## Table of Contents

## ఇందులో

## అపూర్వ విషయం



సాహితీ బంధువులకు శ్రీ వినాయక చవితి శుభాకాంక్షలు. సరసభారతి బ్లాగ్ ఏర్పరచి దశాబ్ద కాలం దాటింది. అంతకు ముందు,ఈ కాలం లోనూ నేను రాసిన రచనలన్నీ ఒక చోటుకు చేర్చాలని మా రెండవ అబ్బాయి శర్మ తపన పడుతూ, వాడి ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూ ఈ పనికి సుమారు ఆరునెలలముందు శ్రీకారం చుట్టాడు. ఎప్పటికప్పుడు నాకు పురోగతి తెలియజేస్తూ, గొప్ప విజన్ తో ముందుకు సాగుతూ మొట్టమొదటి సారిగా నారచనలు డిజిటల్ గా మార్చి, "సమస్త భక్త శిఖామణులు " శీర్షిక తో సుమారు 700 పేజీల దేశ భక్తులు, దైవభక్తులు, రాజ్యభక్తులైన మంత్రులు మొదలైన వారి గురించి నేను రాసినవన్నీ క్రోడీకరించి 75వ భారత స్వాతంత్ర్య దినోత్సవ పుణ్య సమయం లో ఆన్ లైన్ లో నాతొ అవిష్కరింప జేశాడు. వాడి దీక్షకు కృషికి విజన్ కు అభినందనలు .ఏదో రాసుకొంటూ పోవటమేకానీ, దానికింత ప్రశస్తి ఉంటుందని నాకెన్నడూ అని పించలేదు. ఇదంతా చూశాక, తప్పులు దిద్దే సమయం లో కొన్ని అసలు నేనే రాశానా అనే అనుమానం వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. మా వాడిని అడిగితె "నువ్వే రాశావు నాన్నా "అని జ్ఞాపకం చేశాడు. ఇది నా సాహిత్యజీవితం లో ఒక మైలు రాయి .

ఇంతటి తో ఆగలేదు. నేను వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ రూపంగా రాసినవన్నీ ఒక చోటికి చేర్చి డిజిటల్ రూపమిచ్చి రెండవ భాగం గా సుమారు 450 పేజీల "వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ"గా నామకరణం చేసి విద్యా ప్రదాత శ్రీ వినాయకుని పుట్టినరోజు శ్రీ వినాయక చవితి నాడు నాచేత ఆవిష్కరింప జేస్తున్నందుకు మహదానందంగా ఉంది . ఎన్ని సార్లు తప్పుల జల్లెడ పట్టినా, కొన్ని కంటికి కనిపించకుండా దూసుకు పోతూనే ఉన్నాయి .థ,ఠ,ఢ వంటి అక్షరాలు స్పష్టంగా రాయటానికి జంత్రిక ను నాకు ఎప్పటికప్పుడు అందించి ,వేగ వంతంగా రాయటానికి తోడ్పడుతున్న మా మనవడు చి .భువన్ కు ఆశీరభినందనలు. ఇంతటి అక్షర వారాసి ని చూస్తుంటే అద్భుతమని పిస్తోంది. ఇంకా కొన్ని భాగాలు వీలువెంట డిజిటలైజ్ చేసి ,వేర్వేరు శీర్షికలతో ఆవిష్కరిస్తాము. ఇదంతా మా తలిదండ్రుల ఆశీర్వాదాలు, మా ఇలవేల్పు శ్రీ సువర్చలాన్జనేయస్వామి దీవెనలు, శ్రీ సరస్వతీ మాత కరుణా కటాక్షమే అని సవినయంగా మనవి చేస్తూ, మా శ్రీమతి, మాకుటుంబ సభ్యులు అందిస్తున్న ప్రోత్సాహానికి, సాహితీ బంధుల ఆదరాభిమానాలకు అభినందనలు తెలియ జేస్తున్నాను .

గబ్బిట దుర్గాప్రసాద్ 10.09.2021

ఉయ్యూరు

## ఒక్క నిమిషం

కాలం తో పాటు సాంకేతిక మారింది. ఇంతకు ముందు తెలిసినవి అన్నీ పుస్తకం లో రాసుకొని, సమావేశాలలో అందరికి వినిపించటం అనేది అలవాటు గా జరిగేది. 2010 లో సరసభారతి ఉయ్యురు లో ఒక సాంస్కృతిక సంస్థ గా ప్రారంభం అయ్యి సాహితీ సభలు, ఉగాది కవి సమ్మేళనం, సమావేశాలు స్థానిక గ్రంథాలయాలలో, దేవాలయాలలో జరిగేవి. సరసభారతి చిన్న పత్రిక గా రూపుదిదుకొంది.

సహజం గా సైన్స్ టచర్ అవ్వటం వల్ల ప్రతిదీ నా అవసరాలకు మేరకు నేర్చుకోవటం బాగా అలవాటు.. ఈ వయసులో కంప్యూటర్ నేర్చుకొనటం, తెలుగు లో టైపు చేయటం, నోట్స్ తయారు చెయ్యటం ఈమెయిలు రాయటం. సమాధానాలు రాయటం నేర్చుకోన్నవి. బహుశా మా తరం వాళ్ళకంటే ముందుగా కంప్యూటర్ నేర్చుకుని ఇమెయిల్ ద్వారా సాహితీ రచనలు పంపటం ప్రారంభం అయ్యింది ఈ ప్రయాణం. ఇమెయిల్ తెలుగు లో రాసినవి స్కాన్ చేసి. బంధువులకు, మిత్రులకు పంపటం అలవాటు అయ్యింది.

అప్పుడే ప్రసిద్ధ వ్యక్తులు బ్లాగ్ ద్వారా తమ రచనలను, ఆలోచనలను పంచుతున్నారు. పిల్లలు బ్లాగ్ పెడితే అందులో ఇంగ్లీష్ లో రాయటం. తెలుగు వి స్కాన్ చేసిపెట్టటం. ఇది ఒక మెట్టు. సాహితీ బంధు గ్రూప్ తయారుచేసి. సాహితీ మిత్రులకు పంపటం మలి మెట్టు.తెలుగు లో రాయాలంటే సాఫ్ట్వేర్, కీబోర్డ్ ఉండాలి ఎందుకో అది కష్టం గా అనిపించింది. అప్పుడే గూగుల్ యూనికోడ్ తో తెలుగు లో రావాలటం. చాలా బాగా ఉండటం. ఇంగ్లీష్ లో కొడితే తెలుగు లో రావటం అది ఇమెయిల్ లో, బ్లాగ్ లో చేరటం. జరిగింది మొరొక మెట్టు. రోజుకు ఒకటి, లేదా రెండు పోస్ట్స్ తో ప్రారంభం అయ్యి. ఒక అలవాటు గా మారి రోజుకు పది.. డజన్ల వరకూ వెళ్ళింది. బ్లాగ్ ప్రారంభం అయ్యిన తరువాత గ్రామీణ ప్రాంతం నుంచి తెలుగు లో ఉసూల గూడు (బ్లాగ్స్) కూడా రాస్తారు అని ప్రపంచానికి తెలిసింది. తెలుగు బ్లాగర్స్ అందరికి సరసభారతి బాగా పరిచయం. కూడలి ద్వారా దేశ విదేశాల తెలుగు వారికీ బ్లాగ్ చేరింది.

ఉదయం వార్తా పత్రికలలో వచ్చే అంశాలతో ప్రారంభం అయ్యి, సాయంత్రం ఒక పుస్తకం, కవి మీద సమీక్ష సాయంత్రం కొన్ని సార్లు రాత్రి పొద్దు పోయేవరకూ రచనలు జరిగేవి. దాదాపు 10-12 గంటలు నోట్స్ రాసుకోవటం. టైపు చెయ్యటం, ఫొటోస్ కాలేక్ట్ చెయ్యటం. ఇమెయిల్ ఇవ్వటం ఇలా... సోషల్ మీడియా విస్తరించి బ్లాగ్ లో రాసింది ఆటోమేటిక్ గా ఫేస్బుక్, ట్విట్టర్ మొదలైన వాటికి వెళ్ళటం. ప్రపంచమంతా తెలియటం జరిగింది ఇది మరొక్క మెట్టు. అమెరికా ప్రయాణం లో పరిచయం లేని వాళ్ళు కూడా గుర్తు పట్టి బ్లాగ్ గురించి గొప్పగా చెప్పటం విశేష అనుభూతి. బ్లాగ్ లో సాహిత్యం, పుస్తక విశ్లేషణ, సభలు. ప్రయాణాలు. రాజకీయాల, దేవాలయములు, సినిమా, నా దారి. సరసభారతి సమావేశాలు... ఇలా జీవితం లో మనకు తారసపడే ప్రతి అంశం మీద రాయటం అవి సోషల్ మీడియా లో చేరటం జరిగిపోయేవి. టైపింగ్ లో కొన్ని తప్పులు దొర్లినా మంచి మనసుతో దానిని అర్థం చేసుకొని బ్లాగ్ కి సహకరించిన వారి అందరికి ధన్యవాదాలు.

లాభాపేక్ష, వ్యాపార ద్రుష్టి లేకుండా రాసినవి, సేకరించినవి భావి తరాలకు తెలియాలనేదే ఈ ప్రయత్నం. పుస్తకాలలో నిక్షిప్తమైన వి ఈ తరం, రేపటి తరాలకు అందించటమే ఆశయం. వికీపీడియా కూడా తమ రిఫరెన్స్ కోసం సరభారతి పోస్ట్స్ లంకె వెయ్యట జరుగుతోంది.ప్రపంచం మొబైల్స్ లోకి మారినప్పుడు అందరూ బ్లాగ్స్ ఆపేసినా సరసభారతి కొనసాగించటం విశేషం. వాట్సాప్ లో కూడా మిత్రులకు గ్రూప్ తయారుచేసి పోస్ట్ పంపటం ప్రారంభం.గత రెండు సంవత్సరాలుగా చాలా సౌకర్యం గా ఉండటం తో రోజు ఉదయం పది గంటలకు లైవ్ ప్రోగ్రాం చెయ్యటం అలవాటుగా మారింది. సరసభారతి బ్లాగ్ లో రాసి పుస్తకం రూపం లో వచ్చినవి దాదాపు. 40. అంచెలంచలు గా ఎదుగుతూ పదివేల పోస్ట్స్ కు నేను రాసినవి చేరాయి. ముద్రితం కానివి దాదాపు 500 వ్యాసాలు. పదివేల పేజీలు, యాభై లక్షల పదాలు, రెండు కోట్ల అక్షరాలూ. వీటిని సేకరించి తప్పులు సరి దిద్ది క్రమ పరిచి **అంకాత్మక** (డిజిటల్) పుస్తకాలు గా ఆవిష్కరించి మీకు అందించే ప్రయత్నమే ఇది.

ఇంతక ముందు రాసిన 'సిద్ధ యోగి పుంగవులు' పుస్తకం లో 35 మంది ప్రసిద్ధ సిద్ధులను దర్శించటం జరిగింది.
సరసభారతి మొదటి ప్రయత్నం గా **సమస్త భక్త శిఖామణులు** మనకు తెలియని 200 మందిని దర్శించటం జరుగుతోంది. కొందరి జీవిత చరిత్రలు, ప్రసిద్ధుల చరిత్ర కాకుండా వారి సందేశాలు, జీవిత గమ్యాలు రాయటం జరిగింది.75 వ స్వాతంత్ర దినోత్సవ సందర్భం గా 15-08-2021 అందిచటం జరిగింది.
వినాయక చవితి కానుకగా 10-09-2021 అందిస్తున్న రెండో అంకాత్మక (డిజిటల్) పుస్తకం. వేద ఇతిహాస తాత్త్విక రచనల విశ్లేషణ ఇది పురాణ, ఇతిహాస, వేద, ఉపనిషత్ విషయాల మీద వివిధ రచయితలు రాసిన పుస్తకాలు చదివి అప్పటికప్పుడు సరసభారతి బ్లాగ్ లో రాసిన సమీక్ష సమాహారం.

# వేద ఇతిహాస తాత్విక రచనల విశ్లేషణ

## గ్రంథకర్త పరిచయం



| | |
|---|---|
| పేరు | **గబ్బిట దుర్గాప్రసాద్** |
| జననం | **27-6-1940 ఉయ్యూరు కృష్ణాజిల్లా** |
| తలిదండ్రులు | **గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి** |
| భార్య | **ప్రభావతి** |
| విద్య | **ఎం ఏ, తెలుగు, బి.ఎస్ సి. బి.ఎడ్.** |
| ఉద్యోగం | **ఫిజకల్ సైన్స్ టీచర్, పదానోపాధ్యాయుడు -కృష్ణా జిల్లా పరిషత్ (1963-1998)** |
| సంతానం | గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, సమత — సంకల్ప్, భువన్ సాయి తేజ<br>లక్ష్మీ నరసింహ శర్మ, ఇందిర — శ్రీ హర్ష సాయి, హర్షి తాంజని<br>నాగ గోపాల కృష్ణ మూర్తి, రాణి — గౌతమ శ్రీ చరణ్, రమ్య<br>వెంకట రమణ, మహేశ్వరి<br>కోమలి విజయలక్ష్మి, సాంబావధాని — శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్ |
| స్వీయ రచనలు | 1 ఆంద్ర వేద శాస్త్ర విద్యాలంకారులు 2 జనవేమన 3 దర్శనీయ దేవాలయాలు 4 శ్రీ హనుమత్ కథా నిధి 5 శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం 6 సిద్ధ యోగిపుంగవులు 7 మహిళా మాణిక్యాలు 8 పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు 9 దర్శనీయ దైవ క్షేత్రాలు 10 గీర్వాణ కవుల కవితా గీర్వాణం (3 భాగాలు) 13 దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు (2భాగాలు) 15 కేమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య 16 దైవ చిత్తం 17 బ్రహ్మశ్రీ మద్దులపల్లి' శాస్త్రి గారి శతజయంతి కరదీపిక 18 ఆధునిక ప్రపంచ నిర్మాతలు - జీవితాలలో చీకటి వెలుగులు 19 షార్లెట్ సాహితీ మైత్రీ బంధం 20 అణుశాస్త్ర వేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య 21 ప్రయోగాత్మక కాంతి శాస్త్ర పరిశోధన పిత డా పుచ్చా వెంకటేశ్వర్లు 22 ఊసుల్లో ఉయ్యూరు 23 సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా 24 ఆధునిక ఆంద్ర శాస్త్ర రత్న మాణిక్యాలు 25 వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాథ సూరి 26 విదేశీ సంస్కృత విద్వాంసులు. |
| సంపాదకత్వం | సరసభారతి ప్రచురించిన పుస్తకాలు 1 జ్యోతిస్సంశ్లేషణం 2 ఉయ్యూరు ఊసులు 3 నవకవితా వసంతం 4 మా అక్కయ్య 5 "ఆదిత్య "హృదయం" 6 త్యాగి పే"రెడీలు" 7 శ్రీరామవాణి 8 మా అన్నయ్య 9 శ్రీ సువర్చలా వాయు నందన శతకం 10 శ్రీ సువర్చలా మారుతి శతకం 11 శ్రీ సువర్చలేశ్వర శతకం 12 వసుధైక కుటుంబం 13 Nuclear Scientist Dr.Akunuri Ramayya 14 సాహితీ స్రవంతి (సాహితీ మండలి తరపున |
| అంకాత్మక | 1 సమస్త భక్త శిఖామణులు 2. వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ |

# శ్రీరామాయణ పరమార్ధం

“భక్త మహాకవి తులసీదాసు “సీతారామ మయం ఇదం జగతి “అన్నా, భువన మెల్ల నీపై ఉండగా బ్రోవ భారమా ?”అని త్యాగరాజు ప్రశ్నించినా అందరి అనుభూతిలో ఒకే ఒక విభూతి వెలుగుతున్నట్లు గోచరిస్తుంది. అది లౌకికం గా భవభూతి, పారమార్ధికం గా ఆత్మ విభూతి ‘. అదే రామాయణ పరమార్ధం బోధించే ఆత్మానుభూతి “అన్నారు శ్రీమద్రామాయణాన్ని 18 సంవత్సరాలు దీక్షగా పారాయణం చేసి జీర్ణించుకొని అనుభూతి పొంది, అదొక అఖండ ప్రాణాయమము ని భావించిన స్వర్గీయ శ్రీ ఇలపావులూరి పాండు రంగారావు గారు. రామాయణం తనను ‘అనుభూతి జీవిని”చేసిందన్నారు. ఏదో ఒక సమాజానికి సంబంధిన రచన కాదు రామాయణం. అందరికీ సంబంధిన అనుభూతిని ఎవరికి వారి, వారి అనుభూతి అని పించేట్లు పంచి పెట్టిన” జీవరసాయనం” అన్నారు ఏంతో భక్తిగా. జీవ కోటికి జీవ లక్షణాలు ప్రసాదించే “రామకోటి” అంటారాయన. కౌసల్య గర్భం లోనుంచి ఆవిష్కరించుకొన్న “ఆదిత్య హృదయం “శ్రీ రామ చంద్రోదయం అని పులకించి పోతారు “కారుణ్యాలయ, భక్త వరద నిను కన్నది కానుపు రామా !”అని భక్త రామదాసు రామ జననం లో రామ –ఆయనాన్ని సందర్శించి తరించాడని మెచ్చారు, ఈ ఆయనాన్ని ఆవిష్కరించిన తపస్వి ఆదికవి వాల్మీకి మహర్షి అని కీర్తిస్తారు ఇలపావులూరి వారు.



వాల్మీకి పెట్టుకొన్న పేరు లోనే రామాయణ పరమార్ధం ఇమిడిఉంది. “రామ” శబ్దం లోని రామణీయకత, ”ఆయన “ శబ్దం లోని ఆచార్యత రెండింటి సహజ సమ్మేళనమే రామాయణ రసాయనం అంటారు పాండురంగా రావు గారు. తనలో తానూ రమిస్తూ, తనతో బాటు తోటి వారిన్నీ రమింప జేస్తూ, ఆనంద పరుస్తూ నిరంతర నిర్విరామం గా నిత్య సత్య సందీప్తి తో నిర్లిప్తం గా నియతకర్మలను ఆచరిస్తూ, సమభావం తో సంచరించటమే “రామాయణీయత “అన్నారు. ఇది అన్నికాలాలకు అన్ని దేశాలకు, అందరికి వర్తించి ప్రపంచాన్ని ప్రవర్తింప జేసే చిరంతన చైతన్యం అన్నారు ఇలపావులూరి. ఈ పరమ తత్వాన్ని రమణీయం గా ప్రసన్నం గా తన జీవిత –ఆయనం లో సాధించి అందరికి అందులోని ఆనందాన్ని ప్రసాదించిన ప్రసన్న రాఘవుడు రామభద్రుడు.

సామాన్య మానవులు ఎలా ప్రవర్తించాలి అనేదే రామాయణం లోకానికి చెప్పే హితవు. అసత్యాన్ని సత్యం తో, అన్యాయాన్ని న్యాయం తో, స్వార్ధాన్ని పరమార్ధం తో, హింసను అహింస తో, మాయను మమ కారం తో, అసూయను అనురాగం తో ఎలా జయించాలి అనేదే రామాయణం ప్రపంచానికి అందించే సందేశం. వీటిని చాటి చెప్పేందుకే, సాధించటానికే సీతారాములు అష్టకష్టాలు పడ్డారు. అందుకే వారి చరిత్ర ఈ నాటికీ నిలిచి ఉందంటారు. “ఇదం రామ చరితం లోకే ప్రతిష్టాస్యతి శాశ్వతం “అని మంత్రకోవిదుడు అయిన సుమంత్రుడు దుఖం తో కుమిలి పోతున్న కౌసల్యా దశరధులకు చెప్పాడు. కాని ఆ సుమంత్రుడే రామాదులను అడవిలో వదిలేసి వచ్చేందుకు ఏంతో బాధ పడతాడు. ఇది ప్రతివ్యక్తీ జీవితం లో ప్రతి దినం ఎదుర్కొనే చిక్కు ప్రశ్న. రామాయణం లో ఇలాంటి వి అడుగడుగునా కనిపిస్తాయి. వాటిని వివేకం తో పరిశీలించి మనసుకు నచ్చ చెప్పు కుంటూ ఉండటమే జీవితం మనకు నేర్పే గుణ పాఠం అనివివరిస్తారు. ఈ గుణ పాఠాన్నే రమణీయం గా మనకు బోధిస్తుంది రామాయణం.

యదార్ధం గా రామాయణం కేవలం కద కాదు. ఆయనమూ కాదు ఇది ఒక “ఆత్మ దర్పనం”. రామాయణ పాత్రలు నిత్యజీవితం లో మనకు కనిపించేవే. అందుకే రామాయణం ప్రతి రోజు మనకు కనిపించే వ్యక్తుల్లో, జరిగే వృత్తాంతాలలో, అనుభవించే కష్టాల్లో ప్రతి ఫలిస్తూనే ఉంటుంది. వాల్మీకి భాషా ప్రపంచానికి ప్రసాదించిన వాగ్విభూతి నే తాను తన మాటల్లో చెప్పానని ఇలపావులూరి వారు వినయం గా చెప్పారు. తనది వాల్మీకి ప్రవచించిన” ప్రణవ నాదానికి అనునాదం “మాత్రమనని నిగర్వం గా చాటుకొన్నారు. ఆది కవిది ఆర్ద్ర హృదయం చూసిన యానం అయితే తను చెప్పింది ఆర్ద్ర హృదయం చేసిన పయనం అంటారు వినమ్రం గా. శ్రీకారం లాంటి సీతమ్మ, ఓంకారం లాంటి రామయ్య చేదోడు వాదోడుగా ఉంటె జీవితం సఫలం అన్నారు.

రామాయణ పరమార్థం

రచయిత

డా॥ ఇలపావులూరి పాండురంగరావు



ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి.

1999

దశరథ రాముడు తారక రాముడు కావాలి. చైత్ర శుక్ల నవమి పునర్వసు నక్షత్రం లో కర్కాటక లగ్నం లో చంద్ర గురు మొదలైన అయిదు గ్రహాలూ ఉచ్చస్తితి లోస్వక్షేత్రం లో ఉండగా కౌసల్య గర్భం నుండి శ్రీ రామ చంద్రోదయమైంది. రాముడికి రాత్రి నిద్రపట్టదట. కారణం ఆదిశేషుడు పానుపుగా లేక పోవటమేనేమో ? సత్య పరాక్రముడు రాముడైతే సత్య సంధుడు దశరథుడు. విశ్వామిత్రునికి కొత్త ఆయుధాలను సృష్టించే శక్తి ఉందని అవి రాముడికి ఉపయోగ పడుతాయని వసిస్టమహర్షి దశరథుడికి నచ్చచెప్పి వెంట పంపించేట్లు చేస్తాడు. ధనుర్బాణాలతో శ్రీరామ లక్ష్మణులు అగ్ని దేవతల్లాగా అంటే కుమార స్వామి విశాఖుడు లాగా స్థాణువు అంటే శివ స్వరూపం అయిన మహర్షి వెంట వెళ్ళారు అంటాడు మహర్షి వాల్మీకి.

రామాయణానికి మూల కందమైన రాక్షస సంహారం తాటక వధ తో పునాది ఏర్పడింది. ముందు యానం. తరువాత సంహారం. మారీచ సుబాహు వధ ముందు తాటక సంహారం తమో నివృత్తి సూచకం. తమోప సంహారమే తాటక వధ. రాముడు సందేహిస్తే పూర్వం మంధర ను ఇంద్రుడు చంపిన వృత్తాంతం, భ్రుగు మహర్షి భార్య లోకాన్ని అనింద్రం చెయ్యాలని ప్రయత్నిస్తే విష్ణువు ఆమెను సంహరించటం చెప్పి "ఇది నా. శాసనం "అని విశ్వామిత్ర ముని ప్రేమగా హితవు బోధిస్తాడు. శిరసావహించి రాముడు తాటకను చంపేస్తాడు. దుస్ట శిక్షణకూ, రాక్షస సంహరానికీ రామాయణం లో ఇది నాంది.

అయోధ్య నుంచి శ్రీ రామ చంద్రుని యానం అంటే గమనం ప్రారంభం అవగానే బల, అతి బల అనే విద్యలు మహర్షి స్వాధీనం చేశాడు. ఆ విద్యా బలం తో రామ యానం అంటే రామాయణం సుఖం గా సాగుతుంది. రాముడికి మాత్రమె ముని అస్త్ర బలాలను ఉపదేశించాడు. లక్ష్మణుడికేమీ ఇవ్వలేదు. కాని అన్నదమ్ములిద్దరిలో రాగ ద్వేషాలు లేనే లేకపోవటం గమనించాలి. ఇద్దరిలో ఒకే ప్రాణం ప్రసరిస్తూ ఉంటుంది. శరీరాలు వేరైనా తత్త్వం ఒకటే. పయనం గమనం లేక యానం రాముడిది మాత్రమె. లక్ష్మణుడు సాక్షీభూతుడు మాత్రమె. రాముడు అభ్యసించినవన్నీ లక్ష్మణ స్వామికి చూచినంత మాత్రానే ఆకళింపు అవుతాయి. ఆయన అది శేషావతారం సకల విద్యా సారం కదా. రాముడు అంతరంగ వీక్షణానికి ప్రతినిధి అయితే తమ్ముడు బహిర్లక్షణ మైన లోక దృష్టికి నిదర్శనం. రాముడు పరంధాముడు. లక్ష్మణుడు లక్ష్యకాముడు అని విశ్లేషిస్తారు డాక్టర్ ఇల పావులూరి. విశ్వామిత్రుడు ప్రసాదించిన "మానవాస్త్రాన్ని "మారీచుని పై ప్రయోగించగానే వాడు సముద్రం లో పడిపోతాడు. అస్త్రం అమోఘం గా పని చేసినందుకు రాముడు సంతసిస్తాడు. ఇది రామ సత్య పరాక్రమానికి మొదటి విజయం. తాటక వధ రామ కారుణ్యానికి పరీక్ష మాత్రమె. మారీచ మదం సుబాహుని ప్రాణం హరించటం నిజం గా రామ భద్రుడికి గర్వ కారణం. విశ్వామిత్రునికి ముని గణానికి ఆనంద కారణం అవుతుంది.

రామాయణం ప్రారంభం నుంచి సంధ్యలను, సంధ్యోపాసన ను వాల్మీకి మహర్షి ప్రత్యేకించి స్మరించటం గమనించాల్సిన విషయం. ఆ నాటి సంధ్యకు ఒక ప్రత్యేకత ఉంది అది" విజయ సంధ్య " అంటారు పాండురంగా రావు గారు. గాయత్రీ మంత్రం లోని రెండవ బీజాక్షరం ఇక్కడ దర్శన మిస్తుంది. "నాహత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్నఘ్నాన్ రఘు నందనః –రుశిభిహ్ పూజితః సమ్యగ్ యదేన్ద్రో విజయే పురా ".రామాయణం లో బాల కాండ వరకు నాలుగు యజ్ఞాలు వస్తాయి మొదటిది అశ్వ మేధం, రెండవది పుత్రకామేష్టి. మూడవది విశ్వామిత్రుడు సిద్ధాశ్రమం లో చేసిన యజ్ఞం నాల్గవది జనకుడు మిధిల లో చేస్తున్న యజ్ఞం. ఇలా యజ్ఞం తర్వాత యజ్ఞం ఒక ఆశ్రమం తరువాత మరో ఆశ్రమం ఒక రుషి మండలి తర్వాత మరో రుషి మండలి రావటం రామాయణ క్రమం. ఈ యానం లో సంధ్యలకు కూడా ప్రాశస్త్యం ఉంది. యజ్ఞంఅంటే ఇష్టి. సంధ్యలోని సారం ద్రుష్టి. కనుక రామాయణం లో ఇష్టికీ దృష్టికీ ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. అని వివరించారు డాక్టర్ ఇలపావులూరి పాండురంగా రావు గారు. ఈ విషయాలన్నీ వారు రాసిన "అనుదిన రామాయణం "లో ఉన్నాయి.




శ్రీ రాఘువం దశరధాత్మజ మప్రమేయం -సీతాపతిం రఘుకులాన్వయ రత్న దీపం -ఆజాను బాహుం అరవింద దళా య తే క్షం -రామం నిశాచర వినాశకరం నమామి.,

## ఆనంద రామాయణ

### ఆనంద రామాయణ విశేషాలు

శ్రీమద్రామాయణం మన తొలికావ్యం. వాల్మీకి మహర్షి కృతం. ఈ మహర్షి ఆనందరామాయణం, ఆధ్యాత్మ రామాయణం, వాసిష్ట రామాయణం అనబడే యోగ వాసిష్టం కూడా రాశాడు. ఆనందరామాయణం లో శ్రీరాముని ఆనందమయ స్వరూపునిగా అభివర్ణించాడు వాల్మీకి. ఇందులో మనం ఇదివరకు వినని చూడని విశేషాలున్నాయి. వాటిని తెలియ జేయటానికే ఈ ప్రయత్నం. శివుడు పార్వతికి చెప్పిన కధలే ఇవన్నీ. బ్రహ్మశ్రీ సిద్ధాంతి శివ శంకర శాస్త్రులుగారు తెలుగు తాత్పర్యం రాసిన ఈ గ్రంధాన్ని మూడు సంపుటాలుగా "సర్వారాయా ధార్మికవిద్యా ట్రస్ట్ –కాకినాడ- తూర్పు గోదావరిజిల్లా -533001"వారు 2005 లో పునర్ముద్రించారు. దీన్ని ఉయ్యూరు లైబ్రరీలో నుంచి తెచ్చి చూశాను. ఆ విశేషాలు అందరికి తెలియజేయాలనే ఉత్సుకతే ఈ ప్రయత్నం.


Ananda Ramayanam

శ్రీమదానంద రామాయణమున

ప్రథమ సంపుటము

All rights reserved.

### రాముడు జరుపుకొన్న దీపావళి




సీతారాముల వివాహమై అయోధ్యలో హాయిగా ఆనందాన్ని అనుభవిస్తున్నారు. శరత్కాలం లో ఆశ్వయుజమాసం లో జనకమహారాజు వియ్యంకుడు దాశరథ మహారాజును మిధిలకు సగౌరవం గా ఆహ్వానించటానికి మంత్రులను పంపాడు. దశరధుడు వారికి యధోచిత అతిధి మర్యాదలు నిర్వహించాడు. వారిని వచ్చిన కారణం అడిగాడు. అప్పుడు మంత్రులు "దీపావల్యుత్స వార్ధం త్వాం సకుటుంబ సమంత్రిణం-పౌర జాన పద్రైస్సాక మాహ్వాయామాస తేసుహృత్ "అన్నారు "మహారాజా!మీ మిత్రులు జనక మహారాజు మిమ్మల్ని సకుటుంబ పరివారం గా దీపావళి మహోత్సవానికి దయ చేయవలసినదిగా ప్రార్ధించారు "అని వినయంగా చెప్పారు.

దశరధుడు అంగీకరించి ఈ విషయాన్నిదేశం లో అందరికి తెలియ జేసేట్లు చాటింపు వేయించాడు. మంచి ముహూర్తం చూసుకొని పౌరులతో సకుటుంబం గా మిధిలకు ప్రయాణం సాగించాడు. శ్రీ సీతారామ లక్ష్మణులు, కౌసల్యాది మాతలు, సీత మొదలైన రాజపత్నులు ఏనుగులను ఎక్కి, దాస దాసీ జనాలతో మహా వైభవం గా, మహోత్సవంగా బయల్దేరారు. వియ్యంకుని రాక విషయం తెలిసిన మిదిలాదీశుడు అంతే వైభవం గా వారికి స్వాగత సత్కారాలు చేయటానికి సన్నద్ధుడై బంధు మిత్ర పరివారసమేతంగా ఎదురు వెళ్లి స్వాగతించాడు. మంగళ వాద్యాలతో నృత్యం చేసే నర్తకీ మణులతో మేడ పైభాగాలనుండి పౌర స్త్రీలు చల్లే పుష్పవర్షం తో మిధిలా అంతా పండుగ వాతావరణం లో ఉంది అందరికీ తమ ఇంటికే అమ్మాయి అల్లుడు వస్తున్న అనుభూతి పొందారు. దశరాదులకు అర్ఘ్య పాద్యాదులు సమర్పించి బందుగణాన్ని సాదరంగా జనకర్షి ఆహ్వానించి రాజభవనానికి తోడ్కొని వెళ్ళాడు.



అందరికి నూతన వస్త్రాలు సమర్పించి, మ్రుష్టాన్న భోజనాలతో విందు చేసి అల్లుళ్ళను రత్నదీప కాంతులతో అలరించాడు. "జనకః పూజయామాస దీపావల్యాం మహాదినే –దీపోత్సవై ర్మహా పుణ్యే బలిరాజ్యం ప్రవర్తితే – ఆనంద సర్వలోకానాం మంగళాని గృహే గృహే "మహా పుణ్యమైన దీపావళి రోజున ప్రతి ఇంటా సర్వలోకానందం వెల్లివిరిసేట్లు మహా ఉత్సవం జరిపించాడు. అప్పుడు బలి రాజ్యం సర్వ శోభాయమానమై వెలిగిపోతుంది. అల్లుళ్ళకు అభ్యంగన స్నానాలు చేయించి భోజన భాజనాదులు సమకూర్చి గోవులు దాస దాసీజనం, చతురంగ సైన్యం సమర్పించి సంతృప్తి చెందాడు. అలాగే జానకీ మొదలైన కుమార్తెలకు సముచిత పుట్టింటి మర్యాదలు జరిపాడు. వచ్చిన అయోధ్యావాసులన్దరిని మహా గౌరవం గా సత్కరించాడు. జనక మహారాజు ఎవరికీ ఏ లోపమూ రాకుండా అన్ని జాగ్రత్తలు తీసుకొన్నాడు. వియ్యంకుని ఇంటిలో దీపావళి మహోత్సవాన్ని కుమారులు కోడళ్ళు భార్యలు మంత్రి పురోహితులు, పురజనుల సమేతంగా సంతృప్తిగా ఆనందంగా జరుపుకొని దశరధుడు మరల అయోధ్యకు తిరుగు ప్రయాణమయ్యాడు. ఇదీ ఆనంద రామాయణం లో రామాదులు జరుపుకొన్న మొదటి దీపావళి పండుగ.

దారిలో ఉండగా సీతా స్వయం వరం లో ధనుర్భంగం చేయలేక హతాశులైన వివిధ రాజులుఅందరు కలిసి పగబట్టి శదశరధుని పైకి దండ యాత్రగా వచ్చి ముట్టడించారు. కంగారుపడ్డాడు దశరధుడు. రాముడు లక్ష్మణ సమేతం గా తండ్రిని సమీపించి తానూ ఉండగా భయ పడాల్సినదేమీ లేదని తండ్రికి చెప్పాడు. అప్పుడాయన "నీకు పదహారు ఏళ్లుమాత్రమే. వాళ్ళు నామీదకు వచ్చారు. నేనే తేలుస్తాను "అన్నాడు. రాముడు "నేను చేయలేనప్పుడు మీరు నాకు సహాయం రావచ్చు. మనవారందరి యోగ క్షేమాలు చూస్తూ ఉండండి "అని విన్న వించాడు. ఆలస్యం అమృతం విషం అని శ్రీరాముడు ధనుర్బాణాలు తీసుకొని తండ్రి రథం ఎక్కి శత్రురాజులపై కి వెళ్ళాడు, మహా తేజం తో ఉన్న రాముని చూసి

వారందరూ ముందుభయపడినా తర్వాత యుద్ధానికి దిగారు. భీకర యుద్ధం జరిగింది. లక్ష్మణ భారత శత్రుఘ్నులూ యుద్ధానికి దిగారు. శత్రురాజులు భరత శత్రుఘ్నులను బాణాలతో మూర్చ పోయేట్లు చేశారు. ఆగ్రహించిన లక్ష్మణుడు కూడా వారితో తాలపడ్డాడు కాని శక్తి చాలక పోయింది. ఇక ఉపేక్ష చేయరాదని రాముడు రాజులపై వారి సైన్యం పై వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించి, సముద్ర తీరం వరకు తరిమేశాడు. మిగిలిన వారిపై మోహనాస్త్రాన్ని ప్రయోగించి మూర్చిల్ల జేశాడు.

భరతుని ఒడిలోకి తీసుకొని కైక ఏడవటం ప్రారంభించింది. వారిని అందర్నీ సమాధాన పరచి లక్ష్మణుడిని దగ్గరలో ఉన్న మౌద్గల్య ముని ఆశ్రమానికి ఆయుధాలు లేకుండా వెళ్లి అక్కడున్న సంజీవిని మొదలైన ఓషధులను అడిగి తీసుకొని రమ్మని పంపాడు. శిష్యులవలన లక్ష్మణ ఆగమన వార్త విని ముని సంతోషించి సంజీవిని ని ఇచ్చి పంపాడు. దానితో భారత శత్రుఘ్నుల మూర్చ నుండి రాముడు తేరుకోనేట్లు చేశాడు. ముని దశరాధులకు స్వాగతమిచ్చి శ్రీరామ దర్శనం తో పులకించిపోయాడు.

## రావణుడు కౌసల్యాదేవి వివాహానికి విఘ్నాలు కలిగించటం

మనకు ఏ రామాయణం లోనూ కనిపించని కొత్త విషయాలు ఆనంద రామాయణం లో కనిపిస్తాయి రావణుడు కౌసల్యను చెరబట్టటం మనం ఇంతకూ ముందు ఎక్కడా విని ఉండలేదు. ఆ విషయం దీనిలో సవివరంగా ఉండి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

బ్రహ్మాదేవుని వలన తన మరణం కౌసల్యా సుతుని వలన కలుగుతుందని తెలుసుకొన్న రావణా బ్రహ్మ ఆమెకు వివాహం కాకుండా ఉండటానికి ఎన్నో పన్నాగాలు పన్నాడు. అప్పటికి అయిదు రోజుల్లో కౌసల్యా దశరదుల వివాహ ముహూర్తం నిర్ణయించారని బ్రహ్మ, రావణా బ్రహ్మకు చెప్పాడు. లేడికి లేచిందే ప్రయాణం అన్నట్లు రావణుడు రాక్ష సమూహం తో అయోధ్య కు వెళ్ళాడు. దశరధ మహారాజుతో యుద్ధం చేసి ఓడించి ఒక నౌకలో ఉన్న దశరధుని చూసి నౌకను కాలితో తన్ని సరయూనదిలోవిరిగి పడేట్లు మునిగేట్లు చేశాడు. దీనికి వాల్మీకి శ్లోకాలు –"అయోధ్యాం సత్వరం గత్వా రాక్ససైహ్ పరివేష్టితః – నౌకాస్తం తమ్ దశరధం జిత్వా యుద్దైస్సు దారుణైః-బభంజ నిజ పాదేన తాం నౌకాం సరయూ జలే ". ఆ నీటి లో అందరూ చనిపోయారు. కాని దశరధుడు సుమంత్రుడు మాత్రమె బతికి బట్టకట్టి ఆ నౌక ముక్క పై ప్రయాణం చేసి గంగానదిని చేరారు. అక్కడినుండి సముద్రం లోకి కొట్టుకు పోయి ఎలాగో బతికారు.

రావణుడు కోసల దేశానికి వెళ్లి యుద్ధం చేసి కన్య కౌసల్యను అపహరించి, లంకకు ఆకాశమార్గం లో వెడుతూ సముద్రం లో ఈదుతున్న ఒక పెద్ద తిమింగిలాన్ని లాన్ని చూసి దానికి కౌసల్యను ఎరగా వేస్తె పీడా వదిలి పోతుంది అది ఆమెను మింగేస్తే కౌసల్య కద కంచికే కదా ఆమెకిక పిల్లలు పుట్టటం, పుట్టినవాడు తనను చంపటం ఉండదుకదా అని ఆలోచించి ఒక పెట్టెలో పెట్టి సముద్రం లోకి తిమింగిలం ఉన్న చోట పడేశాడు. ఇక ఆమె వలన ఏ భయమూ లేదని నిశ్చింతగా లంకకు చేరాడు పదితలలవాడు. తానొకటి తలిస్తే దైవం వేరొకటి తలుస్తున్దికదా.ఆ తిమింగిలం ఇతర జల జీవులతో పోట్లాడి జయించాలని కోరిక కల్గి నోటితో ఆ పెట్టును లాక్కుపోతూ సముద్రం ఒడ్డున దాన్ని ఉంచి మళ్ళీ సముద్రంలోకి చేరి జలచరాలతో



కలహిస్తోంది. సుమంత్రుడు రాజు దశరధుడు ప్రయాణం చేస్తున్న నౌకా ఖండం అప్పుడే అక్కడికి చేరింది. అక్కడున్న పెట్టెను చూసి ఇద్దరూ ఆశ్చర్య పోయారు. పెట్టె తెరచి చూస్తె కౌసల్య కన్య కనిపించింది. ఒకరికొకరు పరిచయమై ప్రేమ పెంచుకొన్నారు అవ్యవధానం గా ఇద్దరూ గాంధర్వ విధిలో వివాహం చేసుకొన్నారు. -"భార్యా భర్తా సుమంత్రుడు ముగ్గురూ కూడా ఆ పెట్టెలో దూరి మూత వేసేసుకొన్నారు. తిమింగిలం శత్రువులను జయించి వచ్చి మళ్ళీ ఆ పెట్టెను నోట కరచుకొని సముద్రం లో దిగింది.

లంక చేరిన రావణుడు బ్రహ్మను పిలిపించి ఆయన చెప్పిన మాట అబద్ధం అయ్యిందని ప్రగల్భాలు పలికాడు. నవ్విన బ్రహ్మ దేవుడు "ఓం పుణ్యాహం "అని గట్టిగా అన్నాడు. అర్ధంకాక రావణుడు షేక్స్ పియర్ ఫేస్ పెట్టాడు. బ్రహ్మ "కౌసల్యా దశరదుల వివాహం జరిగి పోయింది కదా !"అన్నాడు. విషయం తెలుసుకొన్న పదితలలవాడు తిమింగిలానికి ఎరగా వేసిన పెట్టెను తెప్పించాడు. అందులో చిలకా గోరింకల్లా కౌసల్యా, పదిరదాల దశరధుడు నవ్వుకుంటూ కుల్కుతూ కనిపించారు. క్రోదా వేశం తో రావణుడు ఖడ్గం తీసి వారిని చంపబోయాడు. బ్రహ్మ వారిస్తూ "నువ్వు పెట్టెలో కౌసల్యను ఒక్కదానినే పెట్టావు. ఇప్పుడు అందులో ముగ్గురున్నారు. కాసేపట్లో కోట్లకొలది జనం కాగలరు " "కౌసలై స్తాపితా శ్యాం పటికాయాం త్వయాపురా –త్రయస్త్రతు సంజాతా భవిష్యం త్యత్ర కోటిశః-" అని భయపెట్టాడు. నువ్వు ఇప్పుడే వీళ్లిద్దర్ని చంపితే ఇప్పుడే రాముడు పుట్టి నిన్ను చంపేస్తాడు జాగ్రత్త. భవిష్యత్తులో ఏమి జరుగుతుందో ఎవరికీ తెలీదు కనుక నవ వివాహ దంపతులను సుఖం గా సాకేత రాజధానికి పంపించేయ్యి. నా మాట విను. కాస్తకాల్చుకోమంటే ఒళ్ళంతా కాల్చుకోకు "అన్నాడు. భయపడిన రావణుడు బ్రహ్మ చెప్పిన మాట విని ఆ పెట్టెను కోసల దేశానికి భద్రం గాపంపించేశాడు. ప్రజా సమక్షం లో కోసల రాజు మళ్ళీ వారిద్దరికీ అపూర్వంగా వివాహం జరిపించాడు. తన రాజ్యాన్ని దశరదునికి కానుకగా ఇచ్చేశాడు. అప్పటినుంచే సూర్యవంశ రాజులు" కౌసలేన్ద్రులు" అని పిలువ బడ్డారు.

తర్వాత దశరధుడు మగధ రాజ సుత సుమిత్రను పెళ్లి చేసుకొన్నాడు. ఆ తర్వాత కేకయ రాజకన్య కైకేయినీ వివాహమాడి ముగ్గురు రాణులతో స్వర్గ సుఖాలు అనుభవించాడు. అన్నీ ఉన్నాయికాని దశరధునికి సంతానం కలగలేదు ముసలి వాడై పోతున్నాడు. ఈ బెంగ బాగా బాధిస్తోంది.

## శ్రీరాముని దిన చర్య

శ్రీరాముడు ఉదయాన్నే లేచి కాలోచిత విధులు నిర్వహించి పల్లకీ ఎక్కి సరయూ నదికి మహా వైభవం గా వెళ్ళేవాడు. నదిని పరిశుద్ధి చేయాలనే సంకల్పం తో ఇసుకపై కాలి నడకన ప్రవాహం ఉన్న చోటికి చేరేవాడు. బ్రాహ్మణులు చెప్పినట్లు స్నానాదులు పూర్తీ చేసి నిత్యకర్మలను అనుష్టించేవాడు. గోవులను బంగారాన్ని ధాన్యాలను బెల్లాన్ని డబ్బును మొదలైన దానాలతో సరయూ నదికి, విప్రులకు పూజ చేసి సమర్పించేవాడు.



బంగారు గొలుసులతో అలంకరింపబడ్డ, పట్టు బట్టలు బంగారు త్రాళ్ళు ఉన్న గుర్రాలు లాగే రధమెక్కి స్నానం చేసి మడికట్టుకొన్న సారధి తోలుతుండగా పురజనులు చూస్తుండగా రాజమార్గం లో ప్రయాణించేవాడు. నగర స్త్రీలు పుష్ప వృష్టి కురిపిస్తుండగా నిజ మందిరం చేరేవాడు. సీత ఇచ్చే అర్ఘ్య పాద్యాదులను స్వీకరించేవాడు. అగ్నిహోత్రశాలకు చేరుకొని ధర్మపత్ని సీతతో కలిసి అగ్ని హోత్రునికి ఆహుతులను సమర్పించేవాడు. "గత్వాగ్ని హోత్ర శాలాయాం సీతాయాసన సంస్థితః –అగ్ని హోత్రాది విధినా వహ్నిం హుత్వా తతః పరం ".

లోక శిక్ష కోసం విధివిధానంగా శ్రీ సాంబశివ శంకరుని ఆరాధించేవాడు. సీత చేసిన నైవేద్యాన్ని సమర్పించేవాడు. విప్రులకు దానాలిచ్చి సంతోష పెట్టేవాడు. వారి ఆశీర్వాదాలు గ్రహించి గోపూజ చేసి, అశ్వత్థ వృక్షాన్ని అర్చించేవాడు. తర్వాత సూర్యారాధన చేసి బ్రహ్మయజ్ఞాన్ని విధివిధానం గా పూర్తీ చేసేవాడు. వసిష్టమహర్షి పురాణ ప్రవచనం చేస్తుంటే శ్రద్ధగా సీతాసమేతం గా విని మహర్షిని సత్కరించేవాడు. బంధుమిత్రులు చేరగా వారితో సరస సల్లాపాలు ఆడేవాడు. సీతాదేవి అనేక సార్లు కోరిన మీదట దివ్య మైన నేతితో చేసిన పక్వాన్నాన్ని, ఫలాలను ఉపాహారంగా తీసుకొనేవాడు. భార్య ఇచ్చిన తాంబూలాన్ని స్వీకరించి, దివ్య వస్త్రాలు కట్టుకొని, అద్దం లో చూసుకొనే వాడు. జానకీదేవి కటాక్షాన్ని పొంది రధమెక్కి మంత్రులు, దూతలు పరివేష్టించి ఉండగా మాతృ మందిరాలకు వెళ్లి తల్లులను దర్శించి ప్రదక్షిణ నమస్కారాలు చేసి దీవెనలు పొందేవాడు.



తీర్ధ రూపుల వారి రాజమందిరం చేరి సింహాసనాధిష్టుడైన తండ్రి దశరధ మహారాజును సందర్శించి, ప్రణామం చేసి, అక్కడకు చేరిన పురజనుల విన్నపాలు విని పరిష్కరించేవాడు. ప్రతి క్షణం రాజు గారి గౌరవ మర్యాదలను కాపాడేవాడు. తర్వాత తన మందిరం చేరేవాడు. పత్ని ఇచ్చిన అర్ఘ్య పాద్య ఆచమనాదులు స్వీకరించి, ఆమెతో సరసోక్తులతో కాలక్షేపం చేసేవాడు. పిమ్మట సరయూ నదిలోమధ్యాహ్న స్నానం చేసేవాడు. ఆయన స్నానించిన ఘట్టాలకు "రామతీర్ధం "అనే పేరు వచ్చింది. ఇక్కడ చైత్రమాసం లో స్నానం చేస్తే విశేష ఫలితం వస్తుంది –"నిత్యం యత్రా కరోత్ స్నానం సరయ్వాం నిర్మలే జలే –తదాఖ్యాయా భవాత్తీ ర్ధం -రామ తీర్ధ మితి స్ముటం ".

తర్వాత మాధ్యాహ్నిక ఇష్టులు నిర్వహిస్తాడు. బ్రాహ్మణులు మంత్రులతో కలిసి మూడుకాళ్ల పీటల మీద స్వర్ణ పాత్రలలో భోజనాలు చేస్తాడు. సీతాదేవి కంకణ మంజీర కింకిణీ నూపురాదుల కలస్వనం కమ్మగా వినిపిస్తుండగా సీతా దేవి వడ్డన చేస్తుండగా అందరితో కలిసి భోజనం చేసే వాడు. చేతులు కడుక్కొని, తాంబూలం వేసుకొని సంతోషిస్తాడు. కొద్దికాలం నిద్రపోయి విశ్రాంతి తీసుకొంటాడు. లేచి నూత్న వస్త్రధారణ చేసి ధనుర్బాణాలు ధరించి శస్త్రాలు తీసుకొని రధమెక్కి, వైభవం గా పుష్ప ఉద్యానవనం చేరుకొంటాడు. అక్కడ విహరించి మంగళ వాద్య ధ్వనులు వినిపిస్తుండగా తన మందిరం చేరుకొంటాడు.

సాయం స్నానం చేసి సంధ్యావందనాదులు పూర్తీ చేస్తాడు. అగ్నిని ఉపాసిస్తాడు. పరమేశ్వరుని పూజిస్తాడు. నైవేద్యాదులు సమర్పిస్తాడు. ఆహారం తీసుకొంటాడు. దివ్యపర్యంకం చేరుకొని సీతా సాధ్వి తో కలిసి హాస్య, వినోద గీత సంగీత నృత్య వినోదాలు చూస్తాడు. ఆ తర్వాత సుఖం గా నిద్రిస్తాడు. ఇలా అయోధ్యలో సీత దేవితో పన్నెండేళ్ళు సఖ జీవితం గడిపాడు రాముడు. దినకృత్యం లో మార్పేమీ ఉండేదికాదు.

## సీతారాముల జలక్రీడ

రాజకార్యం నిర్వర్తించి రాముడు తమ్ముళ్ళతో నిజమందిరానికి వెళ్ళాడు. దుందుభులు మోగాయి. వందిమాగధులు కీర్తించారు. ఈ హడావిడి విని సీతాదేవి మంచం దిగి ఎడమ చేతిలో అర్ఘ్యపాత్ర, కుడి చేతిలో ఉపపాత్ర తీసుకొని రాముడికి ఎదురొచ్చింది. ముత్యలపల్లకి దిగిన రాముడు తమ్ముళ్ళతో లోపల ప్రవేశించాడు. దాసదాసీ జనం ఎంతో అప్రమత్తంగా ఉన్నారు. ఒకరు విసనకర్రతో వీచితే, మరొకరు వింజామర విసిరారు. ఒకామె ఆసనం తెస్తే ఇంకొకామె తాంబూలం, మరో ఆవిడ వస్త్రం, ధనుస్సు ఒకావిద ఖడ్గం

ఇంకొకతే తీసుకొని చుట్టూ నిలబడ్డారు. అందర్నీ పలకరిస్తూ అంతర్ గృహం చేరాడు రాముడు. సీతా దేవి ఇచ్చిన జలం తో ఆచమనం చేశాడు. ఆసనం పై కూర్చున్నాడు. అందించిన దివ్య ఉదకాన్ని త్రాగాడు. లక్ష్మణుదిని పిలిచి భోజన శాలకు వెళ్లి బ్రాహ్మణుల నందరిని ఆహ్వానించి ఊర్మిళాదులతో అన్నిటిని సిద్ధం చేయించమని చెప్పాడు.

దాసీజనులు సంతోషించేట్లు రాముడు సీతను బాహు బంధం లో బిగించి అక్కడే ఉన్న జలయంత్రం లోకి(స్విమ్మింగ్ పూల్ ) ఎత్తి తోశాడు. వెంటనే తానూ ఎత్తు మీదనుండి అందులోకి దూకేసి సీతతో జలక్రీడలాడటం ప్రారంభించాడు రాముడు. సీతను బాహుబంధం లో బంధించి నీళ్ళలోకి తోసేస్తూ, నీటిని విపరీతమైన వేగంతో ఆమె పై చల్లుతూ, పరిమళ భరిత దివ్య తైలాలనూ వెదజల్లుతూ హడావిడి చేశాడు. దీనికి మురిసిపోయిన దాసీలు అనేక రకాల సుగంధ చూర్ణాలు, మంగళ ద్రవ్యాలు తెచ్చి ఇద్దరికీ అందించారు. రెచ్చిపోయిన ఆ జంట యెడ తెరిపి లేకుండా వాటిని ఒకరిపై ఒకరు చల్లుకొంటూ అందరికీ వినోదాన్ని పంచారు. పిచికారీలతో ఒకరిపైఒకరు వసంతాన్ని జల్లుకొన్నారు, రాముడు కనుచూపు తో దాసీలను పరదాల వెనక్కి వెళ్ళమని ఆజ్ఞ ఇవ్వగా వాళ్ళు సిగ్గుపడుతూ నవ్వుకొంటూ వెళ్ళిపోయారు. తమ చుటూ ఎవ్వరూ లేరని అనుకొన్న సీతారాములు హాయిగా ఆనందం గా ఇష్టాపూర్తిగా వినోదంగా యధేచ్చగా జలక్రీడా సరససల్లాపాలు బహు భంగులు గా చేశారు.



కుసుమ సుకుమారమైన ముష్టి లతో ఒకరినొకరు కొట్టుకొన్నారు. పరమాత్మ అయిన శ్రీరాముడు మహామాయ అయిన సీతాదేవి అధరోష్టాన్నిలోక రీతిలో సహజంగా విలాసంగా చుంబించాడు, కుచమర్దనమూ చేశాడు. కంచుకాన్ని స్వయంగా చేతులతో తీసేసి అర్ధాంగిని గాఢంగా ఆలింగనం చేసుకొని సౌఖ్యం అనుభవించాడు. కామకేళీ విలాసాలనన్నిటినీ స్వేచ్చగా చేసి సీత మనసుకు సంతోషం సంతృప్తి కల్గించి, ఆనంద కేళి లో ముంచి తేల్చాడు రాముడు. "జల యంత్రేషు క్రీడాం చక్రతు స్సుచిరం ముదాః –ముష్టిభ్యాం జానకీరామం తాడయామాస కౌతుకాత్ –సోపితాం తాడయామాస ముష్ట్యా పుష్ప సమానయా –చుంబిత స్యా బింబోష్టం చూర్ణ యామాస తత్కుచౌ –ముక్త్వా తత్కంచుకీ బంధం ఆలింగ్య హృదయే నతాం – ముమొచ కచ్చం శ్రీరామః సీతాయా స్వరేణసః –"ఇలా హాయిగా స్వేచ్చగా సీతారాములు జలక్రీడ సలిపారు.

ఇంతలో భోజన సమయమైందనిదని లక్ష్మణుడు చెప్పటానికి వస్తే దాసీలు అడ్డగించి సీతారాములు రహస్యం గా జలక్రీడలలో ఉన్నారని చెప్పారు. సరే అని భోజన సమయం అయిన్దికనుక వేగిరమే రావలసినదని వారిద్దరికీ చెప్పమని మర్యాదాపురుషుడు లక్ష్మణస్వామి వెళ్ళిపోయాడు. సిగ్గుల మొగ్గయైన

ఒక దాసీ పరదాల వెనక నుండే ఆ వార్తను వారిద్దరికీ నివేదించింది. రాముడు వెంటనే గట్టుపైకి వచ్చి వేడినీటితో నలుగుపిండితో సుగంధ ద్రవ్యాలతో తలంటి పోసుకొని సిద్ధమయ్యాడు. సీతాదేవికి కూడా పరిజనం ఇలానే చేసి సిద్ధ పరచారు. ఇద్దరిచేత దివ్య పీతాంబరాలు ధరియింప జేశారు. దారిలో పూలు చల్లుతూ వారిద్దరిని వంటశాలకు తీసుకొని వెళ్ళారు. అప్పటికే అక్కడ వేచిఉన్న ఊర్మిలా మొదలైన వారు అందరికి వడ్డన చేశారు. రాముడు బంధు మిత్ర మునిగణ పరివారం తో సహా షడ్రసోపేత భోజనాలుఆరగించారు. సీతాదేవి వీవన తో వీస్తూ పరియాచికంగా మాట్లాడి నవ్విస్తూ ఉంది, తర్వాత సీత అందించిన తాంబూలాన్ని రాముడు తీసుకొని ఆస్వాదించాడు. అందరిభోజనాలు ముగిసిన తర్వాత రాముడు నిద్రాశాలకు చేరాడు. అప్పటికే అక్కడికి చేరుకొన్న సీతా సాధ్వి రాముని రాకకై ఎదురు చూస్తూ నిలిచి ఆహ్వానించి లోనికి తీసుకొని వెళ్ళింది.

## దేవపత్నులు గోపికలుగా జన్మించే వరం

శ్రీరాముడు సరయూ నదీతీరం లో చైత్రమాసం లో పటగృహం(డేరా) లో ఉన్నాడు. సీతాదేవి అక్కడలేదు ఈ సంగతి తెలిసిన అయోధ్య వాసులు నానా దేశవాసులు, రామతీర్థానికి చైత్ర స్నానానికి వచ్చారు దేవ యక్ష రాక్షస కిన్నెర కింపురుషులు గంధర్వులూ నాగులు మునులు రాజులు, అప్సరసలు, కామరూపం లో ఉన్న దేవతలు అందరూ వచ్చారు. శ్రీరాముని దివ్య సుందర రూపాన్ని చూసి వారందరూ పులకించిపోయారు. వారిలో వారు మాట్లాడుకొని అర్ధరాత్రి దేవపత్నులు రామ దర్శనానికి వచ్చారు. భటులు అనుమతినివ్వలేదు. అప్పుడు వారంతా "మాకు ఇప్పటికిప్పుడు శ్రీరామ దర్శనం లభించకపోతే సరయు నదిలో పడి ప్రాణ త్యాగం చేసుకొంటాం "అని బెదిరించారు వాళ్ళు కంగారుపడి రాముడికి నివేదించారు. రాముడు వెంటనే అక్కడికి చేరుకొన్నాడు. రామ దర్శనం తో ధన్యత చెందారు. ఇంతమంది ఇక్కడికి ఒక్కసారిగా రావటానికి కారణమేమిటి అని వారిని అడిగాడు రాముడు.



వారందరూ సిగ్గులమొగ్గలై తలలు వంచుకొని కామ ప్రేరితులమై తాము అక్కడికి వచ్చామని శ్రీరామునితో క్రీడించాలని మనసునిండా కోరికతో ఉన్నామని దాచుకోకుండా చెప్పారు, దానికి శ్రీరాముడు నవ్వి "ఈ జన్మ లో నేను ఏక పత్నీ వ్రతుడిని. నియమ భంగం చేయను. మీరు వెళ్ళిపొండి "అని చెప్పాడు. వారందరి మనసు గాయపడింది తట్టుకోలేక పోయారు. అందరూకలిసి సరయూనదీ ఇసుక తిన్నెలమీద మూర్ఛ పోయారు. అలామూర్ఛ నొందిన ఆ దేవపత్నులపై జాలికలిగి ధర్మాత్ముడైన రాముడు వారితో "'కామినులారా !నేను ద్వాపర యుగం లో నంద గోపుడు పాలించే గోకులం లో శ్రీకృష్ణుడిగా పెరుగుతాను. ఇంద్రుడే నందుడుగా జన్మిస్తాడు. అప్పుడు దేవతలందరూ నా వరప్రసాదం చేత గోపాలకులుగా పుడతారు. మీరందరూ గోపికలుగా జన్మిస్తారు. మీరు

ఇప్పుడుకోరిన మీ కోరికను నేను నెరవేర్చి మీకందరికీ ఆనందాన్ని చేకూరుస్తాను. మీతో కాళింది నదీతీరంలో అర్ధరాత్రి వేళల్లో ఇసుక తిన్నెలమీద పుష్పవనాలలో రాసక్రీడలు సలుపుతాను. మిమ్మల్ని తనియింపజేసి, తరింప జేస్తాను నామాట నమ్మండి "అని నచ్చచెప్పాడు. రామవాక్యం పై ఉన్న నమ్మకం తో వారందరూ విశ్వసించి నమస్కరించి ఆశతో వెనుదిరిగి వెళ్ళిపోయారు. "తా మూర్చాం విహ్వాలా దృష్ట్వా రామో విహ్వల మానసః –నారీ స్సంతోషయన్ ప్రాహ హే నారయ స్సూయతాం మమ –వాక్యం ఖేదావహం చోద్య ద్వాపరే కృష్ణ రూప దృక్ –అహం వ్రజే భవిష్యామి నంద గోపేశ పాలితే –తదా దేవాస్తూ గోపాలా భావి మద్వర దానతః –భవిష్యన్తి సురేశశ్చనంద స్తత్ర భవిష్యతి –భవిష్యద తదా యూయం గోపికా స్సకలాఃవ్రజే –యుష్మాకం పూర యిష్యామి యదేచ్చం వాంచితం తదా –రాసక్రీడాం హి యుష్మాభిః కరిష్యామి న సంశయః – వృందావనేతు కాలింద్యాం సైకతే నిశిపై చిరం –భావద్వ్ స్వస్త చిత్తాశ్చ గచ్చ ద్వం స్వస్థలం ముదా "

### గుణవతి సత్యభామగా జన్మించటం



కృతయుగాంతం లో మాయ పురిలో వేద వేదంగ పారంగతుడైన దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతిధి సత్కారాలలో నిత్యాగ్ని హోత్రం లో శ్రేష్టుడు. సూర్యోపాసి. సూర్య తేజస్సు చేత ప్రకాశించేవాడు. ముసలివాడైన దేవశర్మకు అందాల రాసి అయిన గుణవతి అనే కుమార్తె ఉంది. ఆమెను శిష్యుడైన చంద్రశర్మ కిచ్చి వివాహం చేశాడు. కూతురూ అల్లుడూ చాలా అన్యోన్యంగా జీవిస్తూ దేవశర్మకు సేవ చేస్తున్నారు. ఒక రోజు మామా అల్లుడు సమిధలు వగైరా సేకరించి తీసుకొని రావటానికి హిమవత్పర్వత సానువులలో ఉన్న అడవికి వెళ్ళారు. అప్పుడు అనుకోకుండా ఒక రాక్షసుడు వారికి కనిపించాడు భయపడి పారిపోవాలని ప్రయత్నం చేసి పరిగెత్త లేక ఆగిపోయారు ఇద్దరూ. దయలేని రాక్షసుడు వారిద్దరిని చంపి తినేశాడు. ఆ క్షేత్ర మహాత్మ్యం వలన వారిని విష్ణు దూతలు దేవలోకానికి తీసుకొని పోయారు. సూర్యపూజ నిత్యం చేసేవారుకనుక విష్ణు మూర్తి వారిపై ప్రసన్నంగా ఉన్నాడు. వారికి విష్ణులోక ప్రాప్తికల్గించాడు.



తండ్రిని, భర్తను రాక్షసుడు చంపడాన్న వార్త గుణవతికి తెలిసింది. ఆమె కన్నీరు మున్నీరుగా విలపించి ఉన్న వస్తువులనన్నిటిని అమ్మివేసి వారిద్దరికీ ఉత్తర క్రియలు నిర్వర్తించింది. మనసులో ఏ కోరికా లేకుండా జితెన్ద్రియురాలై విష్ణుభక్తీ పరాయణురాలై ఏకాదశీ వ్రతం, కార్తీక విష్ణుసేవా, మాఘ స్నానం వైశాఖ స్నానాలు పూజలు, విష్ణ్వాలయం లో సేవ, స్వస్తికాదుల నివేదన నిత్య విష్ణుపూజ అనే ఎనిమిది రకాల "విష్ణు వ్రతాన్ని "శ్రద్ధగా చిత్త శుద్ధితో భక్తితో ఆచరిస్తోంది. సరయూ నదీ మహాత్మ్యాన్ని విని అక్కడి రామతీర్థానికి చేరి చైత్రమాస వ్రతం ఆచరిస్తోంది. సరయూనదీ సైకత పటగృహం లో శ్రీరాముడున్నాడని తెలిసి అర్ఘ్యపాద్యాదులతో అర్చించాలని వెళ్ళింది. భటులకు మనసులోని మాట తెలియజేసి వారి అనుమతితో గుడారం లోకి చేరుకొన్నది. అక్కడ లక్ష్మణ భరత శత్రుఘ్నులతో శ్రీరాముడు సర్వాలంకార శోభితుడై దర్శనమిచ్చాడు. ఆ దివ్య మోహన రూపాన్ని చూసి గుణవతి పులకించి పోయి సాష్టాంగ నమస్కారం చేసింది. రామునికి అర్ఘ్యపాద్యాదులిచ్చి భక్తితో పూజించింది, ఆమె సేవలకు పరమ ప్రీతుడైన రాముడు మనసులోని కోరిక ను గురించి ఆమెను అడిగాడు.

గుణవతి "శ్రీ రామా!వేలకొలదిగా నీకు దాసీజనం ఉన్నారు. నీ సేవలో వారందరూ ధన్యులవుతున్నారు.నన్ను కూడా వారిలో ఒకరిగా స్వీకరించి నీ సేవా భాగ్యాన్ని నాకు కలిగించు "అని ప్రార్థించింది. రాముడు ఆమెతో "బ్రాహ్మణ స్త్రీవైన నువ్వు ఇలా కోరడం ఆశ్చర్యంగా ఉందినాకు. నా సేవలో తరించాలని నీకు నిశ్చయంగా మనసులో ఉంటె వేరొక జన్మలో దాన్ని తీరుస్తాను. ఈజన్మలో సాధ్యం కాదు. నేను ద్వాపరయుగం లో ద్వారకాపట్టణం లో శ్రీ కృష్ణావతారం లో ఉంటాను. మీ తండ్రి దేవ శర్మ సత్రాజిత్తుగా జన్మిస్తాడు. నువ్వు ఆయన పుత్రిక సత్యభామగా జన్మిస్తావు. అప్పుడు నిత్యం నా సేవ చేస్తూ పూజిస్తూ ధన్యత నొందుతావు. తన్ను ఆరాధిస్తూ ప్రేమిస్తావు. నేను నిన్ను వివాహం చేసుకొంటాను నీ భర్త నాకు సఖుడైన అక్రూరుడుగా జన్మిస్తాడు. సత్యభామా విధేయుడు అని అందరూ నన్ను అనుకోనేంత గా మన దాంపత్యం వర్ధిల్లుతుంది. ఇక ఇంటికి వెళ్ళు "అని వరమిస్తాడు.

ఎంతో సంతోషించిన గుణవతి ఇంటికి చేరి చైత్రవ్రతాన్ని క్రమం తప్పకుండా చేస్తూ ఒకసారి తోటి జనం తో కలిసి హరిద్వారానికి యాత్రగా వెళ్ళింది. అక్కడే ఉంటూ విష్ణు చిత్తం తో ధర్మాచరణ చేస్తూ ఒక రోజు జ్వరపడి గంగా స్నానం చేస్తూ అందులో శరీరాన్ని వదిలేసింది. స్వర్గం చేరి చాలాకాలం సుఖాలను అనుభ వించింది. ద్వాపరం రాగానే సత్రాజిత్తు కుమార్తె సత్యభామగా జన్మించి శ్రీ కృష్ణ సేవలో తరించి ఆయననే వివాహమాడి "మీరజాలగలడా నాయానతి వ్రత విదానమహిమన్ "అని కృష్ణుడిని కొంగుకు కట్టేసుకొని" సత్యాపతి "అనే బిరుదాన్ని నల్లనయ్యకు వచ్చేట్లు చేసిన ఘటికురాలైంది.

## శివుడు చేసిన రామ స్తవం



ఆనంద రామాయణం లో విలాస కాండ లో శ్రీరాముడు ఆశ్వమేద యాగం చేసిన తర్వాత రాజమందిరం లో కొలువై ఉండగా పార్వతీ పతి శివమహా దేవుడు విచ్చేసి అర్ఘ్య పాద్యాదులు అందుకొని ఉచితాసనాసీనుడై శ్రీరామతత్వాన్ని స్తవంగా గానం చేశాడు.

"యదేకం యత్పరం నిత్యం యదనంతం చిదాత్మకం –యదేకం వ్యాపకం లోకే తద్రూపం చింతయామ్యాహం –సర్వ త్రైలోక్య సౌఖ్యర్ధం రామ భక్త్యభి వృద్ధయే –విజ్ఞాన హేతుం విమలా యథాక్షం ప్రజ్ఞాన సందివ్య సుఖైక రూపం –శ్రీ రామ చంద్రం హరిమాది దేవం విశ్వేశ్వరం రామమహం భజామి –కవిం పురాణం పురుషం పరేశం సనాతనం యోగినమీ –అణో రణీయాం సమనంత వీర్యం ప్రాణేశ్వరం రామ మహం భజామి –నారాయణం జగన్నాధం అభిరామం జగత్పతిం –కవిం పురాణం వాగీశం రామం దశరదాత్మజం –రాజ రాజం రఘువరం కౌసల్యానంద వర్ధనం –భార్గం వరేణ్యం విశ్వేశం రఘునాధం జగద్గురుం –సత్యం సత్య ప్రియం శ్రేష్టం జానకీ వల్లభం ప్రభుం –సౌమిత్రి పూర్వజం శాంతం కామదం కమలేక్షణం –ఆదిత్యం రవిం ఈశానం ఘ్రుణిం సూర్యం అనామయం –ఆనంద రూపిణం సౌమ్యం రాఘవం కరుణాకరం –జ్ఞాన గమ్యం తపోమూర్తిం రామం పరశుదారిణం-వాక్పతిం వరదం వాచ్యం శ్రీపతిం పక్షి వాహనం –శ్రీ శార్ఙ్గ ధారిణం రామం చిన్మయా నంద విగ్రహం –హలదారిణ మీశానం బలరామం కృపానిదిం –శ్రీ వల్లభం కమలానాధం జగన్మోహన మచ్యుతం –మత్స్య కూర్మ వరాహాది రూపదారిణ మవ్యయం –వాసుదేవం జగద్యోని మనాది నిధనం హరిం –గోవిందం గోవ్పతిం విష్ణుం గోపీ జన మనోహరం –గోపాలం గో పరీవారం గోపికన్యా



సమావృతం –విద్యుత్పుంజ ప్రతీకాశం రామం కృష్ణం జగన్మయం –గో గోపికా సమాకీర్ణం వేణు వాదన తత్పరం –కామ రూపం కలావంతం కామినాం కామదం ప్రభుం మన్మధం మధురానాధం మాధవం మకరధ్వజం –శ్రీధరం శ్రీకరం శ్రీశాం శ్రీనివాసం పరాత్పరం –భూతేశం భూపతిం భద్రం భూతిదాం భూరి భూషణం –సర్వ దుఃఖ హరం వీరం దుష్ట దానవ మర్దనం –శ్రీ నృసింహం మహా విష్ణుం –మహాంతం దీప్తి తేజసం –చిదానందమయం నిత్యం ప్రణవం జ్యోతి రూపకం –ఆదిత్య మండల గతం నిశ్చితార్ధ స్వరూపిణం –భక్తీ ప్రియం పద్మ నేత్రం భక్తానా మీప్సిదం ప్రియం – కౌసల్యేయం కలామూర్తిం కాకుస్తం కమలాప్రియం –సింహాసనే సమాసీనం నిత్య వ్రత మకల్మషం –విశ్వామిత్ర ప్రియం దాంతం –స్వదార నియత వ్రతం –యజ్నేశం యజ్న పురుషం యజ్న పాలన తత్పరం –సత్య సందం జిత క్రోధం శరణాగత వత్సలం –సర్వ క్లేశాపహరణం విభీషణ వర ప్రదం –దశగ్రీవ హరం రుద్రం కేశవం కేశి మర్దనం –వాజీ ప్రమధానం వీరం సుగ్రీవేప్సిత రాజ్యదం-నర వానర దైవేశ్చ సేవితం హనుమత్ప్రియం –శుద్ధం సూక్ష్మం పరం శాంతం తారక బ్రహ్మ రూపిణం –సర్వ భూతాత్మ దూతస్తం సర్వాధారం సనాతనం –సర్వ కారణ కర్తారం నిదానం ప్రకృతేః పరం. —నిరామయం నిరాభాసం నిరవద్యం నిరంజనం –నిత్యానందం నిరాకారం అద్వైతం తమసః పరం –పరాత్పరతరం నిత్యం సత్యానంద చిదాత్మకం –మనసా శిరసా నిత్యం ప్రణమామి రఘూత్తమం. "

భవోద్భవం వేదవిదాం వరిష్టం ఆదిత్య చంద్రానిల సం ప్రభావం –సర్వాత్మకం సర్వగత స్వరూపం నమామి రామం తమసః పరస్తాత్ –నిరంజనం నిష్ప్రతిమం నిరీహం నిరాశ్రయం కారణమాది దేవం నిత్యం ధృవం నిర్విషయ స్వరూపం నిరంతరం రామ మహం భజామి –భవాబ్ది పోతం భారతాగ్రజం తం భక్తి ప్రియం భాను కుల ప్రదీపం –భూతాది నాదం భజామి రామం భవ రోగ వైర్యం –సర్వాది పత్యం రణరంగ ధీరం సత్యం చిదానంద సుఖ స్వరూపం –సత్యం శివం సజ్జన హృన్నివాసం ధ్యేయం పరానంద మహం భజామి –కార్యం క్రియా కారణ మప్రమేయం కవిం పురాణం కమలాయ తాక్షం –కుమార వేషం కరుణామయం తం కల్ప ద్రుమం రామమహం భజామి –త్రైలోక్య నాధం సరసీ రుహాక్షం దయానిదిం ద్వంద్వ వినాశ హేతుం –మహాబలం వేద నిధిం సురేశం సనాతనం రామమహం భజామి –వేదాంత వేద్యం కవిమీశితారం అనాది మధ్యంత మచింత్య మాద్యం –అగోచరం నిర్మల మేక రూపం పరాత్పరం రామమహం భజామి –

అశేష వేదాత్మక మాది దేవ మజం హరిం రామ మనంత మూర్తిం –అపార సంవిత్సుఖమేక రూపం నమామి రామం మనసః పరస్తాత్ –తత్వ స్వరూపం పురుషం పురాణం స్వతేజసా పూరిత మేకమేవ –రాజాదిరాజం రవి మండలస్తం విశ్వేశ్వరం రామ మహం భజామి –యోగీంద్ర సంఘై రపి సేవ్యమానం నారాయణం నిర్మల మాదిదేవం –నతోస్మి నిత్యం జగదేక నాధం హరిం చిదానంద మయం ముకుందం –అశేష విద్యాదిపతిం నమామి రామం పురాణం తమసః పరస్తాత్ –విభూతిదం విశ్వ సృజం విరాజం రాజేంద్ర మీశం రఘునాధ నాధం –అచింత్య మవ్యక్త మనంత రూపం జ్యోతిర్మయం రామమాహం భజామి సమస్త సాక్షిం తమసః పరస్తాత్ –మునీంద్ర గుహ్యం పరిపూర్ణ మేకం కలానిదిం కల్మష నాశ హేతుం –పరాత్పరం యత్పరమం పవిత్రం నమామి రామం మహాతోమహాంతం –బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చదేవేంద్రో దేవతాస్తధా –ఆదిత్యాది గ్రహాస్చైవ త్వమేవ రఘు నందనః –తపస రుషయస్సిద్దా స్సాధ్యాస్చ మునయస్తదా –విప్రా వేదాశ్చ యజ్ఞాశ్చ పురాణం ధర్మ సంహితాః – వర్ణాశ్రమా స్తదా ధర్మా వర్ణ ధర్మ స్తదైవచ –నాగ యక్షాస్చ గంధర్వా

దిక్పాలాది గజాదిశః –వసవోస్తొత్రయః కాలా రుద్రా ఏకాదశ స్మృతాః –తరకా ద్వాద శాదిత్యా స్త్వమేవ రఘునాయకః –సప్త ద్వీపా స్సముద్రాశ్చ నదానద్య స్తదా ద్రుమాః –స్థావరా జంగ మాస్చైవ త్వమేవ రఘునందనః –దేవా తిర్యఙ్మనుష్యా ణాం దానవానాం దివౌకసాం –మాతా పితా తదా భ్రాతా త్వమేవ రఘునందనః –శాంతం సర్వ గతం సూక్ష్మం పరబ్రహ్మ సనాతనం –రాజీవ లోచనం రామం ప్రణమామి జగత్పతిం –తతః ప్రసన్నా శ్రీరామః ప్రోవాచ వృషభధ్వజం ”

అని శివుడు రాముడిని స్తుతించాడు. విన్న శ్రీరాముడు పరమానందం తో పరమేశుని అభినందించి ప్రసన్నుడు అయ్యానని ఏదైనా వరం కోరుకోమన్నాడు.. రాంస్మరణ తో తానూ ధన్యుదనయ్యానని తెలిపి తనకు “అద్వైత జ్ఞానం “బోధించమని రామపాదారవిందా సేవలో ధ్యాన్యం చేయమని వేడాడు. కాని రాముడు శివుడికి వేరే వరం ఇచ్చి అనుగ్రహించాడు. శివుడు చేసిన ఈ రామస్తుతి విన్నా చదివినా పారాయణ చేసినా ఉత్తమ లోకప్రాప్తికలుగుతుందని ఫలశృతి.

శ్రీరాముడు గ్రహణ స్నానానికి కురుక్షేత్రం వెళ్ళటం

ఒకసారి శ్రీరాముడు సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న సమేతుడై పుష్పక విమానం ఎక్కి సూర్య గ్రహణ స్నానానికి కురుక్షేత్రానికి వెళ్ళాడు. అప్పటికే దేవ గంధర్వ, కింపురుషులాదులందరూ అక్కడికి చేరుకొన్నారు. అన్ని ఆశ్రమాలనుండి మునులూ విచ్చేశారు. నానాదేశ రాజులూ వచ్చారు. శ్రీరాముడు సీతా సమేతంగా గ్రహణస్నానం చేశాడు. గజ, తురగ ఉష్ట్ర మొదలైనవానిని దానం గా సమర్పించాడు. రాజులు విలువైన కానుకలు రామునికి సమర్పించారు. సీతారామ దర్శనానికికై అందరూ ఉవ్విళ్లూరుతున్నారు. జానకీదేవి రాజపత్నులను ఆలింగనం చేసుకొని కుశల ప్రశ్నలతో వారిని సంతృప్తి పరచింది. మునిపత్నులకు నమస్కరించి ఉచితాసనాలపై వారిని కూర్చుండ బెట్టింది.

## సీతా లోపాముద్ర సంవాదం



సీతాదేవి ముని పత్నులఎడ చూపుతున్న గౌరవ మర్యాదలకు పొంగిపోయిన అగస్త్యమహర్షి భార్య లోపాముద్ర సీతను ఆమె పెండ్లి నాటినుండి ఇప్పటివరకు జరిగిన కధను వివరించమని కోరింది. సీత అన్ని విషయాలు ఆసక్తికరంగా వివరించింది. అంతా విన్న లోపాముద్ర “జానకీ !అంతా బాగానే ఉంది. కాని ఒక విషయం లో మీ ఆయన అనవసరంగా కష్టపడ్డాడేమోనని పించింది, సముద్రంపై సేతువును కట్టటానికి అంత కష్టపడాలా ? మావారు కుంభసంభవులు అగస్త్యమహర్షికి చెప్పి ఉంటె, ఆ సముద్ర జలాన్ని మూడు గుక్కల్లో తాగేసి లంకకు దారి

ఏర్పరచేవారుకదా? కోతిమూకకు సేతువుకట్టే శ్రమ ఉండేదికాదు కదా ?"అని సన్నాయి నొక్కులు నొక్కింది. లోపాముద్రా దేవి చాలా గర్వంతో తనభర్త అగస్త్యమహర్షి గొప్పతనాన్ని గురించి చెప్పిందని గ్రహించిన సీతాదేవి నవ్వి ఆమెతో "తల్లీ అగస్త్య అర్ధాంగి లోపాముద్రా దేవీ ! నా భర్త శ్రీరాముడు సేతువును చాలా తేలికగానే సక్రమంగానే కట్టారు. మీరు కూడా వినండి రాజపత్నులారా ! సవివరంగా ఆ విషయం మీ అందరికి వివరిస్తాను. శ్రీరాముడు మీరు అనుకొన్నట్లు చేతకాని వాడేమీకాదు.రామబాణం ఎక్కు పెట్టి సముద్రుడిని శోషింప జేయగల మహా సమర్ధుడు నా రాముడు. కాని అలా చేస్తే సాగరం లోని అనేక జీవ రాశులకు అపాయంకలిగి హత్యా దోషం కలుగుతుందని సందేహించాడు. ఒక వేళ రాముడు ఆకాశ గమనం తో సముద్రాన్ని దాటితే అప్పుడు రావణుడు శ్రీరాముని మనుష్యమాత్రునిగా ఎలా భావిస్తాడు ?ఇదీకాక భక్తుడైన హనుమ వీపుమీద ఎక్కి సాగర ఉల్లంఘనం చేసి లంకకు వెళ్ళగల సమర్ధుడే కదాఅంటారేమో ! అప్పుడు రామ పౌరుషాన్ని లోకం ఏ విధంగా భావిస్తుంది ?పోనీ ఈదుకుంటూ సముద్రం దాటవచ్చు కదా అని అనుకొంటే "బ్రాహ్మణ మూత్రం అయిన సముద్రాన్ని మనం దాట రాదు" అని శంకించాడు. -"పీతోయం జలధిః పూర్వం శ్రుతం క్రోదా దగస్తినా –మూత్ర ద్వారా ర్బహిస్త్యస్త సమాత్ క్షారత్వ మాగతః –సర్వదా మూత్రవత్ క్షారస్స కదం పాతు మర్హతి –స రుషి ర్మమ వాక్యేన చులకం తు కరిష్యతి ".

"అయినా మీ ఆయన మా ఆయన చేత ప్రార్ధనీయుడే. కాదన లేను. నీ భర్త అగస్త్యముని కోపంతో ఈ సాగరాన్ని పానం చేశాడని విన్నాను.లోకాలు తల్లడిల్లి మహర్షిని ప్రార్ధిస్తే తన మూత్రం ద్వారా సాగరాన్ని బయటికి వదిలాడని లోకానికి తెలిసిన విషయమేకదా.అందుకే తీయగా ఉండే సముద్రజలం అగస్త్య మూత్రం తో ఉప్పగా మారి క్షార జలధి అనే పేరు వచ్చింది. ఈ సంగతి నీకు తెలియనిదికాదు. "మూత్రపానం బ్రాహ్మణేన స్వకార్యార్ధం నిజోక్తిభిః " అలాంటి మూత్ర రూప సాగరాన్ని నా భర్త ఇక్ష్వాకు ప్రభువు రాఘవ స్వామి మళ్ళీ ఎలా పానం చేస్తాడమ్మా! ఒక వేళ నువ్వు హితం చెప్పినట్లే నేను నా రాముని నీ భర్త అగస్త్యమునిని వేడుకొని సముద్రజలాన్ని "చులికీకృత సర్వ పాదోది జలం"గా చేయమని కోరినా, అయన అంటే నీ భర్త అగస్త్యుడు మళ్ళీ ఎల్లా తన మూత్రాన్నే పానం చేయగలడు?" ఇది లోకధర్మ విరుద్ధంకదా మాతా ! లోకం ఏమను కొంటుంది? "రాముడు సొంత కార్యం కోసం నిష్టా గరిష్టూడైన బ్రాహ్మణుడి చేత స్వమూత్ర పానం చేయించాడు "అనే లోకనింద పడమంటావా. అపకీర్తి మూట గట్టుకోమంటావా ? ! ఇది న్యాయమా ? అందుకే రాముడు ధర్మ స్వరూపుడు కనుక నీ భర్త అగస్త్యుని ప్రార్ధించలేదు. ఇన్ని రకాలుగా అలోచించి వానర మూకల చేత సేతు బంధాన్ని చేయిన్చాడు ధర్మమూర్తి రామమూర్తి. ఇంతవరకు ఎవరూ చేయని సాహసం చేసి సేతు నిర్మాణం గావించి చిరకీర్తి పొందాడు రాముడు. ఏ రామునిచేత సముద్రం లో రాళ్ళు సంతరింప బడ్డాయో అలాంటి వాడుకదా "దాశరధి" అని నా భర్త శ్లాఘింప బడ్డాడు కీర్తింప బడ్డాడు !" అని సీతాసాధ్వి సవినయంగా మనవి చేసింది. లోపాముద్ర ఈ సమాధానికి ఓడిపోయి తలవంచుకొని నిలబడింది. మునిపత్ని ఖిన్నురాలుకకుండా ఆమెపై తన కున్న అపూర్వ గౌరవాన్ని ప్రకటిస్తూ లోపాముద్రాదేవిని యధోచితంగా సత్కరించి మిగిలిన మునిపత్నులనూ పూజించి అందరి ఆశీస్సులు అందుకొన్నది. ఇంకా మునిపత్ని మనసులో ఏమైనా కోపం ఉందేమోనని సీతాదేవి ఆమె చెంతకు చేరి "అమ్మా లోపాముద్రా దేవీ ! పరమ పవిత్రురాలివి నువ్వు. నేను చాలా

అపరాధం చేశాను. అంత పరుషంగా నేను మాట్లాడి ఉండి ఉండాల్సినదికాదేమో. ప్రసంగ వశం లో, పరవశం లో శ్రీరామ గుణగానాన్ని చేశాను. ఆయన పౌరుషాన్ని ప్రకటించాను. అంతే నీ మీద నాకు ఏ విధమైన ద్వేష భావమూ లేదు. మహర్షి అగస్త్యులవారివలననే నా భర్త శ్రీరామునికి అంతటి పరాక్రమ పౌరుషాలు లభించాయని నాకు తెలుసు. నన్ను మన్నించమ్మా మనసులో ఏమీ భేదభావం నాపై ఉంచుకోకు తల్లీ "అని పాదాలపై పడి ప్రార్ధించి స్వస్త చిత్తను చేసి యధోచిత సత్కారాలు అందించి లోపాముద్రాది మునిపత్నులకు వీడ్కోలు పలికింది సీతాసాధ్వి.



## సపరివారం గా రాముడు అగస్త్యాశ్రమానికి వెళ్ళటం

సీత తో తమ్ములతో మంత్రి ఇష్ట మిత్రులతో కలిసి ఒక సారి రాముడు పుష్పక విమానమెక్కి దండకారణ్యం లోని అగస్త్యముని ఆశ్రమానికి వెళ్ళాడు. ముని ఎదురొచ్చి స్వాగత సత్కారాలు అందజేశాడు. మహర్షి స్నానం చేసి అన్నపూర్ణా దేవిని స్మరించాడు. ఆమె సంప్రీతి చెంది ఒక పాయస పాత్రను ఆయనకు ఇచ్చి"మునీశ్వరా ! ఈ పాత్రలో అనేక పక్వాన్నాలు సమస్త భోజ్య పదార్ధాలు ఉన్నాయి. నీభార్య లోపాముద్రకు ఈ పాత్రనిచ్చి అందరికి వడ్డించమని చెప్పు "అని చెప్పి అదృశ్యమయింది. అలాగే అగస్త్య పత్ని రామ పరివారానికి వడ్డించింది. అందరికి ఎవరికి ఏది ఇష్టమో ఆ పదార్ధాలన్నీ పాయస పాత్రనుండి వస్తుండగా సంతోషంగా వడ్డించి వారదరికీ తృప్తి కలిగించింది. భోజనాల తర్వాత సీతా రాములకు బంగారు ఆభరణాలను నూతన వస్త్రాలను ముని దంపతులు సమర్పించి ఆశీర్వదించారు.



## రాముడు అగస్త్యునితో పంచాప్సర సరోవరానికి వెళ్ళటం

మళ్ళీ పుష్పకమెక్కి పరివారం తో దండకాటవి సోయగాలను తిలకిస్తూ పంచాప్సర సరోవర తీరం చేరి ఆ రాత్రి అక్కడే విశ్రమించాలని సంకల్పించారు. సీతారాములు అప్సర నాట్య గానాలు తిలకించి సంతోషించారు. కాని అప్సరసలు మాత్రం ఎవరి కంటికీ కనిపించలేదు. అందులోని రహస్యాన్ని రాముడు అగస్త్య మునినిని తెలియ జేయమని కోరాడు. "రామా ! సర్వజ్ఞుడివి నీకు తెలియని విషయమే లేదు. నాద్వారా వినాలనే నువ్వు అడిగావు. చెప్తున్నాను విను "పూర్వం గంధర్వ రాజు పుత్రికలు అయిదుగురు మనోహరాంగులై రజస్వలలు కాకపూర్వం ఈ సరోవరం లో క్రీడించారు. ఇంతలో సరోవరం నుండి ఏడుగురు నాగకన్యలు కూడా బయటికి వచ్చి జలక్రీడలాడుతున్నారు. ఇలా నాగ గంధర్వకన్యలకు బాగా పరిచయాలు పెరిగిపోయాయి. సరస్సు ఒడ్డున తపస్సు చేస్తున్న ఒక మునీశ్వరునికి వీరి జలక్రీడల వలన తపోభంగం కలిగింది. ఆయన వారందరినీ సరస్సు వద్దకు రావద్దని గట్టిగా చెప్పాడు. చపల చిత్త లైన అకన్యలు ముని మాట లక్ష్యపెట్ట లేదు. దేవేంద్రుడు కూడా వారిని ప్రోత్సహించి మరికొంతమంది అప్సరసలను అక్కడికి పంపి ముని సహనాన్ని పరీక్షించాడు. ఏంతో కోపం వచ్చిన వీళ్ళకు శాపం ఇస్తే తన తపస్సు వృధా అవుతుందని ముని ఆగుతున్నాడు. ముని జలదేవతలను ప్రార్ధించాడు. వారు వచ్చి అయిదుగురు అప్సరసలను, నాగ కన్యలను బలాత్కారం గా అక్కడినుంచి తీసుకొని వెళ్లి ఎవరికీ వినపడని కనపడనిని నీటి ఇంటిలోదాచేశారు. హాయిగా తపస్సు చేసుకొని కొంతకాలానికి ఆ ముని స్వర్గం చేరుకొన్నాడు.. వాళ్ళు ఇప్పటికీ అక్కడే ఉన్నారు నృత్య గీతాలాపన కొనసాగిస్తున్నారు. అదే నువ్వు వింటున్నది. నువ్వు వారిపై దయతో వారిని సంతుష్టులను చేయి "అన్నాడు.



ముని ఆజ్ఞను ఔదల దాల్చి శ్రీ రాముడు లక్ష్మణ స్వామిని తన ధనుర్బాణాలను వెంటనే తీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు తాను వెళ్లి జలదేవతను శిక్షించి నాగకన్యల చేర విడిపిస్తానని అన్నాడు. అన్న చెప్పినట్లు తమ్ముడు చేశాడు. చాపం చేత బూని ధనుస్టంకారం చేసి బాణాన్ని సంధించ టానికి సిద్ధ పడ్డాడు రాముడు. అప్పుడు భూమి కంపించింది చండమారుతం వీచింది, దిక్కులన్నీ దుమ్ము కమ్మి చీకటి పడినట్లయింది. చుక్కలు రాలిపడి పోతున్నాయి. ప్రళయ భీకర రామ ధనుస్టంకారానికి భయపడిన జలదేవాతలు భయపడి తాము దాచి ఉంచిన కన్యలనందరిని వెంట బెట్టుకొని రామ దర్శనానికి వచ్చారు. రామపాదార విన్దాలపై పడి ప్రణమిల్లారు. సర్వాలంకార శోభితులైన పన్నెండుమంది నాగ కన్యలను శ్రీరామునికి సమర్పించారు.

రాముని పాదాలపై వ్రాలిన జల దేవతలు రామునితో "శ్రీ రామా !మా అపరాధం క్షమించు. బాణాన్ని ప్రయోగించవద్దు. సూర్య వంశాజులెవ్వరూ స్త్రీలపై బాణ ప్రయోగం చేయలేదు. నువ్వు కూడా గంగా తీరం లోసీతాదేవి ప్రతిజ్ఞ చేసినప్పుడు బాణం ప్రయోగించకుండా భూదేవిని రక్షించిన కరుణా సముద్రుడివి. తాటకిని చంపానుకదాలని నువ్వు ప్రశ్నించ వద్దు. పాపులను సంహరించటం తో బ్రహ్మ హత్యా పాతకం రాదనీ నీకు తెలుసు "అని భయ భక్తులతో ప్రార్ధించారు. సంతోషించిన రాముడు వారి మాటల విశేషానికి నవ్వి బాణాన్ని తూణీరం లో నుంచి బయటికి తీయలేదు. జలదేవతలు రాముని పూజించారు. వారిని స్వస్థానాలకు వెళ్ళిపొమ్మని రామాజ్న. అప్పటికే అక్కడికి చేరిన నాగ, గంధర్వులు సీతారామ అగస్తులను అభినందించి రామునికి కానుకలు అందించి మనోహర వాక్యాలతో ప్రశంసిస్తూ.

## నాగ గంధర్వులు శ్రీరాముని ప్రార్ధించటం



"రాజీవాక్షా !ఈ కన్యలు రజస్వల కాని కన్నెలు. వీరందరూ నీ పుత్రికలుగా భావించు. వీల్లనందర్నీ నీ పుత్రులకు ఇచ్చి వివాహం చేసి కన్నెచెర విడిపించు. నీవలన మాకులాలు పవిత్రమయ్యాయి. "రాముడు వారికి అలానే చేస్తానని వాగ్దానం చేసి వారిని పంపేశాడు. అగస్త్యుదు రామునితో "రామా !నువ్వు వైకుం ఠానికి వెళ్ళేటప్పుడు కుముదుని చెల్లెలైన కుముద్వతిని కుశుని ధర్మపత్నిగా ఏర్పాటు చేయి. ఈ చంపిక కు మగ పిల్లలు పుట్టరు. కుముద్వితి వలన కుశునికి అతిధి అనే కొడుకు జన్మిస్తాడు అతడే రాజ్యానికి ఉత్తరాదికారి అవుతాడు. వంశ వర్ధనుడౌతాడు. ఇప్పుడు కుశుడు తప్ప మిగిలిన లవుడు మొదలైన వారికి నాగ కన్యలను ఏడుగురిని విధి విధానంగా వివాహం చేయించే ఏర్పాటు చేయి. నీ కొడుకు యూప కేతువు ఇంకొక అమ్మాయిని రాక్షస వివాహం చేసుకొంటాడు. అతని సమర్ధత వలన వచ్చే భార్యకూడా మంగళాంగి అవుతుంది. వారికి కొడుకులు మనుమలు కలుగుతారు. నీకొడుకులు కోడళ్ళు అందరూ సుఖ శాంతులతో వర్ధిల్లుతారు. మనుమలు మునిమనుమలను కళ్ళారా చూసి వారి సౌభాగ్యాన్ని గమనించి సంతృప్తి చెంది అప్పుడు మాత్రమె నువ్వు వైకుంఠానికి సపరివారంగా వెళ్ళాలి "అని ఆదేశించాడు రాముడు చిరునవ్వుతో ముని ఆజ్ఞను శిరసా వహిస్తానన్నాడు. కన్యల పేర్లను అడిగి తెలుసుకొన్నాడు రాముడు. వారే చంద్రిక, చంద్ర వదన, చంచల, చపల, అచల "అని తెలియజేశారు గంధర్వులు. ఆ తర్వాత నాగుల నడిగి ఆ కన్యల పేర్లు "కంజానన,కంజ నేత్ర, కంజాంఘ్రి, కలావతి, కళిక, కమల, మాలతి "అని తెలుసుకొన్నాడు. వారందరి మనోభావాలను తెలుసుకొని వారికి తనకుమారులతో వివాహం మనస్పూర్తిగా ఇష్టమే నని గ్రహించాడు. అందరిని పుష్పకం ఎక్కించి సుఖ నిద్రపోయారు. మర్నాడు ఉదయం స్నానాదికాలు నిర్వహించి అగ్ని హోత్రాన్ని అర్చించి గంధర్వ నాగ జనాన్ని చూసి రాముడు "ఈ జనం తో నేను నాగ గాంధర్వ స్వర్గ

లోకాలకు మనుష్యలోక వాసినైన నేను రావటానికి యోగ్యుడినికాను. కనుక నామాట విని మీరు మీ స్వస్థానాలకు వెళ్లి పోయి, ఈ కన్యల వివాహాలకు సకుటుంబ సపరివార సమేతంగా మళ్ళీ అయోధ్యాపురికి విచ్చేసి కళ్యాణాలనులను తిలకించి పులకించి మా ఆతిధ్యాన్ని స్వీకరించి మమ్ములనందరిని ఆనందింప జేయండి "అని చెప్పి అయోధ్యకు చేరాడు.

వీరందరి వివాహం ఎలా జరిగిందో కిందటి ఎపిసోడ్ లో తెలుసుకొన్నాం కదా. ఇక స్వస్తి

## పన్నెండు పెళ్ళిళ్ళు

ఒక రోజు రామరాజు సింహాసనం పై ఆసీనుడై జ్యోతిశాస్త్ర పండితులను పిలిపించి, కులగురువు వశిష్టమహర్షిని సగౌరవంగా ఆహ్వానించి కూర్చోబెట్టి, నాగ గాంధర్వ పురోహితులనూ ఆహ్వానించి తన 7 గురు కుమారులకు దివ్యమైన వివాహ ముహూర్తాన్ని నిర్ణయించమని అర్ధించాడు. అందరు పండితులు తమలో తాము సంప్రదించుకొని ఏకగ్రీవం గా "వైశాఖ మాసం లో శుక్ల పక్షం లో ఒక ముహూర్తాన్ని దానికి పదిహేను రోజుల్లో కృష్ణ పక్షం లో మరో ముహూర్తాన్ని సూచించారు. అలాగే జ్యేష్టమాసం లోకూడా శుక్ల పక్షం లో ఒకటి కృష్ణ పక్షం లో మరొకటి దివ్యమైన ముహూర్తాలని సెలవిచ్చారు, మార్గశిరమాసం లోనూ రెండు, మాఘ మాసం లో మూడు ముహూర్తాలున్నాయని చెప్పారు. ఇలాగ పన్నెండు ముహూర్తాలు పన్నెండుమందికన్యలకు తగి ఉన్నాయని సెలవిచ్చారు. మళ్ళీ అందరూ కలిసి వసిష్టులవారి తో సంప్రదించి శ్రీరామునికి నివేదించారు. లవునికి, అంగదునికి వైశాఖ మాస ముహూర్తాన్ని, చిత్రకేతు, పుష్కరులకు జ్యేష్టమాస ముహూర్తాన్ని, వేర్వేరు పక్షాలలో బాగున్నాయని నిర్ణయించారు. తక్షుడికి సుబహువుకు మార్గ శిరమాస ముహూర్తాలు భేషుగ్గా ఉన్నాయన్నారు. యూపకేతువుకు, అంగదునికి, చిత్రకేతువుకు మాఘ మాస ముహూర్తాలు కుదిరాయన్నారు పుష్కర, తక్షక, సుబాహువులకు ఫాల్గుణ మాస మూడు ముహూర్తాలు తగినవిగా ఎంచారు. ఇలా రాజకుమారులు 12 మందికి 12 శుభ ముహూర్తాలు నిర్ణయించారు జ్యోతిశ్శాస్త్ర పండితులు. వారిని రాముడు ఘనంగా సన్మానించాడు.

జ్యోతి ష్ శాస్త్ర పండితులు మహర్షి వసిష్టుడు, గాంధర్వ నాగ పురోహితులు అందరూకలిసి శ్రీరాముని సన్నిధానానికి చేరి గాంధర్వ, నాగ కన్యలను పెళ్లి కుమారులకు చక్కగా పంచారు. కన్జానన ను లవునికి, కంజాక్షి ని అంగదునికి కన్జాంఘ్రిని చిత్ర కేతువునికి, కలావతిని పుష్కరునికి, కాలిక ను తక్షునికి, కమలను సుబాహునికి, మాలతిని యూప కేతువునకు, ఇచ్చి వివాహం చేస్తే చక్కని పొంతన ఉంటుందని తెలియ జేశారు. ఈ విధం గా ఏడుగురు నాగ కన్యలకు తగిన వరులను నిర్ణయించి చెప్పారు. తర్వాత చంద్రికను అంగదునికి, చంద్రాస్యను చిత్ర కేతువుకు, చంచలను పుష్కరుడికి, ఆచలను సుబాహువుకు ఇచ్చి వివాహం చేస్తే దాంపత్యం అన్యోన్యంగా వర్ధిల్లుతుందని చెప్పారు. సంతోషించిన రాముడు అందరిని సముచితంగా సత్కరించిపంపి సీతా దేవికి ఈ విషయం వర్తమానం పంపాడు.

ఏడుగురు కొడుకులకు పన్నెండు మంది కన్యలతో వివాహం చేసిన తండ్రి శ్రీరాముడు రాజకుమారుల వివాహవార్త దేశమంతటా చాటించగా అశేష జన సందోహం అయోధ్యకు వచ్చి చేరుకొన్నది. ఎక్కడ చూసినా జయ జయ ద్వానాలే. రాజవీదులన్నీ క్రిక్కిరిసిపోయాయి. అందరికి తగిన వసతి సౌకర్యాలు కల్పించారు. రాక్షససేనతో విభీషణుడు, వానరసేనతో సుగ్రీవుడు, ఇద్దరు కొడుకులతో భూరి కీర్తి, సపరివారంగా జనక మహారాజు తమ్ముడు, యుదాజిత్తు తో సహ విచ్చేశారు. ఎవరికీ ఏ లోపం లేకుండా మంత్రులు ఏర్పాట్లు అద్భుతంగా చేశారు.

శ్రీరాముడు వైశాఖ శుక్లపక్షం లో పురోహిత, బంధు మిత్రులతో మంగళ స్నానాలు చేశాడు. లవకుమారునికి మంగళ స్నానాలు చేయించి పెండ్లికోడుకును చేయించాడు వ.ధువు చే సువాసినీ పూజ జరిపించాడు. సీతాదేవి మిగిలిన రాణులు అభ్యంగన స్నానాలు చేశారు. దివ్యాభరణాలతో శోభాయమానంగా అలంకారాలు చేసుకొన్నారు. మంగళ వాద్య ధ్వనులు మిన్నులు ముట్టు తున్నాయి. శ్రీరాముడు పురోహితుల సహాయం తో శ్రీ మహా గణపతి పూజ చేశాడు. తర్వాత పున్యాహవాచనం నవగ్రహ పూజ చేశాడు. మునులన్దరిని ఉచిత రీతిలో సత్కరించాడు. ముహూర్త సమయానికి ముందే నాగ రాజులున్న విడిది ఇంటికి చేరుకొన్నాడు.. లవకుమారుని నాగకన్య కన్జనయనకు శాస్త్రోక్తంగా ముహూర్త సమయానికి వివాహం చేశాడు. నాలుగవ రోజున లవుడు మంగళ మంటపం లో శోభాయమానం గా విరాజిల్లాడు. రాముడు స్వగృహం లో లవుని చేత శ్రీమహా లక్ష్మీపూజ చేయించాడు. అనేక దానాలు ఇప్పించాడు. వివాహానికి తరలి వచ్చిన నాగ యక్ష గంధర్వ పౌరజనం అంతా రామునికి నూతన వస్త్రాభరణాలు చదివించి పూజించి ధన్యులయ్యారు. లక్ష్మణుడిని కుశుడిని సన్మానించారు. రాజ పత్నులు, మిత్రపత్నులు గంధర్వ పత్నులు వేర్వేరుగా సీతాదేవి మొదలైన రాజ పత్నులను సత్కరించారు. వారందరికీ సీతా దేవి యధోచిత సత్కారాలు చేసింది. ఇలా వైశాఖ మాస శుక్లపక్షం లో రాముడు లవుని వివాహం చేసి అందరికి ఆనందం కలిగించాడు.

వైశాఖ కృష్ణ పక్షం లో రాముడు అంగద వివాహం మహా వైభవం గా నిర్వహించాడు. జ్యేష్టమాసం లో శుక్ల, కృష్ణ పక్షాలలో చిత్ర కేతు, పుష్కరులకు పెళ్ళిళ్ళు ఘనం గా చేశాడు. సమస్త రాజులను సత్కరించి మర్యాద చేసి పంపాడు. మళ్ళీ మార్గ శిరమాసం వివాహాలకు రావాలని కోరాడు. మళ్ళీ అందరి సమక్షం లో మార్గశిరమాసం లో తక్షకునికి సుబాహువుకు వైభవోపేతం గా కళ్యాణాలు జరిపించాడు. మాఘ మాస వివాహాలకు ఆహ్వానించి యూప కేతువు అంగదుడు, చిత్రకేతువు లకు ఘనంగా వివాహాలు నిర్వహించి వచ్చినవారందరినీ వెనక్కి వెళ్ళకుండా అయోధ్యలోనే ఉంచుకొని ఫాల్గుణ మాసం లో పుష్కర,తక్షక, సుబాహువుల పెండ్లిండ్లు మహా వైభవోపేతంగా జరిపించాడు. ఈ విధంగా తన ఏడుగురు కుమారులకు పన్నెండుమందికన్యలతో వివాహం జరిపించి రికార్డ్ సృష్టించాడు రాముడు. ఈ కళ్యాణాలు జగదానంద కారకాలుగా, బ్రహ్మానందం గా జరిగినందుకు దేవ యక్ష గంధర్వ నాగ, రాక్షస వానర సమూహాలన్నీ పరమానంద భారితులయ్యాయి. అందరినీ శ్రీరామ పరివారం సగౌరవం గా సత్కరించి మర్యాదలతో వీడ్కోలు పలికి రాముని గొప్పతనానికి వన్నె తెచ్చారు. వారందరూ అయోధ్యను, రాముని వదలలేక వదలలేక వెళ్ళారు.

**ఆనంద రామాయణం ప్రధమ సంపుటం లోని విశేషాలు ఇంతటితో సమాప్తం.**

## చిలుకూరు వారి వచన వాల్మీకి రామాయణం

మనిషికి పుట్టగానే డబ్బు సంపాదన యావ ఉండటం సహజం. ధనాన్ని ఎన్ని రకాల వీలైతే అన్ని రకాల సాధించి, అష్టైశ్వర్యాలతో తుల తూగాలని కాంక్ష ఉంటుంది. దాన్ని సార్ధకం చేసుకోన్న వారెందరో మనకు తెలుసు. ఆ డబ్బును కొందరు సంఘ ప్రయోజనాల కోసం ధారాళం గా ఖర్చు చే్శా అలాంటి అరుదైన మనిషి -మనీషిగా ఎదిగిన వారు బ్రాహ్మణులు అయిన శ్రీ చిలుకూరు వెంకటేశ్వర్లు. గారు.



శ్రీ చిలుకూరు వెంకటేశ్వర్లు గారు మా ఉయ్యూరు దగ్గర తోట్ల వల్లూరు లో నోరి వారింట జన్మించారు. తర్వాత చిలుకూరు వారికీ దత్తత వెళ్లారు. మద్రాస్ చేరి పెయింట్ వ్యాపారం లో,, ఫైనాన్స్ లో, రియల్ ఎస్టేట్ లో పిచ్చగా సంపాదించారు. అరవైఏళ్ళ దాకా ధన యావ తప్ప రెండోది ఆయనకు తెలీదు. అప్పుడు ఆయన జ్ఞాన నేత్రం తెరుచుకోంది..జీవిత గమ్యాన్ని మార్చుకోవాలన్న ఆలోచన కలిగింది. తన డబ్బు, సంపదా అంతా కొడుకులకు, వారికి దక్క వలసినది అంతా న్యాయం గా పంచేసి, , తనకు వచ్చిన దానిలో చెన్నై లోని శ్రీరామ కృష్ణా మ ఠంకు చాలా భాగం రాసిచ్చి,, అక్కడే తపోవనం లో సాధారణ జీవితాన్ని, ధ్యాన దీక్ష, సాహిత్య రచన తో గడుపుతూ శ్రీ రామ కృష్ణ పరమ హంస వారి దివ్య బోధా ప్రచారం కోసం పుస్తకాలను రాసి ప్రచురిస్తున్నారు. భాగవతాన్ని వచనం గా సరళ శైలిలో రాశారు. భగవద్గీత ను పదవ తర గతి విద్యార్ధులను దృష్టిలో ఉంచుకొని, వారికి అర్ధమై,అందే తీరులో శ్రీ పరమ హంస గారు చెప్పిన కధలను జోడించి, మనస్సుకు హత్తుకొనే రీతిగా రాసి, విద్యార్ధులకు రామ కృష్ణ మిషన్ ద్వారా ఉచితం గా అంద జేశారు. తరువాత విద్యా రన్యస్వామి రచించిన శ్రీ శంకర విజయాన్ని అతి సుందర సుస్పష్ట తెలుగు వచనం గా అనువదించి ఇనుప గుగ్గేల్లను తీపి మిఠాయి చేసి అందించి ఏ కొద్ది మంది మాత్రమే బాగా సంస్కృత ప్రావే న్యం ఉన్న వారికి మాత్రమె అర్ధమయ్యే విద్యారణ్య బోధనలను, జన సామాన్యకు చేరువ చేసి సంచలనం సృష్టించారు., , మంచి పేరు పొందారు. వాల్మీకి రచించిన శ్రీ మద్రామాయణాన్ని అత్యంత మెలకువ తో సులభ శిలిలోవచనం గా రెండు భాగాలుగా అనువదించి, మహర్షికి గొప్ప నీరాజనం ఇచ్చారు. ఎప్పుడో డెబ్బై, ఎనభై ఏళ్ళ క్రితంమహా పండితులు, మంత్ర ద్రష్ట, అనేక ఆద్యాత్మిక గ్రంధ రచయిత అయిన స్వర్గీయ జన మంచి శేషాద్రి శర్మ గారు రచించిన "శ్రీ రామావతార తత్త్వం "ను మళ్ళీ ఎవరు పునర్ముద్రించని కారణం గా వెంకటేశ్వర్లు గారు-శ్రీ శర్మ గారి విధానం లోనే ఇంకా సులభ గ్రాహ్యం గాఅనేక విశేషాలతో, పూర్వా పరాలతో గొప్ప సమన్వయ ధ్రుక్పధంతో రాసి ఆస్తిక జనానికి మహద్భాగ్యాన్ని కల్గించారు. మా రెండో కోడలు ఇందిరకు ఆయన తాత గారు. నా అడ్రెస్ వారు సంపాదించి వారు ప్రచురించిన పుస్తకాలన్నీ పోస్ట్ లో పంపారు. అన్నీ చదివి, వారికి వివరం గా నా అభిప్రాయాలను లేఖ ద్వారా తెలియ జేశాను. అప్పుడప్పుడు ఫోన్ లో మాట్లాడే వారు మన సరసభారతి ప్రచురించిన పుస్తకాలన్నీ వారికి పంపాను. చదివి స్పందించేవారు. ఇలా మా సాహిత్య బాంధవ్యం ఏర్పడింది. ఇప్పుడు నేను 7-4-2011 నవారికి రాసిన వారి వచన రామాయణ విశేషాలను మీ అందరికి అంద జేస్తున్నాను.

శ్రీ మద్రామాయణం




వాల్మీకి కృత రామాయణానికి శ్రీ చిలుకూరు గారు చేసిన అనువాదం సరళం గా, సహజం గా, స్సుందరం గా, నిసర్గ రమణీయం గా ఉంది. మంచి ముద్రణా, అందమైన ముఖ చిత్రం తో సర్వాంగ సుందరం గా పుస్తకం హస్త భూషణం గా ఉంది. మొత్తం మీద ఒకే ఒక అచ్చు తప్పు కానీ పించింది అంటే ముద్రణ విషయం లో ఎంత జాగ్రత్త తీసుకొన్నారో అర్ధమవుతుంది "మరి ఎలా రామాయణమ్మన్నచో "అనుకొన్న విశ్వ నాద సత్య నారాయణ గారి మార్గం లోనే వీరూ ఆలోచించారు. ఆయన అనుభవ సారాన్ని ఇమిడ్చి రచించటం హర్షనీయం, ఆనంద దాయకం. దగ్గర కూర్చో పెట్టుకొని, ఆప్యాయం గా చక్కగా చిక్కగా కదా చెప్పి విని పించి నట్లు గా,హాయిగా ఉండటం విశేషం.. కధా గమనానికి అవసర మయాన వాటినే గ్రహిస్తూ, అతిగా ఉండే వర్ణనల జోలికి పోకుండా, ప్రతి వాక్యం చదవాలి చదివి అందులోని సారాన్ని తెలుసు కోవాలన్న ధ్యేయం తో సాగిన రచన. సాంప్రదాయ రచనగా, ఆర్ష ధర్మ వ్యాప్తి గా రాశారు. శ్రీ పరమహంస ల అవ్యాజ కరుణా రసం వీరిపై సంపూర్ణం గా ఉంది. అందుకే రచన హృద్యమైంది. ఎక్కడా సందిగ్ధత లేదు. సారళ్యం సర్వదా కానీ పిస్తుంది. మహర్షి వాల్మీకి రామాయణాన్ని హృద్గతం చేసుకొన్నారు కనుక, ఆ భావ వ్యాప్తి అంత సులభ తార మైంది వెంకటేశ్వర్లు గారికి. మనసారా అందరు అభి నందిన్చాల్సిన ప్రయత్నం.

అగ్ని శర్మ అత్రి మహర్షి ప్రేరణ చేత తపస్సు చేసి, వాల్మీకి మహర్షిగా అవత రించటం,ఆది కవి అయి, ఆది కావ్య మైనశ్రీ మద్రామాయణాన్ని రాయటం మనసుకు హత్తుకొనే రీతిలో రాశారు. ఈ నాడు విప్ల వాత్మ కం గా భావించే "Fraternity of mankind, world citizenship,human dignity concern for society, nationalism "అన్న భావాలను రామాయణం లో అడుగడుగునా దర్శన మిస్తాయని చిలుకూరు వారు తమ ప్రస్తావన లోపేర్కొనటం సముచితం చక్కని ప్రాతి పదిక కూడా.ఈ మొత్తం భావ వ్యాప్తియే రామాయణం.రాముని మార్గమే కాదు సీత మార్గమే కాదు మానవాళి ప్రయాణ మార్గాన్ని సూచించాడు మహర్షి వాల్మీకి కవి. అలాగే రాముడు మానవ మాత్రుడి గానే వ్యవహరించటానికి తన "మాయ "ఏ తనను ఆవహించాలని కోరుకోవటం వల్లనే అన్న విషయం సరిగ్గా సరిపోతాయి. యుద్ధ కాండ చివరలో దేవత లంతా శ్రీ రాముడిని శ్రీ మహా విష్ణువే అని ప్రస్తు తిన్చితే రాముడు మాత్రం తాను దశరధ పుత్రుడినే అనటం, రామాయణ ఆత్మను ప్రదర్శింప జేయట మే..మానవుడు అనుకొంటే అన్నీ సాధించగలడు అని స్పష్టం గా తెలియ జేయట మే ఈ మాటల్లోని పరమార్ధం.అందుకే "మనుష్యుడిల మాహాను బావుడే "అన్నాడు ఆధునిక కవి.

### బాలకాండ

బాలకాండ-ఆ నాడు సాంప్రదాయానికి విరుద్ధం గా యాగాలను నిర్వహించేవారు. తర్వాత బ్రహ్మ రాక్షసులై, యాగ విధ్వంసం చేశారు. రాక్షసులు ఎక్కడి నుండో ఊడి పడరు. మనలోని అవ్యక్త శక్తులే ఆరూపం గా వ్యక్త మౌతాయి. అశ్వమేధం లో యజమాని భార్య, కొన ఊపిరితో ఉన్న అశ్వాన్ని, మూడు బంగారు సూదులతో గుచ్చగానే అది చని పోయేది అన్న వివరణ అవసరమైనదే. యాగం పై ఉన్న అపోహను పోగొట్టేది. జాంబ వంతుడు బ్రహ్మ దేవుడు ఆవలించిన ముఖం లో నుంచి జన్మించటం తెలియ దగిన విషయం. అందుకె ఆయన వానర సేనకు గొప్ప సలహా దారు, పెద్ద దిక్కు అవగాలిగాడు. మన్మధుడు కాలి బూడిద అయిన దేశం అంగ దేశం అయింది అన్న విషయం తెలియ దగింది. విశ్వా మిత్ర మహర్షి శ్రీ రామునికి ఇచ్చిన "గాంధర్వ మానవాస్త్రం "విచిత్ర మైనదే. కావాలని రామునికి దీన్ని అనుగ్రహించాడు మహర్షి. ఇచ్చిన వాటికి కృతజ్ఞత తెలుపుతూ, స్మరించి నప్పుడు మాత్రమె వచ్చి సహాయం చేయమని అంత వరకు మనస్సులో మెదులుతుతు ఉండమని

కోరటం "రాముని బుద్ధి మంత తనం "వామన జన్మ ద్వాదశి నాడు శ్రవణా నక్షత్ర ములో చంద్రుడు ఉన్న అభిజిధ్ నక్షత్రం అని అదే వామన జయంతి అని అందరికి తెలియని విషయాన్ని ఎరుక పరచారు.




పార్వతీ పరమేశ్వరుల రహస్య క్రీడను అడ్డు కొన్న దేవతలకు సంతానం కలగదని అమ్మ వారి శాపం, భూదేవి కూడా తనకు సంతానం కలుగ కుండా చేసి నందుకు ఆమెకు బహు భత్రు త్వాన్ని, పుత్ర సంతానలేమి కల్గించటం లో, ఎంత మహిమాన్వితు లైనా, తమకు కలిగిన బాధను తట్టుకో లేరని, ఎదుటి వారికీ అలంటి బాధలు రావాలని కోరుకోవటం ఒక వింత నైజం గా కన్పిస్తుంది. ఇక్కడే పార్వతీ దేవి కూడా దీనికి ఏమీ అతీతం కాదని అని పిస్తుంది. భూ భారాన్ని మోసే "విరూపాక్ష దిగ్గజం ",అలసట కలిగి నప్పుడు తలను కదిలిస్తే, భూ కంపాలు కలుగుతాయని అనటం లో భూ కాలుష్యం ప్రమాదం అనే హెచ్చరికే ఉంది. క్షీర సాగర మధనం లో జన్మించిన 60కోట్ల మంది అప్సరసలను దేవ, దానవులేవరూ వివాహం చేసుకోవటానికి ముందుకు రాక పోవటం వాళ్ళ వారంతా వేశ్యలైనారని చెప్పటం లో ఇన్ డైరెక్ట్ గా వివాహ వ్యవస్థ అవసరాన్ని చెప్పకనే చెప్పి నట్లయింది ఒక రకం గా వారు సమాజం లో డ్రైనేజి వ్యవస్థ గా ఉండిపోవాల్సి వచ్చిందన్న సత్యం కని పిస్తుంది.

ఇంద్రునికి మేష వృషణాల ను అమర్చటం వల్ల, ఆ నాటి నుండి పితృ దేవతలు వృషణాలు లేని గోర్రెలనే భుజించారు. ఇదులో అవయవాల ట్రాన్స్ ప్లాంటేషన్ శాస్త్రం ఆనాడే అమల్లో ఉందని అర్ధమవుతుంది. ఈ రోజుల్లో మాంసం తినే వారికి గొర్రె వృషణాలు మహా ప్రీతీ పాత్రం అని వింటున్నాం. విశ్వా మిత్రుడు తన కుమారుల్ని యాగ పశువులు గా ప్రాణ త్యాగం చేయమని కోరితే, వారందరూ తిరస్కరించగా, వారిని అధమ జాతి మానవులు గా పుట్టమని శపిస్తాడు. ఆ జాతుల్లో "అంధక, ముష్టిక "జాతులున్నాయి. అంధ జాతే ఆంధ్ర జాతి అనే కధనం ఉంది. ఇది అంత సవ్యం గా లేదనుకొని వెంకటేశ్వర్లు గారు దాన్ని వదిలేశారు. గరళం తో కలిసి పుట్టిన వాడు సాగరుడు అవటం, శాప జలం చేత కల్మషుడు అయిన వాడు కల్మష పాదుడు అవటం వ్యుత్పత్తి వ్యక్తీకరణాలు. భగుడు ఉత్తరా నక్షత్రం తో కూడిన రోజు వివాహానికి మంచి రోజు అని, భగుడు సంతాన ప్రదాత అన్న మహర్షి జ్యోతిశ్శాస్త్ర పాండిత్యాన్ని వెలికి తీసి చూపారు. శ్రీ రాముని చేతిలో గర్వం ఖర్వం అయిన పరశు రాముడు రాత్రి పూట తాను భూమి పై ఉండ రాదనీ, తన గమనానికి సహకరించే పాదాలపై బాణ ప్రయోగం చేయ వద్దని దశరధ రాముడైన కళ్యాణ రాముడిని కోరుకోవటం మనకు కొత్త విషయం గాన అని పిస్తుంది.

అయోధ్యకాండ –కోరికలతో కూడిన వ్యసనాలను, క్రోధం తో వచ్చే వ్యసనాలకు హెచ్చరిక గా మంచి వివరణ నిచ్చారు రచయిత. శ్రీ రామ పట్టాభి షెక ముహూర్తాన్ని సభలో ప్రకటించిన దశరధ మహా రాజు కీడు ను శంకిస్తాడు. ఇది ఆయన మనో వ్యాకులతకు అద్దం పట్టు తుంది. రాబోయే అనర్ధానికి సూచన కూడా. అలాగే రాముడు లక్ష్మణునితో తాను రాజ్యాభి షెకానికి అంగీకరించటం, లక్ష్మణుడి కోసమే నని, భోగాలు, రాజ్య ఫలం లక్ష్మణుడు అనుభవించాలని తన మనో భావం అని తెలియ జేయటం లో రామునికి ఉన్న భ్రాతృ ప్రేమ కు నిదర్శనం గా ఉంది మంధర ను "యతో జాతా "అని వాల్మీకి సంబోదిన్చాడని, అంటే –"అడ్రెస్ లేనిది "అని చక్కని వివరణ నిచ్చారు వెంకటేశ్వర్లు గారు. "అలర్కుడు "అనే రాజు తనను యాచించిన ఒక గుడ్డి బ్రాహ్మణుడికి నేత్ర దానం చేశాడు. కనుక రామాయణ కాలం లోనే "నేత్ర దాన ప్రక్రియ "ఉంది అని గ్రహించాలి. రాముడు పూసుకొన్న చందనం "వరాహ రక్తం "లా గా సుగంధాన్ని వేద జల్లుతోంది అన్న కొత్త విషయం తెలిపారు. అంటే వరాహ రక్తం అంత పరిమళ భరితం గా ఉంటుందని మనకు తెలియని విషయాన్ని రచయిత తెలియ జేశారు.

వన వాసానికి వెళ్ళే ముందు రాముడు దాన ధర్మాలను విపరీతం గా చేశాడు. "క ఠ.కలాప శాఖ "కు చెందినబ్రాహ్మణులు 'తీపి పదార్ధాలు బాగా తింటారని, వారికి వేదాధ్యయనం తప్ప వేరొక పని చేత కాదని కనుక వారికి కావలసిన సమస్తము సమ కూర్చమని తమ్ముడు లక్ష్మణుడిని రాముడు ఆదేశిస్తాడు. నిరంతర వేదాధ్యయ నం జరగాలి అని శ్రీ రామ చంద్రుని కోరిక అని, వైదిక ధర్మ రక్షణ అందరి కర్తవ్యమని ఇందులోని సారాంశం. అసమన్జసుడి దురాగతాన్ని ప్రజలు రాజైన సగరునికివిన్న వీస్తే, ప్రజా క్షేమం కోసం తన కుమారుడిని, వాడి భార్యా పిల్లల్ని దేశం నుంచి కట్టు బట్టలతో బహిష్క రించి ప్రజా క్షేమం రాజు తక్షణ కర్తవ్యమ్ గా చేశాడు. ఆదర్శ ప్రాయు డైనాడు. ఇదీ ప్రజా భీష్టాన్ని నేర వేర్చటం అంటే. ఇవాళ మన నాయకులు వాళ్ళ కొడుకులు, అల్లుళ్ళు, బామ్మర్దులు, వందిమాగధులు బంధు గణం అధికారాన్ని అడ్డం పెట్టుకొని చేయని దుష్కృత్యం లేదు., ప్రజా పీడనా లేదు. ప్రజలు ఎంత మొత్తుకొన్నా వారికి చీమ కుట్టి నట్లుకూడా ఉండదు. ఇదీ మన ప్రజాస్వామ్యం. వారిని వెనకేసుకొచ్చి ఇంకా నెత్తికి ఎత్తు కొంటూ "బె బె "అని మనల్నే ఎక్కి రిస్తున్నారు. వీటికి కోర్టులే శరణ్యం అయ్యాయి అందులోంచి ఫలితం తేలటా నికి ఏళ్ళూ, పూళ్ళూ పడుతుంది. రాజ రిక వ్యవస్థ లో తక్షణ న్యాయం జరిగేది అని అని పిస్తుంది మనకు. వ్యవస్థ ఎంత పతనమైనదోఅర్ధమవుతుంది. ఆదర్శం అటకెక్కింది. అన్యాయం చంక నేక్కింది. ఇలాంటి ఎన్నో విషయాలు శ్రీ చిలుకూరు వెంకటేశ్వర్లు గారు మనకు తెలియ జేసి మార్గ దర్శనం చేశారు.

అయోధ్యా కాండ




అయోధ్యా కాండ విశేషాలను తెలుసుకొంటు న్నాం.వెదురు పోద కుప సిన పుష్పం ఆ వెదురు పొదలను కాల్చి వేస్తుందిట. అన్న విషయం మనకు తెలియ జేశారు. గోమతీ తీరాన మను చక్ర వర్తి ఇక్ష్వాకునికి ఇచ్చిన భూ మండలం ను రాముడు సీతకు చూపించటం, తన వంశ పరంపరను తెలియ జేయటం లా అని పిస్తుంది. "గంగా నది లోని నల్ల కలువలు గంగమ్మ తల్లి కల్లులాగా ఉన్నాయి. కమలాలు చేతుల్లా ఉన్నాయి తీరం లోని వృక్షాలు హారాల్లా, ఇసుక తిన్నెలు జఘనాల్లా ఉన్నాయి "అని మహర్షి వర్ణించిన తీరు మహా సొరు గా ఉంది. కాళి దాస మహా కవికి మార్గ దర్శనం చేసి నట్లున్నది. గుహుడు తన బోయ జాతిని కన్నా బిడ్డల్లా పాలించటం వాళ్ళ అతన్ని "స్తపతి "అని గౌరవం గా పిలుస్తారని కొత్త గా తెలిసిన విషయం.నిషాద జాతి రత్నం గుహుడు. సంస్కారం జన్మను బట్టి కాదు, సాధనను బట్టి లభిస్తుందని వాల్మీకి గొప్ప సందేశాన్నే ఇచ్చాడు. రాముడికి వాన ప్రస్తా మార్గాన్ని ఉపదేశించిన మహర్షి "విఖనస్సు "అని కొత్తగా తెలిసిన విషయం. సర్వజనుల శ్రేయస్సు కోసం శ్రీ రాముడు 'దైవీ నావం 'అనే మంత్రాన్ని జపించటం 'బహుజన హితాయ బహుజన సుఖాయ"అన్న భారతీయ ధర్మా నికి ప్రతీకయే. ఆచరించి చూపి, ప్రతి సందర్భం లో ను శ్రీ రామ చంద్రుడు మార్గ దర్శి అని పించుకొన్నాడు. వనవాసం లో తమ్ముడు లక్ష్మణుడి తో కైక దౌష్ట్యాన్ని చెబుతూ, తన తల్లి కౌసల్య వద్ద ఉన్న చిలుక, గోరువంకలు రామ వన వాసం విషయం విన్నాయని, అందులోని గోరు వంక చిలుకను వెళ్లి కైకేయి కాలు కొరికి పగతీర్చు కొని రమ్మని చెప్పిందని, కౌసల్య మీద పక్షికి ఉన్న ఆదరణ తనకు లేక పోయిందని,కైకమాటను గుడ్డిగా అనుసరించి తన తల్లికి అపకారం చేశానని బాధ పడతాడు. ఇంత సూక్ష్మ విషయాన్ని నాకు తెలిసి నంత వరకు ఎవరు వ్యాప్తి లోకి ఇంతవరకు తీసుకు రాక పోవటం ఆశ్చర్యమే. వెంకటేశ్వర్లు గారు దీన్ని చక్కగా అందించి రామునికి తల్లి పట్ల ఉన్న ఆరాధనా భావాన్ని తెలియ జేసి అభి నందన లందు కొన్నారు. నాకు మాత్రం ఈ చిలుక గోరు వంక వృత్తాంతం పరమాద్భుతం గా ఉంది. సహవేదన అనేది జాతికి అతీతం గా ప్రతి బిమ్బించింది అని పించింది.

చిత్ర కూట పర్వతం పై ఉండే వారంతా ధర్మ కార్యాలు చేసి ధన్యులవుతారట. యమునా నదిని దాటేటప్పుడు సీత 'మద్యపు కుం.డ"లను సమర్పిస్తానని మొక్కు కోవటం, ఆ నాటి వారి ఆన వాయితీ. నదిని తల్లిగా పూజించే సంస్కారం. రాముడు వాస్తు పూజ చేసి పర్ణ శాలలో ప్రవేశించటం, మంత్రాలను తానే పఠిం చటంవల్ల రాజు అన్నిటా సమర్ధుడై ఉండాలి అన్న బోధ ఉంది. అంతః పురమైన, అడవి అయినా ఆచారాన్ని పాటించాలనే ధర్మ సూక్ష్మం కనీ పిస్తుంది. రాముడికి వచ్చిన కలలో తండ్రి దశరధుడు నల్లని వస్త్రాలు ధరించి, ఇనుపీట లపై కూర్చున్నట్లు, ఒళ్లంతా నల్ల రంగు పూసుకోన్నట్లు కని పించాడు.. ఒక రాక్షస స్త్రీ వికృతం గా నవ్వుతోంది. గాడిద రథం మీద నుంచి దశరధుడిని కిందికి నెట్టేసింది. ఈ కల రాముడికి ఏదో మరణ సూచికం గా అని పించి, తమ్ముడికి చెప్పాడు. తండ్రి మరణం తధ్యం అని అని పించింది. స్వప్న వృత్తాంతాలు రామాయణం లో చాలా ఉన్నాయి. అన్ని దేశాల ఇతిహాసాలలోను ఇలానే ఉన్నాయి. వాటి ఫలితాలు వారు అనుభ

వించారు. స్వప్నాలు దేశ కాలాతీతం అని పిస్తుంది. రాముడి ఈ కళను ఎవరు ఇంతగా ప్రచారం లోకి తేలేదు. ఒక్క వెంకటేశ్వర్లు గారే దీన్ని వెలుగు లోకి తెచ్చారని పించింది

భరతునికి అతని సైన్యానికి భరద్వాజ మహర్షి ఇచ్చిన "విందు "న భూతో న భవిష్యతి గా ఉంటుంది. ఈ నాటి ఫైవ్ స్టార్ హోటళ్ళుదీనిముందు బలాదూర్.ఎన్ని వసతులు ఎన్నెన్ని పిండి వంటలు, ఎంత ఆనందం, ఎంత ఆహ్లాదం ?మై మరపించి, అక్కడే ఉండి పోవాలని పించే వ్యామోహం. దీని మాయలో భరతుడు పడతాడా ?లేదా ?అని మహర్షి పెట్టిన పరీక్ష అని పిస్తుంది. జితేంద్రియుడు వీటిని తరుణ ప్రాయం గా భావించి రామ దర్శనానికి బయల్దేరి వెళ్ళటం ఆహా అని పిస్తుంది భరతుని కర్తవ్య దీక్షకు జేజేలు చెప్పాలని పిస్తుంది. సన్నివేశ కల్పనా, నిర్వహణ పరమాద్భుతం గా చేశాడు మహర్షి వాల్మీకి. అంత గొప్ప గాను ఆతిధ్యమిచ్చాడు భరద్వాజ మహర్షి అందుకే అ నాటి నుండి ఎక్కడ మహా గొప్ప విందు జరిగినా "భరద్వాజ విందు "అనటం లోక సహజం అయింది. అదొక "coinage word'అయి పోయింది. ఇంత గొప్ప విందును రాముడికి ఇచ్చే సాహసం చెయ్య లేదు భరద్వాజుడు. ఇదే డ్రమాటిక్ ఎలిమెంట్. భరతుడు ఆశ్రమ జీవితం దెబ్బ తిన కుండా తన సైన్యాన్ని దూరం గానే ఉంచి, తన లోని సంస్కారాన్ని తెలియ జేశాడు. అందుకే రామాయణం ఉత్తమ సంస్కారాన్ని అందించే మహా గ్రంధం గా పేర్కొనటం. కైక ను దూషించే భరతుడితో రామ వన వాసం దైవ ప్రేరితమని, అతని తల్లి కైక నిమిత్త మాత్రురాలే నని, రామ వన వాసం లోక కల్యాణా నికే నని బోధించటం, మనసు కుదు ట పడె ట్లు చేయటం భరద్వాజ మహర్షి చేసిన మహా గొప్ప కార్యం.

భరతునికి అన్న శ్రీ రాముడు చేసిన నీతి బోధ అన్ని కాలాల్లోనూ ఆచరణీయాలే –ఆ విషయాల్లోకి వెళ్తాం "తెల్ల వారు ఝామున నిర్ణయాలు చేయాలి. రాజు ఆలోచనలు ముందుగా బయటి వారికి తెలియ రాదు. రాజనీతి విశారదుల్ని మాత్రమె మంత్రులు గా నియమించాలి. మంత్రి సమర్ధత పై రాజ్యాభి వృద్ధి ఆధార పడి ఉంటుంది. తగి నంత జీతాలు చెల్లించాలి. సమయానికి ఖచ్చితం గా జీతాలు బట్వాడా చేయాలి. ఇహాన్ని గురించి ఆలోచించే బ్రాహ్మణుల్ని దూరం గా ఉంచాలి. దేశ సరిహద్దుల విషయం లో అనుక్షణ జాగరూకత ఉండాలి. ఆదాయం ఎక్కువా, ఖర్చు తక్కువ గా ఉండాలి. సైన్యానికి సకల ఆయుధాలు, సంబారాలు సకాలం లో అందించాలి. దొంగను, లంచ గొండిని వదిలి పెట్ట రాదు. మనస్సు, దానం, వాక్కులతతో ప్రజల్ని ఆ కట్టుకోవాలి. ఆలోచించి నిర్ణయాలు చేయాలి. ఏక పక్ష నిర్ణయాలు అనర్ధ హేతువులు. పండితులను నిర్లక్షం చేయరాదు. కిన్దివారిని ప్రేమతో, చనువుతో చూడాలి "నిజం గా ఇవన్నీ మన ప్రమ్ముత్వాలు మంత్రులు అమలు చేస్తే భూలోకం స్వర్గమే అవుతుంది. మన ఏలికలు వీటికి పూర్తిగా విశుద్ధం గా ప్రవర్తిస్తూ, ప్రజా జీవితం తో ఆడుకొంటున్నారు. ప్రగతిని భ్రష్టు పట్టిస్తున్నారు. జాబాలి అనే ఆయన చెప్పిన నాస్తిక వాదాన్ని ఖండిస్తూ శ్రీ రాముడు "లోకం లో సత్యమే ఈశ్వరుడు. లక్ష్మీ దేవి సత్యాన్ని ఆశ్రయించి ఉంటుంది. సత్యమే అన్నింటికి మూలం "అని చెప్పినవి అక్షర సత్యాలే. దీన్ని వదిలి "ధనమేరా అన్నిటికి మూలం "గా మనం వ్యవహరిస్తూ చిక్కులు కొని తెచ్చుకుంటున్నాం. రాముడు బోధించిన నీతులతో ఉన్న దశ వర్గ, పంచ వర్గ, చతుర్వర్గ, సప్త వర్గ, అష్ట వర్గ, త్రి వర్గాలను, త్రయీ, షాడ్గున్య,దైవ మానుష, కృత్య, వింశతి వర్గ, ప్రకృతి, మండల, ద్వియోనీ, సంధి, విగ్రహాలాను చాలా తేలిక మాటలతో సూటిగా అర్ధమయేట్లు చిలుకూరు వారు వివరించిన తీరు గొప్పగా ఉంది.

### అరణ్య కాండ

అరణ్య కాండ –విరాధుని ప్రవేశమే మహా భయానకం గా ఉంది, రెండు తోడేళ్లను, పది జిన్కల్ని, మూడు సింహాలను, నాల్గు పెద్ద పులులను ఒక ఏనుగు తలను ఇనుప శూలానికి గుచ్చి భుజాన మోసుకు వస్తున్నాడట. వాడి అరుపులో బి.బి.శబ్దం ధ్వనించటం వింత గొలిపే విషయం. దీన్ని పసి గట్టారు వెంకటేశ్వర్లు గారు. మునులు చేసే తపో ఫలం లో నాల్గవ వంతు రాజుకు చెందటం వల్ల రాజు తన రాజ్యం లో ఎంత ప్రశాంత వాతా వరణాన్నిన్ని నెలకొల్పుతాడో తెలుస్తుంది. దాని వల్ల ఉభయులకు క్షేమం, భద్రతా కూడా. మునీశ్వరులతో రాముడు వారు తనను ఆజ్ఞా పించాలి కాని అర్ధించటం తగదు అని, తన తండ్రి తనను మునుల సంరక్షణ కోసమే అరణ్యానికి పంపాడని అంతం లో రాముని లో విధ్యుక్త ధర్మాన్ని, ప్రజలకు రాజు పై ఉన్న అధికారాన్ని తెలియ జేస్తాయి. "యదా ప్రజా –తదా రాజా "అన్నదానికి ఆ నాడే పునాది వేశాడు రాముడు అని పిస్తుంది. మనపాలకులు దీని సారం గ్రహిస్తే, ఆందోళనలు హర్తాల్లు ఉండవు. ప్రజా జీవితం కుంటూ పడదు.

సీతా దేవి రామునితో అతడు ధర్మ వేత్త అయినా సూక్ష్మం గా ఆలోచిస్తే కొద్దిగా అధర్మం తనకు గోచరిస్తోందని, సత్య ధర్మ నిష్ఠ బాగానే ఉన్నా, ఇతరుల ప్రాణాలు తీయటం అనే వ్యసనం తనకు భయంకరం అని పిస్తోందని తన సందేహాన్ని నిర్భయం గా రాముడికి తెలియ జేసింది. సాధారణం గా ఏ భర్త అయినా, తీవ్రం గా గర్జిస్తాడు. కోపం ప్రకటించి ధూమ్ ధాంచేస్తాడు. చెంప చెళ్ళు మని పిస్తాడు. మర్యాదా రాముడు కనుక సీత జనక సుత కనుక, ధర్మా ధర్మ విచాక్షణం కలదని, తనపై ప్రేమతోనే అలా చెప్పిందని మెచ్చుకొన్నాడు రాముడు. భార్య అవసర సమయాల్లో చక్కగా కర్తవ్య బోధ చేయాల్సిందే నన్నాడు. ఆమె ప్రశ్న కు దీటైన సంతృప్తి కరమైన సమాధానం చెప్పాడు. తాపసులు తపో భంగం చేసే రాక్షసుల్ని తమ తపో బలం చేత సంహరించ గల సమర్ధులే నని, దాని వల్ల చిరకాలం గా తాము తపస్సు చేసిపొందిన ఫలం ఖర్చు అయి పోతుందని,, లోక కల్యాణానికి ఖర్చు అయితే తమకంటే సంతోషించే వారు ఉండదని కాని తమ ప్రాణాలను కాపాడు కోవటానికి దాన్ని ఉప యోగించి వ్యర్ధం చేయటం తమకు ఇష్టం లేదని వారు తనతో చెప్పారని, తానే వారందరికి దిక్కు అని మొర పెట్టు కొన్నారని, తాను

దండకారణ్య మునులకు, కండ కావరం తో హాని చేసే దనుజులను మర్దన చేస్తానని ప్రతిజ్ఞ చేశానని, దాన్ని నిల బెట్టుకోవటం తన తన సత్య ధర్మమని చెప్పటం, ఆమెకే కాదు మనందరికి సందేహ నివృత్తి అవుతుంది. అలాంటిటి మనసెరిగిన దంపతులు సీతా రాములు. అందుకే నేటికీ వారు ఆదర్శ దంపతులని పించు కొంటున్నారు.

"మాండమహర్షి "తపో బలం చేత నిర్మించ బడిన "పంచాప్సరస సరస్సు "నుండి సంగీతం అన్నికాలాల్లోను ఒకే రకం గా విని పించటం చాలా వింతగా ఉంది. చిలుకూరు వారికి ఆ సంగీతం ఎలా విన్పించిందో, ఎవ్వరూ చెప్పని విషయమే నని నాకు అని పించింది. మూజికల్ ఫౌంటేన్స్ ఇప్పుడున్నాయి. అప్పుడు వీటిలో మహర్షి పేరు మీదుగా "మాండ లీన్ వాయిద్యం విని పించేదేమో ?14వేల మంది రాక్షసుల్ని ముహూర్త కాలం లో చంపేసిన శ్రీ రాముని కోదండ పాండిత్యానికి, ఆనందం, ఆశ్చర్యం,సంభ్రమం ముప్పిరి గోనగా రాముడిని ఆప్యాయం గా సీతా సాధ్వి కౌగిలించుకోవటం, ఆమెకు రామ చంద్రుని పై ఉన్న ఆరాధనా భావానికి పరాకాష్ట..ఆ సుఖం భర్తకు దేని వల్లా లభించదు., తృప్తి నివ్వదు. ఔచిత్యపు హద్దులో జరిగిన మాధుర్య సంఘటనం ఇది.

సీతా పహరణం తర్వాత విరహం తో వేదన చెందే రాముడు సకల జీవ రాశిని భస్మం చేస్తానని అనటం శోకానికి పరాకాష్ట, ఉన్మత్త ప్రేలాపనే. ఇక్కడ ఉచితానుచితాలు కన్పించవు. "నారాచం "అంటేనే బాణం. ఇక్కడ చిలుకూరు వారు "నారాచ బాణాలు "అనే మాట ను ప్రయోగించారు. అవి ఇంకో రకమైన బాణాలా ?పొరాబడ్డారని పించింది.. లక్ష్మణుడు అన్నను అనునయిస్తూ, హితం చెబుతూ ఆయనలో దుఖం చేత అణగి ఉన్నజ్ఞానాన్ని మాత్రమె మేల్కొల్పుతున్నానని, తాను చెప్పేవన్నీ పూర్వం అన్నగారు తనకు చెప్పినవే నని, అవి హిత వచనాలే అని అనటం లో సుమిత్రా నందనుడిలో హుందా తనం, ఆరిందా తనం, కర్తవ్య బోధ ప్రస్ఫుటం గా కన్పిస్తాయి. సీతాదేవిని రావణుడు ఆహరించిన ముహూర్తం "విందఁఅనే పేరు కలిగిందని, ఆ సమయం లో పోగొట్టుకొన్నది, తిరిగి యజమానికి తప్పక లభిస్తుందని జ్యోతిశ్శాస్త్ర రహస్యాన్ని తెలియ జేశాడు మహర్షి వాల్మీకి. "వంచులక పక్షి "ఆపు లేకుండా కూయటం శుభ సూచకమే నని, "జయమ్ము నిశ్చయమ్మురా "అని పించటం పక్షుల కూతల్లో శుభాశుభాలు తెలియ జెప్పే పరి భాష ఆనాడు వాడుక లో ఉన్నట్లు తెలుస్తోంది. కదల లేని వారిని చంపటం, యజ్న పశువును చంపటంఅంత నింద్యం అని కబంధుని విషయం లో రాముడు అనటం యజ్ఞాలలో అప్పుడు పశు హింస లేదనే అని పిస్తుంది.,

కిష్కింధ కాండ –రుష్య మూక పర్వతం పై నిద్రిస్తూ కల గన్న వాడికి ఆ కల యదార్ధం అవుతుందని, పాపాత్ముడు, దురాచారుడు దాన్ని ఎక్క లేరు అనటం స్థల మహాత్మ్యమే. వాలి నాలుగు సముద్రాల్లలో వాలి, సంధ్యోపాసన చేసే వాడు అన్న దానికి వివరణ గా సూర్యోదయానికి పూర్వమే పశ్చిమ సముద్రం నుండి తూర్పు సముద్రానికి, దక్షిణ సముద్రం నుండి ఉత్తర సముద్రానికి వెళ్ళి సంధ్యా వందనం చేస్తాడని వెంకటేశ్వర్లు గారు చెప్పిన వివరణ చక్క గా సమన్వయము తో కుదిరింది. వాలి అడిగిన ధర్మ సందేహాలకు రాముడు దొంగను శిక్షించిన వెంటనే వాడి దోషాలన్నీ నశిస్తాయని, శిక్షించక పోతే ఆ పాపం దొంగల కంటే రాజునే ఎక్కువ గా బాదిస్తుందని, అందుకే పూర్వం మాంధాత చక్ర వర్తి "శ్రమణకుడు "అనే వాడు చేసిన మహా పాపానికి ఘోరమైన శిక్ష అనుభ విన్చాల్సి వచ్చిందని యుక్తి యుక్తం గా ధర్మ బోధ చేశాడు. "దేవ సఖ పర్వతం "దాటితే వచ్చే 100యోజనాల ఎడారి రాజస్థాన్ ఎడారా ?అని సందేహం వస్తుంది. "వైఖానస సరస్సు "అవతల ఉన్న చీకటి ప్రదేశం లో స్వయం ప్రకాశులైన దేవతలు, సిద్ధులు, తమ దేహం నుండి ప్రసరించే కాంతి తో తపస్సమాది లో ఉండటం ఆశ్చర్యకరం గా ఉన్నా, అసాధ్యం కాదు, సంభవనీయమే నని పిస్తుంది. ఎనిమిది బుద్ధి గుణాలు, నాలుగు బలాలు, పద్నాలుగు సద్గుణాలను సూక్ష్మం గా వివరించిన తీరు ముచ్చటగా ఉండి. అందరు చదివి తెలుసుకో తగ్గవి

## సుందర కాండ

శ్రీ హనుమ సముద్ర లంఘనం లో సురస ను ఎదుర్కొనే టప్పుడు శరీరాన్ని తొంబై యోజనాలకు పెంచాడు అనటం అసంబద్ధం గా, పిల్లల సంతోషం కోసం చెప్పి నట్లుగా ఉందనటం నాకు నచ్చిన విషయం. కొన్ని చోట్ల ఇలాంటి ఔచిత్య భంగాలు బాధిస్తాయి. లంకలోని భావన సముదాయాలన్నిటి గురించి చెప్పిన విధానం తెలుసుకో తగినది. నాలుగు ద్వారాలుండేది "పద్మం "అని, ఇవి సర్వతో భద్రమని, పశ్చిమ ద్వారం లేక మధ్య వంపు తిరిగిన చతుస్సాల గృహాన్ని "హయాననం "అంటే, గుర్రపు ముఖం అని, దక్షిణ ద్వారం లేని దాన్ని "వర్ధమానం "అంటారని ఇది ధన ప్రదమని, తూర్పు ద్వారం లేని ది"స్వస్తిక గృహం "అని ఇది పుత్ర, ధన, సంపదల నిస్తుందని కేటగరైజ్ చేయటం కొత్త విషయాలను తెలియ జేసింది. వీటి వివరణ ఇవ్వటానికి చిలుకూరు వారు ఎంతో శ్రమించి ఉంటారని పిస్తుంది.

పుష్పక విమానం యజమాని మనస్సును బట్టి నడుస్తుందని, యజమాని నియంత్రణ లోనే పని చేస్తుందని, ఏ వేగం కావాలంటే ఆ వేగం లో వెళ్తుందని వాల్మీకి చక్కగా వర్ణించిన విషయాన్ని తేట తెలుగు మాటల్లో వర్ణించటం బాగుంది. మన విమానాల్లో ఇంకా రావాల్సిన మార్పులను ఈ పుష్పకం సూచిస్తోందని పిస్తుంది. రామ రాజ భూషణుడు రాసిన "వసు చరిత్ర "ప్రబంధం లో ఇంద్రుడు వసు రాజుకు మహా

మహిమాన్విత మైన విమానాన్ని బహూక రిస్తాడు. అందులో ఎయిర్ కూల్, ఎయిర్ కండిషనింగ్ కూడా ఉంటాయి. పుష్పకం కంటే మెరుగైందన్న మాట. "వసు రాజు విమానం "పేరుతో చాలా ఏళ్ళ క్రితం నేనొక వ్యాసం రాశాను "మూసీ మాస పత్రిక "లో ప్రచురితమైంది. ఊరికే కంపారిజన్ కోసం చెప్పాను. రావణాసురుడు కుబేరుని దగ్గర నుంచి పుష్పకాన్ని లాక్కొంటే, వసురాజు దివ్యత్వాన్ని మెచ్చి దేవేంద్రుడు ఈ విమానాన్ని కానుక గా ఇచ్చాడు అదీ కధ.

సీతా దేవి ని తప్ప స్త్రీల నెవ్వరిని రావణుడు బలాత్కారం గా లంకకు తీసుకొని రాలేదని, అతని గుణాలకు ఆకర్షితులై వారే వచ్చారని, మరో పర పురుషుని పై వారికి ప్రేమ లేదని అందరు సత్కుల సంజాతలే నని ఈ కాండలో ఉన్నది. కాని ఉత్తర కాండ లో దీనికి విరుద్ధం గా విషయాలున్నాయి. రావణ గాంభీర్యానికి ప్రతిభకు, హనుమ అప్రతి భుడయ్యాడని కాని భయ పడ లేదని మంచి వివరణ నిచ్చారు వెంకటేశ్వర్లు గారు.

## యుద్ధ కాండం

యుద్ధానికి బయల్దేరిన వానర సైన్యానికి సూచన లిస్టు, సుగ్రీవునికి శ్రీ రాముడు చాలా హెచ్చరికలు చేశాడు. శత్రువులు కంద మూలాల్లో, ఫలాల లో విషం కలిపే ప్రమాదం ఉందని, ఏమరు పాటు ఏ మాత్రం తగదని, భూ సైన్యానికి "air protection "ఉండేట్లు చూడమని చెప్పటం యుద్ధ సమయం లో రాజు ఎన్ని జాగ్రత్తలు తీసుకో వాలో తెలియ జేసే యుద్ధ విధానమే కాక, యుద్ధ నీతి కూడా ఉంది.సూర్య మండలం చుట్టూ చిన్న యెర్రని గూడు కడితే అందులో నల్ల మచ్చ ఉంటె రాబోయే ప్రళయానికి సూచన అని మహర్షి వాల్మీకి తెలియ జేశాడు. ఇది లంకకు చేటు కనుక, ఆ సమయం లోనే యుద్ధం ప్రకటించాలని రాముడు లక్ష్మణుడి తో అనటం రాజనీతికి గొప్ప ఉదాహరణ. యుద్ధ తన్త్రానికి మకుటం. జాంబ వంతుడు "గద్గదుని "కుమారుడని, అతని తమ్ముడి పేరు "ధూమ్రుడు "అని మనం తెలుసు కొంటాం.

మాల్య వంతుడు రావణుడి పిన తాత. రావణుడికి నీతి బోధిస్తూ మహర్షులు అగ్ని వలె ప్రకాశిస్తారని, ధర్మ సంరక్షకులని, వారి యాగ ధూమానికి రాక్షసులు చెల్లా చెదరౌతారని, రాక్షస తేజాన్ని అణచే సర్వ సమర్ధులు మునులని, వారి తపోగ్ని రాక్షసులకు తాపం కలిగిస్తుందని వారిని బాధించటం వల్ల రావణుడు పతనం కొని తెచ్చుకోన్నాడని బోధించాడు మాల్య వంతుడు. రామునితో సంధి చేసుకొమ్మని రావణుని తల్లి కైకసి, "అవిద్ధుడు "అనే ముసలి మంత్రీ హితవు చెప్పారు. వినలేదు. వినాశ కాలే విప రీత బుద్ధి అంటే ఇదే.

పాదాల్లో పద్మ రేఖలున్న స్త్రీలు సామ్రాజ్యాధి పతుల భార్య లవుతారని హస్త సాముద్రికం చెప్పాడు వాల్మీకి. పుష్పక విమానం విధవలను తీసుకొని పోదు అనే విషయం విమాన రహస్యం. భరద్వాజుడు విమాన శాస్త్రాన్ని రచించాడని మనకు తెలుసు. దీన్ని జర్మన్, జపాన్ దేశాల వారు తీసుకొని వెళ్ళి, విమానాలు తాయారు చేశారని మన వాళ్ళ నమ్మకం. కుంభ కర్ణుడు నీతులు బోధిస్తుంటే నిండా మునిగిన రావణుడు నీతులతో చర్చించే సమయం కాదని తన తెలివి తక్కువ, భ్రాంతి వల్ల లోపాలు చేశానని ఇప్పుడు కర్తవ్యమేమిటో ఆలోచించమని దశగ్రీవుడు అనటం తక్షణ కర్త్వవ్య బోధ యే.జరిగి పోయిన్దాన్ని గురించి నిర్ణయం తీసుకొనే సమయం లో ఆలోచిస్తూ కాలం వృధా చెయ్య రాదనీ అందరు గుర్తిన్చుకోవాల్సిన విషయం. అతని తప్పుల్లో అందరికి బాధ్యత ఉంది..ఎలా అతడిని బైట పడేయ్యాలో ఇప్పుడు సూచించాలి. లక్ష్మణ మూర్చ సందర్భం గా రామ విలాపం లోనీ ఉచితానుచితాలను చిలుకూరు వారు చక్కగా చిలికి విశ్లేషించారు. ఆదిత్య హృదయాన్ని అతి తక్కువలో అందులోని ఆంతర్యాన్ని సూక్ష్మం గా చెప్పటం విశేషం. బాగుంది.

ప్రేమించే గుణం లేని రాజుతో యుద్ధానికి పోవటం సైనికులు ఇష్టపడరని కనుక యుద్ధ ము లో పాల్గొనే వానర వీరులను ముందే సత్కరించమని రాముడు విభీషణుడికి చెప్పి చేయించాడు. ఇది త్యాగానికి తగిన గుర్తింపు నివ్వటమే. అందుకే మన ప్రభుత్వం వీర, శౌర్య చక్ర,పరమ వీర చక్ర పురస్కారాలిచ్చి సత్కరిస్తోంది. సైనికులను సంతోష పరుస్తున్నారు. అయోధ్యకు వెళ్తూ శ్రీ రాముడు భరద్వాజ మహర్షి ని సందర్శించి తాను వెళ్ళే దారిలో వృక్షాలు అన్నీ అకాలం లో కూడా సమృద్ధిగా ఫలాల నివ్వాలని, పుష్ప ఫల భరితం గా ఉండాలని కోరాడు. ప్రజా క్షేమం అడుగుడుగునా రాజు కర్తవ్యం అని తెలియ జేసే సంఘటన. రాముని తరఫున రాజ్యం చేస్తున్న భరతుని కాలం లో అన్నీ పది రెట్లు అభి వృద్ధి చెందాయట. అది విని అందరు ఆనంద బాష్పాలు రాల్చారట. తన పై ఉంచిన బాధ్యతలను భరతుడు ఎంత సక్రమం గ నిర్వర్తిన్చాడో, ఎంత నియమ బద్ధం గా పరి పాలన నిర్వ హించాడో మనకు తెలుస్తుంది. ఇదంతా తన గొప్ప కాదని రామ భద్రుని ప్రభావమే నని అతి వినమ్రం గా భరతుడు చెప్పటం అతని సుగుణ సంపత్తిని రెట్టింపు చేస్తుంది.

## ఉత్తర కాండం

అయోధ్య రాజుల పురోహితుడు వసిష్ఠ మహర్షి సప్తర్షి మండలం లోనీ వశిష్టుని రూపాంతరమే. బ్రహ్మ దేవుడు మొదట గా జలాన్ని సృష్టించాడు. జల రక్షణ కోసం ప్రాణ సృష్టి చేశాడని అవి ఆహారం లేక నీర సించి బ్రహ్మ ను ప్రార్దిస్తే, వాటికి జావసత్వాలు ప్రసాదించి, జల రాసిని కాపాడమని ఆదేశించాడు. అందులో "అలాగే రక్షిస్తాం "అన్న వారే రాక్షసులు గా పుడతారని "అట్లాగే పూజిస్తాం "అన్న వారు యక్షులు గా పుడతారని బ్రహ్మ అనటం తో ఈ జాతుల ఆవిర్భావం జరిగిందట. మన నోరే మన కర్మలను నిర్దేశిస్తుందని తెలియ జేసే యదార్ధ సన్నివేశం ఇది.

రావణాసురుడికి ఆహుతి చేసుకొన్నా తొమ్మిది తలలను బ్రహ్మ మళ్ళీ ప్రసాదించటం, కోరిన వరాలివ్వటం, అతని చావుకు అతడే కారకుడవటం --అంటే -మానవులను తేలిగ్గా తీసి పారేయటం, వారి వల్ల తనకే ప్రమాదం రాదన్న వాడి ధీమా వమ్ము అయి పోయింది. అదే విభీషణుడు అన్ని వేళలా తన బుద్ధి ధర్మ ము మీదే స్థిరం గా ఉండాలని కోరు కొంటాడు. అన్నదమ్ము లైనా ఆలోచనల్లో, నడవడి లో, ప్రవర్తనవర్తనలో ఎంతో భేదం కని పిస్తుంది. బుద్ధి కర్మను అను సరించే ఉంటుందికదా. కాలకేయాది రాక్షస సంహారం లో తన సోదరి శూర్పణఖ భర్తను కూడా చంపేశాడు రావణుడు. ఇదేమి ఘోరం అని ప్రశ్నించిన సోదరితో యుద్ధం లో బంధుత్వాలు గుర్తుకు రావు అన్నాడు. జరిగిన దానికి పరిహారం గా సోదర తుల్యు డైన ఖరున్ని దండకారణ్యానికి అనది కార రాజు గా, సోదరుడు దూషణుడిని 14 వేల రాక్షస గణానికి సేనాధి పతి గా చేసి, శూర్పణఖ కు తోడిచ్చి జనస్థానానికి పంపాడు. అంతే కాదు ఆమె ఆడింది ఆటగా, పాడింది పాటగా హాయిగా ఉండే స్వేచ్చనూ ఇచ్చేశాడు. వారంతా చేయని అకృత్యమే లేదు. బరి తెగించి ప్రవర్తించారు. ఇష్టా రాజ్యం గా ప్రవర్తించారు. దానికి ప్రతి ఫలం గా జన స్థానం లో శ్రీ రాముడు వారందర్నీ వీర విక్రమంతో సంహరించి లోకోప కారం చేశాడు. ఇప్పుడు మనం ఉంటున్న "జన దండకారణ్యానికి "ఈ ఏడు ( april2011 ) "ఖరుడే అది పతి. అంటే ఖరనామ సంవత్సరం లో ఉన్నాం కదా. ఇప్పటికే ఎన్నో నేరాలు, ఘోరాలు చూస్తున్నాం ఇంకా యే విపరీతాలు చూడాలో ?

ఇంద్రజిత్ పరాక్రమం అవక్ర మైంది. అందరు తపస్సు చేసి అమరత్వం కోరుకొంటే, తన పరాక్రమాన్ని చూపి అమరత్వాన్ని సంపాదిన్చుకొంటానని బ్రహ్మ దేవునితో చెప్పి, తథాస్తు అని పించుకొన్న రావణ కుమారుడతడు. ఇంద్రుడు అహల్యా జారత్వం చేసి నపుడు గౌతమ మహర్షి ఇంద్రుడు చేసిన ప్రతి చెడ్డ పని మనుష్యుల్లో కూడా వ్యాపిస్తుందని, మానవులు చేసిన పాపం లో చేసిన వారికి సగం పాపం ఇంద్రుడికి మిగిలిన సగం పాపం సంక్రమిస్తుందని శపించటం పాప కార్య తీవ్ర పరిణామాలను తెలియ జేస్తుంది. ఇంద్రపదవికే అస్తిరత్వం తెచ్చిన పాపి అయాడు దేవేంద్రుడు. మహా అంద గత్తె అయిన అహల్య రూప గర్వం ఆమె నూ పతితు రాలిని చేసింది. గౌతముని శాపంతో ఆమె ఏకైక అంద గత్తె అన్నది పోయి, అందర్నీ అంద గత్తెలను చేయటం జరిగింది. ఆమెకు ఖేదం, సామాన్యులకు మోదం. రూప గర్వం పతనానికి పరా కాష్ట.అయింది అహల్య విషయం లో.

1000 వ పేజి లో జనకుడిని విదేహుడు అనటం దేహం నుండి పుట్టుకోచ్చాడని చిలుకూరు వారు రాశారు. కాని "దేహ భ్రాంతి లేని వాడు కనుక విదేహుడు అయాడు "అని పెద్దలు చెప్పగా, చదవగా నేను తెలుసుకొన్న విషయం.

భూమి పై రెండవ అధర్మ పాదం మోప బడటం తో ద్వాపర యుగం పేరు వచ్చింది అన్న మాట సరైనదే నని పిస్తుంది. ఎంత తపస్సు చేసినా, శరీరం పై భ్రాంతిని పోగొట్టుకో లేక పోతే "శ్వేతునికి "పట్టిన గతే అందరికి పడుతుంది.

తెలియని విషయాలను తెలుసుకొనే విద్యకు "ఆవర్తని "అని పేరుందని నాకు ఇది చదివిన తర్వాతే తెలిసింది. ఇంకా ఎన్నో విషయాలను వెంకటేశ్వర్లు గారు స్పృశించి వివరించి అంద జేశారు. ఉత్తర రామాయణం లో "భిక్షు తాడిత "కుక్క కథ లో దైవ ద్రవ్యాపహరణం ఎంతటి నేరమో దాని వల్ల వచ్చే అనర్ధమేమితో తెలియ జెప్తుంది. ఇక్కడో విషయం మనవి చేస్తున్నాను. విజయ వాడ ఆకాశ వాణి వారు "ఆలోచనా లోచనం "శీర్షిక క్రింద ప్రతి మంగళ వారం ఉదయం ఏడుం పావు కు ప్రసారం చేస్తున్న దానికి నన్ను రాయమని డైరెక్టర్ శ్రీ మంగళ గిరి ఆదిత్య ప్రసాద్ గారు కోరగా నేను పద్నాలుగు ఎపి సోడ్లు రాస్తే, ప్రసారం చేశారు. ఆరవ ఎపిసోడ్ లో "భిక్షు తాడిత "కథ ప్రసార మైంది. దానికి నేను పెట్టిన పేరు "దేవుని సొత్తు తింటే విపత్తే ".

శ్రీ చిలుకూరు వెంకటేశ్వర్లు గారు తక్కువ వ్యవధిలో వాల్మీకాన్ని నేర్పుగా అనువ దించారు. ఎక్కడా క్లిష్టత లేదు. అన్వయ కాఠిన్యమూ లేదు ద్రాక్షా పానకం గా రచన సాగింది. ఆస్వాదనీయం గా ఉంది..శ్రీ రామునికి ఆంధ్ర దేశానికి చాలా అవినాభావ సంబంధం ఉందని, యుద్ధం తర్వాత రాముడు అయోధ్యకు వెళ్ళ కుండా భద్రాచలం లోనే కొలువై నిలిచి పోయాడని ప్రఖ్యాత కవి, విమర్శకులు, "విశ్వనాధ కాళి దాసుకు మల్లి నాద సూరి"అయిన స్వర్గీయ మల్లం పల్లి శరభయ్య అయ్యవారు చమత్క రించారు., శ్రీ రామ నవమిని ఆంధ్ర దేశం లో చేసి నంత వైభవం గా ఇంకెక్కడా చెయ్యరు ఊరూరా వీధి వీధినా శ్రీ రామ నవమి పందిళ్ళ తో కోలాహలం గా ఉంటుంది. రామాలయం లేని ఊరు ఉండదు. సీతా రాముల పేరులో ఏదో ఒక పేరు ప్రతి ఇంటిలోను ఒకరికి ఉంటుంది. అలాంటి రామ చరితను మహర్షి వాల్మీకి రాసి తాను ధన్యుడై లోకాన్ని

ధన్యత చెందిస్తే చిలుకూరు వారు తెలుగు వచనం లో ఆ మాధుర్యాన్ని , విశేషాలను అందించి, మళ్ళీ ఒక సారి ఆ వైభవాన్ని చూపించారు. రుషి ఋణం తీర్చుకొన్నారు. అభ్యుదయ కవి అనుభూతి కవి స్వర్గీయ దేవర కొండ బాల గంగా ధర తిలక్ (అమృతం కురిసిన రాత్రి ఫేం ),పరవశించి శ్రీ రాముని గురించి రామాయణాన్ని గురించి అద్భుతం గా చెప్పిన పద్యం గుర్తు చేస్తూ

**"రామ శబ్దము చాలు రచ్చలో గట్టులో –పులకించ నట్టిది పూవు లేదు**

**సీత శబ్దము చాలు శీతువో గ్రీష్మమో –వరదలై పారని వాగు లేదు**

**రామ సీతా నామ రమ్య నాదము చాలు –కోవెల కానట్టి గుండె లేదు**

**రామాభి రామ కీర్తనముతో మడియని –స్మయ భావ మద నిశాచరుడు లేడు**

**వాడ వాడల నాడు జీవత్కదాంశ–సంపుతీకృత కాకుత్స్య చరిత మ్రోగే**

**దాని గైకొని, ప్రతిభా నిదానుడైన –మౌని వాల్మీకి అక్షర మాల్య గూర్చే "**

దీనికి ముక్తాయింపుగా సీతా రాముల అభేదాన్ని తెలియ జెప్పే కవి సమ్రాట్ విశ్వనాధ వారి రామాయణ కల్ప వృక్ష కావ్యం లో అశోక వనం లో హనుమ దర్శించిన సీతా మాత స్వరూపాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్య వైభవాన్ని ఒక్క సారి దృష్టికి తెస్తూ,సెలవు తీసుకొంటున్నాను

**''ఆకృతి రామ చంద్రు విరహాకృతి, కన్బొమ తీరు స్వామి చా**

**పాకృతి, కన్నులస్ ప్రభు క్రుపాకృతి, కైశిక మందు రామ దే**

**హాక్రుతి, సర్వ దేహమున యందున, రాఘువ వంశ మౌళి, ధ**

**ర్మాక్రుతి, కూరుచునున్న విధ మంతయు, స్వామి ప్రతిజ్ఞ మూర్తి యై "**

సంపూర్ణం

## పదచిత్ర రామాయణము –అరణ్య కాండ

తెలుగు కదా సీమలో అలవోక గా విహరించి, విమర్శ అరణ్యం లో వీర విహారం చేసి, ఇప్పుడు పద చిత్ర రామాయణం లో సభక్తికం గా విహరిస్తున్న ఆప్తులు శ్రీ విహారి గారికి –మనః పూర్వక ప్రణామాలు. ఉభయ కుశలోపరి –

మేమిద్దరం ఏప్రిల్ మొదటి వారం లో అమెరికా వెళ్లి, ఆరు నెలలుంది, అక్టోబర్ మొదటి వారం లో తిరిగి వచ్చాము. వెళ్ళేటప్పుడు మీ "అయోధ్య "నుతాపీగా ఇక్కడ చదివే తీరిక లేనందు వల్ల మాతో అమెరికా తీసుకొని వెళ్లాను. మేము వచ్చేసరికి "అరణ్య కాండ "అందింది. రెండు చది వాను. ముందుగా అయోధ్య కాండ గురించి – అమెరికా లో నాలుగైదు సార్లు చదవ టానికి తీవ్ర ప్రయత్నం చేశాను. కాని కదా భారమో అన్నిటా అందులో వ్యాపించిన దుఃఖ భారమో, గుండెల్ని పిండి వేసే సన్నివేశాల బరువో, అందరి మనో భావాలు ఆర్దర మై పోవటం వల్ల గుండె బరువై పోవటమో తెలీదు కాని పద్యం నుంచి, పద్యానికి కదలటానికి చాలా సమయం పట్టేది.. ఆపి మళ్ళీ చది వే వాడిని. మళ్ళీ అదే స్తితి. కధే అంత. రామ వనవాస ప్రారంభం అందర్నీ శోక సంతప్తులను చేసింది. శోక సంద్రపు కెర తాలు ఈడ్చి ఈడ్చి తనను తున్నాయి. గుడ్ దిటవు చేసుకొంటేనే ముందుకు సాగ గలమని పించింది. మొత్తం మీద అక్కడే అయోధ్య ను పూర్తీ చేశాను. ఏదో మీ తనువు లో ఇవతళించిన ప్రాచీ భావం మిమ్మల్ని ఊపిరి సలప కుండా శ్రీ రామ గాధను రాయిస్తోంది. మీ కవిత్వం లో విశ్వనాధ దర్శనమిస్తాడు. పురాకవుల వైభవం జ్యోతకం అవుతోంది. ప్రతి పద్యం సాన దేరింది. సందర్భానికి తగిన ఛందస్సు నుపయోగించి, ఆ ఛందస్సుకే సార్ధకత ను చేకూర్చారు. అడుగడుగునా మీ ఆరాధన భావం వేద వేదాంగాల పై పట్టు కానీ పిస్తుంది. చాలా కాలానికి దీని పై రాస్తున్నాను కనుక ఇంత కంటే రాయటం సమర్ధ నీయం కాదని పించి అయోధ్య ను ముగిస్తున్నాను.

మేము వచ్చేసరికి అరణ్య కాండ మా కోసం ఎదురు చూస్తోంది. కాస్త వెసులు బాటు చేసుకొని పది హేను రోజుల క్రితం చదవటం ప్రారంభించి పూర్తీ చేశాను. దాని పై పూర్తిగా రాసే ముందు మీకో విజ్ఞప్తి., త్వరలో మీరు మిగిలిన రెండు కాండలు పూర్తిచేస్తారు. అప్పుడు వాటికి అను బంధం గా మీరు వాడిన వివిధ ఛందో రీతులు, వాటి అవసరం అవి సందర్భానికి ఎలా తగి ఉన్నాయి, కధకు ఏవిధం గా దోహద పడ్డాయి, శిల్పాన్ని ఎలా పరి పుష్టం చేశాయి, కదా నిర్వహణ లో అవి ఎంత విలువను సంతరించుకొన్నాయి అన్న విషయాలన్నిటి మీద సాది కారం గా ఛందో నిపుణులు ఎవరి తో నైనా విశ్లేషణాత్మ కం గా వివరణాత్మ కం గా పరిశీలన, పరి శోధనా చేయించి రాయిస్తే పరమాద్భుతం గా ఉంటుందని నాకు అని పించింది. ఆ పని తప్పక చేసి,నాటొంట్లకు అందులోని రహస్యాలను అందు బాటు లోకి తీసుకు రావాలని మనవి చేస్తున్నాను.

### అరణ్య కాండ

ముఖ చిత్రమే మహా ముచ్చట గా ఉంది."వెడలెను కోదండ పాణి "కి అనుగుణం గా ఉండటం తగినది. తపోధను లైన మహర్షులను వర్ణించి చెబుతూ "చిరుత నవ్వుల నిసువు –ససి, మిస –నొసలు "అనటం కొత్తదనం. శ్రీ రామ సోదరులను చూచినా వర ముని బృందం "గాలి పటంబుల గాంచుచు కేరేడు బాలల పగిదిన్ "అని పించటం అడవిలో గాలి పటాలను ఎగరేసి చూపించి నట్లుంది. భావుకత కు జోహార్లు. ఆ రెండు పద్యాలను "మధుర గతి "చందం లో రాయటం వారి మనసు మాధుర్యాన్ని వ్యక్తం చేసింది అది అమృత కాంక్షే మునులకు. అక్కడి




ప్రాకృతిక అందాన్ని వర్ణించే ముందు "కమల గీతి "లో చెప్పిన కోమల భావం బాగుంది. సమగీతి, పవడ గీతి పద్యాలలో వాతావరణ ప్రశాంతత గోచరించింది. "రామ రామాభ్యుదయ హితా రామ సోమ "అనే పద్యం లో పాదాలన్నీ ఆమ్రేడితాలై సొగసు కూర్చాయి. మునుల ఆనంద పార వశ్యం కన్పించింది. తాపసీ లలనల దర్శనాన్ని "సుమంగలి"పద్యం లో జోడించటం ఔచిత్యానికి పరమో దాహరణ

రెండే పాదాలతో సాగే "కలియుగ మంజరి "ప్రకృతి చిత్ర పటాన్ని ఆవిష్కరింప జేసింది. అంతే కాక గమనాన్ని సూచిందని పించింది "సకల మెరిగిన వారు సాక్షులై నిలువ, --వికల్పము నొందె నడవి తనంత తాను "అన్న మాట సొగసు గా ఉంది.విరాధ కధలో రాముని స్తితిని రామానుజుడు "నీరు రామియున్, సారము లేక తీలు బడు సస్యములో తల వంపు "గా ఉందని గొప్ప సామ్యం గా రైతు భాష గా చెప్పారు. వాడి మదాన్ని "మత్త క్రీడ"లో వర్ణించటం బాగు బాగు. అగస్త్య మహర్షి రాముని తో రామ ధర్మ పత్నిని "ఈ ధరాజ, నీ మనసు ధార లోని సిరి, మానిత వర్తిని భాగ్య రాశియున్ "అని చెప్పటం లో సీతా సాధ్వి వేద శిఖా మణి అని గుర్తు చేయటమే. శూర్పణఖ చేసిన పనిని "పెరగాయ పని "అనటం కొత్త మాటే. సోదరుడు రావణుని తో శూర్పణఖ సీతా దేవి గురించి "సుధ్యుపాస్య – సౌందర్యమున కామే నిర్వచనము "అన్న మాటలలో మొదటిది ప్రాచీ నతకు, రెండోది ఆధునిక భావా విష్కరణకు నిదర్శనం.


Sri Padachitra Raamaayanam (poetry) by VIHAARI

మారీచాశ్రమం లో రావణుని తొందర పాటు ను వర్ణించేందుకు వాడుకొన్న ద్రుత విలంబితం, అశ్వ గతి సందర్భోచితం గా ఉన్నాయి. మాయ లేడి ని చూసి సీత వ్యామోహ పడటానికి "మధురాక్కర "పద్యం మధురం గా అక్కర తీర్చింది. త్రిపదలు "త్రిపధల్లా "శోభించాయి. సీతను రావణుడు తర లించటానికి, తరళాన్ని,అల్ప మైన మనసు తెలియ పరచటానికి "అల్పాక్కర " ఉపయోగ పడ్డాయి. సీతను లంకకు చేర్చటానికి "వియోగిని "ఛందస్సు బాగా తోడ్పడింది

శబరి రాముని రాక కై ఎదురు చూస్తూ పూల చెట్లను సరి చేసే పద్యం "ఓపిక జేసి కొంచు"కృష్ణ శాస్త్రి గారి రచనా అని పించింది సుమా. "వియతి చందం "లో ఆమె మనో వేదన ఆరాధనా చక్కగా ఆవిశార్లించారు. "ఆలస గతి "లో ఆమె రాముని "ఆలస గతి నీ రెరుగు డైన దయ చేతన్ " అని చెప్పించటం అరుదైన విషయం. సందర్భో చితం పరమ ఔచితీ వంతం. అరణ్య కాండ ముగింపు లో ఆ కాండాన్ని "సత్య ధర్మ పరాక్రమ సత్వ విభుతి –యుదిత సుఖ దుఃఖ మిశ్ర భావోప పత్తి – సమాధిక పద చిత్ర రచనా శ్వాస సమితి "అని మొత్తం సారాన్ని పిండి చెప్పారు.

ఇంత కవితా విహారం, కదా కదన.శిల్ప విహారం మీరు చేసినా వినమ్రం గా "రధియై శ్రీ రఘు రాముడు –కధనము నడిపెను, మదీయ కరములు వ్రాసెన్ –విదియు, విధానము నతనిపే –ప్రదిత కు సేసెట్లు తగుదు –పలుకుల వెలదీ "అని సరస్వతీ దేవికి నివేదించటం మీ వినయానికి, ప్రదితకు, మహా సంస్కారానికి ప్రతీక.

ాండ పదచిత్రాలలో "పలుచిత్రాలు"

ం ఎంత వాచోవిధేయమో, పద్యమూ మీకు అంత వశమవటం మీ

కృతం. తపస్సుగా సాగించిన కృషి.

కాండలో పలుచిత్రాలు గమనించాను. అవి తెలియజేయటానికి

ందుకు మన్నించండి. ముందుగా వివిధ ఘట్టాలకు పెట్టినపేర్లు

, కమనీయం, కవిహృదయం, కథాసారంగా అనిపించాయి. చీమలు

ోకగానే ఎక్కి ప్రాకుతాయి సహజంగా. వినమ్రంగా అన్నా, విశేషంగా

ాధ్యను వర్ణించే తీరు కొత్తగా, పవిత్రతను చేకూర్చింది. పూజాద్రవ్యాలతో,

ంటి గొబ్బెమ్మల పోలికలతో, అయోధ్యను తెలుగు వారంతా యిష్టపడే

అనటం, ఆ ప్రజలు తెలుగు ప్రజల్లా సుమనస్కులనటం తెలుగు

లకి ఎత్తిన పతాక. వసంతాగమనాన్ని శిశువునోటి మాటల చల్లదనం

చిత్రమే. నగరశోభ చందన చర్చితంగా వున్నదనే భావమూ కొత్తగా

ద్దాన్నం వున్న ఆకుకీ నోరూరిందనడం అతి చమత్కారం. నేల

ిడిగా కన్పించటం తమాషా. శాంతాదేవిని వర్ణించిన పద్యం శాంత

లో, ఉదాత్తంగా, ఆత్మగౌరవోద్దీపనంగా వుంది. సుకృత పరిపాకం

అనటం ఫలసిద్ధిని సూచించే వైనంగా వుంది. పాయసాన్ని పట్టమహిషి

యిచ్చే సందర్భంలో చెప్పిన పద్యాలు సత్కరమణీయం. సుమిత్రకిచ్చేవేళ

"శేషవిభవకాంక్ష మహిత శేషమునిచ్చెన్' అనటంలోను, కథనమీపయిన 'సశేష' కల్పనమ్ము అనటంలో ద్వంద్వం, వ్యంగ్యవైభవం శ్లేషాంశ చక్కగా కుదిరాయి. మీ కవన పాండిత్యం పండిన చోటు యిది. అలాగే, 'భర'మ్మునే, తలపు పంటల నింపు' అనటం లోకైక కుమారుడెవడో, ఏం చేయబోతాడో సూచ్యార్థసూచన వుంది. 'పల్లవి, అనుపల్లవి' గా శాంతాదేవి, సుమిత్రా దేవిలను భావించడం సంగీత మాధుర్యాన్ని కూర్చింది. భక్తి, శక్తి ధర్మసంప్రశ్రయాలని, భక్తికి కవచం కల్గిందన్న భావం మనోహరం.

పోతనగారి భాగవతంలోని బాలకృష్ణుని చూసి, ముసలితాత వ్యాసుడు తెల్లగడ్డం సవరించుకుంటూ 'కన్నయ్య' అచ్చగా నువ్వు తెలుగు కృష్ణుడివి అయిపోయావేరా" అని ముసి ముసి నవ్వులు నవ్వినట్లు కరుణశ్రీ రాసినట్లు జ్ఞాపకం. అలానే మన రామాదులతో తెలుగు ఆటలు కోతికొమ్మచ్చి, బొంగరాలు, కుప్పిగంతులు ఆడించి తెలుగు దాశరథులను చేశారు. పోతన మాగాయి పచ్చడి తినిపించగానే కృష్ణయ్యతో! శాస్త్రీయ భావాన్ని కవితలో పొదివి' తన గుండియ గదుల కమర్చిన - నాల్గు కవాటములన శ్రీరామాదుల్" అని రాయటం చాలా సహజంగా వుంది. స్వకీయమైంది. విడదీయరానిదన్న గొప్పభావమూ పొదగబడింది. -ఏ కవాటం దెబ్బతిన్నా - గుండెపోటు తప్పదని వైద్య విద్య సూచనా కనిపించింది. సెహభాష్ విహారిగారూ! కవితా విహారం చేశారు. విశ్వామిత్రుని గళంలో జలతరంగిణి విన్పించి, నూత్నభావాన్ని నెలకొల్పారు. ఉడుము నెరవేర్చే పని ఉడత చేయలేదని. మొకుపేసటానికైనా, వురికి నిలబడే నార కావాలనటం లోక సహజాలను కవిత్వంలో పొదగడమే. దశరథుని నోట రాముడే తన చలనశక్తి అంటూ, బుజం మీద పచ్చబొట్టుగా రాముణ్ణి చెప్పటం ఎంతో స్వాభావికంగా, అవినాభావ సంబంధ స్ఫోరకంగా వుంది. గాఢఅనురాగానికి, ప్రత్యక్షసాక్ష్యం, అందుకే ముని విశ్వామిత్రుడు ఆ తర్వాత రామలక్ష్మణులను చూసి 'తండ్రికి నరచేతి నిమ్మపండ్లు నిజ మీ చిట్టి జంట" అని మెచ్చాడు. చక్కని ఉపమానం.

శ్రీరాముడు మునివెంట వెళ్ళి, ఆ మహర్షిని మనసులో భావిస్తూ ఆయన రాక పదసమూహంగా, కోరిక అర్థంగా, ఆగ్రహధ్వనిగా, ధాటి ప్రౌఢిమగా, వివరణ రసంగా, పట్టు ధారాతరంగాలుగా, ప్రయుక్తి గుణం రీతిగా, శిష్యవాత్సల్యం అలంకారంగా, విధానం తత్వసూక్తిగా, భాషణం వ్యాకరణరూపాన్ని పొంది, ఔదార్యం కథా కథనాన్ని సమకూర్చి, వేదవిద్య రసకావ్య సంస్పర్శను చేర్చి, నిరంతరశుభభావ సమభావ ప్రతతిని కూర్చిందని చెప్పిన పద్యానికి హ్యాట్సాఫ్. బుద్ధుని గురించి కరుణశ్రీ రాసిన పద్యాలు జ్ఞాపకానికి తెచ్చాయి. ఈ పద్యం మీ కవితా హృదయానికి కలికితురాయి. రామునికి, విశ్వామిత్రునికి 'తారామైత్రి' కుదిరిందనడం జ్యోతిశ్శాస్త్ర విషయం, ఫలప్రదానం కూడా. రామ, రామానుజులను తనతో రాజు పంపటం "మించు రుచిని నాల్కమీద ఉప్పు కల్లు చప్పరించటం" మామంచి తెలుగునుడికారం.

XI

తూర్పున సూర్యోదయా్ని "రాగిరేకు సర్గ వృత్తమ్ము జేసి, మడచినట్లు
మాలి" కన్పించాడనటం భావుకతకు, లోకరీతి తోడైంది. మునివెంట వుండి
ము నేర్చిన విషయాలు గురువుకు విన్నవిస్తూ చెప్పిన రెండుపద్యాలు "శక్తికి
లము శాంతము", "శక్తియు వజ్రహృదయమగు" అన్నవి రామునికి తగిన
లు. రాముడే చెప్పదగిన మాటలు. గంగానది పరవశత్వంతో పరుగులెత్తే
న్ని "పరిపూర్ణోజ్వల" పద్యంలో కళ్ళకు కట్టించారు. ఆ ప్రవాహ శీలత పద్య
నంలోనూ నిండి పారింది. శ్రీనాథుని చాటువు " గంగవిడుము,
తిచాలన్న" దాన్ని సమయోచితంగా వాడటం, సరదాగా వుంది. 'వేగవతి'
దంలో గంగా ప్రవాహాన్ని వర్ణించటం అద్భుతమైన ఛందోవైవిధ్యభరితమైన,
యానికి తగిన రచన. వెంటనే రాజమరాళీ వృత్తం ఆకాశగంగలో హంసలు
రిస్తోయున్న పురాతన భావానికి ప్రాణ ప్రతిష్ఠ చేయటమే. 'సుధారసలహరి'
ంలో భూగంగను వర్ణించటం, ఆమె పవిత్రతను, అమృతత్వాన్ని చూపించే
నం.

మిథిలలో గురుశిష్యులకు 'స్వాగతవృత్తం'లో స్వాగతం పలకటం,
కచక్రవర్తిని 'త్రిపద'లో వర్ణించడం, మూడువేదాల సారం తెలిసిన వాడని
ంచింది. రంగు చిత్రాలున్న పుస్తకంలోని పేజీలను త్రిప్పినట్లుగ సంవత్సరాలు,
వుల్తో సహా తిరిగి పోతున్నాయని చిత్రంగా చెప్పారు. విశ్వామిత్ర జీవిత
ంటువులో అందని ద్రాక్షపండు అన్నమాట లేదనటం గడుసుగా చెప్పటమే.
కంగా చమత్కారం, ఎద్దేవా! ఆకాశంలోని చుక్కల్ని పిడికిలి విసిరిన పిండి
కాయలు "అనటం తెలుగింటి గోలీలాటను నింగికి చేర్చటమే. సమస్యను
పాద' అనటమూ అచ్చతెనుగుదనమే. చేతిలో వేపమండలు, పెంపుడుపిల్లుల
లో తెలుగువాతావరణం ప్రత్యక్షం. 'చావో రేవో' అనటం మంచి జాతీయం.
లీషుని సైన్యప్రయాణాన్ని 'అశ్వగతి' ఛందస్సులో నడిపి సమయజ్ఞతను చాటారు.
కిందనీటిని, తేనె పూసిన కత్తిని, కొరవితో తలగోక్కోవటాన్ని, తిక్కనగారి మ్మెని
ని కవిత్వీకరించిన వైనం బాగుంది. గాధేయగాథను శతానందుడు
ంచిననపుడు చలువ చీరలు చుట్టిన చాయవల్ల రాఘవుల మానసాలు
ంజితాలయాయన్న మాటలు మధురాలు. భావికథకు సోపానాలు. Horizon
కసము భూమి కలిసిన యంతికమ్ము'గా రాయటం విజ్ఞత. సీత నిజంగా
నపు బొమ్మే - బాపూ బొమ్మే- బొమ్మే సీత అనే పేరును "శ్రుతికావ్యేనాప్త
ం" అనటంలో శ్లేష చక్కగా ధ్వనించింది. కృష్ణశాస్త్రిని మక్కికి మక్కిగా
లో ఆకుగా' తో చమత్కరించారు.

తనకన్నా ముందే లేచిన రాఘవుణ్ణి చూసి భానుడు గుర్రాలను అదల్చడం
పోకడ. రుద్రధనువు శ్రీరాగం పల్కటం, జనం మంచు దుప్పటి కప్పిన
చేనై పోవటం. నిశిత పరిశీలనకు తార్కాణం. ధనువందుకొనే రాముడి
న్ని 'ఉత్సాహ'లో వర్ణించటం లోకజ్ఞత. జనాల భావాలకాస్పదమైన రసపదం

XII



కదిలించటి - రామపదంలో, 'ధ్వని గర్భితం'! 'ఆకృతి దాల్చి' పద్యం పరమవైభవంగా వుంది. నాయికపై చిందులేసే పద్యం. రసం చిప్పిలే విధం. ధనర్భంగం. సీతాకరగ్రహణం 'జనసాంతర సుహృదం' వారిద్దరికీ కాదు అందరికీ. నూనెతో నిండిన నూనెగింజలు. పత్తిపూవుల్లోని పత్తిలాగ మోహనత్వంలో సమ్మోహనత్వం ఒలికి, మాట, చేతపడిపోయాయనడం సంభ్రమాశ్చర్యాలే. 'మత్తకోకిల'లో సుపర్వ సుపర్వ మయిందని మెత్తగా, స్ఫూర్తిగా చెప్పారు. 'ద్రుత విలంబితాలు'లో ఒక్కొక్కరి వివాహాన్ని ఎలా హితంగా చెప్పటం ఔచిత్యం. ఇలా చెప్పుకుపోతే ఎంతో ఉంది.

రసస్పందన కల్గించి, హృదయాలను ఆనంద పారవశ్యంతో, పూర్వకవుల బాటల్లో నడుస్తూ, కొత్త భావాలు చూపుతూ, కొత్తలోకాలు చూపుతూ, తెలుగుకు, తెలుగు నేలకు పట్టం కడుతూ సాగిన మీ రామాయణం మధురం, మధురాతి మధురం.

గబ్బిట దుర్గాప్రసాద్ (ఉయ్యూరు)

XIII

## తిక్కన భారతం

సాహితీ బంధువులకు –"తిక్కన భారతం "శీర్షికను దారా వాహికం గా ప్రారంభిస్తున్నాను. దీనికి ముఖ్య ఆధారం స్వర్గీయ భూపతి లక్ష్మీ నారాయణ గారి రచన.

ఇంద్రియాలను బాహ్యం గా ప్రవర్తించ నీయ కుండా ఆత్మ లో వ్రేల్చట మే యజ్ఞం. ఆత్మ- అగ్ని స్వరూపమూ, నిర్మల మైనది. "యజ్ఞో వై పురుషః "అన్నది శ్రుతి. కనుక జ్ఞాన యజ్ఞం ద్వారా పరమ పురుషుని పొందటం జ్ఞాని చేయ వలసిన పని. పురుషుడే వేదం కనుక మళ్ళీ వేద ధర్మం ద్వారా కూడా సాధించ వచ్చు అని భావం. "వేద తాత్పర్య మారసి, వేది తత్వ మెరుగు వారు వేదజ్ఞులు "అన్నారు తిక్కన సోమయాజి. తాను ఆ స్తితి పొందాడు కనుక మహా భారతాన్ని అంత ఉదాత్తం గా తీర్చి దిద్దాడు కవి బ్రహ్మ. "self is poorna, the absolute. Are you apart from poorna ?.if it is so will it be poornaa ? అన్నారు శ్రీ రమణులు. అంతటి ఉత్కృష్ట మైన తాదాత్మ్య స్తితి ని పొందితేనే, తన కావ్యం ఆ వేద పరమార్ధాన్ని అందివ్వ గలదు అని తలచాడు తిక్క యజ్వ. "only one who can give every thing to the divine enjoys the all pervading divine "అని శ్రీ అరవిన్దులంటారు. ఆ స్తితి ని సాధించి, తన రచనకు పరమ మైన విలువను సంత రించి పెట్టాడు తిక్కన. అదొక మానసిక ఆరోహణ. కావ్యం లోనూ, కావ్య నాయకత్వం

లోను మానవ జీవితం లోను-అంతటా కలిసి. మనం సిద్ధం గా ఉంటె, ఆ పరమాత్మ మనల్ని మారుస్తాడు. ఆ పని నిరంతరం జరిగేదే. మనం ఆ వేదిక ను నిర్మించు కోవాలి. అంతే -the divine is at work to transform you and you must open to iinorder to let it work freely, in you " అన్న శ్రీ అరవిందుల వాక్యం యదార్ధమే. అలాగే తన మానసిక స్తితి ని మార్పు చేసుకొన్నారు సోమయాజి. అందుకే ఆంధ్ర భారత రచన అంతటి పవిత్ర యజ్ఞం గా భావించి పూర్తీ చేసి, తాను ధన్యత చెంది, లోకాన్ని ధన్యత చెందించి, కావ్యానికి వేదత్వాన్ని కల్పించాడు. అనుక్షణం ఎదగటం ఎలాగో తాను ఆచరించి ",ఆదర్శ కవి రుషి "అయాడు ఉభయ కవి మిత్రుడు. ఆ విధానం ఏమిటో పరిశీలించి తెలుసు కొందాం.




భారత కదా సామాన్య మానవుని కథే. తండ్రిని పోగొట్టుకొని, పిన తండ్రి పోషణ లో ఉన్న బాలుర జీవితమే కదా !దాయాదులు, ఈరష్యా, అసూయ, దురాశాపరులు. వాళ్ళదే మొదట పై చేయిగా కన్పిస్తుంది. అంటే అధర్మం మొదట విజయం సాధించి నట్లు కానీ పిస్తుంది. పై చేయిగా ఉన్నట్లని పిస్తుంది. పాండవుల జీవితం కూడా అంతే కదా. అందుకే భారత కదా -మన జీవితాలకు దగ్గర గా ఉంటుంది. పాండవులకు ద్రౌపది థో వివాహం అయిన తర్వాతా కొంత సాంఘిక ఔన్నత్యం వారికి కలిగింది. బంధుత్వం బలపడి, తమకు అండగా నిలబడే వారు దొరికారు. శక్తి యుక్తులు, ధార్మిక జీవితం, కొంత కాలం వారికి ఉన్నత స్తితి ని కల్పించాయి. ధర్మక్ విజయం ఇంకా ఒక స్తిర రూపం దాల్చ లేదు. దుర్యోధనాదుల అధర్మ ప్రవృత్తి వలన తాత్కాలికం గా, అధర్మానికి విజయం లభించి నట్లు కానీ పించి, ధర్మ రాజాదులకు రాజ్య భ్రష్టత కలిగింది. దీనిలో ధర్మ రాజు దోషమూ కొంచే మైనా పాత్ర వహించింది. అదే ద్యూత వ్యసనం. దాని ఫలితమే రాజ్యం పోవటం, అవమానం, కష్ట నష్టాలు. మానవ జీవిత పరిణామం కూడా అంతే. ఏదో ఒకటో రెండో లోపాల వల్ల జీవితం అష్ట వ్యస్తమై పోవటం లోక సహజం. కష్టానుభావం వల్ల ఉత్తమ మైన, సాత్విక ప్రవృత్తి కల వారి లో హృదయ పరి వర్తన కలుగు టుంది. అలాగే అరణ్య, అజ్ఞాత వాసాను భావం ధర్మజుని చిట్టా శుద్ధి కి మార్గాన్ని చూపించి, లోక కళ్యాణం కోసం శాంతి ప్రయోగం చేసి విఫలుడైనాడు. క్షాత్ర ధర్మాన్ని అనుసరించి యుద్ధం చేయ వలసిన అత్యవసర పరిస్తితి కలిగింది. అయిష్టమైనా తప్పని చర్య.అది. తన పక్షాన ధర్మం ఉన్నా, అధర్మ పక్షం థో పాటు తన వారూ యుద్ధం లో నశించారు. ఇదే ప్రకృతి స్వభావం. ఒక సంఘర్షణ ఏర్పడితే, రెండు పక్షాలకు నాశనం తప్పదు. ఇది రాజు అయిన ధర్మ రాజు కు స్వయం గా తెలిసిన విషయం. తరువాత ఇదే వైరాగ్యానికి కారణం కూడా అయింది.

ఇక్కడ మళ్ళీ మనం మానవ జీవితం తో పోల్చు కొనదగిన విషయం ఒకటి ఉంది. ఉత్సాహ వంత మైన యవ్వనం దాటగానే, కష్ట సుఖానుభావం ద్వారా పరిణామం వచ్చి, శాంతి కోరటం సహజ లక్షణం. అంతవరకు ఐహికం పైనే కేంద్రీకరించిన దృష్టి, ఆముష్మికం పై పు కు మరలు తుంది. అలాగే పాండవుల జీవిత చరిత్ర కూడా. భారతం లోని వివిధ ఘట్టాలు ఈ పరిణామ క్రమాన్ని సూచిస్తాయి. నాయకుడైన ధర్మ రాజు మానసిక స్తితి కూడా అలాగే మారింది. ఇతి వృత్తం తో,నాయకుని జీవితం క్రమ పరిణామం పొంది, మానవ జీవిత చరిత్ర కు సంపూర్ణ మైన వ్యాఖ్య గా మహా భారతం నిలిచి పోయింది.

ఈ పరిణామం ఉన్నతం గా, ఉదాత్తమం గా తీర్చి దిద్దాలి అంటే కవి లోనూ ఆ పరిణామం క్రమం గా రావాలి. దానిని అనుసరించి రావాలి. యుద్ధ పర్వం వరకు రచించిన రచనా విధానం పేరు, -అదంతా లౌకిక పరం గా సాగింది. ఆ తర్వాతరచన లో అలౌకిక విధానం ప్రవేశించింది. ధర్మజుని, జీవితం ఎలా పరిణితి చెంది క్రమంగా అంతర్ముఖ మై ప్రశాంతత పొందిందో, తిక్కన సోమయాజి రచన కూడా క్రమ క్రమం గా పరిణామం చెందింది. అలోకిక కావ్య లక్షణాలైన ధ్వని, అలంకారం, చమత్కారం, లను వదిలి, మానసికం గా హాయిని ఇచ్చే అర్ధ పోషణ కే అధిక ప్రాధాన్యత వచ్చింది. ఆ ధ్యేయం గా, నే రచన సాగి, ప్రశాంత తేజో మూర్తిగా రచన మార్పు పొందింది. ఉత్కృష్ట పరిణామ స్థితి ని చేరింది. అనుభవసారమైంది. ఆదర్శ ప్రాయమైనది. ఆర్ష పద్ధతికి అద్దం పట్టింది. వేద, వేదంగ, ఉపనిషత్ రహస్యాలన్నీ, జీర్ణింప జేసుకొని, ప్రాచీన సంస్కృతి కి వారసుని గా రూపొందటం చేతనే మహా భారత రచన చేయ గల్గె అర్హత పొందాడు తిక్కన మహా మంత్రి, సోమయాజులు, కవి బ్రహ్మ, ఉభయ కవి మిత్రుడు తిక్కన. గురూప దేశమే కాక ప్రత్యక్షాను భావం పొందితేనే ఇది సాధ్యం. విద్యకు అధీతి, బోధ, ఆచరణ, ప్రచారం అనే నాలుగు దశ లు ఉంటాయి. భారత రచన లో తాను పొందిన విద్యకు చక్కని ప్రచారాన్ని సాధించి పెట్టి ధన్యడు, చరితార్ధుడు అయ్యాడు తిక్కన



భారతాన్ని పరబ్రహ్మ రూపం గా భావించాడు తిక్కన. తాను, ఆ తత్వాన్ని లోక కళ్యాణం కోసం ప్రచారం చేయాలని, ఆంధ్రీకరణ కు పూను కొన్నాడు. అదొక యజ్ఞం గా భావించి చేస్తేనే సత్ఫలితం కలుగు టుంది. అందుకే ముందుగా వైదిక యజ్న కర్మ దీక్షితుడు అయాడు. యజ్న రూపమైన ఈశ్వరుని నిష్ఠగా చిత్తాన్ని వశీకరణం చేసుకొని, ప్రతిష్టించు కొన్నాడు. సోమయాజి అయ్యాడు కనుక ఈ వాఙ్మయం యజ్నం సులభ మైంది. ఉత్కృష్ట సాధనమూ అయింది. చిత్త శాంతి లభించింది. కవిత్వ దీక్ష తీసుకొన్నాడు. వాఙ్మయ యజ్న రూప మైన యోగ దీక్ష ను పొందాడు. భారత రచన ప్రారంభించారు. ఆతని ధ్యేయం ఆముష్మిక ఫలం, జన్మ రాహిత్యం

తపమునకు,విద్యకు ను, జానూ స్తానమైన -జనన రహితుని యజ్ఞాత్ము శౌరి, వాఙ్మ

యాధ్వరార్చితు జేసితి ణా జనార్ద--నుండు మద్భాజనమున బ్రీతుండు గాత”

అని భీష్ముని చేత అనిపించినా, అవి తిక్కన గారి మాటలే. విద్యా, తపస్సుల జన్మ స్థాన మైన వాడూ, జ్వావు పుట్టుకలు లేనివాడు, యజ్ఞమూర్తి, అయిన పరబ్రహ్మం వాఙ్మయ రూప యజ్ఞం తో తిక్కన పూజించాడు. దీనితో భగవంతుడు ప్రీతి చెందుతాడని నమ్మకం.

శరణా గతుండ భక్తుడ -బరమ పదవి గోరేద ను శుభంబుగా నన్నున్ --బరికించి ఏది మేల -య్యిరవు దొరకోనంగా దలపవే కమలాక్షా "అని విశిష్ట జ్ఞానం తో ప్రార్ధిస్తాడు. భగవంతుని ప్రీతికై భక్తీ శ్రద్ధలతో సత్కర్మలు చేసి, ఫలా పేక్ష లేకుండా, జీవితాన్ని ఈశ్వరార్పణం చేసిన ఆదర్శ కర్మ యోగి తిక్కన. "ఏది మేలో అది చేయించు "అన్న ప్రార్ధన -సర్వ సమర్పణా భావమే. వ్యాసుడు రాసిన గీతా తత్వాన్ని వాచ్యం చేయకుండా, ఆచరణ రూపం గా, ఇలా బహిరంగ పరచాడు. అందుకే తిక్కన ఆదర్శ ప్రాయుడైనాడు. తిక్కనకు యోగం, తపస్సు, యజ్ఞం అభిమాన విషయాలు. నిర్మల అంతఃకరణ సాధ్య మైన బ్రహ్మ జ్ఞానమే తిక్కన ధ్యేయం.

యోగులకు యోగ బలమున -రాగంబు మొహమ్మును జిరస్నేహము,గామమముగ్రోధము గుణా--యోగము వరుస బెడ బాప నున్నతి యొలయున్ "అని యోగా వాసిష్టత ను చాటాడు. యోగం పొందిన వాడి ఆనందం వర్ణనా తీతం. అంటూ –"

యోగ నిరూఢుండుడు సంగ -త్యాగా నందైక రతున్డతనికి, జనన సంయోగము, మృతి, దైన్యమ్మును -భోగా భోగ సుఖ దుఃఖములు లేవధిఅని చెప్పేస్తాడు. చాలా చోట్ల తపో యజ్ఞాల విశిష్టతను పాత్రల చేత చెప్పిస్తాడు. పరమేశ్వరుని "యజ్ఞాత్మక రూప, నిశ్చలా వ్యయ రూపా "అని సంబోదిస్తాడు. జనులందరికీ దానం, తపం, వృద్ధ సేవ అహింస నియతమైన పనులు అంటాడు. "యమ నియమ వికాసీ, వ్యాస చేతో నివాసీ అనీ, యమ నియమ వికాసీ జ్ఞాన గేహ ప్రదీప, దమ శమ కలితానంద ప్రకాశ స్వరూపా"అని పరమేశ్వరుని సంబోధించి, తన జితేన్ద్రియత్వాన్ని తెలియ జేస్తాడు తిక్కన.

ధర్మాధర్మ విదూర నీతి పర, విద్వచ్చిత్త,యోగీ""అపగత కామ రోష హృదయాంతర ఖేలన కల్య " వంటివి రాయటం వల్ల ఈ ద్వంద్వాలను దాటితే తప్ప, మానసిక శాంతి లభించదని, దాని వల్ల మాత్రమె పరబ్రహ్మ స్వరూప సిద్ధి కల్గుతుందని తెలియ జేస్తున్నాడు. "సకల నిగమ వేద్యా, ","వివృత నిగమ శాఖావిశ్రుతాగ్రైక వేద్యా ","ఉపనిషదగమ్యా,యోగ భావ్యైక రమ్యా "అని రాయటం వల్ల వేద, ఉపనిషత్తు లలోని వేదాంత భావన ల మీద గల పరమ పూజనీయ భావం వ్యక్తం అవుతుంది. ఈ జ్ఞానం వల్లనే భగవత్ స్వరూపం బోధ పడుతుందని సూచించాడు. పూర్వ మీమాంస లో ప్రతి పాదించిన వైదిక కర్మ కాండ చేత ఆకర్షింప బడిన తిక్కన మనస్తత్వం, శాంతి రచనా కాలం నాటికి ఎంతో ఉత్క్రుష్ట మైన మార్పు చెందుతుంది.

భగవత్ సంబోధన తో ఈ మార్పు స్పష్టం గా కన్పిస్తుంది. "ప్రకృతి పురుష యోగీ ",వికృతి రహిత మూర్తీ "--"సుస్థిరానంద వర్త్మా ",కేవల భావా నంద మయా ""భాస్వరానంద మార్గా "వంటి సంబోధన లతో తిక్కన -పరబ్రహ్మ తత్వాన్ని, బ్రహ్మా నందం తో ఆత్మా సాక్షాత్కారం గా అభేదం గా, చూపించాడు. మొహం నశించి, వివేకం పొంది, ఆత్మా దర్శనం పొందాలి అన్న భావాన్ని స్పష్టం చేశాడు. ఆత్మా సాక్షాత్కారమూ పొందాడు. దానికి --



దేహాభిమాన సంభ్రుత -మోహ తమో నిరసనాభి ముఖ భూరి వివేకా హీన మహా తత్వ స-మాహిత చిన్మాత్ర రూప మధురిమ సుభగా "అన్న పద్యమే సాక్షం. అసాధ్, సత విచారణ జ్ఞానం చేత మొహం పోయి, చిట్టా వికాసం పొందటమే పరమాత్మ స్వరూప సంధానం. ఇది లభించిన తర్వాతా భావ బంధ మోక్షమే తరువాయి. తిక్కన కూడా కవిత్వ దీక్ష తో, శబ్ద బ్రహ్మానుసంధానం పొంది, జ్ఞాన జ్యోతి స్వరూప మైన పరమాత్మ సాక్షాత్కారం పొంది భవ బంధ విమోచనం పొందాడు. అందుకే అన్నాడు -

కరుణ ఫల పరిత్యాగ వరతో దాత్త చేతః-పరిణత సుఖ పీత భ్రాజ మానా నతాంహో -

నిరసన చరనాబ్జో న్నిద్ర త రాజ మానా --నిరవధి పరినాహ నిర్భరానంద దేహ "

అనపేక్షిత ఫలతా శోభన మహనీయ క్రియా విపాకాత్మక రూపా -"అనే ఆయన చేసిన సంబోధనలు కర్మ యోగిత్వాన్ని సూచిస్తాయి. భారత రచన తో బాటు, తిక్కన హృదయమూ పరిణామం చెందుతూ వచ్చిందని మనకు తెలుస్తూనే ఉంది కదా. ఆధ్యాత్మిక పర్వాలు వ్రాసిన తిక్కన వేరు, ఇంద్రియాలను అరి కత్తి, అంతర్ముఖుడై, ప్రాణాయం తో ఆత్మా సాక్షాత్కారం పొంది నట్లు స్పష్టం గా కన్పిస్తుంది. -ఈ మార్పు -శాంతి, అనుశాసన పర్వాలలో స్పష్టం గా కానీ పిస్తుంది. ఆయన రచన విషయాన్ని బట్టి మారుతుంది. విరాట పర్వం నుండి యుద్ధం వరకు లౌకిక రచనకు ఉత్తమ ఆదర్శం గా తిక్కన రచన ఉదాహరణ గా నిలుస్తుంది. ఉదాత్త కావ్యలక్షణాలకు నిలయమైంది. శాంతి పర్వం నుండి స్వర్గారోహణం వరకు కవిత్వ రచన పరాకాష్ట చెంది, అలౌకిక వేద వాఙ్మయ స్వరూపం పొంది, తేజోమయమై, జ్ఞాన జ్యోతి గా భాసించింది.

త్రియుగ కమల వీధీ దీప్త సంచార లీలా --నియమిత పవనాత్మాగ్ని ప్రభా స్నిగ్ధ సంగా

సమయ వికచ మహాబ్జ స్వైర మాధ్వీక దారో --దయ మయ మధురాత్మా, దర్శితానంద వర్త్మా".

## మహాభారతం -మహా విజ్ఞాన సర్వస్వం

ప్రాచీన భారతీయుల విజ్ఞానాన్ని, నాగరకత ను తెలియ జేసే గొప్ప గ్రంధమే వ్యాస భారతం. మానవుల భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక జీవితం అంతా అందు లో ప్రతి బిమ్బించింది. సాధారణం గా ఏ సారస్వత మైనా మానవ జీవితానికి శబ్ద, వర్ణ చిత్రణే.నాగరకత, సాంఘిక వ్యవస్థ, సంస్కృతి ని వ్యక్తం చేసేది సాహిత్యం. లోక ధర్మ వృత్తి కోసం వ్యాసుడు రాయటం, కద లో ఉదాత్తత ఉండటం, ఆధ్యాత్మిక విషయ ప్రాధాన్యత, వల్ల మహా భారతం మహా విశిష్టమైంది. అంతరార్ధం గా ఆలోచిస్తే, సత్యాసత్యాలకు, ధర్మాదర్మాలకు, దైవ, రాక్షస భావాలకు జరిగే సంఘర్షణ మే దీని లోని ఇతి వృత్తం. వేద వాఙ్మయం లోను ఈ ద్వంద్వాల సంఘర్షణ ఉన్నా, భారతం లో అదిప్రధాన ఇతి వృత్తమైంది. పరమేశ్వరుని సర్వ శక్తిమత్వం, సర్వజ్ఞత్వం, సంచిత కర్మ పరి పాక ప్రాబల్యం, భారత కదా ఇతి వృత్తం గా ప్రత్యక్షమైంది. అంతే కాక, అన్ని వేద శాఖలకు చెందిన వైదిక వాఙ్మయ సర్వస్వం భారతం లో ప్రతి పాడించ బడింది. అందుకే భారతం వేద తుల్యమై, పంచమ వేదమయింది. వేదం శబ్దానికి ప్రాధాన్యం. భారతం అర్ధ ప్రాధాన్యం. లౌకిక మైన భారత కదా ఆధారం గా పరబ్రహ్మ స్వరూపాన్ని,, విధి ప్రభావం, లోకులకు తెలియ బఱచి, సత్య ధర్మాన్ని లోకం లో ప్రతిష్టించటమే భారత కర్త మహాదాశయం.



వేద సారం ప్రతి పాదించటం, ధర్మం, నీతి శాస్త్ర విషయాలు సులభం గా వివరించటం వల్ల భారతం స్మృతి గ్రంధం కూడా అయింది. పురాణ లక్షణాలు అన్నీ సమగ్రం గా ఉన్నాయి కనుక పురాణ సముచ్చయం అన్నారు. ఉపనిషత్ సారం ప్రతి పాదింప బడింది కనుక వేదాంత గ్రంధమైంది. ఇక వ్రాసిన వాడో -"వ్యాసో నారాయనో హరిహ్ "అని పిలువ బడే విష్ణు అంశ సంభూతుడైన కృష్ణ ద్వైపాయన మహర్షి. ఆయనే మహాముని, విజ్ఞాన వేత్త కావటం వల్ల ఆ రచనకు ఉదాత్తత లభించింది. మహాభారత కదా కాలం నాటికి ఆర్యులు దేశం లో చాలాభాగం విస్తరించారు. ఆర్య, అనార్య సంమేనలం కూడా జరిగి, అనేక వ్యవహారాలూ, కట్టుబాట్లు ఏర్పడ్డాయి. ఐహికం పై ఆసక్తి పెరిగి, ఆముష్మిక భావం క్రమంగా తగ్గింది. దానితో సంఘం లో న్యాయ ధర్మాలు క్షీణించాయి. అధర్మ పరాయణమే మహా భారత యుద్ధం. తాను భారత యుద్ధాన్ని ప్రత్యక్షం గా చూశాడు కనుక, వ్యాసుడు ఆ కధను ధర్మ ప్రచారానికి, సంఘ ఉద్ధరణకు చక్కగా ఉపయోగించు కొన్నాడు. సంఘాన్ని, వేద మత సూత్రాలకు అనుసంధించాలని భావించాడు. ఆర్య విజ్ఞాన సర్వస్వాన్ని ప్రజల ముందు ఉంచాలని తహ తహ లాడాడు. జనానికి అందు బాటు లేని వేదాంత ధర్మాలనన్నిటిని అందుబాటు లోకి తేవాలని భావించాడు. భారత కదన్యాయం గా 24000 శ్లోకాలు మాత్రమె. తన ఆశయం నేర వేర్చటానికి, ఆధ్యాత్మిక రహస్యాలు అందించ టానికి మూడు రెట్లు పెరిగి లక్ష శ్లోకాలతో విస్తృతమైంది. ఇందులో కొంత ప్రక్షిప్తత కూడా ఉంది. అందుకే బారతాన్ని "సంహిత "అన్నారు.

ఆదర్శ ధర్మ వీరుడు అయిన శ్రీ రాముని చరిత్ర ను కావ్య రూపం గా వ్రాయటం ఆదికవి వాల్మీకి ఆశయం. సీతా రాముల చరిత్ర మనకు ఆశయం, ఆదర్శం. రామాయణ పఠనంవల్ల నీతి, ధర్మం కలిగినా ప్రత్యక్షం గా సాత్విక మానసిక వికాసం, సద్యః పర నివృత్తి కలుగుతాయి. కనుక రామాయణం కావ్యం అయింది. వ్యాసుని ఆశయం సంఘ సంస్కరణ. కనుక రచన కావ్య రచన కంటే విశిష్ట మైంది. భారతం శాంతి రస ప్రధానం. నాయకుడు శ్రీ కృష్ణుడు. రచన లో రసోత్కార్శ కంటే అర్ధ గౌరవానికి ప్రాధాన్యత కల్గింది. పాండవ ఇతి వృత్తం ఆధారంగా వ్యాసమహర్షి తన ఆశయాన్ని నేర వెర్చు కొన్నాడు. కనుక భారతం కావ్యమే కాదు -శాస్త్రం కూడా అయింది. ఇతి వృత్తం లౌకికం. దాని ద్వారా ప్రతి పాదించింది ఆధ్యాత్మికం కనుక లోక కల్యాణానికి మార్గమైంది.

"కమనీయ ధర్మార్ధ కామ మోక్షములకు నత్యంత సాధనం బైన దాని "అన్నాడు తిక్కన. "ఆయుష్యమ్బితి హాస వస్తు సముదాయంబైహికాముష్మిక శ్రేయః ప్రాప్తి నిమిత్త ముత్తమ సభా సేవ్యమ్ము, లోకాగమ న్యాయైకాంత గృహంబు, నాబరగి, నానా వేదాంత విద్యా యుక్తంబగు దాని చెప్ప దోడగెం దద్భారతాఖ్యానమున్ "

మహాభారత ఆంధ్రీ కారణం కూడా లోక హితం కోసమే ప్రారంభమైంది. రాజరాజ కాలం నాటికి మత కల్లోలం హెచ్చుగా ఉంది. జైన బౌద్ధ మత వ్యాప్తి పెరిగి, వేద ప్రామాణ్యం తిరస్కరింప బడింది. చార్వాకం పెరిగింది. ఆర్య ధర్మం వెనకడుగు వేసింది. నిరీశ్వరవాదం వైపు ఆకర్షణ వల్ల ఐకమత్యం దెబ్బతింది. సంఘ పటిష్టత కోల్పోయింది. ఆ సమయం లో సంఘాన్ని ఉద్ధరించ టికి కుమారిలభట్టు కంకణం కట్టుకొన్నాడు. పూర్వ

మీమాంస కు ప్రాధాన్యం తెచ్చాడు. దానితో మళ్ళీ యజ్న యాగాదులు ఆదరణ పొందాయి. ఆర్యమతం మళ్ళీ పునరుద్ధానమైంది. వర్ణాశ్రమ ధర్మాలకు నిలయమై, సకల ధర్మాలకు ఆలవాలమై, మహాభారత సారం అయిన భారతాన్ని ఆంధ్రీకరించి ప్రచారం చేయ వలసినది గా రాజ రాజు నన్నయ భట్టారకుని కోరాడు. కనుక ఇక్కడ కూడా "లోక సంగ్రహేచ్చ "కారణం అయింది..



తిక్కన కాలం లో చార్వాకం వెనుకడుగు వేసినా, జనం ఇంకా ప్రాబల్యం లో ఉంది. సోమనాదుడు మొదలైన వారి వల్ల వీర శైవం వెర్రి తలలు వేసి, మత కలహాలకు ఆజ్యం పోసింది. శైవ, వైష్ణవాల వల్ల కొత్త తెగలేర్పడ్డాయి. మార్గ దర్శకులు కావలసిన కవులలో మత భేదాలేర్పడ్డాయి. శివకవులు భావి కవులను నిరశించే వారు. ఈక్లిష్ట పరిస్థితులలో తిక్కన మహా కవి భారత రచన చేయ సంకల్పించి సంఘ సంస్కరణ చేశాడు. బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులు పరబ్రహ్మ అంశాలుగా వాళ్ళు చేసే పని సృష్టి, స్థితి, లయాలు సగునాత్మక మైన పరబ్రహ్మ లీలలుగా తెలియ జేశాడు. కనుక పరమాత్మ భిన్న స్వరూపాలే అవి అని తెలియ జెప్పటా నికి "హరి హరైక మూర్తి "ని ఇష్ట దైవం గా భావించి తన భారతాన్ని ఆయనకు అంకితమిచ్చాడు. తిక్కన తర్వాతా నాచన సోముడు, కేతన, ఈ మార్గాన్నే అనుసరించారు. కొరవి గోప రాజు కూడా జత కలిశాడు. తరువాత వచ్చిన శైవ, వైష్ణవ కవులు పరదూషణ మానారు. సహనం వహించారు. తిక్కన -శివ కేశవులకు అభేదాన్ని చూపించటమే కాదు అద్వైతాన్ని బోధించి, జీవాత్మ పరమాత్మ ఐక్యాన్ని చూపాడు.

ఆంధ్ర దేశమంతా ఏక మత సూత్ర బద్ధం చేశాడు. అందుకే ఆంధ్ర దేశం లో అద్వైతానికి అధిక ఆదరణ లభించింది. జాను తెనుగు కు తిక్కన పట్టం కట్టాడు. ఎర్రన కూడా ఇదే మార్గాన్ని అనుసరించాడు. ఈ విధం గా భారత రచనకు, ఆంధ్రీకరణకు కవిత్రయం సమానమైన ప్రయోజనం కల్పించారు. అంచమ వేదం ధర్మ శాస్త్రం అని పిలువా బడే భారతాన్ని తెనుగు చేయటానికి రుషి వంటి నన్నయ, తిక్కన, ఎర్రన లు లభించటం లౌకిక తత్త్వం దాటి ఆధ్యాత్మికత్వం అందుకోండి భారతం. రాజాశ్రయం లో ఉన్నా, అంతరంగం ఆముష్మికం వైపు ప్రసరించింది ఈ ముగ్గురు మహా కవుల్లో. భారత రచన వల్ల భావ బంధ విమోచానమే వీరూ ఆశించారు.

"భారత భారతీ శుభ గభస్తి చయమ్ముల జేసి, ఘోర సం --సార వికార, సంతమాస జాల విజ్రుమ్భము వాపి, సూరి, చే

తో రుచి రాబ్జ బోధనా రతుం డగుదివ్య పరాశారాత్మజాం --భోరుహ మిత్రు గొల్చి " అని నన్నయ గారు పేర్కొనటం గమనార్హం.. తిక్కన కూడా "ఇంకా జన్మాంతర దుఃఖ ముల, తొలగు నట్లు జేసి, సుఖాత్ము జేయవే "అని హరి హరుడిని ప్రార్ధించాడు. అప్పుడు ఆ జగన్నాధుడు -"జనన మర్నాడు లైన సంసార దురిత --ములకు, నగ పడ కుండంగగాను దోలగు తెరవు--గను వెలుంగు నీ కిచ్చితి ననిన లేచి --నిలిచి సంతోష మెద నిండ నెలవు కొనగ " తిక్కన మేల్కాంచాడు. కనుక తిక్కన గారి ఆశయమూ భావ బంధ మోక్షమే. అంతే కాక, తన ఆశయాన్ని ఇలా తెలియ జేస్తాడు కవిబ్రహ్మ -

"కావున భారతామృతము కర్ణ పుటంబుల నారగ్రోలి, యాం --ధ్రావలి మొదముంబోరయు నట్లు గ, సాత్యవతేయ సంస్మృతి

శ్రీ విభవాస్పదంబయిన చిత్తము తోడ మహా కవిత్వ దీ --క్షా విధి నొంది, పద్యముల గద్యములన్ రాచి యించేదన్ గృతుల్"

తిక్కన గారు వాడిన అమృత శబ్దం పరబ్రహ్మనే తెలుపు తుంది. భారతామృతం అంటే పరబ్రహ్మ తో అభేదాన్ని సూచిస్తుంది. పరబ్రహ్మ జ్ఞానం -మననం అనే యోగం తో లభిస్తుంది. అంటే భారత ఆఖ్యానాలను వినటం తో ఆనందం సిద్ధిస్తుంది అని, విశిష్టమైన అర్ధం గా కవి బ్రహ్మ వాక్కు.

పరబ్రహ్మ సాక్షాత్కారం విద్య వల్లనే సాధిస్తారు. అలాగే భారత రచన తనకూ తన జాతికీ నిత్య శ్రేయాన్ని కల్గించాలని తిక్కన గారి పరమ ఉదాత్తమైన ఆశయం. నిత్య మోక్షాన్ని కోరాడు కనుక భారత ఆమ్నాయ కర్మ నిర్వహణలో యోగి అయాడు. యోగుల లాగే సంయమనాన్ని పొందాడు. అల్పాక్షరాలలో అనల్పార్ధం, వ్యంగ్య వైభవం, గాంభీర్య గుణ ప్రధానం గల పాత్ర శీల చిత్రణ, అలంకార వ్యామోహం వదిలి సహజ రమ్యత, అర్ధ గౌరవం చేత కల్పించటం కవిత్రయ రచన ప్రధాన గుణం. ఇంతటి సంయమనం తరువాతి కవుల్లో కన్పించదు. ఇంతటి సంయమనం, లోక హితం కోరే కవులు లేక పోవటం వల్లనే భారతానికి దగ్గర గా రా గల్గిన రచన తెలుగు సాహిత్యం లో ఇంత వరకు రాలేదు. లోక కళ్యాణ ప్రతిపాదిక మహా కావ్యం కనుక భారతం ఆంధ్రుల విజ్ఞాన సర్వస్వమైంది. ఆంధ్రుల జాతీయ జీవిత సర్వస్వం అయింది. డాంటేరాసిన "డివైన్ కామెడి "ఇటాలియన్లకు, హోమర్ రాసిన "ఇలియడ్ 'గ్రీకులకు, మిల్టన్ రాసిన "పారడైజ్ లాస్ట్ "ఆంగ్లేయులకు వారి వారి జాతీయ జీవిత సర్వస్వాలు. ఉత్కృష్టమైన సారస్వతాన్ని నిర్మించి, స్వార్ధ రహితులై, విజ్ఞాన వ్యాప్తి చేసి, లోక హితం చేసిన మహనీయులే నిజమైన జాతీయ నాయకులు అని పాశ్చాత్య మతం. ఆ దేశాలలో సాహిత్య స్రష్టలకు అనన్య గౌరవం ఉండటం మహదానందం గా ఉండటమే కాదు అందరికి ఆదర్శం, అనుసరణీయం కూడా.

## విరాట పర్వం లో తిక్కన విరాట్ స్వరూపం

"హృదయాహ్లాది చతుర్ధ మూర్జిత కదో పేతంబు -నానా రసాభ్యుదాయో ల్లాసి విరాట పర్వము "అని తిక్కనే విరాట పర్వం ప్రబంధ రచనకు అనుకూలం అనే విషయాన్ని ముందే చెప్పాడు. ఇందులో కద మన జీవితానికి చాలా దగ్గర. వీర శృంగార రస పోషణకు అనువు కనుక హృదయాహ్లాది అయింది. అనేక సన్నివేశాలలో వ్యక్తుల ప్రవర్తన, నిజ శీల స్వభావాలు బాగా వ్యక్తమయాయి. లౌకిక జీవితం బాగా ప్రతి బిమ్బించింది. కీచక వధ, ఉత్తర గోగ్రహణం, అభిమన్యు వివాహం దీని లో ముఖ్య ఘట్టాలు. మొదటి దానిలో వీర, రౌద్ర రసాలు, రెండవ దానిలో వీర హాస్యాలు, చివర లో లలిత శృంగారం వర్ణితాలు.



కీచక వధ ను ప్రబంధం గా రచించాడు తిక్కన. అసహాయ స్తితి లోని స్త్రీకి జరిగే అవమానం, షీలా రక్షణ కై ఆమె ప్రయత్నం, దాని ద్వారా వివిధ పరిణామాలు లోక సామాన్యమైనవి కనుక ఇతి వ్రుఉట్టాం సహజ ఆకర్షణ ను పొందింది. పరులను ఆశ్రయించటం అందులోను రాజాశ్రయం లో పాండవుల కష్టాలు, విరాట నగర జీవితానికి అద్దం పడతాయి. విరాటుని వినోదం కోసం భీముడు మల్లులతోనే కాదు, సింహాలతో కూడా పోరాడా వలసి రావటం దాసీ కనుక రాణి సుధేష్ణ చెప్పినట్లు చేయ వలసిన దీన స్తితి లో ద్రౌపది ఉండటం, తన అభి ప్రాయాన్ని కాదన్నాడని విరాట రాజు ధర్మ రాజుని పాచిక తో కొట్టి అవమానించటం, పాండవుల పట్ల సాను భూతి చూపే ఘట్టాలు. దీని కంతటికీ కారణం ధర్మ రాజు ద్యూతం. దాని ఫలితం గా పొందిన దాస్యం. అందుకే బలవంతులైనా, నిస్సహాయ స్తితి. సామాన్య మానవులలో కనీ పించే స్త్రీ లోలత కీచకుని లో ప్రతి బిమ్బించింది. యుక్తాయుక్తత లోపిస్తే, కలిగే పరిణామం ఇదే అని అందరికి హెచ్చరిక. కామక్రోదాదులు కీచక వృత్తాంతం కనుక రచనను ప్రబంధ ప్రక్రియ లో నడిపాడు. ఉద్యానవన, సూర్యోదయ, అస్తమయ వర్ణనలు తరువాత ప్రబంధ రీతి కి

మార్గ దర్శనాలైనాయి. వీటిని ఎర్రన, సోమనాధుడు స్వీకరించారు. శ్రీ నాధుడు పోషించాడు. రాయల కాలం లో పరి పక్వ స్తితిని ప్రబంధం పొందింది.



"నీరజాకరములు నిష్ఠమై జేసినా భవ్య తపంబున ఫలమనంగ - దివస ముఖాభి నందిత చక్ర యుగ్మకంబు ల యనురాగంపు బ్రోవనంగ--హరిహరబ్రహ్మ మహానుభావంబులోక్కోటి గాగ గరగిన గటిక యనగనతుల వేదత్రయ లతి కా చయము పెను పొంద బుట్టెడు మూల కందమనగ --నఖిల జగముల కందేర యగుచు జనసమాజ కరపుట హృదయ సరోజములకు - ముకులనంబును జ్రుమ్భనంబును నొనర్చి -భాను బిమ్బంబు పూర్వాద్రి పై వెలింగె "- --భవ్య తపః ఫలమైన పరంజ్యోతి స్వరూపం విశుద్ధ ప్రేమ పరిణామ మైన రస స్తితి, హరి హర బ్రహ్మైక్య జ్ఞాన మూర్తి, వేదత్రయ జన్మ కారణ మైన అర్బ్రహ్మ స్వరూపం - లోకాతీతత, అలౌకిక ఉపమానాలలో వర్ణన చేయటం వల్ల రచన ఉదాత్త స్తితి పొందింది. మనోహరం గా అని పించాతమే కాదు సౌర్యుని పరబ్రహ్మ మూర్తి గా ప్రతి పాడించి వేద ధర్మాన్ని నిరూపించాడు తిక్కన. సూర్యభగవానుడు చైతన్య దాత అని, జ్ఞాన ప్రదాత అని "కందేర "అనే ఒక్క మాటలో నిక్షిప్తం చేశాడు. అలాంటి పరబ్రహ్మ మైన సూర్య దర్శనం హృదయ వికాసం కలిగిస్తుంది అనటం లో సందేహమే లేదు. ఉపమానాలు అతి పవిత్ర మైనవి కనుక ఉదాత్త కవితా తత్త్వం ఆవిష్కారమైంది. సూర్యాస్తమాయ వర్ణన కూడా భావనా చమత్కారం తో రాశాడు. సూర్యుడు పశ్చిమ దిశా చేరగానే, అది సాన్ధ్యారున రంజితం అయిందట భర్త వస్తే. భార్య కు రాగ రంజితం అయినట్లు.

"ఇనుడు తన కడకు నేతేంచిన రాగము బొందుటదియుచిత మనగా --గెంపున మేరసి పస్చిమాశాన్గన జన సంభావముల గారవ మందెన్ "ఇనుడు అంటే సూర్యుడు భర్త అని అర్ధాలు. రాగం అంటే ఎరుపు అనురాగం -అర్ధ శ్లేష తో గొప్ప చమత్కారం చేశాడు. భర్త విరహం లో ఉన్న పశ్చిమ దిశా కు భర్త సమాగమం -అందుచేత ఆమె లోక సంభవ నీయు రాలు అయిందట. కుల కాంతకు దక్కే గౌరవం దక్కిందట. ఈ విధం గా ప్రకృతి వర్ణన సహజా లంకార చమత్కారం తో హృదయ వికాసం కల్గిస్తాడు తిక్కన.

కీచకుని కామ వృత్తికి అనుగుణం గా వనం లోని పక్షుల విహారం ను అతి సుకుమారం గా పోషించాడు -

"ఇంపైన ప్రియ కాన నిచ్చి, నిల్చిన మధు-వాడట నాను మత్తాలి విభుని --జెట్టు పల్పచారింప చుట్టూ గ్రుమ్మరి మనోరమ నియ్య కొలుపు మరాల విభుని --ఫలరస మొన్దొంటి కెలమి జన్నుల నిచ్చు -మెయిన జొక్కెడు శుక మిదునములకు -గామి బాసి తలిరు జొంపమునకు

మెయి మెయి -దాకంగా జానూ పిక దంపతులును "--ఇదీ ప్రతి అంగుళం లోను కన్పించిన ప్రకృతి. "కామీ స్వతాం పశ్యతి "అన్నట్లు, అంతటా కీచాకుడికి అలాసే కన్పించింది. అతని లోపలి భావాలకు ఉద్రేక పరచటానికి ప్రకృతి బాగా దోహదం చేసింది. అందుకే "తనువు నింద్రియములు, మనము ధృతి యు దన వశంబు గాక -తల్లాడ పది సింహబలుడు విషము బాణు బారి బారే "అన్నాడు. సింహం వంటి బల వంతుడు కూడా కామం లో పిల్లి అయి పోయాడు. అలా కామోద్రేకం తో రోజంతా దహించుకు పోయాడు. సైరంధ్రి చేసిన సంకేతం కూడా అందు కో లేని మూఢత్వం వాడిని ఆవ హించింది.. రాత్రి నర్తన శాల కు చేరాడు. ఎలా ?"స్వాంతము బాహుగర్వ ఘన సం,తమ సాంధము గాగ -శంక యొ క్కింతయు లేక -కీచకుడహంక్రుతి ముంగలి గాగ మండవాభ్యన్తర భూమి "చేరాడు. కామాతురునికి లజ్జా భయము ఉండవు కదా. ఇలా కామంధుని చిట్టా వృత్తిని సాక్షాత్కరింప జేసి మన ముందు కీచకుణ్ణి ఉంచాడు తిక్కన.

ఇప్పుడు భీముని రంగ ప్రవేశం చేయిస్తున్నాడు తిక్కన కవి.. లోకజ్ఞత, ఔచిత్యం నిండిన రచన మనకిన్డులో కన్పిస్తుంది -

"గమనము వీక, పేరొక వికారము పుట్టాక, సంగారోత్సవో --ద్యమ రభసాతి రేకము బయల్పడుటిన్చుక లేక రోష సం

భ్రమ మొక ఇంత యైన బరభావ నిరూప్యము గాక, ద్రౌపదీ --రమణుడు వోయి, విక్రమ దురంధరతం దగ నాట్య శాలకున్ "-

భీముడు జాగ్రత్త గా అన్ని వైపులా చూసుకొంటూ, తన బాల పరాక్రమాలు ఒప్పగా మద మత్త గజం లాగా సదృశ గతి "లో ప్రవేశించాడు. ఇక్కడ కీచక భీములలో ప్రవర్తనా వైవిధ్యం కన్పిస్తుంది. మదాన్దుడై అనుమానం లేకుండా, అహంకారమే ఆయుధం గా ప్రవేశించాడు కీచకుడు. నిర్వికార గామ్భీర్యాలతో ఆత్మ నిగ్రహం కోల్పోకుండా, తన బాహా గర్వమే ఆయుధం గా భీముడు ప్రవేశించాడు.అనుమానం లేకుండా కీచకుడు వస్తే, భీముడు వివేకం తో పరిసరాలను అన్నిటిని పరిశీలిస్తూ వచ్చాడు. బయట పడితే పాండవ రహస్యం బట్టబయలు అవుతుందేమో నసే అనుమానం భీముడిది. కనుక యుక్తా యుక్త విచక్షణ తో వచ్చాడు. ఇలా పాత్ర పోషణ లో స్వభావ వ్యక్తీకరణ లో తిక్కన తన సిద్ధ హస్తాన్ని చూపిస్తాడు.



రతి అసే సాత్విక భావం ఇరువైపులా నిష్టం అయితేసే శృంగారం గా అది పరిణమిస్తుంది. వీర రసానికి ఉత్సాహం కావాలి. అందుకే ద్రౌపది కీచక వధ తర్వాతా భీముడిని "మన వారి లోన నొక్కని బిల్వక -ఉత్సాహంబు చేసిన సాహసాన్ని "ప్రశంసించింది. ఆ ఉత్సాహాన్ని వీరం గా మార్చిందిభీముడిలో. అందుకే కీచక పీచాన్ని అతి భీకరం గా అణచాడు.ద్రౌపది పరాభవాన్ని స్వయం గా చూశాడు కనుక భీముడి లో రౌద్రం మూర్తీభ వించింది. తన భార్య యెడ కామంతో ప్రవర్తించి నందుకు వాడి కళ్ళను, అతిగా ప్రేలి నందుకు ముఖాన్ని, పతివ్రత ఇు వెంటాడి జుట్టుపట్టుకొన్న కాళ్ళు, చేతుల్ని ఇంకా ఏమీ చేయలేని స్తితి లో ఇతరులు చూడ టానికి వీలు లేకుండా, రూపం చేదేట్లు, శరీరం లోకి తోసి, కీచక దేహాన్ని ఒక మాసపు ముద్దగా మారిస్తే తప్ప భీముడికి తృప్తి కలుగ లేదు. ఇది మనకు అమానుష వధ అని పిస్తుంది. ఉపకీచాకుల్ని చంపటం లోను రౌద్రం బాగా విజ్రుమ్భించింది. "వికృతపు జావు నంప మది పేడుక పుట్టిన గిట్టి పట్టి మా -శతకమును బీనా దీర్ఘ భుజ శాఖలు బాదయుగంబు మేనిలో --నికి జొర, నుగ్గు గా దురిమి, నించిన గ్రంథాల తిత్తియైన కీ -చాకు ధరణీ స్తలిం జదిపి చక్కని ముద్దగ జేసే దుష్టుడై "-ఉపకీచాకుల్ని చంపే ఘట్టం లో -

"వికట భ్రుకుటి ఘోర ఫాల కలిత స్వేదోద్భాతుమ్మున్ -చలక్రుతోష్ట ద్వాయుడం -బ్రమర్దన దశావిర్భావ సంభావితాం -గకుండు ని --బాకా విధ్వంసకుడ య్యె డన్నిలచే --శుమ్భంమూర్తి విస్ఫూర్తి తోన్"--ఏఏ వృత్తాంతం అంతా మనం చూసే సంఘటన ఆ అతి సన్నిహితం గా కన్పిస్తుంది. దీనిని తిక్కన మనోహరంగా, రసవత్తరం గా, రచించటం వల్ల పండితులను, విమర్శకులను ఆకట్టు కొన్నది.

## ఉత్తర గోగ్రహణం

ఉత్తర గోగ్రహణం వీర రస ప్రధానం. భావి భారత యుద్ధానికి ప్రాతిపదిక. తాను చేయబోయే విశిష్ట రచనకు ఉపక్రమణిక. అర్జునుని కోదండం నుంచి సూర్య కిరణాలు యెడ తెరిపి లేకుండా వెలువడుతున్నాయి. అన్ని వైపులా నుంచి వచ్చి కౌరవ సైన్యాన్ని ముంచి వేస్తున్నాయి. అవధి లేని బాణ ప్రయోగం -విక్రమంతో తేజో మూర్తి అయిన అర్జున మూర్తి అచ్చ తేజో మాయ మైన మార్తాన్డుని లా ఉన్నాడట. సమగ్రమైన అర్ధ స్పోరక మైన ఉపమానాలు తిక్కన గారి ప్రత్యేకత.

''ఒక మాత్రన్, వితత ప్రసార నిబిదాదిటయు గ్రాస్త్ర సంతా నముల్ -సకలానీఎకము లందు బర్వ, నరు భాస్వన్మూర్తిదీ-ప్తికలాపంబులు, లోక మంతతను, విస్తీర్ణంబులై,యోగ ప-ద్యక్రుత వ్యాప్తి వెలుంగునొప్పెసగు మార్తాండు న్విడంబించుచున్ "---అంతే కాదు -అల్లెత్రాడు, పిడికిలి, ధనుస్సు, హస్తం, వీటన్నిటి లో, ఒకే విదం గా, బాణాలు తమంత తాము భయంకరం గా వెలువడి, శత్రువులను తీవ్రం గా గాయ పరుస్తున్నాయత. తేనే తుట్టె నుంచి ఒక్క సారిగా పైకి ఎగిరే తేనే టీ గల్లాగా వస్తున్నాయి బాణాలు. అంత సహజ సుందర వర్ణన చేయటం తిక్క యజ్వ ప్రత్యేకత.

కర్ణుని ప్రయత్నాలను కూడా అంతే సహజం గా వర్ణిస్తాడు. మనస్సు లోని రోషమే రూపం దాల్చి నట్లు బాణాలు కురిపిస్తునాడు కర్ణుడు. అవి జ్వాలా పరంపర చేత విజ్రుమ్భించే భయంకరాగ్ని లా ఉందట. వీటిని అర్జుండు అనే మేఘం, వర్ష ధారా లానే బాణాలతో చల్లార్చాడు. "అర్క తనూభవా గ్ని కి లోపల ఉన్న రోషమే భీకర స్వరూపం -కాంతి వంత మైన కేతువే శిఖా జ్వాల, ప్రకాష వంత మైన షరా పరంపరాలే కీలలు. అలాగే అర్జునాంబు దానికి ఉజ్వల పతాక మెరుపు తీగ, రాధానేమి ధ్వని గర్జం, బాణ పరంపరలు వర్ష దారాలు, వర్ష వ్యాపారం తో అగ్ని అణగి నట్లు కర్ణుని విజ్రుమ్భన అర్జునుని పరాక్రమం తో అణగారింది. సైనికుల ముఖం అనే పద్మాలు కాంతి హీన మైనాయి. అందుకని కౌరవ సేన అనే సరోవరం దీనమై పోయింది. ఇక్కడ విశేషాలు తెలుసు కొందాం -కర్ణుడు పద్మ బాంధవుడు అంటే సూర్యుని వంశ సంభూతుడు. అర్జున మేఘా వరణం తో నిస్తేజుడు అవటం వల్ల సైనిక ముఖ పద్మాలు కాంతి తప్పాయి. చక్కని ఉపమానాలు తో యుద్ధ స్తితి ని వర్ణించాడు. సూర్యుడు, అగ్ని అభిన్నులు. అర్క అంటే సూర్యుడు అగ్ని అనే రెండు అర్ధాలు ఉన్నాయి. అర్క తనూభావుడైన కర్ణుని, అగ్ని తో పోల్చటం చాలా ఉచితం గా ఉంది. తనూభవ శబ్దం విశిష్టమైన ప్రయోగం. అగ్ని జ్వాలలు తాప హేతువులు. అలాగే కర్ణుని బాణాలు సంతాప కారణాలు. అర్జునుడు ఇంద్రుని కుమారుడు. మేఘం తో అభేదం. అర్జున శబ్దానికి ఇంద్ర, అర్జున అనే అర్ధాలున్నాయి. అర్జున పతాకం దివ్యమైనది. అందుకే మేఘం లోని విద్యుత్ తో పోల్చాడు. కర్ణుని బాణాలు లోకానికి అనర్దాలు. అర్జునుడు ధర్మ యుద్ధ తత్పరుడు. కనుక బాణాలు లోక హితాన్ని చేకూర్చే తాపాన్ని అణగించేవి. ఇంత ఉదాత్తం గా చిత్రించటం తిక్కనే సాధ్యం అని పించు కొన్నాడు. --



"రోషంబు భీషణ రూపమై చేలువొంద, నతుల కేతువు శిఖయై వెలుంగ -శరజాలములు పటు జ్వాలలై నిగుడ, నరక తనూభవాగ్ని ప్రజ్వరిల్లు -నుద్ధతి సైపక యుజ్వల దివ్య పతాక, మేరుంగుగా, దళిత ధోరణి -రాధానేమి రావము, గర్జనము గ, శర పరంపరలు ధారలుగాగ బరగి యడరె అర్జునామ్బుడంబు అనన్య సామాన్య సముదయమ మున,ముఖ పయోరుహముల -

కాంతి దరాగి యపుడు కౌరవ సేనా సరోవరంబు దీన భావ మొంద " ఇదీ తిక్కన గారి రస పట్టు. సహృదయ ఉల్లాసం. నమోస్తు తిక్కన కవీశ్వరా !

## ఉత్తరాభి మన్యుల వివాహం



విరాట పర్వం చివర వచ్చే ఉత్తరాభి మన్యుల వివాహ వర్ణన పరమ పవిత్రమై, లలిత శృంగార బంధురమై ఆదర్శం గా నిలిచింది. సరస మైన రచన. రూపం, వయస్సు, విద్యా, వంశం మొదలైన వాటిలో వారిద్దరూ సములు. లోకోత్తర మైన ఆ వివాహాన్ని తన మధుర కవిత్వం తో శబ్దమయ సుందరం చేశారు మహా కవి తిక్కన సోమయాజులు. సిగ్గుతో, ముగ్ధత్వం తో, వినమ్రం గా ఉన్న పెళ్ళికూతురు ఇంత వరకు తాను చూడని తన మనో వల్లభుడిని ఓర చూపులతో చూస్తోందట. అభిమన్యుడు కూడా, పెద్దల సమక్షం లో నేరుగా ఆమె ను చూడ లేక, ఇప్పుడు బాగా చూస్తున్నాడట. నూత్న వధూవరుల శృంగార చేష్టలు ఎంతో స్వాభావికం గా కవి వర్ణిస్తాడు. మనకు మానసిక ఆహ్లాదాన్ని అందిస్తాడు -

"లలిత తనూ విలాసముల, లజ్జ కతంబున జేసి, మున్ను, వి --చ్చల విడి బట్టగా నేరవు సాలక, యోరలు వారు చూపులన్ --లలీ దలబ్రాలు, వోయునేడలం,దగ ఒందిన నూలు కొల్పియి --మ్ములజరింతు రొండొరుల మోహన మూర్తులపై వదూవరుల్ "ప్రతి పెండ్లి లోను మనం చూసే దృశ్యమే ఇది. తలంబ్రాల సంబరం లో ప్రకృతి సౌందర్యాన్ని, దాని లోని లాలిత్యాన్ని, వధూ వరులకు తిక్కన ఆపాదించాడు. -

"ఒండొరుల దోయిళుల నిను పెంపొంద జేయు --నక్షత ప్రకరంబుల న్యేన్య మస్త -కముల బోసిరి మందార కల్ప లతలు -విరుల గమియ నొండొంటి పై గురియు నట్లు "--వధువు అయిన ఉత్తర ను లతగా, అభి మన్యుని మందార చెట్టు లా వర్ణించటం కవి సమయం అంటారు.



ఆలంబన లేక పోతే తీగ రాణించదు. లాలిత్య, కోమలత్వాలు ఆశ్రయం తో ఉదాత్త జీవితం లత కు స్త్రీ కి సహజం. ఆశ్రయత్వ, సుస్థిరత్వాలు వృక్షం లో, పురుషుని లో సమానం. ఆ లతా ప్రసూనాలు, తాను ఆశ్రయించిన మందారం పై రాలటం, మందారాలు లత పై పడటం సహజం. ఇది స్వభావ సిద్ధ ప్రకృతి మనోహర దృశ్యం. ఈ విధం గా రూప, రేఖా విలాసాలను వారి అనుకూల దాంపత్యాన్ని ధ్వనింప జేస్తోంది. వివాహం పూర్తీ అయింది. వధూ వరులు ఇద్దరు ఒకే ఆసనం పై కూర్చున్నారు. ఒకే చోట, పరస్పర సంయోగం లో శోభించే నవమాలికా చూత వృక్షాలతో వారిద్దరిని పోలుస్తాడు కవితిక్కన. సహజ కోమల, సుకుమార, లాలిత్య, ప్రధానం తో ఉత్తర సౌందర్యానికి, బాహు వీర్య, శౌర్య, స్థైర్య, గాంభీర్య గుణ ప్రధానమైన అభి మన్యు సౌందర్యానికి వివాహానికి తగిన సంయోగం లభించింది. పాణి గ్రహణం తర్వాతపూర్వం లేని ఒక కొత్త కాంతి, విలక్షణతేజస్సు లభించి, మనోహరం గా కన్పించారు. ఇది మనందరికీ జీవిత అనుభవమే. ఆ అనుభవాన్ని మనోహర రూప చిత్రణ చేశాడు కవి బ్రహ్మ. --

"పెను గదుట నిడిన చూతం--బును నవ మాలిక యు బోలె బోలు పొంది, రతండును, నమ్ముగ్ధయు నేకా --సనమున నున్నపుడు నూత్న సౌభాగ్యమునన్ "పాణి గ్రహణాన్ని కూడా తగిన విషయాలతో సరసంగా వర్ణించాడు -

"చిత్తమున గాఢ రాగంబు చేత జూపు -తెరగు దోప గేమ్మోరేడు తీగ బోడి --మృదుల పాణి గుమారుండు మెలపు మై,గ్ర -హించే పల్లవాలంభి మత్తేభ లీల "--ఇందులో నోకు చూద్దాం -అభి మన్యుడు ఉత్తర పాణిని అంటే సుకుమార మైన చేతిని, మత్తేభం అంటే మదించిన ఏనుగు -చిగురాకులమీద ఉన్న ఆసక్తి తో. వృక్షం పై భాగం మీద నుండి సుకుమారం గా తొండం తో గ్రహించి నట్లు గ్రహించాడట. మార్దవం, కోమలం, రక్తిమ అంటే ఎర్రదనం కిసలయాల అంటే చిగురు టాకుల ప్రధాన ధర్మం. అలాంటి కోమల హస్తాన్నిగ్రహించాడు అభి. అంటే ఉత్తర సమగ్ర సౌందర్య దర్శనం చేయించాడు. అభిమన్యుడు గాంభీర్యం గా, అనురాగం తో, నాగరకత తో, ఆమెను గ్రహించాడు. ఇది లోకోత్తర భావన. ఆమె తన లోని గాఢాను రక్తి ని చేతి రక్తిమతో అంటే ఎర్రదనం తో వెల్లడి చేస్తోంది. అలంకార భాష లో కూడా శృంగార రసం రంగు ఎరుపు. కనుక మనస్సు లోని అనురాగం, చేతి లోని, సహజ రక్తిమ రూపం గా ప్రదర్శించాడు. ఆమె ముగ్ధ. మనోభావాన్ని వాచ్యం చేయ రాదు. కనుక చెప్పకుండా చెప్పటం కవి చమత్కారం.

పెళ్లి తర్వాత హోమం చేస్తున్నారు. వారిద్దరి లో ఉన్న సాత్విక భావం శిఖా రాయ మై నిరు పమానం గా కన్పింప జేశాడు తిక్కన. --"గాఢ సంస్పర్శ భంగులు కల్గి నట్టి --హోమ సమయ కృత్యంబుల నొదవి సౌఖ్య -రసము పెన్నిట్ట పోరి బోరి గ్రమ్మ దేర --సంముదంబుధి దేలిరి సతియు బతియు " --స్పర్శ సౌఖ్యం తో దేహాలు సాత్విక స్వేదం (చెమట )తో తడిశాయి. సతీ పతులు సంతోష సముద్రం లో తేలి యాడారు. అంటే ఆనందానికి అవధులు లేవు అనే భావం ఉదాత్తం గా కన్పించింది. ఉత్కృష్ట మైన శృంగార భావాలు హృదయాలను తాకి పరవశించేట్లు చేస్తుంది. ఎక్కడా హద్దు మీరదు. వీరం, శృంగారం రస నిధులై న ఇతి వృత్తాలు. వాటికి తగిన కావ్య రచన వల్ల విరాట పర్వం చదువరుల హృదయాహ్లాది అయింది. తిక్కన తన రచనా విరాట్ స్వరూపాన్ని, అన్ని వైపులా నుంచి, చూపించి, ఆనంద పార వశ్యం కల్గించాడు. కవిబ్రహ్మ లో శబ్ద బ్రహ్మ, నాదబ్రహ్మ, రసబ్రహ్మ కలిసి ముమ్మూర్తులు ఒక్కరై రనో పై సహః అని పించాడు.

## ఉద్యోగ పర్వం లో  తిక్కన శేముషీ గరిమ



రాజకీయం గా కురుపాన్డవులతో బాటు సమస్త రాజ లోకానికి ఉద్యోగ పర్వం ప్రధానమైంది. లోక శాంతి కోసం సంధి కావాలో, లోక అన్దానికి విగ్రహమో అనే ప్రశ్న, దానికి సమాధానం ఈ పర్వం ప్రత్యేకత. భావి కర్తవ్యాన్ని నిర్ణయించే అవకాశం పాండవులకు, కౌరవులకు ఉంది. సత్య ధర్మాలు, న్యాయానికి లోకం లో ఏ స్తితి ఉందొ చూపించే విషయం. లోక హితం కోసం, బంధు హితం కోరిన ధర్మ రాజు ఆశయాన్ని నేర వేర్చటానికి శ్రీ కృష్ణుడు సామ, దానాలను అతి చతురం గా ప్రయోగించటం ఇందులో ముఖ్య విషయం. ఎన్నో కష్టాలను ఓర్చుకొని, మాట ప్రకారం అరణ్య, అజ్ఞాత వాసావాసాలను పాండవులు పూర్తీ చశారు. భావి కార్య క్రమాన్ని ఇప్పుడు నిర్ణ యించు కోవాలి. సంధి చేయటం పాండవుల పై కంటే కౌరవుల మీదే ఎక్కువ గా ఆధార పడి ఉంది యుద్ధం వస్తే కురుపాన్డవులతో పాటు యాదవ, పాంచాల, మత్చ్య, సింధు, గాంధారి వంశాల కంతటికీ సంబంధించింది. అందులోని ప్రజలందరి కి భాగా స్వామ్యం ఉంది. అందుకే లోక హితం కోసం పాండవులు ఉదారం గా వ్యవహరించారు. తమకు, తమ ధర్మ పత్నికి జరిగిన పరాభవాల నన్నిటిని దిగ మింగుకొన్నారు. ద్యూత సమయం లోను, ఉత్తర గోగ్రహణం లోను అన్యాయానికి సహాయం చేసి, ధర్మ నాశనానికి దోహదం చేసిన భీష్మ, ద్రోణులకు, అశక్తుడైన ధ్రుత రాష్ట్రునికి విషమ పరిస్థితే. ధర్మాన్ని ప్రతిఘటించటా నికి మనసు ఒప్ప లేదు.. కాదు అని అధర్మ పరుల ను ప్రతిఘటించా టానికి నైతిక ధర్యం కూడా చాలని, ధర్మా ధర్మాల మధ్య, చాలా సంకట స్థితి లో, సందిగ్ద పరిస్తితి లో ఉన్నారు పాపం భీష్మ ద్రోణులు. కుమారుని పై వ్యామోహం, సంపద మీద ఆశ, రాజ్యాధికారం, పాండవుల శౌర్య సాహసాల వల్ల భయం,, తండ్రి ధ్రుత రాష్ట్రుని ఎటూ తేల్చుకో లేని కిమ్కర్తవ్యతా మూఢుని చేశాయి. భారతం లో ప్రతి పాత్రకూ సందిగ్ధ స్తితే,సంకట పరిస్తితే. కనుక వారందరి మానసిక పరిస్థితులు, షీలా స్వభావాలు, ఈ పర్వం లో బాగా బయట పడుతాయి. కవిగా తిక్కన తన అఖండ జ్ఞానాన్ని, మనస్తత్వ పరిజ్ఞానాన్ని. మంత్ర తంత్ర వేదిత్వాన్ని, ప్రదర్శించటానికి దివ్య మైన అవకాశం. మూడు రాయ బారాల్లో నడపిన ఆయా వ్యక్తుల సంభాషణా శైలి, చతురత లను మనం చూస్తాం. అందుకే ఇక్కడ మంచి సంభాషణా శైలి ప్రతి ఫలించింది.

## ద్రుపద పురోహిత రాయ బారం

ఉత్తరాభిమన్యుల వివాహం కాగానే, బంధువులంతా ఒక చోట చేరి భావి కర్తవ్యాన్ని గురించి ఆలోచించారు. శ్రీ కృష్ణుని హిత బోధ తో, ద్రుపద రాజు పురోహితుడిని ధ్రుత రాష్ట్రుడి దగ్గరకు రాయబారి గా పంపాలని నిర్ణయించారు. ఇదే మూడు రాయబారాల్లో మొదటిది. రాయబారి మెత్తటి వాడే. మాటలతో లోబరచు కో వచ్చునని తియ్యగా మాట్లాడే సంజయుడిని ధ్రుత రాష్ట్రుడు పంపటం రెండవ రాయబారం. సంధి కోసం చివరి ప్రయత్నం గా, దైవమె మానవ రూపం లో ఉన్న శ్రీ కృష్ణుడే స్వయం గా రాయబారిగా రావటం మూడవ రాయబారం. ఈ ముగ్గురు మూడు రకాలైన కులమూ, శీలము కలవారు. దానికి తాగి నట్లే మాట్లాడారు. రెండు పక్షాలలోను ముఖ్య మైన వాళ్ళ అభిప్రాయాలు, ధర్మం వైపు వాళ్లకు ఉన్న భావాలు, చాల చక్కగా గొప్పగా నాటక విధానం తో తిక్కన కళ్ళకు కట్టి నట్లు చిత్రించాడు. అందరికి సంధి కావాలి -కాని ఆ

రాయబారుల లోని వైవిధ్యాలను చాలా బాగా ప్రదర్శించటానికి వీలైన ఘట్టాలు. నాటకీయత కు పరాకాష్ట. లోక ప్రవర్తన, కురు వంశ ప్రవర్తన సమానం గా ప్రదర్శిత మైంది. కౌరవుల వద్దకు దూతను పంపాలని నిర్నయిన్చుకోన్నప్పుడే బాల రాముడు దుర్యోధన పక్షపాతం గా మాట్లాడాడు. సాత్యకి సహించ లేక "ఇట్టు లాడ దగునే ఇది నీ క పో లు,ని --న్నే మనంగ నేర్తు నిత్తెరంగు పాడిగాగ బూని పలుకంగ చెవి యొగ్గి, -యాద రించు వారి నందు గాక "అని అన్నగారిని నెమ్మదిగా మందలించాడు. దూతను పంపటం ధర్మం అనీ అన్నాడు. "అరాతులు సాధుల మెత్తురె ?"అంటాడు. అంటే కఠిన స్వభావం గల విరోధి మూక అయిన కౌరవులు, సాదు స్వభావం ఉన్న పాండవులను మెచ్చుకొంటారా అని సందేహమూ వెలి బుచ్చాడు. ద్రుపద రాజు కూడా ఇక సామం లాభం లేదు అన్నాడు. "మృదు భాషణముల దుర్జన హృదయములు ప్రసన్నతా మహిమ బొందునె ?"అని అనుమానం వ్యక్తం చేశాడు. దురభి మానం తో వాళ్లకు అంటే కౌరవులకు మదం పెరుగుతుంది అని హెచ్చరిస్తాడు. అనదరి అంగీ కారం తో చివరికి ద్రుపద పురోహితుడిని అస్తినా పురానికి రాయబారి గా పంపాలనే నిర్ణయం జరిగింది. ఆయన హస్తిన చేరి, సభలో కొలువైన జన సముక్షం లో మొదలు పెడుతూనే ధ్రుత రాష్ట్రుని దోషాలన్నీ ఏకరువు పెట్టాడు. పాత కధలాన్ని సినిమా రీలు లాగా ఫ్లాష్ బాక్ గా చూపించాడు -- "నారీ రత్నము నట్లు దెచ్చి సభలో నన్వాతతలుం జూడగా --జీరల్ ప్రోవులు గాగ నోల్చు టయు లచ్చిం బుచ్చి కోలున్ మహా --గ్రారణ్య స్థలి నిల్వ బంచుటయు, దైన్య వ్యక్తమై,. పల్కుచున్ --సైరింపం జను బాండవులకు నీ సంధి క్రమం బొప్పదే "అనిపాండవులకు జరిగిన అవమానాలన్ని ఒక్క సారిగా ఏకరువు పెట్టి పుండు మీద కారం రాశాడు. సకల ప్రపంచ ప్రజా నాశనాన్ని కోరకుండా పాండవులు సంధి కోరుతున్నారని, దాన్ని బలహీనత గా భావించ వద్దని ఖచ్చితం గా చెప్పేశాడు. భీమార్జునుల సాత్యకి ల శౌర్యాన్ని, శ్రీ కృష్ణుని సహాయాన్ని ప్రశంసించాడు. వీరిని జయించటం అసాధ్యం అని తేల్చి చెప్పాడు. "అదను దప్ప కుండా నమ్మహాత్ముల నెమ్మి, -బిలువ నంపి, హితము బ్రియము రెండు పక్షముల కు నగుట పాటించి తగవు మై --గొంత భూమి ఇచ్చి కూడి మనుము "అని అభిప్రాయాన్ని కూడా చెప్పేశాడు. ఏదో కొంత భూభాగం పాండవులకు ఇచ్చి కౌరవ పాండవులను సఖ్యాత తో బ్రతికెట్లు చేయమని సలహా ఇచ్చాడు. ఇందులో ఏమాత్రం మొహమాటం లేదు. రచకీయ పరిజ్ఞానం, వాక్ చాతుర్యం లేని శుద్ధ బ్రాహ్మణుడి మొండి మాటలుగా, లోక జ్ఞాన శూన్యం గా అతని మాటలున్నాయి. రాసిన కారం నషాళానికి అంటింది అందరికి. దురభి మాని దుర్యోధనుడు మండి పోయాడు. ఉద్రేకం తన్నుకు వచ్చింది. భీష్ముడు దీన్ని గుర్తించాడు. "పాండు నందనులు ప్రశాంతి మై మనముల నీసు దక్కి -మృదు మార్గము వట్టుటయు, దలపగ భాగ్యము కదా !"అని సూచన చేశాడు. వచ్చిన వాడు బ్రాహ్మణుడు -స్వభావ సిద్ధం గా వాక్పరుషత్వం ఉంది. అని దానిని కప్పి పుచ్చాడు. ఆ మాట పురోహితుని తోనే చెప్పి అర్ధం చేసుకోమన్నట్లు అన్నాడు. "నీ వాక్యం విప్ర స్వాభావికం గా ఉంది. -ఇట్లా లౌక్యం లేకుండా చెవికి పరుషం గా మాట్లాడితే కార్యం నేర వేర్తుందా "అని మెత్తగానే, గట్టిగానే చీ వాట్లు పెట్టాడు. అయితే -బ్రాహ్మణుడు కనుక అధర్మాన్ని ఖండించా టానికి, నిర్భయం గా చెప్పటానికి స్వాతంత్రం ఆయనకే ఉంది. రాజ పురోహితుడు కనుక అధికారం తో కూడిన తీక్ష్ణత కూడా అతని మాటల్లో ఉంది. అందుకే బ్రాహ్మణ రాయబారం విఫలమైంది.. పైగా దుర్యోధన దుష్ట సర్పాన్ని రెచ్చ గొట్టినట్లు అయింది.

## సంజయ రాయబారం



సంజయుడు కౌరవ, పానదవులకు ఇద్దరికీ కావలసిన వాడు. యుక్తాయుక్త వివేకం ఉన్న వాడు. రాజుల వద్ద మెలిగే నేర్పున్న వాడు. అన్నిటికి మించి రాయ బారికి కావలసిన వాక్ చతురత ఉన్న వాడు. అందుకే ధ్రుత రాస్త్రుని ఆజ్న గా పాండవుల దగ్గరకు రాయ బారి గా వచ్చాడు. ముందు గా ధర్మ రాజుతో అతడిని పొంగించి, ఉబ్బేసే ప్రయత్నం చేస్తూ "భాగ్యమున నిన్ను గనుగొన బడసి నాడు --చూడ్కి చరితార్ధ మయ్యె నస్తోక పుణ్య ధనుడు మీ

తండ్రి ధ్రుత రాష్ట్ర ధరణి నాధు -దిండు మీ యుంకి విని ప్రియ మెసక మేసగ "అనటం తో ధర్మ రాజు "ఉబ్బు లింగం "అవుతాడని చాలా ఆశ పడ్డాడు సంజయుడు. తన ప్రయతన లోపం లేకుండా ఇంకాస్త పొగడ్త ధూపం వేశాడు.

-

"అనుజులు నీవునును ద్రోవది -యును బుత్రచయంబు నున్న యోగ క్షేమం బున తెర గారయ బుత్తెం-చే,నితాంత స్నేహ పూర్ణ చేతో వృత్తిన్ "-అన్నాడు. ధర్మ రాజాదుల యెడ పేద తండ్రికి గల స్నేహ భావాన్ని, పాండవులంతా అనుభ వించిన దుఖానికి సానుభూతి ని తెలియ జేశాడు. యుధిష్ఠిరుని మనసు మెత్తబడ టానికి ప్రయత్నం చేశాడు. అందుకే మాటలను అతి జాగ్రత్త గా ప్రయోగించాడు "అస్తోక పున్యధనుడు -మీ తండ్రి -ధరణి నాధుడు "అనే మాటలను సాభిప్రాయం గా ప్రయోగించాడు. మీకు మీ తండ్రి తెలీదు ఆయనే తండ్రి -ఆయన పుణ్యాల రాసి మీదు మిక్కిలి అస్తినా పురానికి మహా రాజు అని గుర్తు కూడా చేశాడు. అంటే తస్మాత్ జాగ్రత్త అనే హెచ్చరికా అందు లో ఉంది. ఆ వరుస క్రమం చాలా పకడ్బందీ గా ఎన్ను కొన్నాడు. ప్రతి మాట అర్ధవంతం సమయానికి తగిండీ. జరిగిన దానికి పెద్ద రాజు తప్పు ఏమీ లేదు అని చెప్పా టానికి "అస్తోక పుణ్య ధనుడు "అన్నాడు. పిత్రుప్రేమ ను జ్ఞాపకం చేసుకోవ టానికి "మీ తండ్రి "అన్నాడు. చివరికి మహా రాజు పంపే సందేశం మీరు కాదనటానికి వీలు లేదు -అది శిరోధార్యం అని చెప్పా టానికి "ధరణి నాధుడు "అన్నాడు. అంతే కాదు "అనుజులు నీవును ద్రౌపదియును "అనటం లో కూడా తమ్ముళ్ళను అనునయించటం, ప్రతీ కారం తో రగిలి పోతున్న పాండవవ పట్ట మహిషి ద్రౌపది ప్రతీకారం తీర్చు కోవటానికి ఎదురు చూస్తోందని తెలిసి ఆమె పేరును ప్రస్తా వించటం సంజయుని మాటల నైపుణ్యానికి గొప్ప ఉదాహరణ. విషయం పెద్ద రాజుది కాని మాటల పేర్పు సంజయుడిదే. ఇదీ కార్య సాధకుడికి ఉండాల్సిన ముఖ్య లక్షణం. అంత మాత్రం చేత ధర్మ రాజు పొంగి పోతాడా ?ఆయన పేరే యుధిష్ఠిరుడు. దానికి తగ్గట్టే ఆయన సమాధానమూ ఉంటుంది.

"'ఆ రాజు మా దేసం గల కారుణ్యము కతమునాను సుఖమున నిట్లున్నారమని "వ్యంగ్యం గా కాకువు తో చెప్పాడు. అవును రాజు గారి దయ వల్ల మేము అడవుల్లో చాలా సుఖాలు అనుభవిస్తున్నాం అన్నాడు దెప్పి పొడుపు గా. కాని తన ధర్మాన్ని వదల కుండా కౌరవులందరి యోగా క్షేమాలను అడిగాడు. అప్పుడు నెమ్మది గా తన తమ్ముల అశేష శౌర్య పరాక్రమాలను వరుసగా వర్ణించి దిమ్మెర పోగొట్టాడు. ధర్మ రాజు ఇప్పుడు ఇవన్నీ ఎందుకు ఏకరువు పెడుతున్నాడో గ్రహించానంతటి అవి వెకి కాదు సంజయుడు. వెంటనే గ్రహించాడు. అయినా తన ప్రయత్నం




తాను చేశాడు. పట్టు వదలని విక్రమార్కుని లా ధర్మ రాజు కారుణ్యాన్ని పదే పదేప్రస్తుతిించాడు. ఇప్పటి వరకు పాండవులకు క్షేమం లేక పోయినా ఇప్పుడు కలుగు తుంది అన్నాడు. --"పొందొంగ దలచితి నీ --విందు శిశిర మైన హృదయంబున, వారందరకు ను సేమంబిట -- ముందర లేకున్న నేడు మొదలగ గలుగున్ "అని చాలా గూఢం గా చెప్పాడు సంజయుడు. తెలివి తేటలన్నీ ప్రయోగించాడు. పూర్వం కౌరవులు ప్రవర్తించిన దానికి పాండవులు ప్రతీకారం తీర్చు కో దలచు కుంటే, ఇంతకు ముందుగా ఉన్న కౌరవుల క్షేమం ఇంకా క్షయం అవుతుంది. శిశిర విమల హృదయం తో సంధిని ధర్మ రాజు కోరుతున్నాడు. కనుక ఇప్పుడు నిజం గా కౌరవులకు క్షేమమే. చంద్ర వంశానికి చెందినా వాడవు కనుక నీ మనసు అమృత మాయం గా ఉంటుందని సూచన కూడా అతని మాటల్లో నిగూఢం గా ఉంది. అదీ సంభాషణా చతురత.చంద్రుని వికాసం లోకానికి ఆనందమే కాదు చల్ల దనాన్ని ఇస్తుందని శాంతి లభిస్తుందని అన్యాప దేశం గా అన్నాడు. చేసిన తప్పు అంతా దుర్యోధనుడిదే కాని మతి తప్పిన ముసలి రాజుది కాదు అని, పేద తండ్రి పై ధర్మ రాజుకు సాను భూతి కలిగేట్లు మాట్లాడాడు. ధర్మ రాజు మెత్త బడితే తమ్ముళ్ళను ఒప్పించ గలదు అనే పూర్తీ విశ్వాసం సంజయునికి ఉంది. అసలే ముదుసలి -మానసికం గా కుంగి పోయాడు. కనుక సానుభూతి కల్గిస్తే కార్యం సానుకూలమవు తుందని ఆశించాడు.

"ధృత రాష్ట్ర భూపతికి వరు--ద్ద కతమున జిత్తమొక విధము కామి, సుతో --ద్ధతి మాన్పద నాడు మనః--క్షతి పిదపంబుట్టి ఇపుడు శాంతుడయ్యేన్ "--కౌరవ వంశానికి కళంకం దుర్యోధనుని వల్లే వచ్చింది దాన్ని పోగొట్టే బాధ్యత ధర్మ రాజుదే అని పెద్ద బాధ్యత కూడా ఇరువైపులా ఆయనదే అని బలేగా చెప్పాడు. "నిపుణ హృదయ "అని సంబోధించి కార్య సాధనకు మంచి బీజం నాటాడు. చివరగా, చాలా తెలివిగా -ఒక వేళ యుద్ధం వస్తే -"అఖిల జనక్షయమయి, జయాపజయాలు తెల్చలేనివి గా ఉంటాయి సుమా "అని హెచ్చరించాడు. యుద్ధ ప్రయత్నం మంచిది కాదు అనే సూచనా ఉంది. ఇరు వైపులా ఉన్న బాలా బలాలను చాలా బాలన్సు గా టేరీజు వేసి మరీ చెప్పాడు. కలహం ఎలా చూసినా మేలు కాదు పొమ్మన్నాడు. అంతే కాదు చివరికి కాళ్ళ బేరానికి వచ్చి నట్లుగా ఆపద మొక్కులూ మొక్కాడు. అక్కడున్న అందరికి క్రోధ శాంతి చేయమని విన్నవించాడు –

"మ్రొక్కెద వాసు దేవునకు, మొద్చెద చేతులు సవ్య సాచికిన్ --దక్కటి మిత్ర బాంధవ హిత ప్రియ మంత్రి వయస్య కోటికిన్ --సృక్కుచు విన్న విమ్చెదనసూయలు దక్కి, యనుజ్ఞ సేయుడీ -ఇక్కరునాకరున్ శరణ మేనిదే పేడెద క్రోధ శాంతికై-"అని అందర్నీ యోగ్యతను అనుసరించి వినయం, గౌరవం, ప్రకటిస్తూ వేడికోలు అంటే విజ్ఞప్తి చేసుకొన్నాడు. " నెయ్యము వాటించి కదుం-దియ్య మేసగ నాలుక లెల్ల దీరు నటులు గా --గయ్యమను దలపు లోనుగా --నయ్యమ నందనుడు మాను నట్టి తెరగున న్ "ధర్మ రాజు యమ ధర్మ రాజు కుమారుడు, ఇప్పుడా ప్రసక్తి ఎందుకు తెచ్చాడు ?అంటే యముడు సమవర్తి. తన ధర్మాన్ని తానూ చేసుకు పోతాడు. అంతే కాలు మ్రుత్యుస్వరూపుడు. ఆయన కు కోపం వస్తే అంతా విలయమే మర్నా పరం పర్లే. అంత జాగ్రత్త గా తిక్కన కవీశ్వరుడు పదాన్ని ప్రయోగించాడు. కనుక యమ నందనుడైన ధర్మ రాజు దండిచ దాలిస్తే ఇక తాన వారు అవతలి వారు అని చూడడు'అప్పుడు దయాదాక్షిణ్యాలకు తావు ఉండదు. అంటే ధర్మ రాజు దండించాలని అనుకొంటే అడ్డ గించే వారెవరు ఉండరని అన్యాప దేశం గా చెప్పాడు. ఇలా చెప్పటానికి ఒక కారణం కూడా ఉంది. సంజయుడిని పంపేటప్పుడు ముసలి రాజు అతడిని హెచ్చరించే పంపాడు -"శాంతి ప్రకారం కార్యం నడుపు. ఒక్కటిగా ఉండటానికి ఏర్పాటు చేసిరా "ఈ ఆదేశాన్ని సంజయుడు తన శక్తి సామర్ధ్యాలను యుక్తిని తెలివి తేటలను చక్కగా ప్రయోగించి చాలా నేర్పుగా చివరి వరకూ చెప్పాడు. వీటన్నిటికి, ప్రతి అక్ష రానికి ధర్మ రాజు తాగి నట్లు గానే తన సమాధానాన్ని తెగేసి చెప్పాడు. రాజ్యం ఇవ్వక పోతే సంధి జరుగదు అనే అర్ధం వచ్చేట్లు బదులిచ్చాడు. సంజయుడు పట్టు వదల లేదు. బంధు నాశనం కల్గించే సంపద సుఖాన్ని ఇవ్వదుఅన్నాడు. సాత్వికులు అని పించుకొన్న పాండవులకు ఇది తగదు అని తెగేసి చెప్పాడు. ఇంత కంటే ఇంకొంచెం ముందుకు వెళ్లి "దుష్ట ద్యూతం వల్ల కౌరవుల గర్వం అంతా పెంచి, వాళ్ళను లోక నిందకు గురి చేయటం న్యాయమా /అని ప్రశ్నించాడు. ఆర్పే దానం గా అరణ్య, అజ్ఞాత వాసాలను కష్టాలను ఓర్చు కొన్న ది అంతా నిష్కారణం గా గురు బంధు వర్గాన్ని చంపుకోవ టానికేనా ?అని నిలదీశాడు. సమాదాన్నాని పాండవులకే వదిలేశాడు. ఈ విధం గా సంజయుడు స్వామి కార్యాన్ని హృదయ పూర్వకం గా నిర్వర్తించాడు. ఎలాగైనా ధర్మ రాజును యుద్ధ విముఖుడిని చేయ టానికి విశ్వ ప్రయత్నం చేశాడు. కనుక సంజయుని మాటలలో తీపి ఉంది, గడుసుదనం ఉంది, అన్నీ తెలిసిన నేరు ఉంది. చ్చివారి దాకా చావని ఆశా ఉంది. అంతరాంతరాలలో తన ద్యూతం విఫల మౌతోందనే నిరాశా భావమూ కన్పిస్తుంది. వీటిని ధర్మ రాజు, శ్రీ కృష్ణుడు కూడా గుర్తించారు. పాండవులు ఏమి సమాధానం చెప్పారో తరువాత తెలుసు కొందాం –

ధర్మ రాజు సంజయుడి తో "ముందు మమ్మల్ని పోగిడావు. యుద్ధం లో కౌరవులనుమేము జయించా లేము అన్నావు. ఆ తర్వాతా సంధి అని సంధి ప్రేలాపన లామాట్లాడావు. అంత పక్ష పాతం గా మాట్లాడతా వేమిటయ్యా !"అని నిలదీశాడు-"ఏదిరిం దమ యట్టుల కా -మది దలచిన బోసగు గాక మాకుం గుడు మిన్నేడిదేమీరు ప్రక్క గోనుడని -చదుర బడచిన మనసు పొందు చక్క బడునే ?" అని ధృతరాష్ట్రుని పక్ష పాత బుద్ధి ని ఎండ గట్టాడు. "సంపద దక్కి యుండగానాశక్తులనం జను మమ్ము బిల్చి పూజింప నంత టేలె, పతి "అని పెద్ద రాజు మనసులోని దురాశను, దుష్ట బుద్ధి సంకల్పాన్ని, తెలియ జేశాడు. "మాతో ఎంతతియ్యగా మాట్లాదావో, ఆ రాజుతో కూడా మేము చెప్పిన విషయా లన్ని అంత తియ్యగానూ తెలియజేయి "అని చెప్పాడు. --" ఆ రాజు సేయు నెయ్యము -గారామును జెప్పె దీవు గడు దీపులుగా -వీరు తమ పాలు వడయక -నేరిమి మాటలన దేర నేర్తురే చెపుమా? అని ఝుదించాడు. ఇదంతా వింటున్న శ్రీ కృష్ణునికి కారం రాచినట్లుంది. ధర్మరాజు మెత్త గా మాట్లాడుతున్నాడని పించిందేమో ఒక సారి ఫ్లాష్ బాక్ లోకితీసుకొని వెళ్లాడు -"దుస్స సేను డదయాకుతి ముందల వట్టి ఈడ్వగా నెట్టు సహించేమామ "అని తీవ్రం గా ప్రశ్నించాడు. "సతి ఏడ్పు టేలున్గున కెట్టులోర్చె-ణీ పట్టున సెమ మారయగ-బంచుట కెట్టు లు నేర్చే గ్రమ్మరన్ " అనినిండు సభలో యాజన సేని అయిన ద్రౌపదికి జరిగిన పరాభవాన్ని చూస్తూ ఊరుకొని ఇప్పుడీ రాయబారం సందీ అంటే అర్ధమేమిటి అని ఈసదించాడు. ధర్మ రాజు పెద్ద రాజును పేద తండ్రి అని ఒక మారు కూడా సంబోధించ లేదు. "ఆ రాజు "అని చాల తేలిక భావం తో అలాంటి నిస్చేతనుడైన రాజు అనే అర్ధం లోనే వాడాడు. కృష్ణుడు లౌక్యం గా "మామ 'అన్నాడు. ఈ విధం గా సంజయుది మిధ్యా వాదాని ఖండించాడు బావ. ధర్మ రాజు సంజయుడిని బాగా ఎస్టిమేట్ చేశాడు. అతని మాటల్ని "దుర్నయము, బెట్టిదం, బెండు "మాటలుగా ఉన్నాయని చెప్పాడు.

అంతే కాక ఇంత వినయం, నేర్పు ఇంకెవరి దగ్గరైనా ఉన్నాయా అని మెచ్చి కోలు గా అన్నాడు. అంటే రాయ బారి సంభాషణా చాతుర్యానికి కితాబు ఇచ్చాడు. సంజయ రాయబార విధానానికే ఈ మాటలు చక్కని వ్యాఖ్యానాలు. పాండవ సందేశాన్ని తీసుకొని సంజయుడు హస్తిన చేరి పెద్ద రాజుకు పూస గుచ్చి నట్లు వివ రించి చెప్పాడు. ధర్మ రాజు సందినేకోరుతున్నాడని ద్రుపద పురోహితుని ద్వారా పంపిన రాయ బారమే చెప్తోందని గ్రహించాడు. అయితే ధర్మ రాజు ను యుద్ధ విముఖుడిని చేయ టానికే సంజయుడిని పంపాడు. అతనూ తీవ్రం గా నే ప్రయత్నించాడు. వంశ, బంధు, రక్షణ అంతా యుదిస్టిరు ని పైనే ఉందని గుర్తు చేయించాడు. శాంతుడు అయితే ధర్మ రాజు రాజ్య భాగాన్ని కూడా కోరడు అని భావించాడు రాజు. కొంత వరకు ఈ రాయబారం ఫలించి నట్లే. బంధు నాశనం ఇష్టపడని ధర్మజుడు "అయిదు ఊళ్లు "ఇమ్మన్నాడు. ధర్మరాజు ఎంత ఔదార్యం చూపించినా, తన కొడుకు దుర్యోధనుడు దానికీ ఒప్పు కోడు అని గుడ్డి రాజు కు బాగా తెలుసు. కళ్ళు గుడ్డివే కాని మనసుల్ని చదవగలడు. తన కొడుకు మూర్ఖత్వమూ చెల్లాలి, ధర్మ రాజూ శాంతించాలి. ఒకే దెబ్బకు రెండు పిట్టలు పడాలని దురాశ. ఈ రెంటినీ నేర పేర్చ తానికే సంజయ రాయ బారవ్యూహం పన్నాడు. మళ్ళీ సంజయుడు యుక్తి గా ఒక ఎత్తు ఎత్తాడు. - "ఎట్టి తప్పులం బోవగ దోచి, తాలిమి పూనుదు గావున నన్ని మాట లిట్లీవు వినంగ నాడియు, నే, దని వోవక విన్న విన్నేదన్ "అని కోన సాగిస్తూ -అంటే" అవతలి వారు ఎన్ని తప్పులు చేసినా సహించే ఔదార్యం ఉన్న వాడివి నువ్వు. సహనం నీకు ఎక్కువ. అది నీకు సహజ ఆభరణం. అయినా నాకు మనసు సంతృప్తి పొందక ఒక మాట చెబుతున్నాను వినవయ్యా "అన్నాడు.

"ణీ విభావంబహిం సయు, ననిన్ద్య చరిత్ర కాక యన్యమే"అని అహింసా మూర్తిగా నోట్లో వేలు పెడితే కొరకలేని వాడిని గా పరిశుద్ధాన్తరంగునిగా ఎట్టి నిండా లేని సచ్చరిత్రునిగా భుజ కీర్తులు పెట్టి కార్యాన్ని గట్టెక్కించు కోవాలని చూశాడు సంజయుడు. ఈ పొగడ్తను పరా కాష్టకు చేరుస్తూ "అల్పులకు అలవి కాని హాలాహలం లాంటి కోపాన్ని దిగ మింగు కోవా టానికి నువ్వు సాక్షాత్తు ఆ నీల గళుడుఅయిన శివుడివే "అన్నాడు. "నీకు నీవే సాటి "అని ములగ కొమ్మ ఎక్కించాడు. బోళాశంకరుడు పొగడ్తలకు ఉబ్బి పోయి నట్లు ధర్మ రాజు ఉబ్బు లింగం అవుతాడనిమంచి ఉపమానాలను ఎన్నుకొని మాటల పొగడ దండలు మెడ నిండా వేశే శాడు. చేసేది లేక ఏమీ పాలు పోక ఆఖరి అస్త్రాలుగా వీటిని



ప్రయోగించాడు. ఈ యుక్తి యుక్తమైన మాటలకు చాలా తీవ్రం గా నే బావా, మరదులు సమాధానం చెప్పి నోరు మూయించినంత పని చేయించారు. ఇప్పటి దాకా చాలా ప్రశాంత చిత్తం తో ఓర్పు గా ఉన్నధర్మరాజు విపరీత మైన కోప స్వరం తో తన తమ్ముళ్ళ అవక్ర పరాక్రమ శౌర్యాలను ఏకరువు పెట్టాడు. అవన్ని ఒక్క సారి ప్రదర్శింప జేశాడా అన్నట్లు తిక్కన ఆయన తో అని పించాడు. "గాండీవ జయా రవంబుతకట మయి పెలుచం గ్రమ్మిన న్, భీము బాహా --దండంబేపారి, శుంభద్గద జడియుచు దోచినన్ -రౌద్రంబు గా దోచినన్, వే—దండ ద్వంద్వము మాడ్కి న్దరిమికవలు మాద్యద్గతిం దాకినన్ జా కుండం బోకుండగౌరవ్యులకు వశమే బిట్టుల్కి మూర్చిల్ల కుండన్ "అని రాబోయే కౌరవ పాండవ యుద్ధం లో జరగ బోఏదేమిటో కళ్ళకు ప్రత్యక్షం చేశాడు. తన సోదరుల ముండేవారు నిలిచి పోరాడలేరని తేల్చి చెప్పాడు. ఆ చెప్పేది చాలా విస్పష్టం గా, ఉద్ధృతంగా తీవ్రమైన గొంతు తో చెప్పే శాడు. సంజయుడు ఇంగితం కల వాడు. పాండవుల మనో భావాన్ని, తీవ్రత ను అర్ధం చేసుకొన్నాడు.బందుత్వాన్ని కూడా పాటించ కుండా"కౌరవ్యులు "అని ధర్మ రాజు అన్నందుకు ఆ అహింసా మూర్తి లో రోషం ఎంత జీర్ణించుకు పోయి ఇప్పటి దాకా బయట పడ కుండా ఉందో గ్రహించాడు. ఇటు వైపు అయి పోయింది -ఇక అటు వైపు నుంచి రావాలి అనుకొన్నాడు. ధృత రాష్ట్రుని కొలువు కూటం చేరాడు. ముందుగానే "సైరణ పేరపుగా భావించుట తప్పు "అని ముసలాయనకు హితోప దేశం చేశాడు. అంటే పాండవులు సహించి ఉండటం భయం తో కాదు అని అర్ధం. "సాదు రేగే నేని విను, తల పొలమున గాని నిలువదు సుమ్మీ

“అని హెచ్చరించాడు. అంటే ధర్మ రాజు ఎంత శాంత చిట్టుడో, అవసరం వస్తే అంత తీక్ష్ణ స్వరూపుడు. సాధువు చేల రేగితే భూమి మీద మిగిలేది బూడిదే అని భావం. సంజయుడు ఉభయుల హితం కోరే వాడు. కనుకమొహమాటం లేకుండా చెప్పే శాడు. ఇప్పటికే చాలా ఆలస్యం జరిగి పోయింది. ధ్రుతరాష్ట్రుని ప్రవర్తన ను కటువు గా నే నిందించాడు. -”ఆలు బిడ్డ లేని యట్టి త్రిమ్మరి యగు -కొయ్య గాక కుదుట గూడు పెట్టి -కుడుచు వారలిట్టి క్రోవ్విదంబుల సేయ -జొచ్చు టి చ్చ గించి చూతురయ్య “అని మందలించాడు. తోట కూర నాదే వంగ దీయాల్సిన కొడుకుని ఉపేక్షించి ఇప్పుడేదిస్తే ఏమి లాభం అన్నాడు. “నీ ఉపేక్ష కొంప ముంచింది. ధర్మ రాజు చాలా తెలివైన వాడు లోకం అంతా తప్పు అంతా నీ మీదే పెట్టి దాకా వదలడు. ధర్మ రాజు అంటే “మెత్తనిపులి “ అని ఆతని ఆంతర్యాన్ని విస్పష్టం చేశాడు. “అనయము వుట్టి జూదమున యప్పుడ ఎంతయు జిచ్చుపెట్టి కా --ల్చిన యది, నీ యుపెక్షయ, వశీక్రుత చిత్తుడు ధర్మ సూతి, మే--త్తని పులి ఎల్ల వారలు, నధర్మము నీ పయి బెట్టు నంత కు --న్వినడు గనదుం, బిదప నీకును నాకు మరల్పవచ్చునే “--ఉపేక్ష ఎంతటి వినాశనాన్ని సృష్టించిందో ఎరుక పరిచాడు. చివరగా 'అయ్యజాత శత్రుదలుగుట నీళ్ళు ల నగ్ని పుట్టి నట్టిదయ్యేమీకు నార్ప పెరవులేదు “అని కవి తిక్కన మహా నేర్పు గా సంజయుని తో చెప్పించాడు బధిర శంఖారావం గా ఉంటున్న పెద్ద రాజుకు. అగ్నిని ఆర్ప టానికి నీళ్ళు కావాలి. ఆనీళ్ళ లోనే అగ్ని పుడితే ? ఆర్పటం సంభావమా ?అది ప్రళయాగ్ని. దానికి సర్వ సంహారం చేయటం తప్ప ఇంకోతేమీ తెలియదు. తస్మాత్ జాగ్రత. అని విలువైన సందేశం ఇచ్చాడు. అయినా ముసలి రాజుకు ఆశ చావా లేదు. విదుర, భీష్మాదులు చెప్పినా విన లేదు. పాండవులను జయింప వచ్చును అనే దురాశ ఇంకా లోపల్లోపల మినుకు మినుకు మంటోంది. కనుక చివరగా సంజయుడిని బాలా బలాల సంగతి అడిగి తెలుసు కొన్నాడు. ఇక్కడ సంజయుడు చెప్పే సమాధానం చాలా లోకోత్తరం గా ఉంది పాండవుల అవక్ర పరాక్రమాన్ని వైభవో పేతం గా, దిమ్మ తిరిగే ట్లు వర్ణించి చెప్పాడు. “అట మిన్నందిన యట్టి వాని పొడవెంతన్నట్లు, పాలాక్షు నె--క్కటి కయ్యంబున గొన్న ఫల్గును భుజా గర్వంబు లేక్కిన్పుటం--తటి వానింగొని ధర్మ సూతి సమరోత్సాహంబుమై నెత్తి వ--చ్చుట కుం గొంకు నె వీపు సక్కనయి నిల్పుం గాక మీ సైన్యముల్ “అని హేళన చేశాడు. రుద్రుని తో జగ జెట్టిఅయిన అర్జునుని పరాక్రమ విక్రమాన్ని ప్రదర్శన గా చూపించాడు. వీళ్ళు అందరు ఒక ఎత్తు.అసలు సకల చరాచర సృష్టి స్తితి, లయ కారకుడయిన శ్రీ కృష్ణ పరమాత్మ సహాయ సంపత్తులుఒక ఎత్తు. ఇన్ని పుష్కలం గా ఉంటె, ధర్మ రాజు యుద్ధం చెయ్య కుండా ఆగుతాడా ? అని కుండా బద్దలు కొట్టాడు. యుద్ధం అని వార్యం అని తన మనసు లోని మాట గా చెప్పేశాడు. ఇది హెచ్చరికే. భయపెట్టటమూ ఉంది ఈ మాటల్లో. సంజయుడు జ్ఞాని కనుక జరుగ బోఏది ఏమిటో తెలుసు కనుక లోక నాశనం కాకుండా విశ్వ ప్రయత్నం చేశాడు. తన మనసు బుద్ధి, వాక్కు, లను త్రికరణ శుద్ధి గా ప్రయోగించాడు. చాతుర్యమూ చూపాడు. అంతటి ఉక్తి, చమత్కారం సంజయుని మాటల్లో తిక్కన చెప్పించాడు. ఇలా రెండవ రాయ బారమూ విఫల మైంది. పాండవుల యుద్ధ సన్నద్ధత తప్పదు అని తేలింది చివరకు. –



శ్రీ కృష్ణ రాయ బారం

సంజయుని ద్వారా ధ్రుత రాష్ట్రునిని అంతరంగం ను పాండవులు పూర్తిగా గ్రహించారు. ఇంకా ముసలి రాజు దురాశ లోనే జీవిస్తున్నాడని అర్ధమైంది. కనుక తానే స్వయం గా రాయ బారానికి బయల్దేరాడు శ్రీ కృష్ణ పరమాత్మ. ఆయనకు తప్పని పరిస్తితి. సంజయుడు హితుడైనా,వాక్ చతురుడైనా, అక్కడ సభ లో సముచిత స్థానం లేని వాడు. కనుక అతని ఉప దేశం చెవిటి వాని చెవి లో శంఖమే అయింది .నిరర్ధకమై అతి పరిచయం వల్లా, ఎప్పుడూ చెప్పుతూన్డటం వల్ల, ఫలితం కలుగ లేదు. ఇక సామ దాన ప్రక్రియలు అయి పోయాయి. దండో పాయమే శరణ్యం. అయినా చివరి ప్రయత్నం చేయాలని శౌరి భావించాడు. దానికి తానే పూనుకొన్నాడు. అక్కడికి వెళ్లి క్రమంగా సామ దాన, భేదాలను ప్రయోగించి చూద్దాం అను కొన్నాడు. దివ్యాంశసంభూతుడు, లోక పూజ్యుడు, వీరాధి వీరుడు, మంచి డిప్లోమాట్, ఉపాయాలన్నీ వివరం గా తెలిసిన వాడు, శత్రు భంజన క్రీడా సక్తుడు, అందరికీ "లోక బావ "అయిన తానే సంధి కార్యానికి నడుం కట్టాడు. అందుకే ధర్మ రాజు "నీకు మేమేం చెప్పాలి. నీవు ఏది చేస్తే అది మాకు శిరో దార్యం" అని భారాన్ని అంతటిని బావ నెత్తిన పెట్టి శాడు. "మమ్మేరుగు డెదిరి నేరుగుదు -నెమ్మి ఎరుగుదు దర్ప సిద్ధి నెరి ఎరుగుదు-వాక్యమ్ముల పద్ధతి నేరుగుదు -పోమ్మేవ్వాడ నేను నీకు బుద్ధులు సేప్పన్ "అన్నాడు. ఇదీ కృష్ణ రాయబారానికి నేపధ్యం. దీని ప్రకారమే కౌరవ సభలో కదనడిపాడు కృష్ణుడు. ముందుగా పెద్ద రాజు తో "జన నాధ !"అని మొదలు పెట్టాడుసకల జనానికి రాజువు నువ్వే అని అర్ధం తో ప్రయోగించిన సాభి ప్రాయ మైన మాట. రాజు గా నీ కర్తవ్యమ్ ఏమిటో ఆలోచించు అనే హెచ్చరిక నిగూఢం గా ఉంది." నువ్వు ఎరుగని పనులున్నాయా ?అయినా పరమ హితం కనుక, తన వారికి చెప్పటం ధర్మం కనుక, భారతాన్వయం మీద ప్రేమ ఉంది కనుక నేనే స్వయం గా రాయ బారి గా వచ్చాను". అనటం లో తనకు అందరు సమానమే అనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు."నీవు ఎరుంగని పను లున్నవే ?"అనటం లో నీకు తెలీకుండా ఈ సభలో ఏదీ జరగ లేదు అని ఘంటా పధం గా చెప్పి నట్లే. అన్నిటికి నువ్వు ప్రత్యక్ష సాక్షివే అని ముసలాయన్ను ఎద్దేవా చేయటమే ".అందరికీ కావాల్సిన వాడిని" అని చెప్పటం లో కౌరవులకు కూడా కృష్ణుడు ఏం చెబుతాడో అనే కుతూహలం కల్గించింది. అదీ సంభాషణా చాతుర్యం. "తాను నూటికి నూరు శాతం మధ్య వర్తి ని" అనిగట్టిగా చెప్పి శాడు. "క్షీరోదక గతి పాండవ కౌరవులోడ గూడి మనికి కార్యం"అన్నాడు. పాండవులు క్షీరం అయితే కౌరవులు నీళ్ళు కనుక ఏది శ్రేష్టమోచెప్పకుండా నే ఉపమానం తో చెప్పించాడు తిక్కన. పాలలో కలిస్తేనే నీటికి పాల స్వభావం వస్తుంది. నీరు కలవక పోయినా పాల ఉనికికి ప్రమాదం ఏమీ లేదు. కనుక దీనిని పాటించటం రాజుగా నీ కనీస ధర్మం అన్నాడు. కార్యభారం అంతా ముసలి రాజు మీదే ఉంచాడు. నిజానికి ఆయనే రాజు, కాని చక్రం తిప్పేది కొడుకు దుర్యోధనుడు. కర్తవ్యమ్ చెప్పి, దాన్ని ఎలా నిర్వ హించాలో, దాని అవసరమేమిటో, కారణాల తో సహా వివ రమ్ గా చెప్పాడు. "పొందు లోక హితం "అని గుర్తు చేశాడు ".ఇదేదో దాయాదుల మనో వర్తి తగాదా కాదు. పాండవులు అంతా ధర్మ, న్యాయ వర్తనులు, వీరాధి వీరులు, కనుక అలాంటి గొప్ప వారిని నీలో చేర్చు కుంటేనే నీకు లాభం". అని చెప్పాడు ".దీని వల్ల నీ ఔన్నత్యంపెరుగుతుంది" అని ఆశ పెట్టాడు ".అంతే కాదు సమస్త భూ మండలం నీపాదా క్రాన్తమవుతుంది" అని వివరించాడు. "పుత్ర వాత్చల్యం తో ప్రజలను కూడాచూస్తె, విరోధం వది లేస్తే, ఏంతో లోక హితం కలుగుతుందని "చిలక్కి చెప్పినట్లు చెప్పాడు.--"జగతి గల జనపతులు నీచరణ పద -మరది గొలువ సముద్రవేలావ్రుతోర్వి -ఎల్ల నే లుట యొప్పదే తల్లి ప్రజల

-యెడ విరోధంబు వాటించు టెంతమేలు?' 'అని పెద్ద కాన్వాస్ లో సమస్త భూ మండలానికి నువ్వే రాజువు అవుతావు. పాండవులు నిన్ను కొలుస్తూ నీ పాద సేవ చేస్తూ నీకు హాయిని కూరుస్తారు. ప్రజలంతా హాయిగా శాంతి సౌఖ్యాలతో జీవిస్తూ నిన్నే తలచు కొంటూ నీకు బరాబరులు చేస్తారు అని 70mm.,స్టీరియో స్కోప్ లో చూపించాడు. అయినా ముసలాడు ఉలకలేదు పలుక లేదు. మెత్తగా చెబితే వినే స్తితి దాటి పోయిందని కృష్ణుడు తెలుసు కొన్నాడు. తిలా పాపం తలా పిడికెడు అన్నట్లు గా పూర్వం జరిగిన దానికి అంతా కురు సభ ప్రత్యక్ష సాక్షి అని సాక్షుల జాబితాను పెంచాడు. "ధర్మో రక్షతి రక్షితః "అన్నాడు. ధర్మాన్ని ఉపేక్షించిన సమర్దులకుచేటు మూడుతునది అని మందలించాడు. ఈ మాటల్ని ఎంతోభావ గర్భితం గా, గంభీరంగా కృష్ణుడి చేత మహా కవి తిక్కన చెప్పించాడు. "పాండవుల పక్షాన సత్య,ధర్మాలున్నాయి. అవే వారిని రక్షిస్తాయి. కాని మీరంతా సర్వ సమర్దులైనా,సత్య ధర్మాలను కాల రాస్తున్తెఉపెక్కిన్చి "కిమిన్నాస్తి "గాప్రవర్తించారు. కనుక అధర్మ ప్రవర్తకులతో పాటు, ధర్మ నాశనాన్ని చూస్తూచేతులు ముడుచుకు కూర్చున్న మీకూ వినాశనం తప్పదు "అని భీష్మ పితామహుడుద్రోణా చార్యుడు మొదలైన వారిని హెచ్చరించాడు. వారందరికి "సర్వ ధర్మస్మృతి "కల్గిన్చాతానికి ప్రయత్నించాడు. "ద్రోణ, భీష్ము లేదిక్కుసుమ్ము ?". అని నిలదీశాడు. దుర్యోధనుడు భీష్మ ద్రోణుల మీద ఆధారపడ్డాడు కనుక వాళ్ళిద్దర్నీ అధర్మ ప్రయత్నం లో విముఖత చూపెట్లు చేస్తే -కోరలు తీసిన త్రాచులు లాగా కౌరవులు సంధికి అంగీకా రిస్తా రెమో ననిభావించాడు. ధర్మ నాశనం జరుగుతుంటే ఔదాసీన్యం చూపటం కూడా అధర్మమే నని తీర్పు చెప్పాడు. ఈ విధం గా "ధర్మంబును, నీతియు మున్నిడికొని, మనో వాక్ప్రకారంబు లేక రూపంబైన సత్యమ్బుకా "అని ధర్మ సత్యాలను ముందుంచు కొనివాటికి చేటు వాటిల్లు తుంటే నోరు మూసుకొని చేష్ట లుడిగి కూర్చోవటం కూడా అధర్మమే నన్నాడు. చివరికిఅంతా నీదే భారం అని ముసలయ్య తో తెగేసి చెప్పేశాడు.



"వారలు శాంత శూరులు, భవచ్చరణంబు గొల్వ బూని యున్నారటు గాక, మీకదిమనంబున ప్రియ మేని నింతకుం --బోరికి వచ్చు చుండుదురు భూవర, రెండు తెరంగులందు, నీ --కారయ బధ్యమే యగు నవ్విధ మేర్పడ నిశ్చ యింపుమా "అని హితోపదేశం చేశాడు ". భావి సౌభాగ్య విదాతావు నువ్వే. నువ్వే నిర్ణయం తీసుకోవాలి. మార్గం నిర్దేశిన్చాల్సింది నువ్వే నువ్వే "అని పదే పదే గుర్తు చేశాడు. దుర్యోధనుడిని ఎక్కడా సీన్ లోకి రానివ్వ లేదు మాటల సందర్భం లో. అదీ కన్నయ్య నేర్పు. ఈ విధానం అంతా ఉత్తమ గురువు చేసే మహోత్తమ ఉపదేశం లాగా ఉంది. ఈ ధర్మోప న్యాసం తో సభ్యుల్లో కలకలం చెల రేగింది. అందరు ఆలోచన లోపడ్డారు. లోక హితం కోసం కృష్ణుడు చెప్పిన ధర్మ వాక్యాలకు బదులు సమాధానం ఉండదు. అంత నిర్దుష్టం గా చెప్పాడు. అది శాసనమే. అందరికి శిరో దార్యమ. సదస్యులు అందరు "ప్రియం పొందారు "అన్నాడు తిక్కన. దాని ప్రభావం అంతగొప్పది. "నెమ్మనంబునన్ బురుషోత్తముడింత యొప్ప బల్కునే -మరు మాట లాడ, నయకోవిదు డెవ్వడు, ధీరు దేవ్వడు, తను వరి యెవ్వడు అంచు నచలాక్రుతు లై ఊరుకోన్నారట. అంతటి ప్రభావం కలిగించే విశిష్ట వచనాలను కృష్ణుడు పలికిఅందర్నీ అలరించాడు. అతను చెప్పిందే ధర్మమని అందరు అంగీక రించారు.

### శ్రీ కృష్ణుడు సభలో చెప్పినవన్నీ ఊసర క్షేత్రం లో పడిన బీజాల్లా

నిష్ప్రయోజన మైనాయి. దురాశకు, పుత్రా వాత్సల్యానికి లోనైన వృద్ధ రాజు ధర్మాన్ని నిర్వర్తించలేక పోయాడు. నారదుడు మొదలైన మహర్షులు, భీష్మ ద్రోణాది గురు సమూహం, చేసిన హిత బోధ నీరు కారి పోయింది. శ్రీ కృష్ణుడు దుర్యోధనుడిని అనునయం తో బుజ్జా గించి, నచ్చ చెప్పా టానికి చేసిన ప్రయత్నం విఫల మైంది. చివరకు బెదిరించాడు. సంధి జరగక పోతే అనర్దాన్ని వివరించాడు. దుర్యోధనుడు మొండిగా "ఎవ్వరైనా సంగ్రామ మునన్ జయించు కొని రాజ్యము సేయుట నిస్చ యించి తిన్ "అని తెగేసి చెప్పాడు. ఇప్పటి వరకు చాలా మెత్తగా, మధురం గా మాట్లాడిన వాసు దేవుడు తీక్ష్ణత జోడించి, పుల్ల విరుపు గా మాట్లాడిన దుర్యోధనుడిని ఉద్దేసించి ఉద్రేక పడ కుండానే సమాధానం చెప్పాడు. గాంభీర్యాన్ని మాత్రం సడ లించలేదు. అపహాస్యంగా, చిరు నవ్వు నవ్వుతు చిలిపి కృష్ణుడి లా తన ధీరో దాత్త త ను, ప్రాధత్వాన్ని వ్యక్తం చేస్తూ హితవు చెప్పాడు. -"అనిన విని,కింక బూనిన యలతి నగావు -చెలువు మొగమున నొక క్రొత్త పోలు పొంద -బుండరీ కాషు డగు

తెల్లబోయి యప్పు -డరుణ కమలాక్షు డగుచు మురాంత కుండు " అన్నాడు తిక్కన. మురాన్తకుడు అనటం లో రాక్షస నాశనమే చేసిన వాడు వీరో లెక్కా అనే భావం.కళ్ళు యెర్ర బడ్డాయి అంటే లోక ప్రళయం తప్పదని సూచన. "మొన తల బడియెదు నీచే--ప్పిన యట్టులతడవు లేదు బిరుదు లరైనీ--వును, వీరు,నిలువు డిదె భం-డనమెల్లి వచ్చే నూరతలు గను డిన్కన్"అని యెర్ర బడ్డ కల టో కోపం తోమురహన్తకుడు చెప్పాడు. లే నవ్వు వింత అందాన్ని చ్చింది మొగానికి.లోకానికి ద్రోహం చేసే వాళ్ళ విషయం లో గాంభీర్యం గా ఉండటం మహాత్ములలక్షణం. "మీరు కోరు కొన్న యుద్ధం మీ ముందుకే వచ్చి కూర్చుంది "అనటం లోకౌరవ సర్వ సంహారం తప్పదు అన్న సూచన. చివరకు తెగించి కృష్ణుడిని బంధించే ప్రయత్నం చేశాడు సుయోధనుడు. అప్పుడు చెప్పాడు చివరి సారిగా పెద్ద రాజు తో-"రోషము నా పయిం గలిగి క్రూరత కౌరవు లింత సేత, సం --తోషమ, నీవు ప్రాభవము తో దగ నాకు ననుజ్ఞఇమ్ము ని--ర్దోషత నేను నోపు గతి, దోర్బల దుర్జయు లైన వారి, వి --ద్వేషము జక్క బెట్టి, జగతీశ్వర, ఇంతక పోయివచ్చెదన్ " అని వీడ్కోలు తీసుకోన్నట్లుగా అన్నాడు. ఏది ఏమైనా లోక శాంతి కావాలి. తను దుర్యోధనాదులను చంప టానికి ఇంత వరకు కారణం కంపించ లేదు. ఇప్పుడు వాళ్ళే ఆ అవకాశాన్ని కల్పించు కొన్నారు. వినాశ కాలే విపరీతబుద్ధి. కారణం బలీయం గా ఉంది. అందుకే ఖండితం గా చెప్పే శాడు. "దుష్టుల్ని చంపి, రెండు పక్షాల వారికి రక్షణ కల్పిస్తాను - దీనికినువ్వు అనుమతించు "అని చంపే అధికారాన్నీ ముసలాయనకే కట్ట బెట్టాడు మహామతి మంతుడు పరమాత్మ. ప్రతి మాట ను చాలా అర్ధ వంతం గా, సమర్ధ వంతం గా మురారి చేత పలికించాడు తిక్కన. బంధువుల అను మతి తో తాను తన స్వంత మెన మామ కంశుడిని వధించిన సంగతిని కథ గా వర్ణించి గుర్తు చేశాడు. ధర్మ రక్షణకు బంధుత్వం అడ్డు కాకూడదు అని సూచించాడు. "సత్కులము బాలిమ్పగ వర్జిం పగరాదే దుష్టాత్మకు నీచు నొక్కరుని "అని కడపటి కర్తవ్యమ్ ఎరిగించాడు. అంతా వ్యర్ధమే అయింది. బూడిద లో పోసిన పన్నీరు. అయినా రాజ కీయం గా ఉదాత్త మైనరాయబారం ఇది. దీని వల్ల రెండు వర్గాల లోని వారి చిట్టా వృత్తులు, అభిప్రాయాలు వ్యక్త మైనాయి.

"పాండవులు శాంత శూరులు అని ముందే కృష్ణుడు చెప్పటం తో తాను వచ్చే ముందు, ద్రౌపది, భీముడు చెప్పిన మాటలు చెవిలో రింగు మంటూనే ఉన్నాయి. భీమార్జునుల మాటల్లో శౌర్యం తో బాటు, శాంతి కూడా ప్రచ్చన్నం గాధ్వనించింది. "ప్రశాంత గాభీరతా లక్షణం "అనటం లో పాండవులకు అది బాగా అన్వయించింది. అన్ని పాత్రలు తమ భావాలను బాగా వ్యక్తం చేశాయి కనుక ఈ రాయ బారాన్ని "ఏకాంకిక "అన్నారు. ఒక సారి ఫ్లాష్ బాక్ లోకి వెళ్తే,, ఉద్రేకం గా,భీషణం గా మాట్లాడే భీముడు శాంతి వచనాలు పలికాడు కృష్ణుని తో. చిరునవ్వు తో



కృష్ణుడు అతన్ని రెచ్చ గొట్టి మేల మాడాడు. అయినా వృకోదరుడు ఉద్రేక పడలేదు. సరసం గానే సమాధానం చెప్పాడు --"ఏమీ, పార్ధుడు నీవు, దండి మగలై ఈ వచ్చు కౌరవ్య సం -గ్రామ క్షోభము బాహు దర్పమున దీర్పంబెద్ద మిర్రెక్కి మి -మ్మెమెల్లన్ పెర గండి జుచేదము గా, కీ సారెకుం, బోయిరా --భీముందిత్తేరి రిత్త మాటలకు కోపిం పడుసూ, పెంపరన్"అని చాలాసరదా గా అన్నాడు. "ఓహో నువ్వు అర్జునుడు యుద్ధ ప్రవీను లై కౌరవ యుద్ధం చేస్తుంటే, ఎట్టు గా ఉన్న కొండెక్కి మేమంతా ఆశ్చర్యం తో చూస్తూ ఉంటాంకానీ బావా - ఇప్పుడోద్దులే -నువ్వెళ్లి రావయ్యా, ఉద్రేక పరిస్తే రెచ్చిపోయే వాడేమీ కాదు ఈ భీముడు "అని శాంతి మాత్రమె తమకు కావాలన్నాడు. ద్రౌపది మాత్రం రోశాగ్ని జ్వాలలు కురిపించింది. ఆమె క్రోధాగ్ని కౌరవులన్దర్నీ ఆహుతి చేస్తే తప్ప చల్లారదు అని తెలియ జేసింది. చాలా గంభీరం గా మాట్లాడింది. విశిష్ట లోక జ్ఞానాన్ని, వివేకాన్ని ప్రదర్శించి మాట్లాడింది. పాండవ ధర్మ పత్ని అని పించు కొండి. "ఓట యొకింత

యేనియు సుయోధను చిత్తము నందు లేదు "పొమ్మంది. "నీ మాటల వల్ల వాడి దురభిమానం పోతుందా ?పైగా పెరుగు తుంది "అని వాడిని కాచి వడ బోసి నట్లు వాడిమనో భావాన్ని వివ రించింది. కోడలు అన్న భావం ఎ మాత్రం లేకుండా జూదం రోజున దాసిగా చేసి, మహా పురుషుని, తన భర్తలు ఆ కొలువు లో మళ్ళీ చేరితే, తనకులభించేది దాస్యమే నని ఖచ్చితం గా చెప్పింది. కోడరికం కాదు అన్నది. భర్తలుతన గౌరవాభి మానాలను లెక్క చెయ్యటం లేదని, నిస్పృహ వ్యక్తం చేసింది.స్త్రీ నిస్సహాయత ను స్పష్టం చేసింది. ఆమె మాట లన్ని ఉత్తమ క్షత్రియస్త్రీ మాటలే. వీర వంశం లో జన్మించిన స్త్రీ పలుకులే. సామాన్య స్త్రీప్రవర్తనా విధానమే. చూడండి ఆమె ఎంత చక్క గా చెప్పిందో అన్న కన్నయ్యకు - "అరయమి జేసి కోడలనకప్పుడు, దాసిగా జేసి, నమ్మహా --పురుషుని పాలికింబతులు వోవగ,వీరలతోనవిను జే--చ్చెర జానీ కోటరంబు దగ జేయుదునో, యటు గాక, పాడిమై --వరవుడ మోపి జే యుదునో వారిక మాధవ నిశ్చయింపుమా ?"అని ప్రతిమాటను సార్ధకం గా ప్రయోగించాడు తిక్కన. స్త్రీ స్వభావాన్ని అద్దంలోచూపించాడు.

పాండవ వీరమాత కుంతీదేవి ఎన్నెన్నో కష్టాలను అనుభవించింది. కృశించి వరుగు అయింది. పాలలో పడ్డ బల్లి లా ఉంది ఆమె స్తితి. ఆమె మాటలువజ్ర ధారాలాగా ఉన్నాయి. ఇన్నాళ్ళు తన మనోవేదనను అత్యంత శక్తి వంత మైన మాటల ఈటెలతో గుచ్చి చెబుతోంది. "కొడుకు గాంచు రాచ కూతురేడ్డానికి -నత్తిపనికి నుచిత మైన సమయ మొదవే -దడయ టింక నొప్పదు జనములు -నట్లు గానిపురుషుల నరు మిమ్ము " అని తన కొడుకు లకు కర్తవ్య బోధ చేయమని మేనల్లుడు కృష్ణుని తో చెప్పింది. ఇదంతా సంధి ప్రసంగానికి ముందే చెప్పింది. "భుజబలమున జీవించుట -నిజ ధర్మమూ మెత్త బడుట నిన్ద్యము -మాద్రీ ప్రజలకు జెప్పుము ద్రుపదాత్మజ -గార్య మడుగు మానుము తగ నందరి లోనే " తన కొడుకుల కంటే నకుల సహదేవులైతే ఈ పరాభవాన్ని బాగా చల్లారుస్తారు అని కుంతిభావం. హస్తిన లో రాయబారం తర్వాతా కృష్ణుడు కలిసి జరిగింది ఆమె కు వివరించాడు. ఆమె -"వీరి గలయుట కష్టం బా పెరవు దప్పుతయు మేలై వచ్చే బొమ్ము-విడువను మానంబున్ "అంది. రోగీ, వైద్యుడూ ఒకటే కోరుకొన్నారు. పాండవులు తమ స్వభావానికి విరుద్ధ మైన, లోక న్యాయానికి వ్యతి రేక మైన సంధి ప్రయత్నప్రతి పాదనను చాలా కఠినం గా, నిర్దాక్షిణ్యం గ నిరసించింది. ఆమె క్షోభ భూదేవి క్షోభాయే. భూభారం తగ్గాలి అనేది ఆమె ఆరాటం. దుర్జను లతో పోట్టమిటి పొ పొమ్మంది. --"రాజుల కెందు నారయ బరాక్రమ జీవన వృత్తి దక్క, నెం-దోజ నిషిద్ధమండ్రు మునులుత్తమ సత్వులు, వంశ ధర్మముల్ --పూజితభంగి జేయుదురు బుద్ధి విహీనులు దాని దక్కి, -నిస్తేజ పు గూటికియ్య కొని నత బొందుదు రంబు జోదరా " అని ఆక్రోశించింది. క్షత్రియ రాజులు నమ్ము కో వాల్సింది భుజబలాన్నే. శత్రువు ల పై కక్ష తీర్చుకోవటం వారి సహజ ధర్మం. పరుల దయా దాక్షిణ్యా లపై జీవించటం రాజు కు నిషిద్ధం,నీచం. అని రాజ ధర్మాన్ని తగిన సమయం లో గుర్తు చేసింది. ఉత్తమ బాల శాలురు వంశ గౌరవానికి అనుగుణం గా ప్రవర్తించాలి. వంశానికి కీర్తితేవాలి. బుద్ధి హీనులు మాత్రమె పరాయి కూడు కు ఆశించి, దైన్యాన్నిపొందుతారు. పాండు రాజు కీర్తిని పాండవులు పాడు చేస్తున్నారు. సత్వ హీనంగా ప్రవర్తిస్తున్నారని విమర్శించింది. సంధి ప్రయత్నం మానక పోతే వారంతాబుద్ధి హీనులు, క్రుపణులు, క్షత్రియ తేజో రహితులు అని నిష్ఠుర మాడింది. నిస్తేజ మైన జీవితం కంటే రాజుకు వీర మరణం మేలు అని ధ్వనించేటట్లు చెప్పింది. ఆభిజాత్యం చాలా అవసరం అని గుర్తు చేసింది. పరాక్రమాలను ఆశ్రయించి మాత్రమె రాజు దేని నైనా సంపాదించాలి.అదే జీవనం. అది కాక అడుక్కు తెచ్చు కొంటె అది "కూడు "అవుతుందని ఎద్దేవా చేసింది. చక్కని శబ్ద ప్రయోగం చేశాడు తిక్కన. ఈ పద్యం లో ప్రతి శబ్దం శక్తి వంత మైనఅర్ధ సంపద తో ప్రయోగించాడు. దీనినే "విశిష్టార్ధ వ్యంజనం "అన్నారు ఆలంకారికులు. వీర పత్ని వీర మాత పలికే పలు కులు గా క్షాత్ర తేజో మయ స్వరూపం గా ప్రత్యక్ష మవుతాయిఆమె మాటలు. ఆత్మ గౌరవం గల స్త్రీ గా, కోడలికి జరిగిన అన్యాయాన్ని దిగమింగు కొన్న అత్తగారిలా ఆమె క్షోభ వర్ణనా తీతం. ద్రౌపది హృదయ బాధ నుఅర్ధం చేసుకొన్న అత్త గారామే. ఉత్తమ కుల కాంత, తమ ఇంటి వధువు, తన కుమారుల సహా ధర్మ చారిణి అయిన అయోనిజ కు మాటలతో వర్ణించ రాని పరాభవాన్ని మర్చిపోలేకపోతోంది కుంతి. తగిన ప్రతిక్రియ జర్గితే తప్ప, ఆ తల్లి ఆవేదన తీరదు, చల్లారదు. కేవలం రాజ్య లాభం నిష్ప్రయోజనం. అలాంటి జీవితం వ్యర్ధం. ఆ విషయాలన్నీ బాహాటం గా నే చెప్పింది. "మరచిరే కొలువున ద్రౌపది -బరచిన బన్నంబు ధర్మ పదము దొరంగన్.-పేరచుట కప్పటి కది తగు -జేరచిన చొ, వెదక వలదే చిరతర కీర్తిన్ "అని భార్యకు జరిగిన పరాభవానికి ప్రతీ కారం చెయ్యటమే తన కొడుకుల కర్తవ్యమ్ అని గుర్తు చేశానని కొడుకు లతో చెప్పమని మేనల్లుడికి చెప్పింది. ఆమె పాలకులకు భీష్మ ద్రోణాదులు కూడా ఆశ్చర్య పోయారు.. కార్య వాదం గా మాట్లాడే కృష్ణుడు, కుంతి కూడా ఇలా బరి తెగించి చెప్పటం తో"ధర్మజ మహా సముద్రానికి చెలియలి కట్ట లేదని" గ్రహించారు. ఏమి చెయ్యాలో తోచని వింత స్తితి సందిగ్దం లో పడి పోయారు. ఇలా ప్రతి సన్నీ వేశం హృదయాలకు హత్తు కుంటుంది. తిక్కన మహా కవి ప్రతి పాత్ర వెనుక దాగి ఉండి, సూత్ర దారి యై సంభాషణలు చెప్పించి నట్లు కనీ పిస్తుంది. ప్రతి పాత్రనుస్పష్టం గా మలిచాడు. స్పష్టత ఉంది. సంభాషణ లన్ని శక్తి మంతాలు.. శిష్ట వ్యావ హారిక భాష నె ఉపయోగించాడు. ప్రతి పదం లోను తెలుగు నుడికారం జీవం పోసుకొన్నది. గీత, కంద పద్యాలతో అంటే చిన్న పద్యాలతో విశిష్ట మైన భావాలను తెలియ జేశాడు. దీనితో"దేశీయత "కు పెద్ద పీట వేసి నట్లయింది. తెలుగు పలుకు బడులు, లోకోక్తులు, చక్కగా ప్రయోగించ టానికి మంచి వేదిక దొరికింది తిక్కనకు. ఇతి వృత్తం అంతా మానవ జీవితానికి సన్నిహితం. మూడు రాయబారాల్లోను మంచి వైవిధ్యం ఉంది.



తిక్కన లోకజ్ఞత, రాజ్యాంగ పరిజ్ఞానం బాగా వెల్లడయింది. శ్రీ కృష్ణ రాయబారం లో కృష్ణుని జీవిత తత్త్వం కూడా బాగా ఆవిష్కారమయింది.మానసిక స్థితులను వెలికి తీయటం తో రచన చైతన్య విలసిత మైంది. మనుమ సిద్ధిరాజు గారి మంత్రిగా, రాజ్యాంగాని నడి పాడు కనుక, ఆ అనుభవ సారం ఇక్కడపిండి పడేశాడు. స్వానుభవానికి మించింది లేదు కదా. ఉద్యోగ పర్వం అంతా"నానా రస చిద్విలాసం ". రాజ నీతి వైదుష్య ప్రదర్శనం. ఆంధ్ర మహాజనులు ఈపర్వం లోని ప్రతి కణాన్ని ఆస్వాదించి ఆనందించే టంత మధురం గా వ్రాశాడు తిక్కన. అందుకే ఈ పర్వానికి అంతటి ఆకర్షణ శక్తి.

## యుద్ధ పంచకం లో విక సించిన మానవ ప్రకృతి-1

భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక పర్వాలను యుద్ధ పంచకం అంటారు. యుద్ధ రంగం జన జీవనానికి దూరం గా ఉంటుంది. యుద్ధం లో వీర ధర్మం ఆకర్షణీయం గా ఉండదు. జుగుప్స బీభత్సా లతో నిండి ఉంటుంది. అందుకని సామాన్యులకు రుచించదు. అయినా ఇందు లో కూడా తిక్కన, అసాధారణ ప్రజ్ఞను చూపి, చదవరులకు ఆకర్షణ కలిగించాడు. ఆయన ప్రతిభ సర్వతో ముఖం గా వికసించింది. -"వేద వ్యాస మునీశ్వరు --పదంబులు దలచి మ్రొక్కి, భక్తీ రసైకా -స్వాదన సుకరానందో --త్పాదన దివ్య మతి నగుచు దగ నేరిగింతున్ "అని సంజయుడు ధృత రాష్ట్రునికి చెప్పిన మాట తిక్కనకూ వర్తిస్తుంది. 18 అక్షౌహిణీ సైన్యం తో, 18రోజులు జరిగిన యుద్ధాన్ని రస వంత మైన కావ్యం గా వ్రాయటం అంత తేలికైన పనేమీ కాదు. అందుకే వ్యాసర్షి కి నమస్కరించాడు. భక్తీ రసం తో ఆనందం తేలిగ్గా లభిస్తుందని భావించి, ఆ ఆనందం తో దివ్య మైన మనోబలం తో యుద్ధ పర్వాన్ని రచిస్తానని ప్రతిజ్ఞ చేశాడు తిక్క యజ్వ. -"ద్వాపరే ద్వాపరే విశ్నుహ్ వ్యాస రూపో జనార్దనః 'అన్న దాని ననుస రించి, ద్వైపాయన మహర్షి సాక్షాతూ శ్రీ కృష్ణుడే కనుక, ఆతని యెడ భక్తీ తో, దివ్య చక్షువు తో, బుద్ధి వికాసం తో, ఆర్ష ధర్మ మైన కవితా శక్తి తో రచన చేసి నట్లు మనం భావించాలి. విసుగు కల్గించే యుద్ధ వర్నలు లేకుండా, వర్ణనా వైవిధ్యం తో, సందర్భోచిత మైన శైలి తో, రస పోషణ, ఔచిత్యం, ఉట్టి పడేట్లు చిత్రించాడు. చైతన్య విలసితం గా, అర్ధ స్ఫూర్తి, భావ గాంభీర్యం లతో ఉదాత్తత ను కల్పించటం తిక్కన శేముషికి నిదర్శనం. యుద్ధానికి మనోహరత్వాన్ని రూపు కట్టించిన మహా కవి తిక్కన.



భీష్ముడు యుద్ధం లో కూలి పోయాడు అర్జునుని వీర విహారం తో. ఆ బాధ తో ధ్రుత రాష్ట్రుడు --"అంచిత తాల కేతు కిరనాలి మేరుఘ్నులు గాగ, మౌర్వి మ్రో--యించుట గర్జ చందనమున నేచి, విరోధి దవానలంబు, మా--యించు శితాస్త్ర వర్షమున నిట్టిది భీష్మ మహాభ్రం మెట్లడం- గిన్చేనో శిఖండి యను గ్రుత్రిమ వాయువు దాకి దైవమా !"-- "పెరిగి పాండవామ్బుధివెల్లి విరిసి నపుడు -నిలువ నిమ్మగు దీవిగా నిన్ను దలచి -యుండ నత్యంత తుచ్చ శిఖండి పల్వ -లాక్రమంబున మునిగి తె యకట తండ్రీ "అని ముసలి రాజు ఏడ్చేశాడు. "దైవమా "అని రెండు సార్లు అంతం తో ఇంకా తన చెయ్యి దాటి పోయిందని గ్రహించాడు. ఇదీ మానవ ప్రకృతి. విధి విలాసం, వైపరీత్యం ఎదిరించ రానివి. పాండవులు అనే మహా సముద్రం ఉప్పొంగినా, మునగని భీష్ముడు అనే ద్వీపం శిఖండి అనే చిన్న నీటి మడుగు పొంగ టం వల్ల ఆక్రమింప బడింది మునిగి పోయింది. అంటే విధి బలీయం కదా. ఇప్పటి దాకా కౌరవులకు ఆశ్రయమైన దీవి మునిగి పోతే వారి ఉనికి కే మహా ప్రమాదం కదా. ఇంక వాళ్ళ కు ఆశ్రయం ఏదీ, ఎక్కడ తల దాచు కొంటారు?పాండవ సముద్రం లో కౌరవులంతా మునిగి పోవాల్సిందే నని ధ్వని. ఆ మాట ముసలాయనే అనే శాడు. అర్జున పరాక్రమం వర్ణించ టా నికి ముసలి రాజు కు ఎన్నో మాటలున్నా పదాలున్నా "శిఖండి "అనే మాట నే ప్రయోగించాడు రెండు సార్లు. ద్రుపదుని కొలువు లో" పేడి వాడి "లా గా తల దాచుకొన్న వాడా ఇంతటి పని చేసింది అని ఈస దింపు, అసహ్యం కూడా. పక్షపాతం నర నరాన జీర్ణించి పోయింది ముసలి రాజుకు. అయినా కురు వంశాన్ని ఇప్పటి దాకా నిలబెట్టి కంటికి రెప్ప లా కాపాడిన పితామహుని పతనానికి గుండెల్లో ఎక్కడో మూరు మూల కలుక్కు మంది.చదివిన మనకూ బాధ కల్గిస్తాడు తిక్కన.

"అమర నదీ సుతుండు వాడి నప్పుడు, వీరల బుద్ధి సంధి కా --రయమునకు జొచ్చు నింక నని, యాత్మ దలంచితి నమ్మహాత్ముడున్ --సముచిత వాక్య వృత్తిగురునాయకు దేర్పరగా జుచే, చిత్త దో --ష మహిమ, నద్దురాత్ముడు, ప్రశాంతత నొందద ఎన్ని భంగులన్ "అని శల్య వధ తర్వాతా అర్జునుడు దుర్యోధనునిమూర్ఖత్వాన్ని గురించి కృష్ణుని తో చెప్పాడు. -"గంగా తనయుడు దెగినను -సంగరమున నుత్స హింప జనునే తమకున్ --పెంగలులని, యప్పుడు దేలి --యంగా నేరిగితి సుయోధనాదుల గృష్ణా ;;!అని కిరీటి కుంగి పోయాడు. ఇలా భీష్ముని యుద్ధౌన్నత్యాన్ని, పెద్దరికాన్ని కురువంశ పాలకుడిని రెండు వైపులా వారూ ఎంత స్పష్టం గా అంచనా వేశారో తెలుస్తోంది. దీని వల్ల యుద్ధ పరిణామం కూడా నిశ్చయ మై పోయి నట్లే. ఈ పద్యాలలో ప్రతి పదం ధ్వని ప్రధానం. అర్ధ గౌరవంతో తొణికిస లాడాయి. ఇవి యుద్ధ పర్వం లో తిక్కన చేయ బోయే భావి శిల్పానికి మచ్చు తునకలు మాత్రమె.

ద్రోణ పర్వం లో కూడా కౌరవ సేన స్తితి ని వర్ణిస్తూ -"పతి రహితాత్ముడైన సతి భంగియు, గోపక హీన మైన గో--ప్రతతి విధంబు, సస్య విదూర స్తితి యైన ధరిత్రి చాడ్పును -ద్దత హరి శూన్య మైన వసుధా ధర కందర భూమి చందమున్ --, మతి మన సేన దోచే బుధ మాన్యుడు భీష్ముడు లేక యుండుటన్ "అని వర్ణిస్తాడు. భర్త లేని స్త్రీ, కాచే వారు లేని ఆవులు, రక్షణ లేక పోవటం వల్ల దుర్మార్గుల బారికి, మృగాల నోటికి ఆహారం అవుతాయి. పంట లేని భూమిని చూస్తె, ఈసడింపు, సింహం లేని గుహ అంటే తెలికదనం లోక సహజం. అలాగే భీష్ముడు లేని కౌరవ సైన్యం అనాధ, దీన, అని తప్పక పాండవుల చేతి లో చిక్కుతుంది అనే ధ్వని ప్రధాన పద్యాలివి. అంతేనా ఇంకా విజ్రుమ్భించి మానవీయ కోణాలను ఆవిష్కరిస్తాడు. "తన ప్రియుడు,, రక్షకుడు అయిన బార్ధ ను తన ఎదుటే మింగిన తోడేళ్ళ గుంపు తనను చుట్టూ ముట్టగా భయ కంపిత అయి, దిక్కులు చూసే ఆడ జింకలా ఉందట కౌరవ సైన్యం. ఇది అత్యంత ప్రత్యాన్విత ధ్వని తో కూడిన పద్యం. "భీష్మ నాజిం గబళించిన పాండవుల విక్రమ లీల "ను అత్యంత అద్భుతం గా వర్ణించాడు తిక్కన. పాండవుల అకలి తీర లేదని, మిగిలిన వాళ్ళ

ను కూడా మింగనిదే శాంతించదని ధ్వని. ఆకలి మహా ఎక్కువ గా ఉండే జంతువూ తోడేలు. అందుకే ఆ పదాన్ని సందర్భోచితం గా ప్రయోగించాడు.

అసలు యుద్ధానికి బయల్దేరు తున్న పాండవ కుమారా వర్గానికి “కన్నె కయ్యం “అవటం తో ఉత్సాహానికి అంటూ లేకుండా పోయింది. ఎప్పుడెప్పుడని ముందుకు దూకు తున్నారు పాండవులు. నవ యవ్వనం లో ఉండటం తో నడక -మదించిన ఏనుగు లాగా ఉందట. భూమి కంపిస్తోందట. ఉత్సాహ, వికాసాలతో వాళ్ళ ముఖాలు భుజ గర్వం తో పొంగి పోతున్నాయట..”కన్నె కయ్యం -మాద్యద్దంతి యూధం “అన్నాడు. మనోహర మైన అర్ధ స్ఫూర్తి. ప్రళయ కాలం లో తానడవ లీల లో ప్రచండ మూర్తి అయిన పరమ శివుని లా విజ్రుమ్భిస్తున్నాదట భీష్ముడు. ఎదిరించే మొన గాడు లేక పాండవ సైన్యం కకా విక లైంది. అప్పుడు వచ్చాడు యువ కిశోరం అభి మన్యుడు. కృత వర్మ, కృపు లను అడ్డగించి, ముత్తాత భీష్ముని పైకి లంఘించాడు. -ఆ వైభవం చూడండి --”ఆ సౌభద్రుమ్ డుగ్రపు-వేసవి దావాగ్ని శుష్క విపినంముల నిరా--యాసంబుగ- -' దరి కొను గతి -భాసిత శర శిఖలు వారి పై బర గిన్చేన్ “--”రంగ త్ప్రద నస్న్స్యుత్యాటు -రంగాముద్దై, తాన్డవాభి రాతుడగు హరు లీ--లం గడగివీర నృత్యము -సంగర రంగమున జేసే శత్రులు మెచ్చన్ “----పనికి రాణి, నీరస మైన అడవిలా ఉన్న కురు సేనకు తీవ్ర వేసవి దావాగ్ని అభి మన్యుని క్రోధం. ఊరికే దాహించేస్తుంది. దీనితో సర్వ కురు సైన్య విన్నషణం ధ్వనిస్తోంది. అడవికి నిప్పు అంటూ కుంటే అంతా కాలిస్తేనే కాని చల్లారదు ఆర్పే వారుండరు. అలానే ఉంది కౌరవ సైన్య స్తితి. అభి మన్యుని శౌర్యం ప్రళయ కాల రుద్రుని తో పోల్చటం వల్ల ఉదాత్తత కలిగింది. బిందువు తో ఉన్న “డకారం “,పాదాన్తాలలో విరుపు వల్ల శబ్దార్ధాల తో మంచి భావం, ధ్వని లో లయకాల తాండవం స్పష్టం గా కళ్ళకు కన్పిస్తాయి. భీష్ముడు అష్ట మూర్తి అయిన హరుడు. అభి మన్యుడు తాండవ హరుడు. ఈ పోలిక లో అష్ట మూర్తి ఆధిక్యత ధ్వనిస్తుంది. ఇద్దరు హరుల పరాక్రమం విలాసం. అంతే కాదు -ఇంకో చోట అభి మన్యుడు అనే కార్చిచ్చు కౌరవ సేన అనే దూది పై పది నట్లుంది అన్నాడు. ఇది ఇలా ఉంటె --దుర్యోధనుడు ఎడురైనాడు. ఎలా ఉన్నాడు అంటే -”ఆకలి లో ఉన్న సింహం దగ్గరకు చేరే ఏనుగు లా గా ఉన్నాడట. ఇక్కడ ఏనుగు దుర్యోధనుడు. సింహం అభి. ఇక్కడా కౌరవ పరాభవం ధ్వనించింది. ఇంతలో క్రుపఅశ్వథామ స్వతామ, కర్ణులు వచ్చి అభి మాన్యుని బారి నుండి, కురురాజు ను కాపాడు కొన్నారు. అభి మాన్యుని నుండి అభి మాన్యుని రక్షించటం క్రూర వ్యాఘ్రం తిన బోయే మాంసాన్ని హరించటం వంటిది అట. క్రోధాగ్ని తో వీరందరి పై బాణాగ్ని కూరి పించాడు యువ కిశోరం. గర్జన తో పారి పోయిన లెల్ల గుంపు లాగా పారి పోయారట.

## యుద్ధ పంచకం లో వికశించిన మానవ ప్రకృతి

ప్రకట బలాధ్యులోక్కత దిరంబాయి, పల్వురు వీక, భూమి పా-- లునకు నడ్డ మైన దవులంబడి, హుమ్మని నోరి కంద, నా--చి గోన మ్రోగు బెబ్బులి విశేషము దోపగ, బార్దు పట్టి, సా --యకముల నొంచి నం దెరలి రందరూ లేళులపిండు నాకృతిన్ “

పద్మవ్యూహం



పద్మ వ్యూహం లో అర్జున పుత్రుని విశృంఖల వీర విహారానికి ఈ విధం గా నే పద్య రచన జరిగింది. ద్రోణునికి ఏమీ పాలు బోవటం లేదు. కర్ణ, శకుని, శల్య, అశ్వత్థామ లను అస్త్ర గురుడైన ద్రోనాచార్యునికి అధర్మానికి ప్రోత్స హించ క తప్ప లేదు. తీవ్ర మైన లోక నిండా కూడా భారించాల్సింది ఈ అవి వేక చర్య వల్ల. అందరు చేరి ఒకన్ని చేసి శస్త్రాస్త్రాలతో కొట్టి చిక్కుల్లో పడేశారు. అయినా "వాలును, బలకయు ను, గొని, య- బ్బాలుడు రాయ మార గణన భాగంబు న,కు --న్మోలిత ధృతి సారుండై--లీల నెగసి పోయే మండలీ భూత గతిన్ "---"తన విద్య కలిమి వినతా --తనయుని భంగిం జరిం ప దామ తమపై డిమ--



పూనా నూరుకు నను తలంపున -మన యోధులు భయము గొనిరి మనుజా ధీశా "గలని సంజయుడు అభి మన్యుని పరాక్రమాని విప రించాడు. ఈ విధం గా ద్రోనాదులు ఊహించని అద్భుత విధానం లో అభి పరాక్రమం తో వీర విహారం చేశాడు. ఓర్వలేని గురుదే అతని ఖడ్గాన్ని ఖండించే శాడు. అయినారాధా చక్రం తీసుకొని ఉపెంద్రుడి లా మీద పడ్డాడు. --"కుంభ సంభావుడున్న దిక్కునకు గవిసి --యడ్డు పడు సేన జించి చెందాడు నక్కు --మార వరుని మేని యొప్పును మగతనంబు --జలము, బలము గీర్తించే నిర్జరా గణము "

అపకారం చేసిన వారిని కాటేసి చంపటం కృష్ణ సర్పానికి సహజ లక్షణం. అలాగే మీద పడ్డాడు అభి. వీరాధి వీరు లందర్నీ చీకాకు పెట్టాడు. ఒంటరి పోరు తో అలసి పోయాడు. చివరికి దుశ్శాసన కుమారుడిని చంపి, తానూస్వర్గం చేరి చరిత్ర సృష్టించాడు అర్జున సుతుడు అభి మన్యుడు. యువకులకు ఆదర్శ మీనాడు. విధి వంచితు దాయాదు. కమలా కారాన్ని కల్లోలం చేసే వన గజాన్ని దయ లేకుండా ముట్ట డించిబోయ వారు చంపినా విధం గా అందరి అధర్మ ప్రవర్తన తో మహా వీరాధి వీరుడు అభిమన్యు కుమారుడు నెల కోరిగాడు. ఈ విషయాన్ని సంజయుడు ధ్రుత రాష్ట్రునికి అద్భుతం గా వర్ణించి వీనుల విందు చేశాడు ముసలి రాజుకు. సంజయునికి మాత్రం తీవ్ర మనో వేదన్న కలిగించింది అభి మరణం -"జగము లన్ని యు తేజమున వెలిగించి -యపరాద్రి సేరిన, తపను మాడ్కి --దార బైనా కాన్లు దరి కొని నివురు గా --జేసి, యారిన, దవ శిఖి

విధమున --గగనంబు తో రాయు కరడులు గల జాలం --బివు ర బారిన మహార్ణవము కరణి -యున్నత గతి సెడి యుర్వి పై గడు విన్న --నైపది యున్న సుధాంశు భంగి --బీరమున దన వారికి బెమ్పోనర్చి -యరుల సమయించి వస మరి, యనువు దప్పి, లెగియు జుడ్కి కి జాల వ్రేగ గుచు బొలిచె --మహిత మూర్తి శోభితుడు ధన్యుడదిప "తిక్కన సంజయుని నోటి తో పలికించిన ఉపమానాలన్ని ఉత్తమోత్తమం గా ఉంది అభి పటిమ ను మహోన్నతం గా పెంచాయి. మూడు లోకాలను వెలిగించిన సూర్యుడు అస్తమించాదట. అరణ్యాన్ని బూడిద చేసిన దావాగ్ని ఆరి పోయిందట. మహా సముద్రం ఇంకి పోయిందట. లోకాలను వెలిగించే చంద్ర బింబం భూమి పై వాలి పోయిందట. ఇదంతా కాల వైప రీత్యం -విధి విలాసం. శుదాంషుడు అనటం లో మహా పరాక్రమం మనోహరం గా ఉందని భావం. హృదయ రంజకం గా యుద్ధం చేశాడని అర్ధం. అతి లోక యుద్ధ విహార స్వరూపం చూపించటం, మహత్తర మైన ఉపమానాలు వాడి, మన మనస్సు లను లాగి వేశాడు తిక్కన. అయ్యో పాపం అని పించేట్లు చేయ గలిగాడు అదీ సహృదయ స్పందన. లోకోత్తర పరాక్రమానికి లోకోత్తర ఉపమానాలు. ఔచిత్యానికిది పరా కాష్ట.

పద్మ వ్యూహం లో అభిమన్యుడు ప్రవేశించ టానికి ముందే తిక్కన పలికించిన వాక్యాలు అనర్ధాన్ని సూచించేవి గా కానీ పిస్తాయి. "నీకు యుద్ధానుభావం లేదు. సాహసం చెయ్య వద్దు "అని అభి సారధి ముందే హెచ్చ రించాడు. దానికి అభి --"అనవుడు నల్ల నవ్వి, దతతనికి ట్లను దేవ యుక్తుడై -యనికి బలారి వచ్చిన, బురారి గానంబుళు, దాను బన్నినం --గినిసి కడంగి, క్రీడియు కృష్ణుడు డాకిన నే, జయింతు, మా--ర్కొని, యను చుండుడున్, సరకు గొందునె ద్రోణుని తోడి యోదులన్ " ఇవి ఒక వీరుని ఉత్సాహ వాక్యాలే కావు. విధి ప్రేరితం గ మృత్యు ముఖం లోకి ప్రవేశించే వాడి నోటి నుండి వచ్చిన అతి సాహస వాక్యాలు. అతి ఆవేశం తో, అహంకారం తో అన్న మాటలు. ఆరి పోయే దీపం ఒక్క సారి మినుకు మన్నట్లు వెలిగింది అంతే. ఇలా అభి మన్యు యుద్ధం లో విషాదం గర్భితం గా ఉంది. మర్నాడు అర్జునుడు వీర విహారం చేశాడు. సైంధవ రక్షణ కోసం ద్రోణుడు విశ్వ ప్రయత్నం చేసినా దాన్ని విఫలం చేయ టానికి అర్జుండు ప్రదర్శించిన అస్త్ర విద్యా నైపుణ్యం, భీమ, సాత్యకి ల శౌర్యాలను అద్భుతం గా వర్ణించి ప్రత్యక్ష దర్శనం చేయించాడు తిక్కన.

సైంధవ వధ కోసం అర్జునుడు ఏకాకి గా పద్మ వ్యూహం లోకి ప్రవేశించాడు. అతనికి సహాయం చేయ టానికి భీముడు వచ్చాడు.



ద్రోణుడు అడ్డు పడ్డాడు అంతకు ముందే సాత్యకి ద్రోనుడిని తప్పించు కొని లోనికి ప్రవేశించాడు. సాత్యకిని పోనివ్వటం లో ద్రోణుడికి మనసు లో ఆంతర్యం ఉంది. సైంధవ వధ తో పాటు సాత్యకి రక్షణ కూడా అర్జునుని పై ఉంటుందను కొన్నాడు. ఈ పరిస్తితి లో భీముడు కూడా లోపలి చేరితే తమ పని ఖాళీ. నిజం గానే, యుద్ధం లో అలసి పోయిన సాత్యకిని అర్జునుడు కాచు కొన్నాడు. శత విధాల భీమున్ని లోపలి పోకుండా అడ్డు కున్నాడు ఆచార్యుడు. ఇక్కడ భీమ పాత్ర ను చాలా గొప్పగా పోషించాడు "నీ తమ్ముడు నా అనుమతి తో లోనికి ప్రవేశించాడు. నువ్వు మాత్రం నన్ను గెల్చి లోపలి వెళ్లాల్సిందే "అని చెప్పాడు. భీముడికి కోపం వచ్చింది --"నరుదొక రది కుని యను మతి జొర దలచునే -మనుజ సేన, సుర బాల మీనన్ -దెరలి కొని విచ్చల విడి నరుగున్ దన వలచిన ఎదకు -నది యట్లుండెన్ "అని తమ్ముడి శక్తి సామర్ధ్యాలను ఏకరువు పెట్టాడు అర్జునుడు లోపలి

వెల్ల టానికి ఎవరి అనుమతీ అక్కర్లేదు పొమ్మన్నాడు. అయితే తాను అర్జునుని లాంటి వాణ్ని కానని తన మగటిమి ని తెలిపాడు --"ప్రియమున వల్కి, నిన్నను సరిమ్పగా, పార్థుడు కాదు సుమ్ము, దు --ర్జయ భుజ శక్తి, నిర్మదిత శత్రుడు భీముడు గాని, నీవు, డం --డ్రియు, గురుండు బ్రియుమ్ము నని, ప్రీతి యొనర్చెద బూని వైరికిన్ --జయ మొన రింతు గాక,యని సేతుసే దర్పము సూప కుండునే "అని తన గద ను విసిరాడు. దాని కాంతులు అన్ని వైపులకు ప్రసరిచాయి. గురువు గారి రథం ముక్కలై పోయింది. ఆయన వేరొక రథం ఎక్కి వచ్చాడు. ఆయన్ను గెల్చి లోపలి వెళ్లటం సులభం కాదని గ్రహించాడు. ద్రోనుడిని విముఖుడిని చేసి, ఆ వ్యవధి లో ల్పలికి ప్రవేశించాలని నిర్ణ యించాడు. ఆ ప్రయత్నాన్ని తిక్కన పరమ రమణీయ మైన పద్యం లో పోదిగాడు -- "అరదము డిగ్గి, యప్పటు శరా'వలికోర్చి, మొగంబు వాచీ, స -త్వరుడాయి, వాన పై గురియ వంచిన మస్తకమొప్ప బోవు, సుమ --దార వృష భంబు లీల జానీ,, దర్ప మేలర్పగా నొక్కచే, నొగల్ --పెరవున బుట్టి, తేరు ప్రజా విస్మయ మందగా వీచి పైచి నన్ ;;--వర్షం పడుతుంటే -అతి ఉత్సాహం తో చేల రేగి, తల వంచి ఎత్తైన ప్రదేశాన్ని, కొమ్ముల తో ధీ కొనే కోడే గిత్త లాగ ఉన్నాడట భీముడు. ఎంతో సహజ మైన వర్ణన. అతని మాటల్లో క్షాత్రం, రాజసం ఉట్టి పడ్డాయి. గురువు కనుక పిత్రు సమానం గా ఆరాధిస్తాను కాని, శత్రువుకి జయం చేయాలని ప్రయత్నిస్తే -శౌర్యం చూప కుండా ఉంటానా -అని అతని మాటలకు అర్ధం. చేతల్లో చూపించాడు. ఇందులో పరాక్రమ ఉద్ధతి, వినయం, వివేకం ఉన్నాయి. ఇంతటి భీకర యుద్ధం లో కూడా ఇంత మనోహర వర్ణన.

భీష్ముడు, అర్జునుడు తీవ్రం గా పోరాడుతున్నారు. కృష్ణుడు ఆగ లేక పోయాడు. రథం దూకి, భీషుని పై కుప్పించి, ఎగసే ఘట్టాన్ని పోతన్న గారు భాగవతం లో వర్ణించిన పద్యం మనకందరికీ వచ్చు. ఇక్కడ అదే దృశ్యాన్ని తిక్కన ఎలా వర్ణించాడో చూద్దాం --"ధరణీ చక్రము గ్రక్కునం గదల, దిగ్దంతా వలి శ్రేణి, కం --ధరముల్, మ్రొగగా బదన్, దిశా వలయముత్కంపంబు గా, నీ బలం --బురులం బారాగా భీష్ము పై గమిసే రౌద్రోద్రేకము జుచి, ఖే --చార లోకంబులు సంచరింప హరి చంచాద్భాహు ఘోరాకృతిన్ "అని వర్ణించి వెంటనే దృశ్యాన్ని మార్చేస్తాడు తిక్కన. --"లలిత పీనామ్బరంబు విలాస మొప్ప --సింహ, నాదోద్భాతం బరగు చెలువు తోడ --మెరుగు వెలుగును, గర్జయు మెరయ వచ్చు --కారు మొగిలన కృష్ణు నాకార మొప్పె ".నిమిషాల మీద పద్యాలు దృశ్యాలు మార్చి భావ శుద్ధి తీసుకు రావటం తిక్కన చాతుర్యం. ఆతన లో భక్తీ, ఇక్కడ శ్రీ కృష్ణుని వీర విలాసం. అంతే తేడా.

మేఘ ధర్మం కాంతి, గర్జనలు. నలుపు రంగు ను వాచ్యం చెయ్య కుండానే వ్యంగ్యం తో చెప్పాడు తిక్కన. సహజ మనోహరాలైన ఉపమానా లతో ఉదాత్త మైన విశేషార్థాలను ధ్వనింప జేయటం లో తిక్కన గడుసు వాడు. ఇదే ప్రౌఢ కవి లక్షణం. ఈ ధ్వనికే "కావ్యాత్మ "అని పేరు.

అర్జునుడు వేసిన బాణాలతో శరీరం అంతా గాయాలై రక్తం ఓడుతున్న కర్ణుడు "గిరికా నిర్ఘర ప్రకార శోభితా చలం "లా గా ఉన్నాడట. రక్తం తో తడిసిన శరీరం కమనీయ కాంతి తో ఉంది. మహాస్త్రాల కాంతి గొప్ప గా ప్రకాశిస్తోంది. రథం పై ఉన్న కర్ణుడు సంధ్యా కాల సూర్య బింబం లా శోభితం గా ఉన్నాడు. పశ్చిమ దిశ కు చేరే సూర్య బింబం లాగా ఉన్నాడు. "భాస్వర "అనే శబ్దం ఇటు కర్ణుడికి, సూర్యుడికి కూడా వర్తిస్తుంది. త్వర లోనే అర్జునుని చేత వధింప బడతాడు అనే ధ్వని. ఈ విషయాన్ని అస్తమించే సూర్యుడు అనటం లో ధ్వనింప జేశాడు. సూర్యుడు తన ప్రచండ ప్రతాపం తో లోకాన్ని తపింప జేసి, తన కాలం తీర గానే అస్తాద్రికి చేరటం సహజం. సూర్యుని అంశ తో జన్మించిన కర్ణుడు కూడా నేలకు ఒరుగుతాడు అని ధ్వని. అందుకే తిక్కన -;;దారుణాస్త్ర జాలామ్ముల వైరి సైన్య --తాప మొనరించి యా సూత తనయ తరణి --పార్ధ దుస్తర కాలవైభవము గడవ -నను వు లేమి, నవ్విధంబున నస్త మించే "కర్ణుని ప్రతాపాస్త్రామయం, సూర్య ప్రతాపాస్త మయం తో అభేద మైన రూపకం చేశాడు కవి. కర్ణుని ప్రతాపాన్ని వర్ణిస్తూ, దావాగ్ని జ్వాల అన్ని వైపులా వ్యాపించినట్లు, బాణ జ్వాలలు సర్వ దిశలా ప్రయోగించాడట కర్ణుడు. కాలే వృక్షాలు, వెదుళ్ళు, ఫెళ ఫెళ ఫెళ ధ్వనించి నట్లు కర్ణుని వింటి ధ్వని విని పిస్తోందట.

భీముడు గద తో గజ సమూహం పై దాడి చేయటం వల్ల ముఖం ప్రకాశించిందట సరైన జోడీ దొరికి నందుకు. "ఏనుగు నెత్తుట గదయున్, దాను దడసి, విలయ కాల దండ ధరుణి చందమున "ఉన్నాడట భీ ముడు. అంతే కాక "అడవి దరి కొనిన, పావకు వడువున భీముడు "కౌరవ వ్యూహాన్ని పొడి చేశాడు. పీనుగు పెంట చేయటం దండ ధరుడు అంటే యముని లక్షణం. అడవిని కాల్చటం అగ్ని పని. దహించిన కొద్దీ దావాగ్ని వ్యాప్తి విస్తారం అవటం సహజం. దాహక శక్తి కూడా వృద్ధి చెందు తుంది. అందుకే భీముని దేహం ఉప్పొంగి పోయింది. అతని శక్తి, ఉత్సాహం ఇనుమడిస్తున్నాయి. సారధిని రథం లోనే ఉండమని, దిగి, గదతో వీర విహారం చేసిన తీరు అత్యద్భుతం, దివ్య శక్తి స్పోరకం. అగ్ని కి తర తమ భేదాలుండవు. అలానే భీముడు అందర్ని స్వా హా చేస్తున్నాడు --ఆ వైభవం చూడండి --

"కవిసి యుగాంత దండ ధరుని కైవడి, గోలు మసంగి, కుంభముల్ --పవులగ, దున్దముల్ దునియ, బ్రక్కలు వ్రక్కలు గాగ, దర్పమున్ --జవము బలంబు, నొప్పగ,గజంబుల వ్రేసిన, నెత్తు రోల్క గా --నవి, వడె, ధాతు నిర్ఘర మయాచల పంక్తుల బోలి మేదినిన్ ".యుగాంతం లో ప్రాణులను చంపటం యముని ధర్మం. ఆ విలయం లో రౌద్రం, భీభత్సం తప్పదు. అవి విలయ నృత్యామే చేస్తాయి. అలాగే కౌరవుల పాలిటి

యముడు అయాడు భీముడు. సహజ సుందర వర్ణన. కింద పడిన గజ రాజులు ధాతు వులతో, నిండిన పర్వతాల లాగాఎర్రగా ఉన్నాయట. పద్యం నడక మత్తేభం జి నడక లా ఉద్రేక ప్రధానం గా ఉండటం మరో విశేషం.

సైంధవ వధ నాడు అర్జున వీర విహారాన్ని కూడా అద్భుత రస పోషణ లో వర్ణించాడు. కవితా శిల్పానికి వన్నె తచ్చాడు. కిరీటి యెడ తెరిపి లేని యుద్ధమే చేశాడు. అర్జునుని అశ్వ శరీరాలు బాణ మయాలైనాయి. అవి కదల లేవు అన్నాడు కృష్ణుడు. రథం దిగాడుకిరీటి.. గాండీవ జ్యా రవం చేశాడు. కౌరవ సైన్యం ఒక్క సారి గావచ్చి మీద పడింది. ఆ సమయం లో అర్జునుడు ప్రదర్శించిన గాండీవ, అస్త్ర విన్యాసం అనితర సాధ్యం అని పించింది. అసాధారణ మైన ఆత్మ విశ్వాసం తో, గాంభీర్య శౌర్యాదు లతో, పాండవ మధ్యముడు మహా యుద్ధం చేశాడు. దివ్యం గా ప్రవర్తించాడు. తిక్కన వర్ణించిన తీరు చూడండి --



"బీభత్స, రౌద్ర మహాద్భుతములు - మూర్తి మంతములుగా మన మొనలు రక్త - మాంస, మేదో సతి మస్తిష్కమూ యధా జూడ -ఘోర రూపంబులై పరిక్షోభమొందే "-ఇలా బీభత్సం సృష్టిస్తున్న బీ భత్సుడినవ్వు ను చూసి బావ కృష్ణుడు - -"పెరికిన బాగులు మేనులు -నేరి బడ నెల్లెదల గలయ, నివిరితి, ప రు లి -త్తరి నీళులు ద్రావకతె -ప్పిరి నెట్లొకో శత్రు సైన్య భీకర మూర్తీ "'!మళ్ళీ నవ్వాడు గాండీవి. అందర్నీ నీళ్ళు కూడా తా గ కుండా చేస్తున్నావు అని మేళ మాడాడు బావ. ఇదిగో చూడమని బాణం తో నేల పగుల గొట్టాడు. బాణాలతో తొట్టె కట్టి, అందులోకి భూగర్భ జలాలను చేర్పించి, త్రాగించాడు బావ కృష్ణ మూర్తి కి. -"ధర దివ్యాస్త్ర హతిం బగిల్చి -కొలనుత్పాదించి, వె,దానికిన్ --శర జాలంబుల నిల్లు గట్ట మన సైన్యంబులున్ వెరం బొందె, న --చ్చెరు వందెన్ సుర సంఘముల్, హరి నుతించేమ్మెంగి, యప్పార్థు, భూ --వర, మున్నిట్టివి, సూడరు, వినసేవ్వారుం ద్రిలోకంబులన్ "ఇలాంటి వింత ఇంత వరకు యుద్ధ రంగం లో ఎవరు చూడలేదు విన లేదు ఇక్కడే కాదు త్రిలోకాలలో కూడా అని ఆశ్చర్యం తో సంజయుడు ముసలి రాజుకు వర్ణించి చెప్పి పొంగి పోయాడు అర్జున ప్రతాప గరిమను చూసి. బీ భత్సం గా యుద్ధం జరుగు తోంది. అలంటి సమయం లో ఈ అద్భుతాలన్ని విలాసం గా, ఆట విడుపు గా, అలవోక గా చేశాడు అర్జునుడు. ఇక సైంధవుడు బ్రతకటం కల్ల అని తెలియ జేసి నట్లే. ఇదంతా అతని చావుకు నేపద్యం -అర్జున మూర్తి మత్వాన్ని ప్రశంశ చేస్తూ చెప్పిన పద్య రాజాన్ని చూద్దాం -

"కురు సేన పై బడ్డ సరకు సేయక మంచు -విరియించు, భానుని పెరవు మెరసి --ఇది నడుగ గల నని ఇంచుక గొంకక -తన ఘోటకంబుల దడవ బనిచి -కొలనక్కజంబుగా నలుగుల మొన ఘటి -ఇంచి యమ్ముల దాని కిల్లుగట్టి -సారధి లీల నశ్వముల కార్యము దీర్చు -నంతకు నవ్వుచు నవుల నిలిచి --గారవమున దాను గాని వాడును బోలె --నరద మెక్కె నింక నడ్డు పడగ --నలవియె, పురారి కైన ను,వీనిచే -జచ్చు వాడు గాక సైంధవుండు ".

ద్రోణాచార్యుడు ఇచ్చిన"పరా భేద్యం "అనే కవచాన్ని తొడుక్కొని, దుర్యోధనుడు అర్జునుని తో తల పడ టానికి యుద్ధరంగానికి చేరాడు. అర్జునుడు ఆ కవచాన్ని బాణాలతో చీల్చి ముక్కలు చేశాడు. యెడ తెరిపి లేకుండా ఆతని చేతులపై బాణ వర్షాన్ని కురిపించాడు క్రీడి. చేతుల్ని వాచి పోయాయి. ఎంత క్లిష్ట పరి స్తితి లో నైనా యుద్ధం చేయ గలనని నిరూపించాడు సవ్య సాచి. సైన్ధవుడిని చంపి, శిరస్సు కింద నెల మీద పడకుండా, ఆకాశం లోనే తిప్పుతూ, అర్జునుడు చేసిన విధానం పరమాస్చర్యం గా ఉంది. అందరు నిశ్చేష్టులై చోద్యం చూశారు. దివ్యాష్ట

సంభూతుడు కనుక అతనికి అది సాధ్యమైంది. అవలీల గా చేయ గలిగాడు. --"పటు శరముల మీదికి డా --పటికిన్ వలపటికి, నపర భాగమునకు, -ముందటికి, జదల నడపె సము -త్కట రయమున శరము గందుక క్రీడ గతిన్ " బంతిని ఆడు కొన్నట్లు ఆకాశం లో కిందికీ, మీ దికీ ప్రక్కలకు బాణా లతో సైంధవుడు తల కాయను తిప్పుతూ పగ తీర్చుకొంటు అనడ్రికి వినోదాన్ని, భయాన్నీ కూడా కలిగిస్తున్నాడు. వ్యవ సాయ దారులకు ఎడ్లను ఎలా కట్టాలో తెలుసు. దాపటి ఎద్దు, వలపటిఎద్దు అని అంతం వింటాం. ఆ పదాలనే ఇక్కడ తిక్కన ప్రయోగించి అచ్చ తెనుగు రుచి కూడా చూపించాడు.

రక్తం తో తడిసి, ఆభరణాలతో, కూడిన శరీర భాగాలతో, శస్త్రాస్త్ర ఖండాలతో, చెల్లా చేద రైనా అనేక ఆభరణాలతో, మ్మ్సపు ముద్దలతో, పీనుగుల సమూహం తో జుగుప్సా కరం గా యుద్ధ భూమి ఉంది. అయితే తిక్కన దాన్ని "కాశ్మీర రాగ రంజితం, వివిధ ఆభరణాలు ధరించిన సుందర స్త్రీ దేహం "లా గా ఉంది అన్నాడు. ఆ భయంకర దృశ్యాన్ని సుందరం గా చెప్పాడు. భీకర, పౌరుష ప్రధానం గా ఉన్న యుద్ధ రంగాన్ని కోమలత కు, లాలిత్యానికి నిలయ మైన స్త్రీ విలాసాన్ని ఆపాదించటం కొత్త విశేషం. సమరంగానాన్ని రమణీయం గా, అవసర మైన చోట్ల భీషణం గా చిత్రించి యుద్ధ వర్ణన కు కొత్త అందాన్ని సంత రించాడు. ఈ విధానం తిక్కన, మహా కవి కాళిదాసుకు నిజమైన వారసుడు అని రుజువు చేస్తోంది. దుశ్శాసనుడు అమానుష యుద్ధం చేశాడు భీముడి తో. కర్ణుడు శక్తి నంతటినీ ధారా పోసి యుద్ధం చేసి అతన్ని రక్షించే సకల ప్రయత్నాలు చేశాడు. చివరికి భీముని చేతి లో చని పోయాడు దుశ్శాస నుడు అన్న వార్తను సంజయుడు పెద్ద రాజుకు వివరించి చెప్పాడు. ముసలి రాజు హృదయ ఆవేదనను తిక్కన మహాద్భుత పద్యం లో తెలియ జేస్తాడు --"పడుచు లీక లూడ్చి, పట్టి యాడెడు నట్టి -పులుగు చంద మయ్యె దలప, నా, య-వస్త, ఎందు జొచ్చు వాడ, నీ యలమట --దీర్ప నెవ్వ రింక దిక్కగుదురు ?"--చిన్న పిల్లల చేతి లో చిక్కి, వాళ్ళు ఈకలు ఒక్కొక్కటి గాపీకి రాల్చి పారేస్తుంటే, బాధ పడే పక్షి లాగా తాను అవస్థ పడుతున్నాను అన్నాడు. ఈకలు దేహం తోనే పుట్టేవి. సహజ మైనవి. అలాగే అతని పుత్ర, పౌత్రులు కూడా తనూజులే అంటే తన శరీరం నుండి జన్మించిన వారే. వారంతా, కళ్ళ ఎదుటే హతమై పోతుంటే, మర్మ భేద మైన వేదన ను అనుభ విస్తున్నాడు. ఆయన పరిస్తితి ఇప్పుడు ఈకలు తెగిన పక్షిలా ఉంది. విల విల లాడి పోతున్నాడు ఈకలు తెగిన పక్షి కి మరణం ఖాయం. అలాగే తనకూ చావు తప్పదు అనే నిర్ణయానికి వచ్చాడు. జీవచ్చవం అయిపోయానని దుఃఖించాడు. దీనినే "సంపూర్నార్ధ స్వోరకం "అంటారు..

భీముడు దుస్సాసనుడిని చంపినా విధానం అతి భీకరం గా ఉంది. "లీల గేల నమర్చి, మత్త గజ కేళీ సుందరోల్లాస మా --భీలత్వంబలరింప, ద్రిప్పు జదలం బ్రుద్వీస్తలిన్,పైచు, ముం --గాలం ద్రోచు మొగంబు ప్రేయు దేశలు,గ్ర స్పూర్తి వీక్షించు మొ --కాలూడంబయి, గ్రమ్మ రండ మెడ చిక్కం ద్రొక్కి, నిల్చున్, నగున్ "ఇతను తమ్ముడి లాగే బంతాట ఆడాడు. ఆకాశం లోకి విసిరేశాడు. కింద పడేశాడు. ఇటు అటు దొర్లించాడు. కాళ్ళ తో తొక్కేశాడు. పాత పగ అంతా తీర్చుకొన్నాడు. పైగా నవ్వాడు. "నీ గుండె చీల్చి నెత్తురు తాగుతా. నీకు దిక్కున్న చోట చెప్పుకో "అన్నాడు దుస్స సేనుడి తో భీముడు. భీముడు అపర నరసిమ్హావతారమే ఎత్తాడు. పూర్వం పొందిన పరాభవానికి ప్రతీకారం సంపూర్ణంగా తీర్చుకొన్నాడు. --ఆ భీభత్సం ఎలా ఉందొ చూడండి -"నరసిమ్హుమ్డసురేంద్రు వ్రచ్చు కరణిన్, రౌద్ర ముదగ్రంబుగా, --నుర మత్యుగ్రత, జీరి, క్రమ్మరు రుదిరంముల్లాసియై, దోసిటన్ --పెర వారం గొని, త్రావు మెచ్చు జవికిన్, మేనున్, మొగంబున్, భయం -కర రేఖంబోరయంగా, జల్లి కొను, నక్కొరవ్వు జుచున్ బొరిన్ 'ఈ విషయాన్ని వర్ణించే ముందు తిక్కన భీముడిని "మహా బల నందనుడు "అన్నాడు. మహా బలుడు అంటే వాయువు అని అర్ధం. గాలి శక్తి మనకు తెలిసిందే. అన్నిట్నీ ఎగరేసుకు పోతుంది, పీకి పారేస్తుంది. దానికి అసాధ్యం ఏదీ లేదు. గాలి ప్రవాహం ముందు ఏదీ నిలబడ లేదు. ఇంత అర్ధం ఉంది ఆ మాట లో. అది ప్రళయ కాల ఝున్య్హ.ప్రతిజ్ఞా నిర్వహణ కోసం భీముడు రాక్షస రూపాన్నే పూనాడు. కాని రాక్షసుడు కాలేదు. రక్తాన్ని పెదవి కి చేర్చాడే కాని, తాగ లేదు. సుక్షత్రియ వీరుడు కనుక అధర్మం గా ప్రవర్తించ లేదు.

ఆశ్వతామ విషయం లో చాలా తేడా ఉంది. దుర్యోధనుని దుస్తితి, తన తండ్రి ద్రోణుని మరణం అతన్ని కలచి వేశాయి. క్రోధం పెరిగి పోయింది. అయితే దానితో పాటు వివేకం కోల్పోయాడు. పూర్వం కర్ణుడు, దుర్యోధనుడు చేసిన పాపపు పను లన్నిటిని, వాళ్ళ ఎదుటే చెప్పిన ద్రోణ సుతుడు, ఎప్పుడూ నైతిక స్తైర్యం తో ఉండే వాడు, తండ్రిని మించిన వీరుడు, పైగా బ్రాహ్మణుడు -అయి ఉండి కూడా, క్రోధం తో వివశుడై, రాక్షసుడిగా ప్రవర్తించాడు. తాను ద్రుష్టద్యుమ్నుని ఎలా చంప బోతున్నాడో, కృప, కృత వర్మ లకు వివరిస్తాడు. ఆ విధానం పరమ భీషణం గా ఉంటుంది --

"ద్రుష్ట ద్యుమ్ను ని,ముట్టి పట్టుదు, మదోద్రేకంబడంగింతు, ను -త్కృష్టాస్త్రంబుల, జంప నల్క, పశు భంగిష్టంపినం గాని, పో--దిష్టా వ్యాప్తి యనగ నా కిదియే, భూ ఇష్టంబు, గౌంతేయులన్ --గష్ట స్వైర విదాభి యోగ మృతులం గావింతు నుగ్రాకృతిన్ "

పశువులను చంపి నట్లు చంపుతానని స్వయం గా ప్రకటించాడు. అప్పుడు కాని కోపం తీరాడట. ఉత్తమాస్త్రాలతో చంపాడట. ఎంతటి ఉన్మాద స్తితి లో ఉన్నాడో ద్రోణ సుతుడు మనకు అర్ధమవుతుంది. అందుకే నిద్రావాస్త లో ఉన్న ద్రుష్ట ద్యుమ్నుని తల పట్టు కొని --"నెల పయిం బాదాం దిగిచి, నుర స్థలంబు, మ్రొ--కాల నొగిల్చి, యేపున మొగంబతి దారుణ ముష్టి నొంచే, ని --ద్రాలస వృత్తి, నంగముల యందు, బలంబును, బుద్ధి, నేర్పు నం --జాలని యవ్విరోది, వివశత్వము బొందగ జేసె ప్రేల్మిడిన్ "

కాళ్ళతో, చేతులతో పొడిచి తన్నాడు. పసువు ను సింహం చంపి నట్లు చంపేశాడు. వేదన తో రోజుతూ, పోర్లాడుతూ, నెత్తురు కక్కు కుంటూ, ద్రుష్ట ద్యుమ్నుడు దుష్ట మరణం పొందాడు. ఇక్కడే భీమ, ఆశ్వత్థామ ళ క్రోధాగ్ని లో ఎంత తేడా ఉందో తెలుస్తోంది. నిద్ర లో ఉన్న ఉప పాండవులను చంపినా కసి తీర లేదు. ద్రుష్ట ద్యుమ్నుని వధ తోనూ తీర లేదు. ఆ క్రౌర్యం తో ఏనుగులను,, గుర్రాలను ఇష్టం వచ్చి నట్లు చంపి పారేశాడు. పీనుగుల పెంట చేసి శాడు. వాటి పాదాలు కోశాడు కొన్నిటి మోరలు చేక్కేశాడు. కొన్నిటి గొంతులు తెమ్పేశాడు. కొన్నిటి వీపులను నొక్కేశాడు. ఇలా పిచ్చి ఎక్కిన వాడిలా అతి ఉన్మాదా వస్త లో రాక్షం గా ప్రవర్తించాడు.. అన్ని అవయవాలను "క్రూర విచేష్ట త, విభ్రమం గా "దారుణం గా హింసించి చంపాడు. కిరాతకుడి లా ప్రవర్తించాడు. ఇంత రాక్షసా వేశం తో పైశాచికం గా ప్రవర్తించి మానవీయత కే మచ్చ తెచ్చాడు. ప్రతీకారేచ్చ ఉండ వచ్చు కాని ధర్మా ధర్మ వివేకం ఉండాలి. ఉచితానుచితాలతో ప్రవర్తించాలి. దయా దాక్షిన్యాలకు నీళ్ళు వదిలి అతి అమానుషం గా ప్రవర్తించాడు ద్రోణ సుతుడు. యుద్ధ నియమాలకే వ్యతి రేకం గా ప్రవర్తించి తండ్రికి తల వంపులు తెచ్చాడు. రౌద్రాన్ని, భీభాత్సాన్ని ఇంత తేలిక మాటల్లో చెప్పిన, వర్ణించిన కవి ఇంత వరకు లేడు. భీముడి క్రోధం దుశ్శాసన వధ తో ఉపశమించింది. కాని ఆశ్వత్థామ కు అట్లా కాలేదు. ఈ విధం గా ఒకే రక మైన సన్నీ వేశాలలో, భిన్న వ్యక్తుల ప్రవర్తన లలో తేడా, వారి శీల స్వభావాలలో భేదాలను స్పష్టం గా వ్యక్తీకరించాడు మహా శిల్పి తిక్కన కవీశ్వరుడు.

భీమ, ఆశ్వత్థామ ల యుద్ధ రీతి లోని భేదం చూశాం. ఇప్పుడు అర్జునుని యుద్ధం తీరు చూద్దాం. భీముడిని యుద్ధరంగం లో అనవసరం గా నినదించాడు కర్ణుడు. అప్పుడు కిరీటి "ఎందుకు మా అన్నను ఊరికే తిడ తావు ?అతడు విజృమ్భిస్తే సిగ్గు లేకుండా పారి పోతే, నిన్ను ఎవరైనా ఏమన్నా అన్నారా ?తప్పున్న మాత్రం తో ఇంత గర్వమా ?సాత్యకి నిన్ను గెలవడా ?గెలుపు, ఓటమి యుద్ధం లో మామూలే. అంత మాత్రం చేత ఇలా నోరు పారేసుకోవటం వివేకుల లక్షణం కాదు. దీని తో హీనం గా ప్రవర్తించి నీ కులం, గుణం అందరికి తెలియ బరచు కొన్నావు. "అని గడ్డి పెట్టాడు. "అభి మన్యుని చిత్ర వధ చేశావు. నీ కళ్ళ ఎదుట నీ కొడుకు వృష సేనుడిని చంపు తాను చూడు "అని సవాలు విసిరి మరీ చంపాడు. ఈ వదా విధానం లో పాం డవ మధ్యముని ప్రశాంతత, ఆత్మ విశ్వాసం, స్థైర్యం, నిగ్రహం మనకు గోచ రిస్తాయి. క్షత్రియోచిత మైన ఆత్మ నిగ్రహాన్ని పాటించాడు. బ్రాహ్మణుడు అయినా ఆవేశం పూని ఉన్మాదం తో ప్రవర్తించాడు గురు పుత్రుడు అశ్వ తామ. "భ్రుకుటి స్పూర్జిత ఫాలభాగు డై,కర్ణ కుమారుని కోదండం, బా హు దండం, తలా ఒకే సారి బాణం తో ఎగర గొట్టాడు ఫల్గుణుడు. దుర్యోధనుడు కర్ణుడు చూస్తుండగానే ఇంత పనీ చేశాడు. అదీ పౌరుషం, మగటిమ. అశ్వత్థామ చివరకు "బ్రహ్మ శిరోనామ కాస్త్రం "ప్రయోగించాడు. వ్యా సాది మహర్షులు వచ్చి ఉప సంహరించ మన్నా వినలేదు. పరీక్షిత్తు ను నొప్పించెంత వరకు వెళ్లాడు. అయినా భీమార్జున్లు అతన్ని ప్రాణాలతో వదిలి పెట్టారు. క్షమించి పంపించేశారు. తమ గుణాన్ని చాటుకున్నారు.

కర్ణుడు మొదలైన వారంతా అభి మన్యుని చేతి లో ఒడి పోయారు. మళ్ళీ మళ్ళీ వచ్చి సాహసం తో యుద్ధం చేశారు కాని అధర్మ యుద్ధం చెయ్య లేదు. ఆవేశం తో ద్రోణుడే అభి మాన్యుని చావుకు కారణమయ్యాడు. అందుకే ధర్మ రాజు "ఆ ద్రోహికి నిన్న, ఇవాళ తోడ్పడిన ద్రోణుని తెగటా ర్చాలి "అన్నాడు. అయితే ద్రోనున్ని ద్రుష్టద్యుమ్నుడు చంప గానే అర్జునినికి కోపం వచ్చింది. ధర్మ రాజు ను నినదించాడు కూడా. అప్పుడాయన పాంచాలి పరాభవాన్ని గుర్తుకు తెచ్చాడు. అభి మన్యు వాదా విధానం చెప్పి "ఇట్టి ధర్మ పరుడైన, కలశ సంభావుతోడ సరి వచ్చు టుచితంబె ?"అని ప్రశ్నించాడు. ఈ విధం గా యుద్ధ రంగం లో భిన్న వ్యక్తుల విభిన్న మనో ప్రవృత్తిని ఆవిష్కరించాడు తిక్కన. యుద్ధ రంగం ఒక నాటక రంగమైంది. దీనికి అనుగున మైన సరళ భాష ను ప్రయోగించాడు. ఆత్రాల స్వభావం, మానసిక భావావేశాలు, భావ సాంద్రత అనీ అభి వ్యక్తం చేశాడు. సమయోచిత రాసా విష్కరణ చేసి నిండుదనం చేకూరుస్తాడు.



భీష్మ పితా మహున్ని చంప టానికి ధర్మ రాజాదులు విధి విధానాన్ని ఆలోచిస్తున్నారు. ధర్మ రాజు "అకటా, తండ్రి సచ్చి నంత నుండియు, మము -నరసి, ప్రాచి నత్తి యనుగు దాత, --జమ్మమది దలంచు తెంపు సూ చితే, రాజ ధర్మ మింత క్రూర కర్మ మగునే ?"అని వ్యాకుల పడ్డాడు తండ్రి పోయిన తర్వాత అన్నీ తానే అయి తమను పెంచి పెద్ద చేసిన పితామహుని చంపాలంటే మనసు ఒప్పటం లేదట. రాజ ధర్మం బంధువులను ఎవరినీ లెక్క చెయ్యదు కదా అని బాధ పడుతున్నాడు. భీష్ముని చేరి ఆయన మరణ విధానాన్ని ఆయన తో నే చెప్పించు కొన్నారు. పితామహుడు తన మరణ విధానాన్ని తెలియ జేసి, "అది తన ఆజ్న గా పాటించ" మని ఆదేశించాడు. అలా అయితేనే ధర్మజుడు అంగీఅరిస్తాడని భావం. అప్పుడు అర్జుని మనో వేదనా లలిత సుందరం గా ఉంటుంది --"గురుని, కృత ప్రజ్నుని, ధ -ర్మ రతు, వయో వృద్ధు, లోక మాన్యు, దయాళున్ --సుర తటినీ సుతు, వంచన --బురుషోత్తమ, చంప బుద్ధి పుట్టదు నాకున్ "అని విల విల లాడి పోయాడు. వంచన చేసి చంపాల్సి వస్తోందే కురు వంశ సూర్యుడిని అని మహా వేదన చెందాడు. ఈ పద్యం లో ప్రతి శబ్దాన్ని అర్ధ వంతం గా ప్రయోగించాడు తిక్కన. తమకు భీష్ముడు -గురుడు, ప్రజ్ఞా ప్రాభవ ఖని, ప్రతిజ్ఞా పాలన కు జీవితం అంకితం చేసిన వాడు, ధర్మ విషయం లో వేలెత్తి చూప లేని వాడు, ఇదంతా కాదు అసలు వయస్సు లో అందర్ని మించి జ్ఞానం తో కూడా వృద్ధుడైన వాడు, లోకం అందరి తోను మాన్యుడు అని పించుకొన్న వాడు, దయా స్వరూపుడు, గంగా నదీ కుమారుడు, అయిన భీష్ముడిని వంచన తో ఎలా చంప మంతావయ్యా పురుషోత్తముడు అనే పేరున్న ఓ కృష్ణ పరమాత్మా !"అని ఆవేదన చెందాడు. ఆయన గునాలన్నిటినీ వరుస క్రమం లో ప్రయోగించాడు. ప్రయోగించిన ప్రతి మాట "భీష్ముని చంప రాదు "అని సూచించే మాటే. ఆయన తనను వ్యక్తీ గతం గా ఎంతో ఆదరించాడు. అందుకే ఈ వేదన. "నన్ను, బాంసు కేళి నున్న, నర్మిలి ఎత్తి --మేని దూలి తనదు మేను వొరయ --ప్రీతీ కౌగిలించి, మా తండ్రి గుణము,ళ --గ్గించి కన్ను నీరు నించు నతడు "

తన చిన్నతనం ఒళ్లంతా మట్టి కొట్టు కొని ఉన్న తనను ఎట్టు కొని ఆ మాట్టి తన ఒలంతా అంటించుకొని నాకు బుద్ధులు చెప్పి నా తండ్రి గుణాలను జ్ఞప్తికి తెచ్చి, తాను ఏడిచే ఆ పితమహున్ని నేను ఎలా చంపను ?అని దుఃఖించాడు. అంతే కాదు ధర్మ పరత్వం, మొదలైన సహజ గుణాలను తెలియ జెసేఎ పద్యం ఒక రసధుని. --"అక్కట తండ్రి లేని మము నేమ్మాయి బెంచిన తాత, నిమ్మెయిం --ద్రోక్కేనగా డతండు సముదీర్ఘ భుజా బల శౌర్య శాలియై --ఇక్కడి సేన జక్కడిచె, సేనియు జూతును గాక, ధర్మ ముం --దక్కుట కోర్వ జాలుదునె ధర్మ రాజు, తమ్ములు క్రూర కర్ములే "అని కన్నీరు మున్నీరు అయాడు.

శిఖండి ని అడ్డం గా పెట్టు కొని, అర్జునుడు భీష్ముని తో యుద్ధం చేస్తుంటే, ద్రోణా చార్యుని మనసులో చెప్పా లేని కలవరం చేల రేగింది. అనర్ధం గోచ రించింది. ఆయన పరిస్థితి --"తడ బడే దివ్య బాణములతంత్రము, మంత్రము దప్పెడుం గడున్ --వడ కెదు జాప దండము, మనంబును నాకు, వశంబు గాడు, వీ --ద్వాదియేడు, జేయ్యులంగాముగమంత్రం తప్పుతోంది, తంత్రం తడ బడు తోంది. డంక, దోరంగేడు నేటి భంగి,, గ --వ్వడి, తన పూన్కి దీర్చుట ధ్రువంబని, బుద్ధి జనించె బుత్రకా "ద్రోణుని చేతులు కాళ్ళు ఒంకి పోతున్నాయి బాణం పట్టు తప్పు తోంది శరీరం తడ బడు తోంది. ఇవన్ని గమనిస్తుంటే ఆయనకే ఆశ్చర్యం వేస్తోంది. అర్జునుడు భీష్మ పితా మహున్ని చంపి తీరుతాడు అనే మనో నిశ్చయానికి ద్రోణా చార్యుడు వచ్చే శాడు. అర్జునుని పరాక్రమం అలా ఉంది. తన వశం తప్పి పోతోంది. శిఖండి ముందున్నాడు. కనుక సుర నాదే తనయుడు సుర లోకం చేరటం ఖాయం అను కొన్నాడు.

పద్మ వ్యూహం లో అభి మన్యుడు మరనిన్చటాన్ని ధర్మ రాజు దిగ మింగు కో లేక పోయాడు. తన వల్లే ఇదంతా జరి గిందని తీవ్రం గా విల పిస్తాడు. ఇన్ని కష్టాలు, కురుక్షేత్ర యుద్ధం అన్నీ తన తప్పిదం వల్లనే వచ్చాయని బాధ పడ తాడు. ఈ సందర్భం లో అతని మనో వేదన ను వ్యక్తే కరించ టానికి చెప్పిన తిక్కన పద్యాలు ఆణి ముత్యాలు. "కొడుకు బోడగానకర్జునుడడిగే నేని, --వానితో నింక నేమను వాడ ? హరికి --నతని గారాబు చెలియలి కధిక దుఃఖ --మే న చేసితి వగ వంగ నేమి గలదు ?--వాని తోడి లోకమి ఏను బోవ -నైతి బో గన్న పుత్రా

శోకాతురత్వ --మున, నిటిన్త వివరణత బొంద కుండ, --జూడ కుండేడి వాడ నర్జునుని మొగంబు "అని తండ్రి కొడుకు చని పోయి నప్పుడు పొందే వ్యధనంతా పొందాడు. అంతా తన అసమర్ధత అని చెప్పు కొన్నాడు. అర్జునుడు వచ్చి అడిగితే యేమని సమాధానం చెప్పాలి /అతనికి తన మొహాన్ని ఎలా చూపించగలను ?అని కుమిలి పోతున్నాడు.

అభిమన్యుని మరణం విన్న అర్జునుడు స్కందావారానికి వచ్చి, అన్నలను తమ్ముళ్ళను చేత కాని వారిగా నిందించాడు. పుత్రా శోక వివశాత్వం తో చాలా కఠినం గా మాట్లాడాడు. అభి మన్యుని తల్లి సుభద్ర వ్యంగ్యం గా, తీక్షణం గా, భీమాదుల హృదయాలను కోసే మాట లంతుంది. స్త్రీ స్వభావం గా, పుత్రా శోకాన్ని వెల్లడిస్తుంది. --"అనిలజు నుక్కు, లావు, గల డందురు, సాత్యకి శౌర్య శాలి నా --జానూ ద్రుపదుండు, సంగర విశారద భావము పూని యుండు, మా --త్స్యుని బటు విక్రమాధ్యుదని చూతురు, పాండవు లిండ రుండి, యొ --క్కని కి, గడంగ లేర, నిను గావగ బుత్రకా !"అని అందర్నీ కడిగి పారేశింది. అంకుశాలతో పొడిచి నట్లయింది వాళ్లకు. శ్రీ కృష్ణుడు సోదరిని ఓదారుస్తూ "తగు మాట లాది కోడలు ఉత్తర శోకం తీర్చు -నీవు ధైర్య వతివి, నిన్ను చూసి మేమూ ధైర్యం పొందాలి "అన్నాడు లోక సహజం గా. నీ శోకం సరే -నీ కోడల్ని ఎవరు ఒదారుస్తారు నువ్వు తప్ప అని. గర్భ శోకానికి ఊరట ఉంటుందా /అందుకు సుభద్ర అన్న నే మెత్తని మనసు గల తన కోడలి దుఖాన్ని తీపి, తళుకు లోల్కే మాటల తో ఒదార్చమని కోరింది. అలాగే సౌప్తిక పర్వం లో ద్రౌపది పుత్రా శోకం హృదయాల గూడులను పట్టి లాగేస్తుంది ఉప పాండవుల హత్య విని. ఈ విధం గా మాతా, పితృ హృదయ ప్రకృతు లను అత్యంత సమర్ధ వంతం గా తిక్కన పోషించాడు. ఘోర యుద్ధం లో కూడా, ఇలాంటి మానవ హృదయ వ్యాపారాలైన దయ, వాత్సల్యం, బంధు భావం చక్కగా ప్రదర్శిమ్పప జేశాడు.

సైంధవ వధ కు అర్జునుడు ఏకాకి గానే వెళ్లాడు. అతని క్షేమం విషయం పై ధర్మ రాజు తీవ్ర వ్యాకులత చెందాడు. సాత్యకిని వెళ్లి సాయం చేయమని చెబుతూ --"హరి గురుడు నీకు గ్రీడియు, --గురు డిరువుర ఎడరు దీర్ప గోరి, గురులకుం గురుడ నగు సేన, చేసెద --పరమ ప్రార్ధనము దీని బాటింపు దగన్ " --ఈ విధం గా తన చింత పోగొట్టటం, గురుడు సఖుడు బంధువు అయినఅర్జును నికీ, అన్న శ్రీ కృష్ణుడికి తోడ్పడటం తన పరాక్రమ ప్రదర్శన చూపటం ఎంత అవసరమో ధర్మ రాజు చాలా మంచి పదాల తో సాత్యకి కి చెప్పాడు. సరే నని బయల్దేరి వెళ్లాడు సాత్యకి. అతని పై వీరాధి వీరులంతా పది విజ్రుమ్భించారు. మళ్ళీ బాధ పడ్డాడు పాండ వాగ్రజుడు -"తమ్ముని దలంచి కృష్ణుని --తమ్ము బనిచె నాతని బదంబడి తన, చి --త్తమ్మున, దలపడ ధర్మ రాజు --డమ్మొయి వాడోక్కొ నారే ఈ యున్న జనులున్ " మొదటి పదాలను చాలా సార్ద కం గా ప్రయోగించాడు. తన తమ్ములు ఉండగా కృష్ణుడి తమ్ముడిని పంపటం లో తను ఎంత గడుసు వాని గా సైన్యం లోని వారు అనుకొంటారో నని బాధ పడ్డాడు. ఆ ఊహా ఆయన విచారానికి కారణం. యుద్ధం లో సంధుల్ని పంపటం సహజం. కాని ఇక్కడ బంధుత్వ విచారణ చేశాడు. ధర్మ రాజు. లోకాప వాడ ముద్ర పడ రాదనీ భావించాడు. ఇది ఉత్తముల లక్షణం. చివరికి తన మనసు ను సమాధాన పరచు కొని భీముడిని సహాయం పంపాడు. --"భీము జేర నరిగి భీభాత్సు నీ తమ్ము --నని, యెలుంగు, గళము నందు దగుల ----నశ్రులోలుక మాట సెప్ప లేడత --డార్తి సూచీ ఇట్టు లనియ నతడు" భీభాత్సుడు అనటం తో అర్జునుని పరాక్రమాన్ని గుర్తు చేయటం నీ తమ్ముడు అంతం తో భ్రాతృ వాత్సల్యాన్ని కర్తవ్య పరాయనత్వాన్ని తెలియ జేయటం, అతడిని రక్షించు కోవాల్సిన అవసరాన్ని గుర్తు చేయటం అన్నీ ఇందులో కనీ పిస్తాయి. అంతే కాదు అర్జునుడిని ఎంత అభిమానం గా తామందరం చూసు కొంతున్నామో అతనికి ఏదైనా జరిగితే ఎలా తట్టు కోలేక పోతారో వివ రించే ఇంకో పద్యం --"నీ తమ్ము గుర్ర, రూపసి, --నీతి విడుదు, సకల గుణ నిది, మద్భక్తుం --డాతనికే డరగు నో యను --చేతో గతి పల్ల టిల్ల జేయదే తాల్మిన్ "--అర్జునుని గుణాలను ఏకరువు పెడుతూ, ఒగుడుతూ, భీముని ప్రోత్స హించటం చాలా ఉచితం గా ఉంది. అతదింకా ధర్మ రాజుకు "కుర్రడే".అంతే కాదు తానంటే భక్తీ శ్రద్ధలున్న వాడు. భీముడు తొమ్మిది రోజుల యుద్ధం చేసి శత్రు సైన్యాన్ని చీల్చి చెండాడి పీనుగుల రాసి చేసి పారేశాడు. అతని పరాక్రమాన్ని తెలిసి పొంగి పోతు కృష్ణుడికి వివ రించి చెబుతాడు. సంతుష్టుడౌతాడు --"కార్చిచ్చు గవిసి మరుగ తతి -నేర్చు కరణి నేడు భీష్ము డేచిన కడిమిం --బేర్చి, మన సేన బొదివె శ --రార్చుల నీ వీరు గన్ను లార.గంటె -తాను జూదమాడి, తమ్ముళ్ళను చాలా కష్ట పెట్టాడు. దానికి మనసు లో బాధ పడుతూనే ఉన్నాడు. తన మీద అంత అనురాగం గౌరవం ఉన్న తమ్ముళ్ళు బాధ పడటం సహించ లేక వాళ్ళను రక్షించకొని కన్నారా చూస్తూ సంతోషించాలి కాని భీష్మునికి బలి ఇవ్వ లేను అని తన అంత రంగాన్ని ఆవిష్కరిస్తాడు. "

ఆశ్వత్థామ నారాయనా స్త్రాన్ని ప్రయోగించాడు. అర్జునుడు మొదలైన వారంతా రధాలు దిగి విల్లు బాణాలు మొదలైన ఆయుదా లన్ని వది లేసి దానికి నమస్కరించారు. కానీ భీముడు మాత్రం సైనికులతో --"దిగకుడు వాహనంబులు, గడింది మగంటిమి గోలు పోవ, మీ --రు గడక దక్కపేట్టకుడు,రూపర నాయుధముల్, మహాస్త్ర --శక్తి గెలుతు, గోత్ర భిత్కుళి శ,ధీ వర శరంబుల వైభవంబు, భూ --రి గదా విహార భంగియు, నరి ప్రకరంబులు పిచ్చ లింప గన్ " ఎవరు భయ పడద్దని రధాలు వగైరా లు దిగాక్కర లేదని ఆయుధాలు విసర్జిన్చాక్కర లేదని తాను దాన్ని ఎదుర్కొని అందర్ని రక్షించ గలనని ఉత్సాహ పరిచాడు. శంఖ నాదం తో, తొడలు కొట్టు కొంటూ సింహ నాదం తో ఆశ్వతామ ను ఎదుర్కో బోతున్నాడు భీముడు. నారాయణాస్త్రం కార్చిచ్చు లాగా భీమ సేనున్ని చుట్టు ముట్టేసింది కృష్ణార్జునులు ఉత్త చేతుల తో భీమున్ని నిరాయుదుడిని చేసి, రధం నుంచి కిందికి తోసేసి కాపాడారు. ఈ విధం గా భీముని సహజ మైన ఔద్ధత్యం, సాహసాలను తిక్కన ఇక్కడ ప్రదర్శింప జేశాడు..



సాత్యకి పరాక్ర మానికి దుర్యోధనాదులు పారి పోయారు. ఈ విషయాన్ని సంజయుడి ద్వారా విన్న ధ్రుత రాష్ట్రుడు --"పులికి బసులు వారిన క్రియ, --సల్పు జలము సిగ్గు విడిచి, యట్లొక్కని కో --ల్తల కోర్వకవిరిగిన --పుత్రుల నేమని విందు, నేను రోయక ఇంకన్ " అని సంజయుని తో తన బాధ వెల్ల గక్కు కున్నాడు. కౌరవుల అశక్తత ను గుర్తించాడు. సాత్యకి చేతి లోనే చావు దెబ్బ తింటే, ఇంకా ముందు జరిగే యుద్ధం లో తన కొడుకు గతేమిటో అని విచారించాడు. మనసు స్వాధీనం తప్పింది. ద్రోణా చార్యుడు మొదలైన వారిని తప్పించుకొని, భీముడు వ్యూహం లోకి ప్రవేశించాడని విన గానే "ఇట్లు సింహ నాదమిచ్చిన భీముని --మార్కొనంగ, మగడు, మన బలమున --గలిగినే, మదాత్మ జుల గాల్ప బుట్టిన --చిచ్చు వాడు, వాని జనయుం టరిది"భీముడు సింహనాదం చేస్తూ వ్యూహం లో ప్రవేశిస్తే, తమ బలం లో అతడిని ఎదిరించే మొగాడే లేకుండా పోవటం ముసలి రాజు కు తీవ్ర నిరాశ కల్గించింది. తట్టు కో లేక పోయాడు. ఘటోత్కచుని పై కర్ణుడు శక్తి అనే అస్త్రాన్ని ప్రయోగించి, చంపాడు అన్న మాట విన్న పెద్ద రాజు ఎంత ఉక్రోషం తో, తన మనస్సు లోని మాటను బయట పేడు తున్నాడు చూడండి -- "ఒకనిని జంపి, ఇట్లు సమ నుజ్వల, శక్తి నెరింగి, కర్ణుడే -- టికి, నరు మీద దాని నిగిడింపక ఇన్ని దినంబు లప్రయో --జకము జేసే, గయ్యము భుజా బాల శాలి, నరుండు, వద్ద బో--రికి, మరి యుత్స హింప గలరే, పేర వారలు సూత నందనా " -కర్ణుడు ఎవరు యుద్ధానికి రమ్మన్నా, వ్రతమని, నియమమని, అంటూ ఎందుకు ఇప్పటి దాకా కాల క్షేపం చేశాడు ?అని బాధ పడ్డాడు. అంటే అంతకు ముందే ఈ పని చేసి ఉంటె తన కొడుక్కి ధైర్యం వచ్చేది కదా. అని లోపలి భావం. ఇక్కడ అతని పుత్రా మొహం తీవ్రత స్పష్టం. దేవుని పై విశ్వాసం, విధి విలాసం అనుల్లంఘు నీయం అనే జ్ఞానం కూడా లేని వాడు అని మనకు స్పష్టం గా తెలుస్తోంది. అందుకే గతం అను కూలించ లేదే అని విచారిస్తున్నాడు. దీన్నినే ధ్రుత రాష్ట్రుని "ఆశక్త దుర్జ నత్వం "అన్నారు పెద్దలు. -- రెండో రోజు యుద్ధం లో పాండవుల్లో ఒక్కడు కూడా చావా లేదని తన సేన ఆడ వాళ్ళ మధ్య లో ఉన్న మగ వాళ్ళ లాగా ప్రవర్తిస్తోందని ఆవేదన చెందాడు. శల్యుడు, దుర్యోధనాదుల చావు విన్న తర్వాతమనసు లోని దుఖాన్ని బాధను, ఆవేదన ను బయటికి వదులుతూ --"చావరు, నొవ్వరు, పాండవు --లేవురు నని, నీవు చప్ప,, నిప్పలుకులు, దుహ్--ఖా వేష కరముల్తై, చే--తో వ్రుత్తి దహింప జొచ్చె, దుర్భర భంగిన్ "అని వాపోయాడు. ఆయన మనసు ఎంత విష పూరితమో, దుష్టుల స్వభావం ఎలా ఉంటుందో, స్పష్ట పరిచాడు తిక్కన. బహుశా వేద వ్యాసుడు కూడా ఇలా ముసలాయన అంతర్యాన్ని బహిర్గతం చేసి ఉండడు. తన కొడుకుల తో పాటు, పాండవుల్లో ఒక్కడు చచ్చినా ముసలి రాజు ఆనందించే వాడు. కాని ఎవ్వరూ చావా లేదు. తన వాళ్ళంతా అగ్ని లో పడ్డ మిడుతల్లాగా భస్మ మై పోయారు. మరి మండదా?ఇదే దుస్సహావ్యధ అంటే. ఈర్ష్య గాంధారీ వల్లభుడిని పూర్తీ గా ఆక్ర మిన్చేసింది. దుర్జన స్వభావం తేట తెల్ల మయింది. పుత్రా శోకం ముంచి వేయగా, విధి అప్పుడు జ్ఞాపకం వచ్చి ఎంతో ఏడుస్తాడు. "కొడుక! తమ్ములు తోడ్పడ గడగి శత్రు --వరుల గెలిచెద నంటి, ఒక్కరుడుండక, --కుండా నీ తమ్ము గుర్రల, నూచ ముట్టు--గొనియెనె, విధి, యే గతి జనుడు జెపుమ "తమ్ముల్లున్నారనే నమ్మకం తో కయ్యానికి కాలు దువ్వావు. నీ తమ్ముల నందర్నీ ఊచ కొత్త కేసేశారు పాండవులు. విధి

బలీయం నాకిన్కేమిటి గతి అని ఆక్రోశం వెలిగక్కాడు. --”గదిసిన పవనుజుడుబెట్టుగ- గదవ్రేసి, -తొడలు విరిగి, కయ్యపు నేలన్ --మద మరి పడి నప్పుడు నీ --మది నేమని తలచితో, కుమార ఎరుంగన్ “భీముడు గద తో ప్రతిజ్ఞా పాలనం చేస్తూ తొడలు విరగ్గొట్టి నప్పుడు నేలకు ఒరిగి యేమని విలపించాడో పెద్ద కొడుకు అని ఆవేదన ఈయనకు. మంచి వాడైనా, చెడ్డ వాడైనా మానవుడికి రాగ మొహాదులు, వాత్సల్యాదులు, సమానం గా నే ఉంటాయి. ఇది ప్రకృతి సహజం. వీటిని ఇంత గొప్ప గా బహిర్గతం చేయటమే తిక్కన చేసిన గొప్ప పని. కర్ణ వధ విన్నాడు ముసలి రాజు. అతనికి ఉదాత్త గౌరవాలనిచ్చి మాట్లాడాడు. మంచి విశేషణాలతో అతన్ని స్తుతించాడు. అతను తన కుటుంబానికి చేసిన సేవ మరచి పోలేనిది. కర్ణుని పై తన కొడుకులు ఎంతో ఆధార పడ్డారు. ఆతని వధ తో కౌరవ సేన నిస్తేజం నిర్వీర్యం అయిందని చెప్పుకున్నాడు సంజయుడికి. --”ఆలా లోని ఆబోతు ను బోలె నొప్పు --గురు బలంబులలో, నున్మద ద్విరద మూర్తి -సింహ సంహానుండు, నిస్సీమ విక్ర --మాభి రాముండు,వోయెనే ?యక్క టక్కట”ఇలా ధ్రుత రాష్ట్రుని చిత్త వృత్తులను ఆయా సందర్భాలలో జరిగిన సంఘటన ల ను ఆధారం గ ఆకర్షణీయం గా వెలి బుచ్చాడు తిక్కన.

దుర్యోధనుడు మడుగు లో దాక్కున్నాడు. అతని అనుజులు అందరు అప్పటికే హతమై పోయారు. ఆ ఆనందం లో ధర్మ రాజు కర్ణుని తన సోదరు లతో ఎవరి తో నైనా గదా యుద్ధం చేయటానికి ఎన్ను కో మంటాడుఇందులో ఆతని తొందర పాటు ఉంది. అతని హృదయ వైశాల్యమూ కన్పిస్తుంది. దాక్షిణ్యం, ధర్మ బుద్ధీ కనీ పిస్తాయి. శ్రీ కృష్ణుడు ధర్మ రాజు ను విమర్శిస్తాడు. “జూదం లో చేసి నట్లే మళ్ళీ చేస్తావా ?”అని ప్రశ్నించాడు. అమితోత్సాహం తో, ముందు వెనుకలు చూడ కుండా పందాలు కాయటం, శపధాలు చెయ్యటం ఎంత చేటు తెచ్చిందో తెలియ జెప్పాడు. ధర్మ రాజుకున్న ద్యూతాసక్తి యే మహా భారత యుద్ధానికి కారణం అయింది. అందుకే ఉపాయం గా “ఈ రాజు కు భీముని తో పోరితేనే సమంగా ఉంటుంది “అని సన్నాయి నొక్కులు నొక్కాడు. వెంటనే భీమ ప రాక్రమాన్ని,, దుశ్శాసన వదను చెప్పి, ఉత్సాహాన్ని ప్రశంశించాడు. దుర్యోధనుని పగ ను ఎగ దోస్తాడు. చివరికి రోగీ పధ్యమే కోరాడు, వైద్యుడూ అదే చెప్పాడు అన్న సామెత లాగా దుర్యోధనుడు భీముడి తోనే యుద్ధం చేస్తానన్నాడు. ఏమైనా సరి జోడుతో చేస్తేనే మజా కదా. ధర్మ రాజు సంస్కృతి కల మాన వ శ్రేష్టుడు. కాని, మానవ స్వభావాతీత దివ్య పురుషుడు కాదు అంటారు విశ్లేషకులు. అందుకే మనకు దగ్గరవుతాడు. వ్యాస మహర్షి ఈ విధం గా ధర్మ రాజాదులను ఇంద్రియ వ్యాపారాలతో కూడిన మానవులు గా చిత్రించి భారత పాత్ర లను లోక జీవితం లో అను సందించాడని మనం గ్రహించాలి. దానికి తెనుగు దనం తో మూర్తి కట్టించాడు తిక్క యజ్వ.

భీష్ముడు తనను అర్ధ రధుని కింద జమ కట్టి నందుకు కోపించిన కర్ణుడు అస్త్ర సన్యాసం చేశాడు. కాని పితా మహుడు శర తల్పం మీద పడి పోగానే, సందర్శించి భక్తీ వినయాలతో, పాదాలకు ప్రణామం చేశాడు. వినమ్రం గా విన్న వించు కొంటున్నాడు చూడండి --”అలుక దక్కి, నన్ను, అధిక వాత్సల్య శీలము గాగ జూచి, తగిన మాట లాడవే మహాత్మా !”అంటూ రుద్ధ కంఠం తో ప్రార్ధిస్తాడు. పశ్చాత్తాపం తో కర్ణుడు తడిసి ముద్ద అయ్యాడు. దారి మారిన కొడుకు పుత్రవాత్సల్యంకోసం తండ్రి ని చేరి, పరి తపించి నట్లుంది అతని పరిస్తితి. “ప్రాడిగల్ సన్ “అయి పోయాడు. పితా మహుడు కూడా “--నీ దెస గోపిస్తూనే, అది శిక్ష కాని, రోషంబు గాదు, కాని, నీవు, పాండు తనయుండ వగుటం, నీయెడ వాత్సల్యంబ,కాని, మాత్సర్యంబు లేదు “అని అనునయించాడు భీష్ముడు కురు పితా మహుని హోదాలో. ఆమాటలు కర్ణుని కర్ణాలకు అమృతపు పలుకు లైనాయి. కౌరవులకు జయం లభించ దని, కుంతీ పుత్రుడు కనుక, పాండవులను చేరటం శ్రేయస్కరం అనీఉపదేశించి చెప్పాడు. కానీ కర్ణుడు నిశ్చయ బుద్ధి తో --”దైవ ధీనము సర్వమున్, మన మతిం దప్పింప గా వచ్చునే “అని విధి విలాసానికి తలోగ్గు తాడు. “నీ వింకన్ నను నొండు వల్కక, పరానీకంబు పై బంపు, మత్సేవా ధర్మము నిర్వ హించెద “అని సర్వ సైన్యాధి పత్య స్వీకరణకు అనుమతి కోరాడు. మర్నాడు మళ్ళీ యుద్ధ సన్నద్ధు డై వచ్చి, వీర శయన మహా నీయుడైన మహాను భావున్ని భీష్మణ్ణిదర్శించి, ఆయన పాదాల పై పడి, కన్నీరు కారుస్తూ, చేయెత్తి, వినయం తో, ఒంగి నమస్కరిస్తూ --”వచ్చితి రాధేయుడ గను -- విచ్చి, ననుం జూడు భరత వీరాగ్రణీ నీ--సచ్చరితము ఫలమే,యి --ట్లిచ్చట, నీ యునికి, దాత నేమన నేర్తు న్ --పావనంబైన పలుకులు నా చెవు --లార నెమ్మి నన్ను నాదరింపు --మయ్య, ధర్మ నిత్య యంచిత సత్య శం --తన కుమార గాఢ ధైర్య సార “అని, నిస్సహాయుడైన చిన్న పిల్లాడిలా ఏడ్చేశాడు కర్ణుడు. ఇలాంటి మాటలు ఆతని నోటి లోనుంచి రావటం మనకు ఆశ్చర్యమేస్తుంది. తన బాహు బలాన్ని నమ్ము కున్న వాడు దుర్యోధనునికి అమ్ము కొన్న వాడూ ఈ కర్ణుడే నా అని పిస్తాడు తిక్కన. విధి నిఎవరు ఏది రించ లేరనే సత్యాన్ని గ్రహించే వివేకం అతనికి కలిగింది. ఇదొక గొప్ప మార్పు. భీష్ముడి పై పూజ్య భావం, విధి చేతిలో అలాంటి అసహాయ శూ రుడూ ఒక బొమ్మ అయాడని అభి ప్రాయం. అతని లోను పితామహుడి లోను ఉన్న పవిత్రత, హృదయ మార్దవము వ్యక్తమయాయి. అతని లో సద్వంశం లో జన్మించిన వాడికి ఉండే భక్తీ, ప్రేమ, ఔదార్యం మూర్తీభ వించి నట్లు గోచరిస్తాయి. అర్ధ రధుడు అని కౌరవ సభలో కర్ణుడిని భీష్ముడు అనగానే “నువ్వే అర్ధ రదుడివి “ అని నిండు సభలో బీరం గా పల్కిన కర్ణుని లో ఎంతటి పరి వర్తన వచ్చిందో గమనించండి.

భీష్మ పితా మహుని శౌర్య పరాక్రమాలను వర్ణిస్తూ కర్ణుడు కన్నీరు కారుస్తుంటే, కర్ణుడిని చూసి రాజులు అందరు ఆర్త రవాలు చేసి, కన్నీరు మున్నీరు గా విల పించారు. రాదేయుడు భీష్ముని --"దమమును, సత్యముం దపము, దానము, శీలము, నస్త్ర వీర్య శౌ --ర్యములును, భీష్మ నంద కలవట్టి మహాత్ముడు పోర నీల్గె, నిం --క, మనకు నేటి బాహు బల గర్వము లెక్కడి సేన లక్కటా --సమసేనే, కౌర వేశ్వరుని, సంపద యందు విషన్న మూర్తి యై ".అంతే కాదు చాలా సహజ సౌజన్యం తో భీష్ముడి పట్ల తన కున్న, గౌరవ భావాన్ని ఆవిష్కరించాడు. అది మనసు లో ఉంది. ఇప్పుడు బయట పడింది. తన ప్రత్యర్ధి అయిన అర్జునుని పరాక్రమ విక్రమాన్ని కూడా జంకు లేకుండా ప్రశంసించాడు కుంతీ పుత్రుడు. వివిధ సంఘటన లలో మానవ హృదయం లో కలిగే పరి వర్తనం, దానికి కారణం అయిన ప్రవర్తన, స్వభావ సిద్ధ మైన శీలాదులు తిక్కన చిక్కగా చక్కగా, పోషించాడు. కర్ణుని మాటలు వినండి --"భరితాశాన్తర, పాం-- చ జన్య రవ దృప్యద్దేవదత్తధ్వని, --స్ఫురణన్, వీనులు వ్రయ్య, గేతన కపి స్ఫూర్జత్త్రభన్, జుడ్కులా --తురతంబొందంగ,  చండ గాండీవ సముద్భూతాస్త్ర జాలంబు, లె --వ్వరు సైరింతురు నీవు దక్క, భుజ గర్వ స్ఫూర్తి, నిర్వాహకా !"అని అర్జునుని గాన్డీవాన్ని ఎదుర్కోవా లన్నా, పాన్చానన్య ధ్వని విని తట్టు కోవాలన్నా, భీష్ముడు తప్ప వేరేవారు లేరని నిస్సందేహం గా తెలియ జేశాడు. తన వల్ల కాదు కిరీటి ని తట్టు కోవటం అని నర్మ గర్భం గా తె లియ జేసి నట్లే.

ఈ రకం గా, మహా కవి తిక్కన భీషణ యుద్ధ సమయం లోను, మానసిక స్వభావాలకు అత్యధిక ప్రాధాన్యమిచ్చి, యుద్ధాన్ని కూడా మానవ జీవితానికి అతి సన్నిహితం చేస్తాడు. పౌరుష శౌర్య ధైర్య సాహస విజ్రుమ్భణే కాదు మానవ ప్రకృతుల ఆవిష్కరణ ను కూడా అంతే ఉదాత్తం గా వెలువరింప జేస్తాడు తిక్కన. పౌరాణిక మార్గం లో కాక, ఒక రూప కర్త లాగా, తాను పాత్రల వెనుక ఒదిగిఉండి, నాటక రంగం లా యుద్ధ రంగాన్ని నిర్మించాడు. అవసరాన్ని బట్టి మనోహర ప్రకృతి సౌందర్యాలను, మరో చోట విశిష్ట శబ్ద ప్రయోగ చాతుర్యాన్ని చూపిస్తాడు. అర్ధ గౌరవం, రసధ్వనుల స్ఫూర్తి, సందర్భోచిత మైన సంభాషణా, రసవత్తర నాటకీయ సంవాదం, సన్నీ వేశాన్ని బట్టి, మానవ స్వభావ వ్యక్తీకరణం, పరిస్తితిని బట్టి మారే, మానసిక ప్రవృత్తీ, మనో రంజకం గా వ చిత్రించే మహా కవి తిక్కన సోమయాజి. ఉభయ కవి మిత్రుడి ఉదాత్త ప్రౌఢ కవితా రచన కు ఆదర్శం, మానవ ప్రకృతికి అద్దం (ఆదర్శం -అంటే -అద్దంఅనే అర్ధం ఉంది )ఈ యుద్ధ పంచకం.

## స్త్రీ పర్వ నిర్వహణ



వీర రౌద్రాలకు, రస వత్తర సన్నీ వేషాలకు నిలయ మైన యుద్ధం ముగిసింది. యుద్ధ సమయం లో ఉన్న ఉత్సాహమంతా అయి పోయింది. శోకం, నిర్వేదం ప్రాధాన్యత పొందాయి. సౌప్తికం లో ద్రౌపది పుత్ర శోకం తారా స్తాయి కి చేరింది. స్త్రీ పర్వం లో ఆ శోకం ఇంకా ప్రాధాన్యత చెందింది. గాంధారి, మిగతా కురు స్త్రీల ఆక్రందన లతో నిండి పోయింది. కరుణ రసం రస సిద్ధి పొందింది. బంధు జన మరణాలతో, ధర్మ రాజు మనస్సు వికలమయింది. విలపించే స్త్రీ లను చూసి నిర్వేదం పొందాడు. యుద్ధ పరిణామ ఫలిత మేమిటో తెలిసి వచ్చింది. దీని కంతటికీ కారణం తన ద్యూత వ్యసనమే ననిపించింది. ప్రజా పాలనం మీద విముఖత్వ మేర్పడింది. వన వాసానికి వెళ్లాలని సిద్ధ పడ్డాడు. తన వల్ల లోక హాని జరిగింది. కనుక సత్పురుషుని లాగా వ్యధ చెందాడు. పరితాపం తో శుద్ధ మనస్కుడై, ప్రశాంతి పొందితే తప్ప, ముందుకు సాగ లేదు. శాంతి తర్వాత గురూప దేశం తో జ్ఞానోదయం కావాలి. దాని వల్ల ధర్మ నిష్ఠ కల్గుతుంది. అందుకే యుద్ధం తర్వాతా శోకాదిప్తిత మైన స్త్రీ పర్వాన్ని రచించాడు వ్యాస మహర్షి. పాప పరిణామా న్ని అందరు అనుభ వించాలి. పాపులే కాక, పుణ్య వంతుల హృదయాలు కూడా ఆర్ద్రత చెందాలి. అప్పుడే లోకం లో న్యాయం, ధర్మం, గురించి స్మృతి కల్గుతుంది. ఒకడు చేసిన పాపాలకు సంఘం లో అనేకులు నశిస్తారనే ప్రకృతి సత్యం హృదయాలలో నాటు కొంటె తప్ప, పాప భీతి కలుగదు. పాపభీతి, అసత్య, అధర్మాల యెడ విముఖత్వమేర్పడి, ధర్మ సంస్థాపనకు అవకాశం లభిస్తుంది. ఈ ఉద్దేశం తో, స్త్రీ పర్వ మంతా శోకానికి నిలయ మై పోయింది. ధర్మ రాజు హృదయం భరించ లేని నిర్వేదనానికి లోనైపశ్చాత్తాపం చెందింది.



ధ్రుత రాష్ట్రుని ఏడ్పు తోనే స్త్రీ పర్వం ప్రారంభమైంది. "కొమ్మలు దున్న మ్రోడ్పడు భూరుహం వలె "ఆయన ఉన్నాడు. కొమ్మల్ని విరిగిన చెట్టు లాగా ఉన్నాడు అంటే అందర్ని కోల్పోయి జీవచ్ఛవమైనాడు. "నా కతంబున బోలిసిరి నందనులు"అని తెలుసు కొన్నాడు. "వీరే కాదు, చెలులు, చుట్టంబులు, సహాయులు "కూడా నశించారు. దీనికి కారణం తానే. అని

పూర్తిగా నమ్మాడు. "ధైర్యం ఎలా వస్తుంది ?అపర కర్మలు ఎలా నిర్వహించాలి ?.ప్రాణం తో ఎలా నిలువ గలను ?"అని వా పోయాడు. సంజయుడు, విదురుడు దుఖోప శమనం చేసే మాటలు చెప్పి ఊర డించారు. సంజయుడు మాత్రం దుర్యోధనాదుల పాప ప్రవర్తనం, పెద్ద రాజు లోభప్ర వృత్తి లను తీవ్రం గా విమర్శించాడు. స్వయం క్రుతాపరాధం అన్నాడు రాజుతో. ఇప్పుడేడ్చి లాభం లేదు -హాస్యాస్పదం అనీ అన్నాడు.



"సుహృజ్జనంబు లుపదేశించిన మాటలు విన లేదని నువ్వే అంటావు. -ఏడ్చి ప్రయోజనమేమిటి ?నీకు, నీకొడుక్కి, దుశ్శాసన, కర్ణ, శకుని ల మాటలే రుచి కరం గా ఉంటాయి అని ఈస డించాడు. "ముందుకు దూకు తాడే కాని, కార్య తంత్రానికి పూను కోడు. దాన్ని నువ్వు మాన్ప లేవు. వాడి బలం మగటిమ నచ్చి, లోభం తో ప్రవర్తించావు. తృష్ణ తో అతి సాహసానికి పూనితే ఫలితం ఇలాగే విపరీతం గా ఉంటుంది "అని లోక న్యాయం తో సంజయుడు ఛీ వాట్లు పెట్టాడు. "అందు కోవటానికి వీలు లేకుండా, ఆపదలకు నిలయ మైన కొండ చరియ లో ఉన్న తేనె కోసం ప్రలోభ పడి, కిందా మీదా తెలీకుండా తెగ పరి గెత్తె తిండి పోతు కు పట్టే గతే నీకూ పట్టింది. అలభ్య మైన పాండవుల సంపద యెడ అతి లోభం తో,, యుక్తాయుక్తాలను వదిలి, శ్రీ కృష్ణ, విదురాదుల హిత వచనాలను విన కుండా తృష్ణ తో అతి సాహసం గా ప్రవర్తిన్నావు "అని దెప్పి పొడిచాడు. --"తాన చుట్టు దగిల్చి యున్న యుదగ్రతం దరి కొన్న, దా -- పానుభూతికి నోర్వ జాలక, యప్రయోజన వాక్య, సం --తాన శోషిత వక్త్రుడై, యతి దైన్య మొందెడు వాని, య-ట్లైన నీదు విలాప మన్యుల కాట పట్టగు భూవరా !"అని అతనిఅవి వేక ప్రవర్తనకు, దాని ఫలితానికి స్వయమ్ముక్రతాప రాధమే కారణమన్నాడు. ఇప్పుదేద్వాతం అవివేకమే నన్నాడు. ఈ సమయం లో అలా అనటం న్యాయమా అని మనకు అని పిస్తుంది. కాని ధ్రుత రాష్ట్రుడికి ఇది అవసరమే. ఉచితం కూడా. విదురుడు మాత్రం వైరాగ్యాన్ని బోధించాడు. "యవ్వనం, రూపం, ద్రవ్యం అనిత్యం. ఇవి పోతే ఏడవటం అవి వేకం "అన్నాడు. ఉదాహరణ గా ఒక విషయం చెప్పాడు ".మట్టి కుండ రూపం పొంది,ఎండి, కాలి, చివరకు పగలటం ఎంత సహజమో, జన్మించిన వానికి, మృత్యువు అట్లా సహజం "అన్నాడు. భవ బందాలపై, విరక్తి కల్గించి, వైరాగ్యం అవలంబిప జేయటం విదురుని కర్తవ్యమ్. ఇలాంటి భావాల్ని చెప్పటానికి అనుకూల మైన శైలి, రీతిని ఎన్ను కుంటాడు తిక్కన సూటిగా, సంక్షిప్తం గా అర్ధ వంతం గా చెప్తాడు. యుద్ధం వరకు మహా భారతం ఐహిక సంబంధ మైంది. తరువాత అంతా ఆముష్మిక సంబంధం.. ఈ ఆరంభం విదురుని తోనే చేయిస్తాడు --"పెడలు నెడ, గాఢ పీడం --బడి, సుడువడి, యోని నోత్తు వడి, యొక భంగిన్ --వేడలగా, గ్రహ భూతముల --ప్పుడు, దొడగి, యనేక దురితములు గల్పించున్ "--భూమిని పీడిస్తే గ్రహాలన్నీ అనేక అనర్ధాలను తెస్తాయి అని సారాంశం. ఇలా చిన్న చిన్న మాటలతో, సూటిగా, భావ గర్భితం గా వేదాంత విన్యాసం చేయిస్తాడు తిక్కన యోగి.

కౌరవ స్త్రీ లతో కలిసి ధ్రుత రాష్ట్రుడు అపర కర్మలకు బయల్దేరే తీరు ను వర్ణిస్తాడు తిక్కన. దుర్భర హృదయ వేదన, శోకా వేశం వెల్లి విరుస్తాయి. "చేలులైన జాడ బయ్యెద -దోలగుటకు సిగ్గు పడు వధూ జనసతి, య --ట్టల నెదుర నేక వస్త్రం -బులతో నంగములు వికృతి బొందగ గడచెన్ "--"మున్నెన్నడు నెవ్వరికిం -గన్ను లేదుర బడని యట్టి కాంతలు, జన లె --ల్లన్ని లిచి, చూడ వేద లిరి -కన్నులు గమరన్, సుప్రున్నికాయంబులకున్ "--రాజాన్తః పుర సహజ లావణ్యాన్ని, సౌందర్య గామ్భీరాలను ఉదాత్త రమణీయం గా చిత్రించాడు. సాధారణ దైన్యానికి చోటు ఇవ్వ లేదు. ధర్మ రాజు ఎదు రైతే, ఈ స్త్రీలంతా, సహజ స్వభావం తో, అఆభి జాత్యం తో, చేతు లెత్తి ఏడుస్తూ తిట్టే శారు. సంయమనాన్ని కోల్పో లేదు. గంభీరం గానే ప్రవర్తించారు. "ఇందర జంపితి నని, యుబ్బుమ్ --దీరద,ద్రుపద తనయ పట్టుల నాభి మన్యుం -దెగటార్చితి, మరదుల --నందర మ్రింగితి విభూతి యన నీ కెద్దీ ! "అని నిల దీశారు. ఇందులో వాళ్ళ దీనా వస్త వల్ల, ధర్మ రాజు లో నిర్వేదం పెరగ టానికి కారణం ఏర్పడింది.



భీమున్ని కౌగిట్లో బంధించిన్ చంపా లన్న పెద్ద రాజుదురాలోచన గమనించి, మాయలాడు క్రిష్నయ్య ఇనుప బొమ్మను దగ్గరకు చేర్చాడు. దాన్ని నొక్కి బిగియార కౌగలించి మసి చేశాడు ధ్రుత రాష్ట్రుడు. --"కోపంబుత్కటమై, యా-- రూపము నిరుగేల బట్టి, రూఢత ఘోరా --తోపంబెసగానా --భూపతి పెస గౌగలించి పొలుపర విరిచేన్ "'నిజమైన భీముడే అనుకొని ఈ దెబ్బతో వాడి పని ధాలనుకొంటూ కౌగిట్లో బిగించి చంపాలని ప్రయత్నించాడు. తన ఆత్మకు శాంతి కలిగింది భీముడు చచ్చాడు అను కొన్నాడు పాపం గుడ్డి రాజు. కాని లోపలి భావం బయటకు రానీ కుండా, భీముడు తన చేతిలో చని పోయి నందుకు వట్టోట్టి ఎడ్పులేడ్చాడు. దాన్ని చూసి చిరు నవ్వు తో కన్నయ్య మందలించాడు. ఇదంతా దృశ్య కావ్యం లా వర్ణించాడు తిక్కన్న. --"తనయ శోకా తురున్డవై ధర్మ మెడలి --యనిల సుతు దేగాటా ర్చేదనని తలంచి --తట్టి పని, నీదు చే నేల యగు, విధా. త్రు --లీల బరికింప, నేరక బేల వైతి "అని మెత్తగా నవ్వుతూనే నాలుగు చివాట్లు పెట్టాడు. మత్సర గ్రస్తు డైన పెద్ద రాజు ప్రకృతి తెలిసి కృష్ణుడు చేసిన కపటోపాయం. ఆయన వ్యాఖ్యానం కూడా. న్వోత్కర్ష తో పాపం గా ప్రవర్తించిన రాజు స్వభావం ఇంత వికృతం గా ఉంది అని అందరికీ తెలియ బరచే చక్కని సన్ని వేశం.అందరూ చచ్చినా ఇంకా బుద్ధి రాలేదాయనకు. పాండవుల మీద పగ నర నరాన జీర్ణించుకొని పోయింది. ఇదే చివరి అదును అని చంప బోయాడు భీమున్ని. అందుకే అలాంటి కౌగిలిని "ధ్రుత రాష్ట్ర కౌగిలి "అని పిలుస్తారు. విధిని గుర్తించకుండా ప్రవర్తిన్చటమే సర్వ అనర్ధా లకు కారణం అని ఇంకా ఆ ముసలి నక్క కు తెలిసి రాలేదు పాపం.

గాంధారీ దేవి లో పుత్ర శోకం మూర్తీభావించింది. ధర్మ రాజునూ శపించ టానికి సిద్ధ పడింది. మంచి చెడ్డలను విచారించే జ్ఞానం ఉందామెకు. అయినా భీముడు తన కుమారుడు దుర్యోధనుడిని నాభి కింద కొట్టాడని బాధ గా ఉంది. దుస్సాసనుడిని భీకరం గా చంపటం కూడా ఆమె గుండె గాయాలను తీవ్రం చేశాయి. భీముని ప్రవర్తన అధర్మమని, రాక్షసం గా ఉందని కఠినం గానే తెల్పింది. భీముడు తగిన సమాధానం చెప్పి "నీవును, సువిచార వింతయు విచారింపుము "అన్నాడు. ఆమె అందులోని సత్యాన్ని గ్రహించింది. తన బాధను ఇలా వ్యక్తం చేసింది --"అందులకు నూత కోలగా నకట యొకని --నైన నిలుపక నూర్వుర నదయ వృత్తి -మ్రింగి తందేవ్వ డేనియు మీకు నెగ్గు -లాచరిమ్పని వాడులేడయ్యె నయ్య "-అంటూ --ఒక్కరిని నీవు సంపక -తక్కిన నంతటనె ప్రతిన దప్పునే విభవం --టెక్కడ మీ యన్న నతం --డెక్కటి రాజ్యంబు సేయ నీడేకుమారా "!అని అతి దీనం గా ఏడ్చింది ".గుడ్డి వాళ్లకు చేతి కర్ర లాగా ఉండాల్సిన కొడుకుల్లో ఒక్కణ్ణి కూడా మిగల్చకుండా చంపెశావే అందులో ఒక్కడైనా నీకు అపకారం చేయని వాడు లేడా" ?అంది. "మ్రిగటం " "ఊత కోల"పదాలను చాల మెలకువ తో ప్రయోగించాడు తిక్కన.

ద్రౌపది పుత్రా శోకం తో ఉంది. అయినా తన దుఖాన్ని పక్కకు నెట్టి, కౌరవ స్త్రీ ళ మీద సానుభూతిని చూపించింది ప్రశంశ నీయం గా. ఆమె గాంధారిని సమీ పించి పాదాలకు మొక్కింది. కుంతీ దేవి కూడా దుఖాన్ని దిగ మింగుకొని ద్రౌవ దిని ఊరడించింది. "నీ, నా, తెరగు టో క్క రూప యగుట చేత మనం ఒకర్నొకరు ఓదార్చు కోవాలి "అన్నది. ధర్మ రాజు ద్యూత వృత్తి, ధ్రుత రాష్ట్రుని ఉపేక్ష వల్లనే ఇంతటి అనర్ధం అందరికి వాటిల్లింది. యుద్ధం యొక్క అనర్ధం ప్రత్యక్షం గా యుద్ధం లో పాల్గొన్న వారికే కాక, బాల, వృద్ధ, స్త్రీ జనం అందరు అనుభ విన్చాల్సి రావటం లోక సహజం. గాంధారి పాంచాలితో --

"పుత్రి !ఇట్లగు నమ్మ శోకము బొంది, కుందుచు నున్న నీ --గాత్ర మందొక కీడు పాటిలి కందు, బాండు తనూభవుల్ --పుత్ర వర్గము గన్నచో నెద భూరి తాపము బొందుడున్ --పౌత్ర హీనత బడ్డ గొంతికి, బాయ నేర్చునే నెవ్వగల్"--"నిను నే నోదార్చెద, --నను నీవూరార్చ వలదే, నా,

నీ, తెరగుల్ విను నొక్క రూప మన,కే--మన గలడు విధాత క్రూరుడై పరు పంగన్ "గాంధారీ దేవి తన దుఖాన్నే కాదు, కౌరవ, పాండవ వనితా హృదం లోని దుఖాన్ని కూడా తానే వెలి బుచ్చి పెద్ద రాణి అని పించు కొందికురు వంశం లో ప్రతి వ్యక్తీ దుఖం ఆమెదే అన్నట్లుగా హుందాగా, బాధ్యతగా ప్రవర్తించింది..

యుద్ధ రంగం లో తమ ఆత్మీయుల కళేబరాలను చూసి, విచలిత అయి హృదయ విదారకం గా విలపించే కౌరవ కాంత లను ఒక్కొక్కర్ని కృష్ణుడికి చూపిస్తూ గాంధారి తన హృదయ క్షోభ ను వెళ్ళ గక్కింది.. --"ప్రేవులు గండలు పెరికి, వేటాడి యం -గద గొని, మొదళులగల్చి, కొనుచు ----రాగిలి రక్తంబు ద్రావుచు, లోచన -గుళికల నొలిచి, మ్రింగుచును, గుండె --కాయ లాదట మెయి, గబళించుచును గ్రొవ్వు --దేమలించి, నమలుచును, నెముక యూట--చవి గొని, యానుచును, జావక యున్న రూ-పులు నచ్చుటకు గాక బెలుచ దన్ని --కొనిన వెర బాయ బారుచు జెనకి తొడరి --కాటు లాడుచు నున్న సృగాలములును --గాకములు, రాపులుగులును, గ్రద్దలును వృ--కంబులును, మానసము వికలంబు సేయ "అని భీభత్సం గా హృదయ విదారకం గా ఉన్న యుద్ధ రంగాన్ని వర్ణి న్చించాడు తిక్కన. ఈ శీను చూస్తె బాబోయ్ యుద్ధం వద్దు అని పిస్తుంది. గాంధారి తో పాటు ధర్మ రాజాదులు కూడా హృదయ వైక్లబ్యం పొందారు. ఒక్కరొక్కర్నే తలచు కొంటూ ఎడుస్తున్నారందరూ. యుద్ధ ఫలం నిర్దోశుల్నీ కూడా ఎలా బలి తీసుకోన్నదో గాంధారి వర్ణించింది. --చంద్ర నార్ద్ర కుట్టిమముల చరణ తలము--లొందుటకు నెవ గించు నయ్యువిద లిపుడు --నెత్తురు తేవ( theva )మెక్కిన నెల బొరలు --చున్న వారేమి చెప్పుడు నుడులకు పేర్మి "--"బాలలు, దరుణులు, బ్రౌదులు, --దూలేదు వికలాత్ముకము లతో దేన్దముల్ --వాలిన, విరహానన ము ల -పాలై, వందురెద నొక్క భంగిన, యకటా !"--లలిత కోమలం గా ఉంటూ సకల సౌభాగ్యాలతో తుల తూగే కురు స్త్రీలు ఎంతటి దైన్యాన్ని పొందారో వివ రించే ఘట్టం. కళ్ళకు కట్టి నట్లు వర్ణించటం అంటే ఇదే. తన కుమార్తె దుస్సల స్తితి ని చూసి గాంధారి దుఖం కట్టలు తెంచు కొని ప్రవహించింది.

"హృదయమున వగా లేని యట్టిట్టు నట్టు -దిరుగు చున్నది దుస్సల వరుని శిరము గానకీ కూతు నేమ్మాయి గనుట కంటే --దలప నెక్కుడు దుఃఖంబు గలదే కృష్ణ "భర్త తలకాయ కన పడక ఏడుస్తూ తిరుగు తోంది దుస్సల.. కూతురు దుఖం చూసి తల్లి తల్లడిల్లి పోయింది. అవధి దాటిన దుఖం. అభిమన్యుని కళేబరం పైన పడి ఉత్తర దీనం గా రోదిస్తోంది. ఆమెను చూసిన గాంధారి దుఖాన్ని ఆపు కోలేక పోయింది. ఆమెకు తెలిసినంతగా శోక భారం ఇంకెవరికీ తెలియదు. --"పాడి మాలి, తనను పలువురు పొదివిన --బోరి తద్ద డప్పి గూరి నిదుర --పోయే నాకో, సుభద్ర పుత్రుండు మృతుడైన --జెలువ మింత గలుగ నేర్చు "ఎలచని పోయినా అభి ముఖం లో ఇంకా పోరాట పటిమ తగ్గలేదు జీవ కల పోలేదు. ఉత్తర ఏడ్పు కు అంతం లేదు. మాటి మాటికీ కృష్ణున్ని చూస్తోంది. ఆమె ముగ్ధ స్వరూపాన్ని చాలా స్వాభావికం గా వర్ణిస్తాడు తిక్కన కవి. లలిత శృంగారం గా, కరుణ రస స్పోరకం గా వర్ణించాడు. ఆమె భగ్న జీవి. దానికి తాగి నట్లు గా చిన్న చిన్న మాటలతో సుకుమారం గా చెప్తాడు. ధర్మం యెడ వివక్ష చూపిస్తే, అందరికీ అదే గతి అని సర్వులకు గుణ పాఠంచెబుతుంది ఈ పర్వం.

కోపం తట్టు కోలేక గాంధారి కృష్ణుడిని శపించింది. ఇంత జరిగినా ఆమె లో పూర్తీ వివేకం కలగ లేదు. తన పుత్ర వ్యామోహం, ద్రౌపది పరాభవం లో తన ఉపేక్ష ఇంతటి అనర్ధానికి కారణం అని ఇంకా గ్రహించ లేదు. తాను స్వయం గా అడ్డు పడి ద్రౌపదిని రక్షించు కొక పోవటం, ధర్మ లోపం., నైతిక దౌర్బల్యం అని తెలుసుకో లేక పోయింది. దాని ఫలితాన్ని అనుభ విన్చాల్సి వచ్చి నప్పుడు మాత్రం దేవుణ్ణి నిందించింది. అన్నదమ్ముల యుద్ధం లో శ్రీ కృష్ణుడు ఉపెక్షించాడని శపించింది. తన తప్పు తెలుసు కో కుండా నల్లనయ్య పై నింద మోపింది. ఆమె "వ్యామోహానికి నిలు వెత్తు దర్పణం "అని పిస్తుంది. వ్యామోహం తో కళ్ళు మూసుకొని పోయిన వారి స్వభావం లోకం లో ఇలానే ఉంటుంది. ఈ విధం గా యుద్ధం వల్ల జరిగిన లోక అనర్ధాన్ని ప్రత్యక్షం గా, శోక భూయిష్టం గా, కరుణ రసోత్పాదకం గా స్త్రీ పర్వం లో వర్ణించాడు మాన్య కవి తిక్కన సోమయాజి.

దీని తర్వాత శాంతి పర్వ విశేషాలను తెలుసు కొందాం,

## శాంతి, అనుశాసనిక, అశ్వమేధ పర్వాలలో ధర్మ సూక్ష్మ విచారణ



కౌరవ, పాండవ స్త్రీ ల ఆక్రందనం ఆధారం గాపోషించ బడిన "నిర్వేదం "ఆ తరు వాత "శాంతి" గా మారింది. శాంత రసానికి నిర్వేదమే స్థాయీ భావం అని ఆలంకారికుల భావన. అందుకనే, శోక భరిత మైన స్త్రీ పర్వం తర్వాత ఈ పర్వాల ను రచించటం సర్వోత్తమం గా ఉంది, ఉచితం గానూ ఉంది. భారత ఇతి వృత్తాన్ని బట్టి, ధర్మ రాజు జీవిత పరిణామాన్ని అనుస రించి కూడా స్త్రీ పర్వం తర్వాత శాంతిని ప్రతిష్టించటం సముచితమే. యుద్ధ పరిణామ ఫలాన్ని ప్రత్యక్షం గా అనుభవించటం వల్ల, దుఖం తో ప్రజా పరి పాలనకు విముఖు డైనాడు ధర్మ రాజు. శ్రీ కృష్ణ పరమాత్మ ఆదేశించటం తో భీష్మ పితామహుని చేరి ఉపదేశం పొందాడు. తన లోని చీకటి ని పోగొట్టు కొని, స్వధర్మాన్ని అనుసరించటం ఇందులో ప్రధాన వృత్తాంతం.

సంఘం లో ధర్మం నశించటం, కౌరవుల పాప ప్రవర్తన, దాని ఫలితం గా 18 అక్షౌహిణుల సైన్యం లోని వీరాధి వీరులు నశించి పోయారు. ఇప్పుడు న్యాయం, ధర్మం కొంత జ్ఞాపకానికి వచ్చాయి. ఆ స్తితి లో ధర్మ పరుడు, నీతి కోవిదుడు, శిష్టాచార సంపన్నుడు, అనుభవజ్ఞుడు, నిరాసక్తుడు అయిన కర్మ యోగి, లోక కళ్యాణం కోసం రాజ్య పాలనకు పూను కొంటే నే, ధర్మం లోకం లో మళ్ళీ ప్రతిష్టాపించ బడుతుంది. ఆ స్తితిని కలిగించాలనే కృష్ణుని ఆశయం, సిద్ధిస్తుంది. కాని, యుద్ధం వల్ల వికల మనస్కుడైన ధర్మజుడు, నిర్వేదం తో సంసార విముఖుడయి నాడు. --"ధ్రుత రాష్ట్రుండు, దనూజు కీడు సమబుద్ధిం జూడ కన్నేచు, డే --గతి జన్నం జన, నిచ్చే గాని, మగుడం గా దివ్వడయ్యేన్, నిరా --కృత శీలుండగు నా సుయోధనుండు, సంక్షీణంబు సేసెం, గులం --బతని జంపంగ, గోప మారే, మది శోకా క్రాన్తంమయ్యెం దుదిన్" --అని బాధ పడ్డాడు. "ఆ దుర్జనుడైన దుర్యోధనుడు దుష్టం గా ప్రవర్తిస్తే, సరి పుచ్చు కోలేక పోయాను.. రాజ్యం కావాలని నాలో కోర్కె ఉండటం వల్లే ఇంత పాపం చేశాను. పరిగ్రహ దోషం పరిత్యాగం వల్ల కాని పోదు. పరిగ్రహ త్యాగం చేస్తే, మనిషి జన్మా, మరణం, దుఃఖాలను పొందడు అని వేదం చెబుతోంది. కనుక అపరిగ్రహం ఒక్కటే నన్ను శుద్దున్ని చేస్తుంది. "అని విశుద్ధ మనస్కుడై వివరించాడు. అంతటి మానసిక క్షోభను అనుభవించాడు. మాటలతో చెప్ప రాని వేదన అది. దుర్యోధనుడు అపకారం చేశాడు కనుక అతని వధించటం తో తన కోపం తీరి పోయింది., కాని ఇప్పుడు శోకం తో మనస్సు నిండి పోయి ఉక్కిరి బిక్కిరి అయి పోతున్నాడు. మనసులో వితర్కించు కొంటున్నాడు. హింసకు ప్రతి హింస జవాబు కాదు. ప్రతి హింస తో మనకు మనశ్శాంతి చేకూరదు. పైగా, దానికి వ్యతి రేక మైన ఫలాన్ని అనుభ విన్చాల్సి వస్తుంది. ఇది ప్రకృతి సత్యం. "vengence recoils itself on the perpetrator ".



దుర్యోధన వధ తో కోపం తగ్గి తాత్కాలిక తృప్తి కలిగింది. కాని, సకల బంధు నాశనం తో శోకం ఇంకా పెరిగి పోయింది. మనసు వికలమై, రాజ్య విముఖత ఏర్పడింది. కర్తవ్య పరాన్ముఖుడైనాడు. పశ్చాత్తాపంతో సల సలా కాగి పోయాడు. ధర్మ రాజు మనో వైకల్యం పోయి ప్రశాంతత పొందాలి అంటే సద్గురువు ఉప దేశమే శరణ్యం. అతడు విశిష్ట జ్ఞానం తో కర్మ యోగిగా మారాలి. భారతీయుల అభి ప్రాయం ప్రకారం ఆ నాటి మిధిలా నగర చక్ర వర్తి జనక మహా రాజు లాంటి జీవన్ముక్తులే రాజ్యార్హులు. కనుక ధర్మ రాజుకు ప్రజా పరిపాలన కోసం సంపూర్ణ మైన ఐహిక, ఆముష్మిక జ్ఞానం పుష్కలం గా లభించాలి. జ్ఞానోప దేశం పొంది, స్వ ధర్మాన్ని అనుస రిస్తూ, రాజ్య భారం మోస్తూ, వ్యాస మహర్షి అను సరణ తో, లోక హితం కోసం అశ్వమేధ యాగాన్ని వేదోక్తం గా నిర్వ హించి, దేశం లోని రాజు లందర్నీ ఒకే ధర్మ శాసన బద్ధులను చేశాడు. నిరాసక్తం గా, వేదోక్త ధర్మాలను ఆచరించాడు. స్వధర్మాన్ని అత్యంత శ్రద్ధా స క్తులతో నిర్వ హిం చాడు.. స్వధర్మాన్ని శ్రద్ధ తో నిర్వహించటం వల్ల, గృహస్తుడు కూడా భవ బంధాలను చేదించు కొని మోక్షం పొంద గలడు అని,అశ్వ మేధ పర్వం ద్వారా నిరూపించాడు. ఇందులో “నక్కు ప్రస్తుడు “అనే వాని కధ స్వధర్మ నిర్వహణ ను బోధిస్తుంది.



ఈ పర్వం లోనే ధర్మ రాజు తన మనస్సు, చేసిన అకార్యాలను తలచు కొని వికల మై నట్లు చెప్ప బడింది. సజ్జనుల మనస్సు వజ్ర సన్నిభం. అయినా స్వాభావికం గా కుసుమ కోమలం. ద్రోణ, అభిమన్యుల అధర్మ వధలకు,తానే కారణం అను కొన్నాడు. తన వంటి అధర్మ ప్రవర్త కుడు రాజ్యం లో ధర్మాన్ని ఎలా నెల కోల్ప గలను ? అని బాధ పడ్డాడు. సంకోచించాడు. మనశ్శాంతికి ముందు ఇలాంటి మానశిక క్షోభ చాలా అవసరం. రాజ్య పరి పాలన విషయం లో వ్యాస ముని అభిప్రాయం కూడా ఉదాత్తం గా నే ఉంది. శ్రీ కృష్ణ, వ్యాస మహర్షుల ఉపదేశం కారణం గా ధర్మ రాజు లోని చీకటి తొలగింది. చిత్తం ఈశ్వరాయత్తం అయింది. భారతీయ భావన ఇంత ఉదాత్తం గా ఉంటుంది కనుకనే మన పురాణాలు, ఇతి హాసాలు సార్వ కాలీనాలు అని గౌరవాన్ని పొందాయి.

"మనుజులు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరు నాజ్ఞ జెల్లెడు- న్వినుము, కుఠార పాణి ధరణీ రుహముల్ నరకంగ,బాప మొం-దునొకొ,కుఠారమున్ జనులు దోసము బొందరు కర్త, ఈశ్వరుం --డని యెడు నిశ్చయంబు ధ్రుఢమది నిల్పిన జాలు భూవరా ",అని ధర్మజుని కి వ్యాస మహర్షి జ్ఞానోప దేశం చేశాడు. అహంకార మమకారాలు, రాగ మోహాలు, వీడి పోగా మనస్సు కుదుట పడింది. ఆత్మా జిజ్ఞాస ఏర్పడింది. అందుకే యోగాభ్యాసం లో ఉన్న శ్రీ కృష్ణుని సందర్శించి, మార్గం బోధించా మని కోరాడు. దీని వల్ల అతనికి యోగా నిష్ఠ లో ఆసక్తి, పర తత్త్వం ఐ కోరికా బలపడ్డాయని తెలుస్తోంది. శాంతి, అనుశాసనికపర్వాలలో ఆధ్యాత్మిక తత్త్వం ప్రకృతి రహస్యం అంతా అతన్ని కర్మ యోగి గా మార్చాయి.



కదా నాయకు లైన పాండవుల జీవిత చరమాంకం ప్రశాంతత పొందటమే. నాయకుడూ, ఫలాది కారి అయిన ధర్మ రాజు స్వర్గం చేరా లాంటే, చిత్తశాంతి పొందాలి. అతని విషయం లో ఒక వేదాంత అర్ధం కూడా ఉంది. పూర్వ జన్మ సంస్కారం కారణం గా సత్య నిష్ఠ, ధర్మ పర తత్త్వం దైవ భక్తీ మొదలైనవి కలిగాయి. ఇంద్రియాలను వశ పరచు కొన్నాడు. రాగ ద్వేషాదులను జయించి, స్వధర్మ నిర్వహణ చేశాడు. క్షత్రియులకు ఉచిత మైన యుద్ధమూ చేశాడు. రాజసం అవలంబించి, విజ్రుమ్భించినా, యుద్ధం తర్వాతసహజ సిద్ధ మైన ప్రశాంతత పొందటం అతని ప్రకృతికి చాలా సమంజస మైనది. కల్పాంతం లో తీవ్ర మైన గాలితో ఉప్పొంగి, సమస్తాన్ని ఆక్రమించి ముంచేసే మహా సముద్రం, మళ్ళీ శాంతి పొంది, మేర అంటే చెలియలి కట్ట దాటకుండా ఉండే విధం గా స్వభావం తో సౌమ్య మైన బ్రహ్మ జ్యోతి కారనాన్తరంగం గా, రాజసం మొదలైన వికారం పొందినా, మళ్ళీ సహజ స్వభావం అయిన సౌమ్యాన్ని పొందు తుంది. ఈ విషయాన్నే -- "నిసర్గ సౌమ్య మేవ బ్రహ్మం జ్యోథిహ్ కుతోపి కారణా --త్ప్రాప్త, వికార మాపి, పునః, స్వభావమే వావ తిష్టతే--కల్పాంత వాత సంక్షోభ లంఘితా శేష భూభ్రుతః --స్థైర్య ప్రసాద, మర్యా దాస్తా ఎవహి మహోదధెహ్ "అన్న దాని లో వివ రించారు.

మోహం తో ద్యూతం లో పాల్గొన్నా, అరణ్య వాస తపోనియమాదులతో పూరమ సంస్కార స్మృతిని ధర్మ రాజు పొందాడు. ఇంద్రియాలను జయించి, శ్రీ కృష్ణుని ఆలంబనం గా భీమార్జునుల సహాయ సాధన సంపత్తి తో దుర్యోధనాది శత్రు వర్గాన్ని జయించి, భీష్మ గురూప దేశం చేత జ్ఞాని యై, ఆత్మా సాక్షాత్కారాన్ని పొంది, చివరికి స శరీర స్వర్గ ప్రాప్తి అనే జీవన్ముక్తి ని పొందటం అంతా పైన చెప్పిన వేదాన్తార్ధం లో సమన్వయం అవుతుంది. ఆధ్యాత్మికత్వాన్ని ప్రతి పాదించటం లో వ్యాస విధానం చాలా విశిష్ట మైనది. దివ్యాష్ఠ సంభూతుడు, జితేంద్రియుడు, మనో వాక్కాయ కర్మ ల చేత" సంయమి "అని పించు కొన్న వాడు, జ్ఞానిగా జీవించి, వీరోచిత యుద్ధాన్ని ప్రతి ఫలా పేక్ష లేకుండా నిర్వహించి, చివరకు ప్రశాన్తుడై, అంపశయ్య మీద తన మరణం నిమిత్తం ఉత్తరాయణం కోసం ఎదురు చూస్తూ, పరమ నిష్ఠ లో ఉన్న భీష్మ పితామహుడు ధర్మజునికి తగిన "ఉప దేష్ట ".అంటే ఆచార్యుడు,, ఉపదేశించదగిన శ్రేష్టుడు. ఎంత ఔచిత్య వంతం గా ఉందో ఆలోచిస్తే మన మనసులకు మనకే ఎంతో ఆనందం గా ఉంది. ప్రాపంచిక కష్ట సుఖాలను అనుభవించాడు. ధర్మ పరుడు, ఆత్మా విమర్శ తో పశ్చాత్తాపం తో శుద్ధుడు, రాగ ద్వేశాదులను తొలగించు కొన్న వాడు, జిజ్ఞాసువు అయిన ధర్మజుడు" శ్రోత ".పరమ గురువుకు పరమోత్క్రుష్ట శిష్యుడు. శాంతి ప్రదాయక మైన ఆధ్యాత్మికం ఇంతటి విశిష్ట పరిస్థితి కి అనుగుణం గా తిక్కన రచన కూడా ప్రశాంత గంభీరం గా ఉంటుంది. భావోద్వేగం వదిలి తిక్కన సోమయాజి చక్కని సంయమనం తో రచన చేశాడు. విపుల ప్రపంచానుభావం, విశిష్ట లౌకికాలౌకిక జ్ఞానం కల్గి జితేంద్రియత్వం యోగా నిష్ఠ మొదలైన వాటి వల్ల ఆత్మా సాక్షాత్కారం పొంది, బ్రహ్మానందాన్ని అనుభవించిన గురువు భీష్ముల వారు. ఇహ లోక విరక్తుడు, పరిణత మనస్కుడు భక్తుడు ముముక్షువు అయిన ఉత్తమ శిష్యుడు అయిన ధర్మ రాజుకు ఉత్తమోత్తమం గా ఉపదేశించిన విషయాలన్నీ ఈ పర్వం లో అపూర్వం గా చెప్పా బడ్డాయి. అర్ధానికి మాత్రమె ప్రాధాన్యత నిచ్చి, కతిన పదాలు ఆడంబరాలు లేకుండా, సమాసాల జోలికి వెళ్ల కుండా, తిక్కన చాలా సరళ మైన రచన చేశాడు రాజ నీతి మొదలైన వాటిని బోధించే తప్పుడు తగిన ఉపమానాలు, ఉదాహరణలను ఎన్నుకొని మనస్సు కు హత్తు కోనేట్లు చెప్పాడు. కావ్యము, ప్రబంధమూ అనే విధానాలు కాకుండా" పౌరాణిక మార్గం" లో రచన చేశాడు. అర్ధం కాని

వేదాంత, అధ్యాత్మిక విషయాలను  చాలా సులభ మైన శైలి లో, లోక సహజ దృష్టంతా లతో వివరించాడు. సమతలం లో ప్రవహించే గంభీర గంగా ప్రవాహం లాంటి శైలిని తిక్కన మహా కవి అవలంబించి ప్రతిభా విశేశాడు లతో నిర్వహించి ఔనని పించుకొన్నాడు. అదీ మహా కవుల లోకోత్తర విధానం.

యుద్ధ  విషయాలన్నీ వర్ణించా ల్సి వచ్చినా, చాలా క్లుప్తం గా వ్యంగ్యం గా వివ రించి ఔచిత్యాన్ని పాటించాడు. నకులుడికి భీష్ముడు ఖడ్గ ప్రభావాన్ని తెలుపుతూ, శివుని రౌద్రాన్ని వర్ణించే ఘట్టం లో --"హరుండు బెట్టుగా నవ్వి, పెల్లార్చుటయును, విని సముద్ధత రయమున, దనుజ కోటి -మునుగ బర తెంచి తాకిన మును కొని, వ --దించి, ఇల ఎల్ల నెత్తుట ముంచే నతడు. "నాలుగు పొడి మాటలతో తేల్చి పారేశాడు. అలాగే కార్త వీర్యుడు హైహయులను చంపటం కూడా ఒకే ఒక పద్యం లో చెప్పాడు. ప్రశాంత చిత్తం తో చని పోవాలని ఎదురు చూసే భీష్ముని చేత శాంతి రస ప్రధాన మైన విషయాన్ని చెప్పించటం లో ఎంతో సంయమనం పాటించాడు తిక్కన. అశ్వ మేధ పర్వం లోని యుద్ధ వర్ణన లో కూడా ఇంతటి ఔచి త్యాన్నే నెల కోల్పాడు. --"నవ్వుచు నానా శరముల -నవ్వీరుల బొలియ జేయ నంతయు విని, తా --సేవ్వగతో, దుస్స ల, యా --కవ్వడి బౌత్రాన్వితముగా, గానగ వచ్చెన్ "--అని సింధు దేశాదీషులు అర్జునుని పైకి యుద్ధానికి వచ్చి నప్పుడు అతడు ప్రవర్తించిన విధానాన్ని వివరించాడు --"రాజుల జంపకు మని మా --రాజానతి, ఇచ్చే, నుద్దురత, సేననిన --య్యోజ విడిచి, నట్లైన -బరాజితుగా, నన్నద్ధరారా పతి దలచున్ "అవసర మైన యజ్న కర్మ నిర్విఘ్నం గా జరగతమే ధర్మ రాజు, అర్జునుల ఆశయం. అందుకని యుద్ధం లో రాజసం కంటే, సాత్వికం ప్రధానం గా పోషించ బడింది. విజజ్రమ్భణ అర్జునుని యుద్ధం లోను లేదు, తిక్కన శై లి లోను కనీ పించక పోవటమే ఇక్కడ గొప్ప విషయం.

తిక్కన మహాకవి కవితా సరస్వతీ స్రవంతి శాంతి, అనుశాసన పర్వాలలో సాత్వికం గా ప్రత్యక్ష మైతే, అశ్వ మేధం లో అంతర్వాహిని గా, నిగూఢం గా ప్రవహించింది. "ఇంద్రియములు దామ ఇచ్చ నట్టు నిట్టు, --దిరిగె సేనియు, దుఖముల్ దెచ్చు నవియ --కట్టు వడి, సుఖ యాత్మ --గావలయు నింద్రియ చోర గణము వలన "--ఇది తికన శైలికీ వర్తిస్తుంది.ఇంద్రియాలను అణచి వేస్తే, ఆత్మా చక్కగా ప్రకాశి స్తుంది. అలాగే అలంకారాలను తగ్గిస్తే, శాస్త్రాల అర్ధం చాలా సులభ గ్రాహ్యం అవుతుంది. --"విను, కేవలుడగు జీవుడు, -దను బరముం గాగ, జాతి, తల్లీనత్వం --బున, వెలుగు నది, నిరామయ --మనంత మగు పదము సూపే యతుల వివేకా "అని అర్ధ గౌరవానికి ప్రాదాన్యమిచ్చాడు. శబ్దార్ధ చమత్కారాదు లను వదిలేసి శుద్ధ సాత్విక రూప రచనను చేశాడు. దీన్నే నిసర్గ రమణీయం అన్నారు. ఈ విధానం లోను చదు వరులను అత్యంతంగా మెప్పించాడు.. గాలి లేని చోట దేపం నిశ్చలం గా ఉంటుంది. సుఖ నిద్ర వల్ల ప్రశాంతత, మేఘాడంబరం లేని ఆకాశం లో నిర్మ లత్వం, తరంగాలు లేని మహా సముద్రం లో ప్రసాద స్తితి అంటే ప్రశాంతత, అలాగే అంతర్ముఖుడై,ఆత్మా సాక్షాత్కారం తో జనిచిన బ్రహ్మానందం లో లీన మైన యోగి స్తితి కూడా అలానే ఉంటుందని చక్కని ఉపమానాలతో విస్పష్టం గా తెలియ జేశాడు.



"అవృష్టి సంరంభ మివామ్బు వాహం --అపా మీవా ధారా మనుత్త రంగం --అంతశ్చరాణాం మరుతాం నిరోధా --న్నివాత, నిష్కంప మివ ప్రదీపః "అన్ని మహా కవి కాళిదాసుగారి రచన తిక్కన రచన కు సమాన ఉజ్జీ లా ఉంది. తిక్కన రచన నిశ్చలత, ప్రశాంత స్వచ్చా, లక్షణా లతో "వేద వాఙ్మయం "లాగా మహా తేజో మయం గా ప్రకాశించింది. ధర్మ రాజు తాను తపోవనానికి వెళ్లి హాయిగా జీవితాన్ని గడ పాలని అను కొంట న్నట్లు తమ్ములకుతెలిపాడు. వారందరూ ఏమంటున్నారో చూడండి --"కేవల నిష్కర్మత, మో-క్షావహా మగు నేని గిరులు, నవనీజములున్--భూవర, ముక్తిం బడయం --గా వలదే, యడవి నునికి, కైవల్యదమే ?"శక్తి ధైర్యం ఉన్న వారు శత్రు ప్రయతనాన్ని వ్యర్ధం చేసి, కార్య సిద్ధి పొంది,, రాజ్యానుభావాన్ని వద్దనటం, అవి వేకం అన్నారు. యే కార్యక్రమం లేకుండా అంటే నిష్క్రియత్వం తో మోక్షం వస్తుందని భావిస్తే -యే పని లేని కొండలు, చెట్లు, అడవులు మోక్షాన్ని పొందాలి కదా !అలా పొందు తున్నాయా ఆలోచించు అని చాలా చిన్న మాటలతో

అనంత సత్యాన్ని వివరించారు అన్నకు -కాదు వివ రించి చెప్పించాడు తిక్కన. అదీ కవితా రహస్యం. చాలా అర్ధ వంత మైన దృష్టాంతాలను చెప్పి, ఒప్పించారు అన్నయ్యను. హింస లేకుండా జీవించటం ఎవరి తరమూ కాదన్నారు. దీనికో పద్యాన్ని తిక్కన సమయోచితం గా చెప్పాడు --"కాయల, బండ్ల, నీళులు గల్గవె, సూక్ష్మ జంతువుల్ మునుల్ --సేయరే హింస, వాని, నుప జీవిత ద్రవ్వరె, కంద మూలముల్ --నీ యెడ జూడు ప్రాణములు నిలవగా నేర వహింస నేరికిన్ --వేయును నెల, భక్ష్యముగ, వేధ విధింప బడే ప్రాణి ప్రానికిన్ "అని లోక సహజ మైన హింసను వివ రించారు. నీళ్ళల్లో గాలిలో, కాయల్లో కూరల్లో పాళ్ళలో స్ ఉన్న సూక్ష్మ జీవులు మునులు తీసుకొంటుంటే హింస చేసినట్లా ?కందమూలాలు తవ్వుతుంటే ఎన్నో జీవులు నశిస్తాయి ఇది హింసే అయితే జీవిత విధానం సాగాడు. ఒక ప్రాణి చావు ఇంకో దాని చేతి లో ఉండటం లోక సహజం. ఈ భక్షణ అనేది వేధ అంటే చంపటం హింసించటం అని పించు కోదు.



ఇలా వేదాంత రహస్యాలను సులభం గా, సరళం గా చెప్పాడు తిక్కన. తేట తెలుగు మాటలే ఉప యోగించాడు. శాంతి ఆనుశాసనిక పర్వయే ఆర్య సాహిత్యం లో మహా భారతానికి విశిష్ట స్థానాన్ని సంపాదించి పెట్టాయి. మహా భారత రచనా ప్రకొజనమ్ కూడా దీని తోనే సిద్ధి పొందింది. వ్యాసుని హృదయం దివ్య జ్ఞానం అర్ధం చేసుకొని సులభ గ్రాహ్యం గా తిక్కన మహా కవి తె లుగు చేశాడు. "తెలుగింటి వ్యాసుడు "అని పించుకొన్నాడు తిక్కన సోమయాజి.

ధర్మ సంకటం చాలా క్లిష్టం గా ఉంటుంది. తేల్చి చెప్పటం మహా కష్టం. శాస్త్ర జ్ఞానం లేని వారికి ఇలాంటి పరి స్తితే యేడు రైతే ఎలా నడుచు కోవాలో అద్భుతం గా చెప్పాడు మహా భారతం లో. --"ధర్మమధర్మము భంగిన -ధర్మము ధర్మంబు మాడ్కి, దనయా, తోచున్ --నిర్మల మతి నరయ వలయు --ధార్మికతన కోరు వాడు దానకేర్పడగన్ "--బ్రహ్మ చర్య, గృహస్త, వాన ప్రస్తా, సన్యాస ఆశ్రమాలను అవలంబించిన వారు అనుసరించే ధర్మాలు యే విధం గా స్థూల దృష్టికి పరస్పర విరుద్ధం గా కన్పించినా, సూక్ష్మ పరి శీలన లో ఉత్తమ ధర్మాలుగా వర్తిస్తాయి. శాంతి తో జీవ యాత్ర చేసే వారికి --"వినుము బ్రతి గ్రహంబును, --యాజనంబును, నద్యాపనమును ధరామరులకు --ప్రజ రక్ష,నృపులకు బసు పాలనము గృషి, వాణిజ్యము నివి వణిజులకు "అని వర్ణాశ్రమ ధర్మాలను తెలిపాడు. అయితే అన్ని వర్ణాల వారు ఆచరించ వలసిన ఉత్తమ ధర్మాలను కూడా వివ రించాడు. --"సత్య శౌచంబులును, నహింసయు, ననసూయయు, శ్రాద్ధంబు, నాటిది పూజ నమును నాత్మ దార పరతయు సర్వ సాధారణంబు లనఘ వీనను, నిజ వృత్తులను సమస్త --జాతులును నిహ పర సౌఖ్య సంపదలకు --నాస్పదములగు నిందృంబు లన్య విధులు "అని స్పష్టం చేశాడు. వివిధ ధర్మాలను అవలంబించటం లో తమ ధర్మం పట్ల దురభి మానం, అన్య ధర్మాల పట్ల నీరసం కలగా కుండా సర్వ ధర్మ సమానత్వాన్ని ప్రతి పాదించి చెప్పాడు. --"వినుమనేక విధంబుల విస్తరిల్లు --ధర్మముల యన్డేకండును దలప, నిష్ప--లంబు లేదాత్మ మొక్షావ లంబీ యైన --ధర్మ ముత్తమమంద్రుతత్వజ్ఞు లధిపా "అని సర్వోత్తమ మైన ధర్మ స్వరూపాన్ని విడమరచి చెప్పాడు.. అనేక ధర్మాలున్నాయి అందులో ఏదీ పనికి మాలినది కాదు. కాని మోక్షం కోరు కొనే వారు మాత్రం తగిన ధర్మాన్ని ఎన్నుకొని ఆ మార్గం లో మోక్షాన్ని సాధించాలి.

కొన్ని ధర్మాలు పాపం గ కన్పిస్తాయి. కాని సూక్ష్మ విచారణ లో అవి సత్క్రియలు గా తెలియ బడతాయి. ఎలాగో చూడండి --"దూరమున గైదువు గొని తను --బోరి గోన సేతెంచు నట్టిపు రుషుని --వేదాంత రహస్య వేది నయినను --బోరి గొనినను, గిల్బిషంబు వొందదువత్సా "దూరం గా ఉండి ఏదో అనుకొని దగ్గరకు వచ్చి చూస్తె అసలు రహస్యం తెలుస్తుంది. అలాగే వేదాంత రహస్యం కూడా ఆచరణ లో దాని విలువ కనీ పిస్తుంది. ప్రాణి హితం కోసం మాట్లాడినవన్నీ సత్యాలే. భూత హితం పరమ ధర్మం. అన్ని మతాలకు ఇదే మూలం అనితెలియ జేశాడు. --"సత్యంబు పల్కుట సర్వ ధర్మములకు --మిక్కిలి, యనృతంబు మేటి పాత --కము, తద్విశేషంబు గలదు చెప్పెద నోరు

--నరదంబు, ప్రాణంబు నపహరింప --జాచు పాతకులతో సూనృతంబాడుట --పాపంబు, బొంకులు వలికి యట్టి --వారి హింసించుటవర ధర్మ మిది యొక్క --డేల భూతములకు హితము సేయు --బొంకు లెల్లను ధర్మముల్ భూత బాధ --కంబు లగు నిక్కములు, పాతకులు వినుము --భూతముల దుష్ట శిష్టత్వములు వివేక --సూక్ష్మతా వేద్యములు, వాని జూడ వలయు "నిజం మాట్లాడటం అబద్ధం చెప్పక పోవటం అందరు తప్పక చేయాల్సిన పనులే. ప్రాణాన్ని డబ్బును సంపదను దోచుకొనే పరమ పాపు లతో నిజం చెప్పటం మంచిది కాదు అక్కడ తప్పించుకోవ టానికి అబద్ధం తప్పదు. అసలేప్పుడూ అబద్ధాలు చెప్పే వారిని దండిన్చాల్సిందే. సర్వ భూతాలకు మేలు చేసే టప్పుడు అబద్ధమాడినా అది సత్యం తో సమానమే. కనుక ప్రాణుల దుష్టత్వం శిష్టత్వం చాలా ధర్మ సూక్ష్మా లతో పరిశీలించి నిర్ణయించాలి. పిడుక్కీ బియ్యానికీ ఒకే మందు పనికి రాదు. ఇదే ధర్మసూక్ష్మం.



వేదాలు కర్మ చేయమని ఒక సారి, కర్మను పరిత్య జించమని ఇంకో సారి చెబుతాయి. దీన్ని ఎలా అర్ధం చేసు కోవాలి అన్న ధర్మ రాజు ప్రశ్నకు భీష్మునిసమాధానం --"కొందరు కర్మాచరణ మభి -నందిం తురు, వారలకు జనన మరణములం --బొందక, వోరాదు, మహా --నందము బొందుదురు నిత్య నైష్కర్మ్య పరుల్ "--"చిత్త శుద్ధి మాత్ర జేసే సేనియు, నవి --ద్యాత్మకం చూపె, యరయ,గర్మ -మది, దొరంగు తమ్చితాత్మ విద్యాత్మక --ధర్మ మది య మోక్షదంబు సుమ్ము "అని కర్మాలను చేయటం లో ఉన్న ధర్మ సూక్ష్మాలను చెప్పాడు. "ఫలములు గోరక, కర్మం-బులు నడపుచు, వాని విమల బోధాగ్ని హతిం --బొలియించుచు, నిర్ద్వందత --నెల కొనునే కాంతి జనులు నిను గంధ్రు హరీ " అని ఆచరణ సాధ్య మైన కర్మ సిద్ధాంతాన్నే చెప్పాడు. ఫలా పేక్ష లేకుండా చేసే సత్కర్మ లన్నీ మోక్ష కారకాలే అవుతాయి. ఎవ రైనా ఎలా ప్రవర్తించాలో, చాలా స్పష్టం గా వివ రించి చెప్పాడు. సూక్ష్మ ధర్మా లనన్నిటిని రాశి గా పోశాడు. ఆధ్యాత్మిక ఔన్నత్యానికి ఈ పర్వాలు చక్కని సోపాన మార్గాలు. జీవ బ్రహ్మ ల ఐకమత్య తకు విశుద్ధ మార్గాలు. కర్మ చేసే వారికి జనన మరనాలుంటాయి. అయితే నిష్కామ కర్మ చేసే వారు మహానందాన్ని పొందుతారు.

" జనులకు గీడు రోయక, యజస్రము ధర్మ రతిం జరించి, స -జ్జన, గురు పూజనంబులు సత్య హితోక్తులు దీన పోషణం --బున, నాటిది ప్రియత్వమును, భూరిత దయార్ద్ర తయుం గలట్టి వా--రనిమిష లోకములని యాత్మ నేరుగుము మేనకాత్మజా "ఎంత సూక్ష్మం గా స్వర్గానికి చేర గలమో చెప్పాడు -ఏమీ లేదు -ప్రజలకు కీడు చేయ కుండా ఉండటం, ఎప్పుడు నీ కు విధించిన మార్గం లో నడవటం, మంచి వాళ్ళను గురువులను పూజించటం, సత్యాలు మంచి మాటలు వారి నుండి గ్రహించటం, ఆపదలో దీన స్తితి లో ఉన్న వారిని ఆదరించటం, అందరి తో ప్రియం గా ప్రవర్తించటం, సర్వ భూతాల మీద దయ కలిగి ఉండటం స్వర్గానికి మార్గాలు.

"పరుసని పల్కు, బొంకులగు పలుకులు, నన్య ధనాభి లాష ముం --బర వనితావిలోలతయు, బాంధవ సజ్జన విప్రియమ్ము, దు --శ్చరితులతో డి మైత్రి యును, సంతత ధర్మ రతాభ్యసూయయుం --గలి,ని భయాన ఘోర నరకంబున కేగెడి వారి చిహ్నంల్ "అంటే --పరుష మైన మాటలు, అబద్ధాలు ఇతరుల ధనం పై ఆశ, ఇతర స్త్రీ ల మీద వ్యామోహం, బంధువులకు మంచి వారికి కీడు చేయాలనే తలంపు, చెడ్డ వారితో స్నేహం, ఎప్పుడూ ధర్మానికి విరుద్ధం గా ఆలోచించటం ధర్మ వ్యతి రేక పనులు చేయటం కలి కాలం లో ఘోర నరకం పొందటానికి కారణాలు అవుతాయి. ఇంత క్రిస్టల్ క్లియర్ గా మంచి చెడు ల జ్ఞానాన్ని విడమర్చి చెప్పాడు. ముక్కు మూసుకొని తపస్సు చేయ్యనక్కర

లేదు. అరణ్యాలకు వెళ్లి గడ్డాలు మీసాలు పెంచి జపతపాలు చేసి శరీరాన్ని కష్ట పెట్టక్కర లేదు. సంసార జీవితం లో ఉంటూనే సర్కార్మా చరణ, నిష్కామ జీవితం లోనే స్వర్గ ప్రాప్తి కలుగు తుంది.. జప తాపాలు చేసి కష్టపడ క్కర లేదు. మంచి పనులు చేస్తే మోక్షం, చెడ్డ పనులు చేస్తే నరకం వస్తాయి. ఈ విధం గా వివిధ ధర్మ శాస్త్రాలలో చర్చించ బడిన విశిష్టార్దాలన్నిటిని సర్వజనులకు అర్ధమయ్యే టట్లు, సిద్దాంత రూపం గా, ఆంధ్ర మహా భారతం లో ప్రతి పాదించ బడ్డాయి. దీని విశిష్టత ను బట్టే ఆంధ్ర భారతం విజ్ఞాన వ్యాప్తికి ఉత్కృష్ట సాధనం గా నిలిచింది.

దీని తో ధర్మసూక్ష్మ విచారణ పూర్తీ అయింది. దీని తర్వాత చివరి పర్వాలలోని ఆంతర్యాన్ని, పరమ ప్రయోజనాన్ని తెలుసు కొందాం.

సద్గురుని ఉప దేశం తో విశిష్ట జ్ఞానం పొంది న ధర్మ రాజు, ధర్మ సింహాసనం అధిష్టించి, రాజ్య పరి పాలన చేసిన విధానం అంతా ఆశ్రమ వాస పర్వ పూర్వ భాగం లో వర్ణింప బడింది. రాజు లందర్నీ ధర్మ బద్ధులను గా మార్చి, ప్రజా రంజకం గా 35ఏళ్ళు మాత్రమె రాజ్య పాలన చేశాడు. ఆయన పాలన లో సత్య న్యాయ ధర్మాలు బాగా పోషింప బడ్డాయి. గాంధారి ధ్రుత రాష్ట్రుల జీవిత విధానం, వారి యెడ పాండవుల ప్రవర్తన ఇందులోనే వర్ణించ బడ్డాయి. ఉత్తర భాగం లో ధ్రుత రాష్ట్రాదులు ఆశ్రమ వాసం చేయటం, నిర్యాణం పొందటం తో నాయకు డైన ధర్మ రాజు ఇతి వృత్తం చివరి దశకు చేరు తుంది. ధర్మ రాజాదులకు ఇది వరకే ఇహ లోక కాంక్ష నశించింది. యుద్ధం వల్ల శోక, నిర్వేదాలు హృదయం లో ఇంకా అంత ర్వాహిని గా ప్రవహిస్తూనే ఉన్నాయి. అవి, తరువాతి జీవితం లో మాటి మాటికి ప్రత్యక్ష మావు తూనే ఉన్నాయి. ఆశ్రమ వాస కధ దీనికే ప్రాధాన్య మైంది.



వ్యాస భగ వానుని తో పాండవు లందరూ కలిసి ధ్రుత రాష్ట్రుని ఆశ్రమానికి వచ్చారు. అక్కడే ఉండి పోవాలనే నిశ్చయానికి వచ్చి, ఇంటికి వెల్ల టానికి విముఖత చూపించారు. కాని, ధర్మాన్ని ఆచరించాల్సిన బాధ్యత వారి పైనే ఉందని ఆ వృద్ధ మూర్తులు చెప్పారు. --"ఇట్లు మీరు నన్ను నెంతయు దరిమిన --విపిన భూమి మిమ్ము విడిచి పోవ --నియ్య కొనదు నాదుహ్రదయంబు మును వోలె --కలుగదిపుడు రాజ్య కాంక్ష నాకు "అని ఇలాంటి స్తితి లో ముసలి వారందర్నీ అరణ్యాల పాలు చేసి, తాను మళ్ళీ సింహాసనం ఎక్కి రాజ్యం చేయటానికి మనసు ఒప్పటం లేదన్నాడు. --మళ్ళీ ఒక సారి ఫ్లాష్ బాక్ లోకి వెళ్లాడు --"విను పాంచాలురు మాత్స్యులు, --వనితా జన శేషు లైరి వారలు లేమిన్ --జననీ శూన్యం బై తో --చిన యది, రాజ్యంబు నాడు చిత్తంబు నకున్ "మత్స, పాంచాల రాజు లంతా యుద్ధం లో చని పోయి ఆడవారికి శోకం మిగిల్చి పోయారు. ఇప్పుడు రాజ్యం నాకు తల్లి లేనిది గా కనీ పిస్తోంది అని వాపోయాడు --"సమరము దీరిన కోలేను -శమ నిరతా, నామనంబు సార తపమునన్ -రమి యింప గోరు యుష్మ-త్సమధిక తపమునకు నేను సందడి సేయన్ "అని తల్లి కుంతీ దేవితో చెప్పుకొన్నాడు. యుద్ధం పూర్తీ అయిన దగ్గర నుండి తన మనస్సంతా

తపస్సు చేయాలనే సంకల్పం తోనే నిండి పోయిందని వివ రించాడు. సహదేవుడూ అవే మాటలు పల్కాడు. ఇలా, అందరి చిత్త వృత్తి, ఆముష్మికానికి పరుగులు తీస్తోంది. వ్యాసుడు- చని పోయిన బంధువు లందర్నీ యోగ శక్తి తో చూపించాడు. ముసలి రాజు భార్య గాంధారి అగ్ని దగ్ధులైనారు. ఇవన్నీ చూసి పానడవు లందరికి ఐహిక కాంక్ష పూర్తిగా నశించి పోయింది. ఈ పర్వం లో కుంతి మనస్తత్వం బాగా విశ్లేషింప బడింది. యుద్ధానికి ప్రోత్స హించింది ఒక రకం గా ఆమే. అయితే మానసికం గా మార్పు వచ్చేసింది. గాంధారి, ధ్రుత రాష్ట్రుల తో పాటు తానూ అరణ్య వాసానికి వెళ్ళింది. వాళ్ళ తోనే మరణించింది. కర్ణుడి వృత్తాంతం ఆమెను క్షోభింప జేసింది. దాని వల్ల ఆమె కు హృదయ వేదనా, అశాంతి, నిర్వేదం ముప్పిరి గోన్నాయి. తట్టు కో లేక పోయింది. --"కనీ, ఏటిలో నిడితి, గల --గని, నట్లయి యుండె, దత్త్రకారంబిది, మీ--కనిన యది, దివ్య బోధం --బున, నత్తేరగంతరంగమున, గోలు కాలున్ "అని తన అశాంతిని చిత్త క్షోభను, ఆస మర్ధతను చాపల్యాన్ని ఉపెక్షను వెల్లడించు కొంది.ఈ విధం గా కథ లోని ముఖ్య పాత్ర లన్నిటికి ఇహ లోకం పైన విరక్తి కల్గి, దృష్టి అంతర్ముఖ మైంది. యాదవ నాశనం కూడా పాండవుల్లో నిరాశను పెంపొందించింది.

మౌసల పర్వం లో కరుణ రసం ఉత్కృష్ట స్తితికి చేరింది. యుద్ధ పర్వం లో అక్కడక్కడ కరుణ రసం సూచించ బడింది. స్త్రీ, అనుశాసన పర్వాలలో కరుణ రస పోషణ జరిగింది. మౌసల పర్వం లో కరుణ రసం పరి పక్వం చెందింది. విరాటపర్వం వీర రస ప్రధానం, మోదాంతం. అంటే ఆనందం తో ముగిసింది. యుద్ధం తర్వాత మౌసలం కరుణ రస విషాదాంతం. దీనికి ఒక ప్రత్యేకత కూడా ఉంది. శ్రీ కృష్ణుని జీవిత పరమార్ధానికి ఈ పర్వం ప్రత్యక్ష వ్యాఖ్యానం. లోకం లో అన్యాయం పెరిగి, పాపం విజృమ్భిస్తే, సత్య ధర్మాలకు హాని కలిగితే, భగవంతుడు అవతరిస్తాడు. దశావతారాలన్ని ఈ ప్రయోజనం కోసమే. శ్రీ కృష్ణావతార ఫలితం కూడా ఇంతే. అధర్మ పరి ణామ ఫలితమే కురు క్షేత్ర యుద్ధం. శ్రీ కృష్ణుడు సూత్ర దారి. అర్జునుని చేత యుద్ధం చేయించాడు. అధర్మ పరిణామ ఫలితాన్ని లోకానికి ప్రత్యక్షాను భవం చేశాడు. వారికి ధర్మ ప్రవర్తన లో ఆసక్తి ని కల్గించాడు సత్య ధర్మాలను స్తాపించాడు. ఇదే ఆయన అవతార ప్రయోజనం. ఆయన రాజనీతి -దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ.. ఈ కార్య క్రమాలలో అవలంబించిన విధానాలు పై ప్రయోజనాలకు మూలమైనవి. పాపాన్ని ప్రతిఘటించే నైతిక ధైర్యం లేని వారి, ప్రత్యక్షం గా ఘోరాలు జరుగుతున్నా, ఉపేక్షించి, పాపులకు బాసట గా చేరి,. యుద్ధం చేసి, అధర్మానికి దోహదం చేసిన భీష్మ, ద్రోణుల విషయానికి, శ్రీ కృష్ణుడు అవలంబించిన విధానానికి ఈ మహా ప్రయోజనమే కారణం. ఉదాహరణకు -కర్ణుడు శక్తి బాణ ప్రయోగం చేసి ఘటోత్కచుని చంపాడు. అప్పుడు కృష్ణుడు "ప్రమోదనంబు నొంది, సింహ నాదంబు సేసి, శంఖంబు పొరించి పగ్గంబుల నొగల ముడిచి, మంద మారుతాన్దోలిత మందారంబు చందంబుదోప, నర్తిన్చుచు, నరదంబు నడిమి కరిగి, కిరీటిం గౌగలించుకొని వీపప్పళించి, వెండియు నార్చి "కృష్ణుడు ఘటోత్కచుడు చావటాన్ని అంత ఆనందం గా అనుభవించాడు. పెద్ద సీనే సృష్టించాడు యుద్ధం మధ్య భాగం లో. అర్జునుని వీపు చరిచాడటఉత్సాహం గా.. అన్నభీముడి కొడుకు చస్తే, తమ్ముడి వీపు చరచటం ఏమిటి / అని మనకు సందేహం కలుగు తుంది. కృష్ణుని సంతోషాతిశయానికి కారణం ఏమిటో ఈ దుఃఖ సమయం లో ఈ చిందు లాటలేమితో అర్ధం కాలేదు. ఆ విషయమే అమాయకం గా బావను అడిగాడు. "ఇంద్రదత్తమైన అమోఘ శక్తి సంపన్నమైన శక్తి అస్త్రం వల్ల నీకు ఇంక భయం పోయింది. అంతే కాదు ఘటోత్కచుడు కిమ్మీరుడు, హిడింబి లతో కలిసి ఉన్నాదు. ధర్మ ద్వేషం, రోషం లతో వారు ముగ్గురు ఎంత కైనా తెగించ గలరు.. ఆ రాక్షసులిద్దరి లాగా ఘటోత్కచుడు కూడా చని పోవటం నాకు చాలా ఇష్టం. వీడు రావణాసురుడు అంతటి వాడు. కర్ను వాడి మీద శక్తిని ప్రయోగించాడు ఇప్పటిదాకా దాచుకొని లేక పోతే నీ మీద ప్రయోగించే వాడు. ఇప్పుడు ఆ ప్రమాదం తప్పి పోయింది. ఇక విజం విజయునిదే. వాడిని కర్ణుడు చంపక పోతే నేనే స్వయం గా మన వాడైనా, చంప వలసి వచ్చేది. కనుక నాకిప్పుడు మహా సంతోషమే కాని దుఖం యే మాత్రమూ లేదు "అని తన మనస్సు లో మాట చెప్పేశాడు. ధర్మ రక్షణ కోసం తన వారు, పరాయి వారు అనే భేదం ఉండదుపరమాత్మకు అని తెలియ జేశాడు. ధర్మ ద్వేషులు, ధర్మ విముఖులు ధర్మ యెడ ఉపేక్షా పరులు అందరు నశిన్చాల్సిందే. అందులో మొహమాటం లేదు. అప్పుడే ఆయన అవతారానికి ప్రయోజన సిద్ధి కలుగుతుంది. అందుకోసమే కురుక్షేత్ర సంగ్రామం లో అర్జునుని విషాదం పోగొట్టి ధర్మోపదేశం చేసి వ్యామోహం నుండి దూరం చేసి కర్తవ్య పాలన తో యుద్ధం చేయించాడు. అభి మన్యుడు, ఉప పాండవులు, విరాట ద్రుపదులు, నారాయణ సైన్యం అందరు నశించారు. ఇరా వంతుని చావుకు బాధ పడే అర్జునుడికి సృష్టి తత్వాన్ని తెలియ జెప్పాడు. పాండవులను రాజ్యాధి కారులను చేసి, అశ్వమేధ యాగం చేయించి, భారత యుద్ధం లో పాల్గొనని రాజుల్ని చంపించటమో, లొంగ దీసు కోవటమో చేయించాడు. దానితో లోక ధర్మాన్ని ప్రతిష్టించాడు.

మౌసల పర్వం అంటే రోకలికథ. అదే యాదవ వినాశనానికి కారణమైంది. అందుకే ఎక్కడైనా తగాదాలు బంధు జనం మధ్య వస్తే "ముసలం ప్రారంభ మైంది "అనే మాట లోక సహజ మై పోయింది. బల రామ, శ్రీ కృష్ణుల నీడలో యాదవులందరు ద్వారకా నగరం లో సకల సుఖాలు అనుభవిస్తున్నారు. మత్తు లో జోగుతూ, మదం బలిసి విశృంఖలం గా ప్రవర్తిస్తున్నారు. అవినీతి, బంధువులతో తగాదాలతో ధర్మ నాశనం చేస్తున్నారు. యుక్తాయుక్త విచక్షణ కోల్పోయి ప్రవర్తిస్తున్నారు. పెద్దల మీద గౌరవం, భక్తీ పూర్తిగా పోయాయి. యాదవ కుల నాశనం అయితే తప్ప, శ్రీ కృష్ణావతార ప్రయోజం పూర్తీ కాదు. అప్పటికే గాంధారి తన వంశం లాగానే యాదవ వంశమూ నిర్వంశం కావలి అని

కృష్ణుని శపించింది. అది ఒక నెపం మాత్రమె. అప్పటికే చరిత్ర రాసి ఉంచాడు పరమాత్మ. ఆ శాపం ఫలించే సమయానికి యాదవ వంశ ప్రవర్తన నీతి బాహ్యం గా మారి పోయింది. "--గురుల కవమానమోనరించు దిరుగు, లజ్జ --విడిచి, యభి లాషముల వెంట, విభుల పంపు --సేయ కున్మార్గుల, దమ చిత్తములకు --వచ్చి నట్లు వర్తింతురు వనిత లధిప ".--ఆడ వాళ్ళు కూడా బరి తెగించి ప్రవర్తిస్తున్నారు. ధర్మ చ్యుతి తట్టుకోవటం కష్టమైంది కన్నయ్యకు. సంఘం ఇలా నీతి బాహ్యమై అధోగతి పాలై పోయింది. "వినాశ కాలే విపరీత బుద్ధిహ్ "ఆ వినాశనాన్ని సూచిస్తూ, ప్రకృతి విరుద్ధాలైన విశేషాలు కలగటం సహజం.

"అరుణములు ఘూర్ణి తంబు లై న,లోచ--నములు మెరయ, మహోగ్ర దండము ధరిం చి --తిరుగు నొక్కొక్క చోట,, నద్రుశ్యుడగుచు, --నన్తకున్డిదే, యదె, తోచె ననగ నదిప "అంతకుడు అంటే యముడు ఎక్కడ పడితే అక్కడ కానీ పిస్తూ కానీ పించాకుండా ఎర్రటి కళ్ళ తో కనీ పిస్తున్నాడట. --"విను గూడు గూర పాకము -గాను గొని, బ్రోయి వాపిడింప గా, నప్పుడ, సం --జనితము లై, పువ్వులు గల --గోన, మిల మిల, మొదలు నందు గురుకుల ముఖ్యా !"విప రీతాలన్నీ జరిగి పోతున్నాయి. యాదవులు కణ్వాది మహర్షులను అవమానించారు. శ్రీ కృష్ణునికి అవకాశం చిక్కింది. ఆ నెపం తో పాపం ప్రదర్శితం అవెట్లు చేశాడు. పాప ఫలాన్ని వారితో అనుభ విన్చేట్లు చేశాడు. దాని ద్వ రా ధర్మ స్థాపన చేయాలని సంకల్పం. అందుకే వారికి అంతటి శిక్ష తప్పని సరి. మహర్షులకు జరిగిన అవమానం విన్న కృష్ణుడు నిశ్చలం గా ఉన్నాడు. "విదాత్రు కరణీయం "అన్నాడు. అంటే బ్రహ్మ రాత తప్పించు కో లేనిది. యాదవ నాశనాన్ని, ఎక్క డైనా మంచి తీర్ధ భూమి లో చేస్తే బాగుంటుందని సంకల్పించాడు. ఉత్సవం పేరు తో మొత్తం యాదవు లందర్నీ తరలించేశాడు.

"తన రథము లేమి, నొండొక --ఘన రథమును, దారకుండు గైకొని యెలమిం -గొని రా, వెడ వెడ గైసే--సిన, కృష్ణుడు, నిర్వికార చిత్తత వెడలెన్ "--కృష్ణుడికి రథం లేదు సారధి వేరే రథం తెస్తే చాలా వేగం గా యే రకమైన చిత్త వికారం లేకుండా, వెళ్ళాడు యాదవులున్న చోటికి. --"బొడవు చీర పూత లొంటి యట్టులు గాగ --నేమి వాహనంబు నెక్క కించు --కేని, వికృతి లేని, హృదయంబు మిత్ర సం --భాషణంబు గలిగి, బలుడు వెడలె "బాల రాముడు రోజు వేసుకొనే విలువైన చీని చీనాంబరాలు కాకుండా చాలా సాధారణ వస్త్ర ధారణం చేసి, రధాన్ని ఎక్క కుండా, బంధువు లతో మాట్లాడు కొంటూ యే వికారం లేని శుద్ధ అంత రంగం తో బయల్దేరాడు. ఇలా, నిర్వికారం గా అన్నదమ్ములు బాల రామ కృష్ణులు బయల్దేరటం తో కాలపురుషుని శాంత, గామ్భీర్యాలను సూచించాడు. సాత్యకి తో సహా, అంతా విపరీతం గా మద్యం సేవించి, ఊగి పోతున్నారు. సాత్యకి కృత వర్మ ను అనవసరం గా నిందించాడు. ఆయనా నానా మాటలు అన్నాడు. ఇలా నెమ్మదిగా కలహం ప్రారంభ మైంది. కృత వర్మ భూరిశ్రవనుడి చావుకు కారణం సాత్యకే నని దెప్పి పొడిచాడు. శమంతక మణి కోసం, సత్రా జిత్తు ను చంపినా విధానాన్ని జ్ఞాపకం చేశాడు సాత్యకి. ఇదంతా విని సత్యభామ కన్నీరు కార్చింది. కృష్ణుడికి కృత వర్మాదుల కోపం వచ్చింది. అతి క్రూరం గా చూశాడు. అసహ్యాన్ని ప్రదర్శించాడు. ఈ విధం గా సాత్యకిని ప్రోత్సహించి నట్లే కృష్ణుడు. సాత్యకి మదిరావేశం తో కృత వర్మను నరికేశాడు. భోజ, అంధక వీరులందరూ సాత్యకి పై విరుచుకు పడ్డారు. తమ్ముడు సాత్యకిని కాపాడే ప్రయత్నం ఏమీ చేయ లేదు కృష్ణుడు. ముని శాపం వల్ల పుట్టిన ముసలం అంటే రోకలి వల్ల జన్మించిన తుంగ మొక్కలతో బాదు కొన్నారు అందరు చచ్చి పోయారు బహుసా దీని వెనక ఉన్న కధ అందరికి తెలిసిందే. ఒక యాదవుడు కడుపు తో ఉన్నట్లు నటించి మునిని అవమానించాడు "నీ కడుపు లో ఏముంది "'అని ముని అడిగితే, వాడు పెడసరం గా "ముసలం అంటే రోకలి "అన్నాడు. దానికి కోపించి ముని అదే నీకు పుట్టి మీ యాదవ వినాశానికి కారణ మవుతుందని శపించాడు. అలాగే రోకలి పుట్టింది. పాపం ఏమి చేయాలో తెలీక దాన్ని అరగ దీసి సముద్రం లో కలిపారు. అదే తుంగ మొక్కలుగా పుట్టింది. దానితో బాదుకొనే యాదవు లందరూ చచ్చారు. తుంగ మొక్క చాలా సున్నితం గా మెత్త గా ఉంటుంది. అదే వినాశానికి ఆయుధమై పోయింది అదీ విచిత్రం.

"తండ్రి, పుత్రుడన్నదమ్ముడు నాకయ --య్యిరుదేరంగు వారు, నేపు రేగి --మడియ, మొదగాలి బడు మ్రాకుగాముల తె--రంగు దోచే, నేమనంగ గలదు., "అన్నా లేదు తమ్ముడూ లేదు తండ్రీ లేదు బంధువులు అనే విచక్షణ జ్ఞానం లేకుండా ఒకరి నొకరు చచ్చేదాకా కొట్టుకు చచ్చారు. ఇదే "యాదవ కులం లో ముసలం "అంటే. అనిరుద్ధ, ప్రద్యుమ్నాదు లైన కృష్ణుని కొడుకులూ చని పోయారు. మిగిలిన వారెవ్వ రైనా ఉంటె అవతార మూర్తి కృష్ణుడు తానే తుంగ బుర్ర లతో మోది చంపేశాడు. యాదవ కులాన్ని సమూలం గా నాశనం చేశాడు. గాంధారి వాక్యానికి సార్ధకత్వం చేకూర్చాడు. ఆడవారిని, ఏనుగులు మొదలైన వాటిని ద్వారక కు తర లింప జేశాడు. తాను తపోవనానికి వెళ్తున్నట్లు తలి దండ్రులకు తెలియ జేశాడు. ఇని గంభీర విషయాలను తిక్కన అతి చిన్న పదాలతో అలంకార రహితం గా చెప్పి మనసుల్ని ఆకర్షిస్తాడు.

శ్రీ కృష్ణుడు అన్న బాల రాముడున్న చోటికి వచ్చాడు. బలరాముడు యోగబలం తో తనువు చాలించాడు. మహా భుజం గా మారి ఆకాశం లోకి చేరాడు. అనంతుడైన ఆది శేషుడు దాన్ని తన పరమ మూర్తి లో కలుపు కొన్నాడు. ఇదంతా కృష్ణుడు చూస్తుండ గానే జరిగింది. తాను భూమి మీదకు వచ్చిన అవతారం పని పూర్తీ అయిందని భావిం చాడు వాసు దేవుడు. ఇక తన విముక్తి మార్గం చూసు కొన్నాడు.. దూర్వాస మహర్షి

ఒకప్పుడు తన శరీరంలోని అన్ని అవయవాలకు  పాయసం పూసి, అరికాలు కు పూయటం మర్చి పోయి వదిలేసిన విషయం జ్ఞాపకం చేసుకొన్నాడు. పాయసం పూసిన శరీర భాగాలను యే శస్త్రాస్త్రాలు బాధించవు. అదీ అందులోని అంత రార్ధం. విధి అనుల్లంఘనీయం పరమాత్మకైనా. కృష్ణుడికి అపాయం అరికాలి వల్లనే వస్తుందని మహర్షి హెచ్చరించిన విషయం గుర్తుకొచ్చింది. మనసును అధీనం చేసుకొన్నాడు. భూమి పై ఒక మహా సమాధి స్తితి ని పొందాడు. "జర" తనను మాయ చే ఆవహించిన ఒక బోయ వాడు, శ్రీ కృష్ణుని కృష్ణ సారంగం గా (నల్ల జింక )గా భావించి భ్రాంతి తో బాణం విడిచాడు. అది సరాసరి వచ్చి హరి అరికాలి లో గుచ్చు కొన్నది. అంతే. ఆ నిమిత్త మాత్రం గా, మానుష దేహాన్ని పరిత్య జించాడు శ్రీ కృష్ణ పరబ్రహ్మ. తన నిజ పదం అయిన వైకుమ్తానికి చేరు కొన్నాడు. దేవేంద్రుడు దేవతా గానం తో ఎదురొచ్చి, భక్తీ తో నమస్కరించి "శ్రీ హరీ !దయావిదేయ మైన ఆట భూమి మీద ఆడావు బంధువులైనా. కంసాదులను,కౌరవులను నిర్జించి, నీ ధర్మాన్ని నేర వేర్చి మళ్ళీ నీ స్వ రూప సన్నిధానానికి చేరావు. లోక హితం కోసం నీవు  అవతారం దాల్చి, ఆ పని పూర్తీ కాగానే మళ్ళీ ఇక్కడికి చేరావు "అని ప్రస్తుతించాడు.

గుజరాత్ లోని ద్వారకా పట్టణాన్ని చూసి ఆనాటి శ్రీ కృష్ణ వైభవాన్ని అనుభూతి గా పొంద వచ్చు..  సముద్రం లో స్టీమర్ లో వెళ్లి చూడాలి. అక్కడి శ్రీ కృష్ణ మదేవాలయం పరమ వైభవం గా అందులోని శ్రీ కృష్ణ విగ్రహం పరమ మనోహరం గా దర్శన మిస్తాయి. ఆ తర్వాత సోమనాద్ వెళ్లి అక్కడి సోమనాధ దేవాయాన్ని దర్శించాలి. అది జ్యోతిర్లింగం. మహమ్మ దీయ దండయాత్రలలో పడి హేను సార్లు విధ్వంసానికి గురైంది. అరేబియా సముద్రం వొడ్డుననే దేవాలయం ఉంది. దాన్ని దర్శిస్తుంటే కైలాసం లో ఉన్నట్లె పిస్తుంది. ఆలయానికి దగ్గర గా కొద్ది దూరం లో నడిచి వెడితే శ్రీ కృష్ణుడు బోయ వాని దెబ్బకు నిర్యాణం చెందిన ప్రదేశం కూడా కనీ పిస్తుంది. ఆ ప్రాంతాలకు వెళ్ళిన వారందరూ వీటిని సందర్శించి గత వైభవాన్ని గుర్తుకు తెచ్చు కొంటారు. 2002  మా రెండో అబ్బాయి శర్మ అహమ్మదా బాద్ లో పని చేస్తుండగా, మేము వెళ్లి అందరం కలిసి అన్నీ చూసి, అనుభూతిని పొందాము.  దసరాపండగల్లో వెళ్ళాం. అప్పుడు రాత్రిళ్ళు గుజరాతీలు వాళ్ళ ప్రత్యేక మైన నృత్యాన్ని అందరు కలిసి సామూహికం గా చేస్తారు. అందరు రాదా కృష్ణులుగా గోపికల్లా అలంకరించుకొని కోలాటం ఆడుతూ చేస్తారు కనుల పండువు గా ఉంటుంది. అక్కడ ఆరు బయలు సినెమా ఉంటుంది. యెట్టిన చోట స్క్రీన్ పెట్టి సినిమా వేస్తారు. హాయిగా మన కారులో కూర్చుని సినిమా చూడచ్చు. తింది తింటూ ఇంట్లో చూసి అంట్లు చూడచ్చు. గాంధీ నగరం దగ్గర స్వామి నారాయణ దేవాలయం శబర్మతి ఆశ్రమం కూడా చూదాల్సినవే. అవకాశం ఉన్న వారందరూ వెళ్లి చూసి ఆనందం పొందాల్సిన దివ్య క్షేత్రాలు ద్వారకా, సోమనాద్ లు.

వసుదేవుడికి చాలా బాధ కలిగింది. శ్రీ కృష్ణుని ఉపేక్ష వల్లే, యాదవ నాశనం అయిందని అనుకొన్నాడు.శ్రీ కృష్ణుడు తలుచు కొంటె ఎంత పని అయినా అవలీల గా చేయ గలడు.  పరీక్షితుని బ్రతికించాడు అశ్వత్థామ బాణం నుంచి. మరి ఎందుకింత ఉపేక్ష ?అని బాధ పడ్డాడు --"వలసిన యట్టి కార్యమును, వావిరి నేట్టుగ నైన జేయగా -- వలతి. మృతుం బరీక్షితుని, వత్సల తన్ బ్రతికించే శౌరి, మొ--గ్గలమున, యాదవుల్ పెనగాగా, గని, మాన్పడుపెక్ష సేసె, నీ --పొలియుటవశ్య భావ్యమని  బుద్ధి దలంచుట గాన నయ్యెడున్ "అని కృష్ణుడు కావాలనే ఇదంతా ఇలా జరగాలనే భావించి చేశాడని గ్రహించాడు. తనపుత్రుడైన శ్రీ కృష్ణ నిర్యాణానికి దుఃఖించాడు. ఆయన్ను ఓదారుస్తూ వేద వ్యాస మహర్షి "హరి ఎరుంగు మున్న యా సంక్షయం "అని స్పష్టం గా అన్నీ శ్రీ హరి యైన కృష్ణునికి తెలిసే జరిగాయని స్పష్టం చేశాడు. అర్జునుడు ఇంకా అమాయకం గా "మూడు లోకాలకు అన్నదాత్వాన్నిచ్చే పరంత్మ  ముని శాపాన్ని బాప లేడా?"అని ప్రశ్నించాడు. అప్పుడు మహర్షి అర్జుననికి శ్రీ కృష్ణ జనం రహస్యాన్ని బోధించి జ్ఞానం కల్గించాడు. -"-ధరణి భారంబు వాప, నవతారము నొందిన విష్ణు డత్తేరం --గరుడుగా, నిర్వ హించి, యజరామర,  నిష్కల, నిర్వికార  భా --స్వర, నిజ సత్పదనంబు నుప శాంతి పరుం డయి, పొందే, దానికిన్ --గురుకుల వర్య, శోకమున గుందుదురే,  మిము బోటి బోధనుల్ "భూ భారాన్ని తీర్చటానికి అవతరించాడు కృష్ణుడు. ఆ పని సక్రమంగా నిర్వహించి, వచ్చియా పని అయి పోగానే స్వస్థలానికి వెళ్లి పోయాడు. జ్ఞాన ధనులైన నీ వంటి వారు దీనికి దుఃఖించటం భావ్యం కాదన్నాడు.

"అవనీ భారము వాపి, తా హరికి దోడై, భీమ సాహాయ్య గొ --రవ, దుర్దాంత పరాక్రమంబున, గ్రుతార్ధత్వంబునం జేసే,  య-స్త్ర వితానంబును నిన్ను బాసి చనియెన్ దైవ ప్రకారాజ్న, నీ--దు వరిష్టా చరణంబున న్ సురలు సంతోషించి రప్పోరులన్ "- కృష్ణుడు నీసహాయం భీముని సాయం తో కౌరవ వినాశన చేయించి, మిగిలిన ధర్మ కార్యాలు మీతో చేయించటానికి మిమ్మల్ని ఉంచి వెళ్లి పోయాడు. మీరు చేసిన యుద్ధాలను దేవతలంతా మెచ్చారు. అని చెప్పాడు --"బలమును, బుద్ధియు, జేవయు, -నలఘు మతియు, నుల్ల శిల్లు నగు కాలము నన్ --బోలియుం, గాల విపర్యయ --కలనంబున  బుధులకుబ్బు గలకయు గలవే "--"నర నారాయణులైన పురాణ మునులు లోక కళ్యాణార్ధం, పార్ధ, పార్ధ సారధు లుగా జన్మించి  ధర్మ సంస్థాపనం చేశారు " అని గుర్తు చేశాడు. --"నరుడు, నారాయణుండు ననంబరాగు --నిత్య పురుషులు నీవును, నేను జుమ్ము, --భువన హిత మాచరిమ్పగా, బూని పేడ్క, --వచ్చి, ఇమ్మహి, బుట్టిన వార మనఘ "అని జ్ఞాపకాల దొంతర పెర్చాడు. శ్రీ కృష్ణుడు కూడా పార్ధునికి --"నానా రూపంబులని -నిట్లేను బ్రవర్తింతు జగము లన్నింటను, నీ --శానుడు, నభవుడు నమృతుడు --నైన శివుని నీవు గొలువు మర్జున యెపుడున్ "అని అర్జునుడు నిమిత్త మాత్రమె నని, తానే మహా భారత యుద్ధాన్ని అంతటినీ నిర్వహిస్తా నని,

బావ మరది అర్జునిడికి ఇది వరకేప్పుడోనే బావ కృష్ణుడు బోధించాడు. మరపు మానవ సహజం కనుక మళ్ళీ గుర్తు చేయాల్సి వచ్చింది అంతే. --"ఏను రక్షింప, జయము నీ కేసక,మేసగ--సమరమున, శూల పాణి యై, శత్రు కోటి నీదు, మునుమున వధి యించు నిరుప మాన --తేజు రుద్రుగా, నేరుగుము ధీర చిత్త "బావా కిరీటీ !. నేను రక్షకుడిగా ఉండి నీకు యుద్ధం లో జయం చేకూరుస్తాను. నువ్వు బాణాలు వేసే నిమిత్తమే యుద్ధం లో నీ పని. సర్వ సంహారకుడు అయిన త్రిశూల పాణి శివుడే అసలు సంహారకుడు నువ్వు బాణం వేస్తె, ఆయన ప్రాణాలు తీస్తాడు అంతే. అని ఎప్పుడో విస్పష్టం గా చెప్పే పాడు అసలు రహస్యాన్ని. ఈ విషయాలనే ఇప్పుడు వ్యాస మహర్షి మళ్ళీ చెప్పి గుర్తు చేశాడు. శ్రీ కృష్ణుని దివ్యత్వం తెలిసిన భక్తుడు అర్జునుడు. అతడు చేసిన ప్రతి పని వెనక శ్రీ కృష్ణ ప్రోత్సాహం ఉంది. శ్రీ కృష్ణ సంకల్పాన్ని నిర్వ హించే భౌతిక శక్తి మాత్రమె అర్జునుడు. వీరిది మనో దేహ సంబంధం. ఇంతకీ బాదరాయణుడైన వ్యాసుడేమి చెప్పాడు --"నీవని సేయ, నీ వలని, నేయ్యమునం, గృప నన్య సైన్యమున్ --దా వధియించుశూల ధరతాస్ఫురణం బెసగంగ,, ముందర, ర--ద్దేవు డు, దాని గాంచు, భవదీయ సముచిత ద్రుష్టియున్ --నినున్ --గావడ,యా, మురాన్తకుడు గాల విపర్యయమావహిల్లు ట న్ "అని కృష్ణుడు అర్జునికి ఇది వరకు చెప్పిందే మళ్ళీ గుర్తు చేశాడు నీ మీద స్నేహం బాంధవ్యం ధర్మం తో శూల పాణి యైన శివుని ప్రేరేపించి నీవు నిమిత్తమాత్రుని గా యుద్ధం చేసి విజయాన్ని నీకు అందించి నిన్ను "విజయుడు "అని పించాడు అని అంటే యుద్ధాన్ని గేలి పించాడు. ఎంత చిన్న మాటలో ఎంత అర్ధ వంత మైనవో ?చదివితే, అర్ధమైతే ఎంత లోతైన భావనలో తెలుస్తుంది వ్యాసుని వారసుని గా తిక్కన మరో వ్యాస రూపం గా మన ముందు సాక్షాత్కరిస్తాడు.

మౌసల పర్వం లోని అర్జునుడు పూర్వపు అర్జునుడు కాదు. ఆ ఉత్సాహం ఇప్పుడు లేదు. ఆ పౌరుష గామ్భీర్యాలూ లేవు. అన్నీ నశించాయి. అతని లోని దశా భేదాన్ని అనుసరించి, పాత్ర పోషణ చేశాడు తిక్కన కవీశ్వరుడు. చక్కని ఔచిత్యమూ పాటించాడు. సైంధవ వధ రోజున లోకాతీతం అద్బుతం దివ్య మైన శక్తి సామర్ధ్యాలను ప్రదర్శించాడు. మౌసలం లో కేవలం నరుడే అయాడు శాంతి, స్థైర్యం, ఉచితజ్ఞత, బంధు ధర్మం, ప్రజా రక్షణ, పరిణత జ్ఞానం ఇప్పుడు అర్జునుడిని ఆవేశించాయి. ప్రాపంచిక విషయాల పై వైముఖ్యమేర్పడింది. విధి విలాసాన్ని తప్పించటం ఎవరి వల్లా కాదు అనే జ్ఞానం కలిగింది. దాని వల్ల నిరా సక్తత ఏర్పడింది. అందుచే విషాద, కరుణ రసాలు ఈ పర్వం లో చోటు చేసుకొన్నాయి. ఉప నాయకుని గా అర్జునుడు, బావ, త్రిలోక రక్షకుడు, జగన్నాధుడు అయిన శ్రీ కృష్ణ పరమాత్మ చివరి ఆదేశాన్ని శిరసా వహించి, తన ధర్మాన్ని నిర్వర్తించాడు.

సంచిత కర్మ భారత ఇతి వృత్తం లో ప్రచ్చన్నం గా అనుస్యూతం గా, నడుస్తుంది. విధి ప్రాబల్యం ప్రకాశితం అయింది. --"వినుము, పురాతన జన్మం --బున జేసిన యట్టి కర్మముల ఫలములు ప్రా --జ్ఞుని నైన బొందు, వానికి --నది శోకము నావహించు, నత్యంతంబున్ " పూర్వ జన్మం లో చేసిన కర్మల్ని బట్టి, ఫలాలు కలుగుతాయి. ఎంత జ్ఞానికైనా అవి తప్పవు. దానితో శోకమూ అతనికి తప్పదు అని సందేశం. ఇలా అవసర మైన అన్ని సన్నీ వేషాలలో తిక్కన విధి విలాసాన్ని విస్పష్టం గా చెప్పాడు. "నముచి కధ "లో దేవేంద్రునితో దైవం కాల ప్రభావాన్ని స్పష్టం గా ఎరుక పరిచాడు. --"సకల భూతంబు లకు శాసకుడు కలడు --గాదే, యొక్కరు డాతని కల్పనమున --ప్రాప్త మైనది నీళ్లులు పల్లమునకు -వచ్చు క్రియ దాన వచ్చు గీర్వాణ ముఖ్యా "!దేవేంద్రా! సకల భూతాలను శాసించే సృష్టికర్త సంకల్పం వల్ల మన కేది ప్రాప్తమో అది నీరు ఎత్తు నుంచి పల్లానికి ప్రవహించి నట్లు మనకు సంక్రమిస్తుంది అని భగవంతుడే దేవతల రాజు అయిన మహేన్ద్రునికి చెప్పాడు. కనుక మానవ మాత్రులం మనం ఎక్కడ ? అలాగే వ్యాస భాగ వానుడు సాక్షాత్తు నారాయణ స్వరూపుడు కూడా అర్జునునికి -"కాల మూలంబు సర్వంబు గాన, దీని --కొండు తలంపులు దక్కి, మీరుత్త మంపు, --గతికి జనుడు, నిశ్చింత, వికార తనులు --విడిచి, యార్య జనంబులు వినుతి సేయ "అన్నిటికి కాలమే మూలం. దీనికి వేరే ఏమీ లేదు. ఇతర ఆలోచన లన్నీ వదిలెయ్యండి. మంచి మార్గం లో నడిచి బుధుల ప్రస్తుతి పొందండి అని స్పష్టం గా చెప్పాడు. కనుక మార్గాలన్నీ మూసుకు పోయాయి. ఒక్కటే మిగిలింది. అదే ధర్మ తత్పరత తో జీవించటం. దీని తో పార్ధుని హృదయం ఆనంద పరవశమే అయింది వెంటనే హస్తినా పురానికి చేరి, ధర్మ రాజాదులతో యాదవ వినాశాన్ని సవిస్తరం గా తెలియ జేశాడు "మన సారధి, మన సచివుడు, మణ బాంధవుడు గురుడు కృష్ణుడు మనల విడిచి అరిగే నృపా ".అని బావురు మన్నాడు. ఈ విషయాలను విన్న యుధిష్టిరుడు మహా ప్రస్తానం తామంతా చేయాలి అనే కోరిక వెలి బుచ్చాడు. యాదవ నాశనం ఆలంబనం గా, అనుల్లంఘ్యం, అప్రతి హతం అయిన విధి విలాస మహాత్మ్యాన్ని, కాల ప్రభావాన్ని, ప్రత్యక్ష మయ్యే విధం గా వివ రిస్తూ, శ్రీ కృష్ణ జీవిత సత్యాన్ని మహా తత్వాన్ని వ్యాఖ్యానించాడు వ్యాస మహర్షి.

అందుకే మౌసల పర్వం సమగ్ర స్వతంత్ర కావ్యం గా భాసిల్లింది. ఇతి వృత్తం పూర్తిగా పోషింప బడింది. రస స్పోరక సన్నీ వేషాలు చాలా చక్కగా విస్తా రింప బడ్డాయి. విస్తుత మైన ఇతి వృత్తాన్ని, దైవికం అయిన ఒకే సంఘటన తో రసొన్ముఖం చేశాడు మహాకవి తిక్కన. రసోత్పత్తి, రసానుభూతి కలిగిన తర్వాతా ఉద్వేగాన్ని తగ్గించి, విషయాన్ని ఉప సంహరించాడు. ఈ ఉద్వేగం శాంతి గా మారి, కావ్య ఫల సిద్ధి తో, ముగిసి నిర్వహణకు తోడ్పడింది. ఉదాత్త వస్తు భావ సమన్వితమై, మానవ కళ్యాణార్ధ ప్రతి పాదికమై, నిత్యానంద దాయకమై ణ ఉత్తమ

కావ్య లక్షణా లన్నీ, ఇందులో కన్పిస్తాయి. యాదవ వంశ చరిత్ర కధ కనుక ఉదాత్తం, ప్రఖ్యాతం అయింది. మహానుభావుడు శ్రీ కృష్ణుడు కదా నాయకుడు కనుక ఉత్తమ నాయకత్వమూ లభించింది. భారత వీరుడు అర్జునుడు దివ్యాస్త్ర సంభూతుడు కనుక, ఉపనాయకుని గా రాణించాడు. నాయకుని సంకల్పాన్ని నేర వేర్చాడు. ఇందులో కరుణ ముఖ్య రసం. వీర రసం దానికి అంగ రసం. యాదవ నాశనం అర్జుని లో ఉత్కంఠ. యాదవ స్త్రీల ఆక్రందన ఉద్వేగం.

అర్జునుడు ద్వారక చేరాడు. వార్త తెలిపాడు. వారంతా శోక తప్తు లైనారు. ద్వారక లోని ప్రజలను రక్షించే నిమిత్తం, అంతపుర స్త్రీ లతో బాల రామ కృష్ణుల నిర్యాణ వార్త నుచెపప్ప లేదు. సూర్యోదయానికి ముందే, ద్వారక నుంచి అందర్నీ తరలించాడు కిరీటి. వారిని రక్షించటం లో ఎంతో స్వార్ధ త్యాగాన్ని ప్రదర్శించాడు. వాళ్ళతో అర్జునుడు --"ఈ రేయి, సెచ్చెర ప్రయాణమునకు గ్రుత్యములగు పను లెల్ల సమ కట్టి, వేగంగ,గ్రక్కున, పెడల వలయు --గాని, పెడల కున్న, భానూదయమ్మున --వనధి పురము ముంచి, కొనిన, గణన --సేయ రాని, యట్టి సేగియు, బ్రయ్యు బా-- పంబు వగయు, సెల్ల భంగి గలుగు "అని అందర్నీ జాగ్రత్త చేసి ద్వారకను వీడి వెళ్లి పోఎట్లు చేశాడు వెంటనే వెళ్ళాక పోతే తెల్ల వారిన తర్వాతా ద్వారకా నగరాన్ని మొత్తం సముద్రం ముంచేస్తుంది. మన వల్ల ఏమీ కాదు అని హెచ్చరించి చెప్పాడు. యాదవ కుమారా పట్టాభి శేకాన్ని దగ్గరుండి జరిపించాడు. సత్యభామ మొదలైన వారందరూ తపోవనం చేరారు. ఈ విధం గా యాదవ వంశ వృత్తం శాంతాన్ని చే రింది. ఈ పర్వాన్ని దృశ్య ప్రబంధం గా తిక్కన మలిచాడు.



ఆలం కార శాస్త్ర రీత్యా పూర్వ నాటకాలలో నాయక వధ నిషిద్ధమే. కాని, భగ వ వతార ప్రయోజన మైన ధర్మ సంస్థాపన సిద్ధించటం, అవతార పురుషుడు కారణ శరీరం వదిలి "అమ్రుతం,బజరం,బవ్యయ, మమలం,బవి తర్క్య, మచల మాగమ, గమ్యం "అయిన నిజ పదాన్ని పొందటం లోక కల్యాణానికి కారణాలే. కనుక తప్పు లేదు. నిషిద్ధమూ కాదు అన్నారు విశ్లేషకులు. ఈ విధం గా భారత రచన చేత మహర్షి వేద వ్యాసుడు నిర్వహించాలను కొన్న ప్రయోజనం ఈ పర్వం లో పూర్తిగా సిద్ధించింది. సత్య, న్యాయ, ధర్మ తత్వాల, వివరణ, సుఖ దుఃఖ విచారం, సత్పురుషులకు అర్ధమయ్ ట్లు, బోధించి, సంస్కరించటం, ఈ పరమ ప్రయోజనం లో ఒక భాగం. వేద, వేదాన్తరహస్యాలు, అందుబాటు లో లేని సూక్ష్మాలు, భగవత్తత్వం,, సృష్టి రహస్యాలు, కర్మాది యోగా మార్గాలు శాస్త్ర జ్ఞానం లేని సామాన్యులకు అందించి, ఇహం మీద వైముఖ్యం కల్గించి, ఆధ్యాత్మిక సాధన కోసం మహత్తర మార్గాన్ని చూపించటం, చిత్త శాంతిని ప్రసాదించటం, దీనిలో ఉన్న మరో ప్రయోజనం. యాదవ నాశనం తో ఇహ బంధాలన్నీ తెగి, పరీక్షిత్తు కు పట్టం కట్టి, పాండవులంతా ద్రౌపదీ దేవి సహితం గా తపోవనం చేరి, మహా ప్రస్తానం సాగించారు. ధర్మ రాజు అలౌకిక శీలము, ప్రవర్తన ల వల్ల సశరీర స్వర్గ ప్రాప్తి పొందాడు. మిగతా వారు చని పోయి స్వర్గానికి చేరారు. ఈ రకం గా స్త్రీ పర్వం లో శోకోద్వేగం, శాంతి, అనుశాసనిక పర్వాలలో నిర్వేదం, మౌసల పర్వం లో కరుణ, ప్రదానాలు అయినా, ధ్యేయం అయిన శాంతరసం మూదిన్లోను అంతర్వాహిని గా ప్రవహించి, చివరికి మొత్తం ఇతి వృత్తాన్ని తన లో లయం చేసుకొని, ఒక జీవిత పరమార్ధాన్ని బోధించింది మహా భారతం. దాన్ని మహర్షి వ్యాసుడు అంత పకడ్బందీ గా పర్వ నిర్వహణ చేసి వేదోక్త ధర్మాన్ని ప్రతి పాదకం గా తీర్చి దిద్దాడు. ఇన్ని మహా గొప్ప విషయాలను సందర్భాను సారం చక్కని శాలీ విన్యాసంతో మనసులకు హత్తు కోనేట్లు చేసి తెలుగు భారతానికి పట్టం కట్టాడు తిక్కన మహాకవి. ఆంధ్రుల మక్కువ కావ్యం గా శోభింప జేశాడు. అందుకే తిక్కన మరో వ్యాసుదని పించుకొన్నాడు. ఈ సందర్భం గా కవిత్రయ కవులైన నన్నయ, తిక్కన ఎర్రన లకు ఆంధ్ర జనం సర్వదా కృతజ్ఞులు.



ఆడ పిల్లలకు తగిన సమయం లో వివాహం జరగటానికి తెలుగు దేశం లో భాగవతం లోని "రుక్మిణీ కల్యాణాన్ని "పారాయణం చేయిస్తారు. ముఖ్యం గా పోతన గారి పద్యాలను. కష్టాలు బాధలు తొలగటానికి పోతన గారి "గజేంద్ర మోక్షం "ను చదువు కొని బాధల నుండి విముక్తు లవుతారు. మరి భారతం సంగతేమిటి?--వర్షాలు సకాలం లో కురవ టానికి శివాలయాలో అభిషేకాలు చేయించటమే కాకుండా "విరాట పర్వం "పారాయణ చేస్తారు దీక్షగా. అదీ వేద వ్యాస సంస్కృత విరాట పర్వాన్నే ఎక్కువ గా పారాయణ చేస్తారు. దానికి చక్కని తెలుగు లో వ్యాఖ్యానం కూడా చెప్పిస్తారు.. మన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, దేవా లయ ధర్మాదాయ సంస్థ, తిరు మల తిరు పతి దేవస్తానం, విజయవాడ కనక దుర్గమ్మ గుడి, శ్రీ శైల మల్లికార్జునాలయం మొదలైన వాటిల్లో వేసవి లో దీన్ని తప్పక చేసి వర్ష ప్రాప్తి ని పొందటం చూస్తూనే ఉన్నాం.

సర్వం సంపూర్ణం -




మనవి --1994 ఏప్రిల్ నెలలో నాకు ఎక్కడో స్వర్గీయ భూపతి లక్ష్మీ నారాయణ గారు రాసిన "భారతము -తిక్కన "అనే పుస్తకం కానీ పించింది. దాన్ని ఆసాంతం మొదటి సారి చదివాను. ఎంతో ఆనందం కల్గింది. మళ్ళీ మళ్ళీ చదివాను. నన్ను బాగా పట్టేసింది. ఆ పుస్తకం అప్పటికే శిధి లా వస్తలో ఉంది. కాగితాలు పెళుసు గా మారి. రంగు కోల్పోయి పెళ పేలా విరిగి పోవ టానికి సిద్ధం గాఉన్నాయి.. దాని లోని సారాంశాన్ని నాకు నచ్చిన విషయాలను నేను నానోట్ బుక్ లో రాసుకోన్నాను. ఆ నోట్సు భద్రం గా ఈ పద్దెనిమిదేళ్ళు నా దగ్గర ఉంది. అందులోని విశేషాల ను ఇదివరకేవ్వరు అంత లోతుగా,అంత ఆంతర్యం గా తరచిన వారు లేరని పించింది. అది చదవటం నా పూర్వ జన్మ సుకృతం అని పించింది. ఇప్పుడు అదంతా మీకు "తిక్కన భారతం "పేర భక్తిగా అంద జేశాను. ఇందులో విశేషాలను వివరించటం లో నేను సరళ భాషనే వాడాను. అసలు రహస్యాలు, విశేషాలు అన్నీ లక్ష్మీ నారాయణ గారివే. ఏదైనా మనసుకు హత్తు కొంటె అదంతా ఆయన ఖ్యాతి యే.సరిగ్గా వివ రించలేక కప్పు దాట్లు ఎక్కడైనవేస్తె అదంతా నా అజ్ఞానమే నని, సవి నయం గా విన్న వించు కొంటున్నాను.

అంకితం --ఉయ్యూరు లో మా మేనమామ స్వర్గీయశ్రీ గుండు గంగాధర శాస్త్రి (గంగయ్య గారు )ఉయ్యూరు విష్ణ్వాలయం లో రామాయణ, భాగవత, భారతాలు, భగవద్గీత లను రోజు సాయంత్రం నాలుగు నుండి ఆరు వరకు క్రమం తప్పకుండా పురాణ ప్రవచనం చేసే వారు. జనం వచ్చినా రాకపోయినా ఆయన సమయ పాలన తో చేసే వారు. ప్రతి ఫలా పేక్ష లేకుండా చేయటం ఆయన ప్రత్యేకత. సంస్కృత గ్రందాలనే ఆధారం గా శ్లోకాలను చదువుతూ చాలా తేలిక భాషలో తెలుగు లో భావాలను, విశేషాలను వివరించే వారు.. నేనూ అప్పుడప్పుడు వెళ్ళే వాణ్ని. మా అమ్మ గారు నిత్య శ్రోత. ఆయన ప్రభావం నా మీద పడింది. నేను కూడా సుమారు అయిదేళ్ళు అదే ఆలయం లో రోజు సాయంత్రం ఆరు గంటల నుండి, ఎనిమిది గంటల వరకు రామాయణం భాగవతం భారతం ఆముక్త మాల్యదమొదలైన వాటిని ధనుర్మాసం లో అలానే ప్రవచనం చేశాను. సమయ పాలన తో చేసే వాడిని. విన్నవాళ్ళు చాలా మంది "ఏమండీ అచ్చం మీ మేన మామ గంగయ్య గారి లానే చెబుతున్నారు. ఎన్నో కొత్త విషయాలు తెలియ జేస్తున్నారు "అని అభినందించే వారు. అదంతా మామయ్య అనుగ్రహం అని భావిస్తాను.

అందుకే "'తిక్కన భారతం "అనే ఈ ముప్పైధారావాహిక భాగాలను మా మేన మామ స్వర్గీయ"'శ్రీ గుండు గంగా ధర శాస్త్రి గారి "కి సవినయం గా, సభక్తి కం గా అంకితం ఇస్తూ కొంత ఋణం తీర్చు కొంటున్నాను.

## ధృతరాష్ట్ర లో(కా)గిలి

కురుక్షేత్ర యుద్ధానంతరం నిర్వేదనకు గురైన ధృత రాష్ట్రుడు కౌరవ వంశాన్ని నిర్వంశం చేసిన భీముని పై ప్రతీకారం తీర్చుకోవాలని మనసులో భావించి పైకి భీముడి పరాక్రమాన్ని మెచ్చుకుంటూ అతని కౌగిలి కోరటం ఈ దుష్టపన్నాగం గమనించిన శ్రీ కృష్ణుడు భీముడికి బదులు లోహ భీముడిని తయారు చేయించి కౌగలించుకోమనటం, ధృత రాష్ట్ర కౌగిలి లో ఆ ఇనుప భీమ విగ్రహం పొడి పొడి అవటం మనం విన్నాం, సినిమాలలోనూ చూశాం. అంతటి కాపట్యం ఉన్నవాడు గుడ్డిరాజు. మహాభారతానికి నాయకుడు ధర్మరాజు, నాయక నాయకుడు శ్రీ కృష్ణుడు. కృష్ణుడు ఆడించినట్లే భారతం నడిచింది అనిలోకం విశ్వ సిస్తుంది. కాని కురువంశ వినాశనానికి ముఖ్య మూల కారణం అంబి కాతనయుడైన గుడ్డి రాజే అని ప్రాచార్య శ్రీ శలాక రఘునాధ శర్మగారు తమ "వ్యాస



భారత వరి వస్య "గ్రంధం లో 'భారత యుద్ధం –ధృత రాష్ట్రుడు "వ్యాసం లో చాలా లోతుగా పరిశీలించి వ్రాశారు. ధృత రాష్ట్రుని బాహ్య ప్రవృత్తి కౌగిలి లో బయట పడితే, ఆంతరిక ప్రవృత్తి హృదయం అనే గృహం అంటే లోగిలిలో బందీ గా ఉన్నది అని నాకు అని పించి, శలాక వారి అభిప్రాయాలలోని ముఖ్య విషయాలను అందరూ తప్పక తెలుసుకోవాలన్న అభిప్రాయం తో మీకు అందించే ఉద్దేశ్యం తో శీర్షిక గా "ధృత రాష్ట్ర లో(కా )గిలి "అని రెండూ కలిసి వచ్చేట్లు పెట్టి రాస్తున్నాను. సాహసానికి మన్నించండి.

" పారమార్ధిక దృష్టి లో చూస్తే భారత యుద్ధానికి మూలకారణం శ్రీ కృష్ణ పరమాత్మ. రాజకీయ దృక్పధం తో చూస్తే రాజ్యం పైఆశ. మానవత్వ కోణం లో చెప్పాలి అంటే సర్వ అనర్ధాలకు మూలకారణం ధృత రాష్ట్రుడే "అన్నారు శ్రీ శలాక శర్మగారు. పరమార్ధం శరీరం, శరీరి, తత్త్వం మొదలైన అంశాలకు సంబంధించింది. భారతం తత్వ ప్రధాన గ్రంధం. ధృత రాష్ట్ర పక్షం అసుర భావాలకు, పాండవ పక్షం దివ్య భావాలకూ ప్రతీకలు. ఈరెండిటికి శరీరం లోను, విశ్వ శరీరం లోను నిత్య సంఘర్షణ ఉంటుంది. పరమాత్మను ఆశ్రయించిన దైవ సంపత్తి, ఆసుర సంపత్తిని సర్వ నాశనం చేస్తుంది. దీన్ని ఆడించేవాడు పరమాత్మ. ఆయన కర్తవ్యాలు సాధు పరి రక్షణ,, అసాధు శిక్షణ, ధర్మ స్థాపన. మానవుని లో చెలరేగే దుష్ట భావాలు- అంటే సచ్చిదానంద తత్వానికి వ్యతిరేకంగా ప్రవర్తించే అజ్ఞానం మొదలైనవి అసాదువులు. వీటికి వ్యక్తిత్వం వస్తే ధృత రాష్ట్రుడు మొదలైన వారు ఏర్పడుతారు. ఆత్మ తత్వాన్ని ఆశ్రయించి, కర్మాది యోగాలద్వారా స్వస్థితిని చేరుకొనే జ్ఞానాశిష్ట భావాలే సాదు శబ్దవాచ్యాలు. వీటికి రూపకల్పన జరిగితే పాండవులు అవుతారు. ధర్మ సంస్థాపన అంటే వేరే ఏదో కాదు –పై రెండు పనులు జరిగితే ఏర్పడే స్థితి. చీకటి తొలగి వెలుగు వచ్చినట్లు అన్నమాట. ఈదృష్టి తో చూస్తే, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వ కారణుడు, వాసుదేవ రూపం లో అవతరించిన పరమాత్మ మహా భారత యుద్ధానికి కర్త, కారయిత "అన్నారు మహా వ్యాఖ్యాన శిరోమణి శలాక శర్మగారు. సాక్షాత్తు అపర సూత మహర్షి అనిపిస్తారు.



యుద్ధానికి రెండవ కారణం రాజ్యాశ. నిజంగా ఇది రాజులకు దోషం కాదు. ఇక్కడ పాండవ కౌరవులలో రెండు పక్షాలు సర్వ నాశనం కాకుండా మధ్యే మార్గం సూచింపబడింది. అదే రాజ్యం లో సగభాగం. అదీ కుదరక పోతే అయిదు ఊళ్ళు అయినా ఇవ్వటం. కాని కౌరవ పక్షం "వాడి సూది మొన ఇంచుక మోపిన యంత మాత్రయున్ భూమి యొనర్చి "ఇవ్వను పో అన్నది. ఇంకొంచెం దూకుడుగా ముందుకు వెళ్లి "ఎవ్వరైన సంగ్రామమునన్ జయంబు గొని రాజ్యము చేయుట నిశ్చయించితి "అనేదాకా వెళ్ళింది. అంతేనా "ఆ మహా భోగం "సిద్ధించేదాకా పట్టిన పట్టు విడువకుండా అంగుళం కదలకుండా కూర్చున్నది. రాజ్యం వీరభోజ్యం అన్నంత మాత్రాన ధర్మం, న్యాయం ఇచ్చి పుచ్చుకొనే పద్ధతీ, సోదరత్వం మొదలైన మంచి లక్షణాలను మంట గలిసి పోయేలా ప్రవర్తించటం వివేక వంతుల లక్షణం కాదు. వీటికోసం ఒక పక్షం అంటే పాండవ పక్షం చేయవలసిన కృషి అంతా చేసింది. ఇంగ్లీష్ లో "గివ్ హిం ఏ లాంగ్ రోప్ "అన్నట్లు చాలా ఉదారంగా వ్యవహరించింది. ఎంతటి మహోన్నత త్యాగాలకైనా, ఎన్ని విపత్తుల కైనా తట్టుకోవాలని దృఢ సంకల్పం తో ఉంది. రెండవ పక్షమైన కౌరవ పక్షం వీటిని నామ రూపాలు లేకుండా, తుడిచి పెట్టటానికి శాయ శక్తులా ప్రయత్నించింది.ఫలం అనుభవించింది. మితిమీరిన అర్ధ లోభం ఎంత భయంకరంగా పరిణమిస్తుందో కురుక్షేత్ర యుద్ధం నిరూపించింది. ఈ దృష్టి లో మహా భారత యుద్ధానికి అసలు కారణం అధికార దాహం. ఇది కౌరవులలో కొండంత గా ఉంటె పాండవులలో గోరంత గా ఉన్నది.

తత్వానికీ, అర్ధ లోభత్వానికీ మధ్యలో వాటితో విడదీయరాని సంబంధం ఉన్న మానవత్వం అనే ముడి ఒకటి ఉంది.అనేక కోణాలలో మానవుడు పశుతుల్యుడే, కొన్ని కోణాలలో విశిష్టుడుగా కనిపిస్తాడు. ఈ కొన్ని కోణాలలో నిలదొక్కుకుని నిలబడితేనే అతని మానవత్వం పరిగణన లోకి వస్తుంది. పైన చెప్పిన ధర్మం, న్యాయం మొదలైనవే ఆ కొన్ని కోణాలు. ఈ విషయాలలో ఒక నీతి, నియమం, లేకుండా ప్రవర్తించి సర్వ నాశనం తెచ్చుకున్నవారు దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు. నైతిక బలం తో, అధికార దృష్టితో, పెద్దల మద్దతు తో, వీరిని అదుపులో పెట్టుకొనే సమర్ధత ఉన్నా, కన్ను కావని పుత్ర వాత్సల్యం తో, దురాశ,సంకుచిత స్వభావం తో చాటుగా, సూటిగా కూడా ప్రోత్సహించినవాడు ధృత రాష్ట్రుడు.అతని కపటత్వమే కురుక్షేత్ర సంగ్రామానికి మూల కారణమైంది. దీన్ని నిరూపించటానికి ప్రత్యక్ష, పరోక్ష నిదర్శనాలున్నాయంటున్నారు శ్రీ శలాక వారు. వాటిని గురించి తరువాత తెలుసు కొందాం.

భారత దేశ తత్వ వేత్తలు ఏదైనా ఒక అంశాన్ని పట్టు కోవటానికి 4 ప్రమాణాలను పాటిస్తారు. అవే ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద ప్రమాణాలు. వీటిలో ఒక దానికంటే మరొకటి క్రమగా బలవత్తరాలు. సాధారణంగా వాదం లో స్వపక్షం, పర పక్షం, మధ్యమ పక్షం అనేవి ఉంటాయి. ఒక పక్షానికే చెందిన మాటలు యధా తధంగా ఆమోదించ టానికి వీలు కాదు. రెండు వైపులా ఉన్న ఉత్తమ స్వభావం గలవారి మాటలను ప్రమాణంగా తీసుకోవాలి. వాద ప్రతి వాదులలో అజ్ఞానం చేత, ఆవేశం చేత తమ తప్పులు ఒప్పుకోవచ్చు. అప్పుడు స్వపక్షం నుంచి వెలువడిన అభిప్రాయాలను ప్రత్యక్ష ప్రమాణాలుగా స్వీకరిస్తారు. ఇలాంటివి మహా భారతం లో చాలా ఉన్నాయి మచ్చుకి కొన్ని చూద్దాం.

1-సంజయ రాయబారం అయిన కౌరవ కొలువులో అర్జునుడి మాటలన్నీ 50 శ్లోకాలో సంజయుడు వృద్ధ రాజుకు చెప్పాడు. భీష్మ ద్రోణాదులు ఆమాటల్ని ధ్రువీకరించారు. "పాండవులు ఎవరి సాయం తో మామీదకు వస్తారు ?"అని అడిగాడు గుడ్డిరాజు. ఆమాట సంజయుడికి ఒక విద్యుత్ ఘాతం లా తగిలి మూర్చపోయాడు. విదురుడు సంజయుడు మూర్చపోయాడని రాజుతో చెప్పాడు. సభలో ఉన్న పెద్ద లందరూ కురు వంశం సర్వ నాశనం అయి పోయింది అనుకున్నారు. అప్పుడు గుడ్డిరాజు "ఆ ఏమీ లేదు. పాండవులు సంజయుడిని బాగా బెదిరించారు అందుకే మూర్చపోయాడు" అన్నాడు తాపీగా. తేరుకున్న సంజయుడు రాజుతో పాండవుల సహాయ సంపత్తులు బలం, బలగం ఎంత గొప్పవో అన్నిటినీ

పూస గుచ్చినట్లు వివరించాడు. అప్పుడు ధృత రాష్ట్రుడు –భీముని శక్తి సామర్ధ్యాలన్నీ వర్ణిస్తూ 60 శ్లోకాలో కుళ్ళి కుళ్ళి ఏడ్చాడు. తన నోటితో తానే పాండవులకు చేసిన అన్యాయాలన్నీ ఏకరువు పెట్టాడు. భీముడి సాహసాన్ని పదే పదే గుర్తు చేసుకొన్నాడు. గుండె చెరువై పోయింది. కొంపలు అంటుకుంటున్నా రాజ్య భాగం గురించి ఒక్క మాట అయినా గుడ్డిరాజు నోటి నుంచి రాలేదు. యుద్ధం చేయటానికే నిశ్చయించాడు.

2- "చావరు, నొవ్వరు పాండవు –లేవురు నని నీవు చెప్పనిప్పలుకులు దుఃఖా వేశములై, చే-తో వృత్తి గరంప జొచ్చె దుర్భర భంగిన్ "అని శల్య పర్వం లో యుద్ధం దాదాపు పూర్తికావచ్చిన సందర్భం లో ధృత రాష్ట్రుడుఅన్న మాటలివి. తనవాళ్ళు అందరూ చచ్చినందుకు పడుతున్న బాధ కంటే, పాండవులు చావలేదన్న వేదనఅత్యంత ప్రమాణంగా  ఆయన వెళ్ళ గక్కాడు. దీన్ని ఆధారంగా ఒక సారి ఫ్లాష్ బాక్ కు వెడితే గుడ్డిరాజు నిజస్వరూపం తెలుస్తుంది. యుద్ధాన్ని ఆయన ఎంతగా ఇష్టంగా కోరుకున్నాడో, యుద్ధం ద్వారా ఎలాంటి ఫలితాన్ని అంటే పాండవుల సర్వ నాశనాన్ని ఎలా కోరుకున్నాడో అవగత మవుతుంది. ఇంతకంటే ధృతరాష్ట్రు ని లోగిలి అంటే అంతరంగానికి ప్రత్యక్ష ప్రమాణం వేరుగా ఇంకోటి ఏమీ అక్కర్లేదు అన్నారు ప్రాచార్య శర్మగారు.

అనుమాన ప్రమాణం ద్వారాకూడా గుడ్డి రాజు కపట వృత్తిని నిశ్చయింప వచ్చు  అన్నారు శర్మగారు. క్రియాశీలురు దుర్యోధనాదులే అయినా వారికి మూల శక్తి ముసలిరాజే. లోకం లో ప్రతి గ్రూపుకూ వీరాభిమానులు  చాలా మందే ఉంటారు. ఇక్కడ కౌరవ పక్షాన్నిమనస్పూర్తిగా ఆరాధించిన వాళ్ళు కనబడటం, కాని వారి పేర్లను పెట్టుకోవటం కాని మనకు కని పించదు.అంటే వాళ్ళ అంతరాంతరాలలో ఎక్కడో ఎవరు ఎలాంటి వారు అనే అభిప్రాయం గూడు కట్టుకొనే ఉంది అని ఊహించవచ్చు అంటారు శర్మగారు.

సమర్ధ మైన ప్రమాణంగా కవి ఉపమానాన్ని స్వీకరిస్తాడు. మహాభారతం లో రెండు పక్షాలవారినీ శ్రీ కృష్ణుడు ఉపమాన ప్రమాణం ద్వారాఉద్యోగ పర్వం లో  విస్పష్టంగా వివరించాడు –

"రోషమయ మహాతరువు సుయోధనుడు,రు –స్కంధ మందులో న గర్ణు డలరు-గొమ్మ సౌబలుడు, గుసుమ ఫలములు, దు –శ్శాసనుండు, మూల శక్తి తండ్రి "

"ధర్మజుండు ధర్మ తరు, వర్జునుడు ఘన –స్కంధ, మనిల సుతుడు శాఖ, కవలు –పుష్ప ఫలము, లేను, భూసురులును, వేద –ములు దదీయ మైన మూల చయము ".

ఈ రెండు పద్యాలు చాలా బలమైనవి. భారత తత్త్వం అంతా వీటిలో బీజ ప్రాయంగా ఇమిడి ఉండి. దీనిలో ధృత రాష్ట్రు ని తత్త్వం విస్పష్టంగా కనిపిస్తోంది. "మూల శక్తి తండ్రి "అనటం లో నెపం దుర్యోధనుడి మీదకు నేట్టేయటానికి వీలు లేదు. ఈ చెట్టు "అసారం "అనీ రెండవ చెట్టు "గాఢ సార సహితం "అనీ శ్రీ కృష్ణ నిర్ణయం. ఇక్కడ అందరికీ ఒక అనుమానం రావచ్చు. పాండవ పక్షపాతి కదా నల్లవాడు ఆయన చెప్పిన మాట పక్షపాతం తో ఉండటం సహజం కదా అటువంటప్పుడు దాన్ని పట్టుకొని వేలాడటం భావ్యమేనా. అందుకే కృష్ణుడు చమత్కారంగా "ధర్మ తరువునకు మూల చయం –ఏను, భూసురులు, వేదములు "అన్నాడు దీన్ని తాత్వికంగా లోతుగా తరచి చూడాలి.

# పోతన లో తాను

సాహితీ బంధువులకు -ముక్కోటి శుభా కాంక్షలు --ఈ రోజు నుంచి "పోతన లో తాను "అనే భాగవత సంబంధ ధారా వాహికం మొదలు పెడుతున్నాను. సహజ కవి పోతనా మాత్యుడు తనను తాను ఆవిష్కరించు కుంటున్నట్లు గా రచన సాగుతుంది. అందుకే" పోతన -తనలో తాను" అన్న దాన్ని సరదాగా "పోతనలో తాను "అని కలిపి శీర్షిక పెట్టాను. ఇందులో "నేను "అని అంటే పోతన గారే అని తెలుసు కో వాలి. ఈ ఏకాదశి రోజు న దీన్ని ప్రారంభిస్తున్నాము. పోతన భాగవతం లోని, ముఖ్యం గా దశమ స్కంధం లోని విశేషాలు ఇందులో వుంటాయి. ఆయన లోని కవిత్వ సంపద, వినయం, భగవద్భక్తి, అలంకార వైభవం అన్నీ ఆయన మాటలతో వింటున్నట్లు వుంటుంది. సమాదరిస్తారని ఆశిస్తున్నాము.

## సహజ పాండిత్యం

నా, హరి, హర అభేద భావాన్ని  ఇప్పటి దాకా మీకు తెలియ జేశాను. నాది సహజ పాండిత్యం అని విన్న విన్నుచ్కొంటున్నాను. "అనగా, చదువు, సాధనా లేక గాలి మూట గట్టిన,  శ్రుత వాచాటనము "అని కొందరు భావించారు. కర్ణునికి కవచ కుండలాలు, కుశ లవులకు, జ్రుమ్భకాస్త్రాదులు, జన్మ తో, సంసిద్ధ మైనవి కావా ?అట్లనే నాకు కూడా నా పురాకృత సుకృతం వల్ల సిద్ధిన్చిది  ఈ  పాండిత్యం. పూర్వ జన్మ

సువాసన, జన్మాంతర బహుళ అధ్యయనం వల్ల లభించిన ఫలితం ఇది. పుట్టుక తో నా పుణ్యం వల్ల లభించిన పాండిత్యం, తపస్సాధనతో సాధించిన కవితా కౌశలం, కలిసి, ఆత్మ మంత్ర పుష్ప సమర్పణ చేశాను. పరమేశ్వర ప్రీతితో, ప్రేరణతో, పరమేశ్వరాన్కితం గాచేసిన పని ఇది. ఈ విషయం లో ఇంత కంటే ఎక్కువ చెప్పలేను. ఇక అనువాద విషయం లో నేను చెప్పేదేమీ లేదు. భగవానుడైన వ్యాస మహర్షి వ్రాసిన సంస్కృత మహా భాగవతాన్ని అనువదించటం కొండను నెత్తి కెత్తు కోవటమే. భగవానుడు "రాముడు "ఈ అనువాదాన్ని చేయించాడు. ఆ పలుకుల పులకలన్నీ ఆ భగ వానుడివే. నేను నిమిత్త మాత్రుణ్ణి. గంటం నాది -కదలిక "వారిది "..తులనాత్మకం గా సంస్కృత, తెలుగు, భాగవతాలను పరిశీలించిన మహాత్ములు కొందరు నా అనువాదం "ప్రౌదయాను వాదం "అన్నారు. "అంతర్లీన పారవశ్యమే ధ్యేయం గా, పాండిత్యం కంటే పరమార్ధానికి, మూర్తి సందర్శనం కంటే, స్ఫూర్తి సందర్శనానికి, మేధా విలసనం కంటే, హృదయ వికాసానికి, ఆశ్చర్య కార మైన ప్రజ్ఞా ప్రకటన కంటే, పారవశ్యం తో కూడిన రసోదయానికి ప్రాధాన్యం ఇచ్చానని, రస నిష్యంద మాన మైన ఆనంద బ్రహ్మ స్వరూప సాక్షాత్కారానికే ప్రాముఖ్యం ఇచ్చానని, నా అనువాద వైఖరి "ప్రౌదయాను వాద వైఖరి "అని తమ సహ్రుదయాన్ని ప్రకటించారు. నా అనువాద పద్ధతి లోని విశేషాలన్నీ మీకు తెలిసినవే. అవి శ్రీహరికి అర్పిత నైవేద్యములే. సహ్రుదైక పేద్యాలే.



"రసో వై సహా "అని వేదం అంది. రస స్వరూపుడగు భగవంతుని దివ్య మంగళ విగ్రహం, ఎప్పుడూ, మన మనసు లో ఉండేటట్లు మాత్రం చేయగలిగాని ఆనందం గా వుంది. నా బాల కృష్ణున్ని చూసి వెండి గడ్డం వెలిగిస్తున్న ముఖ వర్చస్సు తో వ్యాస భగవానులు వెన్నెల బావుల్లాంటి కన్ను లతో నవ్వుతు "నా బాల కృష్ణా !నువ్వు అచ్చం తెలుగు పిల్లాడివి అయి పోయావురా ""అని అన్నారని విని, నా మనసు ఆనంద పులకిత మైంది. నా కళ్ళు సంతత బాష్ప ధారా పరివృత మైనాయి. నేను ధన్యుణ్ణి అయానని పించింది. ఆంధ్ర భాగవత పద్యాలు, ఆంధ్రుల నోట అలవోకగా పలుకుతున్నాయి అట.. ఎంతటి అదృష్ట వంతుణ్ణి నేను ?ఇది నా పూర్వ జన్మ ఫలం. నా మాధవుని దయా వీక్షణ కటాక్షం. తిక్క యజ్వ ను సూర్యునిగా, నన్ను చంద్రునిగా కొందరు పోల్చారు. మేమిరువురము ఆంధ్ర లోకానికి రెండు వెలుగులం అట. సోమ యాజీ పక్కన నాకు పీట వేసి అందలం ఎక్కించారు. తెలుగు జాతికి, తెలుగు వేదాలు అన దగిన, మహా గ్రంధాలను రచించిన ఋషి పుంగవులం అట. ఆహా ఏమి నా భాగ్యం ?అంతర్ దృష్టి తో మహా భారత, తంత్రాన్ని, మంత్రాన్ని, యంత్రాన్ని తన మనస్సు లో నిల్పి, ఆయా పాత్రలను నాటకోచితం గా తీర్చి దిద్ది, ఎవరూ తన దారికి వచ్చే సాహసం చేయకుండా చేసిన తిక్కన కవీశ్వరు లెక్కడ ?నేనెక్కడ ?"ఛందో బంధమగు శబ్దం, కళాధర్మాలైన శ్రుతి లయలను నేను , సాధించానని" కొందరి భావన. "తగిన చోట్ల యమ, ప్రాస అలంకారాలను భాగవత కవితా గానానికి మృదంగ వ్యాపారం నిర్వహించానాట ".నాదము బ్రహ్మము. శబ్దమూ బ్రహ్మమే. నాద, శబ్ద బ్రాహ్మల అను సందానమే నేను చేసిన పని. ధన్యోస్మి.

ఆంధ్ర భాగవత ప్రశస్తి మన తెలుగు దేశాన్నిదాటి మహారాష్ట్ర దేశం లోను మన్నన పొందింది. హిందూ ధర్మ రక్షకులు, హిందూ సామ్రాజ్య స్థాపకులు అయిన శ్రీ శివాజీ మహారాజ్ కు గురు ప్రభులైన శ్రీ శ్రీ సమర్ధ రామ దాససద్గురువులు తమ "దాస బోధ "గ్రంధం లో నా భాగవత భక్తి, ప్రపత్తి నిప్రశంశించారట., ఆహా ! ఏమి నా అదృష్టం ?.ఒక జాతికి కీర్తిని, స్ఫూర్తిని కలిగించిన "రామ దాసు "వరేన్యుల మనస్సెంత సువిశాలం ? ఎల్లలు లేని వారి భక్తికి, వారికి నాపై వున్న వాత్సల్యానికి నేను ఎంత కృతజ్ఞుడిని ?

నాద బ్రహ్మ యై, నారదుని అపర అవతార మైన త్యాగరాజు మహానుభావులు ఆంధ్ర మహా భాగవతాన్ని, అను నిత్యం పారాయణ చేసే వారట. తిరువయ్యారు లో త్యాగ రాజస్వామి గృహం లో తెలుగు భాగవత ప్రతిఇప్పటికీ చెక్కు చెదర కుండాభద్ర పరి చారట. ఇది తెలుగు భాగవత దివ్యత్వ తేజః పుంజం. దీని కాంతి దశ దిశలా వ్యాపించింది.

తమిళ దేశ నవయుగ ప్రవక్త శ్రీ సుబ్రహ్మణ్య భారతి "సిలకవి యరశాల్ "(కొందరు కవి రాజులు )అనే వ్యాసం లో నన్ను ప్రస్తు తించారట. హరికథా పితామహులు శ్రీ మదజ్జాడ ఆది భట్ల నారాయణ దాసు గారికి వారి అయిదవ ఏటనే "తెలుగు భాగవతం "తోనే అక్షరాభ్యాసం అయిందట. భాగవత భక్తి చేతన ఆయన రచనలు హరి కథా రూపం లో ఆంధ్ర సాహిత్యాన్ని రంజింప జేసింది. అమ్మా వాణీ !ఇది నీవు ఇచ్చిన అక్షరాభ్యాసమే. నా కైమోడ్పు నీకే కదా !నేను ఎప్పుడూ నిమిత్త మాత్రుడినే.

"క్షోణి తలంబు నెన్నుదురు సోకగ మ్రొక్కి నుతింతు, సైకత
శ్రోణికి, జన్చరీక చయ సుందర వేణికి, రక్షితామర
శ్రేణికి, దోయ జాతభవ చిత్త వశీకర నైక వాణికిన్
వాణికి, నక్ష దామ శుక వారిజ పుస్తక రమ్య పాణికిన్"

## భాగవత భక్తి



"ఆంధ్ర వాఙ్మయ ప్రపంచం లో విష్ణు భక్తి మార్గాన్ని మొట్ట మొదట భాగవతం మూలం గా "ఈ పోత రాజు "సుప్రతిస్తం చేశాడు "అని అన్నారు. అది లోకోత్తర కృషి అన్నారు. వంగ దేశం లో ఆంధ్ర మహా భాగవతం తరువాతే శ్రీ కృష్ణ భక్తి ప్రారంభామ అయినదట.. శ్రీ చైతన్య ప్రభువుల "రాదా వల్లభ మతం ",శ్రీ వల్లభాచార్యుల వారి "శుద్ధాద్వైతం లేక పుష్టి మార్గం "లకు మన తెలుగు భాగవతం లోని దశమ స్కంధమే ప్రామాణికం అట. శ్రీ చైతన్యులు ఆంధ్ర దేశమున పర్యటించి, మంగళగిరి లక్ష్మీ నరసింహ స్వామిని దర్శించి, నారట. అక్కడ ఇప్పటికీ శ్రీ వారి పాద పద్మాలు వున్నాయట. అసలు శ్రీ వల్లభాచార్యులు తెలుగు వారెనాట. వీరు గుజరాత్, రాజస్థాన్ రాష్ట్రాలలో, పుష్టి మార్గాన్ని ప్రవర్తింప జేశారట. అక్కడ ఇప్పటికీ తెలుగు వారు "తలాంగులు "అనే పేరా ఉన్నారట.వారందరూ మన ఆంధ్ర మహా భాగవతాన్ని నేటికీ భక్తి తో పఠనం చేస్తున్నారట. కనుక శ్రీ కృష్ణ భక్తినీ, మధుర భక్తినీ సాహిత్యం లో అందించిన ఘనత ఈ దాసాను దాసుడు పోతన దే అని చెబుతుంటే విని నా మనసు పులకరిస్తోంది. బహుశా, ఆయా భాషలలోని భాగవతాను వాదానికి తగిన మహాకవులు జన్మించ లేదేమో. ?ఆ మహా పుణ్యం నాకు దక్కింది. కాదు కాదు, కల్గించారు నాకు- నాకు ముందున్న కవి శ్రేష్ఠులు ఈ ఉత్కృస్టత నాకు కాదు, నా భాగవతానికే దక్కుతుంది. "నానా రాసాభ్యుదయోల్లాసి యైన భారతము కన్నా, రానోల్లసితమగు రామాయణము కన్నా, భక్తి రసం భాగవతం లో ప్రధానం గా ప్రపంచితమైంది అన్నారు.,,

"లలిత స్కంధము కృష్ణ మూలము, శుకాలాపాభి రామంబు, మం
జులతా శోభితమున్ సువర్ణ, సుమనస్సుజ్ఞానమున్, సుందరో

జ్వాల వృత్తంబు, మహా ఫలంబు, విమల వ్యాసాల వాలంబు నై
వెలయున్, భాగవతాఖ్య కల్ప తరువుర్విన్, సద్విజ ప్రాయమై. "

ఇలాంటి దివ్య భక్తి ప్రతి పాదక మైన భాగవతాన్ని, తెలుగు చేసినందుకు నాకు జన్మ రాహిత్యమే కల్గింది. "ఈ జన్మ రాహిత్యం, సర్వాంధ్ర జనానికీ కల్గింది "అని ఒక మహాశయుడు సెలవిచ్చారు. అంటే నా పూర్వజన్మానికీ, నేను రచించిన భాగవత ఆంధ్రీ కరణానికీ నట "అంటే ఏకవీ ఇంత రసవత్తరం గా నేటి వరకు భాగవతాన్ని తెనిగించ లేదట. దీని లోతుల తో సరి తూగే రచన "న భూతో న భవిష్యతి "అట."జయంతి తే సుకృతినో రస సిద్ధః కవీశ్వరాః ".ఎందరో మహాను భావులు అందరికీ వందనాలు. ఇదంతా ఆ అమృత భాన్డాన్ని సంస్కృతం లో నిక్షిప్తం చేసి, మనకు అందించిన ఆ వ్యాస భగవానునికే చెందుతుంది.

తపో ధన్యాత్ముడైన ఆ మహర్షికి నా నమో వాకాలు., వేద కల్ప వృక్ష విగలితమై, శుక --ముఖ, సుదాద్రవమున మొనసి యున్న భాగవత పురాణ ఫలా రసాస్వాదన --పదవి గనుడు, రసిక భావ విదులు " "వేదోపనిషదాం, సారా జ్ఞాతా, భాగవతీ కథా --అత్యుత్తమా తలోభాతి పృధగ్భూతా ఫలోన్నతి " "అ,ఉ, అం అనే మూడు మాత్రలతో ఆవిర్భావిన్చిందే ఓంకార ప్రణవ మంత్రం. అలాగే రామాయణ భారత, భాగవతములు మూడు, ఆంధ్ర వాగ్మయానికి మూల స్తంభాలు "అని కొనియాడిన సహృదయులకు నా కృతజ్ఞతాన్జలు తెలియ జేయటం కంటే నేనేమి చేయ గలను ?

మా బావ గారు శ్రీ నాద కవి సార్వ భౌములు ఇదంతా విని మా బావ శ్రీ నాద కవి సార్వ భౌములు చిరు నవ్వు నవ్వు తున్నారు. వారి కవిత్వం లో ప్రౌఢిమ, గాంబీర్యం, శృంగారం త్రివేణీ సంగమం లా పవిత్రత సంపాదించు కొన్నాయి. వారి కవితా పేశము, సీస పద్య నిర్వహణ ఎవరికి అబ్బుతాయి ?"సరస్వతీ వర ప్రసాద లబ్దులు "మా బావ గారు. కారణ జన్ములు.. కనకాభి షేకం జరిపించుకొన్న కవి రాజులు. ఆ నాటి కవులన్దర్నీ, తన పాండిత్య ప్రకర్ష చేత ఓడించి, కంచు దక్కను పగుల గొట్టిన ఉద్దండ కవి సార్వ భౌములు. పరమేశ్వర వర ప్రసాద లబ్దులు వారు. పురాణాలను అనువదించి, శ్రీ హర్షనైషధాన్ని ఆంధ్ర సరస్వతికి "కన్తాభరణం "గా సమర్పించిన పుంభావ సరస్వతులు. ప్రజల భాష లోకూడా కవిత్వం చెప్పి, ప్రజా కవి గా గుర్తింపు పొందారు. తెలుగు సాహిత్యం లో ఒక కొత్త మార్గాన్ని, ప్రపంచానికి చూపిన మార్గ దర్శి. నాకు గురు తుల్యులు. మిత్రులు, సహచరులు కూడా. "శ్రీ నాద యుగ "కర్తలని పించుకొన్న మహా కవి. వారి ప్రజ్ఞా, పాటవాలు వారికే సరి, వారొక కవితా కేసరి. ఆంధ్ర సాహిత్యం లో విశృంఖల వీర విహారం చేసిన విశిష్ట కవి శ్రేస్టులు. "పండితా ఖండలులు "అని పండిత ప్రపంచం లో వన్నె కెక్కిన వారు. అద్వితీయ శృంగార కవి చక్ర వర్తి. వారి అశేష పాండితీ వైభవానికి సదా నమస్కరిస్తాను.

మా బావ గారి మార్గాన్ని, నా మార్గాని బేరీజు వేశారు కొందరు విశ్లేషకులు. మా బావ గారిలో "ఆడంబరం, అహంభావం, వున్నాయని, నేను ఆత్మాభి మాని నని, నిరాడంబరుడిని "అన్నారు. బావ గారు పండితులై, కవియై, సుఖ దుఖాల ద్వంద్వం లో చిక్కు కొన్నారట. నేను ద్వంద్వా తీతం గా ప్రవర్తిస్తూ, జనన, మరణ రహితమైన కైవల్యం పొందినానాట. శ్రీనాధ బావ గారు శృంగారి గా ఎంత పేరు తెచ్చుకొన్నా, "ఈశ్వరార్చన కళా శీలుండ"అని తానే చెప్పుకొన్నారు. మరి, నేను భోగినీ దండకం వంటి, పరమ శృంగార కృతి రచించినా, "భక్తుని "గానే చలా మణీ పొందాను. కాశీ ఖండ, భీమ ఖండ, హర విలాస, శివ రాత్రి మా హాత్మ్యం లో భక్తీ భావాన్ని రంగరించి, కుమ్మరించి పోసినా, శృంగార నైషధం లో రక్తినీ, చాటువు లలోని, శృంగార ప్రసక్తి వల్ల, "శృంగార శ్రీ నాధుడు "గానే ముద్ర పడ్డారు. రుక్మిణీ కల్యాణం, రాస క్రీడలలో శృంగారం కొంత



మోతాదు మించినా, నన్ను "తెలుగుల పుణ్య పేటిక "అనే అన్నారు. కారణం ఒకటే అనుకొంటున్నాను. బావ గారి కృతులన్నీ నరాంకితాలు. వారి ఉజ్వల ఘట్టాలన్నీ రాచ కొలువుకే సమర్పితాలు. పట్టెడు వారి మెతుకులు, గుక్కెడు మంచినీళ్ళు, పుట్టని దుర్దశ లో కూడా, ఆ రాజస మూర్తి, కృష్ణుడి నో, శివుడి నో, దుయ్య బట్టారు. "మత్యహన్కృతి "వారిది అన్నారు. అయినా అవసాన దశ లో 'దివిజ కవి వరుల గుండియల్ దిగ్గు రనగ, అరుగు చున్నాడు శ్రీ నాదుడమర పురికి "అని తొడ గొట్టిన ధీర కవి. వారిది ప్రౌఢ వ్యక్తిత్వం.

నన్ను అంచనా వేస్తూ "నరాదిపుల కొలువు చేయ లేదని, సిరులకోసం పేమ్పర్లాడ లేదని, అధికారానికి ఆశించ లేదని, అహంకారాన్ని ప్రకటించ లేదని, అంటూ, పూర్వ కవులను, భావి కవులను, కొనియాడాను అని అన్నారు. నిజమేనని నేను అనవలసి వస్తోంది. సమకాలీనులు ఎవరు మెచ్చారు ?.మరి నా అంత రంగం లో అందరు" విష్ణు చిత్తులే ".పుట్టని కవులకు జేకోట్టటం నేను అలవరచుకొన్న సహన శీలం., అలవడిన సంస్కారం. హాలికుడనై కవితా కేదారాన్ని పండించ టానికి కృషి చేశాను.

**"ఇమ్మను జేశ్వ రాధముల కిచ్చి, పురంబులు, వాహనంబులుస్**
**సొమ్ములు కొన్ని పుచ్చుకొని, సొక్కి, శరీరము బాసి, కాలు చే**
**సమ్మెట వాటులం బడక, సమ్మతి శ్రీ హరి కిచ్చి, చెప్పే, నీ**
**బమ్మెర పోత రాజొకడు, భాగవతంబు, జగద్ధితంబుగన్ ".**

బావ గారికీ నాకు తెచ్చిన పోలిక చరిత్రకే పరిమిత మైతే చాలు. వారి అంతస్తు తో నన్ను చేర్చ వద్దు. నేను భాగవత పద సేవా తత్పరుడను- అంతే.

మానవ సేవే మాధవ సేవ

"మధు మయ ఫణితీనాం మార్గ దర్శీ మహర్షయః 'కవిత్వం అనే పాలలో భక్తి అనే పంచ దార కలిపి భాగవత రసాయనాన్ని పాకం చేసి, లోకానికి అందించిన అమృత హస్తం" నాదని అన్నారు.

"బాల రసాల పల్లవ నవపల్లవ కోమల "మైన భాగవత కావ్య కన్యను, "తెలుగు గుండెల్లో "మందార మకరందాలను అందించా నట.. తెలుగు జాతి నిర్మల మందాకినీ వీచికలలో డోల లాడిందట. ఈ ప్రశంశలకు నాకు మనసు ఆనంద పరవశ మవుతోంది. ఈ చిన్న కృషికే నాకు మెప్పు వచ్చింది. నా జీవిత ధ్యేయం నెర వేరింది. నర నారాయణులకు భేదం లేదు. నరుడు, నారాయణుడు గా మారాలి. కలియుగం లో భక్తి, భగవంతుని చేరే అతి తేలిక మార్గం. ఎందరో భక్తి వరులు ఈ మార్గం లో ప్రయాణించి, మార్గ దర్శకం గా నిలిచారు. ఆ దీప కాంతిలో మనం కూడా పయనించి, పరమేశ్వర సాన్నిధ్యాన్ని చేరాలి. అదే మన తపన కావాలి.

అయితే మన చుట్టూ వున్న పరిస్థితులను కూడా గమనిస్తూండాలి. మాధవుడు అన్నిటా అంటే పిపీలికాది బ్రహ్మ పర్యంతం వున్నాడు అన్న స్పృహ తో జీవించాలి. మరి మానవ సేవ మాధవ సేవ కాదా ?అవును. "జగత్ హితము నందు నియుక్తు లైన వారే నన్ను చేరుదురు "అని గీతాచార్యుడైన శ్రీ కృష్ణుడు స్వయం గా చెప్పాడు కదా. "సర్వ భూత హృదయాంబుజ వర్తి యగు, తనను అవజ్ఞా చేసి, విగ్రహారాధన చేసిన వాడు మూ డుడు "అని భాగవతం తెలుపు తోంది. శ్రీ హరి సేవ చేస్తూ, భక్తులను కాని, ఇతరులను కాని, సేవించని వాడు సాధారణ భక్తుడు.

ఈశ్వరుని పై ప్రేమ, భగవద్భాక్తులతో స్నేహం, కృప వున్న వాడు మధ్యముడు. సకల భూత రాశిలో తన యొక్క, పరమేశ్వరుని యొక్క రూపాన్ని, తనలో, భగవంతునిలో, సర్వ భూత ప్రపంచాన్ని దర్శించే వాడు భాగవతోత్తముడు. అలాంటి భాగవత ఉత్తముడు చేసే సమాజ పర మేశ్వర సంసేవనమే, పరమేశ్వరుడికి అత్యంత ప్రీతి పాత్రం అని వ్యాస భాగవతము నొక్కి చెప్పింది. శ్రీ శంకర భగవత్పాదులు కూడా "దేయం జీనా జనా వన చిత్తం "అని ప్రార్ధించారు. ఇదే నా ప్రహ్లాదుడూ, చేశాడు. విమూఢ చిత్తు లైన జనాన్ని గూర్చి పరితపించాడు. సామాజిక స్పృహతో భగవంతుడిని ప్రార్ధించాడు.

**""భగవద్దివ్య గుణాను వర్ణన, సుధా ప్రాప్త్యైక చిత్తున్దనై**
**బెగ డాస్, సంసరనోగ్ర వైతరి ణికిస్, భిన్నాత్ముల్లై, తావకీ**
**య గుణ, స్తోత్ర పరాన్ముఖత్వామున, మాయా సౌఖ్య భావంబులస్**
**సుగతిం గానని, మూదులం గని, మదిస్ శోకింతు సర్వేశ్వరా "**

ఇలాంటి వారి గురించి పట్టించుకోమని సిఫార్సు చేశాడు. అట్లాగే "సకల దిగంత వ్యాప్త యశో విరాజితుడు రంతి దేవ మహా రాజు " తన సర్వస్వాన్ని దీనులకు సమర్పించి, పేదరికాన్ని వరించాడు. కూటికి, నీటికి, కరువు ఏర్పడినా, ధైర్యాన్ని కోల్పోలేదు. సకుటుంబం గా 48 రోజులు "నిట్రుప వాసం "చేశాడు. ఆ మర్నాడు కొంచెం నెయ్యి, పాయసం, నీరు ప్రాప్తించాయి. ఇంతలో ఆకలితో వున్న బ్రాహ్మణుడు రాగా, "హరి సమర్పణ "గా సగం పాయసాన్ని అందించాడు. తర్వాత ఒక శూద్రుడు వస్తే, మిగిలిన దాని లో సగాన్ని, ఒక కుక్క వస్తే మిగిలినది అంతా ఇచ్చేశాడు. వున్న కాసిని నీళ్ళు తాగి తృప్తి చెందుదామని అను కొన్నాడు. ఇంతలో ఒక చండాలుడు వచ్చి "మానవ కుల నాద, దప్పి గా వుంది, ఆకలితో అడుగు వెయ లేక పోతున్నాను. కాస్త మంచినీరు ఇచ్చి ఆదుకో"అని ప్రార్ధించాడు. అతనిలో "సదాశివుని "రంతి దేవుడు గమనించి, సాను భూతితో, ఆర్తుడైన ఆ చండాలునితో తాదాత్మ్యం చెందియి లా, అన్నాడు.

**"అన్నము లేదు, కొన్ని మధురాంబువులున్నవి, త్రావుమన్న, రా**
**వన్న, శరీర దారులకు నాపద వచ్చిన, వారి యాపదల్,**
**గ్రన్నన దాల్చి, వారికి సుఖంబులు, సేయుట కంటే, నొండు మే**
**లున్నదే, ?నాకు దిక్కు పురుషోత్తము డొక్కడు సుమ్ము పుల్కసా !,**

ఇక్కడ" అన్న" అనే పదం అనేక సార్లు వాడినందుకు రంతి దేవుని అనుకంపా హృదయాన్ని తేట తెల్లం చేస్తోంది అన్నారు. అతన్ని ఓదార్చటానికి చేసిన ప్రయత్నమే ఇది. ఇందులో ప్రాస ఉందా, పద బంధం ఉందా అన్న ఆలోచనే లేదు. మంచి మనసున్న వారికి ఇందు లో మంచి కన్పించింది. అది వారి సంస్కారం. హృదయం ద్రవించే సన్ని వేశమే ఇది. తన ప్రాణాలను కాపాడు కో కుండా అతిధి ప్రాణ రక్షణకు ముందుకు రావటం గుండె చమరుస్తుంది..రంతి దేవుని త్యాగం యొక్క ఉత్కృష్టత ఈ పద్యం లో రస మార్గం లో ఆవిష్కరింప బడింది అని సహృదయులు అభినందించారు. నన్ను మానవతా మూర్తి అన్నారు. రంతి దేవుని కీర్తి ముందు ఈ మాటలు ఏపాటివి ?"సేవ సేవ కొరకే గాక, సేవ సంస్కారార్ధం అని, అది పరమేశ్వర సందర్శన ప్రాప్తికి దోహదం చేస్తుంది. అప్పుడు లోకా రాదన ఈశ్వర ఆరాధానమే అవుతుంది. ఈశ్వరుడు ఎవరో కాదు "విశ్వ వట వృక్షానికి బీజం. జగత్తు అంతా, పరమేశ్వరుని దివ్య కళా మందిరం. అలాంటి దివ్య కళా మందిర ఆరాధకుడేపరమేశ్వరునికి ప్రీతి పాత్రుడు. అని రంతి దేవుని కధలో అందరు తెలుసుకోవాల్సినది. ప్రక్క వాడిని పట్టించుకో కుండా నీ భక్తీ పండదు అనే నేను చెప్పాను. నరుని లో నారాయణుడిని దర్శించ మన్నాను. మానవ సేవే మాధవ సేవ అని అన్నది అందుకే. ఇవన్నీ పూర్వం మన మహాత్ములందరూ చెప్పినవే. నేను మళ్ళీ జ్ఞాపకం చేశాను కొంచెం ఆర్తి తో.

ప్రహ్లాదుడు ఆజన్మ జ్ఞాని, గజేంద్రుడు అర్ధ జ్ఞాని, కుచేలుడు ఆర్ధిక దుర్దశా పీడితుడు. అందరికి మూలం మాత్రం "ఆర్తి "అది జీవాత్మ - పరమాత్మకు నివేదించుకొనే అలౌకిక మైన ఆర్తి. భక్తీ పరమైన ఈ ఆర్తిని, సర్వ కాలీన సామాన్య జనుల, ఆర్తిగా చిత్రిన్చానని అందుకే నేను"ప్రజా కవి "ని అనీ గుర్తించిన వారూ వున్నారు. నా పద్య పాదాలు సామెతలుగా లోకోక్తులుగా ప్రజల్లోకి చొచ్చుకు పోయాయట. '

**"దీనుల కుయ్యాలిమ్పను -దీనుల రక్షింప మేలు దీవన బొందన్**

**దీనావన, నీకోప్పును, --దీన పరాధీన దేవ దేవ మహీశా "**

ఇలా నన్ను ప్రజా కవిని చేసిన వారి ఔదార్యానికి, నా కృతజ్ఞతా పూర్వక వందనాలు. నాకు ఈ పేరు నప్పుతుందా ?అని నేను ఆశ్చర్య పోతున్నాను. "వర గోవింద కదాసుదారస మహా వర్షోరు ధారా పరం పరలం గాక, బుదేంద్ర చంద్ర !ఇతరోపాయాను రక్తిన్, బ్ర వి స్తర, దుర్దాంత, దురంత, దుస్సహ జనుస్సంభావితానేక, దు స్తర, గంభీర కఠోర కల్మష, కనద్దావానలంబారునే "

**"నీ పాద కమల సేవయు --,నీ పాదార్చకుల తోడి నెయ్యము, నితాం**

**తాపార భూత దయయును -దాపస మందార నాకు దయ సేయ గదే "**

## ముగ్గురు భక్తి కవి రాజులు

**"గుడులు కట్టించే కంచర్ల గోప రాజు --రాగములు గూర్చె కాకర్ల త్యాగ రాజు**

**పుణ్య కృతి చెప్పె బమ్మెర పోత రాజు --రాజులీ ముర్వురు, భక్తీ రాజ్యము నకు "**

అన్నారట ఎవరో మహా కవి రాజు. వారి మోజులకు నా జాజుల అంజలి. భాగవతాన్ని భూమిలో పాతినా, "బాల రసాలమై "పైకి లేస్తుందట. పోతన్న భాగవతం ఎప్పుడు చూసినా, "అప్పుడే తీసిన వెన్న లా" ఉంటుందట. అందుకే దాన్ని వదలి పోడు చిన్ని కన్నయ్య "అన్నారు ముద్దు ముద్దు గా, కొందరు. నా పద్యాలు పాలు తాగిన లేగ దూడల్లాగా పరుగెత్తు తాయట. వెన్నెల్లో ఆడు కొనే కన్నె పిల్లల్లాగా గంతు లేస్తాయిఅట.. లలిత రసాల పల్లవాల్లా మెత్త మెత్త గా చిత్తానికి హత్తు కొంటాయత. నిర్మల మందాకినీ వీచికలై జల జలా ప్రవహిస్తాయి అట. మందార మకరందాలై చవు లూరిస్తై అట..అమ్మో ఇంత అందం గా ఉన్నాయా నా పద్య కన్యా మణులు ?,. అవును -నేను మనసు లో, మాటలో, పాటలో, పద్యం లో, నుడికారం లో, ఆచారం లో, వెలుగులా, వెన్నెలలా, మలయ మారుతం లా, కలిసి పోయాను మీలో. తెలుగు వారి నిత్య జీవితం లో, నిండు గుండెలో, ఉచ్చ్వాస నిస్స్వాసాలలో, నిండి వున్నాను. నిజం -నిజం -నిజం –

"ఉదయ భానుని కిరణాలలో, యదు కిశోరుని మృదు చరణాలలో, చల్లలమ్మే గొల్ల భామల్లో,, విల్లు పట్టిన, సత్య భామల్లో, కుచేలుని అటుకుల్లో, కనక చెలుని కిటుకుల్లో, పల్లె వాన్గనల వలపులలో, పిల్లన గ్రోవి పిలుపులలో, కని పిస్తాను "అట,విని పిస్తాను అట ఔను, ఔనౌను. సహజ సుందర శయ్యా సౌభాగ్యం లో, ఉయ్యాలలు ఊగాయి,నా తియ్యని పద్యాలు. అది నా సౌబ్భాగ్యం. మీ అందరి సుమనో హృదయం. ఈశ్వర సంకల్పం. నా పురాకృత ఫలం. అంటే నేనెప్పుడు నిమిత్త మాత్రున్నే. పలికించిన వాడు వాడే, పలికింది వాడిని గురించే కదా మరి అలాగే వుంటాయి వుండాలి,వున్నాయి.., , ,

**"త్రిజగన్ మోహన నీల కాంతి తను ఉద్దీపింప, ప్రాభాత, నీ**

**రజ, బంధు ప్రభ మైన, చేలము, పయిన్ రంజిల్ల, నీలాలక**

**వ్రజ సంయుక్త, ముఖార విందమతి సేవ్యంబై, విజ్రుమ్భింప, మా**

**విజయుం జేరెడు వన్నె కాదు, మది నావేశించు నెల్లప్పుడున్ "**

**ఈ పద్యం లో శయ్యా సౌభాగ్యం ఉందీ అంటే, అది ఆ ఆది శేషయ్య పై పవళించిన, రమా వల్లభుని కరుణా పొంగమే.**

**"చిత్రంబులు, త్రైలోక్య ప -విత్రంబులు, భావ లతా లవిత్రంబులు,, స**

**న్మిత్రంబులు, ముని జన వన --చైత్రంబులు, విష్ణు దేవు చారిత్రంబుల్ "**

**ఈ పద్యం లో ని మృదు మధుర పద బంధం -కూడా భవ బంధ హారి కృపా విశేషమే.**

**"భూసురుడవు, బుద్ధి దయా --భాసురుడవు, శుద్ధ వీర భట సందోహా**

**గ్రేసరుడవు, శిశు మారణ --మాసుర క్రుత్యంబు ధర్మ మగునే తండ్రీ "**

" **"ఉద్రేకంబున రారు, సహస్ర ధారులై, యుద్ధావనిస్ లేరు, కిం**

**చిద్రోహంబును నీకు జేయబు, బలోత్సేకంబు తో, జీకటిస్**

**భద్రాకారుల, చిన్ని పాపల, రానా ప్రౌఢి క్రియా హీనులస్,**

**నిద్రా సక్తుల, సంహరింప నకటా నీ చేటు లేట్లాదేదేనో "**

అని ద్రౌపదీ మాత తన శిశువులఉచ కొత్త కు దుఃఖిస్తూ, అశ్వత్థామ తో అన్న మాటలు. ఇవి నన్నయ్య గారి ఒరవడి లో నడిచిన పద్యాలు.

"వీరేవ్వరు ?శ్రీ కృష్ణులు --గారా !ఎన్నడును వెన్న గాన రట కదా

చోరత్వంబించు కయును --సేరరట, ధరిత్రి నిట్టి, నియతులు గలరే "

అని యశోదా దేవి బాల కృష్ణుని తో, అంటుంది భాగవతం లో. ఇది తల్లి -కొడుకును గౌరవించటం గా భావించటం గా భావించారట పాపం కొందరు. ఇక్కడ కూడా నాకు భట్టారకు ల వారే మార్గ దర్శకులు. --ఆయన అనలేదా --"వీరెవ్వ రయ్య ద్రుపద మహా రాజులే " ఈ పద్యమే నాకు శిరో దార్యం.

అయితే, అర్ధం చేసు కోలేని వారికి మాత్రం, ఒక కవి అన్నట్లు "అరసికాయ, కవిత్వ నివేదనం, శిరసి మాలిఖ, మాలిఖ, మాలిఖ "అనేంతటి వాడిని కాను. వారికీ ఓ నమస్కారం.

గజేంద్ర మోక్షం, భీష్మ స్తవం, గోపికా గీత, రుక్మిణీ కల్యాణం, లోని పద్యాలు తెలుగు వారి నాలుకలపై, ఎల్లప్పుడు నర్తిస్తాయి అట. అది సహృదయుల అవ్యాజాను రక్తీ, శ్రీ కృష్ణ లీలా తరంగం పై గల నిర్నిద్ర భక్తీను

## రాసా లీలా విహారం--చివరి భాగం

"పుట్టి నేర్చెనో, పుట్టక నేర్చెనో ?--చిట్టి బుద్ధు లిట్టి, పొట్టి వడుగుపొట్ట నున్న పిల్ల, బూమెలునని నవ్వి -యెలమి ధరణి, దాన మిచ్చె నపుడు" అన్న పద్యం లో అంతర్లీనం గా, కవితా వ్యాప్తి వుందని ఒక బుధ వరేన్యుడు అన్నారు. శైలికి ఉదహరించ వలసి వస్తే, భాగవతం అంతా ఉదాహరించాల్సి ఉంటుందని, నన్ను ఆకాశానికి ఎత్తిన వారూ వున్నారు. సమభావం తో చూడమనే నేను విన్న విన్నుకొంతున్నాను. వాగ్భూషణం భూషణమే, అయినా అది మోతాదు ను మించ రాదు.

"భూషణములు వాణికి నఘ --పేషనములు, మృత్యు చిత్తి భీషణములు,హృత్తోష ణములు, కళ్యాణ వి -శేషణములు హరి గుణోపచిత భాషణ ముల్ రాసలీల శ్రీ కృష్ణ పరమాత్మ అద్భుత లీల. అదొక కమనీయ దృశ్య కావ్యం. ఎప్పుడో రామావ తారం లో ఋషులు "పుమ్సామోహనుడు, ఏక పత్నీ వ్రతుడు, అయిన శ్రీ రామ చంద్ర మూర్తిని, "పరిష్వంగ సుఖం "కోరారు. వారికి ఆ అవకాశం "బహుపత్నీ రూప జీవితాతరుడు గా, ప్రభవించ నున్న శ్రీ కృష్ణావ తారం లో లభింప జేశారు పరమాత్మ. ప్రాకృత మాధుర్య స్పర్శ పొందిన గోపికలు, మాధుర్య దర్శనానికి ప్రతీక లై నిలిచారు "అని చక్కని అనుభూతిని కల్గించారు అంతరార్ధం తెలిసిన మహనీయులు.

వేణు గానం చేత ఆకర్షిమ్పబడి, క్రమంగా రాస మండల నృత్యం లో భాగ స్వామినులై, కాత్యాయినీ దీక్షా వ్రతులై, శ్రీ కృష్ణుణ్ణి భర్త గా పొందాలని కోరుకొన్నారు. ఆయన్నే సర్వాత్మనా శరణు పొందితే కాని, ఆ అదృష్టం లభించదు. ఇదే అర్జునునికి ఆ తర్వాత కురు క్షేత్ర సంగ్రామం లో గీతా చార్యునిగా "సర్వ ధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజా"అని ఉపదేశించ టానికి "బీజం ".నదులు, సముద్రాలు, ప్రకృతి స్వరూపాలు. వీరు, వీరికి స్వస్వరూప కేంద్రాలుగా వుండే స్థానాల్లో లీనం కావటం, ఒక అనాచ్చాదిత సహజ సమ్మేళనం. అక్కడ నదులు సాగారాలలో, గ్రహ, తారాదులు, సూర్యునిలో, ఆకాశం వాయువుతో, వాయువు అగ్నితో, ఇలా జరిగే ఏ సంగామానికైనా, దిక్కులే అంబరాలు. ఆ సంగమమే ప్రళయం -అంటే ప్రకృష్ట లయం. ఇక్కడ కూడా, గోపికలు శ్రీ కృష్ణుణ్ణి పోనడటం లో, దిక్కులు అమ్బరాలుగా కలిగి వుంటారు. వారు కోరింది పరిష్వంగ సుఖం. ఆయన ఇచ్చింది ముక్తి కాంతా పరిష్వంగ సుఖం. అదే జన్మ చరితార్ధమైన అపూర్వ సన్ని వేశం. ఆత్మ పరమాత్మ లో కలిసే అద్భుత దృశ్యం. పులకించిన తనువులతో, వీక్షించాల్సిన పునీత విషయం, విశేషం.

"గోపజనము లందు, గోపిక లందును --సకల జంతువు లందు సంచరించు నా మహాత్మునకు, బరాన్గన లెవ్వరు --సర్వ మయుడు లీల సల్పె గాక "."ఎవ్వని చే జనించు, జగమెవ్వని లోపల నుండు లీలమైఎవ్వని యందు డిందు, బరమేశ్వరుడే వ్వడు, మూల కారణంబెవ్వ డనాది మధ్యలయుడెవ్వడు, సర్వము దానయైన వాడెవ్వడు, వాని, నాత్మభవు, నీశ్వరునే శరణంబు వేడెదన్ " అని సృష్టి, స్తితి, లయ కారకుడైన పర బ్రహ్మన్నిసంస్మరిస్తున్నాను. లీలా మానుష విగ్రహుడైన శ్రీ కృష్ణ భగవానుని, ప్రవర్తనం, సంభాషణం,

స్తవనీయమే. లోక సంగ్రహార్ధం అతిథి ని యెట్లా సత్కరించాలో, బాల్య స్నేహితులను ఎలా, సంబావిన్చాలో, శ్రీ కృష్ణుడు “కుచేలో పాఖ్యానం “లో ఆచరించి చూపాడు. అది ఆయన ప్రవర్తనమే. నేనేమో నిమిత్త మాత్రుడిని. ఆయన రాయిస్తున్న ఆయన చరిత్రం, ఔచితీయుతం గా కాక ఇంకేలాగా వుంటుంది ?ఆంధ్ర మహా బాగవతం లో శిల్ప రహశ్యాలన్నీ మీకు కరతలా మలకాలే. వాటిని మళ్ళీ వివరిస్తూ మిమ్మల్నిఇబ్బంది పెట్టను. కొన్ని విశేషాలను మాత్రం వివ రించాలి- తప్పదు. రుక్మిణీ కళ్యాణ ఘట్టం లో శ్రీ కృష్ణ పరమాత్మ పాంచ జన్య శంఖాన్ని పూరించే సందర్భం లో “పూరించెన్ హరి పాంచ జన్యము, కృపామ్భోరాసి, సౌజన్యమున్భూరి ద్వానా చలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్ సారో దార సిత ప్రభాచకిత, పర్జన్యాది రాజన్యమున్దూరీ భూత విపన్న దైన్యమును, నిర్ధూత ద్విషత్సైన్యామున్ “

“శంఖానికి పూరించితం సార్ధకతను “పూరించెన్ “అనే మాట తో, శార్దూల విక్రీడిత పద్యం లో విక్రీడితమైంది. శంఖ ధ్వని “భం, భం “అని విని పించాటానికి “భకారాం “అయిదు సార్లు ప్రయోగించటం జరిగింది. పాంచజన్యం కనుక “అయిదు భకారాలు” చోటు చేసుకొన్నాయి. దానితో వీర రస స్పోరకం గా పద్యం సాక్షాత్కరించింది. ధ్వనికి అనుకరణం గా “సౌజన్య, చైతన్య, దైన్య, సైన్య, “శబ్దాలతో సాధింప బడింది “అని ఒక సహృదయుడు చాలా బాగా విశ్లేషించాడు. పూరించిన వాడు పరమాత్మ కనుక, ఆ శబ్దాలు, అర్ధాలు అంతగా ఒదిగి పోయాయి. ప్రతిధ్వనించాయి. అరి వీర భయంకర మైనాయి. గజేంద్ర మోక్ష ఘట్టం లో “అల వైకుంఠ పురంబులో “అనే పద్యం మొదలు పెట్టి, కొంత నడిచే సరికి నాలో అహం అడ్డు వచ్చిందేమో, ఆగి పోయింది. అహం తగ్గి, మళ్ళీ పరమేశ్వర ధ్యాన నిమగ్నుడను కాగానే, పరమాత్మ స్వయం గా వచ్చి, ఆ పద్యాన్ని పూరించిన సంగతి మీకు అందరికీ తెలుసు. ఈ పద్యం, ఎత్తు గడ “మత్తేభ విక్రీడితం ;;లో. ఆ తర్వాత, “సిరికిం జెప్పడు “ఆ తర్వాత “తన వెంటన్ సిరి, లచ్చి వెంట నవ రొద వ్రాతము', ;ఆ తర్వాత “తన వేంచేయు పధం బు, “ఆ పిమ్మట “చనుదెంచెన్ ఘనుడల్ల వాడే “,అనే పద్యం, చివరికి “కరుణా సింధుడు శౌరి వారి చరమున్ ఖండింపగా బంపె “ఆ ఘట్టం లోని చివరి పద్యం దాకా, అన్నీ మత్తేభాలే. ఇదొక వింత స్తితి. గజేంద్రుడు “రావే వరద, సంరక్షించు భద్రాత్మకా 'అని పేడి కోలు చేశాడు. శ్రీ హరి “మత్తేభ రక్షణా యత్త చిత్తుడై “హడావిడి గా పరుగెత్తు కొంటు వచ్చేశాడు. ఆయన హృదయం లో అడుగడుగునా “మత్తేభ వృత్తాంతమే “మెదులు తున్నది. ఆయన మనసు తన భక్తుడైన “మత్తేభ “మయమయింది. అందుకే, అలా మత్తేభాలు పద్యాల్లో పరిగెత్తాయి. కరి అంటే ఏనుగు అది వేగానికి ప్రసిద్ధం. అందుకే పరమాత్మ అంత త్వరగా రాగలి గాడు దీనుడైన భక్తుని “కుయ్యి “ఆలకించి.. అందుకే శ్రీ హరికి “ఏనుగు అంబారి “కూర్చాను పద్యాలలో. అదొక దివ్య మైన ఊహా సంచారమే. నా మానస మత్తేభాన్ని అధిరోహించి, ఆజ్ఞా పించేది ఆ ఇభ రాజ వరదుడే. శ్రీ మన్నారాయణ చరితామృత పానాన్ని, రుచి చూప వలసినది పోయి, నా సోది విని పించానేమోఇంత వరకు. ఆ అఘ ప్రక్షాళనకు హరినామ సంకీర్తనం చేసి, తరిద్దాం



“శ్రీ కృష్ణా, యదు భూషణా, నరసఖా, శృంగార రత్నాకరాలోక ద్రోహి నరేంద్ర వంశ దహనా, లోకేశ్వరా, దేవతా నీక బ్రాహ్మణ గోగ ణార్తి హరణా, నిర్వాణ సంధాయకా నీకున్ మ్రొక్కెద ద్రుమ్పవే, భవ లతల్, నిత్యాను కంపానిదీ ;” మరి “అమ్మ “లేనిది ఇహ పర సౌఖ్యాలు లేవు కదా. ఆమెను ఒక సారి స్మరిస్తా. “హరికిం బట్టపు దేవి, పున్నె ముల పోవర్ధంపు, బెన్నిక్క చందురు, తో బుట్టువు, భారతీ గిరి సుతల్, దొనాడు పూబోడి, తామర లందున్ డేడి, ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భాసురతన్, లేములు వాపు, దల్లి, సిరి యిచ్చున్, నిత్య కల్య ణముల్ “ హరి హరులకు భేదం లేదనే విషయం ముందే మనవి చేశాను మీకు. అందుకే మా కులదైవం భోళా శంకరుడు—

“వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళి కిన్, దయాశాలికి, శూలికిన్, శిఖరిజా ముఖ పద్మ మయూఖ మాలికిన్ బాల శశాంక మౌలికి, గపాలికి, మన్మధ, గర్వ పర్వతోన్మూలికి, నారదాది, ముని ముఖ్య మనస్సరసీ రుహాళికిన్ “ అలాగే లక్ష్మీ దేవికీ ఉమాదేవికీ భేదం లేదని కదా ఉపనిషత్తులు, పురాణాలు ఘోషిస్తున్నాయి. అందుకే అమ్మ వారికో దండం పెట్టు కొందాం “అమ్మల గన్న యమ్మ, ముగురమ్మల మూల పుటమ్మ, చాల పెద్దమ్మ, సురాసురులమ్మ, కడు పారడు పుచ్చిన యమ్మ, తన్ను లో నమ్మిన వేల్పుటమ్మల, మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మాయమ్మ, కృపాబ్ది ఈ వుత, మహత్వ, కవిత్వ పటుత్వ సంపదల్ “ దాదాపు 500 ల సంవత్సరాలు అయినా, తెలుగు భాగవతం మీ అందరి నాలుకలపై, నర్తిస్తూనే వుంది. ఎందరెందరో పరిశీలన, పరిశోధనా చేస్తూనే వున్నారు. శ్రీ వెంకటేశ్వర పాద పద్మాల చెంత, నాపై ఒక అధ్యన కేంద్రం వుందట. “ఈ అన్న “పై మీకు ఎంత ఆదరం వుందో నాకు తెలుస్తోంది. మీ సహృదయతకు నా నమో వాకాలు. ఇది నా భాగ్యం, నా అదృష్టం.

నాకు ఈ అదృష్టాన్ని కల్పించింది నా నాలుక పై నర్తించే శ్రీ శారదా మాత. ఆ యమ్మ అనుగ్రహ ప్రసాదమే ఈ వ్యాప్తికి కారణం “శారద నీరదేందు ఘన సార పటీర, మరాళ, మల్లికాహార, తుషార, ఫేన రజతాచల కాశ ఫణీశ, కుంద మందార, సుధా పయోధి, సిత తామర సామర, వాహినీ శుభా కారత, నొప్పు, మది గానగ నెన్నడు గల్గు భారతీ “బుధ జన విదేయుదనై, మీకు నా నమస్కారాన్జలులు సల్పు తున్నాను. మీ యెదలో పదిలం గా కల కాలం, నిల వాలని, కోరు కొంటున్నాను. ఆ భాగ్యాన్ని ప్రసాదించి, మిమ్ములను సుఖ శాంతులతో జీవించే ట్లు, దీవించ వలసినది గా, శ్రీ హరిని “ఒక సూర్యుండు సమస్త జీవులకు, తానోక్కోక్కడై, తోచు, పోలిక, నే దేవుడు, సర్వ కాలము, మహా లీలలన్, నిజోత్పన్న, జన్య కదంబంబుల హ్రుత్సరోరుహలన్, నానా విధా నూన రూపకుడై, యొప్పుచు నుండు, నట్టి, హరి నే, ప్రార్ధింతు శుద్ధుం డనై ”అని ప్రార్ధిస్తూ, ఆంధ్ర సాహితీ లోకానికి సంక్రాంతి శుభా కాంక్ష లంద జేస్తూ మీ వద్ద సెలవు తీసు కొంటున్నాను.

## ఎవరీ చిత్రరథుడు?

భగవద్గీత పదవ అధ్యాయం విభూతి యోగం ఇవాళ పారాయణ చేస్తుంటే లో శ్రీ కృష్ణ పరమాత్మ తన విభూతులు ఎవరెవరిలో ఉన్నాయో వివరిస్తూ –

“అశ్వత్థః సర్వ వృక్షాణాం, దేవర్షీ ణాం చ నారదః –గంధర్వాణాం చిత్ర రథః సిద్ధానాం కపిలో మునిః”అని చెప్పిన 26 వ శ్లోకం యధాలాపం గా వెళ్ళిపోయింది. తర్వాత చిత్రరథుడు ఎవర్రాబాబూ అని చిన్న ఫ్లాష్ ఆలోచన వచ్చింది. తెలుసుకొనే ప్రయత్నం చేసి, తెలిసింది తెలుసుకొన్నది మీముందు ఉంచే ప్రయత్నం చేశా..

మనం గీత ను పారాయణం చేస్తాం. మనవాళ్ళు కొందరు దానిలోని గొప్పతనాన్ని ఉపన్యాసాలలో వివరిస్తారు. దానిలోని ధర్మ సూక్ష్మాలు తెలియ జేస్తారు. చదివే మనం కాని, చెప్పే వాళ్ళు కాని శ్లోకం లో ఉన్న పేర్లలోని విశేషాల గురించి ఆలోచించం. తెలుసుకోవాలనే ధ్యాస జిజ్ఞాసా కూడా ఉండదు. ఇది లోక సహజం. ముక్కస్య ముక్కః గా "పరమాత్మ ఏం చెప్పాడంటే వృక్షాలలో తాను అశ్వత్థ వృక్షాన్నని, దేవ మునులలో



నారడదుడనని గంధర్వ్వులలో చిత్ర రథుడ నని, సిద్ధులలో కపిల ముని నని చెప్పాడు. "అనిముగిస్తాం. కనుక నాయనలారా అశ్వత్థ వృక్షాన్ని, నారదుడిని, చిత్ర రథుడిని, కపిల మహర్షి ని పూజిస్తే ఆయన్ను పూజించినట్లే అంటాం. రావి చెట్టు దేవాలయాలలో, గ్రామాలలో రచ్చబండ వద్ద ఉంటాయికనుక వాటికి పసుపు కుంకుమలు పెట్టి కాదుకాదు రుద్ది వీలయితే కోరికలు తీరటానికి ఉట్లు కట్టి పూజిస్తాం. లేక అనంతపురం దగ్గరున్న "విదురాశ్వత్థం"వెళ్లి చూసి ఆహో ఇక్కడే విదురుడు ఈ చెట్టు కింద తపస్సు చేశాడని చెప్పుకొంటాం. పనిలో పనిగా లేపాక్షి వెళ్లి అక్కడి జగత్ప్రసిద్ధ నందిని చూసి మురిసిపోతాం. అక్కడి వీరన్న విరూపాక్ష సోదరుల కధ తెలుసుకొంటాం. విరూపన్న కళ్ళను గోడకేసి కొట్టిన చోటు చూసి అయ్యో పాపం అనుకొంటాం. కాని శ్లోకం లో ఉన్న చిత్ర రథుడి గురించి పట్టించుకోం. ఎవరోలే ఎవరైతే నేమిలె అని ఉదాసీనం గా ఉంటాం. కృష్ణ పరమాత్మ అతని పేరు చెప్పాడు అంటే అందులో ఏదో గొప్పతనం ఉండి ఉండాలి అన్న స్పృహ సహజంగా మనకు రాదు. నాకు తెలిసినంత వరకు తెలుసుకోన్నంత వరకు తెలియ జేస్తా.

భారతం లో చిత్ర రధుని పాత్ర వస్తుంది. అతనికి అంగార పర్ణుడు అనే పేరుంది. గంధర్వ రాజు. కుబేరునికి పరమ మిత్రుడుకూడా. ద్రుపద నగరానికి పాండవులు వెడుతున్నప్పుడు ఒక రోజు రాత్రి, అతడు తన స్త్రీలతో విహరిస్తుండగా వాళ్ల పాద ధ్వనిని విని "ఎవరుమీరు ?ఎక్కడికి వెడుతున్నారు ?"ఇది నాకు చెందిన అడవి. నా అనుమతి లేకుండా నిస్సంకోచంగా రాత్రి వేళ సంచరిస్తున్నారు. ఈ అరణ్యం, ఇక్కడున్న గంగానది అంగార పర్ణుడివి అని మీకు తెలియదా "అనికోపం తో కేకలు వేస్తూ అడిగాడు. అప్పుడు అర్జునుడు "ఈ నదిలో ఎవరు స్నానం చేస్తే వాళ్ళది అవుతుంది కాని నీకుగుత్తాదిపత్యం కాదు. సముద్రం, నది, పర్వతాలు, అడవులు ఎవరో ఒక్కరికి చెందినవికావు. సమస్త జనులకు వాటిపై అనుభవించే హక్కు ఉంది. నువ్వు వద్దన్న మాత్రాన మేము వెనక్కి పోతామనుకొన్నావా ?.గంధర్వులంటే భయపడి శక్తిలేని సామాన్య మానవులు పూజిస్తారు కాని వీరులు కాదు. మమ్మల్ని అడ్డగించటానికి, ఆపటానికి నీకు హక్కులేదు. గంగానది దివిజగంగ. పాపాలను క్షాళనం చేస్తుంది. శాశ్వతమైనది. ఆపవిత్ర నదీమ తల్లి పై హక్కు ఉందనటం మూర్ఖత్వం "అని జవాబు ఘాటుగానే ఇచ్చాడు.

తనను ఎదిరించే వాడువచ్చాడన్న కోపం అసూయతో వాడు అర్జునిపై బాణాలు వేసి గాయపర్చాడు. సర్పాస్త్రాన్ని వాడు సంధిస్తే, అర్జునుడు కూడా వెనువెంటనే శర సంధానం చేసి వాడిని తీవ్రమైన బాణాలతో నొప్పించి అగ్ని అస్త్రం ప్రయోగించాడు. కొంత సేపు ఇద్దరిమధ్య భీకర పోరాటమే జరిగింది. "శస్త్రాస్త్ర ప్రయోగం తెలిసిన వీరుడిపై, తెలియని అస్త్రాలు ప్రయోగించటం తెలివి తక్కువ పని, వ్యర్థం కూడా.అగ్ని తత్త్వం

తెలుసుకోకుండా అంగార పర్ణుడు అనే పేరు పెట్టుకొని కులుకుతున్నావు. అంటే అగ్ని హోత్రునికే ద్రోహం చేస్తున్నావు కనుక నువ్వు శిక్షార్హుడవే "అని హెచ్చరించి చెప్పాడు గాండీవి. కాని అంగారపర్ణుడు అర్జునుని ధాటికి నిలవలేక ఓడిపోయాడు. ఫల్గుణుడు ఆ గంధర్వ ని జుట్టుపట్టుకొని ఈడ్చుకొంటూ అన్న ధర్మరాజు పాదాల చెంత పడేశాడు. ఇంతలో విషయం తెలిసిన అంగార పర్ణు ని భార్య గోడుగోడున విలపిస్తూ వచ్చి తనకు పతి భిక్ష పెట్టమని యుదిష్టిరుని వేడుకొన్నది. ఆమె పై జాలిపడి ఆతడిని వదిలేయమని తమ్ముడికి చెప్పాడు. అర్జునుని శౌర్య బలపరాక్రమాలు గ్రహించి మెచ్చుకొన్న అంగార పర్ణుడు, అప్పటినుంచి తాను అంగార పర్ణుడుగా పిలువబడనని,తన రధం చిత్ర గతులతో నడుస్తుంది కనక చిత్ర రధుడనే పేరు వచ్చిందని దాన్నికూడా అర్జునుడు ధ్వంసం చేశాడుకనుక ఆపేరూ ఇక ఉపయోగించుకోనని చెప్పాడు. అర్జునునితో స్నేహం చేయాలని అభిలషించాడు. అంతేకాదు పార్దుడికి "చాక్షుషి "అనే గంధర్వ విద్య ఉపదేశించాడు. ఈ విద్యను ఇస్తూ అతడు " మనువు సోముడు అంటే చంద్రునికి బోధించాడు. సోముడు అంతరిక్ష దేవత. అగ్ని పృధ్వీ దేవత. ఇంద్రుడు దేవతలకు అధిపతి. చంద్రుడు విశ్వావసు అనే గాంధర్వ రాజుకు ఉపదేశించాడు. విశ్వావసు గంధర్వ రాజు నైననాకు ఆ విద్య నిచ్చాడు. చాక్షుషి విద్యవలన దివి, భువి అంతరిక్షాలలో దేన్ని చూడాలనుకొంటే దాన్ని, ఏ రూపం లో కావాలంటే ఆ రూపం లో చూడగలుగుతారు.. ఈ విద్య స్వాధీనం కావాలంటే ఆరునెలలు కఠోర అనుష్టానం చేయాలి. ఈ విద్యవలననే మా గంధర్వులు మనుష్యులకంటే ఉత్తమజాతి వారయ్యారు. దేవతలకు సములయ్యారు. "అని వివరించాడు.

అతేకాదు చిత్ర రధుడు పాండవులకు ఒక్కొక్కరికి 100 వాజీ లు అనే ప్రత్యేక గంధర్వలోకం లో ఉపయోగించే అశ్వాలను ఇచ్చాడు. వీటిని దేవగంధర్వ అశ్వాలు అంటారు. అత్యుత్తమ జాతి గుర్రాలివి. అవి కృశించినా, బలహీనమైనా వాటి వేగం ఏమాత్రమూ తగ్గదని చిత్రరథుడు చెప్పాడు. ఈ వాజీ లు ఏరంగుకావాలంటే ఆ రంగును, యెంత వేగం కావాలంటే అంతవేగం పొందగల ప్రత్యేక లక్షణాలు కల దివ్యాశ్వాలు. యజమాని అనతరంగాన్ని అర్ధం చేసుకొని ప్రవర్తించే ప్రత్యేక లక్షణం వీటిది. గంధర్వులలో ఉత్తమ జాతి వారు దేవతలతో సమానమైనవారు, కొంచెం తక్కువజాతివారు సామాన్య మానవులతో సమానమై" నరులు "అని పిలవబడుతారని చెప్పాడు.

అర్జునుడు అతనికి కృతజ్ఞతలు చెప్పి తనకు చాక్షుషి విద్య, వాజీలు అవసరం లేదని చెప్పాడు. కాని అతడు తనకు ప్రాణభిక్ష పెట్టినందుకు కృతజ్ఞతగా తీసుకోవాల్సిందేనని బ్రతిమిలాడాడు. అర్జునుడు కూడా దీనికి బదులుగా తన అగ్ని అస్త్రాన్ని అతడిచ్చిన వాజీలకు బదులుగా ఇచ్చాడు. పాండుకుమారుల జన్మ రహస్యాలు తనకు తెలుసునని, వారు యమ, ఇంద్ర వాయు అశ్వినీ దేవతల వర జన్ములని, వారి పౌరుష పరాక్రమాలూ తనకు అవగతమేనని చెప్పాడు. గంధర్వులకు రాత్రివేళ పరాక్రమం ఎక్కువ అని, అర్జునుని బ్రహ్మ చర్యం,ధర్మ వర్తనం వలననే తాను అతని చేతిలో ఓడిపోయానని అన్నాడు. అర్జునుని మాటిమాటికీ "తాపత్యా "అని సంబోధిస్తుంటే ఎందుకు అలా అంటున్నావో చెప్పమని అడిగాడు. అప్పుడు అతడు "దేవలోకం లో తపతి సౌందర్య రాశి. ఆమె చిన్నతనం లోనే ఆమెను వివాహమాడాలని దేవ గాంధర్వ యక్ష రాక్షసులు ఉవ్విళ్ళూ రారు. యుక్త వయసు రానిదే పెళ్లి చేయనని తండ్రి వివస్వుడు అన్నాడు. సంవర్ణు డు అనే అందమైన వినయవిదేయతలు ధర్మపాలన ఉన్న యువ మహారాజు తనకూతురుకు తగిన వరుడు అని నిశ్చయించాడు. అతడు క్షత్రియ కన్యకు బ్రాహ్మణుడికి జన్మించాడు. క్షత్రియ విద్యలలో ఆరితేరినవాడు. నర్మదానదికి ఉత్తర, దక్షిణభాగాలన్నీ అతని ఏలుబడి ఉన్నాయి. ఒక రోజు వనవిహారం లో తపతి కన బడి అతని మనసు లాగేసింది. ఎవరు నువ్వు అని అడిగేలోపు సిగ్గుతో అదృశ్యమైంది. మళ్ళీకనబడితే గాంధర్వ వివాహం చేసుకొందామని అంటే ఆమె తాను తండ్రి సంరక్షణలో ఉన్నానని ఆయన అనుమతి అవసరమని చెప్పింది.

తపతిపై గాఢ ప్రేమలో పడి, అదే ధ్యాసగా ఉన్న అతడిని వశిష్టమహర్షి కలిసి ఉపాయంగా తపతిని అతనికి పెళ్లి చేసి రాజ్యపాలన మంత్రికి అప్పగింప జేసి, నర్మదానది పర్వతాలలపై విహరించమన్నాడు. కాని రాజ్యం లో 12 ఏళ్ళు వర్షాలు లేక కరువుకాటకాలేర్పడ్డాయి.. అప్పుడు మహర్షి, నూతన దంపతులను రాజ్యానికి రమ్మని కోరాడు. వారురావటం తో వర్షాలు కురిసి భువి సస్య శ్యామలమైంది. సంవర్ణ, తపతుల కుమారుడే కురు అంటే మీ వంశ పూర్వీకుడు. అందుకే నిన్ను తాపత్యా అన్నాను "అని వివరంగా చెప్పాడు అర్జునునికి చిత్ర రధుడు. తన పూర్వీకుని వృత్తాంతం సవిస్తరంగా తెలియ జేసినందుకు కృతజ్ఞత తెలిపాడు.

చిత్ర రథుడు ధర్మరాజుతో లోక హితము, ధర్మ సూక్ష్మాలు తెలియ జెప్పే పురోహితుని ఏర్పాటు చేసుకో మని సూచించాడు. అలాంటి వారెవరున్నారని అడిగితే "ధౌమ్యుడు "ఉత్తమజాతిబ్రాహ్మణుడ ని ఆయనను పురోహితునిగా చేసుకోమని సలహా ఇచ్చాడు. కనుక సకల ధర్మ

శాస్త్రాలు తెలిసిన నీతి కోవిదుడు గా చిత్ర రథుడు మనకు కన్పిస్తాడు. గంధర్వ రాజులలో ఇంతటి బుద్ధి సూక్ష్మత ఉన్న వారులేరు. కనుకనే శ్రీ కృష్ణుడు "గంధర్వాణాం చిత్రరథః "అని నొక్కి వక్కాణించాడు. "ఇంట లెక్ట్" ఎక్కడ ఉంటే పరమాత్మ అక్కడ ఉంటాడుకదా.

రామాయణం లో ఒక చిత్ర రథుడున్నాడు. ఈయన దివి రథుని కుమారుడు. ధర్మ రథుని పుత్రుడు. ఇతని మొదటి పేరు చిత్రరథుడు. అంగ దేశ రాజు. ఇతడినే రోమపాదుడు అంటారు దశరథమహారాజుకు మంచి మిత్రుడు. దశరథుడు తనకూతురు శాంతను రోమపాదునికిచ్చి వివాహం చేశాడు. చాలాకాలం సంతానం లేకపోవటం తో దానధర్మాలు విరివిగా చేశాడు భార్యతోకలిసి. ఒకసారి ఒక బ్రాహ్మణుడు దానం పుచ్చుకొని, ఇంటికి వెళ్లి కొడుకును కూడా తెచ్చి అతడికి ఆవును దానం ఇమ్మని కోరాడు. బ్రాహ్మణుడి ఆశాపాతాన్ని చూసి రోమపాదుడు నవ్వగా ఆయన రాజ్యంలో అనావృష్టి కలగాలని శపించాడు. బ్రాహ్మణ అవమానానికి విప్రులు దేశంవదిలి వెళ్ళిపోయారు. అంగ దేశం అనా వృష్టి తో కుంగిపోయింది. ఏరకమైన కల్మష కాపట్యాలు లేని బ్రహ్మచారి అయిన ఋష్యశృంగుడు వస్తేనే వర్షాలు పడతాయని గ్రహించి ఆయన్ను తీసుకురావటానికి వేశ్యలను పంపాడు. ఆడవాళ్ళు అనే వారు ఉంటారని అస్సలు తెలియని ఆయన, వాళ్ల ఆకర్షణకు లోనై వాళ్ళతో వెళ్ళగా సు వృష్టి కురిసి పంటలుబాగా పండి కరువు నశించింది. రోమపాదుడికి సంతానం కలగటానికి ఋష్యశృంగుడు ఇంద్రుని గూర్చి ఇష్టి నిర్వహించాడు. చతురంగుడు అనే కుమారుడు పుట్టాడు.

కురు కుమారులలో ఒక చిత్ర రథుడున్నాడు. అంగరాజు. చిత్ర రథుని భార్య, దేవ శర్మ అనే బ్రాహ్మణుడి భార్య అక్కా చెల్లెళ్ళు. మరో చిత్రరథుడు లక్ష మంది భార్యలున్న ఒక రాజు శశి బిందుని కొడుకు. ఒక్కోపెళ్ళానికి అనేకమంది కొడుకులు.

ఇందరిలో చుక్కల్లో చంద్రుడు అర్జునునికి చాక్షుషి విద్యనూ వాజీ లను ఇచ్చిన అంగార పర్ణ చిత్ర రథుడే మనకు కావలసినవాడు కదా.

## శ్రీ కృష్ణ జననాది వివరాలు శ్రీ కృష్ణ డైరీ




గడచిన ద్వాపర యుగం చివర 126 సంవత్సరాలు మిగిలి ఉండగా శ్రీముఖ నామ సంవత్సర శ్రావణ బహుల అష్టమి అర్ధరాత్రి వృషభ లగ్నం లో మధురానగరం లో శ్రీ కృష్ణుడు జన్మించాడని భాగవతం లోనూ, విజయనామ సంవత్సర శ్రావణ బహుళ నవమి మంగళవారం రోహిణీ నక్షత్రయుక్త వృషభ లగ్నం లో జన్మిచాడని,హోరాను దర్పణం లోనూ ఉన్నది. ఇప్పటికి 5,115 ఏళ్ళక్రితం కలిద్వాపర సంధిలో అని అర్ధం. కృష్ణుడి జీవితకాలం 125 సంవత్సరాల 7 నెలల 8రోజులు. కృష్ణావతారం సమాప్తం కాగానే కలియుగారంభమైంది. అంటే క్రీ పూ. 3225.

| కృష్ణుడు పుట్టిన | కృష్ణావతారం లీలలు |
|---|---|
| మూడు నెలలలో | కృష్ణుడు పుట్టిన మూడు నెలలలోపు పూతన సంహారం,శకటాసుర భంజనం జరిగి, యశోదకు మొదటిసారి తన విశ్వరూప సందర్శన భాగ్యం కలిగించాడు కృష్ణుడు. గర్గాచార్యుల చేత బలరామ కృష్ణులకు నామకరణం జరిగింది. ఆరవనెలలో బాల కృష్ణుడికి అన్నప్రాసన అయ్యాక, తృణావర్త సంహారం చేశాడు. అప్పటికి శత శృంగ పర్వతం మీద కుంతీ పాం డురాజులకు యమధర్మరాజు |

| | |
|---|---|
| | వరంతో ధర్మరాజుప్రజోత్పత్తినామ సంవత్సరం లోనూ,, ఆంగీరసనామ సంవత్సరం లో వాయు దేవుని వరంతో భీముడు, హస్తినాపురం లో గాంధారి ధృత రాష్ట్రులకు దుర్యోధనుడు, శ్రీముఖ నామ సంవత్సరం లో ఇంద్రుని వరం తో అర్జునుడు జన్మించారు. శ్రీకృష్ణ జననం శ్రావణ బహుళ అష్టమి. కలిపూర్వం 126వ సంవత్సరం. |
| ఏడాది | కలిపూర్వం 125 కు భావ నామ సంవత్సర శ్రావణ బహుళ అష్టమికి కృష్ణుడికి ఏడాది వెళ్ళింది. రెండవ ఏడు రాగానే మట్టి తినటం, యశోదకు ద్వితీయ విశ్వరూప సందర్శనం కలిగించటం, శతశృంగం లో మాద్రి పాండురాజులకు అశ్విని దేవతల వరంగా నకుల, సహదేవులు జన్మించటం జరిగింది. |
| 2 ఏడాది | 124 యువ లో శ్రావణ బహుళాష్టమికి రెండో ఏడాది వెళ్ళి, ఉలూఖల బంధనం, యమళార్జున భంజనం, నలకూబర, మణిగ్రీవ శాప విమోచనం, నందాదులు గోకులం నుంచి బృందావనానికి నివాసం మార్చటం జరిగి 3సంవత్సరాల 11వ నెలవరకు కన్నయ్య బృందావన లీలలు సాగాయి |
| 3 | 123 ధాత లో మూడో ఏడు పూర్తికాగానే బాలకృష్ణ వత్సాసుర, బకాసుర, అఘాసుర వధ చేయగా, దేవతలు పుష్ప వృష్టి కురిపించారు. |
| 4 | 122 ఈశ్వర లో నాలుగో యేట బ్రహ్మదేవుడు గోవులను దూడలను గోపాలురను అంతర్ధానం చేసి ఒక ఏడాది ఉంచాడు, ఇప్పుడే కృష్ణస్వామి సమస్త గో, గోపాల, వత్స రూపాలు ధరించి తన సర్వాంత ర్యామిత్వాన్ని ప్రకటించాడు |
| 5 | కలిపూర్వం 121 బహుధాన్య శ్రావణ బహుళ అష్టమి కి 5 యేళ్ళు నిండి బ్రహ్మ కు దిమ్మతిరిగి ఆవు దూడ గోపాలురను వదిలేసి చెంపలేసుకొని కృష్ణ స్తోత్రం చేశాడు. చైత్ర కృష్ణ చతుర్దశి నాడు శత శృంగపర్వతం పై పాండురాజు మృతి చెందాడు. అప్పటికి ధర్మరాజుకు 7,భీముడికి 6,అర్జునుడికి 5,నకులసహదేవులకు 4ఏళ్ళ వయసు. వీరు హస్తిన కు తీసుకుపోబడి భీష్ముని ప్రాపకం లో పెరిగారు. |
| 6 | 120 ప్రమాదిలో కృష్ణుడికి 6 ఏళ్ళు నిండి బృందావనం లో ధేనుకాసుర వధ, కాళీయ మర్దనం, ప్రలంబాసురవధ చేశాడు. గ్రీష్మ, వర్ష, శరత్తులలో గోపాలురతోకలిసి గోవులను మేపుతూ ఆటపాటలతో, మురళీ గానం తో అందర్నీ రంజింప జేశాడు. మార్గశిరమాసం లో కన్నె గోపికల కాత్యాయని వ్రతం, వారి వస్త్రాపహరణం, వరప్రదానం, బ్రాహ్మణులు అంగీరస యాగం చేయటం, స్వామికి గోపాలురకు బ్రాహ్మణ స్త్రీలు యజ్ఞప్రసాదం సమర్పించటం జరిగాయి. |
| 7 | 119 విక్రమ శ్రావణ బహుళాష్టమికి స్వామికి 7 ఏళ్ళు నిండి, ఇంద్రయాగాన్ని నందాదులతోమాన్పించటం, ఆగ్రహించి దేవేంద్రుడు అతి వృష్టికురిపించటం, స్వామి గోవర్ధనగిరి నెత్తటం, ఇంద్ర గర్వ భంగమవటం, కామధేనువు స్వామికి క్షీరాభిషేకం చేయటం, వరుణ దేవుడు పట్టుకు వెళ్ళిన పెంపుడుతండ్రి నందుని విడిపించటానికి వరుణ లోకం వెళ్లి, విడిపించి తీసుకు రావటం, బాల్య రాసక్రీడ, జరిగాయి. 118 వృష సంవత్సరం లో సర్పరూపం ధరించిన సుదర్శనుడి శాపాన్ని బాలకృష్ణుడు తొలగించాడు. జ్యేష్ట శుద్ధంలో ధర్మరాజుకు 11 వ ఏట ఉపనయనం జరిగింది. |
| 14 | కలిపూర్వం 117నుంచి 112 వరకు అనగా చిత్రభాను నుంచి సర్వ జిత్ వరకు శంఖ చూడ సంహారం, వృష భాసుర, కేశి రాక్షస, వ్యోమాసుర వధ జరిపాడు కృష్ణుడు. బృందావనం లో గోపాల లీలలు చూపాడు. ఇవన్నీ అయ్యేసరికి కన్నయ్యకు 14 ఏళ్ళు పూర్తయ్యాయి. |
| 15 | 111 సర్వధారికి 15 ఏళ్ళు పూర్తి అయి, నారద మహర్షి వచ్చి కంససంహారం మొదలైన భవిష్యత్ కార్యక్రమాలు చెప్పటం జరిగింది. అంటే కృష్ణుడికి బాల్యం పూర్తి అయి, అవతార కార్యం నిర్వహించే వయసువచ్చింది కనుకనే నారదుడు వచ్చి కర్తవ్యం బోధించాడు. |
| 16 | 110 విరోధి శ్రావణ బహుళ అష్టమికి కృష్ణస్వామికి నూనూగు మీసాల నూతనయవ్వనం వచ్చి 16సంవత్సరాలు నిండాయి. అక్రూరుడిని కంసుడు బృందావనానికి పంపటం బలరామ కృష్ణులు ఆయనతో ధనుర్యాగానికి మధుర చేరటం, గోపికలు స్వామిని విడువలేక దుఖించటం, వారించటం, దారిలో యమునాతీరాన అక్రూరునికి కృష్ణుడు విశ్వరూప సందర్శనభాగ్యం ప్రసాదించటం, (ఇప్పటికి స్వామి 3 సార్లు విశ్వరూప సందర్శనం చూపించాడు ) అందరూ మధుర చేరటం జరిగింది. మధురలో రథం పై విహరిస్తూ సోదరులు రజకుని నిగ్రహించటం, తంతు వాయక సన్మానం,మాలాకార సన్మానం పొందటం, కుబ్జ తో సంభాషణం. మర్నాడు ధనుర్యాగశాల ప్రవేశం చేసి, కువలయాపీడం అనే ఏనుగు పీచమడిగించి,మల్ల యుద్ధం లో బలరామ కృష్ణ సోదరులు ముష్టికా, చాణూరులను మల్లయుద్ధం లో గెలిచి, కృష్ణుడు మేనమామ కంసునితోపోరాడి సంహరించటం, బలరాముడు కంస సోదరులతో పోరి, నిర్జించటం, సోదరులు తలిదండ్రులు దేవకీ వసుదేవులను కారాగృహం నుంచి విముక్తికల్పించి, వారిచే లాలింప బడటం జరిగాయి. కొన్ని రోజులతర్వాత, పెంచిన తలిదండ్రులైన నంద, యశోదాదులను ఆహ్వానించి |

| | |
|---|---|
| | పిలిపించి, వారి సమక్షం లో మాతామహుడు ఉగ్రసేనునికి పట్టాభి షేకం చేసి, నందునికి కృష్ణస్వామి ఆధ్యాత్మికజ్ఞాన బోధ చేసి, దుర్గా స్తోత్రం ఉపదేశించి, వారిని తిరిగి బృందావనానికి పంపించటం జరిగింది. |
| 17 | కలిపూర్వం 109 వికృతి సంవత్సర శ్రావణ బహుళాష్టమికి కృష్ణమూర్తికి 17 ఏళ్ళు నిండాయి. గర్గాచార్యుల చేత బలరామకృష్ణులకు ఉపనయన సంస్కారం జరిగి, బ్రహ్మచారులై గురు శుశ్రూష చేసి, కాశీ లో ఉన్న సాందీపమహర్షి వద్ద గురుకులవాసం లో ధనుర్వేద, ఉపనిషత్ విద్య నేర్చి, గురు దక్షిణగా మృతుడైన గురుపుత్రుని కృష్ణుడు సజీవునిగా తీసుకొచ్చి అప్పగించటానికి ప్రభాస తీర్థం వెళ్ళటం, సముద్రుడు పూజించటం సముద్రం ప్రవేశించి, పంచ జనాసురుడిని చంపి, పాంచజన్య శంఖం గ్రహించి, యమలోకం వెళ్లి, గురుపుత్రుని తీసుకొని కాశీ చేరి గురువుకు అప్పగించటం జరిగాయి. |
| 18 | 108 ఖర లో కృష్ణుడు గోపికల వద్దకు ఉద్ధవుడిని పంపటం,గోపికల భ్రమర గీతాలు, తిరిగొచ్చిన ఉద్ధవుడు స్వామికి గోపికల అత్యంత ఆరాధనా భక్తీ వివరించటం, కుబ్జ కురూపాన్ని పోగొట్టి సౌందర్య రాశిగా మార్చటం, సోదరులు అక్రూరుని ఆతిధ్యం,పూజలు పొంది బహూకరించటం,పాండవుల క్షేమ సమాచారాలు తెలుసుకొని రమ్మని హస్తినకు అక్రూరుని పంపటం జరిగింది. కృష్ణ బాల్యం ప్రచ్చన్నంగా బృందావనం లో నందగోపుని ఇంట జరగటం వలన కంస వధ తర్వాతే పాండవ శ్రీకృష్ణ సోదరులకు మొదటిపరిచయకాలం అయింది. |
| 19 | 107 నందనలో 19స్వా మికి పూర్తి అవటం, జరాసంధుడు మధురపై మొదటిసారి దండెత్తిరావటం, ఓడిపోయి బలరాముని చేతిలో పట్టుబడటం, కృష్ణుడు కరుణించి వాడిని విడిచిపెట్టటం జరిగాయి. |
| 20 | 106 విజయ సంవత్సరం 20 ఏళ్ళు నిండిన మూడు నెలలకే, జరాసంధుడు మధురపై రెండో సారి కృతఘ్నుతతో దాడి చేసి, ఓడి,16సార్లు దండెత్తి 6ఏళ్ళు మదుర, కృష్ణబలరాములను బాధించాడు. |
| 21 | 105 జయ లో 21 ఏడు వచ్చాక జరాసంధుడు మూడో సారి దండయాత్ర చేశాడు హస్తినాపురం లో పాండవులు ఏం చేస్తున్నారో చూద్దాం. ద్రోణాచార్యులవద్ద ధనుర్విద్య నేర్చిన పాండవ కౌరవులకు ధనుర్విద్యా పరీక్షజరగటం, నాలుగో దండయాత్ర జరాసంధుడు చేయటం జరిగాయి |
| 22 | 103 దుర్ముఖి లో 23 ఏళ్ళు నిండటం, జరుడు 5వ సారి మధురదండయాత్ర, 102 హేవలంబి లో 24పూర్తయి, 6వ సారి దండయాత్ర |
| 23 | 101 విళంబిలో 25 కంసారి కి నిండగా 7వ దండయాత్ర |
| 26 | 100వి కారిలో మురారికి 26 నిండటం, సంధుని 8వ దండయాత్ర, హస్తినలో కౌరవపాం డవులమధ్య కలహాలు తీవ్రమవగా, పాండవులను శార్వరి ఫాల్గుణ శుద్ధ అష్టమికి వారణావతం పంపటం జరిగాయి. |
| 27 | 99 శార్వరికి నల్లనయ్యకు 27నిండటం, జరా 9వసారి దండయాత్ర |
| 28 | 98 ప్లవ లో 28 నిండటం, జరుడి 10 వ దండయాత్ర, ఫాల్గుణ శుద్ధ చతుర్దశి లాక్షా గృహ దహనం, కుంతీ దేవితో సహా బిలంగుండా పాండవులు తప్పించుకుపోవటం, అరణ్యం లో చైత్ర శుద్ధ పాడ్యమి రోజున భీముడు హిడింబాసుర వధ చేసి, హిడింబిని పెళ్ళాడి ఘటోత్కచునికి జన్మనివ్వటం |
| 29 | 97 శుభకృత్ కు బలరామానుజుడికి 29 నిండటం, సందుడి 11 వ దండయాత్ర, |
| 30 | 96 శోభకృత్ కు 30 నిండటం, మధురపై 12వ దండయాత్ర, కుంతీ పాండవులు శాలిహోత్ర ముని ఆశ్రమంలో ధర్మాలు వినటం, |
| 31 | 95 క్రోధి కి 31నిండి, 13వ దండయాత్ర, వైశాఖ శుక్లపక్షం లో పాండవులు, ఏక చక్రపురం వెళ్లి ఒక ఏడాది ఉండటం |
| 32 | 94 విశ్వావసులో 32దేవకీనందనుడికి నిండటం, మధురపై 14వ దండయాత్ర, ఏకచక్రపురం లో రెండో ఏడాది పాండవులు గడపటం |
| 33 | 93 పరాభవ కన్నయ్యకు 33 నిండటం, మధురపై 15వ దండయాత్ర, పాండవులు మూడో ఏడాది ఏకచక్రపుర వాసం |
| 34 | 92 ప్లవంగకు శౌరికి 34 నిడటం జరుని 16వసారి, 17వ సారి ఎత్తిరావటం, పాండవుల నాలుగో ఏడు ఏకచక్రపురవాసం |
| 35 | 91కీ లక సంవత్సరం లో ముకుందు నికి 35 నిండటం జరాసంధుడు మధురపై చివరిసారి 18వ దండయాత్ర చేయటం, కాలయవన పారశీకరాజు వాడికి పశ్చిమం నుంచి సాయం రావటం, 3కోట్ల జరాసంధ శత్రు సైన్యాన్ని ఎదిరించాల్సిరావటం తో కృష్ణుడు ముందుగా కాలయవనుడితోపోరాడి, ఓడిపోయినట్లు నటించి భయంతో పారిపోతున్నట్లు భ్రమకలిపించి ముచుకుందమహర్షి తపస్సు చేస్తున్న గుహలో దూరి, కాలయవనుడు ముని తపోభంగం చేయగా ఆయన కంటిమంటకు వాడు భస్మమవటం,యవన సైన్యం భయపడి పారిపోవటం వరుసయుద్ధాలతో ఇక యాదవులను కష్టట్టటం ఇష్టం లేక బలరామ కృష్ణులు ప్రవర్షణ గిరి అనే దుర్గానికి చేరగా, |

| | |
|---|---|
| | జరాసంధుడు మధురవదలి దీనిపైకి వచ్చి కాల్చేయగా, అక్కడినుంచి తప్పుకొని సోదరులు అజ్ఞాత వాసం కొంతకాలం గడిపి, పశ్చిమ సముద్రం చేరి దాని దగ్గరున్న గోమతి నదీ తీరం లో ద్వారకానగరం నిర్మించటం ప్రారంభించి 90సౌమ్య సంవత్సరానికి పూర్తి చేసి, యాదవులను ద్వారకకు రప్పించి, రుక్మిణీదేవిని పెళ్ళాడటం, ఏక చక్రపురం లో పాండవుల 6వ ఏడు అజ్ఞాతవాసం గడపటం పూర్తి అయింది |
| 37 | కలిపూర్వం 89 సాధారణ నామ సంవత్సర శ్రావణ బహుళ అష్టమికి ముచికుందవరదునికి 37సంవత్సరాల వయసు పూర్తయి జాంబవతి కృష్ణులకు వివాహం, శ్యమంతకోపాఖ్యానం సత్యా కృష్ణుల పెళ్లి జరిగినాయి. ఏకచక్రపురం లో పాండవులఅజ్ఞాతం 7 ఏళ్ళు పూర్తయ్యాయి. |
| 38 | 88 విరోదిక్ కృత్ లో మాధవుడికి 38 నిండి, రుక్మిణీ కృష్ణులకు ప్రద్యుమ్నుడు పుట్టాడు. పాండవుల క్షేమం తెలుసుకోవటానికి పార్ధసారధి హస్తినకు పోగా, ద్వారకలో శతధ్వనుడు సత్రాజిత్తును అర్ధరాత్రి నిద్రలో చంపి, శ్యమంతకమణి దొంగిలించు కుపోయాడు. పాండవులకు 8ఏళ్ళు అజ్ఞాతం పూర్తి |
| 39 | 87 పరీదావిలో గోవిందు డికి 39 నిండి, సత్యభామ పంపిన కబురు తో ద్వారక చేరగా శతధ్వనుడు శ్యమంతకమణి అక్రూరుని దగ్గర దాచి మిధిలకు పారిపోగా తరిమి వాడిని చంపి వాడివద్ద మణి లేకపోవటం తో ద్వారకకు తిరిగి రాగా, స్వామి వలన భయంతో అక్రూరుడు కాశీకి పారిపోయాడు. అతడిని రప్పించి మణిని అందరికి చూపించి అతనికే ఇచ్చేశాడు. మణిప్రభావంతో అక్రూరుడు అనేక పుణ్యకార్యాలు యజ్ఞయాగాదులు చేశాడు. పాండవులు ప్రమాదీచ సంవత్సర ఆశ్వయుజ బహుళ అష్టమి వరకు 9ఏళ్ళు ఏకచక్రపుర అజ్ఞాత వాసం లో ఉన్నారు. |
| 40 | 86ప్రమాదీచలో నల్లని స్వామికి 40నిండాయి. పాంచాలపురం లో ద్రౌపది స్వయం వరం ప్రకటింప బడగా,ప్రచ్ఛన్న బ్రాహ్మణ వేషం లో తల్లితోసహాపాండవులు వెళ్లి, బలరామ కృష్ణులు అనేక రాజ యువరాజులు హాజరవగా కృష్ణుడు పాండవులను గుర్తించి మత్స్య యంత్రం కొట్టే పనిలో ఉన్న సాత్యకిని వారించగా అర్జునుడు దాన్నికొట్టి ద్రౌపదిని దక్కించుకొన్నాడు. ద్రౌపది వివాహం నాటికి ధర్మరాజుకు 42,భీముడికి 41,అర్జునుడికి 40,నకుల సహదేవులకు 30 ఏళ్ళవయసు |
| 41 | 85 ఆనందలో 41 నిండాయి ఆనందమోహనుడికి. ద్రౌపది వివాహం జరిగిన ఒక సంవత్సరం 2 రోజులకు విదురుని పంపి గుడ్డిరాజు పాండవులను హస్తినకు రప్పించుకొని, ధర్మరాజును యువరాజుగా గౌరవించి అతనిచే రాజ్యపాలన చేయించాడు. కన్నయ్య హస్తినకు వచ్చి బావమరదుల క్షేమం తెలుసుకొని, అర్జునుడితో యమునాతీరానికి వేటకు వెళ్లి, అక్కడ సూర్యపుత్రి కాళింది ని ప్రేమించి, హస్తినకు తెచ్చి ద్రౌపది సంరక్షణలో ఉంచి, తర్వాత ద్వారకకు తీసుకువెళ్ళి పెళ్ళాడి,అవంతి రాజు సోదరి మిత్రవిందను వరించి వివాహమాడి భార్యల సంఖ్య 5కు చేర్చాడు మోహన వంశీ లోలుడు. |
| 42 | 84 రాక్షస లో ముకుందుడికి 42 పూర్తయి కోసల రాజకుమారి నాగ్నజితీదేవిని పెళ్ళాడి 83నల లో కేకయ రాకుమారి భద్రా దేవిని 7వ భార్యగా చేసుకొన్నాడు |
| 43 | 82పింగళకు 43 నిండి నామాలసామి మద్ర రాకుమారి. లక్ష్మణ ను మత్స్య యంత్రం కొట్టి, చేపట్టి అష్టమ భార్యను చేశాడు. రాధనుకూడా కలిపితే 9మందిభార్యలు రాదామనోహరుడికి |
| 44 | 81 కాళయుక్తి కి 44 పూర్తి.అక్కడ కౌరవ పాండవ యాదవులలో అంతః కలహాలు లేకుండా ప్రశాంతంగా స్నేహంగా ఉన్నారు |
| 46 | 80 సిద్ధార్ధి మాఘబహుళపాడ్యమికి 46 నిండాయి గోపాల చక్రవర్తికి. ముసలిరాజు పాండవులకు అర్ధరాజ్యమిచ్చి ఇంద్ర ప్రస్థానికి పంపాడు. |
| 48 | 79 రౌద్రికి 47,78 దుర్మతికి 48 దామోదరుడికి నిండాయి |
| 49 | 77 దుందుభి ఫాల్గుణం లో 49 నిండాయి నళినాక్షునికి. ధర్మరాజు అనుజ్ఞతో అర్జునుడు తీర్ధయాత్ర ప్రారంభం చేసి ఒక ఏడాది యాత్రలలో గడిపాడు |
| 50-52 | 76 రుధిరోద్గారికి 50, 75రక్తాక్షికి 51, 74 క్రోధనకు 52 పూర్తయ్యాయి పూతన సంహారికి. కౌరవ, పాండవ యాదవుల వంశాలు వృద్ధి చెందాయి. అందరు సౌజన్యంతో జీవించారు ఈకాలం లో |
| 53-59 | 73 అక్షయకు 53, 72ప్రభవకు 54, 71విభవకు 55, 70శుక్లకు 56, 69 ప్రమోదూతకు 57,68ప్రజోత్పత్తికి 58, 67ఆంగీరసకు 59 |
| 60 | 66 శ్రీముఖకు 60 అంటే షష్టిపూర్తి శ్రీవల్లభుడికి అయ్యాయి. |

| | |
|---|---|
| 61 | 65 భావనామ సంవత్సరం లో 61 నిండాయి భావజ గురుడికి. అర్జునుడు తీర్థయాత్రలో, చిత్రాంగద ను పెళ్ళాడి, యాత్ర ప్రారంభమైన 12 ఏళ్ళకు ద్వారక చేరాడు సుభాద్రానుజుని ప్రోత్సాహంతో యతివేషంలో సుభద్రను వరించి, ఇంద్ర ప్రస్థానికి తీసుకువచ్చి వివాహమాడాడు. |
| 62-63 | కలిపూర్వం 64 యువ సంవత్సరం లో సత్యాపతికి 62 ఏళ్ళు, 63 ధాతలో 63 |
| 64 | 62 ఈశ్వరలో 64 నిండాయి. కృష్ణార్జునులు యమునా నదీ తీర విహారం చేసి, అగ్ని దేవుడు ప్రత్యక్షమై, గాండీవం, అక్షయ తూణీరాలు, స్వేతాశ్వ రధం ప్రసాదించి "గాండీవి" ని చేసి, అగ్ని కోరికపై ఖాండవ వన దహనం చేసి ప్రీతి చెందించి, ఈదహనం నుంచి తనను కాపాడిన క్రీడికి కానుకగా పాండవులకు మయుడు అద్భుత సుందర హర్మ్యాన్ని మయ సభను నిర్మించి ఇచ్చాడు. ఇంద్రుడు అనేక అస్త్రాలు అర్జునునికి ప్రసాదించాడు |
| 65-70 | 61 బహుదాన్యకు బహురూపధారికి 65,60 ప్రమాదికి 66, 59 విక్రమకు 67, 58 వృష కు 68, 57చిత్రభానులో 69, 56 స్వభానులో 70 |
| 71 | 55 తారణ సంవత్సరానికి 71 ఏళ్ళు నిండాయి. నరకాసురుని వలన బాధకలుగుతోందని ఇంద్రుని నుంచి ఇందీవర శ్యామునికి వార్త రాగా,సత్యాపతి అర్ధాంగి తోకలిసి ప్రాగ్జ్యోతిష పురం వెళ్లి, నరకుని సత్యసాయంతో వధించగా అదితి కుండలాలు మళ్ళీ ఇవ్వగా,ఇంద్ర స్తోత్రం తో ప్రీతి చెంది, అమరావతికి వెళ్లి, జయించి, పారిజాత వృక్షాన్ని భూలోకానికి తెచ్చి, నరకుని బందీలై, వాడి సంహారంతో విముక్తులైన న స్త్రీల లో తనవరించినవారిని ద్వారకకు పంపి, మిగిలినవారిని వారివారి స్వగ్రామాలకు పంపించేసి, తనలాగా వేషం వేసుకొని తానె వాసుదేవుడిని అని బుకాయిస్తున్న పౌండ్రక వాసుదేవుడిని, కాశీ రాజు నూ జయించాడు వసుదేవ సుతుడు. |
| 72 | 54 పార్దివ కు పార్ద సారధికి 72 |
| 73 | 53 వ్యయకు 73 నిండాయి. కృష్ణకుమారుడు అనిరుద్ధుని బాణాసురునికూతురు ఉష ప్రేమించి,తనమందిరానికి తీసుకురాగా తండ్రి అతడిని బంధించగా, యదుభూషణుడు వచ్చి, బాణునిఓడిచి, ఉషానిరుద్ధులను ద్వారకకు తీసుకు వెళ్లి పెళ్లి జరిపించాడు. |
| 74 | 52 సర్వ జిత్తుకు 74 నిండి అభిమన్యు జననం |
| 75 | 51 సర్వధారికి 75, నిండగా ఉపపాండవ జననం |
| 76 | 50 విరోధి 76 ఏళ్ళు నిండాయి నారద గాన వినోదుడికి. నారద ప్రోద్బలంతో ధర్మరాజు కార్తీక శుద్ధ పాడ్యమినుంచి చతుర్దశి వరకు రాజసూయ యాగం సంకల్పించగా, కృష్ణార్జున భీములు లు ముందుగా గిరివ్రజం చేరి భీముడు జరాసంధుని సంహరించగా, జరాసంధుడు బంధించిన రాజులందరూ కార్తీక పౌర్ణమినాడు విడుదల చేయించాడు వెన్నుడు. కార్తీక శుద్ధ పంచమినాడు జరాసంధునికొడుకు సహదేవుడు పట్టాభి షిక్తుడయ్యాడు.<br>50 విరోధి లోనే వృష మర్దనుడికి 76ఏళ్ళు నిండగా కురుక్షేత్ర సంగ్రామ సూచకమైన సూర్య గ్రహణం ఏర్పడింది. అప్పుడే యాదవ, పాండవ ముఖ్యుల సమావేశం కురుక్షేత్రం లో జరిగింది.. సమస్త మహర్షులు దేవతలు విచ్చేసి, యమునాతీర విహారి శ్రీ కృష్ణ పరబ్రహ్మను సేవించి తరించారు. కురుక్షేత్రం నుంచి ద్వారకకు తిరిగివచ్చి కృష్ణమూర్తి తల్లి దేవకీ దేవి కోరికపై తనకంటే ముందు జన్మించి మేనమామ కంసుని చే చంపబడిన 6గురు సోదరులను బ్రతికించమని కోరగా, సుతలలోకం వెళ్లి, బలి చక్రవర్తిని మెప్పించి వారిని తెచ్చి తల్లికి చూపించాడు దేవకీ నందన శౌరి |
| 77 | కలిపూర్వం 49 వికృతి సంవత్సర చైత్ర శుక్లానికి చైతన్య వరదుడికి 77 ఏళ్ళు నిండాయి. ధర్మరాజు రాజసూయ యాగం చేయటం, శిశుపాలుడి నూరు తప్పులు సైచి,101వ తప్పుకు శిక్షగా కృష్ణస్వామి చక్రం తో సంహరించటం, భీష్మ పితామహుని సలహా పై ధర్మరాజు శిఖిపింఛమౌళికి అగ్రానాధిపత్యం ఇచ్చిపూజించటం, ఆశ్వయుజ శుక్లం లో పాండవులతో పరమాత్మ ఇంద్రప్రస్థం లో ఉండగా,సాళ్వుడు ద్వారక ముట్టడించటం, ద్వారకా నిర్మాత స్వామి అక్కడికి వెళ్లి వాడినీ, వాడి తమ్ముడు విధూరధుని, దంతవక్త్రుని సంహరించాడు. ఆశ్వయుజ శుక్ల దశమి నాడు ద్వారకలో మురారి యుద్ధ సంరంభం లో ఉండగా, కృష్ణుడు లేని సమయం కనిపెట్టి దుర్యోధనుడు ధర్మరాజు తో ద్యూతానికి పురిగొల్పి ఓడించటం, ద్రౌపదీ వస్త్రాపహరణానికి నిండు సభలో ప్రయత్నించగా యాజ్ఞసేనికి అక్షయ వస్త్ర దానం చేసి ద్రౌపదీ మాన సంరక్షకుడు అనిపించాడు యజ్ఞపురుషుడైన మురభంజనుడు. ధర్మరాజు తమ్ములతో భార్య ద్రౌపదితో వనవాసానికి వెళ్ళాడు |
| 78 | 48 ఖరకు చాణూర మర్దనుడికి 78 నిండాయి. వనవాసం లో పాండవులను పరామర్శించిన పాండవ శ్రేయోభిలాషి తో పాంచాలి తనపరాభావాన్ని చెప్పుకొని దుఖించగా కృష్ణా ను ఓదార్చాడు కృష్ణుడు. |
| 79=88 | 47 నందనకు 79, 46 విజయకు 80, 45 జయకు 81, 44 మన్మధకు 82, 43 దుర్ముఖికి 83, 42 హేవళంబికి 84, 41 విళంబికి 85,40 వికారికి 86, 39 శార్వరికి 87, 38 ప్లవకు 88 |

| | |
|---|---|
| 89 | 37శుభకృత్ కు 89,ఏ ళ్ళు నిండాయి యదుకుల విభూషనుడికి. సత్య తోసత్యాపతి రెండవసారి పాండవుల వద్దకు రాగా ద్రౌపదీదేవి సత్యభామకు పతివ్రతా ధర్మాలు బోధించటం, వనవాసం ముగిసేముందు మూడవ సారి ముకుందుడు మళ్ళీ వచ్చిపరామర్శించి పాండవులకు ధైర్యం చెప్పాడు. శ్రీ కృష్ణానుగ్రహం తో ద్రౌపది దుర్వాసుని ఆగ్రహాన్ని శాంతింప జేసి ఆయన పెట్టిన పరీక్షలో నెగ్గి పాండవులకు ఉపశమనం కలిగించింది. ఈ సమయం లోనే ద్వారకకు కుచేలుడు రావటం అటుకులు చెలికాడికిచ్చి శౌరి చే అస్టభార్యలచే సపర్యలుపొంది అష్టైశ్వర్యాలు అనుగ్రహింప బడటం, మాధవుడు మిధిలరాజు బహుళాశ్వుని,శ్రుత దేవుని,మిదిలవాసులను తరింప జేయటం జరిగాయి. పాండవుల 12 ఏళ్ళ వనవాసం పరి సమాప్తి అయింది. |
| 90 | 36 శోభకృత్ ఆశ్వయుజ కృష్ణ అష్టమికి కౌస్తుభధారికి 90 ఏళ్ళు నిండాయి. పాండవుల అజ్ఞాత వాసం విరాట రాజు నగరం లో ప్రారంభమై, 10 నెలలు నిండాక భీమునిచే నర్తన శాలలో కీచక ఉప కీచక వధ,, విరాట రాకుమారి ఉత్తరకు బృహన్నల వేషం లోని అర్జునుడు నాట్యం నేర్పటం, ఉత్తర, దక్షిణ గోగ్రహణం జరిగి ఉత్తరకుమారుని కి సారధ్యం వహించి పేడి ఐన క్రీడి శమీ వృక్షం పై దాచిన గాండీవం అక్షయ తూణీరాలు ఉత్తర కుమారునితో దింపించి, ధరించి అర్జునరూపం తో ఉత్తరుడు సారధిగా, కౌరవులకు తన నిజరూప దర్శనం చేసి తన అవక్ర పరాక్రమం తో ఓడించి సిగ్గుపడి వెనక్కి మల్లేట్లు చేసి భీష్మ ద్రోణాదులమెప్పుపొంది, విరాట నగరానికి రావటం, ఉత్తరుడు సర్వం తండ్రికి వివరించటం, ఉత్తరాభి మన్యుల వివాహం నీలమేఘశ్యాముడు స్వయంగా జరిపించాడు. ఆశ్వయుజ శుక్లపక్షం లో పాండవులు ఉపప్లావ్యం ప్రవేశించారు. యదుకులస్వామి ద్వారకకు చేరాడు. కౌరవ, పాండవులు యుద్ధం కోసం సేనలను సమకూర్చే ప్రయత్నం లో దుర్యోధన అర్జునులు ఒకేసారి ద్వారకలో శ్రీ కృష్ణ సాయం కోసం రావటం, తన సర్వసైన్యాన్ని కౌరవ రాజుకిచ్చి, అర్జునుని కోరికపై తాను విజయసారదిగా ఉండటానికి అనుగ్రహించి బావమరదితో ఉపప్లావ్యానికి వచ్చాడు వృష్ణివంశ యదుభూషణుడు. కార్తిక శుద్ధ ద్వాదశి (ద్వాదశి దగ్ధ యోగం )నాడు కేశి సంహారి హస్తినకు రాయబారం వెళ్లి 8రోజులు నయానా భయానా నచ్చ చెప్పే ప్రయత్నం చేసి, తనను కట్టేయాలని ప్రయత్నించిన గాంధారి జ్యేష్టపుత్రసమూహానికి విశ్వరూపం తో(నాలుగవ విశ్వరూప సందర్శనం ) భ్రమపెట్టి ముసలిరాజుకు ఆ భాగ్యం కలిగించి, విదురుని ఇంట ఆతిధ్యం స్వీకరించి, తిరిగి వెళ్ళాడు.<br>మార్గశిర శుద్ధ త్రయోదశి మధుసూదనుడికి 90ఏళ్ళు పూర్తి అయి, కౌరవ పాండవ సైన్యాలు కురుక్షేత్రం లో మోహరించాయి.అర్జునుడు విషాద యోగం లో ఉంటె భగవద్గీత బోధించి గీతాచార్యుడై నరుడికి నారాయణుడు 5 వసారి విశ్వరూపం చూపించాడు. యుద్ధం ప్రారంభమైన శుద్ధ ఏకాదశినాడే గీతోపదేశం జరిగింది. మార్గశిర బహుళ అమావాస్య నాడు 15 రోజుల కురుక్షేత్ర సంగ్రామం ముగిసింది. పుష్య శుద్ధ పాడ్యమి నాడు దుర్యోధనుని రెండు తొడలు విరగ్గొట్టి హతుడిని చేసి భీముడు ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నాడు. అశ్వత్థామ ఉపపాండవులను మట్టు బెట్టాడు. వాడిని కృష్ణార్జునులు బంధించి తెచ్చి ద్రౌపదిముందు నిలబెట్టగా మాతృహృదయం తో క్షమించగా, బావ సూచనతో బావమరది వాడి తలలోని చూడామణిని పెకలించి గబ్బుకంపుతో ఉన్న వాడిని బయటికి తోసేశాడు. పుష్యశుద్ధ పౌర్ణమి నాడు యుదిస్టిరుని పట్టాభి షేకం శ్రీ కృష్ణ పరమాత్మ చేతులమీదుగా జరిగింది. మాఘ శుద్ధ ఏకాదశి నాడు భీష్మ పితామహుని స్వచ్ఛందమరణం. భీష్మ తేజస్సు కృష్ణపరమాత్మలో విలీనమైంది. |
| 91 | కలిపూర్వం 35 క్రోధి సంవత్సర జ్యేష్ట శుద్ధ విదియకు విజయ సారధికి 91 నిండాయి పరీక్షిత్తు జన్మించాడు. ఆశ్వత్థామ అస్త్రాలనుంచి గర్భం లో ఉన్న పరీక్షిత్ ను కృష్ణ పరమాత్మ సంరక్షించాడు |
| 92 | 34 విశ్వావసు చైత్ర పౌర్ణమికి శరత్ చంద్ర చంద్రునికి 92 నిండి, ధర్మరాజు వ్యాసాజ్ఞాతో అశ్వమేధం పూర్తి చేశాడు. |
| 93 | 33 పరాభవచైత్ర పౌర్ణమికి 93 పూర్తయ్యాయి పూర్ణ చంద్ర నిభునికి. ధర్మరాజు యాగం పూర్తయి అర్జునుడు అశ్వం వెంట దిగ్విజయ యాత్ర కు బయల్దేరి తనకూ చిత్రాంగదకు జన్మించిన బభ్రువాహనుని చేతిలో ఓడిపోయి, సంధి చేసుకొని బంధింపబడిన యాగాశ్వాన్ని తీసుకొచ్చాడు |
| 94 | 32 ప్లవంగ శ్రావణ బహుళాస్టమికి శ్యామసుందరునికి 94 పూర్తయి, ఉదంకుని ఆశ్రమానికి వెళ్లి దర్శనం తోపాటు 6వ సారి తన విశ్వ రూప సందర్శన భాగ్యం కల్పించి తరింపజేశాడు |
| 95-114 | 31కీ లకకు 95, 30సౌమ్యకు 96, 29 సాధారణకు 97, 28 విరోదికృత్ కు 98, 27 పరీధావికి 99, 26 ప్రమాదీచకు 100 ఏళ్ళు నిండాయి వనమాలికి. 25 ఆనంద కు 101, 24 రాక్షసకు 102, 23నలకు 103, 22 పింగళకు 104, 21 కాళయుక్తి కి 105, 20 సిద్దార్ధికు 106,19 రౌద్రి చైత్ర శుద్ధ విదియకు 107, 18దుర్మతికి 108, 17 దుందుభి కి 109,16 రుధిరోద్గారికి 110,15 రక్తాక్షికి 111,14 క్రోధనకు 112,13 అక్షయకు 113,12 ప్రభవకు 114 |

| | |
|---|---|
| 115 | 11వ భవకు యదు భూషణుడికి 115 ఏళ్ళు నిండాయి. ఈ కాలం లో కృష్ణమూర్తి ద్వారకలో 12ఏళ్ళు బహు యాగాలు చేశాడు. ధర్మరాజు ధర్మమూర్తిగా హస్తినలో పాలన సాగిస్తున్నాడు. గాంధారిధృత రాష్ట్రులు హస్తినలో పుత్రశోకం తో ఉండలేక శతకూపాశ్రమంలో ఉన్నారు. వ్యాసభగవానుడు ప్రత్యక్షమై గాంధారిని ఊరడించి ఆమె కోరికపై చనిపోయిన కౌరవులందర్నీ యోగశక్తి తో చూపించి ఉపశమనం కలిగించాడు. ధర్మరాజాదులు కూడా ఈ ఆశ్రమం లో కొంతకాలం ఉండి, మళ్ళీ హస్తినకు వెళ్ళారు. గాంధారి ధృత రాష్ట్రులు మరణించారు. శ్రీకృష్ణ సంకల్పం తో నారదాది మహర్షులు పిండార క్షేత్రం లో సమావేశమయ్యారు. సురాపానం తో మదించిన యాదవులు వారిని అవమానించ గా, మునుల శాపం తో కృష్ణ కుమారుడు సాంబుడు స్త్రీ వేషం లో ఋషులను ఆటపట్టించగా, వాడికడుపులో ముసలం పుట్టగా భయపడి యాదవులు దాన్ని అరగదీసి సముద్రం లోకలిపారు. |
| 116-124 | కలిపూర్వం 10 శుక్ల సంవత్సరం లో శిఖి పింఛ మౌళికి 116, 9 ప్రమోదూతకు 117,8 ప్రజోత్పత్తికి 118, 7ఆంగీరస కు 119, 6 శ్రీముఖకు 120, 5 భావకు 121, 4 యువకు 122, 3 ధాతకు 123, 2 ఈశ్వర కు 124 |
| 125 | బహుదాన్యకు 125 బృందావన విహారికి ఏళ్ళు నిండాయి. ఈ కాలం లో నారదమహర్షి ద్వారకకు వచ్చి వసుదేవునికి భాగవత ధర్మాలు బోధించి, జనక ఋషభ సంవాదం వినిపించాడు. శ్రీ కృష్ణ భగవానుడు బృందావనం వచ్చి బాలకృష్ణ రూపం ధరించి యశోదా నందులతోపాటు సమస్త గోప గోపీ జనాలకు దివ్య దర్శనం ప్రసాదించి తరింపజేసి భాగవతధర్మాలు బోధించాడు ఆ అవతార మూర్తి. కృష్ణస్వామి కృపాకటాక్షం చేత గోప గోపీ జనం అంతా తమతమ దివ్య ధామాలకు చేరి గోలోక, వైకుంఠ లోకాల దర్శనం చేసి ధన్యులయ్యారు. గోపాలకృష్ణమూర్తి మళ్ళీ ద్వారక చేరగా, బ్రహ్మ ఇంద్రాదులుఅక్కడికి చేరి నారాయణ భగవానుని సందర్శన భాగ్యం పొంది, తన నిజనివాసమైన గోలోకానికి విచ్చేయమని ప్రార్థించి, ఇక అవతార సమాప్తి దగ్గరలో ఉందని గుర్తు చేశారు.<br><br>ద్వారకలో అనేక ఉత్పాతాలు పుట్టాయి, యాదవ ప్రభువు యాదవులను ప్రాభాస తీర్థానికి పంపగా అక్కడ యాదవులు పరస్పర కలహాలతో ఒకరినొకరు సర్వ నాశనం చేసుకొన్నారు. బలరాముడు స్వకీయ సంకర్షణ భాగవానునిలో లీనమయ్యాడు. యాదవ స్త్రీలు దేహత్యాగం చేశారు..<br>ప్రమాది చైత్ర శుద్ధ పాడ్యమి కి ద్వాపరయుగం 8లక్షల 64వేల సంవత్సరాలు పూర్తయ్యాయి. ద్వారకలోని సంఘటనలు తెలిసిన అర్జునుడు ద్వారకకు వచ్చి భగవాన్ శ్రీ కృష్ణ సందర్శనం చేశాడు. తర్వాత బావా మరది కలిసి సముద్ర తీరానికి వాహ్యాళికి వెళ్ళగా, ముసలం ముక్కతో చేయబడిన బాణాన్ని ఒక బోయవాడు కృష్ణ పరమాత్మ పడుకొనివుండగా, ఆయన పాదాలు లేడి కన్నులు అని భ్రమించి బాణం తోకొట్టగా, స్వామి పాద అంగుష్టానికి తగిలి దేవకీ వసుదేవ నందనుడు, యశోదా తనయుడు, నంద నందనుడు శ్రీ కృష్ణ స్వామి 125సంవత్సరాల 7 నెలల, 8 వ రోజులు పూర్తయ్యాక నిర్యాణం చెందారు. అంతకుముందే రాధాదేవి గోలోకానికి చేరుకోగా గోపగోపీ బృందం దివ్య స్వాగతం పలికారు. కృష్ణస్వామి గోలోకంచేరగా బ్రహ్మాదులు దర్శించి పులకించారు.<br>ప్రమాది సంవత్సర చైత్ర శుద్ధ సప్తమికి పరమాత్మ గోలోకానికి చేరుకోగానే, కలియుగం ప్రారంభమై, అర్జునుడు దారకుని తో, మళ్ళీ ద్వారకకు చేరి,సప్తమి దాకా అక్కడే ఉన్నాడు. భూకంపాలు రాగా, మిగిలిన యాదవులతో ద్వారకను వదిలి మధురకు వెళ్ళి,అనిరుద్ధుని కుమారుడు వజ్రుడు కి యాదవ రాజ్య పట్టాభి షేకం చేశాడు, ద్వారక సముద్రం లో మునిగింది. హస్తినకు వచ్చి ధర్మరాజాదులకు శ్రీ కృష్ణ నిర్యాణ విషయం తెలియజేశాడు. వైశాఖ శుక్లం లో పరీక్షిత్తుకు పట్టాభి షేకం చేసి, పౌర్ణమినాడు పాండవులు మహాప్రస్థానానికి దీక్ష తీసుకొని, ఒక ఏడాది భూ ప్రదక్షిణం చేసి, విక్రమ సంవత్సరం లో బదరికాశ్రమం దాటి, మేరుపర్వత సమీపంలో ఊర్ధ్వ లోకాలకు చేరుకొన్నారు |

ఆధారం –నారాయణ తీర్థులవారి సంస్కృత శ్రీ కృష్ణ లీలాతరంగిణి కి ఉయ్యూరు సంస్థానాదీశ్వరులు శ్రీ రాజా మేకా వెంకటాద్రి అప్పారావు గారు ఆంధ్రీకరణం చేయగా, శ్రీమాన్ బొమ్మకంటి వీరరాఘువా చార్యులు పర్యవేక్షించగా, కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్స్1948లో ప్రచురించిన ”శ్రీ కృష్ణ లీలాతరంగిణి “గ్రంథంలో, కొవ్వూరు సంస్కృత పాఠశాల కార్యదర్శి శ్రీ చదలవాడ గోపీ నాథము,శ్రీమాన్ బొమ్మకంటి వీర రాఘువాచార్యులు, శ్రీ ఎస్. యెన్. కే.. బీజార్కన్, శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల అప్పలాచార్యులవారి మహాభారత సంగ్రహం యొక్క భిప్రాయాలు సేకరించి, నూజివీడు హైస్కూల్ చరిత్రోపాధ్యాయులు శ్రీ ధన్యంరాజు అప్పారావు గారు సమకూర్చిన “శ్రీ కృష్ణావతార కాలక్రమము “ అనే వ్యాసం.

# శ్రీ కృష్ణ తత్త్వం

## ప్రారంభం

శ్రావణమాస కృష్ణ పక్ష అష్టమి శ్రీ కృష్ణ జన్మాష్టమి. పగలు సప్తమి, సాయంత్రం అష్టమి వుంటే ఆరోజు జరపటం అలవాటు. సోమ, బుధ వారం వస్తే చాలా పవిత్రం అని భావిస్తారు. రేపు అంటే సోమ వారం కృష్ణాష్టమి అవటం మన అదృష్టం. ఆ రోజుల్లో అష్టమి తిది తో పాటు రోహిణీ నక్షత్రం కూడా కలిస్తే మహామహిమ గల పర్వ దినం అవుతుంది. శ్రీ వైష్ణవులకుభాద్రపద కృష్ణ పక్షం లో,అష్టమి, నవమి తో కలిస్తే కృష్ణాష్టమి. రోహిణీ నక్షత్రం కలిస్తే కలియుగ వైకున్తమే నని పద్మ పురాణం లో వుంది.



శ్రీ కృష్ణ తత్త్వం శ్రీమద్భాగవతం లో వ్యాసుల వారు చక్కగా ఆవిష్కరించారు. బ్రహ్మ దేవుడు ఒకప్పుడు "సృష్టి ఎలా చేయాలి "అనే సందిగ్ధం లో పడ్డాడు ".తప, తప "అని అశరీర వాణి విన్పించింది. తపస్సు చేశాడు. పరమేశ్వర సాక్షాత్కారం పొందాడు. ఆత్మ తత్వాన్ని బోధించమని కోరాడు. శ్రీ హయగ్రీవ రూపం దాల్చి నాలుగు శ్లోకాలతో తత్త్వోపదేశం చేశాడు. అదే భాగవతం. దీనినే "హయగ్రీవ బ్రహ్మ విద్య "అంటారు. దీని విస్తరణ, సారాంశమే భాగవత స్వరూపం. భాగవత తత్త్వం లో వేదాంతుల మాయా సిద్ధాంతం, సాంఖ్యుల ప్రకృతి సిద్ధాంతం, శైవుల శాక్తేయం, మీమాంసకుల కర్మ మొదలైన వన్నీ భగవంతుని దివ్య లీలలలో సమన్వయ పరచటం జరిగిందిఅని పాశ్చాత్య పండితులు అభిప్రాయ పడ్డారు. శ్రీమద్భాగవతం భగవంతుని వాఙ్మయ అవతారం అన్నారు శ్రీ రామ కృష్ణ పరమహంస. నారదీయం లో సకల వెద సారం వుంది అని ప్రముఖుల అభిప్రాయం. భగవత్ స్వరూప మైన ఈ ప్రపంచ సృష్టి రూపాన్ని వివరించేది, అంటే భక్తుల ను గూర్చి వివరించేది భాగవతం అని విజ్ఞుల భావన.

శ్రీ కృష్ణుడు బ్రహ్మం యొక ఆనంద స్వరూపం. ఆయన లీల,మధురిమ వల్ల సృష్టి అంతా జరిగింది అని శ్రీ అరవిందుల అభిప్రాయం ".నిత్య సత్యానంత అమర లీలయే ఆయన. వేణు గానం లో మానవుని లోని అజ్ఞాన మాయమైన క్రీడారూపాన్ని మార్చి, దానిలో తన స్వీయ దివ్య ఆనందం యొక్క లీలా విలాసాన్ని నింపుతాడు. రాధ, భగవంతుని విశుద్ధ ప్రేమ యొక్క మూర్తీ భావం. అదిసంపూర్ణం,సమగ్రం, --ఆత్మ ప్రదానానికి, సంపూర్ణ నివేదనకు సంకేతం"అంటారు శ్రీ అరవిందులు.

" గోపా "అంటే ఆధ్యాత్మిక ప్రకాశాన్ని పాలించే వారు "అని వారి భాషణం. వారిలో ఆధ్యాత్మిక అనుభవం వుంది. ప్రేమ, భక్తి, ఆత్మదానం గల అసాధారణ జీవులుగా భావిస్తారు గోపికలను. గోలోకం లో ప్రేమ, సౌందర్యం,ఆనందం గల దివ్య ప్రపంచం ఆధ్యాత్మిక ప్రభలతో వెలుగుతుంది. గోపి, గోప రూపాలైన ఆత్మలు ఆ ప్రభలను కాపాడుతాయి. రాధ ప్రాకృతిక ఆత్మ. కృష్ణుడు భగవదాత్మ.

ఒకప్పుడు ఇంద్రుని భార్య శచీదేవి విష్ణు లోకానికి వెళ్లి ఆయన తోడ పై కూర్చోవాలని కోరిక తెలిపింది. "నువ్వు భూలోకానికి వెళ్ళు. నేను కృష్ణుడు గా పుట్టి నీ కోరిక తీరుస్తాను. 'అని చెప్పాడు. వ్రజ భూమి లో వృషభానునికి, కళావతి కి రాధ జన్మించింది. కృష్ణునికి ఆమె మేనత్త. కృష్ణుడు గో లోకం లో వున్నప్పుడు "రాసము నుండి,ఆతనిప్రక్కనుండి, పరిగెత్తింది "అంటే "రాసంబు నుండి పుట్టి హరి ఎదుట ధావనము చేసింది "కనుక రాధ అయింది. రాధ శరీర రోమ కూపాలనుండి గోపికలు జన్మించారు. కృష్ణుడు అంటే సర్వం చేశే వాడు, చిత్తాన్ని ఆకర్షించే వాడు. రాదా కృష్ణులు ప్రేమైక జీవులు. కృష్ణ వర్ణం" నీలం ".సముద్రం, ఆకాశం అనంతమైన నీల వర్ణం కలవి. అనతత్వానికి ప్రతీకయే నీల వర్ణం. వజ్రనీలం ఆతని తేజస్సు.

అవతారం పరిణామానికి ప్రతీక గా శ్రీ అరవిందులు భాష్యం చెప్పారు. జలం లో మాత్రమే సంచరించేది మత్స్యావతారం. ఉభాయచరం కూర్మావ తారం. భూచరం వరాహావతారం. పశు మానవ కలయికే నారశింహ అవతారం, పొట్టి మొదటి మానవుడే వామనావ తారం. అది భౌతికత, లోపలి భగవత్ తత్త్వం వుండటం తో ప్రపంచాన్ని ఆక్రమిస్చేవాడు. రాజసిక. ర్రజషిక రూపం పరశు రాముడు. సాత్విక రూపమే శ్రీ రాముడు. శ్రీ కృష్ణుడు ఆధ్యాత్మిక వికాసం యొక్క చివరి రూపం ".సూపెర్ మైండ్" అంటే శ్రీ కృష్ణుడే. బుద్ధుడు నిర్వాణం, విమోచనం కల్పిస్తాడు. ఉత్కృష్ట రాజ్యాన్ని భూమి పైకి తెచ్చి, ప్రతిఘటించే వారిని సంహరించి, లోపాల్ని సరిదిద్దే వాడే కల్కి అవతారం. ఈ విధం గా ఊర్ధ్వ క్రమం లో క్రమ పరిణామ దశలు కన్పిస్తాయి. శ్రీ క ఆనంద మయుడై, ఆనంద దిశ గా నడిపే వాడే శ్రీ కృష్ణుడు.

"ఓం సచ్చిదానంద రూపాయ -క్రిష్ణాయాక్లిష్ట కర్మనే --నమో వేదాంత వేద్యాయ-గురవే బుద్ధి సాక్షినే "

## గోపికా భక్తి

-- **"ధర్మ కర్తయు, ధర్మ భర్తయు, ధర్మ మూర్తియు నైన, స ---త్కర్మదీక్షుడు, ధర్మ శిక్షయు, ధర్మ రక్ష యు జేయగా నర్మలీన్, ధరమీద బుట్టి, పరంగాన జన సంగమే --ధర్మ మంచుదలంచి జేశే నుదాత్త మానస చెప్పుమా ?"**

అని ఆనాడే పరీక్షిత్తు అడిగాడు మనకు వచ్చే సందేహాన్ని ముందే వివరిస్తాడు మహర్షి వ్యాసుడు., దాని వ్యాఖ్యాత మన పోతన. ఆ భక్తి వైభావమేమితో తిలకించి పులకిద్దాం. సందేహ నివృత్తి లో నివృత్త పదాన్ని చేరుదాం. బ్రహ్మ, గోపికల భక్తికి పులకించి పోయాడు. గుణ, దేహాలను వదిలి, బంధ నిర్ముక్తులైనందుకు పరమానంద భారితుదయాడు పరబ్రహ్మ. పోతన గారి పద్యమందారం లో దాన్ని దర్శిద్దాం

"తరుణుల్ గొందరు మూల గేహముల నుద్దండించి రారాక త--ద్విరహాగ్నిం బరితాప మొందుచు, మనోవీదిన్, విభున్, మాధవున్ --బరి రంభంబులు సేసి,జారుదనుచున్, భావిన్చియున్, జొక్కి, పోం --దిరి ముక్తిన్, గుణ దేహముల్ విడిచి, ప్రీతిన్, బంధ నిర్ముక్తలై ".

బ్రహ్మ కూడా, శ్రీ కృష్ణ పాద సేవా తత్పరత తో, తన్మయత్వం పొందాడు. సమస్తం పరమేశ్వరార్పణం లో వున్న ఆనందం -బ్రహ్మ పదం లో కూడా లేదు అని "ఎరుక "పొందాడు సృష్టికర్త. అంత సమ్మోహన మూర్తి ఆయన. ఆ లీల అంత అద్భుతమైనదీ, చిత్తాకర్షణ కలదీ.

"ఎలా బ్రహ్మపదంబు, వేదములకున్, వీక్షిమ్పగా రాని ని --న్నీ లోకంబున, నీ, వనాన్తమునం, మందలో, "గృష్ణ "యం

చాలాపాది, సమస్త భావములు, నీయందే సమర్పించు, నీ --ప్రేలం దక్కని పాదరేనువులపై, పేస్టించినం జాలదే '

గోపికలు శ్రీకృష్ణుని మానసిక అర్చన చేశారు. అందుకే విశిష్టమైన అర్చకులయారు. శ్రీ కృష్ణ భావాన్ని హృద్గతం చేసుకొన్నారు. జారిపోకుండా పదిల పర్చుకొన్నారు. పులకించిన మేనులతో కౌగలించు కొన్నారు. అయితే ఇదంతా, "యోగి "లాగా చేశారు. కనుక వారికి వేరే భావం ఏమీ లేదు. ఏ తప్పు లేదు. సర్వ సమర్పణ తో చేశారు. దానికి అంత మహిమ వుంది. దేహ భ్రాంతి వీడి,, బ్రహ్మ భావం నిండి, ముక్తి కాంతా పరిష్వంగ సుఖం పొందటం చూపిస్తాడు. అదీ ఉత్క్రుష్ట భక్తి అంటే.



"ఒక్క లతాంగి మాధవుని, యుజ్వల రూపము జుడ్కి, తీగలం --జిక్కగా బట్టి, హృద్గతము జేసి, పెలిం జనకుండ, నేత్రముల్

గ్రక్కున మూసి, మేన బులకంబులు గ్రమ్మగా, గౌగాలించియున్ --జొక్కములైన, లోచవుల జొక్కుచు "యోగి "కైవడిన్ "

ఇంతగా అల్లుకు పోతున్నా, వారికి తాను ప్రత్యుపకారం ఏమీ చేయలేని వాడినని కృష్ణుని సమాధానం. దానికి కారణం గోపికలు దోషరహితం గా, నిరంతరం గా తనను అర్చిన్చటమే. బ్రహ్మాదులు, మునులు, గోపికలకు నమస్కరించి జేజేలు పలికారు. ఇది భక్తికి పరాకాష్ట. అందుకే నారద మహర్షి ఎక్కడ భక్తి విషయం వచ్చినా, "యధా వ్రజ గోపికాయాం "అని ఉదాహరిస్తూంటాడు.

"పాయని గేహ శృంఖలముల బాసి, నిరంతర మత్పరత్వముమ్ --జేయుచునున్న, మీకు బ్రతి సేయ, యుగంబులనైన నెర, నన్ --బాయక గోల్చుమానసము, బ్రత్యుపకారముగా దలంచి, నా --పాయుట తప్పుగా గొనక, భామినులార, కృపన్, శమిమ్పరే "

మనసులో ఎప్పుడు భావించటమే తాను ఇచ్చే ప్రత్యుపకారం అట. ఎంత నంగనాచిత్వామో చూశారా కన్నయ్యది ?అయినా గోపికలకు కావాల్సింది ఇంకేముంది ?

మురళీ గానాన్ని విని, పరవశాలై వచ్చిన gopikalanu ఇళ్ళకు మరలి పొమ్మని కోరాడు కొంటె కృష్ణుడు. వాళ్ళు చల్లగా, చక్కని సమాధానం చెప్పారు. పద్మ గంధాన్ని మెచ్చే తుమ్మెద ఇతర పుష్ప గంధాన్ని కోరాదని, తమ తపస్సు ఫలితం గా తనను చేరామని, అందర్నీ వదిలి వచ్చామని, తమది సర్వ సమర్పనమేనని, తమకు ఇంక ఏ ఆలోచనా లేదని, దీనం గా ప్రాధేయ పడ్డారు. భగవద్రతి తప్ప ఇంక ఏ కోరికా వారికి లేదు.

"సిరికి నుదార చిహ్నములు సేయు, భవత్చ్చరనారవిన్దముల్ --సరసిజ నేత్ర, మా తపము, సంపద జేరితి,, మెట్టకేలకున్

మరలగ లేము, మా మగల మాటున నోల్లము, పద్మగంధముల్ --మరగిన తేటులన్య కుసుమంబులకుం,జన నిచ్చగించునే '
ఆ దీనాలపాలకు కరిగి పోయాడు వెన్న తిన్న మనసున్న కన్నయ్య. అందర్నీ సంతృప్తి పరిచాడు. ఆత్మారాముడై, రమించి, వారి కోర్కెలకు సఫలత్వం చేకూర్చాడు. సర్వం సమర్పించి గోపికలు "యోగి బృందార వంద్యులు "అయారు. కాత్యాయినీ వ్రత దీక్ష లో వారి కోరికా విలక్షణం గానే కని పిస్తుంది. "వో తల్లీ !మాకు కృష్ణుడు చేతో విభుడైన నాడు చెలువల మెల్లన్, నేతి వసంతములాడుచు, జాతర చేసెదము, భక్తి చాతురి తోడన్ "అన్నారు. కాదు అనిపించాడు భక్త పోతన. వ్యాస భాగవతం లో"శ్రీ కృష్ణుని పతిగా "చేయమని కోరినట్లు రాశారు పోతనాచార్యుడు ఇంకొంచెం ముందుకు వెళ్లి హృదయాధి నాదునిగా చేయమని ప్రార్ధించటం ఆయన హృదయ వేదిత్వం అని రసజ్ఞులు, విశ్లేషకులు భావించారు.

## శ్రీ గణేష్ చతుర్ధి ---గణేష్ శ్రీ కృష్ణ

శ్రీ కృష్ణ పరమాత్మ యొక్క పరిపూర్ణ అవతారమే శ్రీ గణపతి. "గ"అంటే జ్ఞానం. "ణ " అంటే నిర్వాణం. "ఈశ" అంటే స్వామి. అంటే గణేశుడు జ్ఞాన, నిర్వానాలకు స్వామి అని ardham. "హేరంభుడు "అని కూడా ఆయనకు పేరు. అంటే "వో !దీన రక్షకా "'అని భావం. "ఏకదంతుడు "అంటే సర్వ ఉత్కృష్ట బలశాలి. ఆయన చెవులు చేటలు, అంటే చెడును చెరిగి వేస్తాయి. మంచిని మాత్రమే నిలుపుతాయి. విఘ్నాలను తొలగించి మనల్ని పరిశుద్ధులను చేస్తాడు అందుకే శూర్ప కర్ణుడు అని పేరు. అన్ని చెడు పనులకు నాలుక మూలం. అది బైట వుంటే ఇతరుల దోషాలను ఎంచు తాము. మనసు అనే జిహ్వాగ్రాన్ని మనవైపే తిప్పి ఉంచితే, అంటే మన దోషాలను మనం తెలుసుకొంటే, ముక్తి లభిస్తుంది అని పెద్దలంటారు. అందుకేగజాననుని జిహ్వాగ్రం కంఠం వైపుకు వుంది, మనకు మార్గ దర్శనం గా కన్పిస్తుంది.

శ్రీ కృష్ణుడు, గణేశుడు వేరు కాదు. అభిన్నులు. ఏక స్వభావులు. గణేశుడు పరశురాముడిని తన తుండం చేత బంధించి సర్వ బ్రహ్మాండ దర్శనం, గోలోకం లో శ్రీ కృష్ణ పరమాత్మ దర్శనం చేయించితరింప జేశాడు అని బ్రహ్మ వైవశ్వత పురాణం లో గణేశ ఖండం లో వుంది. నిర్గుణ, సద్గుణ బ్రహ్మలకు అధిపతి కనుక "గణాధిపతి "అన్నారు.

"ఓం నమస్తే గణపతయే, త్వమేవ కేవలం కర్తాసి, త్వమేవ కేవలం హర్తాసి, త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి "అని గణపతి అధర్వ శీర్ష కృతి తెలియ జేస్తోంది.



శ్రీ కృష్ణ, శ్రీ గణేష్ లకు సంబంధించిన ఒక కధను గురించి తెలుసు కొందాం. ధర్మధ్వజుని కుమార్తె తులసి. ఆమె శ్రీమన్నారయనుడిని వివాహం చేసుకోవాలని భావిస్తుంది. ఒక రోజు గణపతి కనిపిస్తే "నువ్వు శ్రీ కృష్ణుని అవతారమే కదా నన్ను పెళ్లి చేసుకో "అని వేడుకొంది. ఆయన "వివాహం బంధ కారణం --నాకు ఆ కోరికే లేదు "అని స్పష్టం గా చెప్పాడు. అప్పుడు తులసికి కోపం వచ్చి "వివాహం వద్దు అంటున్న నీకు తప్పక వివాహం అవుతుంది "అని శపించింది. గణపతికి కూడా కోపం వచ్చి "అనవసరం గా నన్ను శపించావు కనుక రాక్షస భార్యవై జన్మిస్తావు. తర్వాత వృక్ష రూపం పొందుతావు "అని ప్రతిశాపం ఇచ్చాడు. ఆమెకు పశ్చాత్తాపం కలిగి గానేషుని ప్రార్ధిస్తే, "వృక్ష రూపం పొందినా, లోకారాధ్యురాలవు అవుతావు. శ్రీ నారాయనార్చ దివ్య కుసుమం నువ్వు. నీ దళాలతో చేసిన పూజ ప్రజలకు ముక్తిని ప్రసాదిస్తుంది "అని శాప విమోచన కల్గించాడు.

ఆ తర్వాత జన్మలో తులసి శంఖచూడుడు అనే రాక్షసుని భార్య అయింది. శంఖ చూదుని ఆగడాలు భరించ లేక శివుడు అతన్ని త్రిశూలం తో సంహరించాడు. తన కలాంశ తో ఆమె తులసి వృక్ష రూపం పొంది అందరి ముక్తికీ కారకురాలు అయింది. అందుకే తులసి దళం తన పూజకు పనికి రాదనీ గణపతే చెప్పుకొన్నాడు. a వినాయక చవితి నాడు గనేశుని పూజకు తులసి దళాలు నిషిద్ధమయాయి. శ్రీ కృష్ణ గణేశులు అభిన్నులై లోకారాధ్యులైనారు. ఇప్పుడు శ్రీ కృష్ణ పరబ్రహ్మ తత్త్వం గురించి తెలుసు కొందాం.

గోలోకంమండలా కారం  గా వుంటుంది. ప్రళయ సమయం లో శ్రీ కృష్ణుడు మాత్రమే శేషించి ఉంటాడు. మురళి ధరించి, శ్రీ వత్సాన్కిట వక్షస్థలం పై కౌస్తుభం తో ప్రకాశిస్తూంటాడు. ఆయనే పరబ్రహ్మ., పురుషోత్తముడు. ఎప్పుడూ "కిషోర "వయసు లోనే ఉంటాడు. గోపా వేష ధారియై, గోపీ జనం తో పరివేష్టించి ఉంటాడు. పరిపూర్ణుడై, సర్వ వ్యాపియై ప్రవర్తిస్తాడు. "సదారాసా మండల విహారి ".సర్వ సిద్ధి స్వరూపుడు. సర్వ సిద్ధి ప్రదాత. ఆదిపురుషుడు, అవ్యక్తుడు.

శ్రీ కృష్ణుని దక్షిణ పార్శ్వం నుంచి సత్వ రాజస్, తమోగుణాలు, వాటి నుంచి మహస్సు, అహంకారం, పంచ భూతాలూ, పంచ జ్ఞానాలు ఏర్పడ్డాయి. తరువాత నారాయణుడు జన్మించాడు. ఆయన భార్య లక్ష్మి దేవి. వామ పార్శ్వం నుంచి "సదాశివుడు "జన్మించాడు. పంచ ముఖాలు కలిగి దిశలే వస్త్రాలుగా, సకల సిద్దేశ్వరునిగా,గురువులకే గురువు గా ఆయన ప్రవర్దిల్లాడు. ఆయన మృత్యుంజయుడు, మృత్యు స్వరూపుడు కూడా. శ్రీ కృష్ణ నాభి కమలం నుంచి మహా తపస్వి బ్రహ్మ ప్రభావించాడు. చతుర్ముఖాలతో, కమండల, జపమాలతో, ప్రకాశించాడు. దేహధారులకు జన్మ దాత. సరస్వతీ వల్లభుదయాడు. శ్రీ కృష్ణ వక్షస్థలం నుంచి "ధర్మ దేవత "పుట్టాడు. సర్వజీవులపై సమభావం కలవాడు. ధర్మ దేవుని వామ భాగం నుంచి "మూర్తి "అనే స్త్రీ జన్మించి యముని భార్య అయింది. శ్రీ కృష్ణుని ముఖం నుంచి వీణా పుస్తక దారిని, షోడశ వర్ష కన్య సరస్వతి" జన్మించింది. శ్రీకృష్ణుని మనసు  నుంచి "శ్రీ మహాలక్ష్మి ',బుద్ధి నుంచి మూల ప్రకృతి "ఈశ్వరి "జన్మించారు. ఈశ్వరి ఏ సర్వ శక్తులకు మూలం. వేయి భుజాలతో, భయంకరం గా దుర్గతి నాశిని "దుర్గ "భాసించింది. శ్రీ కృష్ణుని శక్తి స్వరూపమే దుర్గ. శ్రీ కృష్ణుని జిహ్వాగ్రం నుంచి వేదమాత "సావిత్రి " ఉద్భవించింది. కృష్ణుని మనసున్నుంచి సమస్త ప్రాణులను మధించే మన్మధుడు, అతని వామ భాగం నుంచి "రతీదేవి "జన్మించి భార్య అయింది.

శ్రీ కృష్ణ వీర్యం జలం లో పడి సహస్ర దైవ సంవత్సరాల తర్వాత గొప్ప అండం గా మారి "విరాత్పురుషుడు "జన్మించాడు. విశ్వానికి ఆయనే ఆధారం. చెవులనుండి మధుకైటభులు జన్మించి, బ్రహ్మను మింగేయాలని ప్రయత్నిస్తే నారాయణుడు చక్రాయుధం తో సంహరించాడు. వాళ్ల కొవ్వు నుంచి ఈ పృథ్వి ఉత్పన్నమైంది అందుకే భూమికి "మేదిని "అని పేరు వచ్చింది. భూమి యొక్క అధిష్టాత్రి దేవి పేరు "వసుంధర ".శ్రీ కృష్ణ వామ భాగం నుంచి, "రాధ "జన్మించింది. ఆమె కూడా సదా "కిషోర "వయస్క. ఆమె రోమాలనుండిగోపికలు, శ్రీ కృష్ణ రోమాలనుంచి "గోపాలురు "జన్మించారు. వీరు రాదా క్రిష్ణులకు "పార్శ్వదులు ".వీరు రాధను, కృష్ణుని పోలి వుంటారు. నిత్య యవ్వనులు. రాదా కృష్ణులు ప్రేమైక జీవులు.

శ్రీ కృష్ణ గుహ్య ప్రదేశం నుంచి కుబేరుడు, భూత ప్రేత, పిశాచాదులు, కుడి కంటి నుంచి ప్రమద గణాలు, ఎడమ కంటి నుంచి "ఈశానుడు "పుట్టారు. బ్రహ్మ దేవుడు శ్రీ క్రిష్ణానుగ్రహం తో విశ్వ సృష్టి చేశాడు. బ్రహ్మ నాభి నుంచి "విశ్వకర్మ "అష్టవసువులు,, మనసు నుంచి సనకస, సనందన, సనాతన సంత్కుమారులు, ముఖం నుంచి "స్వయంభు మనువు ",లలాటం నుంచి ఏకాదశ రుద్రులు, ప్రభవించారు. అనావృష్టి చివర "నారదుడు "పుట్టాడు. పుట్టగానే నీరు ను లోకానికి ఇచ్చాడు కనుక నారదుడు అని పిలువ బడ్డాడు. నారం అంటే నీరు, జ్ఞానం అని అర్ధాలు. రెండూ, ఆయనకు వర్తిస్తాయి. బ్రహ్మ కంఠం నుంచి పుట్టిన వారే "నరదులు "అంటే నరులు.. ఇలా శ్రీ కృష్ణ పరబ్రహ్మ తన నుంచి అఖిల ప్రపంచాన్ని సృష్టించి, పరిపాలించి, తన లోనే లయం చేస్తాడు అని "బ్రహ్మ వైవర్త పురాణం --శ్రీ కృష్ణ ఖండం "లో చెప్పబడింది. కృష్ణ అంటే "సర్వ చరాచర కొటులలో ఆత్మ అయిన వాడు "అనీ, ఆదివాచకం అనీ అర్ధం. అంటే సర్వులకు ఆయనే ఆది పురుషుడు.

శ్రీ కృష్ణ, శ్రీ గణేశ జయంతులు ఒక్క రోజు తేడాతో దాదాపు ఒకే నెలలో వచ్చినట్లే. సెప్టెంబర్ ఒకటి వినాయక చవితి కనుక. ఆ మహానుభావులను స్మరించి, అర్చించి జన్మ సాఫల్యం చేసుకొందాం. సిద్ధి, బుద్ధులను ప్రసాదించే వాడు గనాదీశుడైతే "శరశ్చంద్ర ప్రభువు "అయిన శ్రీ కృష్ణుడు భారత భూమి పై అవతరించి, ధర్మ సంస్థాపన చేసి, గీతామృతాన్ని పంచి, భక్తీ జ్ఞాన, వైరాగ్యాలను తేటతెల్లం చేసి, ప్రేమను కురిపించి, అందరి హృదయాలను ఆకర్షించి, స్మరణ మాత్రం గా ముక్తి ప్రదాత అయాడు. అందుకే స్వామి త్యాగీశానంద, ఆ మహానుభావుడిని, పురాణ పురుషుడిని పూర్ణావతార స్వరూపుడిని "The first teacher in the historry of the world to discover and proclaim the grand truth of love for love's sake and duty for duty sake "."అంటే ప్రేమ ప్రేమ కొరకు, విధి కర్తవ్య నిర్వహణకు అనే సత్యాన్ని ప్రపంచ చరిత్ర లో మొదట గ్రహించి, ప్రకటించిన ప్రధమ ఆచార్యుడు శ్రీ కృష్ణుడు "అని చాటి చెప్పిన దేశికుడు. అందుకే "కృష్ణం వందే జగద్గురుం ".

## భగవాన్ శ్రీ కృష్ణఉవాచ

ఇవాళ కూడా అస్టమి తిధి ఉంది -శ్రీ రిష్ణాష్టమి గానే భావిస్తారు. కనుక శ్రీ కృష్ణుడిని తలచుకొంటూ భగవద్గీత లో ఆయన చెప్పిన మాటలను 'భగవాన్ శ్రీ కృష్ణ ఉవాచ "ద్వారా తెలుసు కొందాం –

"యద్భావం తద్భవతి "మనం ఎలా కోరుకొంటే, అలా జరుగు తుంది. ఇదే positive attitude అంటే. దీన్ని అలవరచు కొని పనులను కౌశల్యం తో నైపుణ్యం గా శక్తి వంచన లేకుండా ఫలా పేక్ష రహితం గా చేయాలి. తాను అవతార పురుషుడిని అని ధర్మానికి హాని కల్గి నప్పుడు అవతరించి అధర్మాన్ని నాశనం చేసి, ధర్మాన్ని ప్రతిష్టిస్తానని చెప్పాడు. ఈ పనిని నేను చేయటం లేదు. కర్మేంద్రియాలు సహజ సిద్ధం గా వాటి పని అవి చేసుకొని పోతున్నాయి. అందులో నా ప్రమేయం లేదు అను కోవటమే "కర్మ సన్యాసం ".కర్మ యోగం అనుస రించ కుండా, కర్మ సన్యాస యోగం ఆచరింప లేరు. మరి కర్మను త్యజించటం అంటే ?ఎవడు ఎవరినీ ద్వేషించడో, దేన్నీ కోరుకోడో అలాంటి కర్మ యోగి నిత్య సన్యాసి గానే భావింప బడుతాడు. సకల ప్రాణుల్లో ఆత్మ స్వరూపుగా భగ వంతుడే ఉన్నాడని భావించే వాడికి కర్మలు బంధనాలు కావు. సత్కర్మ లను నిష్కామ బుద్ధి తో చేస్తే లోక కల్యాణం జరుగుతుంది. వ్యక్తి అభ్యున్నతి వల్ల సమాజం లో సచ్చీలురైన జనం తయారవు తారు. అప్పుడు సమాజం ధర్మ బద్ధం గా ఉంది, లోక కళ్యాణ కారకమవుతుంది. వ్యక్తీ వికాసమే అభ్యుదయానికి మూలం.



కోర్కెలు గుర్రాల వంటివి. అవి యధేచ్ఛగా అటూ, ఇటూ పరి గెత్తు తూ ఉంటాయి. వాటిని కళ్ళెం అనే మనసు తో బుద్ధి అనే ఆశ్వారూఢుడు బంధించి జాగ్రత్త గా నడ పాలి. బుద్ధి చేత మనసును నిగ్ర హించు కొని కోర్కెలను అదుపు లో ఉంచుకోవాలి. ధ్యానం వల్ల మనో నిగ్రహం లభిస్తుంది. దానిద్వారా ఇంద్రియ నిగ్రహం లభిస్తుంది. అప్పుడు మనస్సు ప్రశాంతి పొంది, ఆత్మోన్నతి కలుగు తుంది. చేసే సాధన ఎప్పుడూ వృధా కాదు. దాని ఫలితం తప్పక లభిస్తుంది. ఈ జగత్తు అంతా దారం తో కూర్చ బడిన మణులు లాగా పరమాత్మ ధరించాడు. నీటి లోని రసం, చంద్రుని లో ని కాంతి, నాలుగు వేదాలలోని ఓంకారం, ఆకాశం లోని శబ్దం, పురుషులలో పురుషత్వం అన్నీ ఆయనే. భూమి లోని గంధం ( substance),జాలం లోని రసం (fluid ),అగ్ని లోని తేజస్సు (heat and light ),వాయువు లోని ప్రాణ వాయువు(oxygen ),ఆకాశం లోని శబ్దం (sound ),పురుషుని లోని పురుషత్వం (manliness ), తపోధనుల లోని తపశ్శక్తి అంత తానే నని చెప్పాడు. "ప్రయాణ కాలే ఆపి చ మం తె విదుర్యుక్త చేతసః "-ఎవరు మరణ కాలం లో కూడా భాగ వంతుని ధ్యానిస్తారో వారు ఆయన సన్నీ దానానికే చేరుతారు. మరణకాలం లో పుట్టే భావాలే మరో జన్మ కు కారనభూతాలవుతాయి. జడ భరతుడు అనే ముని తపో నిష్ఠ లో ఉంది కూడా, తాను ప్రేమించి, పెంచిన జింక మీద మరణ సమయం లో కూడా దానినే ఆలోచిస్తూ ప్రాణాలు విడి చాడు. మళ్ళీ జన్మ లో జింక గా పుట్టి, జన్మ బంధం నుండి విముక్తి పొంది, ఆ తర్వాత జన్మ లో ఉత్తమ గతి ని పొందుతాడని భారత భాగవతాలు చెప్పాయి.

భక్తులు నాలుగు రకాలు. ఆర్తుడు అంటే కష్టాల్లో ఉన్న వాడు. అర్ధార్ది అంటే ధనం, సుఖం వంటివి కోరుకొనే వాడు. జిజ్ఞాసి అనగా తత్వ రహస్యాలను తెలుసుకోవాలి అనుకునే వాడు. నాల్గవ వాడు -జ్ఞాని అంటే -పరమాత్మ తత్వాన్ని పూర్తిగా తెలుసు కొన్న వాడు. బ్రహ్మం అంటే వినాశ రహితమైనది. ఆధ్యాత్మం అంటే చేతనం కల జీవాత్మ. కర్మ అంటే త్యాగం తో చేసే పని. అది భూతం అంటే నశించే పదార్ధం. ఆది దైవం అంటే విరాట్పురుషుడు. అధి యజ్ఞం అంటే -దేహం లోని పరమాత్మ. మరణ కాలం లో స్పృహ ఉంటుందో లేదో, భాగ వంతున్ని స్మరించ గలమో లేదో -కనుక జీవించి నంత కాలం భగవంతున్ని స్మరిస్తూనే ఉండాలి. తన భక్తులేవరు దుర్గతి చెందరు అని శ్రీ కృష్ణుడు చెప్పాడు. చెడ్డ వారైనా, మనసు పరి వార్తన తో తనను శ్రద్ధా స క్తులతో సేవిస్తే తప్పక సద్గతిని పొందుతారని అభయమిచ్చాడు. ఒక సారి గోపికల తో రాధ యమునా నదీ తీరాన కూర్చుని ఉంది. ఆమె మనసంతా శ్రీ కృష్ణ ధ్యాన మగ్నమై ఉంది. నారద మహర్షి అక్కడికి

వచ్చాడు. ఆయన తన వీణ అయిన మహతి పై భగవన్నామం పలికిస్తున్నాడు. రాధను చూసి “అమ్మా !కృష్ణుడు లేదని బాధ పడుతున్నావా ?”అని అడిగాడు. అప్పుడు రాధ “కృష్ణుడు నా హృదయం లోనే ఉన్నాడు కదా ఆయన లేనిది ఎక్కడ ?ఆయన లేడని బాధ పడితే,నా హృదయం లోని దేవుడికి ఆ బాధ కలిగించి నట్లే కదా ""?అన్నది. నారదుడు రాధ లోని అనన్య భక్తికి పొంగి పోయాడు.రాధ తన హృదయ దేవాలయం లో శ్రీ కృష్ణ పరమాత్మ ను ప్రతిష్టించి, అను క్షణం ధ్యానిస్తూ తపో సిద్ధి పొందిన ధన్యు రాలు. అదీ నిరంతర ధ్యానం అంటే. కుచేలుడు శ్రీ కృష్ణుని స్నేహితుడు, ఆయన దరిద్రం తో బాధ పడుతూ భార్య మాట మీద ద్వారక కు వెళ్లి పిడికెడు అటుకులు సమర్పిస్తే అష్టైశ్వర్యాలు స్నేహితునికిచ్చిన మహాత్ముడు కృష్ణుడు. అంతే కాదు తన అష్ట భార్య లతో కలిసి కుచేలునికి సపర్యలుచేసి,, తాను పడుకొనే మంచం మీద ఆయన్ను పడుకో బెట్టి, కాళ్ళను ఒత్తిన కారుణ్య మూర్తి. స్నేహానికి నిలు వెత్తుఅద్దం గా భాసించాడు. గురువు సాందీపుని పుత్రుడు మరణిస్తే వేది కి అతన్ని పునర్జీవితున్ని చేసి తీసుకొని గురువుకు అప్పగించి గురు దక్షిణ సమర్పించిన ఉత్తమ శిష్యుడు. తనను నమ్మిన గోప గోపికలకు సమస్తమూ తానే అయి కాచి కాపాడిన రక్షకుడు. చెలికాడు. అధర్మ పరుడైన మేన మామ కంసుడినిసంహరించి ధర్మాన్ని రక్షించిన వాడు. సంపూర్ణ విశ్వాసం తో ఆయనను ధ్యానించిన వారి యోగ క్షేమాలను ఆయనే చూసుకొంటాడు. ఈ విశ్వం లో ఎక్కడెక్కడ గొప్పతనం ఉంటుందో అదంతా ఆయన విభూతియే. అర్జునుడికి తన విశ్వ రూపాన్ని చూపించి విభ్రాంతికి గురి చేశాడు. దాన్ని ఉప సంహరించి అతని భ్రాంతిని తొలగించాడు. చరాచర ప్రపంచం అంతా పరమేశ్వరుని లీలా వినోదమే నని గ్రహించాలి.



సత్యాన్వేషణ తో జీవించటమే, ప్రేమ, కలిగి ఉండటమే భక్తినే ప్రమిద చేసి, ఆర్తి ని నెయ్యిగా మనస్సునేవత్తి గా, అజ్ఞానం అనే చీకటిని పోగొత్తే, పరా భక్తీ అనే ఉజ్వల దీపాన్ని వెలిగించి భగవంతునికి మన హృదయాన్ని సమర్పణ చేయాలి. ఇదీ భక్తీ లోని పరమార్ధం. జీవుడు పరమాత్మ అంశ, పరమాణువు, కాంతి పుంజం. “తత్వమసి “అంటే నువ్వే నేను అనే బావం తో పరమాత్మను చేరాలి.ప్రకృతే తల్లి. పరమాత్మ తండ్రి. త్రిగునా లను దాటి పరమాత్మను చేర వచ్చు. సంసారం అనేతిరుగ బడిన అశ్వత్థ వృక్షానికి మూలము పరమాత్మ. కొమ్మలు కోరికలు. చిగుళ్ళు మొదలైనవి ఫలితాలు. వివేకం, వైరాగ్యం అనే ఖడ్గం తో సంసార బంధనాన్ని చేదించి, కోర్కెల నుండి విముక్తి పొంది ఆత్మ తత్త్వం తో స్తిర పడాలి ఈ వైరాగ్యమే మోక్షం. మంచి గుణాలు కలిగి దైవ చింతన చేసే వారికే ఉన్నతి కలుగుతుంది. పూజ. పునస్కారాదులు భగవంతుని చేర్చలేవు. దయా, సానుభూతి, అహింస, సత్యం, అన్నిటిలో భగవంతుని చూసే చూపు, సాత్విక గుణాల వల్లే భగవద్దర్శనం సాధ్యం. ఎవరూ చెప్పని గొప్ప సిద్ధాంతాన్ని కృష్ణుడు చెప్పాడు “సర్వ ధర్మాన్ పరిత్యజ్యా “అన్నాడు. అన్నిటిని వదిలేసి తనను శరణు వెడితే తానే అన్నిటినీ చూసుకొంటాను అన్నాడు. అదే భగవద్గీత పర మార్ధం. ఏక్కడ ధర్మార్ది అయిన అర్జునుడు ఉంటాడో, అంటే ధర్మం చేయాలను కొనే వారు ఉంటారో అక్కడ సంపద,, విజయం ఐశ్వర్యం స్తిర మైన నీతి ఉంటాయి. శ్రీ కృష్ణుడుగొప్ప రాజ కీయ దురంధరుడు. గొప్ప డిప్లొమాట్. అందరి కళ్ళకు ఆనందాన్ని, జ్ఞానాన్ని కల్గించే వాడు. విధి విధి నిర్వహణ కోసమే నని చాటిన వాడు. “The lord of Autumn moon “శరశ్చంద్ర ప్రభువు శ్రీ కృష్ణ పరమాత్మకు ఈ కృష్ణాష్టమి సందర్భం గా నమస్కరిద్దాం.

## మధురం మధురం మాధవ నామం



శ్రీ కృష్ణుడు ఉద్భవించిన చోట ఉత్తర ప్రదేశ్ లోని మధుర లో ఆయన జన్మించిన చెరసాల చుట్టూ శ్రీ కృష్ణాలయం నిర్మించారు. కేశవ దాసాదేవాలయం దాటగానే కృష్ణాలయం వస్తుంది. ప్రక్కనే మసీదుకూడా ఉంటుంది మొట్టమొదటి ఆలయాన్ని వజ్ర నాభుడు నిర్మించాడు అది దెబ్బతింటేతర్వాత విక్రమాదిత్య మహారాజు పునర్నిర్మించాడు మహమ్మదీయ దండ యాత్రలో ఈ దేవాలయం 17 సార్లు ధ్వంసమైంది ధ్వంసమైన ప్రతిసారీ కొత్త ఆలయాన్ని నిర్మించారు.

శ్రీకృష్ణుడు పరిపూర్ణ అవతారం స్వయం భువు. సాక్షాత్తు శ్రీ మహా విష్ణువే శ్రీ కృష్ణ రూపం లో ద్వాపర యుగం కంస శిశుపాలాది దుష్ట రాక్షసగణాలను సంహరించి ధర్మ సంస్థాపనకోసం ఉద్భవించాడు శ్రావణ బహుళ అష్టమి నాడు శ్రీ కృష్ణ జయంతి. గోవింద, ముకుంద వాసుదేవ అని ఆయన్ను మనసారా భక్తజనం పిలుచుకొంటారు. మనసులను ఆకర్షించేవాడుకనుక కృష్ణుడు.. శ్రీకృష్ణ, వాసుదేవ బాలకృష్ణ, గోపాల మూర్తిగా క్రీ. పూ.4 వ శతాబ్దినుంచి పూజలు అందు కొంటున్నట్లు చరిత్రకారులు అంటారు. కృష్ణుని స్వయంభువుగా భావించ టాన్ని "కృష్ణ తత్త్వం "అన్నారు ఇది మధ్యయుగం లో భక్తి మార్గం పరిపక్వంగా ఉన్నప్పుడు బాగా వ్యాపించింది 10 శతాబ్దం నుండి శిల్పాలలో చిత్రలేఖనం లో క్రిష్ణాకృతులకు ప్రాధాన్యం పెరిగింది. ఒరిస్సాలో ని పూరీ క్షేత్రం లో శ్రీ జగన్నాధ దేవాలయం ఈ ప్రభావం తో నిర్మించబడింఅలాగే మహారాష్ట్రలో విఠోబా అనే పాండురంగని ఆలయం రాజస్థాన్ లో శ్రీనాద్ దేవాలయం ఏర్పడ్డాయి 19 60 తర్వాత పాశ్చాత్య దేశాలలో కృష్ణా కాన్షస్ బాగా పెరిగి అనేక దేవాలయాలు నిర్మించబడ్డాయి అంతర్జాతీయ కృష్ణా కాన్షస్ సంస్థ చాలా ప్రాచుర్యం పొందింది దీనినే "ఇస్కాన్ "అంటారు

సాధారణం గాశ్రీ కృష్ణ విగ్రహాలు నల్ల రాతితో తయారు చేసేవారు. కాలక్రమేనణా నలుపు తగ్గించి నీలం రంగు వాడుతున్నారు అసలు ఆయన రంగుకు "జమ్బూల్ "అనిపేరు దీన్నే జామున్ అంటారు అది "ఊదా రంగు (పర్పుల్ కలర్ )ఫలం జంబూ ఫలానికి ఉన్న నాలుగు చిహ్నాలలోరెండు శ్రీకృష్ణుని కుడి పాదం పైన ఉన్నట్లు వాటిని శ్రీ రూప చింతామణి, ఆనంద చంద్రిక అంటారని శ్రీ మద్భాగవతానికి వ్యాఖ్యానం రాస్తూ శ్రీల విశ్వనాధ చక్ర వర్తి ఠాకూర్ తెలియ జేశారు

సింద్ లోని లర్కానా జిల్లాలోని మొహెన్జ దారో "లో దొరికిన ఒక ఒక షోప్ స్టోన్ శిలాఫలకం పై యమలార్జున గర్వ భంగం అంటే రెండు మద్ది చెట్లను నడుముకు కట్టిన రోటి తో ధ్వంసం చేసిన బాలక్రిషణ మూర్తి శిల్పం బయట పడింది అంటేసింధు నాగరకత కాలం నాటికే శ్రీ కృష్ణ కధలు బహుళ ప్రచారం లో ఉన్నాయి అని పురా తత్వ వేత్తలు వి ఎస్ అగర్వాల్ లాంటి వారు నిర్ణయించారు కృష్ణుడిని బాల కృష్ణు నిగా లేక రాదా కృష్ణుని గా యవ్వన దశలో ఉన్న విగ్రహాలు ఎక్కువ. ఆయన నిలబడి మురళి వాయిస్తూ వ్యత్యస్త పాదం తో కనిపించటం గొప్ప అనుభూతిని కలిగిస్తుంది చుట్టూ గోవులు గోపాలురు గోపికలు పర్య వేష్టించి ఉంటారు ఈ త్రిభంగిమ "లో కనిపించే కృష్ణుడిని " పశుపాలకుడైన దేవదేవునిగా భావించి గోవింద అని గోపీ కృష్ణా అని ఆత్మీయంగా పిలుచుకొంటారు అయన చిలిపి చేష్టలకు గుర్తుగా వెన్న నవనీత చోరా, గోకుల కృష్ణ, కాళీయ మర్దన గిరిధర గోపాల అని పిలుచుకొని మురిసిపోతారు.

ఉత్తర ప్రదేశ్ లోని మీర్జాపూర్ జిల్లా మీర్జా పూర్ లో త్రవ్వకాలలో దొరికిన శిల్పాలు శ్రీ కృష్ణుని కురుక్షేత్ర సంగ్రామానికి చెందినవి. ఇవి క్రీ పూ.800కాలానివి. అస్త్ర శస్త్ర దారిగా అర్జున రధ చోదకుడిగా చేతిలో చేన్నా కోలతో గుర్రాలను అదిలిస్తూ కనిపిస్తాడు.. ఈ కృష్ణుడిని, పార్ధ సారధిగా కొలుస్తారు.

క్రిష్ణకధలు భారత భాగవత, హరివంశ పురాణాలలో నిక్షిప్తమై అక్షర బద్ధమైనాయి రుగ్వేదం లోని 1-22-164 లో 31 వ సూక్తం లో చెప్పబడిన పశుపాలుడు శ్రీ కృష్ణుడే అని శ్రీ భక్తి వినోద ఠాకూర్ అభిప్రాయ పడ్డారు క్రీ పూ..8 నుంచి 6 వ శతాబ్దాలకు చెందిన ఛాందోగ్య ఉపనిషత్ లో 3-17 -6 సూక్తం లో వాసుదేవ కృష్ణుడు దేవకీ కుమారుడు అని ఘోర అంగీరసుని శిష్యుడని పేర్కొన బడింది క్రీ పూ 6 వ శాతాబ్దికి చెందిన యాస్కుని నిరుక్తం అక్రూరుని వద్ద శ్యమతక మణి ఉన్నట్లు శత పద బ్రాహ్మణం ఐతరేయ అరణ్యకాలలో కృష్ణుడిని వృష్ణి వంశ సంజాతునిగా చెప్పాయి క్రీ పూ 5 లేక 6 శతాబ్దాలలో ఉన్న పాణిని తన అష్టాధ్యాయి లో వసుదేవుని కుమారుడు వాసుదేవుడని అర్జున కౌరవు లగురించి చెప్పాడు అంటే కృష్ణునికి అర్జునికి కౌరవులకు సంబంధం ఉందని తెలుస్తోంది

ఇంతటి విస్తృత ప్రచారం ద్వారకా నాధుడు మధురా వల్లభుడు ద్రేపల్లె నందవంశ బాల కృష్ణు డికి ఉంది భారత యుద్ధం లో అర్జునికి కర్తవ్య బోధ చేసి గీతాచార్యుడై "కృష్ణం వందే జగద్గురుం "అని అందరి మొక్కులు అందు కొంటున్నాడు

## కృష్ణం వందే జగద్గురుం

శ్రీమన్నారాయణుని షోడశ కళల పరిపూర్ణ అవతారమైన శ్రీకృష్ణుడు అవతరించిన శ్రావణ బహుళ అష్టమి పుణ్యతిథి శ్రీకృష్ణాష్టమిగా జరుపుకోవటం సంప్రదాయం. దశావతారాలు ఇంతటి వైవిధ్య భరితమైనది, ప్రముఖమైనది మరొకటి లేదు. శ్రీకృష్ణుడు జన్మించిన వెంటనే దేవకీ వసుదేవులకు తన నిజరూప దర్శన ప్రాప్తి కలిగించాడు. తన అవతార రహస్యం చెప్పాడు. ఆ తర్వాత కార్యమైన తనను గోకులానికి చేర్చటం, యశోద పుత్రికను తెచ్చి దేవకి దగ్గరలో పరుండబెట్టటం ఇత్యాది భావి కార్యాచరణకు ఆదేశమిచ్చాడు. పుట్టినది మొదలు గోకులం, యమునాతీరం, బృందావన ప్రాంతాలు అన్నీ ఆ చిన్నారి చిద్రూపుని విహార భూములయ్యాయి. ఈ అమాయక గోపబాలుడు వెన్నదొంగ అయి ఎన్నో అలౌకిక దివ్యలీలలు ప్రదర్శించాడు. భక్తాగ్రగణ్యులైన గోపికలు కృష్ణుని భౌతిక దృష్టితో దేవకీవసుదేవుల పుత్రుడిగా కాక ఆత్మదృష్టితో దర్శించి ఆరాధించారు. అఖిల దేహినా మంతరాత్మదృక్ అని భావగత పురాణం వివరించినట్లు సకల ప్రాణులలోను అంతర్యామియై ఉన్నవాడనే భావనతోనే చూశారు. వారికి జన్మాంతర బంధమున్నది. ధర్మసంరక్షణార్థం మహావిష్ణువు కృష్ణుడుగా అవతరించినప్పుడు, ఎందరో మహర్షులు, దేవతలు గోపగోపీ జనులుగాను, ఆదిశేషుడు బలరామునిగాను ఆ ఆదిదేవుని అనుసరించి జన్మించిన వారే!



ఆ బాలకృష్ణుని దివ్యలీలా చేష్టలకు పరవశించి, కలవరించి, కవులెందరో ఆ వేణుగానలోలుని గుణగణాలను గానంచేసి తరించారు. మన తెలుగు వారికి కృష్ణుని పేరు చెప్పగానే స్ఫురించేది పోతనగారి భాగవతమే! భక్తికి మరోపేరు భాగవతంగా ప్రసిద్ధి పొందటానికి కారణం మందారమకరంద సదృశమైన శైలిలో, సుందర పదబంధ భరితమైన పోతనగారి తెలుగు పద్యాలే. కవిత్వాన్ని కైవల్య సాధనంగా చేసుకొని మధురమైన భక్తిమార్గంలో పయనించి తరించిన భాగవతోత్తముడు పోతన.

తెలుగునాట పోతన పద్యం లాగా ఉత్తరాన సూరదాస్‌కీర్తనలు బహుళప్రాచుర్యం పొందినవి. ఇవి భాగవతంలోని కథలను వర్ణించినా, దశమస్కందంలోని కృష్ణ లీలలను తనివితీరా పాడుకొన్నాడు సూరదాస్. వంగ సాహిత్యాన్ని శ్రీకృష్ణ చైతన్యంతో పునీతమొనరించిన వాడు చైతన్య మహాప్రభు. మహారాష్ట్రులకు పండరిపురంలో వెలసిన పాండురంగడే పరమ ఆరాధ్యుడు. ఏకనాథ్, తుకారం, నాందేవ్ లాంటి కవులు శ్రీకృష్ణ కవితా లహరిలో తడిసిన వారే. గుజరాతీలో నరసిమెహతా రచనలు ప్రసిద్ధి పొందాయి. శ్రీకృష్ణుడే ధ్యాసగా, శ్వాసగా తన్మయం చెంది గానం చేసిన మీరాభజనలు యావద్భారతావనిని మధుర భక్తి లహరిలో ఓలలాడించాయ. కృష్ణతత్త్వ ప్రతిపాదిత గ్రంథాలలో జయదేవుని గీతగోవింద ప్రాశస్త్యం ఇంతింతనరాలేము కదా. అటులనే లీలాశుకుని కృష్ణ కర్ణామృతం, నారాయణ తీర్ధుల కృష్ణలీలా తరంగిణి మకుటాయమానంగా భాసించే మహత్తర మధుర కావ్య కల్పతరువులు.



శ్రీకృష్ణుడు తన అవతారంలో చూపిన లీలా వినోదా లన్నింటిలోకి రాసలీల మధురాతిమధురం. భాగవతంలో రాసలీలలు 5 అధ్యాయములలో వర్ణితాలైనవి. దీనినే రాస పంచాధ్యాయి అంటారు. బహుజన్మ కృత పుణ్యఫలంగా గోపికలను కృష్ణ పరమాత్మతో తదాత్మ్యం చెందే భాగ్యం లభించింది. అదే రాసలీలా పరమార్థంగా సంభాషించాలి. అనురక్తికే కాక భక్తికి సుందర అభివ్యక్తిగా నిలిచింది రాధ. మధురాధిపతే రఖిలం మధురం అని మాధుర్య రసాధిపతి అయి భాసించినవాడు కృష్ణుడు. పరా ప్రకృతిగా భాసించినది రాధ. పైకి శృంగారంగా కనపడినా జీవాత్మ పరమాత్మల సంయోగం కోసం అంతరచైతన్యం కోరుకునే భగవద్రతి అది. భాగవతంలో కనిపించే గోపికల ప్రణయ తత్త్వమూ ఇదే! రాధా తత్త్వాన్ని ఉపాసించి కృష్ణానుగ్రహాన్ని సులభంగా పొందవచ్చని అంటారు. శ్రీకృష్ణ్భగవానుడు తన అనంతముఖ అవతార రహస్యాలను మూడు ముఖ్య దశలలో విశదపరిచాడు. మొదటిది బాల్యదశ. వెన్నదొంగగా మారి, గోపాలకుడై నందకులాన్ని వందనీయం చేశాడు. బృందావనానికి మారటం కాళీయమర్దనం, తదుపరిదైన యవ్వనాంకురదశ, బృందావనం తరువాత 'ప్రౌఢ నిర్భర పరిపాక దశ'. అష్ట మహిషులతో పరిణయం, కురుపాండవుల సంగ్రామం, గీతాబోధ. ఇది ప్రపంచానికి కర్తవ్య బోధ. ఇక రుక్మిణీ కల్యాణం, సత్యభామ పరిణయం ఇవన్నీ తెలిసినవే. కలడో లేడో అనే సంశయం లేకుండా అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు శ్రీకైవల్య పదాభి లాషులందరి హృదయాలలోనూ వెలసే ఉన్నాడు. అలా వెలసి ఉన్న వాడిని తెలుసుకోవడమే జన్మ సార్ధకత.(ఆంధ్ర భూమి )

బిల్వమంగళుడు లీలాశుకమహర్షియై శ్రీ కృష్ణ కర్ణామృతం మధుర భక్తికి పరాకాష్ట గా రాశాడు. మొదటి శ్లోకంలో

"చింతామణి ర్జయతి సోమగురుర్మే-శిక్షా గురుశ్చ భగవాన్ శిఖి పింఛమౌళిః

యత్పాద కల్పతరు పల్లవ షేఖ రేషు –లీలాస్వయం వరరసం లభతే జయశ్రీః"

అంటే –శ్రీ కృష్ణ కర్ణామృత కావ్య రచనలో నాకు మార్గ దర్శి అయిన చింతామణికి, నాకు దీక్షా గురువైన సోమ గిరికినమస్కరిస్తున్నాను. కల్ప వృక్షం తమ చిగురాకుల కొనలవద్ద లక్ష్మీ దేవిని అలంకరించుకొని విలాసంగా కన్పిస్తోంది ఆ కల్ప వృక్షం లాంటి పాదాలతో విరాజిల్లుతూ నెమలి పించం ధరించి ఉన్న నా శిక్షా గురువైన శ్రీ కృష్ణునికి కూడా నమస్కరిస్తున్నాను

శ్రీ కృష్ణ కర్ణామృత శ్లోకాలు ఉత్తర, దక్షిణ భారతాలలో విరివిగా వ్యాప్తి చెందాయి సంగీత భజన సభలలో ఆలపిస్తారు తాళ లయాన్వితంగా ఉండటం తో వీటిని నృత్యాభినయానికీ చక్కగా వినియోగిస్తారు. మూడు ఆశ్వాసాల కర్ణామృతం నిజంగానే చెవులకు అమృతమే. 4 వ శ్లోకం భావ మాధుర్యాన్ని జొన్నలగడ్డ పతఙ్జలిగారు వివారించారు చూడండి

బర్హోత్తంస విలాస కుంతలభరం మాధుర్య మగ్నా ననం –ప్రోన్నీ లన్నవ యౌవనం, ప్రవిల సద్వేణుప్రణాదామృతం

ఆపీనన స్తన కుట్మళా భి రాభితో, గోపీభి రారాదితం –జ్యోతిశ్చేతసి నశ్చ కాస్తుజగతా మేకాభిరామాద్భుతం

భావం –లోకాలన్నితిలోని మనోహర వస్తువులకంటే, ఆశ్చర్య పదార్థాలన్నిటికంటే, ఆశ్చర్యమైనది గోపాల కృష్ణుని దివ్య తేజస్సు శిర్సులో నెమిలి పించం ఉంటుంది బాలుడే అయినా సౌన్దర్యం లో పడుచువారి లక్షణాలు కనిపిస్తాయి మాధుర్య విలసిత మోము నుండి వీనుల విందైన మురలీనాడం వెలువడుతుంది. ప్రౌఢ గోపా కాంతలు నిరంతరం ఆయన చుట్టూ చేరి ఆరాధిస్తూ ఉంటారు. అలాంటి తేజో రూప గోపాలుని రూపం ఎప్పుడూ నా మనసులో ప్రకాశించాలి.

అందరు చెప్పుకొనే శ్లోకం “కస్తూరీ తిలకం “లీలాశుకునిది అని చాలామందికి తెలియదు.

“కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షస్థలే కౌస్తుభం –నాసాగ్రే నవ మౌక్తికం కరతలే వేణుఃకరేకంకణం

సర్వాంగే హరి చందనం చ కలయన్ కంఠేచ ముక్తావళీ—గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః

328 శ్లోకాలున్న ఈ స్తోత్ర మంజరి లో ప్రతిశ్లోకం కర్ణ రంజనమే. చివరగా లీలాశుకుడు

“లీలాశుకం రచితం తవ దేవ దేవ కృష్ణ కర్ణామృతం వహతు కల్పశతాంత రేపి “అని చెప్పాడు వంద కల్పాల

దాకాఅంటే నాలుగు యుగాల దాకా కావ్యం జీవించి ఉండాలని ఆకాంక్షించాడు. ఉంటుంది కూడా

లోకం లో కృష్ణుడిని “గోపాల సుందరి “గా అర్చించే విధానం ఉంది. ఆ మూర్తి జపానికి 33 బీజాక్షరాలున్నాయి. ఇందులో 18రాజ గోపాల మంత్రం లోని వైతే 15 శ్రీ విద్య లోని పంచ దశాక్షరాలు.

దక్షిణ ద్వారక లోని రాజా మన్నార్ గుడి దైవం శ్రీ రాజగోపాలుడు. ఆయన ధ్యానం “శ్రీవిద్యా రాజ గోపాలునిగా చేస్తారు స్వామి పాదాల చెంత శ్రీ చక్రం ప్రతిష్ఠితమై ఉండటం గొప్ప విశేషం ఆయన అలంకారం ఏమిటో తెలుసా ?మోహినీ అలంకారం అంటే మదన గోపాల సుందరి అలంకారం బ్రహ్మోత్సవాలు ఈ అలంకారం తోనే నిర్వహిస్తారు. లీలాశుకుడు ఈ మదన గోపాల సుందరి ని శ్రీకృష్ణ కర్ణామృతం లో 3 నుంచి 104 శ్లోకాల వరకు తనివితీరా బహు సుందర పదబంధం తో వర్ణించాడట

## శ్రీ రామ కర్ణామృతం

కంచి మఠానికిచెందిన పీఠాదిపతి శ్రీ శ్రీ బోధేంద్ర సరస్వతి గారికి శ్రీరామ సిద్ధాంతం పై మహా అభిరుచి ఉండేది వారు తమ పీఠాదిపత్యాన్ని ఐచ్ఛికంగా త్యజించి పదవీ విరమణ తర్వాత కుంభ కోణం దగ్గరున్న గోవిందాపురం గ్రామం వెళ్లి రామభక్తి సామ్రాజ్యం లో చిదానందాన్ని అనుభవిస్తూ “శ్రీ రామ కర్ణామృతం “అనే మహా గొప్ప స్తోత్ర రచన చేశారు. త్యాగ రాజస్వామికివీరు ముందు వారు. వీరి అనుయాయులు రామనామ సిద్ధాంతా న్ని కావేరీ పరీ వాహక ప్రాంతం లో విస్తృతంగా వ్యాపింప జేశారు. కావేరీనదీ ఉపనది అయిన వీరసోర్గన్ నదిలో స్వామివారు “జీవ సమాధి “ చెందారు. రామ కర్ణామృత శ్లోకాలు కృష్ణ కర్ణామృత శ్లోకాలలానే ఉండటం విశేషం. ఆ సొరు చూద్దాం –ముందుగా కృష్ణ కర్ణామృత శ్లోకం –

"హే దేవ హే దయిత, హే జగదేక బంధో-హే కృష్ణ హే చపల హే కరుణైక సింధో

హే నాధ హే రమణ, హే నయనాభి రామ –హాహా కదాను భవితాసిపధం ద్రుసోర్మే

ఇప్పుడు శ్రీ రామ కర్ణామృత మకరందం జుర్రుదాం

"హే రామ, హే రమణ హే జగదేక వీర –హే నాద హే రఘుపతే కరుణాలవాల

హే జానకీ రమణ హే జగదేక బంధో –మాం పాహి దీనం అనిశం కృపణం కృతజ్ఞం "

కృష్ణుడు పూతన పాలు తాగేటప్పుడు పాలతో పాటు ఆమె శరీరంలో వున్న పాపమును కూడా త్రాగేశాడు. పుణ్యమే మిగిలిపోయింది. అందుచేతనే ఆ శరీరం కాలిపోతుంటే అగరువత్తుల వాసన వచ్చింది. కృష్ణుడి కాళ్ళు చేతులు తగిలినంత మాత్రం చేత నిజంగా శ్రీమన్నారాయణునికి తల్లి వుంటే ఏ లోకములకు వెళుతుందో ఆ లోకములకు పూతన వెళ్ళిపోయింది. మరి అ 'పిల్లవాడు నా కొడుకు' అనే ప్రేమతో పాలిచ్చిన తల్లి ఏ స్థితికి వెళుతుందో! వాళ్ళు వెళ్ళే స్థితిని నేను చెప్పలేను అన్నారు పోతనగారు.



ఇది పూతన సంహార ఘట్టము. ఈ ఘట్టమును తాత్త్వికంగా పరిశీలించాలి. భాగవత దశమ స్కంధము ఉపనిషత్ జ్ఞానము. ఆవిడ పేరు పూతన. అమరకోశం 'పునాతి దేహం పూతన' అని అర్థం చెప్పింది. దేహమును పవిత్రముగా చేయుడానికి పూతన అని పేరు. మనకి సంబంధించిన ఒక వస్తువును చూపించి ఎవరిదీ అని ప్రశ్నిస్తే నాది అని చెపుతాము. అయితే ఇప్పుడు నేను అనబడే నువ్వు ఎవరు? దానికి జవాబు మనకే తెలియదు. అదే పెద్ద అజ్ఞానము. 'నేను నేను' అంటున్నది ఏది? అంటే తెలియక ఆ 'నేను'ని చీకటితో, అజ్ఞానముతో కప్పివేశాము. అదే పూతన. అవిద్య. 'నేను'కు 'నాది' తోడవుతుంది. నేను అనేది అబద్ధము. ఈ అబద్ధామునకు నాది అనే మరియొక అబద్ధం తోడవుతుంది. దీనికి అస్తిత్వం లేదు. 'నా' అన్నప్పుడల్లా ఒక పాశం వేసుకుంటున్నాడు. ఎన్ని వేసుకుంటే అంత పశువు అవుతున్నాడు. పశువుకి అజ్ఞానం, అవిద్య ఉంటాయి. 'నేను, నాది' అనే రెండు పూతన రెండు స్తనములు. ఇందులోంచి విషయములను ఇస్తుంది. విషయమే విషము. దేహము ఎప్పుడూ సుఖమునే కోరుతుంది. కానీ దేహసంబంధమయిన సుఖములు విషముతో సమానమయినవి. అవి ఎప్పటికీ దేహి సూక్ష్మరూపమును తెలియనివ్వవు. అలా తెలియకుండా జీవుడు ఈ అబద్ధంలోనే చచ్చిపోతాడు. దీనిని ఏమయినా చేయగలమా? ఏ పని చేసినా దానిని భగవత్ ప్రసాదమని భావించాలి. భగవదర్పణ చేసి సుఖములను అనుభవిస్తే అవి మనపట్ల విషములు కావు అమృతములు అయిపోతాయి. భగవంతుని అర్పించడం వలన లోపల శుద్ధి జరుగుతోంది. శుద్ధి లేకుండా తింటే విషం అయిపోతుంది. పూతన కృష్ణునికి విషపూరిత స్తన్యమును ఇచ్చింది. విషము అమృతము అయిపోయింది. మీకు కూడా అన్నింటినీ ఈశ్వరుడికి చెప్పి తినడం అలవాటు అయితే అది అమృతం అవుతుంది. మనస్సును దేహమును కూడా శౌచపరచగలదు. ఈశ్వరుని వైపు తిప్పగలదు. ఈ రహస్యమును ఆవిష్కరించడమే పూతన సంహారమునందు ఉన్న పెద్ద ప్రయత్నము.

ప్రకృతి వికారమయిన శరీరం పైకి అందంగా ఉన్నట్లు ఉంటుంది. కానీ దీనియందే ఉండిపోతే అసత్యమయిన 'నేను'నందు మీరు ఉండిపోతే అది అమృతత్వమును యివ్వదు. అసత్యమయిన 'నేను' సత్యమును తెలుసుకోవడానికి ప్రసాద బుద్ధితో భక్తి వైపు వెళ్ళినట్లయితే ఈ భక్తి ఒకనాడు జ్ఞానము అవుతుంది. జ్ఞానము ఎప్పుడు కలిగేదీ మనం చెప్పలేము. మిమ్మల్ని మీరు సంస్కరించుకోవాలంటే ముందు భక్తితోనే ప్రారంభించాలి.

అది ఎప్పుడో జ్ఞానం అవుతుంది. జ్ఞానమును అగ్నిహోత్రంతో పోలుస్తారు. మీకు తెలియకుండానే ఒకరోజున ఈశ్వరానుగ్రహం కలుగుతుంది. అపుడు అసలు 'నేను'ను తెలుసుకుంటారు. అది తెలుసుకోవడానికి భక్తి నుండే వెళ్ళాలి. అదే పూతన సంహారఘట్టం. అందుకనే కృష్ణుని మొదటి లీల పూతన సంహారంతో మొదలవుతుంది. ఇది దేహమును పవిత్రం చేసింది. అపవిత్రమయినది పవిత్రం అయింది. పవిత్రము అవగానే లోపల వున్న వస్తువును తెలుసుకోవడానికి ఇది ఉపకరణంగా మారిపోతుంది. మారిపోయి అసలు 'నేను'ను పసిగట్టగలిగిన స్థితికి తీసుకు వెళుతుంది. ఈ ఘట్టమును పరమోత్కృష్టమయిన పరమ పావనమైన ఘట్టంగా పెద్దలు ఆవిష్కరిస్తారు.

## పాండవులకు కలియుగ రహస్యాలు చెప్పిన శ్రీ కృష్ణుడు

కురుక్షేత్ర యుద్ధం ముగిశాక ధర్మరాజు హస్తినాపురం సమ్రాట్ గా పట్టాభి షేకం జరిగాక, ధర్మరాజు కాకుండా మిగిలిన నలుగురు సోదరులు శ్రీ కృష్ణుని సందర్శించి, రాబోయే కలియుగ విశేషాలు వివరించమని ప్రార్ధించారు. సరే అన్న ఆయన తాను నాలుగు బాణాలు నాలుగు దిక్కులకు సంధిస్తానని, వాటిని వెంబడించి ఒక్కో దిక్కులో బాణం పడి ఉన్న ప్రదేశాన్ని గుర్తించి అక్కడ తాము ఏమి గమనించారో తిరిగి వచ్చి తెలియ జేయమని చెప్పాడు. అలాగే పాండవులు నలుగురు బాణాలు వెళ్ళిన తలో దిక్కుకు బయల్దేరి వెళ్ళారు.

ముందుగా అర్జునుడు వెళ్ళిన దిక్కులో ఒక కోయిల మధురంగా గానం చేస్తూ కాలికింద కుందేలును పొడుచుకు తింటూ అతి ఆనందంగా కనిపించింది. బిత్తర పోయిన అర్జునుడు ఈ విషయాన్నివెళ్లి కృష్ణుడికి చెప్పాడు. భీముడు వెళ్ళిన దిక్కులో నాలుగు బావులు కనిపించాయి వాటిలో మూడిట్లో నీరు నిండా ఉన్నాయి నాలుగోది నీరు లేకుండా ఖాళీగా ఉంది.పరిగెత్తుకు వెళ్లి బావకు చెప్పాడు. నకులుడు బాణంపడి ఉన్న చోటుకు వెళ్లి చూస్తే అప్పుడే పుట్టిన లేగదూడను ఒళ్లంతా ఆప్యాయంగా దూడ ఒళ్ళంతా పుళ్ళు పడేదాకా నాకుతున్న ఆవు కనబడింది. సహదేవుడు చోసిన బాణం దగ్గర ఒక పెద్ద కొండ మీదనుంచి పెద్దబండరాయి దొర్లి పడుతూ కిందకు వస్తూ ఒక చిన్న మొక్క అడ్డం వస్తే ఆగిపోవటం గమించాడు. కవలలు కూడా తామిద్దరూ చూసిన వాటిని శ్రీ కృష్ణుడికి నివేదించారు. దీనిభావమేమి తిరుమలేశా అంటూ నలుగురు బిక్కమోహంతో బావ ను అడిగారు. ఆయన విశదంగా వివరించాడు.



అర్జునుడు చూసిన కోయిల- కుందేలు విషయం లో రాబోయే కలికాలం లో విజ్ఞులైన వివేకులు ధనవంతులు కూడా తమ సంపదను ఆనందంగా అనుభవిస్తూ ప్రక్కనే ఉన్న పేదవారిపై దయా,దాక్షిణ్యం, జాలిలేకుండా పీడిస్తూ వారి సంపదపై బతుకుతూ రాక్షసానందాన్ని కోయిల పొందినట్లుగా పొందుతారు అని భావంగా చెప్పాడు. భీముడు చూసిన నూతుల విషయాన్ని వివరిస్తూ ప్రక్కన అతి పేదవాడున్నా వాడికి గుక్కెడు నీళ్ళు అందించి దాహం తీర్చాలన్న ఆలోచన రాని వారు కలియుగం లో ఉంటారు అనిచెప్పాడు.నకులుడు చూసిన ఆవు దూడ విషయం లో –కలియుగం లో తమ తలిదండ్రులు అతి ప్రేమతో గారాబంగా పిల్లలను పెంచి చెడగొడతారుఆవులాగా అన్నాడు. అతిప్రేమతో నాకుతూ తనపిల్లకు పుళ్ళు పడ్డాయని కూడా గ్రహించని ఆవులాగా, పుత్ర వ్యామోహం, సంతానం పై అతి ప్రేమ పిల్లలను చెడ గొడతాయన్నాడు. సహదేవుడు చూసిన దొర్లే కొండమీది రాయి –కలియుగం లో మానవులు నైతిక విలువలు కోల్పోయి బండరాయిలాగా పై స్థాయినుంచి పతనం చెందుతూ, చివరికి ఆబండరాయి చిన్న మొక్క అడ్డురావటం తో ఆగిపోయినట్లు భగవద్భక్తి, భగవన్నామం వలన పతనం నుంచి కాపాడుకొంటారన్నాడు. అని కలియుగ రహస్యాలు వివరించాడు శ్రీ కృష్ణ పరమాత్మ.

## శ్రీ కృష్ణుడు అమ్మవారిని అర్చించేవాడా ?

"భగవాన్ శ్రీ కృష్ణ దేవిని అర్చించే వాడని మార్కండేయ పురాణాంతర్గత మైన దుర్గా సప్తశతి లో ఉన్నది. అందులోని అర్గళ స్తోత్రం లో "రూపందేహి, జయం దేహి, యశో దేహి, ద్విషో జాహి "అని ఉంది.దీన్ని పఠించినవారికి అది కవచంగా రక్షణ కల్పిస్తుందనీ చెప్పబడింది. "కృష్ణేన సంస్తుతయ దేవీ శశ్వద్ భక్త్యా తథాంబికే-రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషోజాహి "దీని భావం "అమ్మా పరాదేవీ !నిన్ను అచంచల భక్తి విశ్వాసాలతో కృష్ణభగవానుడు ఆరాధించాడు. మాకు చక్కని రూపం, అన్నిటా విజయం, అంతులేనికీర్తి కలిగించి మా అజ్ఞానాన్ని కోరికలను సంహరించు".



శ్రీదేవి నిజంగా కృష్ణుడిని రక్షించిందని భాగవత పురాణం చెబుతోంది కదా దేవకీ ఏడవగర్భం ను విష్ణుమూర్తి తనమాయతో రోహిణి గర్భంలో ప్రవేశపెట్టగా బలరాముడు జన్మించాడు.. ఎనిమిదవగర్భంగా కృష్ణుడు, పరాశక్తి ఇద్దరూ అష్టమినాడే జన్మించారు. ఆరోజే శిశువైన కృష్ణుని తండ్రి వసుదేవుడు నందవ్రజం లోని యశోద దగ్గరకు చేర్చాడు. కంసుడు ఆ రోజునే ఆమెను చేతిలోపట్టుకొని పైకేగరేసి ఖడ్గం తో నరుకుదామనుకొన్నాడు కాని వాడి చేతులకు చిక్కకుండా మాయమైంది.

ఇక్కడ కంసుడు లోని ఆహంకారానికి,కృష్ణుడు ఆనందానికి, దుర్గాదేవి అధ్యాశక్తికి ప్రతీకలు,. ఆహంకారం చేతనను (దేవి ) ఆనందాన్ని (కృష్ణుడు )చేజిక్కించు కోలేదు అని అర్థమౌతోంది. పరాశక్తి ఐన దేవి కంసుని అహంకారం అణగ గొట్టేవాడు అప్పటికే పుట్టాడని త్వరలోనే రాబోతున్నాడని సూచనప్రాయంగా భవిష్యత్తు చెప్పేసింది. ఆహంకారానికి విరుగుడు ఆనందమే. కంసుడనే ఆహంకారాన్ని శ్రీ కృష్ణుడు అనే ఆనందమే జయిస్తుందని భావం.

జీవితం లో సంపూర్ణ ఆనందం నిండితే అహంకారానికి తావు అనేది ఉండదు. ఆనంద యోగికి ఆహంకారం ఆమడ దూరం. మనసులో అహంకారం రాజ్యం చేసేటప్పుడు తానూ బాధపడి లోకాన్ని బాధపెట్టి భయంకరుడౌతాడు. వాడి మనసు అనుక్షణ క్షోభ తో, తనను నిందించు కొంటూ అనవసరంగా ఇతరులను నిందిస్తూ ఉంటాడు. అయినా వాడి ఆహంకారం చేతనను నాశనం చేయలేదు. కారణం చేతన శాశ్వతమైనది కనుక.

విశ్వం లో చేతన శక్తిని తగ్గించేది కాని నాశనం చేసేది కాని లేదని గ్రహించాలి. అది నిరంతరం ఉండే శాశ్వత శక్తి. సైన్స్ తెలిసినవారికి ఈ విషయం బాగా అర్థం అవుతుంది. శక్తి నిత్యత్వ సూత్రం ప్రకారం శక్తి సృష్టింపబడదు, నాశనం కాబడదు. రూపాంతరం చెందుతుంది. అలాగే చేతనకూడా సృష్టింప బడదు, నాశనం చెందదు.దానిని సృష్టించే ప్రయత్నం నాశనం చేసే ప్రయత్నం నిష్ఫల మౌతుంది. చేతనమాత్రమే శాశ్వతం"అని గురు శ్రీ రవిశంకర్ తెలియ జేశారు.,

## మనకు తెలియని శ్రీ కృష్ణ సంతాన లీలలు

--

శ్రీ కృష్ణుడికి పదహారు వేల ఎనిమిది మంది భార్యలున్నారని లోకం లో ప్రచారంగా ఉంది.వీరిలో అసలు భార్యలు ఎంతమంది?వాళ్ళే అష్టభార్యలు –రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్ష్మణ అని భాగవత పురాణం పేర్కొన్నది. మరి వీరి సంతానం సంగతేమిటి ?ఈ ఎనిమిది మందికి 80 మంది కొడుకులనుకన్నాడు కన్నయ్య. అందులో




1-రుక్మిణీ-కృష్ణు ల కుమారులు 10 మంది.-1-ప్రద్యుమ్న 2-చారు దేష్ణ 3-సుధేష్ణ 4-చారు దేహ 5-సుచరు 6-చారు గుప్త 7-భద్ర చారు 8-చారు చంద్ర 9-విచారు 10-చారు.

2- సత్యవతీ –కృష్ణుల కొడుకులు 10 మంది -1-భాను 2- సుభాను 3-స్వభాను 4-ప్రభాను 5-భానుమాన్ 6-చంద్రభాను 7-బృహద్భాను 8-అతిభాను 9-శ్రీభాను 10-ప్రతిభాను.

3-జాంబవతీ –కృష్ణుల పుత్రులు 10- మంది -1-సాంబ 2-సుమిత్ర 3-పురుజిత్ 4-శత్రజిత్ 5-సహస్ర జిత్ 6-విజయ 7-చిత్రకేతు 8-వసుమాన్ 9-ద్రవిణ్ 10-కృతు.

4-నాగ్నజిత్ –కృష్ణుల మగసంతానం – 10 మంది- 1- వీర 2- చంద్ర 3-అశ్వసేన 4- చిత్రగు 5-వేగవాన్ 6-వృష 7-ఆమ్ 8-శంకు 9-వాసు 10-కుంతి

5-కాళిందీ-కృష్ణుల కుమారులు 10 మంది -1-శ్రుత్ 2-కవి 3-వృష 4-వీర 5-సుబాహు 6-భద్ర 7-శాంతి 8-దర్ష 9-పూర్ణమస్10-సోమక్.

6-లక్ష్మణ –కృష్ణుల కొడుకులు -10 మంది -1-ప్రబోధ 2-గాత్రవాన్ 3-సింహ 4- బల 5-ప్రబల 6-ఊర్ధ్వగ 7-మహా శక్తి 8-సహ 9-ఓజ 10-అపరాజిత్.

7-మిత్రవింద –కృష్ణుల పురుష సంతానం 10 మంది -1-వృక్ 2-హర్ష 3-అనిల 4- దృఢ 5-వర్దన 6-అన్నాద 7-మహాష్ 8-పావన్ 9-వహ్ని 10-క్షుధి.

8-భద్ర –కృష్ణుల సంతానం 10 మంది-1-సంగ్రామజిత్ 2-బృహత్సేన 3-శూర 4-ప్రహరణ 5-అరిజిత్ 6-జయ 7-సుభద్ర 8-వామ 9-ఆయు 10-సాత్యకి.

అష్టభార్యలకు సమాన సంఖ్య లోనే పుత్రులను ప్రసాదించాడు పరమాత్మ శ్రీ కృష్ణుడు.

వీరిలో అందరూ తండ్రికున్న పేరు,ప్రఖ్యాతులున్న వాళ్ళు కాక పోవటం విచిత్రం. జాంబవతి కుమారుడు సాంబుడికిమాత్రం ఒక ప్రత్యేకత ఉన్నది. మహాభారతం లో చిన్నపాత్ర పోషించటమే కాక, చివరలో యాదవ వంశ వినాశనానికి కారకుడయ్యాడు. సాంబుడు ముమ్మూర్తులా తండ్రి శ్రీకృష్ణుని పోలి ఉంటాడని అందరూ అంటున్నా, కృష్ణుడు మాత్రం సాంబుడు అన్ని విధాలా తన ఆరాధ్యదైవం పరమేశ్వరుడైన సాంబ శివుని పోలి ఉంటాడని భావించాడు.




ఆధారం –పల్లవీ ఠాకూర్ రచన –"ది అన్ నోన్ అండ్ అన్ టోల్డ్ స్టోరీస్ ఆఫ్ కృష్ణాస్ సన్స్ '

## శ్రీ రుక్మిణీ పరిణయ సంజీవిని కవికధా కమామీషు

రావూరి సంజీవ రాయ కవి ప్రణీత "శ్రీ రుక్మిణీ పరిణయము "కావ్యం విశిష్ట మైంది. కారణాలు చాలా ఉన్నా, అందులో ముఖ్య మైన కొన్నిటిని చూద్దాం. యే కావ్యాని కైనా కర్త ఒక్కడే ఉండటం సహజం. కాని ఈకవ్యకన్యక కు నిజం తండ్రి సంజీవ రాయ కవి అయినా, తామూ

ఆ కోవకు చెందిన వారమే నని కొప్పర్తి నరసాఖ్యుడు ముందు ప్రకటించగా, మహా మహోపాధ్యాయ శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారు తామే పరిష్కరించి ప్రకటించి నట్లు చెప్పారు. అంటే అసలు తండ్రే కాక, మరో ఇద్దరి ముద్దుల పుత్రిక అయింది ఈ కావ్య కన్యక. అయితే, సాహితీ లోకం వీరిద్దరిని గుర్తించ లేదు. అసలు తండ్రి సంజీవ రాయ కవి యే అని పరిశీలకులు, పరి శోధకులు నిర్ణ యించారు., ధ్రువీకరించారు. కనుక కర్తృత్వం పై వాదం సమసి పోయింది. ఈ కావ్య కన్యక కు ఇప్పుడు 280 ఏళ్ళ వయసు వచ్చింది.

సంజీవ రాయ కవి వరంగల్లు జిల్లా కొలను పాక అనే గ్రామం లో జన్మించి నట్లు ఆది జైన పుణ్య క్షేత్రమని అక్కడ వీర నారాయణ స్వామి దేవాలయం ఉందని ఆరుద్ర తెలిపారు. అక్కడ గోపరాజు రాయప్ప గొప్ప శ్రీమంతుడు. ఆయన స్వామిపై శతకం రాయమని ఈ కవిని పిలిపించి, సత్కరించి, వేడుకొన్నాడు. "కొలను పాక వీర నారాయణ ముకుంద విశ్వ కుంద"అనే మకుటం తో సీస పద్య శతకం రాశాడు. వీటిని "గునుగు సీసాలు "అన్నారు దశావతార వర్ణన, శ్రీ కృష్ణ లీలలను కూడా కవి వర్ణిం చాడట. సంజీవయ్య తండ్రి గురవయ్య కూడా కవి గా ప్రసిద్ధుడే. కొండ వీటిలో ఉండే వాడు. ఆయన్ను "కొండ వీటి పేద రావు గురవయ్య "అనే వారట. మొదట తెలంగాణా వారే. తర్వాత తెనాలి దగ్గర రావూరు చేరటం వల్ల ఇంటి పేరు రావూరి గా మారింది. "అనుము కొండలు "అనే ఉప శాఖ ఉన్న ప్రధమ శాఖ లో భాగమట..ఈ శాఖ బ్రాహ్మణులు ఓరుగల్లు దగ్గర ఉండటం వల్ల వీరి పూర్వీకులు ఇక్కడి వారే నంటారు ఆరుద్ర. కవి సంజీవయ్య చదువు తెలంగాణాలోనే సాగింది, రాత్రి పూట శ్మశానం లో శవాల వెలుగు లో చదువు కొనే వాడట.అంతటి దుర్భర దారిద్ర్య స్తితిలో కుటుంబం ఉండేదన్న మాట. తర్వాత పెద్ద వాడై,సంపాదనా పరుడై వీర నారాయణ స్వామి ఆలయాన్ని అభి వృద్ధి చేశాడట. "కృష్ణ హరీ వాసుదేవ నందన "శతకం రాశాడు. ఆ శతకం లో తనను "సుధా రస తుల్య కవిత్వ కల్పనా ప్రావిని –కొండ వీటి పేద రావు గుర్వ తనూజ సంజీవిని "అని చెప్పుకోన్నాడట. జాతక సిద్ధాంతగ్రంధాలు చదివి వంట పట్టించుకోన్నాడు. వీర నారాయణ శతకాన్ని 1731లో రాశాడట. రుక్మిణీ పరిణయ కావ్యాన్ని1787 లో రాశాడు. పద్యాలు క్లిష్టం గా ఉండటం, జనాలకు అర్ధం కాక పోవటం వల్ల సంస్కృతం లో వివరణలూ రాసుకొన్నాడు కవి. ఈ వివరాలన్నీ ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం "లో పొందు పరచాడు.




బులుసు వెంకట రమణయ్య గారు "ఆంధ్ర కవి సప్త శతి "లో సంజీవ రాయ కవి కవితా త్రివిక్రమవిలాసం, భాగవతం లోని ఏకాదశ, ద్వాదశ ఖండాలు కూడా పద్య కావ్యాలుగా చెప్పి నట్లు వ్రాశారు. ఈ విషయాలను ఆరుద్ర చెప్ప లేదు. దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు కూడా సంజీవ రాయ కవి గురించి చెప్పారు. కవి ప్రత్యేకత వల్ల సాహితీ లోకం లో నిలబడి, ఎన్ని తంత్రాలు జరిగినా "చిరంజీవి "గా సంజీవ రాయ కవి నామ సార్ధకాన్ని సాధించారు. ఆంజనేయ స్వామి పేరును సార్ధకం చేసుకొన్నారు.

## దౌహిత్రుని తాపత్రయం

సంజీవ రాయ కవి కవి కధకులు రిటైరేడ్ రేడియో ఇంజినీర్ స్వర్గీయ శ్రీ గంధం వేంకాస్వామి శర్మగారి మాతా మహా స్తానం లోనీ వారు. ఆరు తరాల ముందటి వారు. సాధారణం గా దౌహిత్రుడు తాత గారి ఆస్తి కి వారసుడౌతాడు అనేది లోక రీతి. శర్మ గారు ఆరోతరానికి చెందినా వారు కనుక సాహితీ వారసత్వపు హక్కు లభించింది. అది తన తాత, ముత్తాతల నే కాక ముందు తరాల వారికీ ఋణం తీర్చు కొనే హక్కు, బాధ్యతగా భావించి తాను పది హేనవ ఏట చూసిన సంజీవ రాయ కృత రుక్మిణీ పరిణయ కావ్యం లోనీ చిత్రాలను సేకరించే ప్రయత్నం లో ఉన్నారు. ఇప్పుడీ కావ్యాన్ని పరి శుద్ధ పరచి తానే "ప్రకాశకులు "అయి, దాన్ని సాహితీ ప్రకాశ మానం చేస్తూ తర తరాలరుణాన్ని సభక్తికం గా తీర్చుకొన్నారు. ఎందరికో ఆదర్శమాను లయారు. ఇలా ప్రచు రించటం లో అమితానందాన్ని పొంది, ఆ ఆనందపు అను భూతిని సాహితీ ప్రియులకు అందజేసి ధన్యులవుతున్నారు., ప్రశంశ నీయులయారు. తప్పులు జల్లెడ పట్టి, అభిప్రాయం రాయమని నన్ను ఆదేశించారు. వారి పై ఆదరాభిమానాలతో ఔదల దాల్చాను. కావ్యం చదువుతూంటే, చెమకూర వేంకటకవి, రామ రాజభూషణ కవి,పోతన కవి ల కవిత్వాలు కలిపి "మిక్సీ పడితే" ఎలాంటి కవిత్వం వస్తుందో అలాంటి కవిత్వం ఈ కవి రాశారని అని పించింది. మంచి పండితునితో అర్ధ తాత్పర్యాలను విశేషాలను

వ్రాయిస్తే మరీ శోభ తో కావ్యం ప్రకాశిస్తుందని శర్మ గారికి సూచించాను. వారు వెంటనే "మంచి సూచన చేశారు ప్రసాద్ గారూ, నేను ఆ ప్రయత్నం చేసి మీరు చెప్పింది త్వరలోనే ఆచరణ లోకి తెస్తాను. అర్ధ తాత్పర్యాలు విశేషాల తో మళ్ళీ ఈ పుస్తకాన్ని ముద్రిస్తాను.మీ వ్యాఖ్యానాన్ని అక్షరం వదల కుండా అందులో ముద్రిస్తాను "అని చెప్పారు. ఆ ప్రయత్నం తీవ్రం గా నే చేశారు. రాసే వారు దొరికారని, పని జరుగుతోందని త్వరలోనే పూర్తీ అవుతుందని కని పించినప్పుడల్లా చెప్పే వారు. అయితే అకస్మాత్తు గా శ్రీ శర్మ గారు ఈ ఏడాది మే నెలలో ఆ పని పూర్తీ కాకుండానే మరణించటం సాహితీ ప్రియులకు తీవ్ర నిరాశనే మిగిల్చింది. శర్మ గారు సమర్దులైన కధా రచయిత. గొప్ప సంస్కారి. "అమృత హస్తాలు ","నాయనమ్మ కధలు "మొదలైన అద్బుత సంకలాను తెచ్చారు. ఇప్పుడు కావ్య విశిష్టత ను తెలుసు కొందాం

కావ్య విశిష్టత

శ్రీ రుక్మిణీ పరిణయ కావ్యం అనేక ప్రయోగాలకు నిలయం కావ్యానికి కావలసిన సకల హంగులూ ఉన్నాయి. తన ఇష్ట దైవం సంజీవ పర్వతోద్ధారి అయిన శ్రీ ఆంజనేయ స్వామి కలలో కన్పించి, కొండపల్లి మండలం లో కృష్ణా నదికి ఉత్తరాన గల కోడూరు లో తాను వెలసి ఉన్నానని, అక్కడ మదన గోపాలుని ఆలయాన్ని నిర్మించి, స్వామిని ప్రతిష్టించి, రుక్మిణీ పరిణయ కావ్యం రాసి ధన్యుడైనాడు. జన్మ సార్ధకత చేసుకొన్నాడు. అలానే చిత్తాను వృత్తిగా ప్రవర్తించి, కావ్యం రాసి సార్ధకత పొందాడు. ఈ కావ్యానికి "మదన గోపాల చరిత్ర "అనే పేరూ వచ్చింది. అయిదు ఆశ్వాసాల కావ్యం ఇది.

శ్రీ మద్భాగవత దశమ స్కంధం లోనీ రుక్మిణీ కళ్యాణ ఘట్టాన్ని పఠించిన కన్యకలకు వివాహం త్వరలోనే జరుగుతుందని మన దేశం లో నమ్మకం బాగా ఉంది. అలాచేసి సఫలీ కృతు లైన వారెందరో ఉన్నారు. ఆ కధకే కాయ కల్ప చికిత్స చేశారు సంజీవ రాయ కవి. తనకు ముందు తరాల వారైన పోతన, భట్టు మూర్తి, చేమకూర వెంకట కవుల బాణిని, వాణిని స్వంతం చేసుకొన్నాడు. వారు పోయిన ఫక్కీ లన్ని అనుసరించాడు., అనుక రించాడు కూడా. ముఖ్యం గా కధా వివరణ లో పోతన గారు ఏయే సందర్భాలలో ఎలా పద్యాలు చెప్పి పారాయణ చేయటానికి రాశారో అలానే ఈ కవీ పద్యాలు రాశాడు. అయితే అంత తాదాత్మ్యకత చూపలేక, కల్పించలేక పోయారు. వర్ణనల విషయం లో యమకాలు, చమక్కులు, బంధ కవిత్వాలతో మిగిలిన ఇద్దర్నీ అనుసరించారు. కావ్య స్తితికి కావలసిన మసాలా అంతా దట్టించాడు.

కధ అంతా తెలుగు లోగిళ్ళు లోనే జరిగినట్లు చేయటం తమాషా గా ఉంది. రుక్మిణి తెలుగింటి ఆడపడుచు లాగ కన్పిస్తుంది. ఆమె తల్లి గర్భవతి అయినప్పుడు జరిగే సీమంతం, రుక్మిణి బాలసార, ఆట, పాట అన్నీ తెలుగు వారు జరుపుకొనే రీతి లోనే చూపారు. కవిత్వం చాలా చక్కగా, వయ్యారం గా నడుస్తుంది. "పద్మేశు కధలు –మధు మాధురీ నాద స్తిత కున్మేలై, కాగిన మీగడ పాలై విన, గ్రొత్త సేయు "రీతిగా ఉంతాయట.. రుక్మిణి తల్లికి కలలో లక్ష్మీ దేవి కన్పించటం ఆమె అందాన్ని, లావణ్య దీదితిని చూసి ముచ్చట పడి తనకు కూతురు గా జన్మించమని కోరటం కవి చేసిన భలే కల్పన. ఆ సందర్భం లో "పుష్ప వత్సవ మహా రాజ భాగమునకు రాజు వెంచేసె నొక రేయి రాజసమున "అని శ్లేషను ప్రయోగించి సందర్భ శుద్ధి గా చెప్పాడు. ఆమె గర్భవతి గా ఉన్నప్పుడు, శారీరకం గా వచ్చిన మార్పులను సాంప్రదాయ పద్ధతులలో వర్ణించి చెప్పాడు. రుక్మిణి జన్మించింది.. పీటలపై దంపతులు కూర్చుని, స్వస్తి పుణ్యః వాచనం చేసి" బాలికా మణి దేహ శోభా విభూతి రుక్మ కాంతి (బంగారు కాంతి )విలాసైక రూఢిదగుట వల్ల "రుక్మిణి అని పేరు పెట్టారట. అద్భుతం అని పిస్తుంది. ఆమెను చూడ టానికి వచ్చిన పురజనులు రుక్మిణి తన పిన తల్లి పోలిక అని ఒకరంటే, తల్లి పోలిక అని ఇంకోరు, అమ్మమ్మ పోలిక అని వేరొకరు అనటం లో మన తెలుగింటి అమ్మలక్కల తీరు ప్రతి బిమ్బిస్తుంది. చివరకు "అగన్య పుణ్య జన నిశ్శేష భువన పోషణ, సువత్సతల విభూషిన్మతల్లి యైన బాలికా మణి "అని సాక్షాత్తు లక్ష్మీ దేవి యే ఆమె అని నిర్ధారించింది ఒక పేరంటాలు, రుక్మిణి దిన దిన ప్రవర్ధ మానమవుతూ ఉంది. ఆమెను ఉయ్యాల్లో వేశారు. ముత్తైదువులు "ఉయ్యాలో జంపాలో "అని తెలుగింట్లో లాగా ఉయ్యాలా లూపారు. బాల రుక్మిణి తల్లి పాలు తాగే విధానమూ వర్ణించాడు కవి. మనోహరం గా. "ఒక చన్నా నుచు, నొక చన్ను బుడుకుచు, మార్చి మార్చి "పాలు కుడుస్తోందిట. ఇది అందరు పిల్లలు చేసే విధానమే. బొమ్మ కట్టి మన ముందుంచాడు. బాలిక కు టేసి నెలలో అన్న ప్రాసనా చేయటం మన రివాజు. రుక్మిణికి అయిదవ నెలలో "అయిదవదౌ నెల యందు నైదువల్ "చేశారని వర్ణించాడు. తోటి పిల్లలతో ఆమె ఆటలాడింది. "జగదుద్ధారర మోహనా కార వర్తి యై "విల సిల్లు తోంది. "చలువ జాజిగి మించు చలువ వలువలు ధరించింది "రవిక లోపల రవిక తోడిగిందట. అని చమత్కారం గా చెప్పాడు కవి. అంటే ఇప్పుడు స్త్రీలు వేసే "బాడీ "వేసిందన్న మాట ఆనాడే రుక్మిణి. ఇంతకూ రుక్మిణి తండ్రి పాలించిన విష్ణు కుండిన నగరం మన కొండ వీడు దగ్గరే నని చరిత్ర కారులు చెబుతారు. ఆది దృష్టిలో పెట్టుకొని కవి ఇంతటి తెలుగు వాతావరణాన్ని తెలుగింటి శోభను తెచ్చాడని పిస్తుంది.

రుక్మిణీ దేవి సర్వ దేహ వర్ణన ను చమత్కారం గావర్నించాడు "సువర్ణ"లతో. యుక్త వయస్సు వచ్చింది. ఆమెకు తగిన వరుడు శ్రీ కృష్ణుడే నని ఊహించి చక్కని పద్యం చెప్పాడు.

"హరి యమ్మం బున బుట్టి గ్రుష్ణు డిలపై, నద్దేవుని గూర్ప, వా

గ్వరుడూహించి విచిత్ర కల్పనముగా, బద్మాంగి నీలాల కో

త్కరంగ, నీ సుదతిన్ సృజించి, జఘన స్థానంబు గాజేసనో

ధరణిన్, దత్తరుణీత్రయంశాకృతి, దత్తాద్దేతువై కన్పడన్ "

కృష్ణుని లోనీ అంశాలన్నీ ఆవిడ శరీరం లో ఉన్నట్లు చెప్పటం భావుకతకు పట్టం కట్టటమే. ఆమె మోవికి మామిడి చిగురు, మంకెన పువ్వు, యెర్ర తామరా వగైరాలేవీ సరి పోవటం లేదనటం చిత్రం గా ఉంది..పరిణతి లో సారూప్య స్తితి తో వర వర్ణిని గా పేరు పొందింది. కృష్ణుడు కూడా ఆమె రూప లావణ్యాలను తెలిసి కొని, "తనకుం జాయగా జే కొందు ననుచు శౌరి దలచేన్ "అని పిస్తాడు. "మేడ్ ఫర్ఈచ్ అదర్"అన్నట్లున్నా రన్న మాట.

కూతురి పెళ్ళి చేయాలని తండ్రి భీష్మకుడు భావించి, మంత్రులతో, పెద్దలతో తగిన వరుడేవారు అని అడుగుతాడు. తనకు కాబోయే అల్లుడు తలిదండ్రులు బల వంతులైన బంధు గణం గురు పురోహిత హితులు, సిరి సంపదా, కళా, సాహస ఔదార్యం, పరాక్రమం గుణ విరాజం ఉన్న రాజ కుమారుడై ఉండాలని అన్నాడు. కమల వంటి కుమార్తెకు హరిని బోలిన అల్లుడు దొరికితే మహదానందం అన్నాడు.

"కన్యాం రూప గునాన్వితాం మమ సుతాం, క్ష్మాపాల బాలైక మూ

ర్ధన్యాం కాంచన రత్న భూషణ యుతం దాస్యామి తే విష్ణవే

ధన్యోహం హి గృహాణ "యంచు హరి పాదద్వంబు న్వార్చి, ఈ

కన్యాం దానము సేయగలగు ఘన భాగ్యం బెన్న దిన్కబ్బున్ "

ఇలా సంస్కృతం లో తెలుగులో పద్యాన్ని, కన్యాదానాన్ని వివరించాడు విచిత్ర కవి.

మంత్రు లంతా ఏకాంత మందిరం లో సంప్రదించుకొని ఏక వాక్యం గా శ్రీ కృష్ణుడే తగిన వరుడని అతని పుర విశేశాలు, ఆయన గుణ శీలాదు లన్నిటిని సవివరం గా చెప్పారు. శ్రీ కృష్ణుని కలిమి ముందు ఇంద్ర, కుబేర సముద్ర, ఈశ్వర విభూతు లేవీ చాల వన్నాడు. అతని శరీరం లోనీ ప్రతి భాగాన్ని అద్భుత మైన పద్యాలతో వర్ణించాడు. ఆయనే రుక్మిణీ పతి కాగలిగిన వాడని చెప్పారు.

అన్న రుక్మి అక్కడే ఉన్నాడు. వీళ్ళ తీరు నచ్చలేదు. అతని మనసులో శిశు పాలుడున్నాడు. ఇచ్చకపు మాటలతో రాజును ప్రక్క దోవ పట్టిస్తున్నారని "అనర్ఘ్య రత్నాన్ని ఆర ఊతంబు తోదవున అతకటం లాఉంటుంది రుక్మిణిని కృష్ణునికిస్తే" అన్నాడు. కృష్ణుని చేష్టల్ని తన వక్య చాతుర్యం తో గేలి చేశాడు. "నిలువెల్లా మాయ, కులం, గుణం లేవు. ఎన్నో చోట్లు మార్చాడు. గుణం లేని వారి స్నేహం రూప రేఖాదులు లేని వాడు "అంటూ నిందా స్తుతి చేశాడు. కవి సామర్ధ్యం ఇక్కడ ప్రస్ఫుటం గా కన్పిస్తుంది. మరి శిశుపాలుడు "మహిత కనక కుదర చాప మంత్ర జపుడు, భరిత పరమ కృపుడు "అని మెచ్చాడు. రుక్మిణి భరించలేక వోయింది. రాచ కన్య ఏమీ చేసే స్తితి లో లేదు. అక్కణ్ణించి వెళ్లి పోయింది. ఎక్కడికి వెళ్ళిందో, ఏమి చేసిందో చూద్దాం

"కాంత ఏకాంత కాంత నిశాంత శయ్య –వాన్తగతి నొప్పె తాం త లతాం తమై

దంతరిత పూర్వ జోదితో దంత చింత –సంత సంతాప దంతురి తాం త రామమున "

అంతటి బాధను ఇంతటి అందమైన పద్యం లో బంధించాడు కవి. ఆమె వెంట మనమూ వెళ్తున్న భ్రాంతి కల్గించాడు. ఆమె బాధ "గోరు చుట్టూ పై రోకటి పోతూ "లా ఉన్నదాని మంచి జాతీయం ప్రయోగించాడు.

## బాపని రాయబారం

తన మనసులోని ప్రేమను శ్రీ కృష్ణునికి విన్న వించటానికి పేరు లేని బాపనయ్య ను పిలిపించి కృష్ణుని చేరి తన విషయం తెలియ జేయమని కోరింది. "రూఢ మేదో విషాలు, వాచాలు నిన్ను బిల్వ న్వలసె నితకు నా వార్త దేల్ప బుదేన్ద్రా "అన్నది. తన మనసంతా హరి పై చిక్కు కున్నదని సింహముపాలి సొమ్ము గోమాయువు హరిన్చేట్లు గా శిశుపాలుడున్నాడని పోతన శైలిలోనే చెప్పింది కాదు చెప్పించాడు సంజీవ రాయ కవి –

"కారము చేయునగ్రాజు వికారము దూరముగా భవచ్చమ –త్కారము జూపి, నాదగు ప్రకారము శౌరికి విన్న వించి, స

త్కారము సేయనిన యుపకారము కై ప్రతీకారమే నమ-సకారము సేయు చుండుదు చొ కారాముగా హరి దెచ్చు నంతకున్ "అంటూ "కారం "తో చమత్కారం చేస్తాడు కవి..

బాపడు ద్వారకా నగరం చేరి అక్కడి పట్టణవిశేషాలన్నీ తిలకిస్తాడు. పుర వర్ణన లో అద్భుత మైన పద్యాలున్నాయి. తన రాక ను ద్వార పాలకుని ద్వారా ద్వారకా కాన్తునికి చెప్పిస్తాడు. ఆయన విని, "భీష్మ కరాట నయా, గతి దెల్పగా వచ్చిన వాడ"నితెలిసి హృష్ట చిత్తుడౌతాడు కన్నయ్య. అంతటి పరేంగితావగాహి. బ్రాహ్మణునికి ఎదురేగి పూజించి ఉచితాసనం పై కూర్చో బెట్టాడు. ఇక్కడ శ్రీ కృష్ణుని దివ్య సుందర విగ్రహాన్ని చూసి నోరారా ప్రస్తుతిస్తాడు రాయబారి బాపడు. ఎన్ని పద్యాలు చెప్పి వర్ణించినా కవి కౌతుకం తీరలేదు. ఓ దండకం దండ వేసి, దంచేస్తాడు. అదీ సంతృప్తి నివ్వదు. బహు విధ కందాలలో అర వింద దళాయతేక్షణుడిని వర్ణిస్తాడు. పాద భ్రమర, క్షురికా బంధ, ఆర్ధ భ్రమర, గుడి ఏకాక్షర, తల కట్టు, శృంగ కందాలలో అందాన్ని కలం యేతాముతో తోడేస్తాడు. ఇది చాలక గుణితం లో గుణిస్తాడు. సాప్తిక, ఆంధ్ర సప్తిక విభక్తికం గా భక్త్యంజలి ఘటిస్తాడు.. చక్ర బంధ, నాగ బంధ అనుప్రాస సీస, ఆంధ్ర గీర్వాణ భాశిక్య పద్యాలతో ఆనంద పులకాన్కితం గా చక్ర వర్ణన చేస్తాడు. రుక్మిణీ సందేశాన్ని అప్పుడు విని పిస్తాడు. అలాగే రుక్మిణి అందాలణు రుక్మిణీ కాన్తునికి విన్న విస్తాడు. ఇదంతా ఒక రసమయ లోకం లా ఉంటుంది. ఇక్కడ ఒక పద్యం హృద్యం గా రాస్తాడు

"అభ్ర విభ్రమము మధ్యమమునందే కాదు -పొందిన పేనలి యందు గలదు




హరి మనోహరిత్వ మాస్యమ్మునందే కా—దనిశము పాలకుల యందు గలదు “ అంటూ “ముందు శ్రీత్వంబు భావంబు నందే కాదు –కర్ణముల యందు గలదు “అంటూ “ ఆ వరారోహ యాఖ్య చేత నె కాదు దేహ విభూతి నలరు “అని ముక్తాయింపు నిస్తాడు.

ఆమె పలకులు “కున్దంములు పలు కుదురున, కుండంము లటంచు బల్కు గోన నౌ జేలికిన్ “అని చెప్పుతూ “కం దమ్ములు లు ఘన శోభా –కం దమ్ములు మారుని నంత గందమ్ములగున్ “అన్న మాటలు ఆయన కంద పద్యాలకు అన్వ యించ వచ్చని పిస్తుంది. అందమైన కందం, మా కందం, మధుర నిష్యందం, ఆనంద రస నిక్షేపం.

## రుక్మిణీ కృష్ణ పరిణయం

శ్రీ కృష్ణుడు రుక్మిణి సందేశాన్ని విని పోతన గారు “వచ్చెద విదర్భభూమికి “అని చెప్పి నట్లు సంజీవ రాయ కవీ చెప్పాడు. “వచ్చేద విదర్భ నృప వరాన భీష్మక కుండి నంబు “అని చెప్పాడు. బ్రాహ్మణుడు బయల్దేరాడు. కృష్ణుడు “సకలా రాతి చమూ సమూహ కలశా కూపార, మందానమై, పటు రుక్మిన్య బాలా వివాహ కలనా ప్రారంభ సందానమై “బయల్దేరాడు కుండిన నగరానికి.

చతుర్ధా శ్వాసం లో రుక్మిణి తాను పంపిన రాయ బారి కోసం ఎదురు చూడటం వెళ్ళాడో లేదో నని సందేహించటం తన సందేశం చెప్పాడో లేదో నని పోతన గారి రుక్మిణి లా సందేహించటం ఇక్కడా ఉంది.తర్వాత విరహం, ఉప చర్యలు “చక్కని దాన నంచు నేల జవ్వని నంచు సఖీ జనావళి “అన్న పద్యం ముక్కు తిమ్మన గారి సత్య భామ పద్యం లా ఉంటుంది. ఆమె విరహాన్ని భరించలేక “భైరవ కామ సుమాస్త్ర వేదనా శాలినిజంగ జాల గని హస్తాద్రికి చేరాడు. చంద్రోదయ వర్ణన కూడా సందర్భోచితం గా చేశాడు. “ఆగ మిష్య త్రిత య యామినీ నిటలాగ్ర దీపిత చందన తిలక మనగ “లా ఉన్నాడు చంద్రుడు. రుక్మిణి పూర్ణ చంద్రుని పూజించి “సిత భాసురాయ పూత వివిధ సుపరవిక పుణ్య దాయ దివ్య తారక మూర్తయే తే నమోస్తు “అని సంస్కృత పదభూయిష్టం గా స్తుతిస్తుంది. తర్వాత”పాపి “అనే అదే రేంజి లో తెలుగు లో తిట్టి పోయింది.



తర్వాత భానూదయం –"రుక్మిణీ కన్యకా వివాహ పూర్వ పరి ప్రేష్య వర చిరతర దీప్య మాన రత్నాకార దీపమనగా "అన్నట్లు సూర్యుడు ఉదయించాడు. శ్రీ కృష్ణ భాగవానుడూ ఉదయించాడు. బ్రాహ్మణ, సుదర్శన యోగమూ కలిగింది. వివరాలు తెలుసుకొని సంబర పడింది. గుండె దిటవు చేసుకొన్నది.. ప్రత్యుపకారం గా "అంజలి "ఘటించటం తప్ప ఏమీ చేయలేని అశక్తు రాలనని చెప్పి దీవన పొందింది.

శ్రీ కృష్ణుడు ఒంటరి గానే బయల్దేరాడు. తర్వాత ససైన్యం గా అన్న బలరాముడు వచ్చాడు. పోతన గారి లాగానే "జతయా చక్రి విదర్భ రాజ సుతకున్, సత్యంబు వైదర్భియున్ జత ఈ చక్రికి నింత లెస్స యగునే "అని పుర జానులనుకొన్నారు. భవానీ దేవిని దర్శించి "మతి లో నమ్మితి నేసనాతనుల నమ్మా, మిమ్ము బ్రోచిన దంపతులుగా "అని పోతన గారి రుక్మిణి "నమ్మితి ణా మనంబున సనాతనులైన ఉమా మహేశులన్ "అన్న పద్యాన్ని ప్రేరణ గా చెప్పాడు సంజీవ కవి. రుక్మిణిని అశ్వం పై చేర్చిన కృష్ణుడు ద్వారకకు చేరటం శిశుపాలుడు ఎదిర్చినా ఫలితం లేక పోవటం రుక్మి ఎదిరించి శృంగ భంగ మవటం మనకు తెలిసిందే

ద్వారక లో గార్గ పురోహితుడు శుభ లగ్నం లో వివాహం జరిపించాడు. "వృష రాశి జాత, యాదవ వృషభుడు రుక్మీంద్రు తులయన్మిష చేత భార్గవి యయ్యెను ద్రుశానే కాది పతయ మేసంగే నుభయతన్ "అని చెప్పి కవి తన జ్యోతిష పాండిత్యాన్ని చక్క గా జోడించాడు. తులా వృష భాలకు రాశి నాయకుడు ఒక్కడే అవటం భార్గవుడైన హరికి, భార్గవి అయిన రుక్మిణి అని చమత్కరించాడు. "హరి పతి యగు చుండగా మరి, హరిణీ నామము ఘటిల్లి నది "అన్నాడు. హరి ది గోరాశి. రుక్మిణిది తుల. షష్టా ష్టకం, న్యాయం గా పనికి రాదు పొత్తు కుదరదు. కాని "ఉభయైక స్వామికత్వం "వల్ల దోషం లేదని తేల్చాడు. మానుష రూపం దాల్చిన కృష్ణుడు మాయి మూర్తి. మాయ లేనిది రుక్మిణి జగన్మాత. వారిద్దరి పరిణయం చేయటం తనకు పూర్వ పుణ్య ఫలమని గర్గుడు భావించాడు. వివాహం మన పద్ధతి లోనే జరిపించాడు. "జానక్యః కమలాంజలి "అన్న ప్రసిద్ధ శ్లోకం లోనీ భావాన్ని "రుక్మిణి పోసే ముత్యాలు కెంపు లై హరి శిరం పై పడి శుద్దాలై శరీరం నుండి జారుతూ నీలాలై తలంబ్రాలు శోభించాయట. వధూ వరులు పేర్లు చెప్పుకోవటం, పరమాన్నం తినటం పానుపు మీద తాంబూలాలు కొరకటం,



నాక బలి వగైరాలు పూర్తీ చేశారు. తర్వాతా గర్భా దానమూ చేయించాడు కవి. రుక్మిణీ కళ్యాణం ఈ విధం గా ఫలప్రదం అయింది. ఈ కధ వ్రాసినా, విన్నా, చెప్పినా శ్రీ కైవల్యం తప్పదని సంజీవ రాయ కవి భరోసా ఇచ్చాడు. ఇలా పోతన గారి పోకడా, భట్టు మూర్తి అల్లికా, వేంకటకవి చాతుర్యం త్రివేణీ సంగమం గా వర్ధిల్లిన కావ్యం ఇది. కవి సంజీవ రాయలకు, మనకు ఈ దివ్య సంజీవినిని అందించిన వారి వారసుడు స్వర్గీయ గంధం వేంకా స్వామి శర్మ గారికి అంజలి ఘటిస్తున్నాను. రుక్మిణీ పరిణయ కావ్యం భవ్యం దివ్యం –శుభం భూయాత్

## పారిజాతాప హరణం

"అపహరణం "(దొంగ తనం )అనే పేరు తో తెలుగు లో వచ్చిన, మొదటి కావ్యం నంది తిమ్మన రాసిన "పారిజాతాప హరణం "శ్రీ కృష్ణ దేవ రాయల కాలమ్ లో వికశించిన, ప్రబంధ కవిత్వం తో, పండిత జనం మాత్రమే మెచ్చే ప్రౌఢ రచన ఆద రిమ్పబడి, కవిత్వం ఆకాశ వీధి లో

సంచ రిస్తుండా గా, ఆ కవిత్వాన్ని, భూమార్గం పట్టించి, తేట తేనే లూరే కవితా సౌరభం తో, సామాన్య జనులను ఆకట్టు కొనే, అందరికి తెలిసిన కధ తో అందరి హృదయాల్లో ను నిలిచి పోయే విధం గా కవిత చెప్పిన" ఆ నాటి శ్రీ శ్రీ "నంది తిమ్మన.కవిత్వాన్నే కాదు, దివ్య పుష్ప రాజమైన పారిజాతాన్ని, నాక సీమ లో ని వారికే స్వంతమై గుత్తాధి పత్యం వహిస్తున్న సమయం లో, ఆ వృక్షాన్నే పెకలించి, తెచ్చి, భూమి పై నాటి, అందరికీ అండ జేయ గల్గిన "సామ్య వాదమూ "కని పిస్తుంది.



పుర వర్ణనలు,నాయకా నాయికల విరహ వేదనలు, చందన చర్చల తో విసిగి పోయిన పాఠ కులకు, వాటి జోలికి పోకుండా, చక్కని కధ తో, మందార మక రందాల వంటి పద్యాలతో తీయని కవిత్వం అందించాడు ముక్కు తిమ్మన. రాయల దేవేరికి "అరణం "గా వచ్చి, వారిద్దరి మధ్య ఏర్పడిన "పొలఅలకలు "కు పరిష్కార మార్గం గా, కావ్యం రాసి, వారి మధ్య సాన్ని హిత్యం పెంచి, ప్రేమను ద్విగుణీ కృతం చేసిన కావ్యం గా చిరస్థాయి పొందింది. కధలో మంచినాట కీయత , సంభాషణా విలక్షణత, చూపి, చదువరులను ఆకట్టు కొన్న రచన. గొప్ప ఎత్తు తో కధ ప్రారంభించి, చివరికి చక్కని సాఫల్యత కూర్చిన రచన. అడుగడుగునా, "ముద్దు పల్కులు "తో, రస ప్లావితం చేశాడు. అవసర మైతే అర్ధం కాని "మొద్దు పలుకులు "కూడా వాడాడు. "శరదాం బుద చిత్తులే పూరుషుల్ "అని సుద్దులూ చెప్పాడు. అయితే మను చరిత్ర లా త్రవ్విన కొద్దీ, వినూత్న భావాలు కల్గించే కావ్యం మాత్రం కాదు. lighter vein తో రాసిన కావ్యం

కోతిని "తిమ్మన "అని ముద్దు గా పిలుస్తాం. కోతి చేష్టలు తమాషా గా వుంటాయి. చిలిపిదొంగ తనాలు చేయటం, మనల్ని నవ్వించటం, కోతి ప్రత్యేకత. తిమ్మన లో కూడా ఆ లక్షణాలు కని పిస్తాయి. అందుకే దేవ పారిజాతాన్ని, సాక్షాత్తు శ్రీ కృష్ణుడే దొంగిలించే, చిలిపి తనాన్ని కధ గా, వాడుకొన్నాడు.

కధ లో దొంగతనానికి పెద్ద పీట వేశాడు శీర్షికా అదే కదా.అందుకే శ్రీ కృష్ణున్ని ఎవరు వర్ణించినా ఆయన దొంగాటల్నీ, మాయా ప్రవృత్తి నే వర్ణిస్తారు. గరుత్మంతుణ్ణి కూడ "దుర్లభామృత పశ్యతో హరుండు "అంటాడు. యుద్ధం వుంది కనుక వీలైన చోట్లల్లా, "గోపా వధూ వంచాకుదనీ ","దానవ ధ్వంసి"అనీ, "ముర మర్దనుడు "అనీ కపట స్త్రీ రూపం ధరించాడనీ, "కంస ఘర్మసుడనీ ",సత్యా విదేయుడనీ, నముచి మాధనుడనీ,, మధు సూదనుడు అనీ సాభిప్రాయం గా అంటాడు, అని పిస్తాడు. అలాగే ఇంద్రుణ్ణి "జంభ వైరి "అనీ, "పాక దమనుడుఅనీ "బల హరుడనీ "ఔచితీ యుతం గా అంటాడు.

శ్రీ కృష్ణుణ్ణి ఎక్కడా అపర బ్రహ్మ తత్త్వం అన్నట్లుగా, కవి చెప్పడు. ఆయనకు స్తోత్ర పాఠాలు కవి చేయడు. అయితే ఇంద్రుని తల్లి "అదితి 'శ్రీ కృష్ణ దర్శ నానికి పులకించి, ఆయన అవతారాలను వర్ణిస్తుంది. అందు లోను, ఆయన కపట వేషాలను మెచ్చ టమే ఎక్కువ. ఇలా శ్రీ కృష్ణుడు చేయ బోయే దొంగ తనానికి అందరు మాంచి". బిల్డప్" ఇస్తారు. "భవ రోగ వైద్యుని "గా కృష్ణుని వర్ణిస్తాడు కవి

ఈ వైద్యానికి సాధనాలు కావాలి కదా. అందులోను, ఇంద్ర, అష్ట దిక్పాలకు లతో యుద్ధమాయే. ఆ యుద్ధం లో గాయ పడ్డా వారికి చికిత్స చేయాలంటే చాలా ఔషధాలు కావాలి. అందుకే సూర్యోదయాన్ని, వర్ణిస్తూ తమ్మ కవి సద్భుట మైన పద్యం చెప్పాడు.

మొగుడు దమ్ముల జిక్కు, మగ తేటి యలుగులు -సడలి పో జేయు విశల్య కరణి
కాల వశంబున గద చన్న వాసర శ్రీ -గ్రమ్మ రించు సంజీవ కరణి
రేయును వాలున, బాయ లైన రథాంగ -తతుల హత్తించు సంధాన కరణి
తివిరంబు జే సోంపు, సమసిన దిశలకు, వన్నియ నొసగు సావరణ కరణి

మించు బీరెండ యగ్ని బుట్టించు నరణి -- కలుష ఘోష పయో రాశి, గడుపు తరణి
దోచె బ్రాచీ మహీధరో త్తుంగ సరణి --బ్రా జదుపు, ముని కంబుల బరని తరణి "

దీని అర్ధం తెలుసు కొక పోతే వ్యర్ధమే. "ముకుళించిన పద్మాల్లో చిక్కిన తేనే టీగలను సాడ లించే విశల్య కరణి సూర్యుడు. (గ్గుచ్చుకొన్న బాణాలను తీసేది )కాల గతి లో నశించిన దిన లక్ష్మిని, మరలించే అంటే బతికించే సంజీవ కరణి. రాత్రి అనే కత్తి చేత, ముక్క లైన చక్ర వాక పక్షులను అంట జేసే సంధాన కరణి సూర్యుడు. చీకటి వల్ల అందం పోయిన దిక్కులకు శోభనిచ్చే సౌవర్ణ కరణి. పెరిగిన సూర్య తాపం అనే అగ్నిని పుట్టించే "ఆరణి ' ( అగ్నిని మధించేది )'సూర్యుడు. పాపం అనే భయంకర సముద్రాని దాటించే వోడ. వేదాలు అనే మాణిక్యాల భరిణ సూర్య నారా యణుడు, వేద స్వరూపుడు. అద్భుత మైన సందర్భోచిత మైన వర్ణనా.. తిమ్మన కవీ హాట్స్ ఆఫ్.

సూర్యోదయ వర్ణనను ఎంత సాభిప్రాయం గా వర్ణించాడో, తిమ్మకవి సూర్యాస్త మయాన్ని అలానే వర్ణిస్తాడు "దివాంత నాధుడే ఛాయా దదీయ పత్ని బెలుచు, నీడిచి కొంచు బోయే డింగో, యను మాడ్కి, నంతట, శకుంత రవంబు చెలంగ నెల్లెడన్ "అన్నాడు. అంటే -చీకటి అనే రాజు, ప్రభ తగ్గిన పగలు అనే రాజు భార్య, "ఛాయా "ను క్రూరం గా, భూమిపైకి పడ దోసి, లాక్కొని పోతుంటే, ఆమె కేకలు పక్షుల రవాలు గా విన్పిస్తూ న్నాయట.. రా బోయే పారిజాతా పహరణ కు నాంది. ఆ భీభత్సమే కలరవం, కలవరం కూడా..

-- "ఘన సంధ్య రాగ వినతా, తనయ, గరుత్చమితి -కడిది తాకున, ధర వ్రాలిన గగన ఫణి ఫణా మణి యన, రవి మండలము పశ్చి మాంబుధి గ్రుస్కెన్ "

సంజ కెంజాయ అనే గరుడుని రెక్కల ఘాటు దెబ్బలకు, భూమి మీద ఆకాశం అనే సర్పం యొక్క మాణిక్యం అన్నట్లుగా, సూర్య మండలం పడమటి సముద్రం లో అస్తమించింది. గరుడిని రెక్కలూ ఎరుపు, సంజె కూడా ఎరుపే. గగన ఫణి అనే శ్రీ కృష్ణ సర్పం -భవిష్యత్తు లో శ్రీ కృష్ణ -గరుత్మంతుల పరాక్రమ ప్రదర్శనకు నేపధ్యం. ఇలా ప్రకృతి వర్ణన లో కూడా, రాబోయే కధకు చక్కని basement వేశాడు, భేష్ అని పించాడు.

"మరుదీశ, ద్విపదాన శోభ, శిఖా దూమ్యా రోచి -గీనాశ, కాసర దేహ ప్రభ, రాక్షసాసి లతికా కంచ ద్దీదితి , న్వారి దేశ్వర, కేతు ద్యుతి, మాత రిశ్వ, హరిణ చ్చాయన్, ధనా ధ్యక్ష,, నీల రుచిన్, ధూర్జటి కంత(kantha ) కాంతి దమముల్, ప్రాపిన్చే దిగ్భిత్తు లం. " దేవేంద్రుని ఇరావత మద కాంతి వంటి కాంతి తో, అగ్నితేజస్సు తో, యముని మహిష కాంతి తో, నైరుతి లత లాంటి కత్తి కాంతి తో, వరుణుడి జెండా రంగు తో, వాయువు లేడి వంటి కాంతి తో, కుబేరుని నీల కాంతి తో, ఈశ్వరుని, నీల కంత శోభ తో, చీకట్లు వ్యాపించా యట.. ఇదంతా రాబోయే యుద్ధం లో ఈ మహా మహులంతా పాల్గొన బోతున్నారని తెలియ జెప్పే, తెలివైన, గడసరి, నొగసరి విధానం. ముక్కు వారి ముద్దు పలుకు సింగారమే ఇది.

తిమ్మ కవి తన కాలమ్ లో వారి తో పాటు, ప్రౌఢ మైన కవిత్వమూ, నర్మ గర్భ కవిత్వమూ, చెప్ప గలననీ, చివర లో అన్ని రకాల "బంధ కవిత్వం "రుచి చూపించాడు. చిత్ర కవిత్వానీ అందించాడు. సరి వార ల తో తాను సరి సమానున్నని, రుజువు చేశాడు. ఇవన్నీ నారదుడు శ్రీ కృష్ణుని పొగడ టానికి ఉపయోగించిన ఛందో వేది ".చిత్ర చిత్ర స్వభావుడు కనుక చిత్ర గతులతో, నవ్విభు కొనియాడి "అంటాడు కవి సాభిప్రాయం గా.

11 వ శతాబ్దం లోసంస్కృతం లో "పారిజాతాప హరణం "నాటకం గారాశాడు ఒక అజ్ఞాత కవి. శ్రీ నారాయణ తీర్దులు "శ్రీ కృష్ణ లీలా తరంగిణి "తో పాటు "పారిజాతాపహరణం యక్ష గానం "చేశారు. 16 వ శతాబ్ది లో రఘు నాద నాయకుడు కూడా, ఈ ప్రబంధాన్ని రాశాడు. "మాత్రు భూత కవి ఈ నాటకం రాసి 1788 -89 లోతంజావూర్ ను పాలించిన "అమర సింహ రాజు కు అంకితం ఇచ్చాడు.

"నానా సూన వితాన వాసనల నానదించు సారంగమేలా నల్లోల్ల దటంచు, గంధ ఫ లి బల్ కాకన్ "అన్న పద్యాన్ని తిమ్మనే వ్రాశాడు. అందుకే ముక్కు తిమ్మన అనే పేరు వచ్చిందని కొందరి భావన. 1520 నాటికే పారిజాతాపహరణం కావ్యం రాసి 1526 లో తిమ్మ మహా కవి అస్త మించాడు. ఆయన చిత్ర పద్యం తోనే ముగింపు పలుకు తాను

"చిత్రా కృత్య భి నందిత, వజ్ర ముఖాక్షీ మధ్యగా, యక్ష రా

మిత్రో ష్ణద్యుతి దిగ్ధ చక్ర జానీ, వాల్మీ కర్ళపా, కృష్ణ భా
సూత్రా రాద్య, నుతింతు, నిన్ను, జగదీశా, విక్రమాస్థిరా
రాత్రీ నాన్విత భూమి తాబ్ద సదయా, రాధాను భావా కరా "

స్వస్తి --సంపూర్ణం

# రాసలీల ఉత్త్ర్కుష్ట మధురభక్తి కి తార్కాణం అనీబిసెంట్

బృందావన గోపికలు శ్రీ కృష్ణ పరమాత్మపై చూపిన ఆరాధన అంతామధురభక్తి మాత్రమే. అంటే ప్రేమతో ఆరాధించటం. మధురభక్తి కి చెందిన అనేక రకాల వృత్తాంతాలు, చిత్రాలలో శిల్పాలలో, భారతదేశమంతా ఉన్నాయి. దీనికి ఉదాహరణగా కవిత్వం లో మనకు మొదట కనబడేది రాదా కృష్ణులమధ్య ఉన్న మధురభక్తి కి చెందిన12వ శాతాబ్దికవి భక్త జయదేవుని గీత గోవిందకావ్యం. ఇందులో ముఖ్యపాత్ర రాధ శ్రీ కృష్ణునికి అత్యంత ఆత్మీయ ప్రేయసి. ఆమెకు కృష్ణుడు తప్ప ఎవరూ అక్కరలేదు. ఆమె కృష్ణుడినే చూసింది, ఆయననే విన్నది. ఆయన గురించిమాత్రమే భజనల్లో మాట్లాడింది. రాధ శ్రీ కృష్ణుని కోసమే, ఆయనగురించే ఆయనతోనే మాట్లాడింది. ఆమె పై వలపు విసిరినివారెవ్వరినీ లెక్కచేయలేదు. ఆమె మనసా వాచా కర్మణా బృందావన నంద కిశోరునినే వలచింది ప్రేమించింది ఆరాధించింది. ఆమ మనసు, హృదయం నిండా కృష్ణుడే.వేరొకరికి చోటేలేదు. ఆయనమనసులో, మదిలో కూడా ఆమె యే.గీత గోవిందం పాటలు దేశమంతటా అందరూ గానం చేసి పరవశిస్తారు. భజనలో పాడి తన్మయత్వం పొందుతారు. ఒక్కోసారి ఆ పారవశ్యం లో లోకమే మర్చిపోతారు. జయదేవకవి గీతాలకోలాహలం నిర్బంధం లేని మనోల్లాసం, ఆత్మ సంతృప్తి కలిగిస్తాయి., విక్టోరియన్ భావజాలం లో "కాముపూరిత శృంగారం"(ఈరోటిక్) అనుకొన్నా, మనదేశం లో ఈ కావ్యం భక్తిమార్గం లో కేంద్ర బిందువైంది. ఇది దేవుడే రాసుకొన్న స్తుతి కావ్యం. ఈ గీతాలు గానం చేస్తూ నృత్యం చేస్తుంటే ఆ గానానికి,లయకూ, నాట్యానికి మాత్రమే కాదు అందులో వర్ణింపబడిన రాదా కృష్ణుల లీలా సాహిత్యానికి కూడా ముగ్దులమౌతాం,



దీనికి అంతటికి అసలు మూలం ఏది ?ఇదంతా జయదేవుని ఊహ, సృష్టి యా.కానే కాదు. దీనికి వ్యాసమహర్షి రచించిన శ్రీమద్భాగవతం లోనే మూలాలున్నాయి.దశమ స్కంధం లో 29నుంచి 33వరకు ఉన్న అయిదు అధ్యాయాలను "రాస పంచాధ్యాయి "అంటారు. ఇవి శ్రీకృష్ణునికి, బృందావన గోపికలకు మధ్య జరిగిన రాసలీల ను పూర్తిగా తెలియ జేస్తాయి. దీన్ని మనం సరిగ్గా అర్ధం చేసుకొని అభినందించాలనుకొంటే, ముందు మన మనసులను సరిగ్గా దానికి తగినట్లు ట్యూన్ చేసుకోవాలి.

ఒకసారి వెనక జరిగిన "గోపికా వస్త్రాపహరణం "దగ్గరకు వెడదాం. ఆరేళ్ళ పిన్నడు ఆపనిచేయటం అనైతికం అనిపిస్తుంది. ఆకుర్రాడు ఆరిందాలాగా ఆడవారి వినయం పై , పెద్దాడిగామాట్లాడుతాడు.దీనిపై అనిబిసెంట్ చాలా చక్కని వివరణ ఇచ్చింది.

"గోపికలు ఋషులు. బాలకృష్ణ రూప జగ దుద్ధారకుడు, మహాత్ముడు శ్రీ కృష్ణుడు గోపికలకు పాఠం చెబుతున్నాడు, దీని వెనకాల పరమ నిగూఢమైన రహస్యం ఉన్నది. ఆత్మ పరమాత్మను చేరేముందు, కఠిన పరీక్ష ఎదుర్కోవాలి, అప్పటిదాకా బాహ్యంగా తన వెంట ఉన్నవన్నీ, తనకు ఆధారమైనవన్నీ ఒక్క అంతరంగాన్ని తప్ప అనీ వదిలేయాలి అంటే విసర్జించేయాలి. అంటే తనకు రక్షగా ఉన్న సర్వ విషయాలు, ఆచ్చాదనలు వదిలేసి నిస్సిగ్గుగా ఆత్మనొక్కటే నమ్ముకొని అన్నీ విసర్జించి నగ్నంగా, వంటరిగా నిలబడాలి. ఈ పరీక్షలో జంకు గొంకులకు తావే లేదు. బయటి సహాయం అపేక్షించకుండా, దేనిపైనా

ఆధారపడకుండా, చివరికి గురువుపైనా భారం వేయకుండా యేకతా దృష్టిలో ఉండాలి, వంటరిగా, నగ్నంగా మాత్రమే ఆత్మ పరమాత్మ వైపుకు ప్రయాణంచేయాలి, ఇక్కడెవరూ చేయి అందించేవారుండరు. చేయిచ్చినా, చేదుకొన్నా ఆ లీలామానుష రూపుడుఒక్కడే. ఈ ఉత్కృష్ట భావాన్ని వ్యాసమహర్షి గోపికా వస్త్రాపహరణం లో గోపికా కృష్ణుల నెపం తో అందరికీ ఎరుక కలిగించాడు.

శ్రీ కృష్ణుని దివ్యత్వమే రాసలీల అంటుంది బెసెంట్ సతీమణి. వ్యాసర్షి భాగవత ప్రారంభం లో శ్రీ కృష్ణ జననం వివరిస్తూ శ్రావణ మాసంలో రోహిణీ నక్షత్ర యుక్తబహుళ అష్టమి నాడు కంసుని మధురలోని కారాగారం లో కృష్ణజననం జరిగిందని చెప్పాడు. భాగవత దశమస్కంధం మూడవ అధ్యాయం లో లో వ్యాసుడు ఆ సన్నివేశాన్ని వొడలు గగుర్పొడిచేట్లు వర్ణించాడు. గాఢాంధకారం లో రాత్రివేళ దేవదేవుడుచంద్రుడు తూర్పు దిక్చక్రం లో ఉదయించి పెరుగుతున్నట్లు సాక్షాత్కరించాడు –కనిపించాడు అన్నాడు కాని, దేవకీ గర్భం నుండి జన్మించాడు అని చెప్పలేదు. ఆసన్నివేశం మహోత్కృష్టం –


THE BHAGAVAD GÎTÂ

OR

THE LORD'S SONG

TRANSLATED BY

ANNIE BESANT

London:
Theosophical Publishing Society
7, Duke St., Adelphi, W.C.
BENARES: THEOSOPHICAL PUBLISHING SOCIETY
MADRAS: THEOSOPHICAL SOCIETY, ADYAR
1895

"తమ్ అద్భుతం బాలకం అంబుజేక్షణం-చతుర్భుజం, శంఖ గదార్యాయుదయుధం -శ్రీ వక్ష లక్షణం, గలశోభి కౌస్తుభం పీతాంబరం సాంద్ర పయోద సౌభగం –మహార్హ వైడూర్య కిరీట కుండలం –త్విషాపరిష్వక్త సహస్ర కుంతలం –ఉద్దామ కాన్చ్యంగదకంకణాదిభిః-విరాజమానం వసుదేవ ఐక్షత "

భావం –దేవకి భర్త వసుదేవుడు ఆ బాలకృష్ణుడిని-చతుర్భుజాలతో శంఖ గద చక్ర కమలాలతో, ఉరమున శ్రీవత్స చిహ్నం తో,మెడలో కౌస్తుభ మాలతో, పీతాంబర ధారియై, నవనీల మేఘశ్యామల వర్ణం తో, చిక్కని శిరోజాలు కర్ణాభరణాలపై అలంకరింపబడిన కిరీటం తో, ధగద్ధగాయమానమైన వజ్రాది హారాలతో, కటి, హస్త, ముంజేతులకు అలంకారాలతో దర్శించాడు.

మనం నమ్మినా నమ్మక పోయినా ఇది యదార్థం. ఇది నమ్మకపోతే రాసలీల వ్యాసుని ఊహాలీల, కల్పితహేల అనిపించి ఇక చెప్పటానికేమీలేక వ్యాస రచన ను మాత్రమే చదవగలం. ఇదంతా పరమ సత్యం అని నమ్మితే, శ్రీకృష్ణ రాసలీల కూడా యదార్థమే నని నమ్మాల్సిందే. ఏదో నమ్మటం మాత్రమె కాదు. అప్పుడే దానిలో న్యాయ నిబద్ధత కనిపిస్తుంది. రాసలీలపై మంచి, చెడు అనుమానాలు వస్తే, శ్రీ కృష్ణ జనన వృత్తాంతాన్ని తప్పక నమ్మాము అని మర్చిపోరాదు. కనుక శ్రీ కృష్ణుడు సర్వ శక్తిమంతుడు, సంపూర్ణ అతీత మానస దివ్యమూర్తి అని గ్రహించాలి.

మనలాగా కృష్ణుడు ఒక సాధారణ మానవుడు అనుకొంటే రాసలీల అంతా హుళక్కి అని పిస్తుంది.ఆస్థాయి దాటి ఆలోచిస్తేనే, అందులోని పరమార్థం ద్యోతకమౌతుంది. శ్రీ కృష్ణుని ఇంద్రియాతీత పారమార్థిక దివ్య మూర్తిగా,సర్వాంతర్యామిగా, సర్వజ్ఞునిగా సర్వ శక్తి వంతునిగా తెలుసుకోవాలి. ఈ చిత్త సంస్కారమే లేకపోతే,మనల్ని మనమే కోల్పోయి, రాసలీల తత్వాన్ని చర్చించి అర్థం చేసుకొని ఆనందించటానికి అర్హత కోల్పోతాము.



ఇప్పుడు అసలు కథ లోకి వద్దాం. అప్పటికి కృష్ణుడికి 10ఏళ్ళు లేక కొంచెం తక్కువ మాత్రమే అని మర్చి పోరాదు.బృందావన గోపికలు “కాత్యాయని వ్రతం “ చేస్తున్నారు. శ్రీ కృష్ణుని” తమ పతి”గా చేసుకోవటానికి చేస్తున్న వ్రతం అది. ఇది చాలా నియమాల తోరణం.

తెల్లవారు ఝామున యమునా నదిలో స్నానం, నది ఒడ్డున ఇసుకతో పార్వతీ దేవి ప్రతిమ తయారు చేసి యధావిధిగా పూజించటం, నెల రోజుల కార్యక్రమం. చివరి రోజున జరిగిందే గోపికా వస్త్రాపహరణం. కాత్యాయని వ్రత దీక్షలో ఉన్నప్పుడు వారు నగ్నం గా స్నానం చేయరాదని కృష్ణుడు చెప్పాడు. వాళ్ళు వ్రతభంగం చేసినందుకు శిక్షగా” చీరలెత్తుకెళ్ళాడు చిన్ని కృష్ణుడు “. తర్వాత వాళ్ళ” వలువలు” వాళ్ళ కిచ్చి వేశాడు. వారు కోరిన కాత్యాయన వ్రత ఫలంగా-అంటే కృష్ణుని పతిగా పొందే భాగ్య ఫలంగా కొద్దికాలం లోనే వారికి కోర్కె తీరుస్తానని బాస చేశాడు. ఈ సందర్భంగానే ఆయన వాళ్ళకు ఒక విషయం స్పష్టంగా చెప్పాడు –

“ న మయ్యా వేషిత ధియుం కామః కామయ కల్పతే –భర్జితా,ఖచ్చితా ధన ప్రయో బీజయ నేష్యతే”-అంటే –మీలో ఎవరు మీ మనసు,బుద్ధి నావైపు త్రిప్పి ఉంచారో, వారిలో కోరిక, లేక మోహం కలిగి నందువలన అది వేడి చేసిన లేక ఉడకేసిన విత్తనం మొల కెత్తని విధం గా చెడు లేక దోషం కానే కాదు.మన సర్వ వేదాంత గ్రంధాలు కూడా బ్రహ్మ జ్ఞానికి కర్మవాసనలు వేడి చేసిన విత్తనం మొలకెత్తని విధంగా అంటవు,వెంటరావు అనే చెప్పాయన్న సంగతి మర్చిపోరాదు.

గోపికల కాత్యాయని వ్రత ఫలితం అందుకొనే రోజు శరత్ పౌర్ణమి రానే వచ్చింది. ఆయన మాయ చే సృష్టింపబడిన” దివ్య లీల” ఇది, - ”యోగమయం ఉపశ్రితః “అన్నాడు అందుకే. పున్నమి నాటి రాత్రి బాలకృష్ణుని సమ్మోహిత మధుర వేణుగానం యమునానదీ తట విపిన సీమలలో



ప్రతిధ్వనించి, ప్రకృతిని సర్వజీవజాలాన్ని పరవశం కలిగిస్తోంది. గోపికల వీనులకు విందుగా ధ్వనించి అద్భుత రసవాహినియై మనసులను, శరీరాన్ని పుల కింప జేస్తోంది. ప్రతివారిని దైనందిన కృత్యాలకుదూరం చేసి, ఆనంద పారవశ్యం తో

యమునా తీరం వైపుకులాక్కు వెడుతోంది. దీనికేవరూ మినహాయింపుగా కనిపించలేదు. చెట్లు లతలు పొదలు పూలు, ఆకులు పక్షులు జంతువులు మంత్ర ముగ్ధంగా నిలబడి పోయాయి. ఆ దివ్య వేణునాదం అందరి తనువూ మనసులను పులకరింప జేసి, చిత్తరువు బొమ్మలైపోయారు.ఈ మధుర దృశ్యాన్ని కరుణశ్రీ గారు కమ్మని పద్యాలలో పొదిగారు –

"ఏది మరొక్కమారు హృదయేశ్వర గుండెలు పుల్కరించగా ఊదగ దోయి, ఊదగ దోయి –యుష్మదీయ వేణూదయ రాగ డోలికలలో జగమ్ము సర్వమ్ము పులకరించిన దోయి "

ఈ సంపూర్ణ మధుర దివ్యనాదం ఆలకించిన గోపికలకు మనసు మనసులో లేదు. పారవశ్యం తో ఎక్కడిపనులక్కడే వదిలేసి భర్త, తండ్రి, అత్తామామ,బంధుత్వాలను కూడా విసర్జించి, తమను తామే పూర్తిగా మరచిపోయి ఆ నాదం వైపుకు బారులుకట్టి పరుగులు తీశారు, కృష్ణ వేణునాదం ఎరవేసి వాళ్ళను లాక్కు పోయింది. కొందరు గోపికలు ఇంటిపనులు సంసారం వదిలి పెట్టలేక ఇళ్లలోనే ఉంటూ, బాల కృష్ణుని పై అపార ప్రేమతో, కళ్ళు మూసుకొని ఏకాగ్ర చిత్తం తో ఆ వేణుగానాన్ని వింటూ పరవశించారు. శ్రీకృష్ణుని తో ఎడబాటుకు తల్లడిల్లిపోయారు. దీనితో వారి పాప మంతా దగ్ధమైపోయింది –"తీవ్ర పాప ధృత శుభం ". ద ఆయనపై సంపూర్ణ ధ్యాస,ఆరాధనతో వారు ఆయన పరిష్వంగ సుఖపారవశ్యం పొంది, వారి భౌతిక భక్తి నశించి ఆధ్యాత్మికానందం పొందారు. కృష్ణుడు దేవాది దేవుడై,పరమాత్ముయై,తమకు అత్యంత మానస ప్రియుడై, స్నేహితుడై, అత్యంత సన్నిహితుడైపోయాడు. వారి కర్మ బంధాలన్నీ చేదింప బడ్డాయి.భౌతిక శరీరాలు నశించి, ఆధ్యాత్మిక శారీరులైనారు.

ఇక్కడే పరీక్షిత్ మహారాజుకు ఒక ధర్మ సందేహం వచ్చి శుకమహర్షిని "మహర్షీ !గోపికలు కృష్ణుని తమ ప్రియుడు అనే భావించారు కాని, శుద్ధ సత్య స్వరూపం అనే ఎరుకలేదు. వారు తమ స్వస్వరూప భావన వదిలి భౌతిక బంధాలను ఎలా చేదించు కోగలిగారు ?"అని అడిగితె శుకుడు "కృష్ణుని ద్వేషించిన శిశుపాలుడే కర్మబంధ విమోచనం పొందితే, ఆయనను అత్యంత ప్రేమగా ఆరాధించే గోపికలకు విమోచనం కలగటం లో ఆశ్చర్యమేమున్నది ?పరమాత్మ ప్రమాణాలకు అందనివాడు. ఆయన కొరతలేని నిత్య సంపూర్ణుడు. మాయ ఆయన సృష్టి,దాని నియంత్రణ చేసేవాడు కనుక ప్రకృతికి బంధుడు కాదు. ఆయన అవతార పరమార్ధం మానవులకు అత్యంత ప్రయోజనాలు సమకూర్చటమే. కోరిక, కోపం, భయం, రక్షణ, ఆయనతో తాదాత్మ్యభావం, ఆయనతో స్నేహం ఉన్నవారందరూ ఆయన స్మరణతో ఆయనలో ఐక్యమైపోతారు. దీనికి ఆశ్చర్య పడాల్సిన అవసరం లేదు. నువ్వు చాలా అదృష్ట వంతుడవు రాజా !నువ్వు గర్భం లో ఉండగానే ఆయన దర్శనం అనుభవించిన పుణ్యా త్ముడవు. "అని సందేహాలన్నీ నివృత్తి చేశాడు శుకర్షి.

బాలకృష్ణుడు గోపికలంతా బిరబిరా తన వద్దకు రావటం మూగటం గమనించి, వెనక్కి వెళ్లి పొమ్మని చెప్పాడు. వాళ్ళ మొదటికర్తవ్యం ఇంటి వద్ద భర్తను ఇంటిని పిల్లలను చూసుకోవటం అని చెప్పి "మీకు నాపై అత్యంత ప్రేమాభిమానాలున్నాయి నాతో అనుబంధం ఉందిమీకు. ఇది మీకు సహజమే. ప్రపంచం లో ప్రతిజీవి నాతో ఆనందం అనుభవిస్తారు –"ప్రియంతే మయి జనతాః".కాని మీ విధి కృత్యం వేరే చోట ఉంది. గౌరవ కుటుంబాలకు చెందిన మీలాంటి స్త్రీలు ఇలా చేయటం దోషం. వారు పతనమై స్వర్గానికి దూరమై, సంఘం లో గౌరవం కోల్పోయి కష్టాలు, దుఖం అనుభవిస్తారు "అని చెప్పి ఒక గొప్ప శ్లోకం చెప్పాడు దానిని ఆయన మళ్ళీ చెప్పాడు తర్వాత. -

"శ్రవణాత్, దర్శనాత్,ధ్యానాత్ మయి భావో ను కీర్తనాత్-న తథా,సన్ని కర్షేణప్రతియాత తతో గృహాన్"-

అంటే –నాపై పారమార్ధిక ప్రేమ కలగటానికి నిరంతరం నన్ను గురించివినటం, నా ప్రతిమను ఆరాధించటం, నాపై ధ్యానం, విశ్వాసంతో నా గుణ గాన కీర్తన చేయటం చేయాలి. నాతో భౌతిక సామీప్యత వలన పై ఫలితం రాదు. కనుక దయచేసి మీ ఇళ్ళకు తిరిగి వెళ్లి పొండి"అని పరిపరివిధాల నచ్చ చెప్పే ప్రయత్నం చేశాడు కృష్ణుడు.

కృష్ణుడు యెంత నచ్చ చెప్పినా గోపికలు వినలేదు. మొదట భర్తకు, తర్వాత కుటుంబ విధి అని ఆయన చెప్పినదానికి ఆయనే తమ పతి,తమకే కాక ఎల్లలోకాలకు ఆయనే భర్త అని, కనుక తమ మొదటికర్తవ్యం శ్రీ కృష్ణుని సేవయే అని "మా హృదయాలు, శరీరాలు కుటుంబం సర్వం నీకే ఆధీనాలు. నువ్వే వీటినన్నిటినీ లోబరచుకొన్నావు. మా చేతులు, కళ్ళు బుద్ధి మనసు మావికావు. అవన్నీ నీవే. నీకు కానిపనిని దేనినీ అవి చేయటానికి అంగీకరించటం లేదు. కనుక నీ అధీనులమైనమమ్మల్ని వెనక్కి వెళ్ళమని అనవద్దు స్వామీ. మమ్మల్ని నీసేవకులుగా వినియోగించుకో ప్రభూ "అని వేడుకొన్నారు –

"ఇతి వికల వికటం తాసాంశ్రుత్వ యోగేశ్వరేశ్వర-ప్రహస్య సదయం గోపీః ఆత్మా రామో ప్యరిరమత్"

గోపికల మాటలకు చిరునవ్వు నవ్వి జగత్ ప్రభువు, సర్వ లోక నాధుడు వారందరినీ సంతృప్తి పరచాడు. ఆయన స్వయం సంతృప్తి ఉన్న మహానుభావుడుకదా.ఆయన ఆత్మారాముడు. ఆయన దగ్గర లేనిది లేదు –"నానవాప్తం అవాప్తవ్యం "అని గీతలో ఆయనే చెప్పాడు. ఎప్పుడైతే వారిని తనకు అత్యంత సన్నిహితులని భావించాడో అప్పుడు గోపికలు తాము ఉత్కృష్ట జీవులమని భావించారు. తామే భూ ప్రపంచం లో లోఅత్యంత గొప్పవాళ్ళం అనుకొన్నారు. దీనితో వారిలో కించిత్ గర్వ రేఖను స్వామి కనుగొన్నాడు. వారి కి సరైన ఆధ్యాత్మిక బోధ చేయాలని భావించి, అకస్మాత్తుగా అదృశ్యమయ్యాడు.

బాల కృష్ణుని కోసం గోపికలు అన్ని చోట్లా వెతకటం ప్రారంభించారు. ఆయన ఎడబాటును సహించలేకపోయారు. తట్టుకోలేక పోయారు. బుద్ధి పని చేయటం లేదు. ఆయనంటే విపరీతమైన పిచ్చ పట్టింది. దీనినే విరహం అంటారు. భక్తి లో ఇది ఉత్కృష్ట స్థాయి. అందరికి భగవంతు డంటే ఇష్టమే. కాని ఆయన ఎడబాటును గోపికలు భావించి నంతగా మనం అనుభవించలేము. భగవంతుడు మనం ఇచ్చేది స్వీకరించడు అనుకొంటాం. కాని భక్త శబరి ఇచ్చినట్లుగా మనం ఇవ్వగలమా ?.దేవుడు మనమొర ఆలకించి మనల్ని రక్షించడు అని భావిస్తాం, కాని ద్రౌపది పిలిచినంత ఆర్తిగా పిలుస్తామా ?దేవుడు మనకు వరాలివ్వడనుకొంటాం, కాని రాధ ప్రేమించినంత గాఢంగా ఆయన్ను ప్రేమించగలమా ? అంటే మనం చేసేదాంట్లో తీవ్రత ఉంటేనే ఆయన నుంచి స్పందన ఉంటుంది. ఏదో పూజా నైవేద్యాలతో సరిపెట్టుకొంటే ఆయనా అలాగే ఉపేక్ష భావంతోనే ఉంటాడు.

గోపికలు ఆ అడవి అంతా గాలించారు. దారిలో ఆయన పాదముద్రల ఆనవాళ్ళు కనిపిస్తే వాటి నాధారంగా వెతికారు. తర్వాత ప్రక్కప్రక్కనేపాదముద్రల ద్వయం కనిపించి ఆశ్చర్యాన్ని కలిగించాయి, అందులో ఒకటి స్త్రీపాదంగా. రెండోది స్వామి పాదంగా గుర్తించారు. వాళ్లకు అసూయ హద్దు మీరింది. తమలోనే ఎవరో ఆయనతో గడుపుతున్నారని అనుమానమొచ్చింది. ఆమె తమకన్నా గొప్ప అదృష్టవంతురాలు అనుకొన్నారు. కృష్ణస్వామితో ఉన్న ఆ ఒంటరి గోపికకు తమాషా అనుభవం ఎదురైంది. తానె అదృష్టవంతురాలననుకొని ఆయన్ను తనను మోసుకొని వెళ్ళమని కోరింది. నవ్వుతూ సరే అని భుజాలమీద ఎక్కమన్నాడు. ఎక్కే ప్రయత్నం చేస్తుండగా చటుక్కున మాయమయ్యాడు. దీనితో ఆమె గర్వం ఖర్వమైంది. మిగిలిన బృందమంతా వచ్చి చేరగా అందరూ కలిసి మళ్ళీ వెతుకులాట మొదలెట్టారు. ఈ ఏకైక వనిత రాధ అని తర్వాత సాహిత్యకారులు రాశారు. ఆకాశం లో మబ్బులు కమ్మాయి. చంద్రకాంతి తగ్గింది.అందరు తిరిగి బయలు దేరిన చోటికే చేరుకొన్నారు. తాము కృష్ణుడితో మాట్లాడిమాటలు, ఆయనతో తిరిగిన ప్రదేశాలు ఆ అనుభవాలు గుర్తు చేసుకొంటూ, ఇంటిని మరచి, ఆయన గుణగానం చేస్తూ పరవశించి పోతున్నారు –

"తన్ మనస్కాస్, తదాలాపాస్ తద్విచేస్టాస్,తదాత్మికాః-తద్గుణమేవ గాయన్త్యః నాత్మాగారాని సస్మరుః"

ఇదీ గోపికల ఉత్కృష్ట ప్రేమ భక్తి.ఇదే అన్ని భక్తులలో ఉన్నతమైనది.దీనినే గీతలో కృష్ణపరమాత్మ వివరించాడు –

"తద్బుద్ధయాస్ తదాత్మనాస్,తన్నిస్టాస్ తత్ పారాయణాః-గచ్చన్త్య పునరా వృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః"

అంటే ఎవరు తమబుద్ధి మనసు దాని(బ్రహ్మం )పై ఉంచుతారో, ఎవరి ఆత్మ అదో,దానిపైనే దృష్టి పెడతారో,అదే తమ గమ్యమని భావిస్తారో వారు పునర్జన్మ లేని పరమపదం పొందుతారు. ఇంతటి ఉత్కృష్ట భక్తీ గోపికలది కనుక ఉత్తమ భక్తీ తత్పరులకు గొప్ప ఉదాహరణగా బృందావన గోపికలు నిలబడ్డారు. నిస్వార్ధ భక్తికి గోపికలే ఉదాహరణ. కర్మ కన్నా ఈ జ్ఞానభక్తి వారిని ఉన్నతులను చేసి పరమాత్మ సాన్నిధ్యానికి చేర్చింది. మనసులను గోపికలు అర్పించినట్లుగా ఎవరూ అర్పించేనే లేదు.

నారాయణ ఉపనిషత్ శ్లోకం –

"ఐక్యం తే దాన హోమ వ్రతనియమ తపస్సాంఖ్య యోగైర్దురాపం –త్వత్సంఘేనైవ. గోప్యయాః కిల సుకృతి తమః ప్రాపురానంద సంద్రం –భక్తే శ్వన్యే సుభూసస్వపి బహు మనుషే భక్తిం ఏవ త్వమాసాం –తన్మే త్వద్భక్తిం ఏవ దృఢయా హర గదాన్ కృష్ణ వాతాలయః "

దానం జపం తపం నియమం యోగం సాంఖ్యం మొదలైనవి ఏవీ గోపికల ఉత్కృష్ట భక్తికి సాటిరావు. నీతో సామీప్యం, సఖ్యం వారిని ఏ భక్తునికన్నా సాటి రాని వారిని చేసింది అని గురవాయూర్ కృష్ణుని స్తుతించింది మేల్ పుతూర్ నారాయణ భట్టాత్రి రచించిన "నారాయణీయం'

గోపికలకు యెంత వెతికి"నా భౌతికంగా శ్రీ కృష్ణుడు కనిపించలేదు కాని మానసికంగా ఆయన్నే స్మరిస్తున్నారు,కీర్తిస్తున్నారు. వారి గీతాలన్నీ "గోపికా గీత"అనే 18శ్లోకాలలో భాగవత దశమ స్కంధం లో ఉంది. మనదేశం లో వివాహం కావలసిన కన్యలచేత తలిదండ్రులు దీన్నిభగవంతుని ఆశీర్వాదం కోసం చదివిస్తారు, గోపికా గీతిక జయ దేవుని గీతగోవింద కావ్యానికి ప్రేరణ. గోపికాగీతిక లో కొన్ని ముఖ్య శ్లోకాలు చూద్దాం –

1-జయతి తేధికం (కృష్ణ )జన్మనా వ్రజః –శ్రయత ఇందిరా కృష్ణ శశ్వ దాత్రహి – దయిత ద్రశ్యతమ్ కృష్ణ దికు తత్వ కాః -త్రయి ధ్రతాసవాః-కృష్ణ త్వాం విశిన్వతే "

2-న ఖలు గోపికా కృష్ణ నందనో భవాన్ –అఖిల దేహినాం కృష్ణ అంతరాత్మ దృక్-వృక్ష నాశ ఆర్తితో కృష్ణ విశ్వ గుప్తయే –సఖా యు దేవివాన్ కృష్ణ సాత్వతాం కులే "

3-తవ కథాం రతం కృష్ణ తప్త జీవనం –కవి భిరీదితం కృష్ణ కల్మషాపహం –శ్రవణ మంగళం కృష్ణ శ్రీమదాతతం-భువి గ్రుణంతి తే కృష్ణ భూరిదా జనాః"

అని శ్రీ కృష్ణ గుణగానం చేసిన గోపికల గోపికా గీతికి మురిసి, పరవశించిన కృష్ణుడు మళ్ళీ దర్శనమిచ్చాడు. వాళ్లకు పోయిన ప్రాణాలు తిరిగి వచ్చిన అనుభూతి కలిగింది –"తన్వాఃప్రాణాం ఆగతం".

యోగుల హృదయ సీమలలో విహరించే పరమాత్మ, కాళిందీ పుళింద సీమలపై గోపికా పరివేష్టితుడై, శరత్ పున్నమి వెలుగులలో వాళ్ళతో ఆ శరత్ చంద్ర ప్రభువు అతి సన్నిహితంగా చనువుగా మాట్లాడాడు. ప్రతి గోపిక వొడిలోతన దివ్య మంగళ పాదాలను ఉంచాడు. అక్కడున్న శతానేక గోపికలవొడి లలో పాదాలుంచాడన్నమాట. ఆ పాదాలు వాళ్ళతో మాట్లాడుతున్న అనుభూతి పొందారు –కాదు కలిగించాడు స్వామి. అంటే ఎన్ని రూపాలుగా బాలకృష్ణుడు అవతరించి వారికి అత్యంత మానసిక సంతృప్తి కలిగించాడో అర్ధం చేసుకోవాలి. ఇదే ఆయన మాయాలీల గోపికాలీల.ఈ మాయ అర్ధం కాక అమాయకంగా ఆయననే దీని మర్మమేమి స్వామీ అని ప్రశ్నించారు. దానికి" స్వార్ధం కోసం స్నేహం చేసే వాళ్ళు ఉంటారు. స్నేహం వల్ల లబ్ది చేకూరకపోతే స్నేహం వదిలేస్తారు. కొందరు తలిదండ్రులలాగా ఆప్యాయంగా ఉంటారు. అవతలి వారు అలా ప్రవర్తించక పోయినా వారిలో ఈ వాత్సల్యం తగ్గదు.కొందరు ఆధ్యాత్మిక పరిపుష్టి పొంది బంధాలకు లోనౌతామని ఇతరులను పట్టించుకోరు. కొందరు పగ, ద్వేషం వలన ఇతరుల బాగు ఆలోచించరు, కాని మీరంతా ఈ ప్రపంచ బంధాలను వదిలి నా శరణు కోరారు, నాపై ప్రేమ కరిపించారు కనుక ఆ సాన్నిహిత్యం పెంచాను. మీకు కనపడకుండా అదృశ్యమైనా, నేను మిమ్మల్ని ప్రేమిస్తూనే ఉన్నాను. నాపై కోపం, ద్వేషం, అసూయ వదిలేయండి. నేనెప్పుడూ మీ వాడినే. మీ వెంటే ఉంటా. మీరు నాకు ఇచ్చిన దానికి, మీ నిస్వార్ధ ప్రేమకు, సేవకు, నేను ఏమిచ్చినా ఋణం తీర్చుకోలేను. మనమధ్య బాంధవ్యం నిందా రోపణ చేయలేని దివ్యప్రేమ మాత్రమే. గృహబంధాలను అత్యంత కష్టం తో వదిలేసి నా చెంత చేరారు, దివ్యమైన అద్భుతమైన మీ కృత్యాలే మీకు నష్ట పరిహారం "అని చెప్పాడు. గోపికలు ఆయనపై యెంత ప్రేమ భక్తీ చూపించారో, ఆయనా అంతకంటే ఎక్కువ ప్రేమ వర్షం వారిపై తనివి తీరా కురిపించి సంతృప్తి పరచాడు.

దీని తర్వాత "రాసలీల "ప్రారంభమౌతుంది. చేయీ చేయీ కలిపి గోపికలు బృందంగా ఏర్పడి బాలకృష్ణుని చుట్టూ తిరిగారు. ఇద్దరు గోపికలకు ఒక కృష్ణుడు ఉన్నాడు ఒక గోపిక కుడి భుజం పై ఆయన ఎడమ చేయి, వేరొక గోపిక ఎడమ బుజం పై ఆయన కుడి చేయి వేసి లీలా నృత్యం చేస్తుంటే, ప్రతిగోపికా- కృష్ణుడు తన ఎదుట ఉండి తన రెండుభుజాలపై చేతులు వేసి నృత్యం చేస్తున్నట్లు భావించింది. కాని నిజానికి ఆమెకు ఎడమవైపు ఒక కృష్ణుడు, కుడివైపు మరొక కృష్ణుడు ఉన్నాడు. యోగేశ్వరు డైన శ్రీ కృష్ణ పరమాత్మ రాసలీలలో గోపికలను మాయలో పడేశాడు. అది వారికి తెలియనే తెలియదు కారణం వాళ్ళమనసులు వాళ్ళలో లేనేలేవు, ఆ రాసలీలలో అలౌకిక ఆనందం అనుభవించారు. ఈ రాస లీల నీటిలో జలక్రీడగా, అడవిలో వనక్రీడ గా, భూమిపై స్థల క్రీడగా మూడు చోట్ల జరిగింది. అనేకమంది గోపికలతో అనేకమంది కృష్ణులు చేస్తున్న ఈ అద్భుత రాసలీలా విలాసాన్ని అంతరిక్షం నుంచి దేవతలు మహర్షులు దర్శించి పులకించారు. ఇక్కడ మరొక గొప్ప విషయం ఉన్నది. గోపికల ఇళ్ళల్లో వారి భర్తల దగ్గర వారి భార్యలైన గోపికలు వారి ప్రక్కనే ఉన్నారు. ఇళ్ళల్లో భర్తలు తమభార్యాలు తమతోనే ఉన్నట్లు అనుభూతి చెందారు. ఇదీ క్లైమాక్స్. లోకమంతా రాసలీల మత్తులో తేలిపోయింది.

రాసలీల ను పరీక్షిత్ కు శుకుడు వివరించి చెప్పగా "కృష్ణుడు అన్నీ ఉన్న సంతృప్తి ఉన్నవాడు. కాని ఆయన చేసిన ఈ పని ప్రపంచ దృష్టిలో నీతిబాహ్యం అని పించదా?ఎందుకు అలా చేశాడు ?లోకానికి ఏ దివ్య సందేశం అందించాడు దీనితో ?"అని ప్రశ్నించాడు. ఈ ప్రశ్న ఆయనదేకాదు అందరికీ వచ్చే సందేహమే కదా. దీనికి సరైన సంతృప్తికరమైన సమాధానం శుక మహర్షి చెప్పాడు. "పరమేశ్వరుని లీలలు నీతి బాహ్యం కానేకాదు. ఆయన అగ్ని హోత్రం వంటివాడు. అగ్ని లో వేసినది ఏదైనా కలుషితం కాదు. అమానుష స్వరూపుడు చేశాడు కదా అని మనం కూడా అలా ప్రవర్తిస్తే, ఎవరైనా రుద్రుడననుకొని విషం తాగితే నాశనమైనట్లు సర్వ నాశన మౌతాం. పరమాత్మ వాక్కులను అనుసరించాలేకాని ఆయన చేష్టలను కాదు. పరమాత్మ సర్వాతీతుడు కనుక ఆయన చిద్విలాసాలు అంతుబట్టవు, ఆయనకు ఏ దోషం, పాపం అంటదు.స్వార్ధరహితుడు కనుక పరోపకారమే ఆయన కర్తవ్యమ్. లౌకిక పరిధిలో ఆయన చేష్టలు చట్ట విరుద్ధాలనిపించినా, అవి మానవాతీత కృత్యాలు. "అని సమాధానం చెప్పాడు శుకర్షి. అనీబిసెంట్ రాసలీలకామ శృంగార కేళి (రిబాల్డ్రి)కాదు. అదొక దివ్య మానవాతీత అనుభూతి అని చెప్పింది. అందుకే రాసలీల ఉత్కృష్ట మధుర భక్తికి తార్కాణగా నిలిచింది.

పరమాత్మ సర్వ సాక్షి. ఆయన గోపికలలో, వారి భర్త లలో కూడా సాక్షీ భూతుడు. లోకాలన్నిటి లో పారమార్ధిక కాలక్షేపం అది. భగవంతుడు మానవావ తారం దాల్చినప్పుడు భక్తులపై, సర్వ మానవాళి పై దయ, ప్రేమలను చూపించ టానికి, ఇలాంటి లీలలు ప్రదర్శించి విశ్వాసం కలిగించి, వారిని తనవైపుకు ఆకర్షించి దివ్యమార్గాన్ని చూపిస్తాడు. శుక మహర్షి బోధించిన ఈ రాసలీల విన్న వారు, చదివినవారు ఆ పరమేశ్వరుని అత్యంత భక్తులై, భౌతిక కామవాసనలకు దూరమై పరమ పదం చేరుతారు.

“లోకాః సమస్తా స్సుఖినో భవతు ” రాస లీలలు సమాప్తం

## మున్నీటి పై నారాయణుడు

### వైకుంఠ ఏకాదశి కి ప్రత్యేకం

శ్రీ రంగం దేవాలయం లో శ్రీ మన్నారాయణ మూర్తి, అనంత జల రాశి పై, ఆది శేషున్ని తల్పం గా చేసుకొని, శేషుని పడగలు స్వామి శిరస్సు పై ఉన్నట్లుగా దర్శిస్తాం. నాభి కమలం నుండి చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవించి నట్లుగా కన్పిస్తుంది. దీని లో వున్న పరమార్ధం తెలుసు కొందాం

ఆది శేషుని పై పవళించిన పర మాత్మ, ప్రళయం తర్వాత, “నేను ఎప్పటి వాడిని "'అని ప్రశ్నించుకొని, బ్రహ్మను తన నాభి కమలం నుండి సృజించి నట్లు పురాణ కధనం. అయితే “పదార్ధం సృస్తిన్చబడదు, నశించదు “అనే సిద్ధాంతం వుందని మనకు తెలుసు. పదార్ధం రూపాంతరం చెందు తుంది. అందుకే “సృష్టి అనాది “అయింది. దాని రూపం, స్థితీ మాత్రమే మారు తాయి. విశ్వం అంతా రాత్రి పూట నిస్చేతనమై వుంటుంది,ఉన్నత స్థితి లో వుంటుంది. ఉదయం చేతన పొంది, క్రియా రూపం గా ప్రవర్తిస్తూ వుంటుంది. దీన్నే “కల్పం “అనీ “ప్రళయం “అనీ అంటాం.

రాత్రి పూట విశ్వ చైతన్యం నిద్రిస్తుంది. దీనికి కారణం -పదార్ధానుంచి శక్తి ని వేరు చేయ లేక పోవటమే. రాత్రి అయిపోయి, వేకువ రాగానే, నారాయణుడు నిద్ర మేల్కొని, సృష్టి కర్త అయిన బ్రహ్మను సృష్టిస్తాడు. నారాయణ శబ్దం అర్ధం తెలుసు కొందాం. నారం అంటే నీరు. యానం అంటే నిద్రించటం లేక శయనిచటం అనే అర్ధాలు గల రెండు శబ్దాలతో ఏర్పడింది. అంటే అంతరిక్షం అనే జలం పై, నివశించే వాడు అని నారాయణ శబ్దానికి అర్ధం. మహా భారతం శాంతి పర్వం లో భీష్ముడు నీరు అంటే అంత రిక్షం అని అర్ధం చెప్పాడు. పృధ్వి మొదటి లోకం గా, ఆపస్ (నీరు )రెండో లోకం గా భావిస్తారు అని తెలుసు కోవాలి. ప్రళయ కాలమ్ లో మొదటిది, రెండో దానిలో లయం అవుతుంది. దానితో పాటు అంత రిక్షం లోకి వ్యాపిస్తుంది. అదే ద్రవ స్థితి.. అంటే ఘన స్థితి అయిన భూమి ద్రవ స్థితి లోకి మారిందన్న మాట.

ప్రళయం సంపూర్ణం కాగానే అంటే వెలుతురూ రాగానే, నారాయణుడు మేల్కొని సృష్టిస్తాడు అన్నాం కదా. అయితే శూన్యం లోనుంచి సృష్టిస్తాడా ?కాదు -తన లో వున్న వస్తు జాలం లో నుంచే సృష్టిని పునః ప్రారంభిస్తాడు అని భావం. అందుకే విష్ణు స్వరూపుడైన నారాయణ మూర్తి కి శంఖం, చక్రం, కుడి, ఎడమ భుజాల పై కన్పిస్తాయి. దీన్నే ప్రసిద్ధ జర్మన్ తత్వ వేత్త ఇమాన్యుయాల్ కాంట్ మహాశయుడు కాలమ్, అంతరిక్షం చైతన్యం (conscious )గా భావించాడు. ప్రళయం వచ్చి అంతా నశించినా, ఈ మూడూ, నిలిచే వుంటాయి. అందుకే ఆది శేషుడు కాలానికీ, చైతన్యం లేక సంకల్పం చక్రానికీ, అంతరిక్షం లేక పదార్ధం శంఖానికీ ప్రతీకలు గా భావిస్తారు.

ఇంతకీ కాలమ్ అంటే ఏమిటి ?పగలు, రాత్రి విభజనే కాలమా ?కాలమ్ అంతా ఒకే విధం గా ఉంటుందా ?”సంఘటనల పరంపరే కాలమ్ “అన్నాడు హెర్బర్ట్ స్పెన్సర్ పండితుడు. మరి ప్రళయ కాలమ్ లో సంఘటనలు ఏమీ వుండవు కనుక కాలమ్ ఉండదా ?కాదు అది తప్పుడు ఆలోచన. అందుకే కాలమ్ అనాది,అనంతం, అజరామరం అంటారు.

కాలాన్ని “ఆది లో శేషించినది “అంటే మొదటిగా మిగిలినదీ అన్నారు. విశ్వం అంతా ప్రళయం లో మునిగి పోతే, కాలమ్ మాత్రం మిగిలే వుంటుంది. లయం కాదన్న మాట. అయితే కాలమే లయానికి ప్రేరణ కూడా. భగవంతుని శక్తి నుంచి, మళ్ళీ విశ్వం ఊపిరి పోసుకుంటుంది. అదే ఆయన నిస్శ్వాసం అని భవం. అంటే ఉచ్చ్వాసం తో లయం, నిస్శ్వాసం తో సృష్టి జరుగు తాయి అన్న మాట. అద్వితీయ పరబ్రహ్మ -సృష్టి, స్థితి, లయాలకు అతీతుడు. ఇదే శ్రీ రంగం లో చుట్టు చుట్టు కొన్న సర్పం. అదే ఆది శేషుడు -కాలానికి ప్రతీక అయిన వాడు. ఆ సర్పం తోక నోటి లో వుండటం కూడా ఒక ప్రత్యేకతే. ప్రళయ మూర్తి శివుడు, సృష్టి సంహారం చేసి నపుడు, ఆయన ధరించే నాగు పాము అర్ధ నారీశ్వరి అయిన పార్వతి ముంజేతికి కడియం లాగా వుంటుంది. ఆయన కంఠం, భుజాలకు, హారాలుగా సర్పాలుంటాయి. ఎప్పుడైతే సృష్టి పునః ప్రారంభ మయిందో, అంత రిక్షం లో తరంగ వ్యాప్తి జరుగు తుంది. అప్పుడు సంఘటనల పరంపర ప్రారంభ్హ మవుతుంది. దానితో కాల గణన ఏర్పడుతుంది. దీన్నే conditioned time అన్నారు. ఈ స్థితి లోనే (conditioned state )లో నే నారాయణుడు ఆది శేషుని పై నిద్రిస్తాడు.

శేష శయన నారాయణుని దగ్గర వున్నాం మనం. ఆది శేషుని శరీరం పై మూడున్నర ముడుతలు వుంటాయి. అయిదు శిరస్సులుంటాయి. దీని భావమేమిటో తెలుసు కొందాం. ఇప్పుడు జరుగుతున్నది" వైవస్వతమన్వంతరం ".బ్రహ్మ గారి ఒక రోజుకు 14 మన్వంత రాలు. అందులో మనం ఏడవ మన్వంతరం లో వున్నాం. అయితే భగవద్గీత ఏమి చెప్తోందంటే "మహర్షయః సప్త పూర్వే, చత్వారో మానవస్తదా --మద్భావా, మానసా జాతా యేషాం లోక ఇమః ప్రజాః "దీని అర్ధం --సప్త ఋషులు, నలుగురు మనువులు, తన సంకల్పం లోంచి జన్మించిన వారే ననీ, వారి నుండి ఈ సృష్టి జరిగిందనీ "భగవాన్ శ్రీ కృష్ణుడు చెప్పినట్లు భావం. ఆది శేషుని శరీర చుట్టలు కాలానికి ప్రతీకలే. ప్రతి చుట్టా పూర్తి అయిన కాల వ్యవధికి ప్రతీక. మూడు యుగాల కాలమ్ పూర్తి అయి, నాల్గవ యుగం అయిన కలియుగం లో, ఏడవ మనువైన వైవస్వత మన్వన్థరక్మ లో ఉన్నాము అని తెలియ జేస్తుంది. ఈ చివరి యుగం అయిన కలి యుగం లో 28 మహాయుగాలు గడిచి పోయాయి. ప్రతి మన్వంత రానికీ 71 మహా యుగాలు వుంటాయి. ప్రతి మహాయుగానికి నాలుగు యుగాలుంటాయి. అవే కృత, త్రేతా, ద్వాపర, కలి యుగాలు. కనుక మనం ఇప్పుడు నాల్గవ చుట్ట అయిన కలి యుగం లో, 28 మహా యుగాలు దాటాం అన్న మాట. అంటే 28 /71 దాటాం. బ్రహ్మ గారి రోజు లెక్కల్లో3 2 8 /71 అంటే 3 2/5 చుట్లు పూర్తి చేసుకోన్నాం అని అర్ధం. అందుకే ఆది శేషునికి మూడు చుట్లు పూర్తి అయి భిన్న రూపం లో నాల్గావదాన్ని చూపించారన్న మాట. ఇంతటి లెక్క ఆ స్వామి పడక సీన్ లో దాగి వుంది.

ఆది శేషుని శరీర చుట్లు విప్పుకోన్నాం కనుక ఇప్పుడు ఆయన పడగల దగ్గరకు వద్దాం. "సహస్ర ఫణి "గా ఆదిశేషుడు పురాణ ప్రఖ్యాతుడు. ఏమిటి దీని సంబంధం ?మనకు సప్త ద్వీపాలు వున్నాయి. మనది జంబూద్వీపం. ఒక్కొక్క ప్రళయం లో ఒక్కొక్క ద్వీపం జల సమాధి అవుతుంది. సృష్టి లో ఇంకో ద్వీపం ఉద్భవిస్తుంది. ఇలాఇప్పటికి నాలుగు ద్వీపాలు పుట్టి, నశించాయి. ఇప్పుడు అయిదవది అయిన జంబూద్వీపం లో ఉన్నామని ఆది శేషుని అయిదు శిరస్సులు సంకేతం గా తెలియ జేస్తున్నాయని భావం. కలియుగం అంతం ఆవ గానే ఈ జమ్బూద్వీపమూ, నశిస్తుంది. ఆరవ ద్వీపం కొత్త సృష్టి లో ఏర్పడుతుంది. ఇలా అయిదు సార్లు సృష్టి జరిగి నట్లుగా, ఆ పడగలు మనకు సాంకేతికం గా తెలియ జేస్తున్నాయి.,

శ్రీమన్నారాయణుని చక్రం -చేతనకు, శంఖం -పదార్ధానికి ప్రతీకలు గా ముందే తెలుసు కొన్నాం. అవే -పురుష, ప్రకృతి లు. చక్రం తిరుగు తున్నట్లే మన ఆలోచనలూ, నిరంతరంభ్రమణంచెందుతూనే వుంటాయి. శంఖం శబ్దాన్ని ఇస్తుంది. పంచ భూతాలు, పదార్ధాలను ఏర్పరుస్తాయి. అందు లో ఆకాశం ఉత్క్రుస్ట మైనది. ఆకాశం లో శబ్ద తన్మాత్ర వుంటుంది. ఇదే పదార్ధాన్ని ఇచ్చేది. అందుకే శంఖం పదార్ధానికి చిహ్నం గ భావిస్తారు. పురుషుడు చైతన్య వంతుడు. ప్రకృతి నిరాకార వ్రుత్తి కలది. అందుకే చక్రం కుడి వైపు, శంఖం ఎడమ వైపు నారాయణ మూర్తి కి వుంటాయి. ప్రకృతి, పురుషులను వేరు చేయ లేము అని అర్ధం.

ఇప్పుడు నారాయణుడి నాభి దగ్గరకు చేరుదాం. నాభిలో కమలం వుందని చెప్పు కొన్నాం కదా. ప్రాణ నాడియే తామర తూడు. దాని నిండా రంధ్రాలే. దాని నుంచి, సృష్టి కార్యం చేయ టానికి బ్రహ్మ గారికి మహా విష్ణువు ప్రాణ శక్తి ని పంపిస్తాడు అని భావం. మన భాష లో అన్డానికీ (అండం ),కమలానికీ ప్రాముఖ్యత వుంది. బ్రహ్మ గారి గుడ్డు ను బ్రహ్మాండం అంటాం. అదే కమలం. కమలానికి సహస్ర దళాలు వుంటాయి. ప్రతి దళం ఒక్కొక్క లోకానికి ప్రతీక. కమలం యెర్ర గా వుంటుంది. కారణం అది రజో స్వభావానికి గుర్తు అంటే కామ ప్రవ్రుత్తి అన్న మాట. ఇదే సృష్టికి బీజం అని అందరికి తెలిసిన విషయామే. అది స్వచ్చమై, సత్వ గుణం తో తెల్లగా వుంటుంది. బ్రహ్మను కూడా ఎరుపు రంగు కలవాడిగా చిత్రిస్తారు. దానికికారణం కూడా పైన చెప్పిందే. చతుర్ముఖాలు నాలుగు వేదాలకు ప్రతీకలు. వేదం అంటేనే శబ్దం అని అర్ధం. వేదం అంతా శబ్ద ప్రకంపనల మయమే కదా. ఉదాత, అనుదాత్త, స్వర ప్రస్తారమే వేదానికి ప్రాణం. హెర్బర్ట్ స్పెన్సర్ అనే చింతనా పరుని ద్రుష్టి లో ప్రపంచం" నాలుగు ఆవర్తనాల" (rhythm )మయం. బహుశా అయిదవ ఆవర్తనం వస్తే "పంచ ముఖ బ్రహ్మ "యేర్పడ వచ్చు.

కనుక, పైన చెప్పిన వన్నీ, ప్రతీకలు మాత్రమే కాదు చిహ్నాలు కూడా (emblems ).వీటిని జన హృదయం లో చొప్పించాలి. మానవుడిని కింది స్తాయి నుంచి పై స్తాయికి తీసుకొని వెళ్ళ టానికి ఇవన్నీ తోడ్పడు తాయి. మహా మహా చదువు కున్న పండితోత్తములు కూడా ఈ రకమైన అంత రార్ధాలను వివ రించి చెప్పక పోవటం విచారకరం. అందుకే మన దేశం లో భక్తీ ఉన్నత స్తాయికి చేరటం లేదు. భౌతిక భావనలు కొంత వరకే పని చేస్తాయి. ప్రతిమ, విగ్రహ పూజా కింది స్థాయి వరకే. అక్కడి తో ఆగి పోరాదు. దాని లోని అంత రార్ధం తెలుసు కోవాలి.. ఆ ఉన్నత భావ లహరి లో సంచారం చేయాలి. అప్పుడే స్థాయి పెరుగు తుంది.

స్థూలం నుండి సూక్ష్మానికి ప్రయాణం చేయాలి. విగ్రహారాధన చేయ రాదనీ ఎవరి అభిప్రాయమూ కాదు. అలా చేస్తే కింది స్తాయి వారి విశ్వాసమే దెబ్బ తింటుంది. వారిని వివేక వంతుల్ని చేస్తూ, ఎదిగే టట్లు చేయటమే మనందరి కర్తవ్యమ్. ప్రతి మనిషికీ మనసు, శరీరం రెండు వుంటాయి.శరీరం స్తూలం. మనసు సూక్ష్మం. మొదటిది సగుణం. రెండోది నిర్గుణం. "నారాయణ విగ్రహ భావం "తొలి భావం. అందు లోనుంచి నిర్గుణ బ్రహ్మ వైపు ఆలోచించేట్లు చేయాలి. అప్పుడే విగ్రహారాధన సార్ధకం అవుతుంది.పరి పూర్ణత లభిస్తుంది. జీవాత్మ, పరమాత్మ ల సంబంధం తెలుస్తుంది. జీవ బ్రహ్మ ఇక్యానికి దారి ఏర్పడుతుంది. దీనికే ప్రతి సాధకుడూ, ప్రయత్నించాలి. ఆ పరమ ఉత్కృష్ట స్థితి ని పొందాలి. అప్పుడే మన పురాణాలకు, ఉపనిషత్తు లకు సార్ధకత కల్గుతుంది. ప్రాధమిక స్తాయి నుంచి, ఉన్నత స్తాయికి చేర్చే మార్గమే భక్తీ మార్గం. దాని

పరమార్ధాన్ని చక్కగా తెలిసి, ఆచరించాలని, మహర్షుల, మహనీయుల తపన. ఆ మార్గాన్ని అందు కొందాం. ఈ ముక్కోటి ఏకాదశి నాడు, ఆ భావన లను మనసు అంతా నింపుకొని శ్రీ మహావిష్ణుని దివ్య రూప సందర్శనాన్ని ఉత్తర ద్వారా సందర్శనం చేసి మన జీవితాలను సాఫల్యం చేసు కొందాం.

## "అధర్వ వేదం "లో "వ్రాత్య'



నాకు గురువు, మిత్రుడు, మార్గ దర్శి మా ఉయ్యూరు వాస్తవ్యులు స్వర్గీయ వంగల కృష్ణ దత్త శర్మ గారు. ఆయన్ను మేమంతా "దత్తు గారు "అని అంటాం. వారికి వేదం నుంచి వేమన వరకు తెలీని విషయం లేదు. కమ్యునిస్ట్ భావాలకూ ఆకర్షితులై కొంత కాలమ్ వుండి తప్పు కొన్నారు 'బయిటికి వస్తు "నేను ఎందుకు కమ్యునిస్ట్ ను కాలేక పోయాను "అనే పుస్తకం రాశారు. ఉయ్యూరు లో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అంటే ఆర్.ఎస్.ఎస్. కు చాలా కాలమ్ పోషకులు. ఎక్కడ సంఘ శాఖ జరిగినా కాఖీ నిక్కర్, తెల్ల చొక్కా, టోపీ పెట్టు కొని, లాఠీ తో సహా హాజరయ్ వారు. ఉత్తర ప్రదేశ్ లోని సహజాన్ పూర్ యోగి శ్రీ రామ చంద్ర జీ తో సన్నిహిత సంబంధం వుండేది. అక్కడికి వెళ్లి నెలల తరబడి యోగా భ్యాసం చేసివస్తుండే వారు. ఆ విషయాలన్నీ మాకు తెలియ జేసే వారు. చిన్న వాళ్ళలో చిన్న వాడుగా, పెద్ద వాళ్ల లో పెద్ద మనిషి గా వుండే వారు. వేదోపనిషత్ లన్నీ కరత లా మలకం. సైన్సు లో మంచి ప్రవేశం వుండేది. చాలా అడ్వాన్స్డ్ సైన్సు జర్నల్స్ తెప్పించి చది వే వారు. కొత కాలమ్ ఇంట్లో నే ఆర్. ఎస్.ఎస్.శాఖను నది పారు. మంచి వితరణ శీలి. వ్యవసాయము చేయించే వారు. చెరుకు పండే బంగారు భూమి వుండేది. నౌకర్లు, చాకర్లు వుండే వారు. తలంటి పోయటానికి రామ దాస్ అనే మంగలి ఆయన వుండే వాడు. కేరమ్స్ బాగా ఆడే వారు. చెస్ కూడా. రానిదంటు ఏమి లేదు. బాలభారతి, నన్నయ్య కళా సమితి ఆయన నేతృత్వం లో మేము నిర్వహించాం.

దత్తు గారికి గొప్ప గ్రంధాలయం వుండేది. మేము వారింట్లో ఎన్నో పుస్తకాలు చదివాం. శ్రీ శ్రీ, ఆరుద్ర, ఆత్రేయ, మొదలైన అభ్యుదయ రచయితల పుస్తకాలు అక్కడే మాకు పరిచయం. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, భగవద్గీత ఒకటేమిటి ఆయన దగ్గర లేని పుస్తకం లేదంటే అతిశయోక్తి కాదు. అన్నీ కొని ఉంచే వారు. నా బోటి వారికి పుస్తకం ఇస్తే ఒక పుస్తకం లో నోట్ చేసు కొని ఇచ్చే వారు. ఒక వారం తరు వాత అడిగే వారు. కొంచెం వామ నావ తారం గా స్పోటకం మచ్చలతో వుండే వారు. మాట స్పష్టం గా వచ్చేది కాదు. వారింటి దగ్గర, దీపావళి పండగ చేసే వాళ్ళం. నరకాసురున్ని గడ్డితో తయారు చేసి కాల్చే వాళ్ళం. సాహిత్య గోష్టి జరిపే వాళ్ళం. అలాంటి దత్తు గారు మరణించారు సుమారు పద్దెనిమిది ఏళ్ళ క్రితం. ఆయన్ను వాడు కొన్న వాళ్ళమే కాని ఆయనకు కనీసం ఆర్.ఎస్.ఎస్ వాళ్ళు కూడా సంతాప సభ పెట్ట లేదు. దత్తు గారు తన చెల్లెలు ప్రయాగ కృష్ణ వేణి జ్ఞాప కార్ధం ఉయ్యూరు జిల్లా పరిషద్ హై స్కూల్ లో ఒక బ్లాక్ ను దాదాపు ముప్పహి ఏళ్ళ క్రితం 25 వేల రూపాయలతో నిర్మించిన దాత. కూచిపూడి భాగవతులకు, వేద పండితులకు చేతికి ఎముక లేకుండా దానం చేసిన మహాను భావుడు. మంచి మనసున్న వాడు

ఇదంతా ఎందుకు అంటే అలాంటి విద్యా, బుద్ధి జీవి చని పోయిన తర్వాత, ఆయన దగ్గరున్న విలు వైన పుస్తకాలు ఎమవు తాయో నని బాధ పడే వాణ్ని. వాళ్ల  అబ్బాయి గోపాల్ కు, ఆయన భార్య శ్యామల గారికి ఆ పుస్తకాల విలువ ఒకటి రెండు సార్లు తెలియ జేశాను. వాళ్ల  కేమీ పట్ట లేదు. 2000 వ సంవత్సరం లో తల్లికి కొడుకు కు పడక తల్లి రాజా గారి కోట లో ఒక పెంకు టింట్లో అద్దెకు వుండేది. ఇప్పుడున్న ఇల్లు కొడుకు స్వాధీనం చేసు కొన్నాడు. దత్తు గారి పుస్త కాలాన్నే కోటలోని పెంకు టింట్లో వున్నాయి. మళ్ళీ ఆవిడను పుస్తకాల గురించి అడిగి, ఆవిడకు అక్కర లేని పుస్త కాలు నాకు ఇమ్మని కోరాను. సరే నన్నారు. మర్చి పోయాను. ఒక రోజు అకస్మాతు గా మా ఇంటికి వచ్చి "దుర్గా ప్రసాద్ గారు !మా వారి పుస్తకాలు వర్షాల వల్ల దెబ్బతిన్నాయి. కొన్ని చెదలు పట్టి పాడి పోయాయి. మీకు కావాల్సిన పుస్తకాలు యేరు కోని తీసుకొని వెళ్ళండి "అని చెప్పారు దత్తు గారిభార్య  శ్యామల గారు.



THE ATHARVA VEDA

VRĀTYAKĀṆḌA

WITH

S'RUTIPRABHA COMMENTARY

IN ENGLISH

BY

HON. SRI SAMPURṆĀNAND

*Chief Minister, Uttar Pradesh*

PUBLISHERS:

GANESH & CO. (MADRAS) PRIVATE LTD., MADRAS-17

1956

కోటలో వున్న వారింటికి వెళ్లి చూస్తే కళ్ళు తిరిగాయి జాలి వేసింది. చాలా పుస్తకాలు దెబ్బ తిన్నాయి. అందులో నాకు కావలసిన వన్నీ యేరు కోని ఇంటికి తీసుకు రావటానికి మూడు రోజులు పట్టింది. నాగర లిపి లో వున్న వేదాలు, ఉపనిషత్తులు, రామాయణం, భారతం,తెలుగులో ఆంధ్రుల సాంఘిక చరిత్ర తిరుపతి కవుల పుస్తకాలు, వీరేశ లింగం గారివి, కొన్ని ఆంగ్ల పుస్తకాలు వివేక చూడామణి అష్టా వక్ర చరిత్ర మొదలైనవి సుమారు అరవై అరుదైన పుస్తకాలను నేను తెచ్చు కొన్నాను. మిగిలిన వాటిని ఆవిడ ఏం చేశారో తెలీదు. ఆ తర్వాత ఆవిడ ఆ ఇల్లు ఖాళీ చేసి బెజవాడ వెళ్లి పోయారు. నేను తెచ్చుకొన్న పుస్తకాల మీద లోపలి పేజీలో "వంగల దత్తు గారి జ్ఞాపకం గా "అని రాసుకోన్నాను

ఇంతకీ అసలు విషయం లోకి రానే లేదు. అలాంటి వాటిలో నాకు ఒక అరుదైన పుస్తకం దొరికింది. అదే "vraatya khanda "అనే సుమారు నూట యాభై పేజీల ఇంగ్లీష్ పుస్తకం. ఇది "అధర్వ వేదం "లో వున్న వ్రాత్య ఖండం. దీన్ని గురించి ఎవరికి పెద్ద గా తెలీదు. వ్రాత్య అనే పేరు ఎక్కడో అరుదు గ విన్పిస్తుంది వేదోపనిష్హాడ్ లలో దీన్ని ఉత్తర ప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి,రాజస్తాన్ మాజీ గవర్నర్, మహా విద్వాంసుడు డాక్టర్ సంపూర్ణానంద్ ఆంగ్లం లో రాశారు. మూలం ఇస్తూ ఆంగ్లం లో చక్కని అర్ధాన్ని, తాత్పర్యాన్ని రాశారు, నాకు బాగా నచ్చింది. వెంటనే దాన్ని నేను తెలుగు లోకి తర్జుమా చేశాను నా కోసం. వ్రాత్యను ఆంధ్ర దేశం లో పరిచయం చేయాలని నా ఆలోచన. కాని ఏ పత్రికలు వేస్తాయో తెలీదు. అలాగే వుండి పోయింది సుమారు పదకొండేళ్ళు గా. ఆ తర్వాత ఆంధ్ర జ్యోతి వాళ్ళు ప్రతి శుక్ర వారం "నివేదన "అని శీర్షిక తో ఆధ్యాత్మిక విషయాలు ప్రచురించే వారు. దానికి నేను అను వాదం చేసిన దానిలో ముఖ్య మైన విషయాలను వ్యాసం గా రాసి "వ్రాత్య "అని పేరు పెట్టి పంపాను. పట్టించుకొన్న వాళ్ళు లేరు. ఈ మధ్యనే దాని ప్రతి ఒకటి నాకువెతుకు తుంటే కని పించింది. దాన్ని రెండు భాగాలు గా మీకు అంద జేస్తున్నాను. కనీసం కొందరైనా వ్రాత్యను గురించి తెలుసు కొంటారు అని , ఆ శబ్దం మీద వున్న అపప్రధ ను తొలగించుకు కొంటారనీ  నా ఆలోచన. త్వరలో "వ్రాత్య"మీ ముందుంటుంది

ప్రత్యేకత, గొప్పదనం వల్ల అధర్వ వేదం ప్రసిద్ధి చెందింది. వేద ప్రామాణ్యము, పొందింది. దీని లోని నైతిక భావనలు, సామాన్య మానవునికి, కల్గించే ఆశ, సహాయం వల్ల, ప్రత్యేకతను పొందింది. ఒక దృష్టి పార లౌకికమైనా, వేరొక దృష్టి భౌతికం మీద కూడా ఉంచింది. భుక్తికీ, ముక్తికే, సేతువు అయింది. ఆనందం, ఐశ్వర్యం తో పాటు మోక్షానికి మార్గం సుగమం చేసింది. యోగానికి, యోగికి గొప్ప స్థానం కల్పించింది. వైదిక కర్మలను, హీనం  గాచూపిస్తూనే, "రుద్రునికి" గొప్ప స్థానం కల్పించింది.

శైవ తంత్రం లో రుద్రునికివున్న ప్రత్యేకతనే, ఈ వేదమూ, చూపించింది. ఒక రకం గా రుద్రుని పూజించే విధానమే ఇది. శాక్త తంత్రాలలో, రుద్రుని గురువు గా భావించటం కన్పిస్తుంది. అధర్వ వేదం లో పూజ్యుడు రుద్రుడే. యోగి ని భగవంతుని రూపం గా, భావించటం కన్పిస్తుంది. తంత్ర మార్గం లో, గురువుకే ఉన్నత స్థానం. ఇదే అధర్వ మార్గము, "వ్రాత్య కాండ "లో, వ్రాత్యను ప్రస్తుతించే, స్తోత్రాలు ఎక్కువ గా వున్నాయి. సాయనా చార్యుల వ్యాఖ్య ననుసరించి, "వ్రాత్య అంటే ఉపనయం కాని బ్రాహ్మణ బాలుడు". అలాంటి వారిని సంఘం లో అగౌరవం గా చూసే వారు. దీనికి కారణం -అతనికి, మత పరమైన, ఏ విధులు నిర్వహించటానికి అర్హత లేక పోవటమే. ఉపనయనం అయిన వారికే ఆ అర్హత వస్తుందని అందరికి తెలిసిన విషయమే. ఆ వ్రాత్యుడే, గొప్ప ఋషీ, ద్రష్ట అయితే, అందరి పూజలు పొందు తాడు. దేవతలు కూడా అతన్నిఆరాధించే యోగ్యత కల వాడు అవుతాడు. అతనే పరమాత్మ స్వరూపం. బ్రాహ్మణులు అతన్ని ద్వేషించినా, వేద గౌరవాన్ని పొందాడువ్రాత్యుడు. ఈ కాండ అంతా వ్రాత్యను స్తుతించేదే. యోగ విధానం వల్ల, పరమాత్మ అయిన వాడే, వ్రాత్యుడని భావం. యోగి ని స్తుతించిన మంత్రాలన్నీ భగవత్పర మైనవే. సాయనాచార్యుని నిర్వచనం అందరు ఒప్పు కొన్నదే. అయితే, అంతకు మించి చాలా వుంది. ఆ నాటి వ్రాత్యులు వైదిక కర్మలు చేసే వారు కాదు. అసలు చేయ నక్కర్లేదు కూడా. ఆ యోగులు, రుద్రుని భగ వంతుని గా భావించి పూజించే వారు. యజుర్వేదం లోని "రుద్రాధ్యాయం "లో వ్రాత్యను "ఉశ్మిసి "అన్నారు. అంటే తల పాగా వున్న వాడు అని అర్థం., ఇప్పుడు వ్రాత్య ఖండం లోని కొన్ని మంత్రాలు, వాటి అర్ధాలను గురించి తెలుసు కుందాం.

మొదటి మంత్రం -"వ్రాత్య ఆశీదీయ మాన ఏవ స ప్రజా పతిం, సమైరయత్ "అని వ్రాత్య ఖండం లో ప్రధమ అను వాకం లోని మొదటి మంత్రం. వ్రాత్యకు ఉపనయనం లేదు కనుక, అతడు అన్ని బంధనాలకు అతీతుడు. వ్రాత్య అంటే పరమాత్మయే.అతడే కాలా తీతాలకు అతీతు డైన దేవుడు. త్రిగుణా తీతుడు. ఆ గుణాలతో బంధింప బడే కర్మలకు అతీతుడు. "పిప్పల పాఠం "లో వ్రాత్య అంటే మొదట ఇవన్నీ వున్న వాడు అని వుంది. అంటే కేవలం పరమాత్మయే కదా !వ్రాత్య అంటే రుద్ర నామాలలో ఒకటి. "నమో వ్రాత్యాయ "అని రుద్రాధ్యాయం అంటోంది. రుద్రుడే పరమాత్మ. దీనికి సంబందంచి, యజుర్వేదం లో 100 మంత్రాలు వున్నాయి. పైన చెప్పిన మంత్రానికి అర్థం ఏమిటి అంటే --వ్రాత్యుడు, కదలటానికి సిద్ధం గా వున్నాడు అంటే భగవంతుడు అనే భావనే.. తనను, ప్రజాపతి గా భావించాడు అని. భగవంతుడు మార్పులేకుండా వుండడు. చేతనా లేని వాడూ కాదు. పరబ్రహ్మ కే కదలిక లేదు. ఋగ్వేదం లోని "నాస దీయ సూత్రం "లో "అతడు గాలి లేకుండానే శ్వాసిస్తాడు. "అని వుంది. ఈ సూక్తం లో శ్వాసించాడు అంటే చలనం ఉన్నట్లే కదా. అతడు "మాయా శబలుడు "పరబ్రహ్మ మాయలో ప్రతి బిమ్బిస్తాడు. కనుక ఈ చలనం, బాహ్యానికి సంబంధించినది కాదు. ఆన్తరికం. అతడే జ్ఞాని. తెలియ వలసిన వాడు. తెలియ దగిన వాడూ అతనే. లయం లో వున్న జీవులన్నీ, ఆయన్నే చేరు తాయి. ఆయన లోనే వుంటాయి. గాఢ నిద్ర లో వుంటాయి. పూర్వ జన్మ కర్మ లన్ని నిద్రాణం గానే వుంటాయి. మేలు కోవటం అనేది, దీని తర్వాత జరిగే పని. పూర్వ కర్మ ఫలం అనుభవించాల్సిందే. తప్పించు కోవటం కుదరదు. భవిష్యత్ విశ్వం మాత్రు గర్భం లోమూర్తీభ విస్తుంది. ఆ స్థితి లో "హిరణ్య గర్భుడు "అనే తో పిలువ బడుతాడు. ఇంకో పేరు "ప్రజా పతి ".జీవ రాసులన్నిటికి తండ్రి అని అర్థం. భర్త అనే అర్థమూ వుంది. వ్రాత్య అనే దేవుడు, ప్రజా పతిని కదిలించాడు. అంటే తన లోనే వున్న ప్రజా పతికి చలనం,ప్రేరణ కల్గించాడు. (motivated)."నాసదీయ సూక్తం "లో "ఆయన తపస్సు నుంచి ఒకడు జన్మించాడు "అని వుంది. ఇంకో చోట, శృతి "అతని తపస్స్జ్ఞానం" అని అంది.

రెండవ మంత్రం --

"స ప్రజా పథిహ్ సువర్ణ మాత్మాన్న పశ్యత్ -తత్ ప్రాజనయత్" దీని వివరం తెలుసు కొందాం

ప్రజాపతి తనలో బంగారం చూశాడు. అంటే బంగారానికి జన్మ నిచ్చాడని భావం. ఇక్కడ బంగారం అంటే జీవులు చేసిన మంచి, చెడుల ఫలితాలుఅని అర్థం. ఇవన్నీ గత జన్మ లోనివి. గత విశ్వం లోనివి.నగలన్నీ బంగారం తో చేయ బడి నట్లే, గత జన్మ ల సంస్కారాలు అనే సువర్ణం తో, మళ్ళీ జన్మలు చేయబడు తాయి అని గొప్ప అర్థం ఇందులో దాగి వుంది. తమ కర్మల ఫలితాలకు తగి నట్లు, అనేక రకాల సృష్టిని, నిర్మించాలి కదా. అందుకే ప్రజా పతి "హిరణ్య గర్భుడు "అయి నాడు. అంటే తన గర్భం లో హిరణ్యాన్ని అంటే బంగారాన్ని దాచిన వాడు అని అర్థం. ఏదైనా ఒక ఆకృతి రూపు దాల్చాలి అంటే, మనసులోనే ఆ భావం పుడుతుంది. ఆ తర్వాతే ఆకారం ఏర్పడు తుంది. దానికి అతడే సాక్షి. అలాగే భవిష్యత్ విశ్వ రచనకు మనసు లోని ఊహాయే కారణం. నిజం గానే దేవుడికి మెదడు (mind )లేదు. కాని హిరణ్య గర్భుడి గా, ఆపను లన్నీ చేస్తాడు. ఆయన్ను చూశాడు అంటే అదే సాక్ష్యం. భవిష్యత్ లోక సృష్టికి బీజం మనసు లోనే పడింది అన్న మాట.

మూడవ మంత్రం --

"తదేకమవభావత్ -తల్లలామమ భవత్ -తన మహ దభ వత్ -తజ్జేస్త మవ భవత్ -తద్బ్రహ్మ భవత్ --తత్తపో భవత్ -తత్ సత్యమావ భవత్ -తేన ప్రజాయత " ఈ మంత్రార్ధమేమిటో చూద్దాం

అది ఒకటి అయింది. అందం గా మారింది,. గొప్పదైనది. అన్నిటి కంటే పెద్దది అయింది. అదే బ్రహ్మ మైంది. తపస్సు అయింది. సత్యమయింది. దీని వల్ల సృష్టి జరిగింది. ఇదే ప్రజా పతికి చేసిన స్తుతి. అతని చేష్టకు ప్రస్తుతి. విశ్వం అంతా ఆయన లోనుంచే వచ్చింది కనుక, అనేకత్వం లో ఏకత్వం భాసించింది. శృతి కూడా "గొప్ప వాని కంటే గొప్ప వాడు "అన్నది. గొప్ప అంటే అనంతత్వం. దేశ కాలాతీతం. సుందరం అంటే ఇంతకు పూర్వం లేని అనేక విషయాలను కని పించేట్లు చేయటం. ఆయన, విశ్వం యొక్క పుట్టుక కు ముందే వున్నాడు. అందుకే పెద్ద వాడు. వృద్ధుడు. బ్రహ్మ నే ప్రజాపతి అనటం మనకు తెలిసిందే. ప్రజాపతి లో దాగిన జీవుల సంస్కారాలు అన్నీ, తపస్సు. దీని నుంచే సత్యం జనిస్తుంది. రుతం కూడా దీని లోనుంచి రావాల్సిందే. రెండూ విడదీయ లేని సంబంధం కలవి. రుతం స్వాభావిక ప్రకృతి. సత్యం నీతి సూత్రం. "ఆతని తపస్సు నుంచే రుతం, సత్యం పుట్టాయి "అంటుంది శృతి. కనుకనే రుతం, సత్యం ల నుంచే విశ్వావిర్భావం జరిగింది. శూన్యం నుంచి ఏదీ సృస్టింప బడదు. జీవ సంస్కారాల వల్లే జన్మలు కలుగు తాయి. శృతి లో కూడా "సంస్కారాల మొత్తం అయిన "అపూర్వం "నుంచే ఆయన సృష్టి చేశాడు "అని వుంది.

ఇప్పటికి వ్రాత్య ఖండం లోని మూడు మంత్రాలు, వాటి అర్ధం, వివరణ తెలుసు కొన్నాం. ఇప్పుడు నాల్గవ మంత్రం గురించి తెలుసు కొందాం.

<u>నాల్గవ మంత్రం</u>

"సో వర్ధత, సమహాన భవత్, స మహా దేవో భవత్ "అనేది నాల్గవ మంత్రం. దీని అర్ధం తెలుసు కొందాం

ఆయన పెరిగాడు. గొప్ప వాడయాడు. మహాదేవుడయాడని భావం. అంటే, పెరిగి విరాట్ స్వరూపం పొందాడు. పృథ్వి, ఆకాశాలను, ఆక్రమించే, మహా స్వరూపమే విరాట్ అని పురుష శూక్తం లో వుంది. "సృష్టి అంతా ఆయన లో, నాల్గో వంతు మాత్రమే "అని శృతి అంటుంది. దేవ అంటేనే భగవంతుడు. అన్నిటికి ప్రేరణ నిస్తూ, ప్రకాశింప జేసే వాడు అని దేవుడు అన్న పదానికి అర్ధం. లోపల,బయటా,అంతటా, ఆయన ప్రభావం వుంది. అందుకే దేవుళ్ళకే దేవుడైన "మహా దేవుడు "అయాడు.

<u>అయిదవ మంత్రం</u> "స దేవానామీశాం పర్యేత్, స ఈశానో భవతి "అనేది

అయిదవ మంత్రం. దీని భావం అవగతం చేసు కొందాం

అతడు దేవతలకు ప్రభువు అయినాడు. అంటే ఈశానుడైనాడు అని అర్ధం. విశ్వాన్ని నడిపే శక్తులన్నీ ఆయన అధీనం లో వున్నాయి అని అర్ధం."అతడు ఈశానుడు, అన్ని విద్యలకు, జీవులందరికీ ప్రభువు "అని వేదం చెబుతోంది. విద్య అంటే దేవత,శక్తి స్వరూపం. భౌతిక, ఆధ్యాత్మిక, ఆది భౌతిక, రసాయన శక్తులు అని అర్ధం. "ఆయన భయం వల్లనే, వాయువు వీస్తాడు, సూర్యుడు ప్రకాశిస్తాడు, అగ్ని, ఇంద్రాదులు, ఆయన భయం వల్లనే పనులు చేస్తారు "అన్నది శృతి కూడా. కనుక ఎదురు లేని అధికారి ఆయన. ఆయన, రుత, సత్యాలకు అడ్డు చెప్ప గలవారే లేరు.

<u>ఆరవ మంత్రం</u> "స ఏక వ్రాత్యో భవత్ -స ధను రాధత్త --త దేవేంద్ర ధనుహ "

అంటే, అతను ఏక వ్రాత్యుడైనాడు. విల్లు అందుకున్నాడు. అది ఇంద్రునిది. అంటే ఇంద్ర చాపం అని భావం. అందర్నీ ఉన్నత మార్గం లో నడవ టానికి, దివ్య మైన ఉపదేశాలు చేసే వారంతా వ్రాత్యులే. దేవుడు వీరికన్నా ఉన్నతుడు,. అందుకే "ఏక వ్రాత్యుడు "అయాడు. "నిరుక్తం "ప్రకారం ధనుస్సు బలానికి ప్రతీక. సర్వో త్క్రుష్ట మైంది., అన్ని శక్తులకు నిలయమైనది, ఆధార మైనదీ. "వేద శత్రువులను నాశనం చేయ టానికి రుద్రునికి వింటిని ఇచ్చాను ".అని ఋగ్వేద శృతి చెబుతోంది. ఆ వింటి తో జగత్తును, ఆయన శాసిస్తాడు. ఇంద్ర శక్తి, రుద్ర శక్తి లో ఒక భాగం మాత్రమే. పనులు సక్రమంగా జరగటానికి, దండ ప్రయోగం కూడా చేస్తాడు. అంటే న్యాయం, చట్టం అని భావం. ఇంద్రాదులు, "ఏక వ్రాత్య రుద్రుని "నుంచే, అధికారాలు పొంది, తమ విధులను నిర్వహిస్తారని అర్ధం. రాష్ట్రాలపై కేంద్రానికి ఉన్న ఆధిపత్యం లాంటిది ఇది అని గమనించాలి.

తర్వాత మంత్రం లో, అతని ఉదరం నీలం, వీపు ఎరుపు అని వుంది. ఆది శక్తిలో త్రివిధ శక్తులు వున్నాయి. జ్ఞానం కోరిక, చేతన (కర్మ

) త్రిగుణా దీనాలు. క్రింది స్థాయివి. నీలం, ఎరుపు కోరికలను తెలియ జేస్తాయి. ఒకటి -తమోగుణం -కోరిక. రెండోది -రజోగుణం -పని చేసే శక్తి. మూడూ అభి భాజ్యాలే. "పుట్టనిది ఎరుపు. తెలుపు, నలుపు "అని శృతి. సత్వ గుణం బయట పడదు. నలుపు స్పష్టం గా కని పిస్తుంది. తరచుగా కన్పించేది నీలం. హిరణ్య గర్భుని శరీరం సగటు ప్రాణి కోటి శరీరమే. తర్వాతి మంత్రం లో జీవుల్లో వ్యతి రేక భావాలను నీలి రంగులో, శత్రు భావాలను ఎరుపు రంగు లో నాశనం చేస్తాడని బ్రహ్మ వాదులు అంటారని వుంది. జీవులందరూ, కోరికలతో సతమతమవు తారు. ఆయనకు ఎవరు శత్రువు కాదు మిత్రుడు కాదు. ధర్మ వ్యతి రేకులు శత్రువులు. ధర్మ పద గాములు మిత్రులు. దేవుని శక్తి, స్వభావం తెలిపే వారే "బ్రహ్మ వాదులు". వాళ్ళు, బహుజన హితం గా వుంటారు.

" వ్రాత "అంటే సేకరణ. వ్రాత్య అనేది వ్రాత నుండి ఏర్పడిన పదం. జీవుల సమస్తమూ వ్రాత ఏ. వాటికి అధిపతి పరమాత్మ. బుద్ధిని శుద్ధి చేసే వాడు "వ్రాత్యుడు ".యోగ మార్గ దర్శకుడే గురువు. అతడే, అహంకారం వల్ల వచ్చే మంచి, చెడులను బట్టి, సన్మార్గం లో నడి పిస్తాడు. అహంకారం ను వ్రాత్యుని గా భావిస్తే, బుద్ధి లోని సమస్త కోరికలు, భావాల సమా హారమే వ్రాత్యుడు. ఆయనే ప్రజా పతి. ఈ అహంకారం వల్ల సంస్కారం శుద్ధమవాలి. అప్పుడే శుద్ధ మైన బంగారం వస్తుంది. అదే హిరణ్య గర్భం. "బ్రహ్మనగరం తెలిసిన వాడు పురుషుడు. అయోధ్య అంటే దేవతల నగరం. దీనికి ఎనిమిది చక్రాలు,తొమ్మిది ద్వారాలు వున్నాయి. దానిలో స్వర్ణ భాండారం, దివ్య కాంతీ వున్నాయి. దానికి మూడు ద్వారాలు. అదే ఆత్మ స్తితి. బ్రహ్మ ను తెలుసు కొన్న వాడికి ఇవన్నీ తెలుస్తాయి "అని అధర్వ శృతి గట్టిగా చెబుతోంది. ఇవన్నీ యోగికి అనుభవైక వేద్యాలే.



అధర్వ వేదం లోని "వ్రాత్య ఖండ "లో మొదటి అను వాకం లో మొదటి శూక్తం లో ఎనిమిది మంత్రాలు, రెండవ శూక్తం లో 28 మంత్రాలు,. మూడవ శూక్తం లో 11 నాల్గవ శూక్తం లో 18 మంత్రాలు, మంత్రాలు, అయిదవ శూక్తం లో 16 మంత్రాలు, ఆరవ శూక్తం లో 26 మంత్రాలు, ఏడవ శూక్తం లో, అయిదు మంత్రాలు వున్నాయి

రెండవ అనువాకం లో మొదటి శూక్తం లోమూడు, రెండవ శూక్తం లో మూడు, మూడవ శూక్తం లో పదకొండు, నాల్గవ శోక్తం లో పదకొండు, అయిదవ శూక్తం లో పదకొండు, ఆరవ శూక్తం లో పద్నాలుగు, ఏడవ శూక్తం లో ఇరవై నాలుగు, ఎనిమిదవ శూక్తం లో తొమ్మిది, తొమ్మిదవ శూక్తం లో ఏడు, పడవ శూక్తం లో పది, పదకొండవ శూక్తం లో అయిదు మంత్రాలు వున్నాయి.

మొత్తం మీద చివరగా చెప్పిందేమిటంటే వ్రాత్య కుడి కన్ను సూర్యుడు, ఎడమ కన్ను చంద్రుడు. అగ్ని కుడి చెవి. గాలి ఎడమ చెవి. పగలు, రాత్రి శ్వాస ద్వారాలు. దితి, అదితి -ఉత్తర,దక్షిణ ఆయనాలు. సంవత్సరమే తల. అంటే కాల స్వరూపం.

"అన్హా ప్రత్యఙ్, వ్రాత్యా రాత్ర్యా,ప్రాఙ్ నమో వ్రాత్యాయ"
రాత్రి, రాత్రి ముందు, పగలు వ్రాత్యకు నమస్కారం. అన్ని వేళలా వ్రాత్యకు నమో వాకాలు.

ఆధారం --ఉత్తర ప్రదేశ్ మాజీ ముఖ్య మంత్రి, రాజస్థాన్ మాజీ గవర్నర్, బహుభాషా వేత్త, వేదోపనిషత్ సార సంగ్రహీత, మహా పండితుడు, విజ్ఞాని స్వర్గీయ డాక్టర్ సంపూర్ణానంద్ గారు ఆంగ్లం లో రాసిన "Aadharva Veda -vraatya khanda " '.

# స్వామి శివానందుల ఉపనిషత్ సార సుధ

" ఓం !యో బ్రహ్మాణం విద దాతి పూరం --యో వై వేదాంస్చ ప్రహినోహి తస్మై

-- తం హ దేవ మాత్మ బుద్ధి ప్రకాశం -ముముక్షుర్వై శరణం ప్ర పద్యే. "

ఎవరు బ్రహ్మాండాన్ని మొదట సృష్టించారో ఎవరి చేత వేదము గొప్ప గా స్తుతించి పాడుతుందో, అతనిని నేను శరణుకోరు తున్నా ను., బ్రహ్మ జ్ఞానము ల యందు నాకు భక్తి విశ్వాసాల వల్ల నా బుద్ధి వికశించు గాక. జ్ఞానులు అంతర్ముఖులై యోగాభ్యాసం తో ప్రకృతి రహశ్యాల నే గాక, ప్రత్య గాత్మ అయిన పరమేశ్వరుని కను గొని, అద్వైత స్వరూపాన్ని ప్రకటిస్తున్నారు. అంటే తమకు, పరమాత్మకు భేదం లేదని రుజువు చేస్తున్నారు. సామాన్య మానవ నేత్రం తో చూడ జాలనిపర మాత్మను, జ్ఞానం అనే కంటి తో చూస్తున్నారు. విశ్వ రహశ్యాలను తెల్సుకున్నారు. అలాంటి జ్ఞాన చక్షువును పొందటం సులభం కాదు. దానికి ఏకాగ్రత, చిత్త శుద్ధి, నైతిక ఆధ్యాత్మిక జ్ఞానం అవ సరం. ఇవన్నీ యోగీశ్వరుల వద్ద వుండే లక్షణాలు. అయితే స్థిరత్వాన్ని పొంది, స్థిత ప్రజ్ఞత్వాన్ని సాధించటం ఎలాగో, భగవద్గీత లో శ్రీ కృష్ణ పర మాత్మ బోధించాడు. మనకు భగవద్గీతే ప్రమాణం. గీత ఉపనిషత్తుల సంపూర్ణ సారమే. ఉపనిషత్తు లకే వేదాంగాలు అని పేరు. అంటే అవయవాలు. వెద సారాంశాన్ని తెలిపేవే ఉపనిషత్తులు. ఉప అంటే సమీపానికి నిషత్ అంటే చేర్చేవి. అంటే భగవంతుని సమీపానికి అవి చేరుస్తాయి. వేద వ్యాస మహర్షి వేద విభజన చేసి, మామూలు వారికి వేద విధానం ఇంకా దగ్గర చేయాలనే తపనతో, ఆ జ్ఞానాన్ని అంతా, ఉపనిషత్తు లలో నిక్షిప్తం చేశారు భగవాన్ వేద వ్యాసులు. ఉపనిషద్ వాణి మానవ కర్తుత్వాన్ని బోధించింది. ఈ ఉపనిషత్తులే ",The Himalayas of the soul, have been the source of the living waters that sustain our heritege "అన్నాడు పండిట్ నెహ్రు. దీని అర్ధం --ఉపనిషత్తులు పార మార్ధిక హిమాలయాలు. మన సంస్కృతిని పోషించే పావనోదా కాలు. అంతే కాదు "In times of blind ignorence and degradetion, the Upanishads have come to our rescue "అనీ అన్నాడు భగవంతునిపై విశ్వాసం, పార మార్ధిక మైన జీవన అనుష్టానం తో భార తీయ సంస్కృతీ నిర్మించ బడింది. దేశ పరి పుష్టికి అవే ఆధారాలు. అవి కోల్పోతే భారత దేశమే లేదు "If India forgets them, she will be no longer remainIndia "అని స్పష్టం చేశాడు నెహ్రు. అంత మహత్తు కల్గినవి ఉపనిషత్తులు. ఋగ్వేదానికి 20, యజుర్వేదానికి 109, అధర్వ వేదానికి 50, సామ వేదానికి 1000 ఉపనిషత్తులు లు వుంటాయి అంటే మొత్తం 1179 వున్నాయి. అందులో 108 ఉపనిషత్తులే ముఖ్య మైనవి. అందు లోను దశోప నిశాత్తులు చాలా ప్రాముఖ్య మైనవి. అవే "ఈశ. కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండుక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య బృహదారణ్యక ఉపనిషత్తులు. ఇందులో ముక్తి కోరే వారికి "మాండుక్య ఉపనిషత్ పఠనం ఒక్కటే.

చాలు నని శ్రీ రాముడు హనుమంతునికి ఉపదేశిస్తాడు. ఈ ఉపనిషత్తు ల నుండే అర్ధ శాస్త్రం, జ్యోతిష, భూగోళ శాస్త్రాలన్నీ ఏర్పడ్డాయి. అంతే కాదు 18 పురాణాలు ఏర్పడ్డాయి. కర్మ యోగ, రాజా యోగ మాంత్రిక, తాంత్రిక యోగాలన్నీ, అనేక మంది మహర్షులచే రచింప బడ్డాయి. సనాతన మతం అంటే ధర్మం అంటేనే వేదోపనిషత్తులే. మనకు ప్రవక్త ఈశ్వరుడే. వేరెవరు కాదు. ఈశ్వ రాంశ సంభుతూ లైన లైన మహర్షులే వీటిని మనకు దర్శింప జేశారు. ఇంతటి ప్రసిద్ధి చెందిన ఉపనిషత్తు ల లోని, జీవాత్మ, పర మాత్మ లకు గల అన్యోన్య సంబంధాన్ని -జీవాత్మ -పర మాత్మ ను చేరా టానికి చేయ వలసిన విధానాని జీవాత్మ, పర మాత్మ ల ఏకత్వాన్ని వివ రించటమే ఈ వ్యాస పరంపర ముఖ్యోద్దేశం.

## యోగం

పరమాత్మను దర్శించా లంటే యోగ సాధన చేయాలి. ఏ స్థితి లో సంకల్ప, వికల్పాలు, ఆలోచన, సంశయం లేకుండా వుంటుందో అదే యోగం. జీవాత్మ, పరమాత్మలకు సమ భావాన్ని కల్పించేదే యోగం. మనసు లోని ఆలోచనా తరంగాలను అదుపు లో పెట్టేది రాజా యోగం. యోగం లో అష్టాంగాలు వున్నాయి. అవి యమ, నియమ, ఆసన, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు. కర్మ, ఉపాసనా, జ్ఞానాలను "యోగ త్రయం "అంటారు. ప్రాణ వాయువున్ని బంధించా తానని "హఠ యోగం "అంటారు. హఠం అంటే సూర్యుడు, చంద్రుడు కలిసి పోవటం. కోరింది సాధించాతాన్ని కూడా హఠం అంటారు. ఇదే రాజ యోగానికి దారి చూపిస్తుంది. ప్రాణా యామం వల్ల రక్తం, నాడులు, శుభ్ర పడ తాయి. చిత్త ఏకాగ్రత కలుగు తుంది. "యోగం "అంటే కలయిక. అంటే జీవాత్మ, పరమాత్మ ల సంయోగం. యోగ సాధన వల్ల ప్రత్యగాత్మ పరమాత్మ లో కలిసి పోతుంది

యోగ సాధనకు గురువు అవసరం. అప్పుడే సుక్ష్మ విషయాలు తెలుస్తాయి. మన మనసు ప్రతి విషయాన్ని సంకల్పిస్తుంది. సంకల్పం కూడా ఒక పదార్ధమే. దానికీ శక్తి వుంది. ప్రముఖ శాస్త్ర వేత్త అయిన్స్టీన్ సిద్ధాంతం ప్రకారం పదార్ధం శక్తి గా, శక్తి పదార్ధం గా మార్చ వచ్చు. ఈ శక్తినే ఒకరి నుండి మరి ఒకరికి ప్రసరింప జేయ వచ్చు. ప్రపంచాన్ని శాసించ వచ్చు. అందుకే ఋషులు సంకల్పం మాత్రం చేత నే అన్నీ సాధించారు ఇయితే మనసుకు ఆ తేజస్సు ఎక్కడి నుంచి వస్తుంది. ?అద్దం యెట్లా సూర్యుడి నుండి కాంతి పొందు తుందో, అలాగే మనస్సు కూడా, పరమాత్మ నుంచే తేజస్సు ను పొందు తుంది. పాలు యెట్లా పెరుగు గా మారు తుందో అలాగే, మనసుకూడా వస్తు రూపం


Dialogues from Upanishads

OR

(Knowledge of Self)

BY

SRI SWAMI SIVANANDA SARASWATI,

"ANAND KUTIR," RIKHIKESH.

(Himalayas).

PUBLISHED BY

EM. AIRI,

Editor: Ideal Home Magazine,

AMRITSAR.

1936.

1st Edition] [Price Rs. 2/8,-

లోకి మారుతుంది. అప్పుడే వస్తువు ను గుర్తిస్తుంది. కన్ను, వస్తువు వున్నా, మనసు లేక పొతే వస్తువు కన్పించదు. అందుకే పెద్దలు ఈ ప్రపంచాన్ని "మనోమాత్ర జగత్ "అన్నారు. మన మనస్సు గ్రహించక పొతే ప్రపంచం మనకు కని పించదు. అంటేబాహ్య , అభ్యంతర జగత్తు అంతా ఒక్కటే... భేదం లేదు. దీన్ని తపస్సు లేక ధ్యానం ద్వారా తెలుసు కోవాలి. యోగ సాధన వల్ల తన లోని క్షమా, ప్రేమ, దయ, ఆదరణ, సత్యం, ఉదారత్వం, బ్రహ్మ చర్యం వృద్ధి చేసు కోని, సాత్విక గుణాన్ని పెంపొందించు కోవాలి. రాజస, తామస గుణాలను విసర్జిన్చుకుంటాడు. అప్పుడే జ్ఞాన నేత్రం ఏర్పడుతుంది. పరమాత్మ దర్శనం లభిస్తుంది. అదే యోగ సాధన లోని ఆంతర్యం.

## తత్వ మసి

జీవుడే సత్, చిత్ ఆనంద బ్రహ్మ. అయితె ఆ బ్రహ్మను ఓంకారం తో అర్ధం చేసు కోవాలి ".తత్ -త్వం -అసి" అంటే "నీవే-అది "అనగా నీవే ఆ పర బ్రహ్మం. జీవాత్మకు, పర మాత్మ కు భేదం లేదు. పాలలో పెన్న ఎలా దాగి వుందో, అలాగే ప్రతి జీవి లోను ఆత్మ దాగి వుంది. ఎవరు ధ్యానం చేస్తారో, సూక్ష్మ బుద్ధి కలిగి ఉంటారో, వారికే ఆ ఆత్మ దర్శనం లభిస్తుంది. ఇది శాస్త్ర పఠనం వల్ల లభించేది కాదు. ప్రశాంతత, ధర్మ చింతన, సత్ ప్రవర్తన, ఇంద్రియ నిగ్రహం తో నే దాన్ని సాధించాలి. అయితే ఈ ఏకాగ్రతను భగ్నం చేయ టానికి కొన్ని శక్తులు ఎప్పుడు ప్రయత్నం చేస్తూనే వుంటాయి. అవే "లయ, విక్షేప, క్షయ,రాసాద్వాదనలు "లయ అంటే నిద్ర. దీన్ని పోగొట్టు కోవటానికి ప్రాణా యామం చేయాలి. బయట వస్తు వులపై ఆకర్షణే విక్షేపం. అను రాగం వల్ల కలిగేది క్షయం. ఈ రెండు తొలగితే రసాస్వాదన కల్గుతుంది. అయితె, ఆస్వాదన నిర్వి కల్ప సమాధి రుచిని చూడ టానికి మాత్రమె ఉపయోగిస్తే, సాధకుడు ఒక మెట్టు పైకి ఎక్కి నట్టే.



మనసు లోని మాలిన్యాలను నశింప జేసు కో వాలి. కోరిక, భయాలను నశింప జేస్తే, తప్ప మనసు పవిత్రం కాదు. మోక్షం అంటే స్వతంత్ర మైన పరి పూర్ణతే.. దీనికి శత్రువు కోరిక కలిగి ఉండ టమే. అంతటా వ్యాపించి వుండే వాయువు ఎలా మార్పు చెంద కుండా వుంటుందో, అలాగే, ఆది, అంతం లేని గుణ రహిత మైన పర మాత్మ, ఏ శరీరం లో వున్నా, వికారం పొంద టానికి కాని, మార్పు చెందటం కాని జరుగదని అర్జునినికి భగవద్ గీత లో కృష్ణ పర మాత్మ తెలియ జేశాడు. ఆత్మను తెలుసు కొని, స్వయం ప్రకాశ మైన అఆత్మ లో, ' అంటే పరమాత్మ లో ఇక్యం చేసు కోవాలి. అప్పుడు మిగిలిన ప్రపంచం అంతా, మన లోని ప్రశాంత భావమే వికశిస్తుంది. ఆత్మ సాక్షాత్కారం పొందిన వారికి చూసేది, చూడ బడేది తన లోనే లీనం అవుతుంది. అంటే త్రిపుటి మాయమవుతుంది. అప్పుడే బ్రహ్మ లో ఇక్యం అవుతాడు. అంటే తన ఆత్మ ను ప్రతి వాని లోను, చూడ గలిగిన ఒక ఉత్కృష్ట స్థితిని, అంటే నిర్వి కల్ప సమాధి స్థితిని పొందిన రుషి మాత్రమె ఆ దర్శనం పొంద గలదు. అతడే జీవన్ముక్తుడు. అతడు మృత్యువుకు భయ పడడు. తురీయావ స్థ లో, అతడు వున్నట్లు భావిస్తాడు. అతనికి భూత, భవిష్యత్, వర్త మానాల జ్ఞానం తెలుస్తుంది. కోరిక, బాధ వుండదు. అన్నిటా సమ దృష్టి వుంటుంది. నిందా స్తుతులకు చలించాడు.

## ఈశ్వర తత్త్వం

"ఏకమేవ అద్వితీయం బ్రాహ్మమృతం -అఖండ చిదానందా కారం -నిర పేక్షం పరి పూర్ణం "అంటుంది ఉపనిషత్తు. అంటే ఈశ్వరుడు ఒక్కడే. వేరెవరు లేరు. ఆయన ద్వంద్వాలకు అతీతుడు. జ్ఞానానంద మూర్తి, ఆత్మా రాముడు, సంపూర్ణుడు. పరమాత్మ అంతటా విస్తా రించి వున్నాడు. సర్వ భూతాలలో వున్నాడు. చూడ బడే వస్తువు వెనుక పర మాత్మ వున్నాడు. శాశ్వతుడై, రూప రహితుడై, త్రికాల సాక్షీ భూతుడైన ప్రత్య గాత్మ ను ఘోర తపస్సు వల్లనే కను గొనాలి..

"పరి వర్ద మానాత్ సంకల్ప దేశ ప్రపంచో జాయతే --సంకల్ప క్షయే ప్రపంచ క్షయః సర్వ సంకల్పా భావ ఏవ మోక్షః "

సంకల్పం వల్లే లోకం వుంది. సంకల్పం లేక పోతే లోకం అదృశ్య మౌతుంది. సంకల్పాన్ని వదిలించు కోవటమే మోక్షం. సంకల్పం నిప్పు., కోర్కె అనే సమిధ తో, రగుల్కొంటుంది. కోరిక అనే సమిధ ను వారిస్తే, నిప్పు రాచదు.

"యన్ని రస్త ద్వైత మనాద్యంత మక్షరం -జగతో స్వాధిష్టానం, నిష్కల్మషం, జన్మ మృత్యు వివర్జితసం --విభాగ రహితం, తదేవ బ్రహ్మత్వమసి --సౌమ్య !అవధారయ !తదే తద ద్వైతా మృతం అను ధ్యాయన్ -అస్మిన్నే వక్షనే సాక్షాత్కారం మవ్యాప్నసి "

అంటే ఏది ద్వంద్వ రహితమై, శాశ్వతమై, సత్యమై, విశ్వానికి ఆట పట్టై, అంగ రహిత మై, ఏక రూపం లో జనన, మరణ, రహితం గా, వుంటుందో, అదే పరమాత్మ. ఆయన్ను ధ్యానించాలి. అంటే అందరిని సమ దృష్టి తో చూడాలి. అప్పుడే బ్రహ్మ సాక్షాత్కారం. నేనే దేహం అనే భావం ను వివేకం అనే ఖడ్గం తో చేదించాలి. అప్పుడే నేనే సచ్చిదానండుడనే భావం కల్గుతుంది. మనసు కు వస్తువు పై కాని, మనుష్యుల పై గాని, స్థలం పై గాని, ఆసక్తి, ఏర్పడుతుందో, అప్పుడే బంధం ఏర్పడు తుంది. వీటికి అంట కుండా, ఉండటమే ముక్తి. "నేతి-నేతి " "అంటే "కాదు -కాదు ".అనే సిద్ధాంతం తో, పంచ కోశాలను వదలి నప్పుడే పరి పూర్ణ మైన శాశ్వత పరమాత్మ మాత్రమే మనస్సు లో మిగులు తాడు..

## బ్రహ్మ రహస్యం

"బ్రహ్మ జ్యోతిషా మపి జ్యోధిహ్ -స్వయం ప్రకాశః -పరం జ్యోతి రనంతం --జ్యోధిహ్ జ్యోతి హి స్వరూపం -తస్య భాషా సర్వ మిదం విభాతి "

పరబ్రహ్మ వెలుగు లకే వెలుగు. స్వయం ప్రకాశ కుడు, పరంజ్యోతి, ఆనంద జ్యోతి, జ్యోతి స్వ రూపుడు. అతని తేజస్సు చేతనే ఇతరాలన్నీ వెలుగు తున్నాయి. ప్రతి జీవుని హృదయం లోను సూక్ష్మం లో సూక్ష్మం గా, స్థూలం లో అతి స్థూలం గా పర మాత్మ వున్నాడు. కనుక పర బ్రహ్మన్ని తలవటం, ప్రార్ధించటం మాట్లాడటం, అతని గురించి ఉపనయ శించటం, అతని లో కలిసి పోవటాన్ని, "బ్రహ్మ భ్యాసం "అంటారు. గీత లో కూడా, "మాచిట్టా, మడత ప్రాణా, బోధ యంతః పరస్పరం -కధ్యం తచ్చమాం -నిత్యం, తుష్యన్తిచ, రమంతిచ, "అని అంటాడు భగవాన్ కృష్ణుడు.

"నిత్య శుద్ధ స్వరూపోహం, నిత్య బోధ స్వరూపోహం --నిత్య ముక్తి స్వరూపోహం --నిత్య విజ్ఞాన స్వరూపోహం, -నిత్య చైతన్య స్వ రూపోహం "అని పరమాత్మ ఉవాచ. అంతే కాదు అందరి ఆత్మను నేనే.అన్నిటికి నేనే ఆధారం అంతా నేనే. అన్నిటికి నేను అతీతున్ని. జాతి, మత భేదం లేని నిర్మల, నిష్కల్మష నిష్కలంక నిష్క్రియ బ్రహ్మను నేనే. "నిజం గా ఈ భావన ఈ నాటి కాలానికి, జనానికి ఎంత అవసరమో ఉపనిషత్తులు ఆనాడే వివ రించాయి అందుకే అవి కాలానికి అతీతం గా నిలిచాయి..

"ప్రజ్ఞాన ఘన బ్రహ్మ హమస్మి -విజ్ఞాన ఘన బ్రహ్మ మహ్ మస్మి -చిదాన బ్రహ్మ హమస్మి -ఆనంద ఘన బ్రహ్మ హమస్మి

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మమ్ -అనాద్యనంత బ్రహ్మం -అధిష్టానా పరిచ్చిన్న బ్రహ్మహం "

నేనే సత్య జ్ఞానానంద బ్రహ్మను. నేనే అనాది, అనంత బ్రహ్మను, నేనే అవినాష అధిష్టాన, అపరిచ్చిన్న బ్రహ్మను. కర్ర లో వున్న నిప్పు లాగ, అందర్లో డాగి వున్నాను. ఆకాశ రూపి. అంటే సర్వ వ్యాపి. సూక్ష్మి. దేశ కాలాలకు అతీతుణ్ణి. శాశ్వ డిని.

"శాంతా జరామ్రుతాభయం -పర బ్రహ్మం -దివ్యామ్రుత, ప్రాణ, మనో బ్రహ్మం -శాశ్వత, స్వతంత్ర, కూటస్త బ్రహ్మహం "

అంటే శాంత, జరా, అమృత, అభయ, పర బ్రహ్మను. నేనే దివ్య అమూర్తి, అప్రాని, అమన (మనసు, ప్రాణం లేని )బ్రహ్మను. నేనే శాశ్వతం. నేనే కేవలం బ్రహ్మను. అతీంద్రియ బ్రమను. ఇదీ బ్రహ్మ స్థితి.

"సమొహం, పురుషోత్త మొహం, ఈశోహం --శ్రేష్టోహం, శివోహం, భాషా రహితోహం -అగంయాన్తర రహితోహం, అమగ, అభ్యంతర, రహితోహం -అభ్యంతర స్థాప్య భ్యన్తర గతోహం "

నేను అన్నింటికీ సమానుణ్ణి, పురుషులలో ఉత్తమున్ని, ఈశారుడిని ప్రసిద్ధుడిని. శివుడిని. భాషా రహితుడిని. అంతరంగం లోని అంతహ్కారణను నేనే.

దీన్నే గీత లో "సమం సర్వేషు భూతేషు, తిష్టంతం పరమేశ్వరం "అంటాడు ".ఇష్ "అంటే దేవుడు,ప్రభువు అని అర్ధం.

"సర్వోహం, సర్వస్మిన్, సర్వోహం, సర్వస్మిన్నే కోహం -ఏకస్మిన్, సర్వోహం, బహురహం "

అంతటా అన్నిటా నేనే. నా లోనే అన్నీ -సంఖ్యలకు అతీతున్ని, అంత నిద్ర పోతుంటే మేలు కొనే వాణ్ని. ప్రళయం లో కూడా ప్రకాశించే వాణ్ని. నేనే అద్వితీయ ఏకైక పురాణ పురుషుడిని.

"అచక్షు సాహం పశ్యామి --అశ్రోత్ర శ్రుణోమీ -అజిహ్వాయా రసయామి, అత్వచా స్పర్శామను భవామి ---అనాసయా, జిఘ్రామి, అపాదేన చరామి --ఆహస్తే న గృహామి, అమనసా జానామి -శుద్ధ చైతన్యోహం "

కన్నులు లేకుండా చూస్తాను. చెవులు లేకుండా వింటాను. నోరు లేకుండా రుచి చూస్తాను. శరీరం లేకుండా స్పృశిస్తాను. ముక్కు లేకుండా వాసన చూస్తాను. కాళ్ళు లేకుండా నడుస్తాను. చేతులు లేకుండా ముట్టు కొంటాను. మనస్సు లేకుండా గ్రహిస్తాను. నేను పవిత్ర శుద్ధ అంతః కరణను. పర మాత్మను అని పర మాత్మ చైతన్య స్థితి ని తెలియ జేబు తున్నాడు. ఇంద్రియాలు లేక పోయినా, ఆయన అన్ని పనులు చేస్తాడు. అంతటా వ్యాపిస్తాడు. అంగాలు లేని వాడు, గుణాలు లేని వాడు. ప్రతి దాన్నీ బల పరుస్తూ, ఆనందిస్తాడు. అదే ఆయన చిద్విలాసం

ప్రపంచానికి మొలం, ఆధారం ఆయన..కేంద్ర స్థానం. పునాది. వీటిని నశింప జేసేదీ ఆయనే. అంతా ఆయన లీల.

"సర్వ యోని రహం, జగన్మూలోహం, సర్వ దారోహం -పరందామాహం,సర్వ కేంద్రోహం, అధిష్టాన మహం --ప్రభవోహం, ప్రాళయ భూమి రహం "

అంతే కాదు, పరమాత్మ అపర మేయం, అపరిచ్చిన్న బ్రహ్మ, వర్ణింప శక్యం కాని అంటే అన్యపదేష్య బ్రహ్మ

"నేతి నేతి వాక్య ప్రతి పాద్య బ్రహ్మోహం --జగదహల్లక్షనా ప్రతి పాద్య బ్రహ్మోహం --దహకారాకాష వర్తి బ్రహ్మోహం -తపో బ్రహ్మ వర్ణ సత్య దామ శ్రుథాధ్యయనైహ్ -సాధకైహ్ -ప్రేప్స మానం బ్రహ్మోహం "

భాగం త్యాగం, లక్షణ మైన బ్రహ్మ ను నేను. నేతి నేతి అనే వ్యతి రేక భావ సిద్ధాంతం సూచించిన బ్రహ్మను. నేనే. హృదయ గుహ లో వున్న బ్రహ్మను నేనే. సాధకుల షమ, దామ, తపస్సు, సత్యం, బ్రహ్మ చర్యం మొదలైన అభ్యాసాల వద్ద, కనుగొన బడే బ్రహ్మను నేనే. అంటే జీవునికి వన్న పొరలను తొలగిస్తే, జీవుడే పరమాత్మ. బ్రహ్మ సారమే జీవాత్మ. గాహరాకాశం అంటే హృదయం లోని ప్రాణ వాయువే. దమం అంటే నిగ్రహం.

## బ్రహ్మ విచారణ

"కోహం "అంటే నేనెవరు ?అని ప్రశ్న వేసుకొని సాధన చేస్తే పరమాత్మను దర్శించ గలం. నిత్యం తపస్సు, సత్యం, బ్రహ్మ చర్యం, నిగ్రహం, సత్ప్రవర్తనలతో జోడించి, నియమం తో సాధించి నప్పుడే ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది.

"తద్ హి శాశ్వతం బ్రమన నోమనః -ప్రాణస్య ప్రాణం --శ్రోతష్య శ్రోతం, చక్షుషస్చక్షుహ, జిహ్వాయా జిహ్వా
స్వేభాసా దీప్య మాన, మన్యత్సర్వం భాస యతి -- "

అంటే -శాశ్వ త బ్రహ్మయే బుద్ధికి, బృహస్పతి. మనస్సుకు మనస్సు, చెవికి చెవి, కన్నుకు కన్ను, నోటికి నోరు, అంటే సర్వం తానె అయిన స్వయం ప్రకాశ కుడు. అతని తేజం వల్లే అంతా ప్రకాశిస్తుంది. పరమాత్మ "మాత్రు కుక్షా వివ శిశుహ్ "అంటే తల్లి గర్భం లో శిశువు వలె వున్నాడు. అంటే కాదు పరమాత్మ వ్యాపకత్వం ఎలా వుందో చూడండి.

"యదేకు రాసే త్తర్థితాశర్కరా, యధాచ శర్కరాయాం -మాధుర్య తదా, సూక్ష్మే యమాత్మా జగ దఖిలం -మనుష్య శరీరం, చ వ్యాప్త తిష్టతి ".

చెరకు రసం లో చక్కర అంతటా వ్యాపించి వున్నట్లు, తీపి, పంచ దార అంతటా వ్యాపించి నట్లు, పరమాత్మ ప్రపంచం అంతటా వ్యాపించి వున్నాడు. మనిషి చేసే భావనలను బట్టి, మనిషి మారుతూ ఉంటాడు. దేహ ధ్యాస మాత్రమే వుంటే పామరు డవుతాడు. "నేను సచ్చిదా నందున్ని "అనే ధ్యాసతో, వుంటే, దైవ స్వరూపుడు గా మారు తాడు. అదే భేదం.

ప్రపంచం లో అనేక అరిష్టాలకు, రోగాలకు, అకాల మృత్యువుకు మానవుని లోని, దుష్ట సంకల్పమే కారణం. చెడు ఆలోచన భావాల వల్లే వ్యాధి జనిస్తుంది. మురికి దగ్గరే కదా దోమలు చేరేది ?సద్భావన కల వారు ఎప్పుడూ, ఆనందాన్ని, ప్రశాంత త ను పొందు తారు. అంతే కాదు దూరం గా వున్న వారికి కూడా, వాటిని పంచిస్తారు. చెడ్డ ఆలోచన వల్ల తనకే కాదు, సంఘానికీ కీడు జరుగు తుంది. ప్రపంచమే దుష్ప్రభావానికి లోను అవుతుంది. కనుకదాన్ని దూరం చేసి కోవటానికి వెంటనే, మంచిఆలోచన తెచ్చు కోవాలి. లేక పోతే, సంఘమే ప్రమాద భరితం అవుతుంది. ఈ శరీరం తో పరమాత్మను చేర లేము. ఈ శరీరం లోని జీవాత్మను, మన సాధన వల్లనే పరమాత్మలో లయం చేయ గలం.

అంతే కాదు పరమాత్మ ఇలా అంటాడు "సుఖ, దుఖాలు నీకు చెందినవి కావు. నీ మనస్సుకు చెందినవి. నీవుకర్తవే కాని ఫలం అనుభవించే వాడివి కావు. ఎప్పుడూ నువ్వు స్వతంత్రుడవే ".దీనికి ఉదాహరణ గా ఒక కధ తెలుసు కొందాం

ఒకప్పుడు వామ దేవ మహర్షి తల్లి గర్భం లో వుండగా, తల్లి తో ఇలా అన్నాడు "తల్లీ !నేను పారి పోతానేమో నని, ఇనుప ఇళ్ళ వంటి దేహాలు అనేకం నన్ను బంధించాయి. కాని బంధింప బడిన పక్షి, ఎలా గైతే గూటి కింద నొరంగాన్ని తొలిచి, బయటకు పారి పోతుందో, అట్లాగే నేను, ఆత్మ జ్ఞానం తో, బంధాలన్నీ, తొలగించు కొని, బయట పడతాను. "వామ దేవ మహర్షి మహా జ్ఞాని. ఆయన విజ్ఞానం, జన్మ జన్మ కు వృద్ధి చెందింది. అందుకనే, అంత వివేక వంతం గా పలికాడు. చివరి సారిగా, తల్లి గర్భం లోంచి, భూమి మీద పడక ముందే, ఆత్మ సాక్షాత్కారం పొందాడు, ఆత్మ జ్ఞాని. కనుక.

" యోగ సాధనస్య, సంస్కారా అను వర్తస్తే --కాలేచ ఫలా వంతో, భవంతి, -తస్మాన్ మాశుచః -ప్రత్యహం, సాధన వ్యగ్రో భవ "

అంటే సాధన, శిక్షణ, ఫలితం ఎన్నటికీ నశించదు. తగిన సమయం లో ఫలిస్తుంది. అందుకే నిర్విచారంగా, ప్రతి క్షణం సాధన చేయాలి.

## జ్యోతిర్బిందువు

మంత్రాలు దాదాపు ఏడు కోట్లవరకు వున్నాయి. అన్నీ పరమాత్మను దర్శించ టానికి ఉపయోగ పడేవే. అయితే "అహం బ్రహ్మాస్మి "అనే మంత్రం వీటన్నిటిలో ఉత్కృష్ట మైనది. ఈ మంత్రోచ్చాటన ఎప్పుడు చేస్తూ, జప ధ్యానాదులతో మోక్షం పొంద వచ్చు.,

"యధా ఘటః పటోవా, పరిశాల్య మనో నమ్రుదస్తన్తోర్వా --కించి ధన్యత, తద్దైవ ప్రత్యక్ష మిదం, విశ్వం

విచార్య మానం, ఆత్మనో వ్యతిరిక్తం, న కించిత్ "

వస్త్రం, కుండా, మొదలైన వన్నీ, మట్టి లో నుంచే లభిస్తాయని, విచారణ వల్ల ఎలా తెలుసు కొంటామో, అట్లాగే "ప్రత్యగాత్మ "నుండే, ఈ లోకం అంతా,ఏర్పడిందని తెలుసు కోవాలి. మనమే ప్రతి దానికీ, సాక్షీ భూతం. అందరి లో నుంచే చూస్తాం. "త్వం సర్వస్య సాక్షీ, త్వం, సర్వస్మిన్, ఏకో, ద్రష్టాత, త్వతః "

## ఆనంద మూర్తి

బ్రహ్మ ఆనంద స్వరూపం. ఆనంద మయం. ఆనంద విగ్రహం. ఆనంద సాగరం ఆయనే. నిరతిశయానందుడు. పరమానందుడు. ఆయనే ఆనంద సుఖం. ఈ ఆనందాన్ని పొందటమే మానవ లక్ష్యం. దాన్ని అందు కుంటే అంతటా మహదానందమే. ప్రపంచం అంతా ఆనంద దామమే. ఆ, ఆనంద మూర్తి ని "ఒక గుంపు లో వున్న తన భర్తను మౌనాన్గీకారం తో చెలి కత్తె కు ఒక స్త్రీ ఎలా తెలియ జేస్తుందో "అలాగే శ్రుతులు మౌనాన్గీకారం తో, బ్రహ్మను చూపిస్తాయి.

"అహం, భావా భావే మోక్షః -అహంభావ సత్వే బంధః -"అంటే అహంకారం వుంటే బంధం. అహం లేక పోతే విముక్తి.

ఒకప్పుడు ఒక రాజు రాజ్యం వదిలి, అరణ్యం లో తపస్సు చేస్తున్నాడు. ఒక యోగి అతన్ని చూసి "నీ త్యాగం గొప్పది కాదు. నీ కింకా కోరిక తీర లేదు. అన్నీ విడిచానని, భ్రమ పడుతున్నావు. నువ్వు దేన్నీ త్యజించ లేదు.. "అన్నాడు. అప్పుడు రాజు "నా దగ్గర మాంసం కూడా లేని ఎముకలు మాత్రమే వున్నాయి. ఈ ఎముకల శరీరాన్ని కూడా విసర్జిస్తాను "అన్నాడు అప్పుడు ఆ ముని "శరీరం నశిస్తే, కోరికలు నశిస్తాయా ?శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం అని విన లేదా? కోరికలను విసర్జించు. అప్పుడే నీకు కావ ల సింది పొందు తావు "అని జ్ఞానోప దేశం చేస్తాడు. కనుక కోరికలు వది లించు కోవాలి.

"ఆత్మ జ్ఞానే సతి క్రోధ, మత్సర, లోభ హృదయ వేగ, స్వకార్య పరతా నశ్యన్తి --స్వస్వాను విద్యే హృదయే సంతోష పావన త్వ శాంతి --స్వతా విరహి త్వ సర్వ లోక ప్రేమ భావాః ప్రభవంతి"

ఆత్మ జ్ఞానం, క్రోధం లోభం, మొహం, మద,మాత్సార్యాలను నశింప జేస్తుంది. సత్వ గుణం తృప్తిని కలగా జేసి, పవిత్రత, ప్రశాంతత, నిస్వార్ధత, విశ్వ ప్రేమ మొదలైన సద్గుణాలను వృద్ధి చేస్తుంది. అయితే సద్గునాల పక్కనే దుర్గునాలూ కలిసి వుంటాయి. చెరువు లో నాచు, తామర ప్రక్క ప్రక్కనే వుంటాయి. ఆర్సెనిక్ అనే మందు విషం గాను, మందు గాను పని చేస్తుంది. "నేను కాదు "అనే భావ ఖడ్గం తో, "నేను "అనే ధీమా ను నరికేయాలి. ఉపనిషత్ చెప్పిన వాక్యాల మీదా, గురువు మీదా విశ్వాసం ఉంచాలి.

"బుద్ధి ప్రమాద కారీ, విఘ్న కరీ శ్యాత్ "అంటే తెలివి కూడా ఒక ప్రతి బంధకమే. అంటే అనవసర వాగ్వివాదాలలో తల దూరిస్తే, బుద్ధి నిజం గానే బ్రహ్మ జ్ఞానాన్ని సంపాదించ టానికి, అవరోధమే ఆవు తుంది. కనుక పర మాత్మ ఇలా ప్రబోధించాడు "త్వమవి కారీ -అక్షయః, ఆత్మ సామ్రాజ్య న్యోదర్గః - అది ష్టాతా అ

త్వం, సర్వదా పూర్ణః - సమ్రుద్ధః -పరమ కాస్టా -త్వం సర్వ గతః -త్వం సత్యం -త్వమేవ ధీరం బ్రహ్మ,ధీర సాధకత్వ మిదానీం "-సానందః -స్వచ్చందం సంచార "

ఇదే ఉపనిషత్ సారం. అమృత ధార. అదొక భావ భాండం. రసధుని. అమ్రుతోప మానం. రసానందైక యోగం. బ్రహ్మానంద సహోదరానంద తున్దిలం. ఆ సారా సుధను మీకు అందించాను. రసాస్వాదన చేసిన చేసిన, మీ రస హృదయాలకు నమస్సులు. మన జీవాత్మను, ఆ సచ్చిదానంద స్వరూప పరమాత్మ లో లీనం చేసే యోగ సాధన చేద్దాం. జన్మ చరితార్ధం చేసు కొందాం. ఉపనిషత్ లోని ఈ శ్లోకం తో ముగిస్తాను

" ఓం ఆప్యాయంతు మమాన్గాని -వాక్ప్రాన చక్శుహ్ శ్రోత్ర మధోహ్-బల మిన్ద్రియానిచ సారవాని సర్వం --బ్రహ్మోపనిశాడం మాహం -బ్రాహ్మ నికుర్యాం -మామ బ్రహ్మ, నిరాకరో దానిరాకరణ మత్స్వ -నిరాకరణం మే అస్తు -తదాత్మాని, నిరతేయ --ఉపనిషత్సు ధర్మాస్తే మయి స్తన్యుతే మయి సంతు "

అంటే నా ఆవ యవాలు, వాక్కు, ప్రాణం, నేత్రాలు, శోత్రాలు, బలం, ఇంద్రియాలు, అన్నీ పుష్టి గా వుండు గాక. ప్రతి ఒక్కటి, ఉపనిషత్తు లోని పర బ్రహ్మమే. నేను నాస్తికుడను కా కుండు గాక. బ్రహ్మ నన్ను నిరాకరింప కుండు గాక. నాస్తిక వాదం ఎక్కడా ఉండ కుండు గాక. ఆ పర బ్రహ్మ చేత తిరస్కరింప బడ కుండును గాక. ఉపనిషత్తు ల లోని, సద్గునాలన్నీ, నా యందు ఉండును గాక. ఆత్మకు ఆనంద,,వికాసాలను ఇచ్చు గాక. అవి నాలో అంకిత మై పోవు గాక.

## కేనోపనిషత్ విశేషాలు




"ఇహ కేన వేదీ దధ సత్యమస్తి-న చేదిదహ్ వేదిన్మహతీ వినష్టిః" అంటుంది కేన ఉపనిషత్. అంటే ఈ జన్మలో బ్రహ్మం గూర్చి తెలుసుకొంటే అదే నిజమైన జన్మ, లేకపోతే పెద్ద నష్టమే.

వేదం లో కర్మకాండ విషయాలు చెప్పాక, బ్రహ్మ విద్యను చెప్పేజ్ఞానకాండ ను ఉపనిషత్తులు అంటారు. అంటే వేద విద్య నేర్చి, విధివిధానంగా కర్మలు ఆచరిస్తే ఫలితంగా పొందే భార్య, సంతానం వగైరాలన్నీ అనిత్యాలు అని తెలుసుకొని,నిత్య సత్యమైన బ్రహ్మను తెలుసు కోవాలనే వారికి ఉపనిషత్తులు సాయం చేస్తాయి. ఏదో కోరిక లోపలపెట్టుకొన్నవారికి స్వర్గం చేరి, ఆ ఫలం ఖర్చుకాగానే మళ్ళీ భూమిపై పుడతారు, దీన్ని పునరావృత్తి, దూమమార్గం, కృష్ణ గతి దక్షిణాయనం అంటారు. ఇవే కర్మకాండలు వేదజ్ఞానం తో చేసేవాడు మళ్ళీ తిరిగి పుట్టడు..దీన్ని అపునరా వృత్తి,అర్చిరాది మార్గం, శుక్లగతి, ఉత్తరాయణం అంటారు. వీరుబ్రాహ్మలోకం చేరి బ్రహ్మ ఉన్నంతకాలం అక్కడే ఉండి,ప్రళయం లో ఆ లోకం లేకుండాపోతే ముక్తి పొందుతారు. దీన్ని క్రమముక్తి అంటారు. బ్రహ్మలోకం చేరినా ముక్తి పొందలేని వారు కూడా ఉంటారు. వీరిగురించి భగవద్గీతలో శ్రీ కృష్ణ పరమాత్మ "ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావృత్తినోర్జున "అంటే బ్రహ్మలోకం మొదలైన లోకాలన్నీ తిరిగి రావాల్సిందే , కనుక మనసు నిర్మలం విశుద్ధం అయితే జ్ఞాన నిష్టకు మార్గం సులభమౌతుంది. ఇలాంటి చిత్తశుద్ధి ఉన్న ముముక్షువులు అంటే మోక్షం కోరేవారికే ఉపనిషత్తులు ఉద్దేశింప బడ్డాయి,

సమస్త కోరికలు అంటే ఈషణాలు త్యాగం చేసినవారికి, మోక్షం కోరేవారికి మాత్రమె ఉపనిషత్తులు. ఆదిశంకరాచార్య "సన్యాసికే తప్ప, భార్యాపిల్లలున్నవాడికి జ్ఞాననిష్టకు, ఉపనిషత్ విద్యకు యోగ్యత లేదు "అన్నారు. అందులో ఎన్నో కష్టాలుంటాయి కనుకనే ఆమాట అన్నారు.. కోర్కెలు లేకుండా సంసారం లో ఉంటె సన్యాసి కిందే లెక్క. అందరూ ఉండగలరా. శంకరాచార్య అపరిమితంగా అభిమానించే యాజ్ఞవల్క్య మహర్షికి మైత్రేయి, కాత్యాయని ఇద్దరు భార్యలు. ఒంటి మీద బట్టల్ని, భిక్షా పాత్రనూ వదిలేసి,హాయిగా చెట్టుకింద పడుకొనే వాడికి ఆశాపాశం పోదు అన్నారు శంకరుడు భజగోవిందం లో "అగ్రే వహ్నిఃపృష్టే భానూ, రాత్రౌ చిబుక సమర్పిత జానుః- కరతలభిక్షా తరుతలవాసః తదపి న ముంత్యత్యాశాపాశః ".మరి సంసారి సన్యాసి అవటం ఎలా ?భార్యాపుత్రులు దేవుడు మనకిచ్చిన వరంగా, వారి పోషణ భగవంతుడిచ్చిన బాధ్యతగా, వారి సేవ కూడా భగవదారాధనగా భావిస్తే సంసారం" బంధం కాని సంబంధం "అవుతుంది. ఇదే సన్యాసం.ఇదే సంసారం అనే కొలనులో తామరాకు.అంటే నీటిలో ఉంటూ నీటిని అంటనట్టుఉండటం. తామరాకు మీద నీటి బొట్టు ఎక్కి కూచోవాలను కొంటుంది, కానీ నిలవలేక నీళ్ళల్లోకి జారి కనిపించదు. కనుక నీటి బొట్టుగా కాకుండా తామరాకుగా అంటనట్లు ఉండాలన్న మాట.




కోరికలు త్యాగం చేసి మోక్షానికి ప్రయత్నించే వాడు దారి చూపే గురువును వెతుక్కుంటూ వెడతాడు. బ్రహ్మజ్ఞానానికి గురువు తప్పని సరిగా కావాలి. జ్ఞానం

కలిగితే బంధం తెగి పోతుంది. బంధం తెగితే మోక్షమేగా. బ్రహ్మాన్ని తెలుసుకోవటానికి వచ్చిన శిష్యుడికి, ఆచార్యుడైన గురువుకు మధ్య జరిగే సంభాషణా రూపమే "కేన ఉపనిషత్ ".కేన అంటే దేనిచేత లేక ఎవని చే అని అర్ధం. ఎవరి ప్రేరణతో కన్ను చూస్తుంది చెవి వింటుంది. సృష్టి చేయబడుతుంది ?అంతటినీ చైతన్యం చేసే ప్రత్యగాత్మ ఎవరు లేక ఏది ?ఇదే కేనోపనిషత్ చెప్పే విషయం. ఇందులో శాంతి పాఠం తో పాటు నాలుగు ఖండాలున్నాయి. మొదటి ఖండం లో ప్రాణులను ప్రేరేపించిశక్తి ఏది ?,అన్నిటినీ నియమించేది ఆత్మ.ఆత్మ తెలియ రానిది,.చెప్పలేనిది, బ్రహ్మ అనుపాస్యంఅంటే ఉపాశించ లేనిది. ఈ లోకం ఉపాసించేది బ్రహ్మం కాదు. రెండవఖండం లో బ్రహ్మజ్ఞానం గురించిన భ్రమ, బ్రహ్మం తెలియంది కాదు తెలిసింది కూడా, తెలియని వాడు జ్ఞాని, ప్రతిబోధలోనూ బ్రహ్మను భూతి, ఆత్మ జ్ఞానం పొందినదే నిజమైన జన్మ, మూడవ ఖండం ఉపాసన లో –దేవతలగర్వభంగం, పరమేశ్వరుడు యక్షరూపం లో రావటం, అగ్ని పరీక్ష, యక్ష ప్రశ్న, గడ్డిపోచ, వాయువు బలం, ఇంద్రుని ఎన్నిక, ఉమా రూపం లో బ్రహ్మ విద్యావిర్భావం. నాల్గవ ఖండం లో బ్రహ్మోపదేశం, బ్రహ్మ స్పృహ, ఇంద్రుడే మొదటిజ్ఞాని, ఉపాసనా విధానం –అధి దైవతం,అధ్యాత్మం, వన భజన, చిత్త శుద్ధి సాధనాలు, సత్వ శుద్ధి సాధనాలు, ఫలశ్రుతి విషయాలవివరణ ఉంటాయి,

ఆధారం –కేన ఉపనిషత్ -శ్రీ సూరపరాజు రాధా కృష్ణమూర్తి గారి వ్యాఖ్యానం



శాంతి పాఠం-ఓం ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః,శ్రోత్ర మథో బాల మింద్రియాణి చ సర్వాణిసర్వం బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం మామా బ్రహ్మ నిరాకరో దానిరాకరణ మస్త్వనిరాకరణం మేస్తు తదాత్మాని నిరతే య ఉపనిషత్సుధర్మాస్తే మయి సంతుతే మయి సంతు-ఓం శాంతిః శాంతిః శాంతిః

భావం –నా శరీర అంగాలు దృఢంగా, వాక్కు ప్రాణం కన్ను చెవి బలం పొందుగాక. సర్వేంద్రియాలు శక్తి పొందాలి. అంతా ఉపనిషత్ బ్రహ్మమే. నేను బ్రహ్మాన్ని నిరాకరించ రాదు. బ్రహ్మ నన్ను నిరాకరించకూడదు.. అనిరాకరణం ఉండాలి, అనిరాకరణం ఉండాలి. ఉపనిషత్ ధర్మాలు నాలో ఉండాలి, నాలో ఉండాలి.

అన్ని ఇంద్రియాల పని సామర్ధ్యం ఇచ్చేది బ్రహ్మమే. బ్రహ్మ ప్రాప్తికి ఇంద్రియాలే సాధనం. ఇవి బ్రహ్మజ్ఞానానికి ద్వారాలు. అన్ని ఇంద్రియాలు వాటిపనిఅవి చేసుకొనే సామర్ధ్యం బలం ఇవ్వమని ప్రార్ధన. కావలసింది ఆత్మబలం కదా. ఇంద్రియ బలం దేనికి ?"నాయమాత్మా బలహీనేన లభ్యః "అని ముండక ఉపనిషత్ చెప్పింది. అంటే కండబలం లేకపోతే ఆత్మబలం ఉండదు. శరీరం బలంగా ఆరోగ్యంగా లేక పొతే ఆత్మసాధనకు సహకరించదు.ధర్మ అర్ధ కామాలు సాధించటానికే కాదు మోక్షసాధనకుకూడా శరీరం కావాలి. అందుకే అన్ని ఇంద్రియాలు శక్తిపొందాలి అని ప్రార్ధన

ఇంద్రియాలు మనల్ని నడిపించకూడదు. మనమే వాటిని నడిపించాలి. దీనికి ఆత్మబలం కావాలి. అంగాలకు లొంగ రాదు.ఆత్మవల్లనే బలం పొందాలి "ఆత్మనా విందతే వీర్యం "అంది కేనోపనిషత్. అంటే ఈ దేహమే నేను అనే దేహ భావం వదిలేసి, ఈ దేహం కూడా నేనే అనే సర్వాత్మ భావం పొందాలి. బ్రహ్మం నేనే. ఆత్మనే. "ఆత్మై వేదం సర్వం ".అంతా ఆత్మా అయినప్పుడు వేరే ఏదీ లేదు కనుక ఈ దేహమూ నేనే. అంతా ఉపనిషత్ బ్రహ్మమే



నేను బ్రహ్మను నిరాకరించకూడదు బ్రహ్మ నన్ను నిరాకరించరాదు. కంటితో చూసేదే బ్రహ్మం. కన్ను ఉన్నా చూపు ఉంటేనే చూడగలం. ఆచూపు నిచ్చేదే బ్రహ్మం – "చక్షుషశ్చక్షుః—అంది కేన. బ్రహ్మాన్ని తెలియకపోవటమే నిరాకరణం. అన్నిటినీ నడిపించేది బ్రహ్మ మాత్రమే అని తెలుసుకోవటమే బ్రహ్మాన్ని తెలుసుకోవటం లో మొదటి మెట్టు. బ్రహ్మం ఉన్నది అనే తెలివి కలిగితే, అనిరాకరణం బ్రహ్మ జిజ్ఞాసకు ప్రారంభం అవుతుంది.

ప్రథమ ఖండం

మొదటి మంత్రం –"కేనేషితం పతతి ప్రేషితం మనః –కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః

కేనేషితాంవాచ మిమాం వదంతి –చక్షుఃశ్రోత్రం క ఉ దేవో యునక్తి "

భావం –ఏ దేవుని చేత ప్రేరేరింపబడి మనసు కోరే విషయాలగురించి ప్రసరిస్తోందో, ఏ దేవుడి తోకలిసి ప్రాణవాయువు మొదటగా చలిస్తోందో, ఏ దేవునిప్రేరణ చే వాక్కు పలుకుతోందో, ఏ దేవుడు కన్ను చెవి ఇంద్రియాలను ప్రేరేపిస్తున్నాడో

రెండవమంత్రం –"శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో య-ద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః

చ్చక్షుష శ్చక్షు రతిముచ్య దీరాః –ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి "

భావం –ఏ దేవుడు చెవికి చెవి, మనసుకు మనసు, వాక్కు కు వాక్కు అయి ఉన్నాడో, ఆదేవుడే ప్రాణవాయువుకు ప్రాణవాయువుగా నేత్రానికి నేత్రమూ అవుతున్నాడు, ఈలోకాన్ని విడిచి ధీరులు ప్రకృష్ట దశ పొంది,మరణ రహితులు అంటే అమృతులు ఔ తున్నారు.

మనసు ప్రేరణ ఉంటేనే ప్రసరిస్తుంది.ఆప్రేరకుడు ఎవరు ?జీవుడు ఇష్టమున్నా ఏ అవయవాన్నీ కదిలించలేడు కనుక మనస్సుకు ప్రేరకుడు జీవుడు కాదు.ప్రాణవాయువు మహావాయువులో భాగమే. వాయువు జడపదార్ధం. జీవుడు ఈశ్వరుడు తప్పమిగిలిన తత్వాలన్నీ జడాలే. వాయువు కదుల్తున్నట్లు మనకు అనిపిస్తుందికదామరి జడం ఎలావుతుంది ?ఒక్కోసారి వాయువు వీచక ఉక్క అనుభవిస్తూ విసినకర్రతో విసురుకొంటూ అనుభవిస్తాం. కనుక వాయువుకు చలనం సహజం కాదు. శ్వాస క్రియలో మన ప్రాణం ప్రయత్నం ఏమీ ఉండదు. కనుక వాయువుకు చలనం సహజగుణం కాదు. కనుక ఇవన్నీ ఇతరములలైన వాటి ప్రేరణచే శక్తి పొందుతున్నాయని మొత్తం మీద అర్ధం.

శ్రోత్రం అంటే వినటానికి సాధనమైనది. ఏది శ్రోత్రానికి శ్రోత్రమో మనసుకు మనస్సో వాక్కుకు వాక్కోదాన్ని వివరించాలి. శ్రోత్ర వాక్ మనసులు జడాలు కనుక కర్తృత్వం లేదు. కనుక చెవికి వినే సామర్ధ్యం మనసుకుప్రతిఫలన సామర్ధ్యం, వాక్కుకు ధ్వని ఉత్పాదక సామర్ధ్యం తత్వం ఏదో బయట ఉన్నది. మనసో మనః అంటే మనసుకు మనసైనవాడు ఎవడు ?అది తెలియాలి. మనసు జడం కాని అది శరీర కర్తవ్యాలను చేయిస్తోంది. దీనికిశక్తి ఎక్కడి నుంచి వచ్చింది ?బయటినున్చేవచ్చి ఉండాలి అంటే పరమేశ్వరుని వలననే. వాచోహ వాచం అంటే వాగింద్రయానికి వాక్కు అయినవాడు. ఇలా ఇంద్రియాల పనులను చేయించేవాడు దేవుడు. ఆయనే మనసుకు మనసు వాక్కుకు నేత్రానికి

నేత్రం వాక్కు శ్రోత్రానికిశ్రోత్రం అయిఉన్నాడని భావం. మోక్ష విషయం లో గొప్ప బుద్ధిగల ధీరులైన వారు ఈ లోకం వదిలి ఉత్కృష్ట స్థితి పొంది అమృతులౌతున్నారు.

ఆధారం –శ్రీ పండితారాధ్యుల శరభారాధ్య వ్యాఖ్యానం.




మూడవ మంత్రం-"నతత్ర చక్షుర్గచ్ఛతి-నో మనో న విద్మో న విజానీమో –యథైదనుశిష్యాత్ –అన్యదేవత ద్విదితాదధో అవిదితా దధి –ఇతి శుశ్రుమ పూర్వేషాం యేన స్తద్వాచ చక్షురే "

భావం –అక్కడికి దృష్టి ప్రసరించదు.వాక్కు చేరలేదు, మనస్సు అందలేదు. దాన్ని ఎలా అర్ధ మయేట్లు చెప్పాలో మాకు తెలియదు. అసలు ఆలోచించలేము కూడా. కారణం, అది తెలిసిన దానికంటే వేరుగా ఉంటుంది. తెలియని దానికి అవతల చాలా దూరం లో ఉంటుంది. గురువు వివరించినా, తెలుసుకోవటం కష్టం. మాకు తెలియబరచిన బుద్ధి జీవులవలన ఆ విధంగా ఉంటుందని మాత్రం విన్నాము.

నాలుగవ మంత్రం –"యద్వాచా నభ్యుదితం –యేన వాగభ్యుద్యతే-తదేవ బ్రహ్మత్వం విద్ధి-నేదం యయిద ముపాసతే "

భావం –వాక్కు దేనిని చెప్పలేదో, దేని చేత వాక్కు చెప్పబడుతుందో అదే బ్రహ్మ అని తెలుసుకో. ఇక్కడ మనుషులు ఉపాసించేది మాత్రం బ్రహ్మ కాదని గ్రహించు.

అయిదవమంత్ర –"యన్మనసా నను మనుతే –ఏనాహుర్మనో మతం –తదేవ బ్రహ్మత్వం విద్ధి-నేదం యదిద ముపాసతే "

భావం – ఏ తత్వాన్ని మననం చేయటానికి వీలులేదో, ఏ తత్త్వం మనసుకు మనన సామర్ధ్యాన్ని కలిగిస్తుందో, ఆ తత్వమే బ్రహ్మ తత్త్వం అని గ్రహించు. భక్తులు ఉపాసించే ప్రతీక బ్రహ్మ తత్త్వం కాదు.

ఆరవ మంత్రం –యచ్చక్షుషా న పశ్యతి –ఏన చక్షూంసి పశ్యతి –తదేవ బ్రహ్మత్వం విద్ధి- నేదం యదిద ముపాసతే "

భావం –ఏ తత్వాన్ని కంటితో చూడటానికి వీలులేదో, ఏ తత్త్వం యొక్క ప్రేరణ చే కన్ను చూస్తోందో అదే బ్రహ్మ తత్త్వం గా భావించు. లోకం ఉపాసించే ప్రతీక బ్రహ్మ కాదు.

ఏడవ మంత్రం-"యచ్ఛ్రోత్రేణ న శృణోతి-ఏన శ్రోత్ర మిదం శ్రుతం-తదేవ బ్రహ్మత్వం విద్ధి- నేదం యదిద ముపాసతే "

భావం –ఏ తత్వాన్ని చెవిద్వారా వినటానికి వీలు లేదో, ఏ తత్వ ప్రేరణ తో చెవి విన గలుగుతోందో, ఆతత్వమే బ్రహ్మతత్వం అని తెలుసుకో. ఇక్కడ ఉపాసించే ప్రతీక బ్రహ్మం కాదు.

ఎనిమిదవ మంత్రం –"యత్ప్రాణే న ప్రాణితి-యేన ప్రాణః ప్రణీయతే-తదేవ బ్రహ్మత్వం విద్ధి- నేదం యదిద ముపాసతే"

భావం –ఏ తత్త్వం ప్రాణవాయువు చేత జీవించటం లేదో, ఏ తత్త్వం చేత ప్రాణవాయువు నడపబడుతోందో, అదే బ్రహ్మ తత్త్వం గా గ్రహించు. ఉపాసించే ప్రతీక బ్రహ్మకాదు.

ఈ మంత్రాలలో " తదేవ బ్రహ్మత్వం విద్ధి- నేదం యదిద ముపాసతే" అనేది మకుటం గా భావించవచ్చు.

మొదటిఖండం సమాప్తం.

## ద్వితీయ ఖండం

మొదటిమంత్రం-"యది మన్యసే సువే దేతి దభ్ర-నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపం

య దస్య త్వం య దస్యత చ దేవే ష్వధను –మీమాంస్య మేవతే మన్యే విది-తం "

భావం-పరమేశ్వరతత్త్వాన్ని బాగా తెలుసుకొన్నాను అనుకుంటే, నీకు తెలిసింది చాలా తక్కువ. నీ రూపాన్నీ, దేవతల రూపాన్నీ చూసి తెలుసుకొన్నది పూర్తిగా బ్రహ్మ రూపం కాదు. బ్రహ్మ రూపాన్ని అంతటినీ చక్కగా విచారించి మాత్రమేతెలుసుకోవాలి.

రెండవ మంత్రం –నాహం మన్యేనువే దేతి నో న వేదేతి వేద చ –యోనస్తద్వేద తద్వేదనో న వే దేతి వేదచ

భావం –నాకు బాగా తెలిసిందని అనుకోను. నాకు తెలియదు అనే విషయం కూడా తెలియదు. మాలో తెలిసిన వాళ్లకు మాత్రమే తెలుస్తుంది. ఇప్పటికీ నాకేమీ తెలియదనే విషయం కూడా నాకు తెలియదు.

మూడవ మంత్రం –"యస్యా మతం తస్య మతం మతం యస్య చ న వేద సః-అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవజానతాం "

భావం –తెలియ బడని బ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకోవాలను కొని, తెలిసిన జగత్తును మరుస్తున్న వారిలో ఎవరికీ తెలియ బడని తత్త్వం ఉన్నది అనే భావం ఉన్నవాడికి కొంతవరకు తెలిసిందని అర్ధం. తెలిసింది అనే గర్వం ఉన్నవాడికి, ఏ మాత్రం తెలియదు అని గ్రహించాలి.

నాలుగవ మంత్రం –"ప్రతిబోధ విదితం మత మమృతత్వం హి విందతే-ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతే అమృతం""

భావం –గురువు ఉపదేశంపొంది, విషయ పరిజ్ఞానం పొంది ఆ కలిగిన జ్ఞానం తో మననం చేస్తూ మరణం లేని స్థితిని సాధకుడు పొందుతున్నాడు. శరీర కర్మలచే కర్మాచరణ పాటవం అనే వీర్యాన్ని, ఉపాసనతో బ్రహ్మన్ని పొందుతాడు. మతం అంటే మననం చేయబడిన అని అర్ధం.

ఐదవ మంత్రం –"ఇహ చే ద వేదీ దధ సత్య మస్తి-న చే ది హా వేదీ న్మహతీ వినష్టిః

భూతేషు భూతేషు విచిత్య ధీరాః ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి "

భావం –ఈ జన్మ ఉండగానే బాగా విచారించి చూస్తే, పరమేశ్వర అస్తిత్వం గోచరిస్తుంది. ఇలా గమనించకపోతే నాశనం తప్పదు.కనుక ముముక్షువులు భూతముల, ప్రాణముల విషయం లో బాగా ఆలోచించి తెలుసుకొని, ఇహలోక సంబంధాన్ని వదిలి ప్రకృష్టస్థితి ఐన అమృతత్వం పొందుతున్నారు,

## తృతీయ ఖండం




మొదటి మంత్రం-"ఓం బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే-తస్య హ బ్రాహ్మణోవిజయే దేవా ఆమహీయంత,త ఐక్యం తాస్మాక మే వాయం విజయోస్మాక మే వాయం మహి మేతి"

భావం –సర్వ జగాలకు శాసకు డైనపరమేశ్వరుని అనుగ్రహం వలన దేవాసుర యుద్ధం లో దేవతలు జయించారు. కాని తమ విజయానికి కారకుడైన మహేశ్వరుడిని మరచిపోయి, ఆ విజయమంతా తమ శక్తి సామర్ధ్యాల వలననే, సామర్ధ్యం తోనే సాధించామని విర్రవీగారు.

రెండవ మంత్రం –"త ద్దైషాం విజ ఇౌ తేభ్యో హ ఇౌప్రాతర్బభూవ –తన్న వ్య జానంత కి మిదం యక్ష మితి "

తేగ్ని మబ్రువన్ జాత వేద! ఏత ద్విజా నీహి కి మేత ద్యక్ష మితి"

భావం-సర్వాంతర్యామి సర్వజ్ఞుడు అయిన పరమేశ్వరుడు వాళ్ళ గర్వాన్ని గమనించి, యక్ష రూపం లో దేవతల ఎదుట సాక్షాత్కరించాడు. గర్వోన్మత్త మనస్కులైన దేవతలు  ఆవచ్చిన ఆయన ఎవరో తెలుసుకో లేకపోయారు.

మూడవ మంత్రం –"తేగ్ని మబ్రువన్ జాత వేద! ఏత ద్విజా నీహి కి మేత ద్యక్ష మితి"

భావం –దేవతలు తర్వాత అగ్ని తో "ఆ వచ్చిన యక్షుని వివరాలేమిటో తెలుసుకొని రా "అని పంపారు.

నాలుగవ మంత్రం –"త ధేతి త దభ్రద్రవ త్త మభ్యవద త్కో సీతి-అగ్నిర్వా అహ మస్మి త్యబ్రవీజ్జాత వేదా  వా హ మస్మీతి"

భావం –అగ్ని సరే అని చెప్పి యక్షుడి దగ్గరకు వచ్చాడు. యక్షుడు అగ్నిని "నువ్వు ఎవరు ?"అని అడిగాడు. అగ్ని "నేను అగ్నిని. సర్వ వ్యాపకుడిని. వేదోత్పత్తి స్థానాన్ని"అని బదులిచ్చాడు

ఐదవ మంత్రం –"తస్మిం స్త్వయి కిం వీర్య మిత్య పీదగం-సర్వం దహేయం  య దదిదం పృధివ్యా మితి"

భావం –యక్షుడు "నీ సామర్ధ్యం ఏమిటి ?"అని అడుగగా "ప్రపంచం లో సర్వాన్నీ దహిస్తాను "అన్నాడు అగ్ని.

ఆరవ మంత్రం –"తస్మై తృణం నిదధావేత ద్దహేతి త-దుపప్రేయాయ సర్వ జవేన త న్నశశాక –దగ్ధుం స తత ఏవ నివ వృతే నైత –దశకం విజ్ఞాతుం య దేత ద్యక్ష మితి"

భావం –యక్షుడు అగ్ని ముందు ఒక గడ్డిపరక పడేసి దాన్నికాల్చ మన్నాడు. తన సర్వ శక్తులు ఉపయోగించి దాన్ని దహనం చేయటానికి ప్రయత్నించి విఫలుడై, దేవతల దగ్గరకు వెళ్లి ఆ యక్షుడు ఎవరో తెలుసుకోలేక పోయానని చెప్పాడు.

ఏడవ మంత్రం –"అధ వాయు మబ్రువన్  వయా వేత –ద్విజానీహి కిమేత ద్యక్షమితి"

భావం –దేవతలు వాయువుతో "ఆ యక్షుని విషయమేమిటో తెలుసుకొని వచ్చి చెప్పు "అని పంపారు.

ఎనిమిదవ మంత్రం –"తథేతి త దభ్యద్రవ త్త మభ్యవద త్కో సీతి వాయుర్వా  అహమస్మీత్యబ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి "

భావం –వాయువు  సరే అని వేగంగా యక్షుని చేరగా "నువ్వు ఎవరు "?అని అడిగితే "నేను వాయువు. ఆకాశం లో వృద్ధిపొందే మాత రిశ్వుడను "అన్నాడు

తొమ్మిదవ మంత్రం –"తస్మిం స్త్వయి కిం వీర్య మిత్య పీదగం సర్వ మాదదీయం  య దిదం పృధివ్యామితి"

భావం –"నీ సత్తా ఏమిటి ?"అని అడిగిన యక్షుని ప్రశ్నకు వాయువు "భూమి మీద ఉన్న అన్ని పదార్ధాలను గ్రహించ గలను "అన్నాడు.

పదవ మంత్రం –"తస్మై తృణం నిదధా వేత దాదత్స్వేతి-త దుప ప్రేయా య సర్వ జవేన త న్న శశా

కాదాతుం స తత ఏవ నివ వృతేనైత –దశకం విజ్ఞాతుం య దేత ద్యక్ష మితి"

భావం –వాయువు ముందు ఒక గడ్డిపరక పడేసి "దీన్ని గ్రహించు "అన్నాడు వాయువుతో. శక్తులన్నీ ఉపయోగించినా వాయువు దాన్ని గ్రహించలేక పోయాడు. దేవతలను చేరి తానూ యక్షుని విషయం లో అశక్తుడను అయ్యానని చెప్పుకొన్నాడు.

పదకొండవ మంత్రం –"అ థేంద్ర మబ్రువన్ మఘువన్నేత ద్విజానీహి కి మేతద్యక్ష మితి తథేతి దభ్యద్రవ త్తస్మాత్తిరోదధే"

భావం –దేవతలు ఇంద్రునితో "నువ్వే వెళ్లి ఆ యక్ష వివరం కనుక్కొని రా "అని చెప్పి పంపారు.. అలాగే అని ఇంద్రుడు వెళ్ళగా యక్షుడు కనపడకుండా అంతర్ధానమయ్యాడు.

పన్నెండవ మంత్రం –"స తస్మి న్నాకాశే స్త్రియ మా జగామ బహు శోభామానా ముమాం హైమవతీం తాగ్ం హో వాచ కి మేతద్యక్షమితి"

భావం –ఇంద్రుడు ఆకాశం లో బ్రహ్మ విద్యా రూపిణి అయిన ఉమాహైమవతీ స్వరూపమైన పార్వతీదేవిని చూసి "ఆ యక్షుడు ఎవరు తల్లీ "అని అడిగాడు.

## చతుర్ధ ఖండం

మొదటి మంత్రం –"సా బ్రహ్మేతి హో వాచ బ్రాహ్మణో వా ఏతద్విజయతే మహీ యద్వమితి తతో హైవ విదాంచకార బ్రహ్మేతి "

భావం –ఉమా దేవి ఇంద్రునితో "ఆ యక్షుడు పరమేశ్వరుడు. పరమేశ్వరుడే మీ విజయానికి కారణం "అని చెప్పగా ఇంద్రుడు ఆ వచ్చింది పరమేశ్వరుడైన బ్రహ్మ స్వరూపం అని గ్రహించాడు.

రెండవ మంత్రం –"తస్మా ద్వా ఏతే దేవా అతితరా మి వాన్యాన్ దేవాన్, యదగ్నిర్వాయు రింద్ర స్తే హ్యేన న్నేదిష్టం పస్పర్శు స్తే హ్యేన ప్రధమా విదాం చకార బ్రహ్మేతి "

భావం –అగ్ని, వాయువు, ఇంద్రుడు ఈ ముగ్గురే యక్షరూపంలో ఉన్న పరబ్రహ్మ ను చూసి విషయం తెలుసుకొన్నారు కనుక ఈముగ్గురు దేవతలు మిగిలిన దేవతలకంటే అధికులయ్యారు.

మూడవ మంత్రం –"తస్మాద్వా ఇంద్రోతితరా మి వాన్యాన్ దేవాన్ స హ్యేన న్నేదిష్టం పస్పర్శ న హ్యేన ప్రథమో విదాం చకార బ్రహ్మేతి "

భావం –అగ్ని, వాయువు, ఇంద్రులలో ఇంద్రుడు యక్ష బ్రహ్మ తో మాట్లాడి ఆయన స్వభావం స్వయంగా విని తెలుసుకొన్నాడు కనుక ఇంద్రుడు అగ్ని వాయువులకంటే గొప్ప వాడయ్యాడు. నాలుగవ మంత్రం –త స్యైష ఆదేశో య దేత ద్విద్యుతో వ్యద్యుత దా ఇతీ న్యమీష దా ఇత్యధి దైవతం "

భావం –బ్రహ్మ తత్త్వం మెరుపులాగా ప్రకాశ మానమైనదనీ, మెరుపులాగా అంతలోనే అదృశ్య మౌతుందనీ దేవతా విషయకమైన విషయక మైన ఉపదేశం.

ఐదవ మంత్రం –"అథాధ్యాత్మం య దేత ద్గచ్ఛతీవ చ మనోనేన చైత ముపస్మరో త్య భీక్ష్ణం సంకల్పః "

భావం –ఇంకా అధ్యాత్మ ఉపదేశం చెప్పబడుతోంది. ఈ బ్రహ్మ తత్వాన్ని మనస్సు పొందుతున్నట్లున్నది. మనసు చేత బ్రహ్మ తత్వాన్ని స్మరించాలి అని జీవుడి సంకల్పం.

ఆరవ మంత్రం –త ద్ధ తద్వనం నామ తద్వన మిత్యుపాసి తవ్యం స య ఏత. దేవం వేదాభి హైనం సర్వాణి భూతాని సంవాంఛంతి"

భావం –బ్రహ్మ తత్వాన్నే ఉపాసించాలి. ఎవడు బ్రహ్మ తత్వాన్ని ఉపాసిస్తాడో, అతడిని సర్వ భూతాలూ కోరుకొంటాయి. వనం అంటే ఉపాస్య వస్తువు అని అర్ధం.

ఏడవ మంత్రం –"ఉపనిషదం భో బ్రూ హీ త్యుక్తా య ఉపనిషద్బ్రాహ్మీం వావ త ఉపనిషదమబ్రూ మేతి"

భావం –శిష్యుడు గురువును బ్రహ్మ విషయం ఉపదేశించమని కోరితే గురువు బ్రహ్మకు సంబంధించిన ఉపనిషత్తు ను ఉపదేశించాను అని చెప్పాడు.

ఎనిమిదవ మంత్రం –"తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్టా వేదాః సర్వాంగాని సత్య మాయతనం "

భావం –బ్రహ్మ సంబంధమైన ఉపనిషత్తు కోసం క్రుచ్ఛ, చాంద్రాయణాది కర్మలు, బహిర ఇంద్రియ నిగ్రహం, సంధ్యావందనాది విహిత కృత్యాలు, రుక్ మొదలైన సంహితలు. శిక్షా మొదలైన షట్ శాస్త్రాల అధ్యయనం ముముక్షువులకు అవసరమైన ముఖ్య విషయాలు.

తొమ్మిదవ మంత్రం –"యోవా ఏతా మేవం వే దాపహత్య పాప్మాన మనంతో స్వర్గే లోకే జ్యేయే ప్రతి తిష్టతి ప్రతి తిష్టతి"

భావం –ఈ ఉపనిషత్తు ను గురు ముఖతా అధ్యయనం చేసి, అందులోని విషయాలను మననం చేసే ముముక్షువు కర్మ బంధనాలు విడిపోయి బ్రహ్మలోకం లో శాశ్వత స్థితి పొందుతాడు.

ఓం ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః,శ్రోత్ర మథో బాల మింద్రియాణి చ సర్వాణిసర్వం బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం మామా బ్రహ్మ నిరాకరో దానిరాకరణ మస్త్వనిరాకరణం మేస్తు తదాత్మాని నిరతే య ఉపనిషత్సుధర్మాస్తే మయి సంతుతే మయి సంతు-ఓం శాంతిః శాంతిః శాంతిః

# పుష్పదంతుని శివ మహిమ్నః స్తోత్రం శివ మహిమ్నః స్తోత్రం

నేపధ్యం –పుష్పదంతుడు గాంధర్వ రాజు, శివ భక్తుడు. సంగీత ప్రవీణుడు. కామ రూపం లో ఎవరికీ కన పడకుండా ఆకాశమార్గం లో సంచరించ గలవాడు. ఇతని సంగీతవైదుష్యాన్ని మెచ్చి ఇంద్రుడు తనకొలువు అయిన దేవేంద్ర సభలో పుష్పదంతుని సంగీత విద్వాంసునిగా నియమిస్తాడు.




ఒక సారి పుష్పదంత ప్రభువు ఆకాశమార్గం లో అదృశ్యం గా సంచరిస్తూ చిత్ర రధుడు అనే రాజు పాలిస్తున్న నగరాన్ని సందర్శిస్తాడు. చిత్ర రధ రాజు గొప్ప శివ భక్తుడే. పరమేశ్వర పూజకోసం ఒక గొప్ప పూల తోటను పెంచుతాడు. అది వివిధ పుష్పాలతో ఎప్పుడూ శోభాయమానంగా ఉంటుంది. పుష్పదంతుడు ఈ ఉద్యానవనాన్ని చూసి పరవశించి పోతాడు. అందులో ప్రవేశించి పూలు కోస్తాడు. అదృశ్య రూపం లో ఉండటం వలన ఆతనిని రక్షక భటులు చూడలేక పోతారు. రెండు మూడు రోజులు ఇలాగే గడిచాక చిత్ర రధ రాజు పరమేశ్వర పూజకుతన తోటలో పూలు లేక పోవటం గమనిస్తాడు. భటులను ప్రశ్నిస్తే వాళ్ళు రాత్రీ పగలు తాము కళ్ళల్లో ఒత్తులు పెట్టుకొని కాపలా కాస్తున్నామని పూలు ఎవరు కోసి మాయం చేస్తున్నారో అర్ధం కావటం లేదని రాజుకు విన్న వించారు. వారు అత్యంత విశ్వాస పాత్రులు కనుక వారి మాట నమ్మి రాజు పూల దొంగను ఎలా పట్టుకోవాలనే విషయమై చాలా మధన పడ్డాడు.

మర్నాడు రక్షక భటులను పిలిపించి రాజు అన్ని పూల చెట్ల కిందా మారేడు దళాలను వెదజల్లమని ఆజ్ఞాపిస్తాడు భటులు అలాగే చేశారు. మారేడు పత్రి శివునికి అత్యంత ప్రీతికరమైనది. దాన్ని కాలితో త్రొక్కితే పరమేశ్వరునికి విపరీతమైన ఆగ్రహం కలుగుతుందని రాజు భావించాడు. ఆ రోజు పుష్పదంతుడు యదా ప్రకారం అదృశ్య రూపం లో పూదోట లో ప్రవేశించి నిర్భయంగా పూలు కోస్తాడు. అలాకోయటం లో అనుకోకుండానే మారేడు దళాలను కాళ్ళతో తొక్కుతాడు. అప్పుడు శివుని ధ్యానానికి భంగం ఏర్పడుతుంది. వెంటనే పుష్పదంతునిపై ఆగ్రహోదగ్రుడై దేవ జాతికి చెందిన గాంధర్వ రాజు పుష్పదంతుడు తనకు అత్యంత ప్రీతికరమైన పవిత్రమైన మారేడు దళాలను తొక్కటం, పూల దొంగతనానికి పాల్పడటం గొప్ప నేరంగా భావిస్తాడు. గంధర్వ రాజు పుష్ప దంతుని దివ్య సర్వ శక్తులను నశింప జేస్తాడు శివుడు. ఆకారణంగా అతడు రక్షక భటులకు కనిపించి దొరికి పోతాడు. వాళ్ళు బంధించి చిత్ర రధ మహారాజు సమక్షం లోకి తీసుకు వెడతారు. రాజు విపరీతమైన కోపం తో పుష్పదంతుడిని కారాగార శిక్ష విధిస్తాడు.

చెరసాలలో బంధింప బడిన పుష్పదంతుడు విచారంతో కుమిలి పోతూ,తానేదో అపచారం చేసి పరమేశ్వరునికి ఆగ్రహం కలిగించటం వలన తన దివ్య శక్తులన్నిటినీ కోల్పోయానని గ్రహిస్తాడు. పరమ శివుని సంపూర్ణానుగ్రహం సాధించటానికి చెరసాలలో ఉంటూనే పరమ భక్తి తో శివ మహిమలను వర్ణిస్తూ "శివ మహిమమ్నః స్తోత్రం" రాశాడు. స్తోత్రం రచన పూర్తికాగానే పరమేశ్వరుడు, తన మహిమలను పరమాద్భుతంగావర్ణించినందుకు పరమ ప్రీతి చెంది, అనుగ్రహించి పుష్పదంతుని దివ్య శక్తులన్నీ తిరిగి అనుగ్రహిస్తాడు. చెరసాల నుండి బయట పడిన పుష్పదంత గంధర్వ రాజు చిత్ర రధ మహా రాజును దర్శించి తాను చేసిన అపరాధాన్ని మన్నించి, క్షమించమని ప్రార్ధిస్తాడు, దయాళువు అయిన మహారాజు శాంతించి,క్షమించి పుష్పదంతుని విడిచి పెడతాడు. పుష్పదంతుడు మళ్ళీ తన గంధర్వ లోకానికి చేరుకొంటాడు.

ఈ కద తర తరాలుగా ప్రచారం లో ఉంది. కాని ఈ కధకు ఆధారం కాని పుష్పదంతుని కాలం కాని ఇదమిత్థం గా నిర్ణయించటానికి వీలు లేక పోతోంది. పుష్పదంతుని శాపం మాత్రం, ఆస్తిక జనాలకు గొప్ప వరమై పుష్పదంత గంధర్వ రాజు శివ మహిమలను వర్ణిస్తూ రాసిన మహా గొప్ప శివ స్తోత్రం "శివ మహిమ్నః స్తోత్రం" దక్కింది.

దీనికి, సంస్కృతాంధ్ర ఆచార్య సార్వ భౌమ శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు తెలుగులో అర్ధ తాత్పర్యాలు రాసి శివమహిమతోబాటు పుష్పదంత కవి కవితా సామర్ధ్యాన్ని తెలియ జేశారు. ఇదే ఈ నా రచనకు ఆధారం అని సవినయంగా మనవి చేస్తున్నాను.

1-మహిమ్నః పారంతే పరమ విదుషో యద్య సదృశీ –స్తుతి ర్బ్రహ్మాదీనామపి తదవసన్నా స్త్వయి గిరః

అధా వాచ్యస్సర్వః స్వమతి పరిమాణావధి గృణన్-మమాప్యేష నోత్రే హర నిరప వాదః పరికరః "



తాత్పర్యం –పరమేశ్వరా !నువ్వు నన్ను పిలిచి "పుష్పదంతా ! నాసంపూర్ణ మైన మహిమను స్తుతించ టానికి పూనుకున్నావు. నువ్వు పండితుడవు కాదు. ఇది నీలాంటి వాళ్లకు తగిన పని కాదు "అని అంటావేమో –అలాగైతే నీ మహిమ వర్ణించటానికి బ్రహ్మాది దేవతల మాటలూ శక్తిహీనాలే అవుతాయి కదా. వాళ్ళ స్తుతులూ అసమగ్రాలే. తమ బుద్ధి శక్తిని బట్టి నిన్ను స్తుతిస్తూ ప్రతివాడూ సామర్ధ్యం లేని వాడు అవటం వలన నిందింప దగ్గ వాడే అవుతాడు. కాబట్టి నేను నిన్ను స్తుతించటానికి చేస్తున్న ప్రారంభం ఎలాంటి ఆక్షేపణా లేనిదే. మహా మహుల స్తోత్రాలే సరితూగనప్పుడు, నేను చేసే ఈస్తుతి ఏవిధంగానైనా దోషం లేనిదే అవుతుంది.

2-అతీతః పంధానం తవ చ మహిమా వాఙ్మనసయోః -అదద్వ్యావృత్యా యం చకిత మభిదత్తే శ్రుతి రపి

స కస్య స్తోతవ్యం ?కతి విధ గుణః ? కస్య విషయః ?-పదేత్వర్వాచీనే పతతి న మనః కస్య న వచః "?

భావం –పరమేశా !నీ మహిమ వాక్కులద్వారా, మనసుద్వారా, ఊహించటానికి అతీతమైనదే. వేదం కూడా నీమహిమ వర్ణించి చెప్పటానికి శక్యం కాక ఇది కాదు, ఇదికాదు అంటూ భయం తో చెబుతోంది. అలాంటి నీ మహిమను ఎవరు స్తుతించగలరు ?గుణాల లెక్కకు అది అందదు, నీ మహిమ వర్ణించటానికి ఏదీ విషయమే కాలేదు. నీ మహిమ వర్ణించటం లో ఎవరి మనసైనా, వాక్కైనా అధోగతి పాలుగాక తప్పదు.

3-మధుస్పీతా వాచః పరమమృతం నిర్మితవత –స్తవబ్రహ్మాన్ కిం వాగపి సుర గురో ర్విస్మిత పదం ?

మమ త్వేతాం వాణీం గుణకధన పుణ్యేన భవతః –పునామీత్యర్ధే స్మిన్ పుర మధన !బుద్ధి ర్వ్యవసితా. తాత్పర్యం –సర్వ వ్యాపీ, పరబ్రహ్మ స్వరూపీ పరమేశ్వరా !అత్యంత శ్రేష్టమైన వేదవాక్కుల్ని నువ్వే కూర్చావు. అవి అమృత సమానాలు. తేనేలాగా మహా తియ్యనైనవి. అలాంటి వేదవాక్కుల్ని రచించిన నీపై దేవ గురువు బృహస్పతి స్తుతిస్తూ చెప్పిన మాట కూడా చాలా పేలవంగా ఉండి ఆశ్చర్యం కలిగిస్తుంది. అలాంటి నీ గుణాలను ఈ స్తోత్ర రూపం గా స్తుతించటం వలన కలిగే పుణ్యం వలన నా వాక్కును శుభ్రం చేసుకొంటాను. త్రిపుర సంహారీ ఈశ్వరా !ఈ విషయం లో నా బుద్ధి నన్ను ప్రోత్సహిస్తోంది. మన్నించు.

4-తవైశ్వర్యం యత్తత్ జగదుదయ రక్షా ప్రలయ కృత్—త్రయీ వస్తుం వ్యస్తం తిస్రుషు గుణ భిన్నాసు తనుషు

అభవ్యానా మస్మిన్ వరద !రమణీయామ రమణీం –విహన్తుం వ్యాక్రోశం విదధత ఇహైకే జడదియః “

భావం –కొలిచే భక్తులకు వాత్సల్యం తో వరాలిచ్చే దేవరా 1 రుక్ యజు సామ అనే మూడు వేదాలకీ నీ విశ్వాధి పత్యమే వస్తువు. వాటి లక్ష్యం నీ సార్వ భౌమత్వాన్ని వర్ణించటమే. అది ఒక్కటిగానే ఉంటుంది. కానీ రజోగుణ, సత్వ గుణ, తమో గుణ అనే మూడు రూపాలుగా విభజింప బడుతుంది. అదే బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపాలు ధరిస్తూ సమస్తలోకాలను సృష్టిస్తూ, రక్షిస్తూ చివరికి ప్రళయం చేస్తుంది. అలాంటి సర్వోత్కృ ష్ట మైన నీ ఆధిపత్యాన్ని, ఎంతోరమణీయమైన దాన్ని దుర్మార్గులకు అరమణీయం గా కన్పించి నిన్ను నిందిస్తున్నారు.

5-కిమీహం కిం కాయ స్సఖలు కిముపాయాస్త్రి భువనం –కిమాధారో ధాతా సృజతి కిముపాదన ఇతి చ

అత ర్క్యైశ్వర్యే త్వయ్యవనసర దుస్థో హతదియః –కుతర్కోయం కాంశ్చిన్ముఖర యతి మోహాయ జగతః “

తా-పరమేశా !తార్కికులు కొందరు లోకాలకు సృష్టి కర్త అయిన నువ్వు ఏ కోరికతో సృష్టి చేస్తున్నావని ప్రశ్నిస్తున్నారు. నీ ఆకారం ఏమిటి ?సృష్టికి నీ ఉపాయం ఏమిటి ?నీకు ఆధారం ఏమిటి ? ఏ ఉపాదానం తో సృస్తిస్తున్నావు ?అంటూ ఊహకు అందని నీ ఆధిపత్యాన్ని గూర్చి, నీ పై ఉన్న చెడు తలంపును బట్టి, లోకం లో భ్రాంతిని కలిగించటానికి వాచాలత ప్రదర్శిస్తున్నారు ఇదంతా. భేషజమే, కుతర్కమే.

6-అజన్మానో లోకాః కిమవయవ వంతో పి జగతాం –అధిష్టాతారం కిం భవ విధి రానాదృత్య భవతి

అనీశో వా కుర్యాత్ భువన జననే కః పరికరః –యతో మందస్త్వాం ప్రత్యమరవర !సంశేరత ఇమే “



భావం –దేవతా శ్రేష్టా ఈశా !ఈ లోకాలన్నీ విభిన్న అవయవాలు కలవి. అవయవాలున్న వస్తువుకు జన్మ ఉంటుందని శాస్త్రం చెప్పింది. కనుక లోకాలు సృష్టింప బడినవే. మరి సృష్టికర్త లేకుండా సృష్టి జరుగుతుందా ?జరుగదు. లోకాల సృష్టికి పరమేశ్వరునికంటే సమర్దుడెవ్వరు?సృష్టి నిర్వహణకు ఆయనకు పరిజనం దేనికి ?అయన సర్వ సమర్దుడు కదా. మంద బుద్ధులు కొందరు ఇలాంటి నీ సామర్ధ్యాన్ని అనుమానిస్తున్నారు. కనుకనే లోకం లో దీనిపై చర్చ జరిగింది.

7-త్రయీ సాఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి- ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పధ్యమితి చ

రుచీనాం వైచిత్ర్యా దృజు కుటిల నానాపధ జుషాం- నృణా మేకో గంయస్త్వ మసి పయసా మవర్ణవ ఇవ. “

భావం –సంసార విముక్తికోసం కొందరు వేదోక్త కర్మ, కొందరు సాంఖ్యం, కొందరు యోగం, మరికొందరు పాశుపతం, ఇంకొందరు వైష్ణవం అంటూ పేరు పేరు మార్గాలు ఉపదేశిస్తూ ఉంటారు. ఎవరికివారు తమదే విశిష్టమైనదని ప్రచారం చేస్తారు. మరికొంతమంది అది పధ్యం అంటారు. ఇలా వారి వారి అభిరుచి, వైచిత్రిని బట్టి విభిన్న మార్గాలు నిర్ణయిస్తారు. కాని అన్నిరకాల జలాలకు సముద్రం లాగా సమస్తమానవులకు నువ్వే చేరదగిన వాడవు.

8-మహోక్షః ఖట్వాంగం పరశురజినం భస్మ ఫణినః-కపాలం చేతీయత్ తవ వరద !తంత్రోపకరణం

సురాస్తాం తామృద్ధిం దధతి చ భావద్భ్రూ ప్రణిహితాం –నహి స్వాత్మా రామం విషయ మృగ తృష్ణా భ్రమయతి “

భావం –ఈశా !సృష్టి కార్య నిర్వహణలో నీకు సాధన సామగ్రి వృషభ రాజమైన నంది, మంచం కోడు, గండ్ర గొడ్డలి, గజ చర్మం, విభూతి, పాములు, మనిషి పుర్రె అనేవి. అయినా దేవతలు నిన్నే భక్తితో కొలుస్తారు. నువ్వు నీ కంటి సంజ్న చేత వాళ్లకు కావలసిన సంపదలతోపాటు కోరికలన్నీ తీరుస్తావు. అనంత సంపద ప్రదానం చేస్తున్నా నువ్వుమాత్రం సంపదలు అనుభవించాలన్న కోరిక ఈషన్మాత్రం కూడా లేని వాడవు. ఆత్మలోనే నిరంతరం క్రీడిస్తూ ఆనందాను భూతి పొందుతున్న నిన్ను ఏ వస్తువూ మొహాన్ని కలిగించనే లేదు. అందుకని ఏ సమష్టపైనా నీకు అనుభవించాలన్న కోరికే కలగదు.

9-ధృవం కశ్చిత్ సర్వం సకల మపరస్త్వ ధ్రువ మిదం –పరో ధ్రౌవ్యే జగతి గదతి వ్యస్త విషయే

సమస్తే ప్యేతస్మిన్ పుర మధన !తైర్విస్మిత ఇవ –స్తువన్ జిహ్రేమి త్వాం న ఖలు నను ధ్రుష్టాముఖరతా “

భావం –త్రిపురాసుర భంజకా శివా !జగత్తు నిత్యం అని ఒకడు అనిత్యం అని మరొకడు అంటున్నారు. మరొకడు నిత్యా నిత్య నిర్ణయం లో కొంత నిత్యం కొంత అనిత్యం అన్నాడు. వారి వాదాలు నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. నిన్ను స్తుతిస్తూ వాళ్ళ ప్రతిపాదనలకు సిగ్గుపడటం లేదుకాని వాళ్ళ వాచాలత్వం నింద్యం అనిపిస్తోంది.

సర్వ వ్యాపక చైతన్య స్వరూపుడు పరమాత్మ ఒక్కడే “ఎకమేవా ద్వీయం బ్రహ్మ “అని వేదం ఘోషించింది

10-తదైశ్వర్యం యత్నాద్య ద్యుపరి విరించో హరి రధః –పరిచ్చేత్తుం యాతావనల మనల స్కంద వపుషః

తతో భక్తి శ్రద్ధా భర గురు గ్రుణద్భ్యాం గిరిశ! యత్ –స్వయం తస్థే తాభ్యాం తవ కిమను వృత్తిర్న ఫలతి "



భావం –పరమ శివా !ప్రజ్వలిస్తూ ఉండే అగ్ని స్తంభంగా నువ్వు ఉండగా, నీ మహిమ ఎలాంటిదో తెలుసుకోవాలనే చాపల్యం తో బ్రహ్మ తన వాహనం హంస నెక్కి ఊర్ధ్వ లోకాలకు, విష్ణువు యజ్న వరాహ రూపం తో పాతాలలోకాల క్రిందకూ వెళ్ళారు. కాని నీ శిఖరం,నీ మొదలు వాళ్లకు కనిపించనే లేదు. ప్రయత్న విఫలురైన వాళ్ళిద్దరూ నిన్ను స్తుతించారు. వారికి దర్శన భాగ్యం కలిగించి ఆదరించావు. నీకు చేసిన సేవ ఎప్పుడూ వృధా కాదని రుజువైంది.

11-యత్నా దాపాద్య త్రిభువనమవైర వ్యతికరం –దశాస్యో యద్బాహూ నభ్రుత రణ కండూ పరవశాన్

శిరః పద్మ శ్రేణీ రచిత చరణాంభోరుహ బలేః –స్థిరా యా స్త్వద్భక్తే స్త్రిపుర హర !విస్ఫూర్జిత మిదం "

భావం –త్రిపురారీ శివా !పదితలల రావణుడు ఏ శ్రమా లేకుండా మూడు లోకాలలో తన్ను ఎదిరించే వాడు లేడనుకొన్నాడు, అతని 20 చేతులూ ఎప్పుడూ ఎవరితోనే యుద్ధం చేయడం తో తీట కు లొంగిపోయాయి. దీనికి నీ అనుగ్రహమే కారణం. నీ పాద పద్మాలను తన శిరస్సు లనే పద్మాల మాలలతో అర్చించటం చేత అది అతనికి సాధ్యమైంది. నీ పూజపై స్థిర భక్తి ఉండటం దీనికి కారణం.నీపాదారవిందాలపై దృఢ భక్తి వల్లనే అతనికి అది సాధ్యమైంది. 12-అముష్య త్వత్సేవా సమదిగత సారం భుజ వనం –బలాత్ కైలాసే పి త్వదదివసతౌ విక్రమ యతః

అలభ్యా పాతాలే ప్యలస చలితాంగుష్ట శిరశి-ప్రతిష్ఠా త్వయ్యాసీ ద్ధ్రువ ముపచితో ముహ్యతి ఖలః "

భావం –ఈశ్వరా ! రావణుడు నీ అనుగ్రహానికి పాత్రుడై 20 భుజాలు పొందాడు. నీకృపతో లభించిన ఆభుజాలశక్తితో నువ్వు నివశించే కైలాసపర్వతం పైనే తన ప్రతాపం చూపించాడు. వెంటనే నువ్వు అనాయాసంగా నీ బొటన వ్రేలిమొన తో అణచి వేయగా పాతాల లోకం లో కూడా ఉండటానికి వీలు లేకపోయింది. దుష్టుడు ఉపకారం పొంది దాన్ని మరచి ఉపకారిపైనే బలప్రదర్శనకు దిగటానికి పూనుకోవటం లోక సహజం.

13-యదృద్ధిం సుత్రామ్ణో వరద పరమోచ్చైరపి సతీ –మధశ్చక్రే బాణః పరిజన విదేయ త్రిభువనః

న తచ్చిత్రం తస్మిన్వరి వసితరి త్వచ్చరణయో –ర్న కస్యా ఉన్నత్యై భవతి శిరస స్త్వయ్య వనతిః"

భావం-భక్తుల కు వరాలిచ్చి కోర్కె తీర్చే పరమేశా !బాణాసురుడు మూడు లోకాలను తన సైన్యం తో స్వాదీనం చేసుకొన్నాడు. సంపద విపరీతం గా సాధించి ఇంద్ర పదవిని తన పదవి కంటే తక్కువ చేసేశాడు. నీ పద భక్తుడు కనుక అతనికిది ఒక విశేషమే కాదు. నీకు ఎవరైనా శిరసువంచి నమస్కరిస్తే వాడు ఏ ఉన్నతినైనా సాధించగలడు. అలాంటి వరదుడవు నువ్వు.

14-అకాండ బ్రహ్మాండ క్షయ చకిత దేవాసుర కృపా –విదేయస్యాసీ ద్యస్త్రి నయన విషం సంహృత వతః

స కల్మాషః కంఠే న తవ కురుతే న శ్రియ మహో –వికారో పి శ్లాఘ్యో భువన భయ భంగ వ్యసనినః "

భావం –ముక్కంటీ !అమృతం కోసం సముద్ర మధనం చేసేటప్పుడువెలువడిన కాల కూట విషాన్ని చూసి దేవ రాక్షసు లు ప్రళయం వస్తోందని భయపడ్డారు. వాళ్ళపై నీకు పార కరుణ ఉండటం చేత ఆ విషాన్ని మింగి నీ కంఠం లో దాచుకున్నావు. దీనితో నీ కంఠం లో ఒక నల్లని మచ్చ

ఏర్పడింది. తెల్లని నీ శరీరం లో ఆ నల్ల మచ్చ కూడా నీకు శోభనే తెచ్చింది. వికారంగా లేదు కూడా. లోకుల భయాలను తొలగించే వారి శరీర వికృతి కూడా కొనియాడ దగిందే అవుతుందికదా.

15-అసిద్ధార్థా నైవ క్వచిదపి స దేవాసుర నరే –నివర్తంతే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః

స పశ్యన్నీశ త్వామితర సుర సాధారణ మభూత్ – స్మరః స్మర్తవ్యాత్మా న హి పధ్యః పరి భవః "

భావం -సర్వ సృష్టికి అధిపతి ఐన సర్వేశా !సృష్టి దేవ రాక్షస మానవులతో కూడి ఉంది. మన్మధ బాణాలు ఎప్పుడూ వ్యర్థం కావు. ఎవరిపై ప్రయోగిస్తే వారు దాని కి తగుల్కొని బాధపడక తప్పదు. అవి జయ స్వభావం కల బాణాలు అలాంటి శక్తిగల మన్మధుడు నువ్వు సామాన్య దేవతగా భావించి నీపై పుష్పబాణాలు ప్రయోగించి నీ మూడవ కంటి అగ్నికి ఆహుతై శరీరం కోల్పోయి, అనంగుడు అయ్యాడు. ఇంద్రియ నిగ్రహమున్న వారిపై అవమానం లేక బల ప్రయోగం ఆరోగ్య ప్రదం కాదు. వినాశ హేతువే అవుతుంది.

16-మహీ పాదా ఘాతా ద్వ్రజతిసహసా సంశయ పదం –పదం విష్ణోః భ్రామ్యద్భుజ పరిఘు రుగ్ణ గ్రహణం

ముహుర్ద్యౌ రౌస్థ్యంయాత్య నిభ్రుత జాడా తాడిత తటా-జగద్రక్షాయై త్వం నటసి నను వామైవ విభుతా "

భావం –ఉమాపతీ !సంధ్యాసమయం లో ఒక రాక్షసుడు లోకాలను బాధిస్తుంటే, వాడిని భయపెట్టి, లోకాలను సంరక్షించటం కోసం నువ్వు సంధ్యా నాట్యం చేస్తున్నావు. అప్పుడునీ అడుగుల ఒత్తిడికి భూమి హటాత్తుగా తానున్నానో లేనో ననే అనుమానం పొందుతోంది, ఆ నాట్యం లో అడ్డ గడియ లాంటి నీ భుజాల ను నువ్వు త్రిప్పు టూ ఉంటె విష్ణు స్థానమైన ఆకాశం విరిగిన గ్రహ సమూహాలై పోతోంది. చెదిరే నీ జటా జూటం చేత మాటి మాటికీ దెబ్బలు తింటున్న స్వర్గం ప్రతి దెబ్బకీ స్థితిని తప్పుతోంది. సహింప శక్యం కాని నీ తాండవనృత్యం నీకు గొప్ప ఆధిపత్యాన్ని కల్పించటం పరమ మనోహరంగా ఉంది.

17-వియద్వ్యాపీ తారా గణ గుణిత ఫేనోద్గమ రుచిః-ప్రవాహో వారాం యః పృషతలఘు దృస్టశ్శిరసితే

జగద్వీపాకారం జలధి వలయం తేన కృత మి –త్యనే నైవోన్నేయం ధృత మహిమ దివ్యం తవ వపుః"

భావం –రుద్రా ! గంగ ఆకాశమంతా వ్యాపించి, నక్షత్ర సముదాయం చేత ఎన్నో రెట్లుగా ఆవిర్భవిస్తున్న గంగ నురుగు తెల్లగా ఉంది. ఆ గంగా ప్రవాహం నీ శిరసుపై చిన్న నీటి బిందువులుగా దర్శన మిస్తున్నాయి. జగత్తు అంతా ఆ గంగా ప్రవాహం చేత ఆవరింపబడి ఒక ద్వీపాకారంగా కనిపిస్తోంది. అంతటి శక్తిగల గంగా ప్రవాహం నీ శిరసుపై చిన్న చిన్న నీటి బిందువులుగా కనిపించటం చేత నీ దివ్య సుందర దేహం మహా మహిమాన్వితమైనదని స్పష్టంగా చెప్పకనే చెబుతోంది.

18-రధః క్షోణీ యంతా శతధృతి రగేంద్రో ధనురధో –రదాంగే చంద్రార్కౌ రధ చరణ పాణిశ్శర ఇతి

దిధుక్షోతే కోయం త్రిపుర తృణ మాడంబర విధి –ర్విధేయైః క్రీడంత్యో న ఖలు పరతంత్రాః ప్రభుధియః"

భావం –గంగాధరా !త్రిపురాసురులు నీకు గడ్డిపోచాలాంటి వారు. వాళ్ళను కాల్చాలని సంకల్పించావు. అప్పుడు భూమి అంతా నీకు రధమైంది. బ్రహ్మ సారధిగా, మేరుపర్వతం ధనుస్సుగా, సూర్య చంద్రులు రధ చక్రాలుగా అమరిపోయారు. ఆ అల్ప దుష్ట రాక్షస సంహారానికి నీకు ఇంతటి ఆడంబరం అవసరమే లేదు. సమస్త లోకాలను శాసించేవారి బుద్ధులు ఇతరులపై ఆధార పడవు. ప్రభువుల బుద్ధులు విధేయులతో వినోదించాలని ఉబలాట పడుతూ ఉంటాయి. అందుకే త్రిపురాసుర దహనానికి కావాలనే నువ్వు ఇంతటి పటాటోపాన్ని ప్రదర్శించావు.

19-హరిస్తే సాహస్రం కమల బలిమాధాయ పదయోః –యదే కోనే తస్మిన్నిజ ముదహరన్నేత్ర కమలం

గతో భక్త్యుద్రేకః పరిణతమసౌ చక్ర వపుషా –త్రయాణాం రక్షాయై త్రిపుర హర జాగర్తి జగతాం "

భావం – త్రిపురహరా హరా!విష్ణువు నీ పదద్వయాన్ని వెయ్యి కమలాలతో అర్చించాలని సంకల్పించి సేకరించి ఉంచితే అందులో లెక్కకు ఒకటి తగ్గింది. వెంటనే పద్మవంటి తనకన్నునే పెకలించి పద్మంగా సమర్పించి అర్చించాడు., విష్ణుమూర్తి అచంచ భకక్తి యొక్క ఆవేశమే చక్రం గా మారి ఆయన హస్తాన్ని అలంకరించి విష్ణు చక్రమని పిలువ బడుతోంది. ఆ విష్ణు చక్రమే సమస్త లోక రక్షణకు జాగ్రుతమై నిత్యం మేలు కొనే ఉంటుంది. భక్త్యావేశం తో సమర్పింప బడిని విష్ణు నేత్రమే చక్ర రూపం పొంది హస్తాన్ని అలంకరించి సర్వ లోక రక్షణలో నిత్య జాగృతంగా ఉన్నది.

20-క్రతౌ సుప్తే జాగ్రత్ త్వమసి ఫలయోగే క్రతుమతాం –క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధన మృతే

అతతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదాన ప్రతిభువం –శ్రుతౌ శ్రద్ధాం బధ్వా దృఢ పరికరః కర్మసు జనః "

భావం –యజ్ఞేశా !ఏ యజ్ఞం అయినా ఎప్పుడో ఒకప్పుడు పూర్తి కావాల్సిందే. యజ్ఞం చేసినవాడికి ఫలాన్ని అందించటం లో నువ్వు ఎప్పుడూ సంసిద్ధంగా ముందే ఉంటావు. యజ్ఞం అనిత్యమైంది, జడం కూడా. అది ఫలాన్ని ఇవ్వ లేదుకదా ఏకర్మకైనా ఫలదాతవు పురుషోత్తముడవైన నువ్వే. నిన్ను ఆరాదించకపోతే ఫలం ఎలా లభిస్తుంది ?జనాలకు ఈ విషయం బాగా తెలుసుకనుక, యజ్ఞం ద్వారా నీ అనుగ్రహం పొందాలని వేదం పై పూర్తీ విశ్వాసం తో వేదోక్తాలైన యజ్ఞాలను నిర్వహిస్తున్నారు.

"పురి శరీరే శేతే పురి దేహే సీదతీతివా పురుషః "అని పురుష శబ్దానికివాచకమైన పరమాత్మకు నిర్వచనం. అంటే శరీరం లో ఉండేవాడు. "వేదో నిత్య మదీయతాం తదుదితం కర్మ స్వనుష్టీయతాం"అని శంకర భగవత్పాదులు ఆదేశించారు. అంటే వేదోక్త కర్మలను ఆచరించమని భావం. వేద ప్రతిపాదిత యజ్న కర్మలకు ఫలప్రదాత పరమేశ్వరుడే.

21-క్రియాదక్షో దక్షః క్రతుపతి రదీశస్త నుభ్రుతా –మృషీణామార్త్విజ్యం శరణద సదస్యా స్సురగణాః

క్రతు భ్రంశ స్త్వత్తః క్రతుషు ఫలాదాన వ్యసనినో –ధ్రువం కర్తు శ్శ్రద్ధావిదుర మభి చారాయ హి మఖాః"

భావం –భక్తరక్షక పరమేశా !శరీరధారులకు దక్షుడు అధిపతి. యాగ నిర్వహణలో గొప్ప సమర్ధుడు. ఆయన చేసే యజ్ఞాన్ని నిర్వహించేవారు సామాన్యులుకాదు, మహర్షులు. యజ్న వేదికపై ఆసీనులైనవారు దేవతా సమూహం. ఇన్ని సమకూరినా యాగ ఫలాన్నిచ్చే నీ వలన దక్ష యజ్ఞం విధ్వంసమైంది. శ్రద్ధ లేనివాడు ఎంత వైభవంగా యజ్ఞం చేసినా కూడా, ఆ యజ్ఞాలు చేసేవారికి అనర్ధాలే కలిగిస్తాయి.

యజ్నఫల దాత శివుడు ఫలాననివ్వటానికి ఎప్పుడూ ఆసక్తిగా ఉంటాడు. యజ్ఞం లోశ్రద్ధలేకుండా ఆయన అనుగ్రహం పొందలేరు. ఎంతటి గొప్పవాడైనా, శాస్త్రీయంగానే యజ్ఞం చేసినా అనర్ధాలే ఫలిస్తాయి "యదేవ శ్రద్ధయా కరోతి తదేవ వీర్య వత్తరం భవతి "అని ఛాందోగ్యం చెప్పింది

22-ప్రజానాధం ప్రసభ మభికం స్వాం దుహితరం –గతం రోహిద్భూతాం రిరమయి షుమృశ్య వపుషా

ధనుష్పాణేర్యాతమ్ దివమపి సపత్రా కృతమముం –త్రసంతం తే ద్యాపిత్యజతి న మృగ వ్యాధ రభసః "

భావం –గౌరీశా !సంధ్యాదేవి బ్రహ్మ కూతురు. ఒక రోజు ఆమె లేడి రూపం పొంది విహరిస్తుంటే బ్రహ్మకాముకుడై ఆ లేడి వెంట పడి కూతురే అయినా క్రీడించటానికి ఉబలాట పడ్డాడు. అప్పుడు విషయం తెలుసుకొన్న నువ్వు పినాకం అనే ధనుస్సు ధరించి వేటాడే బోయవానిగా ఎదురయ్యావు. బ్రహ్మ భయపడి ఆకాశం లోకి పారిపోయాడు. నీ వేటగాని సంరంభం బ్రహ్మకు ఎప్పుడూ ఒణుకు తెప్పిస్తూనే ఉంటుంది. అనుచితంగా ప్రవర్తించే వారికి నువ్వు సింహ స్వప్నమే.

23-స్వలావణ్యాంశంసా ధృత ధనుష మహ్నాయ తృణవత్-పురః ప్లుష్టం దృష్ట్వాపురమదన పుష్పాయుధమపి

యది స్త్రైణం దేవీ యమనియత దేహార్ధ ఘటనా –దవైతి త్వామద్ధా బత వరద !ముగ్ధా యువతయః "

భావం –పరాక్రమ ప్రబల త్రిపురాసురిడిని సంహరించిన పరమేశా !అహంకారం తో మన్మధుడు నీకు చిత్త చాంచల్యం కలిగించాలని సంకల్పించి విల్లు ఎక్కుపెట్టగా నువ్వు గడ్డిపోచనుకాల్చినట్లు దహనం చేసేశావు. కనుక నువ్వు మన్మధ వికార రహితుడవని భావించాలి. యోగ సమాధిలో

నిగ్రహించుకొన్న శరీరం తో నువ్వు జగజ్జనని అయిన పార్వతీ దేవిని అర్ధభాగంగా గ్రహించావు. తన ముఖ లావణ్యాన్ని తలచుకొని ఆమె నిన్ను స్త్రీలోలుడిగా భావించి ఉంటె, లోకం లో యువతులు తెలివి తక్కువ వాళ్ళు అని నిశ్చయించాల్సి వస్తుంది. ఇది యదార్ధమేకడా ఈశా. అంటే నిన్ను స్త్రీలోలుడిగా భావించటం తెలివి తక్కువ తనమే.

మాలవికాగ్ని మిత్రం లో మహా కవి కాళిదాసు "కాంతా సమ్మిశ్ర దేహోప్య విషయ మనసాం యః పరస్తా ద్యతీనాం "అన్నాడు శరీరం లో అర్ధభాగం గా పార్వతిని గ్రహించినప్పటికీ పరమేశ్వరుడు విషయ వాంచల నుండి ఇంద్రియాలను నిగ్రహించుకొన్న యోగి పుంగవుల కంటే అగ్ర గణ్యుడుఅని తెలియ జెప్పాడు.

24-స్మశానేష్వా క్రీడా స్మరహర !పిశాస్స హ చరాః-చితాభస్మా లేపః స్రగపి నృక కోటీ పరికరః

అమంగల్యం శీలం తవ భవతు నామైవమఖిలం –తదాపి స్మర్తూణాం వరద !పరమం మంగళమపి '

భావం –స్మర దహనా !శివా !నువ్వు విహరించేది స్మశానాలలో. నువ్వుపూసుకోసేది శవాలు కాలిస్తే వచ్చే బూడిద. నీ మెడలో మానవ కపాలాల దండ. ఇలా నీ స్వభావం సర్వం అమంగళమే. వరదాతవైన నువ్వు భక్తులకు పరమ శుభ దాయకుడవు అవటం ఆశ్చర్యం.

"శివం కల్యాణం తద్యో గాద్వా శివ ప్రదత్వా ద్వా శివః "అని శివ శబ్దానికి నిరుక్తి. శుభాలతో కూడి, శుభాలనిచ్చువాడు. అమంగళం గా కనిపించినా మంగళ కారుడు శివుడు అని తాత్పర్యం.

25-మనః ప్రత్యక్చి త్తే సవిధ మవధా యాత్త మారుతః –ప్రహ్రుష్య ద్రోమాణః ప్రమద సలిలో త్సంగిత దృశః

యదా లోక్యా హ్లాదం హ్రద ఇవ నిమజ్యా మృత మయే –తధత్యంత స్తత్వం కిమపి యమిన స్తత్కిల భవాన్ "

భావం –దుర్గేశా !యోగులు యోగ విధానం లో మనసును వాయు స్తంభన చేసి ప్రత్యగాత్మ లో నిలుపుతారు. అప్పుడు వారు అలౌకికానందాన్ని పొందుతారు. ఆ ఆనందానుభవంగా వాళ్ళ ఒళ్ళు పులకరిస్తుంది. కళ్ళు ఆనంద బాష్పాలతో నిండిపోతాయి. ఆ స్థితిలో ఏ వస్తువును చూసి అమృత సరస్సులో మునిగి నంత ఆనందం పొందుతారో దాన్ని వాక్కులచేత వివరింప శక్యం కాదు పరమాత్మా ! ఆ వస్తువు నువ్వే. పరమేశ్వరుడు సచ్చిదానంద పరబ్రహ్మ అని తాత్పర్యం.

26- త్వమర్కస్త్వం సోమస్త్వమసి పవనస్త్వం హుతవహా –స్త్వమాపస్త్వం వ్యోమత్వము ధరణి రాత్మా త్వమితిచ

పరిచ్చిన్నా మేవం త్వయి పరిణతా బిభ్రతి గిరం –న విద్వస్తత్తత్వం వయ మిహతు యత్వం న భవసి "

భావం –మహేశా !పండితులు నువ్వు సూర్యుడివి, చంద్రుడివి, వాయువు, అగ్ని, నీరు, ఆకాశం, భూమి, ప్రత్యగాత్మవు అని కూడా చెబుతున్నారు. అవన్నీ నీ స్వరూపాలుగా, నీ స్వరూపాన్ని పరిమితం చేస్తూ వాక్కులతో కొలుస్తున్నారు. మేము మాత్రమే చరా చర సృష్టి లో నువ్వు అసలు ఏ వస్తువు కావో తెలుసుకోలేక పోతున్నాం.

27-త్రయీం తిస్రో వృత్తీ స్త్రిభువన మథో త్రీనపి సురా –నకారా ద్వైవర్ణై స్త్రిభిరభి దధత్తీర్ణ వికృతిః

తురీయా తే ధామ ధ్వనిభి రవరుంధాన మణుభిః- సమస్తం వ్యస్తం త్వాం శరణద గృణోత్యోమితి పదం "

భావం –భక్త హృదయావాసా పరమేశా !అకార ఉకార మకారాలు కలుపగా ఓం పదం ఏర్పడి మూడు వేదాలను, మూడైనా సత్వ రజస్ తమోగుణాల వృత్తులను, మూడులోకాలను, బ్రహ్మ విష్ణు రుద్ర అనే ముగ్గురు దేవతలనూ బోధిస్తోంది. గుణాలకు అతీతం, షడ్భావ వికార రహితం అయిన నీ నిర్గుణ రూపమే నీ నాల్గవ స్థితి. సూక్ష్మ నాదాలతో ఓంకారం ఆ స్థితినే స్తుతిస్తుంది విశ్వ మంతా సూక్ష్మ ఓంకారనాదాలు వ్యాపించి నీ నాల్గవది అయిన నిర్గుణ తత్వాన్ని అభి వర్ణిస్తున్నాయి '

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ "అని వేదం. ఓంకారమే పరబ్రహ్మ వాచకం. ఓంకార మహాత్మ్యాన్ని ఛాందోగ్య ఉపనిషత్ విశేషంగా వ్యాఖ్యానించింది.

28-భవః శర్వో రుద్రః పశుపతి రథోగ్రః సహ మహాన్ –తథా భీమేశా నా వితి యదభిధానాష్టక మిదం

అముష్మిన్ ప్రత్యేకం ప్రవిరచతి దేవా శ్రుతి రపి-ప్రియా యాస్మై ధామ్నే ప్రణిహిత నమస్యో స్మి భవతే "

భావం –శంభో !భవ, శర్వ, రుద్రా, పశుపతి, ఉగ్ర, మహా దేవా, భీమ, ఈశాన అని నీ నామ అష్టకం ప్రసిద్ధి చెందింది. ఒక్కొక్క నామాన్ని గురించి శ్రుతి చక్కగా ప్రత్యేకంగా నిన్ను స్తుతిస్తోంది. అందరికీ ఇష్టుడూ, ఈ రకమైన తేజస్స్వరూపుడు అయిన నిన్ను (నీకు)నమస్కరిస్తున్నాను

ఈ నామాల అర్ధం తెలుసుకొందాం

భవః –"భవతి భవతే వా సర్వ మితి భవః –"సర్వం తానె అయిన వాడు

శర్వః –"ప్రళయే భూతాని శ్రునాతి హినస్తీతి శర్వః ;;-ప్రళయ కాలం లో సమస్త ప్రాణులను హింసించే వాడు

రుద్రః –"రోదయతి శత్రూనితి రుద్రః –"-శత్రువులను దుఖపెట్టేవాడు –"స్వయం రురోద ఇతి వా రుద్రా "-ఒకప్పుడు బ్రాహ్మ వలన జన్మ ప్రాప్తించగా దుఖించినవాడు –"రుదం రోదనం ద్రావయతి ఇతి వా రుద్రః "-దుఖాన్ని పోగొట్టేవాడు

పశుపతిః-"పశూనాం జీవానాం పతిః"పశువులు అనే జీవులు ప్రమధులైన వారికి ప్రభువు –"బ్రహ్మ విద్యాః స్తావరాంతా శ్చ పశవః పరికీర్తితాః-పశవః క్షేత్రజ్ఞాః తేషాం పతిః తేషాం త్రాతా ఇతి పశుపతిః"-పశువులు అనే జీవులను సంసార బంధం నుంచి రక్షించేవాడు.

ఉగ్రః –"ఉగ్రత్వాత్ ఉగ్రః ;;-మిక్కిలి భయంకరుడు

మహా దేవః –"మహాం శ్చాఅసౌ దేవః "-శ్రేష్టు డైన దేవుడు

భీమః –"బిభేతి అస్మాత్ త్రైలోక్యం ఇతి భీమః "-ముల్లోకాలను భయపెట్టేవాడు

ఈశానః –"ఈస్టే ఇతి ఈశానః "-ఐశ్వర్యం కలవాడు.

29-నమో నేదిస్టాయ ప్రియదవ ! దవిష్టాయ చ నమో –నమః క్షోధిస్టాయ స్మరహర ! మహిస్టాయచ నమః

నమో వర్షిస్థాయ త్రినయన !యవిష్టాయ చ నమో –నమః సర్వస్మై తే తదిదమితి సర్వాయ నమః "

భావం –అడవిలో ఉండటానికి ఇష్టపడే శివా !నువ్వు అందరికీ దగ్గరగా ఉంటావు. అలాగే దూరంగానూ ఉంటావు. మన్మధ సంహారా !మిక్కిలి సూక్ష్మం గా, మిక్కిలి పెద్ద ఆకారం గా కూడా ఉంటావు. ముక్కంటీ!బాగా వృద్ధుడువు బాగా యువకుడివీ కూడా. అంతేకాక సమస్తమూ అయిన వాడవు. అంతేనా –ఇది అది అని నిర్దేశించి చెప్పే వ్యవహారమంతటినీ మించిన సర్వ స్వరూపుడవు నువ్వు. అట్టి నీకు నమస్కారం.

ఈశ్లోకం కృష్ణ యజుర్వేదం లోని నమక భాగం లోని "నమస్సోమాయచ రుద్రాయచ "అని నమః నమః అని చాలా సార్లు వచ్చే మంత్రానికి అనుసరణ.

30-బహుల రజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమః –జనసుఖ కృతే సత్వోద్రేకే మృడాయ నమో నమః

ప్రబల తమసే తత్సంహారే హరాయ నమో నమః –ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమో నమః "

భావం –జగదీశా !నువ్వు సమస్తసృష్టి కార్యం నిర్వహించేటప్పుడు రాజోగుణాన్ని ఎక్కువగా కలిగి ఉంటావు. ప్రజాసుఖ పాలనలో సత్వ గుణాన్ని, పొంది మృడుడవు అవుతావు. సృష్టి ని లయం చేసేటప్పుడు తమోగుణ సంపన్నుడవై హరుడు అనిపించుకొంటావు. కాని నువ్వు మీ మూడు గుణాలకు అతీతుడవే. గొప్ప తెజస్స్వరూపుడవై శివుడు అనిపించుకొంటావు.అంతటి విశిష్టుడ వైన నీకు నమోవాకాలు.

ఈపదాల అర్థాలు గ్రహిద్దాం –

భవః –"భవతి భవతే వా సర్వ మితి భవః –అంతా తానె అయిన వాడు

మృడః-"మృడ యతి సుఖ యతి భక్తానితి మృడః;"-భక్తులను సుఖింప జేసేవాడు –"స్వయం సుఖీ వా "తాను సుఖం కలవాడు అని కూడా

హరః –ప్రళయం లో సమస్తమూ లయింప జేసేవాడు –"భక్తానాం ఆర్తి హరతీతి హరః "భక్తుల పీడను హరించేవాడు

శివః –'శామ్యతి పరమానంద రూపత్వాత్ నిర్వికారో భవతీతి శివః –"బ్రహ్మానంద స్వరూపుడు, నిరాకారుడుకనుక శమించి ఉండేవాడు –"శేరతీ సజ్జన మనాంసి ఇతివా "-ఇతనిలో సజ్జనుల మనస్సు ఉంటుంది –"శేతే సజ్జన మనస్సు ఇతివా "-సాధుజన హృదయ వాసి –"శివం కల్యాణం తద్యోగాద్వా శివః "-శుభం తో కూడిన వాడు. "శివో ప్రదాత్ వా శివః "-శుభాలనిచ్చేవాడు

.

31-"కృశ పరిణతి చేతః క్లేశ వశ్యం కవ చేదం –కవ చ తవ గుణ సీమోల్లంఘినీ శశ్వ దృద్ధిః

ఇతి చకితమ మందీకృత్య మాం భక్తి రాధాత్-వరద చరణ యోస్తే వాక్య పుష్పోపహారం ".

భావం –భక్త వరదా శివా !నామనస్సు కృశించే లక్షణం కలది. ఎన్నో కష్టాలకు వశమైనది. కనుక నా మనస్సెక్కడ ?ఎల్లప్పుడూ పరిమితులు మించి ఉండే నీ మహిమ ఎక్కడ ?ఏవిధంగా నీ గుణాలను నామనసు భావించ గలదు ?దానికి అది సాధ్యం కాని పనికదా అని ఎంతో భయపడుతున్నాను. కానీ నీ పై భక్తి నన్ను మండుడిని చేయటం లేదు. అది నన్ను యెంతో ఉత్సాహ వంతుణ్ణి,సమర్దుడిని చేస్తుంది. దాని ఫలితం గా నీ పాద ద్వయానికి ఈ శ్లోకాలనే పుష్పాలను కానుకగా ఆ భక్తియే సమర్పింప జేస్తోంది.

"భక్తిః కిం న కరోత్యహో వనచరో భాక్తావతంసాయతే "అన్నారు శంకర భగవత్పాదులు శివానంద లహరి లో. భక్తిచేయలేని పని లేదని తాత్పర్యం.



32-అసిత గిరి సమం స్యాత్కజ్జలం సింధు పాత్రే –సుర తరు వర శాఖా లేఖినీ పత్ర ముర్వీ

లిఖతి యది గృహీత్వా శారదా సర్వ కాలం –తదపి తవ గుణానా మీశ పారం న యాతి "

భావం –పరమేశా !సముద్రం పాత్రగా, కాటుక కొండ అంత కాటుక మసి తో, కల్ప వృక్షపు కొమ్మ ఘంటం గా భూమి అంతా రాసే పత్రం గా ఏర్పడి వీటినన్నిటి సాయం తో సాక్షాత్తు సరస్వతీ దేవి యే లేఖకురాలై వ్రాయటానికి పూనుకొన్నా నీ గుణాలనన్నిటినీ వ్రాయటం సాధ్యం కాదు కదా.

“యాత్ర వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ “అని శ్రుతి. ఒకప్పుడు వాక్కులు పరమాత్మను వర్ణించటానికి పూనుకొని కొంతదాకా వెళ్లి శక్యం కాక మనసుతో అవి తిరోగమనాన్ని పొందాయని. సర్వం తానె అయిన పరబ్రహ్మను వర్ణించటం అసాధ్యం అని భావం.

33-అసుర సుర మునీన్ద్రై రర్చిత స్యేందు మౌళేః-గ్రధిత గుణ మహిమ్నో నిర్గుణ సేశ్వరస్య

సకల గుణ వరిష్టః పుష్పదంతాభి దానో –రుచిర మలఘు వృత్తైః స్తోత్ర మేతచ్చకార “

భావం –శ్రేష్ట రాక్షస, దేవ, ముని గణాలచే అర్చింపబడే పరమేశ్వరుడు చంద్రుని శిరోభూషణంగా ఉన్నవాడు, గుది గుచ్చిన సద్గుణాల మహిమకలవాడు, త్రిగుణాలకు అతీతుడు. అలాంటి సర్వేశ్వరుని మహిమలను వర్ణించే ఈ స్తోత్రాన్ని పుష్పదంతుడు కూర్చాడు. అతడు భక్తులకు ఉండాల్సిన లక్షణాలున్న శ్రేష్టుడు.భావ గర్భితమైన ఈ స్తోత్రం ఎంతోమధురమైనది ఛందస్సుసంబంధించిన విశిష్టమైన వృత్తాలతో రచింప బడింది.


Acharya Sarvabhouma
Prof. Vedula Subrahmanya Sastri
M.A. Ph.D. (Telugu), M.A. Ph.D. (Sanskrit)
Retired Professor & Former Head of the Dept. of Telugu
Andhra University, Visakhapatnam.

"Sarada Peetham"
Visakhapatnam
Date : 24-5-15.

[illegible]

34-”అహరహరనవద్యం దూర్జటేః స్తోత్రమేతత్ –పరతి పరమ భక్త్యా శుద్ధ చిత్తః పుమాన్యః

స భవతి శివ లోకే రుద్రా తుల్య స్తధాత్ర-ప్రచురతర ధనాయుః పుత్రవా న్కీర్తి మాంశ్చ”

భావం –పరమేశ్వరుని సంబంధించిన ఈ స్తోత్రం ఉత్తమమైనది. ప్రతి రోజు రాగ ద్వేషాదులతో కలుషితం కాని శుద్ధమనసు కలిగి, పరమభక్తి తో దీన్ని పఠించే వాడు, ఈ లోకం లో అత్యధిక ధనాన్ని, పూర్ణాయుస్సును, పుత్రులను కీర్తినీ పొందుతాడు. మరణించాక శివ లోకం లో రుద్రునితో సమానుడవుతాడు.

దూర్జటి అంటే-”ధూః భార భూతా జటిః జటా యస్యేతి ధూర్జటిః”-భారమైన జడలు కలవాడని అర్ధం

35-మహేశాన్నాపరో దేవో మహిమ్నోః నా పరాస్తుతిః-అఘోరాన్నాపరో మంత్రో నాస్తి తత్త్వం గురోః పరం “

భావం –సృష్టిలో పరమేశ్వరునికి మించిన దైవం లేడు.పరమేశ్వరునికి చెందిన అఘోర (సౌమ్యమైన )మంత్రమైన పంచాక్షరికి మించిన మరో మంత్రం లేదు, శివునికంటే, పంచాక్షరికంటే మించినవీ గురువు కంటే పరతత్వ మైనదీ ఏదీ లేదని తాత్పర్యం.

## సుందర కాండ లో హనుమ

సుందరకాండ మనోభీష్టాలను ఫలప్రదం చేసే, మధుర కాండ. నాకు ఇందులో ఆంజనేయుడు బహు పార్శ్వాలతో, విభిన్న భావాలతో కనిపిస్తాడు. వీటిలో జాతి లక్షణమైన వానర లక్షణం తో పాటు, అమాయక,, తొందరపాటు, ఆలోచనారహిత, నిశ్చేష్ట, నిర్లిప్త లక్షణాలూ, ధీర వీర, పరాక్రమ శౌర్య పార్శ్వాలూ, ధీశక్తి, మతిమంతత్వం, రామభక్తి, ప్రభుభక్తి, కార్య నిర్వహణ దీక్ష, అమ్మను చూడలేకపోయానన్న వేదన ఎవరినినో చూసి సీతమ్మ అని భావించి పొరబడిన విధం, తప్పు చేసి వెంటనే సరి దిద్దుకొనే మాన్యలక్షణం అన్నిటికీ మించి తన శక్తియుక్తుల సమాహారమైన విశ్వరూప సందర్శనం చూస్తే, ఇంతింతై ఎదిగి మహోన్నతుడైన తీరు కనిపిస్తుంది. చంచలత్వం కోతిలక్షణ. దాని నుంచి పరిణతి సాధించిన వృషా కపి, హరి మనకు దర్శనమిస్తాడు. ఒకరకంగా స్ప్లిట్ పర్సనాలిటి అనిపిస్తుంది. కాని అది వినాశనానికి కాక మానవోద్ధరణకు, సకల జన శ్రేయస్సుకు, లోకకల్యాణానికి, ఆది దంపతుల సమాగమానికి రామనామ నిర్నిద్రతకు పరాకాష్ట గా వెలుగొందాడు అని నాకు అనిపిస్తుంది. ఈ భావాలు చాలాకాలం గా మనసులో గూడు కట్టుకొని ఉన్నాయికాని, ఈ భావాలతో జనుల మనస్సులలో ఇప్పటికే సుప్రతిష్టితమైన భావాలను కించ పరచానను కొంటారేమో అనే సందేహం ఉండటం వలన ఇప్పటి వరకు సాహసించలేక పోయాను. కానీ వారం పది రోజులనుంచి భావాలు సుళ్ళు తిరుగుతూ ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే ఆయనమీదే భారం వేసి అడుగు ముందుకేస్తున్నాను. దీనికో నేపథ్యంకూడా ఉన్నది సుమారు పాతికేళ్ళ క్రితం కృష్ణాజిల్లా కైకలూరుకు చెందిన,రామాయణ సుందరకాండ ప్రవచన నిష్ణాతులు బ్రహ్మశ్రీ పరిమి రామకృష్ణ శాస్త్రి గారు రోజు అక్కడినుంచి ఉయ్యూరువచ్చి సాయంత్రం ఖచ్చితంగా 6-30నుంచి 8గంటలవరకు ఉయ్యూరు విష్ణ్వాలయం లో ప్రవచనాలు చేశారు. నేను రోజు వెళ్లి ఆసక్తిగా వినేవాడిని. ఆయన నా శ్రద్ధకు చాలా సంతోషించేవారు. వారికి చేతిలో పుస్తకం అవసరం లేదు. అంతా వాచో విధేయమే. అనర్గళ ధారా పాతమే. ఒకసారి సుందర కాండ ప్రవచనం అయ్యాక వారికి సత్కారం చేస్తూ నన్ను మాట్లాడమన్నారు. నేను బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రి శర్మగారి రామాయణ సారం రోజు చదివి రెడీ గా వెళ్ళేవాడిని, అంతకు మించి కొత్తవిషయాలు చెబుతారేమోనన్న ఆలోచనతో. నన్ను మాట్లాడమంటే "అంతా బాగానే ఉంది కాని శాస్త్రిగారు హనుమ లంకలో కాలుపెట్టి చంద్రుని చూసి పొంగిపోవటం, మధువనం లో అందరితోపాటు మధువు ఆస్వాదిస్తూ నృత్యం చేయటం వంటి కొన్ని ఘట్టాలు మన దృష్టికి తీసుకు రాలేదు. జనమంచి వారి వ్యాఖ్యానం చాలా విషయాలు తెలియ జేస్తాయి. శాస్త్రిగారు దాన్ని చూసినట్లు లేదు అనిపించింది అని నిర్మొహమాటంగా చెప్పాను " ఆయన ప్రవచన తీరును బాగాహైలైట్ చేసి మాట్లాడాను. ఆయన తానూ జనమంచి వారి రచన చదవలేదనీ, కాని అందులో విషయాలు నేను చెప్పిందుకు చాలా సంతోషించారు. మళ్ళీ అక్కడే రామాయణం చెప్పేటప్పుడూ వెళ్ళేవాడిని. నన్ను చూసి దగ్గరగా కూర్చోమని సౌంజ్ఞ చేసేవారు నిత్యం. ఎవరైనా ఏదైనా కొత్తగా తెలుసుకోవాలన్నది నూతనంగా చెప్పాలన్నది నా దృష్టి. ఆ వేడిలోనే అప్పుడే "శ్రీహరి ద్యూతం "అనే పేరుతో హరి అంటే కోతి, వానరమనే అర్ధంతో సుందరకాండ హనుమ దౌత్యం గురించి పాతిక ముప్పై పేజీలు రాశాను పెద్ద బారు నోట్ పుస్తకం లో.. అది నా సర్వస్వం అనుకొన్నాను. ఆసమయం లో నేనుజగ్గయ్యపేట దగ్గర గండ్రాయి హైస్కూల్ లో సైన్స్ మేస్టర్ గా పని చేయటం, మా అన్నయ్యగారబ్బాయి రాం బాబు పెళ్లికుదరటం, నేను అక్కడే ఉండటం వలన ఇంటికి



సున్నాలు వగైరా రిపేర్ పనులతో వాళ్ళ సర్దటం తో నేను వచ్చిచూశాక ఆపుస్తకం నాకు కనపడకకపోవటం తీవ్ర నిరాశ కలిగించింది. చాలాకష్టపడి రాసిన రచన అది. తర్వాత సుందరకాండ పుస్తకం మా బావగారు శ్రీ వివేకాంద్ గారు ఇస్తే పారాయణ చేయటం.

ఆతర్వాత అడ్డాడ హైస్కూల్ లో హెడ్ మాస్టర్ గా 1987 జూన్ నెలాఖరుకు రిటైరయ్యేటప్పుడు స్కూల్ పేరెంట్స్ కమిటీ అధ్యక్షులు డా శ్రీ మేడూరి బాల రత్నవర ప్రసాద్ ఆప్యాయంగా నాకు శ్రీమాన్ చలమచర్ల వెంకటశేషా చార్యుల వారి వ్యాఖ్యానంతో ఉన్న సుందరకాండ పవిత్ర గ్రంధాన్ని కానుకగా అంద జేశారు. అదొక సువర్ణ అవకాశంగా భావించి అప్పటినుంచి క్రమం తప్పకుండా వీలైనప్పుడల్లా పారాయణ చేస్తూ ధనుర్మాసం లో మా సువర్చలాన్జనేయ దేవాలయం లో కనీసం 3సార్లు అయినా పారాయణ చేస్తూ ఈ 2020 ధనుర్మాసానికి 67సార్లు పారాయణం చేసిన అదృష్టవంతుడిని అయ్యాను. ఇంతమాత్రం చేత అదంతా నాకు మనసుకు పట్టిందనికానీ అందులోని లోతులు అర్ధమయ్యాయనికానీ అనుకోవటం లేదు. విపులాచ పృధ్వీ. ఈ నేపధ్యం లో ఈ " సుందర కాండ లో హనుమ బహుముఖీన వ్యక్తిత్వం "మొదలు పెట్టి రాస్తున్నాను. దీనికి నాకు ప్రణాళిక లేదు. లాప్ టాప్ ముందు కూర్చుని, తోచింది సందర్భ శుద్ధిగా రాయటమే నాపని. ఫలితం దైవా దీనం.

సుగ్రీవుని పనుపున శ్రీ రామాజ్ఞ గా దక్షిణ వైపు సీతా దేవిని వెతకటానికి అంగదుని నాయకత్వం లో జాంబవంత ఆన్జనేయాదులు బయల్దేరి దక్షిణ సముద్రం చేరి అలసి కాసేపు విశ్రమించి సముద్ర లంఘనం విషయమై చర్చించు కొంటున్నారు. ఇదేమీ తనపనికానట్లు నిర్లిప్తంగా ఒక ఎత్తైన బండమీద హనుమ శ్రీరామనామ ధ్యానం చేస్తూ పులకించి మైమరిచిపోతూ విభూతి పొందుతున్నాడు. వానరనాయకులు తమ బలాబలాలను నిక్కచ్చిగా బేరీజు వేసుకొంటున్నారు. శత యోజన విస్తీర్ణ సముద్రాన్ని లంఘించి అమ్మవారి జాడ కనిపెట్టి తిరిగి రాగల సమర్ధుడు వారిలో ఎవరూ లేరని చివరికి తేల్చుకొన్నారు. కిం కర్తవ్యమ్ ?తమలో హనుమ లేడేమీ అని వితర్కించారు. సకల బల తేజస్సంపన్నుడు ధీర వీర శౌర్య హనుమాన్ కు మాత్రమె సముద్ర లంఘనం చేయగలవాడని జామ్బవాన్ తెలియ జేయగా, ఆయన ఉన్న చోటుకు వెళ్లి, అతని ధ్యానం అయేదాకా వేచి ఉండి,ముక్త కంఠం గా హనుమ మాత్రమె లంకను చేరగలడు అని చెప్పి అది ప్రభు, రామకార్యం అనీ గుర్తు చేశారు. యోగబలం సాధించి స్పృహలోకి వచ్చి న హనుమకు వారి మాటలు వినిపించాయి. వారిలో దైన్యం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. చిన్న వారు చేతులు జోడించి నిలిచారు. అది సుగ్రీవాజ్ఞ గా జాంబవాన్ నిర్ణయంగా, యువరాజు కోరికగా గుర్తించాడు. "నేనా !సముద్ర లంఘనమా మహాత్ములారా !పరాచికాలాడుతున్నారా ?అంతటి శక్తి సామర్ధ్యాలు నాకెక్కడివి ?సామాన్య వానరుడను. శక్తికి మించిన భారం నాపై పెట్టటం సముచితమా. చిన్నప్పుడు సూర్యుని దగ్గరకు బాల్య చాపల్యం తో తెలిసీ తెలియని వయసులో వెళ్లానేమో ?దానికి ప్రాయశ్చిత్తమూ అనుభవించి దవడ వాయ గొట్టించు కొన్నాను కూడా. ఇది అలవిగాని పనినాకు అని సవినయంగా విన్న విస్తున్నాను "అన్నాడు వృద్ధ జాంబవంతునితో. ఆయన చిరునవ్వు నవ్వి "ఆంజ నేయా !మేమందరం మా శక్తిసామర్ధ్యాలను చెప్పుకొని మా లో ఎవరివల్లా ఈ ఘనకార్యం సాధ్యం కాదని ఏకాభి ప్రాయానికి వచ్చి, నీ శక్తి, యుక్తి, ధీ శక్తి, యోగ తేజస్సులన్నీ పరిగణనలోకి తీసుకొని కార్యభారాన్ని నీకు అప్పగిస్తున్నాం. క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగిరా. మా అందరి ఆశీస్సులు, రాజు సుగ్రీవుని ఆజ్ఞ,శ్రీరామ అంగీకారం మా మాటల్లో ఉన్నాయి. సందేహింప పని లేదు. అమృత ఘడియలు సమీపిస్తున్నాయి. ఈ సమయంలో ప్రయాణం సర్వ విధ విజయకారకం అవుతుంది "అన్నాడు. లేచి నుంచొని పెద్దలకు నమస్కరించి ఆశీర్వాదం పొందాడు.అయినా హనుమమనసులో ఎక్కడో సందేహ బీజం మొలకెత్తింది. పరేంగిత గ్రాహి, జ్ఞాన వయో వృద్ధు జామ్బవాన్ ఇక ఆ సందేహ బీజం వృక్షం కాకూడదని అక్కడికక్కడే చిదిమేయాలని భావించి, అక్కడి వానరులందరి చేతా శ్రీరామ నామం బిగ్గరగా చేయించాడు మాట చెప్పకుండా కను సైగలతో. ఇంకేముంది. పరవశించి పోయాడు వీర ధీర బుద్ధిమాన్ హనుమ. రామ నామో చ్చారణతో పాటు హనుమ గుణ గానం బాల్యాది చేసిన సాహస కృత్యాలు గేయాలుగా పాడించాడు. ఒక్కో గేయానికి ఒక్కో అంగుళం పెరిగిపోయాడు హనుమ. పూర్తిగా ఎదిగి పోయి యోగీశ్వరుడై ముకుళిత హస్తాలతో నిలుచున్నాడు. ఒకరకంగా స్తుతులకు ఉబ్బి పోయాడు. తన బలం తనకు తెలిసి వచ్చింది. తాను తప్ప ఈ అఘటనఘటనా సామర్ధ్యం ఎవ్వరికీలేదని పూర్తి విశ్వాసం, నిశ్చయం కలిగింది. "వానరుడే మహనీయుడు శక్తియుతుడు, యుక్తి యుతుడు వానరుడే "అనిపించాడు. ఈ ఉత్సాహపు పొంగు చల్లార కుండ కపి సైన్యం హనుమపై పుష్ప వృష్టి కురిపించారు. అంతే అదే గొప్ప బలవర్ధక టానిక్ గా పని చేసింది. అందరి వద్దా సెలవు తీసుకొని" జై శ్రీరాం" అంటూ ఉచ్చైస్వరం తో దిక్కులు పిక్కటిల్లేట్లు నినాదం చేయగా కపి సేన కూడా గొంతు కలుపగా, అప్పటికే విజయోత్సవ వాతారణం కనిపించింది అందరి ముఖాలలో. ఆనందం బాష్పాలుగా కన్నులనుండి స్రవించింది. "విజయోస్తు దిగ్విజయోస్తు "నాదాలు దశ దిశలా మారు మ్రోగాయి. "ఆపదామపహర్తారం దాతారం సర్వ సంపదాం-లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం "శ్లోకం అందరి నోటామంగళ తూర్య ధ్వని లా వినిపించింది.

**"తతో రావణ నీతాయా స్సీతాయా శ్శత్రు కర్శనః –ఇయేష పద మన్వేష్టుం చారణే చరితే పథి"**

ఇదీ సుందరకాండలో మహర్షి వాల్మీకి ప్రధమ శ్లోకం. స్వకార్య విరోధాలను రూపు మాపే వాడూ, సర్వ సమర్ధుడు హనుమంతుడు, రావణుడు అపహరించిన సీతాదేవి ఉండే చోటుకు వెతకటానికి సిద్ధ సాధ్యులు దేవతలు తిరుగాడే ఆకాశ మార్గం లో బయల్దేరాలని భావించాడు. శ్రీరాముని

అభ్యుదయం కోరుతూ, పర్వ దినాలలో సముద్రం ఉప్పొంగినట్లు తన శరీరాన్ని పెంచేశాడు. తానున్న మహేంద్ర పర్వతాన్ని కాలితో ఒక్క నొక్కు నొక్కగా దానిపై ఉన్న సకల వృక్ష ప్రసూనాలు ఆయనపై రాలిపడి పూజ చేస్తున్నట్లు కనిపించాయి. అక్కడి విద్యాధరులు భయపడి ఆకాశమార్గం పట్టారు. హనుమ పని రామకార్యం వానరకార్యం కూడా. ఋషులు ఆకాశం లో నిలబడి ఆశీర్మంత్రాలు చదివి దీవించారు. ముడుచుకొని ఉన్న తోకను ఒక్క సారి ఝాడించగా అది సర్పం లాగా భయభ్రాంతుల్ని చేస్తూ, గరుత్మంతుడు కాళ్ళతో తీసుకు పోయే కాల సర్పం లా భాసించింది. నడుం సన్నగా చేసుకొని కాళ్ళను,చేతులు మెడ కుంచించి, తనలో నిక్షిప్తమైన మహా తేజస్సును. మరింత పెరిగేట్లు చేసుకొని ముఖం పైకెత్తి, తోటి వానరులతో "యథా రాఘవ నిర్ముక్తః శరః శ్వసన విక్రమః -గచ్చేత్తద్వద్గమిష్యామి లంకాం రావణ పాలితాం-నహి ద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజాం -అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయం "విడువబడిన రామబాణం లక్ష్యం వైపు ఎలా దూసుకుపోతుందో అంటే ఎన్ని విఘ్నాలు మధ్యలో వచ్చినా ఆగకుండా, నేను కూడా రావణపాలిత లంకకు చేరతాను. అక్కడ సీతా దేవి కనపడకపోతే, అదే వేగంతో స్వర్గం వెళ్లి వెతుకుతా. అక్కడా జాడ దొరక్కపోతే, క్షణం ఆలస్యం చేయక రాక్షసరాజు రావణుడిని లంకతో సహా పెకలించి బంధించి తీసుకు వస్తా "అని వానరులకు ఉత్సాహం కలిగించి తన దైన మార్గం లో ప్రయాణం సాగించాడు.



ఒక్కసారి వెనక్కి చూస్తె నిర్లిప్తంగా తపస్సు చేసుకొంటున్న హనుమ పరిసరాలనే మర్చిపోయాడు. మంత్రాంగం సంగతి తెలీదు. తనపై ఇంత పెను భారం పెడతారని ఊహించలేదు. అక్కడి వారి పెద్దరికాన్ని మాటను గౌరవించి సముద్ర లంఘనకు బయల్దేరాడు. కానీ చపల చిత్తం కదా, తనబలమేమిటో తనకు తెలీదు. దీన్ని బయటికి తేవటానికి జాంబవంతుని తెలివి కలిసొచ్చింది. ఉబ్బేయించాడు స్తోత్రాలతో, ముఖ స్తుతి ఎంతటి సాహసానికైనా పురిగొల్పుతుంది. సమయోచిత ధర్మం అంటే ఇదే. తన బలపరాక్రమాలు వారి నోటి వెంట విని పొంగి, యదార్ధమని గ్రహించి కార్యోన్ముఖుడయ్యాడు. అజ్ఞానం పొర తొలగి జ్ఞాన జ్యోతిస్సు దర్శించాడు. ప్రభుకార్యం తన దైవం రామకార్యయజ్ఞానికి తాను ఒక సమిధను మాత్రమె అనే ఎరుకకలిగింది. ఎరుకకలిగితే శరీరం లో సర్వ శక్తులూ శత పత్ర పద్మం లాగా విచ్చుకొంటాయి. ఇక ఎదురన్నది ఉండదు. అసాధ్యం సుసాధ్యమౌతుంది. అందుకే వీడ్కోలు పలుకుతూ రాముడు విడిచిన బాణం లాగా లక్ష్యాన్ని చేరతాను అన్నాడు. అప్పటికే రామబాణ మహాత్మ్యం అతినికి వాలివధఘట్టం లో అంతకుముందు సప్తతాల భంజనం లో ప్రత్యక్షంగా చూసి ఉన్నాడుగా. కనుకనే అలా పలకగలిగాడు. సీతమ్మ జాడ దొరక్కపోతే ఏం చేస్తానో అన్నదికూడా విస్పష్టంగా చెప్పాడు మహా మతిమంతుడు హనుమ.

ఆకాశం లో చేతులు సాచి హనుమ ఎగురుతుంటే, ఆ చేతులు పర్వత శిఖరాలనుంచి వస్తున్న అయిదు తలల సర్పాలులాగా ఉన్నాయి. ఒక్కోసారి మరీ కిందకు దిగి ఎగురుతుంటే సముద్రజలాలను తాగుతున్నాడేమో అనిపించింది. రెండుకళ్ళుమెరుపులతో ఉన్న అగ్నిగోళాలుగా,ఉదయించే సూర్య చంద్రుల్లా దర్శనమిచ్చాయి. ఎర్రని ముక్కు కాంతి వలన ముఖం సంధ్యారాగ సూర్యుని తలపిస్తోంది. తోక ఇంద్రధ్వజమే అనిపించింది. తోకను తన చుట్టూ చక్రాకారం గా ముడుచుకొని ఎగురుతుంటే సూర్యుని కిరీటం లాగా అందులోని సూర్యునిలాగా భాసించాడు. వాల మూలం చీల్చబడిన గైరికాది ధాతుమయమైన గిరిలా కనిపించాడు. కటి ప్రదేశంనుంచి వెళ్తున్నగాలి మేఘ గర్జనలా ఉన్నది. ఉత్తరదిక్కులో కనిపించే తోకతో ఉండే ఉల్క ఏమో అనే భ్రమకలిగిస్తోంది. ఆకాశం లో హనుమ, క్రింది జలరాశిలో ఆయన ప్రతిబింబం చూస్తె తెరచాప తో గాలి వేగానికి అతి వేగంగా వెడుతున్న నావ లాగా ఉన్నాడు. ఆయనగమన వేగానికి గాలి భయంకరంగా గర్జించే సముద్రం కూడా అందర్నీ కలవర పరుస్తున్నాయి.ఆయన గమన వేగానికి సముద్ర జలం మేఘ మండలం దాకా వ్యాపించి శరత్కాల మేఘ సదృశంగా ఉన్నది. సముద్ర సర్పాలు అల్లకల్లోల జలధినుంచి భయంతో పైకెగసి ఆయన తమను భక్షించ టానికి వస్తున్న గరుత్మంతుడేమో అనుకొన్నాయి, హరి వీరుని నీడ పది యోజనాల వెడల్పు, ముప్పై యోజనాల పొడవుతో సముద్ర జలం పై బహు సుందరంగా భాసించింది. అది సముద్రంలో వ్యాపించిన దట్టమైన నిర్మల మేఘాల వరుస లాగా ఉన్నది. సముద్రజలం అతని వేగానికి అడుగంటి ద్రోణి ఏర్పడినట్లు,ఏదో ఉపద్రవం

రాబోతున్న సూచనగా ఉన్నది. రంగురంగుల మేఘాలమధ్య, మబ్బుల చాటున దాగి మళ్ళీ బయటికి వస్తుంటే చంద్రునిలా అనిపించాడు. తనవంశ పావనుడైన శ్రీ రాముని కార్య దురంధరుడు కనుక గురువు సూర్యుడు, తండ్రి వాయువు తమప్రతాపాలను చూపక చల్లగా కనికరంగా ఉన్నారు. యక్షకిన్నెర కింపురుషాదులు ఋషులు హనుమ ను చూసి స్తోత్రాలు చేసి, మానసికోల్లాసం కలిగించారు.



ఇక్ష్వాకు వంశజులైన సగర పుత్రులతో వర్ధిల్లిన,ఆ వంశ క్షేమం గౌరవం కోరే సాగరుడు తనలో తానూ వితర్కించు కొన్నాడు. "వానరకుల శ్రేష్టుడు హనుమకు నేనిప్పుడు ఏదో కొంత సాయం చేయకపోతే లోకం నన్ను నిందిస్తుంది. ఇఖ్వాకు వంశకులజుడైన శ్రీరాముని దూత హనుమ. అతనికార్యానికి ఏ కష్టమూ రాకూడదు. అలసి పోయి ఉంటాడు కనుక కాస్త విశ్రాంతి పొందే ఆలోచన చేయాలి. విశ్రాంతి తర్వాత యధాప్రకారం రెట్టించిన ఉత్సాహంతో గమ్యానికి బయల్దేరి వెడతాడు "అని భావించాడు. తనలో దాగిఉన్న మైనాక పర్వతం ఇప్పుడు తోడుపడటాడని అనుకోని, పిలచి "మైనాకా !పాతాళం లో ఉన్న రాక్షసులు భూమిపైకి రాకుండా ఉండటానికి ఇంద్రుడు నిన్ను నాలో ఇనుప గడియగా అడ్డంగా ఉంచాడు. నువ్వు రాక్షసమూకలు పైకి వచ్చి చెలరేగకుండా పాతాలలోక ద్వారాన్ని బాగా కప్పేశావు. నువ్వు అన్ని వైపులా పెరగగల సామర్ధ్యమున్నవాడివి. కనుక "సంచోదయామి త్వాముత్తిష్ట గిరి సత్తమ –స ఏష కపి శార్దూల స్త్వా ముపర్యేతివీర్యవాన్ –హనుమాన్ రామకార్యార్ధం భీమకర్మా ఖ మాప్లుతః –అస్య కార్యం మయాకార్య మిక్ష్వాకు కులవర్తినః "అంటూ సీతాన్వేషణ అనే పవిత్రకార్యం పై వచ్చిన హనుమ మనకు అతిధి. పూజనీయుడు. కనుక నీటిపైకి వచ్చి నీ శిఖరం పై కాసేపు విశ్రమించమని నాతరఫున అర్ధించు "అని కోరాడు.

సముద్రుని మాటకు గౌరవమిచ్చి మైనాకుడు పెద్ద చెట్టు, తీగలతో పైకి వచ్చి తనశిఖర దర్శనం కల్గించి నూరుమంది సూర్యులు ఒకే సారి ఉదయించినట్లు అధికకాంతితో విరాజిల్లాడు. ఇది తన ప్రయాణం లో తొలి విఘ్నం గా భావించి హనుమ, తానూ మహావేగంగా పెరిగి మేఘాన్ని వాయువు చెదరగొట్టినట్లు తన రొమ్ము దెబ్బతో సునాయాసంగా పడేశాడు. అకస్మాత్తుగా ఇలా జరుగుతుందని భావించని మైనాకుడు బిత్తరపోయి, హనుమ వేగాన్ని మెచ్చుకొని పులకించి ఆనందించి. మానవ రూపం పొంది "కపి శ్రేష్టా! హనుమంతా !ఎవ్వరికీ సాధ్యంకాని పని చేస్తున్నావు అభినందనలు. కాసేపు నా శిఖరం పై విశ్రమించి సేద తీర్చుకొని మళ్ళీ ప్రయాణం సాగించు. సముద్రుడు రాముని పూర్వులచే వర్ధిల్లినవాడు. కనుక రామహితం కోసం నన్ను ఇలా చేయమని చెప్పించాడు. నీకు ఆతిధ్యమిచ్చి తనకోరిక తీర్చుకోవాలని తలచాడు. మాకూ మీకూ చాలాకాలం నుంచి సత్సంబంధాలున్నాయి. ఇది అతిధి ధర్మమే. నీకు నేను చేసే పూజ మీ తండ్రి వాయు దేవునికిచేసే పూజ అవుతుంది. కృత యుగం లో పర్వతాలకు రెక్కలు ఉండేవి. గరుత్మంతు నిలాగా, వాయువు లాగా అన్ని దిక్కులకు యెగిరి పోయేవి. సకల జీవరాసులు మా గమనానికి భయపడి పోయాయి. ఇంద్రుని ప్రార్ధించాయి. శతక్రతువు ఐన దేవేంద్రుడు పర్వతాల రెక్కలను తన

వజ్రాయుధంతో ఖండించాడు. నాపైకి కూడా రాగా మీ తండ్రి దయతో అతనికి అందకుండా నన్ను విసిరేశాడు. నేను వచ్చి ఈ సముద్రం లో పడటం వలన నా రెక్కలు అలాగే సురక్షితంగా ఉన్నాయి. కనుక సాగరుడికీ నాకూ పరమ ఆత్మీయుడవుకనుక మా ఆతిధ్యం పొంది వెళ్ళు "అని వేడుకొన్నాడు. మతిమాన్ హనుమ "నీఆదరణకు సంతోషం. నీ దర్శనమే నాకు ఆతిధ్యం. నేను కర్తవ్యమ్ మరువరాదు. చీకటిపడే లోగా లంకకు చేరాలి. నేను చేసిన ప్రతిజ్ఞప్రకారం ఎక్కడా క్షణం కూడా ఆగకూడదు "అని చిరునవ్వుతో సమాధానం చెప్పి తన పవిత్ర హస్తం తో మైనాకుని తాకగా సముద్ర, మైనాకులు "నీ వల్ల రామకార్యం సఫలీకృతం అవుగాక "అని రామకార్యానికి తగ్గట్లు ఆశీర్వదించగా రివ్వున ఆకాశానికి యెగిరి హనుమ వాయుమార్గాన గమనం సాగించాడు.

ఈ భాగం లో హనుమ ను సూర్య చంద్ర అగ్ని వాయు రూపాలుగా వర్ణించాడు వాల్మీకి మహర్షి. వారి ప్రతాపాలన్నీ ఆయనలో నిండి నిబిడీకృతం అయ్యాయని భావన. కనుక కార్యం అసాధ్యం కాదని సూచన. సూర్య వాయిదేవులు కూడాఆయనకు అనుకూలంగా ఉండి సాయం చేస్తున్నారు ప్రతాపాలు చూపక తగ్గి ఉన్నారు. మహర్షులు, దేవతలు మొదలైనవారు ఆశీర్వదించారు.వారి ఆశీస్సులు అమోఘం కనుక తప్పక ఫలిస్తాయి. ఇక్కడ సాగరుని ఆలోచనా అభినందనీయమే. హనుమకు కాసింత విశ్రాంతి నివ్వాలని ఆతిధ్యమిచ్చి ధన్యత చెందాలని భావించటం సహజం. కనుక హనుమ తండ్రి మైనాకుడికి చేసినసాయం గుర్తుకొచ్చి అతని ద్వారా తన కోరిక తీర్చుకోవాలనుకొన్నాడు. మైనాకుడూ తనవంతు ధర్మం నెరవేర్చాడు. మైనాకుని రెక్కలు కత్తిరింపబడ లేదనే సత్యమూ మనకు తెలిసింది ఇక్కడ. కారణం వాయువు అన్న విషయమూ అర్ధమైంది. కానీ వీరిద్దరికీ హనుమ చేసిన ప్రతిజ్ఞ తెలీదు. ఆతిధ్యం ఇద్దాము అనే ధ్యాసతప్ప రామ కార్యానికి ఆలస్యకారణం అవుతాము అన్న ఆలోచన లేదు వారికి. అందుకే సంస్కార వంతుడు హనుమ సున్నితంగా వారి మర్యాదలకు అది సమయం కాదని తన ప్రతిన విషయం చెప్పి నిరుత్తరులనుచేసి తెలివిగా బయట పడ్డాడు. తక్షణ వివేకమే ఎప్పటికీ ఉత్తమ ఫలితమిస్తుందని మనకు కూడా ఎరుక పరచాడు ఆంజనేయుడు.

హనుమ చేసినపనికి దేవేంద్రునితో సహా సకల దేవతలు మెచ్చి ఆశీర్వదించారు. మైనాకునితో ఇంద్రుడు "నీ పనికి ప్రీతి చెందాను. ఇకపై నావలన నీకు అపకారం జరగదని హామీ ఇస్తున్నాను. జంకు గొంకులు లేకుండా సుఖంగా వర్ధిల్లు. మహా సాహసకార్యానికి వొడిగట్టినహనుమకు వందయోజనాలు దాటగానే అతనికి ఏ అపాయం వస్తుందో అని భయపడ్డాం. ఏమాత్రం భయపడని హనుమ కు నువ్వు చేసిన సాయం విలువలేనిది. రామదూతకు నువ్వు చేసిన సత్కారానికి అత్యంత ప్రీతి చెందాను "అని నిండుమనసుతో అభినందించాడు. హనుమ తిరిగి వచ్చేటప్పుడైనా తనా ఆతిధ్యం గ్రహిస్తాడన్న కొండంత ఆశతో మైనాకుడు నీటిలో మునగకుండా, ఇంద్రుడిచ్చిన అభయం తో అలాగే ఉండిపోయాడు.

. ఇందరి ఆశీస్సులు దండిగా పొందిన హనుమ అత్యుత్సాహంతో ఆకాశం లో సముద్రాన్ని క్షణకాలం లో దాటగా, దేవ, గంధర్వ, సిద్ధ, మహర్షులు సూర్యతేజం తో ఉన్న నాగమాత సరస తో క్రూర రాక్షస రూపం దాల్చి నోటిని ఆకాశమంత చాచి హనుమ ప్రయాణానికి ముహూర్తకాలం విఘ్నం కలిగించమని,అతని బలపరాక్రమాలు తెలుసుకోవటానికి అది పనికొస్తుందని, ఉపాయంతో అపాయం ఎలా తప్పించుకొంటాడో చూద్దామని కోరారు. ఆమె అలాంటి రూపమేదాల్చి హనుమమార్గానికి అడ్డు నిల్చి,"దేవతలు నిన్ను నాకు ఆహారంగా పంపారు. నిన్ను తినేస్తాను నా నోట్లో ప్రవేశించు "అన్నది. చాలా ఆనందంగా ఆమెకు నమస్కరించి "రాముడు తమ్ముడు లక్మణుడు భార్య సీతతో తండ్రి దశరధుని ఆజ్ఞగా దండకారణ్యం ప్రవేశిస్తే మాయా వేషంతో సీతను రావణుడు అపహరించుకొని పోయి లంకలో దాచాడు. సీత జాడ తెలుసుకొని రమ్మన్న రామాజ్ఞతో దూతగా వెడుతున్నాను. నువ్వు ఇప్పుడు రామ రాజ్యం లోనే ఉన్నావని గ్రహించు. కనుక ప్రభువుకు సాయం చేయటం నీ విధి. కాదంటావా రామకార్యం పూర్తి చేసి తిరిగి వచ్చినీ నోట ప్రవేశించి నీకు ఆహారమౌతాను అని ప్రతిన చేస్తున్నాను నమ్ము "అన్నాడు, తనను దాటి ఎవరూ ముందుకు పోలేరని, తనకు కబ్రహ్మ వరం ఉంది "అన్నది కామరూపిణి సరస. బుద్ధిమాన్ హనుమ వెంటనే ఆమె నోట్లో ప్రవేశించి క్షణం లో బయటికి వచ్చేసి "దాక్షాయణీ !నీవు కోరినట్లే నీ నోట్లో దూరాను బయటికి వచ్చేశాను. బ్రహ్మవరం సార్ధకమైంది కదా. నమస్కారం "అన్నాడు. ఆమె తన సహజ రూపం పొంది "హరి శ్రేష్టా!ఇక సుఖంగా ప్రయాణం సాగించు సీతాదేవినీ, రాముడిని కలిపి పుణ్యం కట్టుకో "అని దీవించింది. దీనితో నాగమాత ఆశీస్సులూ దక్కి మరింత ఉత్సాహం తోప్రయాణం సాగించాడు. క్రిందికి ముడుచుకొన్న రెక్కలతో నాలుగు దిక్కులకు వ్యాపించిన పర్వత రాజు లాగా హనుమ కనిపించాడు.

ఈఘట్టం లో దేవతలు హనుమ ధీశక్తిని పరీక్షించారు. వివేకంతో అతడు సురస నోట్లో దూరి అవ్యవధానం గా బయటికొచ్చి తన తెలివి తేటలు ప్రదర్శించి సురసద్వారా దేవ యక్ష గంధర్వ మహర్షుల అభిమానాన్ని పొంది ఆశీస్సులందు కొన్నాడు. ఇవన్నీ అతని బలాన్ని మరింతగా పెంచాయి. మేధస్సును పదును పెట్టాయి. అఘటన ఘటనా సమర్ధుడు అనిపించుకొన్నాడు. కనుక అతనికి దుష్కరకార్యం ఉండదు అని తేట తెల్లమైంది.

ఇంకో విషమ పరీక్షను ఎదుర్కున్నాడు హనుమ. కామరూపి సింహిక చాలాకాలం తర్వాత తనకు మంచి ఆహారం గా అతి పెద్ద ప్రాణి లభిస్తోందని ఎంచి, హనుమ నీడను పట్టి గుంజింది. ఈఅకస్మాత్తు ఘటనకు ఆశ్చర్యపోయి, ప్రచండమైన ఎదురుగాలి చే వెనక్కి నడుస్తున్న పడవలాగా తనపని అయిందని, అన్ని వైపులకు పరికించి చూడగా, నీటి నుంచి పైకి లేచిన ఒక పెద్ద జంతువు కనిపించగా, తమకు ఒకప్పుడు సుగ్రీవుడు సముద్రం లో నీడను బట్టి వెనక్కి లాగే అతిపెద్ద జంతువు ఒకటి ఉంది అని హెచ్చరించిన విషయం చటుక్కున స్ఫురించి,ఆజంతువు అదే అయి ఉంటుందని నిశ్చయించి, వర్షాకాల మేఘం లా తన దేహాన్ని మరింత పెంచాడు. సింహిక కూడా ఆశ్చర్యపోయి,పాతాళ బిలం లాంటి తననోరు విస్తృతంగా తెరచి,హనుమను తరమసాగింది. అంత విశాలమైన నోటితో తనను కబళిస్తుంది అని వెంటనే గ్రహించి, దాని నోరు, దేహ పరిణామం, ప్రాణస్థానం సూక్ష్మ బుద్ధితో చూసి గ్రహించి, మహా చాకచక్యంగా తన శరీరాన్ని అత్యంత వేగం గా తగ్గించుకొంటూ దాని నోట్లోకి దూరిపోయాడు. రాహువు మింగుతున్న చంద్రుడులాగా కనిపించాడు సిద్ధచారణులకు. వెంటనే సింహిక ఆయువు పట్లను గోళ్ళతో అత్యంత వేగంగా అది నోరు మూయక ముందే చీల్చి, ఉపాయంగా మనోవేగం తో పైకి ఎగిరిపోయాడు. అది విగత జీవియై సముద్ర జలాలపై పడిపోయింది. అప్పుడు ఆకాశ దేవతలు –"తాం హతాంవానరే ణాషు పతితాంవీక్ష్య సింహికాం-భూతా న్యాకాష చారీణి తమూచుః ప్లవగోత్తమం "అంటే వానరశ్రేష్టా, హనుమా !ఒకగొప్ప జంతువును చంపి భయంకర కార్యం సాధించావు. ఇక నీ అభీష్టానికి తిరుగు లేదు. "ధృతి,ర్దృష్టిర్మ తిర్దాక్ష్యం స కర్మసు న సీదతి."-సతైస్సంభావితః పూజ్యః ప్రతి పన్న ప్రయోజనః "'నీలాగా ధైర్య, సూక్ష్మబుద్ధి, బుద్ధి కుశలత, సామర్ధ్యం ఉన్న వాడు ఎప్పుడూ పరాజయం పొందడు "అని ఆకాశ భూత సంతతి అభినందించి ఆశీర్వదించాయి. ఇలా సింహికను సంహరించి దాదాపు సముద్రం అంతా దాటేసి, ఒక్కసారి అన్ని వైపులకు చూడగా మనోహరమైన వృక్షజాలం తో లంకానగరం, దక్షిణ తీర మలయపర్వతం. దానిపై తోటలు కనిపించాయి.



ఇప్పటిదాకా అతి పెద్దగా ఉన్న తన దేహాన్ని ఒక్క సారి చూసుకొని, అంతపెద్ద రూపంతో రాక్షసులకు కనిపిస్తే తానెవ్వరో తెలుసుకోవాలనే తపనఉత్సుకత, తన్నుపట్టుకొనే పన్నాగం చేస్తారని గ్రహించాడు. చిటికలో విరాట్ రూపాన్ని,మూడడుగుల దానం కోరి బలిని పాతాళానికి తొక్కేసిన వామన మూర్తిగా రూపం మార్చుకొని మామూలు కోతిలాగా కనిపించాడు. అవ్వలి తీరాన్ని ఎవరూ చూడకుండా చేరి, లంబగిరి శిఖరం పై దిగాడు. అక్కడ నుంచి దేవతల రాజధాని అమరావతి లాగా ఉన్న లంకానగారాన్ని చూశాడు –

"ససాగరం దానవ పన్నగాయుతం –బలేన విక్రమ్య మహోర్మి మాలినం –నిపత్య తీరే చ మహోదధే స్తదా –దదర్శ లంకా మమరావతీ మివ "

రాక్షసులు, పన్నగులు ఉండే, పెద్ద అలలల్తో కూడిన శతయోజన విస్తీర్ణ మహా సముద్రాన్ని తన స్వీయ బలంతోదాటి, తీరం చేరి, అపర అమరావతి లాగా ఉన్న లంకానగారాన్ని కనులారా సాయం వేళ చూశాడు.

202శ్లోకాల ఈ ప్రధమ సర్గ లో హనుమ బయల్దేరిన దగ్గరనుంచి నాన్ స్టాప్ గా ప్రయాణం చేసి విడువబడిన రామబాణం లక్ష్యం చేరినట్లు లంక కు చేరాడు. మధ్యలో ఎన్నో హుషారురుకలిగించేవి భయపెట్టేవి సంగతులు ఉన్నాయి. లక్ష్యం వైపు సాగే మనిషి ఎక్కడా అలసత్వం చూపరాదు. అనుకోకుండా ఎదురయ్యే భ్రమ ప్రమాదాలను సూక్ష్మ బుద్ధితో వివేకాన్ని జోడించి పరిష్కరించుకోవాలే కాని భయపడి వెనకడుగు వేయరాదు అనే సత్యాన్ని లోకానికి చాటాడు. మంచి పనికి దేవతలుకూడా ఆమోదం చూపి ఆశీర్వదిస్తారని తెలియ జేశాడు. వారికి కావాల్సింది లోకకల్యాణమేగా. ఆత్మీయత చూపినవారిపట్ల మైనాకుని ఆదరించినట్లు ఆదరించి ఆనందం చేకూర్చాలి. పరీక్షా సమయంలో సూక్ష్మగ్రాహి గా ఉండాలి. తననే చంపాలనుకొన్న సింహిక గర్వాన్ని నేర్పుగా ఖర్వం చేసినట్లు, దారికి అడ్డం తొలగించు కోవాలి. అప్పుడే తథాస్తు దేవతలు సంపూర్ణ అనుగ్రం చూపి కార్యానికి సానుకూల వాతావరణం కలిగిస్తారు. ఇలా ఎక్కడ ఒడిదుడుకు లేర్పడినా హనుమ ధైర్య శౌర్య సాహస బుద్ధి వివేకాలతో అధిగమించి అనుకొన్నది సాధించాడు ఇదే ఈ సర్గలో మనం గ్రహించాల్సింది. సముద్రం లో ఎలాంటి తమాషా జీవులుంటాయో, వాటి సవ్రూప స్వభావాలేలా ఉంటాయో మహర్షి చూపించాడు. సింహిక లాంటి ప్రమాదకర జంతుఉ ఉంటుందని రాజుసుగ్రీవుడు చెప్పిన విషయాన్ని సద్యో స్ఫురణకు తెచ్చుకోవటం మహామతిమంతుడైన హనుమ వివేకం. అదే మర్చి పోయి ఉంటె లేనిపోని ప్రమాదం లో పడేవాడు. తక్షణ ఆలోచన తటిల్లత లాగా రావాలి అప్పుడే గొప్ప ఫలితం లభిస్తుంది. ట్యూబ్ లైట్ బుర్ర ఐతే వెలిగే లోపు జీవితం ఆరిపోవచ్చు.,

సముద్రం లంఘించి త్రికూట పర్వత శిఖరం పై ఉన్న లంకా నగరం చూశాడు హనుమ. హరి దర్శనానికి పులకించా యేమో చెట్లు అన్నట్లు సువాసన వెదజల్లే పూల వర్షం కురిపిస్తే, పూలతో చేయబడిన కోతిలా ఉన్నాడు. అలసట నిట్టూర్పులు లేకుండా ఉన్న అతడు "వందేమిటి సహస్ర యోజనాలున్న సముద్రమైనా దాటేయ గలను "అని కించిత్ గర్వంతో రొమ్ము విరుచుకొన్నాడు. ఇది సహజ మానవ లక్షణం. కంటితో ఎటు చూసినా లంక మహా శోభాయమానంగా పచ్చ పరుపు పరచినట్లు కనిపించి,జయధ్వానాలతో "పచ్చ జెండా "ఊపుతున్నట్లని పించింది. ప్రతిప్రాకారం స్వర్ణమయం. కళ్ళు జిగేలు మనే కాంతి మయం. విశ్వకర్మ నిర్మించిన ఈ నగరం త్రికూట శిఖరం పై ఉండటం తో ఆకాశం లో తేలుతున్నట్లు అనిపిస్తుంది. సంకల్పమాత్రం తో సృష్టించిన విశ్వకర్మ శిల్ప నైపుణ్యానికి అబ్బురపడ్డాడు. కోటలు అగడ్తలు రమ్య భర్మ్య హర్మ్యాలు కను విందు చేశాయి. క్రూర రాక్షసులచేత అనుక్షణం కాపాడబడే లంక ఒకప్పుడు కుబేరుడిది. అతన్ని నెట్టేసి ఆక్రమించాడు రావణా బ్రహ్మ.

ఇప్పుడు విచికిత్సకు లోనయ్యాడు మారుతి. "వానరులు ఇక్కడికి వచ్చినా ఏమీ చేయలేరు. దేవతలు కూడా లంకను జయించలేరు. సప్తతాళ భంజనాన్ని ఒకే బాణం తో చేసిన రాముడు కూడా ఏమీ చేయలేడేమో ఇక్కడికి వచ్చి. "ప్రాప్యాపి మహా బాహుః కిం కరిష్యతి రాఘవః "అసుర ప్రవృత్తి కల రాక్షసులముందుసాంత్వనం పని చేయదు. వారు సంపన్నులు కనుక దానమూ పని చేయదు. బలగర్వమున్నవారు కనుక భేదమూ కుదరదు. బలపరాక్రమబుద్ధి విశేషం ఉన్నవారుకనుక యుద్ధం చేత కూడా నిగ్రహింప బడరు. లంకకు రావటానికి అంగదుడు, నీలుడు, మా రాజు సుగ్రీవుడు నాకు మాత్రమె సాధ్యం. ముందు సీతాదేవి జాడ వెతికి, ఆతర్వాత కర్తవ్యమ్ ఆలోచిస్తాను "అని ఆలోచించి, మళ్ళీక్షణం ఆలోచించి "నేను ప్రస్తుతం ఉన్న రూపం లో లంకలో ప్రవేశించకూడదు. కపట క్రూర వర్తనులైన రాక్షసులను వంచించటం ప్రస్తుతం తప్పదు.ఇలా కనిపిస్తే దొరికి పోతా. చిన్న రూపం లో ఇంత లంకంతా వెదకటం చాలాకష్టం. కనుక మధ్యే మార్గం గా చిన్నదీ కాక పెద్దదీకాని మద్యం రూపం పొంది రాత్రి వేళ లంక చేరి అనుకున్నపని సాధిస్తాను.

ఇంతటి మహా నగరం లో సీతాదేవి ఎక్కడ ఉన్నదో ఎక్కడ రావణుడు దాచిపెట్టాడో తెలుసుకోవటం మహా కష్టం. ఆమె ఒంటరిగా ఉంటె నేను ఒంటరిగా చూస్తాను. వివేకం ప్రదర్శించకపోతే, కావాల్సిన పనికూడా దూత చేతిలో విఫలమౌతుంది. రాజు మంత్రిఎంతో ఎన్నివిదాలో ఆలోచించి పని నిర్ణయిస్తారు. అవివేకి ఐన దూత దాన్ని చెడ గొట్ట వచ్చు "ఘాతయంతి హి కార్యాణిదూతాః పండిత మానినః "అని ఆర్యోక్తి. అంటె అన్నీ తమకే తెలుసు అనుకునే దూతలు ఇచ్చిన పనులు చెడగొట్టి చెడ్డ పేరు తెచ్చుకొంటారు రాజకార్యం విఫలమౌతుంది. శ్రీరామకార్యం నా మూలాన చెడిపోవటానికి వీల్లేదు. నేను అవివేకి గా ఉండక పోవటం ఎలా అనేది పెద్ద సమస్య. సముద్ర లంఘనం విఫలం కారాదు. రాక్షస రూపం దాల్చినా, రాక్షసులు తేలికగా గుర్తించే బుద్ధి సూక్షం కలవారు. ఇక్కడ రాక్షసులకు తెలీకుండా గాలికూడా వీయదుఅని నా అభిప్రాయం. వాళ్లకు తెలీనిది ఏదీ ఉండదు. కనుక చిన్న కోతి రూపం లోనే రాత్రిపూట లంక ప్రవేశం చేస్తాను. రాత్రి పూట ఎవరికీ కనిపించకుండా లంకానగరం అంతా

వెదకి అమ్మవారి జాడ తెలుసుకొంటాను "అని బహువిధాల ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చి సూర్యాస్తమయం ఎప్పుడు అవుతుందా అని ఎదురు చూశాడు.

రాత్రికాగానే "పిల్లి అంత"రూపం పొంది, విశాల లంకానగరమంతా గాలించటానికి సిద్ధమయ్యాడు. శుభకార్యానికి సముద్రుడు, మైనాకుడు,సూర్యుని వంటి తానూ చుక్కల మధ్య ప్రకాశించే చంద్రుడు కూడా హనుమకార్యానికి సాయం చేస్తున్నట్లు వెన్నెల కురిపించాడు, అప్పుడు శంఖం, పాలు, తామర తూడులు లాగా తెల్లగా సరస్సులో నుంచి పైకొచ్చిన హంస లాగా తారాపతి చంద్రుడు మార్గాల హనుమకు దర్శనభాగ్యం కలిగించాడు అని58శ్లోకాల ద్వితీయోధ్యాయం. -"శంఖప్రభం క్షీర మృణాల వర్ణ –ముద్గచ్ఛ మానం వ్యవ భాసమానం –దదర్శ చంద్రం స హరి ప్రవీరః –పోప్లూయ మానం సరసీవ హంసం "

ఈ సర్గలో హనుమ ఆలోచనలు యెంత విస్తృతంగా ఉన్నాయో, దూతకార్యం ఎలా కత్తిమీద సాములాగా ఉంటుందో. కార్యం సఫలం అవటానికి ఎంతగా వివేకం బుద్ధి సూక్ష్మత అవసరమో నిరూపించాడు, ఒక్కటే ధ్యేయం హనుమది –అదే రామకార్య సాఫల్యత. అందుకే వచ్చిన తాను పరిపరి విధాల వితర్కించి "నేతి నేతి "అని పండితులు తర్కించి బ్రహ్మాన్ని దర్శించే ప్రయత్నం చేశారో అలా చేసి ఆదర్శ దూత అనిపించాడు. చంద్ర ప్రకాశమూ ఆతనికి గొప్పగా సహకరించింది. అందుకే వాల్మీకి రసవత్తర శ్లోకం లో ఉప్పొంగి పోయి వర్ణించాడు. 'ఘాతయంతి హి కార్యాణిదూతాః పండిత మానినః" అన్న రుషి వాల్మీకి వాక్యం లోకం లో నానుడిగా నలుగుతోంది ఇప్పటికీ. రస స్వరూపుడు పరమాత్మ కనుక కవితా రసప్రవాహమే ఇక్కడ కనిపించింది.

కాలోచిత ఆలోచన హనుమ ప్రత్యేకత. బలమైన సైనికులు అకుక్షణం పహారా కాస్తున్న, వైభవం లో కుబేరుని అలకానగరం లా, దేవేంద్రని అమరావతిలా, స్వర్ణద్వారాలు వైడూర్యవేదికలు నేలంతా రత్నఖచితంగా వైడూర్యాలమెట్లతో సుందర వైభవ లంకను హనుమ చూశాడు. దానిగురించి మనసులో "ఈ లంక గొప్పతనం కుముదుడికి, అంగ దుడికి సుషేణుడికి,మైంద ద్వివిదులకు, సుగ్రీవ కుశపర్వానరరాజుకు రుక్షునకు కేతుమాలికి మాత్రమేచేరటానికి సాధ్యం ఇది. "అనుకొన్నాడు. మరి తానూ వచ్చాడుగా, దాన్ని గురించి చెప్పుకోకపోవటం వినయ లక్షణం ఇక్కడ భాసించింది. ఇతరుల బలపరాక్రమాలు తెలిసి పొగడటం వీర ధీర లక్షణం. హనుమ అదే పాటించి సుభాష్ అనిపించుకొన్నాడు. రామ, లక్ష్మణ శౌర్య పరాక్రమాలు ఒకసారి గుర్తు చేసుకొని వారిద్దరూ అనాయాసంగా లంకను జయించగలరు అని నమ్మకం కలిగింది. లంక "రత్నాలే వస్త్రాలుగా, సామగ్రి నిలవచేసే కొట్లే కర్ణాభరణాలుగా, యంత్రాగారాలే స్తనాలుగా ఉన్న సర్వ శోభిత అయిన యువతి"లాగా కనిపించింది కుర్రాడికి. అప్పుడు మరో పరీక్ష ఎదుర్కొన్నాడు.

లంకా నగర దేవత వికృతముఖం, భయంకరమైన కళ్ళు, అయిన నిజ రూపం తో కనపడి పెద్దగా అరుస్తూ, హనుమను చూసి "ఓకోతీ! నువ్వెవరవు. ఎందుకొచ్చావ్ నీ ప్రాణాలు తీసే లోపు నిజం చెప్పు. సర్వ సురక్షమైన లంకలో నీకు ప్రవేశం లేదు "అనగా అత్యంత వినయంగా "అమ్మా !అంతా నిజమే చెప్తా అబద్ధం చెప్పను. అసలు నువ్వు ఎవరు తల్లీ. ఎందుకు భయంకర రూపంతో నన్ను అడ్డుకుస్తున్నావు, బెదిరిస్తున్నావు ?"అడిగాడు. కామరూపి ఐన ఆమె "రాక్షసరాజు రావణ ఆజ్ఞావర్తిని. నగరాన్ని కాపాడటం నా విధి నన్ను ఎదిరించటం ఎవరికీ సాధ్యం కాదు. నా ప్రమేయం లేకుండా లంకలో నువ్వు ప్రవేశించలేవు. నిన్ను ఇప్పుడే దీర్ఘ నిద్రలోకి పంపిస్తా. "అన్నది. పర్వతాకారంలా ఉన్న దాన్ని చూసి ఇక యుద్ధమే తక్షణ కర్తవ్యం అనుకోని, ఎందుకైనా మంచిదని "అందంగా ఆకర్షణగా ఉన్న ఈ నగరాన్ని చూడాలనే కోరిక కలిగింది. ఇక్కడి వనాలు ఉపవనాలు అడవులు ముఖ్యమైన ఇల్లు చూడటానికి మాత్రమె వచ్చాను "అన్నాడు

వికృతంగా వికటాట్టహాసం చేస్తూ అది 'నీ దుర్బుద్ధి నాకు తెలిసింది నన్ను ఓడించాకుండా లంకానగర సందర్శనం నీకు శక్యం కాదు "అని దబాయించింది. తగ్గు బాలయ్యా తగ్గు అన్నట్లు హనుమ "మంగళాకారిణీ !నేను ఈ పట్టణం అలాఅలా చూసి వెళ్లి పోతానే"అన్నాడు. ఇక ఆలస్యం చేయటం మంచిదికాదని ఆ రాక్షసి అరచేతితోచాచి హనుమను గట్టిగా కొట్టింది. ఆమెకంటే పెద్ద ధ్వని చేసి హనుమ ఎడమ చేతి వ్రేళ్ళు ముడిచి పిడికిలితో బాదాడు. ఆ దెబ్బకు దిమ్మ తిరిగి బొమ్మకనిపించి నేలపై పడిపోయింది. స్త్రీ కదా అని జాలిపడగా గర్వం ఖర్వమైన అది హీన స్వరంతో "మహా బలా హనుమా ! ప్రసన్నుడవు కా. కాపాడు స్త్రీలను ధీర వీర శూరులు చంపరాదు. కనిపించే లంకాపురిని నేనే మహాబలుడవుకనుక నన్ను జయించావు. పూర్వం బ్రహ్మ నాకు ఒక వరం ఇచ్చాడు. దానిప్రకారం ఎప్పుడు వానరుడు తనపరాక్రమంతో నన్ను వశం చేసుకొంటాడో, అప్పుడు రాక్షసులకు భయమేర్పడుతుంది. అది నిజమైంది నీ దర్శనం తో. బ్రహ్మమాట యదార్థం. దానికి తిరుగే లేదు. దుర్మార్గ రావణుడు సీతాపహరణం కారణం గా సకల రాక్షస సమూహంతో వినాశనం చెందే కాలం నీ రాకతో సమీపించింది. కనుక ఏ పనిమీద శాపగ్రస్త మై బలహీనపడిన ఈ లంకకు వచ్చావో, ఆపనులన్నీ యథేచ్ఛగా నెరవేర్చుకొని, నీ ఇష్టం వచ్చినట్లు తిరిగి, సీతామాత

దర్శనం చేసుకొని వెళ్ళు "అని దీవించింది-"ప్రవిశ్య శాపోహతాం పురీం –యద్రుచ్చయా త్వం జనకాత్మజాం సతీం విమార్గ సర్వత్ర గతో యధా సుఖం "

52శోకాల తృతీయ సర్గ ఇది. లంకను అందమైన సర్వాభరణ శోభిత యువతిగా వాల్మీకి హనుమ చేత వర్ణింపజేయటం సరదాగా బాగుంది.అన్ని వేళలా బలం ఉపయోగించరాదు కనుక అంత భీకరాకారంగా ఉన్న లంకా ధీ దేవత కనిపించినా "మంగళస్వరూపిణీ "అని సంబోధించటం హనుమ లోని వెటకారం కన్పిస్తుంది. ఆమె ప్రసన్నతకూ కారణమ మయింది ఆమాట. ఎవరైనా ఎందుకొచ్చావని అడిగితె లోక సహజంగా "ఊరికే చూట్టానికి వచ్చాను "అంటాం. హనుమా అలానే అన్నాడు. దెబ్బకు దెయ్యం పరిగెత్తినట్లు ఒక్క ముష్టిఘాతానికి దాని నిజస్వరూపం బయట పడేట్లు కొట్టాడు హను. కనుక సమయం చూసి బలం ప్రదర్శించాలి ఇక్కడ తప్పలేదు. లంక దేవత యదార్ధం చెప్పేసింది. బ్రహ్మవరం కూడా వివరించి చెప్పి లంకా నగర సందర్శనకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చి పచ్చ జెండా ఊపింది. హనుమకు మరో రహస్యం ఆమె వలన తెలిసింది. శాపోపహత లంక అనే పరమ రహస్యం కూడా తెలిసింది. అంటే ఆయువు పట్టు చిక్కింది. అడగకుండా ఆమె సీతా దేవి ఇక్కడే ఉంది అని రూఢిగా చెప్పటమే కాదు భవిష్యత్ ద్రష్టగా హనుమ ఆమెను దర్శించి వెడతాడు అని నమ్మి ఆశీర్వదించింది. మహర్షి ఏది చెప్పినా ఇంత క్రాంత దర్శనంగా ఉండటం విశేషం.

లంకా దేవతను చంపి హనుమ ద్వారం కాని ప్రదేశంద్వారా ప్రాకారం దాటి, శత్రు శిరసుపై కాలు పెట్టినట్లు ఎడమ పాదం పెట్టాడు. శుభానికి కుడికాలు పెట్టాలి అశుభానికి ఎడమపాదం అన్నది మన సంప్రదాయం. అది తెలిసిన ప్రజ్ఞా శీలి. రాత్రి వేళ యదేచ్చగా లంకలో తిరిగి చూశాడు. గాన నృత్యాలతో నగరం అట్టహాసంగా ఉన్నది. అభి వృద్ధికి చిహ్నాలైన పద్మ స్వస్తిక అనే నిర్మాణ విశేషాలు చూశాడు. అన్నీ అత్యుత్తమ గృహ సముదాయాలే. అంటే వాస్తు ప్రకారం సర్వతో భద్రంగా నిర్మించినవే. 'దుష్ప్రదేశమైన లంకలో ప్రవేశించగలిగాను కనుక రామ సుగ్రీవుల మనోరధం ఈడేరుగాక "అని సంకల్పం చెప్పుకొని ఆనందించాడు "సుశ్రావ మధురం గీతం త్రిస్థాన స్వరభూషితం"అప్సరసలులాగా రొమ్ము. కంఠం, శిరస్సు అనే మూడు స్థానాలనుంచి పుట్టిన మధురగీతాలు విన్నాడు. అనేక రకాల భవనాలు వివిదాకృతులున్న స్త్రీలు కనిపించారు. రెండు చేతులు వ్యత్యస్తం గా పెట్టి, భుజాలను తడుతూ వచ్చే ధ్వనితో సింహనాదాలను జపంగా చేస్తూ ఉన్న వారి వేద మంత్రాలు విన్నాడు. బ్రహ్మభాగం పఠించే వారు, రావణ స్తోత్రం చేస్తూ గర్జించేవారి నాదాలు విన్నాడు. నగరం మధ్యలో ఉన్న గూఢచారులను, రాక్షస సేన నూ చూశాడు. దీక్షలో ఉన్నవారు జడలు కట్టినవారు, బోడితలలవారు, ఎద్దుతోలు కట్టినవారు దిగంబరులు, పిడికిలి నిండా ఆయుధాలు ధరించినవారు, జయ హోమం చేసేవారు, కూట,ముద్గర, దండాయుధ దారులు, ఒంటి కన్ను అంటే "ఏకాకన్నయ్యలు", ఒంటి చెవి ఏకా కర్ణయ్యలు, వ్రేలాడే పొట్టి స్తనాలవారు, వంకర మొహాలవారు, అవయవాలు విషమంగా ఉన్నవారు, విల్లు కత్తి శతఘ్నిఅంటే ఇనుపగద ఆయుదాలున్నవారు, జానెడు ఉండే ముసలం,పరిఘ ఆయుధంగా ఉన్నవారుకనిపించారు. ఆశ్చర్యమైన కనులతో, దున్నపోతుల్లాంటి వారు, పొట్లకాయలాంటి సన్న వారు, మరుగుజ్జులు, లాంగ్ పోల్ లాగా బారైనవారు, తెల్ల నల్లముఖాలవారు, గూని వాళ్ళు, తేజస్సున్నవారు, రాజచిహ్నాలైన టెక్కాలు పట్టుకొన్నవారు మొదలైన వారందర్నీ చూశాడు హనుమ. శక్తి, వృక్షం ఆశని, పడవ తెడ్లు, త్రాళ్ళు ఆయుధాలు గా ఉన్నవారు కనిపించారు. ఉష్పమాలలు చందనం లతో బహువేషాల లవారు, శూల వజ్రాయుధ ధారులు ఐన మహాబలవంతులైన రాక్షసులను చూశాడు. రావణ అంతః పురం ఎదుట లక్షమంది సైనికులు కాపలా కాయటం చూసి ఆశ్చర్యపడ్డాడు. బంగారు ద్వారాలున్న రావణ భవనం చూశాడు. దాని చుట్టూ లోతైన అగడ్తలు ఉన్నాయి. ఏమరు పాటు లేకుండా అందరూ విధులు నిర్వహిస్తున్నారు. గుర్రాల సకిలింపులు, స్త్రీపురుషుల కంకణ మణిమంజీరాది భూషణ ధ్వనులు వినిపించాయి. రధాలు, పల్లకీలు తెల్ల ఏనుగులు, బాగా మేసి మత్తుగా పడుకొన్న మృగాలు, రకరకాల పక్షులు కనిపించాయి "స హేమ జామ్బూ నదచక్రవాళం-మహార్హ ముక్తా మణిభూషితాంతం-పరార్ధ్య కాలాగరు చందనాక్తం –స రావనణాంతఃపుర మా వివేశ "-జంబూ నదిలో, ఇతర చోట్లా లభించే రెండు రకాల బంగారం చేత పూయబడిన ప్రాకారం, విలువైన ముత్యాలతో అలంకరింపబడిన అగరు, చందనాలు పూయబడిన రావణుని అంతః పురం లో హనుమ ప్రవేశించాడు.

ఇది 27శ్లోకాలనాలుగవ సర్గ, దీనిలో రావణ భవన వైభవమంధీ,మార్బలం, నిశాచరుల నిరంతర పహారా, గాన గీత నాట్య విశేషాలు తోపాటు, వివిధ రకాలైన రాక్షసులు, వారు ధరించే ఆయుధ విశేషాలు, వారి బలపరాక్రమాలు అన్నీ చూడగలిగి ఒక ఎస్టిమేషన్ కు రాగలిగాడు భవిష్యత్ కార్యం కోసం ఇంతమంది కన్ను కప్పి తిరగటం ఎంత ప్రమాదమో అర్ధమైంది. అయినా బురిడీ కొట్టించాడు. తనపని తానూ హాయిగా చేసేసుకొన్నాడు సూక్ష్మ బుద్ధి ఉన్న ఆంజనేయుడు.



వెన్నెల మెండుగా ఆకాశం లో కురిపిస్తున్న చందమామను హనుమ చూసి పరవశించాడు జనుల దుఖాల్ని పోగొట్టి సముద్రానికి వృద్ధి కలిగించి ప్రాణికోటికి ప్రకాశం కలిగించే చంద్రుని దర్శించాడు. మందర పర్వత కాంతి, సాయం సముద్రానికి ఉన్న ప్రకాశం జలకమలలకున్న వెలుగువంటి కాంతితో చంద్రుడు శోభాయమానంగా ఉన్నాడు. వెండి పంజరపు హంసలా,, మందరపర్వత సింహం లా, మదించిన ఏనుగు ఎక్కిన వీరుడిలా కనిపించాడు ఉడురాజు.వాడి కొమ్ములున్న తెల్లని వృషభంలా, ఎత్తైన శిఖరాలున్న కొండ లా, బంగారు తొడుగు గల కోరలున్న ఐరావతంగా సకల కళా పరిపూర్ణుడు గా వెలిగిపోతున్నాడు విను వీధిలో. మంచు అనే మాలిన్యం వదలి, శుక్ర గురు గ్రహాలను కప్పి విడిచిన నిర్మలత్వంతో, మహాగ్రహమైన సూర్యుని కిరణాలు పొందటం చేత మహా అంధకారం తొలగి, బాగా కనిపించే మచ్చ తో ప్రభావశాలిగా చంద్రుడు వెలిగిపోతున్నాడు. ప్రదోషకాలం అయిన సాయంకాలం గడిచింది. రాత్రి అయేసరికి పతివ్రతలు తమ భర్తలతో శయనిస్తున్నారు. రాక్షసులు నిశాచరులు కనుక మహానందంగా విహరిస్తున్నారు. మద్యం తో మదించి, ఏమరు పాటున్న జనాలతో ఉన్న వివిధ రథ తురగ గజాలతో వీరలక్ష్మి లాగా వెలిగే గృహాలను ఆ వెన్నెల్లో దర్శించాడు హనుమ. తాగుబోతుల ప్రేలాపనలు, మత్తెక్కి తమనే తాము తిట్టుకొనేవారు, రొమ్ములు విరిచి, భార్యల అవయవాలపై పై కాళ్ళూ చేతులూ వేసి పడుకున్నవారినీ, విచిత్ర వేషగాళ్ళను, విల్లు ఎక్కుపెట్టి తిరిగే వారినీ చూశాడు.

చందన లేపం ఒంటికి పట్టించుకొనే వారు నవ్వేవారు కోపం నిట్టూర్పులు విడిచే స్త్రీలను చూశాడు. పూజింపతగిన సత్పురుషులు లేక, యుద్ధం చేయటానికి సరిపోయే ప్రతి వీరులు లేక, ఆ లంకా పట్టణం నిట్టూర్పు పాములతో ఉన్న మడుగు లాగా అనిపించింది. ఉత్తమ గుణాలకు తగ్గ ప్రవర్తనతో ఉన్న సుందరాకారులు, తేజోవంతంగా దానికి తగ్గ నడవడి ఉన్న వికృతాకార రాక్షసులనూ చూశాడు. పతుల చేష్టలకు సిగ్గుపడేవారు వారు, చల్లినపూలరాశిలో కప్పుకు పోయినవారు అయిన స్త్రీలను చూశాడు. మేడలపై మొగుడి తొడలపై కూర్చుని విలాసం వొలికించే స్త్రీలు, మదన పరవశంతో భర్తలకు అమితానందం చేకూర్చేవారు కనిపించారు. ముసుగు తొలగిన స్త్రీలు బంగారు తీగల్లా, కొందరు మేలిమి బంగారం లా, పతులను ఎడబాసి చంద్రునిలాగా పాలిపోయిన వారినీ చూశాడు. అభిసారికలను, మధుర మనోహరగనలను చూశాడు. కానీ

"న త్వేవ సీతాంపరామాభిజాతాం-పథి స్థితే రాజకులే ప్రజాతాం-లతాం ప్రఫుల్లా మివ సాధు జాతాం-దదర్శ తన్వీం మనసాభి జాతాం"

అంటే పరమ సౌందర్యవతి, సన్మార్గ నిష్టమైన రాజవంశం లో పుట్టి, , గారాబంగా పెరిగి వికసించే పూల తీగలాగా నాజూకుగా, సంకల్ప మాత్రంగా అయోనిజగా జన్మించిన తన్వి సీతామాతను మాత్రం చూడలేక పోయాడు. పాతివ్రత్య ధర్మంతో, రామదర్శనం కోసం పరితపించే నిశ్చయ నిర్మల బుద్ధి కలిగి రామహృద్యాన్ని ఆకర్షించిన ఉత్తమ వనితా రత్నం,పూర్వం" నిష్కం" అనే ఆభరణం ధరించి,ఇప్పుడు కన్నీరే ఆభరణంగా ఉంటున్న

సుందరవదన,స్పష్టంగా కనిపించని చంద్ర రేఖలా ఉండే, దుమ్ముతో కాంతి హీనమైన బంగారు కడ్డీలా ఉండే, గాలిచే చెదరగొట్టబడిన మేఘ రేఖలా ఉండే శ్రీరాముని అర్ధాంగి సీతాదేవి మాత్రం కనిపించక మూఢమతిలాగా దుఖించాడు హనుమ.

ఇది 27శోకాల అయిదవ సర్గ. దీనిలో చంద్రుడు ఎన్నిరకాలుగా ప్రకాశామానంగా కనిపించాడో వాల్మీకి మహర్షి చల్లని వెన్నెల కురిపించి మానసిక ఆనందాన్ని ఇచ్చే ఉదాత్త ఉత్తమ శ్లోకాలలో అభి వర్ణించాడు. తెల్లదనం అంతా మూర్తీభావించినట్లు చెప్పాడు. ఎవ్వరికైనా ఆనందం ప్రత్యక్షానుభవం అవుతుంది. మరి వానర రూప హనుమ కు మరింత ఆనందం. తర్వాత రాక్షసాగ నలు, వారి వివిధ భంగిమలు శయన విలాసాలూ చూశాడు. కానీ అమ్మవారు వీరెవరిలాగా ఉండదు అనే నిశ్చయమనస్సున్న వాడు కనుక వీరంతా సామాన్య రాక్షస స్త్రీలని గ్రహించి, వీరిలో సీతా దేవి ఉండదనిపించింది. కానీ తాను వెదకే, వెతకాల్సిన సాధ్వి ఎలా ఉంటుందో మనసులో భావన చేశాడు. వీరంతా మదమత్తులులాగా ప్రవర్తిస్తున్నారు. సీత మాత్రం భోగాలనీడ పడకుండా భర్తకోసం కుంగి కృశించి మకిలి పట్టిన బంగారు తీగలాగా ఉంటుందని తెలుసుకొన్నాడు. అలాంటి సాధ్వి సీతా దేవి సందర్శనం ఈ సామాన్య రాక్షస గృహాలలో లభించదు అనుకొన్నాడు. కాని ప్రయత్నం వృధా అయింది.. కనుక పామరత్వం ప్రవేశించగా దుఃఖించాడు మహా మతిమంతహనుమాన్.

సీతాదేవి కనిపించలేదని బాధపడి దుఖించిన హనుమ మరింత వేగంగా వెదకటానికి బయల్దేరి రావణ గృహం చేరాడు. అది బంగారు వెండి ద్వారాలతో, మేలిమిగుర్రాలు రథాలతో, సింహాల, పులుల చర్మాలతో కప్పబడిన దంతం వెండి బంగారం కదిలితే వినసొంపైన శబ్దాలు చేసే సుందర రథలతో, రత్నాసనాలు నానామృగ పక్షి సందోహాలతో కూడిన రావణ గృహం చూశాడు. సుందర స్త్రీలతోభేరీ శంఖ మృదంగ వాద్య ధ్వనులతో, ఛత్ర చామరాది రాజలక్షణాలతో,సముద్ర గంభీరం తో ఉన్న ఆభవనం చూసి సీత కనిపించకపోవటం తో రావణకుమారులు, మంత్రుల గృహాలు వరుసగా చూస్తూ, ప్రహస్త,మహాపార్శ్వ, కుంభకర్ణ, విభీషణ గృహాలు దాటి, మహోదర, విరూపాక్ష, విద్యుజ్జిహ్వ, వజ్ర దంష్ట్ర, శకరక్షస గృహాలు కూడా పరికించి, సారణుడి ఇంటికినీ దాటి, ఇంద్రజిత్, జంబుమాలి, సుమాలి, రశ్మి కేతు, సూర్య శత్రు, వజ్రకాయ గృహాలు వెదికి, ధూమ్రాక్ష, సంపాతి, విద్యుద్రూప, భీమ, ఘన, విఘ్న, శుకనాస, వక్త్ర శఠ,వికట, బ్రహ్మకర్ణ, దంష్ట్ర, రోమశ, యుద్దోన్మత్త,మత్త,ధ్వజగ్రీవ, నాది,విజ్యుజ్జిహ్వ, ఇంద్రజిహ్వ, హస్తిముఖ, కరాళ,పిశాచ, శోణితాక్ష గృహాలు వెతికి,వారి సపదలకు ఆశ్చర్యపోయి, పిచే మూడ్ అన్నట్లు మళ్ళీ రావణ గృహానికి వచ్చి అక్కడ అతడు నిద్రిస్తుండగా మేల్కొని కావలికాసే రాక్షస స్త్రీలను చూశాడు. సైన్యమక్కడనిరంతరం పహరాకాస్తోంది.అనేక ఆకారాల పల్లకీలు లతా చిత్ర శాలలు క్రీడాభవనం, క్రీడా శైలం, దేవగృహాలు చూశాడు.అనేక నిధులు రత్నాలు ఉన్న రావణ ధనాగారం, రత్నకాంతులు రావణ తేజం తో ఆభవనం సూర్యునిలాగా తేజరిల్లింది. నేలఅంతా తేనెతో తయారైనమద్యం తో తడిసి ఉంది. మణిమయ పాత్రలు ఎన్నో ఉన్నాయి. వందలాది స్త్రీ లతో వ్యాప్తమైన ఆ రావణ భవనం ప్రవేశించాడు హనుమ.

44శ్లోకాల ఆరవ సర్గ ఇది, ఇందులో మనం తెలుసుకోవాల్సింది ఏమిటి అంటే, ఎక్కడా ఏ భవనమూ వదలకుండా అన్నిటినీ జాగ్రత్తగా సీతా దేవికోసం గాలించాడు దర్పానికి కారణమైనరావణ అనంత ఐశ్వర్యాన్ని స్వయంగా చూసి తెలుసుకొన్నాడు. దేనిపైనా ఆసక్తికాని, అసూయ కాని కలుగలేని స్థిత ప్రజ్ఞత హనుమలో మనం చూస్తాం



మళ్ళీ రావణ సౌధానికి వచ్చిన హనుమ అక్కడి భోగ ఐశ్వర్యాలను శిల్పకళను చూసి సాక్షాత్తు 'మయుడే వచ్చి నిర్మించాదేమో "అనుకొన్నాడు. ఇంతలో పుష్పక విమానం కనిపించింది. దాని శోభా వర్ణనానాతీతం. అది అనేక దాతువులచేత, పుష్పాల పుప్పొడితో ఉన్న కొండ లాగా కనిపించింది. దాని రత్నకాంతులు కళ్ళు జిగేలుమనిపిస్తున్నాయి. అందులో సుందరీమణులున్నారు. ఆకాశం లో మేఘంలా, మబ్బులు కమ్మిన చిత్ర వర్ణం లా ఉంది. ఆ విమానం లో తెల్లని భవనాలు అందమైన పూలతోటలు వికసించిన తామరపూలున్న కొలనులు, విశేష వనాలు ఉన్నాయి. పుష్పకం పై కొన్ని పక్షులు వైడూర్య,కొన్ని వెండి,మరికొన్ని పగడ నిర్మితాలు, దానిపై గుర్రాలు పాములు, అందమైన పక్షులు రత్నాలతో చెక్కబడినాయి. బంగారు పూలతో ఉన్నాయి. ఇదంతా మన్మధుడికి సహాయకారి గా అనిపించింది ఘోటక బ్రహ్మ చారికి. తామరకొలనులు, అందులో లక్ష్మీదేవి ఆమెకు అభిషేకం చేసే స్త్రీలు విస్పష్టంగా చిత్రింప బడినాయి. మొత్తం చుట్టి వచ్చినా స్త్రీ సౌఖ్యం పొందుతున్న రావణుడు కనిపించలేదు, జానకీ మాత దర్శనం కాలేదని పరితపించాడు –

"తతస్తదాబహువిధ భావితాత్మనః –కృతాత్మనో జనక సుతాం సువర్త్మనః –అపశ్యతో భవ దతి దుఃఖితం మనః –సుచాక్షుషః ప్రవి చరతో మహాత్మనః "

అనేక రకాలుగా ఆలోచించే నిశ్చలబుద్ధి, సదాచార సంపన్నతఉన్న మహాత్ముడు, ఉత్తమ దర్శన శక్తి కలవాడు అయిన హనుమ సీతా దేవి కనిపించక చింతా క్రాంతుడయ్యాడు

ఇది 17శ్లోకాల ఏడవ సర్గ. ఇందులో పుష్పకం అనే అత్యంత పెద్ద విమానం కూడా రావణుడి భవనం లో ఉన్నది అంటే అది ఎంత విస్తీర్ణం తో ఉందో ఆలోచించాలి. అంతేకాదు ఆ విమానం లో సకల సౌకర్యాలు, అత్యంత విలాస విషయాలు ఉద్యానవనాలతో సహా ఉన్నాయట. కనుక ఇది మయుడి నిర్మాణమే అనే నిశ్చయానికి హనుమ వచ్చాడు.

దూరం నుంచి మాత్రమే చూసి వర్ణించిన తీరుమాత్రమే ఇది. తర్వాత సర్గ లో మహర్షి హనుమ లోపలి చూసిన పుష్పక వర్ణన ఉంటుంది. అ అరుదైన విమానం కిటికీలు మేలిమి బంగారు నిర్మితాలు. అతి వైభవోపేతంగా అత్యంత సుందరంగా దాన్ని నిర్మించి విశ్వకర్మ తన నిర్మాణ చాతుర్యానికి తానే బోలెడు ఆశ్చర్యం ప్రకటించుకొన్నాడు –

"తదప్రమేయా ప్రతికార కృత్రిమం –కృతం స్వయం సాధ్వితి విశ్వకర్మణా-దివం గతం వాయు పథ ప్రతిష్టితం –వ్యరాజతా దిత్య పథస్య లక్ష్మ్య వత్ '



అంతేకాదు దానికి చోదకుడు అంటే పైలట్ అక్కర్లేదు, రావణుడు మనసులో ఎలా తలచుకొంటే అలా గమనం చేస్తుంది. ఇంకెవరికీ అది నడపటం సాధ్యంకాదు. ఇంద్రుడి విమానం కూడా దీనిముందు దిగదుడుపే. దాన్ని వేలాది రాక్షసులు, భూతగణాలు మోస్తున్నట్లు చిత్రించటం మరీ విశేషం

"మనోభిరామం శరదిందు నిర్మలం –విచిత్ర కూటం శిఖరం గిరేర్యథా

వహంతి యంకుండల శోభితాననా –మహాజనా భూత గణా స్సహస్ర శః

"వసంత పుష్పోత్కర చారు దర్శనం –వసంత మాసాదపి కాంత దర్శనం –సపుష్పకం తత్ర విమాన ముత్తమం –దదర్శ త ద్వానర వీర ముత్తమం "

వసంత పుష్ప సమూహాలలాగా కనిపించే సుందరమైన, వసంత మాసం కంటే మనోహరమైన, సర్వ శ్రేష్టమైన పుష్పక విమానాన్ని కపి శ్రేష్ట హనుమాన్ దర్శించి పులకించాడు "

8శ్లోకాలు మాత్రమే ఉన్న ఈ ఎనిమిదవ సర్గ లో మహర్షి రెండు తమాషాలు చెప్పాడు. లోకం లో ఎవరైనా ఒక గొప్ప పని చేస్తే, ఒక్కోసారి అతడికే తన పని అమితాశ్చర్యం కలిగిస్తుంది. ఆ లక్షణాన్ని విశ్వకర్మ కు కూడా ఉన్నట్లు చూపించాడు. ఎంతటి వారైనా ఇలాంటి మనోభావాలకు అతీతులు కారు అనే లోక సహజ విషయాన్ని బయట పెట్టాడు విశ్వకర్మ చేస్తద్వారా. పుష్పకం పేరులోనే పుష్ప సౌందర్యం భాసిస్తుంది. మరి దాని అందాలు చూస్తే మనసు సంపూర్ణ వికసిత శతపత్రమే అవుతుంది. అలాంటి అనుభూతి పొందాడు హనుమ. అంతేకాదు వసంతం మనసును హసితం చేస్తుంది. ఆహ్లాద పరచి ఉల్లాసం కలిగిస్తుంది. అందుకే వసంత నవరాత్రులు చేస్తాం. అలాంటి వసంత శోభకంటే విశిష్టమైన శోభ పుష్పక విమానానికి ఉండటం తో ఇప్పటిదాకా కల్లోలంగా ఉన్న హనుమ మనసు కొంత సేద తీరిందని గ్లాని తగ్గిందని, కొద్ది కాలం లో ఏదో తెలీని మధు మధుర విషయాలు జరిగి తాను వచ్చిన పనికి సార్ధకత తెస్తుందనీ మహర్షి వాల్మీకి సూచ్యార్ధం గా చూచించాడేమో అని పించింది.

మూడవసారి హనుమ రావణ భవన ం లో వెదికాడు. ఆమడ పొడవు అరామడ వెడల్పు ఎన్నో మేడలతో అలరారింది పుష్పకం మధ్యలో నివాసం ఉన్న రావణ ప్రధాన గృహం చేరాడు. అక్కడి ఏనుగులు నాలుగు, మూడు దంతాలతో విచిత్రంగా ఉన్నాయి. అతని రాక్షసభార్యలు, చెరబట్టి తెచ్చిన రాజకన్యలు ఉన్నారు. ఆప్రాసదం పెద్దపెద్ద చేపలు మొసళ్ళు తిమింగిలాలు పాములు తో కల్లోలం చెందిన సముద్రంలాగా కనిపించింది. కుబేరుని,పచ్చని గుర్రాలున్న దేవేంద్రునికి ఉన్న సంపద అంతా ఇక్కడే కనిపించింది. మళ్ళీ పుష్పకాన్ని చూశాడు. బ్రహ్మకోసం

విశ్వకర్మ దీన్ని నిర్మిస్తే, కుబేరుడు తపస్సుతో బ్రహ్మనుమెప్పించి దాన్ని వరంగా పొందాడు. రావణుడు అన్న కుబేరుని జయించి దీన్ని స్వాధీనం చేసుకొన్నాడు. సర్వతో భద్రాకారంగా ఉన్న జాలాలు అంటే వెంటి లెటర్లు కిటికీలు మణిఖచిత వేదికలు ఉన్నాయి. సరదాగా పుష్పకం ఎక్కి సరదా తీర్చుకొన్నాడు మహాకపి. దివ్యగందాల పరిమళం వ్యాపించి,తనను ఆహ్వానిస్తోందానిపించింది.. అది స్వర్గమా, 33దేవతలకు ఆవాస భూమియా అనిపించింది. దీపకాంతి, ఆభరణాల ప్రకాశం అంతటావ్యాపించి "తగలబడుతున్న శాల "లాగా కనిపించింది భవిష్యత్తులో జరిగేది ఇదే కదా. దానికి సూచ్యార్ధ సూచన చేశాడు మహాకవి వాల్మీకి.



కంబళాలపై వివిధ భంగిమలలో నిద్రించేఉత్తమజాతి స్త్రీలను చూశాడు. వారిముఖాలు పద్మ గంధాన్ని కలిగి ఉన్నాయి. అవి వికసించిన పద్మాలు గా భావించి మకరందం ఆశతో తుమ్మెదలు వాలుతాయేమో అని శంకించాడు. వనితామధ్యమాన నక్షత్రాలతో ఉన్న చంద్రుడిలాగా రావణుడు కనిపించాడు. మితిమీరిన మధుపానం ఆతర్వాత యెడ తెగని రతికేళి తో పుష్పమాలలు ఆభరణాలు స్థాన భ్రంశమయ్యాయి. కొందరి ముఖాల తిలకాలు తుడిచి వేయబడగా, కొందరి మొలత్రాళ్ళు వదులై మార్గాయాసంతో నేలపై పొరలే ఆడ గుర్రాల్లా కనిపించారు. నిద్రావస్తలో విశాల పిరుదులున్న స్త్రీలు హంస కారండక చక్రవాకాలతో ఉన్న ఇసుక తిన్నెలున్న నదులుగా భాసించారు. రావణుడు నానావిధ భంగిమల సుఖాలు వారివల్ల అనుభవించి అలసి సొలసి నిద్రించాడు. అతనికి భయపడి దీపాలుకూడా నిశ్చల కాంతి వెదజల్లుతున్నాయి. వీరంతా రాజర్షుల, పితరుల, దైత్య,గంధర్వ, రాక్షస కన్యలు తమంత తాము రావణుని వలచి వచ్చినవాళ్ళే, ఒక్క సీతా దేవి తప్ప ఎవరూ బలాత్కారం గా తేబడిన వారుకాదు. హనుమ మనసులో "ఈ రావణుడు ఎప్పుడూ తన తేజస్సును యెడ బాయకుండా ఉన్నాడో, అలాగే సీత కూడా రాముడిని ఎడబాయకుండా ఉండేట్లు రావణుడు ఆమెను రామునికి అర్పిస్తే, అతని సంపద అవిచ్చిన్నంగా ఉంటుంది కదా "అనుకొన్నాడు శత్రుహితం కోరి.

"బభూవ బుద్ధి స్తు హరీశ్వరస్య –యదీ దృశీ రాఘవ ధర్మపత్నీ –ఇమా యథా రాక్షస రాజ భార్యాః -సుజాత మస్యేతి హాయ్ సాదు బుద్ధేః"

సీతాదేవి పాతివ్రత్య గుణంతో విశిష్టురాలు. వీడు సీతాపహరణ అనే నీచ కార్యం చేసిపెద్దపాపం చేశాడు. కనుక ఆమె పాతివ్రత్యానికి ఎలాంటి భంగం కలుగదు అని భావించాడు హనుమ.

73శ్లోకాల తొమ్మిదవ సర్గ ఇది. క్షుణ్ణంగా వెతికాను అనే మానసిక సంతృప్తికోసం హనుమ మూడుసార్లు రావణ భవనం వెదికాడు. అక్కడి స్త్రీలు వారి భంగిఅమలు చూసి పతివ్రతా శిరోమణి సీత ఇక్కడ ఉండదు అనిపించింది. మనిషి పరహితం కోరుకోవాలి అదే అతని సహజ లక్షణం. ఆలక్షణాన్ని హనుమ చూపించాడు. రావణుడు సీతను స్వచ్చందం గా రామునికి సమర్పిస్తే వాడి వైభవం అలాగే కొనసాగుతుంది కదా అనుకొన్నాడు. అదీ మనీషి లక్షణం అలాంటి మనీషి గా హనుమ ఇక్కడ మనకు కనిపిస్తాడ

బుసకొట్టే సర్పం లాగా నిశ్వసిస్తున్న రావణుడి దగ్గరకు చేరి హనుమ భయపడినట్లు కనిపించి, తర్వాత వెనక్కి తగ్గాడు. పాన్పుపై ఉన్న రావణ భుజాలు బంగారు బాహుపురులతో ఇంద్ర ధ్వజాల్లా కనిపించాయి పూర్వం ఐరావతం తో పోరాడినప్పుడు ఏర్పడిన గాయాలమచ్చలు,, దేవేంద్రునితో తలపడినపుడు తిన్న వజ్రాయుధ గాట్లు ప్రకాశంగా కనిపించాయి. విష్ణు చక్రగాయాలమచ్చలూ ఉన్నాయి. మంచి మూపు, మంచిలక్షణాల గోళ్ళు బొటన వ్రేళ్ళు, అరచేతులు ఏనుగు తొండాలలాగా భుజాలపై అయిదు తలల నాగుపాము లాఉన్నాయి. మహా బలదర్పాలతో శోభాయమానంగా రెండు భుజాలు మండరపర్వతం మధ్య నిద్రించే మహా సర్పాల్లా ఉన్నాయి. రెండు శిఖరాల మందరం లా ఉన్నాడు. నోటినుంచి మామిడి, పొన్న సుగంధం, పొగడపూల గంధం, శ్రేష్ఠ మద్య గంధం తో నిట్టూర్పులున్నాయి. నిగనిగ లాడే మినపరాసి లా ఉన్నాడు. గంగా జలాల్లో విశ్రమిస్తున్న ఏనుగు లా కనిపించాడు. రావణభార్యలు మహా అందగత్తెలు. నిద్రలోకూడా నాట్య స్త్రీ వాసనాబలంతో ముద్రలు వేస్తోంది. ఇంకొకామె స్తనాలను చేతులతో కప్పుకొని ఆదమరచి నిద్రిస్తోంది.

రావణ భార్య మండోదరి మహా సుందరంగా శయనిస్తోంది. ఆమె సౌందర్యం,యవ్వనం చూసి సీతా దేవి ఏమో అనుకొన్నాడు. సంతోషం కలిగింది. పులకింత వచ్చింది కూడా. సీతా దేవి దర్శనభాగ్యం కలిగిందన్న పరమానదంలో సహజ వానర చేష్టలు చేశాడు వెనుకటి గుణమేల మాను అన్నట్లు ప్రవర్తించాడన్నమాట.

"ఆస్ఫోట యామాస చుచుబ పుచ్చం-ననంద చిక్రీడ జగౌ జగామ –స్తంభా నారోహ న్నిపపాత భూమౌ –నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనాం "

తన ఆనందాన్ని హనుమ వానర సహజమైన చేష్టలతో చేస్తూ జబ్బలు చరుస్తూ, తోకను ముద్దాడుతూ, ఆనంద పారవశ్యం చెందాడు. ఆడాడు పాడాడు ఇటూ అటూ తిరిగాడు. స్తంభం ఎక్కి కిచకిచమన్నాడు, మళ్ళీ కిందికి దూకాడు.

ఇలాంటి కోతి చేష్టలను మనం చూసే ఉంటాం, పూర్వం కోతుల్ని గొలుసుతో కట్టి తీసుకొని వచ్చి ఇళ్ళముందు ఆడించేవారు జ్ఞాపకం ఉందా.ఇలాంటి చేష్టలన్నీ వాటితో చేయించేవారు. నెత్తిన కుండ బుజాలపై కర్ర, గబుక్కున స్తంభం ఎక్కి దిగటం పేలు తీసుకోవటం, దువ్వెనతో దువ్వుకోవటం, అద్దం చూసుకోవటం చొక్కాలాగూ తొడుక్కోవటం విప్పెయ్యటం, తలపాగా పెట్టుకోవటం కర్రతో ఇంటికాపలా కాయటం వంటివన్నీ కోతులతో చేయించి వినోదం పంచి డబ్బులు అడుక్కునేవారు. వాటి ప్రాణాలకు హింస, మనకు వినోదం. దేనికోసం వచ్చాడో ఆపని నెరవేరింది అన్న పిచ్చిఅనందంలో హనుమ ప్రవర్తించాడు సహజ సిద్ధం గా.

ఇది 54శ్లోకాల పదవ సర్గ

కాసేపటికి అసలు రంగు బయటపడి తాను చూసింది సీత కాదు మండోదరి అని గ్రహించాడు హనుమ. అప్పుడు వివేకం ప్రవేశించింది. ఆలోచన పెరిగింది యదార్ధం గ్రహింపు కు వచ్చింది. రామ వియోగంతో సీతా దేవి నిద్రపోదు, భుజించదు అలంక రించు కోదు., ఏదీ తాగదుకూడా. దేవేంద్రుడు వచ్చినా తిరస్కరిస్తుంది. శ్రీరాముడి కి సాటి అందగాడు ఉండడు.వీళ్ళు అంతా మధుపానమత్తులు. మృష్టాన్న భోజనులు. రతికేళీ తత్పరులు. వాళ్ళు ఆవులమంద ఐతే రావండు వాటిమధ్య ఉన్న వృషభం అనిపించింది. అదొక పానభూమిగా దున్నలు పందులు మాంసాల కుప్పలతో వెండి పాత్రల్లో సగం నమిలి వదిలేసిన నెమలి కోడి మాంసాలు, ఖడ్గ మృగ, అడవి పందుల, లేళ్ళు నెమలళ్ళ మాంసాలు పాలు పెరుగు, నంజుకోవటానికి "సువర్చలం "అనే లవణం పాత్రలనిండా ఉన్నాయి. కొక్కెర చకోర, మేక మాంసాలు వాటి పచ్చళ్ళు, పాయసాదులు మొదలైన భోజ్య పదార్ధాలు కనిపించాయి. అమృత మదనం లో వచ్చిన మద్యాలు అవికాక వేరేరకాలైన అనేక మద్యాలు పాత్రల నిండా ఉన్నాయి

ఆడవాళ్ళూ ఒకరినొకరు కౌగిలించుకొని పడుకున్నారు. రతి లో అలసి పోయారు చాలామంది. మద్యం మాంసం మగువ మకారత్రయం తో మోగిపోతోంది భీభత్సంగా రావణ అంతపురం. ఒక్క అంగుళం భూమికూడా వదలుండా రావణ భవనాలు గాలించాడు. కాని సీత కనపడలేదు. మళ్ళీ అంతర్ముఖుడయ్యాడు. "ఇంతమంది పరస్త్రీలను నిద్రలో అనేక భంగిమలలో చూశానునాకు ధర్మలోపం జరుగు తుందేమో. కానీ నామనసు రవంత కూడా చలించలేదు. అవయవాలను నడిపేది మనసు. అది నా స్వాదీనం లోనే ఉన్నది. ఇంకో చోట సీత ను వెదకకూడదు. అక్కడా స్త్రీలే ఉంటారు కదా. తప్పిపోయిన వనితను ఆడు లేళ్ళలో వెదకటం వివేకం కాదు. అత్యంత పరిశుద్ధమనస్సుతో వెతికాను. కానీదేవి కనిపించలేదు "అనుకొని దేవ, గంధర్వ నాగకన్యలలో వెదికాడు లాభం లేదు. చివరికి ఈ పాడు పానభూమిలో వెదకటం నిష్ప్రయోజనం అని నిశ్చయంగా భావించి రావణ భవనం వదిలేసి బయటికి వచ్చి వేరేప్రదేశాలలో వెతకాలనుకొన్నాడు హనుమ –

"తామపశ్యన్ కపి స్తత్ర పశ్యం శ్చాన్యా వరస్త్రియః –అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతు ముప చక్రమే ""స భూయస్తు పరం శ్రీమాన్ మారుతి ర్యత్న మాస్థితః-ఆపానభూమి ముత్సృజ్య తాంవిచేతుం ప్రచక్రమే "

ఉత్తమకాన్తలను చాలామందిని చూసి సీత కానరాక, శ్రీమాన్ హనుమ ద్విగుణీకృత ఉత్సాహం తో, ఆ పాడు పానభూమి విసర్జించి వెదకటానికి నిశ్చయించాడు.

ఇది 47 శ్లోకాల పదకొండవ సర్గ. మహర్షి ఇక్కడి మొదటి శ్లోకం లో హనుమను "కపి "అని, రెండవ శ్లోకం లో శ్రీమాన్ మారుతి అనటం లో చాలా విశేషం ఉన్నది. ఆయనలోని కపిత్వం పోయి, సర్వ శ్రేష్ట మారుతిత్వం కనిపించింది అన్నమాట. ఎరుక అంతర్ముఖత్వం అతడిస్థాయిని పెంచింది. అంటే కార్యం త్వరలోనే సానుకూలమౌతుందన్న మాట.

వెతకటంలో అలసత్వం చూపానేమో అనే అనుమానం తో లతా గృహాలు ఉద్యానవనాలు, నైట్ హాల్టింగ్ ప్రదేశాలు కూడా వెతికినా సీతా దేవి కనిపించలేదు. ఒకరకమైన వైరాగ్యభావం సహజం గా వచ్చేసి "సీత చనిపోయే ఉంటుంది లేకపోతె కనిపించేదే గా. రావణుడు ఎన్ని క్రూర ప్రయత్నాలు చేసినా, తనశీల రక్షణకోసం ఆమె తీవ్రంగా ప్రయత్నించి ఆ దుర్మార్గుడి చేతిలో హతమై ఉండచ్చు. లేక అనేక వికృతాకారులైన రావణభార్యలు, దాసీ స్త్రీలను చూసి ఆమె భయపడిమరణించి కూడా ఉండచ్చు, సీత కనపడక పోవటం శత్రువులపై నా పరాక్రమం చూపక పోవటం వల రాజు సుగ్రీవుడి దగ్గరకు వెళ్ళటానికి మొహం చెల్లటం లేదు. అన్ని చోట్లా నా శక్తికొద్దీ వెతికినా నిష్ఫలమై, సీత కనిపించలేదు. సరే ఇక్కడే ఎక్కువకాలం ఉండలేను కదా. ఒట్టి చేతులతో కిష్కింధకు తిరిగి వెడితే నా సహచర వానరులు లంకలో ఏమి సాధించావు ?అని అడిగితె నాకు సమాధానం లేదు కదా. యువరాజు అంగదుడు వృద్ధుడు జాంబవంతుడు నన్ను ఎన్నో మాటలు అంటారు "అని విచారించి –

"అనిర్వేదః శ్రియో మూల మనిర్వేదః పరం సుఖం –అనిర్వేదోహి సతతం సర్వార్థేషు ప్రవర్తకః "

"న కరోతి సఫలం జంతోః కర్మ యత్తత్ కరోతి సహః –తస్మాదనిర్వేద కృతం యత్నం చేష్ట హ ముత్తమం "అని ఆలోచించాడు. అంటే ఉత్సాహమే సంపదకు మూలం. ఉత్సాహమే పరమ సుఖం. ఉత్సాహమే అన్ని పనులను చేయిస్తుంది. చేద్దాము అనుకొన్న పనిని ఉత్సాహం సఫలం చేస్తుంది. కనుక నీరు కారిపోకుండా రెట్టించిన ఉత్సాహంతో సీతాన్వేషణ చేస్తాను. పిరికివాడిలా వెనక్కి తిరిగి వెళ్ళను. అని నిర్ణయానికి వచ్చాడు. పై రెండు శ్లోకాలో మహర్షి ఉత్సాహ సామర్ధ్యాన్ని అత్యంత స్పష్టంగా తేట తెల్లం చేయించాడు లోకానికి హనుమ ద్వారా. ఈ శ్లోకాలులోకం లో "సూక్తి ముక్తావళి "అయ్యాయి.

ఇదివరకు వెతకని భూగృహాలు, చతుఃపథ మంటపాలు, స్వేచ్చా విహారం కోసం మారు మూల ఉన్న గృహాలు అన్నీ తలుపులు తెరిచి లోపలి వెళ్ళి చూస్తూ, మళ్ళీ మూసేస్తూ, దిగుడుబావులు కొలనులు అన్నీ చూసి నిరాశ చెందాడు. అప్పుడు మనసులో

"చతురంగుళ మాత్రోపి నావకాశ స్స విద్యతే రావణాంతః పురే తస్మిన్ యం కపి ర్న జగామ సః"అంటే లంకలో "నాలుగు అంగుళాల" మేరకూడా వదలకుండా వెతికాను. కానీ నిష్ప్రయోజనం అయింది. ఇక్కడ పండితులు చతురంగ స్థలానికి చక్కని వేదాంత పరమైన అర్ధం చెప్పారు. మనగుండె చతురంగుళ పరిమాణం. కనుక బయట అంతా వెదికాడు కాని లోన వెదక లేదు అన్నారు. విద్యాధర నాగ స్త్రీలు కనిపించారు. ఇందరు కనిపించినా సీత జాడ కనిపించలేదు అని నిర్వేదం చెందాడు మళ్ళీ. తన సముద్ర లంఘనం వ్యర్ధమైనదని బాధ పడ్డాడు. శోక మోహ పీడుతుడై దుఃఖించాడు. ఇప్పుడుహనుమ ఒకసారి "లో దృష్టి"తో పరిశీలించుకోవాలి. ఇప్పటిదాకా తన ప్రయత్నం వల్లే సాధ్యమౌతుందని తలచాడు. ఇక భగవంతుని తోడ్పాటు కావాలని, అది జతకలిస్తేనే కార్యం సఫలమౌతుందనే ఎరుక అతనికి కలుగ బోతోంది.

ఇది25శ్లోకాల పన్నెండవ సర్గ.

విమానం నుంచి ప్రాకారం పై దూకి, మేఘాలమధ్య మెరుపులా వేగంగా వెళ్ళాడు హనుమ. అన్ని చోట్లా వెదికినా సీత కనపడనందుకు విచారించి, సంపాతి చెప్పిన దానిప్రకారం సీత లంక లోనే ఉండాలి. అయోనిజ సీతామాత రావణుని వశం కాదు. రావణుడు ఆమెను ఎత్తుకొని వచ్చేటప్పుడు జారి కిందపడి పోయిందేమో, లేక సముద్రంలో పడిపోయిందేమో, లేక రావణుడి కబంధహస్తాలలో నలిగి చనిపోయిందేమో, వాడుఆమెతో సముద్రం దాటుతుంటే నెమ్మదిగా విదిలించుకొని సముద్రం లో పడి పోయిందేమో, ఒక వేళ దుష్ట రాక్షస రాజు రావణుడే ఆమెను తినేశాడేమో,లేక రావణభార్యలే భక్షించారేమో, రాముడిని తలచుకొంటూ చనిపోయిందేమో. రామలక్ష్మణ అయోధ్యలను స్మరిస్తూ ప్రాణం విడిచిందేమో పంజరం లో బంధింపబడిన చిలక లాగా దుఖిస్తోందేమో. నా పిచ్చకాని ఆమె ఎట్టిపరిస్థితులలోనూ రావణుడికి లొంగనే లొంగదు. సీత లేదనే వార్త రాముడికి ఎలా చెప్పను. నిజం చెప్పకపోతే దోషం అని పరిపరి విధాల ఆలోచించాడుకాని ఒక నిర్ణయానికి రాలేకపోయాడు,



సీతను చూడకుండా కిష్కింధకు వెళ్లి ఏం ప్రయోజనం. అక్కడి వారు అడిగే ప్రశ్నల వర్షానికి నా దగ్గరం ఏం సమాధానం ఉంది. సీతకనపడలేదని చెబితే దుఖం ఆపుకోలేక రాముడు బతుకుతాడా, ఆయన లేకపోతె తమ్ముడు లక్ష్మణుడు ఉంటాడా. ఈ ఇద్దరూ లేరని తెలిస్తే భరతుడు జీవిస్తాడా, శత్రుఘ్నుడు కూడా అంతేగా. వీరి మరణం చూసి తల్లులు కౌసల్య సుమిత్ర కైకలు బతుకుతారా. ఇది తెలిసి సుగ్రీవుడు రుమ, తార అంగదుడు చనిపోరా. వానరరాజులందరి మరణం జీర్ణించుకోలేక వానరులు రాళ్ళతో తలలు బద్దలు కొట్టుకొంటారు. విషం తాగి చస్తారు అడవులు పట్టిపోతారు. కనుక నేను కిష్కిందకు వెడితే భయంకర రోదనమాత్రమే చూస్తాను. ఎవ్వరిముఖంలోనూ సంతోషం జాడ కనిపించనే కనిపించదు. కనుక సీతను చూడకుండా కిష్కింధకు వెళ్ళనే వెళ్ళను.నేను ఇక్కడే ఉంటె వారంతా ఎప్పుడో ఒకప్పుడు సీతను చూస్తాము అనే నమ్మకంతో బతుకుతారు. నిశ్చయంగా ఇక్కడే ఉంటూ దొరికింది తింటూ వానప్రస్థం గడుపుతా. లేకపోతేసముద్ర తీరం లో చితి పేర్చుకొని అగ్నికి ఆహుతి అవుతా. ఒక వేళ సన్యాసి గా ఇక్కడే ఉండిచనిపోతే ఆ శరీరాన్ని కాకులు గద్దలూ తినేస్తాయి. ఇదిమహర్షులు ఉపదేశించిన మార్గమే. పోనీ నీటిలో పడి చనిపోతే ?అని మళ్ళీమళ్ళీ ఆలోచించాడు, చివరి సారిగా తాను లంకలో ప్రవేశించిన రాత్రి గురించి గుర్తు చేసుకొన్నాడు. ఈ రాత్రే లంకాధి దేవతను చంపాడు చంద్రోదయంతో సుందరమైన లంక చూశాడు శక్తివంచన లేకుండా సీతకోసం వెతికాడు. ఇలాటి రాత్రి గురించి లోకం గొప్పగా చెప్పు కొంటుంది. ఆ కీర్తిమాల వాడిపోకూడదు. సువాసనలు వెదజల్లుతూ ఉండాలి. ఈ శుభరాత్రి ఫలప్రదం అవ్వాలి. చిరస్మరణీయం గా నిలిచి పోవాలి. కనుక మరింత ఉత్సాహంతో మళ్ళీ అన్వేషిస్తాను. ఆహార నియమాలు పాటిస్తూ జితేంద్రి యుడను అయి అశోక వనం లో వెతికిచూస్తాను. సకల రాక్షసులను జయించి, తపస్వికి తపస్సిద్ధి లాగా, ఇక్ష్వాకు వంశానికి ఆనందం కలిగించే సీతాదేవిని రాముడికి అప్పగిస్తాను అనుకొన్నాడు

ఇంతగా మనసును మధించాక అంతర్జ్వలనం అయ్యాక హనుమకు వివేక సూర్యోదయం అయింది. దేవుడు గుర్తుకువచ్చాడు పురుషకార్యానికి దైవీ శక్తి తోడ్పడితేనే కార్యం సాఫల్యమౌతుందని అర్థమైంది. దండం అంటె నమస్కారం దశగుణం భవేత్ అన్నట్లుగాలేచినుంచుని చేతులు

జోడించి తూర్పుకు తిరిగి దణ్ణం పెడుతూ శ్రీరామ లక్ష్మణ సీతాదేవులకు నమస్కరించాడు. తర్వాత దిక్పాలకులు,సూర్య చంద్ర మరుత్తులు గుర్తొచ్చి వారికీ నమస్సులు అర్పించాడు. మనసు ప్రశాంతమైంది. అంటే ఇప్పుడు కార్య సాఫల్యత భగవంతుడి పై వేశడన్నమాట. నీవే తప్ప ఇతః పరం బెరుగ అన్న గజేంద్ర సద్రుశుడు అయ్యాడు. అశోకవనం ప్రవేశించటానికి సంకల్పించి దానికి తగ్గట్లు శరీరాన్ని సూక్ష్మ రూపం లోకి మార్చుకొని, సకల దేవతలు సకల భూతాలూ వీరికి ప్రభువైన శ్రీ మహా విష్ణువు మహర్షులు కార్య సిద్ధికలిగించాలని ప్రార్ధించాడు. సీతామాత ఎప్పుడు కనిపిస్తుందా అని కళ్ళల్లో ఒత్తులు వేసుకొని మళ్ళీ వెతకటం ప్రారంభించాడు.

"నమోస్తు రామాయ స లక్ష్మణాయ-దేవ్యై చ తస్మై జనకాత్మజాయై –నమోస్తు రుద్రేంద్ర యమాని లేభ్యో –నమోస్తు చంద్రార్క మరుద్గాణేభ్యః "

"సిద్ధిం మే సంవిదాస్యంతి దేవా స్సర్షి గణాస్త్విహ

"బ్రహ్మ స్వయంభూ ర్భగవాన్ దేవాశ్చైవ దిశంతు మే

సిద్ధి మగ్నిశ్చ వాయుశ్చ పురుహూత శ్చవజ్ర భ్రుత్ "

"సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః

దాస్యంతి మమ యే చాన్యేహ్యదృష్టాః పథి గోచరాః"

ఇది 60శ్లోకాల 13వ సర్గ.

సాధకుడు సర్వ సన్యాసం చేసి పరమేశ్వరార్పణ బుద్ధితో పని చేస్తే ఫలితం సిద్ధిస్తుంది అన్న పరమ సత్యాన్ని విడమరచిన కాండ ఇది. ఒక విషమ సమస్య వచ్చినపుడు మనిషి ఎన్ని విధాల ఆలోచించి, ఫలప్రదానికి ఉత్తమమైన మార్గం ఎంచు కోవాలన్న ఎరుకకూడా కలి గించింది.

అశోక వనం చేరిన హనుమ అక్కడ వసంతోదయం తో పులకించిన వృక్షజాలాన్ని చూశాడు. మృగాపక్షి సంతతి మహానందం తో కనిపించాయి. పక్షులకిలకిలారవాలు వీనుల విందు చేశాయి వనాలు ఉపవనాలతో అది ఉదయించే సూర్యునిలా కనిపించింది. అతని సంచారంతో నిద్రిస్తున్నపక్షులు మేల్కొన్నాయి. రకరకాల పుష్పాలు పుష్ప వర్షం కురిపిస్తూ హర్షం కలిగించి పూలకొండ లాగా ఉన్నాడు. చెట్లమధ్య పరిగెత్తే అతడు వసంతు డేమో నన్న భ్రమకలిగించాడు భూతజాలానికి. భూమిపై రాలిన పుష్పాలు అలంకరించుకొన్నభూ దేవిగా కనిపించింది. పులకించిన వృక్షాలు తమసర్వస్వమైన పుష్పాలన్నీ రాల్చేసి జూదం లో నగలు వస్త్రాలు సంపద అన్నీ ఓడిపోయిన జూదరులులాగా ఉన్నాయి. ఆనందం తో కోతి చేష్టలుగా చేతులు, కాళ్ళు తోక తో పరవశంగా శ్రేష్టమైన వృక్షాల కొమ్మలు విరగగోట్టగా అవి అశోక వనిక జుట్టు ముడి వీడి చందనం మొదలైన అలంకారాలు తొలగి, చుంబింపబడిన దంతాలు పెదవులు కలదై శరీరం పై నఖక్షత దంతక్షతాలున్న యువతి లాగా కనిపించాయి. అల్లిబిల్లిగా అల్లుకున్న తీగెల సముదాయాన్ని తెంపి చెల్లాచెదరు చేశాడు, అక్కడ మణులతో వెండి బంగారు రేకులతో కప్పబడిన నేలను చూశాడు. అనేక ఆకృతుల దిగుడు బావులు వాటికి మణులతో చేయబడిన మెట్లు చూశాడు. ముత్యాల పగడాల పొడులు వాటి చుట్టూ మొలచిన కాంచన వృక్షాల్లా ఉన్నాయి. బావుల్లో తామర కలువ పూల శోభ, చక్రవాకాల కూజితాలు భరత పక్షుల అరుపులు హంస, సారసాల నాదాలతో పరమ మనోహరంగా ఉన్నాయి. బావులకు రెండువైపులా అమృతంలాగా రుచిగా ఉన్న జలాలున్న వాగులు వాటి తీరాలపై చెట్లు రమ్యంగా ఉన్నాయి. వేలాది దట్టమైన పొదరిళ్ళు వాటిమధ్య గన్నేరు చెట్లు కను విందు చేశాయి. అక్కడ అందమైన ఒక పర్వతం ఎత్తైన శిఖరాలతో మేఘంలాగా గుహలు వృక్షాలతో ఉన్నది, దానిపైనుండి నీటితో కింద పడుతున్న నది ప్రియుని తొడ వదిలి క్రిందపడుతున్న ప్రియురాలులాఉంది. ఎత్తైన చెట్ల శాఖాగ్రాలు నీటిలో వంగి ప్రణయ కోపంతో వెళ్ళిపోయే ప్రియురాలులాగా అనిపించింది. ఆనది కొంత దూరం ముందుకు ప్రవహించి అకస్మాత్తుగా వెనక్కి తిరిగిన నదీ జలాలు పతిపై కోపం వదిలి, ప్రసన్నురాలై మళ్ళీ తిరిగి వచ్చినకాంత లాగా ఉంది. ఇలా అనంత వృక్ష సమూహంతో అశోక వనం కనిపించి పులకిపచేసింది. అక్కడే బంగారు రంగు శింశుపా వృక్షం, ఆకులు లతలతో చుట్టూ బంగారు అరుగుతో కనిపించింది. కొన్ని చెట్లు అగ్నిలాగా ప్రకాశామానంగా కనిపించాయి. ఆ కాంతుల మధ్య ఉన్న హనుమదేహం మేరుపర్వత కాంతులతో శోభించే సూర్యునిలాగా బంగారు కాంతులు చిమ్మింది. అది ఆయనకే ఆశ్చర్యం కలిగించింది –

"సో పశ్య ద్భూమి భాగాం శ్చగర్త ప్రస్రవణానిచ –సువర్ణ వృక్షా నపరాన్ దదర్శ శిఖి సన్నిభాన్ "తేషాం ద్రుమాణాం ప్రభయా మేరోరివదివాకరః –అమన్యత తదా వీరః కాంచనోస్మీతి వానరః "

ఇక ఊరుకోగలడా మహాకపి వెంటనే పుష్పించిన కొమ్మలతో ఉన్న శింశుపా వృక్షం ఎక్కి –

"ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శన లాలసాం –ఇతి శ్చేతశ్చదుఖార్తాంసంపతంతీం యదృచ్చయా"అనుకొన్నాడు అంటే –రాముడిని చూడాలన్న కాంక్షతో ఉవ్విళ్ళూరే సీతను ఇక్కడే చూస్తాను. దుఃఖ పీడితయై,అప్రయత్నంగా ఇక్కడే ఎక్కడో అటూ ఇటూ తిరుగుతూ ఉంటుంది. పవిత్ర జలాలున్న ఈ నదికి సంధ్యోపాసనకోసం తప్పక వస్తుంది. అత్యంత శుభప్రదమైన ఈ అశోక వనం లోనే సీతామాత దర్శనం నాకు తప్పక కలుగుంది "అనే మనో నిశ్చయం తో దట్టంగా పూసి ఆకులు, కమ్ముకున్న ఆ వృక్షంపై సీత దర్శనం కోసం నిరీక్షిస్తూ చుట్టూ కలయ ఊస్తున్నాడు నేత్రాలతో.



52శ్లోకాల 14వ సర్గ ఇది. అప్పటిదాకా హనుమకు ఉన్న సంశయాలన్నీ తొలగిపోయాయి వసంతం కూడా హసించింది కనుక అన్నీ మాంచి శకునములే –సీతా దర్శన లాభాలే. అశోక వన ప్రవేశంతో. శోకం లేనిదే అశోకం. కనుక ఇక తనకూ సీతకు శోకం ఉండదు. తప్పక ఇక్కడ సీత కనిపిస్తుంది అనే నమ్మకం కలిగింది. దైవాలన్నీ అనుకూలిస్తున్నాయి.

శింశుపా వృక్షం అంటే ఇరుగుడు చెట్టు. దాదాపు 40 మీటర్ల ఎత్తుతో సతత హరితంగా ఉంటుంది. ఉపాంత రహిత అండాకార పత్రాలుంటాయి. తెలుపు రంగు పుష్పాలు పూస్తాయి. ఏక విత్తనం ఉన్న దీర్ఘ వృత్తాకార రెక్క లున్న ఫలాలు కాస్తాయి.బెరడు గాయాలనుంచి స్రవించే ద్రవం కారకుండా చేస్తుంది. దీని కలప గిటార్ తయారీలో ఉపయోగపడుతుంది. జావా దీవులలో బాగా పెరిగే వృక్షం. బేతాళకథల్లో విక్రమార్కమహారాజు శింశుపా వృక్షానికి వ్రేలాడే శవాన్ని కిందకు దింపి బుజాన వేసుకొంటాడు,

అశోక వనం అంతా"సంతానకం "అనే తీగెలతో పూలు కాయలు పండ్లు ఉండే చెట్లతో కళకళలాడుతోంది. ప్రతిక్షణం రెక్కలల్లార్చే పక్షులతో ఆకులు, రెమ్మలు లేని అశోకవనం లా ఉంది. ఎర్రని అశోక పుష్పాలు భూమిపైరాలి నిప్పు కణికలేమో అనిపిస్తున్నాయి. అప్పుడు శింశుపా వృక్షం కింద మలిన దేహంతో, నిట్టూర్పు కన్నీళ్ళతో బాగా శుష్కించిన చంద్ర రేఖలాగా ఒక వనితా రత్నం కనిపించింది హనుమకు. అగ్నిజ్వాలగా భాసిస్తున్న ఆమె సీతా దేవే అనే నమ్మకం కలిగింది. జీర్ణమయిన పసుపు పచ్చని ఏకవస్త్రగా స్నానాదులు,ఆబహరణాలు లేకపోవటం వలన భూమిలోంచి పుట్టిన పద్మాలు లేని కొలను అనిపించింది. మూర్తీభవించిన దైన్యం తో శోక దేవతగా సాక్షాత్కరించింది. కుజగ్రహం తో పీడింపబడిన రోహిణి లాఉన్నది. కృష్ణ సర్పం లాంటి ఒకే జడ, పేటకుక్కలమధ్య భయంగా ఉన్న లేడిఅనిపించింది. రావణుడు అపహరించుకొని వెళ్ళినప్పుడు ఎలాంటి రూపం లో ఉందని విన్నాడో ఇపుడూ అలాంటి రూపం తోనే కనిపించింది. తపస్సులో ఉన్న సుందర తపస్విని లా,అగ్ని జ్వాలగా ఉన్నది –

"తాం స్మృతీమివ సందిగ్ధామృద్ధిం నిపతితామివ –విహతామివచ శ్రద్ధామాశాం ప్రతిహతా మివ"

"సోపసర్గాం యధా సిద్ధిం బుద్ధిం కలుషామివ –అభూతే నాపవాదేన కీర్తిం నిపతితామివ "

అంటే –సందేహం కలిగించే స్మృతి వాక్యం లాగా, క్షీణించిన సంపద లాగా, సడలిన శ్రద్ధ లాగా, ప్రయోజనం లేని ఆశలాగా, విఘ్నాలతో కూడిన కార్య సిద్ధిలా, కపటం తో ఉన్న ఆలోచన లా,మిధ్యాపవాదం తో పతనమైన కీర్తిలాగా సీతా దేవి ఆంజ నేయునికి కనిపించింది

ఇవన్నీ సార్ధకమైన ఉపమానాలే. భవిష్యత్ దర్శనాలే అనిపించింది నాకుమాత్రం మహర్షి వాక్య విన్యాసం కదా క్రాంత దర్శికదా ఆయన, ఒక్కసారి ఇక్కడే నిలిచి ఆలోచిద్దాం. స్మృతివాక్యం పరమ ప్రమాణీయమే.కానీ దీని తస్సా చెక్కా, అనేక అనుమానాల ప్రోగుకూడా. ఒక్కొక్కదాన్నీ విప్పుకుంటూ పోతేకాని సత్యం రుతం బయట పడవు. అలాగే సీతాదేవి అనే అనుమానం ఉన్నా రూఢిగా చెప్పలేని సందిగ్ద స్థితి. సంపద క్షీణించినా దాని పూర్వవైభవం తగ్గదు.ఒక్కోసారి శ్రద్ధ సడలి పోవచ్చు కానీ కొంచెం జాగరూకత వహిస్తే మళ్ళీ పొందచ్చు. ఆశ ప్రయోజనకారి కాదు కొన్ని వేళల్లో అనిపిస్తుంది. ఆ ఆశ లేకపోతే జీవితం చీకటి మయమే. ఇవన్నీ తాత్కాలికాలే. శాశ్వత సత్యం నెమ్మదిగా ఆవిష్కారమౌతుంది అనే సూచ్యార్థం మహర్షి ఉపమానాలో నాకు కనిపించాయి. అలాగే కార్యం మొదలుపెడితే తెలిసీతెలీకుండా అనేక విఘ్నాలు ఆవరిస్తాయి. ధైర్యంతో ముందడుగు వేస్తె ఫల సిద్ధికలుగుతుంది భయపడి వెనకడుగు వేస్తె విధి వెక్కిరిస్తుంది ప్రమాదో ధీమతామపి అన్నారు. మన ఆలోచనమనకే అబద్ధం అనిపిస్తుంది అనువుగాని వేళ.కాస్త నిదానిస్తే సంయమనం పాటించి మరి రెండుమూడు సార్లు దృష్టిపెడితే మనది రాజమార్గమే అని రుజువవుతుంది. మనం యెంత జాగ్రత్తగా ఉన్నా మంచి దారిలో నడుస్తున్నామని నమ్మినా లోకం మిధ్యాపవాదాలు వేసి ధ్యేయాన్ని ఆటంక పరుస్తారు. ఇది విపరీతం కాదు లోకసహజమే. అప్పుడు మనకు ఆత్మనిబ్బరం మనం చేసేది యదార్ధం అనే నమ్మికా ఉంటె,అవన్నీ మబ్బు పింజేల్లా దూది పింజేల్లా ఎగిరిపోయి సత్యం బయట పడి ధ్యేయానికి విజయం కలుగుతుంది కీర్తి పున్నమి వికసిస్తుంది. ఇన్ని భావాలు ఇమిడ్చాడు వాల్మీకి మహర్షి ఈ సందర్భంగా. అంతేకాదు భవిష్యత్తులో సీతా దేవి పై లోక నింద మోపబడే విషయమూ సూచ్యార్థమే అనిపిస్తుంది. మహా పండితుడు కనుక అతనికి ఇన్ని భావాలుకలిగాయి సీతాదేవిని చూడగానే.



పూర్వం ఋష్యమూక పర్వతం పై జారవిడిచిన ఆభరణములు ఇప్పుడు ఈమెకు లేవు. విడువని నగలుమాత్రమే ఉన్నాయి అని గుర్తించాడు కనుక అనుమానం తీర్చుకోవటానికి ఇదొక బలమైన ఆధారం అయింది. ఋష్యమూక పర్వతం పై ఆమె జారవిడిచిన పసుపు పచ్చని ఉత్తరీయం ను సుగ్రీవాదులు చూశారు. నగలను జారవిడుస్తుండగా కూడా వాళ్ళు చూశారు. ఇప్పుడు ఈమెకు ఆ ఉత్తరీయం లేదు ఆనగలూ లేవు కనుక రెండవ బలీయమైన అనుమానం రుజువైంది. ఇంతటి సాధ్వికనుకనే శ్రీరాముడు అనుతాపం, దుఖం, ప్రేమలతో బాధపడుతున్నాడు అనుకొన్నాడు.సీత శరీరాకృతి, రాముని శరీరాకృతి ఒకటిగానే ఉన్నందువలననే వారికి ఒకరికొకరు తోడూ అయ్యారు అని నిశ్చయించాడు. ఇద్దరి మనస్సులు ఒక్కటే అత్యంత స్థిరంగా ఉన్నాయి. అందుకే సీతాదేవి. ధర్మాత్ముడు రాముడు జీవించగలుగుతున్నారు. సీతా వియోగం ఆయన భరించలేడు.రాముని విడిచి ఈమె బ్రతుక లేదు. సీతను చూస్తె రాముని మనసు పూర్ణ చంద్రునిలా ఉప్పొంగిపోతుంది. రామచంద్ర దర్శనం తో సీత పులకించిపోతుంది. వీరిద్దరూ జీవికా జీవులు. అని బాధ సంతోషం తో ఉన్నాడు హనుమ.

"అస్యా దేవ్యా యథారూప మంగ ప్రత్యంగ సౌష్ఠవం –రామస్య చయథారూపం తస్యేయ మసితేక్షణా"

"తస్యా దేవ్యా మనస్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్-తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి "

వాల్మీక రామాయణాన్ని పూర్తిగా ఆకళింపు చేసుకొని రామాయణ కల్ప వృక్షం అనే అమృత కావ్యం రాశాడు కవిసామ్రాట్ విశ్వనాథ. అందులో సీతారాములకుఉన్న అభేదాన్ని ఒక గొప్పపద్యంలో చొప్పించాడు

"ఆకృతి రామచంద్రు విభావాకృతి, కన్నెమ తీరు స్వామి చాపాకృతి-కన్నులన్ ప్రభు కృపాకృతి, కైశికమందురామ దేహాకృతి,సర్వ దేహ –మునయందున, రాఘవ వంశమౌళిధర్మాకృతి -కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞ మూర్తియై"

ఇంతకంటే గొప్పపద్యం లేదు ఆ ఇద్దరి అవినాభావ సంబంధానికి. అన్యోన్యానికి.

ఇది 55శ్లోకాల 15వ సర్గ

ముందుకు దూకుదామను కొన్న సమయం లో హనుమకు మళ్ళీ దుఖం ఆవరించింది. దీని నివారణకు సీతారామనామ స్మరణమే సాధనం అని భావించి "అమేయ పరాక్రమశాలురైన సోదరద్వయం, అమిత సాధుశీల సీతాదేవి లకే ఇలాంటి దుఖం సంభవిస్తే" కాలాన్ని ఎవరూ అధిగమించటం సాధ్యం కాదు "-అనిపిస్తోంది అనుకొన్నాడు.

"మాన్యా గురు వినీతస్య లక్ష్మణస్య గురుప్రియా –యది సీతాపి దుఖార్తా" దురతిక్రమః

వాల్మీకి మహర్షిహనుమతో చెప్పించిన "కాలోహి దురతి క్రమః" అన్నఉడి మాట లోకం లో నానుడి అయింది '

మళ్ళీ విచార ధార కొనసాగిస్తూ " స్వభావం, వయసు, నడవడి,వంశం,సాముద్రిక లక్షణాలు సీతా రాములకు సమానంగాఉన్నాయి.లక్ష్మీ దేవి గా ఉన్న సీతను స్మరిస్తూ "ఈమె కోసమే రాముడు వాలి సంహారం చేసి, రావణ సాటి పరాక్రమమున్న కబంధుని హతమార్చాడు. జనస్థానం లో14వేలమంది భీకర రాక్షసులను అవలీలగా చంపేశాడు. ఖర, దూషణ, త్రిశిరస్క మహా తేజోవంత రాక్షసులను సంహరించాడు. దక్కదు అనుకొన్న వాలి సామ్రాజ్యం కిష్కింద సుగ్రీవుడికి అవలీలగా తమ్ముడు సుగ్రీవుడికి దక్కింది. సీత క్షేమం తెలుసుకోవటానికే నదీనదపతి మహా సముద్రాన్ని దాటి వచ్చి లంకలో ప్రవేశించాను. అలాంటి పతివ్రతామతల్లి సీతా దేవి కోసం రాముడు ధరిత్రిని అంతా తలక్రిందు చేసినా తప్పు లేదు. ముల్లోకాదిపత్యమా, లేక జానకీ దేవి సీత యా ఎవరు గొప్ప అని ప్రశ్నవస్తే, సీతతో పదహారవ వంతు అయినా ముల్లోకాదిపత్యం సరిరాదు అనిపిస్తోంది ఇది నిశ్చయం. -

"రాజ్యం వా త్రిషు లోకేషు, సీతావా జనకాత్మజా –త్రైలోక్య రాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కలాం ".ఈ శ్లోకమూ లోకంలో గొప్ప ఉదాహరణగా వాడుకలో ఉన్నది.

శ్రేష్ట రాజు దశరధుని పెద్దకోడలు, ధర్మజ్ఞుడు,కృతజ్ఞుడు,పరమాత్మ విదుడు ఐన శ్రీరాముని ధర్మపత్ని సీతాదేవి ఇక్కడ లంకలో రాక్షసులమధ్య దీనయై, దుఖంతో కుమిలిపోతోంది. అల్లారు ముద్దుగా జనకుని ఇంటపెరిగి, రామవివాహంతో అయోధ్య మెట్టినింటికి వచ్చి అసూర్యం పశ్య గా ఉన్న మహాతల్లి, భర్త తనతండ్రికిచ్చిన మాట నిలబెట్టటానికి తానూ వనవాసానికి వెన్నంటి వచ్చి కష్టాలు పడిపడి, అడవిలోకూడా భర్త సేవలో రాజభవనం లో ఉన్న ఆనందాన్నే పొందుతూ, రావణ దుష్టపన్నాగం తో ఇక్కడికి వచ్చి బందీ అయింది, ఇక్కడ కూడా ఆమెకు రామధ్యానం తప్ప మరో ఆలోచన, చూపు లేదు. రామసమాగమనం కోసం ప్రాణాలతో ఉంది. అక్కడ రాముడు కూడా ఈమెకోసం పరితపిస్తూ వెదుకుతూ అనంత దుఖం లో ఉన్నాడు సీత మంచు దెబ్బతో సొంపుపు చెడిన తీగలాగా, సహచరుడు లేని ఆడ చక్రవాకం లాగా కాంతి హీనంగా ఉన్నది. అనేక పుష్పాలభారంతో వంగి శోకాన్ని పోగొట్టే అశోకాలు కూడా ఈమెకు శోకాన్నే కలిగిస్తున్నాయి.

"హిమ వ్యపాయేన చ మందరశ్మి-రాభ్యుత్థితో నిక సహస్ర రశ్మిః-ఇత్యేవ అ మర్థంకపి రన్వవేక్ష్య-సీతేవ మిత్యేవ నివిష్ట బుద్ధిః-సంశ్రిత్య తస్మిన్నిషసాద వృక్షే –బలీ హరీణా వృషభ స్తరస్వీ "

వసంత చంద్రుడూ శోకాన్నే కలిగిస్తున్నాడు"అనిఅనేక విధాలుగా ఆలోచించాడు.దెబ్బలు తగిలిన వారికే మళ్ళీ మళ్ళీ దెబ్బలు తగలటం సహజం. మూలిగే నక్కపై తాటిపండు పడటం లోకరీతి. లేకపోతె శోకాన్ని దూరం చేయాల్సిన అశోకం శోకం పెంచటం ఏమిటి ?చల్లని వెలుగులతో

మానసికానందాన్నివ్వాల్సిన చంద్రుడు కూడా దయమాలి శోకం కలిగించటం ఏమిటి ? "ఇలా ఆలోచిస్తూ చివరికి ఆమె సీతాదేవి అనే నిశ్చయానికి వచ్చి బలిష్టుడు,వానర శ్రేష్టుడు,,మహాహరి హనుమ, శింశుపా వృక్షం మీద కూర్చుని ఏం జరుగుతుందో చూస్తున్నాడు,

ఇది32 శ్లోకాల 16వ సర్గ

తెల్లకలువల సమూహం గా ప్రకాశించే నిర్మల చంద్రుడు, నల్లని జలాలలోకి హంస వెళ్లినట్లు నిర్మలాకాశం పైభాగాన కనబడి, తనకాంతితో సహాయ పడేట్లు హనుమను సేవిచటానికి వచ్చాడు. ఆచల్లని వెన్నెలలో హనుమ సీతాదేవిని చూశాడు. ఆమె చుట్టూ ఒంటికన్ను ఒకే చెవి కలవారు చేటచెవులతో తలను దాచు కొన్నది, అసలు చెవులే లేనిది, పంది చెవుల్లాంటి చెవులున్నది, ముక్కు పైకి ఉన్నది, సన్నని పొడవైన మెడ ఉన్నది, కొద్ది జుట్టున్నది అసలు జుట్టే లేనిది వ్రేలాడే చెవులు నొసలున్నది, వ్రేలాడే పొట్ట, స్తనాలున్నది, వ్రేలాడేమోకాళ్ళు న్నది, గూనిది, మరిగుజ్జుది,పొరపళ్ళున్నది, అసలు పొట్ట మోహంలో ఉన్న వికృతమైనది, మొదలైన రాక్షస స్త్రీలను చూశాడు. నల్ల తెల్ల యెర్ర మొదలైన రంగు శరీరం ఉన్న వారు, పందిముఖం లేడి ముఖం, ఎనుబోతుముఖం, మేకమొహం, నక్కముఖం, ఏనుగు పాదం ఒంటేకాళ్ళు,దేహంలోనే తల దూరి ఉన్నవారు, ఆవు నక్క కుక్క ఏనుగు, కోతిచెవులున్న వారు, అడ్డముక్కు పెద్దముక్కు ఏనుకాళ్ళవారు, పాదాలలోజుట్టున్న వారు, అనేక జంతు ముఖాలున్న వారు, రకరకాల రంగు వెంట్రుకలున్న వారు కలవారు, మద్యం లో పూర్తి నిషాలో ఉన్న అనేకరకాల రాక్షస స్త్రీలను సీత చుట్టూ ఉన్నట్లు గమనించాడు

అనవద్య సౌందర్య తేజో మూర్తి సీతమ్మను చూశాడు. పతివ్రతా ధర్మం తో పెరిగిన కీర్తి శోభతో, పతి స్నేహమే అలంకారంగా, సింహం చేత బంధింపబడిన ఆడ ఏనుగులా గా, మేఘాలచే ఆక్రమించబడిన చంద్ర రేఖలా, బెదరిన ఆడలేడి చూపులతో, శోక సమూహంగా, దుఖ సాగర తరంగం పైకి లేచినట్లు న్న సీతను చూసి హనుమ ఆనంద పారవశ్యంతో కన్నీరు కార్చాడు. రామలక్షమణులను ఒకసారి తలచుకొని నమస్కరించి, శింశుపా వృక్షం ఆకులమధ్య దాక్కున్నాడు.

"నమస్కృత్వా చ రామాయ, లక్ష్మణాయచ వీర్యవాన్ –సీతా దర్శన సంప్రహృష్టో హనుమాన్ సంవృతో భవత్ "

ఇది 32శ్లోకాల 17వ సర్గ. ఇందులో ఎన్నిరకాల రాక్షస స్త్రీలున్నారో వాల్మీకి మనకు చూపించాడు. సీత పాతివ్రత్యాన్ని మరింత మెచ్చే శ్లోకాలు రాశాడు. లంకలో దిగినప్పుడు చంద్రోదయం యెంత గొప్పగా హనుమకు సహకరించిందో, ఇక్కడ అశోకవనం లోనూ చంద్రుడు ఆయనకు బాగా సహాయపడ్డాడు కాంతితో.

ఇంత జరిగే సరికి రాత్రి మూడుజాములసమయం దాటి,చివరిజాము మాత్రమే మిగిలింది. అప్పుడు సాంగ వేదపండితులు,, శ్రేష్ట యాగాలు చేయించగల సమర్ధులు ఐన బ్రహ్మారక్షస్సుల వేద ఘోష వినబడింది. మంగళవాద్యాలు మ్రోగాయి. రావణుడు వెంటనే నిద్ర లేచి జారినమాలలు, వస్త్రాలతో సీతను తలచుకొన్నాడు. మదంతోమదించిన వాడు, మదన ప్రేరితుడై, కామాన్ని అదుపులో పెట్టుకోలేక పోయాడు. వెంటనే సర్వాభరణ భూషితుడై, మందీమార్బలంతో అశోకవనానికి వంద మంది రాక్షస స్త్రీలతో బయల్దేరాడు. అందులో కొందరు బంగారు దీపస్తంభాలు పట్టుకొన్నారు, కొందరు చామరాలు వీస్తూ అనుసరించి వస్తున్నారు. కొందరు బంగారు కలశాలలో నీరు పట్టుకొని ముందు నడిచారు. కొందరు కత్తులు, తివాసీలుతీసుకొని వెనక నడిచారు. ఒకామె మణిమయ మద్య పాత్ర పట్టుకొన్నది. ఇంకొకామె ఛత్రం పట్టుకొన్నది. మత్తుతో ఉన్న ఆతని కాంతలు మెరుపుతీగాల్లా వెంటనడిచారు.కామ పరవశంతో మత్తెక్కిన రావణుడు విలాసంగా నడుస్తున్నాడు. మహాతేజశ్శాలిగా కనిపించాడు చెట్టుపై ఆకులమాటున నక్కి చూస్తున్న హనుమకు.

ఇది 32శ్లోకాల 18వ సర్గ

రావణుడి రాక గ్రహించి భయవిహ్వల మైన సీతాదేవి పెనుగాలికి కదలిపోయే అరటి చెట్టు అయింది. వెంటనే తేరుకొని భయంతో తొడలు, ఉదరం బాహువులచేత స్తనాలను కప్పుసుకోన్నది –పరపురుషుడు కనిపిస్తే కులాంగన లోకం లో సహజంగా ఇలానే చేస్తుంది.

"ఉపవిస్టా విశాలాక్షీ రుదంతీ వరవర్ణినీ – దశగ్రీవస్తు వైదీహిం రక్షితాంరాక్షసీ గణై:"



మలినవస్త్రాలు, నిరాభరణ, శోక దేవతలాఉన్న సీతను చూశాడు ఆమె రాజశ్రేస్టుడు, ఆత్మవిడుడు ఐన రాముడి దగ్గరకు సంకల్పం అనే గుర్రాలతో కట్టబడిన మనో రథం లో పోతోందా అనిపించింది –

"సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః –సంకల్ప హయ సంయుక్తైః యాన్తీమివ మనో రథై"

అసత్య అపవాదం చేత చెడిన కీర్తిలాగా, పునరావృత్తి లేకపోవటం వలన మరుగుపడిన విద్యలాగా సీత ఉన్నది. తరిగిన ధనలాభంలా, చేయని యజ్ఞం లా ఉత్పాత సమయంలో మండే దిశలా, దొంగిలిపబడిన పూజా ద్రవ్యంలా కనిపించింది. తాకకూడని వాడు తాకిన యజ్ఞ వేదికలా, ఆరిపోయిన అగ్నిజ్వాల లా, రాహువు కబళించిన చంద్రునిలా ఉన్నది. తనవారి గుంపు నుంచి వేరు చేయబడి బంధింపబడి నిట్టూరుస్తూ దుఖపడే గజరాజు భార్యలా ఉన్నది. మనసులో రాముడు వచ్చి రావణ సంహారం చేయాలని దుఖంతో అంజలి ఘటించి దేవతలను ప్రార్ధించే పతివ్రతా శిరోమణి లా కనిపించింది. రావణుడు మాత్రం ఆమెను మచిమాటలతో దారిలో పెట్టాలనే సంకల్పం లో ఉన్నాడు. ఇవన్నీ ప్రేక్షకపాత్ర వహించి హనుమ చూస్తున్నాడు అంతకంటే ప్రస్తుతం ఏమీ చేయలేడు కదా.

"సమీక్ష మాణాం రుదతీ మనిందితాం-సుపక్ష్మ తామ్రాయత శుక్ల లోచనాం-అనువ్రతాం రామ మతీవ మైథిలీం –ప్రలోభయామాస వధాయ రావణః "

ఇది 23శ్లోకాల 19వ సర్గ

ఈ రెండు సర్గలలో మహర్షి వాల్మీకి చిత్రించిన ఉపమానాలన్నీ సర్వోత్కృ స్టంగా, సందర్భానికి తగినట్లున్నాయి. సీత విషయంలో వాడిన ఉపమానాలు ఆమె కీర్తిని శీలాన్నీ, నిజాయితీని ధర్మతత్పర్తను, దృఢ సంకల్పాన్నీ, రామునిపై ఉన్నఅపారమైన అనురాగాన్ని, నమ్మకాన్నీ, విశ్వాసాన్నీ తెలియబరచేవే. ఆమె గుణాన్ని మరింత గా పెంచేవే. అందుకే మహాకవి కాళిదాసుకు ఉపమానాలకు మార్గదర్శి వాల్మీకి అంటారు బుధులు.

రావణుడు సీతతో మాట్లాడాటం మొదలుపెట్టాడు "భయంతో నీశరీరాన్ని దాస్తున్నావు సకలజన మనోభిరామం గా ఉన్న నిన్ను నేను మోహిస్తున్నాను. నాపై వలపు చూపకపోతే నిన్ను తాకనే తాకను. నాశరీరంలో కామం వరదలై ప్రవహించినా సరే. ఇక్కడ నాకు తెలియకుండా ఎవరికీ ప్రవేశం లేదు. భయం వదిలి మాట్లాడు. పరస్త్రీలతోపొందు, బలాత్కారంగా తీసుకురావటం రాక్షస ధర్మమే కనుక నేను చేసింది అధర్మం కాదు. నన్నుప్రేమించి శోకాన్ని పోగొట్టుకో. పరధ్యానంగా ఉంటూ కిందపడుకొని అలంకార రహితంగా ఉపవాసాలతో ఉండటం తగదు.నన్ను చేరితే సకల దేవేంద్ర భోగాలు అనుభవించవచ్చు. నీ యవ్వనం సౌందర్యం గడిచిపోతున్నాయి. వాటికి సార్ధకత కలిగించు. నిన్ను సృష్టించిన బ్రహ్మ ఇంతకంటే అందమైన స్త్రీని సృష్టించలేక సృష్టి మానుకొని ఉంటాడు. బ్రహ్మైనా నిన్ను చూస్తే ఆరాధిస్తాడు. నిస్సంకోచంగా నా భార్యగా ఉండు.నిన్నే పట్టమహిషిని చేస్తాను. ఈ లంకారాజ్యంతో సహా నా అధీనం లో ఉన్నదంతా నీదే.మేమంతా నీ సేవకులమే ఈ పృధ్విని అంతా జయించి నీ తండ్రి జనకుడికి అర్పిస్తాను. నన్ను ఎదిరించే సాహసి పుట్టలేదు. చక్కగా అలంకరించుకొని నన్ను పొందు నువ్వు మంగళస్వరూపివి అందరి సుఖాన్నీ చూస్తావు రాముడు ఇక్కడికి రాలేదు. వచ్చినా నన్ను జయించలేడు.ప్రస్తుతం నువ్వులేక అడవులలో సంచరిస్తూ పిచ్చివాడిలా తిరుగుతూ ఉంటాడు. అసలు బతికి ఉన్నాడో లేదో సందేహం. ముందుభాగంలో కొంగలు ఉండటం వలన వెనకనల్లని మేఘాలలో మరుగు పడిన వెన్నెల ఎలా చూడటానికి వీలుకాదో రాముడు అలా నిన్ను చూడలేడు.

ఇంద్రుని కి దక్కిన కీర్తిని హిరణ్య కశిపుడు పొందినట్లు రాముడు నానుంచి నిన్ను పొందలేడు.విలాసినీ !సర్వాన్ని హరించి నట్లు నువ్వు నామనసు హరించావు. ననా అంతఃపురంలో నిన్ను శ్రీదేవిని అప్సరలు సేవించినట్లు సేవిస్తాను. దేవీ ! తపస్సు, బలం, పరాక్రమం, దానం సంపద, తేజం, కీర్తి లతో నాకు రాముడు సాటిరానివాడు. నా యందు అనురాగం చూపించు. నిన్ను చూసి నీ బంధువులు సంతోషించాలి –

“పిబ విహార రమస్వ భుంక్ష్వ భోగాన్ –ధన నిచయం చైవ ప్రదిశామి మేదినీం చ –మయి లాల లలనే యథాసుఖం త్వం-త్వయిచ సమేత్య లలంతు బంధవాస్తే”

“కుసుమిత తరుజాల సంతసాని –భ్రమత యుతాని సముద్ర తీరజాని –కనక విమలహార భూషి తాంగీ-విహార మయా సహ భీరు కాననాని “

36శ్లోకాల 20 వ సర్గ ఇది

ఇందులో మొదరి సారి రావణుడు సీత తో మాట్లాడాడు. ఇందులో సీతా దేవిపై ఆరాధనాభావమే కనిపిస్తోందినాకు. ఎక్కడా కామం తో మాట్లాడినట్లు నాకు అనిపించలేదు. అతడు ప్రయోగించిన శబ్దజాలం ఒక దేవికి చేసే స్తోత్రం లాగా ఉన్నట్లు అనిపించింది. కొంచెం వివరంగా చూద్దాం –అనేకపుష్పమాలలు చందనం, అగరుపూట, వివిధవస్త్రాలు, దివ్యాభరణాలు పానీయాలు శయనఆసనాలు, గీతం నృత్యం వాద్యం మొదలైన సకల భోగాలను అనుభవించమని కోరాడు. ఇవన్నీ ఒక అమ్మవారికి చేసే షోడశ ఉపచారాలుకావా ?బ్రహ్మ ఆమెను ఆరాధిస్తాడు అంటే త్రిమూర్తులు ముక్కోటి దేవతలు శ్రీదేవిని పూజిస్తారని అర్థమే. ఆ శ్రీ దేవి వేరేవరోకాదు సాక్షాత్తు లక్ష్మీ స్వరూపమైన సీతాదేవి. శత్రువు అనే భావంవదిలెయ్యి అంటే మిత్రభావం దాసభావం చూపించు. అమ్మకరుణ అదే, సుందరీవిలాసవతీ,విలాసినీ, మానినీ సుందరీ,మంగళ స్వరూపిణీ అనే సంబోధించాడు ఆరాధనాభావం తో. మబ్బుల మరుగున ఉన్న చంద్రుడు కనిపించడు నిజమే –కాని మబ్బులు తొలగితే కనిపించక ఎక్కడికి పోతాడు ?అలాగే రాముడు ప్రస్తుతం దూరంగా ఉన్నా త్వరలో వస్తాడు అనే నమ్మకం, సూచ్యార్ధం ఉన్నాయి. ఇంద్రుడు హిరణ్యకశిపుని భార్యను అపహరించాడు ఆమె యేకీర్తి. మళ్ళీ వాడు భార్యను సాధించుకొన్నాడు. ఇక్కడా అలాగే సీత రాముని చేరుతుందని వాడే చెప్పాడు. శ్రీదేవిని అప్సరసలు పూజించినట్లు ఇక్కడ అందరూ అల్లాగే చేస్తారు అంటే అమ్మవారు లలితా పరమేశ్వరిని పూజించినట్లు పూజిస్తారు. అందుకే కాటూరి వెంకటేశ్వరరావుగారు రావణ హృదయాన్ని “పౌలస్త్య హృదయం “కావ్యంలో ఇదే ఆరాధనా భావంతో రాశారు. రావణుడికి జన్మజన్మల అనుబంధం స్వామితో, అమ్మవారితో తీరలేదన్నమాట.

రావణుడి మాటలకు తల్లడిల్లి తనకు అతడికి మధ్య ఒక గడ్డిపోచనుంచి సీతాదేవి “నాపై మనసు నీభార్యలపై మరల్చు పాపం చేస్తే మోక్షం రానట్లే నువ్వు నన్ను కోరటానికి అర్హుడవు కాదు. ఇక్ష్వాకు వంశ పతివ్రతను నేను. నీ నిన్ద్యమైనకొరిక అంగీకరించను. నేను పరభార్యను. సజ్జన ధర్మాన్ని పాటించు. నీ భార్యల శీల రక్షణ యెంత ముఖ్యమో పరభార్యల శీలరక్షణా అంతే ముఖ్యం. చపల చిత్తం, ఇంద్రియ చాపల్యం తో పరభార్యలను రమించేవాడు కీర్తి ఆయుస్సు ఐశ్వర్యం కోల్పోతాడు. నీ దుష్కార్యాన్ని మాం చేన్చే సజ్జనులు ఇక్కడ లేరా ?చెప్పినా వినక సకల రాక్షస వినాశానికి పూనుకొంటున్నావా. రాజు నీతిబాహ్య కర్మలు చేస్తే సుసంపన్న రాష్ట్రం నగరం వినాశనమౌతాయి. పాపాల చేతా, దూర దృష్టి లేమి చేతా పాపి నశిస్తే, ప్రాణులన్నీ అభినందిస్తాయి, ఆనందిస్తాయి. నీ ఐశ్వర్య భోగ రాజ్య ప్రలోభాలు నన్నేమీ చెయ్యలేవు. సూర్యుని కంటే వేరుకాని వెలుగును నేను. రాముడికంటేకూడా వేరైనదానినీ కాదని గ్రహించు. వేదవ్రత స్నాతుడు, ఆత్మజ్ఞాన సంపన్నుడు అయినవాడికి యోగాభ్యాస రూప విద్య లాగా శీల వయో వృత్తులచే నేను రామునికే తగిన భార్యను. రామవిరహంతో దుఖితను. బంధించి తెచ్చిన నన్ను రాముడిని ఆహ్వానించి ఆయను అర్పించు. నీ వంశ నాశనం కాకుండా ఉండాలి అంటే రామునితో స్నేహమే నీకు మంచిది.

రాముడు ధర్మతత్పరుడు శరణాగత వత్సలుడు బతుకు మీద ఆశుంటే ఆయన చెలిమి నీకు శ్రేష్టం. శరణువేడి ఆయనను ప్రసన్నుని చేసుకో. శరణాగతుల తప్పులు క్షమించే ఉదారహృదయుడు నా స్వామి రాముడు, మనసులో చెడుభావంవదిలేసి నన్ను ఆయనకు సమర్పించి బతికిపో. శుభం పొందు. ఇంకోమార్గం లో ప్రవర్తిస్తే, వజ్రాయుధం నిన్ను చంపకపోయినా యముడు నిన్ను వదిలేసినా లోకనాథుడు రాముడు నిన్ను వదిలిపెట్టడు అని గ్రహించు. త్వరలో రామ ధనుష్టంకారం విని మూర్చపోతావు. సకల లంకా వినాశనం చూస్తావు. సోదరులు రామలక్ష్మణులు లంకచేరి, నీ రాక్షస సమూహాలను చీల్చి చెండాడి ఎవరికీ బ్రతికే అవకాశం లేకుండా చేస్తారు. గరుత్మంతుని చేతిలోపాములులాగా, రామ గరుత్మంతుని చేత రాక్ష పాములు చావటం ఖాయం. బలిని మూడు అడుగులడిగి రాజ్యలక్ష్మిని దూరం చేసిన వామనుడిలాగా నన్ను నీనుంచి తప్పిస్తాడు.

జనస్థానం లో రామపరాక్రమం వినికూడా, సోదరులు లేని సమయంలో మాయోపాయంగా నన్ను అపహరించే పాపం మూటకట్టుకొన్నావు. పులుల వాసన చూసి కుక్క వాటి దగ్గరకు ఎలా వెళ్ళలేదో,రామలక్ష్మణుల గంధం తగిల్తే ఆదగ్గరకుకూడా రాలేవు. వొంటి చేతితో పోరాడిన వృత్రాసురుడు రేడు చేతులతో యుద్ధం చేసిన ఇంద్రుని చేతిలో చచ్చాడు. అలాగే నీ అపజయం నిజం. నీకు పోయేకాలం వచ్చింది. రాముడి నుండి పారిపోయి కైలాసం వెళ్ళినా, నీకు శనీశ్వరం తప్పదు,మహా వృక్షం పిడుగుపాటుకు కూలినట్లు రాముడినుంచి తప్పించుకో లేవు “అని హెచ్చరించింది సీతామాత.

ఇది 34శ్లోకాల 21వ సర్గ

20నుంచి 26వ సర్గవరకు మనకు హనుమమాట వినబడదు. 27త్రిజట స్వప్న వృత్తాంతం లోనే హనుమ దర్శనం మాట ఉంటాయి.

పరపురుషునితో కులస్త్రీలు సూటిగా మాట్లాడటంఅప్పటికి లేదు. అందుకే మధ్యలో గడ్డిపరక అడ్డం పెట్టుకొని సీత మాట్లాడి సంప్రదాయం నిలబెట్టింది. ఇక్కడ గడ్డిపరక పెట్టటం లో ఉద్దేశ్యం వాడిని తుచ్చ గడ్డిపరకగా ఆమె భావించిందని భాష్యం చెప్పిన వారూ ఉన్నారు. సీత మనో నిశ్చయం సూటిగా అత్యంత స్పష్టంగా నిర్దుష్టంగా చెప్పింది. రామ శౌర్యపరాక్రమాదులు ఎంతగొప్పవని విస్పష్టంగా వివరించింది. అంతకు ముందు సర్గలో రావణుడు తన ప్రాభవపరాక్రమాలు ఏకరువు పెడితే ఇక్కడసీత దీటుగా రామ వీర విక్రమ విశేషాలను గొప్ప

దృష్టాంతాలతో బోధపరచింది. వామనుడే రాముడు అని సూచ్యార్థంగా చెప్పింది. బలి రాజ్యలక్ష్మి ఎలా చెయ్యి జారిపోయిందో వివరించింది. వృత్రాసుర వధ లోని మర్మం కళ్ళకు కట్టించింది. గరుడ –సర్ప వృత్తాంతం జ్ఞప్తికి తెచ్చి నాగ వంశ నాశనం స్వయం గా కోరి తెచ్చుకోన్నట్లే రావణుడు రాక్షస వినాశనం ఆహ్వానిస్తున్నట్లు తెలియజేసింది. రామలక్ష్మణులు పులులు అని రావణుడు కుక్క అని తేల్చిచెప్పింది. రామశరణాగత ధర్మం వివరించి రాముని కాళ్ళమీద పడటం, శత్రుత్వం వదిలి మిత్ర ధర్మం పాటించటం, తనను రాముడికి వాడే స్వయంగా అర్పించటం అనే చాయిస్ లన్నీ ఇచ్చింది. వినకపోతే నీ ఖర్మం అని గట్టిగా చెప్పింది కాదు చెప్పించాడు మహర్షి వాల్మీ

సీత మాట్లాడినమాటలకు ఎక్కడోకాలి రావణుడు ఆమెతో "మగాడు అనునయించిన కొద్దీ స్త్రీ వశపడుతుంది. గుర్రం పెడత్రోవ పడితే సమర్దుడైన సారధి దాన్ని దారిలోపెడతాడు. నీపై ఉన్నకామాన్ని నా కోపం అడ్డగిస్తోంది. కామం ఏర్పడితే దయ ప్రేమకూడా కలగటం సహజం. నిన్ను అవమానించవచ్చు చంపచ్చు,వానప్రస్త వేషం లో ఉన్న రాముడిపై ప్రేమింకా నీకున్నా నిన్ను చంపటానికి ఆజ్ఞ ఇవ్వలేకపోతున్నా.కాని నన్ను చాలానిర్దాక్షిణ్యంగా దూషించావు దీనికి ప్రతీకారంగా నిన్ను చంపటం న్యాయం "అని అక్కసు అంతా వెళ్ళగ్రక్కి మళ్ళీ తమాయించుకొని "నీకు ఇచ్చిన 12నెలలగడువులో 10నెలలు అయిపోయి రెండు నెలలు మాత్రమె మిగిలాయి. ఇప్పటికైనా నాతో రమించు. ఈ రెండు నెలలు దాటితే నిన్ను చంపి ఉదయ భోజనానికి వండుతారు "అన్నాడు ఈమాటలకు సీతకు మాత్రమేకాదు దేవ గంధర్వ కన్యలు కూడా కన్నీరు కార్చారు. కళ్ళతో, పెదవుల చలనాలతో, ముఖ భంగిమలతో వారు సీతను ఓదార్చారు.

వాళ్ళ ఓదార్పులకు కాస్త తెప్పరిల్లి సీత రావణుడితో ఇలా చెప్పింది –తుచ్చుడా ! ఇంద్రుడికి శచీదేవిలాగా రాముడికి నేనుభార్యను. పరాక్రమశాలి రాముని భార్యనైననన్ను నీచపు మాటలతో బాధించావు. దీనికి తగిన ఫలితం అనుభవిస్తావు.మదపుటేనుగు రాముడికి, చెవులపిల్లి నీకూ సాపత్యమా. మాయా మృగ వ్యాజం తో నన్ను దండకారణ్యం నుంచి ఎత్తుకోచ్చావు సిగ్గులేదా. ఇంకా రాముడి కంట బడ లేదు కనుక బతికి ఉన్నావు. అనార్యుడా !క్రూరమైన నీ నల్ల వికృతమైన కళ్ళు నేలపడి రాలిపోనూ. పతివ్రతనైన నన్ను నీచంగా మాట్లాడిన నీ నాలుక వెయ్యి వ్రక్కలుకానూ.నిన్ను శపించటానికి నా భర్త అనుమతి నాకు లేనందున నిన్ను బూడిద చేయాల్సి ఉన్నా దయతో వదిలిపెడుతున్నా. నీ మృత్యువు కోసం దేవుడే నీతో ఈ అకృత్యం చేయించి ఉంటాడేమో. కుబేరుడిఅన్నవు, సైన్యమున్నా రాముడిని దూరం చేసి నన్ను అపహరించిన పిరికి పందవు "అనగానే రావణుడు కోపం కన్నులతో పాములాగా నిట్టూరుస్తూ "నిర్ధనుడిని నమ్మావు. నిన్ను ఇప్పుడే సూర్యుడు సంధ్యను లాగా నా తేజంతో నాశనం చేస్తా "అని భయంకరంగా గర్జించి కావలి కాస్తున్న అక్కడి రక్కసి స్త్రీలతో "ఈమెను సామదాన భేదాది ఉపాయాలతో నాకు వశమయ్యేట్లు చేయండి. అవసరం వస్తే దండోపాయమైనా ప్రయోగించి నా వశం చేయండి "అని కోపంతో ఆజ్ఞాపించగా, దాన్యమాలి అతడిని కౌగిలించి"సీత ఎందుకు నాతో సుఖించు రా. తన్ను ప్రేమించని స్త్రీని కామించే వాడి దేహం బాగా కాలిన కొలిమిలాఉంటుంది. నిన్నుమనసారా ప్రేమించే నన్నుపొంది ఆ తాపం తీర్చుకో "అని వాడి మనసుమార్చగా వాడు ఆవు వెంట వెళ్ళే ఆబోతులాగా అంతః పురానికి బయల్దేరి వెళ్ళాడు.

ఇది 46శ్లోకాల 22వ సర్గ

రావణ, సీత లు ఒకరినొకరు తీవ్రంగా తీవ్రంగా దూషించుకొన్నారు. రావణుడు ఏదో బలమైన కారణం వల్ల సీత ను ఏమీచేయలేకపోయాడు, సీత రాముని ఆజ్ఞ లేనందున వాడిని భస్మం చేయకుండా వదిలిపెట్టానని బుద్ధి కూడా చెప్పింది. రావణుడు సీతను దారిలో పెట్టె బాధ్యత కావలి స్త్రీలకు అప్పగిస్తే, సీత తనదైవమే రావణుడికి యుద్ధం లో జయించి బుద్ధి చెబుతాడని చెప్పింది.

రాక్షసరాజు వెళ్ళిపోగానే అక్కడి కావలి రాక్షసాంగనలు సీత దగ్గరకొచ్చి కోపంతోకూడిన కఠినమైన మాటలతో "రావణుడు పులస్త్యబ్రహ్మ వంశం వాడు. నువ్వు అతనిభార్యవైతే నీకు గౌరవం ఎక్కువౌతుంది. ఏకజట"మరీచి అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అనే నలుగురు ప్రజాపతులలో పులస్త్యుడు బ్రహ్మమానస పుత్రుడు. అతడి మనో సంకల్పంతో తేజశ్శాలి విశ్రవసు మహర్షి పుట్టాడు. అతడికొడుకే

రావణుడు అంటే పులస్త్యునిమనుమడు పౌలస్త్యుడు. అందుకే నామాటవిని ఆ వైభవాన్ని వదులుకోకు "అన్నది. పిల్లికళ్ళ హరిజట"33కోట్ల దేవతలు, దేవేంద్రునికూడా జయించినవాడు రావణుడు. అతని భార్యవు కా. "ప్రఘస "మహా తేజశ్శాలి వీర శూర ధీర రావణుడిని ఎందుకు కాదంటావు. ప్రియ భార్య మండోదరినికూడా విడిచి నిన్నేలుకొంటాడు మాస్వామి "అనగా "వికట 'వికటాట్టహాసంతో "సకల దేవ గంధర్వ యక్ష కిన్నెర కింపురుషాదులను జయించిన రావణుడు నీ దగ్గరకు కాళ్ళ బేరానికి వస్తేచులకన చేశావు. భార్యవై సకల సుఖాలు అనుభవించు"అనగా, దుర్ముఖి "సూర్యుడుకూడా రావణభయంతో తీక్ష్ణ మైన ఎండ కాయడు,వాయువు వేగంగా వీచడు. అలాంటి రావణుడి పక్షాన ఎందుకు చేరవు "అన్నది. ఇలా రావణుడి ఆజ్ఞ పాటించి వారంతా మాటలతో అతడి పరాక్రమాదులు వంశ ప్రతిష్టాదులు పొగడి సీతను అతడి భార్య కావలసినదని తీవ్రంగానే చెప్పి భ్రుత్య ధర్మం నిర్వర్తించారు.

ఇది 23శోకాల 23వ సర్గ

పై సర్గలో రాక్షస స్త్రీలు రావణుడు చెప్పిన సామ వచనాలతో హితవు చెప్పారు. ఇప్పుడు సెకండ్ డిగ్రీ ప్రయోగానికి సిద్ధమయ్యారు. అంతాసామూహికంగా "మానవ స్త్రీవికనుక మానవుడైన రాముడినే కోరుతున్నావు. మనసు త్రిప్పుకో లేకపోతే బతకలేవు. కష్టాల అధ్యాయం ముగించుకో. సుఖాల అధ్యాయం ప్రారంభించు. రాజ్యహీనుడు, దుఖార్తుడు రాముడు చేయగలిగింది వీసం కూడా ఉండదు. "అని కోరస్ గా భయపెడితే సీత కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ "మీరంతా నన్ను జననిందితాలైన మాటలతో బాధపెడుతున్నారు ఇవి పాపపు మాటలని అనిపించటం లేదా ?మానవస్త్రీ రాక్షసభార్య అవటం లోక విరుద్ధం. మీరంతా కలిసి నన్ను తినేసినా మీ మాట విననే వినను. దీనుడే కాని రాజ్య హీనుడేకానీ, పతి యే నాకు ప్రత్యక్ష దైవం. అతని యందె నా అనురాగం శాశ్వతం. శచీ దేవి ఇంద్రుని, అరుంధతి వసిష్టుని, రోహిణి చంద్రుని, లోపాముద్ర అగస్త్యుని, సుకన్య చ్యవన మహర్షి ని సావిత్రి సత్యవంతుని శ్రీమతి కపిలుని, దమయంతి సౌదసుని, కేశిని సగరుని, దమయంతి నలుని అను వర్తించినట్లే, నేను ఇక్ష్వాకు వంశ్య శ్రేష్టుడైన శ్రీరాముని అనుసారిస్తాను "అని దిమ్మ తిరిగే సమాధానం చెబితే దిమ్మతిరిగి బొమ్మ కనిపించింది వాళ్లకు. వాళ్ళు చెప్పింది రావణుడి తండ్రి తాత గురించి మాత్రమె.కానీ సీత పురాణ పురుషుల నందర్నీ తెచ్చి వారి ధర్మపత్నులతో సహా వరుసలో నిలబెట్టింది ".

ఈ సర్గలో మహర్షి సీతాదేవి చేత చెప్పించిన –"దీనోవా, రాజ్యహీనోవా, యోమే భర్తా స మే గురుః- తమ్ నిత్యం అనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా "అనేది లోకం లో ప్రతివ్రతా ధర్మం గురించి చెప్పేటప్పుడు అందరూ ఉదహరించే ముఖ్యశ్లోకం. అందుకే సీత అంత గొప్ప పతివ్రతగా గుర్తింపు పొందింది, నిజానికి ఆవిడ పొందిన సుఖం తక్కువ. జీవితమంతా కష్టాలే. కాని సుఖ దుఖాలలో ఆమె మనసు రామవశమే. ఆయనకూ అంతే.అందుకే ఆదర్శ దంపతులు అంటాం.

ఇదొక మొండిఘటం మాటలతో లొంగదు " అని తీర్మానించి మళ్ళీ వికృత వికార భయంకర చేష్టలతో మీద పడుతూ చివరికి సత్యాన్ని వాళ్ళే వాళ్ళ మాటలతో"ఛీ ఛీ ఈమె రాక్షసరాజు రావణునికి ఏ విదంగానూ తగింది కాదు "అని అన్నారు. "నేయ మర్హతి భర్తారం రావణం రాక్షసాధిపం. వాల్లమనసుల్లో ఉన్న అసలు విషయం "నక్కకూ నాగలోకానికీ సాపత్యమా. పావని సీత పాపి రావణుడి భార్య అవటం లోక విరుద్ధం "అని అనిపించి ఉండచ్చు నని నా ఊహ. "పాపం హనుమ శింశుప పైనే దాక్కొని గుడ్లనీరు కుక్కుకొంటూ ప్రేక్షకపాత్ర వహిస్తున్నాడు. సీతకూడా దుఖం తో ఆ చెట్టు కిందికే వచ్చి శోకం లో మునిగిపోయింది. కృశోదరి అనే రక్కసి "ఇప్పటి దాకా నీ భర్తపై ప్రేమ చూపావ్. అదిమోతాదు మించింది. మోతాదు దాటితే ఏదైనా ప్రమాదమే. నీ మాటలు నేను కాదనను. నేను చెప్పే హితం తలకెక్కించుకో "రాముడిని మర్చిపో నీ మనసులో రావణుడిని ప్రతిష్టించి సకలలోకేశ్వరి కా. రాముడి ఆయుస్సు తీరిపోయింది ఇక్కడికి రాడు రాలేడు.ఇంకా అతనితో నీకు పనిలేదు. రావణుడిని చేరి ఆనందం పొందు లేకపోతె మేమంతా నిన్ను చంపి తినేస్తాం "అన్నది.

వికట పిడికిలి బిగించి గర్జిస్తూ "ఎన్ని అప్రియాలు నువ్వు పలికినా నీమీద దయతో సహించాం.కాని మేము చెప్పింది నువ్వు చెవికి ఎక్కించు కోలేదు. దేవేంద్రుడు వచ్చినా నిన్ను రక్షించలేడు.స్త్రీల యవ్వనం అస్థిరం. అదిగడిచేలోపే సుఖాలు అనుభవించాలి. ఏడు వేలమంది రాక్షసాంగనలు నీ అధీనంలో ఉంటారు, నా మాట వినకపోతే నీ గుండె పీకి తినేస్తా "అని బెదిరిస్తే, మండోదరి(రావణపత్నికాదు ) అనే రాక్షసి శూలం తిప్పుతూ సీతను చూస్తె ఆబగా తినెయ్యాలని అనిపించిందని చెప్పి "కడుపుకు కుడివైపున కాలఖండమనే మాంసపిండం, ఎడమవైపు గుల్మం అనే మాంసపిండం,దానిపై ఉండే మాంసం పద్మకోశం లాంటి హృదయం అనే మాంసం దానికింద అదోమాంసం, ప్రేగుల్ని, తలనుకూడా తినేయ్యాలనిపిస్తోంది "అని భయ పెట్టింది, ఇంకో అడుగు ముందుకేసి ప్రఘస"ఇంకా చూస్తారేమే.దీని మెడ పిసికి చంపి చచ్చిందని రాజుకు చెబుదాం "అనగా అదోముఖి "దీన్ని చంపి మాంసం తినే పనిలో పడదాం ముక్కలు చేసి పంచుకొని, మద్యం, తెనేలలో నంచుకొని హాయిగా తిందాం. శూర్పణఖ అనే రాక్షసి (రావణ సోదరికాదు)అజాముఖి చెప్పింది బాగుంది. మాంసం తింటూ మద్యం తాగుతూ లంకానగర పడమటి

ద్వారం దగ్గరున్న భద్రకాళి ప్రీతికోసం నాట్యం కూడా చేద్దాం "అని థర్డ్ డిగ్రీ దాటిన మెజర్స్ ప్రయోగించి రాజు చెప్పిన దండాన్ని కూడా ప్రయోగించే రీతిలో ప్రవర్తిస్తే భయ విహ్వల సీతామాత నిస్సహాయయై సహనం ధైర్యం కోల్పోయి విపరీతంగా ఏడవటం ప్రారంభించింది.

48 శ్లోకాల 24వ సర్గ ఇది

ఇక్కడ కావలి రాక్షసులు రాజుమాట నూటికి నూరుశాతం పాటించి తమవిధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చారు అని గ్రహించాలి

ఈ సర్గలో హనుమమాట వాల్మీకి మాటగా వచ్చింది తప్ప ఆయన పలికిందేమీ లేదు

రాక్షస స్త్రీల భీకరకఠినోక్తుల చేత కలత చెందిన సీతాదేవి భయకంపిత గద్గద స్వరంతో " నేను మానవ స్త్రీని రాక్షసుడికి భార్య కానేరను. కావాలంటే నన్ను చంపి తినేయ్యండి "అని కఠినంగా చెప్పింది. కన్నీరు మున్నీరుగా కారుస్తుంటే ఒళ్ళంతా తడిసిపోయింది. వణికే ఆమె పొడవైన పెడల్పైన జడ కదిలి పాకిపోయే పాములాగా కనిపించింది. "హా రామా హా లక్ష్మణా అత్తగారూ కౌసల్యా సుమిత్రా "అని రోదించింది. ఎవరికైనా అకాల మృత్యువు దుర్లభం ఇన్ని బాధలుపడుతున్నా నాప్రాణం పోవటం లేదు. ఏదైనా కొద్దిపుణ్యం చేసుకొని ఉంటె నేను సముద్రమధ్యం లో సరుకు తో నిండిన ఓడ పెద్దగాలికి ఊగినట్లు ఊగిపోయి అనాధగా చనిపోతాను. నా రామ దర్శనం ధన్యులైనవారికే దక్కుతుంది. పూర్వ జన్మలో నే జేసిన పాపానికి ఫలం ఇక్కడ అనుభవిస్తున్నాను. భర్త అనుమతిలేకుండా ప్రాణాలు ఎలా విడవగలను అనుకొన్నది.

ఇందులో "హా రామేతిచ దుఖార్తా హా పునర్లలక్ష్మణేతి చ –హా శ్వశ్రు మమ కౌసల్యా హా సుమిత్రేతి భామినీ "

శ్లోకం లోక ప్రసిద్ధం. తానూ రామభార్యనే కాని అన్యులకు కాదు అని తెగేసి చెప్పింది అన్ని బాధలు అనుభవిస్తున్నా,. వాళ్ళు తనని చంపెసితినేస్తారని తెలిసినా.అదీ సీతా సాధ్వి మనో నిబ్బరం అంటే. ఉడత ఊపులకు జడిసేదికాదు, నిశ్చయ మనో రధం ఆమెది.

ఇది 20 శ్లోకాల 25వ సర్గ.

"నాకు తెలియకుండా రావణుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. రాక్షసస్త్రీలు పెట్టె హింసలు భరించలేక పోతున్నాను. ఇక్కడి ఈ లంకా వైభవంతో



నాకేం పని ?నాగుండె రాయి అయిపోయిందా లేక జరామరణాలు లేనిదా అర్ధం కావటం లేదు. ఎంతత ఏడ్చినా బద్దలు అవటం లేదు. రామవిరహం సహిస్తూ బతకటం నాకు నింద అవుతుంది. నా ప్రభువు, పతి రాముడు లేని నాకు ఈ జీవితం ఎందుకు. రాక్షసుల్లారా నన్ను చీల్చండి చంపండి తినేయ్యండి. ఎలాగైనా ప్రాణాలు వదలాల్సిందే. ఈ దుఖం ఇక భరించలేను. రావణ రాక్షసుడిని ఎడమకాలితోనైనా తాకను. అలాంటి నేను వాడిని కామిస్తానా ?నన్ను ముక్కలు చేసినా, అగ్నిలో పడేసికాల్చినా రావణుడిని మాటవినను. నా రాముడు కైకేయి లాంటి దోషవతులలోనూ మంచినే చూసే ప్రాజ్ఞుడు. "ఖ్యాతః ప్రాజ్ఞః కృతజ్ఞశ్చసాను క్రోశశ్చ రాఘవః – సద్వృత్తో నిరనుక్రోశ శ్శంకేమద్భాగ్య సంక్షయాత్ " అపకారం చేసినవాడికైనా ఉపకారమే చేస్తాడు,తనకు చిన్న

ఉపకారం చేసినవారికైనా వారి దుఃఖ సమయంలో గొప్పగా అదుకొనెడుదారుడు.అలాంటి దయామయుడు నాపై దయ ఎందుకు చూపటం లేదో అర్ధం కావటం లేదు. నాకు అదృష్టం తగ్గిందేమో. నన్ను రావణుడు ఇక్కడికి తెచ్చాడని రాముడికి తెలిసి ఉండదు. తెలిసి ఉంటె ఈపాటికి వచ్చేసేవాడు. నా సంగతి తెలిసిన జటాయువునుకూడా రావణుడు యుద్ధంలో చంపాడు. లంకారాజ్య మార్గాలలో రామలక్ష్మణులు ఇక్కడికి వచ్చి కాల్చిన రాక్షసుల చితులనుంచి పైకి ఎగసిన పొగ క్రమ్మి గ్రద్దలు తిరుగుతూ లంక త్వరలోనే శ్మశానం అవుతుంది. త్వరలో నా కోరిక నెరవేరుతుంది ఇక్కడ కనిపించే అశుభాలు ఆవిషయాన్ని సూచిస్తున్నాయి



పాప రావణుడు చస్తే మహా తేజస్సున్న లంక తేజో విహీనమై సంపదలన్నీ నశించి పతి చనిపోయిన పడతి లాగా ఉంటుంది. ఇంటింటా రాక్షస స్త్రీల రోదనం భరింప రానిదౌతుంది. నేను ఇక్కడ ఉన్నానని రాముడికి తెలిస్తే రామబాణం లంకను భస్మం చేస్తుంది. వాడు ఇచ్చిన 2నెలలగడువే ఉన్నదిమిగిలి. ఎవరైనా విషమిచ్చి పుణ్యం కట్టుకొంటే బాగుండును. నా విషయం తెలీక సోదరులు కాయ దుంపలు తింటూముని వృత్తిలో ఉంటూ ఆయుధాలు వదిలేశారా. ?ప్రియమైన దాని వలన ప్రియమే కలుగుతుంది అప్రియమైనదానివలన సుఖం కలుగక దుఖమే కలుగుతుంది. ప్రియాప్రియ ద్వంద్వాలకు అతీతుడైన మహాత్ముడగు రాముడికి నమస్కారం. నేను రామునికి ప్రియపరురాలను. రాముడిని వదిలి జీవించలేను. ప్రాణాలు వదిలేస్తా "అని దుఖపడింది. -"ప్రియా న్న సంభవే ద్దుఖ మప్రియాదధికం భయం –తాభ్యాం హి యేవియుజ్యస్తే నమస్తేషాం మహాత్మనాం'

సాహం త్యక్తా ప్రియార్హేణ రామేనా విదితాత్మనా –ప్రాణాం స్త్యక్ష్యామి పాపస్య రావణస్య గతావశం ""

ఇది 51శ్లోకాల 26వ సర్గ.

ముందుగా రాముడు వస్తాడని, రావాలని కోరుకున్న సీతకు సెకండ్ థాట్స్ వచ్చి, అసలు తాను ఎక్కడ ఉన్నానో ఆయనకు తెలిసిందో లేదో అనుకోని తనవిషయం చెప్పటానికి మిగిలిన ఒకే ఒకడు జటాయువు కూడా తనకోసం రావణుడితో తీవ్ర యద్ధం చేసి చనిపోయాడు కనుక రాముడికి తన విషయం చెప్పటానికి ఎవరూ మిగల్లేదు అని అర్ధం చేసుకొన్నది. ఆయనకు తానిక్కడ ఉన్న విషయం తెలిస్తే ఆఘమేఘాల మీద రాకుండా ఉంటాడా అని ఊరట పొందింది. వస్తే ఏం జరుగుతుందో ముందే చెప్పింది సర్వరాక్షస హననం లంకాదహనం, ఆడవారికి దుఖంబాగావస్తే అది కలిగించిన ఎదుటి వారిని తిట్టటం, శాపనార్ధాలు పెట్టటం సహజం. ఎంతైనా సీత స్త్రీయే కదా.ఆలక్షణం ఎక్కడికి పోతుంది ?రాక్షస్త్రీల మాంగల్యాలు మాడిభస్మం అవ్వాలనుకున్నది. లంక బూడిదకావాలని కోరింది. భార్తలను కోల్పోయిన రాక్షస స్త్రీల రోదన లంక అంతా ప్రతిధ్వనించాలని తనకు జరిగిన అవమానానికి ఇదే ప్రతీకారమనీ భావించింది. ఇది అతి సహజం. అయితే అంతకు ముందు రామునిఉదార హృదయం చెప్పింది. తప్పు చేశానని రావణుడు ఒప్పుకొంటె ఆయన దయామయుడు కనుక అన్నీ మర్చిపోయి క్షమించి లంకను కాపాడుతాడు అని చెప్పింది అన్న సంగతి మనం మరువరాదు మహాశయులారా.

సీత మరణించ బోతోందని కొందరు రాక్షస స్త్రీలు రావణుడుకి చెప్పటానికి కంగారుగా పరిగెత్తారు.కొందరు సీతను చేరి స్వరాలు పెంచి ఇంకా భయపెట్టారు. ఇవన్నీ చూస్తూ సహించలేక త్రిజట వాళ్ళతో "జనకసుత, దాశరధ మహారాజు కోడలు, సకలజనులకు ఆదరాణీయ సీతా దేవి కి బదులు ఆకలిగా ఉంటె నన్ను తినండి. ఇవాళ నేను భయంకరం గగుర్పాటు కలిగించే కలగన్నాను. ఆ కలలో రాక్షస వినాశం, రామాభ్యుదయం సూచితమైంది "అనగానే భయంతో కావలి రాక్షస స్త్రీలు ఆ కల వివరాలు చెప్పమని కోరారు. తనకు ప్రాతః కాలం లో వచ్చిన ఆ కల వృత్తాంతం ఇలా చెప్పింది –"లక్ష్మణ సమేతంగా రాముడు తెల్లని వస్త్రాలు తెల్లని మాలలు ధరించి వేయి హంసల పల్లకీలో ఆకాశం లో విహరించాడు. సీతకూడా తెల్లని వస్త్రాలతో, తెల్లనికొండ ఎక్కి సూర్యుడు కాంతి ని చేరినట్లు రాముని చేరింది. సోదరులతో కలిసి నాలుగు దంతాల కొండలాంటి

వెల్ల ఏనుగు నెక్కి రాముని తొడపై నున్చిలేచి సూర్య చంద్రుల్ని చేతులతో పట్టుకొన్నది. ఆ ఏనుగు తర్వాత లంకానగరం పై నిల్చింది ఎనిమిది తెల్ల వృషభాలు పూన్చిన రథం ఎక్కి సీత లక్ష్మణులతో ఇక్కడికి వచ్చాడు. తర్వాత అందరూ కలిసి పుష్పకదుజయింప శక్యం కాని వాడు.

"ఇకమన ఏలిక రావణుడు శరీరమంతా నూనె పూసుకొని యెర్రని బట్టలు గన్నేరు పూల దండలు ధరించి మద్యం తో ఊగిపోతూ మత్తెక్కి నేలపై పడి ఉండటం చూశాను. భయంతో దిక్కూ మొక్కూ తెలీక గాడిదపై తలక్రిందులుగా ఉండి నేలపై గభాల్న పడ్డాడు. వెంటనే లేచి చీకటి భయంకరం దుర్వాసన ఉన్న మలం గుంటలో మునిగిపోయాడు. ఎర్రని వస్త్రాల నల్లది బూడిద పూసుకొని, రావణుడి మెడకు త్రాడుకట్టి దక్షిణ దిశకు లాగటం కనపడింది. కుంభకర్ణుడు రావణ కుమారులూ ఇలాగే కనిపించారు. రావణుడు పంది,ఇంద్రజిత్ మొసలి, కుంభకర్ణుడు ఒంటెఎక్కి దక్షిణ దిక్కుకు వెడుతూ కనిపించారు. విభీషణుడు మాత్రం తెల్లగొడుగు తెల్లవాస్త్రాలు తెల్లమాలలు తెల్ల చందనం తో శంఖ భేరీ శుభ నాదాల నడుమ నాలుగు దంతాల దివ్య గజం ఎక్కి నలుగురు మంత్రులతో ఆకాశం లో కనిపించాడు. గుర్రాలు రథాలు ఏనుగులతో సుందరమైన లంకానగర గోపురాలు బయటిద్వారం విరిగి సముద్రంలో పడగా చూశాను. రాముని దూత ఒకకోతి లంకను కాల్చటం కూడా చూశాను. ప్రవేశించటానికి వీల్లేకుండా పోయిన అలాంటి లంక రాక్షస స్త్రీలు ప్రవేశించి నూనెతాగి పెద్ద ధ్వనితో అట్టహాసం చేస్తూ నాట్యాలు చేశారు. కుంభ కర్ణాదులు యెర్ర బట్టలతో ఆవుపేడ గోతిలో పడ్డారు. కనుక లంకకు చేటు కాలం దాపురించినదని అర్ధమౌతోంది. మీరంతా ఇక్కడి నుంచి వెళ్లి పొండి. రాముడు వస్తాడు సీతను కలుస్తాడు తప్పదు. మీరిక్కడ ఉంటె రాముడు చంపేస్తాడు.

'సీతను భయపెడితే రాముడు సహించడు.ఆమెతో శాంతంగా తియ్యగా మాట్లాడండి. అందరం సీతా దేవిని అభయం కోరదాం. మీరేమీ చెయ్యక్కర్లేదు ఆమెకు నమస్కరిస్తే చాలు మనతప్పులన్నీ మన్నిస్తుంది. ఆమె శరీరం లో వైకల్యం, దుఖం కలిగించే లక్షణం కాని లేదు. రాక్షరాజ నాశనం, శ్రీరామ విజయం త్వరలోనే జరుగుతాయని నాకు అనిపిస్తోంది. సీత ఎడమకన్ను అదురుతోంది కనుక ఆమె కు శుభ సూచకం. ఆమె ఎడమ భుజం,ఎడమ తొడ పులకిస్తోంది కనుక రామాగమనం సూచిస్తోంది. కొమ్మలలోని పింగళపక్షి చాలా సంతోషంతో మాటిమాటికీ మధురంగా కూస్తూ సీతకు మిక్కిలి ప్రియుడైన బంధువుశ్రీ రాముడు వస్తున్నట్లు తెలుపుతోంది "అని త్రిజట తన స్వప్న వృత్తాంతాన్ని సవిస్తరంగా కావలి రాక్షసులకు తెలియ జేసింది –

పక్షీచ శాఖానిలయం ప్రవిష్టః-పునః పున శ్చోత్తమ సాంత్వ వాదీ-సుస్వాగతాం వాచ ముదీర యానః –పునః పునశ్చోదయతీవ హృష్టః"

50శ్లోకాల 27వ సర్గ ఇది



రామాయణం ధ్వని కావ్యం. కనుక ఉత్తమమైనది. తతో రావణ నీతాయా శ్లోకం లో లంక అంటే శరీరం. రాక్షస స్త్రీలు ఇంద్రియాలు. రావణ, కుంభ కర్ణుడు.అహంకార మమకారాలు. ఇంద్రజిత్ మొదలైనవారు కామక్రోధాదులు. లంకలో బంధింప బడిన సీతవంటి వాడు జీవుడు లేక చేతసుడు. ఆ చేతనానికి జ్ఞానం ఉపదేశించే ఆచార్యుని వంటివాడు మారుతి "అని వైష్ణవ స్వాముల చింతన సారం.

ఈ సర్గలో రామునికి ఒనగూడే మేలు రావణుడికి కలిగే చేటు త్రిజట స్వప్నం ద్వారా సూచింపబడింది. సీతపై ఆరాధనా భావం కలగటానికి కారణమైంది. ఆమె ప్రసన్నురాలైతేనే తమమనుగడ అనే విషయం రాక్షస స్త్రిలకూ తెలిసింది. మాడి మసి అయ్యే లంకపై ఇక ఆదరభావం అనవసరం అనేఅభిప్రాయం త్రిజట కలిగించింది. దాదాపు ప్రపంచ పురాణాలన్నిట్లో స్వప్నాలు వాటి ఫలితాలకు ప్రాముఖ్యత ఎక్కువ. అలాగే శుభ శకునాలూనూ. ఇవి కలత చెందినా మనసుకు ఒకింత ఊరట ఉపశమనం కలిగించి మనో ధైర్యం పెచుతాయి. అలాగే వాల్మీకి మహర్షి కూడా ఇక్కడ పొందు పరచాడు. మనకు కాకి అరిస్తే బంధువుల రాక ఖాయం అని నమ్మకం. లంకలో పింగళ పక్షికి ఆస్థానం ఉందని భావిద్దాం.

"రాక్షసులు నన్ను ఇలా  బాధ పెడుతున్నా పాపం చేశానేమో బతుకు తున్నాను. నేను ఆత్మహత్య చేసుకొంటే దోషం ఏమీ లేదు. రావణుడి చేతిలో చావు ఎలాగైనా తప్పదు.దానికంటే ఆత్మహత్య మేలే కదా. వాడు ఇచ్చిన రెండు నెలల గడువు లోపు రాముడు ఇక్కడికి రాకపోతే ఈ అయోగ్యుడు కడుపు లోనుంచి బయటికి రాని శిశువును శస్త్ర చికిత్సతో మృత శిశువును తీయటానికి దాన్ని ముక్కలు ముక్కలుగా చేసినట్లు, వాడి అయిన ఆయుధాలతో రాక్షసరాజు నా అవయవాలు ముక్కలు ముక్కలు చేస్తాడు. రామా, లక్ష్మణా అత్తా కౌసల్యా సుమిత్రా సముద్రంలోసుడిగాలికిచిక్కిన ఓడలాగా దుఖాలు అనుభవిస్తున్నాను. రామ సోదరులు నాకారణంగా లేడి రూపంలో ఉన్న దుష్ట ప్రాణి చేత చంపబడ్డారేమో. యముడే అప్పుడు లేడి గా  వచ్చి  నన్ను ప్రలోభపెట్టగా సోదరులను పంపాను. రామా నన్ను రాక్షసులు చంపుతారని నీకు తెలీదు కదా. రాక్షసుల తీవ్రమైన మాటలు, భూశయనం,, నువ్వే రక్షకుడవని నమ్మి నియమాలతో జీవించటం అనే ఈ వ్రతం అంతాకృతఘ్నులకు చేసిన ఉపకారం లా వ్యర్ధమయిందా.నా ధర్మాచరణ, ఏకపత్నీ వ్రతం నిష్ప్రయోజనం నిరర్ధకం అయ్యాయి. వనవాస కాలం తీరి అయోధ్యలో వలచినస్త్రీలను పెళ్ళాడి నువ్వు సుఖిస్తావు. కాని నేనిక్కడ ఏ ఫలితమూ దక్కక ఉపవాసాలతో క్రుంగి కృశించి చనిపోతా. లేకపోతె విషం తాగి వాడి ఆయుధం ఉపయోగించి ఆత్మహత్య చేసుకొంటా. నాకు విషంకాని ఆయుధం కాని ఇచ్చే వారే లేరిక్కడ "అనుకొంటూ శింశుప చేరి తనపొడవైన జడతో ఉరి పోసుకోవటానికి సిద్ధపడింది సీతాదేవి. కొమ్మను గట్టిగా పట్టుకొని "ఈ కొమ్మ"సీతమ్మ  తన వంశాన్ని స్మరిస్తూ ఆత్మహత్యా ప్రయత్నం లో ఉండగా శుభ సూచనలు, శుభ శకునాలు కనిపించాయి.

"ఉపస్తితా సా మృదు సర్వ గాత్రీ –శాఖాం గృహీత్వా థ నగస్య తస్య –తస్యాస్తూ రామం ప్రవిచింత యంత్యా –రామానుజం స్వం చ కులం శుభాం గ్యాః"

"శోకా  నిమిత్తాని తథా బహూని –ధైర్యార్దితాని  ప్రవరాణి లోకే –ప్రాదుర్నిమిత్తాని తదాబభూవుః-పురాపి సిద్ధా న్యుపలక్షితాని"

ఇది 20 శ్లోకాల 28వ సర్గ. అన్ని ప్రయత్నాలూ, అన్ని ఆశలూ విఫలమైతే చివరికి ఆత్మహత్యకు పూనుకోవటం లోక రివాజు. అవతలివారికి ఎన్నో చెప్పగలరు కాని తమ దగ్గరకు వచ్చేసరికి అవి అన్నీ మర్చిపోయి ఇదే రకంగా ప్రవర్తిస్తారు మానవులు. సీతకూడా మానవ మాత్ర స్త్రీయే. కనుక చివరగా ఆప్రయత్నం చేసింది. తన ఆత్మహత్యను తన కారణాలతో సమర్దించు కొన్నదికూడా. ఇదే లోక సహజ విషయమే. అలా సమర్ధించుకొని ఆత్మను సంతృప్తి పరచుకోలేకపోతే, ఆప్రయత్నం చేసే ధైర్యం రాదు కదా. ఇది వరకే చెప్పుకు న్నట్లు క్లైమాక్స్ లో సుభ శకునాలు శుభ సూచనలు కనిపించి ఆ ప్రయత్నానికి బ్రేక్ పడుతుంది అలాగే   ఇప్పుడు సీత విషయం లోనూ జరిగింది. మానవ మనసులోని ఆంతర్యాలను, ముఖ్యంగా స్త్రీ హృదయపులోపలి పొరల్ని  మహా కవులు చక్కగా ఆవిష్కరిస్తారు. వాల్మీకి మహర్షి కవీ, క్రాంత దర్శి కనుక ఇలా ముగించాడు.

తెల్లని వస్త్రాలు మెరుపుల సమూహం లాంటి పింగళ వర్ణం కల ఆ హనుమను చూసి మొదట భయపడిన సీత, చాలా వినయంగా ప్రియవచనాలు పలుకుతూ అశోక పుష్ప కాంతి కలవాడై మేలిమి బంగారంలా  ప్రకాశించె కళ్ళతో ఉన్న హనుమను దర్శించింది, అతడి భయంకర వానర రూపం చూసి భయపడి, చూడరానిదేదో చూశానే అనుకొన్నది. తెప్పరిల్లి రామ లక్ష్మణస్మరణ చేసి నెమ్మదిగా ఏడ్చింది. తానూ చూసింది కల అని భావించింది. మళ్ళీ మరోసారి కపి వరాఖ్యుని తేరి పారచూసి, తెలివి తప్పినట్లు పడిపోయింది. మళ్ళీ తెప్పరిల్లి కోతి కలలో కనిపిస్తే  అనిష్టం అంటారుపెద్దలు. తనవలన రామ సోదరులకు,తనతండ్రి కి  ఆపత్తు ఏమీ రాలేదు కదా అనుకోని, శుభం కలగాలని కోరుకొన్నది. అంటే ఆపత్తు తనకొచ్చినా పరవాలేదు తనవారికి రాకూడదు అన్నదొడ్డ  భావం సీతామాతది.

అసలు తనకు కల రావటం ఏమిటి ?నిద్ర పోయే వారికే కదా కలలు వచ్చేది. రామవిరహంతో తానెప్పుడూ నిద్రే పోలేదు కదా. తనకు  కల రావటం అసంభవం  తనరాముడినే ప్రతిక్షణం తలచుకొంటూ, మనో నేత్రాలతో చూస్తూ తానె రాముడిని తలుస్తూ ఉంటె, ఆయననే స్మరిస్తున్నాను కదా అనుకొన్నది. -స్వప్నోహి నాయం నహి మే స్తి నిద్రా –శోకేన దుఖేన చ పీడితాయాః-సుఖం హాయ్ మే నాస్తి యతోస్మి హీనా –తేనేందు పూర్ణ ప్రతిమాననేన "

ఈ రామనామం పలికేది తన అభిలాష మాత్రమె అను కొన్నది. మళ్ళీ ఆలోచించి అదీ కాదు అనుకోని తనమనసుకు రూపం లేదుకదా అని భావించి, పైన చెట్టు ఆకులమధ్య కూర్చున్న వానరం తనకి స్పష్టంగా కనిపిస్తోంది, అతనిమాటలు వినిపిస్తున్నాయి కదా అని ఊరడిల్లింది

"రామేతి రామేతి సదివ బుద్ధ్యా –విచింత్య వాచాబ్రువతీ తమేవ –తస్యాను రూపాం చ కథా తమర్ధ –మేవం ప్రపశ్యామి తథా శృనోతి"

"అహం హితస్యాద్య మనోభవేన –సంపీడితా తద్గత సర్వభావా –విచింతయంతీ సతతం తమేవ –తథైవ పశ్యామితథా శృణోమి"

"మనో రథః స్యాదితిచింతయామి –తథాపి బుధ్యా చ వితర్కయామి –కిం కారణం తస్య హి నాస్తి రూపం –సువ్యక్త రూపశ్చ వదత్యయం మాం"

, ఇక చేయాల్సింది అంతా దేవతలకే అప్పచెప్పాలి. తాను నిమిత్తమాత్రురాలను అనే ఎరుక కలిగి బ్రహ్మ దేవేంద్ర అగ్ని దేవతలకు నమస్కరించి ఆ వానరుడు పలికింది అంతా యదార్ధమవుగాక, కల కాకుండు గాక అని గాఢంగా మనసులో భావించింది సీతాదేవి. -"నమోస్తు వాచాస్పతయే స వజ్రిణే-స్వయంభువే చైవ హుతాశనాయచ –అనేన చోక్తం యదిదం మమాగ్రతో –వనౌకసా తచ్చ తథాస్తు నాన్యథా"

ఇది 14శ్లోకాల 32వ సర్గ.

ఇందులో తనకు కలలు రాకపోవటానికి చక్కని కారణాలు పేర్కొనటం విశేషం. "ఈ రామ "మనసంతా "ఆరామ "మయమే ఐతే, ఆయనుస్మరించని క్షణమే లేకపోతె ఆమె ఉచ్చ్వాస నిస్వాసాలలో రామ శబ్దమే వినిపిస్తుంటే ఇక రాముడు బయట ఎక్కడున్నాడు ?మనసులో స్థిరంగా కొలువై ఉన్నాడు. కానీ మనసులోని తనరామ రూపం భావించటానికే ఉపయుక్తం. అసలురాముడు భౌతికంగా ఇక్కడికి రావాలి ఆమె దుఖానికి ఉపశమనం కల్గించి రావణ దర్ప వినాశనం చేయాలి అప్పుడే తనకూ లోకానికి శాంతి

ఎర్రని పగడపుకాంతి ముఖం తో మహా తేజశ్శాలి వాయునందన హనుమాన్ వినయంతో ప్రణమిల్లి శిరస్సుతో అంజలి ఘటించి మధురాతి మధురవాక్కులతో "అనింద్య సౌశీల్యవతీ ఈ చెట్టుకొమ్మను పట్టుకొని ప్రేలాడే నువ్వెవరు తల్లీ. నీ కంటినుండి ఆ సతత బాష్పదారఎందుకు. దేవ యక్షకిన్నెర కిపురు షులలావులలో ఏ జాతి స్త్రీ రత్నానివి నువ్వు ?నాకుమాత్రం దేవతలాగా కన్పిస్తున్నావు. దివినుండిజారిన వసిష్ట మహర్షి ధర్మపత్ని అరుంధతివా ?ఎవరి గురించి నీ శోకం ?నీలో రాజలక్షణాలు కన్పిస్తున్నాయి. నీ సాముద్రిక లక్షణాలను బట్టి ఎవరో గొప్పమహారాజు పట్ట మహిషివి అనిపిస్తోంది. ఒకవేళ జనస్థానం నుంచి రావణుడు అపహరించి తెచ్చిన సీతమ తల్లివా?. అలా ఐతే చెప్పు నీకు శుభం కలుగుగాక. నీ దైన్యం మానవాకారం తాపస వేషం చూస్తె శ్రీరామ ధర్మపత్ని సీత నువ్వే అనిపిస్తోంది "అన్నాడు హనుమ.

హనుమపలుకులకు ఆమె మనసు ఊరట చెంది పైకి చూస్తూ "రాజ శ్రేష్టుడు ఆత్మ విదుడు దశరధ మహారాజు కోడలిని నేను. విదేహరాజు జనకుని కుమార్తె జానకిని సీతను. ధీమంతుడైన రాముని భార్యను. అత్తవారింట్లో పన్నెండేళ్ళు సర్వ సుఖాలు అనుభవించి, 13ఏట మామగారు శ్రీరామపట్టాభి షేకం చేసే ఏర్పాటు చేస్తే, ఆయనభార్యకైకేయి ఆయనతో "రాముడికి పట్టాభి షేకం చేస్తే ఇక రోజునుంచి నేను భోజనం నీరు త్రాగటం మానేసి ఉపవసాలతో ప్రాణాలు వదుల్తాను. నాకిచ్చిన వరదానం ప్రకారం రాముడిని అడవికి పంపు "అనగానే ఊహించని దశరధుడు తట్టుకోలేక మూర్చ పోయాడు. తెప్పరిల్లి రాముని పిలిపించి "నీకిస్తానన్న రాజ్యం మళ్ళీ నాకు ఇచ్చెయ్యి "అని కోరాడు –

"తటస్త స్థవిరో రాజా సత్యే ధర్మే వ్యవస్థితః –జ్యేష్టం యశస్వినం పుత్రం రుదన్ రాజ్య మయా చత"

రాముడు రాజ్యం కంటే తండ్రిమాటకే విలువ ఇచ్చి అమూల్య ఆభరణ వస్త్రాదులు విసర్జించి, మనస్పూర్తిగా రాజ్యత్యాగం చేసి, నన్ను అత్తగారు కౌసల్యవద్ద ఉండమని చెప్పాడు. నేనూరుకోంటానా ఆయనకన్నా ముందే అడవికి బయల్దేరాను. ఆయన లేనిది స్వర్గం కూడా నాకు రుచించదు–

"సాహం తస్యాగ్రత స్తూర్ణంప్రస్థితా వానచారిణీ"నహి మే తేన హీనాయా వాసః స్వర్గే పై రోచతే "

ఇంతలో ఈ విషయం తెలిసి రామానుజుడు లక్ష్మణుడు నార బట్టలు కట్టుకొని అన్నతో వెళ్ళటానికి సిద్ధమయ్యాడు. ఇలామేముముగ్గురం ఇది వరకు ఎప్పుడూ చూడని ఘోరారణ్యం లోకి ప్రవేశించాం. మేము దండకారణ్యం లో ఉండగా దుర్మార్గరాక్షసప్రభువు రావణుడు నన్ను అపహరించాడు. వాడు నా ప్రాణం తీయటానికి ఇంకా రెండు నెలలు మాత్రమె గడువు పెట్టాడు. ఆ రెండు నెలలు అయిన మరుక్షణం నేను తప్పక ప్రాణాలు విడుస్తాను "అని చెప్పింది.

ఇది 31 శ్లోకాల 33వ సర్గ.

హనుమ సీతకు యెంత టూకీగాజరిగిన రామ చరిత్ర చెప్పాడో అంతే టూకీ గా సీత హనుమకు అప్పటివరకు జరిగిన తన కథ చెప్పింది. రెండు నెలలో ఏదో మార్పు రాకపోతే తనప్రాణాలు నిలవవు అని గట్టిగానే చెప్పింది. సూక్ష్మ గ్రాహులు సీతా, హనుమలు. ఒకరు చెప్పింది ఇంకొకరు స్పష్టంగా అర్ధం చేసుకో గలరు. ఇక కాగలకార్యం ఫలవంతంగా తీర్చాలి ఎవరు యెట్లా అనేది సస్పెన్స్.

దురపిల్లుతున్న సీతను ఓదార్చే ప్రయత్నం లో హనుమ ఆమెతో "అమ్మా !రాముడి సందేశం తెచ్చాను. ఆయన క్షేమం. మీ కుశలం అడిగాడు. మరిది లక్ష్మణస్వామి నీకు నమస్కారాలు చెప్పాడు "అనగానే శరీరం పులకించి హనుమతో "మనుషుడు బతికి ఉంటె నూరేళ్ళకైనా ఆనందం కలుగుతుంది అని చెప్పిన పెద్దలమాట యదార్ధం-

"కళ్యాణీ బట గాథేయం లౌకికీ ప్రతిభాతిమా-యేతి జీవంత మానందోనరం వర్ష శతాదపి "

ఇది వాల్మీకి కోటబుల్ కోట్స్ లో మరొకటి.

చెట్టు దిగి నెమ్మదిగా అమ్మ దగ్గరకు చేరగా ఇంకా అనుమానం తీరక రావణుడే అనుకొని "నేను ఇతనితో మాట్లాడటం అనుచితం అనిపిస్తోంది వానర రూపం దాల్చిన రాక్షస రాజు కాదుకదా "అనుకోని, చెట్టుకొమ్మను వదిలేసి నేలపైనే కూర్చోగా హనుమ మళ్ళీ నమస్కరించగా, దీర్ఘ నిట్టూర్పులతో "మారు వేషం లో వచ్చిన రావణుడివా. మళ్ళీ నన్ను దుఃఖ పెడితే బాగుండదు. జనస్థానం లో సన్యాసిగా కామరూపం తో వచ్చావు. ఉపవాసాలతో చిక్కి శల్యమై దీనంగా బాధపడుతున్న నన్ను మరింత బాధించటం న్యాయం కాదు. ఒక వేళ నేను అనుకొన్నాది నిజం కాకపొతే, నీ మాటలతో నా మనసు సంతోషం పొందింది. రామదూతవన్నమాట నిజమైతే నీకు శుభమస్తు. నాకు రామకథవినటం మహా దానందం. రామ కథ మళ్ళీ వినిపించు. నీమాటలు నా హృదయానికి ఆనందం కలిగించాయి. స్వప్నం యెంత మధురం. చాలాకాలం కిందటే ఇక్కడికి తీసుకు రాబడిన నేను ఇవాళ కలలో రాముడు పంపిన దూతను చూశాను, కలలో రామ లక్ష్మణులను చూసి ఉంటె ఈదుఖం ఉండేదికాదు. స్వప్నం కూడా నాపై శరించింది. కలలో కోతి ఆనందం కలిగించదు.మరి నాకు సంతోషం కలుగు తోందే. కనుక కలకాదు వాస్తవమే చూస్తున్నాను. చిత్తభ్రమకాని వాత ప్రకోపంకాని నాకు కలిగాయా ?లేక ఎండమావి యా?.ఇది ఉన్మాదం కాదు, మోహమూ కాదు కారణం నన్ను నేను గుర్తిస్తున్నాను, వానరాన్నీ గుర్తిస్తున్నాను "అనుకొని వానరుడు రావణుడే అని మళ్ళీ భావించి ఇక అతనితో మాట్లాడటం మానేసింది.



ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే గండరగండ హనుమ ఆమె మనసులోని సంశయం అర్ధం చేసుకొని. సుమధుర వాక్కులతో "అమ్మా !రాముడు సూర్య తేజస్సున్నవాడు చంద్రునిలా ప్రజకు ఆహ్లాదం కలిగిస్తాడు. కుబేరునిలా సకల లోకాదీశ్వరుడు. విష్ణు పరాక్రమ శాలి. సత్య మధుర భాషణలో దేవగురువు బృహస్పతి. -"ఆదిత్య ఇవ తేజస్వీ లోకకాంత శ్శశీ యథా-రాజా సర్వస్య లోకస్య దేవో వైశ్రవణో యథా"

సౌందర్య రమణీయ, కాంతి మంతుడు. మన్మధుని మరో రూపు, నిగ్రహానుగ్రహ సమర్ధుడు.

"రూపవాన్ సుభగః శ్రీమాన్ కందర్ప ఇవ మూర్తిమాన్ –స్థాన క్రోధఃప్రహర్తా చ శ్రేష్ఠో లోకే మహారథః"

బంగారు లేడి రూపం చూపించి రాముని ఆశ్రమానికి దూరం చేసి, ఎవ్వరూ లేని సమయంలో నిన్ను అపహరించి తెచ్చిన రావణుడు దీని ఫలితంగా రాముని చేతిలో మరణిస్తాడు. అలాంటి తేజో శౌర్య పరాక్రమమూర్తి శ్రీరాముని దూతను నేను. నీ కుశలం అడగమన్నాడు రాముడు. తమ్ముడు నీకు ప్రణామాలు తెలియ జేశాడు. మా వానరరాజు సుగ్రీవుడు నీ క్షేమం అడిగాడు. వారు ముగ్గురు నిన్ను తలవని రోజు లేదు తల్లీ.-

"తద్వియోగేన దుఖార్త స్స త్వాంకౌశల మబ్రవీత్ –లక్ష్మణస్య మహా తేజా స్సుమిత్రానంద వర్ధనః –అభి వాద్య మహాబాహూ స్సత్వాంకౌశల మబ్రవీత్

"నిత్యం స్మరతి రామస్త్వాంససుగ్రీవ స్సలక్ష్మణః-దిష్ట్యాజీవసి వైదేహి రాక్షసీ వశ మాగతః

రాక్షసులమధ్య చిక్కి దీనంగా బతికి ఉన్నావు. కొద్దిరోజులలో ఆసోదరులు సుగ్రీవ సైన్యంతో ఇక్కడికి వస్తారు. నేను సుగ్రీవ మంత్రి హనుమ అనే కోతిని. నీ అన్వేషణలో ఈ మహా సముద్రం దాటి ఇక్కడికి వచ్చాను.



"అహం సుగ్రీవస్య సచివో హనుమాన్నామ వానరః –ప్రవిష్టో నగరీం లంకాంలంఘయిత్వా మహోదధిం "

నా పరాక్రమం తో రావణుడి తలపై పాదం పెట్టి వచ్చినట్లు,లంక దేవతను ప్రసన్నం చేసుకొని లంక ప్రవేశించాను. నేను ముమ్మాటికీ వానరుడనే రావణాసురుడను కాను. నీ అనుమానం వదిలి నామాట విశ్వ సించు సీతమ్మ తల్లీ "అన్నాడు. -"

"కృత్వా మూర్ధ్ని పదన్యాసం రావణస్య దురాత్మనః –త్వాం ద్రష్టు ముపయాతో –హం సమాశ్రిత్య పరాక్రమం '

"నాహమస్మి తథా దేవి యథా మా మవాగచ్ఛసి –విశంకా త్యజ్యతా మేషాశ్రద్ధ త్స్వవదతో మమ

ఇది 39శోకాల 34వ సర్గ.

ఇందులో హనుమ రావణుడు ఏమో మాయా రూపం లో వచ్చాడేమో అనే సందేహం సీతకు కలగటం అత్యంత సహజం. పూర్వం సన్యాసిగా వచ్చి మోసం చేశాడు. లంకలో అందరూ కామరూప విద్యలో ఆరితేరిన వారే. కనుక నమ్మక పోవటం లో ఏమీ దోషం లేదు. ఒకటికి రెండు సార్లు ఎసర్టైన్ చేసుకోవాల్సిన అవసరం ఉన్నది. పూర్వం మాయ లేడి మోసం గ్రహించక రాముడిని తొందరపెట్టి పంపటం, రాముడికి ఏమీ కాదని మరిది చెబిత అతని మాటలలో దోషం ఆపాదించి వెంటనే పంపటం, చివరికి లక్ష్మణ రేఖ దాటటం, సీత చేసిన తొందర పాటు నిర్ణయాలే. వాటి ఫలితమే కొంప కొల్లెరై లంకావాసం గతి పట్టింది. ఇప్పుడు నిదానించాలి అని గ్రహించింది. వానరుని శంకించినా నెమ్మది మీద సత్యం గ్రహించి మరో తోదరపాటు చర్యకు పాలుపడకుండా సవ్యంగా ఆలోచించి అసలైన అడుగు వేసి ఫలితం పొందింది. ప్రమాదో ధీమతా మపి అని అన్నారు అందుకే. ఒకటికి రెండు సార్లు ఆలోచిస్తేనే ఆపదలో పడకుండా ఉండగలుగుతాం. లేక లేడికి లేచిందే పయనం అయితే లాంకావాసమే గతి అవుతుంది.

హనుమకూడా చెప్పిందే చెప్పి విసుగు కలిగించకుండా రామ కత బహు రక్తిగా చెప్పాడు ఆయన అవతార విశేషం చెప్పకనే చెప్పాడు. రాముడు వస్తాడు దుఖం తొలగించి రావణ వధ చేస్తాడు అనే సానుకూల వార్తా చెవినవేసి ఆమెకు తో శ్రీరామ కథామృత పానం చేయించాడు, మహర్షి ఆ అమృతం మనకూ అందించి ధన్యులను చేశాడు.

బహు సంతోషి ఐన సీతాదేవి హనుమతో వాత్సల్యంగా "నువ్వు రాముడిని ఎక్కడ కలిశావ్. కోతులైన మీకు నరులైన రామలక్ష్మణులతో స్నేహం ఎలా కుదిరింది. సోదరుల లక్షణాలేమిటో గుర్తులేమితో చెబితే నా దుఖం ఉపశమిస్తుంది అనగా హనుమ "రాముడి చిహ్నా లక్షణాలు లక్ష్మణు వీ సమానమే, రాముడు సర్వాంగ సుందర మూర్తి. కనులు తామర రేకులు. సకలజీవులకు మానసిక ఆనందం కలిగిస్తాడు. దాక్షిణ్యం ఆయన సహజ లక్షణం. సూర్య సదృశ తేజస్సున్నవాడు. సహనం లో భూమి కి సమానం. తెలివిలో బృహస్పతి, కీర్తికి దేవేంద్రుడు. ధర్మ రక్షకుడు. శత్రు పీడకుడు.సకల ప్రపంచాన్ని కాపాడే వాడు. ఐహికాముష్మిక భావ సంపన్నుడు. యజుర్వేదాసక్తి పరుడు. సర్వవేద వేదాంగవేది.విశాలమైన మూపు, పెద్ద బాహువులు, శంఖం వంటి మెడ,శుభకర ముఖం కనపడని మెడ క్రింది సంధి ఎముకలున్నవాడు. కొసలలో యెర్రని నేత్రాలున్నవాడు. భేరీ ధ్వనిలాంటి కంఠస్వరం. "నీల మేఘచ్చాయ బోలు దేహము" వాడు. సమంగా విభజింపబడిన అవయవ పొంకం ఉన్నవాడు. శ్యామల వర్ణుడు. సాముద్రిక శాస్త్రం లో చెప్పినట్లు వక్షస్థలం,మణికట్టు, పిడికిలి దార్ద్యం ఉన్నవాడు కేశాగ్రాలు, వృషణాలు మోకాళ్ళు మూడు సమానంగా ఉంటాయి. ఎత్తైన ఉదరం, నాభి చుట్టూ ఉన్న ప్రదేశం, రొమ్ము కలవాడు గోళ్ళు అరచేతులు కనుగొనలు ఎర్రగా ఉన్నవాడు. పాద రేఖలు, శిరోజాలు, లింగమణినున్నగా ఉన్నవాడు. స్వరం నడక నాభి గంభీరంగా ఉంటాయి.

ఉదరం పై మూడు మడతలు, పల్లంగా ఉన్న చూచుకం, స్తనాలు పాద రేఖలున్నవాడు. దీర్ఘం కాని లింగం బలుపు లేని పొత్తికడుపు, మూడు సుడులతో ఉన్నతల. బొటన వ్రేలి మొదట ఉన్న నాలుగు రేఖలు చతుర్వేద విదుడని తెలియ జేస్తాయి. నుదురు, పాదాలు, అరచేతులలో నాలుగు రేఖలున్నవాడు. 96అంగుళాల ఎత్తు,బాహువులు, మోకాళ్ళు, తొడలు, చెక్కిళ్ళు సమానంగా ఉన్నవాడు. సమానమైన 14 జతల అవయవాలున్నవాడు. కోర దంతాలు నాలుగు. సింహం, పులి, ఏనుగు వృషభం వంటి నడక ఉన్నవాడు. దొండపండు వంటి పెదవులు, బలమైన చెక్కిళ్ళు, పొడవైన ఎత్తైన ముక్కు కలవాడు. కేశ నేత్ర, దంత చర్మ పాద తలాలలో నిగనిగలున్నవాడు. పొడవైన వెన్నెముక, శరీరం, వ్రేళ్ళు, చేతులు ముక్కు కళ్ళు చెవులు ప్రజనం ఉన్నవాడు

"పద్మాకృతి ముఖం కళ్ళు, నోరు, నాలుక, పెదవులు, దౌడలు స్తనాలు గోళ్ళు చేతులు పాదాలు అనే పది అవయవాలు, రొమ్ము తల నుదురు మెడ భుజాలు మూపు, బొడ్డు, ప్రక్కలు వీపు స్వరం అనే పది విశాల అవయవాలవాడు. తేజస్సు, యశస్సు, సంపద, మూడు వ్యాపించిన వాడు. పరిశుద్ధ మాతా,పితృ వంశాలున్నవాడు. పూర్వాహ్ణ మధ్యాహ్న, అపరాహ్న కాలాలలో ధర్మార్ధ కామాలు ఆచరించే వాడు. సత్య ధర్మాలు ఆసక్తిగా ఆచరిస్తాడు. ఆర్జించిన ధనాన్ని యోగ్యులకు ఇచ్చేవాడు. దేశాకాలాలను ఎరిగి ప్రవర్తిస్తాడు. అందరికి ఆనందం కలిగిస్తాడు. రాముని తమ్ముడు లక్ష్మణుడు ఇద్దరు తల్లుల ముద్దు బిడ్డ. పరాజయం లేని వాడు. అనురాగ రూప గుణాలలో అన్నరామునికి సమానమైన వాడు. వీరిద్దరూ నిన్ను వెతుకుతూ మమ్మల్ని కలుసుకొన్నారు. కిష్కింధ వానర రాజు అన్న వాలివలన రాజ్యం కోల్పోయిన ప్రియ దర్శనుడైన సుగ్రీవుడు, ఋష్యమూక పర్వతం పై ఉండగా రామలక్ష్మణులు ఆయన్ను కలుసుకొన్నారు. రాజ్యభ్రష్టు డైన సుగ్రీవుని మేము సేవిస్తాము "అని

రామలక్ష్మణ సాముద్రిక లక్షణాలు ఏకరువు పెట్టి, రాజ్యం అన్నవలన కోల్పోయిన సుగ్రీవుని సోదరులు కలిసిన విషయమూ చెప్పేశాడు.



హనుమ చెబుతున్నాడు "రామ లక్ష్మణులు విల్లంబులతో ఋష్యమూక పర్వత సుందర ప్రదేశాలను చూస్తూ ఉండగా సుగ్రీవుడు భయపడి శిఖరం పైకి పోయి, నన్ను వారి దగ్గరకు పంపగా నేను వారిని చేరి నమస్కరించి సుగ్రీవుని పరిస్థితి తెలియజేయగా, వారు సంతోషించగా వారిద్దర్నీ బుజాలపై కూర్చో పెట్టుకొని సుగ్రీవుని చేరి, వీరి వృత్తాంతం ఆయనకు వివరంగా చెప్పగా, వారు పరస్పరం మాట్లాడుకొని స్నేహ హస్తం చాచుకొని ఒకరి విషయాలు ఒకరికి చెప్పుకొని గుండె బరువు తీర్చుకొనగా రాముడు సుగ్రీవుని ఓదార్చగా, రామానుజుడు మా రాజుకు రామ వృత్తాంతం చెప్పగా, సుగ్రీవుడు దుఖభాజనుడై, తమకుదొరికిన నేను ఏరి ఇచ్చిన నీ ఆభరణాలు వారిద్దరికీ చూపగా, చూసి రాముడు స్పృహ తప్పితెప్పరిల్లి ఒడిలో పెట్టుకొని ఏడ్చినేలపై పడి పోయాడు, లక్ష్మణుడి కూడా చూపించి మళ్ళీ సుగ్రీవుడికి ఇచ్చేశాడు. నీ వియోగ దుఖాన్ని మాన్పటానికి ఎవరి తరమూ కాలేదు. వాలిని సంహరిస్తానని రాముడు, నిన్ను వెదికిస్తానని సుగ్రీవుడు శపథం చేశారు. తర్వాత కిష్కింధకు వచ్చి వాలిని రాముడు చంపి, సుగ్రీవుని కి రాజ్యం అప్పగించాడు. నేను వారిద్దరూ పంపిన దూతను. అన్నమాటప్రకారం సమస్త వానర సైన్యాన్ని నాలుగు దిక్కులు వెతకమని సుగ్రీవుడు ఆజ్ఞాపించి పంపాడు. వాలి కొడుకు అంగదుడు, మూడవ వంతు సైన్యం తో మేము భూమిపై వెతుకుతూ వింధ్య పర్వతగుహ చేరి బయట పడే మార్గం తెలీక కొన్ని రోజులు ఉండిపోయాం. తర్వాత బయటపడి మళ్ళీ అన్వేషణ సాగించి నువ్వుకనపడకపోయే సరికి ప్రాయోప వేశం చేదామని అనుకోగా అంగదుడు బాగా బాధపడగా అందరం మరణమే శరణ్యం అనుకోగా మా పాలి దైవంలా జటాయువు అన్న సంపాతి మా బాధ చూసి అక్కడికి వచ్చి తన తమ్ముడి మరణ వార్త విని,ఎవరు రుచంపారని అడిగితే, రావణుడు అని చెప్పగా దుఃఖించి అరుణపుత్రుడైన సంపాతి నిన్ను రావణుడు లంకకు తీసుకొని వెళ్ళాడని చెప్పాడు. ఇక ఆలస్యం చేయకుండా మళ్ళీ బయల్దేరాం.

అందరం సముద్ర తీరం చేరి భయపడగా, వారి భయాన్ని పోగొట్టి నూరు యోజనాలు యెగిరి వచ్చి లంకలో ప్రవేశించాను. జరిగింది అంతా పూస గుచ్చినట్లు చెప్పాను. నేను నిజంగా రామదూత హనుమాన్ నే. రామ లక్ష్మణులు క్షేమం. అనుక్షణం రాముడు నిన్నే తలుస్తాడు.

సుగ్రీవాజ్ఞ తో నేనొక్కడినే ఇక్కడికి వచ్చాను. నా భాగ్య వశం తో నిన్ను చూడగలిగాను. రామసోదరులు సుగ్రీవ సైన్యంతో త్వరలో ఇక్కడికి వచ్చి రావణ సంహారం చేస్తారు –

"రాఘవశ్చ మహావీర్యః క్షిప్రం త్వా మభి పత్స్యతే-సమిత్ర బాంధవం హత్వా రావణం రాక్షసాధిపం.

.ఉత్తమపర్వతం మాల్యవంతం పై నా తండ్రి కేసరి అనే వానర శ్రేష్టుడు దేవతల ఆజ్ఞచేత గోకర్ణం వెళ్లి, అక్కడ శంబసాదుడు అనే రాక్షసుని చంపాడు. ఆ కేసరికి, అంజనాదేవికి వాయుదేవుని వరంతో జన్మించిన వాడను హనుమను, వాయు సుతుడను నేను-

"మాల్యవాన్నామ వైదేహీ గిరీ ణా ముత్తమో గిరిః-తతోభ్యగచ్ఛద్గోకర్ణం పర్వతం కేసరే హరిః

"హతే సురే శంయతి శంబ సాదనే –కపి ప్రవీరేణ మహర్షి చోదనాత్ –తతోస్మి వాయు ప్రభవో హాయ్ మైథిలి-ప్రభావత సత్ప్రతి మశ్చవానరః "

"అని సవిస్తరంగా చెప్పగా సీత శోకం పోయి రాహువు వదలిన చంద్రునిలా ప్రకాశించింది. హమ్మయ్య ఇప్పుడు సీతకు వానరుడు రావణుడు కాదు నిజమైన కపి వరుడే అనే నమ్మకం కలిగింది. "అమ్మా ! చెప్పాల్సింది అంతా చెప్పేశా ఇప్పుడు నేనేమి చేయాలో ఆనతివ్వు. నేను వాయు దేవునితో సమానమైన ప్రభావమున్న వాడిని. సందేహించకుమమ్మా జానకీ మాతా "అన్నాడు అత్యంత వినయంగా అనిల తనయుడు రామభక్త హనుమాన్.

ఇది 89శ్లోకాల 35వ సర్గ.

సీతకు మొత్తం సీను అంతా అర్ధమైంది. టెన్కోపులో చూపించినట్లు చెప్పాడు కదా. తానేమీ తక్కువ వాడిని కానూ అనీ చెప్పాడు. పంచభూతాలలో భూదేవి సుత సీత అయితే, మరో భూతం వాయువు సుతుడు హనుమ. అంతటి పరాక్రమ వంతుడు. పవిత్ర మాల్య పర్వతం తండ్రి ఆవాస భూమి. కనుక తనపుట్టుక ఉన్నతమైందే. సీత సహనం భూదేవి సహనం అయితే హనుమ పరాక్రమం ఎదురు లేని జంఝా మారుతం. కనుక ధైర్య సాహసాలకు కొదవలేదు. అందుకే ఇంతకష్టసాధ్యమైన పని చేసి లంకలోకి సముద్రం లంఘించి వచ్చి ప్రవేశించాడు. ఇప్పటిదాకా తనకు తప్ప ఎవరికీ కనిపించని నేర్పుతో ప్రవర్తించాడు. రామ సుగ్రీవాజ్ఞ ఔదల దాల్చి వచ్చి సఫల మనో రథుడయ్యాడు సీతామాత దివ్య దర్శనం తో. ఇక కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు అన్నట్లు రామ సోదరులు రావటం, లంకకు చేటు కలిగించటం తథ్యం అని సీత గట్టిగా నమ్మి సందేహాలన్నీ తీరి ఇక అతనితో మనసు విప్పి మాట్లాడుతుంది.

సీత విశ్వాసం పొందాలని హనుమ "రామనామం లిఖింప బడిన ఈ ఉంగరం రాముడు నీకు ఇవ్వమని నాకు ఇచ్చాడు. ఇక నీకు సుఖాలే. ఊరడిల్లు". అనగా దాన్ని చేతిలోకి తీసుకొని రామ సందర్శనం చేసినంత ఆనందం పొందింది. కొంచెం సిగ్గుపడి భర్త సందేశానికి పులకిత అయి హనుమంతుని "నువ్వు పరాక్రమ శాలివి. రావణ రాజ్యం లంక ను ఎదిరించి వచ్చావు. నువ్వు సామాన్య వానరం అని నేను భావించను. నీకు రావణుడు అంటే భయమే లేదు. రామ సోదరుల కుశల వార్త చెప్పి దుఖం పోగొట్టావు. కానీ రాముడు క్షేమంగా ఉంటే, ఇక్కడికి ఎందుకు రాలేదు. నా దుఖాన్ని ఎందుకు ఉపసంహరించలేదు. నన్ను పొందటానికి ప్రయత్నాలు చేస్తున్నాడా. ?మిత్ర సులభుడుగా, దేవతల అనుగ్రహ పాత్రుడుగా ఉన్నాడా ?నా కష్టాలు తీరుస్తాడా ?మా అత్తగార్లు క్షేమమేనా ?భరతుడు నాకోసం ఒక అక్షోహిణిసైన్యం పంపుతాడా ?లక్షముడు రాక్షసులతో వీరోచిత పోరాటానికి సిద్ధంగా ఉన్నాడా ?రావణ, రాక్షస బృందం త్వరలో చనిపోవటం చూస్తానా ?"అని ప్రశ్నించింది.

సీత మాటలకు సంతోషించి చేతులు మోడ్చి "అమ్మా !నువ్వు ఇక్కడ ఉన్నట్లు రాముడికి తెలియదు. అందుకే రాలేదు. నేను వెళ్లి నీ ఉనికి గురించి చెబితే వెంటనే సర్వ సైన్యం తో వచ్చి సముద్రాన్ని స్తంభింప జేసి, లంక చేరి రాక్షస సంహారం చేసి నిన్ను పొందగలడు సందేహం లేదు. రాముడు నీ వియోగం తో సుఖం పొందటం లేదు. త్వరలో రామ చంద్ర మూర్తి ఉదయించిన చంద్రునిలాగా నువ్వు చూడగలవు అని మేము తిరిగే మలయమేరువు వింధ్య మందర, దర్దుర పర్వతాలమీదా,మేము తినే కంద మూలాలపైనా శపథం చేసి చెబుతున్నాను, రాముడు మాంసం మద్యం ముట్టటం లేదు. ప్రాణాలు నిలవటానికి ఏదో కొంత తింటున్నాడు. శరీర స్పృహ కూడా ఉండటం లేదు. నిన్నే తలుస్తూ స్మరిస్తున్నాడు. అసలు నిద్రపోవటం లేదు అకస్మాత్తుగా లేచి సీతా సీతా అని స్మరిస్తున్నాడు "అని చెప్పగా రాముని అవస్థ విని, రామశోకంతోసమాన శోకం పొంది మేఘశకలం చేత కప్పబడిన చంద్రునితో కూడిన రాత్రిలాగా ప్రకాశించి, ప్రకాశించకుండా ఉన్నది. -

సా రామ సంకీర్త నవీత శోకా - రామస్య శోకేన సమాన శోకా –

శరన్ముఖే సాంబుద శేష చంద్రా –నిశేవ వైదేహ సుతా బభూవ "

ఇది 47శోకాల 36వ సర్గ

రాముడికి తాను ఇక్కడ ఉన్నట్లు తెలియ లేదని అర్ధం చేసుకొన్నది. హనుమ చెబితే రాముడు రాగలడు అని తెలిసింది. రాముడు అక్కడ సుఖ భోగాలు అనుభవించటం లేదని తెలిసి మరింత కుంగి పోయింది ఆయన దుఖం లో సాబాలు పంచుకున్నది. హనుమ చేసిన శపథం తమాషాగా ఉంది. తాము తిరుగాడే పర్వతాలమీద, తినే కందమూలాలపైనా శపథం చేశాడు అంటే తానూ చెప్పింది అబద్ధం ఐతే తమకు ఆ పర్వతాలపై నివాస యోగ్యత ఉండదు అలాగే తినేకందమూలాలు దొరకవు. బాగుంది తప్పక అతని మాట నమ్మాల్సిందే

'మలయేన చ వింధ్యేన మేరునా మందరేణచ –దర్దు రేణ చ తే దేవి శపే మూల ఫలేన చ"

సీతకు ఒక సందేహం కూడా వచ్చినట్లుంది. తన వియోగ దుఖంతో ఖాళీగా కూర్చుని ఆయుధాలకు పనిలేకుండా తుప్పు పట్టిస్తున్నాడా ?మిత్రసాయం లేకపోతే శత్రు వినాశనం సాధ్యంకాదు గురువుగారు ఆప్రయత్నాలు చేస్తున్నాడా ?ఏడుస్తూ కోర్చుని దేవతలను మర్చిపోయాడా ? దైవానుగ్రహం లేనిది ఇంతటి మహా ప్రయత్నం ఫలించదు అని ఆమె నమ్మకం ఇవన్నీ ఆమె సంధించిన ప్రశ్నలే. హనుమ సంతృప్తికర సమాధానాలు ఆమెకు సంతోషం కలిగించాయి.

హనుమ మాటలకు సీత "రాముడు నా వియోగానికి దుఖిస్తున్నాడని నువ్వు చెప్పిన మాటలు విషం కలిపిన అమృతం లాగా ఉంది. బాగా-ఐశ్వర్యం కలిగినా, భరించరాని కష్టం వచ్చినా మనిషి స్వతంత్రుడు కాలేడు,దైవం వాడిని తాళ్ళతో కట్టినట్లు ఈడ్చుకు పోతుంది.దైవం నివారింప శక్యం కానిది. కనుకనే నేనూ రాముడూ ఆపదలలో చిక్కాం –

"ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వా సుదారుణే-రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాన్తః పరి కర్షతి "

"విదిర్నూన మసంహార్యః ప్రాణినాం ప్లవగోత్తమ -సౌమిత్రిం మాం చ రామంచ వ్యసనైః పశ్య మోహితాన్ "ఇచ్చిన గడువు ఏడాది మాత్రమె ఎపుడు రాముడు వస్తాడో నన్ను ఎప్పుడు తీసుకు వెడతాడో. ఇప్పుడు పదో నెల గడుస్తోంది. ఈపాటికే నన్ను చంపేసేవాడు క్రూర రావణుడు. తమ్ముడు విభీషణుడు నన్ను విడిపించి రామునికి నన్ను సమర్పించమని హితవు చెప్పాడు. వాడు వినలేదు. వాడి వాలకం చూస్తె వాడు మృత్యువుకు ఎర అయ్యేట్లు కనిపిస్తోంది '

విభీషణుడిపెద్దకూతురు" అనల " తల్లి పంపగా నాదగ్గరకు వచ్చి పై విషయం చెప్పింది

"జ్యేష్టా కన్యా నలా నామ విభీషణ సుతా కపే-తయా మమేద మాఖ్యా తం మాత్రా ప్రహితయాస్వయం "

నా అంతరాత్మ పరిశుద్ధమైనది. రాముడు తప్పక వస్తాడు అని చెబుతోంది. రాముడు లోకో త్తరకార్య నిర్వాహ దక్షుడు దానికి తగ్గ పౌరుష, బల, క్షమ,శౌర్య ధైర్యయుక్తి గుణ విశేషాలు

విశిష్టంగా ఉన్నవాడు –

"ఉత్సాహః పౌరుషం సత్వ మానృశంస్యం కృతజ్ఞతా –విక్రమశ్చప్రభావశ్చ సంతి వానర రాఘవే 'జనస్థానం లో తమ్ముడు తోడు లేకుండానే రాముడొక్కడే 14వేల రాక్షసులను సంహరించాడు. అలాంటి మహా వీరునితో పగ పెట్టుకొని బట్టకట్ట కలిగే వాడు ఎవడు ఉంటాడు ?-"అంటూ చాలా ఎమోషనల్ గా, ఎక్కువగా మాట్లాడుతున్న సీతను చూసి హనుమ మళ్ళీ అనునయించటం మొదలుపెట్టాడు -

"జనస్థానే వినాభ్రాత్రా శత్రుః కస్తస్య నో ద్విజేత్ –న స శక్యస్తు లయితుం వ్యసనైః పురుషర్షభః "

"ఇతి సంజల్ప మానాంతాం రామార్థే శోక కర్శితాం –అశ్రు సంపూర్ణ నయనా మువాచ వచనం కపిః"

"అమ్మా నేను వెళ్లి నీ విషయం చెప్పగానే వానర భల్లూక సైన్యాలతో రాముడు వెంటనే బ,యల్దేరి వస్తాడు. ఒక వేళ,రాడనీ కానీ, గడువు దాటాక వస్తాడేమో అనే అనుమానం నీకు ఉంటె 'నువ్వు నా వీపు మీద కూర్చో. వెంటనే సముద్రం దాటి రాముడి దగ్గరకు చేరుస్తాని. నువ్వే కాదు సకల లంకా రాజ్యాన్నీ రావణుడితో సహా మోసుకు వెళ్ళే శక్తి సామర్ధ్యాలున్న వాడిని నమ్ము. హోమ ద్రవ్యాన్ని అగ్ని ఇంద్రునికి చేర వేసేట్లుగా నేను నిన్ను రాముడికి సమర్పిస్తాను. సందేహించక నా వీపు ఎక్కి మహా సముద్రం దాటి వేద్దాం. నా వెంటబడి వచ్చి నన్ను ఆపగల మొనగాడు ఇక్కడ లేడు. ఇక్కడికి యెంత సునాయాసంగా వచ్చానో అంతే తేలికగా నిన్ను తీసుకుపోగలను "అని సందేహ నివృత్తి చేసి, పరిష్కార మార్గం సూచించ గానే సీతాదేవి పులకిత గాత్రియై, "వానరా ! నువ్వు నన్ను చాలా దూరం మోసుకు తీసుకు పోదామని భావిస్తున్నావు. ఇందులో నీ బుద్ధి సూక్ష్మత కంటే "కపిత్వం "ఎక్కువగా ఉన్నది. నీది చిన్న శరీరం, దానితో ఇంతపెద్ద నన్ను ఎలా మోసుకు పోవాలను కొంటున్నావయ్యా పిచ్చి కపీ. "అనగానే గురుడికి బల్బు వెలిగి ఇంతటి అవమానపు మాట ఇదివరకు ఎవరూ అనలేదని, అదొక కొత్త పరాభవంగా భావించాడు. అప్పటిదాకా "ప్లవగోత్తమ "అని గౌరవించిన సీత అమాంతంగా" కపీ" అనటం గుండెకు బల్లెం గుచ్చుకున్నంత బాధ కలిగించింది. ఆమెకు నమ్మకం కలిగించాలి. లేకపోతే మొదటికే మోసం కలిగింది, వెంటనే తన శరీరాన్ని పెంచటం ప్రారంభించాడు. అది మేరు పర్వతం మందర పర్వతం అంతపెరిగి ప్రజ్వరిల్లే అగ్నిలాగా ప్రకాశిస్తూ వామనుడు త్రివిక్రముడైనట్లు కనిపించాడు. -ఒకసారి హనుమ విశ్వ రూపాన్ని దర్శిద్దాం మనం కూడా –

"మేరు మందార బభౌ దీప్తానల ప్తభః –అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః "

"హరిః పర్వతసంకాశ స్తామ్ర వక్త్రో మహాబలః –వజ్ర దంష్ట్ర నఖో భీమో వైదేహీ మిద మబ్రవీత్

"చూశావా అమ్మా నా విశ్వ రూపం. వనాలు పర్వతాలు కోటలు, ప్రాకారాలు, పురద్వారాలతో ఉన్న ఈ లంకను, రావణుడి తో సహా ఎత్తుకొని తీసుకుపోయే సామర్ధ్యం నాది. ఇక ఊగిసలాట అనుమానం వదిలి స్థిర బుద్ధితో నేను చెప్పినట్లు చేసి శీఘ్రంగా రామ దర్శనం చేసుకో "అన్నాడు.

ఇంతింతై వటుడింతయై అని వామనుడు పెరిగినట్లు పెరిగిన మహా భక్త చింతామణి హనుమ విశ్వరూపిగా పెరగటం చూసి సీత సంభ్రమ ఆశ్చర్యాలతో "మహా కపీ ! నీ ధైర్య శౌర్య పరాక్రమ వాయు వేగాల అగ్ని సదృశ అద్భుత తేజస్సు తెలుసుకొన్నాను. కనుకనే సముద్రం దాటి రాగలిగావు. నన్ను మోసుకొని సముద్రం దాటే శక్తి నీకుంది అని నాకు అర్ధమైంది. కానీ అంతా మంచే జరుగుతుందని అనుకోరాదు కీడెంచి మేలు ఎంచమన్నారు. నీ వాయు వేగానికి తట్టుకొనే సామర్ధ్యం నాకు లేదు. తెలివి తప్పి జారి పడిపోవచ్చు.అప్పుడు సముద్ర తిమింగిలాలు మొసళ్ళు నన్ను తినేయచ్చు. రక్షించాల్సిన వ్యక్తీ మరొకడున్నప్పుడు నీకుఆపద రావచ్చు. రాక్షసులు చూస్తె రావణ ఆజ్ఞతో నిన్ను వెంటాడుతారు. నన్ను మోసుకొని పోతూ ఆకాశం లో ఆయుదాలులేకుండా వాళ్ళతో ఎలా పోరాడగలవు ?నువ్వు వాళ్ళతో యుద్ధం చేస్తుంటే భయపడి నీ వీపునుంచి జారి నేలమీద పడిపోతానేమో అప్పుడు రాక్షసులు నన్ను తీసుకు పోవచ్చు. నీ బలపరాక్రమాలు నాకు తెలిసినా జయాప యాలు దైవా ధీనాలు కదా. కనుక ఎటు చూసినా నన్ను తీసుకు పోయే నీ ప్రయత్నం వృధా అవుతుంది. నువ్వు సర్వ రాక్షస సంహారం చేయగల సమర్ధుడవే అనుమానం లేదు. కాని నువ్వు రామ దూతవు, రాముడు చేయాల్సిన సంహార కార్యం నువ్వు చేస్తే రాముని కీర్తి మసక బారు తుంది కదా. లేకపోతె నీ భయంతో నన్ను రాక్షసులు ఇంకో చోట దాచి పెట్టవచ్చు. నేనెక్కడ ఉన్నానో ఎవరికీ తెలియకపోవచ్చు. కనుక ఇలా చూసినా నీ ఆలోచన సత్ఫలితమివ్వదు.నాపతి దేవుడు నీతో లంకకు రావటమే సర్వ విధాలా ఉత్తమం, నా బ్రతుకుపైనే రామసోదరుల సుగ్రీవాదుల వంశ క్షేమం ఆధార పడి ఉంది.

నాకు ప్రాణాపాయం కలిగితే రామ సోదరులకు నా ఆశ లేక కృశించి వానర భల్లూకాలతో సహా ప్రాణాలు విడుస్తారు. నీ మనసులో ఒక సందేహం ఉండి ఉండచ్చు. నువ్వు పరపురుడివి కదా నిన్ను తాకుతూ నేను కూర్చోవాలికదా మరి అలాంటప్పుడు రావణుడు ఎత్తుకొచ్చినప్పుడు అతని స్పర్శ తగలలేదా అను కోవచ్చు నువ్వు. నాపతి శరీరం తప్ప వేరొక పురుషుని శరీరం నేను తాకను తాకలేదు కూడా. రావణుడు బలాత్కారంగా నన్ను జనస్థానం నుంచి ఎత్తుకొచ్చినప్పుడు నేను ఆశక్తురాలను నా భర్త దగ్గర లేడు.దుఃఖ పరవశత్వంతో నాకు శరీర స్పృహ లేనేలేదు. నేనేమీ చేయలేని స్థితి.

"భర్తు ర్భక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానర –న స్ప్రుశ్యామి శరీరం తు పుమ్సో వానర పుంగవ"

" యదహం గాత్ర సంస్పర్శ్యం రావణస్య బలాద్గతా-అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ. రాముడే రావాలి ఆయనే లంకరాజునుచంపాలి. రామ సోదరులకు ఎదురు నిలిచే వారు లేరు. కనుక నాయనా హనూ!. రామ లక్ష్మణ సుగ్రీవ కపి భల్లూక సైన్యంతో నువ్వు కూడా కలిసి త్వరలో రండి. నా శోకాన్నితీర్చండి. "అని విస్పష్టంగా సందేహ రహితం గా సీతాదేవి హనుముకు చెప్పింది.

"సమే హరి శ్రేష్టసలక్ష్మణం పతిం –సయూధపం క్షిప్ర మిహోప పాదయ –చిరాయ రామం ప్రతి శోక కర్శితాం –కురుష్వ మాంవానర ముఖ్య హర్షితాం "

ఇది 66 శ్లోకాల 37వ సర్గ

ఇందులో హనుమ బలపరాక్రమ విశ్వ రూప ప్రదర్శనకు ముందు సీత తడిని అనేక సార్లు "కపి "అనే పిలిచింది. చిన్న కోతితనను మోసుకు పోవటం ఏమిటి అని ఎద్దేవాచేయటమే కాదు అతని చపలత్వ కోతి ఆలోచనలనూ నిర్మొహమాటంగా చెప్పింది. హనుమ విశ్వరూపం చూశాక పూర్తి నమ్మకం కలిగి అతడిని వానర శ్రేస్టా,మహా కపీ, కపి సత్తమ, హరి శ్రేష్టఅని అత్యంత గౌరవంగా సంబోధించింది. హరి ఎలా విశ్వ రూపం ప్రదర్శించాడో ఈ హరి అంటే కపి వానరుడు కూడా విశ్వరూపం చూపించాడు. భగవంతుడికి భక్తుడికి భేదం లేదనీ తెలియ జేశాడు. వాల్మీకి మహర్షికూడా కపికి సాఫ్ట్ కార్నర్ గా సంబోధనలు మార్చాడు.



తాను వివశనై ఉన్నానుకనుక రావణుడు ఎలా తెచ్చాడో తనను అని చెప్పిహనుమ సందేహం తీర్చింది. "ఎగిరిపోతే ఎంత బాగుంటుందో"అను కొంటె సీత జీవితం కొల్లేరే. అక్కడే సంయమనం బుద్ధి లోకజ్ఞత ప్రదర్శించింది. వీపు మీద మోసుకు పొతే వచ్చే ప్రమాదాలన్నీ నీళ్ళలో పడితే జలచరాలకు ఆహారం అవటం భూమిమీదపడితే మళ్ళీ రాక్షుల పాలుకావటం ఈసారి మరింత కనపడరాని చోటు లో దాస్తే కనుక్కోవటం ఎవరికీ తెలియదనే వాస్తవం చెప్పింది. అయినా నువ్వెవడివి" కోన్ కిస్కా"?మా ఆయనే రావాలి ఆయనే నన్ను రక్షించి రావణ సంహారం చేయాలి. ఆయనకు దక్కాల్సిన కీర్తి వేరొకరికి దక్కరాదు అనే మనో నిశ్చయం వస్తాడనే పూర్తినమ్మకం తెలిపింది. అంతటి పరాక్రమ వంతుడు హనుమ సాయంగా ఉంటె రామకార్యం సఫలమే కాని విఫలం కాదు అని భావించింది. ఆమె దుఖం త్వరలో తీర్చటానికి హనుమ చెప్పిన సూక్ష్మలో మోక్షం సూచన బానే ఉన్నా దానిలో ఉన్న ఇబ్బందులు ఆలోచించలేని ఆవేశ పరత్వం కపిత్వం మరోమారు మనకు కనిపిస్తుంది. ఆవేశం కన్నా ఆలోచన మిన్న అనే సత్యం సీత వాక్కులలో ప్రతిధ్వనిస్తోంది.

హనుమ మనసు సంతృప్తి చెంది సీతతో "అమ్మా నిన్ను చూస్తేనే శుభాలు కలుగుతాయి. స్త్రీ స్వభావ భయాలకు, పతివ్రతా లక్షణాలకు తగినట్లు గా మాట్లాడావు. వీపుమీదఎక్కి నూరు యోజనాల సముద్రం దాటటం స్త్రీలకు శక్తికి మించిన పనే. రాముడిని తప్ప పర పురుషుని తాకను అని నువ్వు చెప్పిన మాట నీకే తగినది. నేను చూసిన నీ రామ విరహం, రావణుని బెదిరింపు, నీ తృణీకారం నీ ఆత్మహత్యా ప్రయత్నం అన్నీ రాముడికి నివేదిస్తాను. నీ అంతు లేని దుఖానికి అనేకకారణాలు స్వయంగా చూసిన నేను నాతో తీసుకు పోతాను అన్నాను కాని అన్యధా భావించ వద్దు. లంకలో ప్రవేశించటం సముద్రం దాటటం చాలా కష్టం కనుక, నిన్ను సముద్రం దాటించే సమర్ధత నాకు ఉండటం వలన, నేను అలా మాట్లాడాను. వెంటనే నిన్ను రాముడి దగ్గరకు తీసుకు వెళ్ళాలన్న ఆలోచన రామునిపై భక్తీ,స్నేహాలవలన అలా చెప్పాను. నాతో రావటానికి ఉత్సాహం నువ్వు చూపకపోతే, నేను ఇక్కడ నిన్ను చూశాను అని చెప్పటానికి తగిన అభిజ్ఞానం అంటే గుర్తు నాకు ప్రసాదించు "అన్నాడు హనుమ.

రాముడికి, తనకు ఏకాంతం లో జరిగిన వృత్తాంతం చెప్పబోయిన సీత బాష్పోద్రేకం తో మాటలు తడబడుతూ నెమ్మదిగా "ఇప్పుడు నీకు నేను చెప్పే ఈ అభిజ్ఞానాన్ని నా రాముడికి చెప్పు.చిత్రకూటం లో ఉండగా ఒక రోజు ఆపర్వతానికి ఈశాన్యం లో మందాకినీ నదీ సమీపాన సిద్ధులు నివశించే, కందమూలాలు, జలం పుష్కలంగా ఉన్న తాపస ఆశ్రమం లో మేము ఉండగా జరిగిన కథను నామాటలతో "నాథా!ఫలపుష్పాలున్న వనం లో విహరించి అలసి చెమటతో ఉన్న నీ తొడమీద కూర్చున్నాను. అప్పుడొకకాకి మాంసా పేక్షతో వచ్చి, నా స్తనాంతరం పొడవటం ప్రారంభించి మాటి మాటికీ పొడుస్తూ ఎక్కడో దాక్కునేది. నేను మొలత్రాడు లాగి పట్టి, నా వస్త్రాన్ని బిగుతుగా కట్టుకొని, ఆకాకిని పారద్రోలే ప్రయత్నం చేస్తుండగా, నా విఫల ప్రయత్నాన్ని చూసి నువ్వు నవ్వావు. దానికి ముందు నేను సిగ్గు పడ్డా, కాకి మళ్ళీ నన్ను గీరటానికి వస్తే, కోపం తో తరిమేసి మళ్ళీ నీదగ్గరకొచ్చి నీ తొడపై కూర్చున్నాను, కోపించి అలసిన నన్ను నువ్వు ఊరడించావు. కన్నీరు కారుస్తూ. తుడుచుకొంటూ కాకిపై కోపం చూపిస్తూ ఉన్న నన్నుచూశావు "



" హనుమంతా !కాకిపెట్టిన బాధ, శ్రమకు అలసి రాముడి తొడపై పడుకున్నాను. తర్వాత రాముడు కూడా నా తొడపై తలపెట్టి కొంచెంసేపు విశ్రాంతి తీసుకొన్నాడు. మళ్ళీ ఆకాకి గోల చేయటం మొదలు పెట్టి,అప్పుడే లేచిన నన్ను అది మళ్ళీమళ్ళీ స్తనాంతరం గీరగా, రక్తం కారి రాముడు తడిసిపోయాడు. అది ఏ మాత్రంభయపడక నన్ను బాధిస్తూనే ఉన్నది. భరించలేక రాముడిని నిద్ర లేపాను. స్తనాల మధ్య కాకి చేసిన గాయం చూసి నిట్టూరుస్తూ రాముడు "ఎవరు ఇంత దారుణానికి ఒడిగట్టారు ?"అని అడిగి నాలుగు వైపులా చూడగా రక్తసిక్తమైన గోళ్ళతో ఉన్న కాకి కనిపించింది. ఆ కాకి ఇంద్రుని కొడుకు వాయు వేగంగా పోగలవాడు భూమి మీదకు వచ్చి ఈపని చేసి అదే వేగంతో పారిపోయాడు, రామునికి తీవ్రమైన కోపం వచ్చి దాన్ని తీవ్రంగా శిక్షించాలనుకొని, తన ఆసనం నుంచి ఒకదర్భను తీసి బ్రహ్మాస్త్రం తో మంత్రించి కాకాసురునిపై వదిలాడు.ఆదర్భాస్త్రం కాకిని వెంబడించగా భయపడి రక్షణ కోసం ని వైపులకూ అన్ని లోకాలకు పరిగెత్తగా దర్భ దాన్ని వెంబడిస్తూనేఉంది. మూడులోకాలలోని దేవతలు మహర్షులు దాని తండ్రి తల్లి బంధువులుఎవరూ రక్షణ ఇవ్వలేదు. తిరిగి తిరిగి,ఆత్మ రక్షణకోసం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై మళ్ళీ రాముడే దిక్కు అని శరణు వేడి పాదాలపై పడి పోయింది. దయాసింధు రాముడు "నా బ్రహ్మాస్త్రం వృధా కాదు ఏం చెయ్యాలో నువ్వే చెప్పు "అని అడిగితె కాకి "నా కుడి కంటిని నీ బ్రహ్మాస్త్రం తో హింసించు "అని కోరితే ఆవాయసం కుడడికంటిని బ్రహ్మాస్త్రం పోగొట్టింది. చావు తప్పి ప్రాణాలు నిలిచి కుడికంటిని పోగొట్టుకొని అ కాకి బతికి పోయింది.

"కాకి మీదనే బ్రహ్మాస్త్రం వేసినవాడివి, క్రూర రావణుడిని క్షమిస్తున్నవేమిటి ?నాపై దయ చూపి త్వరగా వచ్చి వాడిని చంపి నా దుఃఖ నివారణ చేయి "

"మత్కృతే కాకమాత్రేతుబ్రహ్మాస్త్రం సముదీరితం –కస్మాద్యో మాం హర త్వత్తః క్షమాసే తం మహీపతే " గుర్తు చేసిన తెలివైన స్త్రీ సీత.

మహీపతే అంటే రాజా అని సంబోధించి రక్షణ రాజధర్మం

"'హనుమా '!గొప్ప పరాక్రమ శాలి రాముడు రాక్షసులను ఎందుకు ఉపెక్షిస్తున్నాడు నాకోసం ఆమాత్రం చెయ్యలేడా ఈ తాత్సారం దేనికి ? నేనేదో పాపం చేసి ఉంటాను. అందుకేరక్షించే సమర్ధత ఉన్నా రామ సోదరులు రాలేదు "అని విలపించింది సీత. ఆమె ను ఊరడిస్తూ "అక్కడ రాముడూ తమ్ముడూ దురంతా దుఖం లో ఉన్నారు వారికి నువ్వు ఇక్కడ ఉన్నట్లు తెలీదు. వారు రావటం లంక నాశనమవటం తధ్యం "అన్నాడు హనుమ. మళ్ళీ సీత "రాముడి క్షేమమ అడిగానానని ప్రనమిల్లానని చెప్పు. లక్ష్మణ సమేతంగా అక్కడి వారందర్నీ కుశల అడిగానని తెలుపు. ఇంకొక నెల రోజులు మాత్రమె బతికి ఉంటానుఅని గట్టిగా నా నాదునికి చెప్పు "అని తన చీర కొంగున ముడి పెట్టి దాచిన చూడామణి తీసి హనుమకు ఇవ్వగా తీసుకొనిభక్తితో వ్రేలికి పెట్టుకొని, నమస్కరిస్తూ సీత చుట్టూ ప్రదక్షణాలు చేసి మనసులో రాముడిని తలచుకొని తిరుగు ప్రయాణానికి సిద్ధపడి. పెనుగాలికి కంపించి, ఆ గాలి తాకుడు నుంచి విముక్తమైన కొండ లాగా మనసంతా సుఖం నిండి ఉన్నాడు.

"మణివర ముప గృహ్య తం మహార్హం –జనక నృపాత్మజయా ధృతం ప్రభావాత్ –గిరిరివ పవనావధూత ముక్త –స్సుఖిత మనాఃప్రతి సంక్రమం ప్రపేదే".

ఇది 72 శ్లోకాల 38వ సర్గ.

ఇప్పటివరకు రాముడు ఇచ్చిన ఉంగరం అంటే అంగుళీయకం సీత కు హనుమ ఇవ్వటం హనుమ కు సీత తన చూడామణి ప్రదానం చేసి రాముడికి గుర్తుగా పంపటం జరిగింది

తెలుగు దేశం లో తక్కువే కాని తమిళదేశం లో మణి తో పెరున్నవారు చాలామంది ఉన్నారు. మణిరత్నం వగైరా.. చూడామణి చిన్నగా ఉంటుంది కదా హనుమ వ్రేలికి ఎలా తొడుక్కున్నాడు అనే అనుమానం వస్తుంది అంటే అప్పటికి తన మహోన్నత రూపు తగ్గించుకొని మామూలు వానరంగా మారి ఉంటాడని బిట్వీన్ ది లైన్స్ మనం అర్ధం చేసుకోవాలి.

హనుమ కూడా తానూ సీతతో వీపు మీద కూర్చోపెట్టుకొని సముద్రం దాటిస్తాను అన్నమాట కు క్షమాపణ చెప్పుకొన్నాడు. బుద్ధిమంతుల లక్షణం అది తొందరపడినా తర్వాత తప్పు తెలుసుకొని లెంపలు వాయిన్చుకోవాలి ఇది లోక సహజం. పర పురుషుని తాకను అని ఆమె చెప్పిన మాటకూ శిరసువంచి నమస్కరించి తన సంస్కారం తెలియజేశాడు. ఇందులో సీత రామ పరాక్రమాన్ని చాలాసార్లు తనివి తీరా వర్ణించి,తప్పక వస్తాడనే నిశ్చయానికి చేరింది

అభిజ్ఞానం గా సీత చెప్పిన కాకి వృత్తాంతంఆమె పడిన బాధ వేదన కు దృష్టాంతం. కొంత సూటిగా కొంత వేరుగా చెప్పటం లో కథగమనం కుదిరింది. ఆఫ్టరాల్ కాకి మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించిన భర్త తనకోసం ప్రయోగించాకపోవటం ఏమిటని నిలదీసింది. అవును అవసరం వచ్చినప్పుడు అలా కడిగి పారేస్తేనేకాని ఉపశమనం పొందటం కుదరదు. కాకి ఏక కన్ను కాకి ఎందుకయిందో మనకు తెలుస్తుంది. కుడి కన్ను బ్రహ్మాస్త్రానికి బలి అయింది. లోకం లూకేకన్నున్నవాడిని "ఏకాకన్నయ్య "అంటారు. రోజులు మారాయి సినిమాలో ఆ పేరుతొ ఒక కేరక్టర్ ఉంది.

కాకాసురుడు అనిలోకం లో ప్రతీతి. అంటే వాడు రాక్షసుడు. కాని సీత వాడిని ఇంద్రుని కొడుకు అన్నది. ఇంద్రుడు అదితి కొడుకు. ఈలంకే ఏమిటో తెలీదు. వదిలేద్దాం.

చూడామణి ప్రదానం చేశాక హనుమతో సీత "ఈ అభిజ్ఞానంరాముడికి బాగా తెలుసు, దీన్ని చూసి ఆయన మా తల్లిని, నన్ను మామమగారిని స్మరిస్తాడు. నువ్వు వెళ్లి రాముడిని తొందరపెట్టి ఇక్కడికి వచ్చే ఏర్పాటు చెయ్యి. నీ ప్రయత్నం సఫలమై నా దుఖం తీరాలి. దీనికి నువ్వే సమర్ధుడివి. "అనగానే అలాగే అని చెప్పి హనుమ ఆమెకు నమస్కరించి బయల్దేర బోయాడు. అతడు వెళ్ళటం చూసి సీత కన్నీరు కారుస్తూ ", రామ సోదరుల,సుగ్రీవాదుల క్షేమం అడిగానని చెప్పు. నన్ను ఈ దుఃఖ సముద్రం నుంచి దాటించే,నన్ను బ్రతికించే ఉపాయం రాముడికినీ వాచిక ధర్మం తో చెప్పు. నువ్వు రోజు ఆయనకు ఉత్సాహం కలిగిస్తూ నన్ను చేరే పౌరుషం పెంచుకోవటానికి ప్రయత్నించు. నీమాటలు విన్న తక్షణం ఆయన పరాక్రమం ప్రదర్శిస్తాడు "అని చెప్పింది. శిరస్సంజలి మాదాయ గా హనుమ "అమ్మా !రామదండు త్వరలోనే వస్తుంది. శత్రు నాశనం చేసి రాముడు నీ దుఖం నివారిస్తాడు నమ్ము. రాముడు సాగర పర్యంత భూమిని పాలించటానికి ఉత్సాహంగా ఉన్నాడు. నీకోసం లంకను జయిస్తాడు "అన్నాడు.

"నహి సాగర పర్యంతాం మహీం శాసితు మీహతే -త్వన్నిమిత్తో హి రామస్య జయో జనక నందిని "

హనుమ వెళ్లి పోతుంటే మాటిమాటికీ అతన్ని చూస్తూ గౌరవిస్తూ భర్తను స్మరిస్తూ మళ్ళీ "నీకు ఇష్టమైతే ఎక్కడో అక్కడ దాక్కుని విశ్రాంతి తీసుకొని రేపు వెళ్ళు. ఇంకొక్క రోజు ఇక్కడ నువ్వు ఉంటె నా మహా దుఖం కొంచెమైనా తగ్గుతుంది. కాదని నువ్వు వెడితే నా ప్రాణాలు నిలవటం కూడా అనుమానమే. నువ్వు కనబడకపోతే కలిగే దుఖం ఇప్పటి దాకా అనుభవించిన దుఖం కంటే ఎక్కువౌతుంది. నువ్వు ఇక్కడే ఉన్నావు కనుక నాకొక సందేహం కలిగింది దాన్ని తీర్చి వెళ్ళు. కోతులు ఎలుగులు మనుషులు మహా సముద్రాన్ని యెట్లా దాటగలరు. సముద్రం దాటటానికి నువ్వు నీ తండ్రి వాయువు, గరుత్మంతుడు మాత్రమె సమర్దులు. ఇంతటి కష్టమైన విషయాన్నిఎలా సాధ్యం చేయాలని ఆలోచించావోచెప్పు కార్య సాధక ఉపాయజ్ఞులలో నువ్వు గొప్పవాడివి. అయినా సకల శత్రు నాశనానికి నీవు ఒక్కడివే సమర్దుడవు అని నాకు తెలుసు. కాని దీనివలన కీర్తి నీకు వస్తుంది కాని నాకు కాదు. రాముడే వచ్చి శత్రునాశనం చేస్తే నాకు కీర్తి కలుగు తుంది "అన్నది.

ఇదివరకు రాని సందేహాలపుట్ట దులిపిన సీతాదేవియుక్తికి సంతోషిస్తూ హనుమ "వానర భల్లూక సేనలకు రాజు సుగ్రీవుడు. నీ కార్యం సాధించటానికి వేలాది కోట్ల సైన్యంతో సర్వ సిద్ధంగా ఉన్నాడు. ఆ సైన్యం లో పరాక్రమ ధైర్య మహా బల సంపన్నులు మనో వేగులు ఉన్నారు. వారంతా పైకి కిందికి అడ్డం నిలువు గా అడ్డు లేకుండా సంచరించగల సర్వ సమర్దులు. ఆవానరులు ఇప్పటికే చాలాసార్లు వాయుమార్గాన సంచరిస్తూ పర్వత సముద్రాలతో ఉన్న భూమిని ప్రదక్షిణం చేసి వచ్చిన వాళ్ళు. నా కంటే అధికులు, నాతో సమానులు అయిన వానరులు ఎందరో సుగ్రీవ సైన్యంలో ఉన్నారు. నా కంటే బలహీనుడుఒక్కడు కూడా లేడు.నేనే సముద్రం దాటి వస్తే, వారి విషయం లో అనుమానం ఎందుకు. వాళ్ళంతా ఒక్కగంతులో ఇక్కడికి వస్తారు నమ్ము. దుఖం మాని సుఖంగాఉండు ఉదయ సూర్య చంద్రులులాగా రామ సోదరులను నా వీపు మీద కూర్చో పెట్టుకొని నీ దగ్గరకు తెస్తాను. తర్వాత రామ సోదరులు తమ అవక్ర పరాక్రమంతో లంకాదహనం చేస్తారు "అని అనునయిస్తూ దుఖం మాన్పి ప్రయాణానికి బయల్దేరి మళ్ళీ "అమ్మా !త్వరలో రామాదులు లంకాద్వారం సమీపిస్తారు. రామ లక్ష్మణుల కంటే వీరుడెవడున్నాడు.ఈ లంకలో ఎక్కువ కాలం ఉండవు నువ్వు. నీ పతి వస్తాడు త్వరలో. నేను వెళ్లి ఆయన్ను కలిసి నీమాట చెప్పేదాకా ఈ క్లేశాన్ని సహించు "అన్నాడు. -

"రామా ద్విశిస్టకో న్యే స్తి కశ్చిత్సౌమిత్రిణా సమః –అగ్ని మారుత కల్పౌతౌ భ్రాతరౌ తవ సంశ్రయా "

"నతేచిరా దాగమనం ప్రియస్య –క్షమస్వ మత్సం గమ కాల మాత్రం "

ఇది 53శ్లోకాల 39వ సర్గ.

కార్య సాధనలో అనేక సందేహాలు రావటం సహజం. అంతాఅయి బయల్దేరి వెళ్ళబోతున్న హనుమను ఆపి మరో రోజు ఉండిపోమ్మనటం మనం అతిధులను ఇలాగే రేపు వెళ్ళచ్చు అని వాయిదా వేయించటం లాంటిదే. అతడు ఉంటె మరింత దుఃఖ ఉపశమనం తనకు. కాదని వెడితే అప్పటిదాకా అనుభవించిన దానికంటే అధిక దుఖం కలుగుతుంది. గృహస్తులు గా మనం చెప్పే మాటలూ ఇవే కాదా ?

అలాగే అసలైన మరో గొప్ప సందేహం –కోతులు ఎలుగులు మనుషులు అసలు సముద్రం ఎలా దాటి రాగలరు ?ఇది తప్పక తీర్చాల్సిన సందేహమే. దీనికి హనుమ సంతోషించి తన బుద్ధి విశేషం తో చాలా సంతృప్తి కరమైన సమాధానం చెప్పాడు –తనతో సమానులు తనకంటే ఎక్కువ పరాక్రమం ఉన్నవారు సుగ్రీవ సైన్యం లో ఉన్నారని చెప్పాడు. అంతవరకూ బానే ఉంది నమ్మచ్చు. కాని వాళ్ళు ఎప్పుడైనా చెట్లూ కొండలూ దాటి బయటికి వెళ్ళారా అనే ప్రశ్న వేస్తుందని ముందే గ్రహించి మతిమాన్ హనుమాన్ –వారంతా చాలా సార్లు భూ

ప్రదక్షిణచేసిన ధీర వీర,సమర్ధ పరాక్రమ శాలురు అని చెప్పి ఆ సందేహానికి లాక్ పెట్టేశాడు. ఇక్కడే ఆయన బహు ముఖీన వ్యక్తిత్వ ప్రతిభ ద్యోతకమౌతోంది.

వెళ్లి పోతున్న మహాత్మ హనుమాన్ తో సీతాదేవి "సగం వయసు వరకు పెరిగి, ఆతర్వాత నీళ్ళు లేక శోషించి, దైవికంగా కురిసిన వానతో కోలుకున్న పైరులాగా, చాలా ప్రియ వచనాలు పలికిన నిన్ను చూసి చాలా సంతోషం కలిగింది.

"త్వాం దృష్ట్వా ప్రియవక్తారం సంప్రహృష్యామి వానర –అర్ధ సంజాతసస్యే వ వృష్టిం ప్రాప్య వసుంధరా "

చాలాసందర్భోచిత దివ్య ఉపమానం ప్రయోగించి సీతతో చెప్పించాడు మహర్షి వాల్మీకి.

"త్వరలో రామ దర్శనం సంఘటిల్లేట్లు చూడు. "రామా !కాకి మీదతృణంప్రయోగించి దాని కన్ను హరించిన నువ్వు నన్ను పోయావా, మరో విషయం కూడా గుర్తుకొచ్చింది,. పూర్వం నేనునా నుదుట అలంకరించు కొన్న తిలకం గండం అనే పర్వత పార్శ్వం దగ్గర అరణ్యం లో

తిరుగుతుంటే చెమటకు కరిగింది. అప్పుడు రామానువ్వు మణిశిలతో చేయబడిన తిలకాన్ని అలంకరించావు. ఈ రెండవ అభిజ్ఞానం కూడా తప్పకగుర్తుంచుకో.,

"మనశ్శిలాయా స్తిలకో గండపార్శ్వే నివేశితః –త్వయా ప్రణష్టే తిలకే తమ్ కిల స్మర్తు మర్హసి "

మరో అభిజ్ఞానం ఏదైనా ఇవ్వమని అడిగాడు హనుమ. దానికి ఆమె తానూ తలలో భద్రంగా దాచుకొన్న చూడామణి ని ఇచ్చాను దీన్ని చూసి రాముడు నీ మాటలపై విశ్వాసం తప్పక చూపిస్తాడు. "అనగా సంతోషించి శరీరం పెంచి వెళ్ళే ప్రయత్నం చేస్తుంటే సీత మళ్ళీ "

రాక్షసులమధ్య చిక్కి ఉన్న నన్ను ఎందుకు తిరస్కరిస్తున్నావు. దివ్య చూడామణిని ఇప్పటిదాకా చాలా జాగ్రత్తగా కాపాడుకొన్నాను. ఇక్కడి కష్టాలను దాన్ని చూస్తూ సహిస్తూ నిన్ను చూసిన ఆనందాన్ని దానివలన పొందుతున్నాను. శ్రీమంతమైన రత్నాకరమైన సముద్రంలో పుట్టిన దివ్య మణి అది.దాన్ని నీకు ప్రత్యర్పణం చేస్తున్నాను. ఇక శోకం తో ఎక్కువ కాలం ఉండలేను. రాక్షసబాధలు, ములుకుల్లాంటి మాటలు దుస్సహాలుగా ఉన్నాయి.నీకోసం వీటిని సహిస్తున్నాను. శత్రునాశక రామ రాజా ! ఒక్క నెలరోజులే బతికి ఉంటాను.

"ధారయిష్యామి మాసం తు జీవితం శత్రు సూధనా –ఊర్ధ్వం మాసా న్న జీవిష్యే త్వయా హీనా నృపాత్మజ"

రాజా అనటంతో రాజ ధర్మం గుర్తు చేసింది సీత. ఆర్తత్రాణ పరాయణత్వం జ్ఞప్తికి తెచ్చింది

. నాపై రావణ దృష్టి యోగ్యంగా లేదు. నువ్వు ఆలస్యం చేస్తున్నావని విని క్షణంకూడా జీవించలేను మహా ప్రభూ "అన్నది.

ఆమాటలకు చలించిన హనుమకన్నీరు కారుస్తూ "దేవీ !నీ వియోగదుఖం తో రాముడు అన్ని పనులకు విముఖుడుగా ఉన్నాడు. సత్యప్రమాణం గా చెబుతున్నాను రాముడు దుఖిస్తే తమ్ముడూ ఏడుస్తున్నాడు.

"త్వచ్చోక విముఖో రామో దేవి సత్యేన తే శపే-రామే దుఖాభి భూతే తు లక్ష్మణఃపరి తప్యతే "

ఎంతో శ్రమపడితే కాని నీ దర్శనం కాలేదు. ఇది దుఖించేసమయం కాదు. ఈక్షణమే నీ దుఖం అంతమౌతుంది"అన్నాడు మళ్ళీ ఆమె "రాముడు ఎలానన్ను ఈ దుఃఖ సముద్రం దాటిస్తాడో దానికి తగినట్లుగా ఆయనతో మాట్లాడు, నాశోకం, రాక్షసుల బెదిరింపు వెళ్ళగానే క్షణం ఆలస్యం చేయకుండా చెప్పు. నీ ప్రయాణం సుఖమగుగాక "అన్నది

"బ్రూయాస్తురామస్య గత స్సమీపం –శివశ్చ తే ద్వాంతుహరి ప్రవీర "

సీత ఇలా పలకగానే ఆమె సందర్శనం తో తాను కృతార్ధుడ నయ్యానని ఉప్పొంగుతూ, ఇంకా చేయాల్సిన పని కొద్దిగా మిగిలి ఉందని గ్రహించి హనుమ ఉత్తర దిశగా బయల్దేరాడు

"సరాజపుత్ర్యా ప్రతి వేదితార్ధః –కపిః కృతార్ధః పరి హృష్ట చేతాః-అల్పావ శేషం ప్రసమీక్ష్య కార్యం –దిశం హ్యుదీచీం మనసా జగామ "

ఇది 24శ్లోకాల 40 వ సర్గ.

హనుమను ప్లవగోత్తమా, హరిపున్గవం, హరి గణోత్తమ అంటూ చాలా ప్రైజింగ్ గా సంబోధించింది. ఆయనమనసూ చల్లబడింది. మాయాబజార్ సినిమాలో "అదే మన తక్షణ కర్తవ్యమ్ "అని ఆర్ నాగేశ్వరరావు మాటమాటికీ అన్నట్లు సీత రాముడికి వెళ్ళిన తక్షణమే తన స్థితి తెలియబర్చమని పదే పదే చెప్పి పంపించింది. రెండు అభిజ్ఞానాలు కాదు మూడోది కూడా అంటే గండశిలపర్వతం దగ్గర ఆమె నుదుట మణిశిలా తిలకం అద్దటం జ్ఞాపకం చేసింది. పుణ్య స్త్రీ నుదుట క్షణకాలమైనా బొట్టు లేకపోవటం అశుభం కనుక రాముడు వెంటనే స్పందించి స్వయంగా తిలకం పెట్టాడు. అది స్త్రీకి ఎంతో శుభం సౌభాగ్యదాయకం సర్వ మంగళకరం. దాన్ని జ్ఞప్తికి తెచ్చింది అంటే తనమాంగల్యాన్ని మళ్ళీ కాపాడే సమయం వచ్చింది అని మరోసారి గుర్తు చేసింది. ఈ మూడూ చాలక ఇంకోటి ఏదైనా ఇమ్మన్నాడుహనుమ. ఆమె అక్కర్లేదు చూడామణి చూడగానే రాముడికి కర్తవ్యం వెంటనే బోధపడుతుంది అని చెప్పింది దాన్ని ఇంతకాలం ఎంత భద్రంగా దాచుకొన్నదో వివరిస్తూ, దాని పవిత్రతనూ,దివ్యత్వాన్నీ వివరించింది.

హనుమ వాయు మార్గాన తిరిగి వెడుతున్నాడుకనుక "బాన్ వాయెజ్ "కూడా చెప్పి ప్రయాణం సుఖకరం కావాలని దీవించింది.హనుమంతుడు కూడా మనలాగే ఒట్టు పెట్టాడు దేనిమీద ?సత్యం మీద. అందుకే మనకు లోకం లో "సత్యప్రమాణకం"గా అనే మాట వచ్చింది. సశేషం

తనను విపరీతంగా అభినందించిన సీతాదేవిని విడిచి ప్రయాణానికి బయల్దేరుతూ మనసులో "రావణుడి నివాసానికి సంబంధించిన పని ఇంకా కొంచెం మిగిలే ఉన్నది. "అనుకొన్నాడు ఇంతకు ముందు సర్గలోనే ఆఅభిప్రాయం "అల్పావశేషం ప్రసమీక్ష కార్యం "అని మనకు అక్కడ సస్పెన్స్ కలిగించి ఇక్కడ దానికి తెర దించాడు. మనసులో ఇంకా"రాక్షస బలాబలాలు, రావణ హృదయం తెలుసుకోవాలి. దీనికి సామ దాన భేదోపాయాలు కుదరవు దండోపాయమే శ్రేష్టం –దండం దశగుణం భవేత్. రాక్షసులు సామోపాయానికి లొంగరు.సమృద్ధిగా సంపదలతో ఉన్నారుకనుక దానం కూడా వారి యెడల వ్యర్ధమే. బలగర్వితులు కనుక భేదానికి లొంగిపోయే ఘటాలు కాదు. కనుక చతుర్ధ ఉపాయం పరాక్రమమమే ఉపయోగించక తప్పదు. రాక్షసులలో కొందరిని చంపితే మిగిలినవారు ఎలాగైనా కొంత మెత్తపడతారు. నిర్దేశించిన పని చెడకుండా అనేకపనులు సాధించేవారే కార్యాచరణ యోగ్యులవుతారు –

"కార్యే కర్మణి నిర్దిష్టే,యో బహూన్యపి సాధయేత్ –పూర్వ కార్యా విరోదేన స కార్యం కర్తు మర్హసి "

ఒకేకారణం తో చిన్నపని కూడా సాదిమలేము. మహాకార్యం ఎలా సాధ్యం ?ఎవడు అనేక హేతువులతో కార్యసాధన మొదలు పెడతాడో అతడు ఆపనిని సాధించటం లో సమర్ధుడు –

"న హ్యేకస్సాధకో హేతుః స్వల్ప స్యాహీప కర్మణః –యోహ్యర్ధం బహుదా వేద స సమర్ధోర్ధ సాధనే "

ఇక్కడ ఉండగానే మా యొక్క,శత్రువుల యొక్క యుద్ధ తారమ్యం తెలిసి, బలాబల నిశ్చయం చేసి సుగ్రీవుని దగ్గరకు వెడితే నే స్వామి ఆజ్ఞ పూర్తిగా నెరవేర్చిన వాడినౌతాను.

"పరాత్మ సమ్మర్ద విశేష తత్వ విత్ –తతః కృతంస్యా న్మమ భర్తు శాసనం "

"నాకు ఇప్పుడు రాక్షసులతో అప్రయత్నంగాయుద్ధం ఎలా జరుగుతుంది ?ఇలా యుద్ధం జరిగితేనే రావణుడికి తనబలం, మా రామ సుగ్రీవ బలం తెలుసుకో గలడు.ఇప్పుడు నేను రావణ, మంత్రి సహిత సేనానులను యెదిర్చి, సీత విషయం లో అతని మనో నిశ్చయం, వాడి బలం పూర్తిగాతెలుసుకొని మాత్రమె లంకనుంచి నిష్క్రమిస్తాను. ఇది రావణ ఉద్యానం నందనవనంలా శోభాయంగా ఉన్నది. అగ్ని ఎండుకట్టెను కాల్చినట్లు నేను ఈ వనాన్ని దహించి పాడు చేసి రావణుడికి కోపం తెప్పిస్తాను. అతడికి కోపం వచ్చి పెద్ద సైన్యం నామీదకు పంపిస్తాడు. వాళ్ళతో యుద్ధం చేసి, నా పరాక్రమ విక్రమాలను చూపించి ఆ సైన్యాన్ని పూర్తిగా చంపి కిష్కింధకు వెడతాను "అని నిశ్చయం చేసుకొన్నాడు.

తన ఉరువుల వేగం తో వనం లోని చెట్లను విరవటం మొదలుపెట్టి, పక్షులు తీగలతో క్రిక్కిరిసిన ఆ ప్రమదా వనాన్నితుత్తునియలు చేశాడు. కాసేపట్లో ఆవనం విరిగిన చెట్లు, కట్టలు తెగిన కొలనులు,పిండి చేయబడిన కొండలతో రోతగా కనిపించింది. లతా, చిత్ర గృహాలు నశించి మహా సర్పాలు క్రూరమృగాలు చచ్చి ఎక్కడపడితే అక్కడ పడి.దావానలం చేత తగలబెట్టబడినట్లు, వ్యాకులం చెందిన స్త్రీలాగా, ఉన్నాయి, సౌందర్య వనం శోభకోల్పోయి, విహార సీమ వల్లకాడుగా మారింది. దీనివలన రావణ హృదయానికి వ్యధ కలిగించి, మహా బలవంతులైన రాక్షసులతో తానొక్కడే యుద్ధం చేయాలని సంకల్పించి, అశోకవన బహిర్ద్వారం చేరాడు హనుమ.

"త తస్య కృతార్ధ పతే ర్మహాకపి –ర్మహద్వ్యలీకం మనసో మహాత్మనః –యుయుత్సు రేకోబహుభి ర్మహాబలైః-శ్రియా జ్వలన్ తోరణ మాస్థితః కపిః"

మొదటిపాదం లో మహాకపి అని రెండవ పాదం లో చివర కపి అనటం లో ఉద్దేశ్యం ఏమిటి ?మొదటి దానిలో ఆయన ఆంతర్యం కనిపిస్తే, రెండవ దానిలో ఆయన చేసినపని కపిత్వం కనిపిస్తుంది.

ఇది 21శ్లోకాల 41వ సర్గ.

ఇందులో కార్య సాధకుడు ఎలా ప్రవర్తించాలో చెప్పాడు. అది లోకం లో అందరికీ అనుసరణీయం. కృష్ణ రాయబారం లోకూడా కృష్ణస్వామికి కౌరవులకు పాండవుల బలం చెప్పి, కౌరవుల బలం స్వయం గా తెలుసుకోవటమే ధ్యేయం. దీనికి త్రేతాయుగం లో నే హనుమ మార్గ దర్శనం చేశాడని భావించవచ్చు. మొత్తం మీద" చూసి రమ్మంటే కాల్చి వచ్చాడు "అనే సామెత సృష్టించి ఇచ్చాడు మనకు హనుమ.సారీ ఆయనేమీ

ఇవ్వలేదు. మనమే ఆయన పనికి దాన్ని కల్పించుకున్నాం. మంచి జరిగితే సామెత సార్ధకం. లేకపోతె పని పాడు చేశాడనే అర్ధం వస్తుంది. రెండువైపులా పదును ఉన్న సామెత ఇది.

"అల్పకార్య మిదం శేషం "అని గురువుగారు హనుమ అన్నమాట లోకంలో ఒక నానుడిగా కూడా ఉన్నది –ఐనను పోయిరావలయు అస్తినకు "అన్నట్లుగా. అల్పకార్యం అని చెప్పినా బృహత్ కార్యంతో అశోక వనధ్వంశం చేసి మొదటి సారి రాక్షసరాజుపై చావు దెబ్బకొట్టాడు. అక్కడి నుంచి ఇక ఏది చేసినా ప్రణాళికా బద్ధంగా నే చేసి రావణుడి క్రోధానికి కారకుడై, లంకకే చేటుతెచ్చే పను పనులుతన వీర శౌర్య పరాక్రమ బుద్ధి బలాలతో చేశాడు. ఒక్కో పనితో ఒక్కో చావు దెబ్బ కొట్టాడు చచ్చిన వాళ్ళకే కాక వాళ్ళను పంపిన ఆయనకు కూడా. ఆ వైభోగం దర్శిద్దాం.

పక్షుల,మృగాల చెల్లాచెదరైన వాళ్ళ భయ ఆర్తనాదాలు విరిగి విరుగుతున్న చెట్ల ధ్వని విని చూసి రాక్షస స్త్రీలు నిద్ర లేచి అశోకవనం లో హనుమను చూశారు. ఇప్పటిదాకా సీతఃకు ఒక్కదానికి మాత్రమె కనిపించాడు. ఇప్పుడు అందరికి కనిపించి సత్తా చూపుతున్నాడు. వాళ్ళను చూడంగానే గురుడు రెచ్చిపోయి వాళ్ళను భయ పెట్టేట్లు పెద్ద రూపం పొందాడు, పర్వత సన్నిభ హనుమ ఆకారం చూసి వాళ్ళు సీతను "ఎవడు వాడు ఎక్కడి నుంచి ఎందుకు వచ్చాడు ?నీతో ఏం మాట్లాడాడు ?భయం లేకుండా చెప్పు ?"అని ప్రశ్నించారు

"కోయం కన్య కుతోవాయం కిన్నిమిత్త మిహాగాతః -కథం త్వయాసహానేన సంవాదః కృత ఇత్యుత ?"

"ఆచక్ష్వనో విశాలాక్షీమా భూత్తే సుభగే భయం –సంవాద మసితా పాంగే త్వయా కిం కృత వానయం ?"

రక్కస వనితల "టోన్"మారింది మర్యాదగా సీతను విశాలాక్షీ, అసితాపాంగే,కన్యా అనే విశిష్ట విశేషణాలతో సంబోధించారు.

సీత ఏం చెప్పాలి ?ఏం చెబితే ఏం కొంప మునుగుతుందో ?అని తెలిసి లౌక్యంగా నెపం వాళ్ళమీదే నెట్టి "ఏమో !భయంకర రాక్షసులగురించి తెలుసుకొనే శక్తి నాకు ఎక్కడిది ?అతడు ఎవరో ఏమి చేయాలనుకున్నాడో మీరే తెలుసుకోండి పాముకాళ్ళు పాముకే తెలుస్తాయి ఇందులో అనుమానం లేదు. అతడిని చూసి నేను భయపడ్డాను. ఎవరో నాకు తెలీదు. కామరూపంతో వచ్చిన రాక్షసుడే అనుకొంటాను "అన్నది.

"రాక్షసాంభీమ రూపాణాంవిజ్ఞాతే మమ కా గతిః-యూయమే వాభి జానీత యోయం యద్వాకరిష్యతి –అహి రేవ హ్యహేః పాదాన్విజానీతిన సంశయః "

"అహమప్యస్య భీతాస్మి నైనం జానామి కోన్వయం-వేద్మి రాక్షస మే వైనం కామరూపిణ మాగతం "

ఇది పూర్తి అబద్ధమే అయినా అతికి నట్లు సరిపోయింది. ఆడవాళ్ళు అబద్ధాలాడితే గోడకట్టినట్లు ఉంటుంది అనే లోకోక్తి ఇలాంటి వారివల్లే వచ్చి ఉంటుంది. అయినా అబద్ధానికి కొన్ని ఎక్సెంప్షన్స్ లు ఇచ్చారు మనపూర్వులు –ప్రాణ విత్త మాన భంగమందు బొంక వచ్చు నదిప "మూడుకు ఇస్తే ఇంకెన్నైనా చేర్చవచ్చు కదా.ఇప్పుడు ఒక మహా కార్యం జరగాలి. అది తనమాన ప్రాణాలకు సంబంధించినది. ఇప్పుడే రట్టు చేస్తే రామకార్య భంగమవుతుంది, దానివలన రాక్షసుల రాక్షసత్వం పెంపు, మానవుల మానవత్వం కుదింపు జరిగి ధర్మానికే నష్టం కలుగు తుంది. కనుక సీత మాట్లాడిన తీరు సర్వతో భద్రమైనది. కనుక గుణ దోష చర్చ అప్రస్తుతం.

సీత మాటలకు భయపడిన రాక్షసాంగనలు కొందరు అక్కడే ఉండి, కొందరు భయంతో పరుగెత్తి కొందరు రాజుకు నివేదించటానికి వెళ్ళారు. వీళ్ళు రావణుడితో "రాజా !అశోక వనం లో భయంకర శరీరం తో అంతులేని పరాక్రమ తో ఉన్న వానరుడు ఒకడు సీతతో మాట్లాడాడు. ఆమెను మేము అడిగితె వాడి గురించి తెలియ జేయటానికి ఇష్టపడలేదు. వాడు ఇంద్రలేక కుబేర దూతకాని లేక సీతాన్వేషణకు రాముడు పంపిన దూత కాని కావచ్చు. సీత కూర్చున్న చోటు కాక మన ప్రమదావనం సర్వం నాశనం చేశాడు. సీతను కాపాడటానికి అలా చేశాడా లేక అలసటతో ఇక చేయలేక పోయాడో తెలీదు. అయినా వాడికి శ్రమ ఏమిటి ?ఆమెను కాపాడటానికే అలా చేశాడు. సీత కూర్చున్న శింశుపా వృక్షాన్ని ఏమీ చేయలేదు.కనుక వాడి కి తీవ్ర దండన విధించు. ప్రాణాలపై ఆశలేనివాడుతప్ప సీతతో ఎవడు మాట్లాడగలడు?"అన్నారు. తీవ్రకోపం పొంది తనతో సమాన బలం ఉన్న రాక్షస కింకరులను హనుమంతుని పట్టుకోమని ఆనతిచ్చి పంపాడు.

80వేల మంది ఆ రాక్షస కింకరులు భయంకర ఆకారాలతో యుద్ధం చేయాలనే ఉత్సాహంతో హనుమపైకి అగ్నిలో దూకిన మిడతల్లాగా వచ్చి పడ్డారు. ఈఉపమానం వలన వాళ్ళ చావు తప్పదు అని ముందే చెప్పాడు మహర్షి వాల్మీకి. హమ్మయ్య యుద్ధం చేసే అవసరం వచ్చింది అని సంబరంతో హనుమ శరీరం పెంచి కొండలాగా నిలబడి తోకను నేలమీద కొట్టి స్వేచ్చగా తోక కదిలించగా ఆ భయంకర శబ్దానికి భయంతో పక్షులు

ఎగిరిపోయాయి. అప్పుడు హనుమ –"జయత్యతి బలో రామో లక్ష్మణశ్చ మహాబలః –దాసోహం కోసలేన్ద్రస్య రామ స్యాక్లిష్ట కర్మణః అని మొదలుపెట్టి పూర్వం లాగా 6శ్లోకాలు చదివాడు.చివరగా –

"సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వ రక్షసాం-తస్య తన్నాద శబ్దేన తే భవన్ భయ శంకితాః""అంటే సకల రాక్షస సమక్షం లో నేను ఈ లంకను పీడించి,సీతా దేవికి నమస్కరించి, నాప్రయత్నాన్ని ఫలవంతం చేసుకొని పోతాను. అని గర్జించాడు. ఈ మహా గర్జనకు అక్కడికి యుద్ధానికి వచ్చిన కిమ్కర రాక్షసులు భయపడి హనుమ ఎత్తైన సంజమబ్బులాగా కనిపించాడు. అయినా ప్రభువు ఆజ్ఞప్రకారం హనుమతో వివిధ ఆయుధాలతో తలపడ్డారు. బయట ద్వారం వద్ద ఉన్న పెద్ద గద తీసుకొని హనుమ ఆకాశం లోకి యెగిరి, రాక్షసులని మోదాడు. ఆరాక్షస కింకరులు అందర్నీ నేలమట్టం చేసి మళ్ళీ బహిర్ద్వారం పై కూర్చున్నాడు. భయంతో కొందరు రాజు దగ్గరకువెళ్ళి చెప్పారు. అంతమంది చావు వార్త విని కొంచెం కంపించి మహా బల పరాక్రమ వంతుడు, అసాధ్యుడు సహస్ర పుత్రుని హనుమపైయుద్ధం చేయమని ఆజ్ఞాపించాడు రావణుడు. ఇది 43శ్లోకాల 42వ సర్గ



రావణ కింకరులను హతమార్చిన హనుమ ఇకపై "కిం కర్తవ్యమ్ "అని ఆలోచించి "అశోకాన్ని విరచి శోక వనం చేశాను. ఇక చైత్య ప్రాసాదాల పనిపట్టి నేలమట్టం చేయాలి "అనిమేరుపర్వత శిఖరాయమాన చైత్య ప్రాసాదం ఎక్కి మారుతి మరోమార్తాండుడిలాగా, పారియాత్రం అనే కులపర్వతం లాగా భాసించాడు. లంక అంతా వినిపించేట్లు పెద్దపెద్ద శబ్దాలు చేసి ఒడలు చరచుకొన్నాడు. ఆ ధ్వనికి కర్ణ భేరులు బ్రద్దలై పక్షులు పారిపోయాయి కావలివారికి స్పృహ తప్పింది. మళ్ళీ రికార్డ్ పెట్టాడు –

"రాజాజయతి సుగ్రీవో రాఘవేణాభి పాలితః –దాసోహం కోసలేన్ద్రస్య రామ స్యాక్లిష్ట కర్మణః "

సునాయాస కార్యసాధకుడు రాముడికి దాసుడిని వాయుపుత్రుడను హనుమంతుడను శత్రు సైన్య వినాశ కారణుడను.వేలాది రాళ్ళతో వృక్షాలతో నేనుకొడితే వెయ్యిమంది రావణులైనా నాకు యుద్ధం లో సాటికారు

"న రావణ సహస్రంమే యుద్ధేప్రతిబలం భవేత్ –శిలాభిస్తుప్రహరతః పాదపైశ్చ సహస్రశః "

లంక నాశనం చేసి, సీతకు మొక్కి, రాక్షసులు చూస్తుండగానే సఫలతతో తిరిగి వెడతాను "అని బిగ్గరగా అరచి అందరికి గుండె దడపుట్టించి భయభ్రాంతులను చేశాడు. ఇది విన్న చైత్య రక్షకులైన వందమంది వివిధ ఆయుధాలతో హనుమపై దూకారు. హనుమ భీకరంగా మారి నూరుబంగారు అంచులున్న ఆమహా ప్రసాదస్తంభాన్ని వేగంగా పీకి పారేసి దాన్ని గిరగిరా తిప్పగా అందులో అగ్నిపుట్టి అదంతా తగలబడిపోయింది. హనుమ అదే వేగంతో వందమంది రాక్షకులను పరిమార్చాడు. "సుగ్రీవాజ్ఞ పాలించే మహా బలవంతులైన వానర ప్రముఖులు నా వంటి వారు వేలాది మంది భూమండలమంతాతిరుగుతున్నారు. మేమంతా సుగ్రీవాజ్ఞాను వర్తులమే. అందులో కొందరు 10ఏనుగులబలం, మరికొందరు వంద ఏనుగుల బలం, కొందరు ఒఘమ్ అనే సంఖ్య ఉన్న ఏనుగుల బలమున్నవారు కోట్లాది వానర భల్లూక సైన్యంతో మారాజు సుగ్రీవుడువచ్చి మిమ్మల్ని మట్టి కరిపిస్తాడు. ఇక్ష్వాకురాజు రాముడి తో వైరం తో ఉన్న కారణంగానే మీరూ మీలంకా,మీరాజు రావణుడు ఇక హుళక్కే అని భావించండి "అని అరచి జబ్బలు చర్చి చెప్పాడు మహా బలహనుమ.

"మాదృశానాం సహస్రాణి విస్పష్టానిమహాత్మనాం –అటంన్తి వసుధాం కృత్స్నాం వయమన్యేచ వానరాః"

"దశనాగ బలాః కేచిత్కేచి ద్దశ గుణోత్తరాః-కేచిన్నాగ సహస్రస్య బభూవు స్తుల్య విక్రమాః"

"సంతిబౌఘబలాః కేచి త్కేచి ద్వాయు బలోపమాః-అప్రమేయ బలా శ్చాన్యే'త్రాసన్హరి యూధపాః"

"నేయమస్తి పురీ లంకా న యూయం న చ రావణః –యస్మా దిక్ష్వాకు నాథేన బద్ధం వైరం మహాత్మనా "

ఇది 25శ్లోకాల 43 వ సర్గ

ఇప్పటికి వందమందిరాక్షస కింకరులు,వందమంది చైత్య రక్షకులు హనుమ చేతిలో హతమయ్యారు. ఈ కౌంట్ క్రమంగా కరోనా మరణాల సంఖ్యలా పెరుగుతుంది తర్వాత తర్వాత. ఇక్కడ హనుమ ఏమి సాధించాడు ?చెట్లు చేమలు విరిస్తే కోతి చేష్టలుగా మిగిలిపోతుంది కనక మహా బలవంతుడు చేయాల్సిన పని చేయాలని చైత్య ప్రసాద విధ్వంసంతో అది సరిపోతుందనుకొని అదీ చేసి ఎదురొచ్చిన రాక్షకులను అందర్నీ చంపేశాడు. తానెవరో, తన నాయకుడు ఎవరో, వానర బలం ఎంతటిదో అరచి అరచి మరీ అందరికి లౌడ్ స్పీకర్ ప్రకటన లాగా చెప్పాడు. ఈ వార్తలన్నీ రాక్షసరాజుకు చేరాలనేదే ఉద్దేశ్యం. ఇంతటి వినాశనానికి కారణం కేవలం రాక్షసులు రాక్షరాజు రావణుడు మహా పరాక్రమశాలి ఇక్ష్వాకు వంశకులదీపం శ్రీరాముడితో వైరం పెట్టుకోవటమే అని దాని ఫలితం అందరి వినాశనమే ననీ తెగేసి అరచి చెప్పాడు.

తనబలపరాక్రమాలు చూపి చైత్య ప్రాసాదాన్ని నేలమట్టం చేసి తనవానర సేనా బల వివరాలు తెలియజేస్తూ, అసలు కపి సైన్యం ఎంతుందో ఖచ్చితంగా రావణుడికి తెలియజేశాడు. అందులో కొందరు ఓఘం సంఖ్యకల ఏనుగుల బలం ఉన్నవారు అన్నాడు. ఓఘం అంటే సముద్రం అనే అర్ధం కూడా ఉంది. సముద్రం లోతు అంతుపట్టదు. అదేకాక ఓఘం అంటే 1057, అంటే 10తర్వాత 57సున్నాలు పెడితే యెంత పెద్ద సంఖ్య వస్తుందో అంతసంఖ్యున్న ఏనుగులు యెంత బలం కలిగి ఉంటాయో అంతటి బలమున్నవారు అని అర్ధం. ఈ సంఖ్యకంటే పెద్దది మహా ఓఘ0 అంటే 1062...

కనుక ఆషామాషీ వ్యవహారం కాదు. అనంత బలసంపన్నమైన వానర సైన్యం అనంతంగా కదలి వస్తుందని హెచ్చరించాడు హనుమ.

రావణుడి ఆజ్ఞతో ప్రహస్తునికొడుకు జంబుమాలి యెర్ర మాలలు వస్త్రాలు సకల ఆభరణాలతో పెద్దకోరలతో బయల్దేరి వచ్చి అల్లెత్రాటిని లాగి పిడుగులాంటి భీకర శబ్దాన్ని చేయగా ఆ ధ్వనిఅన్ని దిక్కులూ భూ నభోన్తరాలకు ప్రాకింది. రాగానే మహాకపి పై వాడి బాణాలు వేశాడు. అసలే ఎర్రనిముఖం ఆ బాణ ఘాతాలతో మరింత ఎర్రబడి శరత్కాల తామర పువ్వులా ప్రకాశించాడు –

తస్య తచ్చుశుభే తామ్రంశరేణాభి హతం ముఖం –శరదీవామ్బుజం ఫుల్లం విద్దంభాస్కర రశ్మినా"

అసలే ఎర్రనిముఖం బాణపు దెబ్బలతో మరింత ఎర్రగామారి ఆకాశం లో రక్త చందన బిందువులతో తడుపబడిన పెద్ద తామర పువ్వూ లాగా శోభిల్లింది –

"యధాకాశే మహాపద్మం సిక్తం చందన బిందుభిః –చుకోప బాణాభి హతోరాక్షసస్య మహా కపిః"

ఈదెబ్బలతో రెచ్చిపోయిన హనుమ అక్కడే కనిపించిన పెద్ద బండరాయి పీకి జంబు మాలిపై విసిరేస్తే వాడు 10బాణాలతో ముక్కలు చేశాడు. కోపం మరీపెరిగి విశాల సాలవృక్షం పెరికి గిరగిరా తిప్పి వాడిపై విసరగా వాడు ఐదు బాణాలతో దాన్ని, ఒకబాణం తో హనుమ భుజాన్నీ, ఒకబాణంతో వక్షస్థలాన్నీ పదిన్టితో స్తనప్రదేశాన్ని కొట్టాడు. ఒళ్ళంతా బాణమయమైకోపోద్ధృతి తో ఇనప గుదియ(పరిఘ ) వేగంగా తిప్పి వాడి రొమ్ముపై కొట్టాడు. ఆ దెబ్బతో వాడి తల, చేతులు, మోకాళ్ళు విల్లు, గాడిదలు, గుర్రాలు చిరునామా లేకుండాపోయి, వాడి అవయవాలు,ఆభరణాలు పొడిపొడిఅయి జంబుమాలి నేలపైబడి, జముని దగ్గరకు చేరాడు.

"న ధను రణ రథోనాశ్వాస్తత్రా దృశ్యంత నేషవః –స హత స్సహసా తేన జమ్బుమాలీ మహాబలః "

"పపాత నిహతో భూమౌ చూర్ణి తాంగ విభూషణః"

కింకరులు,మహాబలశాలి జంబుమాలి హనుమ చేతిలో చచ్చారన్న వార్తవిని రాక్షసరాజు సహించలేక మంత్రిపుత్రులను హనుమపైకి యుద్ధానికి పొమ్మని ఆనతిచ్చాడు.

ఇది 20శ్లోకాల 44 వ సర్గ.

ఇదే మొదటిసారి హనుమకు ఒక మహా బలవంతుడితో లంకలో పోరాడటం. ఇందులోనూ విజయం సాధించాడు వాయుపుత్రహనుమ.

ఇంతటి భీకర యుద్ధం లోనూ మహర్షి మనకు కాస్త వినోదం కోసం హనుమ ముఖం అసలే ఎర్రగా ఉన్నది వాడి బాణాల దెబ్బలతో మరింత ఎర్రబడటాన్నిచక్కని ఉపమానాలతో వర్ణించి కాస్త నవ్వుకూడా తెప్పించాడు. బండరాయి, సాల వృక్షం కూడా జంబుమాలిని ఏమీ చేయలేకపోయాయి. చివరిగా తన ఆయుధం పరిఘ మాత్రమె వాడి ప్రాణాలు తీయగలిగింది. అదీ వాడి అవయవాల,ఆభరణాల రథాలగుర్రాల గాడిదల అడ్రస్ లేకుండా చేసి వాడిని భూశయం ముందే చేయించింది, అదీ హనుమ వీర విక్రమ పరాక్రమ ప్రతాపం.

రావణ ఆజ్ఞతో అగ్ని తేజులైన ఏడుగురు మంత్రి పుత్రులు హనుమపైకి వచ్చారు. రంగులతోరణాలు అనేక విధాలైన రథాలు తమతమ అసాధారణ చిహ్నాలతో ఉన్న పతాకాలు తో మేఘధ్వనికలిగిస్తూ వచ్చారు. మేలిమి బంగారు విల్లులతో టంకార ధ్వని చేస్తూ, మెరుపులతో కూడిన మేఘాల్లా దూసుకొచ్చారు. వారి తల్లులకు కింకరులు హనుమ చేతిలో చచ్చారన్న వార్త ముందేవిని బంధు మిత్రాదులతో దిగాలుగా,దిగులుగా ఉన్నారు –

"జనన్యస్తు తత స్తేషాం విదిత్వా కిమ్కరాన్ హతాన్ –బభూవు శ్శోకసంభ్రాంతా స్సబాంధ వ సుహ్రు జ్జనా"

మంత్రిపుత్రులు తమలో తాము హనుమను చంపుతామని పోటీ పడుతూ ద్వారప్రదేశం దగ్గరున్న హనుమపైకి దూకారు. మేఘాలు,రథ గర్జితం అనే మేఘ గర్జన ధ్వని తో వర్షించే మేఘాలలాగా బాణ వర్షం కురిపిస్తూ, అంతటా తిరుగుతూ హల్ చల్ చేశారు. హనుమ వెంటనే వ్యూహం మార్చి శరీరం పెంచి, వర్షంచేత కప్పబడిన పర్వతాకారశరీరుడై కనిపించాడు. ఆబాణాలమధ్య వేగంగా కదులుతూ, వాటిని నిష్ప్రయోజనం చేశాడు. ఆకాశంలోకి యెగిరి వాళ్ళ రథాల వేగాన్ని కూడా ప్రయోజనం లేకుండా చేశాడు, అంతరిక్షం దాకా దూసుకువెళ్ళి అరివీర భయంకర హనుమ, ఇంద్ర ధనుసుతో ఉన్న మేఘాలున్న ఆకాశం లో తిరుగుతూ వాయుదేవుడిలాగా ఉన్నాడు. అక్కడి నుంచే భయంకరంగా గర్జించి ఆ సేనను మరింత భయపెట్టాడు.

వీళ్ళ మీద ఆయుధాలు ఎందుకనుకొని, వారిలో కొందర్ని చేతులతో, కొందరిని పాదాలతో,, కొందర్నిగోళ్ళ"తో మరికొందరిని ఎదురు రొమ్ము తో, కొందరిని తొడలతో చీల్చిపారేశాడు.మరికొందరు హనుమ అరుపుకే ప్రాణాలు కోల్పోయి నేలమీద పడి చచ్చారు-

"తలే నాభ్యహన త్కాంచి త్పాదైః కాంశ్చిత్పరంతపః-ముష్టినాభ్యహన త్కాంశ్చి న్నఖైః కాంశ్చిద్వ్యదారయత్

"ప్రమమా థోరసా కాంశ్చిదూరుభ్యామపరాన్ కపిః-కేచిత్తస్య నినాదేన తత్రైవ పతితాభువిః"

మంత్రికొడుకులు చనిపోగానే సైన్యమంతా భయపడి చెల్లా చెదరై పారిపోయింది. ఏనుగులు పెద్దగా ఘీంకరించాయి గుర్రాలు నేలకూలాయి. యుద్ధభూమి అంతా విరిగిన రథాల టెక్కాలు గొడుగులు వాటిముక్కలతో భీభత్సంగా కనిపించింది. సైన్య, జంతు రక్తాలతో దారులన్నీ తడిసి బురదగామారాయి. లంకలో వికృత శబ్దాలు వినిపించాయి. మంత్రికొడుకులతో యుద్ధం అయ్యగారికి మజాగా లేదు. చప్పగా అనిపించింది. మరికొందరితో యద్ధం చేయాలన్న కండూతి పెరిగి ద్వార తోరణం ఆశ్రయించాడు మంత్రికుమారహత హనుమ.

"స తాన్ ప్రవృద్ధాన్ వినిహత్య రాక్షసాన్ –మహాబల శ్చండ పరాక్రమః కపిః-యుయుత్సు రన్యైః పునరేవ రాక్షసై-స్తమేవవీరోభిజగామ తోరణం"

ఇది17శ్లోకాల 45వ సర్గ

ఇందులో తమాషా ఏమిటంటే రావణ మంత్రుల కొడుకుల పేర్లు వాల్మీకి మహర్షి చెప్పలేదు. వాళ్ళను అగస్త్య భ్రాతలుగా నే ఉంచేశాడు. వాళ్ళు "పొడిచేదేమీ" లేదనే అభిప్రాయమా ?మరోతమాషా వీళ్ళతో యుద్ధం ఆకాశం లో చేయటం. ఇంకో తమాషా వాళ్ళను వాళ్ళ సైన్యాన్నీ చేతులతో,కాళ్ళతో,రొమ్ము,తొడలు, గోళ్ళు తో నుజ్జు నుజ్జు చేశాడుహనుమ, అంటే కొన్కిస్కా గాళ్ళు వీళ్ళపై ఆయుధాలు ఎందుకు దండగ అనుకొని ఉంటాడు హనుమ గురుడు. అరిస్తే కరుస్తా, కరుస్తేఅరుస్తా అన్నట్లు గట్టిగా అరచి హార్ట్ ఎటాక్ తెప్పించి తనతో పనిలేకుండా హరీ అనిపిచాడు హరిసత్తముడు. మేఘం చేసే ఒకరకమైన ధ్వనికి "రథ గర్జితం"అనే పేరు ఉన్నదని వాల్మీకి మనకు తెలియజేశాడు.

కింకరులు,ద్వారపాలకులు, జంబుమాలి ఇప్పుడు మంత్రికొడుకులు హనుమ చేతిలో హతమయ్యారు. పాపం వీళ్ళ తల్లులు బంధువులువీళ్ళు బయల్దేరే ముందే కింకరులు హతమయ్యారన్నవార్తతెలిసి తెల్లమొహాలేశారు. అంటే వీళ్ళూ బతికి బట్టకట్టే వారు కాదు అనే నిర్ణయానికి వచ్చారన్నమాట. అనుకొన్నట్లే జరిగి వారికి పుత్ర శోకం తప్పలేదు. నెత్తురు రుచి మరిగిన సింహం కాని పులికాని మరో వేట జంతువు కోసం ఎదురు చూడటం వాటి సహజలక్షణం. హనుమకూడా అలాంటి వాడే కనుక ఈయన "భుజాల దుల" అంటే ముద్దుగా "కండూతి "తీరలేదు. అతడి దృష్టిలో ఇది ఏకపక్ష యుద్ధమైంది. కనుక నే మరికొందరు రాక్షసులతో యుద్ధం చేసి తనకండూతి తీర్చుకోవాలనుకొన్నాడు. దానికి "వెయిట్ అండ్ సీ" గా మళ్ళీ ద్వారం ఎక్కికూర్చున్నాడు రాక్షస మిడతలదండుకోసం అగ్ని హోత్ర హనుమ.

మంత్రి కుమారుల మరణ వార్తవిన్న రావణుడు కొంచెం కలవరపడినా బయట పడకుండా, అంతకంటే వీరులు దీశాలురు నీతిమంతులు ఐన విరూపాక్ష యూపాక్ష, దుర్ధర,ప్రఘస,భాసకర్ణుడు అనే అయిదుగురు సేనానాయులను పిలిచి "మీకు తోడుగా అమేయ బలపరాక్రమ సైన్యం వెంటపెట్టుకొని ఆ కోతిపై యుద్ధం చేసి, వాడిని ఎలాగైనా అదుపులోకి తీసుకొని ఇక్కడికి తీసుకు రండి. వాడి దగ్గర చాలా జాగ్రత్తగా మసలుకోవాలిమీరు. అలాగే దేశ, కాల విరోధం కాని పనిఆలోచించి చేయండి. వాడు కేవలం వానరుడు అని అనిపించటం లేదు. మహా బలంతో ఉన్న భూతం కావచ్చు. మనల్ని ఇబ్బందిపెట్ట టానికి ఇంద్రుడే వాడిని సృష్టించి మనపైకి పంపి ఉండచ్చు. మనమంతా కలిసి పూర్వం దేవ, అసుర నాగ, యక్ష గంధర్వ, మహర్షులను జయించాం కదా. వాళ్ళే మనుకు ఈఉపద్రవం కల్పించి ఉండచ్చు. అనుమానం లేదు. కనుక ఆకోతిని పట్టుకోండి. ధీర వీర పరాక్రముడైన ఆవానరుడిని అవమానించకండి. ఇలాంటి వానరులతో నాకు పూర్వం అనుభవం ఉన్నది.

"హతాన్ మంత్రి సుతాన్ బుద్ధ్వా వానరేణమహాత్మనా –రావణ స్సంవృతాకార శ్చకార మతిముత్తమాం"

"కర్మ చాపి సమాదేయం దేశకాల విరోధినం "

"నావమాన్యో భవద్భిశ్చహరిర్ధీర పరాక్రమః

"దృష్టాహి హరయః పూర్వం మయా విపుల విక్రమః "

వాలి సుగ్రీవ, మహాబలవాన్ జామ్బవాన్, సేనాపతి నీల, ద్వివిద మొదలైన వానరవీరులున్నారు. కాని వారిలో ఎవరికీ ఇంతటి తేజస్సు, పరాక్రమం, ఆలోచన, బలం, ఉత్సాహం కామరూప ధారణం లేవు. ఇదేదో వానర రూప భూతమే. పట్టి తీరాల్సిందే. మీ ముందు ఇంద్రాదులే గడగడ వణుకుతారు. అయినా నీతికోవిదుడు, యుద్ధం లో జయించాలనుకోనేవాడూ చాలాజగ్రత్తగా ముందు తాను రక్షించుకోవాలి. కారణం యుద్ధం లో జయం చంచలమైనది –

"అం తేషాంగతిర్భీమా న తేజో న పరాక్రమః -"న మతి రణ బలోత్సాహౌ న రూప పరికల్పనం ""మహాత్ సత్వ మిదం జ్ఞేయం కపి రూపం వ్యవస్థితం-ప్రయత్నం మహదాస్థాయ క్రియతా మస్య నిగ్రహః "

"తథాపితు నయజ్ఞేన జయమాకాంక్షతా రణే –ఆత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధ సిద్ధి ర్హిచంచలా "అని రావణుడు చెప్పగా రెట్టించిన ఉత్సాహంతో పంచ సేనాపతులు బయల్దేరి, బహిర్ద్వారం వద్ద ఉన్న హనుమను చూసి, అన్నివైపుల్నించి ముట్టడించి హనుమను ఎదిరించారు. దుర్ధరుడు వాడియైన పంచబాణాలు హనుమతలపైకి వేశాడు. ఆదెబ్బలకు హనుమ, సింహనాదం చేసి, ఆకాశంలోకి ఎగిరాడు. దుర్ధరుడు వాడిబానణాలు వేయగా, శరీరం పెంచి, వేగంగా తలపడి కొండపైకి పడే పిడుగులాగా వాడి రథంపై ఒక్కసారి దూకగా, 8గుర్రాలు, బండి నలిగి నుజ్జు నుజ్జు అయి వాడూ చచ్చాడు.

విరూపాక్ష యూపాక్షులు మహాకోపం తో,వేగంతో హనుమపైకి వచ్చారు. వాళ్ళ వేగాన్ని తగ్గించి, భూమిపైకి దిగి, ఒక సాల వృక్షం పెకలించి దానితో బాది ఇద్దర్నీ చంపాడు. ఇప్పటికి మూడు వికెట్లు డౌన్. ప్రఘసుడు కోపం ఆపుకోలేక హనుమమీదకు రాగా, భాసకర్ణుడు కూడా తోడుగా హనుమపైకి బల్లెంతో వచ్చాడు. వాడు అడ్డకత్తి,వీడుశూలం తో యుద్ధం చేశారు. వాళ్ళ దెబ్బలకు ఒళ్ళంతాగాయల్తై, కోపం పెరిగి చెట్లు పాములు, జంతువులతో ఉన్న ఒక పర్వతాన్ని పీకి వాళ్ళపై విసిరి చంపి, మొత్తం అయిదుగురు సేనానులను హతం చేసి మిగిలిన సైన్యాన్ని రథాలతో రథాలను గుర్రాలతో గుర్రాలను ఏనుగులతో ఏనుగుల్ని యోధులతో యోధుల్ని'ఇంద్రుడు అసుర సంహారం చేసినట్లు భయంకరంగా సర్వ నాశనం చేసి కొత్త తరహా యుద్ధానికి తెర దించాడు. తన రణ కండూతికొంత తగ్గించుకొన్నాడు. -

"అశ్వైరశ్వాన్,గజైర్నాగా, న్యోధైర్యోదాన్, రథై రథాన్-స కపి ర్నా శయామాస సహస్రాక్ష ఇవాసురాన్ '

చచ్చినమనుష్యుల జంతువుల కళేబరాలతో, విరిగిన ఆయుధాలు రథాలముక్కలతో ఆప్రదేశం దారుణ మరుభూమిలా కనిపించింది. ఇంతమందిని చంపిన సంతృప్తి ఉన్నా, ఇంకా చంపాల్సినవారికోసం మళ్ళీ బహిర్ద్వారం వద్దకు చేరాడు విరాట్ హనుమ.

ఇది39శ్లోకాల 46వ సర్గ

మొదట్లో రావణుడు మంత్రికొడుకుల చావుకు కలవరపాటు పడినా, గొప్పనటుడులాగా దాన్ని బయట పడనివ్వలేదు. రాజుకు ఇది అవసరం. లేకపోతే ముందుకు వెళ్ళలేడు. ఈసారి మహా బలవంతులైన పంచ సేనానులను పంపాడు. వాళ్ళకు చెప్పాల్సింది స్పష్టంగా చెప్పాడు. కోతిఎవరై ఉండవచ్చో అనేకరకాలుగా ఊహించి చెప్పాడు. తాను అపకారం చేసినవారు పగబట్టి పంపించినవాడేమో అనీ అనుకొన్నాడు. తర్వాత వాళ్ళను కాసేపు దువ్వి తామంతా కలిసి పూర్వం దేవాసురాదులతో చేసిన యుద్ధం గుర్తు చేసి వాళ్ళ పరక్రమాలకు కాస్త ధూపం వేసి ఉత్సాహ పరచాడు. మొదటి సారి రావణుడి నోటి వెంట రాజనీతి వాక్యాలు దొర్లాయి. ఇదొక విశేషం. యుద్ధం లో ఆత్మ రక్షణ చాలా ముఖ్యం అంటూ జయాపజయాలు మన చేతిలో లేవనే యదార్ధాన్నీ తానే చెప్పాడు. విజయం చంచలం అన్నాడు. హనుమను అనమానించ వద్దని హెచ్చరించాడు కూడా. అతడిని పట్టుకొని తీసుకు రావటమే ముఖ్యం అన్నాడు. తనకు పూర్వం పరిచయమైన వానర వీరులపేర్లుకొన్ని చెప్పి స్మరించాడు. వారిలో ఎవరికీ ఈవానరానికున్నగొప్ప గుణమూ లేదని గట్టిగా చెప్పాడు. తనకు తెలుసు వాలి బలపరాక్రమాలు. అతడి చేతిలో కాటా దెబ్బ తిన్నవాడు.. కనుక గుర్తు బాగానే ఉంది.కానీ చెప్పలేదు. చెబితే అభాసు పాలే కదా.

సేనాపతులు కనుక వీరితో. యుద్ధం సరదాగానే చేశాడు భీభత్సంగా. ఇక్కడే కొత్త తరహాయుద్ధం ప్రదర్శించాడు. గుర్రాన్ని గుఱ్ఱంతో ఏనుగును ఏనుగుతో, యోధుల్ని యోధులతో త రథాలను రథాలతో చావబాదటం ఇప్పుడే ఇక్కడే చూస్తున్నాం. హనుమ ప్రదర్శించిన కొత్త టెక్నిక్ ఇది. చక్కగా పని చేసింది. కాసేపు ఆకాశ యుద్ధమూ చేశాడు గభాల్న రథం మీదకు దూకి ఒకసేనాని వాడి గుర్రాలతో సహా రథం నాశనం చేశాడు. ఇలా మహత్తర ధీ బలపరాక్రమాలతో పంచసేనానులకు పంచత్వం కలిగించాడు హనుమ.

పంచ సేనానులు,వారి మహా సైన్యాలు హనుమ చేతిలో పంచత్వం పొందిన సంగతి విని ఆగ్రహావేశాలతో తన దృష్టిని యుద్ధోన్మత్తుడు, తనకుమారుడు అక్షకుమారునిపై నిలుపగా అర్ధం చేసుకొన్న అతడు బ్రాహ్మణుల ఆహూతులతో వృద్ధి చెందినదీప్తానలం లాగా వేగంగా కదలివెళ్ళాడు హనుమపై యుద్ధానికి.

ఆహూతులిస్తేనే అగ్ని ప్రజ్వరిల్లుతుంది. లేకపోతె ఆరిపోతుంది. సూచ్యార్ధ సూచన ఇది

"స తస్య దృష్ట్యర్పణసంప్ర చోదితః –ప్రతాపవాన్ కాంచన చిత్ర కార్ముకః –సముత్పపా తాథ సదన్యుదీరితో-ద్విజాతి ముఖ్యై ర్హవిషేవ పావకః "

బాలసూర్యకాంతికలవాడై, మేలిమి బంగారు జాలీలతో అలంకరింప బడిన ఆకాశ సూర్య సంచారంలాగా దూసుకుపోయే రథంఎక్కి వెళ్ళాడు. అతని ఎనిమిది గుర్రాలు మనో వేగం కలవి.అతని రథంలో అన్ని రకాల ఆయుధాలు చక్కగా అమర్చబడిఉన్నాయి. స్వర్ణ కేతనాలు రెపరెప లాడుతున్నాయి. ఇలా మందీ మార్బలంతో అక్షకుమారుడు బహిర్ద్వారం వద్ద ఉన్న హనుమపైకి దాడి చేయటానికి వెళ్ళాడు. సింహ నేత్రాలవంటి కళ్ళు న్న అక్షుడు ప్రళయాగ్ని లాగా ప్రజా నాశనం చేసే హనుమను చూడగానే కొంచెం ఆశ్చర్యం, కాస్త తత్తరపాటు పడి, మహాకపిని గౌరవంగా చూశాడు అంటే తనకు సమానబలుడితో యుద్ధం చేస్తున్నందుకు గర్విస్తున్నాడు. ఒకవీరుడు మరొక వీరుని పట్ల చూపాల్సిన గౌరవం అది. చక్కగా పాటించాడు -"స సతం సమాసాద్య హరిం హరీక్షణో-యుగాంత కాలాగ్ని మివ ప్రజాక్షయే - అవస్థితం విస్మిత జాత సంభ్రమ –స్సమైక్ష తాక్షో బహుమాన చక్షుపా "

అక్షుడు తనబలం ఎదిరి బలం బేరీజు వేసుకొని, వసంత సూర్యుడిలాగా వృద్ధి చెంది, హనుమ యుద్ధం లో అసాధ్యుదని అతని పరాక్రమం బట్టి గ్రహించి, కోపం తో స్థైర్యాన్ని కూడగట్టుకొని, జాగ్రత్తగా మూడు బాణాలతో హనుమను కొట్టిగర్వించి, హనుమ గర్వితుడని శ్రమను లేక్కచేయడని, శత్రు భంజకుడని గ్రహించాడు చూసిన కాసేపట్లోనే. అంటే ఎంతటి సూక్షబుద్ధికలవాడో తెలుస్తోంది –

"తతః కపిం తమ్ ప్రసమీక్ష్యగర్వితం –జితశ్రమంశత్రు పరాజయోర్జితం-అవైక్షతాక్ష స్సముదీర్ణమానస-స్సబాణ పాణిః ప్రగృహీత కార్ముకః "

ఈ ఇద్దరి భీకరయుద్ధం దేవ దానవులకు కూడా భయం కలిగించింది.భూమిభయపడి పెద్దధ్వని చేసింది. సూర్యతాపం లేదు వాయువు స్తంభించింది. ఆచలాలైన పర్వతాలు చలించాయి. ఆకాశం రోదించగా సముద్రం క్షోభిల్లింది –అంటే ఏదో ప్రళయం రాబోతున్నాడని సూచన అన్నమాట

–"స్సురా సురాణామపి సంభ్రమ ప్రదః "

"రరాస భూమి ర్న తతాపభానుమాన్ –వవౌ న వాయుఃప్రచాచాల చాలః

""'కపేః కుమారస్య చ వీక్ష్య సంయుగం –ననాదచ ద్యౌరుదిరశ్చచుకుభే"

మంచిములుకున్న ముందుభాగం బంగారు రంగున్న వెనకభాగం కల విషసర్పావంటి మూడు బాణాలు శరసంధాన వేత్త అక్షుడు హనుపై ప్రయోగించడు. ఆమూడుబాణాలు శిరసుపై నాటుకొని రక్తం కారి, వృత్తాకారపు కన్నులు తడిసిపోయి హనుమ అప్పుడే ఉదయించిన సూర్యునిలాగా బాణాలనే కిరణాలమాలతో కూడిన సూర్యునిలా విరాజిల్లాడు –

సతై శ్శరైర్మూర్ధ్ని సమం నిపాతితైః-క్షర న్న సృగ్దిగ్ధ వివృత్త లోచనః –నవోదితాదిత్య శ్శరాంశు మాన్ –వ్యరాజ తాదిత్య ఇవాంశుమాలికః "

అక్షకుమారుని యుద్ధోద్ధతికి హనుమ సంతోషించి, శరీరం పెంచి తీక్షణమైన కంటి చూపుతో అతడి సేనను, వాహనాలను కాల్చాడు – అందుకేనేమో ఇవాల్టి సినిమాలలో "కంటి చూపుతో చంపేస్తాను "అనే డైలాగ్ పాప్యులర్ అయింది. వాల్మీకి భిక్ష ఇది.

"స మండరాగ్రస్థ ఇవాంశు మాలికో –వివృద్ధకోపో బలవీయ సంయుతః –కుమార మక్షం సబలం సవాహనం –దదాహ నేత్రాగ్ని మరీచిభిస్తదా"

వాడుకూడా రెట్టించిన ఉత్సాహంతో పర్వతం మీద మేఘం వాన కురిపించినట్లు బాణాలతో హనుమను కప్పేశాడు. హనుమ స్వేచ్చగా ఆకాశం లో తిరుగుతూ హర్షం తో సింహనాదం చేశాడు. బాలుడైనరాక్షసకుమారుడు తనపరాక్రమానికి తానె గర్విస్తూ, గడ్డితో కప్పబడిన పెద్ద బావి మీదకు ఏనుగు దూకినట్లు దూకాడు. ఇక్కడ కూడా వాడి చావును చెప్పకనే చెప్పాడు. ఏనుగులను బంధించే ఉపాయం ఇది.

వాడిబాణం దెబ్బలకు హనుమ మైండ్ బ్లాకై భుజాలు తొడలు విదిలించి శత్రుభీకరంగా ఆకాశంలోకి యెగరగా అతడిని వెన్నంటి వీడూ ఆకాశం చేరాడు. వాడి "వాడి బాణాల"నడుమ వాయువులాగా కదుల్తూ శరఘాతాన్ని తప్పించుకొన్నాడు హనుమ. అక్షపరాక్రమం వీక్షించి మనసులో సంతోషించి, ఆదరంగా వాడినిచూసి చింతించాడు.అంటే వాడి పరాక్రమాన్ని పొగిడాడు కాని బాలుడు నా చేతిలో చచ్చిపోతున్నాడు అని బాధపడ్డాడు కూడా అన్నమాట

బాలుడైనా మహా యోదులుచేస్తున్నట్లు అన్ని యుద్ధ విధానాలూ వాడు ప్రయోగిస్తున్నాడు అలాంటి వాడిని చంపటానికి మనసు రాకుండా ఉంది అనుకొన్నాడు హనుమ జాలిగా

"అబాలవద్బాల దివాకర ప్రభః –కరోత్యయం కర్మ మహ న్మహాబలః –న చాస్య సర్వాహవ కర్మ శోభినః –ప్రమాపణే మే రతి రత్ర జాయతే "

వాడి పరాక్రమం చూసి సురాసురులైనా భయపడుతారు అనుకొన్నాడు. కాని ఇక ఉపేక్షిస్తే తనశరీరం వాడికి బాణార్పితంఅవుతుందని గ్రహించి, చివరికి అక్షకుమారుని చంపాలనే నిర్ణయానికి వచ్చాడు. అంటే యెంత గుంజాటన పడ్డాడోవాడిని చంపటానికి వాడిని చూసి వాడి పరాక్రమాన్ని చూసి, ఇక క్షణం ఆలస్యం చేయకుండా మెరుపు వేగంతో ఆకాశం లోనే వాడి 8గుర్రాలను రథాన్ని అరచేతితో కొట్టగా అవి అప్పచ్చుల్లా, అప్పడాల్లా అక్కడినుంచి న భూమిపై పడి ప్రాణాలు కోల్పోయాయి. రథం ముక్కలైంది. రథాన్ని వదిలి కత్తి,విల్లు తీసుకొని రుషి తన తపో బలంతో శరీరం వదిలి స్వర్గానికి వెళ్ళినట్లు ఆకాశానికి ఎగిరాడు కుమారా అక్షయ. వాయు వేగం తో వాడిని సమీపించి వాడి పాదాలు గట్టిగా పట్టుకొని వెయ్యి సార్లు తిప్పి నేలపైకి విసిరేశాడు. వాడు సర్వాంగాలూ నుజ్జు నుజ్జుకాగా నేలకూలి చచ్చి తండ్రికి ఒణుకు పుట్టించాడు. హనుమ పరాక్రమానికి ఆకాశ దేవతాగణం ఋషులు మొదలైనవారు ఆశ్చర్యపడ్డారు. దేవేంద్రుని కొడుకుకు సాటి తేజస్సుతో నెత్తురు రులాంటి యెర్రని నేత్రాలతో ఉండే అక్షకుమారుడిని క్షయం చేసి హనుమ ప్రళయకాల యముడిలాగా మళ్ళీ బహిర్ద్వారం దగ్గరకు చేరాడు విజయగర్వంతో- – "నిహత్య తమ్ వజ్రి సుతోప మప్రభం –కుమార మక్షం క్షత జోప మేక్షణం –తమేవ వీరో భిజగామ తోరణం –కృతక్షణః-కాలఇవ ప్రజాక్షయే ".

ఇది 39శ్లోకాల 47వ సర్గ

ఇందులో ఇద్దరూ మహావీరులే. ఒకరిని చూసి మరొకరు గౌరవించుకోవటం ఆశ్చర్యం కలిగించేవిషయం. హనుమపెద్దవాడు కనుక అతికి ఈవిషయం తెలిసి ఉండచ్చు. కాని అక్షకుమారుడు బాలుడు. అతడికి ఈవిషయం తెలియటం అతడి సంస్కారం. అందుకే ఇద్దరూ నమస్కారానికి అర్హులే ఇక్కడ. వాడి పరాక్రమం చూసి మహా ముచ్చట పడ్డాడు హనుమ. వాడు ప్రయోగించిన సకల యుద్ధ విదానాలకు "ఫిదా "అయ్యాడుకూడా. అతని ముచ్చట ఎంతదాకా వెళ్లిందీ అంటే ఆబాలుడిని చంపటానికి మనసు రావటం లేదు అని చెప్పటం దాకా వెళ్ళింది. ఐతే అదియుద్ధం, ఎదిరి పరాక్రమానికి జేజేలు కొట్టుకొంటూ కూర్చుంటే, వాడు ఊరుకోంటాడా ?ఉతికి ఆరేస్తాడు. సూక్ష్మగ్రాహి కనుక

వెంటనే గ్రహించి ఆలస్యం చేయకుండా చంపాలని నిర్ణయానికి వచ్చి, వేగంగా కదిలి వాడి ప్రాణాలు బీభత్సంగా హరించి తండ్రి రావణుడికి వణుకు పుట్టించాడు. కాళ్ళు పట్టి గిరగిరా వెయ్యి సార్లు తిప్పితే వాడిప్రాణాలు గాలిలోనే కలిసిపోయి జీవచ్చవంగా నేలమీద పడి చచ్చాడు. అక్షకుమారవధలో హనుమ మరో టెక్నిక్ అవలంబించాడన్నమాట. మంచి కసిపెంచే యుద్ధం మనకు చూపించాడు వాల్మీకి మహర్షి. రెండుపాత్రలను సమానంగా పోషించాడు, బలవీర పరాక్రమ ప్రదర్శన చూపించాడు. హనుమ రణ కండూతిమరికొంచెం తీరింది.

మహర్షి దగ్గర ఒక గొప్పతనం ఉన్నట్లు నాకనిపించింది. మంచి సంతోష సమయాలలో అనుష్టుప్ ను చాలా గొప్పగా వాడి కావ్య సౌందర్యం పెంచుతాడు. లంకలో చంద్రోదయం అయినప్పుడు అలానే వర్ణించాడు. ఇప్పుడు ఈ సర్గ అంతా అనుష్టుప్ లోనే శ్లోకాలు రాసి అక్షయకుమారుని అక్షీణపరాక్రమానికి జేజేలు పలికించాడు.

తనకు మండోదరికి జన్మించిన అక్ష కుమార మరణం తో కుంగినా, నెమ్మదిగా మనసు దిటవు చేసుకొని రావణుడు మేఘనాధుడు అనే తనకొడుకు ఇంద్రజిత్ తో "అస్త్ర శస్త్ర కోవిదుడవు. నీపరాక్రమం సురాసురులకు బాగా తెలుసు. బ్రహ్మను ఆరాధించి బ్రహ్మాస్త్రం పొందావు. దేవేంద్రుని జయించి ఇంద్రజిత్ అనిపించుకొన్నావు. నీ బుద్ధి వైభవం దేశకాలపాత్ర తెలిసిన యుద్ధ నైపుణ్యం ఉన్నవాడవు. తపము యుద్ధం, పరాక్రమం, అస్త్ర శస్త్ర బలాలలో అన్నిటా నాకు సమానమైన వాడవు. నువ్వు యుద్ధం లో నిలిస్తే నీకు జయం అనేది నిశ్చయమే. కింకర, జంబుమాలి అమాత్యపుత్ర, పంచ సేనానులు, వారి సైన్యంతో సహా చనిపోయారు –

"మమాను రూపం తపసో బలం చ తే-పరాక్రమ శ్చాస్త్రబలం చ సంయుగే –న త్వాం సమాసాద్య రణావ మర్దే-మశ్శ్రమం గచ్ఛతి నిశ్చితార్థం "

"నీ సోదరుడు అక్షయ కుమారుడూ గతించాడు. నాబలం వారిలో మాత్రమె లేదు ఆ బలం నీలోనే ఉంది –'

"అమాత్యపుత్రా వీరాశ్చపంచ సేనా గ్రయాయినః –బలాని సు సమృద్ధాని సాశ్వ నాగ రథానిచ"

"సహోదర స్తే దయితః కుమారోక్షశ్చ సూదితః –నహి తేష్వేవ మే సారో యస్త్వ య్యరి నిషూదన "

సామూహికంగా మన యోధులను పరిమార్చిన ఆ వానరుని ఎదుట సైన్యం ఉపయోగ పడదు. వజ్రం లాంటి ఆయుధం కూడా నిష్ఫలమే. వాడి గమన వేగం వాయువుకు కూడా లేదు. వాడు అగ్ని తేజో మూర్తి కనుక పిడికిలి దెబ్బలకు చావడు-

న వీర సేనా గణశోచ్యవంతి-న వజ్రమాదాయ విశాల సారం –న మారుత స్యాస్య గ తేః ప్రమాణం –నచాగ్ని కల్పః కరణేన హంతుం"

కనుక నీ బుద్ధిబలంతో ఆలోచించి వాడి పరాక్రమం గుర్తించి, నీ దివ్యాస్త్రాలప్రభావం చింతిస్తూ వెళ్ళు. అపాయం కలగకుండా కార్యం నెరవేర్చు. చిన్నవాడివైనా నిన్ను పంపటం నాకు భావ్యంగా లేదుకాని ఇది రాజ ధర్మం.క్షత్రియాలోచనం. బంధుత్వం ఇక్కడ లెక్కచేయరాదు-

"న ఖల్వియం మతిః శ్రేష్టా-యత్వాం సంప్రేషయా మ్యహం –ఇయం చ రాజ ధార్మాణాం-క్షత్రస్య మతిర్మతాః"

" యుద్ధం లో విజయం కోసం వివిధ ఆయుధాలు ఉపయోగించాలి"అని అన్నిరకాల జాగ్రత్తలు యుద్ధనీతి బోధించగా, ఇంద్రజిత్ శిరసువంచి నమస్కరించి, తండ్రికి ప్రదక్షిణ చేసి, యోధులు ముందుకు సాగుతుండగా సముద్రంలా ఉప్పొంగి యుద్ధానికి బయల్దేరాడు. నాలుగు సింహాల రథం ఎక్కి,మనోవేగంతో యుద్ధభూమికి చేరాడు. హనుమ వాడి రథధ్వని వింటినారి ధ్వని విని ఆనందించాడు, దిక్కులు కలుపితాలై, క్రూరమృగాలు బిగ్గరగా అరచాయి. ఇంద్రజిత్ యుద్ధాన్ని చూడటానికి ఆకాశం లో దేవముని గంధర్వ గణాలన్నీ చేరాయి. హనుమగురుడికి ఉత్సాహం ఉరకలు వేసి శరీరం పెంచి మహాసింహ నాదం చేశాడు, వాడు ప్రయోగించే బాణాలను మెలకువగా తప్పించుకొంటున్నాడు. హనుమ ఒక్క సారిగా పైకి ఎగిరాడు. అతడి బాణాలను నిష్ఫలం చేశాడు. సకలజనాలను రంజిల్లజేసే ఘోర యుద్ధం ఇద్దరి మధ్యా జరిగింది. ఇద్దరూ అసాధ్యులే అనిపించారు.

ఎన్ని బాణాలు వేసినా వానరుడు లొంగటం లేదని గ్రహించి, అతడిని చంపటం అసాధ్యం అనీ తెలుసుకొని, అతడిని పట్టుకొనే ఉపాయం ఆలోచించి ఇంద్రజిత్తు వాయు సుతునిపై బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు –

"తతః పైతామహం వీరః స్సోస్త్ర మస్త్రవిదాంవరః –సందధే సుమహాతేజాస్తం హరి ప్రవరం ప్రతి "

అవధ్యోయ మితిజ్ఞాత్వా త మస్త్రేణాస్త్ర తత్వ విత్ –నిజగ్రాహ మహాబాహు ర్మారుతాత్మజ మింద్రజిత్ "

ఇంద్రజిత్ సంధించిన బ్రహ్మాస్త్రానికి బంధితుడై చేష్టలుడిగి హనుమ నేలమీద పడ్డాడు

బ్రహ్మ దేవుని వరం వలన బ్రహ్మాస్త్రం తనను ఏమీ చేయలేదు అని గుర్తుకు వచ్చి, "ముహూర్తకాలం లోనే దాని నుంచి విముక్తి చెందుతావు "అని చెప్పినమాటకూడా జ్ఞప్తికి వచ్చి,తానూ బ్రహ్మాస్త్రానికి కాని కట్టుపడను అని ఇంద్రజిత్ తెలిసి ప్రయోగించాడుకనుక ఏమీ చేయకుండా దానికి బద్ధుడయ్యాడు, బ్రహ్మ మహేంద్ర వాయు దేవులు తనను రక్షింపగా,ఇప్పుడు ఈరాక్షస బంధనం రావణునినిచూడటానికి ఉపయోగ పడిందని భావించాడు. రాక్షసులు చుట్టుముట్టి బందిస్తుంటే పెద్దగా గర్జించాడు. కదలికలేని కపి వీరుని చూసి వాళ్ళు జనపనార, నార చీరల తో త్రాళ్ళు పేని హనుమను బంధించారు. ఈ బంధనం వలన రాక్షసరాజును చూసే అవకాశం కలుగుతోందని సంబర పడ్డాడు. త్రాళ్ళ చేత బందింప బడగా బ్రహ్మాస్త్ర బంధం తొలగి పోయింది. అస్త్ర బంధికి వేరొక బంధం కుదరదు,నిలువదు కదా –

"స బద్ధ స్తేన వల్కేన విముక్తో స్త్రేణ వీర్యవాన్ - "అస్త్ర బంధస్సచాన్యం హిన బంధ మనువర్తతే "

త్రాళ్ళతో కట్టటం తో బ్రహ్మాస్త్ర బంధనం వీడిపోయిందని గ్రహించి ఇంద్రజిత్ "ఇతర బంధనాలతో బ్రహ్మాస్త్ర బంధం నిలువదుకదా'.నా మహాకార్యం ఇలా నిష్ప్రయోజనమైంది. మా సన్యాసులకు మంత్రం ప్రభావం సంగతి తెలీదు. ఒకసారి బ్రహ్మాస్త్రం వ్యర్ధమైతే, మళ్ళీ ప్రయోగించటానికీ, వేరే అస్త్రప్రయోగానికీ కుదరదు "అని బాధపడగా హనుమ బంధం విడిపోయిన సంగతి గమనించక, రాక్షసులు లాక్కు పోతుంటే అలాగే ఉన్నాడు, -"విముక్త మస్త్రేణజగామ చిన్తాం-నాన్యేన బద్ధోహ్యనువర్తతే స్త్రం"

కట్టెలతో బాదుతూ, పిడికిళ్ళతో మోదుతూ రావణ సమక్షానికి తీసుకు వెళ్ళారు. బంధనాలతో ఉన్న మహాకపిని ఇంద్రజిత్ తన తండ్రికీ కొలువు కూటం లో ఉన్నవారికీ చూపించాడు. కొలువులోని వారు "ఎవడు వీడు ఎక్కడనుండి వచ్చాడు ఎక్కడ దిగాడు, ఇక్కడికి ఎందుకొచ్చాడు అసలు ఎవరివాడు "'అంటూ గుసగుసలాడుకొన్నారు "వాడిని చంపండి నరకండి, కాల్చండి తినండి "అని రాక్షులు అరచారు. మంత్రి పరివేష్టితుడైన రాక్షసరాజు రావణాసురుడిని హనుమ చూస్తె, వాడు అటూ ఇటూ త్రాళ్ళతో లాగబడే హనుమను చూశాడు. అక్కడున్నవారిని వానరుడి సంగతి అడిగి తెలుసుకోమని ఆనతిచ్చాడు. వాళ్ళు అతనిపై ప్రశ్నల వర్షం కురిపించగా "నేను వానరరాజు సుగ్రీవుని వద్ద నుంచి వచ్చిన దూతను "అని మాత్రం చెప్పాడు

"నివేదయామాస హరీశ్వరస్య –దూత స్సకాశా దహ మాగతోస్మి"

ఇది 62శ్లోకాల 48వసర్గ

రావణుడికి ఎవరికి ఎలా "తైరు "కొట్టాలో బాగా తెలుసు. మేఘనాధుడు అంటే ప్రాణ సమానుడే కాదు బలబుద్ధిపరాక్రమాలలో కూడా తనకు సాటైనవాడేకాదు ఇంద్రుని జయించినవాడు. కనుక వాడు తొందరపడి యుద్ధం లో చనిపోతే వారసులే ఉండరు కనుక ముందూ వెనకా ఆలోచించి వానర పరాక్రమ విశేషాలు క్షుణ్ణంగా తెలిపి, ప్రాణాలతో పట్టుకు రమ్మన్నాడే కాని చంపమని చెప్పలేదు. చంపే దాకావస్తే ఎవరు చస్తారో ఎవరు మిగులుతారో తెలీదుకదా.అందులో జయం అనిశ్చితం చంచలం అని ఇదివరకు చెప్పాడు అక్షకుమారుని పంపిస్తూ. ఎందుకు వీడిని పంపాల్సి వస్తోందో అందులో ఉన్న రాజ, క్షత్రియ ధర్మం తేట తెల్లంగా చెప్పాడు రాజు. పేగు బంధం క్షాత్ర ధర్మం ముందు నిలువదు అనీ చెప్పాడు. మరింత వివరంగా మహాకపి ముందు సైన్యం మహా ఆయుధాలు బలాదూర్ అనీ చెప్పాడు. ఉన్న శస్త్రాస్త్రాలన్నీ ఉపయోగించమనీ చెప్పినా, మిగిలింది కేవలం యుక్తి. దానితో బంధించి తేవాలి. రెట్టించిన ఉత్సాహంతో వెళ్లి వాడు హనుమతో కలబడ్డాడు. ఇద్దరూ ఒకరికి కారు తీసిపోకుండా యుద్ధం చేసి దేవతల, మునులను ఆశ్చర్యపరచారు. "గివ్ హిం ఎ లాంగ్ రోప్"అన్నట్లు ఇంద్రజిత్ అన్ని రకాల ప్రయోగాలు చేసి విసిగి, హనుమ ప్రాణం తీయటం సాధ్యం కాదని గ్రహించి బంధనమే ఉభయతారకం అని గ్రహించి దానికోసమే బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అది చేయాల్సిన పని చేసి బంధించింది. కాని ఇదివరకే బ్రహ్మవరం ఉంది కనుక బంధనం క్షణ భంగురం అని తాతగారే చెప్పారు కనుక కిమిన్నాస్తి గా ఊరుకున్నాడు. ఇక్కడేఆయనకు ఒక" బ్లెస్ ఇన్ డిస్గై స్"లాగా వాళ్ళు బంధించి రావణుడి దగ్గరకు తీసుకు వెడతారు కనుక తనకు కావాల్సిందీ రాక్షసరాజును స్వయంగా చూసి హితం చెప్పాలనుకొన్నాడుకనుక బాగుందని గమ్మున ఉండిపోయాడు. రోగీ పద్యమే కోరాడు డాక్టరూ అదే చెప్పాడు అన్నట్లు సరిపోయింది. బ్రహ్మాస్త్రం తో బంధించిన మోజు క్షణభంగురమై తెలివి లేని రాక్షసమూక త్రాళ్ళతో కట్టేయటం తో వ్యర్ధమైంది. ఇప్పుడుహనుమ" ఫ్రీ బర్డ్ "అది తెలిసినా తెలియనట్లే ఉన్నాడు. రాక్షసమూక లాక్కు వెడుతున్నా ఏమీ అనుకోక తనను కాదులే అనుకొన్నట్లు ప్రవర్తించాడు. చివరికి ఈ బంధనం రాక్షస రాజును చూడటానికి చక్కగా ఉపయోగపడింది. తనకార్యం దాదాపు సఫలీ కృతం అయింది. హనుమకు రావణుడు "తేజో బలసమన్వితుడై ప్రజ్వరిల్లే సూర్యుడిలాగా అవుపించాడు. తాళ్ళతో అటూ ఇటూ లాగబడే హనుమను చూశాడు రాజు. కొంచెం గర్వంకూడా కలిగి ఉంటుంది. తనకొడుకు,తనమాట నిలబెట్టి అన్నంతపనీ చేసి కోతిని పట్టి

తెచ్చినందుకు.తాను సూటిగా దూతను అడుగరాదుకనుక మంత్రిమొదలైన వారితో అడిగించాడు రాజు. అన్నిటికీ ముక్తసరిగా ఒక్కటే సమాధానం "నేను సుగ్రీవ దూతను "అని.

భయంకర మహా పరాక్రమ శాలి హనుమ మనసులో "రావణుడు వచ్చి నాతో యుద్ధం చేస్తాడనుకొని అన్ని ప్రయత్నాలూ చేశాను. కాని ఉన్నచోటు కదలకుండా ఆసనం వీడకుండా కొడుకు ఇంద్రజిత్తు ను పంపి నన్ను బంధించి తెప్పించుకొన్న రాజనీతిజ్ఞుడు "అనుకొని ఆశ్చర్యపడి,రోషం తో కన్ను లెర్రబడి రాక్షసరాజును చూశాడు. ముత్యాలు కూర్చిన బంగారు కిరీటం తో రావణుడు మరింతగా ప్రకాశించాడు. మనస్సంకల్ప మాత్రంగా సృష్టించిన ఆశ్చర్యకరమైన బంగారు నగలు వేసుకొని కాంతి వంతంగా కనిపించాడు.

"తత స్సకర్మణా తస్య విస్మితో భీమ విక్రమః –హనుమాన్ రోష తామ్రాక్షో రక్షోధిప మవైక్షత."

"హైమైరాభరణై శ్చిత్రై ర్మనసేవ ప్రకల్పితైః"

పట్టుబట్టలు కట్టి ఒంటికి రక్త చందనం, కస్తూరి మొదలైన గంధపు పూతలతో ఉన్నాడు. బాగా తెరువ బడిన నోళ్ళు, అందమైన యెర్రని కళ్ళు, చూసే వారికి భయం కలిగించే వాడి యైన పెద్ద కోరలు, వేలాడే పెదవులు ఉన్న పది తలలతో వీరత్వ తేజస్సులతో, దుష్టమృగాలతో శిఖరాలున్న పర్వతం లాగా ఉన్నాడు రావణుడు. కాటుకరాశినల్లదనం, వక్షస్థలం పై పూర్ణ చంద్రునిలా విలసిల్లె హారాలు తో కొంగలతో ఉన్న మేఘం లాగా ఉన్నాడు

"నీలాంజన చయ ప్రఖ్యం హారేణోరసి రాజతా-పూర్ణ చంద్రాభ వక్త్రేణ స బలాక మివాంబుదం"

బలిష్టమైన బాహువులకు భుజకీర్తులు చందనం పూతలతో అయిదు తలల పాముల్లాగా ఉన్నాయి. బాగా పెద్దది,స్పటికాలు పొదిగి, చిత్ర వర్ణాలతో, మధ్యమధ్య రత్నాల కూర్పు తో అత్యంత సుందరంగా రావణ సింహాసనం ఉన్నది. అందమైన చానలు ఆయన చుట్టూ నుంచుని వింజామరలు వీస్తున్నారు.

"మహతి స్ఫాటికే చిత్రే రత్న సంయోగ సంస్కృతే –ఉత్తమాస్తరణాస్తీర్ణే సూప విష్టంవరాసనే "

దుర్ధర, మహాపార్శ్వ ప్రహస్త, నికుంభ మంత్రులతో నాలుగు సముద్రాలతో పరివేష్టించి ఉన్న భూమి లాగా ఉన్నాడు –

"కృత్స్నః పరివృతో లోక శ్చతుర్భి రివ సాగరైః"

మంత్రశాస్త్రం తెలిసిన మంత్రవేత్తలు, దీమంతులైన రాక్షసులు తో దేవతల చే సేవింపబడే దేవేంద్రునిలా ఉన్నాడు -

"అన్వాస్యమాన రక్షోభి స్సురైరివ సురేశ్వరం "

నల్లని రూపంతో బంగారు సింహాసనం పై కూర్చున్న రావణుడు మేరు శిఖరం అధిరోహించిన జలపూర్ణమైన నల్లని మేఘంలా ఉన్నాడు '

"విస్తితం మేరు శిఖరే సతోయమివ తోయదం "

రాక్షసులు తన్ను విపరీతంగా పీడిస్తున్నా, కన్ను ఆర్పకుండా రావణుడి వైభవాన్ని నోరు వెళ్ళబెట్టి చూస్తున్నాడు హనుమ.

"ఆహా ఏమి రూపం ఏమి ధైర్యం ఏమి బలం ?సకలప్రశస్త లక్షణాలతో రాక్షసరాజు రావణుడు శోభిస్తున్నాడు. సీతా దేవి పట్ల అలా అధర్మాన్ని ఆచరించి ఉండకపోయి ఉంటె దేవేంద్ర సహిత దేవలోకానికే అధిపతి కాదగినవాడు –

"అహో రూప మహోధైర్య మహో సత్వ మహో ద్యుతిః-అహో రాక్షస రాజస్య సర్వ లక్షణ యుక్తతా "

"యద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః –స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా "

"వీడి భీకర పరద్రోహాచరణ రూపమైన అధర్మ కార్యాలకు అమర దానవ సకల లోక జనులు భయపడుతున్నారు

"అస్య క్రూరై ర్నృశంసైశ్చ కర్మభి ర్లోక కుత్సి తైః-సర్వే బిభ్యతి ఖల్వస్మా ల్లోకా స్సామర దానవాః"

వీడికి కోపం వస్తే ప్రపంచమంతా ఏక సముద్రం చేయగలడు”అని రావణ రూప పరాక్రమ విక్రమబలశౌర్య వైభవాలను గురించి అనేక విధాలుగా ఆలోచించాడు హరిసత్తముడైన హనుమ.

“అయం హ్యుత్సహతే క్రుద్ధం కర్తు మేకార్ణవం జగత్”

ఇది 20శ్లోకాల 49వ సర్గ.

హనుమ మొదట్లోనే రావణ రాజనీతికి ఫిదా అయ్యాడు యెట్లా ?తనదగ్గరకు రప్పించుకొనే సకల ప్రయత్నాలూ తాను చేస్తే వాడు తానుకదలకుండా కొడుకును పంపి తన్ను బంధించి తనదగ్గరకు రావణుడు తెప్పించుకొన్నాడు. ఇందులో హనుమకు రావణుని గొప్ప రాజనీతి కనిపించింది. తనదగ్గరకు వస్తాడనుకొంటే తననే అతని దగ్గరకు తెప్పించుకోవటం మహా రాజనీతికాదా. ఏమాలోచన హనుమది ?ఇందులో రావణ వైభవం పూస గుచ్చినట్లువర్ణించి హనుమతో మహర్షి వాల్మీకి చెప్పించాడు. రావణుడు మందర పర్వతంలాగా ఉన్నాడుకాని చుట్టూ అనేక దుష్టమృగాలున్నాయి, ఇక్కడ దుష్టరాక్షసులున్నారని భావం. ఇంకేమీ ఉపమానం దొరకనట్లు వాల్మీకి వాడిని కొంగలతో కూడిన మేఘంలా ఉన్నాడన్నాడు. హంసలతో ఉన్న మేఘం ఉత్తమ ఉపమ. ఇది నీచోపమ వాడికి తగిందే. భుజాలు అయిదుతలల పాముల్లాఉన్నాయట. ఇక్కడ వాటిలో విషం ఉన్నట్లు అనుకోవాలి. సింహాసనం స్వర్ణ రత్నమయం జిగ్ జిగేల్ గా పసుపు రంగులో ఉంటె అందులో వీడు నల్ల తుమ్మ మొద్దులాగా ఉన్నాడని పిస్తుంది. చతుస్సముద్ర వేలావలయిత భూమండలం లాగా రావణుడున్నాడు. చాలా గొప్ప వర్ణన. మేరు శిఖరం పై కారు మేఘం లా కనిపించాడు హనుమకు. త్రాళ్ళతో బంధించి రాక్షసులు హింసిస్తున్నా హనుమ తదేక దృష్టితో రావణుడిని చూశాడు అంటే ఏదో లోకోత్తర మహత్తర ఆకర్షణ వాడిలో ఉందన్నమాట.

రావణుడి గురించి హనుమతో వాల్మీకి చెప్పించిన రెండు శ్లోకాలు సాహిత్య చరిత్రలో సువర్ణ మయంగా భాసిస్తూ అందరి నోళ్ళలోనూ నానుతున్నాయి. ఉదాహరణ రూపం గా వ్యాప్తి చెందుతున్నాయి. ఇన్ని సుగుణాలున్నా సీతాపహరణం అనే ఒకే ఒక్క దుర్గుణం వాడి గుణాలకు పెద్ద చేటు తెచ్చింది. లేకుంటే ఇంద్ర పదవి కి సర్వవిధాలా అర్హత ఉంది వాడికి. లోకం లో ఉన్న ఒక ముతక సామెత “మనిషి మంచోడేరా గుణం గుడిసేటిది “వీడికి పూర్తిగా సరిపోతుంది. ఇంతవరకు ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. చూపులతోనే సరి.

గోరోచనవర్ణ నేత్రాలు, మహాతేజస్వి, వానర శ్రేష్టుడు అయిన హనుమను రావణుడు చూసి సందేహం కలిగి మనసులో “ఇతడు సాక్షాత్తు నందీశ్వరుడు “లాగా ఉన్నాడేమిటి ?”అనుకొన్నాడు –

““శంకాహృతాత్మా దధ్యౌ స కపీన్ద్రం తేజసావృతం –కిమేశ భాగావాన్నందీ భవే సాక్షా దిహాగతః”

పూర్వం నేను కైలాసాన్ని పెకలిచినపుడు నాకు శాపమిచ్చిన నందీశ్వరుడు కాని బలికొడుకు బాణ రాక్షసుడు కానీ కోతిరూపంలో వచ్చాడా ?’-

“యేన శప్తోస్మి కైలాసే –మయా సంచాలితే పురా –సోయం వానర మూర్తిఃస్యాత్ –కిం స్విత్ బాణోపి వా సురః”

’అనుకుని కోపంతో కన్నులు ఎర్రబడి మంత్రి ప్రహస్తునితో ఇలాన్నాడు “ఇతడు ఏ దేశం నుంచి ఇక్కడికి ఎందుకు వచ్చాడో నా వనం పాడు చేయటం లో ప్రయోజనమేమిటో, రాక్షస స్త్రీలను భయపెట్ట టానికి కారణమేమిటో ఎదిరించటానికి సాధ్యం కాని లంకానగరానికి రావటానికి కారణమేమిటో ఆ దురాత్ముని అడుగు “అన్నాడు.

వెంటనే ప్రహస్తుడు “వానరా !ఊరడిల్లు.నీకు శుభం కలుగుగాక, భయపడకు. ఇంద్రుడు పంపగా వచ్చావా, కుబేర, యమ, వరుణ చారుడుగా వచ్చావో భయం లేకుండా చెప్పు వదిలేస్తాం. లేక విజయం కోరే విష్ణువు చే పంపబడిన దూతవా ?వానరుడవైనా నీ తేజస్సు అమోఘం. నిజం చెప్పు. అబద్ధం చెబితే నువ్వు బతకటం దుర్లభం. అసలు ఏ ఉద్దేశ్యం తో లంకు వచ్చావో చెప్పు. “అని అన్నాడు

“యది వైశ్రవణస్యత్వం యమస్య వరుణస్యచ –చార రూపమిదం కృత్వా ప్రవిష్టో నః పురీ మిమాం “

“విష్ణునా ప్రేషితో వా దూతో విజయ కాముకి ణః

“నహి తో వానరం తేజో రూప మాత్రం తు వానరం “

“అనృతం వదశ్చాపిదుర్లభం తవ జీవితం

అథవాయన్నిమిత్తం తే ప్రవేశో రావణాలయే”

అప్పుడు వానర శ్రేష్ట హనుమాన్ సూటిగా రావణుడి తోనే "నేను దేవేంద్ర, యమ, వరుణులు పంపిన దూతను కాను. కుబేరునితో నాకు స్నేహం లేదు. విష్ణువు నన్ను పంపలేదు. జాతిగా వానరుడినే కాని వానర రూపం పొందిన వేరొకడిని కానే కాను. రాక్షస రాజు రావణుడిని చూడటం దుర్లభం కనుక ఆయన్ను చూడటానికే వనం ధ్వంసం చేశాను –"అన్నాడు

"అబ్రవీ న్నాస్మి శక్రస్య యమస్య, వరుణస్య వా –ధనదేన న మే సఖ్యం విష్ణునా నాస్మి చోదితః

"జాతి రేవ మమత్వేషావానరో హ మిహాగతః

"దర్శనే రాక్ష సేన్ద్రస్య దుర్లభే తదిదంమయా –వనం రాక్షస రాజస్య దర్శనార్థే వినాశితం"

"అప్పుడు బలవంతులైన, యుద్ధం కోరే రాక్షసులు నాపై కి వచ్చారు. ఆత్మ రక్షణ కోసంనేను వాళ్ళతో పోట్లాడాను. నన్ను ఏ శస్త్రాస్త్రాలు బంధించలేవని బ్రహ్మ దేవుడు నాకు వరమిచ్చాడు. రావణుడిని చూడటానికే నేను బ్రహ్మాస్త్ర బంధనం అలాగే ఉంచుకున్నాను. మీవాళ్ళు త్రాళ్ళతో కట్టటం తో బ్రహ్మాస్త్ర బంధనం తొలగి పోయింది. నేనొక రాజ కార్యం కోసం ఇక్కడికి వచ్చాను. నేను అమిత పరాక్రమ శాలి రాముని దూతను. నీ మంచికోసం నేను చెప్పే మాటలు జాగ్రత్తగా విను "అన్నాడు హెచ్చరికగా హనుమ.

"తతస్తే రాక్షసాఃప్రాప్తా బలినో యుద్ధ కాంక్షిణః-రక్షణార్ధంతు దేహస్య ప్రతి యుద్ధా మయారణే""

"అస్త్ర పాశైర్న శక్యోహం బద్ధుం దేవాసురైరపి-పితామహా దేష వరో మమాప్యేషోభ్యుపాగతః "

"కేనపి రాజ కార్యేణసంప్రాప్తోస్మి తవాన్తికం –దూతోహ మితి విజ్ఞేయో రాఘవస్యామి తౌజసః

శ్రూయతాం చాపి వచనం మమ పథ్య మిదం ప్రభో "

ఇది 18శ్లోకాల 50వ సర్గ.

కిందటి సర్గలో హనుమ రావణ వైభవానికి ఆశ్చర్యపోతే, ఈ సర్గలో రావణుడికి గతంలో జరిగిన విషయాలు,అనుభవాలు హనుమను చూడగా స్ఫురణకు వచ్చాయి. హనుమలో భగవంతుడైన నందీశ్వరుడు కనపడ్డాడు. ఆయన పెట్టిన శాపం గుర్తుకు వచ్చింది. లేకపోతే కోతికి అంతటి తేజస్సేమిటి విధ్వంసం కాకపోతే ?ప్రహస్తుడు కూడా మంచి ప్రశ్నలే సంధించాడు. నిజం చెబితే వదిలేస్తామని, అబద్ధమాడితే చావు తప్పదని హెచ్చరించాడు, అన్ని ప్రశ్నలకు యుక్తియుక్తమైన సమాధానాలే చెప్పాడు దీమాన్ హనుమాన్. ఏ దేవుడూ దేవతా పంపిన దూతను కాను అని నిష్కర్షగా చెప్పాడు. అశోక వనం భగ్నం చేయటానికి కారణం రావణుడిని చూడాలన్న "చపలత్వమే" అన్నాడు. అమిత పరాక్రములైన రావణ రాక్షసులు అనవసరంగా తనపైకి కాలుదువ్వి వచ్చారని ఆత్మ రక్షణకోసం వారితో పోరాడవలసి వచ్చిందని యుక్తియుక్తంగా చెప్పటం హనుమ ధీనిధి అని తెలియ జేస్తుంది "ఆత్మ రక్షణ కోసం –రక్షణార్ధం తు దేహస్య " "అన్నమాట సుప్రీం కోర్టులో కూడా తిరుగులేని మాట. అప్పీలు లేని మాటకూడా. ఇక్కడే పురాణప్రవచ ప్రవీణ బ్రహ్మశ్రీ మల్లాది చంద్ర శేఖర శాస్త్రిగారుచాలా తమాషాగా చెబుతారు "రాజా !నేను మీ వాళ్ళ మీదకు వెళ్ళానా ?లేక వాళ్ళే నా మీదకొచ్చారా ?తెలుసుకో. ఏదో ప్రాణ రక్షణార్ధం వాళ్ళను అలా ఇలా వాయించా. ఆయువు మూడిచచ్చారు.ఇందులో నా తప్పేమీ లేదు మహారాజా !"అని సరదాగా చెబుతారు

తనకు బ్రహ్మ ఇచ్చిన వరం వలన ఏ అస్త్రాలు తనను బందింలేవని బ్రహ్మాస్త్రానికి ఆయనమాటమీదే బద్ధుడనై ఉండిపోయాను అనీ,మీ అబ్బాయి పౌరుష పరాక్రమాలకు నేను లొంగిరాలేదు అవి నన్నేమీ చేయలేవు అని అన్యాపదేశంగా చెప్పాడు.. మహాత్ముడైనశ్రీరాముని దూతను అని విస్పష్టంగా చెప్పాడు. రావణ హితం కోసం తాను చెప్పే మాటలు శ్రద్ధగా ఆలకించమని హెచ్చరికా చేశాడు హనుమ. ఇక్కడే మహర్షి మంచి సస్పెన్స్ సృష్టించి తరువాత ఏమి జరుగుతుందో అనేఉత్సుకత కలిగించాడు. అది తెలుసుకోవటానికి రేపటి దాకా ఆగాలిగా మరి ?అంతేగా మరి ?

భయంకర బలపరాక్రమ తేజస్సులతో ఉన్నదశకంఠ రావణుడిని వానర వీర హనుమాన్ చూసి, భయం తొట్రు పాటూ ఏ మాత్రం లేకుండా, అర్థవంతమైన మాటలతో "నేను రామదూతనైన, వానర రాజు సుగ్రీవుని సందేశం తో లంకకు వచ్చాను. నీ సోదరునిలాగా సుగ్రీవుడు నీకు హితుడు. నిన్ను కుశలప్రశ్నలు అడిగాడు –"తమ్ సమీక్ష్య మహాసత్వం సత్వవాన్ హరిసత్తమః –వాక్య మర్థవ దవ్యగ్ర స్తమువాచ దశాననం "

"అహం సుగ్రీవ సందేశా దిహప్రాప్త స్తవాలయం –రాక్షసేంద్ర హరీశ స్త్వాంభ్రాతా కుశలమబ్రవీత్ "

"స్నేహితుడి లాగా హితం తో సుగ్రీవుడు నీకు పంపిన సందేశం విను. అది నీకు ఈలోకం లో, పరలోకం లో కూడా అభ్యుదయం కలిగిస్తుంది '

"భ్రాతుః శ్రుణు సమాదేశం సుగ్రీవస్య మహాత్మనః –ధర్మార్ధోప హితం వాక్య మిహ చాముత్ర చ క్షమం"

అని చెప్పి ఇది వరకు తాను అశోక వనం భగ్నం చేసేముందు చెప్పిన శ్లోకాలను సుగ్రీవుడు చెప్పినట్లుగా రికార్డ్ పెట్టాడు హనుమ- "రాజా దశరదోనామ రథకున్జర వాజిమాన్ "నుంచి రాముడుసుగ్రీవ స్నేహం చేసి వాలిని చంపి సుగ్రీవుని రాజును చేసేదాకా 7శ్లోకాలలో వాయించి పారేశాడు –

"తత స్టేన మృధేహత్వా రాపుత్రేణ వాలినం –సుగ్రీవ స్థాపితో రాజ్యేహర్యక్షాణాం గణేశ్వరః "

"రాజా !వాలి నీకు పూర్వం పరిచయమున్నవాడే గా. అతడిని ఒకే ఒక్క బాణం తో రాముడు చంపాడు తెలుసా.

"త్వయా విజ్ఞాత పూర్వ శ్చ వాలీ వానర పుంగవః –రామేణ నిహత స్సంఖ్యేశరే ణైకేన వానరః "

మా రాజు సుగ్రీవుడు సత్య ప్రతిజ్ఞకలవాడు కనుక సీత అన్వేషణకై అన్ని దిక్కులకు లక్షలకొద్దీ వానర సైన్యం పంపాడు.వారిలో కొందరు గరుత్మంతు నికి, కొందరు వాయువుకు వేగం లో సాటైనవారు –

"వైనతేన సమాఃకేచిత్ కేచిత్తత్రానిలోపమాః-అసంగ గతయః శీఘ్రా హరి వీరా మహా బలహ "

"అందులో రాజా !నేనువాయుపుత్ర హనుమంతుడను. సీత జాడకోసం నూరు యోజనాల సముద్రాన్ని అవలీలగా దాటి మీ లంకకు వచ్చాను. లంకంతా గాలిస్తూ, ఇక్కడ ఆమెను చూశాను. నువ్వు శాస్త్రోక్త ధర్మ స్వరూపం తెలిసిన మహా ప్రాజ్ఞుడవు. మహాతపస్వివి. పరభార్యను అలా నిరోధించటం నీకు తగని పని.నీలాంటి బుద్ధిమంతులు అపాయకర, ఆత్మవినాశాకర ధర్మ విరుద్దాలైన పనులలో తలదూర్చరు –

"తద్భవాన్ దృష్ట ధర్మార్ధ స్తపః కృత పరిగ్రహః –పరదారా న్మహాప్రాజ్ఞ నోప రుద్ధుం త్వమర్హసి "

అని చాలా నెమ్మదిగా మెత్తగా, ధర్మపరడని తపస్వి అనీ పొగుడుతూ, చేసినపని చాలా నీచమైనదని అలాంటి వాడు చేయతగనిపని అనీ హితవు చెప్పాడు. కొంచెం స్వరం పెంచి "రావణా !రాముడు కోపిస్తే, తమ్ముడు లక్ష్మణస్వామి విడిచిన బాణం కు ఎదురు నిలిచే సాహసం దేవాసురులలో ఎవరూ చేయ లేరు. ఆయనకు అపకారం చేస్తే ముల్లోకాలలో ఒక్కడు కూడా సుఖంగా ఉండలేడు అని స్పష్టంచేశాడు –

"తస్య లక్షణ ముక్తానాం రామ కోపాను వర్తినీం -శరాణామగ్రతః స్థాతుం శక్తో దేవా సురేష్వపి".

"న చాపిత్రిషు లోకేషు రాజన్ విద్యేత కశ్చన-రాఘవస్య వ్యళీకం యః కృత్వా సుఖ మవాప్ను యాత్ "

ఇప్పటిదాకా జరిగిన చెడు గురించి, రామసోదర పరాక్రమ వీరాలగురించి హెచ్చరిక గా చెప్పాడు దీమాన్ హనుమాన్. అసలే మొండి ముండావాడు కొంచెం కఠినంగా నే వాడు చెయ్యాల్సిందేదో, దేని వలన ప్రమాదం తప్పుతుందో సూటిగా చెప్పాలనుకొని "రాజా !ధర్మ అర్ధ సమ్మతమైన నా మాటలు విని భూత వర్తమాన భవిష్యత్తులలో మేలు కలిగేట్లుగా ఆలోచించి సీతా దేవిని శ్రీరాముడికి సమర్పించు " –

"తత్రికాల హితం వాక్యం ధర్మ్యమర్థాను బంధి చ –మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతి దీయతాం"

రావణా !అనితర సాధ్యమైన సీతా దర్శనం నాకు లభించింది. ఆమెను ఇక్కడి నుండి తీసుకు వెళ్ళటం ఎలాగో రాముడే నిర్ణయిస్తాడు. మూర్తీభవించిన శోకదేవతలా సీత ఉన్నది. పొరబాటున ఆమెను వశం చేసుకోవాలని అనుకోకు. ఆమె అయిదు తలల సర్పం. నీ ప్రాణాలు తీస్తుంది అని నీకు తెలియనట్లుంది, జాగ్రత్త. -

"లక్షితేయం మయా సీతా తథా శోక పరాయణా-గృహ్య యాం నాభి జానాసి పంచాస్య మివ పన్నగీం "

"ఆహారం లో విషం కలిస్తే ఎలా జీర్ణం కాదో, అలాగే సీత కూడా దేవతలకు అసురులకు వశీకరింప శక్యం కానిది –

“ నేయం జరయితు శక్యా సాసురై రమరైరపి- “విష సంసృష్ట మత్యర్థం భుక్తమన్న మివౌజసా –రాక్షసరాజా !ఎంతో శమించి తపస్సు చేసి న ధర్మానికిప్రతిఫలంగా దీర్ఘాయుస్సు పొందావు. దాన్ని నాశనం చేసుకోవద్దు. నీ తపస్సుతో పొందిన వరంతో దేవాసురులు నిన్ను చంపలేరని అనుకొన్నా నీకు మృత్యువు తప్పదు-‘

’తపస్సంతాప లబ్ధస్తే యోయం ధర్మ పరిగ్రహః –న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణ పరిగ్రహః

“అవధ్యతాం తపోభి ర్యాం భవాన్ సమను పశ్యతి-ఆత్మనస్సాసురై ర్దైవైర్హేతు స్తత్రా ప్యయం మహాన్ “

రావణుడు చావు విషయంలో తనకు నర వానరులవలన భయం లేదని ముందే శివుడికి చెప్పాడు ఆ విషయాన్ని హనుమ అన్యాపదేశంగా “సుగ్రీవుడు దేవుడు కాదు, అసురుడు, రాక్షసుడు కూడా కాదు.గంధర్వ యక్ష ఉరగుడూ కాదు.ఎవరివలన చావు రాకూడదు అని కోరుకున్నావో వారిలో ఎవరూ కాదు. కనుక సుగ్రీవ వానరరాజు రాజునుంచి ప్రాణాలు ఎలాకాపాడుకో గలవయ్యా ?

“న దానవో న గంధర్వో న యక్షో న చ పన్నగః –తస్మాత్ ప్రాణ పరిత్రాణం కథం రాజన్ కరిష్యతి “’సరే బాగానే ఉంది. ఇప్పటిదాకా నేను చేసిన అధర్మానికి ఫలం అనుభవించకుండా ఉండటం ఎలా ?అను కుంటున్నావా ?అధర్మ ఫలం ధర్మ ఫలం తో కలియదు ధర్మపాలం పూర్వపు ధర్మ ఫలం తో చేరుతుంది. నీ అధర్మం ధర్మాన్ని నశింపజేస్తుంది కనుక అధర్మం నిలవదు. ధర్మం అధర్మాన్ని పో గొడుతుందే,అధర్మం ధర్మాన్ని నాశనం చేయలేదు. కనుక ధర్మాచరణ చేస్తే నీ పాపాలన్నీ పటాపంచలౌతాయి. నేను పూర్వం చాలాధర్మకార్యాలు చేశాను దానిఫాలం చాలా మూలుగుతోంది అది నా పాపాలను అధర్మాన్ని పోగొట్టదా”అని ఆలోచిస్తున్నావేమో. నీ ధర్మఫలం అంతా క్షయ మైంది. కనుక నువ్వు ఇప్పుడు అధర్మ ఫలం అనుభవించక తప్పదు అని గ్రహించు –

“నతు ధర్మోప సంహార మాధర్మఫల సంహితం-తదేవ ఫలమన్వేతి ధర్మ శ్చాధర్మ నాశనః “

“ప్రాప్తం ధర్మఫలం తావద్భవతా నాత్ర సంశయః –ఫలమస్యా ప్యాధర్మస్య క్షిప్రమేవ ప్రపత్స్యసే “

అని మానవ వానరుల చేతిలో నీ చావు తప్పదన్న రహస్యం తనకు తెలిసిందని కుండబద్దలు కొట్టి చెప్పాడు. వాడి ధర్మాధర్మాఫాలం తాలూకు జమా ఖర్చులు లెక్క చెప్పి పుణ్యఫలం జీరో, నిల్ అని చెప్పి, ఇక పాఫలం అనుభవించటానికి సిద్ధంగా ఉండమన్నాడు.

“రాజా !జనస్థానం ఆలో రాముడు ఒక్కడే 14వేల మంది రాక్షస సంహారం చేశాడు, నీకు అన్నిటా పెద్దవాడైన వాలి ఆయన చేతిలో చచ్చాడని, రామ సుగ్రీవ మైత్రి అత్యంత దృఢమైనదనీ తెలుసుకొని నీకు హితం ఏదో ఊహించు. నేనొక్కడినే లంకలో సర్వస్వం నాశనం చేయగలను. కాని అలాచేయమని రామాజ్ఞ లేదు నాకు-”

“కామం ఖల్వహ మప్యేక స్సవాజి రథ కుంజరాం-లంకాంనాశయితుమ్ శక్త స్తస్యైష న నిశ్చయః “మరో విషయం రాజా !సీతను చేరబట్టిన శత్రువైన వాడిని నాశనం చేస్తానని రాముడు వానర, ఋక్షసమక్షంలో ప్రతిజ్ఞ చేశాడు. ఆయనకు అపకారం తలబెడితే దేవేంద్రుదికే దిక్కు ఉండదు నీవొక లెక్కా ?

“రామేణ హి ప్రతిజ్ఞాతమ్ హర్ఋక్ష గణ సన్నిధౌ –ఉత్సాదన మమిత్రాణాం సీతా యైస్తు ప్రధర్షితా”

“సీత అంటే సకల లంకానగరం నాశనం చేసే కాళరాత్రి అనే మహా శక్తి అని గ్రహించు

“యాం సీతే త్యభిజానాసి ఎయం తిస్టతి తే వశే –కాళరాత్రీతి తాం విద్ధిసర్వ లంకా వినాశినీం “

సీత రూపం లో ఉన్న యమపాశాన్ని స్వయంగా నీ మెడకు చుట్టుకోకు. సరిగ్గా ఆలోచించు. సీత కోపం తో తగులబడి, రామకోప పీడితమై నీలంక అంతా అన్నిటితో సహా కొద్దికాలం లోనే కాలిపోవటం చూస్తావు. నీ మిత్ర బాంధవ సోదర, కుమారమంత్రి,హితభార్యలు లంకను వినాశనం చెందించకు –

“తదలం కాలపాశేన సీతా విగ్రహా రూపిణా-స్వయం స్కంధావ సక్తేన క్షమ మాత్మని చిన్త్యతాం “

“సీతాయా స్తేజసా దగ్ధాం రామకోప ప్రపీడితాం-దహ్యమానా మిమాం పశ్య పురీం సాట్టప్రపీడితాం”

“స్వాని మిత్రాణి మంత్రీం శ్చ-జ్ఞాతీన్ భాత్రూన్ సుతాన్ హితాన్ –భోగాన్ దారాంశ్చ లంకాం చ-మా వినాశ ముపానయ “

రావణా !చిలక్కి చెప్పినట్లు చెబుతున్నా విను. ప్రత్యేకంగా రామదూతగా వచ్చిన వానరుడను. నామాట పాటించు. “అన్నాడు

‘సత్యం రాక్షస రాజేంద్ర శృణుష్వవచనం మమ- రామదాసస్య దూతస్య వానరస్య విశేషతః “

రాముడు అంటే ఎవరో నీకు తెలీదు తెలియ జెబుతున్నా విని నీ బుద్ధి మార్చుకో. సర్వలోకాలు, పంచ మహాభూతాలు,బ్రహ్మ సృష్టించిన సకల స్థావర జంగమ రాశి, ప్రళయ కాలం లో రుద్రుని ద్వారా లయింప జేయటానికీ, మళ్ళీ కల్పాది లో పూర్వం లా సృష్టించటానికి మహాయశ్వి రాముడు సర్వ సమర్థుడు. దేవాసుర రాజ, రాక్షస విద్యాధర, గంధర్వ నాగ సిద్ధ కిన్నర కింపురుష, పక్షి జాతులలోనూ సర్వ భూతాలలోనూ సకల ప్రదేశాలలోనే సర్వకాలాల్లోనూ విష్ణువు తో సమానమైన పరాక్రమం కల రామునినితో ఎదురు నిలిచే వారు లేరు –

“సర్వాన్ లోకాన్ సుసంహృత్య సభూతాన్ స చరాచరాన్ –పునరేవ తథాస్రష్టుం శక్తో రామో మహాశయాః

“దేవాసుర నరేంద్రేషు,యక్ష రక్షో గణేశు చ –విద్యాధరేషు సర్వేషు గంధర్వేషూరగేషు చ

“సిద్దేషు కిన్నరేంద్రేషు పతత్రిషు చ సర్వతః –సర్వ భూతేషు సర్వత్ర సర్వ కాలేషు నాస్తి సః

యో రామం ప్రతి యుద్ధ్యేత విష్ణు తుల్య పరాక్రమమ “

“కనుక దశ కంఠా!అన్నిలోకాలకు ప్రభువు, రాజ శ్రేష్టుడు అయిన శ్రీ రామచంద్ర మూర్తి కి ఇలాంటి అపకారం చేసి జీవించటం దుర్లభం. రాముని ఎదుట నిలువగలిగిన వారెవ్వరూ లేరు అని తెలుసుకో –

“సర్వ లోకేశ్వర స్యైవం కృత్వా విప్రియ ముత్తమం –రామస్య రాజ సింహస్య దుర్లభం తవ జీవితం “

రాక్షసరాజా రావణా !స్వయంభు ఐన చతుర్ముఖ బ్రహ్మ, ముక్కంటి మహేశ్వరుడు, త్రిపురారి రుద్రుడు, మూడులోకాల నాయకుడు పరమైశ్వర్య సంపన్నుడు దేవేంద్రుడు కాని రాముడు చంపాలను కొన్నవాడిని ఎట్టి పరిస్థితి లోనూ కాపాడలేరని గ్రహించు “

“బ్రహ్మ స్వయంభూ శ్చతురాననో వా –రుద్ర స్త్రిణేత్రస్త్రిపురాంతకో వా –త్రాతుం న శక్తా యుధి రామవధ్యం “

ఇలా చెప్పాల్సిందంతా సవివరం గా జంకూ గొంకూ లేకండా అతి స్పష్టంగా తేటతెల్లంగా అన్ని కోణాల నుంచి తన దూత వాక్యాలను అత్యంత సమర్ధంగాగంభీరంగా చెప్పిన హనుమంతుని యుక్తియుక్తమైన, వచనాలను విని సాటిలేని పరాక్రమశాలి రాక్షసరాజు రావణాసురుడు కోపం నషాళానికి అంటి గుడ్లు తిప్పుతూ వానర శ్రేష్ట హనుమను చంపమని ఆదేశించాడు.

“స సౌష్ట వో పేత మదీన వాదినః –కపేర్ని శమ్యాప్రతిమో ప్రియం వచః –దశాననః కోప వివృత్త లోచన-స్సమాదిశ త్తస్య వాదం మహా కపేః”

ఇది 45శ్లోకాల అత్యంత ముఖ్యమైలన హనుమ దూత కర్తవ్య సర్గ

సీతారాములు మామూలు మనుషులుకారు అవతార మూర్తులు అని విస్పష్టంగా హనుమ రావణుడికి చెప్పాడు. ఇద్దరిలో ఎవరికి కోపమొచ్చినా లంక భస్మం అవాల్సింది. వారికి జరిగిన అవమానం తీవ్రమైనది. దానికి వారు తప్పక ప్రతీకారం తీర్చుకొంటారు. రాముడి పరాక్రమమం ముందు ఏలోకం లోనూ ఎవరూ సాటికారు.ఆయన చంపాలనుకున్నవాడిని అభయమిచ్చి కాపాడే మొనగాడు ఏలోకం లోనూ లేడు.నాలుగు ముఖాలున్న సృష్టికర్త బ్రహ్మ ఏమీ చేయలేడు.మూడవకంటితో దహనం చేయగల శివుడు చేతులెత్తేయాల్సిందే. ప్రపంచలయం చేసే రుద్రుడు ఏమీ చేయలేక రోదిన్చాల్సిందే. ఇక దేవేంద్రుడి మాట చెప్పేదేముంది ఆయనే తన ఆపదలకు వారి దగ్గరకు వెళ్లి మొక్కుకోవాలి.

సకల చరాచారాన్ని సృష్టించి పోషించి లయం చేసే శక్తి రామునికి ఉంది అందుకే ఆయన “రామబ్రహ్మం “' బ్రహ్మం అన్ని చోట్లా అన్నికాలాలలో సర్వభూతాలలో ఉన్నట్లే రాముడు “ “omniscient, omnipresent, omnipotent “అనీ ఆయన్ను తప్పించుకోవటం అసాధ్యమనీ చెప్పాడు. తాను వానరుడు.తనకంటే ఉత్తమజాతి రాక్షసరాజు తనతో చెప్పించుకోవటం భావ్యం సభ్యతా కాదన్నాడు. సీత పంచముఖ కాలసర్పం, కాలపాశం ఆమె కు కీడు చేస్తే దుంపనాశనమే అన్నాడు. అసలు రాముడిదాకా ఎందుకు సకల లంక వినాశనం చేసే సమర్ధత తనకున్నదని చెప్పాడు. కాని రామాజ్న లేదనీ, ఆయన ప్రతిజ్ఞా చెల్లాలనీ, తనకే ఇంత శక్తి ఉంటె తనను పంపిన ప్రభువుకు ఎంతటి శక్తి ఉంటుందో ఆలోచించ మన్నాడు. ప్రభుకే అలాంటి శక్తి ఉంటే, ప్రభువులకు ప్రభువు రామస్వామి కి ఎంతటి తేజబలపరాక్రమాలుంటాయో గ్రహించమన్నాడు. చాలా

సమర్థంగా ధర్మాధర్మ విచారణ చేసి కూడా హితం చెప్పాడు. రావణ ధర్మఫలం సీతాపహరహతో "హళ్లికి హళ్లి సున్నకు సున్న"అయి పోయి అధర్మ ఫలం పెరిగి నాశనం చేయటానికి సిద్ధంగా ఉందన్నాడు. ఎవరూ రాలేని లంకకు శతయోజనవిస్తీర్ణ మహా సముద్రం పై యెగిరి తాను చేరానని, తనలాంటి తనకంటే విశేష బలపరాక్రమ వానర సింహులు లున్నారని వారికి వాయు, గరుడ వేగం ఉందనీ, కనుక కోతులు భల్లూకాలు అని తేలికగా భావించవద్దనీ చెప్పాడు. వాలి పరాక్రమం తెలుసు నీకు అన్నాడు. పూర్వం ఒకసారి రావణుడు ఏదో కోతి పని చేస్తే కోపంతో వాలి వాడిని తన చంకలో పెట్టుకొని సప్త సముద్రాలలో ముంచి తేలిస్తే, ఊపిరాడక కాళ్ళ బేరానికి వస్తే క్షమించి వదిలాడు వాలి. అలాంటి అమిత తేజో సంపన్నుడైన వాలినే రాముడు ఒకే ఒక్క బాణం తో చంపాడు అని భయపెట్టాడు. వానర భల్లూక సైన్య సమూహాలముందు శ్రీరాముడు సీతాపహరణం చేసినవాడిని సంహరిస్తానని ప్రతిజ్ఞ చేశాడని, రామ ప్రతిజ్ఞా, రామ బాణం తిరుగులేనివని స్పష్టంగా చెప్పాడు.

ఎంతటి ధర్మసూక్ష్మాలు హనుమకు తెలుసో మనకు ఆశ్చర్యమేస్తుంది. అరటి పండు వలిచి చేతిలో పెట్టినట్లు పగవాడికి అంత విస్పష్టంగా సుగ్రీవ దూత గా హనుమ మహా నేర్పుగా మాట్లాడాడు. సుగ్రీవ వచనాలు అని మొదలుపెట్టి, తర్వాత అంతా తన మాటలుగానే చెప్పటం మరో విశేషం అని పించింది. ఇహలోకం లోనూ పరలోకం లోనూ హితమైన మాటలు చెబుతున్నా విను అని బుజ్జగించి చెప్పాడు. వినకపోతే నీఖర్మం అన్నాడు తెగేసి. ఆత్మ వినాశనం తెచ్చే పనులు చేయొద్దు అన్నాడు, తనతో పాటు అందర్నీ, లంకనూ కాపాడుకోమని ముద్దుగా చెప్పాడు. లేక పోతే జరగబోయేది మైండ్ బ్లాక్ అయ్యేట్లు "బిగ్ స్క్రీన్ "మీద చూపించాడు, వినాశకాలే విపరీత బుద్ధి అన్నదాన్ని నిజం చేయకు అనీ చెప్పాడు. చేసిన తప్పులు చెంపలు వాయిన్చుకొంటే పోతాయి అన్నట్లు, పశ్చాత్తాపం చెంది సీతామహాదేవిని శ్రీరామ చంద్ర ప్రభువుకు సమర్పించి తనను సర్వ లంకా సామ్రాజ్యాన్ని కాపాడుకోమన్నాడు. శరణు అంటే రాముడు ఎవరినైనా క్షమిస్తాడని చెప్పకనే చెప్పాడు. శరణాగత రక్షణ రాముని ప్రత్యేకత "అభయం సర్వ భూతేభ్యః ఏతద్ వ్రతం మమ"అని చాటుకున్న ఉదార హృదయుడు.

ఈ హనుమ" దూతం" తో ప్రేరణ చెంది, శ్రీకృష్ణుడు భారతంలో రాయబారం నడిపాడు –"నా పలుకులు విశ్వసింపు " అలుగుటయే ఎరుంగని మహామహితాత్ముడజాత శత్రువే అలిగిన నాడు, సాగరములన్నియు ఏకము కాకపోవునే ",జెండాపై కపి రాజు, ముందు సిత వాజిశ్రేణిం గూర్చి, నే దండంబున్ గొనితోలు స్యందనము మీదన్ నారి సారించి గాండీవంబు ధరించి ఫల్గుణుడు మూకన్ చెండుడు చున్నప్పుడు – ఒక్కండును ఒక్కండునునీమొర నాలకింపడు" లకు హనుమ మాటలే మార్గదర్శకాలు. ఈ సర్గలో దాదాపు అన్ని శ్లోకాలు ఉదహరింప దగినవే. దేనికదే ప్రత్యేకం. అందుకే వదలకుండా అన్నీ రాశాను. వాటి సారమూ తెలియ జేశాను. ఇంతగొప్పగా ఈ సీన్ పండింప జేసిన వాల్మీకి మహర్షికి కైమోడ్పులు ఘటిస్తూ, ఏకపాత్రాభినయంలా హనుమ చూపిన సర్వ హావభావాలకు అంజలి ఘటిస్తున్నాను.

కోపం తో మూఢుడైన రాక్షసరాజు రావణుడు హనుమ ను చంపమని తీవ్రంగా ఆజ్ఞాపించాడు. దూతకార్యానికి వచ్చిన వాడిని చంపటం భావ్యం కాదన్నాడు వాక్య విశారద విభీషణుడు. ఆతడిని ఆపటానికి ఏమి ఆలోచించాలా అని మధనపడ్డాడు. అన్నను సామవచనాలతో మనసు మెత్త పడేట్లు చేద్దామనుకొని, చాలా కౌశల్యమైన మాటలతో "రాక్షసరాజా !ఈ వానరుడిని క్షమించు. అతనిపై కోపం వద్దు. ఏ పని చేయాలో ఏపని చేయరాదో తెలిసిన రాజశ్రేష్టులు దూతను వధించరు. అసలు వానరుని చంపటం రాజధర్మం కాదు. నింద్యమైనదికూడా.అది నీ వంటి వీరునికి తగని పని. -

"నిశ్చితార్ధ స్తతస్సామ్నా పూజ్య శత్రు జిదగ్రజం –ఉవాచ హిత మత్యర్థం వాక్యం వాక్య విశారదః "

"క్షమస్వ, రోషం త్యజ రాక్షసేంద్ర –ప్రసీద మద్వాక్య మిదం శృణుష్వ-వధం న కుర్వంతిపరావరజ్ఞాః-దూతస్య సంతో వసుధాధిపేంద్రాః"

"రాజ ధర్మ విరుద్ధం చ లోక వృత్తేశ్చ గర్హితం –తవదాస దృశం వీర కపే రస్య ప్రమాపణం"

రాజా !ధర్మజ్ఞుడవు,కృతజ్ఞుడవు.రాజధర్మ కుశలుడవు కర్తవ్యాకర్తవ్యాలు బాగా తెలిసిన వాడవు. పరమార్ధం తెలిసిన వివేకివి. నీలాంటి పండితుడు రోషంతో కలుషితులైతే, వివిధ శాస్త్రాలు చదివి, జ్ఞానం సంపాదించటం శ్రమ వ్యర్థమే అవుతాయికదా.కనుక అన్నీ క్షుణ్ణంగా తెలిసిన నువ్వు యుక్తాయుక్తాలతో ఆలోచించి ఈ దూతను దండించు "అని చెప్పి కూర్చున్నాడు. -

"గృహ్యంతే యది రోషేణ త్వాదృశోపివిపశ్చితః-తతశ్శాస్త్ర విపశ్చిత్వం శ్రమ ఏవ హి కేవలం "

"తస్మాత్ ప్రసీద శత్రుఘ్న రాక్షసేంద్ర దురాసద –యుక్తాయుక్తం వినిశ్చిత్య దూత దండోవిధీయతాం "

విభీషణుడి మాటలకు అరికాలి మంట నెత్తికెక్కిన రావణుడు "శత్రునాశకా, విభీషణా!పాపుల్ని చంపితే పాపం రాదు. రాజద్రోహం చేసిన వీడు పాపి కనుక చంపేస్తాను. "అన్నాడు –

“న పాపానాం వధేపాపం విద్యతే శత్రుసూదన –తస్మాదేనం వదిష్యామి వానరం పాపచారిణం”

అన్నమాటలు విన్న తమ్ముడు తన పట్టు వదలకుండా “రాజా !ప్రసన్నుడవు కావలసినది గా కోరుతున్నాను.ధర్మార్ధ యుక్తమైన నా మాట విను. యజమాని ఆజ్ఞను దూత నిర్వహిస్తాడు కనుక ఏ జాతిలో కూడా దూతను చంపటం అనేది లేదు –

“దూతాన్ నవధ్యాన్ సమయేషు రాజన్ –సర్వేషు సర్వత్ర వదంతి సంతః

రాజా !యితడు బలమైన శత్రువు అనటం లో సందేహం ఏమాత్రం లేదు. అతడు చేసిన అపకారం కూడా చాలా పెద్దదే. అయినా సత్పురుషులు దూత వధను దండంగా పేర్కొనరు. దూతకు విధించే శిక్షలు వేరే ఉన్నాయి. అంగవైకల్యం కలిగించటం, కొరడాలతో కొట్టటం, గుండుగీయించటం, ముద్ర వేయటం దూతకు విధించే శిక్షలు అనే చెప్పారుకాని దూతవధ ఎక్కడా ఇంతవరకు విని ఉండలేదు. -

“అశంశయం శత్రు రయం ప్రవృద్ధః -కృతం హ్యనే నాప్రియ మప్రమేయం –న దూత వధ్యాంప్రవదంతిసంతో –దూతస్య దృష్టాబహవో హి దండాః”

“వైరూప్య మంగేషు కశాభి ఘాతో-మౌండ్యం తథా లక్షణసన్నిపాతః -ఏతాన్ హిదూతే ప్రవదంతి దండాన్ –వధస్య దూతస్య న నః శ్రుతోపి “

అన్నా !ధర్మాధర్మాలలో సుశిక్షితమైన బుద్ధి కలిగి ఉత్కృష్ట, అప కృష్టాలు తెలిసి, కార్య నిర్వహణ చేసే నీవంటివాడు కోపించటం ఏమిటి ?ధీరులు కోపం నిగ్రహించు కొంటారు కదా. ధర్మ శాస్త్ర, లౌకిక విషయ, శాస్త్రార్ధాలను తెలుసుకొని వాటిని మర్చిపోకుండా ఉండటం లో నీకు సమానులులేరు. సురాసురులలో నువ్వు ఉత్తముడవు. కోతిని చంపటం లో గుణ విశేషం ఏదీ నాకు కనిపించటం లేదు. నువ్వు వేసే దండన ఇతడికి కాక, ఇతడిని పంపిన వాడికి వర్తించేట్లు చెయ్యి. యోగ్యుడైనా అయోగ్యుడైనా యితడు పరులచే పంపబడిన వాడు. అతడిమాటలు పరాధీనమైన మాటలు కనుక దండింప తగనివాడు. ఇతడిని చంపితే ఇంతదూరం రాగలిగే వేరొక దూత కనపడడు.కనుక వదించవద్దు.అలాంటి ప్రయత్నం ఇంద్రాదులపై చెయ్యి. యితడు ఇక్కడ మరణిస్తే రామలక్ష్మణులను యుద్ధానికి ప్రేరేపించే వేరొక దూత ఉండడు.సర్వ శత్రు సంహారకుడవైన రాజా! ఆ సోదరులతో చేయాల్సిన యుద్ధావకాశాన్ని జార విడుచుకోవద్దు –

“పరాక్రమోత్సాహ మనస్వినాం చ –సురాసురాణామపి దుర్జయేన –త్వయా మనోనందన నైరుతానాం-యుద్ధాయతి ర్నాశయితుం న యుక్తా “

“నీ దగ్గర సర్వ సమర్ధులైన యోగ్యులైన సేవక సైనికులు కోట్లాది మందిఉన్నారు. అందులో కొద్ది భాగం సైన్యాన్ని తీసుకొని నీ ఆజ్ఞతోకొందరు మహాయోధులు వెళ్లి, రామ సోదరులను బంధించి నీ శత్రువులకు నీ ప్రభావం ఎలాంటిదో చూపించాలి “అని అత్యంత రాజనీతిజ్ఞతతో తమ్ముడు విభీషణుడు చెప్పిన మాటలకు అన్న రావణుడు శాంతించి బుద్ధిపూర్వకంగా అంగీకరించాడు –

“తదేక దేశేన బలస్య తావత్ –కే చిత్తివా దేశ కృతోభియాంతు –తౌ రాజపుత్రౌ విని గృహ్య మూఢౌ-పరేషు తే భావయితుం ప్రభావం “

“నిశాచరాణా మదిపోనుజస్య –విభీషణ స్యోత్తమ వాక్య మిష్టం –జగ్రాహ బుద్ధ్యా సురలోక శత్రు- ర్మహాబలో రాక్షస రాజముఖ్యః “

ఇది 26శోకాల 52వ సర్గ

ఇందులో రావణుడి దుందుడుకుతనం, ఆవేశం తో వచ్చిన కోపం ఆలోచనా రాహిత్యం, మరచిపోయిన మూల రాజనీతి మనకు స్పష్టంగా కనిపిస్తుంది. తమ్ముడు విభీషనుడిలో అత్యంత వివేకం ధీబలం, రాజనీతి, ప్రపంచజ్ఞానం విస్పష్టంగా దర్శనమిస్తుంది. అన్నగారి కోపం తగ్గించి శాంత పరచనిదే సమస్య పరిష్కారం కాదు కనుక అతడి శాస్త్రజ్ఞానం, పరాక్రమవిశేషాలు అతడిని ఎదిరించే సాహసం ఎవరిలోనూ లేదనే విషయం చెప్పి కొంత ధూపం వేసి మెత్తబడేట్లు చేశాడు, నేర్చిన శాస్త్రార్ధ జ్ఞానం విఫలం కారాదనీ చెప్పాడు. కోపం అనర్ధదాయకమనీ దూత వధ అనేది ఏ రాజ ధర్మంలోనూ లేనిదని అది ఆటవిక చర్య అని తపస్వి మేధావి రాజకీయ దురంధరుడు అయిన రావణుడు చేయాల్సినపనికాదని అది అత్యంత హేయ, నీచ,నికృష్ట కృత్యమని స్పష్టం చేశాడు, యుక్తాయుక్తాలు విచారించి శిక్షించమన్నాడు. వానరుడు రాజద్రోహం చేశాడు. కనుక దండనార్హుడు అని ఒక మెలిక పెట్టాడు రావణుడు. తనవాదన మరీ ఒక వైపే ఉందేమోననే అనుమానం వచ్చి వానరుడు మహాబలశాలేకాక లంకకు పెద్ద నష్టం కూడా చేశాడు అనటంలో సందేహం లేదనీ చెప్పాడు. దూత తనను పంపినవారు ఏది, ఎలా చెప్పమంటే అలా చెబుతారు. అందులో వాళ్ళ స్వంతమాటలేమీ ఉండవు. దూతవాక్యం అంటే పంపినవాడు చెప్పిన మాటలే. “కాళిదాసు కవిత్వం కొంత నాపైత్యం కొంత” అన్నట్లుగా దూత స్వంత పైత్యం ఉండదు. వాడికి వేసే శిక్షపంపినవాడికి బుద్ధి వచ్చేట్లు చేయటం రాజనీతి అన్నాడు. దూతను దండించేందుకు ఎన్నో రకాలు చెప్పబడ్డాయి కనుక అందులో ఏదో ఒకటి చేసి, వాడిని పంపిస్తే, వాడు వెళ్లి పంపినవాడితో తనగోడు

చెప్పుకొంటాడు. వీడిని ఇక్కడే హతమారిస్తే ఈకాకను అక్కడికి చేర వేసే వారు ఉండరు. రావణుడికి కావాల్సింది రామసోదరులతో యుద్ధం. అనంత సేనావాహినిలో కొంతమందిని సోదరులదగ్గరకు పంపి వాళ్ళను బంధించి తెమ్మనటం ఒక గొప్ప ఆలోచన. రాక్షససైన్యానికి అవలీల అయిన పనికూడా. విభీషణుడి ఈ మంత్రం బాగా పారింది, ఠక్కున అతుక్కుంది రావణ హృదయానికి. వెంటనే "ఐ అగ్రీ విత్ యు "అన్నట్లు తలూపి వధ ఆలోచన విరమించి తమ్ముడి ఆలోచనను అంగీకరించాడు. హనుమ బతికి బయట పడ్డాడు "చూచిరమ్మంటే కాల్చివచ్చినట్లు" లంకాదహనం చేయటానికి.

విభీషణుడి మాటలకు తలపంకించి రావణుడు "బాగా చెప్పావు. దూతను వధించటం నింద్యమే. కనుక వేరే దండన విధించాలి. కోతులకు తోక మహా ముచ్చటైన అలంకారం దాన్ని కాల్చండి.ఆకాలిన తోకతో అతడు ఇక్కడినుంచి వెళ్ళాలి. దీనుడై అంగవైకల్యం తో కృశించిన ఉన్న ఇతడిని, సోదర బంధుమిత్రాదులుచూడాలి "అని చెప్పి. సేవకులతో "నాలుగు వీధుల్లో వీడిని తోక కాలుతుండగా, అందరూ చూసేట్లు త్రిప్పండి "అని ఆనతిచ్చాడు –""సంయగుక్తం హి భవతా దూత వధ్యా విగర్హితా –అవశ్యం తు వధాదన్యః క్రియతామస్య నిగ్రహః "

"కపీనాం లాంగూల మిష్టం భవతి భూషణం –తదస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్చతు"

"తతః పశ్యం త్విమం దీన మంగ వైరూప్య కర్శితం –సమిత్ర జ్ఞాతయ స్సర్వే బాంధవా స సుహృజ్జనాః"

ఆజ్ఞాపయరాక్ష సేంద్రఃపురం సర్వం సచత్వరం - "లాంగూలేన ప్రదీప్తేన రక్షోభిః పరి ణీయతాం-"

ఇంకేముంది కోతితో ఆడుకోవాలని ముచ్చటపడ్డ రాక్షసులు చినిగిన గుడ్డ పేలికలు తోక కు పూర్తిగా చుడుతుంటే, కొంటె హనుమ ఇదే సమయమని తన శరీరాన్ని పెంచేశాడు. ఆయన పెంచుతూనే ఉన్నాడు వీళ్ళు చుట్టుతూనే ఉన్నారు. ద్రౌపదీ వస్త్రాపహరణంలో చీర ఊడుతుంటే మరో చీర దాని స్థానం లో "కన్నయ్యన్నయ్య" కనికట్టుతో చుట్టుకొన్నట్లుంది దృశ్యం. గుడ్డముక్కలను నూనె తో తడిపి నిప్పు అంటించారు వినోదం చూడటానికి. అవతలి ఇల్లు కాలుతుంటే మనకు వినోదం చూడటానికి తర్వాత కాలేది మన కొంప కదా అనే ఇంగితం ఉండదు. ఆనిప్పు వాళ్ళ కొంపకే అన్న సంగతి తెలీదు పాపం వారికి. ఊరుకుంటాడా "కోతిమారాజు" ? మండే తోకతో వాళ్ళను ఎడా పెడావాయించి బాదేశాడు.ఇది "శాంపిల్ దెబ్బలే", తర్వాత చావు దెబ్బలు తప్పవు, ఇళ్ళల్లోని ఆబాల వృద్ధ రాక్షసులంతా వీధుల్లోకి ఆనందం తో వచ్చి చోద్యం చూశారు. మళ్ళీ రాక్షసులు తనను బంధించగా హనుమ "నేను బంధింపబడి ఉన్నా వీళ్ళు నన్ను వదలరు కనుక బంధనాలు చేదించుకొని, పైకెగసి వీళ్ళను చంపుతా. నేను నా యజమాని మేలు కోరి, ఇక్కడ తిరుగుతుంటే, దుర్మార్గులు వీళ్ళు నన్ను బంధించారు. దానికి ప్రతీకారం చేయలేదు. వీళ్ళందర్నీ చంప టానికి నేను ఒక్కడినే చాలు. రాముడు ప్రతిజ్ఞ చేశాడుకనుక అయన ప్రీతికోసం నన్ను నాల్గు వైపులా త్రిప్పుతారు వీళ్ళు. శ్రమ లేకుండా లంక అంతా చూసే అవకాశం కలుగుతోంది కనుక వాళ్ళ ఆగడాన్ని సహిస్తాను. నేను రాత్రిపూట లంకలో తిరిగాను కనుక నగర రక్షణ దుర్గాలు, ఇతర విషయాలు తెలుసుకోవటం కుదరలేదు. ప్రాతః కాలం లో లంక అంతా పరిశీలించి చూస్తాను. నన్ను బాధించినా, పీడించినా సహిస్తాను "అనుకొన్నాడు యుక్తియుక్తమైన ఆలోచన. వచ్చిన పని ఏవిధంగా నెరవేరుతుంది ఇదంతా చూడకుండా ?కిష్కింధకు వెడితే ఇక్కడి విషయాలు అడిగితె ఏం చెబుతాడు ?షేక్స్పియర్ మొహం వేయాల్సి వస్తుంది. తన ఆకారం కప్పి పుచ్చుకొనగా హర్షాతి రేకంతో అతడిని పట్టి తీసుకు వెడుతూ శంఖాలు ఊదుతూ భేరీలు మోగిస్తూ రచ్చరచ్చగా వీధులన్నీ త్రిప్పారు. తిరుగుతూ బాధ భరిస్తూ లంకను కూలంకషంగా పరికించి పరిశీలించి,పరిశోధించి చూశాడు.మహా వీధులు, క్రాస్ రోడ్లు, సందులు గొందులు చిన్నా, పెద్దా ఇళ్ళూ, భవనాలు అంతర్ద్వార, బహిర్ద్వారాలు, లోగిళ్ళు, ముంగిళ్ళు పరీక్షించి చూసి అవగతం చేసుకొన్నాడు. "వీడు దొంగ దొంగ "అని పరిచయం చేస్తూ, అరుస్తూ త్రిప్పారు. పాపం ఎంతటి కాక తగులుతూ, బాధ భరిస్తూ, రామకార్య నిర్వహణకోసం,అవమానమూ ఓర్చుకున్నాడో రామభక్త హనుమ. కార్య దీక్ష అంటే అదీ.

"చత్వరేషు చతుష్కేషు రాజమార్గే తథైవచ –ఘోషయంతికపిం సర్వే"చారీక "ఇతి రాక్షసాః"

ఈ వార్త సీతకు రాక్షస స్త్రీలు –"సీతా !నీతో మాట్లాడిన ఆ ఎర్రమూతికోతి తోకకు నిప్పెట్టి రాక్షసులు లంకానగరం అంతా తిప్పుతున్నారు"అని చెప్పారు

"యస్త్వయా కృత సంవాద స్సీతే తామ్రముఖః కపిః-లాంగూలేన ప్రదీప్తేన సఏష పరిణీయతే"

ఆమాటలకు సీత తన ప్రాణాలనే అపహరించినట్లు దుఖపడి అగ్నిని ధ్యానించిఉపాశించింది –"అగ్ని దేవా !నేను పతి సేవ, తపస్సు చేసి ఉంటె, పతివ్రతనైతే నువ్వు హనుమంతుని శరీరం కాలకుండా చల్లగా ఉండేట్లు చేయి. ధీమంతుడైన నాపతి పై కొంచెమైనా దయ ఉంటె, హనుమ శరీరాన్ని కాల్చక చల్లగాఉండు.నేను పాతివ్రత్యంతోఉన్నట్లు రామ సమాగమనం కోసం ప్రతీక్షిస్తున్నట్లు, ధర్మాత్ముడైన రాముడికి తెలిసిఉంటే, హనుమ అనుకొంటే హనుమపట్ల చల్లగా ఉండు. సత్యప్రతిజ్ఞ కల పూజ్య సుగ్రీవుడు నన్ను ఈ దుఃఖసాగరం నుంచి తరింప జేసేనేని, నువ్వు హనుమంతుని బాధించక చల్లగా ఉండు " అని పరిశుద్ధ మనసుతో నాలుగు శ్లోకాలతో ప్రార్ధించింది –

"మంగళాభి ముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః-ఉపతస్థే విశాలాక్షీ ప్రయాతా హవ్యవాహనం "

"యద్యస్తి పతి శుశ్రూషా యద్యస్తి చరితం తపః –యది చాస్త్వేక పత్నీత్వం"శీతో భవ హనూమతః" "

"యది కించి దనుక్రోష స్తస్య మయ్యస్తి ధీమతః –యది వా భాగ్య శేషో మే "శీతో భవ హనూమతః "

"యది మాం వృత్త సంపన్నా నాం, తత్సమాగమలాలసాం –స విజానీతి ధర్మాత్మా "శీతో భవ హనూమతహః "

"'యది మాం తారయేదార్య 'స్సుగ్రీవ స్సత్య సంగరః –అస్మాద్దుఖాంబుసంరో"ధాచ్ఛీతో భవ హనూమతః "

'ఆమె ప్రార్ధనలు విని వేడి తోక లోని అగ్ని శాంతించి, సీతాదేవితో" హనుమ కు శుభమే" అని తెలియ జేస్తున్నట్లుగా ప్రదక్షిణ జ్వాలతో మండాడు. అ అనలమే చల్లబడితే తండ్రి అనిలుడు ఊరు కుంటాడా ?తనవంతు కర్తవ్యాన్నీ తీరుస్తూ మంచులాగా చల్లగా వీస్తూ సీతకు, హనుమకు సుఖం కలిగేట్లు వీచాడు. "అగ్నికి వాయువు తోడైనట్లు"అనే సామెత ఉంది. అగ్ని ప్రమాదం జరిగినప్పుడు గాలిబాగా వీస్తే ఉపయోగించే సామెత. ఇక్కడ రివర్స్ లో అగ్ని చల్లదనానికి వాయువుకూడా మరింత చల్లగా వీచి తామిద్దరం భాయీ భాయీ,జిగినీ దోస్తులం అని నిరూపించుకొన్నారు. ఇలా అగ్నికి చల్లదనం లో వాయువు తోడుపడటం అరుదైన సంఘటన, దృశ్యమూను.

ఈ "బిహైండ్ ది కర్టెన్ "విషయం పాపం హనుమకేం తెలుసు ?మనసులో "అగ్ని నన్ను ఎందుకు దహించటం లేదు. పెద్దపెద్ద జ్వాలలేఉన్నా, నాకేమాత్రం బాధ కనిపించటం లేదు చందనం, వట్టి వేళ్ళ గంధం పూసినట్లు నా తోక చివర చల్లగా ఉందేమిటి ?ఇదంతా రామ ప్రభావమే. ఆయన ప్రభావంతోనే సముద్రమధ్యలో మైనాకుడు పైకి వచ్చాడు కదా. అతనికే రామకార్యం మీద ఆసక్తి ఉంటె, అగ్ని ఎందుకు సహకరించడు?సీత సౌమ్యత రాముని తేజస్సు, వాయు దేవుని స్నేహం వలనా దహించే స్వభావం కల అగ్ని నన్ను కాల్చటం లేదు "అనుకొన్నాడు.

"దాహ్యమానేచ లాంగూలేచిన్తయామాస వానరః - 'ప్రదీప్తోగ్ని రయంకస్మాన్న మాం దహతి సర్వతః –

"దృశ్యతే చ మహా జ్వాలః కరోతి న చ మేరుజం –శిశిరస్యేవ సంపాతో లాంగూలాగ్రే ప్రతిష్టి తః"

"రామ ప్రభావా దాశ్చర్యం పర్వత స్సరితాం పతౌ-యది తావత్సముద్రస్య మైనాకస్య ధీమతః –రామార్థం సంభ్రమ స్తాదృక్ మగ్నిర్నకరిష్యతి ?

"సీతాయాశ్చానృశం స్యేనతేజసా రాఘవస్యచ –పితుశ్చ మామ సఖ్యేన న మాం దహతి పావకః "

వెంటనే సింహ నాదం చేస్తూ పైకి యెగిరి, రాక్షస సంచారం లేని పురద్వారం దగ్గరకు వెళ్లి, మళ్ళీ పొట్టి రూపం పొందగా బంధనాలన్నీ విడిపోయాయి –

"స భూత్వా శైల సంకాశః క్షణేనపునరాత్మవాన్ –హ్రస్వతాంపరమాం ప్రాప్తో బంధనా న్యావశాతయత్ "

.బంధన విముక్తుడైన వెంటనే మళ్ళీ పర్వతాకారం దాల్చి అక్కడున్న ఇనుప గుదియ చూసి,దానితో కావలి రాక్షసులను వాయిం చేసి చంపి లంకను చూస్తూ తోకనుండి వచ్చే అగ్ని జ్వాలలు మాలగా ఉన్నవాడుగా, కిరణ సమూహంతో ఉన్న సూర్యుడులా భాసిం చాడు హనుమ –

స తా న్నిహత్వా రణ చండ విక్రమః –స్సమీక్ష మాణః"పునరేవ లంకాం-ప్రదీప్త లాంగూలాకృతార్చిమాలీ –ప్రకాశాతదిత్య ఇవార్చి మాలీ "

ఇది 45 శ్లోకాల 53వసర్గ

వనం విరగ్గొట్టి, పంపిన కింకర ద్వారపాలక మంత్రికుమార సేనాపతులనే ససైన్యంగా చంపిన హనుమ ధీమత్వాన్ని అంచనా వేయలేక పోయాడు రావణుడు. లేకపోతె తోకను కాల్చమని చెప్పటం ఏమిటి ?అసలు రాక్షసులు కవ్వించక ముందే అశోక వననాశనం చేశాడు. తోకకాలిస్తే ఇంకేం ప్రమాదం తెస్తాడో అనే బేసిక్ ఆలోచన మంత్రాంగం తెలిసిన అతడికి రాకపోవటం విడ్డూరంగా ఉంది. కొలువులో అందరు మేధావులున్నా ఎవరికీ ఈ ఆలోచన తట్టలేదు. విభీషణుడికి తట్టే ఉండచ్చు. కానీ చెబితేఈ "మొండి ముండావాడి "వల్ల ఏ ప్రమాదమో ఏదో చంపకుండా వదిలి రాజనీతిని కాపాడుకోనేట్లు అన్నతో చేయించాను కదా అని తృప్తి పడి మిన్నకుండి పోయాడని పిస్తుంది. హనుమ "మామూలోడు "కాదు. తోకకు గుడ్డలు చుట్టేప్పుడు, నగర వీధుల్లో త్రిప్పినప్పుడు పర్వత సన్నిభ ఆకారం లో ఉన్నాడు. అలాగే పైకీ ఎగిరాడు. ద్వారం దగ్గరకొచ్చాక, బుద్ధి పాదరసంలా పనిచేసి వామనత్వం పొంది తనబంధనాలు ఆటోమేటిక్ గా ఊడి పోయేట్లు చేసుకొన్నాడు. ఇదే సమయానికితగినట్లు ప్రవర్తించటం ఆలోచించటం ఆచరించటం అంటే. అది హనుమ లో పుష్కలంగా ఉన్నది.

హనుమ తోకకు నిప్పెట్టారని రాక్షస వనితలు సీతకు చెబితే ఆమె తల్లడిల్లి పోయింది. తనకోసం ఇంతదూరం వచ్చిన రామదూయ అయిన వాడికి ఏ అపాయం జరుగరాదు అని భావించి అగ్నిని ప్రార్ధించి తనవ్యక్తిత్వాన్ని రామ ప్రభావాన్నీ, సుగ్రీవ సంకల్పాన్నీ ప్రవర లాగా చెప్పుకొని "శీతో భవ హనూమతః "అని మనస్పూర్తిగా నాలుగు సార్లు ప్రార్ధించింది. పతివ్రత ఐన ఆమె ప్రార్ధన మన్నించక పోతే అగ్నికి పుట్టగతులుండవు.అందుకే హనుమ తోకకు చందనం, వట్టివేళ్ళగంధం వెన్నపూస పట్టించినంత గా వెంటనే చల్లబడ్డాడు. తనధర్మం తానూ చేశాడు రామకార్యం కోసం. డూడూ బసవన్నలా వాయుదేవుడు కూడా సహకరించి మలయ మారుతంలా వీచి చల్లబరచాడు.

తోక మంటలను అంతకు ముందు భరిస్తూ నగరమంతా తిరిగాడు. ఊరికే తిరగటమా అది కానే కాదు. ప్రతిఅంగుళం లోనూ ఏముందో బైనాక్యులర్ కళ్ళతోనూ, ఎక్స్ రే నేత్రాలతోనూ చూసిమెదడు మనస్సులో గ్రాఫిక్ చిత్రాలు గీసుకొన్నాడు రామ సుగ్రీవులకు నివేదించటానికి. లంకవాసులకు హనుమ లాంగూల దహనమే చివరి వినోదం అయింది. ఐతే బాగా ఎంజాయ్ చేశారు బాజా భజంత్రీల డప్పుల మోతలమధ్య. హనుమనూ చాలాదగ్గరగా చూడగలిగారు. ఆతర్వాత ఇళ్ళూ,ఒళ్ళూకాలి లబో దిబోలేగా.

లంకను చూస్తూ, తనమనసులోని కోరిక తీరగా అధిక ఉత్సాహంతో తరువాత కర్తవ్యం గూర్చి ఇలా ఆలోచించాడు "అశోక వన భంగం చేశా. మహామహులైన రాక్షస సంహారం చేశా. ఇక మిగిలింది లంకా దహనమే. ఇదిఒక్కటి పూర్తి చేస్తే, ఇప్పటిదాకా చేసిన పనులవలన పొందిన ఆయాసం తగ్గుతుంది. కొద్ది ప్రయత్నం తో చేసే ఈ పని వలన నా శ్రమ ఫలిస్తుంది.

"అల్పయత్నేన కార్యేస్మిన్ మమసాత్స ఫలః శ్రమః "

"నాతోకకున్న నిప్పుతో ఈ మహాగృహాలు తగలబెట్టి అగ్నికి సంతర్పణ చేస్తాను ".న్యాయమేకదా.తోక కాలకుండా చల్లబరచిన అగ్ని దేవుడికి కృతజ్ఞతగా ఆ మాత్రమైనా చేయాలి లేకపోతే కృతఘ్నుడు అయిపోతాడు. అది ఆయన రక్తంలో లేదు. అందుకే చక్కగా ఆలోచించాడు.

"యోహ్యయం మమ లాంగూలే దీప్యతే హవ్యవాహనః –అస్య సంతర్పణం న్యాయ్యం కర్తు మే ధిర్గృహో త్తమైః"

మెరుపులతో ఉన్న మేఘం లాగా వేగం తో మారుతి, మండే తోకతో లంకాపుర భవనాల పైభాగాలపై తిరిగాడు. ఒక ఇంటినుంచి మరో ఇంటికి కోతిలాగా దూకుతూ, ఉద్యాన మహా భవనాలలో సంచరించాడు. ముందుగా ప్రహస్తుని ఇంటిపై దిగి చిచ్చుపెట్టి. తర్వాత మహాపార్శ్వుడు వజ్ర దంష్ట్ర, తేజశ్శాలి శుక, ధీశాలి సారణ, ఇళ్ళను తగలెట్టాడు. తర్వాత కోటాలో ఇంద్రజిత్, జంబుమాలి, సుమాలి రాక్షస గృహాలకు "అగ్గెట్టాడు'..తర్వాత రశ్మికేత సూర్య శత్రు, హ్రస్వ కర్ణ, దంష్ట్రరోమశ, యుద్ధోన్మత్త,మత్త,ధ్వజగ్రీవ, భీకరుడైన విద్యుజ్జిహ్మ,హస్తిముఖ కొంపలకు చిచ్చెట్టి, పిమ్మట కరాళ,పిశాచ, శోణితాక్ష, , కుంభకర్ణ, మకరాక్ష, యజ్ఞ శత్రు, బ్రహ్మ శత్రు, నరాంతక, కుంభ, దురితాత్ముడైన నికుంభ, గృహాలను వరుసపెట్టి తగలబెట్టాడు. ఒక్క విభీషణుడి గృహాన్ని మాత్రం కాల్చకుండా వదిలేశాడు '.కారణం కృతజ్ఞత. రావణ కొలువులో రాక్షసరాజుకు నీతిపాఠం చెప్పగల రాక్షస వీరుడు, దూత ను చంపకూడదు అనే రాజ ధర్మాన్ని రాజుకు రాజుకు గుర్తు చేసి తనకు ప్రాణభయం లేకుండా మహోపకారం చేసినవాడు కనుక.

"వర్జయిత్వా మహా తేజా విభీషణ గృహం ప్రతి "

లంకలోని సకల రాక్షస గృహాలను కాల్చివేసి, చివరికి రావణుడి భవనం దగ్గరకు వచ్చాడు. బహురత్న శోభితమై, సకల శుభ లక్షణాలతో మేరుమందరం లా ఉన్నతమైన రావణ ప్రధాన భవనాన్ని తన"తోకాగ్ని"తో కాల్చి, ప్రళయ కాల మేఘంలాగా సింహ గర్జన చేశాడు.

"తతస్తస్మిన్ గృహే ముఖ్యే నానారత్న విభూశితే –మేరు మందర సంకాశే సర్వ మంగళ శోభితే "ప్రదీప్త మగ్ని ముత్సృజ్య లాంగూలాగ్రే ప్రతిస్టితమ్-'నానాద హనుమాన్ వీరో యుగాంత జలదో యథా"

ఇప్పుడు అగ్నికి వాయువు తోడ్పడి మహా వేగంగా వీస్తుండగా లాంగూలాగ్ని ప్రళయాగ్ని లాగా ప్రజ్వరిల్లింది. వాయువు బాగా సహకరించి ఆ అగ్నిని నిమిషాలమీద అన్ని ఇళ్ళకూ పాకించి మహోపకారం చేశాడు హనుమకు. మహా దారుణ నష్టం కలిగించాడు లంకకూ రావణ సమూహానికి. ఇప్పటిదాకా వాడు వీచమంటే వీయటం, వద్దంటే మానేయటంలా ఆయన బానిస బతుకు గడిపాడు. ఇప్పుడు తనకోపం పగ ప్రతీకారం తీర్చుకోవటానికి ప్రళయ జంఝు లా విజ్రుంభించాడు. తనకూ ఒక చాన్స్ లంకాదహనం లో లభించినందుకు మహదానందపడ్డాడు.

బంగారు కిటికీలు, ముత్యాల మణుల రత్నాల తో నిర్మిత భవనాలు మాడి భస్మమైపోయాయి. పుణ్యం తీరగానే ఆకాశం నుంచి నేలకు పడిన సిద్ధుల భవనాల్లాగా రాక్షసభవన విమానాలు విరిగి నేల గూలాయి –

"తాని భగ్న విమానాని నిపేతు ర్వసుదాతలే-భవనానీవ సిద్ధానా మంబరాత్ పుణ్య సంక్షయే"

అందమైన విలాసవంతమైన తమభవనాలన్నీ తగలబడుతుంటే,కాపాడుకొనే ప్రయత్నాలు చేస్తూ యజమానులు "అయ్యో !అగ్నియే వానర రూపం లో వచ్చి దహించింది "అని ఏడుస్తూ, పారిపోతున్న చేసే భీకర నాదాలు అన్ని వైపులనుంచి వినిపించాయి"-

"నూన మేషోగ్నిరాయాతః కపి రూపేణ హా యితిః

పాలుతాగే పసిపాపలను చంకనెత్తుకొని స్త్రీలు కురులు వదిలేసి, ఆక్రందనం చేస్తూ తగులబడుతున్న ఇళ్ళ నుండి నేలపై బడ్డారు –'

"క్రందత్య స్సహసా పేతుః స్తనంధయధరాస్త్రియః –కాశ్చి దగ్నిపరీతేభ్యో హర్మ్యేభ్యోముక్త మూర్ధ జాః"

అట్లా పడినా వాల్మీకికి వాళ్ళు ఆకాశం నుంచి నేలమీద పడిన మెరుపుతీగాల్లాగా కనిపించారు-

"పతంత్యో రేజిరేభ్య స్సౌదామినస్య ఇవాంబరాత్ "

కాలిన భవనాలనుంచి వాటికి అలంకరించిన వజ్ర వైడూర్య రత్న,ముత్య,వెండి బంగారాదులన్నీ కరిగి 'నీళ్లై"అంటే భస్మమై అంటే బంగారమైప్రవహించటం హనుమ చూశాడు. రత్నం లోనూ బొగ్గు లోనూ ఉండే మూలపదార్థం ఎలిమెంట్ కార్బన్ అనే పరమ సత్యం ఇక్కడ ఆవిష్కారమైం దని పించిందినాకు. వజ్రంకాలిస్తే వచ్చేది బొగ్గే.

అగ్ని కట్టెలు, గడ్డి చేత తృప్తి చెందదు.అలాగే హనుమ రాక్షస గృహ దహనంతో తృప్తి చెందలేదు, అలాగే భూమి కూడా చావబడిన రాక్షసుల చేత తృప్తి చెందలేదట '.మూడూ పంచభూతాలలోనివేగా. వాటికి దాహం ఎక్కువ. అందుకే ఈ నష్టం వాళ్లకు ఆనలేదు తృప్తి కలిగించలేకపోయింది. ఇంకా ఎక్కువ నష్టం కావాలన్న మాట

"వజ్ర విద్రుమ వైదూర్య' ముక్తా రజత సంహితాన్-విచిత్రాన్ భవనాన్ ధాతూన్ స్యన్దమానాన్ దదర్శ సః"

"నాగ్నిస్త్రుప్యతి కాష్టానాం, తృణానాంహరియూధపః –నాగ్నేర్నాపి విశస్తానాం రాక్షసానాం వసుంధరా "

తగల లబడిన సకల వస్తుజాలం మోదుగ పువ్వుల్లాగా, బూరుగ పూలలా, కుంకుమలా వాటి ద్రవ్య స్వభావాన్ని బట్టి ప్రకాశించాయి. త్రిపురాలు రుద్రునిచే కాల్చబడినట్లు, లంకానగరం వేగవాన్ బలవాన్ మహాన్ హనుమాన్ చేత దగ్ధం చేయబడింది-

"హనూమతా వేగవతావానరేణ మహాత్మనా –లంకాపురం ప్రదగ్ధం త రుద్రేణ త్రిపురాయథా"

హనుమ అంటించి విడిచిన అగ్ని లంకాపురాగ్రాన ప్రజ్వరిల్లిన భయంకరాగ్ని, జ్వాలానల సమూహాలను ప్రజ్వ లింప జేసి విరాజిల్లింది. వాయువు తోడైన ఆ అగ్ని,ప్రళయాగ్ని వేగంతో పొగ లేకుండా ప్రకాశిస్తూ, రాక్షస భవనాలలో తిరుగాడుతూ, రాక్షస శరీరాలు అనే నేతితో ప్రజ్వరిల్లజేయబ డిన జ్వాలల్లాగాఆకాశం అంటుతూ పెరిగాయి –

యుగాన్తకాలానల ఉల్య వేగ –స్సమారుతో గ్నిర్వవృదే దివి స్పృక్-"విదూమ రశ్మి ర్భవనేషు సక్తో –రక్షశ్శరీరాజ్య సమర్పితార్చిః"

ఆ మహాగ్ని కోటి సూర్య ప్రభా భాసితంగా, లంకానగరం అంతా చుట్టి వ్యాపించి పిడుగుల్లాంటి భయంకర శబ్దాలు చేస్తూ, బ్రహ్మాండాన్ని బద్దలు చేస్తోందేమో ననిపిస్తోంది-

–ఆదిత్య కోటీర సదృశ స్సుతేజా –లంకాం సమస్తాం పరివార్య తిష్టన్-లంకాం సమస్తాంపరివార్య తిష్టన్-శబ్దై రనేకై రశని ప్రరూఢై-ర్భిందన్నివాండం ప్రభవౌ మహాగ్నిః “

ఆకాశ పర్యంతం వ్యాపించిన ఆ అగ్నిరూక్ష కాంతితో,మోదుగుపూల రంగుమంటలతో కనిపించి క్రమగా మంటలు తగ్గి, పొగ చేత వ్యాపించిన మేఘాల్లాగా నల్లకలువల్లాగా ప్రకాశించాయి –

“తత్రాంమ్బరా దగ్ని రతి ప్రవృద్ధో –రూక్ష ప్రభః కింశుక పుష్ప చూడః-నిర్వాణ దూమాకుల రాజయశ్చ-నీలోత్పలాభాః ప్రచకాశిరే భ్రాః”

“ ఈకోతిగాడుయముడో, వరుణుడో, వాయువో, రుద్రుడో అగ్ని,సూర్య కుబేర చంద్రుడో అయిఉంటాడు. కేవల వానరుడు మాత్రం కాదు. స్వయంగా యముడేమో””?ఒక వేళఅన్నిలోకాలకు తాత, సకల జీవ పోషకుడు ఐన బ్రహ్మ కోపం సకల రాక్షస సంహారానికై వీడి రూపం లో వచ్చినదా ?-

-కిం బ్రాహ్మణ స్సర్వ పితామహస్య -”సర్వస్య ధాతుశ్చతురాననస్య –ఇహ గతో వానర రూపదారీ –రక్షోప సంహార కరః ప్రకోపః “

“మూడు విధాలుగా పరి చ్చేద శూన్యమైనదీ, ఇంద్రియ గోచరం కానిదీ, కేవల మనసుకూ తెలియ శక్యం కానిదీ, అద్వితీయమైనదీ, ఐన వైష్ణవ తేజం తన అసాధారణ ఆశ్చర్యకర శక్తితో ఈ కపి రూపం దాల్చి వచ్చిందా ?”అని జ్ఞానాదధికులైన రాక్షసులు అందరూ ఒక చోట చేరి చర్చించుకున్నారు –

“కిం వైష్ణవం వా కపి రూప మేత్య –రక్షో వినాశాయ వరం సుతేజః –అనంత మవ్యక్త మచిన్త్యమేకం-స్వమాయయా సాంప్రత మాగతమ్ వా “

లంకలోని సకల వస్తుజాలం రాక్షస, అశ్వ ఏనుగు, పక్షి మృగాలు భీకరమైన అరుపులతో రథ, వృక్షాదులు కాలటం వలన ఏర్పడిన ధ్వనితో ఆ లంక దీన స్థితి లో భీకరధ్వనులు కలది అయింది చేష్ట లుడిగి.

“అయ్యో తండ్రీ !అయ్యో కొడుకా !అయ్యో ప్రియుడా !మిత్రుడా !పుణ్యాలతో మంచి భోగాలు అనుభవించినట జీవితమా !”అనుకొంటూ రాక్షసులు చేసే దీనాలాపనలు అంతటా వ్యాపించి భయం గొలుపుతున్నాయి –

“హా తాత హా పుత్రక కాంత మిత్ర –హా జీవితం భోగయుతం పుణ్యం –రక్షోభి రేవం బహుదా బృవద్భిః -శబ్దః కృతో ఘోరతర స్సుభీమః “

అందరూ అన్ని విధాలుగా శాపోప హతుల్లా చనిపోయినట్లుంది నగరం. ప్రళయ కాలం లో భగవంతుని కోపం తో నాశనం చేయబడిన భూమి లాగా ఉన్న దీనమైన లంకను హనుమ చూశాడు. చేయాల్సిన విధ్వంసం అంతా చేసేసి, ఇక తనకు ఏమీ పట్టనట్లు కిమిన్నాస్తి గా ఉండిపోయి త్రికూట పర్వతం పై హాయిగా కూర్చున్నాడు. ఒకసారి రాముడిని మనసులో స్మరించాడు. ఇలాంటి దానికోసం ఆకాశం లో కాచుకు కూర్చున్న దేవతలు పొగడ్తలజల్లు కురిపించారు. ఈవనం తగులబెట్టటం,లంకాదహనం చేసిన హనుమాన్ ను వాల్మీకి మనసారా పొగడ్తలు చేసి తన ఆనందాన్నీ పొందుపరచి మనకూ ఆనందం కూర్చాడు –

“మహాబలం మారుత తుల్యవేగం, మహామతిం వాయు సుతం,వరిష్టం-ప్రతుష్టువుర్దేవ గణాశ్చసర్వే”

“భంక్త్వా వనం మహా తేజా హత్వా రక్షాంసిసంయుగే –దగ్ద్వా లంకాపురీం రమ్యాం రరాజ స మహాకపిః”

దేవతలతో పాటు కోరస్ పాడారు గంధర్వ,సిద్ధ, మహర్షులు. వీరికి ఆనందం, ఆశ్చర్యమూ కలిగాయి –

“తత్ర దేవా స్స గంధర్వా స్సిద్దాశ్చ పరమర్షయః –దృష్ట్వా లంకాం ప్రదగ్దాం తాం విస్మయం పరమం గతాః”

హనుమను చూసి సకల భూత గణాలు ప్రళయాగ్ని అనుకొన్నాయి. వీరితో పాటు వంతకలిపారు విద్యాధర నాగ రాక్షస, యక్ష మహాభూతాలు మహదానందంగా. అక్కడ వాళ్ళు లంకలో ఏడ్పులు, పెడబొబ్బలు. ఇక్కడ ఆకాశం లో వీరంతా కేరింతలు, పులకరింతలు అభినందనలు. “ఒళ్ళు కాలి ఒకడు ఏడుస్తుంటే చుట్టకాల్చుకోటానికి నిప్పు కావాలని అడిగాడు వేరొకడు “అన్న సామెతగా ఉంది దృశ్యం.

“దేవాశ్చ సర్వేముని పుంగ వాశ్చ-గంధర్వ విద్యాధర నాగ యక్షాః- భూతాని సర్వాణి మహాం తి తత్ర –జగ్ముః పరాం ప్రీతి మతుల్య రూపం “.

ఇది 51శ్లోకాల 54 వ సర్గ.

ఇదంతా హనుమ" లంకాదహన విభూతి యోగమే'.కడుపు నిండా కాల్చాడు లంకను. కళ్ళనిండా ఆ కాల్పుల దృశ్యాలను చూసుకొన్నాడు. రాక్షసుల ఆర్తనదాలు వీనుల విందుగా విన్నాడు. సీతాపహరణం అనే పెద్ద తప్పుకు శాంపిల్ చెప్పుదెబ్బ గా చేశాడు. ఇన్ని ఇళ్ళు మాడి మసి అయి మహా తేజస్సుతో ఉన్న లంకానగరాన్ని మరు భూమిగా మార్చాడు. రావణ రాక్షసుల గర్వానికి రెండవ పెద్ద దెబ్బ కొట్టాడు. భవిష్యత్తులో విభీషణుడు దుష్ట రావణుడి చెంత ఉండలేడని, మహా వైష్ణవ భక్తుడు కనుక రామపాదాలను తప్పక చేరుతాడని, చేరక తప్పదని ఊహించి కూడా ఆ ఇంటి జోలికి పోలేదు..చాలామంది రాక్షసుల కొంపలు తగులబెట్టాడు. ఈపేర్లన్నీ ఎలా తెలుసు ఆయనకు ?బయట నేమ్ ప్లేట్లు పెట్టుకొన్నారా ? అనుకోవచ్చు.ఏ కావ్యంలోనైనా రచనలోనైనా గ్రంథకర్తే చెబుతాడు,

ఈ దహనకాండ సర్గలోనూ మహర్షి వాల్మీకి చాలసందర్భ శుద్ధిగా ఉపమాలంకారాలు వాడి శ్లోకాలకు శోభ కూర్చాడు. చెప్పాల్సిన విషయం స్పష్టంగా అర్ధమయేట్లు చెప్పి రంజింప జేశాడు. అగ్నికి సంతర్పణం చేస్తానన్నాడు హనుమ. సుమారు యాభై ఏళ్ళ క్రితం వరకు ఆంధ్ర దేశం లో కాశీ రామేశ్వర తీర్ధ యాత్రలు చేసిన వారు ఇళ్ళకు క్షేమంగా తిరిగి వచ్చినప్పుడుఇళ్ళ వద్ద ఆయా దేవతాపూజ చేసి కాశీ సంతర్పణ రామేశ్వర సంతర్పణ చేసి బంధు మిత్రగణాలను ఆహ్వానించి, తాము తెచ్చిన గంగోదకం పాత్రలు, కాశీ కాలభైరవ తోరాలు పంచిపెట్టి కమ్మని విందు ఇచ్చేవారు. అప్పుడు ప్రయాణ సౌకర్యాలు తక్కువ కాశీకి వెళ్ళినవాడు తిరిగి వస్తాడనే నమ్మకం తక్కువున్న కాలం, "కాశీకి పోయిన వాడు కాటికి పోయిన వాడితో సమానం "అన్న సామెత బాగా వ్యాపించి ఉన్నకాలం కనుక అంతటి ఆనందోత్సవాలు జరిపేవారు. ఉత్తర భారతం లో కూడాఇలాంటివి జరిపేవారా ?మనకు తెలీదు. కాని వాల్మీకి మాత్రం చక్కని "తెలుగు సంతర్పణ "చేయించాడు అగ్ని హోత్రుడికి లంకాదహనం తో.

కాలే లంకా, అందులోంచి వచ్చే పిడుగుల్లాంటి వింత ధ్వనులు, కార్చిచ్చులాంటి వాలాగ్ని, జ్వాలాగ్ని రంగు మోదుగు పూలలా ఉందనటం, దహ్యమాన వస్తువుల కు అనుగుణంగా అగ్ని శిఖమోదుగ, బూరుగు, పూల రంగు, కుంకుమవర్ణ శోభితమవటం మహా గొప్ప అలంకారాలు. విలువైన రత్న వజ్ర స్వర్ణ రజతాదులు కాలి ప్రవాహమై ప్రవహించటం కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు కవి వాల్మీకి. అగ్నికి ఆహుతైన జనం పెట్టె శోకాలు, హృదయ విదారకంగా చూపాడు. తండ్రులను కొడుకులను పిల్లలను భర్తలను భార్యలను మిత్రులను కోల్పోయిన వారి రోదనాలు ఎంతటి కర్కోటక హృదయాన్నైనా ద్రవింప జేస్తుంది. అదీ కవితా శిల్పం.

కాలి బూడిదైన లంక శాపం చేత దగ్ధమైనట్లు, ప్రళయం లో భగవంతుని కోపం చేత నాశనం చేయబడిన భూమిలా కనిపించిందని సొగసైన వర్ణన చేశాడు. అసలు ఇంత వినాశనానికి కారణం ఏమిటి అని వితర్కించుకొన్నారు జనం.దిక్పాలకులలో ఎవరో ఒకరు వానర రూపం లో వచ్చి ఉండాలని, లేకపోతే సకల లోక పితామహ బ్రహ్మదేవుని కోపమే ఈ రూపంలో వచ్చి నాశనం చేసిందని కొంచెం పై ఆలోచన ఉన్నవారు భావించారు. ఎవరూకాదు యమధర్మరాజే లేక ప్రళయకాల రుద్రుడే వచ్చి ఉంటాడు "బాబోయ్" అనుకొన్నారు మరి కొందరు. ఆ పై స్థాయి బుద్ధి సూక్ష్మత ఉన్నవారు మాత్రం"రచ్చ బండ" దగ్గర చేరి తీరికగా సృష్టిస్థితి లయాలకు ఆదిమూలం,త్రివిధ పరిచ్చేద్య శూన్యం, ఆద్యంతాలు లేని, అద్వితీయమైనది మనోవాగతీతమైనది,తెలుసుకోవటానికి అసాధ్యమైనది అయిన పరబ్రహ్మం అనే వైష్ణవ తేజమే ఆశ్చర్య శక్తితో కపి రూపంగా వచ్చింది అనుకొన్నారు. విష్ణుమూర్తికి మహాకపి అనే పేరు కూడా ఉంది కదా. ఈ ఊహ బాగానే ఉంది. ఇందరి ఊహాలకు హనుమ గొప్ప పనికల్పించాడు తాను చేసిన లంకాదహనం తో. ఇదీ ఆయన వ్యక్తిత్వంలో ఒక భాగమే.

ఇది లంకా దహనమే కదా ఏదో పైపైన లాగించేద్దాం అనుకోని మొదలుపెడితే ఏదీ వదలానిపించక అన్నిటినీ స్పృశించాల్సి వచ్చింది. దేన్నీ విడువ బుద్ధికాలేదు. అంతటి చిక్కదనం చక్కదనం ఉంది ఈ సర్గలో. కవి మహర్షి వాల్మీకి కి మరోమారు కైమోడ్పులు.

లంకను సర్వవిధాలాతన వాలాగ్నితో దహింప జేసినమహాబల హరిసత్తమ హనుమ, సముద్ర జలాలలో తోకను ముంచి అగ్ని చర్చాడు –

"లంకాం సమస్తాంసందీప్య లాంగూలాగ్నిం మహాబలః –నిర్వాపయామాస తదా సముద్రే హరి సత్తమః "

సర్వవిధాల విభవం చెడిన లంకను ఒకసారి మళ్ళీ చూసిఒక్కసారి భయపడి తననుతాను నిందించుకొని మనసులో" లంకను కాల్చి యెంత నింద్యమైన పని చేశాను ?ప్రజ్వరిల్లే అగ్నిని నీళ్ళతో చల్లార్చినట్లు, ఎవరు తనకోపాన్ని స్వబుద్ధితో నిరోధించుకొంటారో వారు మహాత్ములగు పురుష శ్రేష్టులు,మహాత్ములుకదా?"-ఈ శ్లోకం లోకం లో బాగా ప్రచారమైంది.

"ధన్యా స్తే పురుష శ్రేష్టా ఏ బుద్ధ్యా కోప ముత్థి తమ్-నిరుంధంతి-మహాత్మానో దీప్త మగ్ని మివాం భసా"

"కోపం హద్దు మీరితే పాపం చేయకుండా ఎవరుంటారు ?కోపంతో పెద్దలను కూడా చంపుతారు, కఠినమైన మాటలతో సత్పురుషులను ఆక్షేపిస్తారు –

"క్రుద్ధఃపాపం న కుర్యాత్కః క్రుద్ధోహవ్యా ద్గురూనపి –క్రుద్ధః పరుషాయా వాచా నర స్సాధూనదిక్షిపేత్"

విపరీతమైన కోపం లో ఏది మాట్లాడాలో ఏది కూడదో తెలీదు. కోపించిన వాడు చేయరాని పని, ఎక్కడా మాట్లాడరానిది ఉండదు లోకం లో.

"వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్ –నా కార్య మస్తి క్రుద్ధస్య నా వాచ్యం విద్యతే క్వచిత్ "

"మనిషిలో పెల్లుబికి ఉన్న కోపాన్ని శిధిలమైనకుబుసాన్ని పాము వదిలేసినట్లు ఓర్పుతో తొలగించుకున్నవాడే పురుషుడు అనబడుతాడు. ఇదికూడా అద్భుత ఉపమానం

"య స్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి –యథోరగస్త్వచం జీర్ణాం సవై పురుష ఉచ్యతే"

"ముందూ వెనుకలు చూడకుండా ఆలోచించకుండా మహాపాపం చేసి సీతాదేవిని కాల్చి స్వామి ద్రోహి, ఘాతకుడినీ అయ్యాను. లంక అంతాపూర్తిగా కాలిపోతే, జనకీదేవికూడా తగులబడే ఉంటుంది. తెలీకుండా నా ప్రభువు కార్యం పాడు చేశాను. ఎవర్ని వెతకటానికి ఇంత దూరం శ్రమపడి వచ్చానో, ఆపనిని పూర్తిగా నాశనం చేశాను. లంకను కలచి సీత సంరక్షణ చేయలేకపోయిన మందభాగ్యుడను "-పశ్చాత్తాపం తో చేసిన పాపాలన్నీ పోతాయి అనటానికి ఈ దృశ్యం ఉదాహరణ. తొందరపాటు తెచ్చే అనర్థం ఎలా ఉంటుందో చెప్పే విషయం.

"అచింత యిత్వా తాం సీతా మగ్నిదం స్వామి ఘాతుకం –యది దగ్ధా త్వియం లంకా నూనా మార్యాపి జానకీ –దగ్ధా తేన మయా భర్తుర్హతం కార్య మజానతా –మయాహిదహతా లంకాం న సీతా పరిరక్షితా "

"నా అన్వేషణ ఎవరికోసమో ఆ సీతాదేవినే నాశనం చేసుకొన్నాను. లంకలో ఏమూలా మిగలక దహనమైంది కనుక ఆమె తగులబడే ఉంటుంది. నా అవివేకం వలన నాస్వామికార్యం చెడిపోయింది కనుక నా ప్రాణాలు ఇక్కడే వదలటం మంచిది. అగ్నిలో దూకనా బడబాగ్నిలో పడనా సముద్రం లోపడి, అందులోని జీవులకు ఆహారమవ్వనా. మొత్తం దూతకార్యం వ్యర్థం చేసి ఏముఖం పెట్టుకొని సుగ్రీవ రామాదులను చూడగలను ?నాలోని కోతిస్వభావాన్ని చంచలత్వాన్నీ,రోష దోషాన్నీ ప్రదర్శించిన వెర్రి వెంగళప్పను. అని తనను తానె బాగా ఎస్టిమేట్ చేసుకొన్నాడు హనుమ. ఇదీ ఆయన వ్యక్తిత్వం లో భాగమే. ఆత్మ విమర్శ లేనిది మనిషి ఎదగడు. ఎదిగే, ఎదిగిన,ఎదుగుతున్న మహాకపి కనుక చక్కగా తాపీగా తనపనులన్నిటినీ ఒకసారి నెమరేసుకొని పశ్చాత్తాపం చెందాడు. చేసిన దోషానికి ప్రతిక్రియలు అన్ని కోణాలనుంచీ ఆలోచించాడు. తనవానర చేష్టలను చెప్పుతో "సారీ తనవాలం"తోనే కొట్టుకున్న ఘనుడు సుందర హనుమ. చెడ్డ పని చేశానని పించినపుడు మనసు పరిపరి విధాల పోతుందనటానికి ఈ విషయం కూడా గొప్ప సాక్ష్యమే.

"ఈషత్కార మిదం కార్యం కృతమాసీ న్న సంశయః –తస్య క్రోదాభి భూతేన మయా మూలక్షయః కృతః"

"వినష్టా జానకీ నూనం న హ్య దగ్ధః ప్రదృశ్యతే –లంకాయాం కశ్చిదుద్దేశసర్వాభస్మీ కృతా పురీ "కిమగ్నౌనిపతామ్యద్య" ఆహోస్విద్బడబా ముఖే –శరీర మాహో సత్వానాందద్మి సాగర వాసినం "

"ఈషత్కారమిదం "శ్లోకం మల్లాది చంద్ర శేఖర శాస్త్రిగారు తరచూ ఉటంకిస్తారు.

"మయా ఖలుతదే వేదం రోష దోషాత్ ప్రదర్శితం -ప్రథితం త్రిషు లోకేషు కపిత్వ మనవస్థితం

"రజో గుణంతో నేను చేసిన పని ఎందుకూ పనికి రాకుండా పోయింది. రజో గుణానికి కారణమైన క్రోధానికి లోబడి సమర్థత ఉన్నా, సీతను రక్షించలేక పోయాను. ఆమె మరణిస్తే రామ సోదరులు ఎలా బ్రతుకుతారు?. వాళ్ళు లేకపోతె సుగ్రీవుడు, అతని బంధువులు అందరూ నశిస్తారు

"-రజో గుణం ఎలా కొంపకు అగ్గెట్టేస్తుందో హనుమ తో చెప్పించాడు మహర్షి. రజస్సు వలన కోపం, క్రోధం పెరిగి చేయరాని అనర్థాలన్నీ చేయిస్తుంది. దాన్ని అదుపులో పెట్టుకొంటేనే మనిషి మనీషి అవుతాడు. లేకపోతె పతనం అంచున నిలబడిపోతాడు. సీత మరణం ఎందరికి మరణకారకమౌతుందో హనుమ గొప్పగా విశ్లేషించుకొన్నాడు. ఏదో ఆకుటుంబానికె నాశనం కాదు, సుగ్రీవాది కపి వరులకు కూడా. అదీ ఇంతటితో ఆగితే పరవాలేదు. మొత్తం అయోధ్య,మిథిల ప్రజలందరికీ జీర్ణించుకోలేని విషయమై మరణ కారణం అవుతుంది. ఇక్కడే హనుమలో ఉన్న అసలైన మానవత్వాన్ని అందించాడు మహర్షి.

ధిగస్తు రాజసం భావ మనీశ మనవస్థి తం –ఈశ్వరేణాపి యద్రాగా న్మయా సీతా న రక్షితా "

"వినష్టాయాంతు సీతాయాంతావుభౌ వినశిష్యతః –తయోర్వినాశే సుగ్రీవః సబంధు ర్విన శిష్యతి"

"ఏత దేవ వచః శ్రుత్వా భరతో భ్రాతృ వత్సలః -ధర్మాత్మా సహ శాత్రుఘ్నః కథంశక్ష్యతి జీవితుం "

"ధర్మనిష్టకల ఇక్ష్వాకు వంశజులైన రామాదులు నలుగురు నశిస్తే, ప్రజలంతా శోక పీడితులవటం తధ్యం. భాగ్య హీనం తో నేను ధర్మార్ధ సంగ్రహణం చేయకుండా, రోషం అనే దోషం పట్టి పీడించి లోకానికే చేటు తెచ్చాననటం స్పష్టం ' ధర్మార్ధ సంగ్రహణం చేయకపోవటం వల్ల కలిగే చేటు రోషదోషం అనే పిశాచిపడితే కలిగే అనర్థం చక్కగా విశ్లేషించాడు. ఇవన్నీ ఆయనకే కాదు మనకందరికీ మహా వాక్యాలులాగా మహా నీతి వాక్యాలు. తొందరపడటం యెంత ప్రమాదమో చెప్పే సందర్భం.

"ఇక్ష్వాకు వంశే దర్మిష్టే గతే నాశ మసంశయం –భవిష్యంతి ప్రజా స్సర్వా శ్శోక సంతాప పీడితాః"

"తదహం భాగ్య రహితో లుప్త ధర్మార్ధ సంగ్రహః –రోష దోష పరీతాత్మావ్యక్తం లోక వినాశనః "

ఇలా బాధతోమధనపడుతున్న హనుమకు కొన్ని శుభ శకునాలు గోచరించగా మళ్ళీ మనసులో "అనవద్య సౌందర్య రాశి, మంగళ రూపిణిసీతా దేవికి ఆమె తేజస్సే రక్షణగా ఉండగా,ఆమె నశించదు.అగ్ని అగ్నిని దహింపదు కదా !ధర్మాత్ముడు, మహా తేజశ్శాలి రాముని భార్య సీతకు ఆనే పవిత్ర నడవడి శీలమే రక్షిస్తుంది. అగ్ని ఆమెను తాకటానికి కూడా అర్హుడు కాడు"అనుకొన్నాడు. అసలు అగ్నికి రక్షణ ఏమిటి. అగ్ని జోలికి ఎవరొచ్చినా మసి అవటమే కదా. ఆమె శీలమేసీతాదేవి అగ్ని లాంటి రక్ష. ఆమె తేజస్సు ఆమెకు సంరక్షణ. అగ్ని హోత్రుడు కూడా ఆమెను తాకటానికి పనికి రాడు అని హనుమ అన్నాడు అంటే ఆమె శీల పావిత్ర్యం, పాతి వ్రత్యం ఎంతటి మహోన్నతమైనవో ఆమెను చూడగానే గ్రహించిన సూక్ష్మగ్రాహి హనుమ. మొదట్లో ఏదో కొంపమునిగిపోయినట్లు బాధ, భయం పడ్డాడుకాని తరచిచూసి ఆమెను ఎవరూ ఏమీచేయలేరని సిద్ధాంతీకరించాడు.అందుకే రావణ సంహారానంతరం రాముడు ఆమె శీలపరీక్షకు అగ్ని పరీక్ష పెడితే, అగ్ని ఆమెను తాకటానికి కూడా భయపడి మిన్నకుండిపోయాడు. కనుకనే ఆమె అగ్ని స్వరూపిణి అన్నాడుహనుమ అగ్ని మరో అగ్నిని దహనం చేయదు చేయలేదు అని తీర్మానించాడు. ఎరుక కలగటం అంటే ఇదీ. మొదట్లో కపి లక్షణం తర్వాత "మహాకపి దీవిశాలత "హనుమ వ్యక్తిత్వంలో భాగం. ఆయన భయపడినట్లు ఏదీ జరగలేదు కనుక సరిపోయింది. జరిగి ఉంటె ?ఊహించరాని మహా విపత్తు.

"అథవా చారు సర్వాంగీ రక్షితా స్వేన తేజసా –న న శిష్యతి కళ్యాణీ నాగ్ని రగ్నౌ ప్రవర్తతే "

"నహి ధర్మాత్మనస్తస్య భార్యా మమిత తేజసః –స్వచారిత్రాభి గుప్తాం తాంస్ప్ర ష్టుమర్హతి పావకః "

మరికొంత విచారణ చేస్తూ హనుమ "కాల్చటం అగ్ని స్వభావం. దానికి నాశనం లేదు. సర్వకాల సర్వావస్థల లోనూ దానికి దహన శక్తి ఉంటుంది. అగ్ని "ఆఫ్టరాల్ " నాతోకనే కాల్చలేకపోతే, పూజ్యురాలు అగ్ని హోత్రం వంటి సీత జోలికి వెళ్ళే సాహసం చేయగలడా "అనుకొని మైనాక వృత్తాంతం ఒకసారి గుర్తుకు తెచ్చుకొని, ఆశ్చర్యపడి మళ్ళీ మనసులో "తపం, సత్యం, అనన్య పతిభక్తి తో సీతాదేవి అగ్నినే దహిస్తుంది కానీ, అగ్ని ఆమెను ఏమీచేయలేదు"అనుకొని ఆమె ధర్మ పాతివ్రత్యాలను స్మరిస్తూ ఉండగా మహాత్ములైన చారణుల వాక్యాలు"ఆహా !ఏమి ఆశ్చర్యం?హనుమంతుడు రాక్షసుల ఇళ్ళల్లోభయంకర దుస్సహజమైన అగ్నిని రగిల్చి దుష్కర కార్యం అద్భుతంగా చేశాడు. పారిపోయే రాక్షస స్త్రీలు, ఆబాల వృద్ధుల జనాల కలకలం, పెద్ద ధ్వనులతో కొండ గుహ లలో నాదం ప్రతిధ్వనిస్తుండగా, ఆక్రందనలు చేస్తున్నట్లుగా, మిద్దె, ద్వార, ప్రాకారాలతో లంక అంతా తగలబడింది కానీ సీత కాలక పోవటం ఆశ్చర్యం కలిగించింది " అన్నమాటలు హనుమకు వినిపించాయి. తనకు కనిపించిన శుభ శకునాలు, తన మనో నిశ్చయం, సీతా దేవి పాతి వ్రత్యం, రామ ప్రభావం మొదలైన సుగుణాల కారణాలతో, చారణ వాక్యాలతో మనసులో ఆనందం పొందాడు. ఉపశమనం కలిగింది.

"అహో ఖలు కృతం కర్మ దుష్కరం హి హనూమమతా –అగ్నిం విసృజతా భీక్ష్ణం భీమం రాక్షస వేశ్మని"

"ప్రపలాయిత రక్షః స్త్రీ బాల వృద్ధసమాకులా –జనకోలాహలాధ్మాతా క్రందంతీ వాద్రి కందరే "

"దగ్ధేయం నగరీ సర్వా సాట్ట ప్రాకార తోరణా-"జానకీ న చ దగ్ధేతి"విస్మయో ద్భుత ఏవ నః "

చివరికి హనుమ తనకోరిక నెరవేరి సీతకు ఏ ఆపదా కలగలేదని తెలిసికొని, మళ్ళీ ఒక్కసారి ఆమెను దర్శించి తిరిగి వెళ్లాలని నిశ్చయించుకొన్నాడు. ఎవరో ఆకాశ రామన్నలు చెబితే నమ్మి వెళ్ళిపోతే హనుమ ఎలా అవుతాడు ?తానూ స్వయంగా సీతను చూసి ఎసర్టైన్ చేసుకొని సంతృప్తి చెందాకే తిరుగు ప్రయాణం చేయాలన్నది మహామతిమాన్ హనుమాన్ తీసుకొన్న మరో మెగా నిర్ణయం. అందుకే సుందర కాండ అంతసుందరమైనది.

"తతః కపిః ప్రాప్త మనోరథార్థ-స్తా మక్షతాం రాజసుతాంవిదిత్వా –ప్రత్యక్షత స్తాంపునరేవ దృష్ట్వా –ప్రతి ప్రయాణాయ మతిం చకార "

ఇది 35శ్లోకాల 58వ అధ్యాయం

ఈ సర్గ లో కోటబుల్ కోట్ లైన శ్లోకాలు చాలా ఉన్నాయి. అన్నీ ఆణిముత్యాలే. నేనూ, చాలామంది రేడియో లో సూక్తిసుధలో, ఆలోచనాలోచనం లో ఉపయోగించుకొన్నవే. ప్రవచనాలలో మహామహులంతా ఉదాహరించేవే. అంతటి సార్వకాలికమైన సత్యాలున్న శ్లోకాలు మాత్రమే కావు. మహర్షి మాటలు. శిరో దార్యాలే. కనుక ఈ సర్గ కూడా చాలా ముఖ్యమైనదే అని పిస్తుంది. హనుమ గుంజాటన, మనో నిశ్చయం, తాను చేసిన పని అవతలి వాళ్లకు అపకారం చేస్తే బాగానే ఉంటుంది కాని. "మన అనుకొన్న" వాళ్లకు ఏదైనా జరిగితే తట్టుకోలేరు. అదీ లోక సహజం. దీన్నీ గొప్పగా చిత్రించాడు. తన కోతి చేష్టలకూ బాధ పడ్డాడు. చివరకు సీతారాముల నిర్మల నిష్కల్మష మనస్తత్వం కూడా లోకానికి చాటాడు.

ఈ సర్గలో హనుమ అంతర్మధనాన్ని మహోత్కృష్టం గా వాల్మీకి కవి తీర్చి దిద్దాడు. హనుమ ఏక పాత్రాభినయానికి, సర్వ గుణ, రస, అలంకార సుశోభితంగా రాశాడు కవివాల్మీకి. ఎవరైనా ఈ సర్గను ఏక పాత్రాభినయం చేశారో లేదో నాకు తెలీదుకానీ, చేస్తే మహాద్భుత రసకందాయంగా ఉంటుందన్నది మాత్రం సత్యం. మహర్షి రచనా, మజాకానా !

చేయాల్సిన లంకా దహనం కూడా సంతృప్తిగా చేసి హనుమ శింశుపా వృక్షం క్రింద ఉన్న సీతాదేవిని దర్శించి నమస్కరిచి "నా భాగ్యవశం వలన అమ్మా నిన్ను ఏ ఆపదారాని దానిగా చూస్తున్నాను "అన్నాడు. సీతకూడాతిరుగు ప్రయాణానికి సిద్ధ పడిన హనుమను ఆత్మీయంగా పలకరించి "హనుమా !శత్రు సంహారకా !నువ్వొక్కడివే సర్వ రాక్షస సంహారం చేసి, నన్ను నా రామునికి సమర్పించ గలసమర్ధుడవు. దీనివల్ల నీకీర్తి పెరుగుతుం దనే కాని రాముని కీర్తి పెరగదు. ఆయనే వచ్చి శత్రు రాక్షసులను చంపటమే శ్రేయస్కరం శోభకరం. నువ్వు వెళ్లి ఆయనకు అన్ని విషయాలు చెప్పి, ఇక్కడికి రావటానికి తగిన ప్రయత్నాలకు అనుగుణంగా నువ్వు ఆయనకు చెప్పు.

హనుమ సీతకు ప్రత్యుత్తరంగా "అమ్మా !రాముడు అన్నిరకాల సైన్యంతో త్వరలోనే ఇక్కడికివచ్చి రాక్షులందర్నీ చంపి, నీ శోకం తీరుస్తాడు "అని ఓదార్పుగా చెప్పి తిరుగు ప్రయాణం చేయబోతూ, సీతకు వీడ్కోలు చెప్పి అత్యంత త్వరగా రామ దర్శనం చేయాలన్న హడావిడిలో" అరిష్టం "అనే పర్వత శ్రేష్టాన్ని ఎక్కి అనేక జలపాతాలతో అనేక వృక్ష ఫల పుష్పజాతులతో పక్షులు జంతువుల సమూహాలతో ఉన్న, గాలికికదలే కీచకాలు వెదురు పొదల ధ్వనితో బుసలు కొట్టే సర్ప సమూహాలతో. తపస్సుకు ఉపయోగపడే ప్రశాంత గుహలతో మేఘాలను అందుకొనే శిఖర సమూహాలతో, దాతు స్రావంతో ఉన్నఅరిష్ట పర్వత శిఖరం ఎక్కి, ఒక్కతొక్కు తొక్కగా కొన్ని కొండ చరియలు విరిగిపడగా హనుమ దక్షిణ తీరం నుంచి ఉత్తర తీరానికి ప్రయాణించాలని బయల్దేరాడు, ఆ పర్వతం పై ఉన్న సకల పుష్ప జాలం హనుమకు వీడ్కోలు చెబుతున్నట్లు పూల వాన కురిపించాయి. పెద్ద చెట్లు విరిగి నేల వ్రాలాయి.

గుహాంతర్భాగం లో ఉన్న సింహాలు హనుమ పాద ఘట్టనం తో పీడింపబడి భయంతో భీకరంగా అరవగా ఆ ధ్వని ఆకాశాన్ని చీల్చుకొని అంతటా వినబడింది –

"ఆరురోహ గిరి శ్రేష్ట మరిష్ట మరిమర్దనః-తుంగ పద్మకజుష్టాభి ర్నీలాభి ర్వనరాజిభిః"

"కందరాన్తరస్థానాంపీడితానాం మహౌజసాం-సిమ్హానాం –నినదో భీమో నభో భిన్దన్ స శుశ్రువే "

ఈ భయంకర ధ్వనులకు విద్యాధర స్త్రీలు భయంతో వస్త్రాలు జారి, చిందరవందరై, ఆభరణాలు స్థానాలు తప్పి, పర్వతం ఉంచి ఆకాశానికి ఎగిరాయి –

"స స్రస్తవ్యా విద్ధవసనా వ్యాకులీకృత భూషణాః-విద్యాధర్యస్సముపాతాళానికి పేతుః సహసా ధరణీధరాత్ "

పెద్ద పెద్ద పాములు యెర్రని నాలుకలతో, విషసర్పాలతలలు పర్వతం నుంచి పైకి ఎగిరిపోయాయి. కిన్నర విద్యాధర గంధర్వ,యక్షులు తమ స్థానాలు కోల్పోయి గత్యంతరం లేక వాళ్ళూ ఆకాశం లో చేరారు. హనుమ త్రొక్కిడికి అరిష్టపర్వతం పాతాళానికి కుంగిపోయింది. -

స చ భూమిధరః శ్రీమాన్ బలినా తేన పీడితః - "సవృక్ష శిఖరోదగ్రః ప్రవి వేశ రసాతలం "

పదియోజనాల వెడల్పు, ముప్పై యోజనాల ఎత్తు ఉన్న అరిష్ట పర్వతం అణగారి భూమితో సమానమైనది.

"దశయోజన విస్తార స్త్రింశద్యోజన ముచ్చ్రితః –ధరణ్యాం సమతాం యాతః స బభూవ ధరాధరః " తీవ్ర తరంగాలతో కొట్టబడిన తీర ప్రదేశం కల భయంకర సముద్రాన్ని అవలీలగా దాటటానికి బలవాన్ వీర్యవాన్ దీమాన్ హనుమాన్ ఒక్క సారిగా ఆకాశంలోకి ఎగిరాడు –

"స లిలంఘ యిషుర్భీమం సలిలం లవణార్ణవం-కల్లోలా స్ఫాల వేలాంత ముత్పపాత నభో హరిః"

ఇది 34శ్లోకాల 56 వ సర్గ

ఇందులో హనుమ మళ్ళీ చివరిసారిగా సీతాదేవిని చూసి, ఆమె దుఖాన్ని పోగొట్టే మాటలు చెప్పి, రాముడు ససైన్యంగా త్వరలో వస్తాడనే భరోసా ఇచ్చి, సెలవు తీసుకొని తిరుగు ప్రయాణానికి బయల్దేరాడు. ఇప్పుడు అరిష్ట పర్వతం ఎక్కాడు ఆకాశం లోకి ఎగరటానికి. ఆయన త్రొక్కుడికి" అరిష్టం" పాతాళానికి దిగిపోయింది. ఇక్కడ నాకు ఏమి అనిపించిందంటే అన్ని రూపాలలో ఉన్న అరిష్టం తొలగిపోయి, రాముడు రావటానికి" లైన్ క్లియర్ "అయింది అని. సీత హనుమ పరాక్రమం ను మెచ్చి, ఐతే సీత దుఖం రాముడు వచ్చి తీర్చాల్సిందే కాని,, హనుమ చేయాల్సినపని కాదని స్పష్టం చేసింది. ఆయన త్వరగా వచ్చేట్లు నచ్చ చెప్పమని నొక్కి మరొక్కసారి చెప్పింది. కనుక ఆశావహంగా ఈ సర్గ ముగిసింది.

చంద్రుడు తెల్ల కలువగా, సూర్యుడు నీరు కోడిగా, పుష్య, శ్రవణా నక్షత్రాలు కలహంసలుగా మేఘాలు నాచు, తీరపు పచ్చిక భూమి గా, పునర్వసు నక్షత్రం పెద్ద చేపగా, అంగారకగ్రహం మహా మొసలిగా, ఐరావతం మహా ద్వీపంగా, స్వాతీ నక్షత్రం హంసగా, గాలి తాకిడిచే పుట్టిన అలల వంటి చంద్ర కిరణాలేచల్లని నీరుగా, అనేక వర్ణాలతో ఉన్న యక్ష, గంధర్వులు వికసించిన తామరలుగా, కలువలుగా, అపార మైన రెండవ మహా సముద్రంలాగా రమణీయమైన ఆకాశాన్ని హనుమంతుడు ఏమాత్రం అలుపూ సొలుపూ లేకుండా వాయు వేగం తో పెద్ద నావ సముద్రాన్ని దాటినట్లు దాటాడు. ఆకాశాన్ని మహాసముద్రంగా అందులోని వివిధ విషయాలను తగినట్లుగా సముద్రంలోని విషయాలతో గొప్పగా పోల్చి చెప్పిన శ్లోక చతుష్టయం.కాళిదాసఅభిజ్ఞాన శాకుంతలం లోని నాలుగవ సర్గలోని నాలుగు శ్లోకాలు యెంత చిరస్మరణీయమైనవో,నా దృష్టిలో ఈ నాలుగు కూడా అలాంటివే. కానీ ఎవరి దృష్టిలోను ఇవి పడినట్లు ఎవరూ ఎక్కడా పెద్దగా ఉదాహరించినట్లు నాకు కనిపించలేదు. లేక నేనే చూసి ఉండక పోనూ వచ్చు, అద్భుతమైన ఉపమానాలతో వాల్మీకి కవి మహర్షి వర్ణించిన దృశ్యకావ్యం ఈ నాలుగు శ్లోకాలూ –

"స చంద్ర కుముదం రమ్యం, సారక కారండవం శుభం –తిష్య శ్రవణ కాదంబ మభ్ర శైవాల శాద్వలం "

"పునర్వసు మహామీనం, లోహితాంగ మహాగ్రహం –ఐరావత మహాద్వీపం, స్వాతీ హంస విలోళితం"

"వాత సంఘాత జాతోర్మి చంద్రాంశు శశిరాంబమత్-భుజంగ యక్ష గంధర్వప్రబుద్ధ కమలోత్పలం "

"హనుమాన్మారుత గతి ర్మహానౌ రివ సాగరం – అపార మపరిశ్రాంతః పుప్లువే గగనార్ణవం.."

ఆకాశ చారి హనుమ ఆకాశాన్ని మింగేసే వాడిలా, చంద్రుని గోళ్ళతో గీరేసే వాడిగా, నక్షత్రాలు సూర్యుడు తో ఉన్న ఆకాశాన్ని హరించే వాడిలా, మేఘాలను ఆకర్షించే వాడిలా దూసుకు పోయాడు. మహా మేఘాలు హనుమ సంపర్కం తో తెలుపు, యెర్రని ఎరుపు, పసుపు, నలుపు, ఆకుపచ్చ రంగులతో ప్రకాశించాయి. ఇక్కడకూడా అద్భుతమైన భావన-

"పాండు రారుణ వర్ణాని,నీల మాన్జిష్టకాని చ –హరితారుణ వర్ణాని మహాభ్రాణిచకాశిరే "

అలాంటి మేఘ సముదాయాలలోస్వేతవస్త్ర దారి హనుమ దూరి పోతూ, ఒకో సారికనిపించీ మరోసారి కనిపించకుండా ఆకాశ చంద్రుని లాగా ఉంటున్నాడు. ఈ "వానర చంద్రుడి"ని రెండు శ్లోకాలతో వర్ణిస్తే కాని వాల్మీకి మనసు సంతృప్తి పడలేదనుకొంటా --

"ప్రవిశాన్నభ్ర జాలాని నిష్పతం శ్చ పునః పునః –ప్రచ్చన్న శ్చప్రకాశ శ్చచంద్రమా ఇవ లక్ష్యతే "

"వివిదాభ్ర ఘనాపన్న గోచరో ధవళాంబరః-దృశ్యా దృశ్య తనుర్వీర స్తదా చంద్రా యితేంబరే"

ఇలా మేఘాలను చీల్చుకొంటూ మళ్ళీ వాటిల్లో దూరుతూ మేఘగర్జన ధ్వనితో హనుమ గరుత్మంతునిలా ప్రకాశించాడు. ఆయన విష్ణువాహనం, ఈయన రామవాహనం కదా.

"దారయన్మేఘ బృందాని నిష్పతంశ్చ పునః పునః –న్నదన్నాదేనమహతా మేఘస్వనః "

అన్నీ దాటుకొంటూ సముద్ర మధ్యమానికి వచ్చి, మైనాక పర్వతాన్ని చేతితో తాకి తృప్తి పొందించి, బాణం లాగా మహావేగంగా దూసుకు పోయాడు – లంకకు వెళ్ళేటప్పుడుఇచ్చిన వాగ్దానం ఇప్పుడు తిరిగొస్తూ చెల్లించాడు హనుమ మైనాకుడికి.

"పర్వతేంద్రం సునాభం చ సముపస్పృశ్యవీర్యవాన్ –జ్యాముక్త ఇవ నారాచో మహావేగో భ్యుపాగతః "

మరికొంత దూరం ప్రయాణం చేసి మేఘంలాగా ఉన్నతమైన మహేంద్ర పర్వతాన్ని చూసి, దగ్గరకు వచ్చాను అనే మహాదానందం తో సింహనాదం చేశాడు. ఆధ్వని శంఖధ్వనిలాగా నలుదిశలా వ్యాపించింది. ఆకాశం సూర్యమండలం తో సహా బ్రద్దలౌతోందా అన్నట్లు ఉంది ఆ ధ్వని.మళ్ళీ మిత్రులందర్నీ చూడబోతున్నాననే సంతోషంతో తోకను అటూ ఇటూ ఊపాడు వేగంగా –ఇది అసలైన కపి లక్షణం. కోతులు మంద కనిపిస్తే చేసే చేష్ట.

" న కిచి దను సంప్రాప్తః సమాలోక్య మహాగిరిం- 'మహేంద్రం మేఘ సంకాశం ననాద హరి పుంగవః –

"స పూరయామాస కపిర్దిశో దశ సమం తతః –నదన్నాదేనమహతా మేఘస్వన మహాస్వనః "

"ననాద హరి శార్దూలో లాంగూలం చాప్య కంపయత్ "

సముద్ర తీరంలో హనుమ రాకకోసం దీనముఖాలతో ఎదురు చూస్తున్న కపి వీరులంతా మేఘ గర్జన, తొడల ఆస్ఫాలన ధ్వని, హనుమ సింహనాదం విన్నారు. ఉత్కంఠ పట్టలేకపోతున్నారు.

"నిశమ్య నదతో నదం వారాస్తే సమన్తతః –బభూవు రుత్సుకాస్సర్వే సుహృ ద్దర్శన కాంక్షిణః"

జాంబవంతుడు అత్యంత సంతోషంతో వానరుల-దర్నీదగ్గరకు పిలిచి "హనుమంతుడు అన్ని విధాలుగా కార్యం సాధించి వస్తున్నాడు సందేహం ఏమీలేదు. అలా సాధించకపోయి ఉంటె ఇలాంటి నాదం చేసేవాడే కాదు "అని చెప్పగానే వానరులంతా మహోత్సాహంతో ఎగిరెగిరి గంతులు వేశారు, ఒక చెట్టునుంచి ఇంకో చెట్టుకు, ఒకకొండ చివరినుంచి వేరోకదానిచివరపైకి దూకి ఆనందం వ్యక్తం చేశారు సహజ లక్షణంగా -

"సర్వథా కృత సౌ హనుమాన్నాత్ర సంశయః –న హ్యకృతకార్యస్యనాద ఏవం విధోభవేత్ "

"తస్య బాహూరు వేగం చ నినాదం చ మహాత్మనః –నిశమ్య హరయో హృష్టాః సముత్పేతుస్తతః స్తతః "

"తే నగాగ్రే న్నగాగ్రాణిశిఖరా చ్చికరాణి చ-ప్రహృష్టాస్సమ పద్యంతహనూమంతం దిదృక్షవః "

ఉత్సాహం ఆగక చెట్టుకోమ్మలకు ఎగబ్రాకి, కొమ్మలనుపట్టుకొని కూర్చుని హనుమంతుని ఆహ్వానిస్తున్నట్లుగా పెద్ద కొమ్మలను మనుషులు వస్త్రాలు ఊపినట్లు కదిలించారు. హనుమమళ్ళీ కొండగుహలోని గాలిలాగా గర్జించాడు. హనుమ కనిపించగానే అందరూ లేచినుంచుని చేతులుమోడ్చి మహాస్వాగతం పలికినట్లు ప్రవర్తించారు –

"తమభ్ర ఘన సంకాశ మాపతంతం మహాకపిం –దృష్ట్వాతే వానరాస్సర్వే తస్థుః ప్రాంజలయస్తదా"

హనుమ మహేంద్ర పర్వతం పై వ్రాల గా వానరులంతా ఆయన చుట్టూ మూగి చూసి పరవశించారు

"పరివార్య చ తే సర్వేతమరోగముపాగతం"

ఏ ఆపదా లేకుండా క్షేమంగా తిరిగి వచ్చిన తమప్రియతమ నాయకుడికి వారు దుంపలు,పళ్ళు కానుకలు ఇచ్చి పూజించారు. హనుమ అక్కడున్న జాంబవంతమొదలైన పెద్దలకు యువరాజు అంగదుడికి నమస్కరించాడు. వారూ ఆయనను సత్కరించగా "సీతను చూశాను "అని మాత్రమే చెప్పాడు హనుమ ముక్తసరిగా –

"స తాభ్యాం పూజితః పూజ్యః కపి భి శ్చప్రసాదితః –"దృష్ట్వా సీతేతి "విక్రాన్త స్సంక్షేపేణ న్యవేదయత్ "

అంగదుని కౌగలించి అక్కడ ఉచితమైన ప్రదేశం పై కూర్చుని వానర వీరులతో ఇలా చెప్పాడు –"లంకలోని అశోకవనం లో భయంకర రాక్షసస్త్రీల మధ్యకాపలాలో ఉన్న అనిందిత సీతాదేవిని చూశాను. ఒకే జడ తో రామదర్శనం కోసం పరితపిస్తూ ఉపవాసాలతో కృశించి మలినాంగి గా ఉంది. "అన్నాడు మళ్ళీ కొద్దిగానే. "చూశాను "అన్న ఒక్క మాటకే వానరులంతా సంతోషించారు. ఆనందంతో వింతధ్వనులు సింహనాదాలు, గర్జనలు, స్వభావసిద్ధమైన "కిచకిచలు "చేశారు. దీనికి మిగిలినవారు ప్రతి గర్జన చేశారు. అక్కడ అంతాఆనంద కోలాహలమే రాజ్యమేలింది –

"క్ష్వేళంత్యన్యే నదన్త్యన్యే గర్జంత్యన్యే మహాబలాః-చక్రు హు "కిలకిలా "మన్యే ప్రతి గర్జంతి చాపరే "మరీ సంతోషం పట్టలేక తోకలు నేలకేసి కొట్టారు. ఇదీ ఆజాతి సహజ లక్షణమే. కొందరైతే కొండలమీద నుంచి దూకి, హర్షం తో హనుమను స్పృశించారు.

"ఆప్లు త్య గిరి శృంగే భ్యః సం స్పృశంతిస్మ హర్షితాః"

ఈ ఉత్సాహం కొంత తగ్గాక అంగదుడు హన్మతో "వానరా !మహాసముద్రం దాటి, మళ్ళీతిరిగి వచ్చావు. నీకు సాటి పరాక్రమ శాలి లేడు.నీప్రభు భక్తి, పరాక్రమం,ధైర్యం శ్లాఘనీయం. రాముని సతీమణిసీతను చూసిన భాగ్యశాలివి, అదృష్టవంతుడివి.రాముడు ఇక సీతా వియోగ శోకం వీడగలడు"అనగానే వానరులందరూ హనుమ జాంబవంత అంగదుల చుట్టూ పెద్దపెద్ద రాళ్ళపై కూర్చున్నారు -

"సత్వే వీర్యేన తే కశ్చిత్సమోవానర విద్యతే - -యదవప్లుత్య విస్తీర్ణం సాగరం పునరాగతః" –"అహో స్వామిని తే భక్తి, రహో వీర్య, మహో ధృతిః –ద్రిష్ట్వా దృష్ట్వాత్వయా దేవీ రామపత్నీ యశస్వినీ, ద్రిష్ట్యాత్యక్షతికాకుస్థః శోకం సీతా వియోగజం '

ఏదో కొద్దిగా పటిక బెల్లం ముక్క రుచి చూపించి, మిగిలినదంతా దాస్తే, తినాలనే ఉత్కంఠ ఎలా పెరిగిపోతుందో, అలానే వానరులంద రికీ హనుమ లంకాయాత్ర విశేషాలు

ట్రావెలోగ్ "వినాలనే కౌతూహం తో ఉండి ఆయన మొహం వైపే ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు అడిగే ధైర్యం చేయకుండా. మహాబుద్ధి కీర్తితో ఉన్న హనుమ, శౌర్య యశస్సు భుజాలకు ఆభరణాలతో ఉన్న అంగదుడు పరి వేష్టించి ఉన్న ఆ మహేంద్ర పర్వతశిఖరం మాహా శోభతో వెలిగి పోతోంది '

"హనూ మతా కీర్తిమతా యశస్వినా –తథాంగదే నాఙ్గద బద్ధ బాహునా

ముదా తదా ధ్యాసిత మున్నతం మహ-న్మహీధరాగ్రం జ్వలితం శ్రయాభవత్ ".

ఇది 50శ్లోకాల 57వ సర్గ.

"దృష్ట్వా సీతేతి"అన్న మాట అందరూ" బ్రివిటి"కి గొప్ప ఉదాహరణ. ఎంతోదూరం ప్రయాణం చేసి వచ్చినవాడు చెప్పే సంక్షిప్త వచనం. ముందు "కులాసానాలేక ప్రయాణం బాగా జరిగిందా ""?అని అడిగి అని అలసట తీరి కుశలప్రశ్నల, ఉపాహారాలతర్వాత ప్రయాణ విశేషాలు అడుగుతాం.అలాగే హనుమ వీళ్ళు అడగకుండా వాళ్ళు దేనికోసం ఎదురు చూస్తున్నారో గ్రహించి ఆ ముక్క చెప్పాడు. వానరుల ఆనందం అంతటినీ అక్షరాక్షరంగా వాల్మీకి వర్ణించి చెప్పాడు, . స్వభావ సిద్ధమైన వారి ధ్వనులు కిచకిచలు, ఎగుర్లూ దూకుళ్ళూ,తోక నేలకేసి కొట్టటం వగైరా. వాళ్ళ సత్కారం వివరించాడు. ముందుగా అక్కడి పెద్దలైన జాంబవంతాదులకు, తర్వాత యువరాజు అంగదుడికి హనుమ నమస్కరించి తన సంస్కారం చాటాడు. అంగదుని ఆప్యాయంగా కౌగిలించుకొన్నాడు సుగ్రీవ రాజు ప్రతినిధికనుక. ఇదీ రాజధర్మం లో ముఖ్యమైన విషయమే. దాన్నీ చక్కగా పాటించాడు. ఆతర్వాత యువరాజు ప్రస్తుత రాజప్రతినిధి తమ బృందనాయకుడు అంగదాదులు పరి వేష్టించి ఉన్న సభలో కొంచెం వివరంగా సీతా దర్శనం గురించి చెప్పాడు, పట్టరాని సంతోషంతో వానరులంతా తమస్వభావసిధమైన రీతిలో ఆనంద కోలాహలం సృష్టించారు.

తమమంత్రీ తనబృందంలో ముఖ్యుడు ఈ “ఎక్స్ ప్లోరేషన్” ప్రతినిధి హనుమను యువరాజు రాజోచిత సంబోధనలతో అతని పరాక్రమ ధైర్య ప్రభుభక్తులను శ్లాఘించి తన బాధ్యతా చక్కగా నెరవేర్చి, ఇక రాముని శోకం ఎక్కువ కాలం ఉండదు అని తీర్మానంగా అందరికీ తెలియ జేశాడు. పెద్దరికం నిలబెట్టుకున్నాడు. హనుమ దూత వివరాలన్నీ పూర్తిగా తెలుసుకోవాలనే ఉత్కంఠ ఉన్న వానరుల మనస్తత్వాన్ని కూడా మహర్షి గొప్పగావిష్కరించాడు. కనుక ఈ సర్గలో ఎవరికి వారు తమపరిధిలో తమ బాధ్యత సమర్ధ వంతంగా నెరవేర్చారు. వీటన్నిటికంటే ముఖ్య విషయం జాంబవంతుని మనీష –హనుమ చేసిన సింహనాదం విని, అది” విజయోత్సాహం”గా చేసిందే అని ఖచ్చితంగా చెప్పాడు వానరులకు. సీతాదేవిని చూసిన ఆనందంతో చేసిన గర్జనే అది అని “అసెర్టైన్”చేశాడు., సర్టిఫై చేశాడు. లేకపోతే ఆ ధ్వని అలాఉండదు అనీ చెప్పాడు. ఎంతైనా సీనియర్ మోస్ట్ కదా. ఆ అనుభవమే వేరు. ఎందరికో పాఠాలు చెబుతుంది, మార్గ నిర్దేశం చేసి స్ఫూర్తి నిచ్చి, ప్రేరణ కలిగిస్తుంది. ఓహో జాంబవాన్ మహా ధీమాన్ ప్రణామ్యహం.



జాంబవంతాదులు హనుమ చుట్టూ మహేంద్ర పర్వతం పై కూర్చుని ఉండగా, జాంబవంతుడు సంతోష పులకిత గాత్రంతో హనుమను “సీతా దేవిని చూసి వచ్చిన విధానమంతా వివరించు ‘హనుమా ‘.ఆమెను ఎక్కడ ఎలా చూశావ్ ?ఎలాఉంది ?క్రూర రావణుడు ఆమె పట్ల ఎలా ప్రవర్తిస్తున్నాడు?అన్ని విషయాలూ యధాతధంగా మా అందరికీ తెలిజేయి. అంతా విని మనం ఏంచేయాలో ఆలోచిద్దాం.మనం కిష్కింధకు వెళ్లి రాముడి సన్నిధిలో ఏం చెప్పాలో, దేన్నీ దాచాలో బుద్ధిమంతుడవైన నువ్వు మాకు చెప్పు “ అని అడిగాడు. దూర దృష్టి ఉన్నవాడుకనుక రాముడి హృదయం గాయపడే మాటలు చెప్పకుండా మిగిలిన విషయాలు చెప్పి ఆయన్ను కర్తవ్య పరాయణుడిని చేయాలని పెద్దాయన తలపు. సరాసరి రాముడి దగ్గరే సర్వ విషయాలు చెప్పటం ప్రమాదకరం. కనుక ముందుగా తాము విని, అవసరమైతే విషయాలను కొంత సెన్సార్ చేసి, ముఖ్యవిషయాలు రాముడికి చెప్పటం రాజనీతి. ఇప్పటివాడా ఋక్షరాజు జాంబవంతుడు?గ్రాండ్ ఓల్డ్ మాన్., అన్నీ కాచి వడపోసిన ముదురుఘటం.

“కధందృష్టాత్వయాదేవి, కథంవా తత్ర వర్తతే –తస్యాం వా స కథంవృత్తఃక్రూరకర్మా దశాననః “

“తత్వత స్సర్వ మేతన్నః ప్రబ్రూహి త్వం మహా కపే-శ్రుతార్థాశ్చింత యిష్యామో భూయః కార్య వినిశ్చయం

”యశ్చార్థస్తత్ర వక్తవ్యో గతై రస్మాభి రాత్మవాన్ –రక్షితవ్యంచ యత్ర త్రతద్భవా న్వ్యాకరోతు నః “

వృద్ధవాన్ జాంబవాన్ అలా అడగంగానే సంతోషం తో ఒడలు పులకించి, సీతాదేవినిస్మరించి నమస్కరించి ఇలా చెప్పటం ప్రారంభించాడు –”మీరంతా చూస్తుండగా మహేంద్ర పర్వతం నుంచి సముద్ర దక్షిణ తీరం చేరటానికి ఆకాశం లోకి ఎగిరా కదా. అలా ఆకాశం లో పోతుంటే బంగారు శిఖరాలతో దివ్యమైన పర్వతం నన్ను నిరోధించటానికా అన్నట్లు భావించి దగ్గరకు వెళ్లి, దాన్ని పగలకొట్టాలనే ఉద్దేశ్యంతో ముందు “శాంపిల్” గా నా తోకతో ఝాడించి కొట్టాను. అంతే అది వెయ్యిముక్కలైంది. నా ప్రయత్నం గ్రహించి ఆ మహాపర్వతం”పుత్రా !అని నన్ను ప్రేమగా పిలిచి, తనపేరు మైనాకుడు అని సముద్రం లో ఉంటానని, ఒకప్పుడు పర్వతాలకు రెక్కలు ఉండేవని వాటితో ఆకాశం లో ఎగిరి ప్రాణులకు బాధకలిగించేవనీ, అప్పుడు పాకాసుర సంహారి దేవేంద్రుడు వాటి రెక్కలను వజ్రాయుధం తో ముక్కలు చేశాడనీ, మా తండ్రి వాయుదేవుడు తనను దేవేంద్రుని బారి నుంచి తప్పించి, ఈ సముద్రం లో పడేసి ఇంద్రుడికి కనపడకుండా చేశాడనీ, తానూ రాముడికి సహాయం చేయటానికే వచ్చాననిచెప్పగా, రామబాణం లాగా తనప్రయాణం ఎక్కడా ఆగటానికి వీల్లేదని చెప్పి, ఆయన అనుమతితో మళ్ళీ ప్రయాణం సాగించాను. అప్పటిదాకా మానవాకారం తో మాట్లాడిన ఆపర్వతం,మళ్ళీ పర్వత రూపం పొంది సముద్రంలో ఉన్నది “

"క్రుతామే మనసా బుద్ధి ర్భేత్తవ్యోయం మయేతిచ-ప్రహతంచ మయా తస్య లంగూలేన మహాగిరేః-శిఖరం సూర్య సంకాశం వ్యసీర్యత సహస్ర ధా"

మొదటి సర్గ లో హనుమ మైనాకుడిని తోకతో కొట్టి" వేయి ముక్కలు "చేసినట్లు లేదు. ఇప్పుడే ఈవిషయం చెప్పాడు.

"చాలాకాలం ప్రయాణం చేశాక సర్పాలకు తల్లి సురస సముద్ర మధ్యంలో కనిపించి, నన్ను తనకు దేవతలు ఆహారంగా ఇచ్చారు కనుక నన్ను తినేస్తాను అన్నది. రామకార్యానికి రెండవ విఘ్నం కలుగుతోందని భావించి నమస్కరించి, ఆమెతో రామ వృత్తాంతం టూకీ గా చెప్పిరామదూతగా వెడుతున్న నాకు అడ్డం రావద్దని, కావాలంటే లంకనుంచి తిరిగి వచ్చేటప్పుడు ఆహారం అవుతానని రామకార్యానికి ఆమెనుకూడా సాయం చేయమని కోరాను.నా మాట వినకుండా తన్ను ఎవరూ తప్పించుకోలేరు అని చెప్పగా తెలివిగా పది యోజనాల పొడవున్న నేను పదిహేను యోజనాల పొడవున్నవాడిగా మారగా, నన్ను బట్టి ఆమె కూడా నోరు పెంచటం ప్రారంభించగా, అమాంతం ఒక్కసారిగా నా శరీరాన్ని బాగా కుదించుకొని ఆమె నోటిలో దూరి, క్షణం లో బయటకు వచ్చేశాను. అప్పుడు సురస సహజ వేషంతో కనిపించి "సౌమ్య వానర శ్రేష్ఠా ! ఇంక సుఖంగా వెళ్ళు. నీకు కార్యసిద్ధి అవుగాక. మహాత్ముడైన రామునితో సీతను కలుపు. సుఖం, శుభం భూయాత్. నీ బుద్ధి కౌశలానికి చాలా సంతోషించాను "అనగా భూతగణాలన్నీ "భేష్ భేష్ "అని ప్రశంసించాయి –

"రామో దాశరధిఃశ్రీమాన్ ప్రవిష్టోదండకావనం –లక్ష్మణేన సహభ్రాత్రా సీతాయాచ పరంతపః

"తస్య సీతాహృతా భార్యా రావణేన దురాత్మనా –తస్యాస్సకాశం దూతోహం గమిష్యే రామ శాసనాత్ '-కర్తు మర్హసి రామస్య సాహాయ్యం విషయే సతీ"అథవా మైధిలీం దృష్ట్వారామచాక్లిష్టకారిణం"

"అర్ధ సిద్దై హరి శ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యధాసుఖం –సమానయ చ వైదేహీంరాఘవేణ మహాత్మనః –సుఖీభవ మహాబాహో ప్రీతాస్మి తవ వానర"

"సాదు సాధ్వీతిసర్వ భూతైఃప్రశంసితః "

"మళ్ళీ మహావేగంతో బయల్దేరాను. నా నీడను బట్టిఎవరో వెనక్కు లాగుతున్నట్లు అనిపించింది. కానీ నాకెవ్వరూ కనబడలేదు. నావేగం తగ్గగా అన్ని వైపులా చూస్తూ కారణం ఏమిటో అని చూసినా నాకేమీ కనిపించలేదు. నాకు మూడో విఘ్నం కలిగించటానికి ప్రయత్నించిన జంతువేదో తెలియలేదు. ఒకసారి కిందకి చూడగా భయంకర రాక్షసి ఒకటి నీటిలో కనిపించింది. అది నన్ను చూసి అట్టహాసం చేసి "ఓ మహా శరీరా !ఆకలిగా ఉన్న నాకు నువ్వు భలే ఆహారంగా దొరికావు. ఎక్కడికి పోతావు పెద్దోడా ?చాలాకాలం గా ఆహారం లేని నాకు పుష్టిగా నువ్వు ఆహారంగా దొరికావ్'అన్నది.. ఆవిడ మాట కాదనటం ఎందుకని సరే అని, ఆమె నోటికంటే, నా శరీరం బాగా పెంచాను. నన్ను చూసి ఆమె కూడా నోరు పెంచింది. నాసామర్ధ్యం, కామరూపం, నేను చేయగల అపకారం ఆమెకు తెలీదు పాపం. క్షణంలో నా రూపం అతి సూక్ష్మం చేసుకొని ఆవిడ నోట్లో ప్రవేశించి గుండెను చీల్చి ఒక్కసారి మళ్ళీ ఆకాశం లోకి ఎగిరాను..పర్వతాకారం గా ఉన్న ఆరాక్షసి భుజాల కీళ్ళు సడలిపోయి సముద్రంలో మునిగిపోయింది. ఆకాశ సిద్ధ చారణులు "భయంకర సింహిక రాక్షసిని హనుమ శీఘ్రంగా సంహరించాడు "అని అనటం నాకు వినిపించింది.

"నచ మాం సాదు బుబుదే మమవా నికృతం కృతం –తతోహం విపులం రూపం సంక్షిప్య నిమిషాంత రాత్ "

"తతోహం విపులం రూపం సంక్షిప్య నిమిషాన్తరాత్-తస్యా హృదయ మాదాయ ప్రపతామి నభాస్థలం"

"సా విస్సృష్ట భుజా భీమా పపాత లవణాం భసి-మయా పర్వత సంకాశా నికృత్త హృదయాసతీ"

"శృణోమి ఖగతానాం చ సిద్ధానాం చారణై స్సహ –రాక్షసీ సింహికా భీమా క్షిప్రం హనుమతా హతా "

విడిచిన రామ బాణం లక్ష్యం చేరేదాకా విశ్రమించాడో అలాగే హనుమ లంకకు వెళ్ళేటప్పుడు తిరిగి వచ్చేటప్పుడు నాన్ స్టాప్ గా ప్రయాణం చేశాడు అని మనం గుర్తుంచుకోవాలి అదీ ఆయన ప్రతిభా, సామర్ధ్యం, పట్టుదల, కార్యదీక్ష, అంకితభావం, ధీశక్తీ,చిత్త శుద్ధీ.

"సింహికా హననాన్ని తలచుకొంటూ కొండలతో ఉన్న దక్షిణ సముద్ర తీరం చేరాను. ఇక్కడే లంకానగరం ఉంది"అని మళ్ళీ తన సింహళ యాత్రా వృత్తాంతం కొన సాగిస్తూ హనుమ "సూర్యుడు అస్తమించాక, అక్కడి భయంకర నిశాచరులకు తెలియకుండా లంకానగరం లో ప్రవేశించాను. అప్పుడు ఒక ప్రళయకాల గర్జన చేస్తూ మండే అగ్నిలాంటి వెంట్రుకలు, న్న రాక్షసి నన్ను చంపటానికి మీదకొస్తే ఎడమ చేతి పిడికిలి తో ఒక్క పోటు పొడిచి ఓడించి,రాత్రికాలం లో లంకలో చేరగా ఆమె తాను లంకాధి దేవతనని, నా పరాక్రమంతో ఆమెను జయించాను కనుక,ఇక సకల రాక్షసులను జయిస్తాను అని శుభం పలికింది. తర్వాత రావణ అంతఃపురం చేరి, రాత్రి అంతా గాలించినా,,నాసీత జాడ కనిపించలేదు. దుఃఖ సముద్రం లోపడి ఒడ్డు కనిపించలేదు. తర్వాత గృహ, ఉద్యానవనాలన్నీ తెతికా. అప్పుడు పెద్ద అశోక వనం లో శింశుపా వృక్షం పైకెక్కి బంగారు రంగు అరటి తోటలు చూశా. ఆవృక్షం దగ్గర వరవర్ణిని అంటే శీతాకాలం లో సుఖమైన ఉష్ణం, వేసవిలో చల్లని శరీరం కల, భర్తానురాగమున్న,నడియవ్వనంలో ఉన్న తామరరేకులవంటి కనులున్న, ఉపవాసంతో కృశించిన ముఖం కల సీతాదేవిని చూశాను –

"అదూరే శింశుపా వృక్షస్యాత్ పశ్యామి వరవర్ణినీమ్-శ్యామాం కమలపత్రాక్షీ ముపవాస కృశాననాం "

"ఆమె రావణుడు అపహరించినప్పుడు ఏ వస్త్రాన్ని దాల్చి ఉన్నదో,, ఇప్పుడూ అదే వస్త్రాన్ని దాల్చి, కేశాలు ధూళి దూసరితాలతో మలినమై, సంతాపం తో దీనంగా సదా భర్త హితాన్ని కోరుతోంది. సీత ను ఫోటో తీసి చూపించి నట్లుంది కదా హనుమ అంటే వాల్మీకి వర్ణన.

"తదేక వాస స్సంవీతాం రాజోధ్వస్త శిరోరుహాం –శోక సంతీప దీనాంగీం సీతాం భర్తృహితే స్థితాం"

"రక్తమాంసాలు తినే ఆడ పులుల మధ్య ఉన్న ఆడ లేడి లాగా సీత వికృత భయంకర రాక్షస స్త్రీలచేత పరివేష్టింపబడి ఉన్నది.గొప్ప ఉపమానం ఇది. -

"రాక్షసీభి ర్విరూపాభి రభి సంవృతాం-మాంస శోణిత భక్షాభి ర్వ్యాఘ్రీభి ర్హరిణీ మివ "

"ఆమె అనుక్షణం భర్తనే తలచుకొంటూ, మాటిమాటికీ రాక్షసస్త్రీలు భయపెడుతుంటే, ఒంటి జడ తో దీనంగా, నేలమీదే పడుకొంటూ, హేమంతంలో కళ తప్పిన కమల సమూహం లాగా,రావణ వైముఖ్యం తో, చనిపోటానికి సిద్ధపడిన ఆమెను ఎలాగో చూడగలిగాను"-

-"సామయా రాక్షసీ మధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః-"ఏక వేణీ,ధరా దీనా భర్తృచింత పరాయణా "భూమి శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే "

"ఆమె దీనావస్థ చూస్తూ ఆ చెట్టుమీద కూర్చుని అన్నీ చూస్తుండగా మొలత్రాటి చిరుగజ్జెలు,అందెల మ్రోతలతో గంభీరమైన కోలాహలం రావణ భవనం నుంచి వినిపించింది. నేను కలవరపాటుతో నా శరీరం చిన్నది చేసుకొని ఆ వృక్షంపై దట్టమైన ఆకులమధ్య పక్షిలాగా కూర్చున్నాను. అప్పుడు రావణుడి భార్యలు, మహాబలశాలి రావణుడు సీత ఉన్న చోటుకు వచ్చారు. హనుమకున్న సద్యో స్పురణ కు వెంటనే తగినట్లు స్పందించటానికి ఇది గొప్ప ఉదాహరణమే.

"తతోహం పరమోద్విగ్నఃస్వం రూపం ప్రతిసంహరన్-అహం తు శింశుపా వృక్షే పక్షీవ గహనే స్థితః "

రావణ రాకగురించి హనుమ వివరిస్తూ "రావణుడు తనభార్యలతో సీత ఉన్న చోటుకు వచ్చాడు ఆమె శరీరాన్ని చేతులతో ఆచ్చాదనగా కప్పుకొనగా, భయపడిన,రక్షకులెవరూలేని వణుకు చున్న ఆమెను చూసి, "భూమిపై వంగి నమస్కరించి" తనను ఆదరింపు మని కోరాడు. ఇలా నమస్కరించాడని వాల్మీకి 20వసర్గలో చెప్పనే లేదు. అంతేకాదు ఇక్కడ రావణుడికి సీత పరమ శక్తి స్వరూపిణిగా కనిపించి ఉంటుంది. దైవీ శక్తిని ఆమెలో వాడు చూశాడు. అందుకే తలవంచి నమస్కరించాడు అని నాకనిపిస్తోంది.

"తద్రుస్ట్వాథ వరారోహా సీతా రక్షో మహాబలం –సంకుచ్యోరూ స్తనౌ పీనౌ బాహుభ్యాం పరి రభ్యచ "విత్రస్తాం పరమోద్విగ్నాం వీక్షమాణాం తతస్తతః –త్రాణం కించి దపశ్యంతీంవేపమానాం తపస్వినీం "

"తామువాచ దశగ్రీవ స్సీతాంపరమ దుఖితాం-"అవాక్ఛిరాఃప్రపతితో "బహుమన్యస్వ మామితి

"తానిచ్చిన రెండునెలలగడువు లోపల తన్ను ఆదరించకపోతే ముగియగానే ఆమెరక్తం తాగుతానన్నాడు. వాడిమాటలకు ఆమెకు కోపం వచ్చి"రాక్షసాధమా !అమిత తేజశ్శాలి రాముని భార్యను, ఇక్ష్వాకు వంశమహారాజు దశరథునికోడలిని. నన్ను అనరాని మాటలు అంటున్న నీనాలుక ఎందుకు తెగి పడకుండా ఉంది ?పాపిస్టుడా! నా భర్త దగ్గర లేని సమయం లో ఆయనకు తెలీకుండా నన్ను అపహరించి తెచ్చావ్. దీన్ని బట్టి నీపరాక్రమము యెంత అల్పమైనదో తెలుస్తోంది. రాముడి దాస్యం చేయటానికి కూడా నువ్వు పనికి రావు. అనేకయాగాలు చేసిన సత్యసంధుడు రాముడు. యుద్ధం లో అరివీరభయంకరుడు. నీకూ ఆయనకూ పోలికేమిటి ?"అని అనగానే వాడి కోపం పరాకాష్ట కు పోయి సీతను చంపే ప్రయత్నం చేయగా, రాక్షసాంగనలు హాహాకారం చేశారు. 22వ సర్గలో రావణుడు సీతను చంపటానికి ప్రయత్నించి నట్లు చెప్పలేదు. రెండు నెలల లోపు మాట వినకపోతే చంపమనిమాత్రమె కాపలా రాక్షసులకు చెప్పాడు. కానీ ఇది హనుమ చెబుతున్న కథ కనుక కొంత మిర్చీ మసాలా దట్టించి వానరులకు వాడిపై కోపం, సీతపై అపార సానుభూతి కలిగేట్లు చెప్పి ఉంటాడు. సెకండ్ వర్షన్ ఎప్పుడూ నాటకీయంగా ఉండటం లోక సహజం.

"యది చేత్వం తు దర్పా న్మాంనాభినందసి గర్వితే –ద్వౌ మాసావంతరం సీతే పాస్యామి రుధిరం తవ "

"రాక్షసాధమ రామస్య భార్యామమిత తేజసః-ఇక్ష్వాకు కులనాథస్య స్నుషాం దశరథస్య చ –అవాచ్యం వద తోజిహ్వే కథం న పతితా తవ "

"న త్వం రామస్యసదృశోదాస్యే పృస్య న యుజ్యతే "

"వివృత్య నయనే క్రూరేముష్టి ముద్యమ్యదక్షిణం –మైథిలీం హంతుమారబ్దః స్త్రీభి ర్హాహాకార కృతం తదా"

"అప్పుడు రావణ భార్య లలో శ్రేష్టురాలు మండోదరి, రావణుడి క్రూర కృత్యాన్ని' దేవ, గంధర్వ యక్ష కాంత లుండగా వారితో క్రీడించక, సీతతో నీకేమిటి పని అని బుజ్జగించి నివారించి,అంతఃపురానికి తీసుకు వెళ్ళింది. "'

ఇక్కడ కూడా లోగడ సర్గలో చెప్పినదానికి విరుద్ధంగా ఉన్నది అక్కడ 22వ సర్గలో ధాన్యమాలి రావణుడిని కౌగిలించి నచ్చచెప్పి తీసుకు వెళ్ళినట్లు ఉన్నది. అక్కడ మండోదరి ప్రసక్తి లేదు. ఇక్కడ ఆమే రావణుడు తిరిగి వెళ్ళటానికి ముఖ్య పాత్ర వహించింది. హనుమకు ఈ ఇద్దరు తేడా అని తెలీదా ?మండోదరి అలా చేసింది అంటే ఎఫెక్టివ్ గా ఉంటుందనా ?ఇదేదో మాజిక్ గా ఉంది.

"స్త్రీణాం మధ్యా త్సము త్పత్య తస్య భార్యా దురాత్మనః –వరా మండోదరీ నామ తయా స ప్రతి షేదితః "

"దేవ గంధర్వ కన్యాభి ర్యక్ష కన్యాభిరేవచ-సార్ధం ప్రభో రమస్వేహ సీతాయా కిం కరిష్యసి ?"

"రావణుడు అలా సీతను బెదిరించి వెళ్ళగానే కాపలా రక్కసులు వినరానిమాటలతో ఆమెను బెదిరించారు. వాళ్ళ మాటలను ఆమె గడ్డిపోచలాగా తీసిపారేసింది –

"తృణవద్భాషితం తాసాం గణయామాసజానకీ "

సీత దృఢ నిశ్చయాన్ని వాళ్ళు రావణుడికినివేదించారు.తమప్రయత్నాలన్నీ భగ్నం కాగా వాళ్ళు సీతను చుట్టుకొని నిద్ర పోయారు. 24వ సర్గలో రాక్షసస్త్రీలు వేర్వేరుగా సీతను ఎలా బెదిరించారో వివరంగా ఉంది. దాన్నిక్కడ హనుమ వదిలేశాడు. వాళ్ళమాటలను గడ్డిపరకగా భావించినట్లు ఇక్కడ హనుమ చెప్పాడు. అక్కడ ఆమాట లేదు. రావణుడికి తెలియజేసినట్లూ అక్కడ లేదు. ఆమె చుట్టూమూగి నిద్రించారు అని ఇక్కడ ఉన్నది. అక్కడ ఆమాట లేదు. అవసరాన్ని బట్టి పెంపు కుదింపు చేయటమేకాక "ఎమ్ఫాటిక్"గా చెప్పటం హనుమ ఉద్దేశ్యమేమో?

"వాళ్ళు అలా నిద్ర పోగా, పతి హితమేకోరే సీత దయనీయంగా శోకంతో ఏడ్చింది. రాక్షస స్త్రీల మధ్య ఉన్న త్రిజట నిద్ర లేచి "పాపులారా !కావాలంటే నన్ను చంపండి. సీత జోలికి మాత్రం వెళ్ళకండి. నేనిప్పుడే గగుర్పాటు కలిగించే ఒక కల గన్నాను. దాన్ని బట్టి రాక్షస నాశనం, ఆమె పతి విజయ సూచకం గా ఆ కల ఉన్నది. మనల్ని కాపాడమని ఆమెనే ప్రార్థిద్దాం. కొద్దిరోజుల్లో ఆమె సకల దుఃఖ విముక్తురాలై గొప్ప సుఖాలు పొందుతుంది. తనకు ప్రణమిల్లిన వారిని జానకీ దేవి వారి అపరాధాలు మన్నించి ప్రసన్ను రాలు అవుతుంది "అనగానే "త్రిజట చెప్పింది నిజమే అయితే, నేను మిమ్మల్ని కాపాడుతాను "అని సీత చెప్పింది. ఈమాటకూడా 27వ త్రిజటా స్వప్న సర్గ లో లేదు.

"తస్సా సా హ్రీమతీబాలా భర్తుర్విజయ హర్షితా –"అవోచ ద్యది తత్తధ్యం భవేయం శరణం హివః"

"నేనప్పుడు సీత దారుణ దుఖం చూసి, ఆమెను చూశాను అనే ఆనందంకూడా కలగలేదు. సీతతో ఎలామాట్లాడాలా అని ఆలోచించి దానికి అనుగుణంగా ఇక్ష్వాకు వంశాన్ని కీర్తించాను. ఆమె విని కన్నీటితోనే నాతో "వానర శ్రేష్టా!ఎవరు నువ్వు ఎలావచ్చావ్, నీకు రామునిపై ఆదరం ఎందుకు కలిగింది ?ఆ వివరాలన్నీ చెప్పు "అని అడిగింది. ఈమాటలు చాలా సందర్భ శుద్ధిగా ఉన్నాయి –

"కా చ రామేణ తే ప్రీతి స్తన్మే శంసితు మర్హసి "

నేను ఆమె మాటలకు సమాధానంగా "అమ్మా !నీ భర్తకు సహాయకుడు వానరరాజు సుగ్రీవుడి సేవకుడనైన హనుమంతుడను. మహా కార్య నిర్వాహకుడు రాముడు పంపగా వచ్చాను. ఈ ఉంగరం నీకు గుర్తుగా ఇమ్మన్నాడు. ఇప్పుడు నన్ను ఏమి చేయమంటావు?దాన్ని బట్టే చేస్తాను. నీకు ఇష్టమైతే నిన్ను రామ లక్షణుల దగ్గరకు తీసుకు వెడతాను"అన్నాను ఆమె క్షణం ఆలోచించకుండా "రాముడు రావణుడిని చంపి నన్ను తీసుకు పోవుగాక "అన్నది –

"అహ రావణ ముత్సాద్య రాఘవో మాం నయత్వితి "

'నేను ఆమె మాటలకు సంతోషించి ఆమె ఆనవాలు ఇమ్మని అడిగాను. ఆమె తన చూడామణి నాకు ఇస్తూ "దీన్ని చూసి రాముడు నిన్ను మహా గౌరవిస్తాడు "అని రామునికి చెప్పాల్సిన మాటలన్నీ వివరంగా నాకు చెప్పింది. నేను వెంటనే ఇక్కడికి రావాలనే తొందరలో ఆమెకు ప్రదక్షిణ చేసి, ప్రణమిల్లాను –

'మణి ర్యేవమహాబాహో రామస్త్వాం బహుమన్యతే"

"రావణుడు అలా సీతను బెదిరించి వెళ్ళగానే కాపలా రక్కసులు వినరానిమాటలతో ఆమెను బెదిరించారు. వాళ్ళ మాటలను ఆమె గడ్డిపోచలాగా తీసిపారేసింది –

"తృణవద్భాషితం తాసాం గణయామాసజానకీ "

సీత దృఢ నిశ్చయాన్ని వాళ్ళు రావణుడికినివేదించారు.తమప్రయత్నాలన్నీ భగ్నం కాగా వాళ్ళు సీతను చుట్టుకొని నిద్ర పోయారు. 24వ సర్గలో రాక్షసస్త్రీలు వేర్వేరుగా సీతను ఎలా బెదిరించారో వివరంగా ఉంది. దాన్నిక్కడ హనుమ వదిలేశాడు. వాళ్ళమాటలను గడ్డిపరకగా భావించినట్లు ఇక్కడ హనుమ చెప్పాడు. అక్కడ ఆమాట లేదు. రావణుడికి తెలియజేసినట్లూ అక్కడ లేదు. ఆమె చుట్టూమూగి నిద్రించారు అని ఇక్కడ ఉన్నది. అక్కడ ఆమాట లేదు. అవసరాన్ని బట్టి పెంపు కుదింపు చేయటమేకాక "ఎమ్ఫాటిక్"గా చెప్పటం హనుమ ఉద్దేశ్యమేమో?

"వాళ్ళు అలా నిద్ర పోగా, పతి హితమేకోరే సీత దయనీయంగా శోకంతో ఏడ్చింది. రాక్షస స్త్రీల మధ్య ఉన్న త్రిజట నిద్ర లేచి "పాపులారా !కావాలంటే నన్ను చంపండి. సీత జోలికి మాత్రం వెళ్ళకండి. నేనిప్పుడే గగుర్పాటు కలిగించే ఒక కల గన్నాను. దాన్ని బట్టి రాక్షస నాశనం, ఆమె పతి విజయ సూచకం గా ఆ కల ఉన్నది. మనల్ని కాపాడమని ఆమెనే ప్రార్ధిద్దాం. కొద్దిరోజుల్లో ఆమె సకల దుఃఖ విముక్తురాలై గొప్ప సుఖాలు పొందుతుంది. తనకు ప్రణమిల్లిన వారిని జానకీ దేవి వారి అపరాధాలు మన్నించి ప్రసన్ను రాలు అవుతుంది "అనగానే "త్రిజట చెప్పింది నిజమే అయితే, నేను మిమ్మల్ని కాపాడుతాను "అని సీత చెప్పింది. ఈమాటకూడా 27వ త్రిజటా స్వప్న సర్గ లో లేదు.

"తస్సా సా హ్రీమతీబాలా భర్తుర్విజయ హర్షితా –"అవోచ ద్యది తత్తథ్యం భవేయం శరణం హివః"

"నేనప్పుడు సీత దారుణ దుఖం చూసి, ఆమెను చూశాను అనే ఆనందంకూడా కలగలేదు. సీతతో ఎలామాట్లాడాలా అని ఆలోచించి దానికి అనుగుణంగా ఇక్ష్వాకు వంశాన్ని కీర్తించాను. ఆమె విని కన్నీటితోనే నాతో "వానర శ్రేష్టా!ఎవరు నువ్వు ఎలావచ్చావ్, నీకు రామునిపై ఆదరం ఎందుకు కలిగింది ?ఆ వివరాలన్నీ చెప్పు "అని అడిగింది. ఈమాటలు చాలా సందర్భ శుద్ధిగా ఉన్నాయి –

"కా చ రామేణ తే ప్రీతి స్తన్మే శంసితు మర్హసి "

నేను ఆమె మాటలకు సమాధానంగా "అమ్మా !నీ భర్తకు సహాయకుడు వానరరాజు సుగ్రీవుడి సేవకుడనైన హనుమంతుడను. మహా కార్య నిర్వాహకుడు రాముడు పంపగా వచ్చాను. ఈ ఉంగరం నీకు గుర్తుగా ఇమ్మన్నాడు. ఇప్పుడు నన్ను ఏమి చేయమంటావు?దాన్ని బట్టే చేస్తాను. నీకు ఇష్టమైతే నిన్ను రామ లక్షణుల దగ్గరకు తీసుకు వెడతాను"అన్నాను ఆమె క్షణం ఆలోచించకుండా "రాముడు రావణుడిని చంపి నన్ను తీసుకు పోవుగాక "అన్నది –

"అహ రావణ ముత్సాద్య రాఘవో మాం నయత్వితి "

'నేను ఆమె మాటలకు సంతోషించి ఆమె ఆనవాలు ఇమ్మని అడిగాను. ఆమె తన చూడామణి నాకు ఇస్తూ "దీన్ని చూసి రాముడు నిన్ను మహా గౌరవిస్తాడు "అని రామునికి చెప్పాల్సిన మాటలన్నీ వివరంగా నాకు చెప్పింది. నేను వెంటనే ఇక్కడికి రావాలనే తొందరలో ఆమెకు ప్రదక్షిణ చేసి, ప్రణమిల్లాను –

"మనసులో మరో సారి నిశ్చయానికి వచ్చి సీతాదేవి నాతో "నా వృత్తాంతం అంతాచెప్పి విన్నంతనే రామలక్ష్మణ సుగ్రీవులు కలిసి ఇక్కడికి వెంటనే వచ్చేట్లు చెయ్యి. రెండు నెలలుదాటితే, నేను బ్రతకను ఆతర్వాత ఆయన వచ్చినా వ్యర్ధమే –

"యద్యన్యథాదేత ద్ద్వామాసౌ జీవితం మమ-న మాం ద్రక్ష్యతి కాకుస్థో మ్రియేసాహ మనాథవత్"

"సీతాదేవి దీనాలాపాలతో నాకు రాక్షసరాజు పై విపరీతమైన కోపం వచ్చి మిగిలిన పని పూర్తి చేయాలనుకొన్నాను. నా శరీరాన్ని పర్వతంలాగా పెంచి యుద్ధం చేయాలనుకొని అశోకవన ధ్వంసం చేశాను. రాక్షస స్త్రీలు మేల్కొని అక్కడి మృగ పక్షులు పారి పోవటం చూసి, అక్కడ నన్ను చూసి వెంటనే రావణుడి దగ్గరకు వెళ్లి "రాజా !ఇతరులు ప్రవేశించజాలని నీవనాన్ని, నీ బలపరాక్రమాలు తెలీక ఒక దుర్మార్గ వానరుడు పాడు చేశాడు. వాడి దుర్బుద్ధికి తగినట్లుగా వెంటనే మరణ శిక్ష విధించు "అన్నారు."ఏ శిక్ష వెయ్యాలో వాళ్ళే రాజుకు సూచించారు. 42వ సర్గలో మాత్రం తీవ్ర శిక్ష వెయ్యమని చెప్పబడింది. హనుమ కొంత మార్చి చెప్పాడు. -

"వధ మాజ్ఞాపయ క్షిప్రం యథాసౌ విలయం వ్రజేత్ "

"అప్పుడు తనమాట వినే జయింపనలవికాని కింకరులను నాపైకి రాజు ఆజ్ఞాపించి పంపాడు. నాపై పడిన 80వేలమంది కింకరులను అక్కడే పరిఘ తో చంపిపారేశాను. చావగా మిగిలి తప్పించుకొన్నవారు రాజుకు వెళ్లి చెప్పగా నేను చైత్యప్రాసాదం ఎక్కి, దాని రక్షకులను చంపాను '.అప్పుడు చాలామంది రాక్షసులతో ప్రహస్తుని కొడుకు జంబుమాలిని నాపైకి పంపాడు. వాళ్ళందర్నీ పరిఘతోనే మట్టుపెట్టాను. మంత్రికుమారుల్ని పంపాడు రాజు. వాళ్ళనీ పరిఘతోనే యమపురికి పంపాను. తర్వాత అయిదుగురు సేనానాయకులను పంపగా అందర్నీ ససైన్యంగా చంపేశాను. మండోదరి కొడుకు అక్షకుమారుని గొప్ప సైన్యం తో పంపగా వాడితో ఆకాశాయుద్ధం చేసి రెండు పాదాలు గట్టిగా పట్టుకొని వందసార్లు ఆకాశం లో త్రిప్పి

నేలపై పడగొట్టి చంపాను. పంపినవారందర్నీ చంపేస్తున్న నాపై కోపం విపరీతమై తనకొడుకు ఇంద్రజిత్ ను పంపగా వాడి సైన్యాన్ని గుక్క తిప్పుకోకుండాకూల్చగా,వాడికీ మండి, బ్రహ్మాస్త్రం ప్రయోగించి నన్ను బంధించగా వాడిభటులు నన్ను త్రాళ్ళతో కట్టి రావణదర్బారుకు తీసుకు వెళ్ళారు.

"నన్ను లంకకు ఎందుకు ఏపనిమీద వచ్చానో, సీతను ఎందుకు చూశానో చెప్పమని ప్రశ్నించారు. నేను "సీతాదేవిని చూడటానికే వచ్చాను వాయుకుమారుడైన హనుమను రామదూతగా వచ్చాను సుగ్రీవుని మంత్రిగా వచ్చాను సుగ్రీవుడు నిన్ను క్షేమం అడిగాడు నీకు ఇహపర సాధకమైన హితోపదేశం నాతో పంపాడు. "ఋష్యమూక పర్వతం పై రాముడు నాకు మిత్రుడయ్యాడు. నాభార్యను రావణుడు ఎత్తుకుపోయాడని కనుక ఆమెను వెతకటానికి సాయం చేయి అని కోరగా, నేను మా అన్నవాలి నాకు అపకారం చేశాడు, వాడిని వధించి నాకు న్యాయం చేయి "అనికోరాడు అని సుగ్రీవ వాక్యంగా చెప్పాడు హనుమ. రాజా !వారిద్దరూ అగ్ని సాక్షిగా స్నేహితులయ్యారు. రాముడు ఒకేబాణం తో వాలిని చంపి వానర రాజ్యం కిష్కింధకు సుగ్రీవుని రాజును చేశాడు, కనుకమేము రామునికి అన్నివిధాలా సాయం చేయాలి. అందుకే ధర్మసంమిటంగా నన్ను నీదగ్గరకు దూతగా పంపాడు. వానరసైన్యం నీ రాక్షససైన్యాన్ని చంపకముందే నువ్వు సీతను రాముడికి సమర్పించు. దేవతలే వానరుల సహాయం కోరితే వెళ్లి విజయం చేకూర్చిన వానరుల ప్రభావం అందరికీతెలుసు "అని హితవు చెప్పాను " ఈమాటలు 51వ సర్గలో లేవు. అక్కడ వేలాది వానర వీరులు సర్వదిశలో వాయువేగంతో సంచరించే బలపరాక్రమవంతులైన వారున్నారు అనిమాత్రమే చెప్పాడు. ఇక్కడ కొంచెం పెంచి చెప్పాడు.

"వానరాణాం ప్రభావోహి న కేన విదితః పురా –దేవతానాం సకాశం చ యేగచ్ఛం తి నిమంత్రితాః"

"నా ప్రభావం తెలీక నన్ను చంపని రావణుడు ఆజ్ఞాపిస్తే, బుద్ధిశాలి సోదరుడు విభీషణుడు దూతవధ రాజశాస్త్రానికి విరుద్ధమని, దూత స్వామిహితం కోసమే నిజం చెబుతాడు కనుక చంపటం ధర్మకాదని, ఆకపి అపకారమే చేసిఉంటే అంగవైకల్యం కలిగించవచ్చు అని చెప్పగా, నా తోక కాల్చమని ఆజ్ఞాపించాడు రాజు. వెంటనే సేవకులు జనపనార గుడ్డపీలికలతో నా తోకకుచుట్టి నన్ను కొడుతూ తోక కాల్చారు. నాలుగు వీధులూ తిప్పుతూ "ఈకోతి చేసిన అపరాధానికి శిక్షగా బంధనం, పుచ్ఛదహనం చేయబడుతోం దహో "అని బిగ్గరగా అరుస్తూ త్రిప్పారు. ఈవిషయం 53వ సర్గలో లేదు. అక్కడ "వీడుదొంగ వీడుదొంగ "అని అరుస్తూ తిప్పారని ఉన్నది –

తతస్తే రాక్షసాస్సూరా బద్ధం మా మగని సంవృతం -'అఘోషయన్ రాజమార్గే నగరద్వారమాగాతా"

"నేను తెలివిగా నారూపం తగ్గించుకోగానే కట్లు తెగిపోగా,మళ్ళీ శరీరం పెంచి ఇనుప గుదియ తో ఆ రాక్షసులని చంపి, నగరద్వారంపైకి యెగిరి నాతోక కున్న అగ్నితో లంకాదహనం చేశాను. సీత సంగతి మర్చిపోయాను. సిగ్గుపడి పశ్చాత్తాపం చెందగా చారణులు సీత క్షేమంగా ఉన్నది అని చెప్పిన శుభవార్త విని సంతోషించాను. తోకకాలుతున్నా అగ్ని నన్ను దహించలేదు. మనసు ప్రశాంతంగా ఉంది వాయువు చల్లగా వీచింది, సీతాదేవిని మళ్ళీ దర్శించి స్వయంగా ఆమె కుశలం అర్ధం చేసుకొని, తిరుగుప్రయాణానికి ఆకాశంలోకి ఒక్కసారి ఎగిరి, సముద్రం దాటి మళ్ళీ మీదగ్గరకు వచ్చి మిమ్మల్ని చూడగలిగాను. శ్రీరామచంద్రుని ప్రభావం, మీ తేజస్సు, కారణంగా మన రాజు సుగ్రీవుని కార్యాన్ని చక్కగా నిర్వహించగలిగాను. నేను ఇక్కడి నుంచి బయల్దేరిన దగ్గర్నుంచి తిరిగి వచ్చేదాకా చేసిన పనులన్నీ సవివరంగా మీకు తెలియ జేశాను. ఇక ఇప్పుడు నేను ఏమి వదిలి పేశానో అది అంతా చెయ్యాలి "అని హనుమ గుక్క తిప్పుకోకుండా చెప్పి కూర్చున్నాడు.

"రాఘవస్య ప్రభావేన భవతాంచైవ తేజసా –సుగ్రీవస్య చ కార్యార్ధం మయాసర్వ మనుష్టితం"

"ఏతత్సర్వం మయాతత్ర యథావ దుపపాదితం - అత్ర యన్న కృతం శేషం తత్సర్వం క్రియతామితి"

ఇది 165శ్లోకాల 58 వసర్గ.

విషయం అంతా తెలిసిందేకనుక పెద్దగా వివరణ అవసరం లేదు. తేడాలున్న చోటమాత్రమే మీ దృష్టికి తెచ్చాను. ఇందులో హనుమ వ్యక్తిత్వం ఎక్కడుంది ?అంటే తన దూతకార్యం అంతా తనగొప్ప కాదు. అది రాముని ప్రభావం, వానర ఋక్ష సేన తేజస్సు మాత్రమే అని అత్యంత వినయంగా చెప్పటం లో ఉన్నది. కాదా మరి? అవును మరి. అంతేగా మరి ?వారి ఆశీర్వాద ప్రోత్సాహ బలం తో అంతటిఘనకార్య నిర్వహణ

చేయగలిగాను అని వినమ్రంగా విన్న వించిన హనుమ ఎంతో ఎత్తుకు ఎదిగి"ఎంత ఎదిగి పోయావయ్యా "అని మనతో అనిపించుకొన్నాడు మనకు గొప్ప ఆదర్శ ప్రాయుడౌతున్నాడు, చెప్పాల్సింది పూస గుచ్చినట్లుగా చెప్పానని ఏదీ దాయలేదనీ అన్నట్లు తెలియజేశాడు. ఇకతాను మిగిలినపని ఎలా చేయాలో సలహా ఇవ్వమని కోరి తన విజ్ఞత చాటుకున్నాడు హరి ప్రవీణ హనుమ

సీతాన్వేషణ వృత్తాంతాన్ని సవిస్తరంగా హనుమ తెలియజేశాక,మళ్ళీ హనుమ "శ్రీరామ కార్యం సఫలమైంది. సుగ్రీవుని ఉత్సాహం ఫలించింది. సీతాదేవి పాతివ్రత్యాన్ని చూసి నా మనసు పరవశించింది. రావణుడు మహాతపస్సంపంనుడు, తపస్సుచేత పెరిగిన అతడి కోపానికి లోకాలే దహించుకు పోతాయి. అందుకే సీతా దేవిని తాకినా అతడి శరీరం దగ్ధం కాలేదు. సీతాదేవి కోపిస్తే ఎలా తగలబెట్టగలదో అగ్నికూడా అంతగా కాల్చలేడు.

"సఫలో రాఘవోద్యోగ స్సుగ్రీవస్య చ సంభ్రమః –శీల మాసాద్య సీతాయా మమ చ ప్రణవం "మనః

"తపసా దారయే ల్లోకాన్ క్రుద్ధోవా నిర్ద హేదపి-సర్వధాతి ప్రవృద్ధో సౌ రావణోరాక్షసాధిపః

తస్య తాంస్పృశతో గాత్రం తపసా న వినాశితం "

"న తగగ్ని శిఖా కుర్యాత్ సంస్పృ ష్టాపాణినా సతీ –జనక స్యాత్మజా కుర్యాత్ యత్రోధ కలుషీ కృతా "

"పెద్దలు జామ్బవంతాదుల అనుమతితో జరిగిన కార్యం అంతా నివేదించాను మ్యాను. భృత్య విజయం స్వామి విజయమేకనుక, ఇప్పుడు లంకకు వెళ్లి సీతాదేవిని తెచ్చి, ఆమెతో కూడా రామ లక్ష్మణులను చూడటం యుక్తం గా ఉంటుంది అని పిస్తోంది. నేను ఒక్కడినే రావణుడితో సహా సకల రాక్షస సంహారం చేయగలను. మీరు కూడా కలిసి వస్తే జయించటం తేలికే. యుద్ధంలో రావణ, పుత్ర అనుచర సోదర సైన్యాలను చంపుతాను. ఇంద్రజిత్ ప్రయోగించే బ్రహ్మ, యింద్ర, రౌద్ర, వాయవ్య, వారుణాది అస్త్రాలను నిష్ఫలం చేసి సర్వ రాక్షస సంహారం చేస్తాను. మీరు అనుమతిస్తే రావణుని బంధిస్తాను "

"అహం తు రావణం యుద్ధే ససైన్యం న పురస్సరం –సహపుత్రం వదిష్యామి సహోదరయుతమ్ యుధి"

"బ్రహ్మ మైన్ద్రం, చ రౌద్రం చ వాయవ్యం వారుణం తథా –యది శక్ర జితో స్త్రాణి దుర్ని రీక్షాణి సంయుగే "

"యుద్ధంలో నేను కురిపించే రాళ్ళవాన తో దేవతలే నశిస్తారు. ఇక రాక్షసులసంగతి చెప్పాలా ?సముద్రం చెలియలి కట్ట దాటవచ్చు. మంధర పర్వతం కదలచ్చు. కాని శత్రు సైన్యం జాంబవంతుని ఏమీ చేయలేదు "-

"సాగరో ప్యతియా ద్వేలాం మందరః ప్రచలేదపి- న జామ్బవంతం సమరే కంపయే దరివహినీ"-

" మనమంతా ఎందుకు ?వాలిసుత అంగదుడు ఒక్కడు చాలు. సకల అగ్ర రాక్షస సంహారం చేయటానికి –

"సర్వ రాక్షస సంఘానాం రాక్షసా ఏ చ పూర్వతాః-అల మేకో వినాశాయ వీరో వాలిసుతః కపిః-""మహాత్ముడు పనసుడు, నీలుడు, తొడల వేగంతో మందర పర్వతాన్నే బ్రద్దలు చేయగలరు. రాక్షసులు ఒక లెక్కా ?

"పనస స్యోరు వేగేన నీలస్య చ మహాత్మనః –మందరో ప్యవ శీర్యత కిం పునర్యుధి రాక్షసాః"

"మైంద, ద్వివిదు లతో ఎదుర్కొనే సామర్ధ్యం దేవ, అసుర, యక్ష, గంధర్వ, ఉరగులకుకూడా లేదు. వారిద్దరూ ఆశ్వినీదేవతలకుమారులు. బ్రహ్మవరం పొంది అమృతం త్రాగి అమరులై, సకల వానరులలో శ్రేష్టులని పించుకొన్నారు,

"అశ్వి పుత్రౌ మహా భాగా వేతా ప్లవగ సత్తమౌ –ఏతయోఃప్రతి యోద్ధారం న పశ్యామి రణా జిరే "అమృత ప్రాశినా వేతౌ ఏను లంకను సర్వ వానర సత్తమౌ "

"నేను లంకనుపాడు చేశాను. అన్ని రాజమర్గాల్లో నా పేరు మారు మ్రోగేట్లు చాటాను. 'రామసుగ్రీవులకు జయం అంటూ జరిగిన విషయాలన్నీ చెప్పాను. లంకలో శింశుపా వృక్షం కింద, రాక్షస స్త్రీల మధ్య సీత దుఖంతో దీనంగా విలపిస్తోంది. నిరంతర రామ ధ్యానం తో గడుపు తోంది. రావణుడు తనకు వశం కమ్మని కోరుతూ బెదిరిస్తున్నాడు. ఆమె రాముడినే నమ్ముకొని వాడివైపు కన్నెత్తికూడా చూడటం లేదు. భర్తపై ఆమె అనురాగం అచంచలం. పాపి రావణుడిని ఐనా చంపకుండా వదిలింది అంటే వాడు మహానుభావుడే. వాడిని వాదించటం నిమిత్తమాత్రమే సీతాపహరణమే వాడి వినాశానికి మూలం –

"నియతస్సముదాచారో భక్తిర్భర్తరి చోత్తమా –యన్న హంతి దశగ్రీవం సమహాత్మా కృతాగసం"

నిమిత్తమాత్రం రామస్తు వధే తస్య భవిష్యతి

"అనధ్యయనం నాడువిద్య ఎలా క్షీణిస్తుందో అలా సీతాదేవి క్షీణించి ఉన్నది. కనుక ఇప్పుడు మన తక్షణ కర్తవ్యమేమిటో దాన్ని ఆచరించండి "అని హనుమ తనసహచర వానర వీరులతో చెప్పాడు.

"సా ప్రకృత్యైవ తన్వంగీ తన్వంగీ తద్వియోగాచ్చకర్శితా-ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా "

"ఏవమాస్తే మహాభాగా సీతా శోక పరాయణా-యదత్ర ప్రతి కర్తవ్యమ్ తత్సర్వ ముపపద్యతాం"

ఇది 35శ్లోకాల 59వ సర్గ.

ఇందులో హనుమ ఒక్కో వానర వీరుని బలపరాక్రమాలను విశ్లేషించి చక్కగా చెప్పాడు.ఇవి అతిశయోక్తులు కావు యదార్ధాలే.ఇలా చెప్పటం లో ఉద్దేశ్యం ఏమిటి అంటే వాళ్ళల్లో ఒక సారి పౌరుషాగ్ని రగుల్కొల్పటమే. రాబోయే రామ రావణ సంగ్రామానికి వాళ్ళను సమాయత్తం చేయటమే. అనధ్యయనం నాడు విద్య క్షీణించినట్లే సీత క్షీణించింది అనటం గొప్పమాట. సీత ను ఎత్తుకురావటం తోనే సగం చచ్చాడు. ఇకరాముని పని నిమిత్తమాత్రమేఅనటమూ బాగుంది. తన బలపరాక్రమ శౌర్యాలనూ దీటుగానే చెప్పుకొన్నాడు హనుమ. సీత కోపాగ్ని ప్రభావంకూడా చాలా గొప్పగా చెప్పాడు. ఇదంతా యుద్ధ వ్యూహం లో భాగమే అనిపిస్తుంది. మైంద ద్వివిదులు అమృతం త్రాగినట్లు ఇప్పుడే మనకు హనుమద్వారా తెలిసింది. జాంబవంతుని పరాక్రమమూ శ్లాఘించి ఉత్సాహ పరచాడు. ఈసర్గలో హనుమ పలికిన ప్రతిమాటా తగిన ఆలోచనతో చెప్పిందే భవిష్యత్తును దృష్టి లో పెట్టుకొని చెప్పినదే. ఈ సర్గకూడా చాలా ఉపయోగ మైనదే, ముఖ్యమైనదే.

హనుమ చెప్పిన విషయాలన్నీ ఓపికగా విన్న యువరాజు వాలిసుత అంగదుడు అందరినీ ఉద్దేశించి "సీతాదేవిని తీసుకురాకుండా రాముని దగ్గరకు మనం వెళ్ళటం భావ్యం కాదు. ఇంతమంది మహావీరులం సీతాన్వేషణకు వెళ్ళి, ఆమెనుచూశాం కాని తీసుకు రాలేదు అని రామునికి చెప్పటం తగదనిపిస్తోంది. ఎగరటం లో పరాక్రమం లో కాని దేవదైత్యులలో హనుంతుడికి సాటి ఎవరూ లేరు. అలాంటి హనుమ లంకలో రాక్షస వీరులను మట్టుపెట్టగా,ఇకమనకు వేరే పని ఏముంది ?సీతను తీసుకొని వచ్చాక మాత్రమే రాముని చూడటానికి వెడదాం."అన్నాడు. అంగదుని మాటలు విన్న జాంబవంతుడు అతనితో "రాజపుత్రా !నువ్వు చెప్పింది అయుక్తం కాదు. అయినా యుక్తమైనా సరే, రామాజ్ఞ ప్ర కారమే మనం నడుచుకోవటం మన విధి. స్వతంత్రించి మనం ఏ పనీ చేయకూడదు. కనుక ఆ ప్రకారం కార్య సిద్ధి ఆయే ఉపాయం ఆలోచించాలిచాలన్నాడు.

"తస్య తద్వచనం శ్రుత్వా వాలిసూను రాభషత-"అయుక్తం తు వినా దేవీం " దృష్ట వద్భి శ్చవానరాః"

"దృష్ట్వా దేవీ న చానీతా ఇతి తత్ర నివేదనం –అయుక్త మివ పశ్యామి భవద్భిః ఖ్యాత విక్రమైః"

"తే ష్వేనం హతవీరేషు రాక్ష శేషు హనూమతా –కిమస్య దత్ర కర్తవ్యమ్ "గృహీత్వా యామ జానకీం "

"న తావ దేషా మతి రక్షమానో –యథా భవాన్ పశ్యతి రాజపుత్ర –యథా తు రామస్య మతి ర్నివి ష్టా-తథాభవాన్ పశ్యతు కార్య సిద్ధిం "

ఇది 6శ్లోకాలు మాత్రమే ఉన్న 60వ సర్గ.

యువరాజు అంగదుడు ఆవేశ పరుడు. ఈ" ఎక్స్పెడిషన్ "కు తానే నాయకుడు. అతని ఆజ్ఞకు లోబడే హనువ వెళ్లి సీతను లంకలో చూసి వచ్చినా, నాయకుడిగా తనకు రావాల్సిన కీర్తిరాదు. సీతను తీసుకురాకుండా చూసి వచ్చాం అని రాముడికి చెప్పటానికి మొహం చెల్లటం లేదు. అది తన నాయకత్వానికి" ఫెయిల్యూర్ "అవుతుందని మధన, బాధ, అవమానం అతనిది. కనుక తక్షణ కర్తవ్యం. అక్కడ ఉన్న సమర్ధ వానర వీరులో కొందరుకానీ అందరూ కానీ లంకకు వెళ్లి ఎలాగైనా సీతనుతీసుకు రావాలి. అప్పుడే ఆమెతో కలిసి రామ దర్శనం చేయాలి. ఉడుకురక్తం ఆలోచన. అప్పుడే తన" ప్రెస్టేజ్" తన బాబాయ్ ముందు నిలుస్తుంది. లేకపోతే "డామేజ్ "అవుతుంది అనుకొన్నాడు కుర్రాడు, యువరాజు కనుక. ఆపైన ఆలోచించ లేకపోయాడు. ఇలాంటి సమయాలలోనే అనుభవజ్ఞుల ఆలోచన, సలహా "టంకం" అతికి నట్లు సరిగ్గా అతికి, పని చేస్తుంది

అందుకే జాబవంతుడు తన అనుభవ సారం అంతాపిండి వడగట్టి తానే అంగడుడికి,అందరి తరఫున "మాంఛి డోసు"లాంటి సలహా ఇచ్చి మారుమాట్లాడకుండా చేశాడు. అదే- నిర్ణయం తాము తీసుకోకూడదని, యువరాజు అంగదుని తో సహా అందరు రామాజ్ఞకు బద్ధులుగా నడవాల్సిందే అని ఖరాఖండిగా చెప్పి,అంగదుడితోపాటు అందరి నోళ్లకు తాళం వేశాడు. లేకపోతే ఏమయ్యేది ?ఎవరికి వారు తమపరాక్రమ డబ్బాలు స్వరడబ్బా పరడబ్బా పరస్పర డబ్బాలు కొట్టుకొని,కృష్ణరాయబారం లో దుర్యోధన, కర్ణ, అశ్వత్థామ, ద్రోణ కృపాదులు నిండు సభలో తమలో తాము" సిగపట్ల గోత్రం"పట్టి, రాయబారి ముందు పలుచనై పరువు పోయినట్లు జరిగేది. అటునుంచి ఆటే లంకకు పరిగెత్తేవారు. తర్వాత

ఏమై పోతారో తెలీదు. రామ సుగ్రీవాదులకు  సీతా దర్శన వార్త చేర వేసే వారు ఉండరు. ఒక వేల హనుమ అక్కడే ఉండిపోయినా  వాళ్ళంతా తిరిగి వచ్చేదాకా సుగ్రీవ రాములను చూడటానికి వెళ్ళే సాహసం చేసేవాడు కాదు.  దుందుడుకు స్వభావి  అంగదునినపై రాజు సుగ్రీవుడికి కోపం వస్తే, అతన్ని  రక్షించగలిగే  వారెవరూ ఉండరు సుగ్రీవాజ్ఞ అంత  తీక్ష్ణమైనది. ఇప్పటిదాకా చేసిన అన్వేషణ అంతా నిష్ఫలమై పోతుంది. అప్రమాదం జరక్కుండా ఎంతో ముందు చూపుతో రామకార్య సాఫల్యానికి, హనుమ అన్వేషణ ఫలితానికి చక్కని" డ్రమాటిక్ ఫినిషింగ్ "ఇచ్చాడు జాంబవాన్ అని నాకనిపించింది. చిన్నసర్గ అయినా చాలా" పవర్ ఫుల్ "సర్గ అని నేను అనుకొంటున్నాను.

జాంబవంతుని సలహాను అంగద హనుమదాది కపివీరులంతా ఆమోదించారు. తర్వాత అందరూ కలిసి మహేంద్ర పర్వతం వదిలి ఆకాశంలోకి ఎగిరారు. మహా గజాలలాగా మహాశరీరాలున్న వారవటం తో ఆకాశం కప్పి వేయబడినట్లు అనిపించింది. సర్వభూత పూజ్యుడు, వీర ధీర మహాబల మహావేగుడు ఐన హనుమను రెప్ప వేయకుండా చూస్తూ తమ చూపుల మీదనే ఆయన్ను కూర్చో పెట్టుకొని మోసుకు పోతున్నట్లుగా అనిపించింది –

"సభాజ్యమానం భూతై స్తమాత్మవంతం మహాబలం –హనుమంతం మహావేగం" వహంత ఇతి దృష్టి భిః""

రామకార్య సాధన చేసి మహాయశం పొంది, మిగిలిన దిక్కులకు సీతాన్వేషణకుతే  వెళ్ళిన వానరులకంటే వీరు  ఘనులయ్యారు –

"రాఘవే చార్థ నివృత్తిం కర్తుం చ పరమం యశః –సమాధాయ  సమృద్ధార్థాః కార్మ సిద్ధిభి రున్నతా "

సీతా  దర్శన వార్త రాముడికి చెప్పాలనే తహతహతో, రావణుడితో యుద్ధం చేయాలన్న కాంక్షతో, రాముడికి ప్రత్యుపకారం చేయాలన్న కోరికతోవానరులు  అనేక వృక్షాలు తీగలతో నందన వనం లాంటి, సుగ్రీవుని ఆజ్ఞ చేత కాపలా కాయబడుతున్న, ఏ ప్రాణీ  చొరరానంత కట్టు దిట్టమైన, సకలమనోహరమైన మధు వనం చేరారు –

"నందనోపమ మాసేదు  ర్వనంద్రుమలతా యుతం "

"యత్తన్మదు వనం నామ సుగ్రీవస్యాభి రక్షితం –అదృష్యం సర్వభూతానాం సర్వ భూత మనోహరం "

మధువనాన్ని సుగ్రీవుని మేనమామ దధిముఖుడు  సదా రక్షిస్తూ ఉంటాడు. వానరులంతా మధువనం లో దిగి సుగ్రీవుని మనసుకు ఆందం కలిగించే మధువనం లోని మధువు తాగాలాని ఉబలాట పడ్డారు –

"తే తద్వన ముపాగమ్య బభూవుః పరమోత్కటాః –వానరా వాన రేంద్రస్య  మనః కాన్తతమం మహత్ "

తెనేలాగా పింగళ వర్ణం తో ఉన్న వానరులు  తేనే త్రాగటానికి యువరాజు అంగదుని అనుమతి కోరారు –

"తతస్తే వానరా హృష్టాదృష్ట్వామధువనం మహత్ కుమార మభ్యయా చంత మధూని  మధు పింగళాః"

అంగదడు,జాంబవంతాది పెద్దల అనుమతి పొంది తర్వాతనే తేనే తాగటానికి వానరును  అనుమతించాడు –అంటే తనను అడిగినా, పెద్దరికం జామ్బవంతునికిచ్చి, ఆయన సరే నన్న తర్వాతే తన అనుమతి మంజూరు చేశాడు –

"తతః కుమారస్తాన్ వృ-ద్ధాన్ జాంబ వత్ప్రముఖాన్  కపీన్ –అనుమాన్య దదౌ తేషాం నిసర్గం మధు భక్షణే"

అంగదుని అనుమతి లభించగానే ఆనంద పరవశత్వం తో ననౌకసులైన  వానరులు నృత్యం చేశారు-ఇక్కడ వనౌకసులు అనటం పరమ ఔచిత్యమైన మాట. వాళ్ళు ఉండేది వనాలలోనే కనుక ఆ శబ్దం చక్కని అర్ధ ప్రబోధకంగా ప్రయోగించాడు కవి వాల్మీకి -

"తత శ్చాను మతా స్సర్వే సంప్ర హృష్టా వనౌకసః –ముదితాఃప్రేరితా శ్చాపి ప్రవృత్యంతో భావం స్తతః

కోతికి కొబ్బరి కాయ దొరికితే అనే సామెత లోకం లో ఉంది. అలాగే ఇక్కడా వానరుల ఆనందానికి అంతులేకుండా పోయింది. కొందరు పాడితే, కొందరు వంగితే మరి కొందరు నృత్యం చేస్తే ఇంకొందరు అట్టహాసం చేస్తే, కొందరు పడి లేస్తూ, కొందరు అటూ ఇటూ తిరుగుతూ, కొందరు అరుస్తూ " హల్ చల్"చేశారు –

"గాయంతి కేచిత్ ప్రణమంతి కేచిత –నృత్యంతి కేచిత్ ప్రహసంతి కేచిత్ –పతంతి కేచిత్ ద్విచరంతి కేచిత్ –ప్లవంతి కేచిత్ ప్రలవంతి కేచిత్ "

ఒకళ్ల నొకళ్ళు కావలించుకొంటూ, కొందరు ఒకళ్ళను ఒకళ్ళు పట్టుకొంటూ, కొందరు మాట్లాడుకొంటూ, కొందరు కలిసి విహరించి ఆనందం అనుభవించారు -

"పరస్పరం కేచి దుపాశ్రయంతే-పరస్పరం కేచి దుపాక్రమంతే-పరస్పరం కేచి దుపబ్రువంతే-పరస్పరం కేచి దుపారమంతే"

కొందరు ఒక చెట్టు మీదనుంచి ఇంకో దానిమీదకు పరిగెత్తారు. కొందరు చెట్టు చివరి కొమ్మలపైకి చేరి కిందికి దూకారు, మరికొందరు గడుగ్గాయలు మహా వేగంతో చెట్టుకింది వృక్షాగ్రం ఎక్కేశారు-

"ద్రుమా ద్ద్రుమం కేచి దభి ద్రవంతే-క్షితౌ నగాగ్రా న్నిపతంతి కేచిత్ –మహీతలానన్ త్కేచి దుదీర్ణ వేగా –మహాద్రుమాగ్రా ణ్యభి సంపతంతి"

"ఒకడు పాడుతుంటే ఇంకోడు నవ్వుతూ వాడి దగ్గరకు వెళ్ళాడు. ఇంకోడు నవ్వేవాడి దగ్గరకు ఏడుస్తూ పోయాడు. ఇంకోడు ఏడ్చేవాడిని త్రోసేసి దగ్గర కెళ్ళాడు.మరో గడుసు పిండం అరుస్తూ ఆ తోసిన వాడి దగ్గర కెళ్ళాడు –ముక్తపద గ్రస్తం లాగా తమాషాగా వర్ణన చేసాడు మహర్షి.

"గాయంతి మన్యః ప్రహసన్నుపైతి-హసంత మన్యః ప్రరుదన్నుపైతి-రుదంత మన్యః ప్రణుద న్నుపైతి-నుదంత మన్యః ప్రణద న్నుపైతి"

బాగా తేనె కడుపారా తాగి, మత్తెక్కి విపరీత చేష్టలు చేస్తూ కల్లోలం సృష్టించారు. తాగి తృప్తి పొందనివాడు మత్తెక్కని వాడు లేదు అంటే అతిశయోక్తిలేదు. కల్లుపాకల దగ్గర" తాగు బోతుల సీను" ఇదంతా లాగా అనిపిస్తుంది. -

"సమాకులం తత్కపి సైన్య మాసీ –న్మధు ప్రపానోత్కటసత్వ చేష్టం-న చాత్ర కశ్చిన్న బభూవమత్తో-న చాత్ర కశ్చి న్న బభూవతృప్తః "

తాగి తందనాలాడటం అంటే ఇదే నెమో ? తాగినమత్తులో మధువనం చెట్లు విరగ్గొట్టారు, ఆకులు పూలు పళ్ళు రాల్చి నేలపాలు చేస్తుంటే కాపలాదారు దధి ముఖుడు అడ్డు వచ్చాడు. అసలే ముసలాడు, ఆయన మనల్ని బెదిరించటం ఏమిటని ఇంకా చెలరేగిపోయారు కోతిమూక. పాపం శాయశక్తులా వనాన్ని కాపాడే ప్రయత్నం చేశాడు సుగ్రీవ మేనమామ-. కొందర్ని తీవ్రంగా తిట్టాడు. కొందర్ని అరచేత్తో కొట్టాడు, కొందరితో పోట్లడాడు. కొందర్ని వనం పాడు చేయకండిరా బాబూ అని బుజ్జగించాడు. పాపం ఒళ్ళు ఎరగని మత్తులో తిట్లూ శాపనార్ధాలు దెబ్బలూ తిన్నారు వానరులు –

"ఉవాచ కాంశ్చిత్పరుషాని ధృష్ట-మసక్త మన్యాంశ్చతలై ర్జఘాన –సమేత్య కైశ్చిత్కలాహం చకార –తథై వసామ్నోపజగామ కాం శ్చిత్"

మధుపానమత్తులై, కపలాదారును లెక్క చేయకుండా భయం లేకుండా రెచ్చిపోయి, అతడి చుట్టూ చేరి, వనరక్షకుడు అతడిని ఏమీ చేయరాదనే ఇంగితం కూడా లేకుండా తిట్టారు, అటూ ఇటూ లాగారు. గోళ్ళతో గీరి పళ్ళతో కరిచి,చేతులు కాళ్ళతో బాదుతూ ఆవనం లో తినటానికి ఉన్న సర్వం భోజ్యం చేసి మిగలకుండా పూజ్యం చేసేశారు కపి సేన కసికసిగా విజయోత్సాహంతో -అసలైన "కిష్కింధకాండ "సినిమా ఆడారు. మనకు వారికీ వినోదం, ఆనందం సంతృప్తి, ఆటవిడుపు దధిముఖుడికి పరాభవం, దుఃఖం అవమానం దూషణ తిరస్కారాలు.

ఇది 23శ్లోకాల 61వ సర్గ

కోతి మూక ఆగడాలను కవి రుషి వాల్మీకి అనుస్టుప్పులలో మన చెవుల తుప్పు వదిలేట్లు పరమ మనోహరంగా వర్ణించాడు. తీవ్రమైన అనుభూతి ఆనందం సంతృప్తి సంఘటనలలో ఈ విధమైన శ్లోకాలతో వర్ణిస్తూ గొప్ప" ఎఫెక్ట్ "కలిగిస్తాడు లోగడ రెండు మూడు ఘట్టాలలో చూశాం. ఇన్ని మంచి శ్లోకాలను ఏ ప్రవచన కారుడూ ముట్టుకోడు. అదే నాకు ఆశ్చర్యం. ఒక సారి కైకలూరుకు చెందిన ప్రవచన కారులు బ్రహ్మశ్రీ పరిమి రామకృష్ణ శాస్త్రిగారు ఉయ్యూరు విష్ణ్వాలయం లో సుందర కాండ చెబుతూ అంతా అయ్యాక ఆయన్ను సన్మానిస్తూ నన్ను మాట్లాడమంటే ఈ సర్గ శ్లోకాలు చదివి వినిపిస్తే "అలాగా మాస్టారూ "అని ఆశ్చర్యపోయారు. మల్లాది వారూ ఎక్కడా ఉటంకించినట్లు లేదు. నాకెందుకో ఈ సర్గ పరమాద్భుతం అనిపిస్తుంది. సహజత్వానికి నిలువుటద్దం.వీనులవిందైన శబ్ద లాలిత్యానికి గొప్ప ఉదారణ.

అసలు ఈ మధువనం సీను ఎందుకు పెట్టాడు కవి ?ఎవరైనా ఏదైనా అద్భుత కార్యం సాధిస్తే, పరీక్ష పాసైతే రాంకు వస్తే మాంచి ఉద్యోగం సంపాదిస్తే తన ఆనందాన్ని ఇతరులతో పంచుకోవటం లోక రివాజు. స్వీట్,హాట్ టీ వగైరాలిచ్చి తృప్తి చెందుతారు. ఇంకా" ఖరీదైన "వారు "మందుపార్టీ "చేసుకొంటారు. కాక్ టైల్ పార్టీ వగైరాలు చేస్తారు. ఇక్కడ కూడా అంతే.వానర విజయోత్సాహానికి తగిన" కిక్కు" రావాలి. అందుకే మధు వన విహారం. తేనె త్రాగటం. వనౌకసుల సహజ లక్షణం. తేనె తుట్టె దులిపి తేనె తాగటం. ఆ పనే వీళ్ళు చేశారు. మాత్తెక్కితే

పిచ్చిప్రేలాపనలు, చేష్టలు చేయటమూ సహజమే. అలాగే తమ జాతి లక్షణాలనీ ప్రదర్శించారు, ధిక్కారమూ సహజమే అదీచేశారు మత్తు గమ్మత్తులో. వద్దని వారించిన వారిని దుమ్మెత్తి పోయటమూ సహజమే. అదీ చూపించారిక్కడ. అన్నీ సహజ లక్షణ సుందర బంధురంగా ఉన్నాయి. ఆశ్లోకాలలో వాల్మీకు తేనే కారేట్లు రాశాడు. చదువుతుంటే మనకూ కిక్ వస్తుంది. చక్కని లయాత్మకమైన శ్లోకాలు. భావ సుందరాలు. మనోజ్ఞాలు. మధుమధురాలు. మరొక్క సారి మహర్షికి నమస్కరిస్తున్నాను ఈసర్గను సర్వతో మనోజ్ఞంగా తీర్చి దిద్దినందుకు.

హనుమ అంగద జాంబవంతాది" ఎల్డర్స్" ఈ మధువు జోలికి వెళ్ళినట్లు చెప్పలేదు. అనుచరుల సంతోషమే తమ సంతోషంగా భావించి ఉంటారు. కపులు తమ కపిత్వం తో వన ధ్వంసం చేయటం తప్పని పిస్తుంది. కానీ ఇక్కడ తప్పని విషయమే అది. ఆనందానికి పరాకాష్ట అది అని సర్దుకోవాలి. సుగ్రీవుడికి పరమానందం కలిగించేది,కుకనే మేనమామను ముసలివాడైనా జాగ్రత్త గా చూసుకొంటాడని కాపలాగా పెట్టాడు. అలాంటి దాన్ని ధ్వంసం చేస్తే సుగ్రీవుడు అగ్గిమీద గుగ్గిలం అవుతాడు. కానీ లెక్క చేయలేదు కపి మూక. తెలిసినా తమ విజయం ముందు ఈ తోట ధ్వంసం ఒక లెక్కా అను కొంటాడని తెలుసేమో వీరికి ? అసలు అంగద జాంబవంతులు కూడా కిమిన్నాస్తిగా మౌనంగా ఉండి పోయారు. ఏదో ఆంతర్యం వారికి తెలుసు అనిపిస్తుంది.

హనుమ వానరులకు "జంకకండి మీ ఇష్టం వచ్చినట్లు మధువు తాగండి. మిమ్మల్ని అడ్డగించే వారిని నేను చూసుకొంటాను "అనగానే అంగదుడు కూడా "మీరు తేనే తాగండి "అన్నాడు" తానా తందానా"గా. " అని వారిద్దరూ అన్నదాన్నీ "బాగు బాగు "అంటూ "భేష్ భేష్ అంటూ వానరులు ఆనందం వ్యక్తం చేశారు. హనుమ సీతను చూశాడని జాంబవంత అంగదులు మధువును గ్రోలమని అనుమతిచ్చారన్న సంతోషంతో మధువనం చేరి, కాపుదార్ల ను విదిలించి, ఇష్టం వచ్చినట్లు తెనేత్రాగి పండ్లుకోసి తిన్నారు, వనరక్షకులపై పడి బాదారు. "తూమెడు తేనే తుట్ట"లనుఒక్కొక్కడు చేత్తో పట్టుకొని తేనే అంతా తాగి ఖాళీ చేశారు. మిగిలినవాటిని త్రెంచి పారేశారు, కొందరు విసిరేశారు, మత్తుబాగా ఎక్కి ఆ తుట్టేలతోనే కొట్టుకున్నారు –

"మధూని ద్రోణ మాత్రాణి బాహుభిః పరి గృహ్యతే –పిబంతి సహితా స్సర్వేనిఘ్నంతి స్మతథా పరే "

"కేచిత్ పీత్వా పవిధ్యంతిమధూని మధు పింగళాః-మధూ చ్చి ష్టేన కేచిచ్చ జఘ్ను రన్యోన్య ముత్కటాః"

మదించిన వానరులు కొందరు చెట్ల కింద చేరి, కొమ్మల్ని పట్టుకొని మత్తు బాగా పెరిగి ఆకులు నేలపై రాల్చి వాటిపై పడుకొన్నారు. సంతోషంతో ఒకరినొకరు కింద పడేసు కొని తన్నుకొన్నారు, తోసుకొన్నారు. కొందరు సింహనాదం చేస్తే, కొందరు పక్షుల్లాగా అరచారు, మరికొందరు హాయిగా నేలపై పడి దొర్లారు –ఇవన్నీ కోతి చేస్టలే. చూస్తుంటే ముచ్చటగా ఉండేవే.

"ఉన్మత్త భూతాః ప్లవగా మధు మత్తా శ్చహృష్ట వత్ –క్షిపంతి చ తదాన్యోన్యం స్కలంతి చ తథాపరే"

"కేచిత్ క్ష్వేళాం ప్రకుర్వంతి,కేచిత్ కూజంతి హృష్ట వత్ –హరయో మధునా మత్తాః కేచిత్ సుప్తామహీతలే "

కొందరు పల్లెటూరి పనులు చేసి నవ్వుకొన్నారు. మరికొందరు అలాగే చేస్తూ నవ్వుకొన్నారు. మేమిలా చేశాం మేమలాగా చేశాం మేమిట్లా చేశాం మేము ఇలా చేస్తాం అని చెప్పుకొంటూ పగలబడి నవ్వుకొన్నారు-

"కృత్వా కేచిద్ధ సంత్య న్యే కేచిత్కుర్వంతి చేతరత్ –కృత్వా కేచి ద్వదంతనయే కేచిత్ ద్బుధ్యంతి చేతరత్"

"'మధువానాన్ని కాపాడే వారు వానరుల ఆగడాలకు భయపడి నలుదిక్కులకూ పారిపోయారు. వాళ్ళను వెంబడించి మోకాళ్ళు పట్టి లాగి, అపానద్వారం చూపగా భయం దుఖం తో దదిముఖుడి దగ్గరకెళ్ళి మొరపెట్టుకొన్నారు. అంటే చాలా మోటుగా ఉచ్చ నీచాలు లేకుండా కోతిమూక ప్రవర్తించిందన్న మాట –రాయటానికే నాకుఇప్పుడు ఇబ్బందిగా ఉంటె అసలు ఆదృశ్యం చూస్తె ఎంత జుగుప్సగా ఉంటుందో ?-కానీ మా చిన్నతనాలలో మేము కూడా అవతలవాడిని ఏడిపించటానికి పొట్టిలాగు కిందికి జార్చి "ముందు, వెనక "చూపిస్తూ నవ్వుకోవటం నాకు గుర్తే. మానవుడు కోతినుంచి దిగుమతి అయ్యాడు అనటానికి ఇదికూడా బలమైన సాక్ష్యమేమో ?

"జాను భిస్తు ప్రకృష్టాశ్చ"దేవమార్గం "ప్రదర్శితాః- అబ్రువన్ పరమోద్విగ్నా గత్వా దధిముఖం వచః"

వనపాలకులు "హనుమంతుని అనుమతి తో వానరులు మధువనం పాడు చేశారు. మమ్మల్ని మోకాళ్ళు పట్టి లాగి అపానద్వారం చూపించారు "అనిసిగ్గు విడిచి చెప్పి గగ్గోలుపెట్టారు.ఆమాటలు విని ఓదార్చి "నాతో రండి. మనం కలిసి మనబలం చూపించి అడ్డు కొందాం "అని చెప్పి వాళ్ళతో కలిసి వనానికి వచ్చాడు. పెద్ద చెట్టు పీకి, చేత్తో పట్టుకొని కోతులపైకి వెళ్ళాడు. అనుచరులూఅనేక రకాల చెట్లు పీకి చేతులతో పట్టుకొని

అలానే చేశారు.హనుమకు కోపం రాగా వానరులతోకలిసి వనపాలురందరిపై దాడి చేశాడు. అంగదుడు తనతాత దదిముఖుని కిందపడేసి, చేతులతో కొట్టాడు బందుత్వం,ముసలితనం కూడా మరచి. ఈ దెబ్బలకు అతడు తట్టుకోలేక వివశుడై కాసేపు మూర్చపోయాడు –

"ఆర్యకం ప్రాహర త్తత్ర బాహూభ్యాం కుపితోం గదః "

"స భగ్న బాహూరుభుజో విహ్వల శ్శోణితోక్షితః -'ముమోహ సహసా వీరో ముహూర్తం కపికుస్జరః "

కాస్త తేరుకొని దదిముఖుడు మత్తెక్కివోడలు మరచిన ఆవానరులను దండం చేతబట్టి పారద్రోలాడు. అందుకే "దండం దశ గుణం భవేత్ "అన్నారు.దూరంగా పోయి అతడు తన సేవకులతో "వాళ్ళ ఏడుపు వాళ్ళని ఏడవనియ్యండి. మనం రాజు సుగ్రీవుని వద్దకు వెళ్లి మనరాజుకు అంగదుడు చేసిన అపకారం అంతా చెబుతాను. అసలే సుగ్రీవుడికి కోపం ఎప్పుడూ తారాస్థాయిలో ఉంటుంది. మనం చెప్పినమాటవిని వీళ్ళందర్నీ చంపించి వేస్తాడు. ఈ వనం ఆయనకు చాలా ఇష్టమైనది తండ్రితాతలనుంచి సంక్రమించింది దేవతలకుకూడా చొరరానిది –

"సర్వం చైవాంగదే దోషం శ్రావ యిష్యామి పార్థివే-అమర్షీ వచనం శ్రుత్వాఘాతయిష్యతి వానరాన్ "

"ఇష్టం మధువనం హ్యేతత్ సుగ్రీవస్య మహాత్మనః –పితృపైతామహం దివ్యం దేవైరపిదురాసదం "

"సుగ్రీవుడికి ఈ తేనే తాగే వారు, పోగాలం దాపురించిన వారు ఐన వానరులకు, మిత్రులకు కూడా మరణ శిక్ష వేస్తాడు. సుగ్రీవాజ్ఞ పరమ భీషణమైనది. దాన్ని యెదిర్చి ఎవరూ బతికి బట్టకట్ట లేరు, రాజాజ్ఞ ధిక్కరించిన వీళ్ళకు చావు మూడుతుంది. అప్పుడు వాళ్ళ వల్ల బాధలుపడ్డ మన కోపం శాంతిస్తుంది "అని వనపాలురను ఊరడించి, వారితో సహా దదిముఖుడు అమాంతం ఆకాశం లోకి యెగిరి క్షణం లో రాజు రామ లక్ష్మణ సుగ్రీవుల ముందు వాలాడు. మహాపరాక్రమశాలి ఐన అతడు దీనవదనం తో సుగ్రీవుని పాదాలకు ప్రణామం చేసి నిల బడ్డాడు "

"'స వానరా నిమాన్ సర్వాన్ మధు లుబ్ధాన్ గతాయుషః-ఘాత ఇష్యతి దండేన సుగ్రీవఃససుహృజ్జనాన్ "

"వాద్యా యేత్యే దురాత్మానో నృపాజ్ఞాపరిభావినః –అమర్ష ప్రభవో రోషఃసఫలో నో భవిష్యతి "

"సన్నీ పత్య మహా వీర్యః సర్వైస్తైః పరి వారితః –హరి ర్దధిముఖః పాలైః పాలానాం పరమేశ్వరః "

"స దీన వదనో భూత్వా కృత్వా శిరశి చాంజలిం-సుగ్రీవస్య శుభౌ మూర్ధ్నా చరణౌ ప్రత్య పీడయత్ "

ఇది 40 శ్లోకాల 62వ సర్గ.

ఇందులో వానరుల కోతి చేష్టల పొడిగింపూ,వాళ్ళ సభ్యత లేని ప్రవర్తన, అంగదుడు తాత అని చూడకుండా ముసలి దధిముఖుడిని నేలపై పడేసి భుజాలతో పొడవటం కొంత హద్దుమీరిన ప్రవర్తన కనిపిస్తుంది. అంగద హనుమలు సుష్టుగా మధువు తాగమని "ఫుల్ లైసెన్స్" ఇవ్వటం తో వానరులలో సీతాన్వేషణ సమయం లో కోల్పోయిన శక్తీ, పొందిన అలసట దూరం చేసుకోవటానికి ఫుల్లుగా తాగి తాగుబోతుల వీరంగం సృష్టించారు. ఇంత చేస్తే కానీ వాళ్ళు మామూలు వానరులు కాలేక పోయారన్న మాట. సుగ్రీవుడికి పరమ ప్రీతిపాత్రమైన తరతరాలుగా దక్కిన మధు వనం పాడు చేయటం అంటే ఆయనకు తెలిస్తే ప్రాణాలు కోల్పోవటమే. బహుశా ఇంత దూరం ఆలోచించి ఉండరు హనుమదాదులతో సహా. ఒక వేళ ఈ ఆనంద సమయం లో అవేవీ గుర్తుకు రాక పోయి ఉండవచ్చు. తెలిస్తే ఏం చేస్తాడెం అనే ధీమా కూడా కావచ్చు. తాము తెచ్చిన అత్యంత శుభ ప్రదమైన వార్త విని, ఆయన ఈ చిన్న చిన్న విషయాలను పట్టించు కోడులే అనే భరోసా కూడా కావచ్చు. తాగితే బాగానే ఉంది వనధ్వంసం ఎందుకు చేయాలి ?"ఆనంద లహరి" కి అడ్డూ, ఆపూ ఉండవు. వేరేది ఏదీ కనిపించదు వినిపించదు.గుడ్డిలో మెల్ల జాంబవంత హనుమ అంగదులు మాత్రం "తీర్థం "పుచ్చుకోలేదు. వానరుల "ఎంజాయ్ మెంట్" ను హాయిగా వారూ ఆస్వాదించారు. వారి పర్మిషన్ ఉండబట్టే ఇంత తెగించారు. వాళ్ళు నాయకులు, మనకేమైనా అయితే వాళ్ళే చూసుకొంటారు అనే తెంపరితనం ఉండచ్చు.హనుమకూడా దధిముఖునిపైకి పోరాటానికి వెళ్ళటం స్వజన సంరక్షణలో భాగమే.

మేనమామ అయిన, వయసులో పెద్ద వాడు ముసలి వాడూ అయిన దదిముఖుడు రాజైన సుగ్రీవునికి పాద ప్రణామం చేసి, మధు వనపాలకాధికారిగా నమస్కరించి సంస్కారం చూపాడు. తనపాలన ధర్మాన్ని కూడా సమర్ధవంతం గానే నిర్వహించాడు మధువన సంరక్షణ విషయం లో. అయినా" తెగించిన వాడికి తెడ్డే లింగం "అన్నట్లు బరితెగించిన ఆ కోతి మూక ను అడ్డుకోలేక విధ్వంసాన్ని ఆపలేకపోయాడు పాపం. వాళ్ళతోనూ, మనవడు అంగదుడి తోనూ దెబ్బలు కూడా తిన్నాడు విధి నిర్వహణలో.



దధి ముఖుని దీనవదనం చూసికలత చెందిన సుగ్రీవుడు "ఎందుకు నా పాదాలమీద పడ్డావు ?లే. అభయ మిస్తున్నాను. అసలు విషయం ఏమిటో చెప్పు "అన్నాడు. సుగ్రీవుని విశ్వసించి అతడు లేచి "రాజా !నీ తండ్రి ఋక్ష రజస్సు కాలం లోకాని, నీ పాలనలో కానీ, నీ అన్నవాలి కాలం లోకానీ మధువనం ఎప్పుడూ ఇలా విధ్వంసం కాలేదు. ఇప్పుడు వానరులు మధు భక్షణ చేసి పాడు చేశారు. మధుపాన మత్తులో ఉన్న వాళ్ళను మన కాపలా వాళ్ళు బెదిరిస్తే లక్ష్యం చేయకుండా ఫలాలు కోసి తింటూ తేనే తాగుతూ, త్రాగగామిగిలింది పారబోస్తూ ఉంటె అదలించగా వెక్కిరించారు. వనం లోని తేనే తాగద్దని మన రక్షకులు వారిస్తుంటే అంగదాదులు,మన వాళ్ళనే బెదిరించారు. కోపం తో వానరులు వీళ్ళందర్నీ తరిమేశారు. చేతులతో కాళ్ళతో కొట్టారు కొందరు అటూ ఇటూలాగి అపానద్వారం (దేవమార్గం )చూపించారు. నువ్వు పాలకుడవై ఉండగా ఈ ఘోరుల్ని వాళ్ళు కొట్టారు. వారి స్వేచ్చను అడ్డుకోలేక పోయాం "అని పూస గ్రుచ్చినట్లు తెలియ జేశాడు –అపానమార్గానికి గౌరవప్రద నామం "దేవమార్గం ".తన్ను అంగదుడు కిందపడేసి కొట్టిన సంగతి చెప్పకుండా వదిలేశాడు ఎందుకో ?నీ పాలనలో ఇలా జరిగింది అని కొంచెం నిష్ఠూరంగా చెప్పినట్లు భావించాలి. అంటే రాజుకు కోపం తెప్పించే అన్నిరకాలమాటలూ చెప్పాడు -

"ప్రాణిభిర్ని హితాఃకేచిత్ కే చిజ్జానుభి రాహతాః-ప్రకృస్టాశ్చ యథా కామం "దేవమార్గం "చ దర్శితాః"

సుగ్రీవునితో అతడు చెబుతుండగా లక్ష్మణుడు వచ్చి "వనపాలకుడైన యితడు ఎందుకు వచ్చాడు. దుఖంతో నీకేమి చెప్పి ఏమికావాలని కోరాడు ?"అని అడిగాడు. మాటల నేర్పరి సుగ్రీవుడు "పూజ్య లక్ష్మణా!సీతాన్వేషణకు దక్షిణ దిశకు వెళ్ళిన వానర పుంగవులు తిరిగి వచ్చారని, అంగదాదులు మధువన మదు భక్షణ చేశారని యితడు చెప్పాడు. ఇలా చేశారంటే వాళ్ళు కార్యం సాధించారనే అనిపిస్తోంది. అందుకే అంతటి ఉత్సాహం ప్రదర్శించి ఉంటారు. నా అనుమతి లేదని భయపడకుండా మధువన ప్రవేశం వారు చేశారంటే కార్యం సఫలంగా సాధించారనే అర్ధం. సందేహం లేదు –

"అంగదప్రముఖై ర్వీరైర్భక్షితం మధు వానరైః-విచిత్య దక్షిణా మాశామాగతై రహరి పుంగవైః"

"నైషామకృత కృత్యానామీదృశః స్యా దుపక్రమః-ఆగతై శ్చప్రమథితం యథా మధువనం హితైః

ధర్షితం చ వనం కృత్స్న ముపయుక్తం చ వానరైః"

"దృష్ట్వా దేవీ న సందేహో న చాన్యేన హనూమతాః"

లక్ష్మణా ! సీతాదేవినే హనుమంతుడే చూశాడు. సందేహం లేదు. అతడికి కాక ఈకార్యసాధన ఎవరి వలన అవుతుంది ?అతడిలో వివేకం బుద్ధిసూక్ష్మత పట్టుదల, పరాక్రమం, విద్యా ది మహాగుణాలున్నాయి –

"కార్యసిద్ధి ర్మతి శ్చైవ తస్మి న్వానర పుంగ వే-వ్యవసాయ శ్చవీర్యం చ శ్రుతం చాపి ప్రతి ష్ఠితమ్"

"ఏ పనిలో జాంబవంత, అంగదులు నాయకులుగా ఉంటారో, వారికి హనుమ తోడుగా ఉంటాడో ఆ పని తప్పక నేర వేరి తీరుతుంది –

"జామ్బవన్యత్ర నేతా స్యా దంగద శ్చమహాబలః –హనూమాం శ్చాప్యధిష్ఠాతా న తస్య గతిరణ్య థా"

"అంగదాదులు మధువనం పాడు చేసి, వాళ్ళను వనపాలురు వారిస్తే, వాళ్ళతో దెబ్బలులుతిన్నారు.ఈ విషయం నాకు నివేదించ టానికే రక్షకుడు దధిముఖుడు వచ్చాడు. సీతా దేవిని వానరులు చూశారు. బ్రహ్మ చే నా తండ్రి ఋక్ష రాజస్సుకు ఇవ్వబడిన ఈ దివ్య వనం లో పడి యధేచ్చగా తేనే తాగారంటే,వారి ప్రవృత్తిని ఊహించ వచ్చు. సీతా దేవిని చూడకపోతే మధువన ధ్వంసం చేసే వాళ్ళు కాదు "అని చాలా సంతృప్త ప్రశాంత చిత్తంతో సుగ్రీవుడు రామానుజునికి నివేదించాడు –.ముందు మంత్రికి విన్నవించి తర్వాత రాజుకు చెప్పటం లోక సహజం. అందుకే ముందు రామానుజునికి చెప్పాడు.

"న చా ప్రదృష్ట్వావైదేహీం విశ్రుతాః పురుషర్షభ-వనం దత్త వరం దివ్యం ధర్ష యేయు ర్వనౌకసః " సుగ్రీవుని నోటినుండి వెలువడిన ఈ వీనుల విందైన పలుకులు విని రామ లక్ష్మణులు మిక్కిలి హర్షించారు –

"శ్రుత్వా కర్ణ సుఖాంవాణీం సుగ్రీవ వదనా చ్చ్యుతాం-ప్రాహృష్యత భ్రుశం రామో లక్ష్మణ శ్చమహా బలః"

తర్వాతసుగ్రీవుడు వనరక్షక దధిముఖునితో "కార్య సాధకులై వచ్చిన అంగదాదులు మధు వనం లో మధు భక్షణ చేయటం విని సంతోషం కలిగింది నాకు. వారి చిలిపి చేష్టలు క్షమించదగినవే కనుక వారిని క్షమించాను. సీతా దేవిని చూసిన సింహ సదృశ బలపరాక్రమ వీరుడు హనుమను, అతనితో వెళ్ళిన వానర వీరులను చూడాలని, వారు చేసిన ప్రయత్న విషయాలు వినాలని రామసోదరులు, నేను ఆసక్తిగా ఉన్నాం "అన్నాడు. కార్యసిద్ధి తో సంతోషం తో పులకిత గాత్రం తో వికసించిన నేత్రాలతో ఉన్న రామ సోదరులను చూసి వానరరాజు సుగ్రీవుడు సంతోషించి, రామ కార్యసిద్ధి అయిందని మిక్కిలిగా ఆనందించాడు –

"ఇచ్చామి శీఘ్రం హనుమత్ప్రధానాన్ –శాఖా మృగాంస్తాన్ మృగరాజ దర్పాన్ –ద్రష్టుం కృతార్ధాన్ సహ రాఘువాభ్యాం –శ్రోతుం చసీతాధిగమే ప్రయత్నం "

"ప్రీతిస్ఫీతాక్షౌ సంప్ర హృ ష్టౌకుమారౌ –దృష్ట్వా సిద్ధార్ధౌ వానరాణాం చ రాజా అంగైస్సంహృష్టైః-కర్మ సిద్ధిం విదిత్వా –బాహ్వో రాసన్నాం సోతిమాత్రం ననంద"

ఇది 28శ్లోకాల 63వ సర్గ

ఇందులో ఎక్కడికక్కడే అక్కడి ముఖ్య విశేషాలు చెప్పేశాను. దదిముఖుడు చెప్పినది సావధానంగా విన్నాడుకానీ సుగ్రీవుడు, వానర విధ్వంసం తో వనరక్షణకు వారు పడిన కష్టం దుఖాన్ని మాటలతో ఉపశమనం కలిగించలేదు.హనుమంతుడు కార్య సిద్ధి చేసివచ్చాడు కనుకనే అంత విలయంస్సృష్టించారు వానరులు అని అర్ధం చేసుకొన్నాడు. వారినీ పల్లెత్తు మాట కూడా అనలేదు. తన "మెజెస్టీ" ప్రదర్శించాడు. వారు సాధించిన మహా కార్యం ముందు తెనేతాగటం, వనం పాడు చేయటం, కాపలా వారిని కొట్టటం వగైరా చాలా అత్యల్ప విషయాలని భావించాడు. అందుకే దధి ముఖుని సమక్షంలోనే వానరులందర్నీ పొగిడాడు. వాడు మళ్ళీ అక్కడికి వెళ్లి ఏదో గిల్లికజ్జా పెట్టుకోకుండా. అందర్నీ క్షమించాను అనీ చెప్పాడు రాజే ఆ మాట అన్నప్పుడు "కోన్కిస్కా" కాపలాదారు ఏం మాట్లాడుతాడు ?గమ్మున ఉండిపోవటం తప్ప.

సుగ్రీవాజ్ఞ శిరసా వహించి,సంతోషం తో దదిముఖుడు, ఆయనకు, రామసోదరులకు నమస్కరించి, తనబృందంతో ఆకాశానికి ఎగిరి, మధువనం ప్రవేశించాడు. అప్పుడు "వానరగురువుల "మత్తు అంతా దిగిపోయి, మర్యాదగా లేచి నిలబడ్డారు. దధి కూడా వారందరికీ అంజలి ఘటించి అంగదునితో "సౌమ్యుడా ! ఈ వనరక్షకులు మిమ్మల్ని వారించారని కోపం వద్దు అజ్ఞా, తో వారు చేసిన పని అది. నువ్వు యువరాజువు కనుక మధువనానికి అధిపతివి. అజ్ఞానం తో చేసిన అపచారానికి క్షమించు. మీ పినతండ్రి దగ్గరకు వెళ్లి, మీరంతా మధువనానికి వచ్చారని చెప్పాను. ఆయన, అక్కడి మిగిలినవారు మీరిక్కడికి రావటం, వనభంగం చేయటం విని సంతోషించాడే కాని కోపించలేదు. వెంటనే మిమ్మల్నందర్నీతనదగ్గరకు పంపమని నాకు చెప్పాడు "అని చెప్పాడు –దదిముఖుడుకూడా రాజాజ్ఞకు బద్ధుడై జరిగిన దానిలో వానరుల తప్పేమీలేదని" సర్టిఫికేట్ "ఇవ్వటమే కాక వనపాలురు వారి యెడల ప్రవర్తించిన తీరు అజ్ఞానం మాత్రమె అని క్షమించమనీ కోరటం రాజాజ్ఞను సంపూర్తిగా నెరవేర్చటం లో భాగమే. సుగ్రీవుడు వారందర్నీ క్షమించాడనే చల్లని వార్తకూడా తెలియ జేశాడు తనకర్తవ్యంగా.

"స తా సుసాగమ ద్వీరోబద్ధ్యాకరపుటాంజలిం ఉవాచ వచనం శ్లక్ష్ణమిదం హృష్టవ దంగదం"

"సౌమ్య రోషో న కర్తవ్యో యదేతి రభివారితః-అజ్ఞానా ద్రక్షభిః క్రోధాద్బవంతః ప్రతి షేదితాః"

"యువ రా త్వమీశశ్చ వనస్యాస్య మహాబలః –మౌర్ఖ్యా త్పూర్వం కృతో దోషస్తం భవాన్ క్షంతు మర్హసి "

"ఆఖ్యాతం హి మయా గత్వా పిత్రుప్యస్య తవానఘః-ఇహోపయాతం సర్వేషా మేతేషాం వనచారిణం"

"త త్వదాగమనం శ్రుత్వా సహైభి ర్హరి యూథపైః-ప్రహృష్టో సౌ వనం శ్రుత్వా ప్రధర్షితం "

"ప్ర హృష్టో మాం పిత్రువ్యస్తేసుగ్రీవో వానరేశ్వరః –శీఘ్రం ప్రేషయ సర్వాం స్తానితి హోవాచ పార్థివః"

ఈ శ్లోకాలలో హృష్ట, ప్రహృష్ట శబ్దాలు పునరావృత్తం అయేట్లు మహర్షి రాశాడు. ప్రకృష్టమైన హర్షం అందరూ పొందారని "సూపర్లేటివ్ డిగ్రీ "ఉపయోగించి చెప్పటం సీతాదేవిని చూసిన వార్తకు కలిగిన మహోత్కృ ష్ట ఆనందాను భూతి అన్నమాట..

దదిముఖుని మాటలు విని అంగదుడు వానరులతో "రాముడు ఈ వృత్తాంతం వినే ఉంటాడని అనుమానంగా ఉంది. కనుక శత్రుతాపక వానర మహా శయులారా,కార్యం సాధించాక ఇక ఆలస్యం చేయటం తగదు మా బాబాయ్ సుగ్రీవుడి దగ్గరకే అందరం వెళ్ళటమే మిగిలింది. మీ రంతా ఎలా చెబితే అలా చేద్దాం. కర్తవ్య విషయం లో నేను మీకు పరాదీనుడనే. యువరాజునైనా, మిమ్మాజ్ఞాపించే సమర్ధత లేదు. కార్య సాధకులైన మీకు నేను అనాదరం చేయటం తగని పని "అన్నాడు.బాధ్యత తాను తీసుకోకుండా సమష్టి నిర్ణయం చేయమని దానికి తానూ బద్ధుడనే ననీ "యువర్స్ మోస్ట్ ఒబీడిఎంట్"లాగా "ప్రజాస్వామ్య పాలకుడు "లా చెప్పాడు –ఇప్పుడుమనల్ని ఎలుతున్నాదినాయకులకు ఈ ఆలోచనే ఉంటే మూడుపూలు ఆరుకాయల్లాగా వర్ధిల్లధా.వానర రాజుకున్న ఇంగితం కూడా మనల్ని యేలుతున్న మహా ప్రభువులకు లేకపోవటం సిగ్గుచేటు. అక్కడ రాజరిక వ్యవస్తలో ప్రజాస్వామ్యం పూసింది. ఇక్కడమనకు ప్రజాస్వామ్యంలో ఆటవికత, మొనార్కీ వేరి తలలు వేస్తోంది. "వాట్ ఎ పిటీ మై కంట్రీ మెన్ ?

"శంకే శ్రుతోయం వృత్తాంతో రామేణ హరియూథ పాః-తత్ క్షమం నేహ నః స్థాతుం కృతే కార్యే పరంతపాః"

"కిం శేషం గమనం తత్ర సుగ్రీవో యత్ర మే గురుః"

"సర్వే యథా మాం వక్ష్యంతి సమేత్య హరియూథపాః-తథాస్మి కర్తా కర్తవ్యే భఃవద్భి పరవా నహం "

అంగదుడు వానరులను చాలా సాభిప్రాయంగా హరియూథపాపరంతపాఅని వారి శౌర్య పరాక్రమ విక్రమాలకు తగినట్లు సంబోధించాడు. పరంతపుడు అంటే శత్రు సంహారకుడు, అనీ సూర్యుడు అనీ అర్ధాలున్నాయి. వారు శత్రు సంహారకులైన పరాక్రమ శౌర్య సూర్యులని అతని భావం.

యువరాజు వచనాలకు ప్రీతి చెంది అందరూ ఏకగ్రీవంగా "యువరాజా !ప్రభువు అయి కూడా ఇంత వినయంగా ఎవరు మాట్లాడుతారు ?అధికార మదం తో మత్తిల్లి ప్రతివాడూ అహంకారి అవుతాడు. నీ పలుకులు నీస్వభావ, యోగ్యతలను తెలియ జేస్తున్నాయి. ఇంకోడు ఎవడూ ఇలా మాట్లాడడు.నీ వినయం, నీకు రాబోయే శుభానికి సూచనగా, యోగ్యతగా ఉన్నది. మేమేంతా మనరాజు సుగ్రీవుని దగ్గరకు వెళ్ళే అవకాశం కోసమే నిరీక్షిస్తునాం.అయినా నీ ఆజ్ఞ లేకుండా అడుగుకూడా ముందుకు వేయ లేని "అశక్తులం". ఇది ముమ్మాటికీ నిజం. "అనగానే "సరే అలాగే వెడదాం"అన్నాడు అంగద యువరాజు. ఇక్కడ అంగదుని సౌశీల్య వినయ గుణాలు ప్రస్ఫుటంగా గోచరించటమేకాక, పెద్దల యెడ ఉన్న గౌరవభావాన్నీ,ప్రజాస్వామ్య విలువను తెలియ ఇస్తోంది. వానరులుకూడా తక్కువ వాళ్ళేమీ కాదు –ఆయనకూ "ధూపం "బాగానే వేశారు. రాజుతో పని కదా-క్షణక్షణ చిత్తులు రాజులు. ఎప్పుడు ఆగ్రహం చూపిస్తారో యెప్పుదుఅనాదరణ చూపుతారో చెప్పలేం. అందుకే చాలా ఆలోచించి వీళ్ళుకూడా తమమీద భారం, నెపం వేసుకోకుండా చాకచక్యంగా నే సమాధానమిచ్చారు. ముందడుగు వేయాలని ఉన్నా,రాజాజ్ఞను కాదని కదలలేని "అశక్తులం"అని సాభిప్రాయంగా అన్నారు. అంగదుని మాటలు అతనికి భావి రామరావణ యుద్ధం లో రామవిజయాన్ని సూచించటమే కాక కిష్కింధకు తిరుగులేని యౌవ్వరాజ్య పట్టాభి షేక శుభవార్త కూడా ఇందులో ఊహించి అన్నారు. అతడు యువరాజు అయినా ఆశక్తుడను అంటే, వీరు మహాబలశాలురు కార్యసాధకులు అయినా "అశక్తులం "అని వినయంవిజ్నత చూపారు.. అందరూ ఎవరి పరిధి మేరకు వారు చక్కగా ప్రవర్తించారు అందరిదీ ఔచిత్యమైన పలుకులే. సాభిప్రాయమైన సంబోధనలే చేశారుకూడా.

."ఏవం వక్ష్యతి కో రాజన్ ప్రభుస్సన్ వానరర్షభ –ఐశ్వర్య మదమత్తో హి సర్వో హమితి మన్యతే "తవ చేదం సుసదృశం వాక్యం నాన్యస్య కస్య చిత్ –సన్నతి ర్హితవాఖ్యాతి"భవిష్య చ్చుభ యోగ్యతాం "

"సర్వే వయమపి పాప్తా స్తత్ర గంతుం కృతక్షణాః-స యాత్ర హరి వీరాణాం సుగ్రీవః పతి రవ్యయః"

'త్వయ హన్యుక్తై ర్హరిభి"ర్నైవ శక్యం పదా త్వదం—క్వచిద్గంతుం హరి శ్రేష్ట బ్రూమస్సత్య మిదం తు తే "

అంగదునినితో సహ అనదరూ ఆకాశానికి యెగిరి, యంత్రాలతో ఎగర గొట్టబడిన కొండల్లాగాఅంటే ఫిరంగుల్లోన్చిదూసుకు వెళ్ళిన "తూటాలు"లాగా ఆకాశం లో ఏ మాత్రం ఖాళీ లేకుండా ఆక్రమించి,సంతోషంతో అరుస్తూ కేకలు వేస్తూ వెళ్ళారు. శోకంతో కనుల నీరునిండిఉన్న రామునితో సుగ్రీవుడు "రామా !కొంచెం తమాయించుకో. సీతాదేవి కనబడింది కార్య సాధన లేకుండా వానరులు ఆలస్యంగా రారు. యువరాజు అంగదుడు కార్యం చెడితే, నా దగ్గరకు రానే రాడు.కార్యఫల సిద్ధి లేకుండా వస్తే మధువన భంజనం చేయడు.దీనం గా కలవరంగా ఉంటాడు. సీతను చూడకపోతే తరతరాల మా వనాన్ని పాడు చేయడు.సీత క్షేమం తెలిసింది. నువ్వు కుశలంగా ఉన్నందున మీ తల్లి కౌసల్య సత్సంతానవతి అయింది. శోకం వదిలి ఊరడిల్లు. హనుమ సీతా దేవి దర్శనం చేశాడు అనటం లో సందేహం లేదు అతడు తప్ప అంతఘనకార్యం సాధించేవారులేరు. సూర్యునిలోని తేజస్సులాగా హనుమలో సిద్ధి, మతి, పట్టుదల, పరాక్రమం ఉన్నాయనటం నిశ్చయం. జాంబవంతుడు నాయకుడుగా, అంగదుడు సేనాపతిగా, హనుమ సహాయకుడుగా ఉంటె చేబట్టినపని విజయవంతమే అవుతుంది "అని దుఖం పోగొట్టే మాటలు ధైర్య వచనాలు సీతా సందర్శన శుభవార్త చేవిన వేశాడు మిత్ర సుగ్రీవ. హనుమపై ఉన్న అపారమైన నమ్మకం. "జాంబవంత హనుమంత అంగద త్రయం "సాదింప రానిది లేదని "సర్టిఫికేట్ "ఇచ్చాడు. అంగదుడి లక్షణాలు తెలిసినవాడుకనుక అతడూ కార్యసాధన కాకుండా తన ఎదుటకు రాడనీ చెప్పాడు. 'అన్నీ మంచి శకునములే సీతా దర్శన "శుభ వార్తలే "అన్నట్లు మాట్లాడాడు –

"కౌసల్య సుప్రజా రామా సమాశ్వసి హిసువ్రత –దృష్టా దేవీ న సందేహో న "చాన్యన్యేన హనూమతా-

"హనూ మతి హిసిద్ధి శ్చమతిశ్చమతి సత్తమ –వ్యవసాయ శ్చవీర్యం చ సూర్యేతేజ ఇవధ్రువం"

"జామ్బవాన్యత్ర నేతాస్యా దంగదశ్చ బలేశ్వరః –హనూమాం శ్చాప్యధిష్టితా న తస్య గతి రన్యథా"

ఇంతలో ఆకాశం లో కిలకిల శబ్దాలు ఆనందోత్సవ కేరింతలు దగ్గరగా వినిపించాయి. వానరుల ఆ "ఆనంద రవళికి "సుగ్రీవుడు తనతోక పెంచి తలపై మాలలాగా చేసుకొని మహా సంతోష పడ్డాడు. ఆయనకు పట్టరాని సంతోషం వస్తే ఇలా చేస్తాడని వాల్మీకి శ్లోకం లో బొమ్మ గీసి చూపించాడు

"తతః శ్రుత్వా నినాదం తమ్ కపీంకపి సత్తమః –"ఆయతాంచితలాంగూల"స్సోభవ ద్హృష్టమానసః "

అంగద,హనుమంతులను ముందుపెట్టుకొని వానరులు రాముని చూడాలనే ఉత్సాహంతో ముందుకు వచ్చారు. ఆనంద పులకితగాత్రులై, వారంతా రామ సుగ్రీవుల చెంతకు చేరారు. మహాభుజ హనుమ శిరసువంచి రామపాదాలకు నమస్కరించాడు "సీతాదేవి పాతివ్రత్యమహిమతో క్షేమంగా ఉన్నది "అని రామునికి విన్నవించాడు –

"హనూ మాం శ్చమహా బాహుః ప్రణమ్య శిరసా తతః –"నియతా మక్షతాం దేవీం రాఘవాయ న్యవేదయత్ "

హనుమ కార్యసాధకుడై తిరిగి వచ్చాడని సుగ్రీవుడు లక్ష్మణుడు కూడా నిశ్చయించి. సంతోషంతో హనుమను ఆదరంగా చూశారు..అప్పుడు శత్రు సంహార రామ గొప్ప ఆదరం తో హనుమంతుని చూశాడు. రాముడికి శత్రు సంహార శబ్దం ఇక్కడ చాలా ఔచిత్యంగా ప్రయోగించాడు మహర్షి వాల్మీకి. ఇక మిగిలిన కార్యం శత్రు సంహారమే అని తెలియ జేయటానికి.

"నిశ్చితార్ధ స్తతస్తస్మిన్ సుగ్రీవం పవనాత్మజే –లక్ష్మణఃప్రీతిమాన్ ప్రీతం బహుమానా దవైక్షత"

"ప్రీత్యా చ రమమాణోథ రాఘవః పరవీరహా –బహుమానేన మహతా హనుమంత మవైక్షత "

సుగ్రీవ రామ లక్ష్మణుల ఆదరపు చూపులే ప్రస్తుతానికి హన్మకు బహుమతులు. అంతకంటే ఆయనకు ఏమీ అక్కర్లేని నిమిత్తమాత్రుడు. అప్పగించిన కార్యం అనుకొన్నసమయంలో విజయవంతంగా నిర్వహించి, వాడి పోయిన హృదయాలకు సంతోషపు వసంతాన్ని పంచిపెట్టాడు. అందరూ హనుమ గొప్పతనాన్ని బహువిధాలుగా మెచ్చారు. ఇలా "మిషన్ హనుమ " గ్రాండ్ సక్సెస్ " అయింది. అందరికీ ఊరట లభించింది.

"ఇది39 శ్లోకాల 64వ సర్గ.

వానరులంతా అంగదుని ముందు పెట్టుకొని చిత్రమైన అడవులున్న "ప్రస్రవణ గిరి "కి వెళ్లి, రామలక్ష్మణ సుగ్రీవులకు నమస్కరించి సీతా వృత్తాంతం చెప్పటం మొదలెట్టారు. రావణుడుఅంతపురం లో సీత బంధింపబడినట్లు, రాక్షసస్త్రీలు ఆమెను భయపెడుతున్నట్లు, రామునిపై ఆమెకున్న అవ్యాజ అనురాగం, రాక్షసరాజు ఇచ్చిన రెండు నెలల గడువు విషయం హనుమమనుంచి తాము విన్నది చెప్పారు. సీతా దేవి క్షేమం అని తెలిసి రాముడు "సీత ఎక్కడ ఉంది ?నాపై ఆమె అభిప్రాయమేమిటి ?సీత గురించి అన్ని విషయాలు చెప్పండి "అనగా వారంతా హనుమవైపు చూసి ఆయననే చెప్పమన్నారు –

"క్వ సీతా వర్తతే దేవీ కథం చమయివర్తతే –ఏతస్మే సర్వ మాఖ్యాత వైదీహిం ప్రతివానరాః"

వానరుల సాభిప్రాయం గ్రహించి, ప్రాజ్ఞ హనుమ దక్షిణ దిశకు తిరిగి, సీతాదేవికి మొక్కి, రాముడితో "నేను నూరు యోజనాల వొడవైన సముద్రం దాటి, సీతా దేవిని వెతుకుతూ, దక్షిణ తీరం లో దురాత్మరావణపాలిత లంకానగరం వెళ్లి,అతడి అంతపురం లో నీమీదే మనసంతాలగ్నం చేసి, జీవిస్తున్న సీతాదేవిని చూశాను. ప్రమదావనం లో రక్కసి వనితలామెను కావలి కాస్తున్నారు. వారు మాటిమాటికీ భయపెడుతున్నారు. ఆమె సుఖం అనుభవించటానికి పుట్టింది, కాని దురంత దుఖం అనుభవిస్తోంది. ఒంటి జడతో దీనురాల్లై,నిన్నే తలుస్తూ అక్కడ బందీగా ఉంది. నేలపైనే నిద్రిస్తోంది. హేమంత తామర తీగలాగా ఆమె శరీరం కాంతి విహీనంగా ఉంది. రావణునిపై వైముఖ్యం తో చావటానికి నిశ్చయించిన ఆమెను ఎలాగో వెతికి కనుగొన్నాను. నేను ఇక్ష్వాకు వంశ కీర్తి ని మెల్లగా ప్రస్తుతించి, ఆమెకు నాపై విశ్వాసం కలిగేట్లు చేయగలిగాను.

" దుఃఖ మాసాద్యతే దేవీ తథాదుఖోచితా సతీ "

రావణాంతః పురే రుద్ధారాక్షసీభిస్సురక్షితా –ఏక వేణీధరా దీనా త్వయి చింతాపరాయణా"

"అథ శ్శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగతే-రావణా ద్విని వృత్తార్థా మర్తవ్యకృత నిశ్చయా "

"ఇక్ష్వాకు వంశ విఖ్యాతిం శనైః కీర్తి యతా నఘు –సా మయా నర శార్దూల విశ్వాస ముపసాదితా "

నాపై విశ్వాసం కలిగి సీతాదేవి నాతో మాట్లాడింది.నీ పరిస్థిని కూడా సాకల్యంగా ఆమెకు తెలియజేశాను. రామ సుగ్రీవ మైత్రివిని చాలాసంతోషించింది, నీపై అచంచల ప్రేమ భక్తీ తో ఆమె ఉంది. నిరాహారంగా నీకోసం భయంకరతపస్సు చేస్తోంది !చిత్రకూటం లో జరిగిన కాకాసుర వృత్తాంతం జ్ఞాపకం చేయమన్నది. ఆమె స్వయంగానాకు "అక్కడ నువ్వు ఏం చూశావో అక్షరం పొల్లుపోకుండా సుగ్రీవుడు కూడా వింటుండగా రాముడికి నివేదించు, నేను ఇప్పటిదాకా చాలాజాగ్రత్తగా దాచుకొన్న చూడామణిని నా రాముడికివ్వు.శ్రీమంతమైన ఈ చూడామణిని నేను ఎంతో శ్రద్ధగా కాపాడుకొన్నాను. పూర్వం ఒక సారి నా నుదుటి బొట్టు కరిగి నీకు కనిపిస్తే, నువ్వు మణి శిల నా నుదుట బొట్టుగా ప్రతిఫలిం చేట్లు న నుదుట గుండ్రాతిపై ఉంచావు దాన్ని ఒక్కసారి స్మరించు. అనర్ఘ రాఘవా !సముద్రం లో పుట్టిన శ్రీమంతమైన చూడామణి నీ కోసం పంపాను. నేను ఇప్పటివరకు దుఖం లో దీన్ని చూసుకొంటూ నిన్ను చూసినంత ఆనందాన్ని అనుభవిస్తున్నాను. దాశరథ రామా !ఇంకా ఒక్కనెల మాత్రమే బతికి ఉంటాను. ఆతర్వాత ఈ రాక్షసులకు వశమై జీవించనే జీవించను "అని కృశాంగి ధర్మచారిణి సీత రావణ బందీయై నాతో చెప్పింది. రామా !ఆమె చెప్పింది అంతా ఆమె మాటలతోనే నీకు విన్నవించాను. ఇంకా ఆలస్యం చేయకుండా సముద్ర లంఘనం విషయం ఆలోచించు "అని హనుమ సవివరంగా తెలిపాడు. తనమాటలు విని రామ సోదరులు ఊరట పొందారని గ్రహించి, సీతాదేవి ఇచ్చిన చూడామణి ని రామునికి అందజేసి, ఆమె చెప్పిందంతా సవిస్తరంగా చెప్పాడు హనుమ.

"రామ సుగ్రీవ సఖ్యం చ శ్రుత్వా ప్రీతిముపాగమా "

"నియతస్సముదాచారో భక్తిశ్చాస్యాస్తథా త్వయి –ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ "అభిజ్ఞానం చ మే దత్తం యథా వృత్తంతవాన్తికే –చిత్ర కూటే మహాప్రాజ్ఞ వాయసం ప్రతి రాఘువ "అయం చాస్మైప్రదాతవ్యో యత్నాత్ సుపరిరక్షితః-బ్రువతా వచనా న్యేవం సుగ్రీవ స్యోప శృణ్వతః-ఏష చూడామణిః శ్రీమాన్ మయా సుపరిరక్షితః"

"మన శ్శిలా యా స్తిలకో గండ పార్శ్వే నివేశితః –త్వయా ప్రణష్టే తిలకే త్వంకిల స్మర్తు మర్హసి "

"ఏష నిర్యా తితః శ్రీమాన్ మయాతే వారి సంభవః –ఏతం దృష్ట్వాప్రమోదిష్య వ్యసనే త్వామివానఘ "

"జీవితం ధార యిష్యామి మాసం దశరథాత్మజ –ఊర్ధ్వం మాసా న్న జీవేయం రాక్షసా వశ మాగతా"

"సర్వధా సాగర జలే సంతారః ప్రవిధీయతాం"

"తౌజాతా శ్వాసౌ రాజపుత్రౌ విదిత్వా –తచ్చాభిజ్ఞానం రాఘవాయ ప్రదాయ – దేవ్యా చాఖ్యాతాం సర్వమే వాను పూర్వ్యాత్ –వాచా సంపూర్ణం యాయుపుత్రః శశంస"

ఇది 28 శ్లోకాల 65 వ సర్గ.

హనుమ లంక విశేషాలన్నీ చాలాసంక్షిప్త వివరంగా రాముడికి సుగ్రీవ సముఖంలోనే సీత కోరినట్లు తెలిపాడు. "చూడామణి, మణి శ్శిలాఫలకం విషయాలు నెలకంటే ఎక్కువకాలం బ్రతకని విషయమ సీత చెప్పినట్లే డైరెక్ట్ స్పీచ్ తో హనుమ తెలియ జేసి రాముడికి సీత చెబుతున్న అనుభూతి కలిగించి గోప్పఎఫెక్ట్ తెచ్చాడు. తక్షణ కర్తవ్య పరాయణుడిని చేయటానికిది బాగా తోడ్పడింది., చూడామణి మహాత్మ్యం చాలాగొప్పదని దాన్ని తాను ఇంతవరకు ప్రాణప్రదంగా తన పవిత్ర శీలంతో పాటు కాపడుకొన్నది సీత. అన్దుకెఆ విషయాన్ని నొక్కి వక్కాణించింది.దీనితోనైనా రాముడిలో చలనం కలుగుతుందని, తనకు మోక్షం కలుగుతుందని ఆశించింది. ఆమె కోరినట్లే రామసోదరసుగ్రీవ సమక్షం లో అంద జేసి,దూత కార్యాన్ని అత్యంత సఫలం చేశాడు. సీత తనతో చెప్పిన కాకికథ తో సహా, మిగిలినదంతా హనుమ తాను తనకళ్ళతో చూసిన సర్వవిషయాలు రామాదులకు చెప్పాడు తక్షణ కర్తవ్యం సముద్రం దాటటం ఎట్లాగో ఆలోచించమని త్వర పెట్టాడు. ఇక తాను చేయవలసిందేమీ లేదు. రామసోదరులు, వానరరాజు సుగ్రీవుడి చేతుల్లోనే ఇక మిగిలింది అంతా ఉన్నది. ఇప్పటిదాకా హనుమ సఫల పవిత్ర రామకార్య దూత. ఇక తాను కేవలం వారి బంటు. వారేమి ఆలోచించి నిర్ణయిస్తే దాన్ని తూచా పాటిస్తాడు. కానీ సీతను లంక చెర విడిపించి రావణ సంహారం చేసి నెలలోపలె లంకనుంచి రాముడు తీసుకు రావాలి తప్పదు. ఇదే ఇప్పుడు అందరి తక్షణ కర్తవ్యమ్.

హనుమ ద్వారా సీత పంపిన చూడామణిని హృదయానికి హత్తుకొని రాముడు విపరీతంగా దుఃఖించాడు. కన్నులనిండా నీరు గ్రమ్మిన రాముడు సుగ్రీవునీతో "దూడ పై వాత్సల్యం గల ఆవు దాన్ని చూడగానే పాలను కార్చినట్లు, ఈ మణి రత్నాన్ని చూడగానే నా హృదయం ద్రవిస్తోంది. మా వివాహ సమయంలో మామామగారు జనకమహారాజు దీన్ని సీతకిచ్చాడు. దాన్ని ఆమె తన శరీర శోభ పెరిగేట్లు చక్కగా అలంకరించు కొన్నది. -

"యథైవ దేనుః స్రవతి స్నేహా ద్వత్సస్యవత్సలా –తథా మమాపి హృదయం మణిరత్నస్య దర్శనాత్ "

"మణిరత్నమిదం దత్తం వైదేహ్యాఃశ్వశురేణ మే –వధూ కాలే యథా బద్ధ మధికం మూర్ధ్ని శోభతే "

"ఈ మణి సముద్రాన పుట్టింది. సజ్జన పూజితమైనది. జనకుని యజ్ఞానికి సంతోషించి దేవేంద్రుడు ఇచ్చిన కానుక. శ్రేష్ట హనుమంతా !ఈ మణిని చూసి మా తండ్రి దశరథుని,మామామగారు విదేహ దేశాదిపతిని చూసినట్లైంది.ఈ మణి నా సీత శిరసుపై బాగా శోభిల్లింది. ఇవాళ ఆ మణిని చూడగానే ఆమెను సంపాదించి నట్లైంది.

"అయం హి జల సంభూతోమణిస్సజ్జనపూజితః –యజ్ఞే పరమ తుష్టేన దత్త శ్శక్రేణ ధీమతా –ఇమాం దృష్ట్వామణి శ్రేష్ఠం యథా తాతస్య దర్శనం –అద్యాస్మ్యవగత స్సౌమ్య వైదేహస్య తథా విభో "

"అయం హి శోభతే తస్యాః-ప్రియాయా మూర్ధ్ని మే మణిః-అస్యాద్యదర్శనే నాహం –ప్రాప్తాంతామివ చింతయే"

హనుమా !వైదేహి ఏమి చెప్పిందో ఆ మాటలను మళ్ళీ మళ్ళీ చెప్పి దప్పిక గొన్న వాడికి నీటితో సంతృప్తి చెందించినట్లు చెప్పి ఆ మాటల నీటితోనాకు సంతృప్తి కలిగించు. లక్ష్మణా !సముద్రం లో పుట్టిన మణిని చూశానుకానీ, సీత రావటం మాత్రం చూడ లేకపోయాను ఇంతకంటే నాకు దుఖం ఏముంటుంది ?"

"కిమాహ సీతా వైదేహీ బ్రూహి సౌమ్య పునఃపునః –పిపాసు మివ తోయేన సించంతీ వాక్య వారిణః"

ఇతస్తు కిం దుఖతరం యదిమం వారి సంభవం –మణిం పశ్యామి సౌమిత్రే వైదేహీ మాగతాం వినా "



సీత ఇంకొక్క నెల బతికి ఉంటె చాలు, కలకాలం జీవించినట్లే. ఆనల్లకలువల కనుల సీత లేకుండా ఒక్క క్షణం కూడా బతకలేను. సీతను ఎక్కడ చూశావో అక్కడకు నన్ను తీసుకొనిపో. ఆమె క్షేమవార్త తెలిసిందికనుక ఇక ఒక్క క్షణం కూడా నిలవలేను హనుమా. రాక్షసులమధ్య బెదురూ దైన్యం భయంతో ఆమె ఎలా ఉండగలుగు తోందో ?-

““చిరం జీవతి వైదేహీ యది మాసం’ధరిష్యతి “-క్షణం సౌమ్య న జీవేయం వినా తా సీతేక్షణాం “

“నయ మామపి తమ్ దేశం యాత్ర దృష్టామమప్రియా –న తిష్టేయం క్షణమపి ప్రవృత్తి ముపలభ్యచ “

“కథం సా మమసుశ్రోణీభీరుభీరు స్వతీ సదా –భయావహానాం ఘోరాణాంమధ్యేతిష్టతిరాక్షసాం”

శరదృతువులో చీకటి లేకుండా వెన్నెల కాసేచంద్రుడిని మేఘాలు కమ్మినట్లు, రాక్షస్త్రీలమధ్య ఉన్న సీతముఖానికి సుఖం అనే వెన్నెల లేకుండా పోయింది, హనుమా !సీత ఏయే మాటలు నాకు చెప్పమని నీకు చెప్పిందో ఒక్కమాట కూడా వదిలిపెట్టకుండా నాకు చెప్పు. అప్పుడు ఔషదాలవలన రోగి బతికినట్లు ఆ మాటలతో నేను బతుకుతాను. నన్నుఎడ బాసి ఉన్న సీత ఏమన్నదో సవివరంగా చెప్పు చెప్పు చెప్పు “అని దుఃఖ వివశుడయ్యాడు రామయ తండ్రి.

“శారద స్తిమిరోన్ముక్తోనూనం చంద్ర ఇవాంబుద్యైః-ఆ వృతం వదనం తస్యా న విరాజతి రాక్ష సైః”



"కిమాహ సీతా హనుమం స్తత్వతః కథ యాద్య మే – ఏతేన ఖలు జీవిష్యే భేషజే నాతురో యథా"

"మధురా మధురాలాపా కిమాహ మమ భామినీ – మద్విహీనా వరారోహా హనుమన్ కథ యస్వ మే"

ఇది 15శ్లోకాల 66వ సర్గ.

దుఃఖ వివశత్వంతో రాముడు పిచ్చివాడై ఉన్మత్త రాఘవుడిగా మాట్లాడాడు. ఇదంతా చూడా మణిమహాత్మ్యం. దాన్ని చూడగానే పాతగాథలన్నీ తవ్వి తీశాడు తన తండ్రి, మామ గుర్తుకొచ్చారు. సీత జ్ఞాపకం వచ్చి ఆమె దాన్ని అలంక రించు కొనికోతన అందాన్ని ఎలా పెంచుకున్నదో మనకు హనుమద్వారాతెలిపాడు. మణి ఉత్కృష్టతను సీత ద్వారా మనం విన్నదే. ఇక్కడ తమ వివాహ సమయం లో ఆమె తండ్రి ఇచ్చిన కానుక గా గుర్తు చేశాడు చేసిన యజ్ఞానికి సంతృప్తి చెంది ఇంద్రుడు ప్రసాదించిన అమూల్య మణి అది. సజ్జనుల చేత పూజింప బడిందని చెప్పి దాని గౌరవాన్ని మరింత పెంచాడు. దూడను చూడగానే సంతోషంతో ఆవు పాలను చెపినట్లు, శరత్ చంద్రుని మేఘం కప్పిట్లు వెన్నెల మసకబారటం, రోగికి ఔషధాలతో రోగం తగ్గటం మంచి ఉపమానాలు. మణిలో సీత దర్శనం చేశాడు రాముడు. కనుక ఇక ఆగలేకపోయాడు. ప్రతిబింబంతో లేక ఫోటోతో సంతృప్తి ఉండదు. అసలు విషయం చూస్తేనే పరమ తృప్తి. అది సీతను తాను స్వయంగా చూస్తేనే కలుగుతుంది. ఇక ఆగలేడు. అందుకే హనుమను సీత ఉన్న చోటుకు తీసుకొని పొమ్మని త్వర పెట్టాడు. ఆమె ఇంకో నెల బతికుంటే చాలు శాశ్వతం గా జీవించేట్లు తాను చేయగలను అనే ధీమాను చెప్పకనే చెప్పాడు. అంటే ఇక ఆలస్యం చేయకుండా లంకకు వెళ్లి రావణ సంహారం చేసి సీతను దక్కించు కొంటాడు అన్న భావం వ్యక్తమౌతోంది.

దేనికైనా దోహదం ఒకటి ఉండాలి. రామునికి ఇక సీత పలికిన మాటలే దోహదం అన్నమాట. కనుకనే హనుమను ఆమె పలికిన ప్రతిమాటా తనకు తెలియజేయమన్నాడు. అవి కేటలిస్ట్ ల్లాగా అంటే ఉత్ప్రేరకాల్లాగా వాటిని మరింత వేగవంతం చేసే ప్రమోటర్స్ లాగా పని చేస్తాయి అన్నమాట. అప్పుడే రియాక్షన్ అత్యంత వేగంగా జరుగుతుంది. రావణ సంహారం అనే రసాయన ప్రక్రియ వేగవంతం చేయటానికి సీత పలుకులు కేటలిస్ట్ ల్లాగా ఆమె దుఖం బాధ దీనత్వాలు ప్రమోటర్లులాగా సహకరిస్తాయని రాముడి మనోభావం. దివ్యమణి దర్శనం దివ్య ప్రభావాన్నే అత్యంత శీఘ్రంగా కలిగిస్తుంది. అందుకే రాముడి తహతహ.

రామ వాక్యాలు విన్న హనుమ ఆయన హృదయ వేదన అర్ధం చేసుకొని లంక లోని సీతా దేవి వృత్తాంతన్ని ఆమె తనకు చెప్పిన సందేశంలోని మాటలను వివరించి చెబుతున్నాడు –పురుష శ్రేష్ఠ రామా !సీతమ్మ చిత్ర కూటం లో జరిగిన సంగతి అంతా ఇలా చెప్పిందివిను చిత్రకూటం లో ఆమెఒకరోజు నీ దగ్గర సుఖంగా నిద్రించి ముందుగా మేల్కొనగా ఒకకాకి అకస్మాత్తుగా వచ్చి ఆమె స్తనం పై గీరింది. తర్వాత నువ్వు ఆమె ఒడిలో తలపెట్టుకొని నిద్రించి నప్పుడు ఆ కాకి మళ్ళీ వచ్చి ఆమెను బాధించింది. అది ఆతర్వాత మాటిమాటికీ వచ్చి ఆమె స్తన ప్రదేశాన్ని ముక్కుతో పొడవగా గాయమై, రక్తం స్రవించి నీ శరీరం తడిస్తే, నిద్ర లేచావు. ఆమె గాయాన్ని చూసి కోపించిన సర్పం లాగా ఆమెతో "పిరికి దానా !నీ స్తనాన్ని గోళ్ళతో గీరిందెవరు?కోపించిన పంచముఖ సర్పం తో చెలగాటమాడింది ఎవరు ?"అంటూ నాలుగు వైపులాచూసి, వాడిగా ఉన్న రక్త సిక్తమైన గోళ్ళ తో ఆమెకు ఎదురుగా ఉన్న కాకినిచూశావు పక్షిశ్రేష్టమైన ఆ కాకి దేవేంద్రుడి కొడుకట.వాడు భూమ్మీద వాయు వేగంతో సంచరించగలవాడట.అప్పుడు నువ్వు కోపపు యెర్రని కనులతో, ఆ కాకిపై క్రూరమైన ఆలోచన చేసి, దర్భాసనం నుంచి ఒక దర్భను తీసి బ్రహ్మాస్త్ర మంత్రంతో అభి మంత్రించి వదిలితే అది మండుతున్న ప్రళయాగ్ని లాగా దానివైపు వెళ్లి కాకిని వెంటాడింది. కాకిని కాపాడలేక వాడి తండ్రి ఇంద్రుడు, దేవతలు మహర్షులు దాన్ని రక్షించలేక వాడి ఖర్మకి వాడిని వదిలేశారు. మూడులోకాలూ తిరిగినా రక్షించేవారు లేక, శత్రుదమనుడ వైనశరణాగతుడవైన నీ దగ్గరకే వచ్చింది,

"కః క్రీడతి సరోషేణ పంచ వక్త్రేణ భోగినా –నిరీక్ష మాణ స్సహసా వాయసం సామపై క్షథాః"

"సుతః కిల స శక్రస్య వాయసః పతతాం వరః –ధరాతరాంచర శీఘ్రం పవనస్య గతౌ సమః "

"తతస్తాస్మిన్ మహా బాహో కోప సమవర్తి తేక్షణః-వయసే త్వం కృథాః క్రూరాంమతిం మతిమతాం వర "

"స దర్భం సంస్తరా ద్గుహ్య బ్రహ్మాస్త్రేణ హ్యయోజయః –స దీప్త ఇవ కాలాగ్ని ర్జ్వాలాభిముఖః ఖగం "

క్షిప్తవాం స్త్వం ప్రదీప్తం హి దర్భం తమ్ వాయసం ప్రతి-తతస్తువాయసం దీప్తః సదర్భోనుజగామ హ"

"స పిత్రాచ పరిత్యక్త స్సురై శ్చ సమహర్షి-త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త్రాతారం నాది గచ్చతి-పునరేవాగత స్త్రస్త" స్త్వకాశ మరిందమ"

భూమిపై నీ పాదాల చెంత పడిన ఆ కాకిని, చంపదగినదే అయినా దాన్ని దయతో కాపాడావు. నువ్వు ప్రయోగించిన అస్త్రం విఫలం కారాదు అని నువ్వు దానికి చెప్పగా, దానికోరికపై దాని కుడి కంటిని దహించావు. బతుకు జీవుడా అనుకొంటూ అది నిన్ను మీ తండ్రినీ ప్రస్తుతించి నమస్కరించి, తనమానాన తాను తననివాసానికి యెగిరి పోయింది –

"స తతం నిపతం భూమౌ శరణ్య శ్శరణా గతం –వధార్హమసి కాకుత్ స్థ కృపయా పర్యపాలయః "మోఘమస్త్రం న శక్యం తు కర్తు మిత్యేవ రాఘవ భవాం స్తస్యాక్షికాకస్య హినస్తి స్మస దక్షిణం "రామా త్వాం నమస్కృత్య రాజ్ఞే దశరథాయచ –విసృ ష్టస్తుతదా కాకః ప్రతి పేదే స్వమాలయం ' రామా !సీతాదేవి ఇంకా "ఇలా అస్త్ర విశారదుడు,శౌర్య ధైర్య పరాక్రమాల రాముడు రాక్షసులపై ఎందుకు అస్త్రాలు ప్రయోగించటం లేదు ?నాగ గంధర్వ యక్ష మరుద్గణాలు కూడా రాముని ముందు యుద్ధం లో నిలువ లేరే ? అలాంటి పరాక్రమశాలి రాముడు రావణుడిపై అస్త్రప్రయోగం చేసియుద్ధం లో చంపాలి.శత్రు తపనుడు, నర శ్రేష్టుడు రఘువంశ మణి దీపం ఐన లక్ష్మణుడు అయినా అన్న అనుమతి తో నన్ను ఎందుకు రక్షించడు ? సమర్ధులైన ఆ రామ సోదరద్వయం అగ్ని వాయు తేజో సంపన్నులు. దేవతలకూ ఎదిరింప అసాధ్యులే, మరి నన్ను ఎందుకు ఉపేక్షిస్తున్నారో నాకు అర్ధం కావటం లేదు. శత్రుసంహార సమర్ధతకల వారిద్దరూ నన్ను దయ చూడకపోవటం అంటే నేనేదో బలమైన పాపం చేశానేమో అనిపిస్తోంది "అని కన్నీరు కారుస్తూ జానకి పలికింది జానకిరామా "అన్నాడు తానూ దుఖిస్తూహనుమ –

ఏవం అస్త్ర విదం శ్రేష్టఃసత్వవాన్ శీలవానపి- కిమర్ధమస్త్రం రక్షస్సు న యోజయతి రాఘవః –"

"క్షిప్రం సునిశితైర్బాణై ర్హన్యతాంయుధి రావణః "

"భ్రాతు రాదేశ మాజ్ఞాయ లక్ష్మణో వా పరంతపః –స కిమర్ధం నరవరో న మాంరక్షతి రాఘవః "

"శక్తౌ తే పురుష వ్యాఘ్రౌ వాయ్వగ్ని సమతేజసౌ-సురాణా మపి దుర్ధర్షౌకిమర్ధం మా ముపేక్షతః"

మమైవ దుష్కృతంకించి న్మహ దస్తి నసంశయః –సమర్ధౌసహితౌ యన్మాంనా పేక్షతేపరంతపౌ"

రామా!వైదేహి అన్న ఆమాటలు విని నాగుండె చేరువై ఆమెకు ఉపశాంతి కలిగించాలని "అమ్మా !రాముడు నీ ఎడబాటు తో దుఖమనస్కుడై ఏపనీ చేయటం లేదు. అన్నను చూసి తమ్ముడూ అలాగే ఉన్నాడు. నేను ఎలాగో నిన్ను చూడగలిగాను. ఇక ఇది దుఖం చాల్సిన సమయం కాదు. ఈ క్షణం లోనే నీ శోకం తొలగటం చూస్తావు. రామ సోదరులు ఇక్కడికి వచ్చి నిన్ను చూసి లంకను భస్మం చేస్తారు. భయంకర క్రూర దుష్ట రావణుడిని,అతని బంధుమిత్ర పరివారాన్నీ పరిమార్చి, నిన్ను అయోధ్యకు తప్పక తీసుకు వెడతాడు. నేను నిన్ను చూసినట్లు నీ గుర్తు ఒకటి నాకు ఇవ్వు. అని అడిగాను ఆమె అన్ని వైపులా చూసి ఎవరూ చూడటం లేదని తెలుసుకొని తన జడకు ఆభరణమైన చూడామణి ని

" కొంగు నుంచి తీసి "నాకు ఇచ్చింది. ఆ అభిజ్ఞానాన్ని తీసుకొని శిరసువంచి నమస్కరించి ఇక్కడికి రావటానికి సన్నాహ పడ్డాను "అన్నాడు రాముడితో హనుమ. -

"త్వ చ్చోక విముఖో రామో దేవి సత్యేన తే శపే –రామే దుఖాభిభూతేతు లక్ష్మణఃపరితప్యతే "

"కథం ఛి ద్భవతీదృష్టా న కాలః పరి శోచితుం –అస్మిన్ముహూర్తే దుఖానా మంతం ద్రక్ష్యసి భామిని "

"తా ఉభౌ నారా శార్దూలౌ రాజపుత్రా వనిందితౌ –త్వద్దర్శన కృతోత్సాహౌ భస్మీకరిష్యతః"

"హత్వా చ సమరే రౌద్రం రావణం సహబాంధవమ్ –రాఘువస్త్వాంవరారోహే స్వాం పురీం నయతేధ్రు వం "

"తస్య రామో విజానీయా దభిజ్ఞాన మనిందితే-ప్రీతి సంజననం తస్య ప్రదాతుం త్వ మిహార్హసి "

"సా భి వేక్ష్య దిశ స్సర్వా వేణ్యుగ్రథితముత్తమం –ముక్త్వా వస్త్రా ద్దదౌమహ్యం మణి మేతం మహాబల ".

రామా !ఇక్కడికి త్వరగా రావాలనే ఉత్సాహంతో శరీరం పెంచిన నన్ను చూసి సీతమ్మ కన్నీటితో "హనుమా !రామలక్ష్మణ సుగ్రీవుని అతని మంత్రులను కుశలం అడిగానని చెప్పు. రాముడు ఈ దుఖసాగరాన్నించి నన్ను దాటించేట్లు నువ్వు సన్నాహం చెయ్యి. రాముడినికలిసి పెల్లుబికే నా దుఖాన్ని, రాక్షస్త్రీలు పెట్టె బాధల్ని భయాన్ని ఆయనకు తెలియజేయి. నీ ప్రయాణం సుఖంగా జరుగు గాక !"అని చివరిసారిగా నా వీడ్కోలు దుఖాన్ని భరిస్తూ గుడ్ల నీరు కుక్కుకొంటూ దీనాతి దీనంగా పలికింది. పూజ్య రామా !ఇలా అత్యంత విషాదం తో నీ భార్య పలికిందయ్యా, నేను చెప్పిందంతా యోచించి, సీత సమగ్రంగా క్షేమగానే ఉన్నదని నమ్ము, విశ్వసించు "అన్నాడు రామదూత పవనసుత హనుమ"-

"హనుమాన్ సింహ సంకాశా ఉభౌ రామ లక్ష్మణౌ-సుగ్రీవంచ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయం "

"యథా చ మహా బాహూ ర్మాంతారయతి రాఘవః –అస్మాద్దుఖాంబు సంరోధాత్వం సమాధాతు మర్హసి "

"ఇమం చతీవ్రం మామ శోక వేగం –రక్షోభి రేభిః పరి భర్త్సనం చ –బ్రూయాంతు రామస్య గతస్సమీపం –"శివశ్చ" తే ధ్వాస్తు హరి ప్రవీర"

"ఏ తత్తవార్యా నృపరాజ సింహ-సీతా వచః ప్రాహ విషాద పూర్వకం-ఏతచ్చ బుద్ధ్వా గదితం మయాత్వం –శ్రద్దత్స్వ సీతాంకుశలాం సమగ్రాం"

ఇది 37శ్లోకాల 67 వ సర్గ.

రాముడు సమగ్రంగా లంకలో జరిగినది అంతా తెలియ జేయమంటే హనుమ అంతా "సినేమా రీలు"లేక నేటి వీడియోలాగా లాగా చెప్పి చూపించాడు. ఎందుకింత హైరానా, టెన్షన్ రాముడికి ?సీత అక్కడ ఏ రూపం లో ఉందో అసలుందో లేదో, ఈ కోతి నిజంగా చూశాడో లేదో, చూస్తె ఆమెను గుర్తుపట్టాడో లేదో, మాట్లాడాడో లేదో, ఆమె అసలు తనకోసం ఎదురు చూస్తుందో లేదో, వస్తాననే నమ్మకం కలిగిఉందో లేదో, తన శౌర్య పరాక్రమాలు గుర్తున్నాయో లేదో, ఏదో కాకమ్మ కబుర్లు చెబుతున్నాడేమో,అభిజ్ఞానమైన చూడామణి ఆమెదో కాదో లాంటి సవా లక్ష సందేహాలతో సతమతమై నిగ్గు తేల్చుకోవాలని అంత తపన పడ్డాడు రాముడు. ఆమె తన రాకకోసం రావణ సంహారం కోసం నిరీక్షిందా లేదా అనేసదేహమూ తీరాలి. అప్పుడే కదా తక్షణ కర్తవ్యం తాను ఆలోచించాలి లేకపోతె కుక్క తోకపట్టుకొని గోదారి ఈదినట్లవుతుంది. ఇవన్నీ కన్ఫర్మ్ అవ్వాలి.

హనుమకు భయమేముంది ?అత్యంత వినయ సౌశీల్యగుణమున్న ఉన్నవాడు నిజమైన రుజు ప్రవర్తన ఉన్నవాడుకనుక బొంకాల్సిన అగత్యం అవసరం ఆయనకేముంది ?అందుకే యుట్యూబ్ లో కాంటా సుబ్బారావు లాగా "కుండ బద్దలు కొట్టి "నట్లు ప్రతిమాటా చెప్పాడు. ఆమె శీల పవిత్రత చెప్పి రాముని నిజగుణ గరిష్టతను, సీతా విరహవేదననూ ఆమెకు చెప్పి సమన్యాయం చేశాడు. నవవ్యాకరణ పండితుడా మజాకానా ? కాకాసుర వృత్తాంతం పరమనాటకీయంగా ప్రదర్శించి గొప్ప ఎఫెక్ట్ కలిగించాడు. రాముడి మనసులో ఉన్న, ఇతరులకు చెప్పలేని, ఇతరులతో పంచుకోలేని ధర్మ సందేహాలన్నీ హనుమ సీతమ్మ మాటలతో తీర్చుకొన్నాడు. ఇక్కడ హనుమ మరో ఉషశ్రీ యో, మల్లాది చంద్ర శేఖర శాస్త్రిగారో అనిపించాడు.

రాముడుకూడా "కడుపు నిండా "సీతా వియోగ దుఖాన్నిఏడ్చి ఏడ్చి తీర్చుకొన్నాడు. దుఖం పొతే సుఖమే కదా వచ్చేది ?ఆ సుఖం రాముడికీ సీతకూ అతిత్వరలోనే నెలరోజులలోపలే రాబోతోంది " సీతాపహరణ కథ "సుఖాంత మౌతోంది, అందరి కన్నీటికి తెర పడ బోతోంది.

హనుమ కొనసాగిస్తూ"నర శ్రేష్ట రామా !నీపైఅనురాగం తో నీ హితం కోరే నాపై విశ్వాసంతో ఇక్కడికి రావాలని తొందరపడుతున్న నన్ను

పై విశ్వాసంతో ఇక్కడికి రావాలని తొందరపడుతున్న నన్ను ఆదరంగా మళ్ళీ పిలిచి “రాముడు యుద్ధం లో రావణ సంహారం చేసి వెంటనే నన్ను ఇక్కడి నుంచి తీసుకొని వెళ్ళే ట్లు పలువిధాలుగా చెప్పు. శత్రుసంహారహనుమా !నువ్వు ఇక్కడ ఉండాలనుకొంటే రహస్య ప్రదేశం లో ఒక రోజు విశ్రమించి వెళ్ళు. నువ్వు ఇంకొక్క రోజు ఇక్కడ ఉంటె మందభాగ్యురలనైన నా దుఖం కొంతతీరి ఉపశాంతి లభిస్తుంది. నువ్వు తిరుగు ప్రయాణమై వెడితే నాప్రానాలు నిలుస్తాయో లేదో అని సందేహిస్తున్నాను –

“ఏవం బహువిధం వాచ్యో రామో దాశరధి స్త్వయా –యధా మా మాప్నుయా చ్చీఘ్రం హత్వా రావణ మాహవే “

“మమచాప్యల్ప భాగ్యాయాః సాన్నిధ్యా త్తవ వీర్యవన్ - అస్య శోక విపాకస్య ముహూర్తం సాద్విమోక్షణం ““గతే హిత్వయి విక్రాంతే పునరాగమనాయ వై –ప్రాణానామపి సందేహో మమ స్యా న్నాత్ర సంశయః “




“హనుమా ! నా భర్తను ఎడబాసి దుఖాలపాలై దుర్గతి పొందుతున్న నాకు, నువ్వు కనపడకుండా వెళ్ళటం మరింత శోకకారణ మౌతుంది. నీ సహాయులైన ఋక్ష,వానరుల పై నాకు సందేహం ఉంది. వారూ రామలక్ష్మణులు దాటరాని సముద్రాన్ని ఎలా దాటుతారు ?ఈసముద్ర లంఘనం గరుత్మనుడికి నీకు వాయు దేవుడికి ముగ్గురికి మాత్రమె సాధ్యం. మిగిలినవారికి అలాంటి శక్తి కలిలిగి ఉండకపోవచ్చు. ఇలాంటి దుష్కరమైన కార్యానికి ఏ ఉపాయం ఆలోచించావు నువ్వు ?నువ్వు ఒక్కడివే రావణ, సకలరాక్షస సంహారం చేసి నన్ను రామునిసంనిదికి తీసుకు పోగలిగిన సమర్దుడివే దీనివలన కీర్తి నీకు దక్కుతున్దికాని రాముడికి కాదు కదా. కాని రాముడే ఇక్కడి ససైన్యంగా వచ్చి రావణునిపై విజయం సాధించి నన్ను తీసుకుపోవటం ఆయనకు యశస్కరం –

“త్వా దర్శన జ శ్శోకో భూయో మాం పరితాపయేత్-దుఃఖా ద్దుఖ పరాభూతాం దుర్గతాం దుఃఖ భాగినీం”

“కథం ను ఖలు దుష్పారం తరిష్యంతి మహోదధిం-తాని హర్యక్ష సైన్యాని తౌవా నరవరాత్మజౌ ‘త్రయాణా మేవ భూతానాం సాగరస్యాస్య లంఘనే –శక్తిః స్యా ద్వైతేయస్య తవ వా మారుతస్య వా “

“కామమస్య త్వమే వైకః కార్యస్య పరిసాధనే -, పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః “

“బలై స్సమగ్రైర్యది మాం-హత్వా రావణ మాహవే –విజయీ స్వాం పురీం రామో –నయే త్తత్స్యా ద్యశస్కరం”

“హనుమా !పూర్వం రావణుడు నన్ను రాముడు నా దగ్గర లేనప్పుడు మాయోపాయం తో తీసుకు వెళ్ళాడు. కాని రాముడు అలాకపతమార్గం లో నన్ను ఇక్కడి నుంచి తీసుకు వెళ్ళటం ఉచితం కాదు. రాముడు తనసైన్యంతో లంకను నింపి, అప్పుడు అందరి సమక్షం లో నన్ను తీసుకు వెళ్ళటం తగిన పని. యుద్ధ పరాక్రమ శాలిరాముడు ఎలా సముచితంగా చేయటం తగునో, అలా నువ్వు చెయ్యి “-

“యథాహం తస్య వీరస్య వనా దుపధినా హృతా-రక్షసా తద్భయా” దేవ తథా నార్హతి “రాఘవః “బలైస్తు సంకులాం కృత్వాలంకాంపర బలార్దనః –మాం నయేద్యదికాకుత్ స్థ స్తత్తస్య సదృశం భవేత్”

““తద్యథా తస్య విక్రాన్త మనురూపం మహాత్మనా –భవ త్యాహవ శూరస్య తథా త్వ ముపపాదయ-”

హుమా రామునితో చెబుతూ "రామా !యుక్తియుక్తాలు అర్ధవంతాలు ఐన ఆమె మాటలు విని నేను ఇలా చెప్పాను –"అమ్మా సీతా దేవీ!ఋక్ష,కపి సైన్యనాయకుడు రాజు సుగ్రీవుడు రాముడికి తోడుగా ఇక్కడికి వచ్చి నిన్ను తీసుకు వెళ్ళటానికి కృత నిశ్చయుడై ఉన్నాడు. బుద్ధి పరాక్రమంశక్తి మనో వేగం ఉన్న వానరులెన్దరోఆయన సైన్యం లో ఉన్నారు వాళ్ళంతా భూమి ఆకాశం పాతాళాలలో అడ్డు లేని సంచారం చేయగలవారు అమిత తెజస్సాలురు మహాకార్య దురంధరులు. వాళ్ళు ఆకాశమార్గం లో భూమిని చాలాసార్లు చుట్టి వచ్చారు. మా సైన్యం లో నాతో సమానులు నాకంటేశ్రేస్తులుచాలా మన్దిఉన్నారు నాకంటే తక్కువ వారేవ్వరూసుగ్రీవ సైన్యం లో లేనేలేరు. నా వంటి సామాన్యుడే సముద్రాన్ని అవలీలగా దాటి వస్తే ఆమహా బలశాలుర విషయం చెప్పాలా ?నేను వచ్చింది దూతకార్యం కనుక సామాన్యుడైనవాదినే దూతగా పంపాలికనుక నన్ను పంపారు శ్రేస్తులను దూత క్రుత్యానికి పంపరు"

"సుగ్రీవ స్సత్వ సంపన్నస్తవార్ధే కృత నిశ్చయః "

"తస్య విక్రమ సంపన్నా స్సత్వ వంతోమహా బలాః-మనస్సంకల్పసంపాతానిదేశే హరయః స్థితాః"

"ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమార్గాను సారిభిః"-మద్విశిష్టాశ్చ,తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః "-మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవ సన్నిధౌ"

"అహం తావ దిహా ప్రాప్తః కిం పునస్తే-మహాబలాః-"న హిప్రకృష్టాఃప్రేష్యంతే హీతరే జనాః"



"అమ్మా సీతా దేవీ !ఇంకా చింత మాను. శోకం వదిలేయి ఆవానరులు ఒకే ఒక గంతులో లంక చేరుతారు. నా బుజాలపై రామ లలక్ష్మణులు కూర్చుని సూర్య చంద్రులులాగా నీ దగ్గరకు వస్తారు. సింహ సదృశ అరి వీరభీకరరాముడు, ధనుర్ధారి లక్ష్మణుడు త్వరలో లంకాద్వారానికి చేరటం నువ్వు చూస్తావు. గోళ్ళు, పండ్లు ఆయుధాలుగా ఉన్న వీరులు సిమ్హాలుపులులవంటి పరాక్రా శాలురు, ఎనుగుల్లాగా మహా శ్రేస్తులైన వారు అయిన వానరులు త్వరలో లంకలో ప్రవేశించతమ్ చూస్తావు. కొండల్లాగా,మేఘాల్లాగా ఉన్నతులై లంకలోని మాలయ పర్వత ప్రాంతం లో సింహ నాదం చేసే కపిశ్రేస్టుల మహాధ్వని త్వరలోనే వింటావు. "అని సీతాదేవి దుఖాన్ని మాన్పాతానికి సకల ప్రయత్నాలు చేసి విశ్వాసం కలిగించాను రామా "అని హనుమ అన్నాడు –

మామ పృష్ఠ గతౌ తౌ చ చంద్ర సూర్యా వివోదితౌ-"త్వత్సకాశం మహాభాగే నృసింహా వాగమిష్యతః-"

" అర్చిష్మం సింహ సంకాశం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవం –లక్ష్మణం చ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితం"

"నఖ దంష్ట్రాయుధాన్వీరాన్ సింహ శార్దూల విక్రమాన్ –వానరా న్వార ణేంద్రాభాన్ క్షిప్రం ద్రక్షసి సంగతాన్ "

"శైలాంబుద నికాశానాం లంకా మలయా సానుషు-నర్దతాంకపి ముఖ్యా నామచిరా చ్ర్ఛోష్యసి స్వనం"

రామా !నేను అమ్మా !శత్రుదమనుడు రాముడు వనవాస దీక్ష పూర్తీ చేసి, నీతోకలిసి అయోధ్యకు చేరి పట్టాభి షిక్తుడు అవటం త్వరలోచూస్తావు "అని,నువ్వు ఆమె కోసం పరితపిస్తున్నావని నేను చెప్పిన వెంటనే శోకం తో తట్టకోలేక పోయిన సీతాదేవితో ఆమె దుఖం,శోకం తొలగే ఉచితమైన

ఇష్టమైన మాటలు చెప్పగా ఆమె దుఃఖ శోకాలు వీడి ప్రసన్ను రాలై,శాంతి పొందింది "అని దూత హనుమ శ్రీరాముడికి సీతా వృత్తాంతమంతా సవిస్తరంగా తెలియ జేశాడు –

"నివృత్త వనవాసం చ త్వయా సార్ధమరిందమం –అభిషిక్త మయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవం "

"తతో మయా వాగ్బిరదీన భాషణా-శివాభి రిష్టాభిరభిప్రసాదితా –జగామ శాంతం మామ మైధిలాత్మజా –తవాపి శోకేన తదాభి పీడితా "

అనే అనుష్టుప్ శ్లోకం తో మహా కవి వాల్మీకి సుందర కాండ ముగించాడు.

ఇదిసుందర కాండలో 29శ్లోకాల చివరి 68 వ సర్గ.

ఇందులో సీతకాని రాముడుకాని హనుమంతుడుకాని ప్రయోగించిన శబ్దాలు అర్ధవంతాలు అవతలి శక్తిసామర్ధ్యాలను పూర్తిగా తెలియే జేసేవి. చివరగా చెప్పిన పట్టాభి షేక శుభవార్త రామాయణానికి ఫలశ్రుతి. దానికోసమే ఇన్ని కష్టాలు బాధలు. సుందరకాండ చివరలో ఆశుభవార్త చెప్పటం సుందర కాండను మరింత సుందరంతరం చేసినట్లైంది

సీతాదేవిని హనుమ యెంత కష్టపడి ఊరడించాడోఈ సర్గలో కళ్ళకు కట్టినట్లు రాముడికి తెలియ జేస్తూ మనకు ఎరిగించాడు. తనకంటే తక్కువబలవంతులు సుగ్రీవ సైన్యం లో లేరు అని భరోసా ఇచ్చాడు సీతకు. తానూ సామాన్యుడు కనుక తనను దూతగా పంపారు అనటం అతని సంస్కారం, వినయం, విధేయత, రామదూతగా హనుమ గొప్ప విజయం సాధించాడు సీతా శోక నివారణ, ఉపశమనం రామ వియోగ దుఃఖ నివారణ ఆమె కుశలమనే వార్తతో ఆయనకోఉపశమనమం కలిగించాడు.తనను దూతగా పంపిన సుగ్రీవునికీ స్వామి కార్యం నెరవేర్చిన విధేయుడిగా నిలిచాడు దానితో వారరాజుకూ ఆనందం, ఉపశమనం.

సుందరకాండ తర్వాత రామరావణ యుద్ధం, అగస్త్యమహర్షి రామునికి ఆదిత్యహృదయం వివరించి బలోపేతుడినిచేయటం, రావణ సంహారం, దేవతలు రాముని ప్రస్తుతించటం, సీతతో సహారామ లక్ష్మణ సుగ్రీవ విభీషనాదులు అందరూ పుష్పకం పై అయోధ్యకురావటం భరతుడి దీక్ష విరమింప జేయటం శ్రీ రామ పట్టాభిషేకం, రామరాజ్య విషయాలతో రామాయణం పూర్తి-స్వస్తి.

మనవి -14-4-20మంగళవారం "సుందర కాండలో హనుమ బహుముఖీన వ్యక్తిత్వం "ధారావాహిక ప్రారంభించి ఇవాళ 7-7-20 మంగళవారం సుమారు రెండున్నర నెలలకాలం లో మిగతావి కూడా రాస్తూ68సర్గలను 70ఎపిసోడ్ లలో రాసి, ఈ 70 వ ఎపిసోడ్ తో పూర్తి చేయగలిగాను. మొదటి ఎపిసోడ్ లో చెప్పినట్లు ఎలాంటి ప్రణాళిక లేకుండా మొదలు పెట్టి, పూర్తి చేశాను. ప్రతిరోజూ ఆ రోజు రాసే సర్గను చదువుతూ, రాస్తూ, నాకు అనిపించిన విశేషాలు రాశాను. ఇది ఆదికావ్యం కనుక కావ్య గుణాలను సాధ్యమైనంతవరకు చెప్పే ప్రయత్నమూ చేశాను. ఎక్కడ వీలయితే అక్కడ హనుమ వ్యక్తిత్వాన్ని వివరించాను. ఇవాల్టి వరకు అంతే చేశాను. ఎలా మొదలుపెట్టానో ఎలా పూర్తి చేశానో నాకే ఆశ్చర్యంగా ఉంది. మా స్వామి రాయించుకొని ఉంటాడు. అంతకంటే నేను చెప్పేది లేదు, హనుమ అనుగ్రహం, సరస్వతీమాత కటాక్షం, మా తలిదండ్రుల ఆశీస్సులు లేకపోతే ఇలా రాయగలిగే వాడిని కాను అని సవినయంగా మనవి చేస్తున్నాను. నాతోపాటు సుందరకాండలో విహరించి, ఆ సౌందర్యాన్ని ఆస్వాదించిన సాహితీ బంధువులకు ధన్యవాదాలు.

సుందర కాండ పారాయణ పద్ధతులు –మనసులోని కోరిక తీరటానికి సుందర కాండ పారాయణ చేస్తారు. పారాయణ చేయాలనుకొనేవారు ఉదయం పూజాదికాలు పూర్తి చేసి శుచి అయిన ప్రదేశం లో కూర్చుని ప్రతిరోజూ స్మార్తులైతే శ్రీమహాగణపతిధ్యానం మిగిలినవారు వారివారి విధానాలలో ధ్యానం, వాల్మీకి నమస్క్రియ,ఆంజనేయ నమస్క్రియ, రామాయణ ప్రార్ధనా, శ్రీరామ ధ్యానం శ్లోకాలు చదవాలి. పారాయణ పూర్తి అయ్యాక నైవేద్యం పెట్టి హారతిచ్చి "స్వస్తిప్రజాభ్యః –నుంచి యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం రామాస్తుతేపూజనం "దాకాఉన్న శ్లోకాలు చదివి ముగించాలి.

పారాయణ మొదటి రోజున సంక్షిప్త రామాయణసర్గ, శ్రీరామావతార సర్గ, శ్రీసీతారామ కళ్యాణ సర్గ, సీతారామ సుఖజీవన సర్గ చదివిన తర్వాతే సుందరకాండ మొదటి సర్గతో ప్రారంభించాలి

చివరి రోజు పారాయణ నాడు అంటే సుందరకాండ 68వ సర్గ పూర్తి చేసిన రోజున నాగపాశ విమోచన సర్గ, ఆదిత్య హృదయ సర్గ, రావణ వధ సర్గ, శ్రీరామ స్తుతి సర్గ, శ్రీరామ పట్టాభి షేక సర్గ చదవాలి

1-ఒక్క రోజులో పారాయణ పూర్తి చేయాలనుకొంటే పైన చెప్పినవన్నీ అదే వరుసలో చేయాలి

2-2రోజుల్లో –మొదటి రోజు సుందరకాండ 1నుంచి 36వ సర్గవరకు, రెండవ రోజు37నుంచి 68వరకు పారాయణ చేయాలి

3-3రోజుల్లో –మొదటిరోజు 27వ సర్గ వరకు, రెండవరోజు 28నుంచి 41వరకు మూడోరోజు 42నుంచి 68సర్గవరకు

4-5రోజులపారాయణ –మొదటి రోజు 15వ సర్గవరకు రెండో రోజు 27వరకు మూడోరోజు 38వరకు నాల్గవ నాడు54 వరకు ఐదవరోజు 55నుంచి 68వరకు

5-8రోజుల్లో –రోజుకు 9సర్గల వంతున, 7రోజులు మిగిలినవి 8వ రోజు పారాయణ చేయాలి

6-9రోజుల పారాయణ –మొదటి రోజు 1-5,రెండు -6-15,మూడు-16-20,నాలుగు -21-26,ఐదవరోజు -27-33,ఆరవరోజు -34-40,ఏడవరోజు - 41-52,ఎనిమిదవ రోజు – 53-60,తొమ్మిదవ రోజు -61-68 సర్గలు పారాయణ చేయాలి

ఎన్ని రోజులు చేసినా చిత్తశుద్ధి ముఖ్యం. పారాయణ రోజుల్లో అంటూ మైలలకు దూరంగా ఉండాలి. దాన్నిబట్టి ప్లాన్ చేసుకోవాలి ఇదంతా ఒక దీక్షగా భావించిచేయాలి. అప్పుడే ఫలితం. శ్రీ సుందరకాండ పరాయణ ఫలప్రాప్తి రస్తు

# శ్రీ సువర్చలాంజనేయం

శ్రీ ఆంజనేయుడు అంజనా దేవి కి,కేసరి కి, జన్మించిన కుమారుడు. బుద్ధిమంతుడు, బలవంతుడు, ప్రతాపశాలి. ఆయనకు చిన్న తనం లోనే వ్యాకరణం నేర్చుకోవాలని కోరిక కలిగింది. వ్యాకరణం అంటే ఒక్కటే కాదు. నవ విధ వ్యాకరనాలున్నాయి అవి పాణినీయం, కలాపము, సుపద్మము, సారస్వతము, ప్రాతి శాఖ్యము, కుమారవ్యాకరణము, ఇంద్రము వ్యాఘ్ర భౌతికము శాకటాయనము. ఇవన్నీ నేర్చుకున్న వాడిని నవ వ్యాకరణ పండితుడు అంటారు. వీటిని పూర్తి అధ్యనము చేసి అధ్యాపనం (నేర్చుకోవటం, బోధించటం )చేయగల నేర్పు వున్న వాడు సాక్షాత్తు ఆ సూర్య భగవానుడే.. హనుమంతుడు సూర్యుని దగ్గరకు వెళ్లి తనకు వ్యాకరణాలు బోధించ మని వేడుకున్నాడు. సూర్యుడు "నేను ఉదయము నుంచి, సాయంత్రం దాకా తూర్పు నుంచి పడమరకు ప్రయాణం చేస్తూంటాను. నిలకడ గా ఒక చోట ఉండను. నీకు నేర్పటం ఎలా సాధ్యం ?"అన్నాడు. దానికి మహా మతిమంతుడైన హనుమాన్ ""స్వామీ !నేను ఒకకాలు తూర్పుకొండ మీద, రెందోకాలు పడమటి కొండ మీద వుంచి మీతోనే వుంటాను. కనుక నేర్పండి "'అన్నాడు. సరే నని అయిదు వ్యాకరణాలు నేర్పాడు ఆ విధం గానే. మిగిలినవి కూడా నేర్పమని అడిగాడు. మారుతి. మిగిలినవి వివాహం అయిన వారికే నేర్పాలి అన్న ణియమం వుంది అన్నాడు గురువు.. నేను బ్రహ్మ చారిని కదా ఎలా సాధ్యం అని అడిగాడు వాయుసుతుడు.. అయితే దీనికి ఒక పరిష్కారం వుంది ఆమెను నీకు ఇచ్చి వివాహం చేస్తాను అప్పుడు మిగిలిన వ్యాకరణాలు బోధిస్తాను అన్నాడు రవి





ఇంతకీ సూర్యుని కుమార్తె ఎవరు ఎలా పుట్టింది అని అనుమానం వచ్చింది హనుమకు. అప్పుడు సూర్యుడే సందేహ నివృత్తి చేశాడు. తాను చాలా తీవ్ర తేజంతో జ్వలిస్తుంటే తన భార్య చాయా దేవి భరించలేక పోయిందని ఆమె తండ్రి, తన మామ గారు మయుడు తనను సాన పట్టాదని తీవ్రత తగ్గిందని, సాన పట్టగా వచ్చిన రజను ఒక రాశి గా ఏర్పడిందని దేవతల వర ప్రభావం తో ఆ రాశి నుంచి మంచి వర్చసు దేహకాంతి తేజస్సు కల అపురూప సౌందర్య రాశి ఆవిర్భవించిందని, ఆమెయే తమ కుమార్తె సువర్చల అని వివరం గా చెప్పాడు సూర్యుడు., మంచి వర్చస్సు వుండటం చేత సువర్చల గా నామ కారణం చేసామని చెప్పాడు ఆమె ను వివాహం చేసుకోమని కోరాడు సరే నని ఒక షరతు పెట్టాడు హనుమ. తాను వివాహం అయినా బ్రహ్మ చారి గానే ఉంటానని దాంపత్య సౌఖ్యం ఉండదని తనకుమార్తెకు ఈ విషయం చెప్పి ఆమె అంగీకరిస్తే తాను వివాహం చేసుకుంటానని నిర్మొహమాటం గా చెప్పాడు. సువర్చలకు., బలశాలి, మతి మంతుడుబుద్ధిమంతుడు తనకు భర్తగా లభించటం తన అదృష్టమని దాంపత్య సౌఖ్యం లేక పోయినా తనకు అంగీకారమే నని ఆమె బదులు చెప్పింది. అందరు ఆనందించారు వారి వివాహం వైభవం గా జరిగింది అప్పటినుంచి ఆంజనేయుడు సువర్చలాన్జనేయుడు అయాడు., వచ్చే మన్వంతరం లో హనుమ బ్రహ్మ దేవుడవుతాడు అందుకే ఆయన సహస్రనామం లో "భవిష్యత్ బ్రహ్మనేనమః"అని వుంది సూర్యుడు తన అల్లుడైన హనుమంతునికి మిగిలిన నాలుగు వ్యాకరణాలు నేర్పాడు. గురువుకు తగిన శిష్యుడని పించు కున్నాడు. అందుకే ఆయన్ను "నవ వ్యాకరణ పండితుడు "అంటారు. ఇదే సువర్చలాన్జనేయం.



భాషాప్రవీణ: గురజాడ పూర్ణచంద్రశర్మ, కౌండిన్యసగోత్రోద్భవుడు
జననం: 28-10-1910 తండ్రి శ్రీ గురజాడ సాళ్వపతిశర్మగారు. తల్లి సూర్యకాంతమ్మగారు. జిల్లా పరిషదుపాధ్యాయుడు (25 సంవత్సరాలు).

వ్రాసిన సంస్కృత గ్రంథములు
1. గురుగౌరవమ్ నాటకమ్ (అముద్రితము)
2. సువర్చలాంజనేయమ్
3. ప్రహ్లాదచరిత్ర (అముద్రితము)
4. హారిణీ నాటకమ్ ..
5. జడభరత చరితమ్ ..
6. గజేంద్రమోక్షణమ్

తెలుగు గ్రంథములు.
1. [illegible]
2. గేయరామాయణము
3. పుష్పకము (అముద్రితము)
4. సీతాకల్యాణము ..
5. పార్వతీ కల్యాణము ..
6. శ్రీ శివభాగవతము .. (ఆటవెల పద్యములు)

హనుమ చిరంజీవి అని మనకు.ఆయన వైశాఖ మాసం లో కృష్ణ పక్షం లో దశమి నాడు జన్మించాడు ""వైశాఖే మాసి కృష్ణాయాం దశమ్యాం మందవాసరే "అని దీని వివరణ ఆ రోజునే శ్రీ హనుమజ్జయంతి దేశ మంతటా చేస్తారు.. ఆయన పుట్టిన వారం శని వారం. శనివారం మంగళ వారం హనుమకు ప్రీతి కరమైనవి. ఆ రోజుల్లో విశేషం గా స్వామిని అర్చించి తరిస్తారు, సువర్చలాన్జనేయ కల్యాణాన్ని వైశాఖ బహుళ దశమి నాడు అంటే హనుమజ్జయంతి నాడు జరపటం ఆచారం. తమల పాకులపూజ (నాగవల్లి )ఆయనకు ప్రీతికరం.. అప్పాలు నైవేద్యానికి శ్రేష్టం.. పానకం ఇష్టం. లడ్డూలు మరీ ఇష్టం ఆంజనేయుడు లంకను దాటి సీతా మాత ను దర్శించి స్వామి కార్య దురీనుదయాడు. రామ భక్త హనుమాన్ గా వీర హనుమాన్ గా దాసాంజనేయ స్వామిగా, వీర ధీర హనుమాన్ గా సంజీవి పర్వతోద్దారణ హనుమాన్ గా, పంచముఖ అన్జనేయునిగా భక్తులచేత పూజలు అందుకుంటున్నాడు. ఆయన్ని సేవించితే భాయాలుండావ్,పాపాలు అంటవు, , , దుస్వప్నాలు రావు శత్రువుని జయించే కోరిక తీరుతుంది. అందుకే ఆయనకు ఊరూరా వీధి వీధినా దేవాలయాలు కత్తి భక్తీ శ్రద్ధలతో పూజించి సేవించి తరిస్తారు

ఆంజనేయ స్వామి ప్రవర తెలుసు కుందాము ఆయనది కౌన్డిన్యస గోత్రం.. వసిష్ట, మైత్రావరణ కౌన్డిన్యస మహర్షులు ఆ గోత్ర ఋషులు. హనుమంతుని ముత్తాత గారి పేరు హేమగార్భ శర్మ, తాత గారు పింగాక్ష శర్మ, తండ్రి గారు కేసరి శర్మ.

సువర్చలా దేవి ప్రవర వినండి ఆమె గోత్రం కాష్యపస గోత్రం కాశ్యప, వత్సార, నైద్రువ అనే ముగ్గురు మహర్షులు ఆ గోత్రం లోని ఋషులు. ఆమె ముత్తాత గారు చతుర్ముఖ బ్రహ్మ. తాత గారు కశ్యపబ్రహ్మ. తండ్రి వివస్వత బ్రహ్మ అనే సూర్యభగవానుడు.

శ్రీ సువర్చలాదిస్తిత వామ భాగం -నిరస్త కందర్ప సురూప దర్పనం
భాను ప్రభం రాఘవ కార్య దక్షం -అస్మత్కులేశం శ్రీ హనూమంత మీడే.

## శ్రీ గురజాడ పూర్ణ చంద్ర శర్మ

రచన –స్వర్గీయ శ్రీ గురజాడ పూర్ణ చంద్ర శర్మ గారుతెలుగు పండితులు -గురజాడ –కృష్ణా జిల్లా –రచనా కాలం -11-2-1976-

ఉయ్యూరు జిల్లా పరిషత్ హైస్కూల్ లో మేము తొమ్మిదీ పది తరగతులు చదువుతున్నప్పుడు మాకు తెలుగు బోధించిన గురు వరేన్యులు శ్రీ గురజాడ పూర్ణ చంద్ర శర్మగారు. చక్కగా బోధిస్తూ ఎన్నో మంచికథలను ధారావాహికం గా చెప్పి వినోద విజ్ఞానాలు కలిగించేవారు. వారు నిత్యం గురజాడ నుండి సైకిల్ పై వచ్చేవారు. చాలా సౌమ్యులు నెమ్మది స్వభావులు. సన్నగా మాట్లాడినా స్ఫుటం గా వినిపించేది. గొప్ప బోధకులు. వారంటే శిశ్యు లందరికి అమిత గౌరవం ఉండేది చిరునవ్వు తప్ప ఎప్పుడూ కోపం వారిలో మేము చూడలేదు. తెల్లనిపంచా చొక్కా

పై పంచె తో సరిపడా రూపం వారిది. నల్ల చాదుబొట్టు పెట్టుకొనే వారు ఎర్రగా వెడల్పైన ముఖం తో కనిపించేవారు. నాపై శిష్య వాత్సల్యం ఎక్కువగా ఉండేది. అప్పుడే మా నాన్న గారు మృత్యుంజయ శాస్త్రిగారూ మా హైస్కూల్ లో తెలుగు పండితులుగా ఉన్నారు. వీరిద్దరికీ ఒకరంటే మరొకరికి అమిత గౌరవ భావన ఉండేది. శర్మగారుబందరుకు చెందిన ప్రఖ్యాత కవి గురజాడ రాఘవ శర్మ గారికి పెదనాన్నగారి కుమారుడు.

శర్మ గారు గురజాడలో కాపురం ఉండగా కపి రూపం లో శ్రీ ఆంజనేయస్వామి స్వప్నం లో కనిపించగా తనను ఏదైనా ఆయనపై కావ్యం రాయమని ఆదేశించారేమోనన్న భావన కలిగి ప్రారంభిస్తే అది "శ్రీ సువర్చలాంజ నేయం "గా సంస్కృత శ్లోకాలలో పరంపరగా ధారగా వెలువడిందట. పూర్తీ అవగానే శర్మ గారి పేద తండ్రిగారి కనిష్ట పుత్రులు గురజాడ గోపాల కృష్ణ మూర్తి గారు గురజాడ శ్రీ కోదండ రామాలయ ధర్మ కర్తగా పుస్తకాన్ని ముద్రించి శ్రీరాముని ఎదుట ప్రతిష్టితుడైన శ్రీ ఆంజనేయస్వామికి 11-2-1976 శ్రీ రాక్షస నామ సంవత్సర భీష్మ ఏకాదశి నాడు అంకిత మిచ్చే ఏర్పాటు చేశారు. సంస్కృత శ్లోకాలకు శర్మ గారే చిక్కని సరళ తాత్పర్యం రాశారు. ఈ పుస్తకాన్ని మా సువర్చలాంజనేయ స్వామిదేవాలయ అర్చక స్వామి ఛి వేదాంతం మురళీ కృష్ణ సంపాదించి నాకు ఇచ్చాడు.

13-5-2015 శ్రీ హనుమజ్జయంతి నాడు స్వామి వారల శాంతికల్యాణ మహోత్సవం లో నేను రాసిన "దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు "గ్రంధం(నేను రాసిన పదవ పుస్తకం –సరస భారతి ప్రచురించే పదిహేనవ పుస్తకం ) ఆవిష్కరణ చేయ బోతున్నాముకనుక అందులో మా గురువుగారు రాసిన "శ్రీ సువర్చలాన్జనేయం " ను చేర్చాలని భావిస్తూ, ఈ రోజు నుంచి దీనిని ధారావాహికం గా మీకు అంద జేస్తున్నాను. మాస్టారు రాసిన "గురజాడ గ్రామం "బదులు "ఉయ్యూరు గ్రామం "అని మాత్రమె మారుస్తున్నాను. మిగతాది అంతా యధాతధం గా ఉంటుంది. మ మాస్టారి సంస్కృత రచనా పాండిత్యం ఈ పుస్తకం చదివే దాకా నాకు తెలియదు. వారిని మీ అందరికీ పరిచయం చేసి శిష్యుడిగా నా ధర్మాన్ని నేరవేరుస్తున్నాను. గురువుగారు శర్మగారికి వినయ విధేయతలతో శిరసు వంచి పాదాభి వందనం చేస్తూ గురుణం తీర్చుకొంటున్నాను. మీ -గబ్బిట దుర్గా ప్రసాద్ –ఉయ్యూరు -22-12-14-

"నాలీ కాక్ష మలీకాక్షం, వాగేషయ మగేశయం –విపుంగవ ధ్వజం ధామ పుంగవ ధ్వజ మాశ్రయే "

శ్రీ సువర్చలాంజ నేయం

**1-శ్రీ మద్విద్యా దానోద్దండం –అపశబ్ద దోష రిపు ప్రచండం**
**హస్తే స్వాత్మీయ దంత దండం –వందే ప్రణవ స్వరూప తుండం**

తాత్పర్యం –అన్ని విద్యలను దానం చేయటం లో ప్రసిద్దుడు, అపశాబ్దాలను దగ్గరికి రానీయని వాడు, చేతిలో దంతం అనే ఆయుధాన్ని ధరించిన వాడు అయిన ఓంకార వక్ర తుండు(వినాయకుదు )నికి నమస్కారం.

**2-ఉయ్యూరు (గురజాడ )పురే సంస్థిత వంతం –సతీసుతద్వయ శోభిత వంతం –**
**ధ్రుత చంద్ర పదం శ్రీ భగవంతం –వందే సదర్ధ వితరణ వంతం**

తా—ఉయ్యూరు (గురజాడ)పురం లో వేంచేసి చంద్రుని వంటి ముఖం తో దేవేరితో, పుత్ర ద్వయం తో శోభిల్లి సకలార్ధాలను అనుగ్రహించే భగ వంతునికి నమస్కారం.

**3-శ్రీ హనుమంతం వింధ్య –స్థిత పారిజాత తరువార మూలం**
**ద్రష్టుం తుంబుర నారద –మునీ ఆదాద్యో సమాయాతౌ "**

తా—వింధ్యపర్వత సానువుల్లో పారిజాత వృక్ష మూలం లో విలసిల్లె శ్రీ హనుమత్ప్రభు దర్శనం కోసం నారద, తుంబురులు సంతోషం తో వచ్చారు.

**4-అన్యోన్యాదర పూర్వక –నమః ప్రదర్శిత మధసంద్రు తాంజలిః**
**శిలా తలయోః రుపరి స-న్యవేశ యత్తౌ కపి శ్రేస్టః**

తా—పరస్పరం ఆదరంగా పలకరించు కొని కపి శ్రేష్టుడు హనుమంతుడు అంజలి బద్ధుడై వాళ్ళిద్దరినీ తన ఎదుట ఉన్న శిలా పీఠం పై కూర్చో బెట్టాడు.

**5-భగవతి హనుమతి ధృత్వా మోదం –కుర్వతి మధురం రామ నినాదం**
**సధ రతి బాష్ప వారి యశోదం-సముత్తి తౌ తే వక్తుం వాదం**

తా-హనుమ దివ్య రామనామ సంస్మరణ చేసిన వదనం తో కళ్ళనుండి బాష్పదార కారుతుండగా నారద తుంబురులిద్దరూ ఆశ్చర్యం గా నిలబడి మాట్లాడటం ప్రారంభించారు.

**6-రామేత్యేకే నైవాప దేశే –భారా తై స్తైర్చహు భేదేన**
**హనుమతి గాయతి సతి మోదేవ –తౌ యుక్తౌ విస్మయ నాదేన.**

తా-భావ రాగ తళ యుక్తం గా అనేక విధాల రామ నామ దివ్య నామ సంకీర్తన తో ధన్యడయ్యే హనుమంతుని భక్తీ తత్పరతను చూసి ఆశ్చర్య పడ్డారు.

**7స బాష్ప వారి స్వార్తిర్యదిన –సమహా పుణ్యం బాష్పం యదిన**
**స మహా సిద్ధిఃపుణ్యం యదిన స పరం పశ్యతి సిద్ధిర్యదిన**

తా--మనసులో ఆర్తి కలిగితేనే కన్నీరొస్తుంది. అలా స్రవించటం పుణ్యం. ఆ పుణ్య ప్రాప్తి వల్లనే మహాసిద్ధి. ఆ సిద్ధి పరలోకప్రాప్తికి సాధనం..

**8-శ్రీమన్మునీశ్వరౌ తౌ-స్వహృది స్తోత్రం ముదా కురుతాం తదా**
**శ్రీ రామ రామ రామే త్సుచ్చై ర్గాయతి కపి శ్రేస్టే"**

తా-శ్రీరామ రామ అని ఎలుగెత్తి పాడే ఆ వానర శ్రేస్టూని చూసి మునీశ్వరులిద్దరూ స్తోత్రాలు చేశారు.

**9-దృష్ట్వా దృష్ట్వా శ్రీ హనుమంతం –సంతుస్టువతు ర్చహు గాయంతం**
**పాదోక్షేపణ గతి నృత్యంతం –తౌ మే నాతేమహిమా వంతం.**

తా—రామనామ గాన పారవశ్యం తో చిందులు దొక్కే హనుమాన్ ను కంటి రెప్ప వాల్చకుండా చూస్తూ ఆంజనేయుని మహిమను తెలుసుకొన్నారు.

**10 –నిశ్చల చిత్తః కోవా భవతి –సు చిరంజీవీ కోవా భవతి**
**భూష్ణు ర్చహ్మా కోవా భవతి-సమహాత్మా శ్రీ హనుమాన్ భవతి**

తా—నిశ్చల చిత్తుడు ఎవరు?చిరంజీవి ఎవరు?భవిష్యత్తులో బ్రహ్మా అయ్యేది ఎవరు ?ఎవరోకాదు –ఆ మహాత్ముడు శ్రీ హనుమత్ ప్రభువే.

**11-యస్మిన్ శీతోస్తి కృష్ణ వర్త్మా-యం ఖే గమయతి సమీరణాత్మా**
**సయయే యస్సూక్ష్మ స్థూలాత్మా –నోయం శ్రీ హనుమాన్ పరమాత్మా**

తాత్పర్యం –ఎవరికి అగ్ని చల్లగా ఉంటుందో, ఎవరు ఆకాశం లో గాలిలో విహరిస్తారో, ఎవరు సమయానుకూలంగా సూక్ష్మ అతి సూక్ష్మ రూఒపాలు దరిస్తారో అలాంటి పరమాత్మ శ్రీహనుమత్ప్రభువు.

**12-భక్తిస్చేత్కిం స్వాధ్యాయేన –స్మరణం చేత్కింమంత్ర జపేన**
**ఆర్తిస్చేత్కిం శుచితాపేన – లయతా చేత్కింస్తుతి పఠనేన.**

తా—భక్తీ లో మునిగిన వాడికి వేదం పఠనం ఎందుకు?ఆర్త హృదయం ఉంటె ప్రాయశ్చిత్తం దేనికి?భక్తీ తో ఆనంద నాట్య మాడేవానికి స్తోత్ర పాఠాలేల?

**13-శబ్దార్ధ వ్యాకృతి విష యేషు –భక్త్యా వేశప్రోల్లాశేషు**
**భక్త శిఖండిః దుస్సంగేషు –హనుమత్తుల్యో నహి లోకేషు.**

తా-వ్యాకరణం లోను భక్తీ ఆవేశం తో గంతులు వేయటం లో, భక్తీ ప్రభావం లో దురితాల ధూళిని వదిలించటానికి హనుమంతునికి సాటి ముల్లోకాలలో ఎవరూ లేరు.

**14-రామేత్యను పద ముద్గాయంతం –సులలిత సురుచిర పదోచ్చలంతం**
**కృత కరతాళం శిరసి వహంతం –ప్రణ మానసస్సంతం శ్రీ హనుమంతం.**

తా—అనుక్షణ రామ నామ గానలోలుడై, కరతాళ ధ్వనులతో సుందర పదార విందాలతో గంతులేస్తూ రెండు చేతులు జోడించి శిరస్సున ఉంచుకొనే శ్రీహనుమంతునికి వందనం.

**15-శ్రీరమేత్యాలాప పదాని –మునీంద్ర వీణా శిలాతలాని**
**కృత్వా సంయగ్ద్రవ రూపాణి-చకుర్వీణే లగ్నే తాని.**

తా—శ్రీరామ అనే పదం ఆలాపిస్తే శిలా తలాలు కరిగి పోతున్నాయి. వాటికి ఆనించిన వీణలు కరిగిన ఆరాతి ద్రవం లో చిక్కుకోన్నాయి.

**16-సమ సమతాం హనుమతే నితాంతం సమ విశదయతాం హర్ష స్వాంతం**
**వ్యస్మరతాం స్వాగమ వృత్తాంతం –సమ పశ్యతాం స్వ వీణా క్రాంతం.**

తా—అలాశిలా ద్రవం లో చిక్కుకు పోయిన వీణలను గురించి ఆలోచిస్తూ తాము వచ్చిన పని మరిచిపోయి నారద, తుంబురులు తమమనసు పొందిన ఆనందాన్ని తెలియ జేస్తూ వినయంగా వంగి నమస్కరిస్తున్నారు.

**17- తం కపి వర్యం మౌనిఖ్యాతౌ –దృష్ట్వా దృష్ట్వా సమ్యక్ ప్రీతౌ**
**భక్త్యా ముకుళిత హస్తౌ జాతౌ –తౌ ద్వౌ కృతార్ధ తామాయాతౌ "**

తా-ఆ విధంగా ఆ ఇద్దరు మునులు కపివరుని చూసిన కొద్దీ ప్రేమ పొంగి, చేతులు జోడించి నిలబడి తమ జన్మలు సార్ధక మైనట్లు భావించారు.

**18-రామాలాపం విరతం కృత్వా –హనుమాన్ తౌ గాపయితుం మత్వా**
**ఉభౌ యువాం గాయత మిత్యుక్త్వా –తిస్టతి కరతాళం గమయిత్వా. -**

తా—అప్పుడు హనుమ శ్రీరామ గానాలాపం ఆపి, ఎదుట అత్యంత విధేయంగా నిలబడిన ఆ ఇద్దరు మునులను రామనామ గానంచేయమని, తాళాలు అందజేయటానికి సిద్ధం గా ఉన్నాడు.

**19-ఆదౌ తుంబుర ఉవాచ –భక్త్యర్ధీవ సముత్తిస్టన్ ప్రీత్యా**
**సంజ్ఞ ప తేశ్రీ కపయే –సన్న మితాంగః కృతాంజలిః.**

తా—మొదటగా తుంబురుడు భక్తీ ఆవేశం కలగలుపుగా నమస్కారం చేసి శ్రీ హనుమత్ప్రభువుతో ఇలా మాట్లాడటం మొదలు పెట్టాడు,

**20 –నిరస్త సమస్త దురిత వ్రాతం –మామిహ విద్యా గర్వా పేతం**
**సుజన వినీతం సాదుపునీతం –కరోతి హనుమాన్ యుష్మద్గీతం.**

తా-తుంబురుడు హనుమతో "హనుమ స్వామీ!నువ్వు చేసిన భక్తీ గాన లహరి విశ్వ వ్యాప్తమై పాపాలన్నిటిని పటా పంచలు చేసింది. నావిద్యా గర్వాన్ని అణచి వేసింది. సుజనత్వాన్నిచ్చి పవిత్రుడిని చేసింది.

**21-యుష్మద్ధృదయే రామో రమతే త్వత్సమ భక్తో నష్లవగ పతే**
**కపిరప్యచలో సిత్వం సుమతే-నిత్యాద్భుత నూతన భక్తి గతే.**

తా—"కపివరా!నీహృదయం అంతా రామనామ మయం. కోతి చపలుడు అనే మాట నీకు చెల్లనే చెల్లదు. నవ నవోన్మేషణం నీ భక్తి తత్పరత. నీసమాన భక్తుడులేడు.

**22-త్వమేవ శక్తో వీణోద్ధరణే-తే భక్తిర్వా శక్తోద్ధరణే**
**తే మహిమార్వః స్యాదుద్ధరణే-నావం శక్తా వీణా ద్ధరణే.**

తా—ఈ వీణలను ఉద్ధరించే శక్తి మాకు లేదు. వీటిని ఉద్ధరించే భక్తీ శక్తులు మహిమా నీకే ఉన్నాయి హనుమయ్యా.

**23 ఏతచ్ఛ్రుత్వా హనుమాన్ –సర్వ సమర్ధః సర్వం కర్తుం సం**
**శక్తః శ్రీరామ ఏవ –భవతీత్యు వాచా నమస్కుర్వన్.**

తా-ఈ మాటలు విన్న హనుమాన్" అయ్యా!సర్వ సమర్ధుడు, సమస్త సృష్టిచేసి పాలించేవాడు శ్రీరామ చంద్రుడు ఒక్కడే " అని వినయంగా చెప్పి శ్రీ రాముని తలచుకొని నమస్కరించాడు.

**24-యువ యోర్మయి సర్వత్రా ప్యేకం-దైవం విలసతి తచ్చానేకం**
**తత్సం స్తోతుం సర్వం మూకం –సూక్ష్మాత్సూక్ష్మం మహతో స్తోకం.**

తా-మీలో నాలో, అంతటా నిండి ఏకమై, సూక్ష్మాతి సూక్ష్మం గా, అనంతంగా వెలిగే ఆ పరబ్రహ్మ అయిన దైవాన్ని మనం వర్ణించలేము.

**25-పుణ్యే లోకే యుష్మ దదీతాం –తాం సన్మధురాం గాంధర్వ కృతాం**
**తాం పుణ్యజనాప్తాం సంగీతాం-శ్రోతుం వాంచామ్య మరాభి మతాం.**

తా-పుణ్య లోకాలన్నీ మీ అధీనం లో ఉన్నాయి. మీరు నేర్చుకొన్న మధురాతి మధురగానం విని భక్తులు తరిస్తారు. అలాంటి గానాన్ని నాకు వినిపించి కృతార్ధుడిని చేయండి. అని హనుమ వారిని వేడాడు.

**26 ఏతద్వాక్యం శ్రుత్వా –శ్రీనారాయణ పవిత్ర పదాంకితం**
**గీతా మగాయతాం తౌ –మధుర స్వర సత్రమోపేతాం.**

తా-హనుమ ప్రార్ధన విని మునులిద్దరూ శ్రీమన్నారాయణ దివ్య వచన సమన్వితమైన గానాన్ని ఆలాపించటం ప్రారంభించారు.

**27 –శ్రీహరి మనిశం దారయ ప్రుత్వం –పరమాత్మానం సదా భజత్వం**
**సర్వ మసత్యం విద్ధి జగత్వం –నిత్యం సత్యం భగవత్తత్వం.**

తా-ఓమనసా!సదా శ్రీహరిని స్మరించు పరమాత్ముని సేవించు. ఈ కనబడే జగత్తు మిధ్య. భగవత్తత్వం ఒక్కటే నిత్యమైనది.

**28 –ఏవం మునీ పరవశం-స్వగాయతా మాపి బహుదా తత్సమయే**
**శిలే, న మృదుతాంప్రాప్తే –చలనం నాప్తే చ తే వీణే.**

తా-నారద తుంబురు లిద్దరు అనేక విధాల పరవశత్వం తో గానం చేసినా, శిలలు ఏమాత్రం మెత్త పడలేదు. వీణలు కించిత్తుకూడా సడల లేదు.

**29-రామం హృది పశ్యంతం –శ్రీ కపి ముపెత్య తన్మౌ నిద్వంద్వం**
**గర్వం త్యక్త్వా ప్రణమ్య-వినమితి శీర్షం స్తుతిం చక్రే.**

తా-ఎల్లప్పుడూ హృదయం లో శ్రీరామ చంద్రుని దర్శించే కపి వరుడైన అ హనుమ ముందు తమ కుప్పి గంతులు పనిచేయవని తెలుసు కొని గర్వాన్ని వదిలేసి మునులిద్దరు భక్తి ప్రపత్తులతో ముకుళిత హస్తులై హనుమను ఇలా స్తుతించారు.

**30 –హనుమా నుత్థాయ భక్తి–భరితో వినమ్రతో బహు మొద మనాః**
**వీణా ద్వన్ద్వ ముపస్సృత్య –రామేత్యుక్త్వా సమస్తా వీత్.**

తా-అప్పుడు భక్తీ సంతోషాలతో ఆ నారద, తుంబురుల వీణలపై తన దృష్టిని ఒక సారి ప్రసరింప జేసి "శ్రీరామ "అంటూ అనేక సార్లు. జపం చేశాడు.

**31 –బాష్పాలం కృత లోచన వంతం –వినమిత తను మంతం ప్రణ మంతం**
**ద్రుస్టాతన్మయ తో గా యంతం-సద్భక్తే స్ద ను మివ హనుమంతం.**

తా-వినమిత గాత్రం తో భక్తీ పరవశత్వం తో, కళ్ళవెంట ఆనంద బాష్పాలు జలజలా రాలుతుండగా గానం చేస్తున్న హనుమ భక్తియే శరీరం గా అవతరించిన మూర్తి అనిఆ ఇద్దరు తెలుసుకొన్నారు.

**32-శ్రీ హనుమాన్ శ్రీరామం స్మరతి –పరమాత్మా తన్మనసి స్ఫురతి**
**ప్రుద్వి ద్యుత్త ద్విలయో శ్చరతి- శిలాద్వయం ద్రవ రూపం ధరతి.**

తా-హనుమ శ్రీ రాముని స్మరించాడు. అయన మనస్సులో పరమాత్మ తళుక్కున మెరిశాడు. ఆ హృదయ విద్యుత్ కాంతి ఆ రెండు రాళ్ళను కప్పేసి ద్రవ రూపం గా మార్చేసింది.

**33- ధ్యానేన శిలే మ్రుదేవే కృత్వా –వీణే నీత్వా తాభ్యాం దత్వా**
**హనుమాన్ మునీంద్ర వినుతిం శ్రుత్వా –తదాపి రేజే గర్వ మధ్రుత్వా.**

తా-రామ ధ్యానం తో శిలలు ద్రవిం చగా దానిలో చిక్కు పడిపోయిన వీణలు రెండూ పైకి తీసి తుంబుర నారదులకు హనుమ ఇవ్వగా, ఆనంద పరవశం చెంది వారు బహువిధ స్తోత్రాలతో కీర్తించారు.




**34-శ్రీ హనుమంతం దృష్ట్వా –ప్రాంజలి ఘటితస్సన్ నారద మౌనీ**
**సహ తుంబు రేణ జాతాం –స్పర్ధా ముచావ కదా విధాం.**

తా-అలాంటి శ్రీహనుమంతుని కళ్ళారా చూసి అంజలి ఘటించి నారదుడు తుంబు రునితో పూర్వం తనకు జరిగిన విద్యా స్పర్ధను కదగా చెప్పటానికి ప్రారంభించాడు.

**35 –సత్వోం కార స్వ రూప పుచ్ఛం –బ్రవీమి, పురి కదా హ మగచ్ఛం**
**తుంబుర నిలయం ముదమాయచ్ఛన్ –కేయం శృతి రిత్యహ మా ప్రుచ్ఛం "**

తా-ఓంకార రూప వాలం ఉన్న హనుమతో ఇలా అన్నాడు "స్వామీ !పూర్వం ఒక రోజు నేను ఈ తుంబు రుని ఇం టికి వెళ్లాను. అక్కడ నాకు అతి మధురమైనగానం వినిపిస్తే అది ఎక్కడినుండి వస్తోంది అని అడిగాను.

**36 –పృచ్ఛంతం మాం దృష్ట్వా –తత్రైకా గృహ దాసీ తత్రస్తాం**
**వీణాం సంతర్ప యతీ –సంబర వీన్మా మిదం వాక్యం.**

తా-నా ప్రశ్న విన్న ఆ ఇంటి దాసీ నన్ను లోపలి తీసుకొని వెళ్లి అక్కడున్న వీణను చూపిస్తూ ఇలా అంది.

**37 –బహూలోహ సప్త తంత్రీ సహిత-కోమల సుస్వర మాధుర్య హితా**
**వాతాల్పగతే రపి, నాద హితా-తుంబుర వీణా సస్వర రహితా,**

తా—లోహం తో చేయబడి సప్త స్వరాలకు సప్త తంత్రులు అమర్చబడి, సుస్వర సునిసిత ధ్వనులను పలికే ఈ వీణ కొద్ది గాలికే కంపించి చక్కని నాదాన్ని చేస్తుంది ఇదే తుంబుర ముని వీణ. అపస్వరం ఎప్పుడూ పలకదు

**38-.అప్యంత రస్తి తుంబుర –ఇతి పృచ్ఛంతం మా మిద ముచావసా**
**గాతుం తత్ర జగమిషతి –యాత్రా సారే రమా విష్ణూ.**

తా-నేను తుంబురుడు లోపల ఉన్నాడా అనిదాసిని అడిగితె లక్ష్మి నారాయణు సన్నిధిలో గానం చేయటానికి బయల్దేరుతున్నాడని చెప్పింది.

**39- అత్రాంతరే పరీమళ-సువేష తుంబుర ముని స్సమాయాతః**
**శుచి వేషం తం దృష్ట్వా –ప్రపలాయిత వాన్ భయేనాహం.**

తా-ఇంతలో బాగా అలంకరించుకొని తుంబురుడు ఇంటినుంచి బయటికి వస్తూ ఉండగా చూసి భయపడి పారిపోయాను అన్నాడు నారదుడు.

**40 –విద్యాస్పర్ధామయి సజ్జ్నాతా –సంగీతేచ్ఛా మయి సంభూతా**

**స్తుతామయీ శ్రీ భాషా మాతా –సాష్టాంగ నమస్కృతో విధాతా.**

తా-నాకు అప్పటికప్పుడే వీణ గాన విద్య నేర్చుకోవాలనే కోరిక బలీయం గా ఏర్పడింది. వెంటనే విద్యా రాణి సరస్వతీ దేవి, వాణీపతి బ్రాహ్మ దేవుల సన్నిధి చేరి సాష్టాంగ నమస్కారం చేసి నిలబడ్డాను

**41-పితరౌ !గీతం లిఖితం వామే –తచ్ఛ్రేయసే భవిష్యతి వామే**
**తద్విజయాయ భవిష్యతి వామే –తదభీప్సితం ఫలిష్యతి వామే.**

తా-తల్లీ!పితా !నానొసట సంగీతం రాయలేదా మీరు ?నా శ్రేయస్సు, విజయం అపేక్షించి అలా రాయకుండా వదిలేశారా?నాకు ఆజ్ఞానం పొందే అదృష్టం లేదా?

**42-మాతర్మహ్యమ్ భాషా –మదాః సంగీతం నాదాఃకో హేతుః**
**నార్హో వాహం గాతుం –కరుణాద్యాపి మయిస్తినా.**

తా-తల్లీ !చక్కని భాషనిచ్చావు. సంగీతానికి నేను తగనా?ఇప్పటికీ నా మీద నీకు దయ రాలేదా?

**43-ఏవం సంపృచ్ఛ మాన –వాగ్బ్రహ్మణౌతౌ –ద్వాపర యుగే**
**శ్రీ కృష్ణా త్సంగీతమ్-సంప్రాప్స్య –సీతిసమూచాతే.**

తా-అని నారదుడు పదే పదే అడిగేసరికి వాగ్దేవీ చతుర్ముఖులిద్దరు "ద్వాపర యుగం లో శ్రీ కృష్ణ పరమాత్మ వలన సంగీతం నీకు అబ్బుతుంది "అని సెలవిచ్చారు

**44-తతో మయా సుప్తు త ప్త-మబ్దాఃకదం చ నానే కేగమితాః**
**శ్రీ కృష్ణో ద్వాపరేద్య –సముదిత వానితి సమ శ్రౌషం.**

తా—అప్పుడు కొన్నేళ్ళు తపస్సు చేశాను. ద్వాపరం ప్రారంభమైంది శ్రీకృష్ణ పరమాత్మ అవతరించాడనే శుభ వార్త విని మిక్కిలి సంతోషించాను.

**45-యమునా తీరం స్వగమం –సమపశ్యం సర్వ జగన్మనోహరం**
**గో గోపావ్రుత బాలం –సాలగ్రామం యధార్చనే.**

తా-ఒక సారి యమునా తీరానికి వెళ్లాను అక్కడ సాలిగ్రామంలాగా గోవులతో గోపికలతో పరి వేష్టించి ఉన్న గోప కిషోర బాలుడిని సందర్శించాను.

**46-సుమధుర సంగీత రసాధారం –సునీల సుందర మేఘ శరీరం**
**సువర్ణ సన్మణిగణ కటి హారం –సమస్తువం సద్వన సంచారం.**

తా-మధుర సంగీతానికి ఆధార భూతమైన నీల నీరద సుందర శరీరుని, బంగారు రత్నాల మొలత్రాడు ధరించిన బృందావన సంచారిని దర్శించాను.

**47-శ్రీ కృష్ణ గోపాలాస్ –మామపి సమీక్ష్య ముదాధ్య దరహాసః**
**రాత్రి ష్వభ్యా సాత్స –ద్విద్వాస్ స్యాదితి తదా బ్రవీత్**

తా-అప్పుడు సుందర మందహాస వదనార విందుడైన కృష్ణుడు నాపై ద్రుష్టిమరల్చి "రాత్రి వేళసంగీతం నేర్చుకొంటే మహా విద్వాంసు డివిఅవుతావు "అన్నాడు.

**48-లక్షయే బాణా సుస్థితి –మాస్త్యా యధాన్యగా న భవంతి తదా**

**కృష్ణా దీరిత వాచః –మా మేవ గతా సగోపాస్.**

తా-లక్ష్యం వైపు సూటిగా వదిలిన బాణం లాగా శ్రీకృష్ణ మహా వాక్యం గోపాలురకు అర్ధమైందో లేదో తెలియదుకాని నా హృదయానికి మాత్రం సూటిగా తగిలింది.

**59-శ్రీ కృష్ణ స్వామి మనో –జ్ఞాత్వా గచ్చం గోపాల గృహేషు**
**ప్రాన్నాయ సుగీతాయ –న్యచరం బృందావనే నక్తం**

తా—శ్రీ కృష్ణ స్వామి హృదయ రహస్యం తెలుసుకొని, పగటిపూట గోపాలక గృహిణులు ఇచ్చే భిక్ష తింటూ రాత్రి అంతా విద్యాజన కోసం సంచరించాను.

**50-గిరినన భీకర నీలా-రాత్రిర్మా మను చరతీ సదా వతీ**
**సద్గురు మానీ తవతీ-సత్సంగీతం స్వ శిక్ష యత్.**

తా-ఆ విధంగా రాత్రులలో కొండల్లో కోనల్లో నన్ను అను సరిస్తూ సద్గురువుగా నాకు అనుగ్రహం ప్రసాదించి శ్రీ కృష్ణ దేవుడు మంచి సంగీత శిక్షణ అందజేశాడు.

**51 –సంగీతం సంప్రాప్తం –శిలాద్రవీకృత శక్తిర్న ప్రాప్తా**
**సా లక్ష్య సిద్ధి సాధ్యే –త్సద్య జ్ఞాతం మయా ప్రభో.**

తా-"కృష్ణ ప్రభో ! నీ దయ వల్లనాకు సంగీత జ్ఞానం లభించింది. కాని కఠిన శిలలు కరిగించే శక్తి రాలేదే అని బాధ గా ఉంది. ఇది లక్ష్య సిద్ధి చేత కాని లభించదు అనే సత్యమూ తెలిసింది. అన్నాడు నారదుడు.

**52-యత్సంగీతం ప్రాప్తం –తత్కురు నిత్యాభ్యాస మహా నిశితం**
**టం శత్రుం జేష్య సీతి-మామాహ బాల గురు స్తదా.**

తా-"అనుక్షణం సంగీతాన్ని అభ్యాసం చేస్తూ ఉన్నప్పుడే రస సిద్ధికల్గి, శత్రు విజయం సంప్రాప్తమౌతుంది " అని నా బాల గురు మూర్తి శ్రీ కృష్ణుడు శెలవిచ్చాడు.

**53-ప్రణమస్కృత్య శ్రీ కృష్ణాయ –శ్రీమల్లక్ష్మీశ దర్శనాయ**
**గత్వా సంగీతే విజయాయ –ప్రోక్తం సర్వం సర్వజ్ఞాయ.**

తా-శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కరించి శ్రీ లక్ష్మీ నారాయునులను సందర్శించి, సంగీత విద్యా విజయం కోసం మీ దగ్గరకు వచ్చాను అయినా మీకు తెలియని విషయం ఉంటుందా మహాత్మా అన్నాడు నారదుడు.

**54 –కధ మాప స్సంగీతం –కస్తే గురుః క్వని వసతి స మహాత్మా**
**ఏవ మహం సంప్రోక్త –స్తదా వద మిదం హరిం దృష్ట్వా.**

తా- అప్పుడు అయన "సరే,సంగీతా విద్య ఎలా నీకు లభించింది ?నీగురుమూర్తి ఎవరు?ఎక్కడ ఉంటారు ?అని శ్రీహరి ప్రశ్నించాడు, నేను ఈ విధం గా సమాధానం చెప్పాను –

**55-సద్గో ధూళి విభూత్యా విభాతి –భూలోకే మద్గురు రా భాతి**
**గురుస్తు బాల ఇవ ప్రతిభాతి –శ్రీ దక్షినాఖ్య శివ ఇవ భాతి.**

తా –గోధూళి విభూతిగాధరించి భూలోకం లో నా గురుదేవుడు బాలకృష్ణుడు సాక్షాత్తు శ్రీ దక్షిణ మూర్తి లాగా భాసిస్తున్నాడు.

**56- అధికోవా కిం తుంబుర ఏవ –ఆపి నాహామస్మి గాయక ఏవ**
**పరీక్ష తాం మాం దేవో త్రివ –నాచే సద్గురు ముప గచ్ఛామ్యేవ.**

తా- "స్వామీ !నేను గాన విద్య నేర్చుకొన్నాను కదా. ఇప్పుడు మీరు తుంబురు డిని, నన్ను పరీక్ష చేసి ఎవరు మాలో అధికులో నిర్ణ యించ గలరా?ఒక వేళ నేనే అధికుడిని కాకపోతే మళ్ళీ మాగురువుల దగ్గరకు వెళ్ళిపోతాను "అని విన్న వించాను.

**57-శ్రీహరిణా శ్రీ వాణ్యా-న్యాయ స్థానే క్రుతేదికారిణ్యౌ**
**తాభ్యాం నిర్ణీత మేవ –సత్యమితి హరిస్తదావదత్.**

తా –న్యాయ నిర్ణేతలుగా శ్రీ లక్ష్మీ సరస్వతులు ఉంటారని వారి నిర్ణయమే తుది నిర్ణయమని హరి సెలవిచ్చాడు.

**58-శత పత్ర నేత్ర పరిచిత మిత్రం –ఆహూతం సద్యో మమ శత్రుం**
**తుంబురు నామక శుద్ధ చరిత్రం –సమ పశ్యమిమం తదా పవిత్రం.**

తా –ఇం త వరకు నాకుప్రత్యర్ధిగా ఉన్న పవిత్ర చరిత్రుడు, విప్పారిన పద్మ నేత్రుడు అయిన తుంబురుని పిలిచి నాకు పరిచయం చేశాడు.

**59-శ్రీహరి నిశ్చిత కాలే –తత్రావాం ద్వౌ సమగాచ్ఛావ ముదా**
**సభ్యై ర్విద్యుద్దీపై –ర్యత్రస భాసా ప్రకాశతే.**

తా –శ్రీహరి ఏర్పాటు చేసిన ముహూర్తానికి మేమిద్దరం విద్యుద్దీప కాంతులతో మిరు మిట్లు గోల్పుతున్న సభావేదిక కుచేరాం

**60-కుచేల వేషె నాహం-పురాణ కథకో ధనో యధా రేజే**
**సూజ్వల వేషె నహం-శ్రీ హరిదానో యదా రేజే.**

తా –నేను పురాణ కాలక్షేపం చేసే పేద కదకుడిలాగా కుచేల వేషం వేసే వేషధారిలాగా ఉంటె తుంబురుడు పట్టు బట్టలు ధరించి బాగా ప్రకాశిస్తూ కనిపించాడు.

**61-అయమా రేభే స్వర మగ్నే న –భైరవి రాగేనా సుతానేన**
**ఆహామారేభ మ్రుదుగానేన –హంసధ్వని రాగ సులగ్నే న.**

తా-తుంబురుడు తీవ్ర స్వరం తో భైరవ రాగాలాపన చేశాడు. నేను నెమ్మదిగా సంయమనం తో మృదువైన "హంస ధ్వని "రాగాన్ని ఆలాపించాను.

**62-సమ భూదేవ స్వర సంశ్లిస్టః-అభూవ మహం సురాగా విస్టః**
**వైకుంఠ గణో బహు సంతుస్టః –శ్రీమద్విష్ణుః-సద్యః పుష్టః**

తా –అతడు సప్త స్వరాలను మేళ విన్చిపాడాడు. నేనూ నిండుగా రాగాలాపన తో పాడాను విష్ణులోక జనాలకు తుష్టి శ్రీ మహా విష్ణువుకు పుష్టి కలిగాయి.

**63-అనయోః శ్రేస్టఃకస్యా –దిత్యాహ శ్రీ భగవాన్ హరిస్తదా**
**ప్రత్యూ చతుర్మదాశ్రీ –హరయే నమరె రామా వాణ్యౌ.**

తా-నారద తుమ్బురులలో ఎవరు శ్రేస్టూలు అని శ్రీహరి లక్ష్మీ సరస్వతులను అడిగాడు. ఇద్దరూ ఆలోచించి తమ నిర్ణయాన్ని ప్రకటిం చారు.

**64-సురభూమిషు సంగీతం –యత్తొమ్బురీయ మితి తద్బహు రమ్యం**
**తస్మాత్తుంబుర గానం –వర మిత్యు వాచరమా దేవి.**

తా-దేవలోకం లో సంగీతం చాలా అవసరం. బహు రమ్యమైండి శ్రేస్ట మైనదీ తుంబురు గానమే ఐ లక్ష్మీ దేవి ప్రకటించింది.

**65-శ్రీ భారత సంగీతం –యత్సర్వ లోక రమ్యమితితద్ధువం**
**తన్నారదసంగీతం –వరమిత్యువాచ సరస్వతీ.**

తా –భూలోకం లో ముఖ్యంగా భారత దేశం లో వ్యాపించిన భారతీయ సంగీతం అన్ని లోకాలను ఆనందింప జేస్తుంది. అలాంటి డి అయిన నారద సంగీతమే శ్రేష్టం అని సరస్వతీ దేవి తన తీర్పు చెప్పింది.

**66-యువయోరుభయయోః కో విజయీతి –వక్ష్యతి వాయోస్సుట ఏ వేతీ**
**యువయోర్వాన్నా ఫలిష్యతీతి –హరి రాహ గచ్చతం తత్రేతి**

తా-"మీ ఇద్దరి సంగీతం లో ఎదిగోప్పదో మీలో విజయం ఎవరిదో నిర్ణయించటానికి సమర్ధుడు వాయుసుడు అయిన హనుమంతుడు ఒక్కడే. అక్కడికే వెళ్లి తెల్చుకోండి "అని శ్రీహరి చెప్పాడు.



**67-కపిరతి లజ్జాం నధరేతమితి-గర్వం ధృత్వా నచ రేతమితి**
**సునమ్ర మనసా గాఏతిమితి –హరి రాహ తత్ర గచ్చేతి మితి.**

తా-"హనుమ కపి అని సిగ్గుపడకండి. గర్వం లేకుండా హాయిగా వినమ్రంగా మనసారా భక్తితో గానం చేయండి "అని మమ్మల్ని ఇద్దరినీమీ దగ్గరకు హరిపంపాడు.

**68-తత్ర తద్దై పేత్యుక్త్వా –కృత్వా ప్రణామ మావా మాయాతో**
**త్వదీయభక్తి మహిమ్నా –విజయీ క ఇతి ప్రనిస్చితః.**

తా-శ్రీహరికి కృతజ్ఞతలతో నమస్కరించి మీ సన్నిధికి వచ్చాం మేమిద్దరం. భకి మహిమకు విజయం అనేది లేదు అని మాకు అర్ధమైపోయింది.

**69-యః పాషాణౌ ద్రావయతీతి –యస్సర్వాన్ విస్మాయ యతీతి**
**యో భక్తాన్ సంతార యతీతి –సమహాన్ నిశ్చిత ఏవ జయీతి.**

తా-భక్తీ మహిమ తో కటిక రాళ్ళు కూడా కరిగిపోతాయి. ప్రాణికోటి అన్తాఆస్చర్యమ్ లో మునిగిపోతుంది. తరించటానికి అందరికీ భక్తిమాత్రమే సాధనం. అలాంటి మహిమ ఉన్న వాడె విజేత అని మాకు గట్టి నమ్మకం కలిగింది.

**70-యస్మన్నాసన పీతే-నిత్యం సీతా శ్రీ రామ లక్మణాన్**
**సంస్థాప్య సుపశ్యసీతి- శ్రున్మస్తాన్ దర్శయ ప్రభో.**

తా-స్వామీ హనుమా !ణీ మానస పీతం పై శ్రీసీతా రాములు నిత్యం భాసిస్తూ ఉంటారని విన్నాం. కానీ ప్రత్యక్షం గా చూసే భాగ్యం మాకు దక్క లేదు. దయ చేసి ఒక సారి వారందరి దర్శన భాగ్యాన్ని మాకు ప్రసాదించు "అని పేడుకొన్నారు నారద తుంబురులు.

ర్చ



**71-ఏవం నిశమ్య హనుమాన్ –క్షణం నిమీలిత నేత్రో ప్రుచ్చిత్వా**
**సీతా శ్రీరామచంద్ర –లక్ష్మణ సంస్థితి మదర్శయత్.**

తా – నారద తుంబుర ప్రార్ధన విని హనుమ క్షణ కాలం నిమీలిత నేత్రుడై, హృదయ కుహరం విప్ప జేసుకొని శ్రీ సీతా రామ లక్ష్మణుల దర్శనాన్ని వారిద్దరికీ ఇచ్చాడు.

**72-తాభ్యాం గర్వ సుస్టూత్యక్త –తత్రాధిక ప్రసంగో ముక్తః**
**శ్రీ రామ ఇత్యనరారతముక్తః –హనుమాన్ త్రుస్తో వక్తు మశక్తః**

తా-వెంటనే వారిదరి గర్వం ఖర్వమై, అధిక ప్రసంగాన్ని ఆపేశారు. శ్రీరామనామ సంకీర్తన చేసి హనుమకు ఆనందాన్ని చేకూర్చారు.

**73-శ్రీరామ నామ సద్భాజనేన-తచ్చైల వనం సనాతనేన**
**సంయగ్ధ్వనితం ప్రతిస్వనేన –సర్వం భువనం పూత మనేన.**

తా –అలా వారిద్దరూ శ్రీ రామ నామ భజన మధురాతి మధురంగా చేయగా శైల వనాంతరం అంతా ప్రతిధ్వనించి, మూడు లోకాలను పవిత్రం చేస్తోంది.

**74-హృదయే దైవం కః స్థాపయతి –హృదయం చిత్వా కో దర్శ యతి**
**గానేన శిలాః కో ద్రావయతి –సమహాన్ హనుమానేకో జయతి.**

తా-హృదయం లో ప్రతిస్టింప బడిన దైవాన్ని తెర తీసి నట్లు హృదయాన్ని చీల్చి దర్శన మిప్పించి,తన అఖండ గానమహిమతో కఠిన శిలలని కరగించిన హనుమ ఒక్కడే జయ శాలి.

**75-సద్భజన పరా బహవస్సంతి-. సజ్జాప నిష్టా బహవస్సంతి**
**వేదా సక్తాబహువస్సంతి-హనుమత్తుల్యాః కతి వా సంతి.**

తా –సద్భజనానంద కరులు ఎదరౌన్నారు. జప నిష్టాగరి ష్టూలూ చాలా మంది ఉన్నారు. కాని శ్రీ హనుమత్ప్రభువు కు సాటి యైన వారేవ్వరున్నారు ?అంటే ఎవ్వరూ లేనే లేరు.

**76-సుస్థిర చిత్తో యః కో ప్యస్తి –బ్రహ్మ చారీయః కో ప్యస్తి**
**జీవన్ముక్తోహః కో ప్యస్తి-హనుమత్తుల్యో నైకో పస్తి.**

తా –అలాంటి నిశ్చల చిత్త భాక్తాగ్రగాన్యుడు, అలాంటి నిష్కల్మష బ్రహ్మ చారి, అట్టి నిరామయ జీవన్ముక్తుడు అయిన శ్రీ హనుమ కు సాటి మరొకడు లేడు.

**77-ప్రబోదనే యస్య ణ సంతోషః-సమాచారాన ఏవ యస్య తోషః**
**అత ఏవ రామ చంద్రే తోషః-తాదృశ భగవాన్ హనుమానేషః.**

తా –పరులకు ఉపదేశం చేసి నంత మాత్రం తో సంతోషం రాదు. స్వీయ ఆచరణలోనే సంతోషం పొందగలం. మహా మహిమాన్వితులలో నిగూఢం గా శక్తి నిలిచి ఉంటుంది అని నారద తుంబురు లిద్దరూ గ్రహించారు.

**78-శ్రీరామ పదే సంపశ్యంతం –మందిర హృదయే వందన వంతం**
**బహిస్చ దృష్ట్వా శ్రీ హనుమంతం –తా మే నాతే మహిమా వంతం.**



తా –తన హృదయం అనే మందిరం లో నూ, బయటనూ, శ్రీరామ పాదారవింద సన్నిధి లోను వినమ్రుడై వందనం చేసే శ్రీ హను మంతుని దర్శించి మహా మహిమాన్వితునిగా అర్ధం చేసుకొన్నారు మునులిద్దరూ.

**79- ప్రుచ్చేదనం కద మితి-క్షణం సమాలోచ్య, ప్రాజ్య మహిమ్నాం**
**మహతీ శక్తి ర్గూఢా-స్వాదితి మౌనిద్వాయ మేనే.**

తా –మారుతిలాగా హృదయాన్ని చీల్చటం ఎలా సాధ్యం ?అని క్షణకాలం ఆలోచించి మహా మహిమ గల మహనీయులలో శక్తి నిగూఢం గా ఉంటుందని నారద తుంబురు లిద్దరూ గ్రహించారు,

**80-బ్రహ్మాది సురా మునయః –సస్త్రీ కాస్తద్భూతల మావ తేరుః.-**
**సత్పుష్పాణి వవర్షుః –శ్రీ రామాలయ కాపి శీర్షే.**

తా-బ్రహ్మాది సకలదేవతలు తమ దేవేరులతో సహా భూమిమీదకు శ్రీ రామాలయం గా రూపొందిన శ్రీ హనుమంతుని శీర్షం పై మహదానందం తో పుష్ప వృష్టి కురిపించారు.

**81-సర్వస్మిన్ స్తుత వతి సతి-యదా స్వరూపం ధృత్వా శ్రీ భగవాన్**
**హనుమాన్ సువర్చ లాధ్యః –సత్కల్యాణం తదాప్తవాన్**

తా-ఈ విధంగా సకల జగత్తు కీర్తిస్తుండగా శ్రీ హనుమత్ భగవానుడు స్వస్వరూపాన్ని పొంది సువర్చాలాదేవి ని కళ్యాణ మాడాడు.



**82-శ్రీ హనుమత్కల్యాణం-మంత్రైస్తాన్త్రై ర్విధి వత్తే**
**తస్మై తస్మై సువస్తు –జాతం దత్వా ప్రతిష్టూవుః**

తా-విధిపూర్వక మంత్రం తంత్రాలతో శ్రీ హనుమ కల్యాణం జరిపించి మంగళాభరణాలను సమర్పించి సంతోష స్వాన్తులయ్యారు.

**83-రామాలయ నటంతం –సంభాషంతం క్వాపి చ నా వశ్యం**
**తాదృశ మత్రా పశ్యం –శ్రీ కపి మితి నారదో మేనే.**

తా-ఈ కదిలే, మధురంగా మాట్లాడే "శ్రీ రామాలయాన్ని "ఎక్కడైనా ఎప్పుడైనా ఎవరైనా చూశారా?అలాంటి సాక్షాత్ శ్రీ రామాలయం గా భాసించిన శ్రీ హనుమత్ ప్రభువు ను సందర్శించే భాగ్యం కలిగిందని శ్రీ నారద తుంబురు లు సంతోషా నందాలుపొందారు.,

**84-శ్రీ హనుమాన్ సర్వేభ్యః –ఫలాని సువస్తు చయంచ దత్వా, సం**
**తుష్టావ నమ్రత ప్తాన్ –తేతం స్తుత్వా తతో జగ్ముః**

తా-ఇలా తన చుట్టూ పరివేష్టించి ఉన్న వారందరికి ఫలాలను, పుష్పాలను నవ దంపతులు సమర్పించి వినమిత గాత్రులై నిలిచారు. అప్పుడు పుణ్య రాశి అయిన శ్రీ హనుమను స్తుతించి సెలవు పొంది వెళ్ళిపోయారు.



**85-శ్రీహనుమాన్ శ్రీ సువర్చ-లా ముపగామ్య సుఖ ముపిత్వా పుష్టం**
**తుష్ట మితి సుపుత్ర ద్వయ –మేత్య మహా భక్త ఇతి ప్రఖ్యాతః.**

తా-శ్రీ హనుమత్ప్రభువు శ్రీ సువర్చలాదేవితో సుఖ జీవనం చేసి "పుష్టుడు, తుష్టుడు"అనే ఇద్దరు మంచి పుత్రులను పొంది, మహా భక్తుడుగా విరాజిల్లాడు.

**ఓం తత్సత్ –శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ**
**మంగళం మహత్**
**ఇతి శ్రీ గురజాడ పూర్ణ చంద్ర ప్రణీతం శ్రీ సువర్చ లాంజనేయం.**
**శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ**
**అంకితం**
**"అతులిత బుద్ధి బలసమ –న్విత !వివినుత సువర్చలాంజ నేయ యిదె యొసం**
**గితి గృతి, పల్కింపస్ ద –క్షత, కాపాడ గాదె !పూర్ణ చంద్రుడ !తండ్రీ.**

**శ్రీ సువర్చ లాంజనేయం సర్వం సంపూర్ణం**



మనవి –ముందే మనవి చేసినట్లు కృష్ణా జిల్లా ఉయ్యూరు సమీపం లోని గురజాడ గ్రామస్తులు, మా కు గురువుగారు,తెలుగు పండితులు అయిన స్వర్గీయ గురజాడ పూర్ణ చంద్ర శర్మ గారి సంస్కృత కృతి "శ్రీ సువర్చలాంజ నేయం ".చక్కని చిక్కని శ్లోకాలతో, మహా సుందరంగా రాశారు ప్రతి శ్లోకానికి వారే సూక్ష్మగా తాత్పర్యం రాశారు. కాని అది కొంత గ్రాంధికం లో నడిచింది. నేను సాహసించి అందరికి సులభం గా అర్ధమయేట్లు సరళమైన తెలుగు లోకి మార్చి మీకు అందజేశాను. ఇందులో గుణాలన్నీ మా గురువుగారు బ్రహ్మశ్రీ పూర్ణ చంద్ర శర్మ గారివి. లోపాలన్నీ నావి అని సవినయం గా మనవి చేసుకొంటున్నాను.

ప్రారంభం లోనే చెప్పినట్లు శ్రీ మన్మధ నామ సంవత్సర వైశాఖ బహుళ దశమి 13-5-2015బుధవారం శ్రీ హనుమజ్జయంతి నాడు స్వామి వారల శాంతి కల్యాణోత్సవ సమయం లో ఆవిష్కరింప బడే నేను రాసిన పదవ పుస్తకం, సరసభారతి ప్రచురిస్తున్న పదిహేనవ గ్రంధం అయిన " 'దర్శనీయ శ్రీ ఆంజనేయ స్వామి దేవాలయాలు "గ్రంధంలో" శ్రీ సువర్చ లాంజనేయం "ను చేరుస్తున్నామని మనవి చేస్తున్నాను.

# వాశిష్ట గణపతి ముని

## "ఉమా సహస్రం "లో ఉమా మహేశ్వర తత్వాన్ని ఆవిష్కరించిన వాశిష్ట గణపతి ముని

ఫిబ్రవరిలో శ్రీ రమణాశ్రమాన్ని సందర్శించినపుడు అక్కడి పుస్తక శాలలో కావ్య కంఠ గణపతి ముని సంస్కృతం లో రాసిన వెయ్యి శ్లోకాల "ఉమా సహస్రం "కొన్నాను. దానికి తెలుగు అర్ధ తాత్పర్య, వివరణలను శ్రీ పన్నాల రాధా కృష్ణ శర్మ తేలిక భాష లో రాశారు. శర్మగారు జిల్లెళ్ళమూడి అమ్మగారి ఒరిఎంతల్‌ఈ కాలేజీ ప్రిన్సిపాల్ చేసి రిటైరైన సంస్కృతంధ్రాల్ల పండితులు. గీర్వాణం -2 లో వారిని గురించి రాయటానికి బ్రహ్మశ్రీ తూములూరిశ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు ఇచ్చిన ఫోన్ నంబర్ ను బట్టి హైదరాబాద్ లో వారింటికి వెళ్లి ఇంటర్వ్యూ చేసి, వారి పుస్తకాలు తీసుకొని వారి గురించి రాసి సంతృప్తి చెందాను అప్పటినుంచి సరసభారతి పుస్తకాలు వారికి పంపుతూనే ఉన్నాను చాల శాంత సౌజన్యమూర్తి శర్మగారు ఆయన సతీమణిగారుకూడా మంచి ఆతిధ్యమిచ్చారు నాకు మా అబ్బాయి శాస్త్రికి., ఈ నెలలో ఒక వారం కిందటే చదవటం మొదలు పెట్టాను. బ్రాహ్మణ స్వామి అని పిలువా బడే ఆయనకు "భగవాన్ రమణ మహర్షి "అని పెట్టి, మహర్షి చేత "నాయన "అని అందరిచేతా నాయన గారు అని పించుకున్న గణపతి ముని శ్రీ రమణా స్థాన కవీశ్వరులు. అమ్మవారి పరమ భక్తులు. ఇరవై రోజుల్లో ఉమా సహస్రం రాస్తానని చెప్పి రాయటం మొదలు పెట్టి, మూడు వంతులు రాసి, కుడి చేతి బొటన వ్రేలికి వ్రణం ఏర్పడటం వలనకొద్ది రోజులు ఆగి, ఆపరేషన్ జరిగి కట్టుకట్టటం వల్ల మళ్ళీ ఆగి, ఇంకా ఒక్క రోజే మిగిలి ఉండటం రాయాల్సిన శ్లోకాలు 250శ్లోకాలు ఉండటం వలన చివరి రోజు 5గురు లేఖకులను ఏర్పరచుకొని, మహర్షి తన వెనుక ఆశీనులవ్వగా, అయిదుగురికి వరుసగా శ్లోకాలు చెప్పగా వారు రాస్తూంటే అర్ధ రాత్రికి ముందే కావ్యాన్ని ముగించిన అఘటన ఘటనా సమర్ధులు గణపతి ముని. సాక్షాత్తు వినాయకుని అవతారమే. వెనక ఉన్న భగవాన్ సమాధి స్తితి నుండి లేచి "నేను చెప్పిందంతా రాశావా?"అని అడిగి ఆశ్చర్యం కలిగిస్తే, "అలాగే గ్రహించి గ్రంధాన్ని రాశాను "అని వినయం గా సమాధానం చెప్పారట. ఇదొక అపూర్వ సన్నివేశమే.



గణ పతి ముని పుస్తకాన్ని ప్రధమ మొదలైన శతకాలుగా శతకం లోని భాగాలను "స్తబకము "లు(పూల గుత్తులు ) గా పేరు పెట్టి ఒక్కొక్క స్తబకం లో 25శ్లోకాలుం డేట్లు, ప్రతి స్తబకం కధాంశాన్ని బట్టి ఛందస్సును ఉపయోగించి ఎంతో ఛందో వైవిధ్యాన్ని పాటించారు. బహుశా అమ్మవారి దివ్య సుందర విగ్రహాన్ని మనోలోకం లో దర్శించి రాసి సమర్పించిన భక్తి తాత్పర్య సుమాలివి. మునికి వేదం ఉపనిషత్, శాస్త్ర, దర్శన పురాణాది గ్రంధాలపై ఉన్న అపారమైన పాండిత్య ప్రతిభకు నిదర్శనం, అమ్మకు ఛందో రూప కదంబ పూల మాల ఇది. మొదటి శతకం మొదటి స్తబకం లో శ్రీ ఉమా మహేశ్వర తత్వావిష్కరణ నన్నెంత గానో ఆకర్షించింది. ఆ వివరాలే మీ ముందుంచుతున్నాను.

### మొదటి స్తబకం

మొదటి స్తబకం లో అమ్మ వారి మహా శక్తి తత్త్వ వివరణ వేదోపనిషత్ స్పర్శగా ఉంది. ఆ శక్తి అన్నిటా అవిచ్చిన్నం గా వ్యాపించి ఉంది. యోగం లో కూడా ఆశక్తి తరంగాలు గోచరిస్తాయి. కాని యదార్ధ స్వరూపం కాన రాదు. శక్తి తరంగాలు అంటే శక్తి వివర్తనాలు అంటే రూపాంత రాలు. మనకంటికి కని పించేవి కనిపించని తరంగాలు గా. అనుభవేక వేద్యమే కాని దృష్టికి గోచరించేవి కావు. ఆ మహా శక్తి సత్ స్వరూపుడు, సర్వ వ్యాపకుడు అయిన పరమేశ్వరుని తపశ్శక్తియే. ఆయన నుండి వేరు చేయటానికి వీలు లేని చిచ్ఛక్తియే. ఆ శక్తి లీలా దేహ ధారిణి అయిన హైమవతి. అదే మనదేహం లోని కుండలినీ శక్తి.

సత్య స్వరూపుడైన పరమ పురుషుడు, అన్నిలోకాలకు నాభి యై, కేంద్రమై సత్యలోకం అన బడ్డాడు. ఆయన నుండి వెలువడి, అంతటా వ్యాపించే ఆయన సూక్ష్మ శక్తియే తపోలోకం. అఖండ వ్యాపన శీలుడు అని చెప్పటానికే, అన్నిటికీ ఆద్యుడు అని వివరించటానికే "లోక "శబ్దాన్ని వాడారు. బండి చక్రం నాభి నుండి ఆకులు(కడ్డీలు) చుట్టూ వ్యాపించి ఉన్నట్లు పరమ పురుషుడైన సత్య లోకం లో సర్వ లోకాలు ప్రతిష్టితాలై ఉన్నాయి. వృత్తానికి మధ్య భాగం దాని కేంద్రం అయినట్లే అన్ని లోకాల సముదాయానికి కేంద్రం సత్య లోకం. అదే పరమ పురుషుడు. ప్రాణి నుండి ప్రాణాన్ని వేరు చేయటానికి వీలు లేనట్లు, పరమ పురుషుని నుండి శక్తిని వేరు చేయటానికి వీలు లేదు. సత్య స్వరూపుడు, శక్తుడు అయిన పరమ పురుషుని సహజ మైన సూక్ష్మ శక్తి యే తపస్సులేక తపోలోకం. అగ్ని నుండి పొగ వచ్చి అన్ని వైపులకు వ్యాపించి నట్లు పరమ పురుషుని నుండి వ్యక్తం అయ్యే గూడార్ధాలన్ని వెలుపలికి వచ్చి అయన శక్తి తరంగాలన్నీ అంతటా వ్యాపిస్తాయి. ఇదే జనో లోకం. గూడార్ధాలు అంటే అవ్యక్త స్తితి లో నుండి పుట్టే, పుట్టిన, పుట్ట బోయే అన్ని రకాల జగత్ జీవ ఉపాధులకు ఉపాదాన కారణాలైన పదార్ధాలు అని అర్ధం. పరమ పురుషుని నుండి వాని ఆవిష్కారం ధూమం లాగా ఉంటుంది. అది పరమ పురుషుని తపో జ్వాలల యందంతటా వ్యాపించి జనోలోక మైంది. జనో లోకం అంటే జన్మించే లోకం అని అర్ధం.



పరమ పురుషుని శక్తి సహజ సిద్ధం. దాని స్వభావం కూడా ఆయన లోపల రహస్యం గా ఉన్న పదార్ధాలను ఆవిష్కరింప చేయటమే కనుక జన, తప, సత్య అనే మూడు పేర్లుగల త్రిలోకాలు వేరు చేయటానికి వీలు లేవని భావం. వేదాంతులు చెప్పే సత్ చిత్ ఆనంద లక్షణాలు ఏకం, అద్వితీయం అయిన పరబ్రహ్మ సృష్టి సంబంధం దృష్ట్యా మూడు లోకాలు గా ఉంటాయని గణపతి మునికవి వ్యాఖ్యానించారు. కనుక సత్ –సత్యం, చిత్ –తపశ్శక్తి, జనం –ఆనందం. దీని తర్వాతా దక్ష స్వరూపాన్ని, దాక్షయిణీ జన్మ రహస్యాన్ని దక్ష యాగం కధలో ఉన్న అంతరార్ధాన్ని కవి గొప్పగా వ్యాఖ్యానించారు. వైదిక భాషలో ఉన్న పార్వతీ శబ్దానికి అపూర్వమైన అర్ధాన్ని ఆవిష్కరించారు గణపతి ముని. మొదటి స్తబకం లోని ఇరవై అయిదు శ్లోకాలు "ఆర్యా వృత్తం "లో రాసి అమ్మవారి మహాత్యాన్ని "ఆర్యా మహాదేవతా "అన్న సత్యాన్ని ప్రతిష్టించారు. ఆ విభాగాన్ని తనివి తీరా దర్శిద్దాం.

"అఖిల జగన్మాతోమా తమసా తాపేన చాకులా నస్మాన్ –అనుగ్రుహ్నా త్వను కంపాసుదార్ద్రయా హసిత చంద్రికయా "అని ప్రధమ శ్లోకం తో అన్ని లోకాలకు తల్లి అయిన ఉమాదేవి చీకటి,అజ్ఞానం చేత ఆధ్యాత్మిక ఆది దైవికాలన బడే మూడు తాపాల చేత పీడింప బడే మమ్మల్ని దయామృతం తో చల్లనయిన నవ్వు వెన్నెలతో అనుగ్రహించాలి అని ప్రార్ధించారు గణపతి ముని. తర్వాత సమస్త వస్తువుల్లో యెడ తెగ కుండా ప్రవహిస్తూ దేశ కాల పరిమితుల్లేని ఆలోచన కల యోగం లో దర్శింప తగిన తరంగాలుకలిగి జరామరణ ములకు అతీతమైన, ఇలాంటిది అని వివరించటానికి వీలు లేని మహా శక్తికి నమస్కరించారు. ఆ శక్తి పర మేశ్వరుని చుట్టూ వ్యాపించిన తపశ్శక్తియే అని ఆమె యే లీలా స్వరూపం లో హైమవతి –పార్వతి అయిందని, ఆమెయే కుండలినీ శక్తి అని కీర్తించారు. పొగ మధ్య ఉన్న వేడిమి వంటి శుద్ధ జ్వాలతో సమానమైన శక్తినే కొందరు స్వర్గం అన్నారు. పొగ లాంటి జనోలోకం అవధులు లేనిది. ఈజనోలోకాన్నే వ్యోమం, అంతరిక్షం, గగనం అనే పేర్ల తో పిలిస్తారు.




జనోలోకం లో ఆకాశం అనే ఉపాధి సంపర్కం తో ఇలాంటి వాడు అని నిర్వచించ టానికి వీలు లేని అవ్యక్తుడైన పరమ పురుషుడి కంటే వేరుగా చెప్ప బడే స్వాభిమానం గల ఒక వ్యక్తి జన్మించాడు. కాంతి మార్గం అయిన జ్వలించే ఆకాశ రూపం అయిన ఈ జనోలోకామే దక్షుడు అని గూఢ భాషలో చెప్పారు. ఆ దక్షుడి గర్భాన జనించిందే దాక్షాయణి. జ్వలిత ఆకాశం దక్షుడు అయ్యాడని చెప్పటానికి "అదితేర్దక్షో అజాయత దక్షాద్వాదతిః పరి "అని వేదమే చెప్పింది. అదితి నుండి దక్షుడు పుట్టాడు దక్షుడి నుండి అదితి జన్మించింది. పరమేశ్వరుడికి అభిమాని అయిన శక్తి దక్షాత్మ ప్రకాశానికి ముందు కూడా ఉంది. ఈ విషయాన్నీ "సత్యా "అనే మాట తో చెప్ప బడింది శ్లోకం లో. సతీ శబ్దం కూడా సర్వదా ఉంటుంది అని సత్యా శబ్దం లానే అర్ధాన్ని చెప్పింది. నిజం గా దక్షుడనే పేరు గల ఆకాశానికి జనని అయిన శక్తి లక్షణా వృత్తి చేత పుత్రిక వుతుంది. ఈ విధం గా అదితి నుండి దక్షుడు, దక్షుడి నుండి అదితి జన్మించాయని చెప్పిన వేద వచాన్ని సమర్దిన్చాడుకవి. జనని అయిన శక్తికి లక్ష్యార్ధం " సుత "అంటే పుత్రిక అవుతుంది

"జగతాం మాతా పితరౌ సతీ భవౌ కేపి పండితాః ప్రాహుహ్ –అదితి ప్రజా పతీ తావ పరేషాం భాషయా విదుషాం "అని పద మూడవ శ్లోకం లో స్తుతించారు ముని. అంటే లోకాలకు జననీ జనకులు దాక్షాయణీ శివులు అని కొందరు పండితులు చెప్పగా, మరి కొందరు ఆ జగజ్జననీ జనకులే అదితి కశ్యపులని పురాణ కధనం గా చెప్పారని అర్ధం. కేన ఉపనిషత్ చెప్పిన దాన్ని శ్లోక బద్ధం చేసి లోకం లో కళ్ళున్న వాళ్ళలో దేవేంద్రుడు ధన్యుడని కారణం ఆది మహిళ అయిన ఉమా దేవిని మొదటి సారి చూడ గలిగాడని మిగిలిన దేవతలేవ్వరికీ ఆ భాగ్యం కలగ లేదని చెప్పారు. ఇంకో శ్లోకం లో ఉత్తమ సౌందర్య స్త్రీలలో మొదట గా చెప్ప దగినది గౌరీ దేవి అని కొందరు అంటే, హిమాలయం దేవతాత్మ అని కాళిదాస మహాకవి కుమార సంభవం లో చెప్పాడన్నారు.

వేద భాషలో మేఘాన్ని పర్వతం గా భావించారు. ఆ పర్వతం నుండి వచ్చిన గంభీర ఘోష కల సహింపరాని విద్యుచ్ఛక్తి జనించింది. నిరుక్తం లో మేఘానికి ఉన్న ముప్పై పేర్లలో పర్వతం అనే పేరు కూడా ఉంది. అంత రిక్షం తన రేణు సమూహం నుండి ఆహారాన్ని స్తోందని కాని పరమేశ్వరుడికి ఇవ్వటం లేదని దక్ష యజ్ఞ పరం గా ఇరవై ఒకటవ శ్లోకం చెప్పారు గణపతి ముని. దీనికి వివరణ –ఆకాశమే దక్షుడు.

దక్షుడి నుండే అన్నీ పుట్టాయి. అన్ని ఆయన్నుంచే వచ్చాయి ఈ సామగ్రి సృష్టికే ఇవ్వ బడుతున్దికాని పరమ పురుషుడైన ఈశ్వరునికి ఇవ్వ బడదు అని దక్ష యజ్ఞం లో శివుడికి దక్ష ప్రజాపతి హవిర్భాగాన్ని ఇవ్వక పోవటాన్ని సమర్ధించారు కవి ముని. శక్తి అంతా వ్యాపించి ఉన్నా అది రహస్యం గా ఉంటుంది కనుక మామూలు దృష్టికి గోచరం కాదు. నష్టం అయినట్లు కనిపిస్తుంది. అందు చేతనే దక్ష యజ్ఞం లో సతీ అంటే దాక్షాయణి నిర్యాణం చెప్ప బడింది అంటారు ముని –"వ్యాప్తాపి యన్నిగూఢా బహి రీక్షక బుధ్యపేక్ష్య యా –శక్తిర్యాగే తస్మిన్నవసానం తదుదితంసత్యాః "అని శ్లోకం లో ఆ రహస్య భావాన్ని బంధించారు.

"పర్వత నామనో వైదిక భాషాయాం యదియ మతి బాలా శక్తిహ్ –ఘనతో భవతి వ్యక్తా తదభిహితం పార్వతీ జననం "అంటారు. అత్యంత బలం ఉన్న ఈ శక్తి వేద భాషలో పర్వతం అని పేరుగల మేఘం నుండి పుట్టింది, అదే పార్వతీ జననం అన్నారు. పర్వతం నుండి పుట్టిన్దికనుక పార్వతి పర్వతం అంటే మేఘం కనుక మేఘం నుండి పుట్టిన శక్తియే ఉమా దేవి అనే పార్వతీదేవి అని భావన. అంటే ఆమె విద్యుత్కాంతి స్వరూపిణి అన్న మాట. భూలోక వాసులమైన మన బోటి వారిని అనుగ్రహించటానికే హిమాలయ పర్వతం లో పార్వతీ పరమేశ్వరులు ప్రసన్నులై ఉన్నారని. ఇది భక్తులను అనుగ్రహించటానికి వారు చేసిన లీలా విలాసం అని గణపతి ముని "తే జోష్మతః శివా విహ్ హిఆచలేనుగ్రహాయ భూమి జుషాం –దత్తోయ త్సాన్నిధ్యం లీలా చారిత్ర మాన్య దిదం "అని ఇరవై నాలుగవ శ్లోకం లో చెప్పారు. ఇరవై అయిదవది అయిన మొదటి స్తబకం లోని చివరి శ్లోకం లో "ఆర్యా వృత్తం " లో రచింప బడిన ఈ శ్లోకాలు వేదాది శాస్త్ర సమ్మత మైన భావాన్ని తెలుసుకున్న వారు శివుని పట్టపు రాణి జగన్మాత అయిన ఉమా దేవి స్వరూపం గానే తెలుసుకొంటారు అని ముగించారు '.

"ఏ తేషామార్యాణాం జానం తః శాస్త్ర సమ్మతం భావం –జానీయు ర్భవ మహిషీం భువనానా మంబికాం దేవీం "

## సముద్ర మధనానికి యోగ శాస్త్రార్ధం చెప్పిన గణ పతి ముని

కావ్య కంఠ గణపతి ముని "ఉమా సహస్రం "పంచమ శతకం, సప్త దశ స్తబకం లో ఉమా దేవి మందహాస వర్ణనను చంపక మాలా వృత్తం లో వర్ణించారు. అందులో క్షీర సాగర మధనం ప్రస్తావన తెచ్చి దానికి యోగ శాస్త్రార్ధాన్ని జోడించి చక్కని సమన్వయము చేశారు. ఆ వైభోగమే మనం ఇప్పుడు దర్శించ బోతున్నాం.

ఏడవ శ్లోకం "భూమి రుహాగ్ర స్థాపిత భాండా ద్యే మధు పాయం పాయ మజశ్రం



విస్మృత విశ్వో నన్దతి మాత స్తత్ర కిల త్వం ధామ దదాసి "-లో "అమ్మా!చెట్టు చివరనున్న పాత్ర(తాటి చెట్టు చివర కట్టిన కల్లు కుండ) నుండి మదకరమైన మధువును నిరంతరం తాగి తాగి ప్రపంచాన్ని విస్మరించి ఆనందించే శివుని యందు నీవు ఉంటావట "అన్నారు. ఇక్కడ వాసిష్ట గణపతి ముని ఆంతర్యం ఏమిటో తెలుసుకొందాం. శరీరమే చెట్టు. దాని చివరిభాగమే శిరస్సు. అందులోని సహస్రారమే పాత్ర. అందులో కారే సోమ రసమే మధువు. ఆ మధుపానం వలన కలిగిన బ్రహ్మానందమే మదం. దాని వల్లే ప్రపంచాన్ని మర్చి పోవటం. ఇలా బ్రహ్మానందం లో అన్నీ మరచి ఉన్న వ్యక్తీ పరమ శివుడు. ఆయన అంతటినీ దేవీమయం గానే భావిస్తూ, అన్నిట్లోనూ దేవినే దర్శిస్తాడని భావం. తరువాత శ్లోకం

"కోపి సహస్రై రేష ముఖానాం శేష ఇతీడ్యఃపన్నగ రాజః –ఉద్గిర తీదంయద్వనేభ్యో దేవి!తనౌ మే తద్భుత!పాసి "

లో"ఇలాంటిది అని వర్ణించ టానికి వీలు కాని ఒక అనుభవం వెయ్యి శిరస్సులున్న ఆది శేషుని లాగా నా దేహం లో అనుక్షణం విషం లాగా తాపాన్ని కలిగిస్తోంది. దాన్ని నువ్వు తాగి నా తాపాన్ని హరిస్తున్నావు. అయ్యో నీకు యెంత కష్టం కలిగిస్తున్నాను తల్లీ "అంటారు. ఇందులోని

అంతరార్ధం –దేవి అనుగ్రహం తో యోగ సాధన జరుగుతుంటే, ఏ సిద్ధి సిద్ధాచక ముందు ఒక తాపం శరీరం అంతా వ్యాపిస్తుంది. దాన్ని అమృతమయి అయిన దేవి హరించి సాధకుడిని కాపాడుతుంది. ఇది గణపతి ముని గారి స్వానుభవమే. ఇప్పుడు సముద్ర మధనం దగ్గరకు ప్రవేశిస్తున్నాం.

"మందర దారీ నామృత హేతు ర్వాసుకి రజ్జు ర్నామ్రుతా హేతుః -మంధన హేతు స్సామృత హెతుః సర్వ బలాత్మా శర్వ పురంధ్రీ "

అన్న శ్లోకం లో "అమృత మధన సమయం లో మందర పర్వతాన్ని మోసిన ఆది కూర్మ మైన శ్రీహరి కాని, కవ్వం తాడు అయిన వాసుకి కాని అమృత ప్రాప్తికి కారణం కాదు. మధనానికి కారణం అయిన సర్వ బాల స్వరూపిణి అయిన ఉమా దేవియే అమృత ప్రాప్తికి కారణం అన్నారు గణపతి ముని. అంటే మందరం, వాసుకి సహాయ కారులె కాని అమృత ప్రాప్తికి భగవతి ఏ కారణం అని కవి హృదయం.

"ప్రాణి శరీరం మందర శైలో మూల సరోజం కచ్చప రాజః –పూర్ణ మనంతం క్షీర సముద్రః పృష్ట గ వీణా వాసుకి రజ్జుః"

అనే శ్లోకం లో ముని "జీవుని దేహమే మందర పర్వతం. మూలాధార పద్మమే కూర్మ రాజు. దహరా కాశమే క్షీర సాగరం వెన్నెముక అయిన వీణా దండమే రజ్జువు అయిన వాసుకి. అని యోగ శాస్త్ర రహస్యార్ధాన్ని వివరించారు. తరు వాతిశ్లోకం –

"దక్షిణ నాడీ నిర్జర సేనా వామగ నాడీదానవ సేనా –శక్తి విలాసో మంధన కృత్యం శీర్షజ ధారా కాపి సుదోక్తా "

అంటే "దేహమధ్యం లోఉన్న సుషుమ్నా నాడికి కుడి వైపు ఉన్న పింగళ నాడి దేవతా గణం. సుషుమ్నకు ఎడమ వైపున ఉన్న ఇడానాడి రాక్షస గణం. శక్తి యొక్క క్రీడయే మధనం అనే కార్యం. సహస్రం నుండి వెలు వడిన ఆనంద ధారయే అమృతం. అని యోగార్ధాన్ని వివరించారు. ఇంకొంచెం ముందుకు సాగి తరువాతి శ్లోకం లో

"కంఠ నిరుద్ధే భూరి విషాగ్నౌ తైజస లింగా వాసి హరేణ-త్వద్బల జాతం స్వాద్వమృతం కో దేవి!నిపీయ ప్రేత ఇహ స్యాత్ "అంటారు –"తేజస్వరూపిణివి అయిన మాతా !అమృత మధన సమయం లో మొదట వాసుకి ముఖం నుంచి వెలువడిన విషాగ్నిని తేజోమయ లింగ వాసి అయిన రుద్రుడు తన కంఠం లో దాచేశాడు. నీ శక్తి వలన పుట్టిన మధురామ్రుతాన్ని గ్రోలాడు కనుక బతికి బయట పడ్డాడు ".అంటే అమ్మ బలం వల్లకలిగిన అమృతాన్ని తాగిన వాడికి మరణం ఉండదని అర్ధం.

## గణపతి ముని వర్ణించిన అర్ధ నారీశ్వరత్వం

కావ్య కంఠ, వాసిష్ట గణపతి ముని "ఉమా సహస్రం "షష్ట శతకం"ఏక వింశ స్తబకం "(21) లో "అనుష్టుప్ "వృత్తాలలో పార్వతీ పరమేశ్వరుల అర్ధనారీశ్వరత్వాన్ని మహా వైభవం గా వర్ణించారు. ఆ సొగసు చూడ తరమా –చూద్దాం –

"ఇతం పీత్వాకుచం స్కంధే ప్రసారితకరే తతః –జయతి స్మిత ముద్భూతం శివయో రేక దేహయోః"అంటూ ప్రధమ శ్లోకం రాశారు. బాల సుబ్రహ్మణ్యం ఎడమవైపునున్న స్తనం నుండి పాలు తాగి, కుడి వైపుకు చేతులు చాపగా ఒకే శరీరం కల పార్వతీ పరమేశ్వరులకు పరమ ఉత్క్రుష్టమైన నవ్వు కలిగిందట.



వామభాగం లో రత్నాలు పొదిగిన అందెల ధ్వనికి ఆకర్షితులైన హంసలు, కుడి వైపు అందెగా ఉన్న నాగ రాజు బుసలతో వాటిని భయ పెడుతున్న నారీ, పురుషాకారం కల ఒక దివ్య వస్తువు తన హృదయం లో ఉండుగాక అని కోరారు రెండవ శ్లోకం లో. ఎడమ వైపు దేవ సేనా నాయకుడైన సుబ్రహ్మణ్య స్వామిని బుజ్జా గిస్తూ, కుడి వైపు ఒడిలో గణపతి శిశువును ధరించిన అర్ధనారీశ్వరత్వం కాపాడు గాక అని మూడో శ్లోకం లో అంటారు. నాలుగులో

"విడంబిత బ్రహ్మ చారి కోకైకస్తన మేకతః –కవాతార్ధ నిభం బిభ్ర ద్వక్షః కేవల మన్యతః "



ఎడమ వైపు తోడూ (జంట)లేకుండా జక్కవ పక్షి లాగా ఉన్న ఒంటి చన్ను కలిగి, కుడి వైపున తలుపు చెక్క లాగా (బేస్ బాల్ కోర్ట్-లేక టెన్నిస్ కోర్ట్ )విశాలం గా ఉన్న స్తనంలేని వక్షం ఉన్న నారీ పురుషాకారం తనను రక్షించు గాక అన్నారు. తరువాత పార్వతీ భాగం లో శ్వాసిస్తూ కుమారస్వామి పాలుతాగుతుంటే, పరమేశ్వర భాగం లో బుసకొట్టే భయంకర సర్పం ఉన్న అర్ధనారీశ్వరులు కాపాడాలని కోరుకొన్నారు. ఎడమ వైపు తామర తూడు లాగా మెత్తగా మృదువుగా ఉన్న బాహు లతను ధరిస్తూ, కుడివైపు ఐరావత గజ తొండం లాగ భీకర బాహుదండం ఉన్న స్త్రీపురుషత్వం కాపాడాలని కోరారు. ఏడవ శ్లోకం లో –

"కుత్రాప్య విద్య మానే పి వందనీయేతదా తదా-పరస్పర కర స్పర్శ లోభాతో విహితాంజలి"

పార్వతీ పరమేశ్వరులిద్దరికి ఎవరికీ నమస్కరించాల్సిన అవసరం లేని సర్వోత్రు కృష్టులు. కాని అప్పుడప్పుడు ఒకరి చేయి మరొకరు తాకాలనే కోరికతో దోసిలి రూపం తో నమస్కరిస్తున్నట్లు కని పిస్తారని చమత్కరించారు కవి. మరో శ్లోకం –

"శక్ర నీల సవర్నత్వా ద్భాగయో రుభయోరపి –ఊర్ధ్వాధరాం గ సాపేక్ష సంధి జ్ఞాన గల స్థలం "

కంఠ స్థలం లో కుడి ఎడమ భాగాలు రెండూ కూడా ఇంద్రనీల మణుల్లాఉన్నందున, ఆ సంధి జ్ఞానం పై కింది అంగాల ఆపేక్ష కలది అయి అక్కడ ఉన్న అర్ధ నారీశ్వార వస్తువు నా హృదయం లో ఉండుగాక

అని ప్రార్ధించారు. ఇక్కడ కొంత వివరణ అవసరం –దేవి కాళికా స్వరూపం కనుక ఆమె కంఠం ఎడమ భాగమంతా నీలం గా ఉంటుంది. తెల్లని శరీరం కల శివుడు విషాన్ని కంఠం లో దాచినందు వల్ల కుడి భాగం నీలం గా ఉంటుంది. ఇలా కంఠం అంతా నీలం కాగా ఏది పార్వతీదేవి కంఠం లో సగం, ఏది శివుని కంఠం లో సగం అని తెలుసుకోవటం కష్టం గా ఉంది అని కవి భావం. కాని కుడి భాగం లోశివుడి కంఠం మీదున్న తెలుపు కంఠం కింద ఉన్న తెలుపుల ను బట్టి పార్వతీ పరమేశ్వరుల కంఠసంధి భాగాన్ని గుర్తించి తెలుసుకోవాలి అని భావం.

ఎడమ వైపు కలువలను వికసింప జేసే చంద్రుడు నేత్రం గా,, కుడివైపుపద్మాలను వికసింప జేసే సూర్యుడిని నేత్రం గా కలిగి ఉన్న అర్ధనారీశ్వరాన్ని స్తుతించారు. ఎడమ వైపు అందమైన నల్ల గ్రుడ్డున్న నేత్రం చేత, కుడివైపున చేతుల్లో ఆడు కొనే లేడి పిల్ల ఉన్నదట. అంటే పార్వతికన్ను శివుడి చేతిలో ఉన్న లేడి పిల్ల దృష్టివిలాసాన్ని, శివుడి చేతిలో ఉన్న లేడి పిల్ల పార్వతి ద్రుష్టి విలాసాన్ని నేర్చుకొన్నాయని చమత్కారం. లలాటం లో ఎడమ వైపు కాశ్మీర సుగంధ ద్రవ్యం చేత, కుడి వైపు మన్మధ దహన అగ్ని నేత్రం చేత అలంకరింప బడి ఉందట. ఒక వైపు మంచి వారికి క్షేమం కలిగించే చూపు, రెండవ వైపు దుస్టూలకు భయం కలిగించే మండే చూపు ఉన్నాయట.. ఎడమ వైపు నల్లని మెరసే కేశాలుంటే, కుడివైపు అగ్ని జ్వాలల్లా పాటల వర్ణ జడలున్నాట.అర్ధ నారీశ్వర వక్షం లో ఎడమ వైపు కేశపాశం, కుడి వైపు సర్పహారాలున్నాయి. ఎడమవైపు కొత్త పారిజాత పుష్ప మాల ఉంటె, కుడివైపు పెద్ద కెరటాలతో ఉన్న ఆకాశ గంగ ఉందట. వెండికొండలో, యోగుల మనస్సుల్లో విహరించే అర్ధ నారీశ్వరం. యెర్రని ఈశ్వర జటా జూటం యెర్రని సంధ్యాకాశం లా ఉంటె దేవి కురులు సంధ్యాకా మేఘం లాగా ఉన్నాయట.

"దమత్యో ర్యువాయో రేష లోపో యన్నాస్తి శైలజే –వామం పార్శ్వం విభో స్తేతుం దాతుం తే దక్షిణ కరః "

"అమ్మా పార్వతీ !ఆ పతి శివుడికి శయ నించటానికి ఎడమ వైపు లేదు. దానం ఇవ్వటానికి నీకు కుడి చెయ్యి లేదు దంపతులైన మీ ఇద్దరికీ ఇదే లోపం అని భలేగా చమత్కరించారు ముని




లోకం లో స్త్రీలు రెండుస్తనాల తో ఒక్క బిడ్డను పోషించ గలరో లేదోకాని నువ్వు మాత్రం ఒకే స్తనం తో ముల్లోకాలనూ పోషిస్తున్నావు. స్త్రీలు కడుపులో ఒక బిడ్డను మోయటానికే ఆప సోపాలు పడతారు. నువ్వు మాత్రం సగం కడుపుతో మూడు లోకాలని అవలీలగా మోస్తున్నావు.

"అనురూపా శివస్య త్వమనురూపః శివస్తవ –ఆలం కారో నురూపో వా మకలంకో ర్భకః శశీ ".

అమ్మా ! మీ ఇద్దరు ఒకరికి ఒకరు తగిన వారు. మీ ఇద్దరికీ తగిన ఆభరణం కళంకం లేని చంద్రుడు.

"తవైవ తవ దేహాన్మో హరస్యైవ హరస్య యః –ప్రాణాస్తూ జగతాం ధాత్రి హరస్య త్వం హర స్తవ "

జగదీశ్వరీ !నీ దేహం నీదే –దానిపై శివుడికి అధికారం లేదు. శివుని దేహ భాగం ఆయనదే. దానిమీద నీకూ అధికారం లేదు. దేహ భాగాలు వేరైనా శివుడికి నువ్వు ప్రాణం, శివుడు నీకు ప్రాణం గా ఉంటారు. కనుక మీ దాంపత్యం, ప్రేమ లోకోత్తరం అంటారు. ఇద్దరూ ఏకం గా ఉన్న దయామయమైన మీ మనస్సు మాకు శుభం చేకూర్చాలి అని ఇరవై నాలుగో శ్లోకం లో కోరారు.

చివరిదైన ఇరవై అయిదవ శ్లోకం లో మళ్ళీ ఒక చమత్కారం చేశారు –

"భవస్య భాగ ముత్సృజ్య భవానీ భాగ మాత్మనః –భజ త్వనుష్టూ భా మాసాం సృష్టానాం నార సింహినా "

నరసింహుని పుత్రుడినైన ఈ గణపతి ముని కవి అనుష్టుప్ ఛందస్సులో భవ (శివ) వర్ణన పరమైన పద్య భాగాన్ని నీ భర్త భవునికి వదిలేసి భవానీ !నీకు సంబంధించిన పద్య భాగాన్ని నువ్వు స్వీకరించు.

## గణపతి ముని చేసిన ఆధ్యాత్మిక సర్వోపచార పూజ

కావ్య కంఠ వాసిష్ట గణపతి ముని "ఉమా సహస్రం "లో అష్టమ శతకం,, ముప్పై వ స్తబకం లో ఉమా దేవిని ధ్యాన, ఆవాహనలతో కూడిన సర్వోప చార పూజను ఆధ్యాత్మికం గా "ప్రమాణిక వృత్త "శ్లోకాల తో చేసి ప్రత్యేకతను చూపారు. ఆ పూజలో మనమూ పాల్గొని తరిద్దాం.

"కృతేన సా నిసర్గతో ద్రుతేన నిత్య మానసే –సితేన శీత శైలజా స్మితేన శం తనోతు మే "అని మొదటి శ్లోకం తో అమ్మ వారిని ప్రార్ధించి, ఎప్పుడూ ప్రకాశించే తెల్లని నవ్వుతో ఉమాదేవి తనకు శుభం కలిగించాలని కోరుకొన్నారు. మామూలు మనం చేసే నిత్య పూజ ను ధ్యానం తో మొదలు పెడతాం. గణపతి ముని

"ప్రతి క్షణం వినశ్వర నయే విసృజ్య గోచరాన్ –సమర్చ యేశ్వరీం మనో వివిచ్య విశ్వ శాయినం "

అని రెండో శ్లోకం లో నశించే శబ్దాది విషయాలను వదిలి చిత్త వృత్తులను వేరు పరచి చిత్త వృత్తులకు, విషయాలకు ఆధారం గా ఉన్న చిద్రూపిణి అయిన పరమేశ్వరిని అర్చించ మని మనసును కోరారు. ఇదే ధ్యానం.

విశుద్ధ దర్పనేన వా విదారితే హృదాంబ మే –అయి ప్రయచ్ఛ సన్నిధిం నిజే వాపు షృగాత్మజే "

దీనిలో ఆవహనం చెప్పారు. నిర్మలమైన అద్దంవంటి నా హృదయం లో నీరూపాన్ని ప్రదర్శింపు అని దేవికి ఆవాహన చెప్పారు.



"పురస్య మధ్య మాశ్రితం సితం య దస్తి పంకజం –అజాండ మూల మస్తుతే సురార్చితే తవాసనం ""నా శరీర మధ్యమం లో ముఖ్యమైన మూల స్థానం లో బ్రహ్మాండ మంత విలువ గల నా నిర్మల హృదయ పద్మం నీకు ఆసనం గా వేస్తున్నాను అని భావం. అంటే ఆసనం ఇచ్చారని భావం. తరువాత పాద్యం ఇవ్వాలి కదా –

"అఖండ ధారయా ద్రవ న్నవేందు శేఖర ప్రియే –మదీయ భక్తీ జీవనం దదాతు తేంబ పాద్యతాం "

బాలేందు శేఖర ప్రియా !అవిచ్చిన్న ధార గా ప్రవహించే నా భక్తి అనే ఉదకాన్ని నీకు పాద్యం గా సమర్పిస్తున్నాను. అంటారు. తరువాత అర్ఘ్యం ఇవ్వాలి

"వివాస నౌఘు మానస ప్రసాద తోయ మాంబ మే –సమస్త రాజ్ఞి హస్తయో రనర్ఘ మర్ఘ్య మస్తుతే"

సర్వేశ్వరీ !సమస్త వాసనా రహిత మైన నా మనో నిర్మలత్వం అనే జలం నీకు అర్ఘ్యం అగుగాక "అని సమర్పిస్తారు. తరువాత ఉపచారం -పానీయం –

"మహేంద్ర యోని చింతనా ద్భవన్ భవస్య వల్లభే –మహారసో రసస్త్వయా నిపీయతాం విశుద్ధయే "

శివకామినీ దేవీ !జననీ !ఇంద్ర యోని ధ్యానం వలన స్రవించే గొప్ప రుచికల అమృత రసాన్ని నా శరీర శుద్ధి కోసం నువ్వు త్రాగు. అని పానీయాన్ని సమర్పించారు. సుషుమ్నా నాడీ మార్గం లో దవడల మధ్య స్తనం లాగా వేలాడే దాన్ని "ఇంద్ర యోని "అంటారు. ఆ మార్గం లో ధ్యానించే వారికి రసం స్రవిస్తుందని యోగులు అంటారు. తరువాత స్నానం సమర్పించాలి.

"సహస్ర పాత్ర పంకజ ద్రవ త్సుదా జలేన సా –సహస్ర పత్ర లోచనా పినాకినో భిషిచ్యతే "

సహస్రం అనే కమలం నుండి స్రవించే అమృతా రసం తో పరమేశ్వరికి అభిషేకం చేస్తాను అని గణపతి ముని భావం. కనుక స్నానం అనే ఉపచారం పూర్తి అయినట్లే. ఇప్పుడు అమ్మవారికి పంచామృత స్నానం సమర్పించాలి. -

"మమార్జితం య దిన్ద్రియై స్సుఖం సుగాత్రి పంచభిః-తదంబ తుభ్య మర్పితం సుదాఖ్య పంచాకాయతమ్"

మంగ "ళాంగీ !మాతా!కన్ను మొదలైన అయిదు ఇంద్రియాల చేత దర్శనాదుల వలన నేను పొందిన సుఖం నీకు పంచామృత స్నానం అగుగాక. ఇక వస్త్రాన్ని అర్పించాలి –

"వసిష్ట గోత్ర జన్మనా ద్విజేన నిర్మితం శివే –ఇదం శరీర మేవ మే తవాస్తు దివ్య మంశుకం "

మంగళ రూపిణీ గౌరీ!వసిష్ట గోత్రం లో పుట్టిన బ్రాహ్మణుడైన ఈ గణపతి ముని చేత రూపొందిన నా దేహమే నీకు దివ్య వస్త్రం అగుగాక. అని దేహాన్నే వస్త్రం గా దేవికి సమర్పించిన ఆధ్యాత్మిక మహా యోగి పుంగవులు కావ్య కంఠులు. నైష్టి కుడైన గణపతి ముని తన తపో బలం చేత దేవికి వస్త్రం కాదగిన అంతర్దేహాన్ని నిర్మించి దాని పరిపాక ప్రభావం వలన భౌతికమైన దేహాన్ని కూడా దేవికి దుకూలం అంటే వస్త్రం అవ్వాలని భావించారని దీని వ్యాఖ్యాత సంస్కృతం లో కపాలి శాస్త్రి గారు, తెలుగులో శ్రీ పన్నాల రాదా కృష్ణ శర్మ గారు వివరించారు. తరువాత యజ్ఞోప వీత సమర్పణ –

"విచిత్ర సూక్ష్మ తంతు భ్రున్మమేయ మాత్మ నాడికా –సుఖ ప్రబోధ విగ్రహే మఖోప వీత మస్తుతే "

"చిదానంద స్వరూపిణీ !అద్భుతం సూక్షం గోచరం అయిన నా ఈ ఆత్మ నాడి అంటే సుషుమ్నా నాడి నీకు యజ్ఞోప వీతం గా సమర్పిస్తున్నాను. హృదయం నుండి ఆత్మ అనే జ్యోతిని భరిస్తూ, సహస్రారానికి పోయే మధ్య నాడిని సుషుమ్న అంటారని మనకు తెలుసు. దీనినే బ్రహ్మ నాడి అని అమృత నాడిఅని కూడా అంటారు. ఇక చందన చర్చ –

"మహాద్విచిన్వతో మమ స్వకీయ తత్వ విత్తిజం –ఇదం తు చిత్తసౌరభం శివే తవాస్తు చందనం "

"శ్రేయస్కరీ జననీ !సర్వోత్కృ ష్టమైన దాన్ని వెతుకుతున్న నాకు ఆత్మ తత్వ జ్ఞానం వలన కలిగిన సువాసన తో నా మనస్సు పరిపూర్ణ మైంది. అలాంటి నామనసు నీకు గంధం. ఇప్పుడు పుష్పాలతో అర్చన –

"మహేశ నారి !నిస్స్వసన్ తథాయ ముచ్ఛ్వసన్ సదా-తవానిశం సమర్చకో మమాస్తుజీవ మారుతః "

"మహేశ్వరీ!ఉచ్ఛ్వాస, నిశ్వాస రూపం లో ఉన్న నా ప్రాణ వాయువు నీకు పూజా పుష్పం అగుగాక అని ముని సమర్పించారు తన ప్రాణాన్నే అమ్మకు., పిమ్మట ధూప సమర్పణ –

"విపాక కాల పావక ప్రదీప్త పుణ్య గుగ్గులుః-సువాసనాఖ్య ధూప భృద్భవ త్వయం మమాంబ తే "

అమ్మా !నా పుణ్య పరిపాకం వలన కలిగిన సువాసనలే, మంచి సంస్కార విశేషాలే నీకు ధూపం. ధూపం తర్వాత దీపం ఇవ్వాలి –

'గుహావ తార మౌనినా మయీశ్వరీ ప్రదీపితా –ఇయం ప్రబోధ దీపికా ప్రమోద దాయికా స్తుతే "

"పరమేశ్వరీ!కుమారస్వామి అవతారం అయిన శ్రీ రమణ మార్షి నాలో వెలిగించిన ఈ జ్ఞాన దీపం నీకు ఆనందాన్ని కలిగించుగాక. అంటూ తనగురువు రమణ మహర్షి తనలో జ్ఞాన దీపం వెలిగించి అజ్ఞాన తిమిరాన్ని పోగొట్టారని గురుస్తుతికూడా చేసి నట్లయింది ముని –నాయన గారు. ఇప్పుడు మహా నైవేద్యం సమర్పించాలి –

"ఇమామయి ప్రియా త్రియాం మహా రసా మహాం కృతిం –నివేద యామి భుజ్యతా మియం త్వయా నిరామయే "

ఆరోగ్య స్వరూపిణీ అంబా!అత్యంత ప్రియమై, శుద్ధమై అధిక రుచి కల నా ఈ అహంకారాన్నే నీకు నైవేద్యం గా సమర్పిస్తున్నానని. గణపతి ముని అహంకార వర్జితులై సర్వ సమర్పణం చేశారు.. నైవేద్యం పిమ్మట తాంబూలం ఇవ్వాలి.

"సరస్వతీ సుదాయతే మనో దదాతి పూగతాం –హృదేవ పత్ర మంబికే త్రయం సమేత్యతే ర్వ్యతే"

"అమ్మా ! వాక్కును సున్నం గా, మనస్సును వక్కముక్కగా, హృదయాన్ని తమల పాకుగా చేసి ఈ మూడింటి తో నీకు తాంబూలాన్ని సమర్పిస్తున్నాను. తాంబూల సేవనం తర్వాత నీరాజనం సమర్పించాలి –

"వినీల తోయ దాంతరే విరాజ మాన విగ్రహా –నిజా విభూతి రస్తుతే తటిల్లతా ప్రకాశికా "

"నీల మేఘం మధ్య ప్రకాశిస్తూ నీ విభూతి విశేషమైనదీ అయిన నా ఆజ్ఞా చక్రం లోని మెరుపు తీగ నిన్ను ప్రకా శింప జేసే నీరాజనం అగుగాక అన్నారు –నీరజనానంతరం మంత్రపుష్పం సమర్ప యామి కదా –

"స్వరోయ మంత రంబికే ద్విరేఫ వత్స్వరన్ సదా-మమాభి మంత్ర్య దీసుమం దదాతి దేవి తేన్త్రయే '

నా లోపల ఉన్న విశుద్ధ ప్రాణ రూపం అయిన స్వరం నిరంతరం తుమ్మెద లాగ మ్రోగుతూ, అవ్యక్త నాదమై నా బుద్ధి అనే పుష్పాన్ని అభి మంత్రించి నీ పాదాల చెంత సమర్పిస్తున్నాను అని గణపతి ముని సర్వోపచార ఆధ్యాత్మిక పూజ పరి సమాప్తి చేశారు.

సాధారణం గా పూజ అవగానే విసర్జన చెప్పుతాం. "శోభానాయ పునరాగామనాయచ " అని అంటాం కాని ఈ పూజలో గణపతి ముని ఆవాహన చెప్పరు. తమాషాగా ఏమంటారో చూడండి –

“తవార్చనం నిరంతరం యతో విధాతు మస్మ్యహం -న విశ్వనాధ పత్నితే విసర్జనం విధీయతే “

అమ్మా విశ్వేశ్వరపట్టమహిషీ ! నేను అవిచ్చిన్నంగా నిన్ను అర్చించాలి కనుక నీకు ఉద్వాసన చెప్పటం లేదు అన్నారు గడుసుపిండం అయిన నాయన. ఇది ఆధ్యాత్మిక పూజ కనుక ఆవాహనతో ప్రారంభమైనా విసర్జనతో అంతం కారాదని భావం. మానసిక పూజ కదా ఇది.

“వియోగ మిందు దారిణా న చేహ విశ్వ నాయకే మదంబ నోత్ర రాజతే తటిల్లతా శిఖాంతరే “

అమ్మా విశ్వేశ్వరీ!ఇక్కడ చంద్ర ధరుడైన శివుడితో కూడా వియోగం లేదు. సహస్రార చంద్ర ధరుడు హృదయాకాశం లో ఉండి పరమాత్మ అయిన శివుడు నాభి పైన విద్యుల్లతా జ్వాల మధ్య ప్రకాశిస్తున్నాడుకడా అని చమత్కరించారు. ఇంకో శ్లోకం లో తన దేహాన్ని ఏకాంత మందిరం గా చేసుకొని, అభిమానించి అందులో నాధుడైన పరమేశ్వరునితో విహరించ మని ప్రార్ధించారు. దేవికి సహస్రారం శివునికి హృదయం ముఖ్య స్థానాలని కనుక ఈశ్వర సహితం గా హాయిగా విహరింప వచ్చునని అంతరార్ధం గా కోరుకొన్నారు.

మరో శ్లోకం లో అజ్ఞానులుల లో లాగా, సోమరులలో లాగా నిద్ర వల్ల ప్రయోజనం లేదని ఎల్లప్పుడూ తన హృదయం లో సంచరించమని కోరారు. ఇరవై నాలుగవ శ్లోకం లో

“అయం తవాగ్రిమః సుతః శ్రితో మనుష్య విగ్రహం –తనూజ వేశ్మ సౌష్టవం మ్రుడాని !పశ్య కీద్రుశం

భవానీ –నీ పెద్ద కోడుకు గణపతి మానవ దేహాన్ని (కావ్య కంఠులు )ధరించాడు ఆ నీ కొడుకు దేహం యొక్క సౌష్టవం ఎలాంటిదో పరిశీలించు అని తాను గణపతి అవతారమే నని ఖచ్చితం గా చెప్పుకొన్నారు తల్లికి. చివరి శ్లోక

“గణేశితు ర్మహాకవే రసా ప్రమాణికావలీ –మనోంబుజే మహేశ్వరీ ప్రపూజ నేషు శబ్ద్యతాం “

“అమ్మా ఉమా దేవీ!గణపతి ముని నైన నేను “ప్రమాణికా వృత్తాలలో “రాసిన ఈ శ్లోక సముదాయం దేవీ పూజ లో అర్చకుని చిత్తకమలం లో ధ్వనించు గాక ”అని నిత్య పూజలో ఉన్న అంతర్యాన్ని గ్రహించి దేవుళ్ళకు పూఅలు చేయమని, చేయించమని పూజారులకు అన్యాపదేశం గా సూచన ఇచ్చారు గణపతి ముని.

ఈ ప్రమాణికా వృత్త శ్లోకాలు మహా రమణీయం గా నడుస్తాయి. చదువుతుంటేనే భక్తీ భావం ధారలై ప్రవహిస్తున్నట్లు ఉంటుంది నోటికి రావటమూ సులభమే. వీటిని కంఠస్తంచేయటమే కాక హృదయ గతం చేసుకొని తరిద్దాం.

68వ భారత స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలతో

అన్నట్లు –గణపతి ముని గొప్ప స్వాతంత్ర్య సమార యోధులు. ఎన్నో సంస్కరణలు తెచ్చిన వారు అని గుర్తు చేస్తూ

## ఉమాదేవి బీజాక్షర వివరణ చేసిన గణపతి ముని

ఉమా సహస్రం లో శ్రీ కావ్య కంఠ గణపతి ముని దేవి బీజాక్షరాలపై గొప్ప వివరణ నిచ్చారు. ఈ దర్శనం అంతా నవమ శతకం లో ముప్పై మూడవ స్తబకం లో “వంశస్థ వృత్తాలు “లో మనోహరం గా, మనోజ్ఞం గా ఆరాధనా భావ బంధురంగా రచించి అమ్మవారి పరి పూర్ణ కటాక్ష సిద్ధి పొంది, మనలనూ ఆ అనుభూతిని పొందమన్నట్లు చేశారు. మొదటి శ్లోకం లోనే



"సుధాం కిరంతో ఖిల తాప హారిణీం,తమో హరంతః పటలేన రోచిషాం –శ్రియం దిశంతో దిశి దిశ్య సంక్షయాం, జయంతి శీతాద్రి సుతాస్మితాంకురాః"

తాపత్రయాన్ని, వేడిని హరించే అమృతాన్ని వెదజల్లుతూ కాంతి పుంజం తో చీకటిని అజ్ఞానాన్ని నశింప జేస్తూ అన్నిదిక్కులలోను అక్షయమైన శోభను, సంపదను ప్రదర్శిస్తున్న ఉమా దేవి మందహాసాలు గొప్పగా విరాజిల్లుతున్నాయి అని కీర్తించారు. నాలుగవ శ్లోకం లో

"మనః ప్రతాపస్య భవ త్యసంశయం ప్రవర్ధనం వైదిక మంత్రం చింతనం –ప్రశస్యతే ప్రాణమహః ప్రదీపనే దయాన్వితే తాంత్రిక మంత్రం సేవితా "

దయామయీ !ఋషులు దర్శించిన "తత్స వితుః మొదలైన మంత్రాల ధ్యానం తో మన మనస్సు ప్రభావం పెరుగుతుంది. ఇందులో సందేహమే లేదు. శ్రీ విద్య మొదలైన తాంత్రిక మంత్రోపాసన వలన ప్రాణ తేజస్సు వృద్ధి చెందుతుంది. అన్నారు. వేదం మంత్రాలు తాంత్రిక మంత్రలకంటే అర్ధ ప్రాధాన్యం కలిగి ఉంటాయని, ఆ మంత్రార్ధ విచారణ వల్లజ్ఞానం కలుగుతుందని, హ్రీం కారం మొదలైన బీజాక్షరాలు ఉండే తాంత్రిక మంత్రాలపునశ్చరణ వలన ప్రాణ నాడి శుద్ధి జరిగి నాదం అభి వ్యక్తమౌతుందని దాని వలన ప్రాణ ప్రభావం పెరుగుతుందని భావం.

తాంత్రిక మంత్రాలనున ఉపాశించేవారి నుండి విద్యుత్తు తో సమానమైన తేజస్సు బయటికి వచ్చి ప్రపంచమంతా వ్యాపిస్తుందని తర్వాతి శ్లోకం లో చెప్పారు ముని. తాంత్రిక మంత్రోపాసకులకు మనస్సువికారం చెందదని వారి ద్రుష్టి, బుద్ధి విషయ వాసనలకు లోను కాదని, వారి దేహం లో రోగాలు ప్రవేశించలేవని మరో శ్లోకం లో వివరించారు –ఏడవ శ్లోకం లో –

"స్మరన్తి మాయాం గగనాగ్ని శాంతి భిః స్వహచ్ఛ భాసా సాహితాభి రంబికే –తదా రసజ్నాం ద్రుహిణాగ్ని శాన్తిభి ర్భణంతి దోగ్ధ్రీం తుఖషష్ట బిన్దుభిః"

అమ్మా!పూర్ణ చంద్రుడి తో కూడిన ఆకాశ -అగ్ని, శాంతులతో మాయా బీజాన్ని, చంద్రుని తో కూడిన బ్రహ్మ –అగ్ని శాంతులతో రసనా బీజాన్ని, ఆకాశ –షష్ట స్వర బిందువులతో ధేను బీజాన్ని చెప్పటం లోకం లో అలవాటు గా ఉంది. దీనికి వివరణ తెలుసు కోవాలి. పూర్ణ చంద్రుడు అంటే పూర్ణానుస్వారం అంటే నిండు సున్నా. ఆకాశం అంటే హకారం అగ్ని అంటే రేఫం. శాంతి అంటే ఈ కారం. పూర్ణానుస్వారం తో కూడిన హకార, రకార, ఈ కారాలతో "హ్రీం "అనే బీజాక్షరం ఏర్పడుతుంది. దీన్ని మాయా బీజం అంటారు. బ్రహ్మ అంటే క కారం. అగ్ని రకారం. శాంతి ఈకారం. పూర్ణానుస్వారం తోకూడిన కకార, రకార, ఈ కారాలతో ఏర్పడేదే"క్రీం"అనే బీజాక్షరం. దీన్నే రసనా బీజం అంటారు. ఆకాశం అంటే ఖ. హకారం షష్ట స్వరం. అంటే ఆరవ స్వరం ఊ కారం. వీటన్నిటితో బిందువు సున్నాతో ఏర్పడిన "హూం " అనే బీజాక్షరం ఏర్పడుతుంది. దీనికే ధేనుబీజం అనిపేరు. 'ఈ మూడు మహా మంత్రాలు.

తరువాత గణపతి ముని ఈ మహా మంత్రం దేవతలను వివరించారు.

"అభాన్య తాద్యాభువనేశ్వరీ బుధై రనంతరా మాత రగాది కాళికా-ప్రచండ చండీ పరికీర్తితా పరా, త్రయోష్యమీ తేమనవో మహా ఫలాః "

దేవీ !మొదటిది అయిన హ్రీంకార మాయా బీజం కు దేవత భువనేశ్వరి. రెండవది అయిన క్రీం కార రసనా బీజానికి దేవత కాళికా దేవి. మూడవది అయిన హూం కార మనే దేను బీజానికి దేవత ప్రచండ చండి అని మంత్రం వేత్తలు చెప్పారు. ఈ మూడు మంత్రాలూ మహా సిద్ధి దాయకాలే. ప్రచండ చండికే మరో పేరు "చిన్న మస్త "లేక "వజ్ర వైరోచని "అంటారు.

మరికొంచెం వివరణ ఇస్తూ తరువాతిశ్లోకాన్ని రచించారు

"ఉపాధి భూతం శుచి నాభసం రజో దధాతి సాక్షా ద్భువనేశ్వరీపదం-తదాశ్రయా వ్యాపక శక్తి రద్భుతా,మనస్వినీ కాచన కాలి కేరితా "

దేనితోను సంబంధం లేని స్వతస్సిద్ధం గా అందరికి ఉపాదాన మైన ఆకాశ రేణుపే భువనేశ్వరి. ఆ ఆకాశ రేణువు ను ఆశ్రయించి ప్రాజ్ఞ అయి, ఆశ్చర్య కరి అయి, మాటల తో వర్ణించటానికి వీలు లేని సర్వ వ్యాపక శక్తి యే కాళికా దేవి గా చెప్ప బడింది అని ముని అభిప్రాయం. అంటే సూక్షం గా చెప్పా లంటే ఆకాశ రేణువే భువనేశ్వరి అని సర్వ వ్యాపిని అయిన చిచ్చక్తియే కాలి అని అర్ధం. తరువాత –

"అమర్త్య సామ్రాజ్య భ్రుతః ప్రవర్తికా, విశాల లోకత్రయ రంగ నర్తికా –పరాక్రమాణా మది నాయికోచ్యతే, ప్రచండ చండీతి కలా సవిత్రి తే"

"దేవతలా రాజు ఇంద్రుడిని ప్రపంచ వ్యవహారాలకు నియమించి మూడు లోకాలలోనూ, అప్రతి హతం గా విహరిస్తూ, వివిధ పరాక్రమాలకు అది దేవతవు అయిన నీ కళయే ప్రచండ చండి గా లోకం లో ప్రసిద్ధమైంది. దీని వలన నీకు శచి,, ఇంద్రాణి అనే పేర్లు సార్ధకాలైనాయి. కొంచెం లోతుకు వెళ్లి విచారిస్తే –ప్రచండ చండికి క్రియా శక్తి ముఖ్యం. కాలికి వ్యాపించటం జ్ఞాన శక్తి ముఖ్యం. అయితే ఈ రెండిటికి మూలం భువనేశ్వరీ మాతయే. ఈ రకం గా దేవి యొక్క మూడు మహా మంత్రం దేవతా విభూతులను గణపతి ముని ప్రతిపాదించారు. అలాంటి భువనేశ్వరిని అర్చించే వారికి ఏమి ఫలం లభిస్తుందో తరువాతి శ్లోకాలలో చెప్పారు.

"స్మరన్ మానుం రోదితి భక్తిమాం స్తవ, ప్రగృహ్యా పాదం ముని రంబ లంబతే –ఫలం చిరాయ ప్రధమః సమాప్నుయాత్, పరో మరందం పద ఏవ విన్దతి "

"తల్లీ !నీ మంత్రాన్ని ధ్యానించే భక్తుడు ఏడుస్తూ చాలాకాలానికి కాని ఫలాన్ని పొందలేడు. కాని నీ పాదాల్ని ఆశ్రయించిన మౌని మాత్రం వెంటనే ఫలసారాన్ని పొందుతాడు. అంటే మంత్రం జపిస్తే ఎప్పుడో కాని ఫలితం రాదు. అదే పాదాలను ఆశ్రయిస్తే వెంటనే ఫలితాన్ని పొందుతాడు అని భావం.

పదహారవ శ్లోకం లో –"అహం (నేను )అనే పదం యొక్క అర్ధం జ్ఞానం అనే తీగ అయితే, అది అంటే అహంకార పదార్ధం దేను బీజం అయిన "హూం "అనే మంత్రార్ధం కంటే వేరైనది ఎలా వుతుంది?అహం అనేది ప్రాణ ధ్వని యొక్క వైఖరి అయితే దేనుబీజం అయిన హూం ఆ ప్రాణ ధ్వని వైఖరి కాదు అని చెప్పటానికి వీలే లేదు. ఇంకొంచెం వివరం గా –అహం శబ్దం ప్రాణ ధ్వనియే. హూమ్కారమూ ప్రాణ ధ్వనే. కనుక శబ్దం లో ఈ రెండిటికి భేదం ఉందికాని అర్ధం లో భేదం లేదని కావ్య కంఠుల అభిప్రాయం. మరో శ్లోకం లో –

"పారేతు యాం చేతన శక్తి మామన, న్యభాణి సా కుండలి నీతి తాన్త్రికైః-విలక్షణా నామ చమత్రుతి ర్జడాన్, ప్రతారయత్యాగమ సార దూరాన్ "

కొందరుతంత్ర వేత్తలు చేతన శక్తి ఉన్నదాన్నే కుండలిని అన్నారు. ఈ అసాధారణ చమత్కారం మంత్రం శాస్త్రం తెలియని మంద బుద్ధులనువంచించ టానికే కదా అని ప్రశ్నించారు. అంటే తాంత్రికులు చిచ్చక్తిని కుండలిని అన్నారు. ఇది విలక్షణ మైన చమత్కారం. కుండలిని అంటే పాము అని సామాన్యులు భయ పడతారు కాని కుండలిని అని వారికీ చప్పున స్పురించదు. దీనివలన మొహం జరిగే ప్రమాదం ఉంది అని అంటారు.

"మతిః పరాచీ వ్యవహార కారణం, భావేత్ప్రతీచీ పరమార్ధ సంపది –ఉభౌ దిశే యస్య మతి ర్విగాహతే, పదా చ మూర్ధ్నా చ స సిద్ధి ఇష్యతే "బహిర్ముఖం అయిన బుద్ధి బయటి ప్రపంచ వ్యవహారానికి కారణం అవుతుంది. అంతర్ముఖం అయిన బుద్ధి పరమ పురుషార్ధం అయిన మోక్షానికి కారణం అవుతుంది. బహిర్ముఖం అంతర్ముఖం అయిన బుద్ధి గల యోగి పాదం చేతా, శిరస్సు చేతా సిద్ధుదౌతాడు. ఇక్కడ పాదం అంటే హృదయం అనే ఆకాశం. మూర్ధం అంటే సహస్రారం. అంటే హృదయం చేత సిద్ధుడైన వాడు ప్రత్యక ద్రుష్టి సిద్ధుడు అవుతాడు. సహస్రారం చేత సిద్ధుడైన వాడు పరాక్ ద్రుష్టి సిద్ధుదవుతాడు. అందరికి పరాగ్ ద్రుష్టి అంటే బాహ్య ద్రుష్టి అవకాశం కలుగుతుంది. కాని ప్రత్యక ద్రుష్టి అంటే

అంతర్ ద్రుష్టి కలవాడికి బాహ్య ద్రుష్టి అదుపులో ఉంటుంది. జీవన్ముక్తుడు అయిన పురుషుడు మాత్రమె అంతర్ముఖం గా ప్రజ్ఞను విడవ కుండా బాహ్య వ్యవహారాలూ నిర్వహించే సమర్ధుడు అవుతాడు అంతరార్ధం గా వివరించారు వ్యాఖ్యాతలైన కపాలి శాస్త్రి, పన్నాల రాదా కృష్ణ గార్లు.

బుద్ధికి లక్ష్యమైన స్థానం హృదయం అని హృదయం లో ఎల్లప్పుడూ ద్రుఢం గా ఉన్న వాడు బుద్ధి బయటి ప్రపంచం విషయాల్లో తిరుగుతున్నా, చిద్వరూపిణి అయిన దేవి యందు నిమగ్నుడయ్యే ఉంటాడు. కనుక జనన మరణ భయం అలాంటి వారికి ఉండదని తరువాతి శ్లోకం లో చెప్పారు. ధ్యానం లో అద్భుతమైన ధ్యాన శక్తిగా, దర్శనం లో దీప్తం అయిన దర్శన శక్తిగా, ప్రవచనం చేసేటప్పుడు శ్రేష్టమైన ప్రవచన శక్తిగా దేవిని దర్శించే నైష్టిక పురుషుడు బాహ్య విషయాల చేత బంధింప బడడు అని తరువాతిశ్లోకం లోవివరించారు. ఆశ్రితుల భయాన్ని పోగొడుతూ పండితుల చేత ప్రస్తుతింప బడే పరమేశ్వరి కని పించేవాటి యందు"సంగం"(బంధం ) వదిలి దర్శన కర్మ ను చూసే క్రాంత దర్శిఅయిన కవి దృష్టిలో నిత్యం సన్నిహితం గా ఉంటుంది అన్నారు. చివరి శ్లోకం లో-

"అయం భయానాం పరిమార్జక స్సతాం సమస్త పాపేఘు నివారణ క్షమః –మనోజ్ఞ వంశస్థ గణో గణేషితు-,ర్మనో మహేశాజ్ఞ ద్రుశో దినోత్సవం "

సజ్జనులకు భయ హరం గా, సమస్త పాపాలకు నివారణ గా గణపతి కవి "వంశస్త వృత్తం "లలో రచించిన ఈ రమణీయ శ్లోక బృందం ఉమా దేవికి పరమానందం కలిగించుగాక అని చెప్పి ముగించారు.

పరమేశ్వరి యోగ సిద్ధుల విభూతి ని వివరించిన గణపతి ముని

కావ్యకంఠ వాసిష్ట గణపతి ముని "ఉమా సహస్రం " దశమ శతకం లో ముప్పై తొమ్మిదవది స్తబకంలో దేవి యోగ సిద్ధులను ఇంద్రజా వృత్తాలలో "లలో మహా సొగసుగా వర్ణించి. ఆ దేవీ యోగ వైభవాన్ని వివరించారు,. .. మొదటి శ్లోకం –

"వ్యాప్యేద మిందో ర్భువనం య ఏవ, ప్రాయేణతస్యామల చంద్రికా భూత్ –మంద స్తవార్తిం స ధునోతు హాసో, నిశ్శేష లోకేశ్వరా వల్లభాయాః"



ప్రతి స్తబకం లో చేసినట్లే ఇక్కడా అమ్మవారి చిరునవ్వు వైభవాన్ని ముందుగా స్తుతించారు. చంద్ర మండలం లో వ్యాపించి చంద్రుని చల్లని తెల్లని వెన్నెల అయిన పరమేశ్వరి మందహాసం నీ వ్యధను హరించుగాక అని ప్రార్ధించారు. తర్వాత అఖండమైన ఆకాశం లో అద్వితీయమైన మెరుపుగా ప్రకాశిస్తూ అన్నిలోకాలను నిరంతరం పరిణామాన్ని పొందిస్తూ, ఒక్కో సారి మేఘం లో విద్యుత్ రూపం గా ఉన్న ప్రచండ దేవి మా పాపాలను హరించాలి అని కోరుకొన్నారు. ఇలా మార్పులు జరుగుతున్నా ఇంకా కొన్ని బ్రాహ్మండాలు ఆవిర్భ విస్తూనే ఉన్నాయని కొన్ని నశించి పోతూ ఉన్నాయని మరికొన్ని వృద్ధి చెందుతున్నాయని తెలియ జేశారు. మహా ప్రమాణం అయిన సూర్యుని తో, అతి ప్రమాణాలైన కుజుడు మొదలైన గ్రహాతో కూడిన ఒక్కొక్క బ్రహ్మాండం దేవి రోమ కూపం వంటిది కనుక ఆమె మహాదైశ్వర్యాన్ని పొగడ గల వాడు లేడు అంటారు. మేఘాల గంభీర ధ్వనియే దేవి శబ్దం అని, అందులోని మెరుపులే ఆమె కాంతి తరంగ విలాసమనీ కీర్తించారు. తర్వాతి శ్లోకాలన్నీ పరమాద్భుత రీతిలో రచించి బీజాక్షర సముదాయమా అన్నంత పవిత్రం గా ప్రస్పుటం గా విరచించారు మహా ముని. ఏడవ శ్లోకం నుండి ఈ కవితా ధారా విజ్రుమ్భించి భక్తీ వెల్లువై విరుస్తుంది.

"ఇన్ద్రస్య వజ్రం జ్వలితం క్రుశానో ర్జ్యోతిస్సహస్ర చ్ఛదబంధ వస్య –పీయూష భానో ర్హసితం విసారి, జీవస్య చక్షు ర్మమ తాత దైవతం "

ఇంద్రుని వజ్రాయుధం, అగ్ని జ్వాల, సూర్యుని తేజస్సు, చంద్రుని వెన్నెల, జీవుని దర్శన శక్తి, జ్యోతిర్మయమైన అమ్మవారి దైవ స్వరూపమే అన్నారు. తరువాత –

"యస్మైవ తేజః ప్రావి భక్త మారక, విద్యుచ్ఛశాం కానల లోచనేషు –గూఢం తదాకాశ గృహే సమంతా దంతాన భిజ్నం ప్రణమామి దైవం "

"సూర్య- విద్యుత్ చంద్ర -అగ్ని నేత్రాలలో వేరుగా ఉన్నట్లు భిన్నమై ఆకాశం అంతా గుప్తంగా ఉన్న అనంత తేజస్సు కల దైవానికి నమస్సులు అని చెప్పుకొన్నారు.

"జాగ్రత్సు బుద్ధి ర్నిమిశాత్సు నిద్రా, శుష్కేషు పక్తి స్తరణేషు వృద్ధిః-ధీరేషు నిష్టాచపలేషు చేష్టా.దేవీ మమాపత్తి మపా కరోతు "

మేల్కొన్న వారిలో మెలకువగా, నిద్రపోయే వారిలో నిద్రగా, రసహీనాలలో పాకం గా, యౌవన వంతులలో పుష్టి గా, ధీరులలో ధైర్యం గా చంచల మనస్కులలో చలనం గా ఉన్న పరమేశ్వరి ఆపదలను తొలగించాలని మొక్కుకొన్నారు.

"విద్యావతో వాద విధాన శక్తిఃవీరస్య సంగ్రామ విధాన శక్తిః-నారీమణేర్మోహ విధాన శక్తిః ర్లేశ త్రయం కిన్చిదపార శక్తేః"

విద్వాంసుని వాదన శక్తి, వీరుని యుద్ధ శక్తి, స్త్రీ సమ్మోహన శక్తి, అనే ఈ మూడూ "అనంత "అయిన మహాశక్తి స్వల్ప అంశాలు మాత్రమే.

తాపసుల మనస్సులకు ఉత్సాహం కలిగించే శక్తి, మహా కార్యాలలో ప్రేరణ శక్తి, దుష్టుల హృదయాలలో క్షోభ కలిగించే వ్యామోహ శక్తీ అయిన పరదేవత మనల్ని కాపాడాలి అని వేడుకొన్నారు.

అంతటా వ్యాపించే వ్యాన వాయు శక్తి తో జీవుల దేహాలను నడిపించే సర్వేశ్వర శక్తి, యుద్ధ విజేత ప్రతాపం లో, ఓడిపోయి భయ పడిన వాడి పలాయనం లో ఉన్న ఆశక్తికి నమస్కారాలు అంద జేశారు.

ఒక్కటే అయిన రూపాన్ని అనేక అద్భుత కల్పనలతో అనేక రూపాలుగా మూల స్వరూపం ఎరుగని జనాలకు చూపిస్తూ, యదార్ధ దృష్టి ఉన్న జనానికి మాత్రం తన ప్రభువైన సర్వేశ్వరుని చూపించే ఈ విశ్వ మూల శక్తికి ప్రణామాలు చేశారు.

విశ్వ సంవాదం కలవాడై, ధ్యానం తో కాని మంత్రం జపం తో కాని, గుణ సంకీర్తన తో కాని దేవిని ఆశ్ర యించే వాడు ధన్యుడు అని నిష్కర్ష గా తెలిపారు. -పదిహేనవ శ్లోకం –లో

"మూలాగ్ని ముద్దీగ్ని శిరశ్శశాంకం సంద్రావ్య యస్తర్పయతే కృతీ త్వాం-తస్మిన్ నగాదీశ్వర కన్యకే త్వం, ప్రాదుర్భ వంతీ న కి మాదదాసి "

అమ్మా పార్వతీ దేవీ !మూలాధారం లో అగ్ని ని ప్రజ్వలింప జేసి సహస్రారాం లో చంద్రుని ద్రవింప జేసి నీకు సంతృప్తి కలిగించే భక్తుని కి నువ్వు ఆవిర్భవించి చేసేదేముంది ?అని ప్రశ్నించారు.

సహస్రార పద్మ మాధ్యమం లో చంద్ర రూపిణి అయిన అమ్మ ను సేవించే యోగి ఆధ్యాత్మిక తాపమే శాంతిస్తుంటే అల్పమైన బాహ్య తాపం శమిస్తుంది అని వేరుగా చెప్పాలా అంటారు గణపతి ముని.

వీణా దండం గా ఉన్న వెనక మార్గాన ప్రాణ వాయువును గాని, వాక్ రూప మంత్రం కాని బుద్ధిని కాని సాధనం గా చేసుకొని హృదయా కాశ మద్యం లో దిగే వాడు దేవి ఈశ్వరుని తోకలిసి అద్భుత లీలలను ప్రదర్శించే అద్వితీయ బ్రహ్మ పురాన్ని పొందుతాడు అని భరోసా ఇస్తారు

జగన్నాయికా, రుద్ర పత్నీ, ఘనశ్యామా కేశ పాశా! తంత్ర శాస్త్రం లో చెప్ప బడ్డ దేవి మంత్రం మనోనిగ్రహం తో ఉపశించే వాడు సంసార బంధ విముక్తుడై అన్నిటిని జయిస్తాడు అని వివరించారు తరువాత పందొమ్మిది ఇరవై శ్లోకాలలో "పంచ దశాక్షరీ "మంత్రాన్ని గూర్చి వివరించారు.

"పద్మాసనో ద్వాదశ వర్ణ శాంతీ దంభోలి పాణి ర్భువనాది నాదా –గీర్వాణ మార్గో భ్రుగు రాట్చ యోని, రంతే తదాగ్రే చ హలం విరాజీ "

'జమ్భస్య హన్తా నల శాంతి చన్ద్రైసంయుక్త ఊష్మా గల దేశ జన్మా –దంత స్థలీ సంభవ ఊష్మ వర్ణో, వాణీ పతిర్వజర ధర శ్చ లజ్జా "

దీనికి పూర్తీ వివరణ కావాలి –పద్మాసనః అంటే బ్రహ్మ అంటే క కారం ద్వాదశ వర్ణ –శాంతి పన్నెండవ అక్షరం ఏ కారం శాంతి, ఈ కారం దంభోలి పాణి అంటే వజ్రయుధధారి ఇంద్రుడు ల కారం, భువనాదినాదా అంటే భువనేశ్వరి –హ్రీం కారం అంటేటే మొత్తం మీద క –ఏ –ఈ –ల –హ్రీం – ఇది మొదటిఖండం

గీర్వాణ మార్గ –ఆకాశ మార్గం అంటే హ కారం, భ్రుగు అంటే స కారం, అబ్జయోని అంటే బ్రహ్మ కకారం అగ్రేచ అంటే కకారానికి ముందు హలం –హలక్షరం చివర విరాజే అంటే ప్రకాశించే హ కారం జమ్భస్య హన్తా అంటే జమ్భాసురుడిని చంపిన ఇంద్రుడు అంటే ల కారం, గలదేశ జన్మా అంటే కమలం లో పుట్టిన ఊష్మా అంటే శ స, స, హ లలో ఒకటైన హ కారం అనల శాంతి అంటే రేఫ ఈ కార అనుస్వారాలతో కూడిన హ్రీం కారం మొత్తం మీద హ –స –క–ల –హ్రీం –ఇది రెండవ ఖండం

దంత్యస్థలం లో పుట్టిన ఊష్మం అయిన స కారం, వాణీపతి అంటే బ్రహ్మ కనుక క కారం, వజ్రధర అంటే ఇంద్రుడుకనుక ల కారం లజ్జా హ్రీమ్కారం మొత్తం మీద స-క-ల-హ్రీం ఇది మూడో ఖండం

ఏతావాతా తేలింది ఏమిటి అంటే క-ఏ-ఈ –ల –హ్రీం, హ –స-క-హ-ల- హ్రీం, స –క-ల—హ్రీం ఇదిపంచాదశాక్షరి మంత్రం. తరువాత శ్లోకం లో

మూడు ఖండాలుగా ఉన్న క ఏ ఈ ల హ్రీం, హ స క హ ల హ్రీం, సకల హ్రీం అనే పంచ దశాక్షరాల్లో కూడిన శ్రీ విద్యనూ సాక్షాత్తుగా మహా ముని దక్షిణా మూర్తి రూపం లో ఉన్న మహా దేవుడు ఉపదేశించాడు అంటే ఈ పంచ దశీ విద్య కు రుషి దక్షిణా మూర్తి –ఈ విద్య రహస్య విద్యల్లో అత్యంత రహస్యమైంది. పుణ్యం చేసిన వారికే లభిస్తుంది. అన్ని విద్యల్లో శ్రేష్టమైనది బ్రహ్మ చేత స్తుతింప బడింది

ఈ విద్యనే శరీరం లో కుండలిని అని వస్తువులో విద్యుత్ అని, లోకం లో ఆకాశం అని చెప్ప బడింది. దేవతా స్త్రీ లచే నమస్కరింప బడిన దేవి దేవటా స్త్రీలచే కీర్తింప బడింది. ఉపాసకుడు నేత్రాన్ని నిశ్చలం గా ఉంచి మనస్సు తో మంత్రాక్షర రూపం మయిన ప్రాణాన్ని దర్శిస్తూ విశ్వ పోషిణి అయిన దేవిని సేవిస్తే సర్వాభీష్టాలు సిద్ధిస్తాయని తరువాత శ్లోకం లో చెప్పారు.

భువనేశ్వరి కాళి, ప్రచండ చండి, లలితా మొదలైన దేవతలకు హ్రీం, క్రీం, హ్రూం, శ్రీం మొదలైన ఏకాక్షర మంత్రాల్నికాని పంచ దశాక్షరీ మంత్రాన్ని కాని, సర్వేశ్వరుని శక్తి అయిన పర దేవతా యొక్క శ్రేష్టమైన దశ మహా విద్యలను కాని భక్తితో జపిస్తే సాటి లేని సిద్ధులకు జన్మ భూమి అయిన ప్రాణం వశం అవుతుంది. ప్రాణ శక్తి వశం అయితే సర్వ శక్తులూ వశమైనట్లే నని ఇరవై నాలుగవ శ్లోకం లో చెప్పారు --చివరి శ్లోకం

"ఏతాః కవీనాం పద కిమ్కరస్య,, పూతాః ప్రమోదం పద మావహంతు-గీతాఃసభక్తి ద్రవ మింద్ర వజ్రా,శ్వేతాచలాదీశ్వర వల్లభాయాః"

కవులకు పాద సేవకుడైన గణపతి భక్తి రస బంధురం గా ఇంద్రజా వృత్తం లో రచించిన శ్లోకాలు కైలాస నాద పత్ని అయిన పార్వతీదేవికి పరమాందం కలి గించు గాక అని స్తబకాన్ని ముగించారు గణ పతి ముని.

## పరమేశ్వరి విశ్వ వ్యాపకత్వాన్ని, విశ్వరూపాన్ని దర్శించిన గణపతి ముని



శ్రీ కావ్యకంఠ వాసిష్ట గణపతి ముని "ఉమా సహస్రం "చివరిదైన పదవ శతకం నలభై వ స్తబకం లో "పాదాకులక వృత్తం "లో దేవి దివ్య విభూతిని సందర్శించి, ఆ అనుభూతిని మనకూ అందజేస్తున్నారు. ఈ శ్లోకాలన్నీ పరమ పవిత్రం గా భక్తికి పరాకాష్టగా, ఆనందానికి అవధి రహితం గా పదే పదే మననం చేసుకొనే రీతిగా ఉంటాయి. ఆ వైభోగం చూద్దాం – "శమయతు పాపం దమయతు దుఖం, హరతు విమోహం స్ఫుటయతు బోధం –ప్రధయతు శక్తిం మందం హసితం, మనసిజ శాసన కుల సుదృశోనః "

అని మొదటి శ్లోకాన్ని చెప్పారు. మన్మధ వైఖరి అయిన శివుని ఇల్లాలు పార్వతీ దేవి మందహాసం మన పాపాలను నివారించి దుఖాలను నశింప జేసి, భ్రమలను తొలగించి, జ్ఞానాన్ని వికసింప జేసి, శక్తిని ప్రకటించాలని ముని కోరుకొన్నారు. రెండవ శ్లోకం లో –'

“ఆర్ద్రా దయాయా పూర్ణా శక్త్యా, దృష్టి వశం వదవిష్టపరాజా –అఖిల పురంధ్రీ పూజ్యా నారీ, మమ నిశ్శేషాంవిపదంహరతు “

దయతో అమ్మ వారి మనసు మెత్త బడి శక్తి పూర్ణమై, చూపులతోనే లోకేశ్వర శివుని వశ పరచుకొని, లోకం లో ఇల్లాండ్ర చేత పూజింప బడుతూ ఉన్న పరమేశ్వరి ఆపదలను నశింప జేయాలని వేడుకొన్నారు. ఇక్కడి నుండి ప్రతి శ్లోకం ఒక రస గుళిక యే.కవి కవితామృత దారయే.

“శుద్ధ బ్రాహ్మణి మోదో దైవం, తత్ర సిసృక్షతి కామో దైవం –సృజతి పదార్ధాన్ దృష్టిర్దైవం,తాన్బిభ్రాణే మహిమా దైవం “

సకలం అని నిష్కళం అని విభజించ టానికి వీలు కానీ ద్వంద్వానికి అతీతమైన, స్వతస్సిద్ధం అయిన బ్రహ్మ లోని ఆనందం దైవం. అంటే దైవ స్వరూపం ఆనందమే అని అర్ధం. సృష్టించాలి అనే బ్రహ్మ గారి కోరిక ఇచ్చ దైవం.అంటే ఇక్కడ దైవ స్వరూపం సృజ ఇచ్చ, పదార్ధాలలను సృష్టించే బ్రహ్మం లోని దృష్టి దైవం –అంటే సృష్టి నిర్వాహకం అయిన చూపు దైవమె. సృజింప బడిన పదార్ధాలను భరించే బ్రహ్మం లోని మహిమ దైవం అంటే ధారణా శక్తి దైవమె. తరువాత

“వికృతౌ వికృతౌ ప్రకృతిర్దైవం, విషయే విషయే సత్తా దైవం –ద్రుష్టౌ ద్రుష్టౌ ప్రమతిర్దైవం, ధ్యానే ధ్యానే నిష్టా దైవం “

వస్తువులు నామ రూపాలతో వికారాన్ని పొందుతూ ఉండి,,వాటి వికార రహితమైన ప్రకృతి దైవం. దృష్టికి గోచరం అయ్యే సమస్త విషయాలలోనూ ఉనికికి ఆధారమైన సత్త దైవామే. ప్రతి దర్శన క్రియ లోను ఉన్న బుద్ధి దైవమె. ప్రతి ధ్యానం లో ఉన్న నిష్ట అంటే దృడమైన స్తితి దైవమె నంటారు గణ పతి ముని. తరువాతి శ్లోకం లో –

“స్ఫూర్తౌ స్ఫూర్తౌ మాయా దైవం, చలనే చలనే శక్తిర్దైవం –తేజసి తేజసి లక్ష్మీ ర్దైవం, శబ్దే శబ్దే వాణీ దైవం “

ప్రతి స్పందన లోని మహా శక్తి దైవమె. ప్రతి కదలిక లోని చలన ఆవశ్యక శక్తి దైవమె. ప్రతి తేజస్సులోని కాంతి దైవమె. ప్రతి ధ్వనిలోని చెవులకు వినిపింప జేసే శక్తి దైవమె అని వివరించారు.

“హృదయే హృదయే జీవర్దైవం, శీర్శే శీర్శే ధ్యాయద్దైవం –చక్షుషి చక్షుషి రాజర్దైవం, మూలే మూలే ప్రతప దైవం “

ప్రతిగుండేలో జాగరూకం అయిఉండేది దైవం. ప్రతి శిరస్సులో ధ్యానించేది దైవమె. ప్రతి కంటిలో ప్రకాశించేది దైవమె. ప్రతి మూలాధార చక్రం లో ప్రజ్వలించేది దైవమె.

“అభితో గగనే ప్రస ర్దైవం, పృధివీ లోకే రోహద్దైవం –దినకర బింబే దీప్యద్దైవం,సిత కర బింబే సిన్చద్దైవం”

ఆకాశం అంతా వ్యాపించేది దైవం. భూమిలో మొలిచేది దైవం. సూర్య మండలం లో వెలిగేది దైవం. చంద్ర మండలం లో అమృతాన్ని స్రవించేది దైవం అన్నారు.

“శ్రావం శ్రావం వేద్యం దైవం, నామం నామం రాధ్యం దైవం –స్మారం స్మారం దార్యం దైవం, వారం వారం స్తుత్యం దైవం “

మాటి మాటికి విని తెలుసుకోన దగింది దైవం. నిత్యం ప్రణామం తో ఆరాదించేది దైవం. స్మరణ చేస్తూ చేస్తూ ధారణ తో పొందదగింది దైవం. అనేక రకాలుగా వరించి స్తుతింప దగింది దైవం.

“శ్రుతిషు వటూనాం గ్రాహ్యం దైవం, గృహినా మగ్నౌ తర్ప్యం దైవం –తపతా శీర్శే పుష్టం దైవం, యతీనాం హృదయే శిష్ట దైవతం “

బ్రహ్మ చారులకు వేదాధ్యయనమే ఆశ్రమ ధర్మం అయిన తపస్సు. అదే వారికి దైవం. గృహస్తులకు అగ్ని హోత్రమే దైవం. తపస్సు చేసేవారికి శిరస్సులో వృద్ధి పొందినదే దైవం. సన్యాసులకు దహరా కాశం లో వృత్తి రహితమై ఆత్మ రూపం లో మిగిలిందే దైవం.

“నమతా పుష్పైఃపూజ్యం దైవం, కవినా పద్యారాధ్యం దైవం –మునినా మనసా ధ్యేయం దైవం, యతినా స్వాత్మని శోధ్యం దైవం “

నమస్కరించే వాడికి పుష్పాలతో పూజింప దగినదే దైవం. కవికి పద్యాలతో ఆరాధింప బడేదే దైవం. మునికి మనసులో ధ్యానింప దగినదే దైవం. ఇంద్రియ నిగ్రహుడైన యతికి తనలో శోధింప దగిన అంటే తన మూల రూప స్వరూప మైనదే దైవం అంటారు. తరువాత

"స్తువతాం వాచో విడధ ద్దైవం,స్మరతాం చేత స్స్ఫుటయ ద్దైవం –జపతాం శక్తిం ప్రదయ ద్దైవం, నమతాం దురితం దమయత దైవం "

స్తోత్రం చేసే వారి వాక్కులను స్తుతి సమర్ధాలను చేసేదే దైవం. ధ్యానించే వారి చిత్తాన్ని వికశింప జేసేదే దైవం. మంత్ర జపం చేసే వారి శక్తిని విజ్రుమ్భింప జేసేదే దైవం. నమస్కరించే వారి పాపాలను నశింప జేసేదే దైవం.

"వాచో వినయం ద్వాహ్ని దైవం, ప్రాణాన్ వినయ ద్విద్యుతి దైవం –కామాన్వినయ చ్చంద్రే దైవం, బుద్ధీర్వినయ త్సూర్యే దైవం "

అగ్నిలో ఉండి వాక్కులను ఉపదేశించేది దైవం. మెరుపు లో ఉండి ప్రాణాలను నడిపేది దైవం. చంద్రునిలో ఉండి నియమించేది దైవం సూర్యునిలో ఉండి బుద్ధులను ప్రేరేపించేదే దైవం. వివరం గా చెప్పాలంటే –అగ్ని వాగ్దేవత అని వేదం చెప్పింది. అంత రిక్షం లో వ్యాపించిన జ్యోతిలో ఉన్న శక్తి ప్రాణులకు చలన శక్తి కలిగిస్తుంది. కోరిక తో మరణించిన వాడు చంద్ర లోకం చేరుతాడు. కనుక చంద్రుడిలో ఉండి కామాలను నియమిస్తాడు. సూర్యుడు బుద్ధి ప్రేరేపకుడు అని వేదం అన్నది. దీనికి గాయత్రీ మంత్రమే సాక్ష్యం.

"హృదయే నివసద్ గృష్ణా ద్దైవం, వస్తౌ నిసాద్విస్రుజ ద్దైవం –కంఠే నివాసత్ప్ర వద ద్దైవం, కుక్షౌ నివస్త్రపచ ద్దైవం "

హృదయం లో సాక్షిగా ఉండి అంతటిని తెలుసుకొనేదే దైవం. పొత్తి కడుపు నుండి మలిన పదార్ధాలను విసర్జించి, నిర్మలత్వాన్ని కల్గించేదే దైవం. కంఠంలో ఉండి ప్రవచనం చేసేది దైవం. పొట్టలో ఉండిద తిన్నదాన్ని జీర్ణం చేసేది దైవం. "దేహే నివాసద్విచలద్దైవం, పంచ ప్రాణాకారం దైవం –భాగి సమస్త స్యాన్నే దైవం, స్వాహాకారే త్రుప్య ద్దైవం "

దేహం లో స్థిరం గా ఉండి కదిలేది దైవం. పంచాప్రాణాకారం కలది దైవం. స్వాహాకారం లో తృప్తి చెందేది దైవం.

"భిభ్రన్నారీ వేషం దైవం, శుభ్ర దరస్మిత విభ్రాద్దైవం –అభ్రమ దాపహ చికురం దైవం, విభ్రమ వాస స్థానం దైవం "'

స్త్రీ వేషం ధరించిన ది దైవం. తెల్లని చిరునవ్వు ప్రకాశం కలది దైవం. నీల మేఘాన్ని మించిన కేశాలు కలది దైవం. విలాసాలకు నిలయమైనది దైవం.

"శీత జ్యోతి ర్వదనం దైవం, రుచి బిందూప మరందం దైవం –లావణ్యామృత సదనం దైవం, సమర రిపు లోచన మదనం దైవం

చంద్రుని వంటి ముఖం కలది దైవం. కాంతి బిందువులతో సమాన మైంది దైవం. సౌందర్యం అనే అమృతానికి నిలయమైంది దైవం. కామారి అయిన శివుని నేత్రానందకారకం దైవం.

"లక్ష్మీ వీచి మదలికం దైవం, ప్రజ్ఞా వీచి మదీక్షం దైవం –తేజో వీచి మదధరం దైవం, సమ్మద వీధి మదస్యం దైవం "

శోభా తరంగాలతో కూడిన లలాటం కలది దైవం. చిన్మయ తరంగ ముల చూపు కలది దైవం. తేజస్సు అనే తరంగ సహితమైన కింది పెదవికలది దైవం. ఆనంద తరంగ భరితమైనది దైవం.

"కరుణాలోలిత నేత్రం దైవం, శ్రీ కారాభ శ్రోత్రం దైవం –కుసుమ సుకోమల గాత్రం దైవం, కవి వాగ్వై భవ పాత్రం దైవం "

దయ అలల్లాగా ప్రసరిస్తున్న కన్నులు కలది దైవం. సంస్కృతం లో, తెలుగులో రాయబడే శ్రీ అనే అక్షరాన్ని పోలిన చెవులు కలది దైవం. కుసుమ కోమల శరీరం కలది దైవం. కవి వర్ణన లకు ఆస్పదమైనది దైవం.

"హిమవతి శైలే వ్యక్తం దైవం,సిత గిరి శిఖరే క్రీడ ద్దైవం –తుంబురు నారద గీతం దైవం, సురముని సిద్ధ ధ్యాతమ్ దైవం "

హిమాలయాలలో ఉమాదేవి గా విరాజిల్లేది దైవం. కైలాస శిఖరం పై క్రీడించేది దైవం. తుంబురు నారద భక్త గాయకులచే కీర్తింప బడేది దైవం. దేవతలు, మునులు, సిద్ధుల చేత ఏకాగ్రత తో ధ్యానింప బడేది దైవం,

"క్వచిదపి రతి శత లలితం దైవం, క్వచి దపి సుతరాం చండం దైవం –భక్త మనోనుగవేషం దైవం, యోగి మనోనుగ విభవం దైవం "

ఒక చోట అనేక విలాసాలతో సౌమ్యం గా ఉండేది దైవం. వేరొక చోట మిక్కిలి భయంకర ఉగ్ర రూపం లో ఉండేది దైవం. భక్తుల మనస్సులను బట్టి బాహ్య ఆకారాలు ధరించేది దైవం. అమోఘమైన సంకల్పం ఉన్న యోగుల మనస్సులను అనుసరించి ఐశ్వర్యం కలది దైవం.

"చరితే మధురం స్తువతాం దైవం, చరణే మధురం, నమతాం  దైవం –ఆధరే మధురం శంభోర్దైవం, మమతుస్తన్యే మధురం దైవం "

స్తోత్రాలు చేసే వారికోసం తన చర్యల్లో మధురమైనది దైవం. నమస్కరించే వారి కోసం పాదాల యందు మధురమైనది దైవం. పరమ శివుని కోసం అధరోస్టం లో మధురమైనది దైవం. పుత్రుడైన గణపతి కి  మాత్రము స్తన్యం లో మధురమైనది దైవం.

భుజ భ్రుత విస్టప  భారం దైవం, పద ధ్రుత సంపత్సారం దైవం –లాలిత నిర్జర వీరం దైవం, రక్షిత సాత్విక ధీరం దైవం "

బాహువుల్లో జగత్తు యొక్క రక్షణ భారాన్నివహించేది దైవం. అన్ని సంపత్తులకు పాదములు కలది దైవం. దేవ వీరులను లాలించేది దైవం. సత్వ గుణ ప్రధానులైన జ్ఞానుల్ని రక్షించేది దైవం. ఇరవై నాలుగో శ్లోకం లో

"రమణ మహర్షే రంతే వాసీ, మధ్యమ పుత్రో నరసింహస్య –వాసిష్టో యంమరుతాం మాతు ర్గణపతి రంఘ్రిం శరణ ముపైతి "

అరుణాచలం లో ఉంటున్నభగవాన్ శ్రీ రమణ మహర్షి శిష్యుడు, శ్రీ నరసింహ జనకునికి మధ్య తనయుడు, వసిష్ట గోత్రోద్భవుడు అయిన ఈ గణపతి కవి, దేవ మాత అయిన ఇంద్రాణీ దేవి చరణాలను ఆశ్రయిస్తున్నాడు. అంటూ చరణ మే శరణం అని భక్తిగా ఆర్తిగా అమ్మ పాదాలనాశ్రయించారు కవి ముని. చివరగా ఇరవై అయిదవ శ్లోకం –

"త్రిభువన భర్తుఃపరమా శక్తిః, సకల సవిత్రీ గౌరీ జయతే –తన్నుతి రేషా గణపతి రచితా –పాదాకుల ప్రాంతా జయతి "

మూడు లోకాలకు ప్రభువు అయిన పరమేశ్వరుని సర్వోత్కృస్ట శక్తి, విశ్వానికి జనని అయిన ఉమాదేవి సర్వోత్తమం గా విరాజిల్లు తోంది. గణపతి కవి "పాదాకుల వృత్తం "లలో రచించిన శ్లోకాలతో ప్రశస్తం గా ముగిసిన శ్రీ ఉమా దేవి స్తుతి సర్వోత్కృస్టం  గా విలసిల్లు తోంది అని గణ పతి ముని తన వెయ్యి శ్లోకాల "ఉమా సహస్రాన్ని "చాలా అర్ధ వంతం గా ఎవరికైనా అమ్మ వారి పాదాలే శరణు అపే దారి చూపిస్తాయి అని, సందర్భానికి తగిన  "పాదాకుల వృత్తం "ను ఎన్నుకొని మధుర మధురం గా దేవీ గానాన్ని చేసి అందులోని మాదుర్యామృతాన్నితనివార గ్రోలి, మనకూ ఆ అమృత రససేవనం అందించి ధన్యులని చేశారు.

గణపతి ముని రచించిన  వెయ్యి శ్లోకాలతో,వాటికి చక్కని అర్ధ తాత్పర్యాలను శ్రీ పన్నాల రాధాకృష్ణ శర్మ గారు మనస్సుకు హత్తుకోనేట్లు రాసిన"ఉమా సహస్రం "  పుస్తకం 555పేజీల  ఉద్గ్రంధం. దీనిని ఫిబ్రవరిలో శ్రీ రమణాశ్రమాన్ని దర్శించినపుడు కొన్నాను. కాని జూలై దాకా చదవ టానికి అవకాశం కలగ లేదు., జులై 18న చదవటం ప్రారంభించి నిన్న అంటే ఆగస్ట్ 17న నెల రోజుల్లో పూర్తీ చేశాను. ఎక్కడికక్కడ ఎన్నో కొత్త విషయాలు నన్ను ఆకర్షించాయి వాటిని మీ అందరికి తెలియ జేయటానికే కొన్ని వ్యాసాలు  రాసి గణపతి మునికవి ఆంతర్యాన్ని తెలియ జేసే చిరు ప్రయత్నం చేశాను. దోషాలన్నీ నావి. మహత్తు అంతా మహనీయులు కావ్య కంఠ వాసిష్ట గణపతి ముని కవి గారిది అని వినమ్రం గా విన్న  వించు కొంటున్నాను. ఇంతటి గొప్ప గ్రంధం చదివే మహద్భాగ్యం నాకు ఏ పురాకృత సుకృతం వల్లనో లభించిందని, ఉమా దేవి అనుగ్రహమే నన్ను ప్రేరేపించి చది వి చిందని ని నమ్ముతున్నాను.

## శ్రీ కృష్ణుడు ఇంద్రుని అవతారం

భగవాన్ శ్రీ కృష్ణుడు ఇంద్రుని అవతారం అని వేదాల ననుసరించి శ్రీ రమణ మహర్షి కి గురువు ఆయనతో 'నాయనా "అని గౌరవం గా పిలిపించుకొన్న కావ్య కంఠబిరుదాంకితులు వాసిష్ట గణపతి మునిఅభిప్రాయ పడ్డారు వేదాలలో కుత్సుని సారధి గా చెప్పబడిన వాడే కృష్ణుడు. కుత్సుడు అంటే అర్జునుడు. ఋగ్వేదం 4-17-14 మంత్రం లో ఇంద్రుడు సూర్యుని రధ చక్రాన్ని తొలగించి యుద్ధం లో అర్జునుని పరాభవాన్నుండి కాపాడి నట్లు ఉందట. కృష్ణుడే సూర్యుని కూడా మాయోపాయం చేత కూల గొట్టాడని ఆ రుక్కు తాత్పర్యం. అతని శరీరానికి మూల భూతం భూమి. సాధారణం గా అందరి శరీరాలకు భూమియే ప్రకృతి మరి కర్ణుడికి అవటానికి ప్రత్యేకత ఏమిటి ?/అని వితర్కించి గణపతి ముని భూదేవి అంశావతారం పొందిన స్త్రీకి అతడు జన్మించి నట్లు తేల్చి అదీ విశేషం గా తెలియ జేశారు. కనుక కుత్సితుని రక్షించిన ఇంద్రుడే కృష్ణుడు అని తేల్చారు. అంశావతారానికి అసలు అవతారానికి భేదం లేదని కృష్ణుని ఇంద్రావతారం గా నిగమాలు పేర్కొన్నాయి అని తెలిపారు.



భారత ఇతి హాసం లో కృష్ణుని "శౌరి 'అన్నారు. వేదాలలో "శూర దేవుని పౌత్రునిగ వర్ణించి "శౌర దేవుడు "అన్నారు. ఇతిహాసం లో దేవా అనే పదాన్ని వదిలేశారు. ఇంద్రునికి శౌర దేవత్వం కూడా అవతార సంబంధమే అని మంత్రం చెబుతోంది ఈ మంత్రం కర్త "పురుహన్మా రుషి ".ఆ మంత్రార్ధం –"శౌరదేవుడైన ఇంద్రా !లేగ దూడలను తీసుకొని వచ్చితల్లి ఆవు దగ్గర పాలను కుడిపించే వాడి లాగా పరలోకం చేరిన కుమారులను మూడు లోకాలలోనూ గాలించి వాళ్ళను తెచ్చి బతికించి ప్రాణ ప్రేరణ చేయి. ".భాగవతం దశమ స్కంధం లో చనిపోయిన బ్రాహ్మణ బాలకులను శ్రీకృష్ణుడు బ్రాహ్మణుని కోరిక మేరకు పిలిచి పునర్జీవితులను చేసిన కధ మనకు తెలిసిందే. ఈ రెండు మంత్రాలకు కర్త అయిన పురుహన్మా రుషియే భాగవతం లో శ్రీ కృష్ణుని విద్యా చెలికాడు అయిన కుచేలుడనే సుదాముడు. అతడు ప్రేమతో తెచ్చిసమర్పించిన గుప్పెడు అటుకులు గ్రహించి అతనికి సాటి లేని సంపద నిచ్చి ఆదరించాడు బాల్య సఖుడైన కృష్ణుడు.

ఋగ్వేదం 4-32-22- రుక్కు లో కృష్ణుడు నందుడు అనే గోపాలకునికి పుట్టిన పుత్రుడని ఉంది. అదే భాగవతపురాణం భారతేతి హాసాలలో కృత్రిమ పుత్రుడని పేర్కొన్నాయి. కనుక కృష్ణుడు ఇంద్రుని అవతారమే నంటారు వాసిష్ట ముని. ఇంద్రుని కి ఉన్న "వసు "శబ్దానికి "దేవా "కలిపితే వచ్చేది వసుదేవ నామమే. దానికి పుత్రార్ధ కం గా వచ్చే పేరే "వాసుదేవ ".ఈ రెండు మంత్రాలకు రుషి వసిస్టుడు. రెండో మంత్రం లో వసిస్టుడు"మన్య మానుడు "ను తన శత్రువు గా పేర్కొన్నాడు. మరి వసిస్టుడు అంతటి గొప్ప వాడికి శత్రువు సామాన్యుడేవడు అవుతాడు అని ప్రశ్నించుకోవాలి. ఇక్కడ కొంత దూరా లోచన చేయాలంటారు "నాయన ".వసిష్ట శత్రువు అంటే వసిస్టుడికి శత్రువు కాదు ఆయన పురోహితుడు గా ఉన్న రాజుకు శత్రువు అని తీసుకోవాలని వివరణ ఇస్తారు. వేదాలలో సుదాసుడు అనే వాడు ఈయన శత్రువు అని ఉంది. సుదాసుని తండ్రి పిజ వసుడనే వాడు రాజు. తండ్రి కొడుకు లలో ఒకరితో మన్య మాన వంశీకులు యుద్ధం చేశారు. ఆ యుద్ధం లో ఇంద్రాదుల అనుగ్రహం పొంది రాజు దేవకుని చంపాడు. కనుక దీనిని బట్టి యుద్ధం చేసింది సుదాసుడే అని నిర్ధారించారు కావ్య కంఠులు. పది మంది రాజులు ఇతని శత్రువులని చెప్ప బడింది. అందులో "భేదాకుడు "అనే రాక్షసుడు కూడా ఉన్నాడు. ఈ యుద్ధం యమునా నదీ తీరం లో జరిగింది అని స్పష్టం చేశారు గణపతి ముని. దేవకుని రాజధాని మధుర అక్కడే ఉంది. దేవజుడితో బాటు అతని కుమారులూ చచ్చారు., అప్పుడు దేవకుని తమ్ముడు" ఉగ్రసేనుడు "రాజయ్యాడు. ఈ రాజరికం అకస్మాత్తు గా లభించింది దీనికి కినిసిన కంసుడు అతన్ని బంధించి తానే రాజై ఆర్యులన్దర్నీ ఓడించాడు. వాళ్ళు దిక్కు లేక పారిపోయారు అని భాగవత పురాణ కధనం.




ఇంతకీ మనకు దీని వల్ల తెలిసిన్దేమిటి ?దేవకుని కూతురు" వికుంఠ. "దేవకుని కూతురు కనుక దేవకీ అయింది. దైవకి అనే పదం ప్రాకృత భాష లో దేవకీ అయింది. వైకుంఠ నామం కృష్ణునికి చెందేది. ఈ పేరు తో కృష్ణుడు మంత్రం ద్రష్ట అయాడు. కృష్ణుడు అనే పేరఇంకొకరు కూడా మంత్రం ద్రష్టగా ఉన్నారంటారు గణపతి ముని. ఈయనే పాండవుల పితామహుడైన ద్వైపాయన మహర్షి అనబడే వేద వ్యాసుడు. ఇంత దూరం ఆలోచించి కావ్య కం ఠులు నిర్ణయాలు చేస్తారు వారి సూక్ష్మ దృష్టికి అందనిది లేదు. ఇలాంటివి ఎన్నో వారు "భారత చరిత్ర పరీక్ష "లో త్రవ్వి పోశారు సంస్కృతం లో రాశారు. మన కు తెలియాలని శ్రీ రాణీ శేషాద్రి శాస్త్రి గారు తెలుగు లోకి అందునా సులభ మైన తెలుగు లోకి అను వాదం చేయగా శ్రీ గుంటూరు లక్ష్మీ కాంతం గారు దీనిని 1961 లో ముద్రించి తెలుగు వారికి చేరువ చేశారు ఈ ముగ్గురు మహాను భావులకు ఆంధ్ర జాతి ఎంతో రుణ పడి ఉంది,

వీలు వెంట మరిన్ని గణపతి ముని గారి భారత కధలను అందించ టానికి ప్రయత్నిస్తాను

## వేద పరమా (త్మ )ర్ధం

శ్రీ మైనేని గోపాల కృష్ణ గారు ఏంతో ఆత్మీయం గా నేను తప్పక చదవాలని భావించి అమెరికా నుండి ఆర్డర్ పై స్వర్గీయ కొత్త సచ్చిదానంద మూర్తి గారు ఆంగ్లం లో రాసిన "వేదార్ధ మీమాంస "కు వాడ్రేవు చిన వీర భద్రుడు చేసిన తెలుగు సేత పుస్తకాన్ని పంపారు. హైదరాబాద్ లో ఉంటున్న ఈ అయిదారు రోజుల్లో దాన్ని ఆసాంతం చదివాను. ఎన్నో విషయాలను గుది గుచ్చి ఒక చోట చేర్చి కరతలామలకం గా వేదం ఎందుకు చదవాలి, అందులో ఉన్న పరమార్ధం ఏమిటి, ఎందుకు దానికి దూరమై పోతున్నాం, పాశ్చాత్యులు వేదం ను సరిగ్గా అర్ధం చేసుకో కుండా, ఏవేవో చదివి విపరీతార్ధాలను ఎలా రాశారు, దానివలన వేద పరామార్ధానికి ఏర్పడిన ఇబ్బంది ఏమిటి అన్న విషయాలను నాలుగు వేదాలు ఉపనిషత్తులు, మహా భారత భాగవత రామాయణ, మనుస్మృతులు మీమాంస, శ్రీ శంకర, రామానుజ, మాధవాచార్యుల భాష్యాలు, సాంఖ్య, న్యాయ వైశేషిక, బ్రహ్మ సూత్ర, భగవద గీతాదుల నాధారం గా సవివరం గా శాస్త్ర ప్రమాణం గా చర్చించి నిగ్గుతేల్చి అతి సరళ భాషలో ఇంగ్లీష్ లో రచించి తన విశేష శేముషీ వైభవానికి, పరిజ్ఞానానికి దర్పణం గా "వేదార్ధ మీమాంస "ను రాస్తే అంతకంటే సరళ సుందరం గా ప్రతి మాటను సాధికారికం గా ప్రతి భావాన్ని ఉజ్జ్వల తేజో విలసితం గా అనువాదం చేసి అసలు మూల గ్రందాన్నే చదువుతున్నామనే అమోఘ అనుభవాన్ని కలిగించారు చిన వీర భద్రుడు. నిజం గా వాణినా రాణి అన్న చిన వీరభద్రకవి అనిపించి, పెద వీర భద్రుడే అనే నిశ్చయాన్ని కల్పించారు. మూల, అనువాద రచయితలిద్దరికీ కై మోడ్పు ఘటిస్తూ అందులో నేను తెలుసుకొన్న నాకు నచ్చిన ముఖ్య విషయాలను "వేద పరమా (త్మ )ర్ధం "గా మీ ముందు ఉంచుతూ, మీకూ ఆ అను భూతిని పంచుతున్నాను.

ఋగ్వేద,యజుర్వేదాలలో లో సత్యమే జ్ఞానమని, యజ్ఞం కర్తవ్యమని యజ్నమంటే శుద్ధి చేసే కర్మ అని తెలియ జేశారు. రుక్కుల ద్వారా వర్ణింప బడింది సామం ద్వారా గానమైంది. అధర్వం అన్ని వేదాల సారమే. యజ్న మార్గానికి దారి చూపింది "అధర్వుడు ". ఆయన పేర ఆ వేదం పిలువ బడింది. భ్రుగువులు కూడా ఆయనకు సమానమే అందుకే దానికి అధర్వాన్గీరసం లేక భ్రుగ్వాన్గీరసమని పిలుస్తారు, కైవల్య పధం నాలుగు కొమ్ములు కల వృషభం అ కొమ్ములే నాలుగు వేదాలు యజ్న మార్గం లో పరమ పురుషుడిని తెలుసుకోవాలి. ప్రతిదీ ఈశ్వరునితో

కూడుకొని ఉంది అనే భావం రావాలి. వేద వృక్షానికి పూసిన పువ్వే సామ వేదం. మానవుడిలో ఉన్న బ్రహ్మన్ ను ఎరుక పరచేదే అధర్వ వేదం. వేదాల్లో యజ్న యాగాదులకు సంబంధించింది అంతా "త్వం ", భగ వంతుని గుణ గణాలను వర్ణించేది "తత్ " వేదాంతం బ్రాహ్మణ, ఆత్మల ఏకత్వాన్ని తెలియ జేస్తుంది.

వేదాలు ఎ భేదామూ లేకుండా ఒకే విషయాన్ని గూర్చి చెప్పాయని భగవత్ పాదులన్నారు. జీవితం లోని అత్యున్నత సూత్రం గా సత్యాన్ని ప్రతిష్టించటం ఉపనిషత్తులు చేసిన గొప్ప పని అని "లూడర్స్ "వివరించాడు. ఏధర్మాన్ని బ్రహ్మన్ని ఎరుక పరుస్తుందో అదే వేదం. కోరిన కోర్కెలను తీర్చటానికే వేదాన్ని వాడుకో రాదు అంతకు మించిన అమూల్య జ్ఞానం ఉందని గ్రహించాలి. మానవ జీవితం లో ఏ కర్మ అయినా యజ్ఞమే. అదొక ఆరాధనా కార్య క్రమం. మన కోరికలు తీర్చుకోవటం కోసం దేవతలకు అర్పించే కానుకలే యజ్ఞం. యజ్ఞం మానవుల్ని దేవతల్ని కలిపి ఉంచే ఒప్పందాలు. యజ్ఞం చేయక పోవటం అమానుషం, సామాజిక ఉపద్రవం. దేవతలు పురుషుడిని హవిస్సు చేసి యజ్ఞం చేశారు. అంటే మానసికం గా చేశారని భావం, ప్రపంచం మహా పురుషుని దేహం. యజ్ఞం చేయటం పురుష స్వరూపమే అవుతుంది. యజమాని యజ్ఞం హవిస్సు, అగ్ని అన్నీ పురుషుడే. "పురుషాత్మకం సర్వం "అన్నది వేదం. భగవంతుడు తనలోని సమస్త జీవుల్ని వెలికి తీసి వాటి అనుభవం కోసం తన సర్వస్వాన్ని వారికి ప్రసాదిస్తున్నాడు. ఈ సృష్టి భగవంతుడు చేసే యాగమే.

యజ్ఞం చేసేటప్పుడు మానవుడు తన పాత అస్తిత్వాన్ని దేవతలకు హవిస్సుగా అర్పించి దగ్ధం చేసుకొంటాడు. ఏరూపం లో కొలిస్తే ఆయన ఆరూపం లో చేరువౌతాడు బగవంతుడు. బ్రాహ్మణాలు ఆరణ్యకాలు యజ్ఞాన్ని ఒక కారుణ్య కర్మ గా మార్చాయి. తన మంచికోసం చేసేది యజ్ఞం. సమస్త ప్రాణులకోసమూ జ్ఞానోదయం కోసం చేస్తే మహా సత్రం అంటారు. అందరం బ్రహ్మ, దేవ, పిత్ర, మనుష్య, భూత యజ్ఞాలనే పంచ మహా యజ్ఞాలు చేయాల్సిందే.. వేదం అధ్యయనం చేస్తూ చిత్త ఏకాగ్రత, ఇంద్రియ నిగ్రహం, స్తిత ప్రజ్ఞత, ఆధ్యాత్మిక శీలం, యశస్సులో అభివృద్ధి బ్రాహ్మన్ కు హవిస్సులంద జేయటమే బ్రహ్మ యజ్ఞం. తన దగ్గర ఏది ఉందొ దాన్ని భగ వంతుడికి సమర్పించటం దేవ యజ్ఞం. బీదలకు, అవసరమున్న వారికి సాయం చేయటం మనుష్య యజ్ఞం. సర్వ భూత కోటికీ వీలైనంత సాయం చేయటం, ప్రేమించటం భూత యజ్ఞం. మొత్తం జీవ కోటితో సంబంధమే భూత దయ. మనిషి విశ్వ ప్రణాళిక లో ఒక భాగం. మనిషి శాశ్వత, అతీతమైన దానితో బాటు తాత్కాలిక అస్తిత్వం తో కూడా ముడి పడి ఉంటాడు. తనకోసం తోటివారికోసం భగవంతుడికోసం జీవించటమే అన్నిటికన్నా ఉత్కృష్ట మైన యజ్నం.

ఉపనిషత్తులు –ప్రజా పతియే తనను తానూ ఒక మహా యజ్న పశువుగా భావించి తనను తానె యజ్ఞం చేసుకొన్నాడని చెప్పింది మనిషి జీవితమంతా సోమయాగమే నంది. ప్రపంచమే ఒక హోమం. భూమి దాని ఇంధనం. అగ్ని దాని పొగ. రాత్రి దాని మంట. చంద్రుడు భస్మం. నక్షత్రాలు విస్ఫులింగాలు ఈ అగ్నికి దేవతాలు వర్షాన్ని హవిస్సుగా సమర్పిస్తారు. దాని నుంచి అన్నం వస్తుంది మనిషి ఒక అగ్ని. అతడికి దేవతలు అన్నాన్ని హవిస్సుగా అర్పిస్తారు. దానినుంచే జీవితం పుడుతుంది. పరబ్రహ్మ మనిషిలోనే ఉన్నాడు. మనిషి తినేది అంతా పరబ్రహ్మానికి నైవేద్యమే. కౌతికీ ఉపనిషత్తు –మనిషి నిద్రపోతున్నా మెలకువ గా ఉన్నా నిర్విరామం గా యజ్ఞం చేస్తున్నట్లే లెక్క అని చెప్పింది




స్వర్గీయ ఉప్పులూరి గణపతి శాస్త్రి యజ్ఞాల ఘట్టాలు అధ్యయనం, పారాయణ యజ్ఞం చేసిన దానితో సమానమే అన్నారు. స్వాధ్యాయ ప్రవచానలకు మించిన యజ్ఞమే లేదు. బ్రహ్మ జ్ఞానమే మానవ జీవిత పరమార్ధం. భూత భవిష్యత్ వర్తమానాల మీద ఆధిపత్యం ఎవరికి ఉందో, ఎవరు ఈ ప్రపంచానికి అతీతం గా ఉన్నాడో ఆయనే శాశ్వతుడు నిత్య నూతనుడు. ఆయనే మర్త్య ప్రపంచం లో ఉన్న అమర్త్యుడు, అతడు మృత్యువుకు భయ పడడు. గాఢం గా కోరుకొనే వారికి పరమ ధామం లో ప్రతిదీ ఏక రూపం ధరించినట్లే ఉంటుంది. అన్నిటి లోను పని చేసే ఏక సూత్రమే బ్రాహ్మన్ అని ఆరణ్యన్యకాలు అంటున్నాయి, అందరిలోనూ ఉన్నది ఒకటే ఆత్మా. ఇవాళ ఉన్నది రేపు ఉండబోయేది ఆయన ఒక్కడు మాత్రమె. పరమ పదం లో దివ్య రూప రహితుడైన పురుషుడి నుంచే దేవ మనుష్య జీవరాశులన్నీ ప్రభ వీస్తున్నాయని ముండకోపనిషత్ అంటోంది. దేవాతలైనా బ్రాహ్మన్ ను దాటి ముందుకు పోలేరు. ఈ మహా సత్యమే వేద సారం ఆ సత్యం తెలియక పోతే సారాంశం బోధ పడదు "నా వేద విన్మనుతే తమ బృహంతం ".

వేదాలు ఒక దానికొకటి అనుసంధించుకునే ఉన్నాయి. సత్యం జిజ్ఞాస, మీమాంస వల్లనే గోచరిస్తుంది. "పోస్ట్ మోడరన్ యుగ తాత్విక పద్ధతి అయిన "హెర్మ న్యూటి క్స్ "అంటే ఇరవయ్యవ శతాబ్దపు పాశ్చాత్య తాత్వికులు తత్వ శాస్త్రం లో తాము కొత్తగా కనుక్కొనే సత్యం ఏదీ లేదని తాము ప్రాచీన తత్వ వేత్తల రచనలను మళ్ళీ పూర్తిగా చదివితే సరిపోతుందని భావించారు. గత పది హేను వందల ఏళ్లుగా భారతీయ ఆచార్యులేవ్వరూ తాము కొత్తగా యేదర్శనాన్ని ప్రతి పాదిస్తున్నట్లు చెప్ప లేదు.. పాత వాటికి భాష్యాలు మాత్రమె రాస్తున్నారు. భాష్య సంప్రదాయానికి "హెర్మ న్యూటిక్స్"కు తేడా ఉంది. భాష్యం లో భాష్య కారుడు ఏదో ఒక సంప్రదాయానికి బద్ధుడై రాస్తాడు కానిహెర్మన్యూ టిక్స్ తటస్థ భావం తో నిష్పక్ష పాతం గా, ఎటు వంటి లోగో సెంట్రిజం లోను కాకుండా ప్రాచీన రచనలను అర్ధం చేసుకొంటుంది. ఇదే విధానాన్నిపద్మ విభూషణ్ శ్రీ కొత్త సచ్చిదానంద మూర్తి గారు అవలంబించి వేద సారాన్ని అర్ధం చేసుకొనే ప్రయత్నం చేశారు. ఇది నేడు భారత దేశానికి అత్యంత అవసరమైన రచన 'అందుకే నాకు ఇష్టం "అని అనువాదకులు శ్రీ చిన వీర భద్రుడు స్పష్టం గా తెలియ జేశారు.

"శబ్ద బ్రహ్మేతి యచ్చేదం శాస్త్రం వేదాఖ్య ముచ్యతే –తదిష్యదిధీష్టితం సర్వమేకేన పరమాత్మనా "

వేదం గా పిలువ బడే ఈ శాస్త్రం అంతా శబ్ద బ్రాహ్మ స్వరూపం గా, ప్రసిద్ధి కెక్కినది అంతా కూడా ఆ పరమాత్మ వల్లనే ప్రేరేపిత మైంది. ఆయనలోనే పాదుకుని ఉంది.. (తాంత్రిక వార్తికం లో కుమారిలుడు )

## బ్రాహ్మణాలు కదా కమామీషు

జూన్ తొమ్మిది సోమవారం మా అమ్మాయి ఛి సౌ విజయ లక్ష్మి, మా మనవడు ఛి సంకల్ప్ –అంటే మా పెద్దబ్బాయి శాస్త్రి కొడుకు కలిసి ఆర్ టి సి వారి పాకేజ్ టూర్ లో శ్రీ వెంకటేశ్వర స్వామి దర్శనానికి హైదరాబాద్ నుండి తిరుమల వెళ్ళారు. మంగళ వారం ఉదయం చేరి దర్శనం

పూర్తి చేసుకొన్నారు అన్నీ వాళ్ళే దగ్గరుండి తీసుకుని వెళ్లారట. ప్రసాదం లాడ్డూలు కూడా వాళ్ళే కలెక్ట్ చేసి ఇచ్చారట. పద్మావతీ అమ్మవారి దర్శనం శ్రీ కాళ హస్తి చూపించి మళ్ళీ రాత్రికే బయల్దేరి బుధవారం ఉదయం హైదరాబాద్ చేరారు. తిరుమలలో దేవస్థానం బుక్ స్టాల్ కు వెళ్ళిన మా అమ్మాయికి అక్కడ కొత్తగా ప్రచురించిన "బ్రాహ్మణాలు "కనపించాయి "నాన్న అన్నిటి మీదా రాశారు కాని బ్రాహ్మణాల పై రాయలేదే "అనుకోని ఒక పుస్తకం కొని తీసుకొని వచ్చింది నాకోసం. దీని ప్రధాన సంపాదకులుఆచార్య ఎస్ బి.రఘునాదా చార్య గారు.




దాన్ని ఆ పూట నుంచే చదవటం మొదలు పెట్టి నాలుగు వందల యాభై పేజీలను అయిదు రోజుల్లో పూర్తిచేశాను. బాగా ఉంది. అంతకు ముందెప్పుడో ఇరవై ఏళ్ళ క్రితం అరణ్యకాలు చదివాను. ఇందులో కొన్ని కధలు బాగున్నాయి వాటినీ అందులోని విశేషాలను బ్రాహ్మణాల వైశిష్ట్యాన్ని తెలియ జేయటానికి "ఆరణ్యకాల కదా కమామీషు "శీర్షికతో రాయటం ఈ రోజు నుంచే మొదలు పెడుతున్నాను. నాకు తెలిసిన, నచ్చిన విషయాలను అందరికి అందివ్వటమే నా ఉద్దేశ్యం. ఇదొక దారి చూపే పనే కాని లోతులను తరచి చూపే పనికాదని సవినయం గా మనవి చేస్తూ ప్రారంభిస్తున్నాను.

## బ్రాహ్మణాలు అంటే ఏమిటి ?

వేదాలు భగవంతుని నిశ్వాసాలు. అవి రుక్, యజు, సామ అధర్వాలని నాలుగు. వీటి మూల గ్రంధాలను "సంహితలు "అంటారు. ఇవన్నీ దాదాపు ఛందో బద్ధమంత్రాలే. కనుక మంత్రభాగమనీ పేరు. దేవాతా స్తుతులు, యజ్న యాగాది వైదిక కర్మలు, ధార్మిక ప్రక్రియలు, తాత్విక చింతనలు వేదాలలో ప్రతి పాదించ బడ్డాయి. మంత్రం ద్రస్టలైన మహర్షులు భావన లో వీటిని దర్శించారు. అందుకే వారు మంత్ర ద్రష్టలు అయ్యారు. వారు దర్శించిన మంత్రాలనుపయోగించి వివిధ దేవతారూపం లో ఉన్న భగవంతుని ఆరాధించటమే యజ్ఞం. యజ్ఞం చరా చర సృష్టికి సుఖ సంతోషాలను తుష్టిని పుష్టిని ఇస్తుంది. యజ్న యాగాలకు కొన్ని పద్ధతులున్నాయి. వాటిల్లో సామాజిక ద్రుష్టి, తాత్విక చింతన, ధర్మాసక్తి ఉంటాయి. సంహితను సరిగ్గా అర్ధం చేసుకుని అనేక కర్మలలో ఉపయోగించుకుంటూ, అందు లోని సాంకేతిక పరిజ్ఞాన అర్దాన్ని వివరిస్తూ ఏర్పడిన వాటినే "బ్రాహ్మణాలు" అన్నారు. ఇవి గద్యం లో ఉంటాయి. వేద సంహితలకు, ఆ తర్వాత వచ్చిన వాఙ్మయానికి బ్రాహ్మణాలు వంతెనలాంటివి.యాగస్వరూపాన్ని వివరించటమే బ్రాహ్మణాల ముఖ్య కర్తవ్యం.

బ్రహ్మ అనే శబ్దానికి అర్ధం అంటున్నది శాత పద బ్రాహ్మణం. నాలుగు వేదాలలోను ఉన్న మంత్రం భాగానికి వినియోగాన్ని విధిస్తూ, వ్యాఖ్యానం గా ఏర్పడిన గ్రంధమే బ్రాహ్మణం. మంత్రాలు కాకుండా మిగిలిన వన్నీ బ బ్రాహ్మణాలే.ఇవి గొప్ప ప్రామాణిక గ్రంధాలు.

## సంహితలు –బ్రాహ్మణాలు

సంహితలలో ప్రతి ముఖ్య శాఖ కు ఒక బ్రాహ్మణం ఉండేది. రుక్సంహితకు 21శాఖలున్నా ఆరు మాత్రమె కని పిస్తున్నాయి అవే ఐతరేయ బ్రాహ్మణం, కౌశీతకి బ్రాహ్మణం, పైంగి బ్రాహ్మణం, బహ్వ్చ బ్రాహ్మణం, ఆశ్వలాయన బ్రాహ్మణం, గాలవ బ్రాహ్మణం.

యజుస్సంహితకు రెండు ప్రధాన శాఖలున్నాయి. అందులో కృష్ణ యుజుర్వేదానికి తైత్తిరీయ శాఖలకు సంబంధించింది తైత్తిరీయ బ్రాహ్మణం. మాధ్యందిన –కాన్వ భేదం తో శుక్ల యజుర్వేదానికి రెండు శాఖలున్నాయి వీటికి విడి విడిగా మాధ్యందిన శత పద బ్రాహ్మణం, కాన్వ శత పద బ్రాహ్మణం అని రెండున్నాయి ఇవికాక కాల గర్భం లో పన్నెండు కలిసి పోయాయి.

సామ సంహితకు మూడు ప్రధాన బ్రాహ్మణాలు తలవకార బ్రాహ్మణం, తాండ్య బ్రాహ్మణం, ఛాందోగ్య బ్రాహ్మణం ఉన్నాయి ఇవి కాక ఉప బ్రాహ్మణాలు –సామ విధాన బ్రాహ్మణం, దేవతాధ్యాయ బ్రాహ్మణం, వంశ బ్రాహ్మణం, సంహితోపనిష బ్రాహ్మణం ఉన్నాయి

అధర్వ సంహితకు ఒకే ఒక బ్రాహ్మణం గోపద బ్రాహ్మణం ఉంది.

బ్రాహ్మణాలు వివిధ కాలాలో ఏర్పడ్డాయి. పంచ వింశ బ్రాహ్మణం, తైత్తిరీయ బ్రాహ్మణం మిగిలిన వాటికంటే ప్రాచీన మైనవి. వీటి తర్వాత తలవకార లేక జైమినీయ బ్రాహ్మణం ఆ తర్వాత కౌశీతకి బ్రాహ్మణం ఏర్పడ్డాయి. దీనితర్వాత ఐతరేయం ఆ తర్వాత శత పధం ఏర్పడ్డాయని భావిస్తున్నారు. కృష్ణ ద్వైపాయన వ్యాసుని చేత కల్ప సూత్రాలతో బాటు నిర్మింప బడిన బ్రాహ్మణాలు ఆధునికమైనవి. అంతకు ముందున్న బ్రాహ్మణాలు ప్రాచీనమైనవి అని అనుకుంటారు. మొత్తం మీద ఐతరేయ, పంచ వింశ, తైత్తిరీయ బ్రాహ్మణాలు మిగిలిన వాటికంటే ప్రాచేనమైనవి శతపద బ్రాహ్మణం నవీనమైనది.

## బ్రాహ్మణాలు దేనికి చెందుతాయి ?



"బ్రాహ్మణం చ వేదః "అని జైమిని సూత్రాలకు భాష్యం రాసిన శబర స్వామి అన్నాడు అంటే మంత్రాలే కాదు బ్రాహ్మణాలు కూడా వేదమే నన్న మాట. బృహదారణ్యక ఉపనిషత్తుకు భాష్యం రాస్తూ శ్రీ శంకర భగవత్పాదులు "వేదాను వచనేన మంత్రం బ్రాహ్మణాధ్యయనే "అన్నారు అనగా మంత్ర భాగాన్నీ, బ్రాహ్మణ భాగాన్ని అధ్యయనం చేయటమే వేదాను వచనం అని చెప్పారు అంటే బ్రాహ్మణాలు వేదాలేనని అంగీకరించారు. తంత్ర వార్తికం లో కుమారిలుడు బ్రాహ్మణాలకు వేదం అనే పేరుందని ఒక ధర్మ శాస్త్రాన్ని పేర్కొన్నాడు. మనుస్మృతి వ్యాఖ్యానం లో మేధా తిది,మస్కరి మున్నగు వారు కూడా బ్రాహ్మనాలను వేదాలుగా గుర్తించారు. "మంత్రం బ్రాహ్మనయోర్వేద నామ దేయం "శ్రోత స్మార్తం లో మంత్రాలు బ్రాహ్మణాలు వేదాలే అని ఆపస్తంభుడు పేర్కొన్నాడు. సాయణుడు"మంత్రం బ్రాహ్మణాత్మక శబ్ద రాశిర్వేదః "అంటే మంత్రం భాగ, బ్రాహ్మణ బాగ రూప మైన శబ్ద రాసి అంతా వేదమే నని చెప్పాడు.

## బ్రాహ్మణాల వల్ల ఏం ప్రయోజనం ?

సంహితలలో ఉన్న మంత్రాలను అర్ధం చేసుకోవటానికి బ్రాహ్మణాలు ఉపయోగ పడుతాయి. యజ్ఞాన్ని ఎలా చేస్తే ఏమేమి ప్రయోజనాలు కలుగుతాయో నిర్వ చిస్తాయి. సంహితలలో నిక్షిప్తమైన నిగూఢ భావ రాశిని అర్ధం చేసుకోవటానికి నిఘంటువులు కావాలి. వాటిని ఆధారాం గా యాస్కుడు మొదలైన మహర్షులు "నిరుక్తాలు "రాశారు. ఒకప్పుడు ప్రతి వేదానికి విడి విడిగా నిఘంటువు, నిరుక్తం ఉండేవి. ఇప్పుడన్నీ నశించి పోయి యాస్కుడు రాసిన నిఘంటువు నిరుక్తం మాత్రమే లభిస్తున్నాయి. నిఘంటువులు సంహితలోని పదాలకు అర్ధ నిర్వచనం చేసేటప్పుడు బ్రాహ్మణాల పై ఆధార పడతాయి. బ్రాహ్మణాలలో

ఆయా సందర్భాలలో ఇవ్వ బడిన అర్ధాలే నిఘంటువుల లో కూడా కన పడతాయి. దీన్ని బట్టి తేలేది ఏమిటి అంటే వేదం మంత్ర పదాలకు, నిఘంటు అర్ధాలకు మూలాలు బ్రాహ్మణాలే.. మంత్రం భాగాన్ని సరిగ్గా అర్ధం చేసుకోవటానికి బ్రాహ్మణాలే సరైనవి.

మంత్రం ద్రష్టలైన మహర్షులు బ్రాహ్మణాలలో సత్య స్వరూప మంత్రార్ధాలను తెలియ జేశారు. వీటిని ఆధారం గానే నిఘంటువులు, ఇతర భాష్యాలు ఏర్పడ్డాయని భారతీయ పండితులు భావించారు. మానవులకు వైదిక కర్మలను ఆచరించటానికి బ్రాహ్మణాలు ప్రేరణ నిస్తాయి అని ఆపస్తంభుడు తన యజ్న పరి భాషలో వివ రించాడు. విధి, అర్ధ వాదరూప మైన బ్రాహ్మణాలు వైదిక కర్మలను విధిస్తూ, వాటిలో మానవుడు ప్రవర్తిం చేట్లు సందర్భాన్ని బట్టి స్తుతిని, నిందను చేస్తూ ప్రేరణనిస్తాయి. బ్రాహ్మణాల ద్వారా ప్రేరణ పొందిన వాడు, మంత్రార్ధాన్ని సరిగ్గా అర్ధం చేసుకుని, యజ్న యాగాదులను చేస్తాడు. యాగాలు బాగా ఆచరించే కాలం లో బ్రాహ్మణాలే దారి చూపాయి.

బ్రాహ్మణాలను సరిగ్గా అధ్యయనం చేస్తే ప్రాచీన భారతీయ చరిత్రను, సంస్కృతిని, ఆచార వ్యవహారాలను, జీవిత లక్ష్యాన్ని తెలుసుకో వచ్చు. బ్రాహ్మణాలలో సాంకేతికం గా ఉన్న ఉపాఖ్యానాలు, తరువాత వాగ్మయం లో ఏ విధం గా నిరూపించ బడ్డాయో పోల్చుకొని తెలుసుకో వచ్చు. అంటే ప్రాచీన భారతీయులకు సంబంధిన అనేక అంశాలను బ్రాహ్మణాలను అధ్యయనం చేసి తెలుసుకో వచ్చు. ఒక్కమాటలో చెప్పా లంటే ప్రాచీన భారతీయ జీవన సంస్కృతులను, ఆలోచనా ధోరణులను, తత్వ చింతనకు బ్రాహ్మనాలే అద్దంపట్టాయి.

## బ్రాహ్మణాల లోని మహర్షులు

బ్రాహ్మణాలలో వేద ద్రష్టలైన మహర్షుల పేర్లే కాకుండా మరి కొందరు మహర్షుల పేర్లు కని పిస్తాయి. ఇందులో సప్తర్షులే కాక కుత్స, అత్రి, రేభ, అగస్త్య, కుశిక గణ, వసిష్ట,వ్యస్వ మహర్షుల పేర్లున్నాయి. బృహదారన్యకోపనిషత్ లో గౌతమ, భరద్వాజ, విశ్వా మిత్ర, జమదగ్ని, విశిష్ట కశ్యప, అత్రి మహర్షుల ను పేర్కొన్నది. అధర్వ వేదం లో అదనం గా ఆంగీరస, గనిస్తికర, కక్షీ వంత, కణ్వ మేదాటిది, త్రిషాక, ఉశనా, కావ్య ముద్గల ఋషుల పేర్లు కని పిస్తాయి. ఋగ్వేదం తర్వాతి వాగ్మయం సప్తర్షి నక్షత్ర మండలానికి సప్తర్షులకు ఉన్న సంబంధాన్ని చర్చించింది. సాయనుడు నక్షత్రానికి ఉన్న "ఋక్ష "శబ్దానికి సప్తర్షులు అనే అర్ధం చెప్పింది. ఇప్పుడు ఆయా ఋషుల గురించి వివరాలు తెలుసు కొందాం.

అగస్త్యుడు –ఈయన్నే ఆగస్తి అనీ అంటారు. ఈయన మరుద్దేవతలను వృషభాలను ప్రోక్షించి పూజ చేశాడు. అక్కడి పశువుల్ని ఇంద్రుడు అపహరించుకు పోగా మరుద్దేవతలు వజ్ర ధారులై ఇంద్రుని చంపటానికి వచ్చారు. అప్పుడు ఇంద్రుడు, అగస్త్యుడు " కయా శుభీయ "అనే సామ వేదం మంత్రాన్ని చదివి వారిని శాంతింప జేశారు. ఇంద్రుని బుద్ధి విశేషాన్ని గుర్తించి అగస్త్యుడు బ్రహ్మ జ్ఞానాన్ని మొట్టమొదటి సారిగా ఉపదేశించాడు.

కణ్వుడు—ఈయన వంశీకులే కణ్వులు లేక కాన్వులు.ఈయన్నే "సౌశ్ర వసువులు "అనీ బహువచనం లో పిలుస్తారు. అత్రి, కన్వవంశాలకు సంబంధం ఉంది.

గౌతముడు –ఇది రుషి గోత్రం పేరు. ఈ గోత్రీకులకు ఆంగిరసులకు సన్నిహిత సంబంధాలున్నాయి. జనక, యాజ్న్య వల్క్యులకు సమకాలికుడు. ఒక ఋగ్వేద స్తుతి "స్తోమానికి "ప్రణేత ".విదేహ రాజు మాధవుడు వైశ్వానరాగ్ని ని తన నోటిలో ధరించాడు. రాజుకు పురోహితుడైన గౌతముడు అగ్నిని పిలిచాడు. బదులు పలికితే బయట పడతానేమో నని భయం తో పలక లేదు. ఎలాగైనా అగ్నిని బయటికి రప్పించాలని గౌతముడు ఋగ్వేద మంత్రాలతో అగ్నిని స్తోత్రం చేశాడు. అయినా రాజు కాని అగ్ని కాని పలక నే లేదు. రుషి మళ్ళీ దీర్ఘం గా తీవ్రం గా క్రోధం గా అగ్నిని పిలిచాడు. ఊహూ అగ్ని జాడే లేదు. అప్పుడు గౌతముడు "తన్వాఘృత స్రవీ మహా "అనే ఋగ్వేద మంత్రాన్ని పలికాడు. మంత్రం లో ఉన్న "ఘ్రుత "(నెయ్యి)శబ్దం వినపడగానే అగ్ని ఊర్ధ్వ ముఖం గా ప్రజ్వరిల్లాడు. రాజు అగ్నిని భరించలేక పోయాడు. అప్పుడా అగ్ని భూమి మీదకు చేరింది. అగ్నిని నోటిలో భరించటం వలన ఏర్పడిన తాపాన్ని పోగొట్టుకోవటానికి రాజు సరస్వతీ నదిలో మునిగాడు. అప్పుడు అగ్ని తూర్పు దిక్కు గా ప్రజ్వ రిల్లుతూ భూమి అంతటా వ్యాపించింది. గౌతమర్షి మండుతున్న అగ్నిని వెంట డించాడు. అగ్ని భూమి పై ఉన్న నదులన్నిటిని ఎండింప జేసింది. అందువలననే "మిత్ర విందా యష్టి "విదేహ రాజైన జనకుని ఉద్దేశించి ఏర్పాటైంది. దాన్ని ఇతను చూశాడు.

కశ్యపుడు –విశ్వ కర్మ "సర్వ మేధా యాగం "చేశాడు. కశ్యపునికి భూదానం చేయాలను కున్నాడు విశ్వ కర్మ. భూమి అంగీకరించలేదు. కష్యపునికి దితి, అదితి అనే ఇద్దరు భార్యలున్నారు. కశ్యపుడు బ్రహ్మ పుత్రుడైన మరీచి కొడుకు. కనుక దేవతలకు అసురులకు, సర్వ ప్రాణి కోటికి కశ్యపుడు తండ్రి అన్నమాట. అదితి తో పాటు పన్నెండు మంది దక్ష పుత్రికలను పెళ్లి చేసుకొన్నాడు. వారి వలన ఎంతో ప్రాణి కోటిని సృష్టించాడు కశ్యపుడు. కశ్యపుడు ప్రజాపతి గోత్ర ఋషీకూడా. సామ వేదం లో నిక్షిప్తమైన జ్ఞానం మొదటి సారిగా ఇంద్రుని నుంచి అగ్నికి తర్వాత కశ్యపుడికి సంక్రమించింది.

అత్రి –రుషి గోత్రం. పరి వార రూపం గా ప్రియ మేధులు, కణ్వులు, గౌతమ, కక్షీ వంత గుణాలతో అత్రి గణం ఏర్పడింది. అత్రి జమదగ్ని, గౌతములు క్రిమి సంహారకులు అని ఛాందోగ్య బ్రాహ్మణం తెలియ జేస్తోంది.

యాజ్ఞ్య వల్క్యుడు –శత పద బ్రాహ్మణాన్ని రచించింది యాజ్ఞ్య వల్క్యుడే. మైత్రేయి కాత్యాయిని ఇతని భార్యలు. మైత్రేయి పైన అధిక ప్రేమ ఉండటం తో కాత్యాయినిని “ఇతర “అన్నాడు. ఇతర పుత్రుడే “మహీదాస ఐత రేయుడు “ఐత రేయ బ్రాహ్మణ రచయిత. వైశంపాయన శిష్యులలో యాజ్ఞ్య వల్క్యుడొకడు. ఒక సారి జనక రాజు యజ్ఞం లో “అందరి కంటే గొప్ప బ్రహ్మ జ్ఞానికి పది వేల గోవుల్ని “ఇస్తానని ప్రకటించాడు. అక్కడే ఉన్న అశ్వల, యార్త భాగ, ఉషాస్తి, ఆహోల, ఉద్దాలక, గార్గి మొదలైన రుషులతోను, రుశషికల తోను వాదం చేసి గేలు పొంది, రాజు ప్రకటించిన పది వేల ఆవులను తోలుకు పోయిన ధీశాలి.

ఒక సారి ఉపనిషత్ పురుషుని స్పష్టం గా ఆవిష్కరించమని, లేక పొతే శిరస్సు తెగి పడుతుందని దేవ మిత్ర శాకల్యుని ప్రశ్నించాడు. శాకల్యుడు చెప్ప లేక పోయాడు. అంతే శిరస్సు తెగి పడి పోయింది. జనకుడు యాజ్ఞ్య వల్క్యుని వలన బ్రహ్మ జ్ఞాన ఫలాన్ని పొంది రాజ్య సర్వస్వాన్ని గురు దక్షిణ గా సమర్పించాడు. యాజ్ఞ్య వల్క్యుడు ఒద్దని చెప్పి జనకుడినే రాజ్యం ఏలుకోమ ని ఇచ్చేశాడు, సన్యాసం తీసుకుంటూ తన సంపదను భార్య లిద్దరికీ పంచేశాడు. మైత్రేయి ఆత్మ సంపదను అడిగి పొందితే, కాత్యాయని భౌతిక సంపదను వాంచించి పొందింది.

భ్రుగువు –వరుణ పుత్రుడు భ్రుగువు అని శత పద బ్రాహ్మణం చెప్పింది. తైత్తిరీయం లో దీనికో కద ఉంది. భ్రుగు గణం ద్రుహ్యులకు పురోహితులుగా ఉండేవారు. వీరికి అన్గిరసులతో సంబంధం ఉంది. చ్యవనుడికి భార్గవుడని అన్గిరసుడని పేర్లున్నాయి. వీరిపై ఆక్రమణ ఫాలితం గా సృంజయ, వైతహవ్యులు సర్వ నాశన మైపోయారు.

భరద్వాజుడు –గోత్ర రుషి. దివోదాసుని పురోహితుడు. మంత్ర ప్రణేత, ద్రష్ట.

## బ్రాహ్మణాలలో రాజులు

మిధిల రాజు జనక మహా రాజు గురించి శత పద బ్రాహ్మణం లో ఉంది. ఆయన సభలో ఎక్కువగా ఆధ్యాత్మిక విషయాలే చర్చకు వచ్చేవి. ఒక సారి సభలో “అగ్ని హోత్రం చేసే విధానం ఏమిటి ?అని ప్రశ్నించాడు. శ్వేతకేతువు, సోమ శుష్మడు, యాజ్ఞ్య వల్క్యుడు తోచిన సమాధానం చెప్పారు కాని రాజు సంతృప్తి చెందలేదు. కానిముగ్గురిలో యాజ్ఞ్య వల్క్యుడు చర్చను బాగా నిర్వహించినందుకు వెయ్యి గోవులను బహుమానం గా ఇచ్చాడు. కాని “అగ్ని హోత్ర తత్త్వం యాజ్ఞ్య వల్కుడికీ సరిగ్గా బోధ పడలేదు “అని చెప్పి సభ చాలించేశాడు జనకుడు. మిగిలిన ఇద్దరు ఋషులు జనకుడు పరి పూర్ణ జ్ఞానం తో తమను నిరుత్తరుల్ని చేశాడనుకొన్నారు. దీనికి ప్రతీకారం చేయాలని ఆలోచించి జనకు డిని బ్రహ్మ తత్వ విచారం లోకి దించాలను కొంటే యాజ్ఞ్య వల్క్యుడు ఒప్పుకో లేదు, జనకునితో వాదానికి దిగి గెలిచినా ఓడినా తమకే అవమానం అన్నాడు. అగ్ని హోత్రం నిజ విజ్ఞానాన్ని జిజ్ఞాస తో ఒంటరిగా తెలుసుకొని జనకునికి వివరించి విజయం సాధించాడు. మహా రాజైన జనకుడు ఎంత తత్వ వివేక సంపంన్నుడో మనకు తెలుస్తుంది.. జనకుడు సత్యకామ జాబాలి కి ముఖ్య శిష్యుడు.

వ్రతర్దనుడు అనే రాజు యజ్న విధానాన్నిగురించి యాజకులతో చర్చించి నట్లు కౌశీతకీ బ్రాహ్మణం లో ఉంది. ప్రవాహ జైవాలి అనే పాంచాల రాజు శ్వేత కేతువు కు సమకాలికుడు. ప్రవాహ జైవాలి, శిలా కశా వత్యుడు, చైకితాన దాల్భ్యుడు అనే ఇద్దరు క్షత్రియులతో వాదం చేసినట్లు ఛాందోగ్యం చెబుతోంది. దాల్భ్యుని సోదరులు బక దాల్భ్యుడు జైమినీయ బ్రాహ్మణం, చాన్దోగ్యాలలోను కేశి దాల్భ్యుడు కౌశీతకి బ్రాహ్మణం లోను కనిపిస్తారు.ఈ ముగ్గురి తల్లి ఉచ్చైశ్ర వసుడు అనే కౌరవ రాజు సోదరి. తండ్రి శాతానీకుడు. వీరందరి ప్రసక్తి జైమినీయ బ్రాహ్మణం లో ఉన్నది.

ద్రుపద మహా రాజు కూడా యాగ చర్చ చేసినట్లు అతని బిరుదు “యాజ్ఞ సేనుడు “'ద్వారాను, అతనికుమారు లైన “సుత్వా యాజ్ఞ సేనుడు “,శిఖండి యాజ్ఞ సేనుడు “ద్వారా తెలుస్తోంది. ద్రౌపదికి యాజ్ఞా సేన అనే బిరుదున్న సంగతి తెలిసిందే. వీరంతా యాగ తత్వజ్నులే, కేశి దాల్భ్యుని సమకాలికులే. జీవల చైతకి, ప్రాచీన శాల, ఔపమన్యువు, సత్య యజ్న పౌలుషి, బుడిలఅశ్వత రాశ్వి మొదలైన క్షత్రియులు ఉద్దాలక ఆరుణి తో చర్చ చేసినట్లు చాన్దోగ్యమే చెప్పింది. జీవాల కారి, ఆశాఢ సావయసుడు, అనే ఇద్దరు క్షత్రియులగురించి కూడా జైమిని బ్రాహ్మణం లో ఉంది. జనక మహా రాజు సమకాలికులైన బార్కు వార్షుడు, ప్రియ జాన శ్రుతేయుడు, ల విషయం కూడా ఇందులోనే కనిపిస్తోంది. సుదక్షిణ క్షైమిఅన్న క్షత్రియుడు జనకుని తో “స్తోమ “శబ్దార్ధాన్ని చర్చిన్చాడని తెలుస్తోంది.

కౌశీతకీ, జైమిని బ్రాహ్మణాలలో కోసల రాజు బ్రహ్మ దత్త ప్రాసేన జితుడి సమకాలికులైన హిరణ్మయ కుషణుడు, ఇటన్ కావ్యుడు బ్రహ్మ దత్త చైకితానుల గురించి ఉన్నది. పర ఆహ్నార అనే కోసల రాజు ను గురించి,సమీస్వాహుడు అనే మరొక రాజు గురించి తాండ్య బ్రాహ్మణం, శత పదాలలో ఉన్నది. "సులభా "అనే క్షత్రియ స్త్రీ జనక మహా రాజు తో ఆధ్యాత్మిక విషయ చర్చ చేసి నట్లు కనిపిస్తోంది ఈమె మైత్రేయి కావచ్చు. ఈమె పేర "సౌలభ బ్రాహ్మణం "ఉండేది అని కాశికా వృత్తి లో చెప్ప బడింది కాని కాలం లో కలిసి పోయి కని పించ లేదు. వీరందరి గురించి తెలియ జెప్పిన బ్రాహ్మణాలు వీరిని "బ్రాహ్మణులు "అని శ్రేష్ట వాచకం తో పేర్కొనటం వారికి ఉన్న ఆధ్యాత్మిక ప్రావీణ్యానికి, సంఘం లో వారి పలుకు బడికి, ప్రతిష్ఠ కు నిదర్శనం.

## ఉపాఖ్యానాలలో కధలు

వేదం యజ్న యాగాది కర్మల విషయం బోధించటం తో బాటు చిన్న పిల్లలకు పెద్దలు కధలు చెప్పి బుజ్జగించి లాలించినట్లు కొన్ని కధలను కూడా చెప్పింది. వీటిని ఉపాఖ్యానాలు లేక ఆఖ్యాయికలు అని అంటారు. ఈ కదల వెనుక నిగూఢ సందేశం ఉంటుంది. తాను చెప్పదలచిన కర్మ ప్రాధాన్యతను తెలియ జేయటానికి లేక దోషాన్ని వివరించటానికి అనేక ఉపాఖ్యానాలను వేదం చెప్పింది. ఈ ఉపాఖ్యానాలు బ్రాహ్మణాలలో ఎక్కువగా కనిపిస్తాయి. వాటి వివరాలే ఇప్పుడు మనం తెలుసుకో బోతున్నాం.

## ఐతరేయ బ్రాహ్మణం

ఋగ్వేదానికి చెందినా ఐతరేయ బ్రాహ్మణం లో చాలా ఉపాఖ్యానాలున్నాయి. అందులో ముఖ్యమైనది "శునస్షేఫోపాఖ్యానం ".ఇక్ష్వాకు రాజు హరిశ్చంద్రుడు పుత్ర సంతానం లేక చాలా కాలం పరి తపించి తనకు పుత్రుడే కనక పుడితే వరుణ దేవుడికే సమర్పించి క్రతువు చేస్తానని మొక్కుకొన్నాడు. వరుణానుగ్రహం తో "రోహితుడు "అనే పుత్రుడు కలిగాడు. పుత్రజననం జరగ్గానే వరుణుడు ప్రత్యక్షమై వాగ్దానం ప్రకారం ఆ కొడుకును తనకు ఇచ్చేయమని అడిగాడు. బారసాల ముచ్చట తీరాక ఇస్తానని రాజు వాయిదా వేశాడు. పది రోజుల తర్వాత మళ్ళీ వచ్చి అడిగితే దంతాలోచ్చినతర్వాత అన్నాడు. ఇలా చాలా సార్లు వరుణుడు రావటం రాజు వాయిదా వేయటం జరిగింది.

రోహితుడికి యుక్త వయస్సు వచ్చి గురుకులం లో చేరి శస్త్రాస్త్ర విద్యలన్నీ నేర్చి ఇంటికి తిరిగి వచ్చాడు. తండ్రి కొడుకుకు తాను వరుణుడికి ఇచ్చిన మాటను జ్ఞాపకం చేశాడు. తాను బలి పశువు కావటానికి ఒప్పుకోక ఇల్లు వదిలి అరణ్యాలకు వెళ్లి పోయాడు. మొక్కు తీర్చ లేదనే కోపం తో వరుణుడు హరిశ్చంద్రునికి జలోదర వ్యాధి వచ్చేట్లు చేశాడు. వైద్యులు ఎన్ని ప్రయత్నాలు చేసినా వ్యాధి తగ్గక మంచం పట్టాడు. కొడుకు రోహితుడికి విషయం తెలిసి తండ్రి దగ్గరకు వచ్చాడు. ఇంద్రుడు అడ్డ గించి వనవాసమే మంచిదని చెప్పి అరణ్యాలకు పంపించేశాడు.

ఇలా మూడు సార్లు జరిగింది. తండ్రి రోగాన్ని పోగొట్టటానికి వేరెవరైనా పురుషుడిని ఉంచి యాగం జరిపించాలని రోహితుడు తలచాడు. తిరిగి తిరిగి అజీ గర్తుడు అనే ఆయన దగ్గరకు వచ్చాడు రోహితుడు. అతనికిఉన్న ముగ్గురు కొడుకులలో ఒకరిని తనకిమ్మని వేడుకొన్నాడు. పెద్దకొడుకును ఇవ్వటానికి తండ్రి, చిన్న కొడుకునివ్వటానికి తల్లి ఒప్పుకోలేదు. ఇద్దరి అభిప్రాయాలను తెలుసుకొన్న రెండవ కొడుకు శున స్షేపుడు తను ఎవరికీ చెందడు కనుక రోహితుని వెంట వెళ్ళాడు. అజీ గర్తునికి ప్రతి ఫలం ముట్ట జెప్పి రోహితుడు శునశ్శేపుడి ని తీసుకొని

వెళ్ళాడు. యాగానికి అప్పటికే అన్ని ఏర్పాట్లు జరిగి పోయాయి. నరుడైన పునస్షేపుడిని యూప స్తంభానికి కట్టెయ్యటానికి ఎవరూ ముందుకు రాలేదు. చివరికి తండ్రి అజీ గర్తుడే కొడుకును యూపానికి కట్టేసి వంద ఆవులను తోలుకు పోయాడు. ఇంకో వంద గోవులను ఇస్తే కొడుకును చంపటానికి కూడా తండ్రి సిద్ధ పడ్డాడు. శునశ్శేపుడు ఆర్తి తో వరుణుడిని ప్రార్ధిస్తే ప్రత్యక్షమై యూప స్తంభంనుంచి తప్పించి హరిశ్చంద్రుని వ్యాధిని పోగొట్టాడు. శునశ్శేపుడు తండ్రి వెంట ఇంటికి వెళ్ళటానికి ఒప్పుకోలేదు. విశ్వామిత్ర మహర్షి దగ్గరకు చేరాడు. ఆ మహర్షి శునశ్శేపుడిని కుమారుడి గా స్వీక రించాడు. ఈ ఉపాఖ్యానం లో వివిధ వ్యక్తుల మనస్తత్వాల ఆవిష్కరణ జరిగింది. దేవతా స్తుతి రూపాలైన అనేక రుక్కులు ఈ ఉపాఖ్యానం లో ప్రాధాన్యత పొందాయి.

## నేనెవరిని ?

సంస్కృతం లో "కః "శబ్దానికి ఎవడు అని బ్రహ్మ అని రెండు అర్ధాలున్నాయి. ఐతరేయ బ్రాహ్మణం లో ఉన్న ఒక ఉపాఖ్యానం లో దీనికి సంబంధించిన కద ఉంది. ఇంద్రుడు వృత్రాసురుడిని చంపి, లోకాలన్నీ జయించి, ప్రజా పతి వద్దకు వచ్చి" నేను అన్ని ప్రాణుల కంటే గొప్ప వాడిని "అని గర్వం గా చెప్పాడు. అప్పుడు ప్రజాపతి "నా గొప్పతనాన్ని నువ్వు లాగేసుకొంటే మరి నేను ఎవర్ని ?"అని ప్రశ్నించాడు. దానికి ఇంద్రుడు "ప్రజా పతీ !స్వాత్మ ను నువ్వు కః "అని అన్నావు కనుక ఇక నుంచి నువ్వు ఆ శబ్దం తోనే పిలువ బడుతావు "అన్నాడు. అప్పటి నుంచి కః అనే శబ్దానికి బ్రహ్మ అనే అర్ధం కూడా వచ్చి చేరింది. ప్రజా పతి గొప్ప తనాన్ని కూడా హరించటం చేత ఇంద్రుడు మహేన్ద్రుడయ్యాడు. దేవతలు ఇంద్రుని కోసం "మాధ్యందిన సవనం ""నిష్కేవల్య శస్త్రం "లను ప్రత్యేకం గా కేటాయించారు. కనుక ఉపాఖ్యానం లో మాధ్యందిన సవనానికి నిషేవల్య శాస్త్రానికి మహాత్మ్యాన్ని కలిగించే శక్తి ఉన్నట్లు సూచిస్తోంది.

## కౌశీతకీ బ్రాహ్మణం లో ఉపాఖ్యానాలు

ఇందులో ప్రజా పతి తపస్సు అనే ఉపాఖ్యానం ఉంది. సృష్టి చేయాలని ప్రజాపతి తపస్సు చేశాడు. ఆ తపస్సులో నుంచి అగ్ని వాయువు, ఆదిత్యుడు చంద్రుడు, ఉషస్సు జన్మించారు. మొదటి నలుగురు తపస్సు చేశారు ఉషస్సు ద్వారా వెయ్యి కళ్ళు, వేయి పాదాలు గల మహా పురుషుడు ఉద్భ వించాడు. ఈ ఉపాఖ్యానం సృష్టి ప్రారంభం లో ఉన్న తత్వాలను గురించి తెలియ జేస్తుంది.



అగ్నికి ఆజ్యం కధ –రాక్షసులతో యుద్ధం చేయాల్సి వచ్చినప్పుడు కంటికి కనిపించకుండా పరారయ్యే అగ్ని ఋతువులలో ప్రవేశించి దాక్కున్నాడు. దేవతలు అసురులను జయించి అగ్ని కోసం వెతుకు తున్నారు. యమ, వరుణులు అగ్నిని పట్టుకొన్నారు. అగ్ని కోరికను మన్నించి అతనికి వరం గా "ప్రయాజాను యాజలు ",ఆజ్యం "(నెయ్యి )ఇచ్చి మళ్ళీ తీసుకొచ్చారు. అందుకే లోకం లో "అగ్నికి ఆజ్యం "సామెత పుట్టింది. అగ్ని ప్రయాజాను యాజ లతో బాటు నెయ్యినీ కోరుకోన్నాడని దీన్ని బట్టి తెలుస్తోంది. ఈ ఉపాఖ్యానం లో వృత్రాసుర వధ, సూర్యోత్పత్తికూడా ఉన్నాయి.

## ఉపాఖ్యానాల్లో కధలు -2

### 'కాల కంజుల యాగం

తైత్తిరీయ బ్రాహ్మణం లో ఉపాఖ్యానాలు చాలాఉన్నా "కాల కంజుల యాగం "గురించి మంచి విషయం కని పిస్తుంది. కాల కన్జులు అనే రాక్షసులు స్వర్గాన్ని పొందటానికి ఇటుకలను (ఇష్టకలు )పేర్చి యాగం చేస్తున్నారు. వీరి రాకతో స్వర్గం నాశనమవుతుందని ఇంద్రుడు మారు వేషం లో వెళ్లి వారిలో ఒకడుగా ఉండి "చిత్ర"అనే పేరుగల ఇటుకను ఉంచాడు. యాగం పూర్తయింది స్వర్గానికి ఆ ఇటుకల మీదుగా కాల కంజ రాక్షసులు నడిచి వెడుతున్నారు. ఇంద్రుడు తాను పేర్చిన" చిత్రేష్టక "ను తీసేశాడు. చితి కూలి పోవటం తో రాక్షసులు నేల మీద పడిపోయి సాలీడు మొదలైన క్రిమి కీటకాలై పోయారు. అందుకే సాలీళ్ళు పూర్తిగా నేల మీద ఉండక, ఆకాశం లో ఎగరలేక మధ్యలో గూళ్ళు నిర్మించుకొని ఉంటాయి. ఈ ఉపాఖ్యానం లో ధర్మ రక్షణ, ఆత్మ రక్షణ రెండూ కానీ పిస్తాయి. శత్రువును మాయోపాయం తో జయించ వచ్చుననే సందేశం ఉంది. కనుక చిత్రా నక్షత్రం లో "ఇష్టకాచాయనం "చేసే వాడి శత్రువులు నశిస్తారనే అంతరార్ధం ఇందులో ఉంది.

## బ్రహ్మ కైనా పుట్టు రిమ్మ తెగులు

సురాసురులకు ఒకప్పుడు ఘోర సంగ్రామమే జరిగింది. సురులు తాము అసురుల చేతిలో ఓడిపోతామేమో నన్న భయం తో సమస్త వస్తు సామగ్రిని,ధనాన్ని "అగ్ని షోములు "(అగ్ని సోముడు )ల వద్ద దాచి యుద్ధానికి తరలి వెళ్ళారు. ఈ ధనాన్ని చూసి కళ్ళు కుట్టి ఆ ఇద్దరూ ఆ దనం తో జీవితాంతం హాయిగా బతక వచ్చునని, దేవతలు జయించలేరని నమ్మకం తో దేవతలు తమ దగ్గర దాచిన దాన్ని అంతా తీసుకొని ఉదాయిస్చేశారు., దేవతలే యుద్ధం లో రాక్షసులని జయించారు. అగ్నిని వెతికి పట్టుకొని కొంత ప్రతిఫలం ముట్ట చెప్పి సామ దాన ఉపాయాలతో తమ సంపదను రాబట్టుకొన్నారు. అలాగే సోముడిని కూడా పట్టుకొని కొట్టి, దండోపాయం తో ధనాన్ని స్వాధీనం చేసుకొన్నారు. తర్వాతాఆ ధనమే ఇంద్రుడు వాయువు మొదలైన గ్రహాలుగా మారటం వలన యాగం లో యజమానుడు ఈ గ్రహాలను తప్పని సరిగా ఉంచి యాగం చేయాలని తైత్తిరీయం చెబుతోంది.

## సృష్టికి ఆది

సృష్టిని గూర్చి ఉన్న ఉపాఖ్యానం లో ఈ జగత్తు లో మొదట అరణ్యాలు, పర్వతాలు ఉండేవికావు. అంతా జలమయమే. ప్రజాపతికి సృష్టి చేయాలని సంకల్పం రాగానే ఆ జలం పై ఆయనకు "పద్మ లత"కనిపించింది. వెంటనే వరాహ రూపం దాల్చి ఆ లతకు దగ్గర నీటిలో మునిగి మట్టిని పైకి తెచ్చి భూమిని, మిగిలిన సృష్టినీ పూర్తీ చేశాడు.

## అనుభ విన్చిందే మనది

ప్రజాపతి ప్రజా సృష్టి చేయాలనే కోరిక తో తపస్సు చేశాడు. ఆయనకు బంగారం కనీ పించింది. అది తన కోర్కె తీరుస్తుందని భావించి అగ్నిలో హోమం చేశాడు. జరగలేదు. మళ్ళీ చేశాడు లాభం లేదు. తర్వాత ఆ బంగారాన్ని తన కడుపులో ఉన వైశ్వానరాగ్నికకి ఆహుతిగా మింగేశాడు. వెంటనే ఆయనకు ప్రజోత్పాదన శక్తి వచ్చేసింది. అందుకే లోకం లో "దాచి పెట్టిన దానికంటే ఉపయోగిన్చిన్దేఉత్తమమైన్ది " అనే సామెత దీనివల్లనే వచ్చింది. సువర్ణ భస్మం సంతాన ప్రాప్తి కల్గిస్తుందని ఆయుర్వేదం చెబుతోంది.

## అంతం లేని వేదాలు

వేదాలు అనంతాలు అని చెప్పే ఉపాఖ్యానం కూడా తైత్తిరీయ బ్రాహ్మణం లో ఉంది. భరద్వాజ మహర్షి తన జీవిత కాలమంతా తపస్సులోనే గడిపి, ఇంకా చాలా నేర్వాల్సింది ఉందని గ్రహించాడు. ఇంద్రుడిని ప్రార్ధించి మరొక జీవితకాలాన్ని వరం గా పొంది మళ్ళీ నేర్వటం మొదలు పెట్టినా ఇంకా నేర్వాల్సిన వేదాలు మిగిలే ఉన్నాయి. మరోజీవితకాలమూ చాల లేదు. 300సంవత్సరాలు వేదాధ్యయనం చేసి అలసిపోయి వృద్ధుడై పోయి పడిఉన్న మహర్షి దగ్గరకు ఇంద్రుడు వచ్చి మూడు పెద్ద పర్వతాలను చూపించి అవే వేదాలని చెప్పి ఆ మూడింటిలో నుంచి మూడు గుప్పిళ్ళ ధూళి తీసి ఇచ్చి అంతటి తో సంతృప్తి పడమన్నాడు. అందులోని ఒక్కొక్క రేణువు ఒక్కొక్క వేదం శాఖ అని ఎరుక కలిగించాడు అందుకే "అనంతావై వేదాః "అన్నారు.

## మోదుగ చెట్టు పుట్టుక

భూమి పైన మూడవ లోకం లో ఉండే సోమాన్ని గాయత్రీ దేవి బలాత్కారం గా తీసుకొని వెళ్ళింది. అప్పుడు సోమాన్ని రక్షించే వారికి ఆమెకు యుద్ధం జరిగింది. ఆ యుద్ధం లో సోమలతః కు చెందిన యొక ఆకు ఒకటి నేల మీద పడింది. దాని నుండి పలాశ లేక మోదుగ చెట్టు పుట్టింది. అలాగే దర్బ, మర్రి, మెది జమ్మి, వికంకత మొదలైన వృక్షాల పుట్టుక కూడా తైత్తిరీయ బ్రాహ్మణం లో ఉంది.

దీని తర్వాతా శత పద బ్రాహ్మనం లో ఉన్న ఉపాఖ్యానలలోని కధలను తెలుసుకొందాం.

## శత పద బ్రాహ్మణం లో ఉపాఖ్యాన కధలు

శుక్ల యజుర్వేదానికి చెందిన శత పద బ్రాహ్మణం లో అనేకు ఉపాఖ్యానాలున్నా మచ్చుకి ఒకటి రెండు తెలుసు కొందాం.

## సంజీవినీ విద్య

అధర్వ మహర్షి పుత్రుడు "దద్యాత్ "ఈయన్నే దధ్యజాధ్వరుడు "అనీ అంటారు. కొందరు అదర్వుడు అని పిలుస్తారు. ఈయన ప్రాపంచిక సుఖాలకు దూరమై ప్రశాంతం గా ఒక ఆశ్రమం లో ముని వృత్తి తో జీవితాన్ని గడుపుతున్నాడు. తపస్సు, విద్యార్ధులకు అధ్యాపనం మాత్రమె ఆయన నిత్య కృత్యాలు. ఈ మహర్షి ధార్మిక జీవితాన్ని గమనించిన ఇంద్రుడు సంప్రీతుడై మహర్షి దగ్గరకు వచ్చి, అతిధి పూజలందుకొని మహర్షి సచ్చీలత, ధర్మ తత్పరత తనకు ఏంతో ఆనందాన్ని కల్గిన్చాయని వరం ఇవ్వాలని పిస్తోందని ఏదైనా వరం కోరుకోమని అన్నాడు. తనకు కాంతా కనకాలపై వ్యామోహం లేదు. కాని బతిమాలి ఇంద్రుడు వరం ఇస్తానంటే వద్దన రాదనుకొని బ్రహ్మ సాక్షాత్కారం పొందే "మధు విద్య "ను ఉపదేశించమని కోరాడు. ఇంద్రుడు సంకటం లో పడ్డాడు. అయినా మాట నిలబెట్టుకోవాలని విద్యను ఇంద్రుడు మహర్షికి ఉపదేశించాడు. ఆ మధువిద్య ను ఇంకెవరికైనా ఇస్తే మహర్షి శిరస్సును వజ్రాయుధం తో ఖండిస్చేస్తానని ఇంద్రుడు మహర్షిని హెచ్చరించి వెళ్లి పోయాడు.



కొంతకాలానికి ఇంద్రుడి చేత యజ్న భాగం లేకుండా బహిష్కరింప బడిన శ్వినీ దేవతలకీ విషయం తెలిసింది. పోయిన తమ ప్రాభవాన్ని మధు విద్య ద్వారా మళ్ళీ సాధించుకోవచ్చనే ఆశా కలిగి దధ్యజాచార్యుని చేరి మధు విద్యను ఉపదేశించమని కోరారు. ఇంద్రుని శాసనాన్ని మహర్షి వారికి తెలియ జేశాడు.. అప్పుడు అశ్వినులు ముందుగా మహర్షి తలను నరికి గుర్రపు తలను అతికిస్తామని, విద్య ఉపదేశం చేసిన తర్వాత ఇంద్రుడు గుర్రం తలను ఖండిస్తాడని తర్వాత తాము మహర్షికి మామూలు తలను అంటించి సంజీవనీ విద్య తో బ్రతికిస్తామని తెలిపారు. సరిగ్గా అలానే జరిగింది. మహర్షి మధు విద్యను ఆశ్వనిలకు ఇస్తే, ఇంద్రుడు వచ్చి మహర్షి శిరస్సు ఖండించినందుకు దుఃఖ పడ్డాడు మహర్షి ఇంద్రుడిని ఓదారుస్తాడు. కనుక విద్యలను అత్యంత గోప్యం గా కాపాడుకోవాలని ఈ ఉపాఖ్యానం తెలియ జేస్తోంది. అలాగే పాత్రల నెరిగి విద్యాదానం చేయాలనే సూచనా ఉంది.

## ఊర్వశీ పురూరవులు

ఇళుడులనే మహా రాజు పార్వతీ దేవి శాపానికి గురై ఆరు నెలలు స్త్రీగా ఉండాల్సి వచ్చి ఇళాదేవి అయాడు, ఈమె మీద బుధుడి ద్రుష్టి పడి వారిద్దరి సంగమం తో పురూరవుడు జన్మించాడు. పురూరవుడు తలిదండ్రులను మించిన ప్రజ్ఞా శాలి. ఒక రోజు దేవ సభలో చక్ర వర్తి ఊర్వశిని చూసి మోహించాడు. ఆమెకూ అతనిపై ఆకర్షణ కలిగింది. మిత్రావరుణ శాపం వలన ఊర్వశి మానవ కాంత గా ఉండాల్సిన సమయమూ వచ్చింది. ఊర్వశి తాను ఎప్పుడూ నేతినే ఆహారం గా స్వీకరిస్తానని, తనవద్ద ఎప్పుడూ ఒక మేకల జంట ఉండాలని, పడకకు అవతల ఎప్పుడూ పురూరవుడు నగ్నం గా కని పించరాదని మూడు షరతులను పెట్టి,పురూరవ చక్ర వర్తి పట్టపు రాణిగా అతనితోకలిసి భూలోకానికి ఊర్వశి వచ్చింది. వారిద్దరి దాంపత్యం చాలా ఏళ్ళు ఆదర్శ వంతం గా గడచి పోయింది. గంధర్వుల మాయో పాయం వలన చివరి రెండు షరతులు భగ్నం అయ్యాయి. వెంటనే ఊర్వశి తానూ చెప్పిన మాటకు కట్టు బడి స్వర్గ లోకం చేరింది. విరహ వేదనతో జ్వలిస్తున్న పురూరవుడు నిర్మధనం ద్వారా అగ్ని సృష్టించి గార్హపత్యం, ఆహవ నీయం, దక్షిణాగ్ని స్థలాలలో త్రేతాగ్నులను అర్చించి స్వర్గానికి చేరి ఊర్వశి

పొందు సౌఖ్యం పొందాడు. ఈ కధలో పురూరవుని నిష్కళంక ప్రేమ తెలుస్తుంది విధిని ఎవరూ తప్పించలేరని అర్ధమౌతుంది. వృత్రాసురో పాఖ్యానం కూడా ఈ బ్రాహ్మణం లోనిదే.

## జైమిని బ్రాహ్మణ ఉపాఖ్యాన కధలు

### మేడిచెట్టు పుట్టుక

సామ వేదానికి చెందినా జైమిని బ్రాహ్మణం లో అసంఖ్యాక ఉపాఖ్యానాలున్నాయి. అందులో మేడి చెట్టు పుట్టుక కద తెలుసు కొందాం. మేడికి "ఉదుంబర "అని పేరు. ఇది చాలా సారవంతమైన వృక్షం. ప్రజాపతి అన్నం సారాన్ని అంతటినీ ఒక చోట చేర్చి ప్రజలకు పంచటం ప్రారంభించాడు. అప్పుడు కొన్ని చుక్కలు నేల మీద పడి మేడి చెట్టు పుట్టిందట. అందుకే మేడి పండు మంచి పుష్టి నిచ్చేఆహారం అని ఆయుర్వేదం చెబుతోంది.



ప్రజా పతి ప్రజా సృష్టి చేయటం, అగ్ని ని ముఖం నుండి సృష్టించటం,. ప్రజా పతి ముఖం నుండి అగ్ని భయంకర జ్వాలలతో బయటకు వచ్చి ప్రజాపతి శిరస్సుకు హాని కలగటం, దేవతలు ఈ అగ్నిని బృహస్పతి ద్వారా గ్రహించటం కూడా వివరింప బడింది.

తాండ్య బ్రాహ్మణ ఉపాఖ్యాన కధలు గురించి తరువాత తెలుసు కొందాం.

## తాండ్య బ్రాహ్మణం లో ఉపాఖ్యాన కధలు

సామ వేదానికి చెందిన తాండ్య బ్రాహ్మణం లో ఉపాఖ్యానాలు కొద్దిగానే ఉన్నాయి. అందులో ముఖ్యమైన కొన్నిటిని తెలుసుకొందాం.



## పురోహితుడిని వశిష్టుడు అని ఎందుకు అంటారు ?

సాధారణం గా బ్రాహ్మణుల వివాహాది శుభ కార్యాలను చేయించే పురోహితుడిని వాళ్ళు గౌరవం గా "వశిష్టుడు "అంటారు. ఈ పేరు ఎలా వచ్చిందో చూద్దాం. వసిష్ట మహర్షి ఇక్ష్వాకు వంశ పురోహితుడని మనకు తెలిసిన విషయమే. వసిస్టుని సంతతి లోని వారందర్నీ వసిస్టుడు అనే పేరు తోనే పిలుస్తారు. అంతేకాక సామాన్య పురోహితుడినికూడా ఆ గౌరవ వాచకం తో "వసిస్టుడు "అనే పేరు తో పిలవటం లోకం లో సహజమై వసిస్టుడు అందరి వాడయ్యాడు.

ఒకప్పుడు రుషులందరికీ ఇంద్రుడిని ప్రత్యక్షం గా చూడాలని పించింది. కొందరు కొన్ని రకాల ప్రయత్నాలు చేశారు. కాని ఎవరి వల్లా కాలేదు. వసిష్ట మహర్షి ఆలోచించి "నివహం "అనే పేరుగల సామ మంత్రం తో ఇంద్రుడిని స్తుతించాడు. వెంటనే ఇంద్రుడు ప్రత్యక్షమై అనేక యజ్న యాగాది క్రతువులను వాటి అనుస్టాన పద్ధతులను సవివరం గా తెలియ జేశాడు. అందుకనే మిగిలిన రుషులకంటే వశిస్టుడి కే ప్రాధాన్యత కలిగింది. సకల వైదిక కర్మలూ సమగ్రం గా తెలిసిన వాడవటం వల్ల చక్రవర్తులు ఇతర ఋషులను వదిలి పెట్టి వశిస్టుడినే పురోహితుడిగా చేసుకొన్నారు.

## నిజమైన పుత్రుడు ఎవరు?

ప్రజాపతి భూమిని, అందులోని ప్రాణుల్ని, స్వర్గం మొదలైన లోకాలను, సూర్య చంద్రాది మండలాలను సృష్టించాడు. కాని సృష్టిలోని ప్రాణులు ప్రజా పతి గారి పెద్దరికాన్ని మన్నించ లేదు. అప్పుడు ప్రజా పతి సృష్టి సారాన్ని అంతటిని ఒక మాలగా చేసి మెడలో ధరించాడు. దీనితో సకల సృష్టీ ప్రజాపతి పాద క్రాంతమై దానోహమన్నది. ఇప్పుడు ప్రజాపతికి తన సృష్టి కి ఒక నాయకుడు ఉంటె బాగుండును అని పించి తన మెడలోని మాలను ఇంద్రుని మెడలో వేశాడు. ప్రజాపతికి ఇంద్రుడుకాక చాలా మంది పుత్రులున్నారు కాని తండ్రి ఇంద్రుని మెడలో మాల వేశాడు కనుక వంశ రక్షకుడిగా సమర్దుడిగా ఇంద్రుడినే ఎంపిక చేసి నట్లు లెక్క. తండ్రి విశ్వాసానికి పాత్రుడై ఆయన ఆస్తిలో అధిక భాగాన్ని పొందిన వాడే నిజమైన పుత్రుడు అని తాండ్య బ్రహ్మనం చెప్పింది.

తర్వాత ఇంద్రుడు "అభిజిత్ "విశ్వ జిత్ "అనే యాగాలు చేసి, జైత్ర యాత్ర చేసి సమస్తలోకాది పతి అయ్యాడు. కనుక తండ్రి అధికారం ఇచ్చి నందు వల్లనే కాక స్వంత ప్రతిభా సామర్ధ్యాలు కూడా ఇంద్రునిలో ఉన్నాయని ఈ బ్రాహ్మణం తెలియ జేస్తోంది. ఇందులోని ఉపాఖ్యానాలు ఎక్కువ గా సామల గురించే ఉన్నాయి. దేవాసురులు పశు సంపద కోసం యుద్ధం చేశారు. దేవతలు "ఆతే అగ్న"అనే "సంజయ సామ "ను గానం చేసి సాధించారు. దేవతల మీద అలిగి పక్షి రూపం తో వెళ్ళి పోయిన యజ్న పురుషుడిని, దేవతలు "సౌవర్ణ సామ "తో తిరిగి పొందారు. ఇంద్రుడు "పదస్తోభ సామ "గానం చేసి వృత్రాసురిడిని సంహరించి నందుకు కలిగిన పాపాన్ని పోగొట్టుకొన్నాడు




విఖనసుని పుత్రులను వైఖానసులు అంటారు వీరు ఇంద్రునికి ప్రీతి పాత్రులు. వైఖానసులు దేవతలకు ఉపకారం చేస్తున్నారని క్కోపం తో ఒక రాక్షసుడు వారిని రహస్యం గా ఎత్తుకొని వెళ్లి "ముని మరణం "అనే చోట దాచేశారు. తన ఆప్తులు కానీ పించక పోయే సరికి ఇంద్రుడు కలవరం చెంది నలుమూలలా వెతికించాడు. చివరికి వైఖానసుల కళేబరాలు కానీ పించాయి. ఇంద్రుడు అక్కడికి వెళ్లి "వైఖానస సామ "ను గానం చేసి వారిని పునరుజ్జీవులను చేశాడు. అందకని సామాలలో వైఖానస సామ కు అధిక ప్రాధాన్యం ఉంది అది తీర్చలేని కోరిక అన్నేఉన్నదని విశ్వాసం. దానం పట్టటం దోషమే కాని కొందరికి తప్పని పని అది ఆ దోష నివారణకు "ధ్వస్రమొహ్ పురుశాస్తన్యోహ్ "అనే మంత్రాన్ని చదువుతారు. ఇప్పుడు గో పద బ్రాహ్మ ఉపాఖ్యానాలను గూర్చి తెలుసు కొందాం.

## గోపద బ్రాహ్మణ ఉపాఖ్యాన కధలు

అధర్వ వేదానికి చెందిన గోపద బ్రాహ్మణం లో చాలా గంభీర అంతరార్ధాలున్న ఉపాఖ్యానాలు ఉన్నాయి. ఇందులో ముఖ్యమైన "ఉద్దాలక –శౌనక సంవాదం "గురించి తెలుసుకొందాం.

అరుణుడు అనే మహర్షి పుత్రుడే ఉద్దాలకుడు. ఉద్దాలకుడు శాస్త్రార్ధం చేసి తనను జయించిన వారి కి తన మెడలో ఉన్న విలువైన హారం ఇస్తానంటూ దేశాలన్నీ తిరిగాడు. ఎవరికి అంతసాహాసం కని పించలేదు. చివరికి ఉత్తర దేశ పండితులు శౌనకుడు అనే పేరున్న "సద్రేవాయనుడు "ను నాయకుడిగా చేసుకొని ఉద్దాలకునితో శాస్త్రార్ధానికి తల పడ్డారు, ఉద్దాలకుడు ప్రశ్నిస్తుంటే శౌనకుడు జవాబులిచ్చాడు. ఈ కధలో విజ్ఞాన్నాన్ని పొందటమే కాక దాన్ని శాస్త్రార్ధ చర్చలతో పెంపొందించుకోవాలనే సందేశం ఉంది.

### ప్రేది –ఉద్దాలకుడు

ఉద్దాలకుని గురువు ఇప్పటి పాట్నా అయిన కౌశాంబి నగర నివాసి "ప్రేది". శిష్యుడికి బ్రహ్మ చర్యాన్ని గూర్చి బోధించి "నీ తండ్రి సంవత్సర యజ్ఞాన్ని ఎన్ని రోజుల్లో పూర్తీ చేస్తాడు ?"అని అడిగితె ఉద్దాలకుడు "పది రోజుల్లో "అని సమాధానం చెప్పాడు. ఇలా చెప్పటానికి ఉద్దాలకుడికి ఒక లెక్క ఉంది. ముఖ్యమైన విరాట్ ఛందస్సుకు పదే అక్షరాలుంటాయి. ఆచార్యుడు మళ్ళీ అడిగితే "తొమ్మిది "అన్నాడు శిష్యుడు. ప్రాణాలు(నవ రంధ్రాలు ) తొమ్మిది కనుక సరైన సమాధానమే చెప్పాడు. మళ్ళీ అడిగితే గాయత్రి అష్టాక్షరి కనుక ఎనిమిది అన్నాడు. మళ్ళీ అడిగితె ముఖ్య ఛందస్సులు ఏడు కనుక ఏడు అన్నాడు. ఇలా సంఖ్య తగ్గుతూ చివరికి మనిషికి రెండు పాదాలు కనుక రెండు అన్నాడు. ఇక్కడ పాదం అంటే మనం అనుకొనే కాలు కాదు కర్మ, జ్ఞాన మార్గాలు. చివరి ప్రశ్నకు ఒకటి అన్నాడు ఉద్దాలకుడు. అంటే ఒక సంవత్సరం అని అర్ధం. మానవుని కి పరమార్ధాన్ని బోధించే విషయాలెన్నో ఇందులో ఉన్నాయి.

## దక్షయజ్ఞ ధ్వంసం

ఒక సారి ప్రజాపతి దక్షుడు రుద్రునికి భాగం లేకుండా యజ్ఞం ప్రారంభించాడు. కూతురు సతీదేవిని అవమానించాడు కోపించిన రుద్రుడు వీర భద్రుని సృష్టించి దక్షాధ్వర విధ్వంసం చేశాడు. యజ్ఞం లో మిగిలిన "ప్రాశిత్రాన్ని "చూడగానే భగుడి కళ్ళు పోయాయి. సవిత్రు దేవత దాన్ని తాకగానే చేతులు తెగిపోయాయి. బంగారు చేతులు అమర్చాడు., అందుకే హిరణ్య పాణి అనే పేరొచ్చింది. సవిత్రునికి. సూర్యుడు సాహసించి తిన బోతే పళ్ళు ఊది పోయి "పూషుడు "అని పిలువా బడ్డాడు.



అందుకే సూర్యునికి పళ్ళు లేవుకనుక మెత్తని పిండి పదార్ధాలే నై వేద్యం పెట్టాలని శృతి చెప్పింది. ఇద్మూడికి శిరస్సు, బర్హికి కీళ్ళు పడిపోయాయి. చివరికి బృహస్పతి మంత్రోచ్చారణ తో సూర్యుని కళ్ళ తో చూస్తూ అశ్వినీ దేవతల బాహువులతో స్వీకరించి లోపాన్ని సరి దిద్దాడు. ఇందులో ఉన్న అంతరార్ధం –ప్రజా పతి శరీర అవయవాలకు అది పతి అయిన జీవాత్మ. రుద్రుడు సర్వజ్ఞుడైన పరమాత్మ. యజ్ఞం అంటే పరమాణు సంయోగం తో ఏర్పడిన శరీరం. ప్రజా పతి రుద్రుడని యజ్ఞం నుంచి దూరం చేయటం వలన భగ, సవిత్రు, పూషా, ఇద్మ,బర్హిస్ తత్వాలు తమ తమ పనులు చేయ లేక పోయాయి అని గ్రహించాలి. జ్ఞాని ఏ పనిలోనూ పరమాత్మ ను మరువ రాదు అని నీతి.

## కౌశీతకీ బ్రాహ్మణం లో అగ్న్యాధానం కద

అగ్న్యాధానం అంటే హోమం చేయటానికి కావాల్సిన అగ్ని ని ప్రతి ష్టిం చటం. యజ్ఞం లో ఆహవనీయం, గార్హపత్యం, అన్వాహార్య పచనం అనే మూడు అగ్నులుంటాయి. ఒక్క రోజు తో పూర్తీ అయ్యే యాగాలనుంచి వెయ్యి సంవత్సరాలు చేయాల్సిన "సత్రం "వరకు ఈ అగ్నులు అవసరమే. ముందు అగ్నిని ప్రతిష్టించి మిగిలిన కార్య క్రమాలు మొదలు పెట్టాలి.

ఒకప్పుడు మానవుల్లాగా దేవతలు కూడా భూలోకం లోనే ఉండి కర్మానుష్టానాలు చేసుకొంటూ స్వర్గం పొందటానికి సాధన చేస్తూండే వారు. ఈ అనుష్టానం వల్ల దేవతలు పునర్జన్మ నుండి విముక్తులై పునరా వృత్తి లేని స్వర్గాన్ని పొందారు. దీనితో మనుష్యుల కంటే వేరు గా ఉన్నారు. స్వర్గానికి పోతున్న దేవతలు అగ్నితో "నువ్వు భూలోకం లో ఉండి మానవులకు, మాకు అధ్యక్షుడు గా ఉండు. మానవులు శ్రౌత స్మార్త కర్మల ద్వారా సమర్పించిన వి నీ ద్వారా మేం స్వీకరిస్తాం. మా అనుగ్రహం చేత మానవులకు ఐహికాముష్మిక పురుషార్ధాలు పొందుతారు. మనుష్యులకు మాకు సంబంధం కలుపుతూ నువ్వు భూమి మీదే ఉండిపో. మానవులు యజ్ఞ యాగాదులలో ఇచ్చే ద్రవ్యాలను నువ్వు స్వీకరించు. మా తరఫున వారి కోర్కెలు తీర్చు. "అని చెప్పారు. దానికి అగ్ని "నాకు తీవ్ర దాహం ఉన్న సంగతి మీకు తెలుసు. నన్ను సమీపించటానికే భస్మమై పోతామనే భయం తో ఎవరూ సాహసం చేయలేరు కదా అందువల్ల మీరనుకోన్నట్లు "పురోడాశం "మొదలైనవి నాకు మానవులు ఇవ్వరు "అన్నాడు.

దేవతలకు సంకట పరిస్తితి వచ్చి బాగా ఆలోచించారు. అగ్ని లో ఇతరులు సహింప రాని తీవ్ర దాహక శక్తి, మంగళకరమైన మానవాభ్యుదయానికి ఉపయోగించే శోభనకర దాహక శక్తి అని రెండు రకాలు ఉన్నాయి. రెండో దానివలననే మనం వంటలు వగైరా చేసుకో గాలుగుతున్నాం. ఈ శోభన శక్తిని మాత్రం అగ్ని లో ఉంచి, దేవతలు తీవ్ర శక్తిని వేరు చేసి దాన్ని నీటిలో ఉంచారు. దీనికే "పవమానాగ్ని "అని పేరు. కొంత

వాయువులో ఉంచారు. ఇదే పావకాగ్ని. మిగిలిన శక్తి నంతటిని సూర్యుని లో ఉంచారు ఈ అగ్నికే శుచి అని పేరు. కనుక అగ్ని దేవుడిని పూజించాలంటే ఆహవనీయ, గార్హపత్య, అన్వాహార్య రూపాలలో ఉండే శోభంకర అగ్నులనే కాకుండా పావక, పవమాన, శుచి పేర్లతో ఉన్న అగ్ని స్వరూపలనూ పూజించాల్సిందే. అందుచేత ఈ మూడు శరీరాలకు మూడు ఇష్టులు చేయాలి. పావకేష్టి పూర్ణ మాసేష్టికి వికృతి. శుచి, పవమానేష్టూలకు దర్శేష్టి ప్రకృతి. ఇవన్నీ చేస్తేనే అగ్న్యాధానం పూర్తీ అయి నట్లు లెక్క.

కౌశీతకీ బ్రాహ్మణం విశిష్టత సోమయాగ నిరూపణం మీదే ఆధారపడి ఉంది. సోమయాగం పది రోజులు చేస్తారు వాగ్దీక్ష తో ఇది ప్రారంభ మవుతుంది. ఈ దీక్షతో ప్రాణ దీక్ష లభిస్తుంది. ఈ రెండిటి వల్లా యజమానికి కోరిక నేర వేరుతుంది. కనుక మాటకున్న విలువ, దాన్ని ప్రేరేపించే మనసుకున్న సంయమనం, మనసుతో ప్రభావితమయ్యే ప్రాణ శక్తి ప్రయోజనం ఇందులో సూచించారు. ఇందులో సూచిన అభిజిత్, విశ్వజిత్ యాగాలు విశిష్టమైనవి. అభిజిత్ అంటే అగ్ని. విశ్వజిత్ అంటే ఇంద్రుడు. దేవతలు అభిజ్ఞ్ యాగం తో ముల్లోకాలను జయించారు. మిగిలిన లోకాలన్ విశ్వ జిత్ చేసి జయించారు. ప్రజా రక్షకుడైన డైన రాజుకు విశ్వ జిద్యాగం చాలా అవసరం అని తెలుస్తోంది. శత్రు శేషం లేకుండా చేస్తుంది.దీనితో సామాన్య ప్రజల సంక్షేమానికి హాని తల పెట్టె దుస్త శక్తులను మట్టు పెట్ట వచ్చు లోక క్షేమం కలుగు తుంది.

మనసుకు పరిధులు లేవు అని, మనస్సు ప్రజాపతి అని, ఆ ప్రజాపతి యజ్ఞ మయుడని, మనః పూర్వకం గా యజ్ఞం కోసమే యజ్ఞం చేయాలని తెలియ జేయ బడింది. ప్రజా రక్షకు డైన రాజు మనస్సుజీవితం నిస్వార్ధం గా ఉండాలి అనే సూచన ఉంది. విజ్ఞుడి రాక తో యజ్ఞం ఆనందిస్తుందని చెప్ప బడింది. ఏదైనా ప్రమాద వశాత్తు తప్పులు చేస్తే సరి దిద్దుకోవాలని సూచించింది.. అందరూ చేరలేని ఎత్తులకు ఎగిరే గరుత్మంతుడే వాయువు అని, వాయువు అంటే ప్రాణమని చివర సుపర్ణ పర్వం లో వివరింప బడింది. వాల ఖిల్యులు అంటే భౌతిక శరీరం నుండి విడి పోని ప్రాణాలు అని, వైశాల్యం లో వాలం అంటే కేశం అంటే వెంట్రుక వంటి ప్రాణాలు, శరీరాన్ని వదల లేవుకనుక వాటికి వాలఖిల్యులు అనే పేరొచ్చింది. రెండిటితో సంబంధం లేని దాన్ని ఖిల అంటారు. సూక్ష్మ సంబంధం ఉన్దికనుక వాలఖిల్యులన్నారని భావం. చివరలో కర్మ బద్ధుడైన జీవుని ప్రస్థానాన్ని కూడా సవివరం గా కౌశీతకి బ్రాహ్మణం వివరించింది.

అగ్ని బ్రహ్మణ శక్తి. సోమం క్షాత్ర శక్తి. అన్ని కోర్కెలను తీర్చే వాక్కు మనస్సు లే హోమ ద్రవ్యాలు. బలి సమర్పించటం అంటే పురోడాశం సమర్పించటమే పశుబలి. పశువును కాక పశువుకు ప్రతీక అయిన పురోడాశం ను సమర్పించాలి. యజ్ఞం చేసే యజమానికి ఇహ పరాల్లోను అంతరిక్షం లోను మేలు జరుగుతుంది. సంతానంకావాలని యజ్ఞం చేసేవారు "శుద్ధ ప్రణవం "ను, పరువు ప్రతిష్టలకై చేసే వాళ్ళు "మకార లేకుండా ఉన్న ప్రణవాన్ని "ఉచ్చరించాలి ఈ యజ్ఞం సు సంపన్నం అయితే స్వర్గ రూపం, తగ్గితే అన్నాది రూపం, హెచ్చితే సంతాన రూపం అవుతుందని వివరించింది కౌశీతికం. సోమమే సవనీయం చేయాల్సిన పశువు. యజ్ఞమే ప్రజాపతి స్వరూపం అని ముందే తెలుసుకొన్నాం. ప్రాజాపత్య యజ్ఞం సర్వా భీష్టాలను తీరుస్తుంది. సూక్షం గా విచారిస్తే యజ్ఞ కర్త శరీరమే పురోడాశం. ఆయన ఉచ్ఛ్వాస నిస్స్వాసాలే సోమ పాన పాత్రలు. యజ్ఞకర్త ఇహలోకం లో సంపూర్ణ జీవితం గడిపి స్వర్గం లో అమరుడౌతాడు.

షోడశి లో ఈ విశ్వం షోడశ కళాత్మక రూపం గా చెప్ప బడింది షోడశి ఇంద్రుడే. ఇంద్రుడు హరి యే.యజ్ఞం పురుష స్వరూపమే. పురుషుని శిరస్సు "హవిర్వాహకం ".ముఖమే ఆహవ నీయం. ఉదరం సదస్సు. ఆహారమే దేవతలకు చేసే స్తోత్రాలు. బాహువులు మార్జాలీయాగ్ని ధ్రీయాలు. లోపలి దివ్య శక్తులు సదస్సులోని దేవతా పీఠాలు. మనస్సు బ్రహ్మ.. ప్రాణమే ఉద్గాత. అపానం ప్రస్తోత. వ్యానం ప్రతి హర్త.వాక్కు హోత. నేత్రమే అధ్వర్యుడు. సంతతే సదస్యులు. ఆత్మ యజమాని. అవయవాలు హోత్రాశంసులు. ఇవన్నీ గమనిస్తే మానవ జీవితం యజ్ఞ మయం అనే అంతరార్ధం తెలుస్తుంది.

## తైత్తిరీయ బ్రాహ్మణ ఉపాఖ్యానకధలు

కృష్ణ యజుర్వేదానికి ఎనభై ఆరు శాఖలున్నాయి. అందులో నశించి పోయినవి కాక మిగిలి ఉన్న నాలుగు శాఖలలో ముఖ్యమైనది తైత్తిరీయ శాఖ. దానికి సంబంధించిన బ్రాహ్మణమే తైత్తిరీయ బ్రాహ్మణం. అంటే కృష్ణ యజుర్వేదానికి మిగిలి ఉన్నది ఒకే ఒక్క తైత్తిరీయ బ్రాహ్మణమే నన్న మాట. కృష్ణ యజుస్సంహితలో బ్రాహ్మణ భాగాలు కలిసి పోయే ఉంటాయి., బ్రాహ్మణానికి సంహితకు పెద్దగా తేడా కని పించదు.వైశంపాయనుడి శిష్యుడు పైంగి యాస్కుడు. అతని శిష్యుడే తిత్తిరి మహర్షి. ఉఖ మహర్షి తిత్తిరి శిష్యుడు. ఆత్రేయుడు తిత్తిరి ప్రశిష్యుడు. తైత్తిరీయ శాఖా ప్రవర్తకులలో తిత్తిరి మహర్షి మణి లాంటివాడు. అతనే ఈ బ్రాహ్మణ కర్త కనుక ఆయన పేరనే చెలా మణి అయింది. ఈ బ్రాహ్మణం లో మొదటికాన్డను పార క్షుద్ర అని రెండవ దాన్ని అగ్ని హోత్రం అనీ అంటారు మూడవ దానిలో విభాగాలకు వాటి ప్రత్యేక పేర్లున్నాయి.



ఒకప్పుడు విదేహ రాజు జనకుడు సావిత్రాగ్ని జ్ఞానాని సంపాదిన్చాలనుకొని దేవతలను కలిశాడు. వాళ్ళు లోకం లో ఎవరు తమను సావిత్రాగ్ని స్వరూపం గా ఉపాసన చేస్తారో అలాంటి వారు సర్వ పాపాల నుండి, అప మృత్యువు నుండి ముక్తులౌతారని, పూర్ణాయుస్సుపొంది ఎప్పటికీ అన్నాదులకు లోటు లేకుండా సర్వాన్న సామ్రుద్ధి కలవారై స్వర్గాన్ని పొందుతారు అని చెప్పారు. అశ్వత్థ మహర్షి శిష్యుడు అహీన మహర్షి సావిత్రాగ్ని స్వరూపాన్ని ధ్యానం చేసి సాక్షాత్కరింప జేసుకొన్నాడు. అందుకనే ఆయన దేహ అవసాన దశలో" బంగారు హంస" అయి స్వర్గం చేరి ఆదిత్యునితో తాదాత్మ్యం చెందాడు.

ఈ బ్రాహ్మణం లో నీతికధలు తో బాటు లౌకిక జ్ఞాన విషయాలూ చాలానే ఉన్నాయి. చంద్రుడు ఏ రోజు ఏ నక్షత్రం తో కలిసి ఉంటాడో ఆ రోజు ఆ నక్షత్రం ఉంటుందని లోక వ్యవహారం. కృత్తికా నక్షత్రం తో చంద్రుడు కలిసి ఉన్న రోజు కృత్తికా నక్షత్రం అని అర్ధం. రోజుకొక నక్షత్రం ఉంటుంది కనుక దీన్ని బట్టి తెలుసుకోవాలి. కృత్తిక ఒకప్పుడు మొదటి నక్షత్రం గా ఉండేది. ఆ నక్షత్రం లో ఆధానం చేస్తే బ్రహ్మ వర్చస్సు కలుగుతుందని శాస్త్రం. రోహిణి లో చేస్తే సిరి సంపదలు కలుగుతాయి. దేవతలు ఒకప్పుడు ధన గర్వం లో విర్ర వీగుతూ అశ్రద్ధగా అగ్న్యాధానం చేసి సిరి సంపదలు పోగొట్టుకొని దరిద్రులైనారు. తప్పు తెలుసుకొని పునర్వసు నక్షత్రం లో శ్రద్ధ గా చేసి మళ్ళీ ధనికులైనారు. పునః అంటే మళ్ళీ వసు అంటే సంపద పొందారు కనుక ఆ నక్షత్రానికి పునర్వసు అనే పేరొచ్చింది. అలాగే విషువత్ కు ఇందులో అర్ధం చెప్పబడింది. సంవత్సరాన్ని రెండు భాగాలు చేయాలి. మొదటి భాగం లో చివరి నాలుగు రోజులు, రెండో భాగం లోని మొదటి నాలుగు రోజులు తీసుకొని మధ్యలో ఉన్న రోజును విషువత్ అంటారని ఈ తొమ్మిద రోజుల్లో యాగం చేస్తే అష్ట దిక్పాలకులు పాలించే ఎనిమిది స్వర్గాలు,అంత కంటే పై నుండే స్వర్గం పొందగలరు.

## అన్నం రెండు సార్లు ఎందుకు తినాలి?

ఒకప్పుడు దేవతలు, పితరులు, మనుష్యులు, పశువులు, అసురులు (వీరందరికీ ప్రజలనే పేరు )ఉపవాసం తో ఉండే సత్రాన్ని గురించి తపస్సు చేశారు. వారిలో దేవతలు నేతితో నిండిన చమన పాత్రను చూసి హోమం చేసి పది హీను రోజులకోసారి భోజనం చేసే రస పదార్ధాన్ని పొందారు. అందుకే అమావాస్య, పౌర్ణమి రోజుల్లో దేవతల ప్రీతికోసం దర్శ, పూర్ణమాస యాగాలు చేస్తారు. పితృదేవతలు నెలకోసారి భోజనాన్ని సంపాదించుకొన్నారు. అందుకే ప్రతి అమా వాస్య నాడు "పిండ పితృ యజ్ఞం "చేసి పితృ దేవతలను సంతృప్తి పరుస్తారు. మానవులు ఒకేరోజు రెండు భోజనాలను సంపాదించారు. పశువులు మూడు సార్లు తిని మిగిలిన సమయం లో నెమరేస్తాయి. రాక్షసులు సంవత్సరానికి ఒక సారే తిండి సంపాదించారు. అందుకే ఏడాదికి ఒక సారే తిండి తిని మిగిలిన రోజుల్లో దేవతల తో యుద్ధాలు చేసే వారు.

నక్షత్రాలే ప్రజా పతి శరీరం. హస్తా నక్షత్రం ప్రజా పతి హస్తం. చిత్తా నక్షత్రం శిరస్సు. స్వాతి హృదయం. విశాఖ తొడలు, అనురాధ పాదాలు. ఇలా నక్షత్ర స్వరూపిగా ప్రజాపతిని ధ్యానిస్తారు.

## గోవులే అగ్ని హోత్రాలు

పర్వతాలు మొదలైన అచేతనాలను సృష్టించి తర్వాత ప్రజాపతి అగ్ని వాయువు, ఆదిత్యుడు అనే చేతనలను హోమం ద్వారా సృష్టించాడు. ఈ ముగ్గురూ తాము కూడా ప్రజా పతి లాగానే సృష్టి చేయాలను కొని అగ్ని ప్రాణం కోసం వాయువు శరీరం కోసం, ఆదిత్యుడు కండ్ల కోసం హోమం

చేశారు. దీనితో ఒక గోవు పుట్టింది. దాని పాలు పంచుకోవటం లో ముగ్గురికీ పేచీ వచ్చింది. పరిష్కారం కోసం ప్రజా పతి దగ్గరకు చేరారు. ప్రాణాలు లేని శరీరం, కండ్లు వ్యర్ధం కనుక ప్రాణాలకోసం హోమం చేసిన అగ్నిదే ఆవు అని తీర్పు చెప్పాడు. అప్పటి నుంచి ఆవుకు "అగ్ని హోత్రం 'అనే పేరొచ్చింది. ఆవును అగ్ని హోత్రం గా ఉపాసించే వారికి అప మృత్యు భయం ఉండదని ఈ బ్రాహ్మణం చెప్పింది.

## మానవ సృష్టి

ప్రజాపతి సృష్టి చేయాలను కొని ముందు ప్రాణ వాయువు తో బలాదికులైన అసురుల్ని సృష్టించి "పిత "అని పించుకొన్నాడు. తర్వాత పితృదేవతలను సృష్టించి, ఇంకా ఏమేమి సృష్టించాలా అని మనసులో ఆలోచించాడు. అప్పుడు మనుష్యులేర్పడ్డారు. మననం చేయటం వాళ్ళ ఎర్పడ్డారుకనుక మానవులని పించుకొన్నారు. మనుష్యులు లౌకిక వైదిక వ్యవ హారాలు చేసే సరికి అంతా కాంతి తో నిండి పోయింది. ఆ కాంతి ననుసరించి దేవతలను సృష్టించాడు. ఈ ఆలుగు రకాల సృష్టి" జలం" లాంటిది. నదీ జలం తటాక జలం వగైరా ఎలా భోగానికి ఉపయోగిస్తాయో సృష్టి కూడా భోగానికి ఉపయోగ పడుతుందని అంతరార్ధం.

## బొల్లి ఎల్లా పోతుంది?

తెల్ల బొల్లి మచ్చలున్న శరీరాన్ని "కిలాపం "అంటారు. తల నెరిసి పోవడాన్ని "పలితం"అంటారు.;;నీలి "అనే ఓషధి ఈ రెండు వ్యాదుల్నీ పోగొట్టు తుంది. ఈ ఓషధిని అభిమంత్రిస్తూ చెప్పాల్సిన మంత్రాలు ఇందులో ఉన్నాయి. బొల్లి ఎన్ని రకాలో, వాటిని పోగొట్ట శక్తి నీలికి ఎలా వచ్చిందో వివరాలున్నాయి.

## పగలు రాత్రులకు పేర్లు

సావిత్ర చయనం లో కొన్ని వైదిక పరిభాషలున్నాయి. ప్రతీనెలలో మొదటి పదిహేను రోజులు శుక్ల పక్షం. తరువాతిది కృష్ణ పక్షం. శుక్లపాడ్యమి తో మొదలైన తిధుల పగటి వేళలను వరుసగా సంజ్ఞానం, విజ్ఞానం, ప్రజ్ఞానం, జానాథ్, అభిజానాథ్, సంకల్పమానం, ప్రకల్ప మానం, ఉపకల్పమానం, ఉప క్లప్తం,క్లప్తం,శ్రేయః, వసీయ, ఆయత్,సంభూతం, భూతం అనే పేర్లతో పిలుస్తారు. శుక్ల పక్ష రాత్రులకు వరుసగా దర్శ, దృష్టా, దర్శత, విశ్వ రూపా, సుదర్శనా, ఆప్యాయ మానా, ప్యాయ మానా, ప్యాయా, సూనృతా, ఇరా, అపూర్యమానా, పూరయన్తీ, పూర్ణా, పౌర్ణ మాసీ అనే పేర్లున్నాయి. అలాగే కృష్ణ పక్ష పగళ్ళకు రాత్రులకు పేర్లు చెప్పా బడ్డాయి

తైత్తిరీయం మూడు కాండలలో అనేక పేర్లున్న యజ్ఞ యాగాదుల నిర్వహణ విధానం వివరణ ఉంది మధ్యమధ్యలో సందర్భాన్ని బట్టి లోకానికి పనికి వచ్చే కబుర్లెన్నో చెప్పింది.వీటినన్నిటిని అర్ధం చేసుకొని సంస్కారం తో జీవితాన్ని మలచుకొని సమాజ భ్యుదయానికి పాటు పడమనే ఏ బ్రాహ్మనమైనా బోధించే విషయం.

తరువాత శత పద బ్రాహ్మణ విశేషాలు తెలుసుకొందాం

## శత పధబ్రాహ్మణ ఉపాఖ్యాన కధలు

శుక్ల యజుర్వేదానికి ఉన్న ఒకే ఒక్క బ్రాహ్మణం శత పద బ్రాహ్మణం నూరు అధ్యాయాల గ్రంధం. అందుకే శత పధం అని పేరు. ఇక్కడ పధ అంటే అధ్యాయం అని అర్ధం. అమూల్య తత్వాలను ఆవిష్కరించిన గ్రంధం కనుక విశేష ప్రాచుర్యం పొందింది. అన్నిరకాల యజ్ఞయాగాదుల గురించి వివరణ ఉంది. ఇందులో రాజసూయ యాగం గురించి సంపూర్ణం గా ఉంది.

## రాజ సూయ యాగం

రాజ్యాధికారానికి వచ్చిన రాజు రాజసూయ యాగం చేయాలి. దీని వల్లరాజు ప్రతిష్ట పెరగటమేకాక పవిత్రత కూడా పెరుగుతుంది. ఇందులో 6 సోమయాగాలు, 2పశు యాగాలు, 129ఇష్టులు ఉంటాయి ఏడు దర్వీ హోమాలతో పద్నాలుగు నెలల్లో పూర్తవుతుంది. ఫాల్గుణ శుక్ల పాడ్యమి నాడు రాజసూయాన్ని ప్రారంభిస్తారు. అభిషేక సంస్కారం చేసి ఆరు యాగాలు చేసి, అభిషేచనీయ మనే సోమ యాగం తో మధ్యాహ్న సవనం, ప్రధాన ఆహుతి చేసిన తర్వాత బ్రహ్మ గారు రాజు చేయి పట్టుకొని సభ్యులకు, ప్రజలకు ఇతడు రాజు అని పరిచయం చేస్తాడు. తరువాత అభిషేకం జరుగుతుంది. సముద్రం నది, సరస్సు, సెలయేరు మొదలైన పదహారు పుణ్య తీర్ధాలలో ని పవిత్ర జలాన్ని సేకరించి ఇరుగు నెయ్యి, పాలు తేనే మొదలైన పంచాగవ్యాలను కలిపి రాజును అభి షెకిస్తారు. దీనికి మేడి పాత్రను ఉపయోగిస్తారు.



విల్లు బాణం పట్టుకొని రాజు పులి తోలు పరచిన మేడిసింహాసనం పై ఆహవనీయాగ్ని దగ్గర కూర్చుంటాడు. ఆరు పార్ధ హోమాలు చేస్తారు. మహేంద్ర స్తోత్రాన్ని ఉద్గాత పఠిస్తాడు. అధ్వర్యుడు బ్రహ్మ, హోత, ఉద్గాత రాజు చుట్టూ నిలుచుని పవిత్ర జలాలతో అభిషేకిస్తారు. తర్వాత రాజు నూతన వస్త్రాలు ధరిస్తాడు.. మళ్ళీ ఆరు పార్ధ హోమాలు చేస్తారు అందులో "రత్నినాం హవీ షింపి "అనే పన్నెండు ఇష్టులు చేస్తారు. ఈ కార్యక్రమం వలననే రాజ ఉద్యోగులకు రత్నిన్ అంటే రత్నాలు అనే పేరొచ్చింది. వీరే పురోహిత, సూత, సంగ్రహీత్రు, అక్షావాప, క్షత్రి, గోణికర్తన, పాలాగల, తక్షన్, రధకార మొదలైన వారు.

రాజు మూడు గుర్రాలు ఇద్దరు అంగ రక్షకులు గల రధాన్ని ఎక్కి ఒక వీరుడితో ద్వంద్వ యుద్ధం చేసి జయిస్తాడు. పరిహాసానికి తన బంధువులకు చెందిన గో సమూహం మీదకు దండెత్తి, జయించి, కొంత దనం రాజ్య భాగం వారికి ప్రతి ఫలం గాఇస్తాడు. తర్వాత అధ్వర్యుని తో పాచిక లాడుతాడు. ఇందులో పందెం ఆవు. దాన్నీ జయిస్తాడు. సోమయాగం తర్వాత శునస్షేపుని వృత్తాంతాన్ని రాజు పఠిస్తాడు..మర్నాటి నుంచి పది రోజులు "సంస్రుపాం హవీం షి "అనే పది ఇష్టులు చేస్తారు. పదకొండవ రోజు "దశ పేయం "చేస్తారు ఈ సోమయాగం లో పది చమనలు అంటే పాత్రలు ఉపయోగిస్తారు. పది మంది ఋత్విక్కులు పాల్గొంటారు అందుకే దశపేయం అయింది. "కేశవా నీయ "అనే సోమయాగం ఒక ఏడాది తర్వాత చేస్తారు. తర్వాత వ్యుష్టిద్విరాత్ర, క్షత్రస్య ధృతి అనే సోమయాగ నిర్వాహణ జరుగుతుంది. దీనితో రాజ సూయం సమాప్తమౌతుంది. ఈ యాగం లో ప్రధాన దేవత వరుణుడు.. "వరునసవో వా యేష యద్ రాజ సూయం "అని ఈ బ్రాహ్మణం చెప్పింది. రాజ సూయ, అశ్వ మేధ, పురుష మేధ, సర్వమేద యాగాలు క్షత్రియ యాగాలు. రాజ సూయం లో రాజును ప్రజా పతికి ప్రత్యక్ష ప్రతి నిదిగా పేర్కొన్నారు. ఈ బ్రాహ్మణం లో పద్నాలుగు కాన్దలున్నాయి.

అగ్ని స్మార్తాగ్ని అని శ్రౌతాగ్ని అని రెండు రకాలు. వివాహం అయిన గృహస్తు స్మార్తాగ్ని ని సేవించాలి. స్మార్తాగ్ని తో చేసే యజ్ఞాలన్నిటికీ పాక యజ్ఞాలంటారు. వీటిని చేసిన వారు పాక యాజులు. ఇందులో ఔపోసన హోమం, విశ్వ దేవం, పార్వణ యజ్ఞాలు, ఇస్టకాలు మొదలైన ఏడు యజ్ఞాలుంటాయి..గార్హ పత్యం ఆహవనీయం, దాక్షిణ్యం, సభ్యం అని శ్రౌతాగ్ని నాలుగు రకాలు. దీని విదానం లో గాంధార, కేకయ, సాల్వ కురు పాంచాల కోసల దేశాది ప్రస్తావన వస్తుంది

ఒక సంవత్సరం పాటు చేసే "సౌత్రామణి యజ్ఞం "గురించి ఇందులో ఉన్నది. ఈ బ్రాహ్మణం లో అప్పుడే పుట్టిన బౌద్ధ, సాంఖ్య మతాల ప్రస్తావన కని పిస్తుంది. జనమేజయుడు కురు రాజు గా పేర్కొన బడ్డాడు. పాండవ ప్రస్తావన ఉండదు. ఇందులో అర్జున శబ్దం కేవలం ఇంద్రుడికే పరిమితం. జనకుడు మిదిలాదిపతిగా, సీత కు జనకుడిగా చెప్ప బడ్డాడు. ఊర్వశీ పురూరవోపాఖ్యానం శకుంతల దుష్యన్తోపాఖ్యానమూ ఉన్నాయి. భరతుని ప్రస్తావన ఉంది. ప్రళయానికి సంబంధించిన మను –మత్స్యాల వృత్తాంతం రమణీయం గా వర్ణించ బడింది. శుక్ల యజుర్వేదం లో మాధ్యందిన, కాన్వశాఖా భేదం వలన మాధ్యందిన శత పద బ్రాహ్మణం, కాన్వ శత పద బ్రాహ్మణం అని రెండు ఉన్నాయి ఈ బ్రాహ్మణాన్ని యాజ్న్య వల్క్య మహర్షి ముసలితనం లో రాసి ఉంటాడని భావిస్తున్నారు. పాంచాల దేశానికి చెందినగొప్ప యాజ్ఞికుడు ఆరుణి శిష్యుడే యాజ్న్య వల్క్యుడు. జనక రాజు ఆస్థాన సభాపతి యాజ్ఞావల్క్యుడే. దీనికే వాజసనేయ బ్రాహ్మణం అని కూడా పేరుంది.,

ఈ బ్రాహ్మణం క్రీ పూ 800-500మధ్య కాలం నాటిదని చెపుతున్నారు. మాధ్యందిన శతపదానికి హరిస్వామి "శ్రుత్యర్ధ వివృతి "అనే ప్రసిద్ధ భాష్యం రాశాడు.. అవంతీ రాజు విక్రమాదిత్యుని ఆస్థానం లో ధర్మాధ్యక్షుడు, దానాధ్యక్షుడు గా హరిస్వామి ఉండేవాడు. తండ్రి నాగ స్వామి. హరిస్వామికి "సర్వ విద్యా నిధాన కవీన్ద్రాచార్య సరస్వతి "బిరుదు ఉంది. ఇతని భాష్యం సమగ్రం గా దొరక లేదు. దొరికిన దానిలో అతని గాంభీర్య విధానం కని పిస్తుంది. దీనికి సాయణుడు సమగ్రమైన భాష్యం రాశాడు. అరి వీర భయంకరుడు, వైదిక ధర్మ సంరక్షకుడు అయిన హరిహర

రాయలు యజ్న విధిని పూర్తిగా తెలియ జేసే ఒక గ్రంధానికి ఒక దానికి వ్యాఖ్యానం రాయమని కోరితే సాయణుడు శత పద బ్రాహ్మానానికి వ్యాఖ్యానం రాశాడు. కనుక సంహితల తర్వాత అంతటి ఉన్నత స్థానాన్ని పొందింది శత పద బ్రాహ్మణం.

## తలవకార బ్రాహ్మణ ఉపాఖ్యాన కధలు

వ్యాసమహర్షి శిష్యుడైన జైమిని శిష్యుడే తలవ కారుడు. జైమిని చేత రచించ బడి తలవకారుని చేత ప్రచారం పొందింది తలవకార బ్రాహ్మణం. రచయితకంటే ప్రచారకునికే అధిక ప్రాధాన్యం కలగటం విశేషం. కొందరు జైమినీయ బ్రాహ్మణం అనీ పిలవటం కద్దు. సామ వేదానికికున్న అనేక శాఖలలో ఇదొకటి. ఇందులో అయిదు కాండలుంటాయి అవే ఆగ్నేయ, ఐంద్ర పవమాన అరుణ, శుక్రియలు. నాల్గవ దాన్ని ఉపనిషద్ బ్రాహ్మణం అనీ పిలుస్తారు. చివరి దానికి ఆర్షేయ బ్రాహ్మణం అనే పేరు కూడా ఉంది. సింధు నదీ తీర ప్రాంతం లో ఇది పుట్టిందని భావిస్తారు. సాయనుడు దీనికి భాష్యం రాయ లేదు. భావత్రాతుడు రాసినట్లు తెలుస్తోంది. సామగాచార్యులలో జైమిని ప్రసిద్ధుడు. కర్నాటక దేశం వాడని "కర్నాటకే జైమినిహ్ ప్రసిద్ధః "అని "చరణ వ్యూహం" బట్టి తెలుస్తోంది. యజ్న యాగాదుల విషయాలే ఎక్కువ. జ్యోతి ష్టోమం చేస్తే స్వర్గం వస్తుందని చెప్పింది స్వర్గం అంటే సుఖం అనే అర్ధం కూడా ఉంది.



ఇందులో ఋత్విక్కుల విధుల గురించి పూర్తీ సమాచారం ఉంది. యాగం మొదట్లో అధ్వర్యుడు "దీక్షణీయ "అనే ఇష్టి జరిపి యజమానికి అతని భార్యకు దీక్ష నిస్తాడు. దీక్షా కాలం లో యాజమాన దంపతులు వంటికి వెన్న రాసుకొని, కంటికి కాటుక పెట్టుకొని ఉండాలి. గోళ్ళతో గోక్కో రాదు. జింక కొమ్ముతో గోక్కోవాలి. పాలు, అత్తిపండ్లు, పెరుగు, పేలాలు మాత్రమె ఆహారం గా గ్రహించాలి. కడుపు నిండక పోతే వట్టి అన్నం తినచ్చు. అపశబ్దాలు, అసత్యాలు పలకరాదు. పళ్ళు కనబడేట్లు నవ్వ రాదు. స్త్రీముఖం చూడరాదు. యజ్న శాల విడిచి వెళ్ళరాదు, ఋత్విక్కులకు దక్షిణ ఇచ్చేవరకూ తన చేతి తో ఎవరికీ ఏమీ ఇవ్వరాదు. యాగా ద్రవ్య సేకరణకు నాలుగు దిక్కులకు యాచకులను పంపాలి. యాచకులు అంటే అడుక్కొనే వాళ్ళు కాదు హోమ ద్రవ్యాలను సేకరించేవారు. యెంత ధన వంతుడైనా ఇది తప్పని సరి విధి. దీనితో మొదటి రోజు కార్య క్రమం పూర్తవుతుంది.

రెండవ రోజు "ప్రాయణీయ "ఇష్టి జరిపి వస్త్రాన్నిచ్చి సోమలతను కొనుక్కోవాలి. ఇప్పుడు సోమలత దొరకటం లేదుకనుక "పూతిక "ను ప్రత్యామ్నాయం గా వాడుతున్నారు. ఈ సోమాని కి "రాజు "అని వేదం పేరు పెట్టింది.

రాజు మన ఇంటికి వస్తే ఎలా ఆతిధ్యమిస్తామో సోమానికీ అలానే ఇవ్వాలి. దీన్ని "అతిధ్యేష్టి"అంటారు. దీని తర్వాత యజమాని, ఋత్విక్కులు పరస్పరం స్నేహం తో ఉంటామని ప్రతిజ్ఞ చేయాలి. తర్వాత "ప్రవర్గ్య కర్మ "ప్రారంభిస్తారు. మనశరీరం లో శిరస్సుకు యెంత ప్రాధాన్యం ఉందో దీనికీ అంటే ప్రాముఖ్యం ఉంది. దీనికో కద కూడా ఉంది. పూర్వం విష్ణు మూర్తి ధనుర్యుద్ధం లో దేవతలను ఓడించి, ధనుస్సును గడ్డం కింద పెట్టుకొని విలాసం గా నిల బడి ఉంటె, ప్రతీకారేచ్చ తో ఇంద్రుడు చెద పురుగులను పంపి అల్లే త్రాటిని కొరికిస్తాడు. బంధం ఊడిపోయి ధనుస్సుకర్ర అతి వేగం తో పైకెగిరి విష్ణువు శిరస్సును శరీరం నుండి వేరు చేస్తుంది. ప్రతిక్రియ జరిగింది కనుక యజ్ఞం విచ్చిన్నమైంది. అశ్వినీ దేవతలు వచ్చి శిరస్సును అతికించిన తర్వాత దేవతలు యజ్ఞాన్ని పూర్తీ చేశారు. దీన్ని అనుకరిస్తూ "మహా వీర"అనే శిరస్సు లాంటి కుండ ఒకదాన్ని మంత్రం పూతం గా తయారు చేసి అందులో ఆవుపాలను మేక పాలను నేతినీ పోస్తారు. వీటితో హోమం చేస్తారు ఇదే ప్రవర్గ్యం. ఉపసత్ అనే ఇష్టిని చేసి రెండో రోజు పని పూర్తీ చేస్తారు. మూడవ రోజు "సుత్య"అనే అయిదవ రోజుకుసోమయాగానికి కావాల్సిన వేదికను తయారు చేస్తారు. నాల్గవ నాడు "అగ్నిష్టోమీయం "అనే పశు యాగం చేస్తారు అ రోజే సోమలతను రాతి మీద ఉంచి, రాతి తో దంచి రసం తీసి దాన్ని కొయ్య తో తయారైన "గ్రహం "అనే చిన్న పాత్రలో పోసి ఇంద్రాది దేవతల నుద్దేశించి హోమం చేస్తారు. హోమం చేయగా మిగిలిన రసాన్ని యజమానులు

తాగుతారు. సోమ లత అనే ఓషధిని రాతి తో కొట్టి రసం తీయటం పీడనమే కనుక పరిహారం కోసం "వసతీరా "అనే పుణ్య జలాన్ని స్పర్శించి దోషాన్ని పోగొట్టుకొంటారు.

ఇందులో ఒక ఉపాఖ్యానం సరదాగా ఉంటుంది. జంటగా ఉండే కొండ గుహల్లాంటి చీకట్లో నివశించే బలుడు అనే రాక్షసుడు దేవతలను విపరీతం గా పీడించేవాడు. వాళ్ళు బృహ స్పతి తో మొరపెట్టుకొంటే ఆయన "బల భిత్ "అనే యాగాన్ని చేసి వాడిని చీక ట్లోంచి వెలుగు లోకి రప్పించి ఆయుధాలతో చీల్చి చంపాడు. అంటే ఈ యాగం శత్రునాశన కారి అని తెలుస్తోంది. అన్న సమృద్ధి ద్ధికోసం విరాట అనే యాగాన్ని, స్వారాట్ వల్ల స్వారాజ్యాన్ని అంటే తనకు తాను ప్రకాశించేలోకంపొందాలి, వృషభ యాగం చేసి దేవ శ్రేష్టుడైనాడు ఇంద్రుడు వృషభం శ్రేష్టత్వానికి సూచిక. పదమూడు నుండి వెయ్యేళ్ళ వరకు చేసే యాగాన్ని సత్రం అంటారు. "గవా మయనం"అనేది అయన క్రతువులకు వికృతి. ఏడాదిపాటు చేస్తారు. ఇది చేస్తే స్వర్గం శత్రు విజయం, వాక్పటుత్వం మొదలైనవి. పరమాత్మ సమర్పణ బుద్ధితో చేస్తే మోక్షం లభిస్తుందని ఈ బ్రాహ్మణం తెలియ జేస్తోంది.

ఇతర సామ వేద బ్రాహ్మణాల కంటే తలవికారం అతి పెద్దది. కాని ఇది సస్వరం గా లభించలేదు. దీని వ్యాఖ్యానం, ప్రయోగ పద్ధతి, శ్రౌత సూత్రం కాని దొరక్క పోవటం దురదృష్టం. ఉపాఖ్యానాలలో ప్రసిద్ధ రాజుల, ఆచార్యుల పేర్లు కని పిస్తాయి. జనకుని సమకాలిక రాజు లెందరినో ఇది ప్రస్తావించింది. వీరిలో చితుడు, దాల్భ్య వంశ మూల పురుషుడు దర్భ్యుడు, కేశి దార్భ్యుడు, సుత్వా యాజన సేనుడు, ఉపాకపి, ఖార్గాలీ, సుదక్షిణ క్లైమి,బ్రహ్మ దత్త ప్రసేన జిత్తులున్నారు. చెట్లు, చేమలు లేక పోతే ప్రాణి మనుగడ అసాధ్యం అని ఈ బ్రాహ్మణం చెప్పింది. ఓషధులు వనస్పతులు లేక పోతే భూమి ప్రాణ నివాసా యోగ్యం కాదని గరుడుడు స్వర్గం నుంచి సోమలతను తెచ్చి భూమిపై పిండాడు. ఆ రస బిందువులు పడిన చోట్లలో తాబేలు వీపులాగా కఠినం గా ఉన్న బోడి గా ఉన్న భూమి మీద ఓషధ వనస్పతులు పుట్టాయట. వీటివల్లనే భూమి నివాస యోగ్యమైంది.

వాయువు అంతరిక్షం లో ప్రకాశిస్తుందని, శక్తి వంతమైన అణువులతో నిండిన అయస్కాంత క్షేత్రం చేత ఆకర్షింప బడి అడ్డం గా వీస్తుందని, ఉత్తరాభిముఖం గానే ఈ వాయువు వీస్తుందని, తెల్లగా ప్రకాశించే రూపం తో ఉంటుందని, ఈ వాయువే అంత రిక్షాధిపతి అని ఈ బ్రాహ్మణం చెప్పింది. అంతరిక్షం లో శక్తి పూరిత అణువులుంటాయి ప్రాణం నుంచి జలం నుంచి, అగ్ని నుంచి ఇవి పుట్టి ప్రకాశిస్తాయని చెప్పింది ఇవే. ఈ బ్రాహ్మణం లో "పశు "శబ్దం చేత పేర్కొన బడ్డాయి. వర్షం కోసం దుందుభి అనే వాయిద్యాలను మోగించాలని చెప్పింది. యాజ్ఞిక, చారిత్రిక, భాషా ప్రయోగ దృష్టిలో తలవికార బ్రాహ్మణం ఎన్నో విశిష్టతలను ప్రదర్శించింది

"ఏష వై శశః య ఏషో న్తశ్చంద్రమసి "అని చెప్పింది అంటే చంద్రునిలో కన బడే మచ్చ కుందేలే అని కవితా పరం గా చెప్పింది. వీణకు ఒకప్పుడు నూరు తీగాలుండేవని "వాణంశత తంత్రి మాహరాంతి "అనే వాక్యం వలన తెలుస్తోంది.. గర్భస్థ శిశువుకు అడ లేక మగ లక్షణాలు అయిదవ మాసంలో ఏర్పడతాయని "తస్మాత్ పంచమే మాసి గర్భా విక్రియన్తే "అన్నదాని ద్వారా తెలుస్తోంది.

దేవతలకు రాక్షసులకు తాగాదాలు మామూలే కాని ఇందులో దేవతలకు ఋషులకు తగాదాలున్నట్లు చెప్ప బడింది. మనువుపుత్రుడు శార్యావతుడు అనే రుషి యజ్ఞం చేశాడు. భ్రుగు వంశానికి చెందిన చ్యవన మహర్షి సోమ పాత్రను అశ్వినీ దేవతల కోసం హోమం చేయటానికి చేతిలోకి తీసుకొన్నాడు. ఇంద్రుడు మహర్షికి తెలియకుండా ఆ పాత్రను దొంగిలించుకు పారిపోయాడు. ఈ పని చేసింది ఇంద్రుడే అని తెలిసి చ్యవనుడు ఇంద్రుడిని కొట్టాడు. దేవతలకు కోపమొచ్చింది. రుషులకూశువాళ్ళ పై కోపం ఏర్పడింది. దేవతల యజ్ఞాలను ఋషులు ఋషుల యజ్ఞాలను దేవతలు పాడు చేయటానికి సిద్ధ పడ్డారు. ఋషులు దేవతలను ఎదుర్కొని ఓడించటానికి "మదం "అనే పేరుగల రాక్షసుడిని పుట్టించారని ఈ బ్రాహ్మణం కొత్త విషయం తెలియ జేసింది.

## తాండ్య బ్రాహ్మణం

సామ వేదం లోని "కౌదుమ శాఖ "కు చెందినదే తాండ్య బ్రాహ్మణం. దీనిలో ఇరవై అయిదు అధ్యాలున్డటం చేత పంచ వింశ బ్రాహ్మణమనీ పేరుంది. తండి మహర్షి దీనికి ప్రవర్తకుడు కనుక ఆపేరొచ్చింది. చివరి రెండు ఖండికలను "అద్భుత బ్రాహ్మణం "అంటారు. తాండ్యానికి అద్వితీయ స్థానం ఉంది. 180యాగాల నిర్వహణ వివారా లిందులో ఉన్నాయి. కురుక్షేత్రానికి దూరం గా ఇది వర్ధిల్లిందని భావన. క్రీ పూ.ఎనిమిదవ శతాబ్దికి చెందినదిగా భావిస్తున్నారు. యజ్న యాగాది విషయాలు వివరిస్తూనే మధ్యలో అనేక లౌకిక విషయాలను ఈ బ్రాహ్మణం చెప్పింది. విద్యా సంపన్నుడైన అతిధి ఇంటికి వచ్చి భోజనం చేస్తున్నప్పుడు ఎవరూ కూడా మనసు నొప్పించే మాట మాట్లాడకూడదు. అతిధి మనసుకు నొప్పికలిగితే ఆతిధ్యం వ్యర్ధమౌతుందని తెలిపింది. కర్మకాండకు, దార్మికతకు బాగా తోడ్పడింది.



సత్ర యాగాలు రెండు రకాలు. పన్నెండు నుంచి వంద రోజులు చేసేయాగానికి రాత్రి సత్రమని, వంద రోజులు దాటిన దాన్ని అయన సత్రమనీ అంటారు. గీత బద్ధం గా ఋక్కులను గానం చేస్తే స్తోత్రమని, గీత రహిత రుక్కుల్ని "శస్త్రమని "అంటారు. సామ వేదాధ్యాయి అయిన ఉద్గాత స్తోత్రం చేస్తాడు. రుగ్వేదాధ్యేత అయిన హోత మంత్రోచ్చారణ చేస్తాడు, సామ వేదం నేర్చిన ఉద్గాత ఋక్కులను గానం చేస్తే స్తోత్రం అవుతుంది. సామగానానికి ఉద్గాత, స్తోత, ప్రతి హర్త, సుబ్రహ్మణ్యుడు అనే నలుగురు ఋత్విక్కులుంటారు. మూడు ఉరుక్కులకు ఒక సామ గానం చేయాలి. ఇవి ఇరవై, లేక ఇరవై ఎనిమిది ఆవ్రుత్తులుగా ఉంటాయి. ఈ సంఖ్యలకే స్తోమం అని పేరు. గానం చేయాల్సిన మంత్రాలను క్రమ పద్ధతిలో ఏర్పాటు చేయటాన్ని "విష్టుతి "అంటారు. ఇష్టి, పశు యాగాలలో సోమ యాగం ఒక భాగం గా ఉంటుంది సోమయాగం రుక్, యజు సామ వేదాల ననుసరించే చేయాలి. వసంత రుతువులోనే సామయాగాన్ని నిర్వ హించాలి. పది పదిహేనవ అధ్యాయాల మధ్య పన్నెండు రోజులు చేసే "వ్యూఢ ద్వాదశాహం "అనే యాగం చెప్పా బడింది. కొన్ని యాగాలలో యజమాని మూడు రోజులు అడవిలో నివశించాలి. సర్వ సత్ర యాగం ఏడాది పాటు చేయాలి.

తాండ్య బ్రాహ్మణ శైలి ప్రాచీనమైనది. కల్ప సూత్ర శైలిలో ఇది ఉంటుంది. సామ వేదం బ్రాహ్మణాలు రెండు ఒకటి తాండ్య శాఖ రెండోది తలవర శాఖ. సరస్వతీ, ద్రుషద్వతి నదుల మధ్య ఈ యాగాలు చేశారు వ్రాత్య సోమాలు అనే యాగాల ద్వారా బ్రాహ్మణులు కాని ఆర్యులు ప్రాయశ్చిత్తం చేసుకొని బ్రాహ్మణ సంఘం లో ప్రవేశించటాన్ని ఈ బ్రాహ్మణం తెల్పింది. నైమిశారణ్యం లో ఋషులు అనేక యాగాలు చేశారు. ఇక్కడ "సుదామ "అనే నది ఉన్నట్లు చెప్ప బడింది. జనకుడి ప్రస్తావన ఇందులో కని పించదు, దీని చివరలో "అతి రాత్రం ప్రజా పతేహ్ సహస్ర సంవత్సరః "అంటే వెయ్యేళ్ళు అతి రాత్రం అనే సత్ర యాగాన్ని చేస్తే ప్రజాపతికి మళ్ళీ ప్రజా సృష్టి చేసే శక్తి ఏర్పడుతుంది అని అర్ధం.

సామిత్ర సామ గొప్ప తనాన్ని చెప్పే కద ఒకటి ఉంది. దీర్ఘ జిహ్వ అనే రాక్షసి చరువు, పురోడాశాడులను తన నాలుక తో నాకేస్తూ యజ్ఞాన్ని పాడు చేసింది. ఇంద్రుడు దాన్ని ఏ విధం గానూ చంప లేక పోయాడు. సుమిత్రుడు అనే కుత్స మహర్షి సహకారాన్ని కోరాడు. సంస్కార వంతమైన యాగా శాలలో ఆమెను మాయ చేసి వశం చేసుకొని ఇంద్రుడితో సామసాయం తో ఆ రాక్షసిని చంపించాడు. అందుకే దీనికి "సామిత్ర సామ "అనే పేరొచ్చింది.

కాలేయం అని ఇంకొక సామ ఉంది. లోకాధి పత్యం సురాసురులు పోటీ పడ్డారు దేవతలు తండ్రి ప్రజాపతి తో మొర పెట్టుకొన్నారు. వారికి సామాను ఉపదేశించి అసుర బాధ నుండి విముక్తులవమని ఉపదేశించాడు "ఏతే వైతాన్ కాలయిష్యధ్వం "అనటం వలన కాలేయం అనే పేరొచ్చింది. కలి అనే రుషి దర్శించాడుకనుక కాలేయం అనీ అంటారు. శ్వానాశ్వుడు సత్ర యాగం చేస్తుంటే కొందరు యాజ్ఞికులు క్రోధం తో అతడిని నీళ్ళు లేని మరు భూమికి తీసికెళ్ళి వదిలేశారు. అప్పుడు ఆయన వర్షం కోసం ఈ సామాను కను గోన్నాడు. దీన్ని గానం చేయగానే అక్కడ వర్షం పడి పంటలు బాగా పండాయి. మరుభూమిని సస్య శ్యామలం చేసి మళ్ళీ యజ్న భూమికి చేరాడు. దోవ తప్పిన వాడు ఈ సామాన్ని గానం చేస్తే మళ్ళీ గుర్తించగలడు అని సారాంశం.

కవి అంటే శుక్రాచార్యుడు. ఆయన దర్శించిన సామ ను "కావం "అంటారు. ఉశనా అన్నా శుక్రుడే కనుక ఇంకో సామకు "ఔశనం "అని పేరొచ్చింది. బ్రహ్మ అన్ని యజ్ఞాలను ఈ సామ చేత సృష్టించాడట. పూర్వం దేవతలు వేదరాశిని తమలో తాము పంచుకోగా బ్రహ్మ కొచ్చిన భాగమే పెద్దదిగా ఉందట. దీన్ని యజ్ఞా యజ్నీయం అంటారు. ఎద్దు మూత్రం పోసినప్పుడు ఎలా వంకర టింకర గా పోస్తుందో సామాన్నికూడా

అలా మెలికలు గా గానం చేయాలి. దేవతలు అగ్నిని ముందు పెట్టుకొని అశ్వం తో శత్రువులను ముట్టడించేట ప్పుడు చేసిన సామగానాన్ని "సాకమశ్వం "అన్నారు. సాకం అంటే "కూడా "అని అర్ధం.

చర్మ రోగాలను కూడా సామ గానం వల్లపోగొట్టుకోవచ్చునని ఈ బ్రాహ్మణం తెలియ జేసింది. ఆంగిరస్సు కుమార్తె "ఆకూ పార"కు చర్మమంతా ఉడుము చర్మం లాగా గట్టి ఆ మారింది. ఆమె ఇంద్రుని ప్రార్ధించి తే దోషాన్ని పోగొట్టాడు. ఎలాంటి కోరికతో నైనా ఈ సామాన్ని గానం చేస్తే వారికి ఆకోరికలు సిద్ధిస్తాయి అని "ఆకూ పార "అనే సామ బోధిస్తోంది. బ్రాహ్మణులేకాకుండా క్షత్రియులు కూడా కొన్ని సామలను దర్శించారు.. ఆర్శభ సామ 'అనేది క్షత్రియ సామ. విశ్వామిత్రకుమారుడు ఋషభుడు పుట్టే వరకు మహర్షి క్షత్రియుడుగానే ఉన్నాడు. అందుకే అది క్షాత్ర సామ అయింది "బ్రాహ్మణా చ్చంసి సామ"అని అందుకే అన్నారు.

బ్రాహ్మనాలలో విధించ బడిన శస్త్రాలు అంటే స్తోత్రాలు బ్రాహ్మణాలుగానే పిలువ బడుతున్నాయి. వీటిని పఠించే ఋత్విక్కు "బ్రాహ్మనాచ్చంసి ".స్తుతులు రెండు రకాలు ఒకటి స్తోత్రాలు రెండు శస్త్రాలు. గానం తో చేయబడిన మంత్రం స్తోత్రం. గానం లేని మంత్రం శస్త్రం..పురుషులే కాదు స్త్రీలు కూడా మంత్రం ద్రస్టలుగా ఉన్నట్లు ఈ బ్రాహ్మణం తెలిపింది. "త్వాస్టీసామ "అనేది త్వష్ట కుమార్తెలైన త్వాస్త్రులు ఇంద్రుడికి కంటి రోగం వలన నిద్ర పట్టక పోతే ఈ సామ గానం చేసి చంటి బిడ్డను జోల పాడినట్లు పాడి నిద్ర పుచ్చారట. "ఔర్నాయణం "అనే సామ లో పూర్వం అంగి రసులు సత్ర యాగం చేస్తే స్వర్గాన్ని పొందినా దేవా యాన మార్గం గోచరించ లేదు. వాళ్ళలో కళ్యాణుడు అనే అంగిరసుడు అంత రిక్షం లోకి వెళ్లి "ఊర్నాయువు "అనే గంధర్వుడిని ప్రార్దిస్తే ఆయన మార్గాని తెలియ జేసి "ఊర్నాయువు నాకు దాన్ని చెప్పాడు. నేనే తెలుసుకొన్నాను అని అబద్ధం చెప్పద్దు. "అని చెప్పాడు కాని ఇతడు అబద్ధంఆడి మాట తప్పిజ్ఞానం నశించి కుష్టు రోగి అయ్యాడు. ఊర్నాయు సామకు అంతటి శక్తి ఉందని తెలుస్తోంది. ఇక్కడ దర్శనం అంటే కనుక్కోవటమే కాని రాయటం కాదని గ్రహించాలి.

ఋత్విక్కులు మర్చి పోతే ప్రక్క వాడు జ్ఞాపకం చేయ రాదు. ప్రజా పతిని అతిధిగా పిల్చి చరువు,పురోడాశం తో సంతృప్తి పరచేటప్పుడు కూడా మధ్యలో మర్చిపోయిన కర్మ ను గుర్తు చేయ రాదు.

## ఛాందోగ్య బ్రాహ్మణం

ఛాందోగ్య బ్రాహ్మణం సామ వేదానికి గలకౌదుమ శాఖకు చెందింది. మంత్రం బ్రాహ్మణం అనీ పిలుస్తారు. చతుర్వేదాల్లోను, బ్రాహ్మణాలలోను ఉన్న మంత్రాలు కొన్ని ఇందులో ఉన్నాయి. ఇందులో యజ్న యాగాది ప్రస్తావనే లేకపోవటం విశేషం. మానవ జీవితం లో ఆచరించాల్సిన సంస్కారాలకు సంబంధిన మంత్రాలు ఉన్నాయి, గృహ్య సూత్రాలకు ఇది మార్గ దర్శి. ఇందులోని చివరి ఎనిమిది ప్రపాఠకాలను "ఛాందోగ్య ఉపనిషత్ "అంటారు.



ఈ బ్రాహ్మణం లో రెండు ప్రపాఠకాలు, ఒక్కొక్క టి ఎనిమిది ఖండాలుగా ఉన్నాయి మొదటి దానిలో 136,రెండవ దానిలో 121మంత్రాలున్నాయి. ఎనిమిదవ శాతబ్దికి చెందినది. దీనికి గుణ విష్ణువు "ఛాందోగ్య మంత్రం భాష్యం ",సాయనాచార్యుడు "వేదార్ధ ప్రకాశిక "పేర్ల తో వ్యాఖ్యానాలున్నాయి. ఈ బ్రాహ్మణం వివాహం, గర్భాదానం, సీమంతం మొదలైన గృహ కర్మలకు ప్రాధాన్యమిచ్చింది. కనుక మిగిలిన వాటికంటే ప్రత్యేకతను పొందింది. వివాహ సమయం లో వరుడు వధువుతో "నీ హృదయం అంటే ఇనీ అభీష్టం నాది కావాలి. నా హృదయం నీదికావాలి. మనిద్దరి ఆలోచనలు అభిలాషలు ఒకటికావాలి "అని అంటాడు ఇది ఏంతో ఉదాత్త విషయం. వివాహ ప్రయోజనం, గృహస్తాశ్రమ వాసం బాగా వివరింప బడింది. కుటుంబం లో స్త్రీ మకుటం లేని మహా రాణి కుటుంబ గౌరవ ప్రతిష్టలు ఆమె మూలం గా నే వృద్ధి చెందుతాయి అని చెప్పబడి ఉండటం తో అ నాడు స్త్రీకి ఉన్న అధిక ప్రాధాన్యం తెలుస్తోంది. వరుడు "అత్త వారింట్లో అత్త మామ ఆడ బిడ్డలు బావలు బావ మరదులు మొదలైన వారందరిని ప్రేమాను బంధాలతో బాగా చూస్తూ ఇంటికి దీపం లాగ యజమానురాలు లాగా ఉండు "అని వధువుతో అంటాడు మహిళామతల్లి బాధ్యతలను బాగా గుర్తు చేసిన బ్రాహ్మణం. సమాజం లో స్త్రీకి అత్యంత ఉన్నత స్తానాన్నిచ్చిన బ్రాహ్మణం ఇది.

దంపతులు కలిసి మెలిసి జీవిస్తే స్వర్గం అని చెప్పింది. ఇంట్లో పశువులు, బిడ్డలు, అపారమైన దనం ఉంటె కాపురం పాడి పంటలతో కళకళ లాడుతుందని, సతీపతుల హృదయాలు ఏకమై అన్యోన్యం గా ఉంటె సంసార రధం చక్కగా సాగుతుందని చెప్ప బడింది. వివాహం తర్వాత వరుడి ఇంట్లో గృహ ప్రవేశం జరిగినప్పుడు ఒకే శయ్యపై నూతన దంపతులను కూర్చోబెట్టినప్పుడు వరుడు వధువుతో "ఈ ఇంట్లో ధైర్య సాహసాలతో ఉండు. ఇక్కడే నాతో సుఖించు. నీకు, నీ బంధువర్గానికి నాపై ప్రసన్న భావం ఏర్పడేలా ప్రవర్తించు. నాతో అనురాగం తో మెలగు "అంటాడు. మగ పిల్లలే ఎక్కువగా పుట్టాలని కోరుకొంటాడు.

గ్రామాంతరం వెళ్లి వచ్చిన తండ్రి కొడుకు శిరస్సును తాకుతూ "అంగా దంగా త్సం స్రవసి" అనే మంత్రం చదివి దీర్ఘాయుస్సు తో జీవించమని ఆశీర్వ దిస్తాడు. పుత్రుడు ధ్రుఢం గా, తీక్షణం గా సువర్ణంలా తేజస్వీశ గా నూరేండ్లు వర్ధిల్లాలని తండ్రి ఆకాంక్ష. పిల్లాడి మూడో ఏడులో "చూడాకరణం "చేయాలి. దీన్ని చేసే మంగలిని "సావిత్రు దేవత "గా భావించాలి "ఆయమగాత్ సవితా క్షురేణ"అనే మంత్రం వల్లఇది తెలుస్తోంది అంటే పనిలో దేవుణ్ణి చూసే విధానం ఇందులో కానీ పిస్తుంది.. క్షురకర్మ దీర్ఘాయుష్యానికి దోహదమని చెప్పింది. ఉపనయనానికి ముందు వటువు అగ్ని వాయు సూర్య, చంద్ర ఇంద్రులనుద్దేశించి హోమం చేయాలి. ఆ దేవతలను పేరు పేరునా పిలిచి ""దేవతలారా !ఉపనయనం అనే కర్మను అనుస్టింస్తిచ బోతున్నాను. ఈ సంగతి మీకు మనవి చేస్తున్నాను. మీ అనుజ్న తో దీన్ని సుఖం గా చేయగలను. ఇలా చేసి విద్యాభ్యాసం మొదలైన వాటిల్లో సమృద్ధిని సాధిస్తాను. అసత్యాన్ని వదిలి సత్యాన్ని ఆశ్రయిస్తాను "అని అంటాడు

చదువుల్లో నైపుణ్యం, సత్య వ్రత పాలన ఉపనయనానికి ముఖ్య ప్రయోజనాలని తెలియ జెప్పింది. బ్రహ్మ చారి అగ్ని కార్యం, గురు శుశ్రూషస మొదలైనవి చేయాలని,పగలు నిద్ర పోరాదని ఈ బ్రాహ్మణం నిర్దేశిస్తోంది. మేఖలా బంధం (నడుం చుట్టూ త్రాడు )చేస్తారు దీని వలన పవిత్రత, బల వృద్ధి తపో వృద్ధి శత్రు రక్షణ లభిస్తాయి. దీని తర్వాతా శిష్యుడు ఆచార్యుని దగ్గర కూర్చుని తనకోసం అధ్యయనం ప్రారంభించమని వేడుకొంటాడు. ఇలా అధ్యయనం కోసం గురువు చెంతాకు చేరటమే ఉపనయనానికి అర్ధం. గురువు శిష్యునితో మొదటగా గాయత్రీ మంత్రాన్ని చది వించటం తో వేదాధ్యయనం ప్రారంభ మౌతుంది. గానం చేసే వాడిని రక్షిస్తుంది కనుక "గాయత్రి "అయింది.

పశు క్షేమం, స్వేచ్చామరణం, దారిద్ర్య నిర్మూలనం, కీర్తి అభి వృద్ధి, శుభ ప్రాప్తి, ఈశ్వర ప్రసాదం, పుణ్య లాభం వృత్తిలో నిరాటంకం, విష నివారణం, క్రిమి నాశనం మొదలైన ఎన్నో ప్రయోజనాల గురించి వివరించింది. వంకరగా నడిచేవి, రెండు తలలున్నవి, తెల్లవి మొదలైన క్రిముల వర్ణన ఉంది. ఆచార్యుడు, ఋత్విక్కు, స్నాతకుడు, రాజు, వివాహం చేయ దగిన వాడు, అతిధి లను సత్కరించాలి. ఈ బ్రాహ్మణం ఆ నాటి సాంఘిక వ్యవస్థకు ప్రతీక మాత్రమె కాదు నేటి సామాజికానికి మార్గ దర్శనం కూడా. స్రౌత, గృహ్య, ధర్మ సూత్రాలను సంస్కృత వాఙ్మయం లో "కల్ప సూత్రాలు "అని మహర్షులేపేరు పెట్టారు. బ్రాహ్మణాలలో ఉన్న మంత్రాలను గ్రహించి వివాహాది కార్య క్రమాలకు గృహ్య సూత్రాలను ఏర్పాటు చేశారు

స్త్రీ పురుషుల సంగమమే వివాహం. సంతానానికి కామ మూలకం. కామం సురా మూలకం.. కనుక పెళ్లి చేసుకొనేకన్యను సుర తో అభిషేకించాలి అని చెప్పారు. ఇదిప్పుడు పాటించటం లేదు. కన్య యొక్క ఉపస్థ ఇంద్రియాన్ని "ఆనందేన్ద్రియం "అని బ్రహ్మ దేవుని రెండవ ముఖమని వర్ణించారు. బ్రహ్మ ఒక ముఖం తో వేదాలు చదువుతూ రెండో ముఖం తో సంతానోత్పత్తి చేస్తాడట. ఈ ఇంద్రియం ద్వారానే స్త్రీలు పురుషుల్ని వశ పరచుకొంటారు. అందుకే అధికారిణులవుతున్నారని చెప్ప బడింది. పురుషుడు స్త్రీ యోని లో రేతస్సు అనే ఆజ్యాన్ని ఉంచటం వల్లనే సంతానం కలుగుతుంది అని యజ్ఞ భాషలో చెప్పారు. కన్యలు ధరించేనూతన వస్త్రాలను స్త్రీలే నేయాలి. కొత్త బట్టలు కట్టిన వధువును భర్త నూరేళ్ళు కాంతిమంతం గా, ధనవంతురాలుగా జీవించమని ఆశీర్వ దిస్తాడు. పెళ్ళిలో గుండ్రాయిని తోక్కించటం లో విశేషం ఉంది. ఆ రాయిలాగా వధువు స్తిరం గా ఉండిశత్రు బాధ లేకుండా చేసుకోమని సూచన. వధువు తన జ్ఞాతి వర్గాన్ని వృద్ధి పొందించాలని భర్త దీర్ఘాయుస్సు తో ఉండాలని పేలాల తో అంటే లాజ లతో హోమం చేస్తుంది. సప్త పది లో అన్యోన్యాను రాగం పెరుగుతుంది బలిని అణచిన విష్ణువును ప్రార్ధించి అగ్ని హోత్రం చుట్టూ ఏడడుగులు నడిపిస్తారు. అన్న సమృద్ధికోసం మొదటి అడుగు, బలం కోసం రెండవది, యజ్ఞం కోసం మూడోది, సౌఖ్యం కోసం నాల్గవది,పశు సంపదకోసం అయిదవది, పుష్టికోసం ఆరవది, సప్త హోమ సాధ్య సోమ యాగం కోసం ఏడవ అడుగు వేయిస్తారు.

"ఏక మిషె విశ్నుస్త్వా నయతుహ –ద్వే ఊర్జేస్త్వా నయతు –త్రీణివ్రతాయ విష్ణుస్త్వా నయతు చత్వారి మాయో భవాయ విష్ణుస్త్వా నయతు – పంచ పశుభ్యో విష్ణుస్త్వా నయతు –షడ్ రాయ స్పోషాయ విష్ణుస్వా నయతు –సప్త సప్తభ్యో హోత్రాభ్యో విష్ణు స్త్వా నయతు "

పెళ్లి లో పాణిగ్రహణం ముఖ్యమైంది. దీనితో వధువుకు అత్తమామలు ఆడ బడుచులు, మరుదుల మీద అధికారం వస్తుంది. సర్వాధికారి అయి తనకూ బంధువులకూ భర్తకూ సంతృప్తిని ఆనందాన్ని కలిగించాలని భావన. కనుక గృహస్తాశ్రమ ధర్మాలేన్నిటినో ఈ బ్రాహ్మణం తెలియ జేసి మార్గ దర్శనం చేసింది. ఇది సామ వేదానికే చెందినా చాలా సూక్తాలు యజుర్వేదం నుండి గ్రహింప బడ్డాయి. నిత్య కర్మ చేసేవారికి ఇది కరదీపిక.

## ఉప బ్రాహ్మణాలు

సామ వేదానికి ఉన్న తలవ కార, తాండ్య బ్రాహ్మణాలలో యజ్ఞ యాగాదులను గురించి చెప్పారు. చాన్దోగ్యం వీటి గురించి చెప్పక పోయినా వివాహాది సంస్కారాలగురించి చెప్పింది. మిగిలినవి పేరుకు బ్రాహ్మణాలేకాని అవీ యజ్ఞ యాగాదులను గురించి చెప్పలేదు అందుకని వాటిని ఉప బ్రాహ్మణాలు అన్నారు. అవే సామ విధాన బ్రాహ్మణం, దేవతాధ్యాయ బ్రాహ్మణం, సంహితోపషత్ బ్రాహ్మణం, వంశ బ్రాహ్మణం. మొదటి దానిలో వచ్చే జన్మ లో శాశ్వత సుఖ ప్రాప్తికోసం కృషి చేయాలని, ఈలోకం లో దుఖాలతో బాధ పడరాదని ధర్మాన్ని అతిక్రమించకుండా ప్రయత్నించాలని, ఏకోరిక తీరాలో ఆకోరికకు సామలు కూడా చెప్ప బడ్డాయి.

రెండవ దానిలో ఏ సామకు ఎవరు దేవత, అది దేవతలో, చెప్పారుకనుక "దైవత బ్రాహ్మణం "అయింది. గానం చివర విని పించే ధ్వనిని బట్టి సామలను కని పెట్టి, వాటి దేవతలను చెప్పింది. అనేక రాకాల ఛందస్సులు, రంగులు, దేవతలు పేర్కొన బడ్డారు. ప్రతీకను ఉపాసించే విధానాలకు బీజం ఇందులో ఏర్పడి నట్లు భావించాలి. మూడవ దాని లో మంత్రం సముదాయాన్ని సంహిత అంటారని మనకు తెలుసు. కాని ఇందులో సంహిత అంటే గానం అని అర్ధంఅని గ్రహించాలి సామ వేదం లో రుక్కులే గానం చేయబడి సామలు అని పిలువ బడ్డాయని మనం చెప్పుకొన్నాం. ఉపనిషత్ అంటే ఇక్కడ "రహస్యం" అని అర్ధం. సామ గానం లో ఉండే విశేషాలను రహస్యాలను తెలియ జేసేదికనుక "సంహితోపని షత్ బ్రాహ్మణం అని అన్నారు. నాల్గవ ఉప బ్రాహ్మణమే వంశ బ్రాహ్మణం. వేదాధ్యయనం గురు శిష్య పరంపరగా రావాలని సామల గానం గురువు అనుగ్రహం వలననే పొందాలని, ఇలా ఈ పరంపరను కాపాడుకొస్తున్న మహర్షుల వివరాలను ఈ బ్రాహ్మణం తెలియ జేసింది. అందుకే వంశ బ్రాహ్మణం అయింది. ఈ నాలుగు ఉప బ్రాహ్మణాలు కురుక్షేత్ర తూర్పు భాగం లో క్రీ పూ అయిదవ శతాబ్ది లో ఏర్పడ్డాయని భావిస్తారు.

మొదటిది అయిన సామ విధాన బ్రాహ్మణానికి సాయనుడు "వేదార్ధ ప్రకాశిక "అనే భాష్యం రాస్తే "పదార్ధ మాత్ర వివృతి" అనే భాష్యాన్ని భారత స్వామి చెప్పాడు. ఈయన సామ సంహితకూ భాష్యం రాశాడు. హోసల రాజు రామ నాథుడి పాలనలో శ్రీ రంగం లో సామ సంహితకు భాష్యం రాసి నట్లు తెలుస్తోంది. తరువాతే ఈ బ్రాహ్మణానికి వ్యాఖ్య రాసి ఉంటాడు. రెండవది అయిన దేవతాధ్యాయ బ్రాహ్మణానికి వ్యాఖ్య అవసరమే లేదు. అయినా సాయనుడు భాష్యం రాసినట్లు చెప్తున్నారు. మూడవది అయిన సంహితో పని షత్ బ్రాహ్మణం మొదటిఖండం వరకు సాయణ భాష్యం తో దొరుకుతోంది. చివరిదైన వంశ బ్రాహ్మణానికి సాయన భాష్యం దొరుకు తోంది. ఈ నాలుగింటిలోని విశేషాలను ఇప్పుడు తెలుసుకొందాం

ఆడ పిల్లను మనకు నచ్చిన వాడికి ఇచ్చి పెళ్లి చేయాలనీ చెప్పింది మొదటి బ్రాహ్మణం. దీనికి ఒక మార్గమూ సూచించింది పిల్ల తండ్రి అమా వాస్య రాత్రి నాలుగు దారుల కూడలి లో అమ్మాయిని కూర్చో బెట్టి "ఏ హ్యాషు బ్రవాణితే " అనే సామ ను మూడు సార్లు అభిషేకం చేయాలి. ఇలా మూడు అమావాస్యల్లో మూడు సార్లు చేస్తే పిల్లకు ఇష్టమైన వాడితో పెళ్లి అవుతుంది అని కిటుకు చెప్పింది.

రెండవ దానిలో ఛందస్సుకు సంబంధించ ఎన్నో వివరాలున్నాయి. వేదం, సావిత్రీ దేవి, సత్యం నన్ను కాపాడు గాక అని "బ్రహ్మ సత్యం చ పాతు మాం "అనే సామ చాలా ప్రాముఖ్యమైనది. అంటే జ్ఞానం సావిత్రీ దేవి శాశ్వత సత్యం మనల్ని ఎప్పుడూ కాపాడాలని అర్ధం. నాల్గవ బ్రాహ్మణం లో సామ గానం చేసే వాళ్ళకు, సామగాన విశేషాలు తెలుసుకోవాలను కొనే వారికి చింతామణి లాంటిది. యోగ్యుడైన శిష్యుడు దొరక్క పోతే గురువు విద్యనూ తన దగ్గరే ఉంచుకోవాలని అయోగ్యుని చేతిలో ఉంచరాదని చెప్పింది. నాల్గవ దానిలో సామ గాన మహర్షుల పూర్తీ వివరాల తో బాటు, వంశ క్రమం, చెప్పి ఏ సందేహం వచ్చినా తీర్చే విధం గా ఉంది,

## సామం గొప్పతనం

సామ విధన బ్రాహ్మణం లో సామ యొక్క గొప్ప తనం చెప్ప బడింది. మొదట బ్రహ్మం అనే పదార్ధం మాత్రమె ఉంది. దాని నుంచి హిరణ్య గర్భుడు ఉదయించాడు. ఆయన మనసు లో నుంచి ప్రజా పతి ఉద్భ వించాడు. ప్రజాపతి అంటే మనస్సు. అతడు చరాచర సృష్టిని చేశాడు. తన సృష్టికి సామ ను జీవన సారం గా ఇచ్చాడు. సప్త స్వరాలతో కూడిన సామమే దేవతలకు, పితరులకు, మానవ, పశు పక్ష్యాడులకు జీవనోపాయం కనుక సామను "అన్నం "అని అన్నారు. సామ స్వరూపం వాక్కు. వాక్కు రూపమే రుక్కు. సమానం కనుక సామ అయింది. అంటే అనేక రకాల ఛందస్సులకు ఇది సమానం. సామ తత్వాన్ని తెలుసు కొంటె ఇహ లోకం లో ప్రతిష్ట పెరుగుతుంది. దీని అంతరార్ధం ఏమిటంటే -చక్కని గానమే సామం. దానికి సప్త స్వరాలు మూలం. భావంతో సాహిత్యాన్ని జోడించి గానం చేస్తే అమృతం లాగా ఆప్యాయం అవుతుంది. గానామృతం తో పరవశించని ప్రాణి సృష్టిలో లేదు. లోకానికి గాన ప్రాశస్త్యాన్ని ప్రసాదించింది భగ వంతుడే కనుక గానం యొక్క గొప్ప తనం ఇందులో తెలుప బడింది.

ఒకప్పుడు దేవతలు ప్రజాపతి చెప్పినట్లు యజ్న యాగాలు చేసి స్వర్గానికి వెళ్ళారు. అయితే దేవతలా కన్నా తక్కువైన అజులు,పృష్ణులు, మొదలైన ఋషులు, వైఖానసులు అనే మంత్రం ద్రష్టలు, మానవులు వెళ్లి తమకు స్వర్గం చేరే మార్గాన్ని చెప్పమని తమ తండ్రి ప్రజాపతి ని అడిగారు. "స్వాధ్యయనం "అంటే యజ్ఞాలలో విధింప బడ్డ సామలను గానం చేయటం, తపస్సు వల్లస్వర్గ ప్రాప్తి కలుగుతుందని చెప్పాడు. వీరందరూ సామాధ్యయనం చేసి స్వర్గం పొందారు.

## తపస్సు

శరీరాన్ని వేడెక్కించి ఇంద్రియాలను అదుపు లో ఉంచుకోవటానికి చేసే సాధనే తపస్సు. ఇందులో కృచ్చ్రం, అతి కృచ్రం, కృచ్చాతి కృచ్చ్రం అని మూడు రకాలున్నాయి. వీటిగురించి వివరాలు తరువాత తెలుసుకొందాం

తపస్సు అంటే ఇంద్రియాలను అదుపులో పెట్టుకొనే ముఖ్య సాధనం అని అందులో మూడు రకాలున్నాయని చెప్పుకొన్నాం. ఇప్పుడు వాటి వివరాలను తెలుసుకొందాం.

## కృచ్చ్రం

మూడు రోజులు పగటి పూట మాత్రమె సాత్వికాహారం తింటూ, తరువాత మూడు రోజులు రాత్రిమాత్రమే భోజనం చేస్తూ, మరో మూడు రోజులు ప్రయత్నం చేయకుండా దొరికిందే తింటూ, చివరి మూడు రోజులు పూర్తిగా ఉపవాసం చేయాలి. ఇలా పన్నెండు రోజులు దీక్షగా చేస్తూ, వెంటనే ఫలితం రావాలంటే పగలంతా నిల్చునే ఉండాలి. రాత్రిళ్ళు కూర్చునే ఉండాలి. సత్యం మాత్రమే మాట్లాడాలి. చెడు సాంగత్యం పనికి రాదు. "రౌరవం ","యౌదాజయం "అనే సామలను గానం చేస్తూ ఉండాలి. చివరికి దేవతా తర్పణం మొదలైనవి చేసి, దేవతలకు నైవేద్యం పెట్టి తినాలి. ఈ పన్నెండు రోజుల తపస్సును "కృచ్ఛ్రం "అంటారు.

## అతి కృచ్ఛ్రం

పైన చెప్పిన నియమాలన్నిటిని పాటిస్తూ, కుడి చేతిలో పట్టినంత అన్నాన్ని మాత్రమె రోజుకు ఒక సారి తినాలి. అదే అతి కృచ్ఛ్రం.

## కృచ్ఛ్రాతి కృచ్ఛ్రం

ఈ రెంటికి మించిన ఘోర తపస్సు. పన్నెండు రోజులూ నీటిలోనే ఉండాలి. మిగిలిన నియమాలన్నీ పై మాదిరే. ఈ మూడు తపస్సులు చేస్తే పాపాలు నశిస్తాయి

## ప్రాయశ్చిత్తాలు

.శాస్త్రం చెప్పినట్లు చేయక పోవటం, నిషేధించిన పనులు చేయటం, సమాజానికి హాని కలిగేవి చేయటం పాపాలు అని పించుకొంటాయి. పాపాలకు చేసే ప్రతీకారమే ప్రాయశ్చిత్తం. అనేక రకాల పాపాలకు వాటికి తగిన ప్రాయశ్చిత్త విధులున్నాయి. ఉదాహరణకు –అశ్లీలం లేక బూతు మాట్లాడితే "దధిక్రా వ్ణో అకార్షం "మొదలైన సామలను గానం చేయాలి. ఎవరినైనా దూషిస్తే ప్రాయశ్చిత్తం గా "ఇదం విశ్వుర్వి చక్రమే "సామను చదవాలి. తలిదండ్రులను గురువును దూషించిన పాపం పోవటానికి "తమాహం సోమ రారణ "సామ చదవాలి. ఇలా ఎన్నో ఉన్నాయి.

## కామ్య కర్మలు

ఆయుర్దాయం పెరగటానికి "తు చే తునాయ "మొదలైన సామలతో తెల్ల ఆవాలను మంత్రించి ప్రతి రోజూ తినాలి. చిన్న చిన్న రోగాలకు "శం నొ దేవీ రభీష్టయే "సామతో నేతిని మంత్రించి రోజూ శరీరానికి రాసుకోవాలి. సర్ప భయం లేకుండా చేసుకోవటానికి శంఖ పుష్పి, సర్ప గంధ లను నూరి గుళిక చేసి దగ్గరుంచుకొని "చర్శానీ ధ్రుతం " సామ తో మూడు సార్లు అగ్నిలో హోమం చేయాలి. అప్పుడు ఆ గుళికను మెడలో కట్టుకోవాలి. విషం తిన్నా హాని చేయకుండా ఉండటానికి "త్వమిమీ ఓషధీ "సామను రోజూ గానం చేయాలి. ముసలితనం మృత్యువు రాకుండా దుంపలు పండ్లూ తింటూ, జింక తోలు ధరించి మౌనం గా నెల రోజులు అడవిలో ఉండి పుష్య పూర్ణిమ నాడు "ఉద్వయంత మసస్పరి "అనే సామ తో సూర్యుడిని పూజించాలి. ఇలా నాలుగేళ్ళు చేస్తే జరా మ్రుత్యువులు దూరం.

## దేవతాధ్యయన బ్రాహ్మణం

అగ్ని, ఇంద్రుడు, ప్రజాపతి, సోముడు, వరుణుడు, త్వష్ట, అంగిరసుడు, పూషా, సరస్వతి, ఇంద్రాగ్నులు కలిసి పది మంది సామ గానానికి అది దేవతలు. కాలేయం రౌరవం మహోత్సవం మొదలైన సామలకు దేవత అగ్ని. వామ దేవ్యం, సామకు ప్రజాపతి దేవత. ఔశన కావం అనే సామకు సోముడు దేవత. యజ్న యజ్నీయం కు వరుణుడు,వార వంతీయం, ఆభీవర్తనం సామలకు త్వస్ట దేవతలు. స్వ ప్రుస్టా అనే సామకు అంగిరసుడు, కౌశీతం, దైవోదానం మొదలైన వాటికి పూషా దేవతలు. కొన్నిటికి సరస్వతి మరికొన్నిటికి ఇంద్రాగ్నులు దేవతలు. మిగిలిన సామలన్నిటికీ ఇంద్రుడే దేవత. వసువులు, రుద్రులు, ఆదిత్యులు విశ్వే దేవులు అనే నలుగురు సామ దేవతలు. ఇంద్రాగ్ని ప్రజాపతులు దేవతలు ఇంకా కుదిస్తే "బ్రహ్మ "ఒక్కడే సామ లన్నిటికీ దేవత

రుక్కు ను తల్లి అని, గానాన్ని తండ్రి అని, స్వరాన్ని ప్రజాపతి అంటారు. గాయత్రి అన్నా సావిత్రి అన్నా ఒక్కటే.

## సంహితో పనిషత్ బ్రాహ్మణం

సామ గాన రహస్యాలను తెలియ జెప్పేది ఈ బ్రాహ్మణం. అధ్యయనం గురు శిష్య సంబంధం, ధర్మ శాస్త్ర విషయాలు చెప్ప బడ్డాయి. మందరం మాధ్యమం తార అనే స్థాయీ భేదాన్ని బట్టి గానం మూడు రకాలు. వీటికి దేవ సంహిత, అసుర సంహిత, రుషి సంహిత మొదలైన సాంకేతిక పదాలనుప యోగించారు. ఆయా గాన ఫలితాలూ చెప్ప బడ్డాయి. గానం చేసేటప్పుడు మూల మంత్రాలలో వచ్చే మార్పులను అంటే ఉన్న అక్షరాలూ జారిపోవటం కొత్తవి చేరటం "హో, హోఇ.,తాఇ"మొదలైన విచిత్ర ధ్వనులు, ద్రుతం విలంబితం మొదలైన వృత్తులు, స్వర ప్రస్తార విషయాలు ఉన్నాయి. గాన ప్రభావం వలన మూల సాహిత్యం లో కలిగే అనేక మార్పులను సామ వేదమే నాంది పలికింది

స్వాధ్యయనం ఏరోజు మాన రాదనీ సామ జపం వలన యజ్ఞ యాగాలు చేసిన ఫలితం వస్తుందని ప్రోత్సహించింది.

## వంశ బ్రాహ్మణం

సామగాన ఋషుల పరంపర ఇందులో ఉంది. "బ్రహ్మకు, ఆచార్యులకు ఋషులకు సకల దేవతలకు నమస్కారం "అనే మాటతో ఇది ప్రారంభ మౌతుంది. మిత్ర వర్చాసుడు, బ్రహ్మ వృద్ధి, గిరి శర్మ, నిగడుడు, త్రాతుడు, రుద్ర భూతి మొదలైన అరవై మంది సామ గురువుల గురించి వారి గోత్రాల గురించి పేర్కొన బడింది. అందరికీ మొదటి గురువు "బ్రహ్మ "మాత్రమె అన్నారు.

## గోపద బ్రాహ్మణం

అధర్వ వేదానికి చెందిన బ్రాహ్మణమే గోపద బ్రాహ్మణం అయినా అధర్వ సంహిత కు సాక్షాత్తుగా సంబంధం లేదు. యజ్ఞ యాగాలతో బాటు ఇతరవిషయాలూ ఉన్నాయి. అధర్వ వేదం లో నిష్ణాతుడైన వాడే యజ్ఞాలలో బ్రహ్మ గా ఉండాలని ఇందులో చెప్ప బడింది. బ్రహ్మ విధులు, ప్రాముఖ్యాన్ని గూర్చి ఇతర బ్రాహ్మణాలు చెప్పలేదు. కర్మ లోపం వల్లజరిగే పాపాలకు ప్రాయశ్చిత్తం ఉన్నది. రుత్విక్కులలో బ్రహ్మ కున్న ఉన్నత స్థానాన్ని వివ రిం చింది.

"ప్రాయశ్చి త్త రాను ధ్యానై రనుజ్ఞానాను మన్త్రనైహ-హోమైశ్చ యజ్ఞ విభ్రంశం సర్వం బ్రహ్మ ప్రపూరయేత్"

ఇందులో నూరు ప్రపాఠకాలుఉండేవి అని తెలుస్తోంది దిరికినవి కేవలం పదకొండే పతంజలి మహర్షి పేర్కొన్న అవయవ లక్షణం దీని లోనిదే. ఓంకార స్వరూపం, ప్రతి వేదం బ్రహ్మ చర్యం, గాయత్రీ మంత్రం రహస్యార్ధం తెలుసుకోవటానికి గోపద బ్రాహ్మణం ఏంతో ఉప యోగ పడుతుంది.

ఈ బ్రాహ్మణం పూర్వభాగం ఉత్తర భాగం అని రెండుగావిభజింప బడింది. పూర్వం లో అయిదు ఉత్తరం లో ఆరు ప్రపాఠకాలున్నాయి. పూర్వ భాగం లో సృష్టి సముద్రాల పుట్టుక, భ్రుగువు మహర్షి జననం, అధర్వ మహర్షి ఉత్పత్తి, అధర్వ వేదావిర్భావం బ్రహ్మ సృష్టి, ఓంకారోత్పత్తి, గాయత్రీ మాహాత్మ్యం, బ్రహ్మ చారి ధర్మాలు, యాగాలలో బ్రహ్మ స్థానం, దేవ యజనం, బ్రహ్మోదనం, ఆత్రేయ యజ్ఞం, ఋత్విక్కుల అర్హత, స్వాహా శబ్ద ఉత్పత్తి, యజ్ఞ దీక్ష, వాటిల్లో వేదం మంత్రం వినిమయం ఉంటాయి. ఉత్తర భాగం లో యజమాని, అతిధులు, నక్షత్రోత్పత్తి, చాతుర్మాస్య యాగాలు, , దేవాసుర యుద్ధం, అగ్నీధ్ర నియమానం, వషట్కార విశేషాలు, దక్షిణ, ఉక్త దేవతలు షోడశి నిర్వచనం, శర్వం, వాజపేయ ప్రశంస, అప్తార్యామ ప్రశంస, సంపాత మంత్రోత్పత్తి, అహీన యాగ విశిష్టత, మొదలైనవి చెప్ప బడ్డాయి. ఈ బ్రాహ్మణం గుజరాత్ ప్రాంతం లో ఏర్పడిందని క్రీ పూ అయిదవ శతాబ్ది ది అని తెలుస్తోంది. దీనికెవరూ వ్యాఖ్యానం రాసినట్లు లేదు

యజ్ఞం లో పాల్గొనే రుత్విక్కులలో బ్రహ్మ ప్రధానమైన వాడు. ఆయన అధర్వ వేదాం లో నిష్ణాతుడై ఉండాలి. యజ్ఞ యాగాలలో జరిగేలోపాలకు బ్రహ్మ గారు చేయాల్సిన ప్రాయస్చిత్తాలు చెప్పారు.ఇందులో యజ్ఞక్రమ వైశిష్ట్యాన్ని బాగా తెలియ జేశారు. అగ్న్యా దేయం కంటే పూర్ణాహుతి, దానికన్నా హోమం, అంతకంటే దర్శ పూర్ణ మాసాలు, వాటి కంటే ఆ ఆగ్రయణం, దానికంటే చాతుర్మాస్యలు, వాటికంటే పశు బంధం, దానికన్నా అగ్ని ష్టోమం, అంతకంటే రాజ సూయం, దానికన్నా వాజ పేయం, అంతకంటే అశ్వ మేధం, దానికన్నా పురుష మేధం, అంతకంటే సర్వ మేధం, దానికన్నా దక్షిణా వంతాలు, వాటికంటే దక్షిణలు, అదక్షినలు, సహస్ర దక్షిణం ఉత్తమ మైనవని తెలియ జేయ బడిందిం. పురుషునికి సంవత్సరానికి పోలికలను మహా ఆశ్చర్యం గా చెప్పారు. దీనితోనే ఈ బ్రాహ్మణానికి ప్రాముఖ్యత పెరిగింది.

## ప్రపంచ సృష్టి

ఏ వేదం లోనూ లేనంత గొప్పగా సృష్టి గురించి గోపధం తెలియ జేసింది. మొదట్లో పరబ్రహ్మ ఒకడే ఉండేవాడు. తనలాంటి మరో దైవాన్ని సృష్టించాలని తపస్సు చేసి తన దేహం లో వేడి పుట్టించి ఫాల భాగం నుండి చెమట కార్చాడు. ఈ స్వేదానికే సువేదం అనీ పేరు. అంటే బాగా

జ్ఞానం కలిగింది అని అర్ధం. దీనివల్ల  సమస్తమూ ఆయనకు అవగతమవుతుంది. మరింత తపస్సు చేశాడు. రోమ కూపాలనుంచి స్వేదం ధారలుగా ప్రవహించింది. ఆ దారాలతో ప్రపంచ సృష్టి చేసి, సృష్టిని ధరించి పాలించాలనుకొన్నాడు. వెంటనే స్వేద ధారలలోకి తొంగి చూశాడు. తన ప్రతి బింబం కనిపించింది. ఆయన రేతస్సు ఆ స్వేదం లో జారి పడింది. స్వేదం లో వేడి పుట్టించి దాన్ని రెండు భాగాలుగా చేశాడు.. అందులో ఒకటి తాగటానికి వీలు లేని ఉప్పు సముద్రం, మరొకటి తియ్యని నీరు ఏర్పడ్డాయి. ఈ తీయని  నీటిలో వేడి పుట్టించాడు. అంతకు ముందే అందులో పడిన రేతస్సు ఎండిపోయి దాని నుంచి భ్రుగువు అనే రుషి జన్మించాడు. వెంటనే పరబ్రహ్మ అదృశ్యమైనాడు.

భ్రుగువు పరబ్రహ్మను వెతక టానికి అన్ని దిక్కులూ వెతికాడు. తూర్పులో వాయువు, దక్షిణం లో మాత రిశ్వ,, పడమర లో పవమానం, ఉత్తరం లో వాతం అని అశరీర వాణి పలికి కింద నీటిలో చూడమన్నది. చూడగా నోటి నుండి అదర్వుడు అనే రుషి పుట్టాడు. కింద నుంచి పుట్టాడు కనుక అదర్వుడు అనే పేరు. ఆయన దేహం బ్రహ్మ దేహం లాగా తేజో వంతం గా ఉంది. ఆయనే సృష్టికార్యం జరిపే ప్రజా పతి. పర బ్రహ్మ అధర్వుని దేహాన్ని తపింపజేసి  వేడెక్కించటం వలన ఆయన దేహం నుండి ఏకర్చ, ద్వార్చ్య, త్ర్యర్చ,చతుర్చపంచర్చ, షడర్చ, సప్తార్చ, అష్టర్చ, నవర్చ, దశర్చ అనే పది మంది ఆదర్వణ ఋషులు జన్మించారు. వీరి నుంచి ఏకాదశర స్చ, ద్వాదశర్చ, త్రయోదశర్చ, చతుర్దశర్చ,పంచ దశర్చ, షోడశార్చ, సప్త దశర్చ, త్రయోదశార్చ, చతుర్దశార్చ, పంచాదశార్చ, షోడశార్చ, సప్త దశర్చ, అష్ట దశర్చ, ఎకోనవవిమ్శర్చ, విమ్శారస్చ  అనే పది మంది అధర్వ ఋషులు తిరిగి పుట్టారు. అధర్వణుడు, అధర్వ ఋషులు దర్శించిన మంత్రాలకే అధర్వ వేదం అని పేరు. దీని నుండి ఓంకారం పుట్టింది.

పరబ్రహ్మం నుండి భూమి, అంతరిక్షం, స్వర్గ అనే మూడు లోకాలు పుట్టాయి. ఆయన పాదం నుండి భూమిని, ఉదరం నుండి అంతరిక్షాన్ని, తలనుండి స్వర్గాన్ని సృష్టించాడు. భూమి  నుండి  అగ్ని, అంతరిక్షం నుండి వాయువు, స్వర్గం నుండి ఆదిత్యుడు లను సృష్టించాడు. అగ్ని వలన ఋగ్వేదం, వాయువు నుండి యజుర్వేదం, ఆదిత్యుని నుండి సామ వేదం, వెలశాయి. ఋగ్వేదం నుండి    భూహ్ అనే వ్యాహృతి, యజుస్సు నుండి భువః, సామం నుండి సవః అనే వ్యాహృతులు పుట్టాయి.

ఉప్పు నీటి నుండి సముద్రం, అన్ని వైపులకు వ్యాపించి తమకు ఒక దేవు డిని మ్మని ప్రార్దిస్తే, వరుణుడు అధి దేవత అయ్యాడు. వరుణుడి నుండి ముచ్యుడు, పుట్టాడు ఇతనే మృత్యు దేవత. ఇతని దేహం నుండి రసాలు కారాయి.రసాల నుండి పుట్టిన వారే అంగీరస ఋషులు. ఇలా అధర్వాన్గీరసులు భ్రుగ్వాన్గీరస ఋషులు జన్మించారు. అంగీరసులు దర్శించినదే అంగీరస వేదం. దీని నుండి జనత్ అనే వ్యాహృతి పుట్టింది. పరబ్రహ్మ తూర్పు దిక్కు నుంచి సర్ప వేదాన్ని, దక్షిణ దిక్కు నుండి పిశాచ వేదాన్ని, పశ్చిమం నుంచి అసుర వేదాన్ని, ఉత్తరం నుండి ఇతిహాస వేదాన్ని, ఊర్ధ్వ, అదో దిక్కుల నుండి పురాణ వేదాన్ని సృష్టించాడు. సర్ప వేదం నుండి "వృధాత్ ",పిశాచ వేదం నుండి కారత్, అసుర వేదం నుండి గుహాన్ ఇతిహాస వేదం నుండి మహాత్, పురాణ వేదం నుండి తత్ అనే వ్యాహృతులను సృష్టించాడు. తర్వాత చంద్రుడు, గ్రహాలూ, వృక్షాలు మొదలైనవి సృష్టించాడు.

పిమ్మట పర బ్రహ్మ ఒక యజ్ఞాన్ని చేసి దానిలో అగ్ని ని హోత గా, వాయువు అధ్వర్యుగా, సూర్యుని ఉద్గాత గా, చంద్రున్ని బ్రాహ్మ గా, పర్జన్యుడిని సదస్యునిగా, ఓషధులు, వృక్షాలు  చమస్సులు (గరిట లాంటిది )గాను, విశ్వేదేవతలను హోత గాను, అధర్వాన్గీరాసులు గోప్తలుగాను నియమించాడు. గోప్తలు యజ్ఞం లో జరిగే లోపాలను సవరిస్తారు. ఇలా అధర్వ వేదం, దాని ప్రాముఖ్యత, అధర్వామ్గీరాసుల ప్రాశస్త్యం విశిష్టం గా గోపద బ్రాహ్మణం లో వివరించ బడింది.

## ప్రణవం

పర బ్రహ్మ బ్రహ్మ దేవుడిని ఒక తామరాకు పై సృష్టించాడు. తన కోరికలను, లోకాలను, దేవతలను, వేదాలను, యజ్ఞాలను, శబ్దాలను, భూతాలను స్థావర జంగమాలను ఏ విధం గా ఏకాక్షరం వలన తెలుసుకోవాలి అని ఆలోచించి, బ్రహ్మ చర్యాన్ని పాటించి చివరకు "ఓం"అనే ప్రణవాన్ని కనుగొన్నాడు. ఓంకారం లో రెండు వర్ణాలు, నాలుగు మాత్రలు ఉన్నాయి. ఇది సర్వ వ్యాపి, మార్పు లేనిది, బ్రాహ్మీ మాయం. దీని నుంచే కోరిన వస్తువులు, సమస్త లోకాలు, దేవతలు, యజ్ఞాలు, శబ్దాలు, స్థావర జన్గమాత్మకమైన భూతాలు పుట్టాయి.

ప్రణవం లోని మొదటి అక్షరం నుండి స్వర్గం, రెండవ అక్షరం నుంచి తేజస్సు వెలుగు పుట్టాయి. ఓంకారం లోని మొదటి స్వర మాత్రక నుంచి భూమి అగ్ని ఓషధులు, వృక్షాలు, భూహ్ అనే వ్యాహృతి, గాయత్రీ ఛందస్సు మూడు విధాలైన స్తామాలు, తూర్పు దిక్కు, వసంత రుతువు వాక్కు, నాలుక సృష్టింప బడ్డాయి. దాని రెండవ స్వర మాత్ర నుంచి అంత రిక్షం, వాయువు, యజుర్వేదం, భువ అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు,

పది హేనురకాల స్తామాలు, పశ్చిమ దిక్కు, గ్రీష్మ ఋతువు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు చేసే అవయవాలు నిర్మించ బడ్డాయి. మూడవ స్వర మాత్ర నుండి స్వర్గం, సూర్యుడు, సామ వేదం, స్వః అనే వ్యాహృతి, జగతీ ఛందస్సు, ఉత్తర దిక్కు, వర్ష రుతువు, కళ్ళు మొదలైనవి ఏర్పడ్డాయి. దాని "వ"కార మాత్ర నుండి నీరు, చంద్రుడు, అధర్వ వేదం, నక్షత్రాలు, అంగీరసులు, అనుష్టుప్ ఛందస్సు దక్షిణ దిక్కు, శరదృతువు మనసు మొదలైనవి జనించాయి. దాని "మ"కార మాత్ర నుండి ఇతిహాస పురాణాలు, వాక్కు, ఛందో యుక్తమైన భాష, ఉపనిషత్తులు, వృధాత్, కారత్, గుహన్, మహాత్, తత్, శం,ఓం అనే వ్యాహృతులు, నృత్యం, గానం. చైత్ర రాధా దేవతలు, తేజస్సు, తేజస్సు, వెలుతురూ, ఊర్ధ్వ దిక్కు, అదో దిక్కు, హేమంత, శిశిర ఋతువులు సృష్టింప బడ్డాయి.

ఓంకార సహాయం తో దేవతలు రాక్షసులని జయించారు ఓంకారమే అన్ని వేదాలకు మూలం. ప్రపంచానికి ఆధారం. ఈ విధం గా దిక్కులు, ఛందస్సు, పంచ భూతాలు, వేదాలు రుతువులు, సూర్య చంద్రులు, ఇతిహాస పురాణాలు, ఓంకారం నుండి పుట్టాయని గోపద బ్రాహ్మణం చెప్పింది.




## గాయత్రీ మంత్రం

గాయత్రిని మించిన మంత్రం లేదు "ఓం భూర్భువస్సువః త్తత్సావితుర్వ రేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ "అనేది గాయత్రి మంత్రం. గాయత్రికే సావిత్రి అని పేరు ఈ మంత్రం తత్త్వం గ్లావుడు, మౌద్గాల్యుడు అనే ఇద్దరు ఋషుల మధ్య జరిగిన సంభాషణ రూపం లో వివరించ బడింది. మైత్రేయ వంశం లో పుట్టిన గ్లావుడు మౌద్గాల్యునికి వేదాలు వాటి అర్ధాలు తెలియవు అని నిందించాడు. అందుకు మౌద్గాల్యుడు "సకల వేదం సారం, సకల ఆధార మైన గాయత్రీ మంత్రం యొక్క తత్త్వం నీకు తెలుసా?"అని శిష్యుని ద్వారా ప్రశ్నించాడు. మంత్రం తత్త్వం తనకు తెలియదని, మౌద్గాల్యుని తూల నాది నందుకు క్షమాపణ చెప్పుకొని గాయత్రీ మంత్రం తత్వాన్ని ఉపదేశించమని వేడుకొన్నాడు. మౌద్గాల్యుడు సాకల్యం గా వివరించి చెప్పాడు.

"వేదాలు ఛందస్సు, సవిత (సూర్యుడు)యొక్క శ్రేష్టమైన భాగాలు. అన్నం ఆయన ప్రకాశం. ధియః అంటే విధులు లేక కర్మలు. వీటి వల్లనే ఆయన లోకమంతా సంచ రిస్తాడు. మనస్సు సవిత. వాక్కు సావిత్రి. మనసున్న చోట వాక్కు, వాక్కు ఉన్న చోట మనస్సు, ఉంటుంది. అగ్నియె సావిత్రి. పృథ్వి సావిత్రి. అగ్ని ఆదిత్యుడు వేదాలు వేదాలు ఛందస్సులు యజ్ఞం దక్షిణ సమస్తం సావిత్రియే. దీని తత్వాన్ని తెలుసుకొన్న వాడు సర్వ పాప విముక్తుడై సుఖ సంతోషాలను పొందుతాడు.

## రుక్ –సామల సంబంధం

ఉత్తర భాగం లోని తృతీయ ప్రపాఠకం లో ఈ రెంటి సంబంధం చెప్ప బడింది. ఆదిలో రుక్, సామలు మాత్రమె ఉండేవి. రుక్కు కు "సా"అని సామకు "ఆమ "అని పేరు. పుల్లింగం లో ఉన్న సా తో స్త్రీలింగం లో ఉన్న" ఆమ 'తో"సకల జీవరాసులని అభి వృద్ధి చేయటామికి మనం కలుసు కొందాం "అని చెప్పింది. కాని సామ అందుకు ఒప్పుకోలేదు. రుక్ కన్నా తానే గొప్ప అని ప్రగల్భాలు పోయింది. కోపించిన రుక్ తానె రెండు భాగాలుగా విడిపోయి మొదటి భాగం రెండో భాగం తో మాట్లాడింది. కాని రెండో భాగం పలకనే లేదు. అప్పుడు తాను మూడు భాగాలుగా విడిపోయి సామను మళ్ళీ పలకరించింది. కనుక సామ మూడు రుక్కుల చేత కీర్తింప బడుతోంది. ఈ సంభాషణ అంతా "సా","మ"మధ్య జరిగింది.

గమ్ అనే ధాతువుకు డో" ప్రత్యయం చేరిస్తే గో"శబ్దం ఏర్పడుతుంది. గో శబ్దానికి పొందదగిన పదార్ధం అని అర్ధం. పొంద దగింది వేదవాణి, పృధివీ రాజ్యం, స్వర్గ సుఖం. వీటిని పొందే మార్గాన్ని తెలిపే బ్రాహ్మణం కాబట్టి గోపధం అయింది. వేదం విజ్ఞానం పొందటం, రాజ్య వ్యవహారాలూనడపటం, పరమ సుఖాన్ని పొందటం అనే పురుషార్ధాలు కలుగుతాయి.

పూర్వం వైదిక యుగం లో "పని "అనే కొండ జాతి వాళ్ళు బ్రాహ్మణుల ఆవులను దొంగిలించి కొండ గుహలో దాచారట. "సరమ "అనే ఇంద్రుని కుక్క ఆ ఆవులకోసం వెతుకుతూ అనేక ప్రదేశాలు తిరిగి కనుక్కోన్నది. ఇంద్రునికి తెలిసింది ఇంద్రుడు దండెత్తి పణి జాతి వారి బలాన్ని చేదించి ఆవులను విడిపించాడు. అన్గిరసులు ఇంద్రునికి సాయం చేశారు. అందుకే గోపద బ్రాహ్మణం అధర్వాం గీరస బ్రాహ్మణం అనే పేరు తెచ్చుకొంది. ఈ నాటి డిటెక్టివ్ పరిశోధనకు ఆ నాడే బీజం పడిందని భావించ వచ్చు. అడుగు జాడలు వేలి ముద్రలు కుక్కల సాయం తో నేరస్తుల ఆచూకీ ఇవన్నిటికీ ఈ బ్రాహ్మణం ఆధారమే.

గోపధం లో కొన్ని పదాల వివరణ అత్యద్భుతం గా ఉంటుంది ఆ వైభవాన్ని తెలుసుకొందాం.

1-స్వేదం –సు వేదమే స్వేదం అని అర్ధం చెప్పింది. అంటే బాగా వేదం చదవటం. వేదం గట్టిగా చదివి కంఠస్తం కావాలంటే చమట పట్టేట్లు చదవాలి. కా బట్టే ఈ సువేద పదం స్వేదం గా మారిందని వివరణ ఇచ్చారు ఇందులో.

2-రధం –రస అనే శబ్దం నుంచి వచ్చింది. రస పూర్ణం అంటే ఆనంద పూర్ణం గా ఉండటం. దీని వల్ల రధం అనే సంజ్ఞ రూపొందింది.

3-దీక్షిత –ధీక్షిత పదం నుండి ఇది వచ్చింది. శ్రేష్టమైన బుద్ధిని పొందేవాడు ధీక్షితుడు. అదే దీక్షిత గా మారింది.అందుచేత అతడు పెద్దలచే నమస్కరింప దగిన వాడు అవుతాడు.

4-మఖ –అంటే యజ్ఞం. ఖ అంటే చిద్రాలు దోషాలు. మ అంటే పోగొట్టేది. దోషాలు లేనిదిగా చేసేది. మఖ అంటే యజ్ఞం. దోషాలు లేనిదిగా యజ్ఞం ఉండాలి.. అంటే యజ్న కర్మ లో ఏ విధమైన పొరబాట్లు, దోషాలు ఉండరాదని తెలుస్తోంది.

5-సామ –సా అంటే లక్ష్మి అమ అంటే జ్ఞానం. లక్ష్మీ సంబంధమైన జ్ఞానం అని సామ కు అర్ధం.

6-కుంతాపసూక్తం – కు అంటే చెడు తాప అంటే తపింప జేయటం. చెడును నశింప చేసే సూక్తమే కుంతాప సూక్తం. అధర్వ వేదం లో దీనికి ప్రసిద్ధి ఎక్కువ.

## కొన్ని సుభాషితాలు

1-దేవతలు పరోక్ష ప్రియులు, ప్రత్యక్ష ద్వేషులు. ఈశ్వరుని అచింత్య శక్తిని వర్ణించే సందర్భం లో నిది. ఈశ్వరుడు పరోక్షం గా ఉన్నా ఇష్టుడు. ఈ భౌతిక జగత్తు ప్రత్యక్షం గా ఉన్నా ద్వేషింప దగినది. ఇది అశాశ్వతం.

2-యజ్ఞాలలో ఋత్విక్కులు అసమర్ధులు గా, బ్రహ్మ చర్య దీక్ష లేని వారుగా, రాగ ద్వేషాలున్న వారు గా ఉంటె ఆ యజ్ఞం నాశనమవుతుంది. సదాచారమే యజ్న ఋత్విక్కులకు ముఖ్యం.

3-మట్టి బెడ్డలు కుండలో వేస్తె అవి శౌచ కర్మకు, దాన్యోత్పత్తికి పనికి రావు. ఉపయోగపడే వాటిని తగని స్థానం లో ఉంచరాదు అని అర్ధం.

4-యాజకుడు తేజస్వి, సత్య వాది,వ్రత నిష్టుడు గా ఉండాలి. అతడు మంచి వాడు కాక పోతే పచ్చికుండలో నీళ్ళు పోసినప్పుడు విచ్చి నీరు కారిపోయినట్లు యజమాని ప్రయోజాన్ని నాశనం చేస్తాయి.

5-తలిదండ్రులు చిన్న తనం లో కుమారుడిని పోషిస్తే, వాడు పెద్ద వాడై వారిని పోషించాలి. ఇది తెలిస్తేనే నిజమైన యజ్ఞం. తలిదండ్రుల సేవే నిజమైన శ్రాద్ధం, తర్పణం కూడా. బతికి ఉండగా పట్టించుకోకుండా చని పోయిన తర్వాత శ్రాద్దాలు చేసినా అది నిష్ప్రయోజనం.

6-జరిగి పోయిన కాలం పరిమితం. రాబోయే కాలం అపరిమితం. గతం లో చెడు చేసినంత మాత్రాన కుంగి పోనవసరం లేదు. భవిష్యత్తు తరువాత వచ్చేదికనుక మంచి చేసి ఆ దోషాన్ని పోగొట్టుకోవచ్చు. నిరాశ చెందక్కర లేదు.

ఇప్పుడొక్క సారి ఈ బ్రాహ్మణం లో చెప్ప బడిన విషయాలను పునరాలోకిద్దాం. పూర్వ బ్రాహ్మణం లో సృష్టి విధానం ఓం మహాత్మ్యాన్ని వివరించారు. సృష్టి అంతా ఓం నుండే ఏర్పడింది. ఓం బ్రహ్మ, విష్ణు, రుద్రాత్మకం. దీన్ని వెయ్యి సార్లు జపిస్తే కోరికలన్నీ సిద్ధిస్తాయి. గాయత్రీ మంత్రోపాసన చేస్తే సంతతి కూడా బలం గా ఉంటుంది. శిష్యుడు గురు శుశ్రూష చేసి పంచాగ్నులను వశం చేసుకోవాలి. గృహిణి అతడికి భిక్ష పెట్టాలి. భిక్ష పెట్టక పోతే పుణ్యాలన్నీ నశిస్తాయి. మాంస భక్షణ నిషిద్ధం. విపాట్ నది ఒడ్డున వసిష్టా శ్రమం ఉన్నది

ఉత్తర బ్రాహ్మణం లో దర్శ పూర్ణమాసం నుండి చిన్న యాగాలు, పెద్ద యాగాల వివరణ ఉంది. ఖగోళ, జ్యోతిష సంబంధ విషయాలు చెప్ప బడ్డాయి. చిత్త మొదలైన నక్షత్రాలు పౌర్ణమి రోజు చంద్రునితో కలిసి చైత్రం మొదలైన నెలలు ఏర్పడుతాయని చెప్పారు. ఫాల్గుణ పూర్ణమి నుండి సంవత్సరం మొదలైంది అని పేర్కొన బడింది. భూమి గోళాకారామని, సూర్యుడు ఎప్పుడూ చాటు కాడని వివరించింది. తిరుగుతూ ఉండే భూమి అంచున సూర్య కాంతి పడుతుందని తెలిపారు.

## ఆరణ్యకాలు అరణ్యాలల మహర్షులు దర్శించిన -ఆరణ్యకాలు

ఏకాంత వాసం లో దీర్ఘ తపస్సులో అరణ్యవాసం లో మహర్షులు దర్శించినవి లేక ఆరాటంలో పుట్టినవి ఆరణ్యకాలు. ఇవి కర్మకాండలగురించి, వ్రతాలు, ప్రవర్గ్యలు గురించి తెలియ జేస్తాయి. ఆరణ్యకాలు కర్మకాండ కు సంబంధించినవైతే ఉపనిషత్ లు జ్ఞానకాండకు సంబంధినవి. వేద మంత్ర భాగాలను సంహితాలని, వాటి వ్యాఖ్యానాలను బ్రాహ్మణాలని,, వాటిలోని కర్మకాండను తెలియజేసేవి ఆరణ్యకాలని, వేదాలలోని జ్ఞానభాగాన్ని చెప్పేవి ఉపనిషత్తు లేక వేదాంగాలని అంటారు.

ఆరణ్యకాలు కూడా వివిధ ఋషుల పేర్లతో పిలువ బడుతున్నాయి. ఋగ్వేదానికి ఐతరేయ ఆరణ్యకం, కౌశిక ఆరణ్యకాలు -యజుర్వేదానికి తైత్తిరీయ ఆరణ్యకం, మైత్రాయణీయ ఆరణ్యకం,కేదారణ్యకం, బృహదారణ్యకం సామవేదానికి తలవకార ఆరణ్యకం, ఆరణ్యక సంహిత, అధర్వ వేదానికి ఆరణ్యకం అలభ్యం

ఐతరేయాఅరణ్యకం 5 అధ్యాయాలు మొదటి రెండిటిలోప్రాణ విద్య ఉంటుంది 3 లో సంహితోపనిషత్ లో స్వర చర్చ 4, 5 ల లో మంత్రాల సాంకేతిక వివరణ ఉంటుంది దీన్ని మహానామ్ని అంటారు

తైత్తిరీయ ఆరణ్యకం లో 10 భాగాలు. మొదటి దానిని 'కథాకాని "అంటారు. అగ్ని చయన కాండ ఉంటుంది 2వది మహాయజ్ఞ నిర్వహణ విధానం మిగిలినవి మంత్రం తంత్ర సాంకేతిక వివరాలు.

కథారణ్యకం -తైత్తిరీయమే. సాంఖ్యాయన ఆరణ్యకం లో 15 అధ్యాయాలు., 2 అధ్యాయాలు మహా వ్రతాన్ని 3నుంచి 6 కౌశిక ఉపనిషత్ ను, 7,8 సంహితోపనిషత్, 9 ప్రాణ విశిష్టత, 10 అగ్నిహోత్ర విధి 11 అంత్య సంస్కారం 12 ప్రార్ధన ఫలితాలు 13 శ్రవణ మనన నిధి ధ్యాస వివరణ 14 అహం బ్రహ్మాస్మి వివరణ 15 బ్రహ్మ నుంచి గుణ సాంఖ్యాన వరకు గురు స్తుతి ఉంటాయి. బృహదారణ్యకం బృహదారణ్యక ఉపనిషత్ ను, ముఖ్యంగా "పర్వాగ్య "కర్మ కాండను గురించి వివరిస్తుంది. ఆరణ్యకాలను "రహస్య బ్రాహ్మణాలు "అన్నారని నిరుక్తానికి వ్యాఖ్యానం రాసిన దుర్గా చార్య అన్నాడు.

ప్రాచీన కాలంలో వేదంలోని ఋక్కులు, యజస్సులు, సామలు అన్నీ కలిసి ఒకే ఒక వేదరాశిగా ఉండేది. ఎవరయినా వేదం నేర్చుకోవాలంటే ఒకే ఒక వేదరాశిగా ఉన్న వేదంలోని ఋక్కులు, యజస్సులు, సామలు అన్నీ కలిపి నేర్చుకునేవారు. కృతయుగం నుండి ద్వాపరయుగం వచ్చేసరికి మొత్తం వేదరాశిని అధ్యయనము చేయవలెనంటే బహుకష్టముగా ఉండేది. భగవానుని అంశ అయిన వేదవ్యాసుడు ఈ వేదరాశిని విడివిడిగా ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము మరియు అధర్వణవేదము అను నాలుగు భాగములుగా విభజించాడు. వేదాలలో సంహితలు మూలగంథాలు. వీటికి వ్యాఖానాలు బ్రాహ్మణాలు అవతరించాయి. బ్రాహ్మణాలలోని ఒక భాగంగానే అరణ్యకం ఆవిర్భవించింది.

### అరణ్యకములు

అరణ్యకములు అనగా అడవులకు సంబంధించిన విషయాలు. వివిధ కర్మ, యజ్ఞ కార్యముల అంతరార్థాలను వివరించేవి. ఇవి బ్రాహ్మణములకు, ఉపనిషత్తులకు మధ్యస్థాయిలో ఉంటాయి. ఇవి కూడా బ్రాహ్మణాలలాగానే కర్మవిధులను ప్రస్తావిస్తాయి. కాని వీటిలో కర్మలయొక్క భౌతిక భాగం ఉండదు. కర్మలవెనుక ఉన్న నిగూఢమైన తత్వాలమీది ధ్యానానికి ఆరణ్యకాలు ఎక్కువ ప్రాధాన్యతనిస్తాయి. ప్రతి

సంహితలు బ్రాహ్మణాలున్నట్లే అరణ్యకాలు కూడా ఉండేవి. కాలాలు గడిచే కొద్దీ ప్రజల నిరాదరణకు బలై చాలా వరకు నశించి పోయాయి. అథర్వవేదానికి చెందిన గోపథబ్రాహ్మణం అనే బ్రాహ్మణానికి సంబంధించిన అరణ్యకం లేకపోవడము ఇందుకు తార్కాణం.

## అరణ్యకాలు అంటే ఏమిటి ?



వేదములలో సంహితలు మహర్షులు దర్శించినవి కావున ఇవి మూలగ్రంథాలు. బ్రాహ్మణాలనేవి సంహితలకు వ్యాఖ్యాన రూపాలు. వేద రాశిలో సంహితలు, బ్రాహ్మణాలువరుసగా ఒకటి, రెండు స్థానములు కాగా అరణ్యకాలు మూడవ స్థానమును పొందినవి. అరణ్యకాలు అంటే అనేకమంది ద్వారా ఈ క్రింది విధముగా అనేక అర్థాలు ప్రతిపాదించబడినవి.

1. అరణ్యంలో దీక్షతో అధ్యయనము చేసిన గ్రంథాలే అరణ్యకాలు.

2. గృహస్థాశ్రమము వదలి సన్యాసము లేదా సన్యసించుట వలన అరణ్యాలకు వెళ్ళి ప్రశాంత వాతావరణములో తపదీక్షతో వేదాధ్యయనము చేయటకు కావలసిన గ్రంథాలే అరణ్యకాలు.

3. కర్మఫలంతో పాటు జ్ఞానం సంపాదించు మేలు కలయిక అరణ్యకాలు.

4. యజ్ఞాలలోని రహస్యాలను అరణ్యాలలోనే మహర్షులు చర్చించారు.

5. బ్రాహ్మణము లలో ఉండే గృహస్థాశ్రమ కర్మకాండలు, జ్ఞానం మాత్రము ప్రధానముగా ఉండే ఉపనిషత్తు ల మేలు కలయికయే అరణ్యకాలు.

6. అరణ్యములలో మాత్రమే ఆచరించవలసినవి కావున అరణ్యకాలు.

7. వేదాల సారమే అరణ్యకాలు.

## అరణ్యకాలు - సంహితలు

వేద విభాగానికి చెందిన సంహితలు మంత్రములతో కూడినవే మునుముందు వేదం అనుకునేవారు. తదుపరి కాలాములో మంత్రముతో పాటు వ్యాఖ్యాన రూపాలైన బ్రాహ్మణాలు కూడా కలిపిందే "వేదం" అని ఇంకొందరు అభిప్రాయ పడ్డారు. అరణ్యకాలు మాటేమిటి ? ఇవి కూడా కర్మ భాగంతో పాటుగా జ్ఞాన మార్గమునకు చెందిన ఉపనిషత్తులు కలిగి ఉండుటచే వేదమని పిలువ కూడదని కొందరి అభిప్రాయము. అందుకు కారణము వేదాంతమే ఉపనిషత్తులు అని వ్యవహరించారు.

నిర్మాణ విషయం లో ఆరణ్యకాలు వాటిలోని విషయాలను బట్టి చాలా భేదం గా కనిపిస్తాయి కొన్నిటిలో సంహితభాగం కలిసిఉంటే మరికొన్నిటిలో బ్రాహ్మణభాగం కలిసి ఉంటాయి. మిగిలినవాటిలో సూత్రాలతో కలసి ఉంటాయి. చాలా ఆరణ్య కాలలోమంత్ర వివరణ, పదాల వ్యుత్పత్తి, వాటి గుర్తింపు, చర్చలు, పురాణగాధలు, ప్రతీకాత్మక లేక సాంకేతిక వివరణలు, అరుణ కేతు లాంటి ఋషుల లోతైన వేదాంత భావనలతో నిండిన మంత్రాలు ఉన్నాయి.

ముఖ్యంగా ఆరణ్యకాలు భాష శైలి లలో బ్రాహ్మణాలులాగా యజ్ఞయాగాది క్రతు విధానంపై చర్చించాయి.కనుక వీటిని నిర్దుష్టంగా చేసే విధానాలపై దృష్టి పెట్టాయి. వేదపార్య ప్రణాళిక లో కొన్ని యజ్ఞాల విషయం లోమాత్రమే ఆరణ్యకాలు నిబంధింపబడినాయి, వేద శాఖల పేర్లతో ఆరణ్యకాలు పిలువబడి నాయి. వివరాలు మొదట్లోనే పైన తెలియజేయబడినాయి. అయినా మరొక్కమారు తెలుసుకొందాం –ఋగ్వేద

సంహితకు ఐతరేయ శాఖ కు చెందిన ఐతరేయ ఆరణ్యకం, కౌశికి, సాంఖ్యాయన శాఖలకు "కౌశీతకి ఆరణ్యకం"ఉన్నాయి. కృష్ణ యజుర్వేద సంహితకు తైత్తిరీయ శాఖకు చెందిన తైత్తిరీయ ఆరణ్యకం, మైత్రాయన శాఖకు మైత్రాయారణ్యకం,చరక లేక కథా శాఖకు కథారణ్యకం ఉంటే, శుక్ల యజుర్వేద సంహితకు కాణ్వ, మాధ్యందిన శాఖలకు బృహదారణ్యకం ఉన్నది. మధ్యందినం 9 భాగాలలో చివరి 6 భాగాలు బృహదారణ్యక ఉపనిషత్ లోనివే. సామవేదానికి జైమినేయశాఖకు తలవకార ఆరణ్యకం లేక జైమిని ఉపనిషత్ బ్రాహ్మణం ఉంది. ఆరణ్యక సంహిత విలక్షణ ఆరణ్యక గ్రంథంకాదు. సామవేద సంహితకు పూర్వార్చికం. దీనిలోని మంత్రభాగాన్ని ఆరణ్యక సంహిత అన్నారు. దీని ఆధారంగా ఆరణ్య గాన సామాలను గానం చేస్తారు. అధర్వ వేదానికి ఆరణ్యకం లభించలేదు. కాని గోపథ బ్రాహ్మణాన్నే దీని ఆరణ్యకం గా భావిస్తారు.

ఐతరేయ ఆరణ్యకం –లో 5 అధ్యాయాలున్నాయి. ఏ అధ్యాయానికి ఆ అధ్యాయాన్నే ఆరణ్యకం అని పిలుస్తారు. మొదటిభాగం "మహావ్రతం "గురించి వివరిస్తుంది. దీనిలో కర్మకాండతోపాటు ఊహాత్మక వివరణా ఉంటుంది. రెండవ దానిలో 6 అధ్యాయాలున్నాయి. అందులో మొదటి మూడిటిలో "ప్రాణవిద్య "గురించిన అన్ని వివరాలు ఉన్నాయి. ఇదే అన్ని మంత్రాలకు ముఖ్య ఆధారం. ఇందులోనే అగ్ని హోత్రునికి సూర్య, వాయువులకు ఆహుతులు వేసే విధి విధానం ఉంది. వేద మంత్ర విధిని అతిక్రమించినా, లోపం చేసినా అత్యల్ప జీవులైన పక్షులు, పాకే జంతువుల జన్మ లభిస్తుందని తెలియ జేసింది. రెండవభాగం లోని 4, 5, 6 అధ్యాయాలనే ఐతరేయ ఉపనిషత్ అంటారు. మూడవ భాగానికి సంహితోపనిషత్ అని పేరుంది. ఇది పద పాఠం, క్రమపాఠం, జటపాఠం మొదలైనవి వివరిస్తుంది. అంటే వేదాన్ని ఎలా ఉదాత్త అనుదాత్తాలతో నేర్వాలో తెలియ జేస్తుంది. స్వరాలలో ఉన్న స్వల్ప భేదాలనూ సవివరంగా చర్చించి చెబుతుంది. ఇందులోని నాలుగు అయిదు ఆరణ్యకాలు అంటే భాగాలు మంత్రాల సాంకేతికత పై విపులంగా వివరిస్తుంది. దీనికి "మహానామ్ని "అనిపేరు. దీనికి సంబంధించిన యజ్ఞం మధ్యందిన యజ్ఞం.

తైత్తిరీయ ఆరణ్యకం –ఇందులో 10 అధ్యాయాలు. మొదటి6 ను సరైన ఆరణ్యకం అన్నారు. ఇందులో నిమొదటి రెండు అధ్యాయాలు "అష్టా కాథకాని"అంటారు.అంటే కాథకంలోని 8 అధ్యాయలు అని అర్థం. ఇవి అసలు తైత్తిరీయ శాఖకు చెందినవికావు అనిభావం. వీటిని కాథక శాఖనుంచి అరువు తెచ్చుకొన్నారు. ఇవన్నీ వేదం లోని అగ్నిచయనం గురించి విపులంగా చెప్పేవే.

మొదటి అధ్యాయం వేదం లో చివర వచ్చినది. ఇందులో పురాణ పురుషుల పేర్లున్నందున అలా భావించాల్సి వచ్చింది. అగ్ని హోత్ర వేదిక నిర్మాణానికి ఇటుకలను పేర్చే విధానం "ఆరుణ ప్రశ్న"ఉండటం వలన సూర్యనమస్కారాలు చేసే విధానం ఉన్నందున ఆ పేరు వచ్చింది. రెండవ అధ్యాయం ప్రతి బ్రాహ్మణుడు ఆచరించాల్సిన పంచ మహాయజ్ఞాల వివరణ. వేద స్వాధ్యాయనం,యజ్ఞోపవీత ధారణ, సంధ్యావందనం, బ్రహ్మ యజ్ఞం, పితృ యజ్ఞం, కూష్మాండ హోమం (యజ్న వేదికను శుభ్ర పరచటం )గురించి విస్తృత వర్ణన. ఇందులోనే "శర్మణ"అనే పదం ప్రయోగింపబడింది. ఈపదాన్ని బొద్ధ, జైనులు ఆతర్వాత వాడుకొన్నారు. 3వ అధ్యాయం అనేక హోమాలు యజ్ఞాల సాంకేతిక వివరాలు తెలియ జేసింది. 4 వఅద్యాయం శ్రౌత కర్మకాండలో ప్రవర్గ్య కు చెందిన మంత్రాలు న్నాయి. దీనిలో అత్యధిక ఉష్ణోగ్రతలో ప్రత్యేకమైన మట్టిపాత్రలో పూర్తిగా పాలునింపి, ఎర్రగా పాత్ర కాలేదాకా మరగించటం ఉంటుంది కనుక ఇది ప్రమాద హేతువుగా భావిస్తారు. ప్రవర్గ్య అంటే అగ్నిష్టోమం లో తాజా పాలను మహావిర లేక ఘర్మ అనే మట్టిపాత్రలో అత్యధిక ఉష్ణోగ్రతలో వేడి చేయటం. ఈ పాలను అశ్వినీ దేవతలకు నైవేద్యంగా పెడతారు. ఇదికూడా కథాశాఖ విదానంగానే ఉంటుంది. 5 వ అధ్యాయం లో ప్రవర్గ్య యజ్న విధానం వచనం లో చెప్పబడింది. దీన్ని బ్రాహ్మణ శైలి అంటారు ఇదీ కథా శాఖ విధానాన్ని పోలి ఉంటుంది. 6 వ అధ్యాయం పితృమేదానికి సంబంధించింది. అంటే దహన సంస్కార మంత్రాలున్నాయని అర్థం. 7,8,9 అధ్యాయాలు తైత్తిరీయ ఉపనిషత్ లోని 1-శిక్ష 2-ఆనంద 3- భ్రుగు అనే మూడు వల్లి లు. 10 అధ్యాయం ను "మహారణ్య ఉపనిషత్ "అంటారు. ఇందులో మూడు సంహితలలోని మంత్రాలు ఉన్నాయి.

కథారణ్యకం –ఇది తైత్తిరీయంకు సమాంతరంగా ఉంటుంది. ఇందులో కొద్దిభాగం మాత్రమే భద్ర పరచబడింది. అదికూడా కాశ్మీర దేశం లో భూర్జర పత్రాలలో నిక్షిప్తమైంది. ఈమధ్యనే దీన్ని కూర్చి ముద్రించారు. అనువాదమూ ఉంది.

శాంఖ్యయన ఆరణ్యకాలు –ఇది 15 అధ్యాయాలు. మొదటి రెండు అధ్యాయాలు మహావ్రతం గురించి చెప్పబడింది. 3 నుంచి 6 వరకు ఉన్నదాన్ని "కౌషితకి ఉపనిషత్ "అంటారు. 7,8 సంహితోపనిషత్. 9 ప్రాణం గొప్పతనం వివరిస్తుంది. 10 వ అధ్యాయం అగ్ని హోత్ర విధివిధాన వివరణ. మానవ శరీరం లో అంటే పురుషునిలో అగ్ని వాచకం లో, వాయువు ప్రాణం లో, సూర్యుడు కళ్ళల్లో, చంద్రుడు మనసులో, దిశలు చెవులలో నీరు శక్తిలో ఉన్నాయని తెలియ జేసింది. ఈ ఆరణ్యకం అర్థం చేసుకున్నవారికి దేవతలందరి అనుగ్రహంకలిగి ఇచ్చిన హవిస్సులు అందుకొని తినటం నడవటం మాట్లాడటం ఆలోచించటం దానం చేయటం మొదలైన వాటికి సర్వ సమర్ధత లభిస్తుందని తెలిపింది. 11వ

అధ్యాయం అనారోగ్యం, మృత్యువు  లను ఎదుర్కొనే పరిష్కారాలు సూచిస్తూ, కలల ప్రభావాలను చర్చించింది. 12 లో ప్రార్ధన ఫలితాల వివరాలున్నాయి. 13 లో విశేషమైన తత్వ చర్చ ఉండి,మానవులు ప్రాకృతిక, శారీరక బంధాలను విసర్జించి  శ్రవణ, మనన, నిధిధ్యాస లను అలవరచుకొని, జపతపాలతో, ఆత్మనిగ్రహం,, విశ్వాసం లతో జీవించాలని చెప్పింది. 14 వ అధ్యాయం లో రెండే రెండు మంత్రాలున్నాయి. అవి 1-అహం బ్రహ్మాస్మి –ఇదే సకల వేదసారం 2-వ మంత్రం "మంత్రార్ధం తెలియకుండా వేదమంత్రాలను వల్లె వేసినవాడు తాను మోసే బరువు విలువ తెలియని జంతువు వంటి వాడు "అని చెప్పే మంత్రం.

15 వ అద్యాయం బ్రహ్మ నుంచి గుణ సంఖ్యా యనుడి వరకు గురుపరంపర వర్ణన విపులంగా ఉన్నది.

బృహదారణ్యకం –శుక్ల యజుర్వేద బ్రాహ్మణం లో శత పథ బ్రాహ్మణం కు చెందిన ఆరణ్యకం బృహదారణ్యకం. మాధ్యందిన శాఖ కు చెందినది. తైత్తిరీయ, కథారణ్య కాల లాగానే ఇది ప్రవర్గ్య కర్మకాండను గురించి విపులంగా చర్చించింది. బృహదారణ్య ఉపనిషత్ ను అనుసరించింది.

రహస్య బ్రాహ్మణాలు –ఆరణ్యకాలు బ్రాహ్మణాల కొనసాగింపే. బ్రాహ్మణాలలో చెప్పబడని రహస్య కర్మకాండల గురించి చర్చించటం వలన రహస్య బ్రాహ్మణం అనే  పేరొచ్చింది.

మొత్తం మీద మనకు తెలిసిందేమిటి ?ఆరణ్యకాలు ముఖ్యంగా 1- బ్రహ్మ విద్య 2-ఉపాసన 3- ప్రాణ విద్యను బోధిస్తాయి. యజ్న యాగాదులు కర్మకాండలలోని  రహస్యాలను వివరిస్తాయి. మైత్రేయి –యాజ్ఞవల్క్యుల మధ్య జరిగిన చర్చలు  చిన్నకథలు,వాటి అంతరార్ధం తెలియ జెప్పుతాయి. కర్మ కాండ కు, జ్ఞానకాండకు మధ్య సేతువుగా ఉంటాయి. అంటే బ్రహ్మవిద్యకు ఉపాసనకు మధ్య అంతరాన్ని తొలగించే వంతెన లా ఉంటాయి. భౌగోళిక చారిత్రిక సాంస్కృతిక విశేషాను తేటతెల్లంగా వివరిస్తాయి.

మనవి –బ్రాహ్మణాలు గురించి రాసిన చాలాకాలానికి మనోరణ్యం లో చిక్కుకున్న ఆరణ్య కాల గురించి ఇవాళ రాయటానికి ముఖ్య కారకులు శ్రీ సింగపూర్ శ్రీధర్.  ఆయన ఫోన్ చేసి అడగక పొతే ఇప్పుడప్పుడే రాసి ఉండేవాడిని కానేమో !ఆయన ప్రేరణే ఇవాళ ఉదయం  9-30 నుంచి మధ్యాహ్నం 1-30 వరకు  కదలకుండా కూర్చుని దాదాపు నాలుగు గంటలు రాసి పూర్తి  చేశాను. కనుక ఈ ఆరణ్యకాలు శ్రీ సింగపూర్ శ్రీధర్ గారికి అంకితస్తే సముచితమని భావించి ఆయన అనుమతిలేకుండానే అంకిత మిస్తున్నాను  –దుర్గాప్రసాద్

ఆధారం –ఇంగ్లిష్, తెలుగు వీకీ పీడియా.ఇంతకు మించిన వివరాలు నాకు దొరకలేదు.

## ధర్మశాస్త్రాలలో బ్రాహ్మణుడు

విద్యావారిధి డా.శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సంస్కృతాంధ్రాలలో గొప్పకవి శేఖరులు. 30కి పైగా గ్రంథాలు రాశారు. వారి విద్వత్తుకు వెలకట్టటం అసాధ్యం.  వేద,శాస్త్ర పురాణాదులలో విస్తృత పరిశోధన బహు గ్రంథాలపరిశీలన చేసి ఇటీవలే "ధర్మ శాస్త్రాలలో బ్రాహ్మణుడు "అనే చిన్నపుస్తకం ప్రచురించి, నాకు  ఆత్మీయంగా నవంబర్ 20 న పంప,వెంటనే చదివేశాను. వారి లోతైన అవగాహన కు ఆశ్చర్యపోయాను. వారేది రాసినా అంతటి నిశిత పరిశీలన ఉంటుంది. అందరికి అర్ధమయ్యే తీరులో చక్కగా రాశారు. అందుకు అభినందనలు. అందులోని ముఖ్య విషయాలు మీకు అందజేస్తాను.




ప్రారంభం లోనే శాస్త్రిగారు భోజమహారాజు చెప్పిన ఒక శ్లోకాన్ని ఉల్లేఖించి తమ ప్రణాళికను అమలు చేశారు –”ఉచ్చైర్గతి ర్జగతి సిద్ధ్యతి ధర్మ తశ్చేత్-తస్య ప్రమాచ వచనైః కృత కేతరై శ్చేత్-తేషాం ప్రకాశన దశా చ మహీసురై శ్చేత్-తా నంతరేణ నిపతే త్క్వనుమత్ప్రణామః –”

భావం –ప్రపంచం లో ఉన్నతమైన ధర్మం వలన నే మానవులకు లభించేట్లయితే, ఆ ధర్మ స్వరూపం వేదాలచే చెప్పబడితే, ఆ వేదాలు బ్రాహ్మణుల వలననే లోకం లో ప్రచారమౌతుంటే, ఆ బ్రాహ్మణుడికి తప్ప నానమస్కారం ఇంకెవరికి చెందుతుంది?

కాళిదాసు సరస్వతీ అవతారం. భోజుడు బ్రహ్మ అవతారం. అసలు బ్రాహ్మణుడు అంటే ఎవరు ?”బ్రహ్మత్వం బ్రహ్మ విజ్ఞానాత్ “అంటే పరబ్రహ్మ జ్ఞానం కలవాడే బ్రాహ్మణుడు. మహాభారతం “యః క్రోధ మోహౌత్యజతి తమ్ దేవా బ్రాహ్మణం విదుః”అంటే రాగద్వేషాలు లేకుండా ఇంద్రియాలను జయించినవాడు బ్రాహ్మణుడు అని దేవతలు చెబుతున్నారు అన్నది. బ్రాహ్మణ ఆచార విధానాలు అనుసరించినవాడు ద్విజుడు. వేదం నేర్చి విప్రుడు, బ్రహ్మజ్ఞానం పొందటం వలన బ్రాహ్మణుడు ఔతాడు. బ్రాహ్మణ ధర్మాలు చాలాఉన్నాయి. అన్నీ పాటించటం కష్టం. కనీసం వాటిని తెలుసుకోవాలి. ఒకసారి గరుత్మంతుడు బోయ వాళ్ళనందర్నీ తింటూ ఒక వ్యక్తిని తినలేక కక్కేస్తే, తల్లి వినత “అతడిని తినలేవు ఎందుకంటె అతడు బ్రాహ్మణుడు “అని చెప్పిందని శంకరాచార్యులు తమ బ్రహ్మ సూత్ర వేదాంత భాష్యం లో “రక్షితే హిబ్రాహ్మణత్వేరక్షిత స్స్యాత్సర్వతో హి వైదికో ధర్మః “అని చెప్పారు.

ధర్మ శాస్త్రాలలో మను ధర్మ శాస్త్రం ప్రాచీనమైనది. బ్రహ్మ దేవుని నుంచి మనువు అవతరించాడు “యద్వైకిం చ మను రవదత్ తద్ భేషజం “అన్నది వేదం ప్రపంచం లో అధర్మం అనే అనారోగ్యాన్ని పోగొట్టే దివ్యౌషధమే మనువు చెప్పాడు. మను చక్రవర్తి,శత రూప అనే తన ధర్మపత్నితో బ్రహ్మావర్త క్షేత్రం లో బర్హిష్మతి నగరం లో దర్భాసనంపై కూర్చుని, ఏకాగ్రమనసుతో, యజ్ఞ పురుషుని ధ్యానిస్తూ, విష్ణుకథలు వింటూ భృగువు మొదలైన మహర్షులకు ధర్మతత్వం బోధిస్తూ 71యుగాలకాలం భూమండలం పై యోగులు ప్రాణ శక్తిని రక్షించు కొన్నట్లు రక్షించాడు. భృగువు నుండి శిష్యులకు, ప్రశిష్యులకు మనుధర్మం వ్యాపించి “మను స్మృతి “అయింది. దీనికి “కుల్లూక భట్టు ““మన్వర్ధ ముక్తావళీ”అనే గొప్ప వ్యాఖ్యానం రాశాడు.

ముఖ్య బ్రాహ్మణ ధర్మాలు –వేద, శాస్త్ర పురాణాలు నేర్వటం వాటిని ఇతరులకు బోధించటం,యజ్ఞాలు చేయటం చేయించటం, దానాలు గ్రహించటం, దానాలివ్వటం అనే ఆరు షట్కర్మలు విధిగా చేయాలి.. బ్రాహ్మణులకు ఆచారం ముఖ్యం. అంటే తనకు తానూ క్షేమం కలిగించుకోనేదే ఆచారం.. ధర్మాలను ఆచరిస్తే ఈలోకం లో కీర్తి, పరలోకం లో ఉత్తమ స్థితి కలుగుతుంది, బ్రహ్మావర్త దేశం అంటే ?భారతదేశం లో సరస్వతి, దృషద్వతి నదులమధ్యభాగం. దీని తర్వాత బ్రహ్మర్షిదేశం గొప్పది. కురుక్షేత్రం మత్స్య నగరం, పాంచాల శూర దేశాలే బ్రహ్మావర్తం. తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన అరేబియా సముద్రం, ఉత్తరాన హిమాలయం దక్షిణాన వింధ్య పర్వతాల మధ్య ఉన్నదే ఆర్యావర్తం.

గృహస్థులు అయిదు యజ్ఞాలు –వేదాలు నేర్వటం నేర్పటం, పితృదేవతలకు పిండాలు, నీటితో తృప్తి చెందించటం, హోమం అనే దేవ యజ్ఞం చేయటం, భూతబలి అంటే చిన్నప్రాణులకు ఆహారం ఇవ్వటం, మనుష్యయజ్ఞం అంటే అతిధులను గౌరవించి తృప్తి పరచటం చేయాలి. బ్రాహ్మణ జీవిత విధానం ఎలాఉండాలి ?ఇతరులకు ద్రోహం చేయరాదు, సత్యం తో జీవించాలి. లభించినదానితో సంతృప్తి చెందాలి. ఆత్మ సంతృప్తియే అన్ని సుఖాలకు మూలం అని గ్రహించి జీవించాలి. అగ్ని హోత్రాన్ని నోటితో ఊదకూడదు. అపవిత్రవస్తువులు అందులో వేయరాదు. విధి యజ్ఞం కంటే జప యజ్ఞం పది రెట్లు గొప్పది మానసిక జపం శ్రేష్టం. మితభోజనం మంచిది. ప్రతినమస్కారం చేయటం తెలియనివాడికి నమస్కారం

చేయరాదు. ఎవరినైనా "క్షేమంగా ఉన్నారా ?"అని పలకరించాలి. విద్యకు, వయసుని బట్టి గౌరవం చూపాలి. జ్ఞానం వలననే గొప్పతనం వస్తుందని తెలియాలి. సన్మానం అంటే భయపడాలి..

తల్లిగర్భం నుంచి వచ్చినది మొదటిజన్మ. ఉపనయనం తర్వాత రెండవ జన్మ. యజ్ఞాలలో దీక్షవహిస్తే మూడవ జన్మ. వేద శాస్త్రాలు చదివే ముందు గాయత్రి చెప్పాలి. నిత్యస్నానం విధి. భారతం కర్ణ పర్వం లో శివుడు త్రిపురాసుర సంహారానికి భూమి రథంగా, సూర్య చంద్రులు చక్రాలుగా గాయత్రి రథానికి పైనకట్టే త్రాడుగా "గాయత్రీ శీర్ష బంధనా "గా మారారని ఉంది. "కస్సవితాకా సావిత్రీ స్తన యిత్నురేవ సవిత్రీ విద్యుత్సావిత్రీ సయత్ర స్తన యిత్నుః"-"తద్వి ద్యుద్యత్రవావిద్యు త్తత్ర స్తన ఇత్యుస్తే ద్వేయో నీతదేకం మిధునం "అనే సావిత్ర్యు పనిషత్ లో చెప్పినట్లు మేఘాన్ని సవిత్రుడని, మెరుపును సావిత్రిఅని భావన చేయాలి చంద్రుని సవిత్రునిగా, నక్షత్రాలను సావిత్రిగ భావించాలి. గాయత్రి గురించిన జ్ఞాని శాశ్వతుడౌతాడని భీష్మ పర్వం లో ఉంది. "యోవా ఏతాం సావిత్రీ మేవం వేద స పునర్మృత్యుం జయతి"గాత్రీ మంత్ర తత్త్వాన్ని గుర్తించినవాడు మృత్యువును జయిస్తాడని వేదమే చెప్పింది.

ప్రపంచకర్త ఈశ్వరుడే. తార్కికులు"జగతాం యది నో కర్తా కులా లేన వినాఘటః, చిత్రకారం వినా చిత్రం స్వత ఏవభవేత్తతః "అన్నారు – చిత్రకారుడు లేకుండా చిత్రం, కుమ్మరి లేకుండా కుండా, రానట్లే ఈశ్వరుడు లేకుండా ప్రపంచం రాదు. చిత్ శక్తి, చేతనా శక్తి, జడ శక్తీ అన్నీ శక్తి రూపాలే అని సప్త శతి చెప్పింది –"చిచ్చక్తి శ్చేతనా రూపా శక్తిర్జ డాత్మికా"

సంధ్యావందనం లో" హరి, హర అభేద స్మరణం "అనే అంశం ఉన్నది.

ఇంకా చాలా చెప్పారు శాస్త్రిగారు. కాని అందులో చాలా వాటిని ఇప్పుడున్నకాలమాన పరిస్తి స్థితులనుబట్టీ, ఉద్యోగ ధర్మాలను బట్టీ, అంటే నైట్ డ్యూటీలు, షిప్ట్ డ్యూటీలు, ఒక్కోసారి ఇరవైనాలుగుగంటల డ్యూటీలు ఉన్న వాళ్ళు, అలాగే అపార్ట్మెంట్ కల్చర్ లో, మహిళలకు ఉన్న రుతుసంబంధ ఇబ్బందులు, ఆడవాళ్ళూ డ్యూటీలలో ఉండటాలు, తప్పని సరి విదేశీయానాలు, అక్కడ ఉద్యోగాలు మొదలైనవాటివలన అనుసరించటం కష్టం అని నేను వాటి జోలికి పోలేదు. దీనికి శాస్త్రిగారు మన్నిస్తారని భావిస్తాను.

ఈ అమూల్యగ్రంథాన్ని (వెల-60రూపాయలు )పొన్నూరు బ్రాహ్మణ మహాసభ కార్యదర్శి, ఆంధ్ర ప్రదేశ్ బ్రాహ్మణ సేవా సంఘ సమాఖ్య రాష్ట్ర కార్యనిర్వహణా కార్యదర్శి శ్రీ పులిపాక వెంకట సత్య సాయి వరప్రసాద్ గారు ప్రచురించి శాస్త్రిగారికి కుడిభుజంగా నిలిచారు. ఈ పుస్తకం ప్రతి బ్రాహ్మణుడికి అంది, మానసిక పరిణతి, ఆధ్యాత్మికాభి వృద్ధి కలుగుతాయని విశ్వాసంతో రచయిత శాస్త్రిగారు, ప్రచురణకర్త వరప్రసాద్ గారు ఉన్నారు. వారి ఆశయం సఫలమవ్వాలని ఆశిద్దాం

శ్రీ గాయత్రీమాత సుందర ముఖచిత్రం తో పుస్తకం తేజో విరాజమానంగా ఉండటం ప్రత్యేకత.

## మరుగున పడిన మతాలూ మతా చార్యులు

సాహితీ బంధువులకు –శుభ కామనలు –పై శీర్షిక తో ఈ రోజు నుంచి ఒక కొత్త సీరియల్ ప్రారంభిస్తున్నాను. లోతుగా చర్చించ కుండా ముఖ్య మైన విషయాలనే ప్రస్తావించి, మరుగున పడిన మతాలను మాతా చార్యులను గురించి సంక్షిప్తం గా తెలియ జేయటమే నా ముఖ్యం గా భావించి చేస్తున్న ప్రక్రియ.

### లోకాయతనం

దీనికే కాపాలిక మతం అని ఇంకోపేరు. దీని లో స్త్రీ, పురుష విచక్షణ లేదు ఫ్రీ లైంగిక సంపర్కం ఉంటుంది. ఈ విషయం గుణ రత్న మొదలైన వారు చెప్పారు. తాంత్రిక విద్య ఇందులో ప్రధానం. వీరికి "దేహమే సర్వస్వం సంభోగమే పరమార్ధం ". ఇది ఒక రకం గా బౌద్ధం లో ఒక భాగం అయిన "సహజీవ "సిద్ధాంతం లాంటిది అని అంటారు. ఇందులో "ఉరు" భౌతిక వాదమే ఉన్నదని దేవీ ప్రసాద్ రాయ చట్టోపాధ్యాయ తెలిపాడు లోకాయుతులకు" మద్యం మాంసం మైదునం" అంటే"మకార త్రయం" మీద మక్కువ ఎక్కువ. ఇది చౌక రకం కాదని "పర లోకాన్ని, ఆత్మను, నిరాకరించి, ఇహలోకం లో సుఖం గా బతకండి "అనేదే ఆదర్శం అని చెప్పారు లోకాయతులు. ప్రతి వాడు తన సుఖాన్ని,తన లాభాన్ని సాధించాలి. ఆదర్శాన్ని గట్టున పెట్టాలి, కట్టు బాట్లు తెగ గొట్టాలి మర్యాద ను మట్టుబెట్టాలి. వీటన్నిటికి కవరింగ్ గా తాము కాపాలికులమని

తాన్త్రికులమని దండన కు భయ పడి చెప్పుకోవటం అలవాటైందని విశ్లేషకుల భావన. గ్రీకు తత్వ వేత్త ఎపిక్యూరస్ సిద్ధాంతాలకూ ఇదే గతి పట్టింది.



లోకాయతనానికి "బృహస్పతి "ప్రవర్తకుడు అంటారు. ఇతను రాసినవే "బృహస్పతి సూత్రాలు" అని పిలువ బడినాయి. పతంజలి, భాస్కరుడు(బ్రహ్మ సూత్రానికి భాష్య కర్త ) లోకం లో లోకాయతనం అనే మతం ఉందని చెప్పారు., లోకాయతన భాష్య కర్త "భాగురి "అని పతంజలి చెప్పాడు. భాగురి క్రీ. పూ.150 కి పూర్వపు వాడని అభిప్రాయం. పది హేడవ శతాబ్దం లో జయశ్రీ రాసిన "తత్వోవ ప్లవ "అనే గ్రంథాన్ని రాసి బృహస్పతిని తన గురువు గా చెప్పుకొన్నాడు. అన్ని ప్రమాణాలను యితడు నిరాకరించాడు.

లోకాయతులు ప్రత్యక్ష ప్రమాణాన్ని మాత్రమె అంగీకరించారు. అనుమానం మొదలైన ప్రమాణాలను కాదన్నారు. అన్ని వస్తువులూ నాలుగుభూత సముదాయమే, ప్రపంచానికి అంతటికి స్వభావం తప్ప ఇంకే కారణం లేదు అన్నారు. "శరీరం లేక పొతే చైతన్యం లేదు జడ భూతాల వికారం లో చైతన్యం కలుగుతుందని వీళ్ళ మతం. "రాజు లేకశాసకులు నిర్మించే విధులే ధర్మాలు. అవి అపౌరుషేయాలో, నిత్యమైనవో కాదు. రాజ నియమ బద్ధ మైన సౌఖ్యం, అర్ధ కామాలను సాధించటం "అనేది లోకాయతన వాదం. మనకు కనపడని పార లౌకిక సుఖ వాంఛ లతోనో, పుణ్యం, పాపం అనే భ్రమ తోనో సుఖం రాదు. కనబడే ఇహ సుఖాలను ఉల్లంఘించటం మూర్ఖత్వం, శాసనాలకు లోబడి అన్ని సుఖాలు పొంది బతకాలి "అన్నదే లోకాయతుల మత సారం.

ఇప్పుడు దీని ప్రభావం లేదు. ఉన్నా ఏ మారు మూల హిమాలయ ప్రాంతాలోనో ఉంది ఆచరణకు అ సాధ్యంఅని, అతి అని, జుగుప్స, అని పించటం వల్ల కను మరుగైంది లోకాయతనం

## టావో మతం

చైనా దార్శనికుడు కన్ ఫ్యూజియాన్ కంటే యాభై ఏళ్ళ ముందు పుట్టిన "లా వోట్జు "ఒక గొప్ప తత్వ వేత్త. ఆయన ప్రవచించిందే టావో మతం.అతను "టావో టే చింగ్ "అనే గ్రంధాన్ని రాశాడు. చైనా లో హోవాన్ రాష్ట్రం లో క్రీ పూ.604 లో జన్మించి నట్లు తెలుస్తోంది. చౌ రాజు

ఆస్థాన ఉద్యోగి. ఆ రాజ్య పతనాన్ని ముందే ఊహించి ఉద్యోగానికి రాజీ నామ చేశాడు. ఏకాంత అజ్ఞాత సన్యాస జీవితం గడిపాడు. కొంతకాలాని ఆ రాష్ట్రాన్ని వదిలి కొండలు ఎక్కి పడమట వైపుకు వెళ్ళాడని అంటారు అక్కడ పర్వత దగ్గరున్న ఒక రాజు "ఇన్ హి" కి తన మతాన్ని బోధించాడు. తాను రాసిన గ్రంధాన్ని అతనికి అంద జేశాడు. కంఫ్యూసియాన్ ను రెండు సార్లుఈయన్ను కలుసుకోన్నాడని ఒక ఐతిహ్యం ఉంది.



అతని గ్రంధం క్రీ పూ. 300 నాటిదని భావిస్తారు. చువాంగ్ చూ అనే ప్రసిద్ధ తత్వ వేత్త లా వోట్జూ ను ప్రశంషించాడు. క్రమం గా లా వోట్జూ అమరజీవి అని మహిమాన్వితు డ ని ప్రచారం జరిగింది. అంతకు ముందే దశావతారాలు దాల్చాడని అన్నారు. క్రీ. పూ.221 లో చక్ర వర్తి "చిన్ హిష్ హువాంగ్ టి "తో బాటు క్రీ. పూ..140-86 లో రాజ్యమేలిన" పూ చక్ర వర్తి "కూడా టావో మత ప్రభావానికి లోనైనారు. టావో మతం లో అమరత్వాన్ని పొందే మూలికల సంపాదన, రసాయనాల తయారీ, అంధ విశ్వాసాలకు బానిసలవటం ముఖ్య భాగం. అసలు లావోత్జూ బోధలన్నీ పక్కకు నెట్ట బడ్డాయి. పూ చని పోయిన తర్వాతా ఈ విశ్వాసాలన్నీ తగ్గి పోయి అసలు బోధలు వెలుగు లోకి వచ్చాయి.



క్రీ. శ 147-168ప్రాంతపు హవాన్ చక్ర వర్తి టావో మత ప్రభావం లో పడ్డాడు. అప్పటి నుంచి లా వోట్జు పుట్టిన చోట ఉన్న అతని ఆలయం లో చక్ర వర్తి బలులను ఇప్పించే ఏర్పాటు చేశాడు. మళ్ళీ ఆ మతం క్షీణించింది. తర్వాతా 424--452 మధ్య ఉన్న "టాయ్ ఉ టీ చక్ర వర్తి "మతాన్ని వ్యాప్తి చేశాడు. 477-500 లో టాయ్ హో చక్ర వర్తి ఎన్నో ఆలయాలు మఠాలు నిర్మించాడు క్రమంగా అంతకు ముందు నుంచే క్రతువులు చేయటం ప్రారంభ మైంది. ఇలా పాలకుల ను బట్టి ఈ మతం ఉత్థాన పతనాలు పొందింది

టావో అంటే మార్గం అని అర్ధం. ప్రజల జీవిత విధానం, ప్రకృతి విధానం, పర తత్త్వం అనే వాటికి కూడా టావో శబ్దం వర్తిస్తుంది. "ఏ సూత్రాన్ని అనుసరించి ప్రపంచం లోని ప్రక్రియ లన్నీ జరుగుతున్నాయో అదే టావో ".నీతులన్నీ దేన్నీ అనుసరించటానికి ప్రేరణ పొందుతాయో అదే టావో. మనుష్యులు స్వభావ సిద్ధం గా నడచే బాట టావో. సూర్య చంద్రాదుల గతి, పృధ్వి సంచారమూ టావో. అన్ని వస్తువుల సహజ స్వభావం సారమే టావో. కనుక ఒక రకం గా టావో అనేది అనిర్వచ నీయం అని పిస్తుంది. జీవన్మరణాలు సత్తు అసత్తు చక్ర భ్రమణం గా ఒక దాని తర్వాతా ఒకటి వస్తుంది. "ద్యావా పృధ్వి లప్రారంభం అసత్. ప్రపంచ వస్తువు తల్లి సత్. వీటి విపర్యయం వల్ల మొదటి దాని ఆశ్చర్యం రెండవ దాని సాన్తత్వం కనీ పిస్తుంది సద సత్తుల యోని పరమ రహస్య మైన టావో. కనీ పించే ప్రపంచా విర్భానికి ముందే అది ప్రవర్తిల్లింది. అది శాంతం శూన్యం ఏకాకి. నిర్వికారం. దీని స్వభావం తెలుసు కోవటం ఎవరి తరం కాదు. అది ద్వంద్వా తీతం. టావోయే అన్నిటికి మూలం ఆధారం. అది నిష్క్రియం అయినా అన్నిటినీ స్వాభావికం గా చేస్తుంది.

టావో ను అనుసరించిన వారిలో "టే"అనేది కనీ పిస్తుంది. అంటే మంచి ప్రవర్తన,ధర్మం నైతిక శక్తి మార్గ దర్శనం అన్న మాట. స్వభావాన్ని అనుసరించే వాడు ఏపని చేయక పోయినా చేసి నట్టే లెక్క. అనిదీనిని "వెయ్ వు వెయ్ 'అంటారని గ్రంధం లో ఉంది అంటే నిష్క్రియ అయిన క్రియ, నిరాకారమైన కర్మ. అని భావం. మనిషి నిష్క్రియుడై, నిశ్చలుడై, స్థిరుడై, శాంతుడై నిర్లిప్తుడై తన ద్వారా టావో ను పని చేయ నిస్తే ఈ స్తితి కలుగుతుంది.,

క్రీపూ..369-286 మధ్య చువాంగ్ టావో మతాన్ని అభి వృద్ధి చేశాడు. యితడు తార్కికుడు గ్రంధ కర్త. రాజు ప్రధానిని చేస్తానని పిలిచినా తిరస్కరించాడు టావో కు సత్తా సాక్ష్యం ఉన్నాయని చెప్పాడు. క్రియ ఆకారం లేవు. అది సంక్రమించటానికి వీలుంది కాని గ్రహించే వీలు లేదు.

ప్రతి వాడు నిష్కళం కం గా సదా చారం తో ప్రవర్తిస్తే ప్రభుత్వమే అక్కర్లేదు. అన్ని దృక్పధాలు ఆచారాలు సమానమే. కనుక వస్తువులలో ఉన్న భేదాలను వదిలి అనంతత్వం గురించే యోచన చేయాలి. సమస్త వస్తువుల ఏకత్వమే ఈ విశ్వం. ఏకత్వం లో మమైకం కావాలి. జ్ఞానాన్ని వదిలేస్తే అనంతం లోఏకమవుతారు. కేవలం తన స్వభావం వల్లనే ఆనందం వస్తుంది.

"'నాతో బాటు అన్ని వస్తువులు ఒక్కటే. భూమి ఆకాశం నాతో బాటే వచ్చాయి. "అనే అను భూతిని పొంది చావు పుట్టుకలు సుఖ దుఖాలు మంచి చెడు అనే ద్వంద్వాలను సమానం గా చూసే వారి స్వేచ్చ, నిరపేక్షం పరి పూర్ణం.అలాంటి పూర్ణ పురుషుడికి ఆత్మ ఉండదు. అలాంటి ఆధ్యాత్మిక మానవుడికి ఏపనీ చెయ్యాల్సిన అవసరం లేదు. అతడు ఋషి తుల్యుడు ఆ ఋషికి పేరు ఉండదు. "ఇదే చువాంగ్ ట్చు "మతం లోని సారాంశం.

## మోత్జు మతం

చైనా దార్శనికుడు కంఫ్యూజియాస్ కంటే తర్వాతి కాలం వాడైన మోత్జు హోవాన్ రాష్ట్రం లో కాని లూ రాష్ట్రం లో కాని పుట్టి ఉంటాడని చరిత్ర చెబుతోంది కాలం క్రీ. పూ. 468-376గా ఊహిస్తున్నారు ఇతని మతాన్ని "ఉపయోగితా వాదం "అంటారు ఉపయోగం లేక లాభం, నిర్వహణ లను గురించి ఎక్కువ గా చెప్పాడు మంచి చెడులను వాటి ఉపయోగాలను బట్టి వాటి వినియోగాలను బట్టి నిర్ణయించాలి. ప్రాచీన విజ్ఞానులు నడచిన బాటలో నడవటం "ద్యాన్ ",పితరులు చెప్పిన ఆజ్ఞలనుపాలించటం చేయాలి ఇవే నాటిక నిర్ణయాలకు ఆధారం. సాధారణ జనం యొక్క ఇంద్రియ జ్ఞానం చేత రుజువైన నిర్ణయమే సరైనదిగా భావించాలి. వీటిని ప్రజా పాలనకు లాభం చేకూరేట్లు అమలు చేయాలి. దేశానికి, ప్రజలకు లాభం అనేదే ఒరవడి రాయి గా భావించాలి.



ఆచరణకు సాధ్యం కాని సిద్ధాంతాలు విలువ లేనివే. ఇంతకీ లాభం అంటే ఎవరికి దేనికి ?దేశ సంపద, ప్రజా సంఖ్య, ధన ధాన్యాలు ప్రజల సంఖ్యను పెంచేదే సరైన నీతి విధానం. ఉపయోగం లేని వాటి పై డబ్బు దుబారా చేయకుండా ఉంటె సంపద పెరుగుతుంది. మగవారు ఇరవై ఏళ్ళకు ఆడవారు పదహారేళ్ళకు పెళ్లి చేసుకొని సంతానం పొందాలి. దీని వల్లనే ప్రజాభి వృద్ధి సాధ్యం. మనిషి ఎప్పుడూ ఫలించే పనే చేయాలి. అన్న వస్త్రా లిచ్చేవి శ్రమ తీర్చే పనులే ఉపయోగామైనవి. పనీ పాట లేకుండా రోజులు గడపటం పుట్టిన రోజులు చావు రోజుల్లో అశౌచం పాటించటం, గుళ్ళూ గోపురాలు కట్టించటం సంగీతాది కళల వల్ల ఏ ప్రయోజనమూ లేదు. ఇవన్నీ నిరర్ధక కర్మలు. వీటిని వదిలెయ్యాలి. ఉద్రేకం పనికి రాదు. కష్టించి పని చెయ్యాలి. మితం గా ఖర్చు చేయటం, ప్రజాభివృద్ధి శ్రేష్టం

బలీన రాజ్యాలను బలమైన వారు ఆక్రమించటం దుర్బలుల్ని మంచి వారిని బల వంతులు పీడించ రాదు మోసం అసలు పనికి రాదు. పీడన మోసం, అనేవి గొప్ప విపత్తులు. పాలించే వారికి దయ ఉండాలి పాలింప బడే వారికి విశ్వాసం ఉండాలి తండ్రికి ప్రేమ, కొడుకుకు పితృ భక్తీ తప్పని సరి ఇవి లేక పొతే లోకం లో ఘోర విపత్తులే జరుగుతాయి. ద్వేషం హింస, పక్షపాతం పతన హేతువులు. పక్ష పాతం లేని విశ్వ జనీన ప్రేమ (chien ai )ను అల వరచుకోవాలి. అందరిని తన లాగే భావిస్తే లోకం లో విపత్తులే ఉండవు. అందరూ ఇలా ప్రవర్తిస్తే విశ్వానికి అంతటికి లాభం చేకూరుతుంది మోసం దగా వల్ల తాత్కాలిక ప్రయోజనం కలిగినా అవి అందరికి కష్టం నష్టం కల్గిస్తాయి.

"ద్యాన్ "అనేది ఉందని అది విశ్వ ప్రేమ ను ఆచరణ లో పెట్టె వారికి ఉచిత ప్రతి ఫలాన్నిచ్చిబహు మానిస్తుందని మోత్జుచెప్పాడు విశ్వ ప్రేమ కలిగి ఉండాలి అన్నది "ద్యాన్ "యొక్క ఇచ్చ, ఆజ్ఞా కూడా. ద్యాన్ అందరికి వివేకాన్ని ఇస్తుంది కనుక అది అందర్నీ ప్రేమిస్తుంది,భరిస్తుంది ధరిస్తుంది అదే పూజలని యజ్ఞాలను బలుల ను తీసుకొంటుంది. నాగరకు లంతా దానికి బలుల ను సమర్పించి ఆరాధించాలి, ఈ ద్యాన్ అంటే ఈశ్వరుడే. ధర్మ రక్షణ అధర్మ శిక్షణ అదే చేస్తుంది ఈశ్వరుడే కాక పితరులు దేవతలు కూడా దుష్ట శిక్షణ శిష్ట రక్షణ చేస్తారు. వీరంతా మానవ కర్మలకు ఫలితాల నిస్తారు అంతే. మానవులనుభవించేది అంతా వాళ్ళు చేసిన దాని ఫలితమే తప్ప వేరే కాదు. అదృష్టం అంటూ విధి అంటూ ఊరికే కూర్చోకుండా ఎవరి పని వారు చేయాల్సిందే.

రాజ్యం, ప్రభుత్వం లేక పొతే ఎవడి ఇష్టం వచ్చి నట్లు వాడు ప్రవర్తించి విశ్వ శాంతికి భంగం కల్గిస్తాడు. ధర్మాత్ముడు, సమర్దుడైన వాడే ప్రభువు గా ఉండాలి. మొత్జు తరువాత క్రీ. పూ.221 కి ముందే అతని అనుయాయులు తర్కాన్ని ఆధారం గా చేసుకొని అతని బోధలను బల పరిచే ప్రయత్నం చేశారు. ఈ విషయాలు "మోచింగ్ "అనే గ్రంధం లో కనీ పిస్తాయి.. ఉపయోగానికి, లాభానికి విలువను ఎందుకు ఇవ్వాలి అనేదానికి ఇందులో సమాధానం చెప్ప బడింది ఏదైనా లభిస్తే సుఖం ఇచ్చేది లాభ ప్రదమైంది. సంప్రాప్తమైనప్పుడు అప్రియం చేసేది నష్ట ప్రదం. సుఖం ఇచ్చేదే లాభం దానికే విలువ. భవిష్యత్ లో శాశ్వత సుఖాన్నిచ్చేదే లాభ ప్రదం అందరికి లాభం చేయటమే ధర్మము, విశ్వ ప్రేమ ఉన్నప్పుడే అది సాధ్యం

మొత్జు అనుయాయులు విశ్వ ప్రేమ సాధ్యమా అన్న దాని పై కూడా చర్చించారు. అది సాధ్యమే నని నిశ్చయం గా చెప్పారు. ఎంతమంది ఉన్నారో తెలియ కుండా ఎలా ప్రేమిస్తాం /అన్నదానికి ప్రేమించటానికి సంఖ్య తో సంబంధం లేదని చెప్పారు. మానవులంతా ఎక్కడ ఉన్నా వారెవరో తెలియక పోయినా ప్రేమించటం సాధ్యమే. అన్నారు. మానవుల సంఖ్య పరిమితమే కనుక ప్రేమించటం సాధ్యమే మనుష్యులలో చెడ్డ వారు ఉంటారు కదా ఎలా? అన్నదానికి దుష్టుని లోని దౌష్ట్యాన్ని ద్వేషించాలి దాన్ని తొలగించటమే దుస్ట శిక్షణ. ఇది మానవ హింస లోకి రాదు అని నొక్కి చెప్పారు

## చార్వాక మతం



చార్వీ అనే ఆచార్యుని బట్టి ఆ మతానికి చార్వాక మతం అనే పేరొచ్చింది. ఈయన బృహస్పతి శిష్యుడు అని అంటారు. "బ్రతికి న్నన్ని నాళ్ళు హాయిగా ఉండండి "అని అందమైన అంటే" చారు " మాటలతో "వాక్ "తో చెప్పారు కనుక "చార్వాకం "అయింది. "తిను తిను "అనేదే వీరి ఉద్బోధ అందుకే ఆపేరు. తిను అంటే అనుభవించు అని అర్ధం గా భావించాలి. చర్వ్ అనే సంస్కృత ధాతువుకు "తినటం "అని అర్ధం. ఉంది కనుక ఆ పేరు సార్ధక మైనదని "గుణ రత్నుడు" అనే ఆయన ఊహించి చెప్పాడు.




కౌటిల్యుడు అర్ధ శాస్త్రం లో దీనిని, లోకాయతన మతం మొదలైన వాటిని కలిపి "అన్వీక్షికి "అని పిలిచాడు. వాల్మీక రామాయణం లో అన్వీక్షక ప్రసంగం ఉంది. అన్వీక్షకులు తెలివి లేని వారని వారిది బాల బుద్ధి అని అనవసరం గా వాగుతారని చెప్ప బడింది. ద్రుపద మహారాజు ఒక బ్రాహ్మణుని ద్వారా బృహస్పతి రాసిన వాటిని చెప్పించు కొన్నాడని అప్పుడు ద్రౌపది ఆమె సోదరులు కూడా దాన్ని విన్నారని మహా భారతం లో ఉంది. బౌద్ధ గ్రంధాలు వినయ పిటిక, అన్గుత్తర నికాయ లలో కొంత మంది బ్రాహ్మణులు చార్వాక లోకాయతాన్ని నేర్చుకొన్నట్లు కనపడుతుంది.. మను స్మ్రుతి దీని అనుయాయులను హైతుకులు పాషండులని, బిడాల ప్రతికులని తీవ్రం గా దుయ్య బట్టింది. వారు శిక్షార్హులనీ తేల్చింది. వీరు పరలోకాలను యజ్ఞాలను నిరాకరించటమే ముఖ్య కారణం. వీరితో బాటు నాస్తికులు కూడా లోకాయతులే అని "మేధా తిది "చెప్పాడు. "దత్తము, హుతము "పరలోకానివే అని నాస్తిక వాదం.

వీరికి ఉన్న తర్క ప్రావీణ్యాన్ని శుక్ర నీతి శాస్త్రం ప్రశంసించింది హేతువాదానికే ప్రాధాన్యత నిచ్చి వైదిక విధులను బహిష్కరించటం వల్ల వీరికి ఆదరణ లభించక క్రమం గా ఈ చార్వాకం కను మరుగైంది. భగవంతుని పై ద్వేషం, శృతి స్మృతులను నిరాకరించటం నిరాదరించటం, వీటిని చదివే వారిని శిక్షించటం వల్ల చార్వాకం ప్రజల నుండి దూరమైంది,

## స్యాద్ వాదము

స్యాద్ వాదం జైనం లో భాగమే. ప్రతి వస్తువులో అనేక ధర్మాలుంటాయి అన్నిటిని "అర్హతులు "మాత్రమె తెలుసుకో గలరు. సాధారణ జ్ఞానం ఉన్న వారు అందులో కొన్ని మాత్రమె గ్రహించ గలరు. ఇలా పాక్షికం గా ఏక దేశ నిష్టం గా వస్తు ధర్మాలను తెలుసుకోవటాన్ని "నయం "అంటారు. ఉన్నదాన్ని దేని నైనా అది ఉంది అని గ్రహించటం నయమే. కాని వేరే ద్రుష్టి తో వేరే విధం గా చూస్తె అది నిషేధింప బడుతుంది. అప్పుడే దాన్ని లేదు అన వచ్చు. కనుక దేనినైనా "ఇది ఉన్నదికావచ్చు "అని తెలుసుకోవటమే (సత్ స్యాత్ )జ్ఞానం. ప్రతి వస్తువు గురించి అంశ మాత్ర జ్ఞానం అంటే ఆ వస్తువు యొక్క ఏదో విశేషాన్ని నిరూపించటమే నయ వాదం. తీర్ధన్కురులు సర్వజ్ఞులు పూర్ణ పురుషులు కనుక వారి జ్ఞానం పూర్ణం.

ఉన్న వస్తువు గురించి "ఉన్నది "అని చెప్ప రాదు. ఎందు కంటే వర్త మాన కాలం లో ప్రస్తుత పరిస్తుతులలో అ వస్తువు ఉంది. అంటే అన్ని దేశ, కాల పరిస్తితులలో అది ఉండదు కదా. అందుకని దాన్ని "ఉన్నది కావచ్చు "(స్యాత్ ఆస్తి )అని చెప్పటమే సమంజసం.

ప్రస్తుతం ఉన్న ఒక వస్తువు గూర్చి "ఉన్నది కావచ్చు "అంటే "ఈ వేళ ఒక విశేష సమయం లో, ఒక విశేష రూపం లో ఆ వస్తువు ఉంది (స్యాత్ ఆస్తి )అనీ, లేనిది కావచ్చు అని (స్యాత్ నాస్తి )అంటే వేరొక చోట వేరొక రూపం లో ఆ వస్తువు లేదు అని అర్ధం కూడా. ఈ రెండిటి ని కలిపితే "వస్తువు ఉన్నదీ, లేనిదీ కావచ్చు ".అనే నిర్ణయానికి వస్తాం. దాని నిజ స్తితి అవ వ్యక్తం. ఉన్నది ఆవ వ్యక్తం కావచ్చు, ఉన్నది లేనిది కూడా కావచ్చు ఆవ వ్యక్తం కావచ్చు. ఇలా ఏ వస్తువు గురించి అయినా ఏడు విధాలుగా పాక్షిక, వైకల్పిక జ్ఞానాలు అంటే నయాలు ఉంటాయి. వీటినే "సప్త భంగీ నయం "అని అంటారు. ఏతా వాతా దేన్నీ గురించి అయినా ఇదమిద్దం గా ప్రతిపాదించటానికి వీలే లేదు. అందుకని "కావచ్చు "(స్యాత్ )అని మాత్రమె చెప్పగలం. ఈ వాదాన్నే స్యాత్ వాదం "అంటారు

సంజయుడు మొదట్లో పరలోకం దేవతు కర్మం ఫలం వంటి వాటి విషయం లో "ఉన్నది –లేదు కూడా "అని కానీ, 'లేదు –ఉన్నది కూడా "అనీ నాలుగు విధాలుగా ఏవిదం గా నైనా చెప్పగలమని 'ఏ'కాంత వాదం "అనే దాన్ని లేవ దీశాడు. దేన్నీ గూర్చి అయినా ఒక విధం గా (ఏకాంతం )గా, చెప్పలేం. దీని తర్వాత నే మహా వీరుడు "ఆత్మ ఉన్నది ",ఆత్మ లేనిది ",ఆత్మ ఆవ వ్యక్తం ",కావచ్చు. అని మూడు విధాలుగా చెప్పటానికి వీలుంది అని చెప్పాడు. ఇదే "త్రిభంగీ నయనం "దీని తర్వాత వచ్చిందే సప్త భంగి నయనం. అన్ని నయనాలను అంగీకరించటం చేత వస్తువుల సమగ్ర జ్ఞానం తెలుస్తుంది పాక్షిక బుద్ధి పోతుంది. తర్వాత పరి పూర్ణ జ్ఞానం లభిస్తుంది అర్హతులవుతారు.

## సర్వాస్తి వాదం

బుద్ధుడు చని పోయిన తర్వాత మూడొందల ఏళ్ళకు కాత్యాయనేఏ పుత్రుడనే ఆయన "అభి ధర్మ జ్ఞాన ప్రస్తాన శాస్త్రం "రాశాడు. కనిష్కుడి కాలం లో దీనికి "విభాష "అనే వ్యాఖ్యానం వచ్చింది. రెండూ గీర్వాణ భాషలో ఉన్నవే. మొదటిది బుద్ధుని వచనం అయిన "అభి దమ్మ పిటకం "ఆదారం గా కాత్యాయనీ పుత్రుడు తన జ్ఞాన ప్రస్థానాన్ని రాశాడు. సర్వాస్తి వాదం అనేది అంతా దీని మీదే ఆధార పడింది. "విభాష" ను ప్రమాణం గా తీసుకొన్న వారు వైభాషికులు అనే పేరుతొ పిలువ బడుతున్నారు. ఇప్పుడీ గ్రంధం చైనా భాష లో ఉన్న అను వాదం లో మాత్రమె దొరుకు తోంది. వైభాషి కులు మన దేశం లో కాశ్మీరం లో ఎక్కువ గా ఉండటం వల్ల "కాశ్మీర వై భాషికులు "అనే పేరొచ్చింది. సర్వాస్తి వాదు లందరూ దీన్ని ఆమోదించలేదని గ్రాహించాలి. కాశ్మీర్ లో వైభాషికులు కాని సర్వాస్తి వాదులున్నారు. కాశ్మీర్ వెలుపల ఉన్న వారిని బహిర్దేశీ యులని, పాస్చాత్యులని, అపరాన్తకులని అక్కడి సర్వాస్తి వాదులు అంటారు. ప్రసిద్ధ వైభాషి కులలో వసుమిత్రుడు, ఘోషకుడు, బుద్ధ దేవుడు, ధర్మ త్రాత, భదంతుడు ఉన్నారు.



కాశ్మీర వైభాషి కం ఆధారం గా వసు బంధుడు(క్రీ. శ నాల్గవ శతాబ్దం )అభి ధర్మం ను ఆరు వందల కారికలలో వివరించాడు దీనికే "అభి ధర్మ కోశం "అని పేరు. దీనికి వ్యాఖ్యానాన్ని స్తిర మతి వసుమిత్రుడు, దిగ్నాగుడు, యశో మిత్రుడు వసు మిత్రుని తో బాటు రాశారు. అయితే "కోశ కరక "అనే దానిలో సంఘ భద్రుడు ఖండించాడు.. ఇందులో తమాషా ఏమిటంటే వసు బంధుడు వై భాశికుడు కాక పోవటం. అయినా అతని గ్రంధం సర్వాస్తి వాదు లందరికి ఆదర ణీయం.

అయితే సర్వాస్తి వాదం లో ఉన్న ముఖ్య విశేషా లేమిటి ?ఇందులో అతీత అనాగత ధర్మాలు, స్వంత లక్షణాలున్న పదార్దాలు, కూడా ద్రవ్యం యొక్క సత్తు లే, అని త్రై యద్విక ధర్మాలు అస్తిత్వాన్ని ప్రతి పాదించే వారందరూ సర్వాస్తి వాదులే అని చెప్పాలి. బయటికి కనీ పించే రూపం, లోపల జ్వాలించే జ్ఞానం రెండు స్వతంత్ర మైనవే అని అంటారు వీరు. అన్నీ ప్రతీత్యం నుంచి వచ్చినవే. ఏదైనా ఆలంబనం అంటే ఆధారం లేక పోతే విజ్ఞానం రాదు. అతీత అనాగత వస్తువు లేక పోతే విజ్ఞానం నిరాలంబం అని పించుకొనటమే కాక అసలు ఏర్పడదు కూడా. అతీతం లేక పోతే అనాగత ములో కర్మ ఫలించదు. విపక్వ కాలం లో విపాకం గా ఉన్న కారణం అతీత మైనదే. కనుక అనిత్యమైనది. అతీతం అనాగతం అయినదాన్నే రూపం అంటారు.

ఇంతకీ ధర్మం అంటే –స్వంత లక్ష ణాన్ని ధారణ చేసేది అని అర్ధం. ధర్మాలు "వ్యవ కీర్నాలు "అంటే వాటిని ఏర వచ్చు, విభజించ వచ్చు. ధర్మ ప్రవిచయం ప్రజ్న అనే చిత్తం యొక్క ధర్మ లక్షణం. దీని వల్ల నిర్వాణం వస్తుంది. ఇదే పరమ జ్ఞానం. ధర్మాల స్వ లక్షణాలు, సామాన్య ఆక్షణం తెలుసు కొంటె నిర్వణ ప్రాప్తి కలుగు తుంది. ధర్మాలు రెండు రకాలు. మలిన మైనవి మలినం కానివి. ఆర్య మార్గాన్ని వదిలిన వన్నీ మలినమైనవే. మిగిలినవి మలరహితాలు. రూపం చేత ఆక్రమింప బడనిది, చుట్ట బడనిది ఆకాశం. ఇది పృధివి మొదలైన వాటి వలే భౌతికం తికం, ప్రతి సంఖ్య అనేది ప్రజ్ఞా విశేషం. ఏ ధర్మాన్ని గూర్చి రాగ ద్వేషాదులు ప్రతి సంఖ్య వలన నిరో దింప బడుతుందో, ఆ ధర్మం విషయం లోప్రతి సంఖ్యా నిరోధం జరుగును. ప్రతి సంఖ్య లేకుండా జరిగే నిరోధం అప్రతి సంఖ్యా నిరోధం అవుతుంది. ఏ ధర్మం విషయం లో ఇది జరుగుతుందో అది ఉత్పన్నం కాదు. వాటి గురించిన రాగాదులు ఇక ఎప్పటికీ కలగవు. ఈ మూడు అసంస్కృతులు., అద్వ వినిర్ముక్తాలు అని పించుకొనే ధర్మాలు

ఆత్మ అంటే ప్రజ్ఞాప్తి. స్కంద పంచకమే ఆత్మ, జీవుడు. ఇది అపరిణామ శాశ్వత పదార్ధం కాదు. సర్వాస్తి వాదులు శాశ్వత ధర్మాన్ని దేన్నీ కాని, ఒకే మూల కారణాన్ని కాని ఒప్పుకోరు. 14 రకాల పరమాణువులు ఉన్నాయి అని వీరు అంటారు. అవే అయిదు విజ్ఞాన కేంద్రాలు, అయిదు విషయాలు, నాలుగు మహా భూతాలు. రూపాలలో కెల్లా సర్వ సూక్ష్మ మైనవి పరమాణువులు. అవి ద్రవ్యాలు కావు. వీటికే "కలాపాలు అంటారు. ఉపచయం సంతతి, జరత, అనిత్యత ఇవే రూప కలాప లక్షణాలు. సర్వ సూక్ష్మ కాలం క్షణం అయి నట్లే, ప్రతిఘ తో ఉన్న రూపాల సర్వసూక్ష్మ భాగము పరమాణువు అని పిలువ బడుతుంది. అది రూప పర్యంతం మాత్రమె. కాని శాశ్వతం కాదు. వినాశం చెందుతుంది. అంత మాత్రం చేత నిత్యం కూడా కాదు. అని వీరి దార్శనిక భావన కొంచెం గందర గోళం గానే ఉంటుంది. అందుకే మరుగున పడి పోయిందేమో.

## శూన్య వాదం

ప్రజ్ఞా పారమితం ఆధారం గా ఆచార్య నాగార్జునుడు క్రీ శ175 లో శూన్య వాదాన్ని వ్యాప్తి చేశాడు. విగ్రహ వ్యావర్తిని, మాధ్యమికా కారిక మొదలైన గ్రంధాలు రాశాడు. మొదటి దానిలో 72 కారికలు, రెండవ దానిలో400 కారికలు ఉన్నాయి. వీటి వ్యాఖ్యానాలు కూడా ఆచార్యుడే రాశాడు.. క్రీ.శ.200-224 కాలం లో ఉన్న ఆర్య దేవుడు " చ తుహ్ శతక "లో శూన్య వాదాన్ని పరమత ఖండనం తో సమర్ధించాడు. క్రీ

శ.ఆరు వందల వాడైన చంద్ర కీర్తి "ప్రసంన్ పద "అనే టీకను శతక పై వృత్తి నీ రాశాడు. బుద్ధ పాలిత, భావ వివేకాదులు ఈ సంప్రదాయం లో ప్రసిద్ధ ఆచార్యులు.



శూన్యత అంటే ఏమిటో నాగార్జునుడు వ్యావర్త లో వివరించాడు. "ప్రతీత్య సముత్పాదన "మే శూన్యత అన్నాడు. అదే అనేక పదార్ధాలలో ఉన్న మధ్యమ పదం అన్నాడు. భావనలు నశించి, కొత్త భావాలలు పుట్టటమే శూన్యత. నిస్వభావత్వం వలన ప్రత్యాయా శ్రితాలై ఏర్పడే భావాలకు హేతు ప్రత్యయాపెక్షం ఉంది కనుక స్వభావం ఉండదు. అవి ఇతర ఆశ్రయాలలో ఉన్నాయి కనుక స్వభావం కాని అంతస్సారం కాని లేనివి అవుతాయి. ప్రతీత్య సముత్పాదాలైన భావాలు క్షణికాలు. "ఉంది లేదు, ఆ రెండు ఆ రెండూ కాదు "అని ఉత్పాద స్తితి లేని వాటి గురించి చెప్పలేదు ఇవి కోటులు అన్నాడు వీటి నుంచి వినిర్ముక్తమ్ ఆయె తత్త్వం ఆస్తి నాస్తి అనే రెండు మార్గాలను వదిలేసిన మార్గం కనుక మాధ్యమిక లేక మధ్యే మార్గం అన్నారు దీనిని.. వస్తు తత్త్వం శూన్యం. అంటే భావం అభావం లేనిది. సత్ స్వభావ అనుత్పత్తి లక్షణం అని చెప్పేదే మాధ్యమిక దర్శనం.

కర్మ యొక్క నిమిత్తం వల్లనే కారకం ఉందని చెప్ప వచ్చు. కర్మ ఉంది అని కారకం యొక్క నిమిత్తం చేత చెప్ప వచ్చు. ఇంకో విధం గా సత్తా సిద్ధించే కారణం లేదు. భావాలు తమ లో నుండి పుట్టవు. అలా అయితే దేని లోంచి అయినా ఏదైనా పుట్ట వచ్చు. ఈ రెండిటి లో దోషం ఉంది కనుక వీటిని కలపటం సరికాదు. భావాలు హేతువు లేనివి అని చెప్పటానికి వీలు కూడా లేదు. కారణం లేక పోతే ఫలం అనేది ఉండదు. కనుక అన్ని భావాలు దేని నుంచైనా ఉత్పత్తి కావచ్చు.

సత్ అనేదానికి ప్రత్యయం అవసరం లేదు అన్ని వస్తువు లకు పుట్టుక నాశనం పరస్పరం ఆశ్రయింప బడి ఉంటాయి. లోకం ఉంది అని నమ్మిన వాడిని లేదు అని చెప్పటం మోసమే. ప్రపంచం అవాస్తవం అనే మాట శూన్య వాదానికి విరుద్ధం కాదు. ప్రమాణాలు అసిద్ధాలు కనుక వాటి భావాల వాస్తవికత సిద్ధం కాదు. ప్రతీత్య సముత్పాదం వల్లనే భావాలలో శుద్ధ మైనది, కానిది అనే తేడాలు ఏర్పడుతున్నాయి. అంత మాత్తరం చేత ఇవి పరమార్ధాలు కావు. అలా కాక పోవటం చేత శీలం మొదలైన వాటి వల్ల మార్చలేము.

పదార్ధ తత్త్వం మనకు తెలియక పోవటానికి కారణం "సంవ్రుతి ".అంటే మొహం. అన్ని పదార్ధాలలో ఆవరించి ఉన్న అజ్ఞానం అన్న మాట. ఈ సంవ్రుతి వస్తువుల స్వభావాలను చూడ టానికి కప్పు గా, వాటి పై అసాధ్ స్వరూప ఆరోపణం చేస్తోంది. నిస్స్వభావాలు, సత్యాభాసితం అయిన వస్తువుల స్వభావం ఉన్న వానిగా, సత్యాలుగా కనిపింప జేసేదే సంవ్రుతి అంటే మిధ్య. లోకం దృష్టిలోనే ఇది సత్యం. అందుకే ఇది" లోక సంవ్రుతి సత్యం" అంటారు. ఇది ప్రతీత్య సముత్పన్నం, కృత్రిమం. కనుక దీనికి వ్యతిరేకం గా పరమార్ధ సత్యం మాటలతో చెప్పటానికి వీలు లేనిది అంటే అవాచ్యం. అది జ్ఞానం తో తెలియ దగినది కూడా కాదు. ఎవరికి వారు స్వయం గా తెలుసుకో దగినది. అవిద్యా వాసనా లేని వారు అంటే జ్ఞానులు ఏ దృష్టితో వస్తువు లను చూస్తారో అదే పరమార్ధ సత్యం. దర్శనం కాని, అంటే "ఆదర్శన న్యాయం " వల్లనే చూడ టానికి వీలవుతుంది. అది నిష్ప్రపంచ జ్ఞానం. అజ్ఞానం చేత ఆవ రింప బడిన సత్యాన్ని నిస్స్వభావం గా తెలుసుకోవటం యోగులకు మాత్రమె సాధ్యం.

పరమార్ధానికి ఉత్పాద, నిరోదాలుండవు. అది అనేకార్ధాలతో ఉన్నా "అనా నార్ధం"అయినది. దీనికి రావటం పోవటం ఉండవు. అది శివం. జ్ఞాన జ్ఞేయ వ్యవహారానికి అది నివ్రుత్తమైనది. కనుక అది జాత జరా మరణాలు లేనిది. మాధ్యమికులకు స్వంత పక్షం అంటూ లేదు ప్రతిజ్ఞా కూడా లేదు. కనుక వారికి స్వతంత్ర, అనుమాన ప్రయోగాలు అక్కర్లేదు. సత్ అసధ్, సదసత్, వీటిలో ఏ పక్షానికి వీరు చెందరు. దేన్నీ ప్రతి పాదించరు. ఇతరులు కూడా ఏ దోషాన్ని వీళ్ళకు ఆపాదించరు.. ప్రత్యక్షాదుల చేత ఏ వస్తువు ఉప లబ్ద మైనట్లు ప్రమాణం వీరికి లేనందున

మాధ్యమికులకు పక్షం అనేది లేదు. ఇతరుల ప్రతిజ్ఞాల నిషేధమే మాధ్యమికుల అనుమానాలు. వాళ్లకు స్వంత ప్రతిజ్ఞాలేవీ లేవు కనుక ఇతరులు వాళ్ళను ఖండించరు దూషించరు

అన్ని సంస్కారాలు మ్రుషాలు, మోష ధర్మాలు. నిర్వాణం ఒక్కటే అమోష ధర్మం, పరమ సత్యమని బుద్ధుడు చెప్పాడు. నాగార్జున మతం లో నిర్వాణం రాగాదుల లాగా ప్రహీనం కాదు. అది సంప్రాప్తం అయ్యే ఫలమూ కాదు. అశూన్య పదార్ధం లాగా నిత్యం కూడా కాదు. అది అనిరుద్ధం, అనుత్పన్నం. నిర్వాణం ఒక భావం కాదు అయితే అభావమూ కాదు. ఈ రెండూ కాదన్నాడు ఆచార్యుడు. "జనన మరణాలకు ఉపాదానం చేయని ఒక అప్రవృట్టి నిర్వాణం "అన్నాడు నాగార్జునుడు. ఇది భావం అభావం ఉభాయాత్మకం కాదు నిర్వాణం ఎవరి చేతా గ్రహింప బడదు అది ప్రకాశ మానం కూడా కాదు. అని మాధ్యమిక సిద్ధాంతం. ఒకరు బోధించటం ఒకరు విని ఆచరించటం సిద్ధమైనవికావు. బుద్ధుడు అనిర్వాణాన్నే నిర్వాణం గా చెప్పాడు. "ఆకాశం చేత వెయ బడిన ముడి ఆకాశం చేతనే విప్ప బడాలి అనేది శూన్య వాదం. "సరిగ్గా పట్టు బడని పాము, దుష్ప్రసాదితం అయిన విద్య, నాశన కారణాలు అయినట్లుగానే దుర ద్రుష్ట మైన శూన్యత మంద బుద్ధులను నాశనం చేస్తుంది "అని నాగార్జునుని శూన్య వాదం లోని పరమార్ధం. పరమార్ధాన్ని తెలుసుకోవటం కష్టం అంటాడు ఆచార్యుడు

## మహమ్మద్ ఇక్బాల్ మతం

మహమ్మద్ ఇక్బాల్ తత్వ, న్యాయ శాస్త్రాలను జర్మని గ్లాండ్ దేశాలలో చదివి అధ్యయనం చేశాడు. మంచి కవి.ఆధునిక యుగం లో మహామ్మదీయులలో గొప్ప దార్శనికు డని ప్రసిద్ధి చెందాడు ఇక్బాల్1877నవంబర్ తొమ్మిది న జన్మించి 1931 ఏప్రిల్21 న మరణించాడు ఆయన్ను "అల్లామా ఇక్బాల్ "అని కూడా పిలుస్తారు. ఉర్దూ, పార్శీ భాషల్లో ప్రావీన్యుడు పాకిస్తాన్ ఉద్యమ నేత కూడా. ఆయన్ను "లాహోర్ ఇక్బాల్"అంటారు. పెర్శియన్ భాషల్లో మట్లాడటం రాయటం చేశాడు 1922 లో కింగ్ జార్జ్ నైట్ హుడ్ ప్రదానం చేశాడు. ఆల్ ఇండియా ముస్లిం లీగ్ కు నాయకుడు. "షేర్ ఏ మార్శిక్ "అంటే "పోయేట్ ఆఫ్ ది ఈస్ట్" గా బిరుదు పొందాడు. "ముసాఫిర్ ఆఫ్ పాకిస్తాన్ "అంటే పాకిస్తాన్ ఆలోచనా జీవి "అని పిలువా బడ్డాడు. పాకిస్తాన్ ప్రభుత్వం ఇక్బాల్ ను "జాతీయ కవి "హోదా నిచ్చి గౌరవించింది ఉఅయన పుట్టిన రోజు ను "ఇక్బాల్ డే "గా నిర్వహిస్తున్నారు., ఆయన రాసిన "సారే జహాసె అచ్చా హిందూ సితార్ హమారా "గీతం జాతీయ గీతం గా భారత దేశం లో గౌరవం పొందింది.



ఆయనపై జలా లుద్దీన్ రూమి, బెర్గ్ సన్ మొదలైన వారి ప్రభావం ఎక్కువ. నివృత్తి అనే మాట ఇక్బాల్ కు గిట్టని మాట.జీవితం అంటే ప్రవృత్తియే అంటే యాక్టివిటి అన్నాడు. పాపం లో ఉంటూ అధర్మం తో పోరాడటం లోనే జీవితం ఉంది అని చెప్పాడు. ఈశ్వరుడిని ధర్మాన్ని అంగీకరించే వారందరూ మహామ్మదేయులే అని అభిప్రాయ పడ్డాడు. ఇస్లాం అంటే సత్యమే అన్నాడు. మహమ్మద్ ప్రవక్త దాన్ని సంపూర్ణం గా పొందాడు. ఇతరులకూ ఆయన సత్యాన్ని ప్రసాదించాడు. జాతి, పదవి, డబ్బు మహమ్మదీయులకు గొప్పదనాన్ని కలిగించవు. నీతి ఒక్కటే నిర్ణయిస్తుంది అస్తిత్వ కార్యాలన్నీ ఆత్మా చేయిస్నేవే. కనపడేది అంతా ఆత్మ యొక్క రహస్యమే. ఆత్మ సారం లో అనేక విశ్వాలుఉన్నాయి

ఆత్మ మేల్కొని సంవేదన చెంది తనను తాను ద్రుఢం చేసుకొంటుంది. అప్పుడు ఆలోచన జగత్తు ప్రకాశితం అవటం తో అనాత్మ వెలుగు లోకి వస్తుంది వ్యాపారం కోసం ఆత్మా శయి విషయాలుగా, సాధ్య, సాధనాలుగా ఇంకా ఎన్నో రూపాలుదాలుస్తుంది. కాలం అనేది ఆత్మకు రంగ భూమి. కాలం అనంతం కనుక ఆత్మ చేసేదంతా శాశ్వత ప్రాముఖ్యాన్ని పొందుతుంది.. ఇతిహాసం ఆత్మ కు తన స్వభావం తెలుసుకోనేట్లు చేస్తుంది. జీవితం అంటే నిరవచ్చిన్న చైతన్య తరంగం. కాలం యొక్క మూలాన్ని, దాని సత్ విషయాన్ని తెలుసుకోవటమే అక్షయ జీవిత రహస్యం.

లాహోర్ లో ఇక్బాల్ సమాధి ఉన్నది

జీవిత ధారణకు ఇచ్చ, తృష్ణ కారణాలు. అవే పరి రక్షణ చేసి లక్ష్యాన్ని ఏర్పరుస్తాయి. ఇచ్చ,, ఆదర్శం లేని వాడు చచ్చిన వాడితో సమానం. జీవితాన్ని తీర్చి దిద్దేది, సౌభాగ్యాన్ని కల్గించేది ఇచ్చ మాత్రమె మానవ నిర్వహణం అంతా యిచ్ఛయే. ధర్మం మీద ఆధార పడ్డ సంఘం తో తాదాత్మ్యం చెందటం వల్ల ఆత్మ అర్ధ వంతం అవుతుంది. సంపూర్ణ ఆత్మ వికాసానికి ప్రేమ ముఖ్యమైనది. ప్రేమ ఆత్మను సజీవం గా,ఇంకా కాంతి వంతం గా చేస్తుంది. ప్రేమ వల్లనే ఆత్మ యొక్క సత్తా ప్రకాశిస్తుంది. అప్పుడు ఆత్మ లో ఉన్న అజ్ఞాత శక్తులు వృద్ధి చెందుతాయి. అన్ని ఆదర్శాలకు, గొప్ప కర్మలకు కారణ మైన ఈశ్వరుని యందు కలుగు ఆనంద అతిరేక పూర్వ మైన శక్తి నే నిజమైన ప్రేమ అంటారు. "భగవత్ ప్రేమ చివరకు భగవంతుడే అవుతుంది "అని ఇక్బాల్ ప్రవర్త తన కవిత్వం, లో గ్రంధాలలో ఇస్లాం సారాన్నే తాను చెప్పానని ప్రకటించాడు.

## ఫాచియా మతం

ఫాచియా అంటే రాజ శాసన సంప్రదాయం. ధర్మం తో నీతి తో శాసనలతో ప్రభుత్వం పని చేయాలనేది వీరి సిద్ధాంతం. ప్రభుత్వం ప్రపంచం లో ఉన్న వస్తు స్తితి మీద ఆధారపడాలి కాని పరంపరా గతం గా కాని అలౌకిక సూత్రాల పైన కాని ఆధార పడరాదన్నది వీరి విశ్వాసం.



క్రీ. పూ. 319-301 లో "చి" రాష్ట్రాన్ని పాలించిన హుసువాన్ కాలంలో షేన్ టావో నుంచి, చాలా ఏళ్ళు మంత్రిగా ఉన్న షాంగ్ యాంగ్ వరకు ఈ అఆలోచనలను పాటించి ప్రభుత్వాలను నడిపారు. అయితే ఈ ఆలోచనలను సువ్యవస్తితం వ్వేసిన వాడు మాత్రం హాన పై ట్జు. షేన్ టావో మాత్రం టావో మతం పై విశ్వాసం ఉన్న వాడు అన్ని వస్తువులు సమానమే అయినా కొన్ని కొన్నిటికి మాత్రమె పని చేస్తాయి కనుక వీటిలో ఏరుకోవటం వల్లసమగ్రత రాదు కొంత భాగం మాత్రమె లభిస్తుంది. పూర్ణత్వం సిద్ధించదు. నిజానికి ఏ బోధ కూడా పూర్ణత్వాన్ని తెలుప లేదు. మంచి చెడు, కర్తవ్యాకర్తావ్యాలు యదార్ధం కానప్పుడు జ్ఞానం అనేది వ్యర్ధమే అవుతుంది. జరాగాల్సింది ఎట్లాగో జరిగి పోతుంది, పరిస్తితులకు అనుగుణం గా మారుతూ కష్ట సుఖాలు కలగని పద్ధతిలో మనిషి ప్రవర్తించాలి. ధర్మా ధర్మాలను లెక్క చేయ కుండా, ఉదాసీనం గా ఉంటూ అనుభావాలనుంది ఏదీ నేర్చుకోకుండా, భవిష్యత్తు గూర్చి ఆలోచించక జీవితాన్ని గడపాలి అని వీరి బోధ. షేన్ టావో ఇలాగే జీవించి నట్లు చువాంగ్ ట్జు గ్రంధం లో ఉంది

ప్రభుత్వ పాలనకు అధికారం, శక్తి మాత్రమెఅవసరం. మంచి గుణాలు, జ్ఞానంకావు ధర్మాత్ములు, జ్ఞానులు అణగి పడి ఉండటానికి కారణం అధికారం, శక్తి లేక పోవటమే. ఈ రెండు ఉంటేనే వారికి ప్రాభవం వస్తుంది. అప్పుడే రాణిస్తారు. పాలించే వాడి భయం వల్లే రాజ శాసనాలు అమలౌతాయి. అతని పట్ల ప్రేమ వల్ల కాదు పాలకుడి చేతిలో దండం ఉండాలి, దండనా ఉండాలి కఠినం గా వ్యవహరించి నప్పుడే పాలన సత్ఫలితాల నిస్తుంది ఆ శక్తి లేని పాలకుడు నిరర్ధకం.

బాధ్యతలను బట్టి పదవుల్ని ఇవ్వాలి పదవులకు తగిన ఆచరణ వారి లో ఉండాలి అందరి ప్రాణాలను రక్షించే లేక తీసి వేసే సర్వోత్కృష్ట అధికారం రాజ్య పాలకుడికి ఉండాలి. పాలన ను గుప్పిట్లో ఉంచుకోవట మే (షు)రాజ తంత్రం లో ముఖ్యం. రాజు దగ్గర పని చేసే ఉద్యోగుల "ప్రతి కృతులే "శాసనాలు. "శాసనాన్ని అనుసరించిన వారికి బహుమానాలు ఉల్లంఘించిన వారికి శిక్ష "అనే అభిపాయం ప్రాజల మనస్సులలో గాఢం గా నాట బడాలి. శాసనాలు (ఫా) లేక పోతే సంక్షోభమే. అని షాంగ్ యాంగ్ చెప్పాడు.

"మానవుని లో స్వార్ధం సహజం కనుక దండమే దశ గుణంభవేత్."పారలౌకికం అయిన దేదైనా ప్రమాణం కాదు. శాసనం, పాలకుల ఆజ్ఞా వారి ఇచ్చు మాత్రామే ప్రమాణం. రాజ శాసనాలన్ని చండ ప్రచండం గా ఉండాలి ఆషా మాషీ గా ఉండ రాదు" అని ఫాచియా సిద్ధాంతం. "రాజును, తలిదండ్రులను సేవిన్చాటా నికే మానవుడు పుట్టాడు. శాసనాల గురించి తెలుసుకోవటం పాలన గూర్చి చర్చిన్చటమే పురుషార్ధం "అని హాన ఫైత్జు అన్నాడు. నీతి, దయల కంటే శాసనం, దండం ముఖ్యం. వీటి వల్లనే అధిక విలువ, ఉపయోగం కలుగుతాయి.

"సోమరి పోతులైన సాదు సన్యాసుల్ని వ్యాపారుల్ని పండితుల్ని దార్శకుల్ని "తన్ని"వాళ్ళతో వ్యవసాయం చేయించాలి.. బీదల పోషణ, దయా ధర్మాలు బోధించే వారికీ ఇదే గతి పట్టాలి. శాసనాలకు వ్యతి రేక మైన గ్రంధాలు, దర్శనాలు లేకుండా చెయ్యాలి. కష్ట పడి మిత వ్యయం చేస్తే ఆహారానికి లోపం ఉండదు ఇలా చేయని వాడికే దరిద్రం వస్తుంది. వాడి మీద దయ చూప కూడదు. నీతి, సత్యం, రుజు వర్తనం, దయ రాజ తంత్రం లో పనికి రానే రావు అవి అతని డిక్షనరీ లో ఉండకూడని పదాలు. దేవుడు దెయ్యం పూర్వా చారాలు అని పట్టుకొని పేళ్ళాడకుండా ప్రస్తుత పరిస్తితులను బట్టి రాజు పరి పాలించాలి. ఏ ప్రభువుకైనా ప్రపంచానికో లేక కనీసం చైనా కో చక్ర వర్తి అవటం అనేది ఆదర్శం గా ఉండాలి. ఏ పనిలోనైనా నిబద్ధత ఉండాలి "అని షాంగ్ యాంగ్ రాజ తంత్రం గురించి చెప్పి అక్షరాలా తానూ ఆచరించి చూపించాడు. హాన్ ఫైత్జు దాదాపు దీన్ని అంతటిని అంగీకరించాడు కాని ఇతనిలో కన్ఫ్యూసియాస్ అనుచరుడైన హామాన్ ట్జు ప్రభావం టావో ప్రభావం ఉన్నట్లు కనీ పిస్తాయి

ఈ ఫాచియా సిద్ధాంతాలను, పద్ధతుల్ని చిన్ రాష్ట్రం లో అమలు చేసి చైనా దేశాన్ని ఒకే చక్ర వర్తి పాలన కిందకు తెచ్చాడు. ఇదంతా క్రీ.పూ.221లో జరిగింది అంతకు ముందెప్పుడూ. కన్ ఫ్యూసియాస్ వల్ల కాని టావో దర్శనం వల్ల కాని చైనా ఎప్పుడూ ఏక చక్ర వర్తి పాలన కిందకు రాలేదు. నిరంకుశ సామ్రాజ్యాన్ని చండ శాసనాలను అమలు పరచాడు. చిన్ రాజ వంశం పదిహేనేళ్ళు పాలించింది తరువాత విచ్చిన్నమయింది మళ్ళీ ఇరవయ్యవ శతాబ్దం ఉత్తరార్ధం లో ఫాచియా సూత్రాలను అమలు చేస్తూ నిరంకుశ ప్రాభుత్వం చైనా లో ఏర్పడిన సంగాతి మనకు తెలిసిందే

ఆధునిక కాలం లోచైనా లో కొత్త మతాలేవీ యేర్పడ లేదు. పాశ్చాత్య మతాలప్రభావం పెరిగింది సమన్వయ సిద్దాన్తాలోచ్చాయి. చైనీయ బౌద్ధం ప్రభావం చూప లేక పోయింది మావో కాలం లో కమ్యూనిస్ట్ భావజాలం, మార్క్స్ సిద్ధాంతల అనుసరణ జరిగింది

## సెయింట్ థామస్ ఆక్వినాస్

సెయింట్ తామస్ ఆక్వినాస్ క్రైస్తవ మతం లో డొమినికన్ శాఖ కు చెందినా వాడు. ఐరోపా లోని మధ్యయుగ దార్శనికులలో గొప్ప వాడు. ఆయన బో ధించింది సంపూర్ణం సమగ్రం అంటారు. తనకు పూర్వం ఉన్న దార్శనికుల భావాలను తన దర్శనం లో పొందు పరచాడు. గ్రీకు తత్వ వేత్తలైన అరిస్టాటిల్ ప్లేటోల భావాలను, క్రైస్తవం లోని గ్రీక్ ఫాదరుల వాదన సారాంశాలు, అగస్టిన్ సిద్ధాంతాలను, పూర్తిగానో, పాక్షికం గానో తన దర్శనం లో పొందు పరచాడు. పదకొండు, పన్నెండు, పదమూడు శతాబ్దాలలో ఉన్న దార్శినికుల భావాలకు తన సిద్ధాంతాలలో స్తానం కల్పించాడు.




క్రీ.శ.1225 లో ఇటలీ లోని ఆక్వినాస్ దగ్గర థామస్ ఆక్వినాస్ జన్మించాడు. ప్రాథమిక విద్య మౌంట్ కాసినో విద్యా సంస్థ లో పూర్తీ చేశాడు.. తర్వాతా నేపిల్స్ యూని వర్సిటి లో ఉన్నత విద్య కోసం చేరాడు. 1244 లో డొమినికన్ సన్యాసులలో చేరాడు.. పారిస్ లో ఆల్బర్టస్ మాగ్నస్ దగ్గర విద్య నేర్చాడు. అక్కడి నుండి గురువుతో పశ్చిమ జర్మని చేరుకొన్నాడు.

1252 లో ఆక్వినాస్ రచనలు బోధనలు ప్రారంభించాడు 1268-72 మధ్య పారిస్ లో ఉన్నాడు. నేపిల్స్ విశ్వ విద్యాలయం లో డొమినికన్ కాలేజి ని ఏర్పాటు చేసే ప్రయత్నం చేశాడు 1274 మార్చి 7 న ఆక్వినాస్ 49 వ ఏట మరణించాడు. ఆయన దాదాపు 105 గ్రంధాలు రచించి నట్లు తెలుస్తోంది.

ఆక్వినాస్ సిద్ధాంతాలలో కొన్ని విషయాలను తెలుసు కొందాం. మనిషికి సహజం గా పరమ సత్తా ను గ్రహించటం అసాధ్యం. ప్రతి ఒక్కరిలో నిర్ణయ అధికారం ఉంటుంది. నిర్ణయం అనేది అందరు గుర్తించాల్సిన విషయం. నిర్ణయం అనేది స్వయం వ్యక్తం.. ఈ నిర్ణయం అనే దాన్ని మొదట్లో సెయింట్ ఆగస్టీన్, డేకార్టు లు చేశారు. సామాన్య నిర్ణయాలు మన మొదటి నిర్ణయాలు కాదు అంటాడు ఆక్వినాస్.

మన మనస్సు చే గ్రహింప బడిన సత్తా, వస్తువు యొక్క సత్త అభిన్నాలు అనేది ముఖ్య సూత్రం. మన నిర్ణయమే ప్రామాణికమే. రెండు సత్తా ళల సంవాదాన్ని సత్యం అంటారు. అది రెండిట్లోనూ ఒకే రకం గా ఉండాల్సిన అవసరం లేదు. అది వస్తువులో భౌతిక రూపం లోను, మనసులో భావ రూపం లోను ఉంటుంది.

మనం గ్రహించేది అంతా మన రీతి ని బట్టే గ్రాహిస్తాం. సత్తా క్లిష్టం గా ఉంటె అందులో ఒకటి గృహీత అంశం, రెండోది గ్రాహక అంశం.. దీన్ని అంతర క్రియ అన్నాడు. సత్యం అనేది ఈశ్వరుడు కావచ్చు. లేక పోతే క్రియా శక్యతల మిశ్రితం కావచ్చు. ప్రతి భౌతిక సత్తా కు ఒక వాస్తవ రూపం ఉంటుంది. రూపం తో బాటు శుద్ధ శక్యత కూడా ఉంటుంది.

నిర్ణయానికి ఆధార మైంది అంతరజ్ఞానం కాదు. ఇంద్రియాల తో జన్మించిన బౌద్ధిక ప్రక్రియ మాత్రమె. సన్ని కర్ష జన్యం అయిన క్రియ చేత బుద్ధి గ్రహించి స్వయం గా సమన్వయించుకొన్నందు వల్ల జ్ఞానం కలుగుతుంది. మానవ జ్ఞానం నిరంతరం అన్వేషణ తోనే ఉంటుంది. మానవుడిని ప రిపూర్ణుని చేసే సమర్ధత ఉంది. మనకు అన్వేషణ యోగ్యం గా ఉండేదే మనకు లక్ష్యం. సత్తా ఉత్కృష్టం అయిన కొద్దీ, పరి పూర్ణ సామర్ధ్యత పెరుగుతుంది. అందుకని సత్తా లన్నిటిలో భగవసత్తపరమ ప్రమాణం అయినది. మానవునికి అన్వయించు ప్రకృతి నియమమే నైతికం. మనిషి దీన్ని అనుసరించ వచ్చు లేక పోనూ వచ్చు.

ఈ విధమైన పది సూత్రాలను ఆధారం చేసుకొని ఆక్వినాస్ తన దర్శనాన్ని సంపూర్ణం చేశాడు. దేవుడు సృష్టించిన ఈ ప్రపంచం లో దివ్యులు కూడా మత విశ్వాసం తో నే సంచరిస్తున్నా రు. జగత్తులో మానవులు, దివ్యులు, భౌతిక సత్తాలు ఉన్నాయి. మనవ స్వభావం అతని ప్రవృత్తి వల్లనే బయట పడుతుంది. నిర్ణయం అతని బుద్ధికి ఇంద్రియాను బవానికి సంబంధించింది.

మానవుడు అంటే ప్రాధమిక ద్రవ్యం, జ్ఞానాన్ని ఆశ్రయించిన లేక ఆత్మా అనే ఈ రెండిటి వల్ల ఏర్పడిన వాడు. మన ఆత్మ సంపూర్ణ వ్యక్తీ కాదు. సంపూర్ణ వ్యక్తికీ ఆత్మా ఉండదు. ఆత్మ కేవలం ఒక ఆకృతి మాత్రమే. ఆత్మ అభౌతికం స్వయ అస్తిత్వం కలిగింది. జ్ఞానేంద్రియాల ద్వారా మనిషి జ్ఞానం సంపాదించాలి. అనుభవ గ్రాహ్య మైన వాటి నన్నిటిని సమన్వయ పరచి గ్రహించాలి. మా నవునికి ఉన్న స్వచ్చంద ఇచ్చ వస్తువును గ్రహించటానికి, వదిలెయ్య టానికి నిర్ణయించు కొంటుంది,

మానవ శక్తి పరిమితం కనుక స్వశక్తితో పరమ లక్ష్యాన్ని చేరుకో లేదు. దయామయుడైన దేవుని అనుగ్రహం వల్లనే గమ్యాన్ని చేరగలడు. భగవంతుడు తనను తాను ఆవిష్కరించు కోవటం వలన నే మనిషి కి ఈ వరం ప్రసాదింప బడింది. అందుకే బందీ లో చిక్కిన దర్శనాలను చేదించుకొని ఏకైక సాధనం అయిన సార్వ భౌమ సాక్షాత్కార అనుభవానికి ఎదురు చూస్తుండాలి

## అచింత్య భేదా భేద మతం

బెంగాల్ రాష్ట్రం లో శ్రీకృష్ణుని మహా భక్తుడైన చైతన్య ప్రభువు సాక్షాత్తు శ్రీ కృష్ణావతారం గా భావిస్తారు ఈయన 1465 లో జన్మించి 1532 లో తనువు చాలించాడు. చైతన్యుడు ఒక గొప్ప భక్తి సాంప్రదాయానికి పునాది వేశాడు. ఈయన, ఈయన శిష్యులు "బ్ర హ్మ సూత్రాల" మీద ఎలాంటి వ్యాఖ్యానం చెయ్యలేదు. వీరికి శ్రీ మద్భాగవతమే సర్వోత్రుస్టమైన గ్రంధం, చై తన్యుని శిష్యులు రూప గోస్వామి, సనాతన గోస్వామి సోదరులే, రూప గోస్వామి"భక్తీ రసామృత సింధువు "మొదలైన గ్రంధాలను రచించాడు సనాతన గోస్వామి "వైష్ణవ తోషిణి, "భాగవతామృతం "మొదలైనవి రాశాడు వీరి తమ్ముడి కుమారుడు జీవ గోస్వామి "క్రమ సందర్భం "అనే భాగవత టీక ను భక్తీ సిద్ధాంత, ఉపదేశామ్రుతం వంటి పుస్తకాలు రాశాడు శ్రీ చైతన్య జీవితాన్ని శ్రీ కృష్ణ దాస కవి రాజు రాసి అందులో చైతన్య బోధలను పొందు పరచాడు. గోస్వాములు ముగ్గురు రాసింది వేదాంత వ్యాఖ్యానమే

## బలదేవ విద్యాసాగారుడు



18 వ శతాబ్దపు వంగ దేశ బల దేవ విద్యా సాగరుడు చైతన్యుల గోస్వాముల బోధల నాధారం గా బ్రహ్మ సూత్రాలకు భాష్యం రాశాడు. గోవింద భగవానుడు స్వప్నం లో కనిపించి ఆదేశించటం వల్ల రాసిన్ది కనుక దీనికి "గోవింద భాష్యం "అని పేరు పెట్టాడు. వీరు చెప్పిన వేదాంత దర్శనానికే "అచింత్య భేదా భేద వాదం" అనే పేరొచ్చింది అందులోని ముఖ్య విషయాలను తెలుసు కొందాం.

సూర్యుని లాగా వేదం కూడా స్వయం ప్రకాశం. అన్ని ప్రామాణా లకు వేదమే శరణ్యం. జీవుడికి పరమేశ్వర అంటే శ్రీ కృష్ణ స్మ్రుతి ఉండదు. అందుకే ఇది తెలుసుకోవటానికి కృష్ణుడే వేదాలను,, పురాణాలను బోధించాడు. ఉపనిషత్తుల లో ఉండే ముఖ్య విషయాలనే వ్యాస మహర్షి బ్రహ్మ సూత్రాలుగా చెప్పాడు. వ్యాసుడు స్వయం గా నారాయణుడే కనుక ఇందులో భ్రమ, ప్రమాదాలుండవు తాత్పర్యం వల్ల ముఖ్యార్ధం తెలియక పోతే గౌణార్ధం, అభిదా వృత్తి వలన అన్వయం కుదరక పోతే లక్షణా వృత్తి వల్ల గ్రహించాలి

బ్రహ్మ సూత్రాలలో వ్యాసుడు పరిణామ వాదం చెప్పాడు. భగ వంతుడు చిన్తయ శక్తి "ఉన్న వాడు. కనుకనే ఆయన స్వేచ్చగా జగత్తు లో పరిణ మిస్తాడు ఆయన అవికారి గానే ఉంటాడు. భగవంతుడు ఐశ్వర్య స్వరూపుడు. ఆయనలో మాయ ఉండదు. అయన పరి పూర్ణుడు. వేదాలన్నిటికి భగవంతుని తో సంబంధం ఉంది. వేద బీజం అయిన "ప్రణవం "మాత్రమె వేదాల మహా వాక్యం. ఇది భగవంతుని నిగూఢ నామం. ఇదే ఈ విశ్వాన్ని ధరిస్తోంది. ప్రణవ మహా వాక్యం ముందు "తత్వ మసి "అనే వాక్యం మహా వాక్యం గా నిల బడదు. ఇది ఏక దేశీయ వాక్యమే అవుతుంది.

వేదాంతం లో చెప్ప బడిన బ్రహ్మ శబ్దం ముఖ్యార్ధం భగ వంతుడే. ఐశ్వర్య, వీర్య, యశః, శ్రీ జ్ఞాన వైరాగ్యాలను సంపూర్ణం గా ఎవరిలో ఉన్నాయో ఆయనే భగ వంతుడు. భగవంతుని విభూతి,, దేహాలు చిదాకారాలు. ఆయన స్థానం, పరివారం కూడా చిదానందమయాలే భగవద్గీత లో చెప్పి నట్లు జడ, జీవులు ఆయన అపర పర ప్రకృతులే. ప్రకృతియే శక్తి. భగ వంతుని లో జడ జీవులకు భేద అభేద సంబంధం ఉంది. ఇది నిత్యం సత్యం.

భక్తి పురుషార్ధ సాధనం. భగ వంతుని దయ వల్ల ముక్తి లభిస్తుంది. ముక్తి పొందిన వాడు భగవంతుని సన్నిధి లో,భగవంతుని లోకం లో ఉంటాడు వాడికి మళ్ళీ పుట్టుక ఉండదు. భక్తి అనేది ఆనంద, జ్ఞానాల రూపం. సాధన, భావన, ప్రేమ అనే మూడు భక్తి మార్గానికి అవస్థా త్రయం. ఇంద్రియ ప్రేరణ వల్ల సాధారణ భక్తి కుగుతుంది. ఇది హృదయం లోఉన్న ప్రేమ ను. మేల్కొల్పుతుంది. శుద్ధ సత్వం, స్నిగ్ధత వల్ల లభించే భక్తి విశేషాన్ని భావం అంటారు. భావం ఘనీభవించినపుడు ప్రేమ ఏర్పడుతుంది. ఇదే మానవ యత్నం లో చివరి ఫలం., పరమ పురుషార్ధం కూడా. మొత్తం మీద ఇవీ అచిన్త్యా భేదాభేద వాదం లోని ముఖ్య విషయాలు,

## పరా భౌతిక శాస్త్రం

పరా లేక అతీత భౌతిక శాస్త్రాన్ని "మెటా ఫిజిక్స్ "అంటారు.. ఈ శాస్త్రం అన్ని శాస్త్రాలకు మూలం అని చాలా మంది అభిప్రాయం. చేత బడులు చేసే వారు మొదలైన వారి వల్ల ఈ మధ్య అది అధిక్షేపానికి గురైంది.

ఒక పుస్తకానికి అతి భౌతిక శాస్త్రం అనే పేరు ముందెప్పుడో పెట్టారట. గ్రీకులో పుస్తక ప్రియుడు "ఆండ్రోనికస్ "అరిస్టాటిల్ రచనలన్ని సంపుటీకరణం చేశాడు. జ్ఞానం, ప్రాధమిక దర్శనం, ఈశ్వర మీమాంసల గురించి అరిస్టాటిల్ రాసిన 14 ప్రకరణాలను, భౌతిక శాస్త్రానికి సంబంధించిన ఎనిమిది ప్రకరణాల నుండి వేరు చేసి వాటికి "అతి భౌతిక శాస్త్రం "అంటే భౌతిక శాస్త్రం తరువాతది అనే అర్ధం లో పేరు పెట్టాడు. ఇది లాటిన్ భాషలో "మెటా ఫిజికా "గా అనువాదం పొందింది అరిస్టాటిల్ చర్చించిన విశిష్ట విషయాలే కాకుండా వాటి లాంటి మరికొన్ని సమస్యల కు కూడా ఈ పేరునే వాడారు. మెటా అంటే పరా అని అతీతమని అర్ధం అరిస్టాటిల్ తరవాత ఎన్నో వందల ఏళ్ళకు ఈ పదం అతి భౌతికం అనే పేరు మీదనే చలామణి అయింది.

అరిస్టాటిల్ వివేకం గురించి సామాన్య భావాలద్వారా పరిష్కరించాడు. ప్రత్యేక కళల, శాస్త్రాల ప్రత్యక్ష పరిచయం లోక రీత్యా సరి పోయిందే అయినప్పటికీ వస్తువు యొక్క స్తితికి కారణం తెలుసుకొని దృష్టాంత పూర్వకం గానే కాకుండా, వాటి సూత్రాల చేత కూడా ఇతరులకు తెలియ జేసే వారు విజ్ఞాన వంతులు అని పించుకొంటారు. వస్తువుల మధ్య ఉన్న పరస్పర సంబంధాలను తెలుసుకొనే వాడు మహా జ్ఞాని. ప్రాధమికం గా జ్ఞానమే వివేకం. రోజు వారీ జీవితానికి దూరం గ ఉన్న వాటిని గురించిన జ్ఞానం చాలా అవసరం దాన్ని పొందటం దుర్లభం కూడా మిగిలిన వన్నీ దీనిపై ఆధార పడి ఉన్నందున ఇది ప్రాధమికం అని పించుకొంటుంది. అందుకే దీనికి "ప్రాధమిక దర్శనం "అనే పేరు కూడా వచ్చింది.

ఏ శాస్త్రం అయినా ఏదో ఒక సత్తా ను గురించి పరిశీలన చేస్తుంది గణిత సూత్రాల ఆధారం గా వస్తు పరిమాణం వైశాల్యం ఆకారం తెలుసుకో వచ్చు భౌతిక శాస్త్రం సజీవ నిర్జీవుల చలనాలను తెలుసుకోవచ్చు కనుక ప్రాధమిక సూత్రాలను పరిశీలించేదే ప్రాధమిక దర్శనం అవుతుంది. ఏ శాస్త్ర జ్ఞానానికి అయినా దానికి ఇతర జ్ఞాన క్షేత్రాలతో ఉన్న సంబంధాలను తెలుసుకోవాలి అనుకొనే వారికి ఈ సమస్యలు ప్రధానం అవుతాయి. అవి భౌతిక శాస్త్ర పరిధి దాటి ఉంటాయి కనుక ఇంతవరకు ప్రకృతికి అవతల ఉన్న సత్తా ను గురించి ప్రశ్నలు ఉత్పన్నం కాలేదు. ప్రాధమిక దర్శనానికి విశిష్ట విషయాల గూర్చి చర్చించాల్సిన అవసరం లేదు.

ఇతర శాస్త్రాల చర్చలకు విషయం కాని ఒక వస్తువును అరిస్టాటిల్ గుర్తించాడు. ఈశ్వరుడు నిత్యుడు, పరిమాణాలకు అందని వాడుకనుక ఈశ్వర భావం ప్రకృతి శాస్త్రాల పరిధి లోకి రాదన్నాడు. అన్నిటికి ఈశ్వరుడే మూల కారణం కనుక ఆయనే మొదటి కారణం, మొదటి తత్వం కూడా అవుతాడు. కనుక ఒక రకం గా మెటా ఫిజిక్స్ అనే ప్రాధమిక శాస్త్రమ్ "ఈశ్వర శాస్త్రం "అని కూడా పిలువ బడుతోంది.

ఇదే నిత్య సత్య విషయాన్ని గురించి ఆలోచించేది. ఈశ్వరుడు కాని శుద్ధ సత్యం కాని లేక పోతే భౌతిక శాస్త్రమే ప్రాధమిక దర్శనం యొక్క ఇతర వ్యాపారాలను స్వీకరిస్తుందని మేధావి అరిస్టాటిల్ చెప్పాడు.

## ముగ్గురు గ్రీకు మత దార్శనికులు

క్రీ పూ. 600 -400 మధ్య కాలం లో ముగ్గురు గ్రీకు దార్శనికులు ప్రభావం చూపారు. వారే అనాక్సి మాండ ర్,,అనాక్సిమేనీజ్, అనాక్స గోరాన్ లు

## అనాక్సి మాండర్

క్రీ.. పూ.611-547కాలం వాడుఅనక్సి మాండర్..అయోనియా భౌతిక దార్శనికులలో రెండవ వాడుగా ప్రసిద్ధి చెందాడు. మైలీతాస్ అనే నగరం లో ఉండే వాడు. తెలీజ్ కు సహచరుడంటారు. "దేని నుంచి వ్యతి రేక విషయాలు వేరు పడటం వల్ల ప్రపంచం పుట్టిందో, దేనిలో ప్రళయం లో ప్రపంచం తిరిగి లయం అవుతుందో అలాంటి నిత్య, అవినాశ, అనంత మైనదే మొదటి తత్త్వం అని చెప్పిన దార్శనికుడు అనాక్సి మాండర్..తాను చెప్పిన దర్శన సూత్రాలను లిఖిత పూర్వకం గా భద్ర పరచిన మొదటి ఫిలాసఫర్ అనాక్సి



.ఆయన రాసిన దానిలో ఒక భాగం మాత్రమె లభిస్తోంది. విజ్ఞాన శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు ప్రపంచ వస్తువులను నిశిత పరిశీలన చేశాడు. "ప్రకృతి సమతుల్యతకు భగ్నం కలిగిస్తే ఈ విశ్వం ఎక్కువ కాలం మనలేదు " అని ఆనాడే గట్టిగా చెప్పిన పర్యా వరణ రక్షకుడు.. ఖగోళ శాస్త్రానికి కొత్త విషయాలు జోడించాడు భూమికి గ్రహాలకు ఉన్న అవినా భావ సంబంధాన్ని వివరించాడు. ప్రపంచ పటం అయిన గ్లోబ్ ను మొదట తయారు చేసిన వాడీయనే. దీనితో జాగ్రఫీ వృద్ధి చెందింది. ఆయనకున్న అపార జామెట్రీ పరిజ్ఞానం వల్ల గ్రీసులో "గ్నోమోన్" ను ఆవిష్కరించాడు మిలేశియాస్ రాజకీయాలలో చురుగ్గా పాల్గొన్నాడు. అందులో ఒక కాలనీకి నాయకుడిని చేశారు సైన్సు ప్రయోగాలకు ఆద్యుడు కూడా అని పించుకొన్నాడు

## అనాక్సి మేనీజ్

ఈయన కూడా మైలీతాస్ దార్శనికుడ ని పేరు పొందాడు. క్రీ.పూ.586- 528 వాడని భావిస్తారు. ప్రపంచం లో మొదటి ద్రవ్యం "వాయువు" అని చెప్పాడు. వాయు సాంద్రత లోని మార్పుల వల్లనే సమస్త సృష్టి జరిగిందని చెప్పాడు అనాక్సి మాండర్ కు శిష్యుడు. భూమి పుట్టుక, స్వభావాలపై పరిశోధన చేశాడు. భూమికి ఖగోళ వస్తువులకు సంబంధాన్ని చర్చించాడు. సూర్య, చంద్రులు బల్ల పరుపు గా ఉన్నాయని చెప్పాడు అవి గాలి లో తెలియాడుతా యన్నాడు. భూ కంపాలకు భూమిలో తేమ తగ్గి పోవటమే కారణం అన్నాడు. సాంద్ర మైన గాలి పొరలపై సూర్య కిరణాలు పడినప్పుడు ఇంద్ర ధనుస్సు ఏర్పడుతుందని ఊహించాడు

ఆయన పరిశోధనలు గుర్తించి ఆధునిక ఖగోళ శాస్త్ర వేత్తలు చంద్రునిలో ని ఒకగుంట కు " అనాక్సి మేనీస్ "అని గౌరవం గా పేరు పెట్టారు. "ఆయన దృష్టిలో ఫిలాసఫీ అంటే మూలాధారమైన నమ్మకాలు, కీలక భావనలు, వ్యక్తీ లేక బృందం యొక్క వైఖరులు "అని నిర్వచనం చేశాడు విజ్ఞానం స్తితి, యదార్ధం, విలువలు, విపేచనా బుద్ధి మొదలైన వాటి పై ఆయన శోధించి తన భావాలు చెప్పాడు

## అనాక్స గోరస్

క్రీ.పూ.500-428 కాలానికి చెందిన వాడు ఆసియా మైనర్ లో క్లోజో మెనో లో జన్మించాడు ఎదేన్స్ నగరానికి వెళ్లి అక్కడే 30 ఏళ్ళు ఉన్నాడు. శాస్త్రీయ అన్వేషణ విధానాన్ని దార్శనిక విధానాన్ని అయోనియా నుండి ఎదేన్స్ కు తెచ్చిన వాడు గోరాస్.

ప్రపంచం ఏదో ఒక విధం గా నిత్యం అన్నాడు మొదట్లో ప్రపంచం అతి సూక్ష్మ భాగాలుగా ఉండేదని, ప్రపంచం అంతా అవి వ్యాపించి ఒక దానితో ఒకటికలిసి పోయాయని అన్నాడు. మన బుద్ధి కాని, హేతువు కాని వీటిని వేరు పరచటం కాని సంఘటితం చేయటం కాని చేసింది అంటాడు. యాంత్రికం గా కలుసుకోవటం, వేరు పడటం వల్ల సూక్ష్మ కణాలు భౌతిక ద్రవ్యానికి కారణం అయ్యాయి ఇదే ఆ తర్వాత పరమాణు సిద్ధాంతానికి మార్గం ఏర్పరచింది

## అనాక్స గోరాస్ మరియు పెరిక్లిస్

గ్రహణాలు, తోక చుక్కలు, ఇంద్రధనుస్సు,అగ్ని గోళమైన సూర్యుడు గురించి స్పష్టమైన విషయాలు చెప్పిన మొదటి వ్యక్తి. బుద్ధి పై అతి సూక్షం పరిశోధన చేశాడు మనసు వల్లనే చలనం జరుగుతోన్దన్నాడు గ్రీకు ఫిలాసఫీ ని మలుపు తిప్పిన వాడు అనాక్స గోరస్.

## అనేకేశ్వర వాదం

అనేకేశ్వర వాదాన్ని ఆంగ్లం లో "polytheism "అంటారు. అనేక దేవా, దేవతల మీద నమ్మకం, లేక పౌతే నానా దేవతాలను పూజించటం అనే ఒకానొక దశను అనేకేశ్వర వాదం అంటారు. ఇది ఏకేశ్వర వాదానికి, నాస్తిక వాదానికి, అనేకాసుర (poly demonism )లకు భిన్నమైనది. అనేకేశ్వర వాదం లో భక్తీ, పూజలు వేరు వేరుగా ఉండ వచ్చు పరిణామ వాదం దృష్టిలో మతాభి వృద్ధిని గమనిస్తే అనేకాసుర వాదం తర్వాతా,ఏకేశ్వర వాదానికి ముందు, వచ్చిన దశయే అనేకేశ్వర వాద దశ. అని తెలుస్తుంది. ఇనుప, కంచు యుగాలలో ఈ ఆరాధన ఉంది. స్త్రీ దేవతా రాదన ఉంది

## అందరూ దేవుళ్ళే

అనేకేశ్వర వాదం లో నాలుగు భిన్న దశలు కన్పిస్తాయి 1-ఆదిమ మానవుడికి ప్రాణం ఉన్న ప్రతిది దైవం గానే కన్పించింది. అలాంటి ప్రతి వస్తువుకు సంకల్పం, ప్రయోజనం ఉన్నాయి. ప్రతి క్లిష్టమైంది, బుద్ధికి అందరానిది అయిన వస్తువు సంఘటన దేవతయే. 2-రెండో దశలో మానవులు జంతువులను పూజిస్తారు దీనికి "తిర్యక్ ఈశ్వర వాదం "(zootheism ) అంటారు. అన్ని నిర్జీవ వస్తువులకు దైవత్వం ఆరోపింక పోవటం మనం గమ నిస్తాం. 3- ఈ దశలో మానవుడికి మిగిలిన జీవులకు భేదాన్ని చూస్తాం. తిర్యగీశ్వరులైన వీటిని అధికారం నుంచి తొలగించటం లేక నీచ స్తానం లో ఉంచటం జరిగిన పెద్ద మార్పు. ప్రకృతి శక్తులన్నిటికి దివ్యత్వాన్ని ఆరోపించటం జరిగింది. ఇప్పుడే సూర్యుడు చంద్రుడు, వాయువు ఉషస్సు మొదలైన వాటి పూజ జరిగింది 4-నాలుగవది అయిన చివరి దశ అతి ఉన్నత మైనది



. ఇందులో మానసిక, నైతిక, సాంఘిక గుణాలను దేవతలకు ఆపాదించటం జరిగింది. ప్రతి కార్యానికి ఒక దేవత ఏర్పడ్డారు యుద్ధానికి ప్రేమకు, భాగ్యానికి వేరు వేరు దేవతా రాదన జరిగింది ఈదశలో ఈ దేవతలకు స్పష్టమైన మానసిక గుణాలు ఉన్నాయి వీరిలో నైతిక దెవతలదిఅగ్రస్తానం. మానవుడు తన బుద్ధి, విచక్షణ జ్ఞానం ఉపయోగించిన  అనేకేశ్వర వాదదశ నుంచి. "ఏకేశ్వరో పాసన దశ "ఏర్పడిందని భావిస్తారు.



## అరిష్టి పస్




క్రీ. పూ. 435-356 ప్రాంతానికి చెందిన గ్రీకు మతా చార్యుడుఅరిష్టి పస్.."సెరేనేయిక్ "అనే మత స్తాపకుడు. చిన్న తనం లోనే సెరెన్ నుంచి ఏథెన్స్ కు చేరాడు. సోక్రటీస్ శిష్యుడై ఎన్నో విషయాలు అభ్యసించాడు గ్రీకు దేశం లోని ప్రసిద్ధ పట్టణాలన్నీ పర్య టించాడు. సెరెన్ లో ఒక విద్యాలయాన్ని స్తాపించాడు.

ఈయన తండ్రి అరిటాదేస్ గ్రీస్ కు వచ్చి ఒలిం పిక్స్  ఆటలలో పాల్గొన్నాడు సోక్రటీస్ మరణం వరకు ఆయన వద్దే ఉన్నాడు సోక్రటీస్ గారి శిష్యుడే కాని గురువు చెప్పిన దానికి పంగనామాలు పెట్టి సుఖ భోగాలకు మరిగాడు పరిస్తితులను మనకు అనుగుణం గా మలచుకోవాలే కాని, పరిస్తితులకు అనుగుణం గా మనం మారరాదు  అనేది ఈయన సిద్ధాంతం. సొక్రటీస్ శిష్యులు అరిస్తిపాస్ గురువు చెప్పిన దానికి విరుద్ధం గా సంచరిస్తున్నాడని గగ్గోలు పెట్టినా చిద్విలాసం గా నవ్వే వాడు కూతురుఅరేతి ద్వారా మనవడికి (అరిస్తిపస్ యంగర్) )ఈ సిధాంతాన్ని అందించాడు అతను దీన్ని ఒక ఛత్రం లో నిబంధించాడు అరిస్తపాస్ అనేక గ్రంధాలు రాసినట్లు చెబుతారు కాని అది నిజం కాదంటారు ఆయన రాసి నట్లుగా చెప్ప బడేది ఒక పుస్తకం ఉంది అదే "అన్ అన్సేంట్ లక్సరీ "



### ఈ నాటి లిబియా లో అరిస్తి పస పుట్టిన సేరెన్ పట్టణం

సోక్రటీస్ చెప్పిన ధర్మం, సుఖం అనే తత్వాలను అర్ధం చేసుకొని ధర్మం కంటే సుఖానికే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చాడు. జీవితం లో సుఖమే ప్రమాణం అని సిద్ధాంతీకరించాడు. ఏది ఎక్కువ సుఖాన్నిస్తుందో అదే మంచిది అని తీర్పు చెప్పాడు. తను చెప్పినదాన్ని జీవితం లో

పూర్తిగా ఆచరించి ఇంద్రియభో గాలలో తెలియాడాడు. అప్పుడెప్పుడో ఆయన చెప్పిన దర్శనం ఇప్పుడు అనుభవ ప్రధాన వాదానికి అందులో

ముఖ్యం గా సుఖ ప్రధానవాద మతానికి దగ్గిరైంది.సెరెనిక్ ఫిలాసఫీ అంతా తాత మనవడి ద్వారానే వృద్ధి పొందింది

## శామ్యూల్ అలేక్సాండర్

క్రీ. శ.1859 జనవరి ఆరు న శామ్యూల్ అలేక్సాండర్ ఆస్ట్రేలియా లోని సిడ్నీ లో జన్మించాడు. ఇంగ్లాండ్ లో చదివాడు మాంచెస్టర్ లో దర్శన శాఖ ఆచార్యుడు గా పని చేశాడు యూ దు మతస్తుడు. ఆక్స్ ఫర్డ్, కేంబ్రిడ్జి లలో ఉన్నత విద్య నేర్చాడు మోరల్ ఆర్డర్ అండ్ ప్రోగ్రెస్ పుస్తకం రాశాడు బ్రిటిష్ అకాడెమి ఫెలో గా గౌరవం పొందాడు. అనేక ప్రాంతాలలో పర్య టించి ఉపన్యాసాలిచ్చాడు "స్పేస్ టైం అండ్ డయేటి "గ్రంధం రాశాడు

మాం చెస్టర్ లో ఆయన ఇల్లు అనేక ప్రముఖులకు ఆతిధ్యం ఇచ్చింది అరిస్టాటిల్ సొసైటీకి పని చేశాడు రిటైర్ అయ్యే దాకా మాంచెస్టర్ లో ప్రొఫెసర్ గా ఉన్నాడు అంతకు ముందు విశ్రాంతి కోసం కొద్దికాలం పని చేయలేదు అయినా చిన్న చిన్న ఉపన్యాసాలిచ్చాడే కాని ఖాళీ గా లేడు అలేక్సాందర్ శామ్యూల్ జీవితాంతం పెళ్లి చేసుకో కుండా బ్రాహ్మ చారి గా ఉండి పోయాడు

బ్రిటిష్ అకాడెమి లోను,బ్రిటిష్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫిలాసఫీ ఇంగ్లాండ్, పాలస్తీనా లలోని జ్యాయిష్ సంఘం లో సభ్యుడు గా కొ న సాగాడు. మాంచెస్టర్ లో ఆయన విగ్రహం ప్రతిష్టించి గౌరవించారు అందులోని సెంట్రల్ హాల్ కు ఆయన పేరు పెట్టారు 1927 లో హెర్బర్ట్ స్పెన్సర్ పై కీలక ఉపన్యాసంనిచ్చి అందరి ప్రశంసలు పొందాడు ఆర్డర్ ఆఫ్ మెరిట్ ను ఇచ్చి అమెరికా ప్రభుత్వం గౌరవించింది ఒక ఆస్ట్రేలియా వాసికి ఇచ్చిన అరుదైన గౌరవం ఇది "బ్యూటి అండ్ ఆఫ్" అనే గొప్ప గ్రంధం రాశాడు.



ప్రపంచ వ్యాప్తం గా ఉన్న యూదుల దురవస్థ కు బాధ పడి తన సమయం, దనం,వారి బాగు కోసం వెచ్చించాడు 1938 సెప్టెంబర్13 న మరణించాడు మాంచెస్టర్ లోని దక్షిణ సేమట రి లో ఆయన పార్ధివ దేహాన్ని ఖననం చేశారు ఆయన రాసిన విల్లు ప్రకారం ఆయదగ్గర ఉన్న పదహారు వేల పౌండ్ల డబ్బులో పదమూడు వేల పౌండ్లు జెరూసలెం యూని వర్సిటి కి అందించారు ఆయన రాసిన"ఫిలసాఫికల్ అండ్ లిటరరీ పీసెస్ " గ్రంధాన్ని మరణానంతరం ప్రచురించారు మెల్ బోర్న్ లోనిమొనాస్ యూ ని వర్సిటి లోని ఆడిటోరియం కు సామ్యూల్ పేరు పెట్టారు ఆయన్ను ఆ కాలపు స్పెక్యులేటివ్ థింకర్ "అన్నారు

ఆయన భావాలను "పాన్తేనిక్ "భావాలన్నారు ఆయన సమకాలికుడు "ఆల్ఫ్రెడ్ నార్త్ వైట్ హెడ్ "అలేక్సడ ర్ సామ్యూల్ ను ఇరవయ్యవ శతాబ్దపు గొప్ప బ్రిటిష్ ఫిలాసఫర్ గా పరిగ ణి స్తారు ఆయన సిద్ధాంతాన్ని "ఎమేర్జెంట్ ఇవల్యూషన్" అని పిలుస్తారు

ఈ ప్రపంచానికి మూల తత్త్వం అవిభాజ్యం అయిన దిక్, కాలాలు (స్పేస్ అండ్ టైం) అని సిద్దాన్తీక రిం చాడు, ద్రవ్యం, గుణం, ప్రాణం, చైతన్యం మొదలైన వన్నీ డిక్, కాలాల నుండి ఉద్భవించినవే అన్నాడు. ఏదైనా ఒక భూత స్తితికి, దాని లో నుంచి పుట్టే దాని కంటే ఉన్నతరం గా ఉన్న భూత స్తితిని దైవం అన్నాడు దీన్నే తేలిక గా చెప్పా లంటే ప్రతి అంతస్తు కు దాని పైన ఉన్న అంతస్తు నే దైవం అణా వచ్చు అని సిద్ధాంతం చెప్పాడు. ప్రాణం మాత్రమె కలిగిన జీవులకు దాని కంటే ఉన్నతం గా ఉన్న గుణం వైపుకు పురోగామించాలి అన్న ప్రేరణ ఉంటుంది అలాంటి జీవులకు అస్పస్తాం గా అను భావానికి వచ్చే గుణమే దేవుడు. స్థలాన్ని కాలాన్ని, కాలం స్పేస్ నుప్రత్యేకం గా ఉంచుతాయి ఈ రెండు ఏకత్వం లోని అనేకత్వాలను దోహద పడుతుంది. చలనం అనేది పాయింట్ల కదలిక కాదు కాని పాయింట్లు చలనానికి అవధులేర్పరుస్తాయి కాలము, స్పేస్ ల మధ్య అనేక సంబందాలుండి,వస్తువులా మధ్య బంధాలను ధ్రుడం చేస్తాయి.

మానవులకు ఇంకా దైవం అనుభవం లోకి రాలేదు. కాని పొందాలన్న ప్రేరణ మాత్రం ఉంది. అని అలేక్సాండర్ మతం గా భావించాలి మిన్కోస్కి, ఐన్స్టీన్, లోరెంజ్ లు చెప్పిన డిక్, కాలాల భావజాలం, డార్విన్ వికాస వాద సిద్ధాంతాలు శామ్యూల్ దర్శనం లో చోటు చేసుకొన్నాయని తెలుస్తోంది. ఈయన 79ఏళ్ళు జీవించి 1838 సెప్టెంబర్ పదమూడున మరణించాడు. ఆ యన లేవ నెత్తిన చాలా ప్రశ్నలకు సరైన సమాధానాలు చెప్ప లేక పోయాడు అందుకనే వాటిని ఎవరూ అ తర్వాత పట్టించుకోలేదు.

## ఆరిజన్ అడ మాంటి యస్

క్రీ పూ.185 లో ఈజిప్ట్ దేశం లో ఆరిజన్ అడ మాంటి యాస్ జన్మించాడు అతని తండ్రి దేవుడి పై తనకున్న విశ్వాసం రుజువు చేసుకోవటానికి ప్రాణ త్యాగం చేశాడు. కొడుకుతో చిన్నప్పుడే మత గ్రంధాలన్నీ చదివించాడు. క్రీ. పూ. 200 లేక్ అంటే పదిహేనవ ఏట "డైడా స్కాలియా "అనే మత సంస్థకు అధినేత గా నియమింప బడ్డాడు. అమోనియం సాక్కాస్ అనే గురువు వద్ద దగ్గర ప్లేటో యొక్క కొత్త సిద్ధాంతాలను అధ్యయనం చేశాడు. అప్పటి క్రైస్తవ మతాధికారి కి వ్యతిరేకం గా ఉండటం వల్ల అలేక్సాన్డ్రియా నగరాన్ని వదిలి పెట్టి వెళ్లి పోవాల్సి వచ్చింది. తర్వాత సేజరీయ పాలస్తీనా లో కొత్త విద్యా సంస్థను నెల కోల్పాడు. డేడియన్ క్రైస్తవుల్ని పీడించే కాలం లో జైలు పాలయ్యాడు జైలు లోనే మరణించాడు.

ఆరిజన్ గొప్ప తపస్సంపంనుడు అని కీర్తి పొందాడు. సన్యాసి జీవితాన్నే గడిపాడు. భగవద్భక్తి తో ఎప్పుడూ పరవశించి ఉండే వాడు. అనేక గ్రంధాలు రాశాడు చివరి రోజుల్లో అతని రచనలను, బోధనలను అనేకులు ఖండించటం వలన కాల గర్భం లో కలిసి పోయాయి అతను రాసిన వాటిలో ముఖ్య మైనవి 1–బైబిల్ పాత నిబంధనలపై విమర్శ. ఇందులో క్రైస్తవ మతాన్ని విశ్వ సించె వారికీ ధర్మ సూక్ష్మాలు రాశాడు 2-నాలుగు సంపుటాల "పెరి ఆర్కాన్ "మౌలిక సిద్ధాంత గ్రంధం రాశాడు ఆ కాలానికి ఈశ్వర శాస్త్ర సిద్ధాంతాలను చెప్పిన మొదటి సిద్ధాంత గ్రంధం. దీని లాటిన్ అను వాదమే ఇప్పుడు లభ్యమవుతోంది ఆత్మల పూర్వ భావ సిద్ధాంతాలనే ఇందులో చెప్పాడు. ఆ పూర్వ అవస్థ పొందటమే మోక్షం అన్నాడు 3- సెల్సస్ సిద్ధాంతాల ప్రతి ఘటన అనే ఎనిమిది సంపుటాల రచన. క్రైస్తవం పై సేల్సస్ చేసిన విపరీత భావాలను ఇందులో ఖండించాడు ఇప్పటికి అర్జన్ వాదాన్నే అందరు అంగీక రిస్తున్నారు

ఆరిజన్ శిష్యుడు యేతి నాసియాస్, కైరిల్లాస్, డైడమస్ లు అలేక్సాన్డ్రియా నివాసులే. ఈశ్వర శాస్త్రం లో వీరంతా ఘటికులే..క్రీసు దివ్యత్వం పై వీళ్ళకు అపార నమ్మకం ఉంది. వీళ్ళు మత గ్రంధాలకు లాక్షణిక వ్యాఖ్యలు రాశారు.

## ఆల్ కిండీ

ఆల్ కిండీ అరబ్బులకు మొదటి దార్శనికుడు. జ్యోతిష్యం బాగా తెలిసిన వాడు. బాగ్దాద్ నగర కాలిఫ్ మామూన్ ఆస్థాన వైద్యుడు. పూర్తీ పేరు అబూ యూసఫ్ యాకూబ్ ఇషాక్ ఆల్ కిండీ. తండ్రి పాలిస్తున్న కూఫా నగరం లో జన్మించాడు. బాస్రా, బాగ్దాద్ నగరాలలో విద్య నేర్చాడు. దర్శన, విశ్వ, ఖగోళ, జ్యోతిష, చాక్షుష గణిత వైద్య శాస్త్రాలపై270 గ్రంధాలు రాశాడు. మెటా నక్కీలు పాలించిన కాలం లో ఆయన గ్రంధాలయాన్ని ప్రభుత్వం స్వాధీన పరచుకొందని తెలుస్తోంది. అందువల్ల 20 గ్రంధాలు మాత్రామే లభ్యమవుతున్నాయి సంఖ్యా శాస్త్రాన్ని ఆరబ్ క్రిస్టియన్ దర్శనాలలో ప్రవేశ పెట్టిన వాడు కిండీ తన కున్న గణిత వైద్య శాస్త్ర జ్ఞానం తో మందులకు పోటెన్సి ని కానీ పెట్టి ఉపయోగించాడు



అరిస్టాటిల్ గ్రంధాలను వ్యాఖ్యానం చేసిన వారిలో కిండీ ఒకడు. ఆరిస్టాటిల్ అను చరుడని దార్శనికు డని పేరొచ్చింది ఈయన పేరు ఆరబ్ దేశం లో మారు మొగి పోయింది. నవీన ప్లేటో సిద్ధాంతాల, అరిస్టాటిల్ సిద్ధాంతాల మధ్య సమన్వం చేశాడు ఈశ్వరుని పరి శుద్ధ మైన నైతికత్వం, నిర్వి శేష మైన యేకత్వాలను కిండీ పరిగనించాడు ఈశ్వరుని ప్రభావం మధ్య నున్న పదార్ధాల ద్వారా ప్రపంచం పై పడుతోంది అని చెప్పాడు డు ఈ పదార్ధాలన్నిటి కంటే కింద ఉన్నది మాన వఆత్మ అని తేల్చాడు. అన్ని దర్శనాలను అధ్యయనం చేసి తనకు అనుకూలం గా ఉన్న వాటిని తీసుకొన్నాడు

మూల స్థానం నుండి ప్రపంచం అంతా వ్యాపించే దివ్య సత్యం యొక్క రూపాన్ని అన్ని చోట్లా కనుక్కొనే ప్రయత్నమే చేశాడు. కిండీ- గ్రీకులు చెప్పిన బుద్ధి (నౌస్ )కి కూడా ప్రాధాన్యత నిచ్చాడు. అన్ని ఆధ్యాత్మిక వస్తువులకు మొదటి స్థానం, స్వరూపమే ఈశ్వరుడు అని చెప్పాడు. ఖగోళం లో కనీ పించే దేవతలు బుద్ధి యొక్క రూపాలే. మానవాత్మ శక్తి అయిన బుద్ధియే. మానవాత్మ ప్రతి క్షణం తన ప్రయోజనం కోసం ప్రపంచం లో అవతరింప జేసే సహజ శక్తుల రూపమే. భావాల మధ్య అవసరమైన సంబంధాలను నిరూపించే ప్రవృత్తి ఉన్నదే బుద్ధి.. అరిస్టాటిల్ అంగీకరించిన పదార్ధాల స్తానం బదులు ఆల్ కిండీ ద్రవ్యం, ఆకారం, చలనం, కాలం అనే వాటిని ప్రవేశ పెట్టాడు కిండీ క్రీ శ 801లో జన్మించి72 వ ఏట 873లో మరణించి నట్లు తెలుస్తోంది కిందీ సిద్ధాన్టలన్నీ ఆ తర్వాత కాలం లో ఆల్ ఫరాబీ సిద్ధాంతాలు కనుమరుగు చేశాయి

## జాన్ కాల్విన్

స్విట్జర్ లాండ్ లో క్రీ శ1509 లో జులై 10 న జాన్ కాల్విన్ శషికార్టీలో ఉన్న నోయాన్ లో జన్మించాడు, క్రైస్తవ మతాచార్యుడి గా మంచి గుర్తింపు పొందాడు. హేన్గేస్ట్ డి మౌంట్ మార్.అనే సంపన్నుల ఇంట ఉండి విద్యా భ్యాసం చేశాడు. పారిస్ విశ్వ విద్యాలయం లో చేరి లాటిన్ భాష అభ్యసించాడు. తర్కం దర్శన శాస్త్రాలను అధ్యయనం చేశాడు. బేసల్ కు వెళ్లి స్తిరం గా ఉండి పోయాడు ఇక్కడే "ఇంస్టి ట్యూట్స్ఆఫ్ క్రిస్టియన్ రెలిజియన్ "అనే క్రైస్తవ మత సంహితలుగ్రంధం రాసి ప్రచురించాడు



ప్రొటెస్టెంట్ మత సిద్ధాన్తాలన్నిటిని ఒక చోట చేర్చి సంఘటితం చేసిఆ గ్రంధం లో నిక్షిప్తం చేసిన ఘనత ఈయనదే.. ఇందులోని మొదటి భాగం లో సృష్టి కర్త అయిన దేవుని గూర్చిన జ్ఞానాన్ని రెండవ భాగం లో విమోచన కారుడు (రిడీమర్ )అయిన భగవంతుని గూర్చి జ్ఞానం, మూడవ దానిలో పవిత్రాత్మ (హోలీ స్పిరిట్ )చేసే పను లను సవివరం గా తెలియ జేశాడు. ఇందులోనే పశ్చాత్తాపం విశ్వాసం సమర్ధనం, విశ్వాసి యొక్క పవిత్రీకరణ అనే అంశాల గురించి కూడా రాశాడు చివరగా తన కొత్త సిద్ధాంతాన్ని ప్రతి పాదించాడు. ఈ సిద్ధాంతం లో దేవుడు కొందరిని మోక్షానికి అర్హులైన వారిగా, మిగిలిన వారిని అర్హత లేని వారిగా చేస్తాడని నిశ్చయం గా చెప్పాడు..ఈ నిర్దేశానికి మార్పు అనేది ఉండదు అని గట్టి గా చెప్పేశాడు నాలుగవ భాగం లో చర్చి నిర్మాణం పరి పాలన, పవిత్ర కర్మలు. లౌకిక రాజ్యాధి పతి కి ఉన్న అధికారాల పరిమితి అనే అంశాలను చర్చించాడు

కాల్విన్ బోధించిన సెయింట్ పీటర్ కాదేద్రిల్ -జెనీవా

మంచి సంస్కారం తో ప్రపంచం లో ఉన్న అన్ని వస్తువుల విషయాలను స్వరూపాలను అనుగ్రహాన్ని పాత్రత ను సత్తా విషయం లోను, శీల విషయం లోను ఈశ్వరుని పై పూర్తిగా ఆధార పడి ఉంటాయి అని ఆయన సిద్ధాంతం లోని సారాంశం. మానవుడు బుద్ధి లో స్వతస్సిద్ధం గానే భగవంతుని గురించి జ్ఞానం ఉంటుంది. ఈ సృష్టి కూడా దేవుని స్వరూప స్వభావా గుణాల ఆవిష్కరణమే నని అన్నాడు సృష్టిని చేసి, పోషించే భగవంతుని పై పూర్తీ విశ్వాసం తో ఉండాలని ఆయన పైనే సృష్టి ఆధార పడిందని కాల్విన్ సిద్ధాంతం.

1559 లో ప్రసిద్ధ మైన జనీవా అకాడెమీ ని స్థాపించాడు. దాని ద్వారా తను సుసంస్కృతం చేసిన ఈశ్వర సిద్ధాంతాలను బహుళం గా ప్రచారం చేశాడు. యాభై నాలుగేళ్ళు మాత్రమె జీవించి1564 may 27 న జాన్ కాల్విన మరణించాడు, ప్రొటెస్టెంట్ మత విప్లవం లో గొప్ప పాత్ర పోషించి ఫ్రెంచ్ దార్శనికుదని పించుకొన్నాడు పొలెమిక్ అపాలజిస్ట్ రచయిత అని పించుకొన్నాడు క్రిస్టియన్ దియాలజీ లో సుస్తిత స్థానం సంపాదించుకొన్నాడు ఆయన ఆనాడు ప్రవచించిన వాటినే ఈనాడు ప్రపంచ వ్యాప్తం గా ఆచరిస్తున్నారు సంతానం లేకుండా నే చని పోయాడు రిఫార్మర్ లలో అనైకతను గూర్చి బాధ పడ్డాడు వారిని పిలిచి మాట్లాడి ఐక్యత చేకూర్చాడు

## కియోర్క్ గార్డ్



కియోర్క్ గార్డ్ క్రీ శ.1813 లో డేనిష్ లోని కోపెన్ హాగెన్ లో జన్మించాడు. తండ్రి వ్యవసాయ దారుడే కాక ఉన్ని వర్తకుడు కూడా. సమాజం లో పేరు పొందిన వాడు. కొడుకు ను తీవ్ర క్రమ శిక్షణ తో విద్య నేర్పించాడు ఒక రోజు తండ్రి కొడుకును పిలిచి జీవితం లో తాను అపరాధం చేశానని, ఇప్పుడు పశ్చాత్తాపం చెందుతున్నానని కొడుకును అందుకే అంత తీవ్ర క్రమ శిక్షణ తో పెంచుతున్నానని మనసు విప్పి చెప్పాడు. అతను చేసిన తప్పేమిటో కొడుక్కు చెప్పలేదు. ఈ విషయం తెలిసిన కొడుక్కి తండ్రి పై ఉన్న గౌరవం అంతా పోయింది. తండ్రి చేసిన తప్పుకు తాను కూడా పాలు పంచుకొంటున్నానని విచా రించాడు వ్యాకుల మనస్సు తో చాలా కాలం ఉండి పోయాడు.

Head and shoulders sketch portrait of a young man in his twenties, which emphasizes the face, full hair, open eyes forward, with a hint of a smile. His attire is formal, with a necktie and lapel.

కియోర్క్ గార్డ్- యూని వర్సిటీ లో చేరి చదువుతున్నా మనస్సు నిలప లేక పోయాడు 1838 లో తండ్రి మరణం తర్వాత కొంత ఊరట చెందాడు. మరో రెండేళ్లలో యూని వర్సిటి విద్య పూర్తీ చేశాడు సవ్యం గా సాగి పోతున్న జీవితం లో మరో ఉపద్రవం ఏర్పడింది ".రేజీన్ ఆల్ సెన్"అనే అమ్మాయిని ప్రేమించాడు పెళ్లి చేసుకొంటానని మాట కూడా ఇచ్చేశాడు. కాని తను వివాహానికి అర్హుడిని కాదేమో నన్న సందేహం పీడించింది. పెళ్లి చేసుకొంటే ఆమె కు కూడా తన తప్పులో భాగస్వామిని అవుతుందని పుట్టబోయే సంతానానికి ఇది వర్తిస్తుందని భావించి ఇక పెళ్లి ప్రస్తావన వదిలేసి మత ధర్మ విద్య లో జీవించాలని నిర్ణ యించాడుఈయనను సొరెన్ కీర్క్ గార్డ్ అనీ అంటారు

పుస్తకాలు రాయటం ప్రారంభించాడు. ఒక్క ఏడాది లోనే అనేక గ్రంధాలు రాసేశాడు. అనేక గ్రంధాలు రాసిన రచయిత గా గుర్తింపు పొందాడు కాని మళ్ళీ తీవ్ర నిరాశకు లోనయ్యాడు ఒక డేనిష్ పత్రికా రచయిత చేసిన తీవ్ర విమర్శకు ఉత్తేజం పొంది, అతని తో వాదానికి దిగాడు. సత్యాన్ని కాపాడటానికి తన ప్రాణాల నైనా త్యజించాలని నిశ్చయించుకొన్నాడు. ఈ సందర్భం గా కొన్ని విషయాలు చెప్పాడు. "సత్యం ఎప్పుడు కొద్ది మంది పక్షానే ఉంటుంది అయినా మిగిలిన వారి కంటే బల వత్తరం గా ఉంటుంది. ఎక్కువ మందిది మిధ్యా బలం. స్వతంత్రం గా ఆలోచించ లేని జనం ఈ మేజారిటీ పక్షాన ఉంటారు..

గార్డ్ రాసిన "జీవిత పధ దశలు "గ్రంధం లో సౌందర్యం, నీతి, మతం అనే మూడు దశలున్నాయని చెప్పాడు ఇవి ఒక దాని తర్వాతా ఒకటి పొందే దశలు కావు. ఒకే సమయం లో ఉండే మానసిక స్తితులే. ఒక్కో సారి వీటి మధ్య సంఘర్షణ జరగా వచ్చు. కియొర్క్ రచించిన "కాని లేక "పుస్తకం లో సౌందర్యం నీతి విషయాలను చర్చించాడు. సౌందర్య విషయిక జీవితం అంటే ఇంద్రియ తర్పణమే.. కాని నైతిక జీవిత విషయం లో మనిషి జీవిత భారాన్ని తనపైన వేసుకొంటాడు. నైతిక మార్గాన్ని కూడా దాటి మత మార్గం లో నడవాలి. "భయం కంపం "అనే గ్రంధం లో దేవుడి ఆజ్ఞ తో అబ్రహం తన కొడుకు ను బలి ఇచ్చిన విషయాన్ని ప్రస్తావించి భగ వంతుని ఆదేశమే చివరిదని దానిని అందరూ ఆచరించాలని తెలియ జేశాడు దేవుడి పై అచంచల విశ్వాసానికి అబ్రహాం గొప్ప ఉదాహరణ అని చెప్పాడు.

హెగెల్ చెప్పిన అభిప్రాయాలను గార్డ్ ఖండించాడు. ఈ విషయం లో తన కున్న అభిప్రాయాలను తెలియ జేయ టానికి మరో పుస్తాకం రాశాడు దీనికి "పర్యవసాన అవైజ్నిక అను బంధం "అని పేరు పెట్టాడు. కష్టాలను ఎదిరించి జీవితాన్ని ఒక వ్యవస్థ గా చేసుకోవాలన్నాడు. వ్యక్తీ యొక్క స్వానుభావమే "అస్తిత్వం " అన్నాడు సత్య దృష్టి ఉన్నవాడు పిచ్చి వాడి లా ప్రవర్తిస్తాడు. అతని మా టలెవారికి అర్ధం కావు. దేవుడేం చేస్తాడో మనిషికి తెలియదు. ధార్మిక విషయాల పై రాసిన దానిలో క్రైస్తవ నమ్మకాన్ని చర్చించాడు మత సత్యం ఎప్పుడూ దేవుని పై ఉన్న విశ్వాసం తో నే ఉంటుంది. ఇందులో ఆ త్మాను భవం ఉంటుంది. ఆత్మానుభవం అంటే నిత్యం తన నిర్ణయాలలో వ్యక్తం అయ్యే జీవిత అనుభవమే అన్నాడు,

మొదట్లో గార్డ్ ఉప దేశాలను ఎవ్వరూ లెక్క చెయ్య లేదు. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత, దార్శనిక పద్ధతులన్నీ నాశనం అయిన తర్వాత గార్డ్ సిద్ధాంతాల పై జనం దృష్టి పడి విపరీతం గా వ్యాప్తి చెందాయి. ఇతని "ఆంక్సైటి, డెసిషన్"అంటే ఉత్కంఠ,నిశ్చయం మొదలైన ఆస్తిత్వ వాద సిద్ధాంతాలను" హై డేగ్గర్, యాస్పర్స్, మార్సెల్ "మొదలైన దార్శనికులు తమ దర్శన శాస్త్రాలలో చొప్పించారు. అస్తిత్వ వాదానికి ఒక రకం గా "కియోర్క్ గార్డ్ ఆద్యుడు "అని పించుకొన్నాడు. ఇరవయ్యవ శతాబ్దపు దార్శనికుల పై పందొమ్మిద వ శాతాబ్దికి చెందిన కియొర్క్ గార్డ్ చూపినంత ప్రభావం ఏ దార్శనికుడు చూప లేక పోయాడు నిర్మాణం లో కొత్తదనాన్ని, కొత్త దార్శనిక భావ ధోరణిని దర్శన శాస్త్రం లో ప్రవేశ పెట్టిన ఘనుడు కియొర్క్ గార్డ్.. గార్డ్ తన నలభై రెండవయేట 1855 లో కీర్తి శేషుడయ్యాడు

## ఆగస్ట్ కొంటే

క్రీ శ.1798 లో 28 జనవరి లో ఫ్రాన్సు దేశం లో మౌంట్ పీల్యార్లో కొం ట్ ఆగస్ట్ పుట్టాడు. ఫ్రాన్స్ దేశపు దార్శనికుడు గా ప్రసిద్ధి చెందాడు. విద్యార్ధి గా ఉండగానే ఆ నాటి దర్శనీయ సిద్ధాంతాల ను తీవ్రం గా వ్యతి రేకించాడు 1818 లో సెయింట్ సిమాన్ తో పరిచయం కలిగింది. సీమాన్ ప్రభావం ఆగస్ట్ మీద పడింది.



అన్ని విషయాల లాగానే రాజ కీయ విషయాలను కూడా సూత్రీకరించ వచ్చు అనే అభిప్రాయం ఆయనది. దర్శన శాస్త్రాలన్నీ సమాజానికి సంబంధించి ఉండాలని చెప్పే వాడు. నైతిక, మత, రాజ కీయ విధానాలను పునర్వవస్తీక రించటమే దర్శనానికి ముఖ్య విషయం అని చెప్పాడు సీమాన్ చెప్పిన వన్నీ తన సిద్ధాంతాలలో పొందు పరచాడు కొంట్. 1843 లో దేశం లో రాజకీయ ప్రాధాన్యం ఉన్న కాలం లో కొంట్ "ప్రత్యక్ష జ్ఞాన ప్రాధాన్య సమాజం (పాజిటివిస్ట్ సొసైటీ) అనే దాన్ని నెల కోల్పాడు. శిష్యులు చాలా మంది ఏర్పడ్డారుఆయన రాసిన పుస్తకమే రెలిజియన్ ఆఫ్ హ్యూమానితి

ఈ యన వాదం ఆయన మొదట కనీ పెట్టిన "త్రిదశా నియమం "(the law of the three )తో ప్రారంభించాడు. మొదటి దశలో మానవుడు ప్రపంచాన్ని మత దృష్టి తో చూడాలి రెండవ దశ లో అతి భౌతిక దృష్టితో వీక్షించాలి మూడవ దశలో ప్రత్యక్షా నుభవం దృష్టితో చూడాలని చెప్పాడు. మొదటి రెండు దశలలో మనిషి సంఘటనలకు కారణం, వాటి స్వరూపాన్ని అన్వేషిస్తాడన్నాడు. మూడవ దశలో నియమాల తో సంతృప్తి చెందుతాడు అని వివ

రించాడు. సమాజానికి కావలసిన వాటిని ఈ మూడవ దశలో చెప్పటం వలన శాస్త్రీయ దృక్పధాన్ని, పర్య వేక్షణ ను ఇందులో చేర్చాడు. ప్రత్యక్ష జ్ఞానానికి ప్రాధాన్యత నిచ్చాడు కొంట్,

మూడవ దశలో సామాజిక సంఘటనలను చేర్చటం వల్ల భౌతిక శాస్త్ర ఆవిర్భావానికి కారణం అయింది. సమాజం లోని భూతాలు వాటి అర్ధాలు పరిస్తితుల మధ్య సంబంధాన్ని గురించి చెప్పేదే "సామాజిక భౌతిక శాస్త్రం "అంటే కొంట్ ఆగస్ట్ ను మొదటి సామాజిక భౌతిక శాస్త్ర వేత్త గా భావించ వచ్చు

1859 సెప్టెంబర్ 21 న మరణించాడు

## బెనడేట్టో క్రోచ్

ఇటలీకి చెందిన బెనడడేట్టో క్రోచ్ 1966 ఫిబ్రవరి 25న పెస్కాస్సరోలి లో జన్మించాడు. గొప్ప చరిత్రకారుడు, సాహితీ విమర్శకుడు. నేపిల్స్ లో కేధలిక్ బడి లో చదివాడు. 1883 భూ కంపం లో అతని 17వ ఏట తలిదండ్రులిద్దరు మరణించారు. క్రోచ్ కూడా శిధిలాలలో చాలా రోజులు కప్పు బడి ఉన్నాడు. ఒళ్లంతా గాయాల తో చాలా కాలం ఇబ్బంది పడ్డాడు.

రోం నగరం చేరి బాబాయి దగ్గర కొంతకాలం ఉండి యూనివర్సిటి లో చేరాడు. కాని విద్య సాగలేదు. మళ్ళీ 1886 నేపిల్స్ కు చేరాడు. చరిత్ర పై చాలా పరిశోధనలు చేశాడు 1893 లో చరిత్ర తీరు, సాహిత్య విమర్శల పై రెండు వ్యాసాలూ రాశాడు వీటి తో అతని పేరు మారు మోగింది. క్రమంగా మత సిద్ధాంతాల పై ద్రుష్టి పెట్టి రచనా వ్యాసంగం కోన సాగించాడు. 1902 లో క్రోచ్ స్వంత భావాలకు ఆవిష్కరణ చేసి దర్శన శాస్త్రం లో అందరి దృష్టినీ ఆకర్షించాడు. సౌందర్యం, తర్కం, ప్రవర్తన, చరిత్ర లేఖనం (హిస్టోరియోగ్రఫీ)అని నాలుగు భాగాలుగా తన దర్శన శాస్త్రాన్ని రాశాడు

Historical materialism and the economics of Karl Marx (1914)Breviary of Aesthetics: Four LecturesMy philosophyHistory as the story of liberty

1909 లో "విమర్శ "అనే పత్రిక స్తాపించి సాహిత్యం లో, చరిత్రలో యాభై ఏళ్ళు గా ఇటలీ సాధించిన దాని పై సమీక్ష వ్యాసాలూ రాశాడు 1926 కే 20 గ్రంధాలు రాసి ప్రాముఖ స్తానాన్ని పొందాడు. అతని విద్వత్తు ను గుర్తిచి ఇటలీ రాజ్య సభకు సభ్యత్వాన్ని ప్రసాదించింది ప్రభుత్వం 1920-21 లో విద్యా మంత్రి గా కూడా పని చేశాడు క్రోచ్ దర్శనం ఫ్రాన్సేస్కో డే సాన్క్టిస్ట్ రాసిన సాహిత్య విమర్శ, జియాం బాటిస్టా ఆలోచనల తో ను నిండి ఉంటుంది వీరి ప్రభావం ఆయన రాసిన సాహిత్యం, చరిత్ర లో చేసిన పరిశోధనల లో కూడా కనిపిస్తుంది.

క్రోచ్ చేసిన గొప్ప పని సౌందర్యానికి చరిత్రకు కొత్త అర్ధాలను చెప్పటం. అందుకే నూతన మత మార్గ దర్శి అని పించుకొన్నాడు. చరిత్ర నిజ స్తితి చూస్తె తనకు ఒక గట్టి సత్యం (కాంక్రీట్ రియాలిటి )కనీ పించింది అన్నాడు. దీన్ని ఆధారం గా చేసుకొనే తన నూతన చరిత్ర ను వ్యాఖ్యానిన్చానని తెలియ జేశాడు కనుక చరిత్ర మూర్త దర్శన శాస్త్రము (కాంక్రీట్ ఫిలాసఫీ )ఒకటే అని బలం గా చెప్పాడు. చరిత్రలో అంతర్గతం గా ఉన్న (ఇమ్మనేంట్ )పద్ధతిని కనుగొని దానికి ఒక రూపం ఇవ్వటమే దర్శన శాస్త్రం యొక్క పరమార్ధం అన్నాడు

అనుభవాతీత సత్యాలకు, మూల తత్వాలకు, చరమ లక్ష్యాలకు క్రోచ్ తన దర్శన శాస్త్రం లో చోటు కల్పించలేదు. కల్పనలను కూడా వదిలి పెట్టాడు. క్రోచ్ దర్శనాన్ని "ఆత్మ దర్శనం "(ఫిలాసఫీ ఆఫ్ స్పిరిట్ )అని పిలిచాడు. వాస్తవ సంఘటనలే చరిత్ర, అలాంటి సంఘటనల ను వ్యాఖ్యానించే చరిత్ర ఒకే చైతన్యం యొక్క పని అని చెప్పాడు. చరిత్రలో ఆత్మ స్వయం గా వ్యక్తమవుతుందని, చరిత్రనే శరీరం గా చేసుకొని చరిత్ర అన్ని భాగాలలోను ఆత్మ సంపూర్ణం గా, అఖండం గా క్రియా రూపం లో ప్రత్యక్ష మై ఉంటుందని వివ రించాడు అలాంటి దాని ఉనికి, ప్రవృత్తి, మానవ చరిత్రకే పరి మితం కాలేదు అనుభవాల యొక్క చివరి అవధులను కూడా దాటి ప్రవృత్తి అన్ని వైపులా విస్తరిస్తుంది.

అనుభం లో వ్యాపించి ఉండే ఆత్మ ఏకం, అఖండం అంటే కాక ఆత్మ ఏకం, చతుర్ముఖం కూడా అంటాడు బెనదేట్టో. దీనికి స్పష్టం, నిత్యం, విభిన్నం ప్రయోజనం, అనే దశలుంటాయి.వీటి మధ్య ఆత్మా నిరంతరం ఉండి ముందుకు పోతుంది. ఈ ప్రయాణం లో అది తన అనుభవం తో తనకు తాను పూరించు కొంటుంది. తన అస్తిత్వాన్ని సాఫల్యం చేసు కొంటుంది. ఈ నాలుగు వృత్తులు అనుభవ విషయాలను సృష్టిస్తాయి. ఇవి సౌందర్యం, తర్కం, అర్ధ,నీతిశాస్త్రాలకు చెంది ఉంటాయి. ఇవన్నీ కలిస్తేనే సంపూర్ణ దర్శన శాస్త్రం అని పించు కొంటుంది.

అందరు చెప్పే సత్యం శివం సుందరం లకు ప్రయోజనం అనే నాలుగవ దానిని కొత్తగా క్రోచ్ చేర్చడన్న మాట. జ్ఞానం లో ఆత్మ కళ గా వ్యక్తమవుతుంది. ఇలా తనను తానూ ఆవిష్కరించు కోవటం లోనే దానికి సృజనాత్మకత ఉందని తెలుస్తోంది. జ్ఞానం యొక్క మొదటి దశనే

కళ అంటారు ఈ దశ లో  అది ఆక్రుతులలో (ఏమ్బాడి  మెంట్స్ ) లో వ్యక్తమవుతుంది. ఆత్మ జ్ఞానం విషయం సౌందర్య విషయం కూడా దాని ప్రవృత్తి  ఫలితమే.  విశిష్ట వ్యక్తిత్వం ఉన్న ప్రతి విషయం లోను ఆత్మ ఆకారాన్ని పొందుతుంది. కనుక అలాంటి విషయం సౌందర్యం అని పించుకొంటుంది.

కళఅంటే భావం లేక రూపం లేక అనుభావాంశం ను అనుసంధానం చేయటమే అని నిర్వచించాడు. అలాంటి అనుసందానాన్నే రూపాభి వ్యక్తీ అని, భావాల్ని బహిర్గతం చేయటం కేవలం యాంత్రిక శిల్పం అని ఆయన అభిప్రాయ పడ్డాడు. కళా ఖండాలలో ఆవిష్కరింప బడిన భావాలను మళ్ళీ  భావన చేయటం వలన మూల భావం మళ్ళీ ఆవిష్కారమవుతుందని క్రోచ్ చెప్పాడు జ్ఞానం యొక్క రెండవ దశ అయిన తర్కం లేక కేవల అమూర్త దర్శన శాస్త్రం. ఇందులో జ్ఞానం అన్ని విషయాలలోనూ అభి వ్యక్తం అవుతుంది. ఈ సామాన్య విషయాలను అస్తిత్వం లోకి తెచ్చి జ్ఞానం తన దృష్టికి విషయం గా మార్చు కొంటుంది. ఆత్మ యొక్క పై రెండు స్తితులు చరిత్రను వాస్తవ మార్గం లో రూపొందిస్తుంది అని బెనడెట్టో క్రోచ్ ప్రగాఢ విశ్వాసం. 86 ఏళ్ళు నిండుగా జీవించి క్రోచ్ 1952 నవంబర్ ఇరవై  న చని పోయాడు.

## విలియం జేమ్స్

జేమ్స్ విలియమ్స్ అమెరికా దార్శనికుడు క్రీశ..1842 జనవరి 11 న న్యూయార్క్ లో.  జన్మించాడు మనస్తత్వ శాస్త్ర వేత్త గా మంచి పేరు. వ్యావహారిక సత్తా వాదాన్ని (ప్రాగ్మా టి జం )ను ప్రారంభించిన ముగ్గురిలో ఒకడు. హార్వర్డ్ వైద్య కళా శాల లో ఆచార్యుడి గా పని చేశాడు. హార్వర్డ్ విశ్వ విద్యాలయం లో దర్శన శాస్త్ర ఆచార్యుడు  గా పని చేశాడు. తర్వాత సైకాలజీ ప్రొఫెసర్ అయ్యాడు. మనస్తత్వ శాస్త్ర తత్త్వం(ప్రిన్సిపిల్స్ ఆఫ్  సైకాలజీ), మహానుభావ వైవిధ్యం(వెరైటీస్ ఆఫ్ రిలీజియన్ )తీవ్ర అనుభవ వాదం (రాడికల్ ఏమ్పిరిసిసం )వ్యావహారిక సత్తా వాదం (ప్రాగ్మాటిజం )అనే గ్రంధాలు రాశాడు జేమ్స్ ఇవి తర్వాతి తరం పై గొప్ప ప్రభావం కలిగించాయి.



Principles of Psychology (1890)A pluralistic universe (1909)Essays in Radical Empiricism (1909)

మన అనుభవం లో ఒక భాగం నుండి మరొక భాగానికి బుద్ధి మనల్ని తీసుకొని పోతుంది. వస్తువుల మధ్య సత్ సంబంధాల్ని కల్పిస్తుంది. సరళ మార్గం లో శ్రమను తగ్గించి, అడ్డు లేకుండా కార్యాలు చేయటానికి ఏ భావం అయినా సత్యమే అంటాడు విలియమ్స్. దాని సాధకత మాత్రమె సత్యానికి నిదర్శనం. అని సత్యాన్ని నిర్వచించాడు. మన అవసరాలను, ప్రయోజ నాలను సంతృప్తి పరచటానికి భావాల ప్రమాణం ఆధార పడి ఉంది. మన ప్రవృత్తి లో విజయాన్ని చ్చేదే సత్యం అంటాడు అపజయాలను కల్గించేది అసత్యం. ఒక సత్యం సత్యమా అసత్యమా అని తేల్చేది ఆచరణ లో అది చేకూర్చే ఫలితం పై ఆధార పడి ఉంటుందన్నాడు.

జేమ్స్ చెప్పిన రెండవ ముఖ్య భావం "బహుత్వ వాదం ".ఏకత్వ వాదం కంటే ఇదే మేలైనది అంటాడు అదే మానవ స్వాతంత్ర్యానికి, అవసరాలకు తగినది. మనం ఉన్న ప్రపంచం సర్వోత్క్రుస్టం కాదు. కాని మనిషి తన సంకల్పం తో, ప్రయత్నం తో అభి వృద్ధి చేయచ్చు. అని అభి వృద్ధి వాదాన్ని (మేలియోరిజం )ను ప్రతి పాదించాడు. జేమ్స్ చెప్పిన అనుభవ వాదం యూరప్ లో సాంప్రదాయిక భావ, బుద్ధి వాదాలకు వ్యతి రేక మైనది. అనుభవ విషయం అంతా సత్యమే నంటాడు జేమ్స్. సత్యం ప్రతి క్షణం మార్పు చెందుతుంది. ఇంద్రియాలు కల్పించే సంబంధాలు కూడా సత్యం లో భాగాలే నన్నాడు. అవి కూడా అనుభాల వల్ల  ఏర్పడినవే. సత్యం అంటే మన గ్రహణ కోసం సిద్ధం చేయ బడ్డ ఏదో ఒక నిత్య పరిణామ రహిత వస్తువు మాత్రం కాదు. మానవ ఆలోచనల వల్ల  చరిత్ర మారుతోంది. కనుక మనిషి చరిత్ర గతిని మార్చ గలుగుతున్నాడు.

సత్యాన్ని మనం గ్రహించటం ద్వారానే అందులో కొన్ని మార్పులను మానవుడు చేయ గలుగుతున్నాడు. మనకు కనీ పించే ప్రపంచానికి ఆధారం గా ఒక నిత్య ద్రవ్యం ఉంది అనటం భ్రాంతియే అన్నాడు విలియం. ప్రత్యక్ష అనుభవం లో నానాత్వం విభిన్నత్వం కన పడుతోంది. కనుక సత్యం నానాత్వా తోను, భిన్నత్వం తోను కూడి ఉంటుంది ఇదే అనుభవ వద సారాంశం.

మానవుడు తన రాగం సంకల్పం లకు అనుగుణం గ ఈశ్వర భావాన్ని ఏర్పరచుకొన్నాడు. ఈశ్వరుడు కూడా ఈ విశ్వం లో ఒక భాగమే. ఆయన మానవులపై కరుణా ద్రుష్టి ఉన్న వాడు. అమిత శక్తి సంపన్నుడు కూడా. అందుకే మనకు అన్ని రకాల సహాయం అందిస్తాడు. విశ్వసిమ్చాలి అనే సంకల్పం (విల్ టు బిలీవ్ )ఈశ్వర సంకల్పాన్నే ప్రతి పదిస్తున్నన్నాడు. చైతన్యం అనేది ఒక వస్తువు కాదు. అదొక ప్రక్రియ (ఫంక్షన్ )అని విలియం వాదం

మానవ సంకల్పానికి స్వేచ్చ ఉందని అందుకే మానవుడి ప్రయత్నం అదుపు లో ఉంచుకొనే వీలుందని శారీరక ప్రవృత్తు లన్ని మనస్సును ఆక్రమించిన తీవ్ర భావాలకు అను గుణం గానే ఉంటాయని జేమ్స్ భావించాడు 62 ఏళ్ళు జీవించి విలియం జేమ్స్ 1910 ఆగస్ట్ ఇరవై ఆరు న మరణించాడుజేమ్స్ ను "ఫాదర్ ఆఫ్ అమెరికన్ సైకాలజీ "అని గౌరవం గా పిలుస్తారు

## నింబార్కర్

వేద వ్యాస మహర్షి రాసిన బ్రహ్మ సూత్రాలకు వ్యాఖ్యానం రాసిన వారిలో నిమ్బార్కరుడు ఒకరు. అయన తెలుగు వాడే ననే అభి ప్రాయం ఉంది గోదావరి తీరం లో సుదర్శనాశ్రామం లో జన్మించి నట్లు చెబుతారు. ఈయన రాసిన విషయాలను బట్టి చూస్తె ఆది శంకరాచార్యుల వారికి ముందు వాడు కాదని అభిప్రాయం.

ఈయన రాసిన "మాధవ ముఖ మర్దనం, "బట్టి చూస్తె మాధవా చార్యుల ముందు వాడు కూడా కాదంటారు. కనుక జీవిత కాలాన్ని క్రీ పూ..13 శతాబ్దపు వాడని తేల్చారు. నిమ్బార్కర్ రాసిన బ్రహ్మ సూత్రా వ్యాఖ్యానానికి "వేదాంత పారిజాతం "అని పేరు. తన సిద్ధాంతాలను "దశ శ్లోకి "లో నిక్షిప్తం చేశాడు. "సవి శేష నిర్వి శేష శ్రీ కృష్ణ స్తవ రాజం "అనే స్తోత్ర గ్రంధము కూడా రాశాడు.



నిమ్బార్కర్ దర్శనం లో మూడు తత్వాలున్నాయి. అవి చిత్తూ, అచిత్తు, ఈశ్వరుడు. వీటినే భోక్త, భో గ్యం, ప్రేరిత లేక శ్వేతాశ్వతరం అంటారు. ఈయనకు శ్రీ కృష్ణుడే పర తత్త్వం. ఈయనకు సమానం కాని అధికులు కాని లేరని నమ్మకం. సర్వేశ్వరుడు సర్వానికి నియంత. ప్రపంచానికి నిమిత్తం, ఉపాదానం కూడా ఆయనే. అందుకే పరబ్రహ్మ అంతర్యామి. రూపం అనే రెండు రూపాలుంటాయి. ప్రపంచం అంటే పర బ్రహ్మ పరిణామమే. పర బ్రహ్మ ప్రపంచ దృష్టిలో భిన్నం గాను, ఆంతర్యం లో అంతర్యామి రూపం లో అభిన్నం గా ఉంటాడు. పర బ్రాహ్మ పరుడు, అంతర్యామి అయిన సగుణ, నిర్గుణ భావాన్ని నిమ్బార్కరాచార్యుడు చెప్పలేదు.

వేదం లో ఉన్న నిర్గుణ వాక్యాలు కేవల భేదాన్ని, మిగిలిన వాటిని నిషేదించాడు. పరబ్రహ్మ తన నుండి ప్రపంచాన్ని సృష్టిస్తాడు. ఈశ్వరుని అభేదత్వానికి స్వతంత్ర సద్భావం, నియామకత్వం కనీ పించి నట్లు భేద, అభేద రూపం లో పర తంత్ర సద్భావం నియామత్వం సూచిస్తుంది. ప్రపంచం దేవుని మాయా విజ్రుమ్భానం కాదు. ఆయన శక్తి నుంచి ఆవిర్భవించింది. పరత్వం అన్తార్యమిత్వం రూపాల సమతుల్య స్తితి ఏ ఆయన ప్రపంచాన్ని సృష్టించ టానికి కారణం. ఈ రెండు సమ ప్రాదాన్యమైనవే. అవ్యాకృత, వ్యాకృత రూపాలు బ్రహం యొక్క స్వగత భేదాలే. ఆయన ప్రపంచానికి అతీతుడు. ప్రపంచం లేకుండా పర బ్రహ్మ సమగ్రం కాదు.

జీవాత్మ జ్ఞాన స్వరూపుడు. అచేతన ద్రవ్యాలైన శరీరం, ఇంద్రియాలు, ముఖ్య ప్రాణం, మనస్సు, బుద్ధి అనే వాటి కంటే భిన్నుడు. అతడు జ్ఞానాశ్రయం కూడా. జ్ఞానం ధర్మ గా ఉన్న వాడు. జీవాత్మ ఆది అంతం లేని వాడు. పరబ్రహ్మ అంశమే జీవాత్మ. జీవాత్మ అనేకాలు. ఇవన్నీ పరాబ్రహ్మ రూపాలే. అవిద్య చే సంసారి అవుతాడు. అందుకే సుఖ దుఖాలనుభ విస్తాడు.

జగత్తు మూడు విధాలు. కేవల సత్యం ప్రాకృతం. కాలం పర బ్రహ్మ చే ప్రేరితం. ప్రాపంచానికి ఉపాదానం. ప్రపంచం పర బ్రాహ్మ కార్యం నిత్యం సత్వ రజస్తమో గుణాల తో కూడి ఉంటుంది

ప్రాపంకత్పత్తి ఆకాశం, వాయువు,అగ్ని, జాలం, భూమి అన్ని పరబ్రహ్మ నుండే ఆవిర్భ వించాయి. కేవల సత్యం కాలం అచిద్రూపాలు.



బ్రహ్మం చిత్తూ అచిత్ లమధ్య పరస్పర సంబంధమే. ఆయన నియంత. బ్ర హ్మం అంటే కొత్త ఉత్పత్తికాదు, సూక్షం రూపం లో నుంచి స్తూలం గా వ్యాపించినదే. బ్రహ్మం అంశి జీవాత్మ అంశం. ఈ రెండు అసత్యాలు కావు. అయన సర్వ వ్యాపి దోష రహితుడు. జీవుడు జగద్వ్యాపారి. బ్రహ్మ క్షర అక్షర రూపాలకు అతీతుడు.

బ్రహ్మనికి జగత్తు కు మధ్య స్వరూపం లో తేడా ఉంది. బ్రహ్మ కారణం జగత్తు కార్యం. ఈరెండిటి అనన్యత్వాం మాటల తో చెప్పా లేనిది. బ్రాహ్మ చైతన్య స్వరూపం నిత్య శుద్ధం. మోక్షం అంటే జీవాత్మ పర బ్రహ్మ లో సామ్యాన్ని పొందటమే. ఆయన ప్రసాదమే జీవుని కి శరణ్యం. మోక్షానికి కర్మ, జ్ఞానం, ఉపాసన, శక్తి, ప్రపత్తి, గురు అనుగ్రహం అనే ఆరు కావాలి విద్యుక్త కర్మమే చేయాలి. కర్మ జ్ఞానానికి అంగాం. విద్య కర్మకు అంగం. బ్రాహ్మ విద్యయే నేర్వాలి. పర మాత్మ జ్ఞానాన్ని పొందిన ఆత్మా ను ఉపాసించాలి అదే అత్యుత్తమ ఉప్పాదానం.

భక్తీ ఉపాసన ఒక టి కావన్నాడు ఆచార్యుడు. దేవుని పై పరమ ప్రేమనే భక్తీ అన్నాడు, భక్తీ మోక్ష సాధనం ఈశ్వర ప్రసాదం లభిస్తేనే మోక్షం. ఈయన చెప్పిన ప్రపత్తి రామానుజా చార్యులు చెప్పి నట్లే ఉంటుంది. ప్రపత్తి ఈశ్వరుని గురించి, ఆచార్యుని గురించి ఉండాలి జీవాత్మ, పరమాత్మలకు మధ్య వర్తి ఆ చార్యుడు. జీవుడు –గురువు –ఈశ్వరుడు. ఆచార్యుని అనుగ్రహాన్ని ముందు పొంది మోక్షానికి ఆయన ఉపదేశాన్ని పాటించాలి. ఆచార్య ఉప పత్తి లభిస్తే ఇక కర్తవ్యమ్ అనేది ఉండదు. ఆచార్య పదం అన్ని సందేహాలకు నివృత్తి. అని నిమ్బార్కరాచార్య మతం

## హేడేగ్గర్

జర్మనీ దేశానికి చెందినమార్టిన్ హేడే గ్గర్ దార్శనికుడు1889 లోసెప్టెంబర్ 26 న "మెన్ కిర్చ్ "అనే గ్రామం లో జన్మించాడు. ఆర్గ్ బర్గ్, పై బర్గ్ యూని వర్సిటీలలో దార్శనిక శాస్త్ర అధ్యాపకుడు గా పని చేశాడు. రెండో ప్రపంచ యుద్ధం తర్వాతా "బ్లాక్ ఫారెస్ట్ "ఆనే నిర్మానుష్య ప్రదేశం లో నివాసం ఉన్నాడు



హిడేగ్గర్ ను అస్తవ వాది అని పిలిచినా ఆయనకు ఇష్టమైనది సత్య శాస్త్రమే. సామాన్య సత్యాన్ని పరిష్కరించాలి అంటే ముందు మానవ సత్యాన్ని విచారించాలి అంటాడు. మనిషి లోనే సత్యం తనను తానూ తెలుసుకొనే స్తితి లోకి వచ్చే సింది అని భావించాడు. మనిషికి సత్యం ఉందని అది తనలోనే ఉందని తెలుసు అంటాడు హిడేగ్గర్. అతని సత్యం జ్ఞానం తో కలిసే ఉంటుంది. కనుక మిగిలిన సచేతన, అచేతన వస్తువు ల సత్యం కంటే భిన్నమైనది., విచక్షణ మైనది. ఈ సత్యాన్నే హిడేగ్గర్ అస్తిత్వ వాదం అన్నాడు. ఆటను రాసిన "బీయింగ్ అండ్ టైం"గ్రంధం ఇరవయ్యవ శతాబ్దపు అపూర్వ గ్రంధం అని పించు కొంది నాజీలతో సాన్నిహిత్యం ఎక్కువ దాన్ని తిరస్క రించలేదు తానూ హోగ స్వామి అయినందుకు చిన్తించలేదు క్షామపణా చెప్ప లేదు అందుకే వివాదా స్పదుడు అ య్యాడు కాని ఆన్తరంగికులలతో "అలా చేయటం తన అతి పెద్ద దోషం" అని అన్నా ట

Being and Time (1927)Poetry, language, thoughtAn Introduction to MetaphysicsPathmarks

"సత్యం కాలం", అనేది ఈయన ప్రధాన గ్రంధం. మానవ అస్తిత్వ విషయం టో ప్రారంభించి, సామాన్య అస్తిత్వానికి పరిష్కారం సాధించాడు. కాని ఆ పుస్తకాన్ని పూర్తీ చేయ లేక పోయాడు. మానవ అస్తిత్వాన్ని దాటి వెళ్ళ లేక పోయాడు. ఈ సత్యాన్ని ఒక "ఆవేదన "గా భావించాడు. ఆ ఆవేదన లో శక్యత, భూత స్తితి, పతనం అనే మూడు అంశాలున్నాయని చెప్పాడు. మానవుడు భవిష్యత్తు వైపు చూపు సారిస్తాడు. ఇతనికి అనేక మార్గాలు తెరచే ఉన్నాయి. దేన్ని తీస్కొంటే, జీవితం సార్ధకత చెందు తుందో తనకు తానె నిర్ణ యించు కోవాలి. ఈ నిర్ణయ సంభావ్యతనే ;"శక్తత "అన్నాడు. మానవుడు కోరుకొన్న సన్నీ వేశం ఇది కాదు. గతించిన దాని నుంచే భవిష్యత్తు నిర్ణ యించుకోవాలి. దీనికే "భూత స్తితి "అని పేరు పెట్టాడు. మానవ పతనం వర్తమానానికి సంబంధించిందే. రోజు కనీ పించే అవకాశాల రూపం లో అది ఉంటుంది. ఈ వర్త మాన అవస్తలో మానవుడు చిక్కు కొని ఉన్నాడు అని హిడేగ్గర్ అభి ప్రాయం.

అస్తిత్వాన్ని హిడేగ్గర్ సార్ధకతా సహితం సార్ధకతా రహితం అని రెండు రకాలుగా విభ జించాడు. జన సామాన్యం లో మనిషి ఉండి తన వ్యక్తిత్వాన్ని కోల్పోతాడు. అలాంటి స్తితిలో ఉత్తేజం పొంది తన అస్తిత్వాన్ని బాధ్యతా యుతం గా తీర్చి దిద్దు కొంటాడు. మృత్యు భీతి అతని ప్రవర్తనలో మార్పుకు కారణం అవుతుంది. జనాల నుండి అతను విడుదల పొందటం అనేది అస్తిత్వం యొక్క శూన్య స్వభావమును గుర్తించటం వల్ల కలిగినదే.

హిదేగ్గర్ "అది భౌతిక శాస్త్రం అంటే ఏమిటి ?""అతి భౌతిక శాస్త్ర ఉపోద్ఘాతం ","దారువనం ( Holzwege)అనే గ్రంధాలు ఆ తర్వాతా రాశాడు. సత్య శాస్త్ర విషయాలను మరింత విపులం గా చర్చించి వీటిలో రాశాడు. అతని మనవ అస్తిత్వ విషయం శూన్యం దగ్గరకు చేరింది. అతని అతి భౌతిక శాస్త్రం లో "ఏదైనా ఎందుకు ఇక్కడ ఉంది ?ఏమీ లేకుండా ఎందుకుండా కూడదు / అనేవి మూల ప్రశ్నలు అస్తిత్వం యొక్క ప్రతి ద్వందియే శూన్యం. ఈ రెండు పరస్పర విరుద్ధాలు. హిడేగ్గర్ ఆలోచనలు చివరికి "అపరోక్ష అనుభవం "వైపుకు సాగాయి. ఈ భావాన్ని జెన్ బౌద్ధం తో, మాస్టర్ ఎకార్ట్ అపరోక్ష అను భావం తో పోలుస్తారు. ఇతని తార్కిక విశ్లేషణ సత్య సాక్షాత్కారానికి దారి తీసింది

జర్మనీ భాష లో పదాల వ్యుత్పత్తి అర్ధాలను హిడేగ్గర్ ఎక్కువ గా వాడుకొన్నాడు కనుక భాష అంత సరళం గా ఉండదు. సమకాలీన ఐరోపా ఆలోచనా పరులలలో హిడే గ్గర్ అత్యంత ప్రతిభా వంతుదని పించు కొన్నాడు జీన్ పాల్ సాత్రే పై, హిదేగ్గర్ ప్రభావం ఎక్కువ. ఈశ్వర శాస్త్రం, మనస్తత్వ శాస్త్రాల పై కూడా హిడేగ్గర్ ప్రభావం ఎక్కు 1976 మే 26న ఎనభై ఏడేళ్ళ వయసులో మరణించాడు.

## హెగెల్

జార్జి విలియం ఫ్రెడరిక్ హెగెల్ 1770 లో ఆగస్ట్ ఇరవై ఏడు న జర్మని లోని స్టుడ్ గార్ట్ నగరం లో జన్మించాడు మిత్రుడు షెల్లింగ్, కవి హోల్డర్లిన్ ళ తో కలిసి ఈశ్వర మీమాంస శాస్త్రాధ్యయనం చేశాడు. ముగ్గురికి స్వేచ్ఛ అంటే మహా ఇష్టం. అదే వీరిని కలిపింది. గ్రీక్ సాంప్రదాయాన్ని అమితం గా వీళ్ళు ప్రేమించారు ఫ్రెంచ్ విప్లవానికి ప్రేరణ కల్గించారు.



The Phenomenology of Spirit (1807)Elements of the Philosophy of RightEncyclopedia of the Philosophical SciencesAesthetics

హెగెల్ కొంత కాలం ఒక సామంతుని ఇంట్లో ట్యూటర్ గా పని చేశాడు. తర్వాత ఒక వార్తాపత్రికకు సంపాదకుదయ్యాడు. తన విద్యా వ్యాసంగాన్ని "యీనా "లో మొదలు పెట్టాడు. హైడల్ బర్గ్ లో కొద్ది కాలం లెక్చరర్ గా పని చేశాడు. తరువాత బెర్లిన్ విశ్వ విద్యాలయానికి ఆహ్వానం పొంది చని పోయే వరకు అక్కడే అధ్యాపక జీవితాన్ని గడిపాడు. 1831 లో కలరా వ్యాధి సోకి మరణించాడు.

హెగెల్ జీవించి ఉండగానే ఆయన కీర్తి జర్మనీ దాటి వ్యాపించి పోయింది. క్లిష్టమైన భాష లో రాసే వాడు. దానితో అతని రచన ల పై వ్యతిరేక వ్యాఖ్యానాలోచ్చాయి. భావ కా ఠిన్యానికి ప్రసిద్ధి చెందిన వాడు హెగెల్. తనను ఒక్కడే అర్ధం చేసుకోన్నాడని అతను కూడా అపార్ధం చేస్సుకోన్నాడని వాపోయాడు. హెగెల్ మరణానంతరం అతని ఉపన్యాసాలను మిత్రులు స్నేహితులు కలిసి గ్రంధస్తం చేశారు.

దార్శనిక వ్యవస్థా నిర్మాతగా హెగెల్ ప్రాచుర్యం పొందాడు. సాక్షాత్కార ప్రాబోదాన్ని అంగీకరించ లేదు. అపరోక్ష జ్ఞానానికి పూర్తీ వ్యతిరేకి. జాకోబి వ్యాప్తి చేసిన శ్రద్ధ అనే ఆదర్శాన్ని కూడా హెగెల్ ఒప్పుకోలేదు. జ్ఞానం యొక్క మహత్వం లో అపార నమ్మకం ఉన్న వాడు హెగెల్. జ్ఞానం కంటే గోప్పదనేది లేదు అని బాగా విశ్వాసం గా ఉన్నాడు

షెల్లింగ్ చెప్పిన కేవల ఉదాసీనత భావంమీద కాని, స్పినోజా చెప్పిన తటస్థ మూల ద్రవ్య భావం మీద కానిసత్యం యొక్క ఆవిష్కరణ జరగదని అన్నాడు. సత్యమే జ్ఞాత అంటే తెలుసుకో దగినది. జ్ఞానం కేవలం భావాత్మకం. సత్య భావం సత్యానికి పరకీయం కాదన్నాడు. సత్య సాధనకు ఇది బాహ్య సాధనం మాత్రం కాదు., ఏ విషయం లో సత్యం తనను తాను వ్యక్తం చేసుకొంటుందో ఆ విషయమే భావం అన్నాడు. చైతన్య ము, వాద తార్కిక పధం లో (దలలిక్తికల్లి ),భావాల విధి నిషేధ ప్రక్రియ ద్వారా తనను తానూ అభి వ్యక్తం చేసుకొంటుంది. భావాలు ఆలోచన యొక్క పదార్ధాలే, కాకుండా, సత్యం యొక్క పదార్ధం కూడా అదే.

ఈ దృష్టిలో తర్క శాస్త్రం అతి భౌతిక శాస్త్రం రెండు ఒకటే. భావాలు వాద తార్కిక గతి లో స్తిర స్తానాలు కావు సత్యాన్ని తెలుసు కోవటానికి కొన్ని పరిస్తితులలో జ్ఞానానికి సాధ్యం. సంఘర్షణ, విరుద్ధత అనేవి సత్య స్వభావం లోనే ఉన్నాయి ప్రతిజ్ఞా(ధీసిస్ ), ప్రతి ప్రతిజ్ఞా(యాంటి ధీసిస్ ) తో వ్యతిరేకించాడు. అందులోని వ్యతి రేకాత్మాన్ని తన లో ఇముడ్చు కొంటుంది. జ్ఞానం కేవలం పరోక్షం. భావాత్మకం జ్ఞాన రూప మైన దర్శన శాస్త్రం అన్నిటి కంటే ఉత్కృష్ట మైంది. మతం క,ళ జ్ఞానం యొక్క కింది దశలు మాత్రమె. దర్శనం ఉపాధి రాహిత సంగ్రాన్ని ఇస్తుంది. హేతు బద్ధమైన దంతా సత్యమే. చైతన్యం యొక్క ఆత్మా వికాసమే ప్రతిజ్ఞా, ప్రతి ప్రతిజ్ఞా, సంయోజనం అనే మూడు దశల ద్వారా జరిగి సర్వ సామాన్యసర్వ శూన్య అనే తర్కానికి ఆధారం.

విషయ, విషయి రూపం లో రూపం లో ఉన్న చైతన్యానికి కేవల చైతన్యానికి గల భేదాన్ని హెగెల్ పూర్తిగా ఆవిష్కరించాడు. దేశం వ్యక్తీ సృష్టి కాదు విషయ చైతన్యం యొక్క స్వతంత్ర మూర్త రూపం. చైతన్య వికాసచివరి దశ కాదు చైతన్య వికాసం లో కల మతం, విజ్ఞాన శాస్త్రం అనే తరువాతి దశలున్నాయి. రాష్ట్రం అనేది జాతీయ చైతన్యావతారం మాత్రమె. రాష్ట్ర స్తాపన తో ప్రపంచ చరిత్ర ప్రారంభిస్తుంది. చరిత్ర లో జాతులు కొంత కాలం ఉంది వాటి ప్రయోజనం పూర్తికాగానే శాశ్వతం గా అదృశ్య మవుతాయి. చరిత్ర లో పునరుక్తి లేదన్నాదాన్నాడు హెగెల్.

హెగెల్ దర్శన శాస్త్రం లో మూడు మౌలిక శిక్షలున్నాయి. సత్యం స్వరూపం భావం మూడు తర్క శాసత్రానికి చర్చా విషయాలు. విషయి లేక వ్యక్తీ చైతన్యం రెండవది శాసనం. నీటి, రాష్ట్రం చరిత్ర వీటిలో చెప్ప బడిన సత్యం మూడవది కళ లో వ్యక్తమయ్యే అంతస్స్పురణం. ఉండవలసిన దానికి ఉన్న దానికి మధ్య అయన దర్శనానికి ఘర్షణ లేదు. నిజానికి దూరమైన ఆదర్శం విషాదం అన్నాడు. హెగెల్ చెప్పిన దాన్ని కొందరు భౌతిక వాద వ్యాఖ్యాన్ని కల్పించారు. కొంత మంది ఈశ్వర వాదం వైపు మళ్ళించారు 1831 నవంబర్ పద్నాలుగు న71 ఏళ్ళు జీవించి మరణించాడు,

## థామస్ హాబ్స్

థామస్ హాబ్స్ డేకార్టు శిష్యులలో మొదటి ఆంగ్లేయుడు 1588 లో ఏప్రిల్ అయిదు న జన్మించాడు. నాలుగవ ఏటనే విద్యా భ్యాసం మొదలు పెట్టాడు. గ్రీకు, లాటిన్ భాషల్లో చేయి తిరిగిన వాడని పించు కొన్నాడు. కొద్ది కాలం లోనే ఈ రెండు భాషల్లో పాండిత్యాన్ని కూడా సాధించి అందర్నీ ఆశ్చర్య పరచాడు. పద్నాలుగవ ఏట యూడి పస్ రాసిన "మీడియా "నాట కాన్ని గ్రీకు నుండి లాటిన్ భాష లోకి అనువాదం చేసిన ఘనుడు హాబ్స్.. పదిహేనవ ఏట ఆక్స్ ఫర్డ్ విశ్వ విద్యాలయం లో చేరాడు. ఇరవయ్యవ ఏట డిగ్రీ సాధించాడు.



Leviathan (1651)elements of law, natural and politicMan and citizen

1608 -1640 కాలం లో కావెండిష్ రాజు కుటుంబం లో అధ్యాపక వృత్తి చేశాడు రాజ కుమారుడి తో కలిసి యూరప్ పర్యటన చేశాడు. దానితో ముసలి తనం లో ఉన్న గెలిలియోను, డేకార్టు స్నేహితులతో గొప్ప పరిచయం కలిగింది హాబ్స్ "ప్రాకృతిక రాజకీయ నియమ ప్రవేశం "(the elements of law natural and political )గ్రంధం రచించాడు. ఇందులో నిరంకుశ రాజరికాన్ని సమర్ధించాడు.. ఆ నాటి పార్ల మెంటు లోని స్వతంత్రుల వల్ల తనకు ప్రాణ హాని ఉందని భావించి ఫ్రాన్స్ దేశానికి పారిపోయాడు..

"లేవియన్" అనే మరో గ్రంధాన్ని రాశాడు లార్డ్ క్రామ్వెల్ కాలం లో బ్రిటిష్ సింహాసనాన్ని అధి ష్టిం చటానికి తోడ్పడ్డాడు. రెండవ చార్లెస్ హక్కుల్ని సమర్ధించాడు, 1651 లో సెయింట్ జర్మేన్ వద్ద ప్రవాసం లో ఉన్న చార్లెస్ సభలో ఈ గ్రంధాన్ని సమర్పించి నప్పుడు సభ నుండి హాబ్స్ బహిష్కరింప బడ్డాడు. హాబ్స్ ను "ఫాదర్ ఆఫ్మోడరన్ పొలిటికల్ ఫిలాసఫీ "అంటారు. ఆయన దృష్టిలో మనషులు చలనం ఉన్న వస్తువులే. ఆయన చెప్పిన సోషల్ కాంట్రాక్ట్ అన్ విషయం పొలిటికల్ ఫిలాసఫీకి ఆధారం. జామెట్రీ చరిత్ర దియాలజీ లలోను హాబ్స్ ఘనుడు.

రాజుకున్న సర్వ సత్తాక అధికారాన్ని (సావెరినిటి )హాబ్స్ సమర్ధించాడు. అతని సిద్ధాంతాలన్నీ కార్టీసియన్ సంప్రదాయానికి దగ్గరగా ఉంటాయి. దివ్య శక్తుల ప్రమేయం లేకుండా ప్రకృతి నియమాలకు మాత్రమె లోబడి ఈ విశ్వమంతా పని చేస్తోందన్నాడు. శాస్త్రీయ పద్ధతిలో మనషి విశ్వ రహస్యాలను అర్ధం చేసుకోవాలన్నాడు. రాజకీయం లో స్పినోజా అధిష్టించ లేక పోయిన స్థానాన్ని హాబ్స్ అధిష్టించాడు. మానవ జీవితం మొదట్లో నిస్సహాయం, దీనం హీనం అసభ్యం. ఈ ప్రాకృతిక స్తితి లో ఉన్న వారంతా అధికారం కోసం అర్రులు చాస్తారు. ప్రతి వాడు తన పొరుగు వాడికి విరోధి. స్వంత ప్రయోజనాలకోసం మనిషి కక్కుర్తి పడతాడు. హాబ్స్ చెప్పిన ఈ ప్రాకృతిక స్తితి అమెరికా లోని రెడ్ ఇండియన్ల లో ఉంది. జాతుల మధ్య వైరమే వారిజీవితం. "లేవియతాన్ "రాస్తున్న సమయం లో బ్రిటన్ లోప్రాజల మధ్య అంతర్యుద్ధం జరిగింది ఇది కూడా దాని వంటిదే అన్నాడు హాబ్స్.

ఈ సంగ్రామ స్తితి ఎక్కువ కాలం కోన సాగదని, మానవుడు ఇది గ్రహించి ఘర్షణ వదిలి సంఘ శక్తి తో నియంత్రణ చేస్తాడ న్నాడు. ప్రతి వాడు తనను తానూ నియమించుకోవటానికి కొంత హక్కు కోల్పోవాలి రాజుకు ఆ హక్కులు సంక్రమింప జేయాలి. దానివల్ల దేశాన్ని శత్రువుల నుండి కాపాడగలుగుతాడు. రాజుకు ప్రజలు పూర్తీ విధేయత తో ఉండాలి.దేశ విదేశాల వ్యవహారాలలో రాజు నిరంకుశుడు. దాన్ని ప్రశ్నించ రాదు. సంధి విషయం లోను రాజు ప్రజాభిప్రాయాన్ని పరిగనించ క్కర్లేదు. వ్యక్తీ స్వేచ్చను రాజుకు కానుక ఇచ్చి అతను ఆడమన్నట్లల్లా ప్రజలు ఆడాలి. రాజ శాసనం దైవ శాసనమే తిరుగు లేనిది. మత విషయం లో కూడా రాజు నిరంకుశుడే. రాజ శాసనాన్ని ఉల్లంఘించిన మతగురువు ను రాజు నిర్దాక్షిణ్యం గా అదుపు చేయాలి. అని హాబ్స్ పండితుడు అభి ప్రాయ పడ్డాడు. 1679 డిసెంబర్ నాలుగున మరణించాడు

## హెర్బర్ట్ స్పెన్సర్



హెర్బర్ట్ స్పెన్సర్ బ్రిటన్ దేశం లో 1820 లోఏప్రిల్ ఇరవై ఏడున జన్మించిన మేధావి. పరిణామవాద సిద్ధాంత కర్త. యూని వర్సిటి లో చేరి విద్య నేర్వా లనే కోరిక ఉండేది కాదు కనుక స్వయం గా అన్నీ నేర్చుకోవటం ప్రారంభించాడు. కొద్ది కాలం ఎలిమెంటరి స్కూల్ టీచర్ గా తర్వాతా రైల్వే ఇంజినీర్ గా ఉన్నాడు. పత్రికా రచన ప్రారంభించాడు స్వతం గా గ్రంధ రచన సాగించాడు. పరిణామ సిద్ధాంతాన్ని ఆధారం గా చేసుకొని 36 ఏళ్ళు కష్టించి అన్ని ముఖ్య శాస్త్రాలను క్రోడీకరించి 10 సంపుటాలుగా స్వంత దార్శనిక శాస్త్రాన్ని రచించాడు.

The Man Versus The State (1884)Education (1860)The Factors of Organic Evolution (1887)The Data of Ethics (1879)

స్పెన్సర్ తన భావ జాలానికి "ప్రత్యక్ష జ్ఞాన ప్రాధాన్య వాదం" (పాజిటివిజం )అని పేరు పెట్టాడు. పరిణామ సిదద్ధం తాన్ని అన్ని విషయాలకు జోడించిన మొదటి వాడు స్పెన్సర్. డార్విన్ రాసిన "ఆరిజిన్ ఆఫ్ స్పెసీస్ "చూసిన తర్వాత తన సిద్ధాంతాలను కొంత సవరించుకొన్నాడు జీవము, మనస్సు, సమాజం వంటి వాటిని భౌతిక ద్రవ్యం, గతి శక్తి అనే వాటి ద్వారా వివరించే ప్రయత్నం చేశాడు లోపలి బయటి సంబంధాలకు అనుగుణం గా సమాధాన పరచటం లోనే జీవం యొక్క గొప్ప తనం ఉంది అన్నాడు. సేంద్రియ ప్రపంచం లో పిండ నిర్మాణం,సజాతీయ రూపాల నుంచి విజాతీయ రూపాల వరకు నడిచింది అనే "ఫాన్ బాయర్ "నియమాన్ని స్పెన్సర్ తన "ప్రధమ తత్వాలు "(ఫస్ట్ ప్రిన్సిపుల్స్)లో విపులంగా రాశాడు

జ్ఞేయ ప్రపంచానికి సంబంధించిన నియమాలలో ఏకత్వాన్ని స్పెన్సర్ సాధించ గలిగాడు. శక్తి నిత్యత్వాన్ని గుర్తించటం ద్వారా దీన్ని సాధించ వచ్చు నని చెప్పాడు. ప్రకృతిలో మార్పులు రెండు రకాలుగా ఉంటాయి. పరిణామ ప్రక్రియ, విలయవ ప్రక్రియ-(ప్రాసెస్ ఆఫ్ డిస్ట్రక్షన్ )లు. సేంద్రియ జీవాలు, జాతులు, గ్రహాలూ గ్రహ కుటుంబం, సమాజ వ్యవస్థ వంటివి ముందుగా ఏర్పడి అభి వృద్ధి చెంది వ్యవస్తితాలైనప్పుడు పరిణామం జరుగుతుంది అన్నాడు. ఒక సమూహం అవ్యవస్తితం అయి నాశనం చెందితే విలయం జరుగుతుంది

పరిణామ ప్రక్రియ లో రెండు రూపాలున్నాయన్నాడు స్పెన్సర్. ప్రధానమైనది, గౌణమైనది. ప్రధాన పరిణామం లో భౌతిక ద్రవ్యాలు వ్యవ స్తీకరణం చెందుతాయి తర్వాత గతి విలయం జరుగుతుంది. సమాజం లో వివిధ మార్పుల వల్ల జరుగు పరిణాం గౌణ పరిణామం. అప్పుడు ఏక రూప స్తితి అనేక రూపాలవుతుంది ప్రవృత్తులలో అభ్యాసాలలో సంకీర్ణత వైవిధ్యం దీని ఫలితాలే. ప్రవర్తన కూడా పరిణామానికి సంబంధించినదే. పరి స్తితులకు అనుగుణం గా మనిషి తన చేష్టలను సవరించుకోవటమే ప్రవర్తన. దీని విలువ ఫలితాన్ని బట్టి నిర్ణయించాలి బ్రిటిష్ అనుభావ వాదుల నైతిక సంప్రదాయమైన"ఉపయోగితాసుఖ వాదాన్ని "స్పెన్సర్ అనుసరించాడు. ఇమాన్యాల్ కాంట్ గారి దృశ్య వాదం పైనఆధార పడి తన "అజ్నేయతా వాదం "నిర్మించాడు స్పెన్సర్. దీని వల్ల భౌతిక వా దప్రమాదం తప్పింది. 19 శతాబ్దం లో స్పెన్సర్ ప్రభావం అమోఘం. ఎవరి నోట విన్నా స్పెన్సర్ మాటే వచ్చేది అంతగా పాతుకు పోయాడు దార్శనిక హృదయాలలో.కాని ఈ రోజు అయన భావాలు సజీవం గా నిలిచింది మాత్రం అతి తక్కువే. 83 ఏళ్ళు జీవించి 1903డిసెంబర్ ఎనిమిది న స్పెన్సర్ మేధావి మరణించాడునోబెల్ బహుమతికి నామినేట్ అయ్యాడు కాని అందలేదు

## బరూక్ స్పినోజా

1632 వంబర్ 24 న బరూక్ స్పినోజా హాలండ్ లో ఆమ్స్టర్ డాం లో జన్మించాడు. ఇరవై ఏళ్ళకే సాహిత్యం లోను దర్శన శాస్త్రం లోను పండితు డైపోయాడు. వయస్సు పరిణత చెందిన తర్వాత తన శక్తి యుక్తులన్నీ దర్శన శాస్త్రానికే అంకితం చేశాడు. చాలా ప్రాశాంతం గా ఆలోచనల తో మునిగి ఉండే వాడు, బతక టానికి సరి పడ మాత్రమె సంపాదించు కోవాలని సిద్ధాంతం ఉన్న వాడు కళ్ళ జోళ్ళ షాపు నడిపే వాడు. చివరి దశలో వేలాది మంది శిష్యులు స్నేహితులు ఏర్పడ్డారు దేశ విదేశాల నుండి యాత్రికులు ఆయన్ను సందర్శించే వారు. 1677 లో ఫిబ్రవరి ఇరవై ఒకటి న నలభై అయిదవ ఏట క్షయ వ్యాధి తో స్పినోజా మరణించాడు. పది హేడవ శతాబ్దపు గొప్ప రేషనలిస్ట్ ఫిలాసఫర్ అని పించుకొన్నాడు




స్పినోజా దర్శనం లో సమాలోచన రీతి భారతీయ దార్శన పద్ధతిలో ఉంటుంది. ఆయన ఆసక్తి కి నైతికత, ఆధ్యాత్మికత పునాదులు. దేనిని పొందితే శాశ్వత ఆనందం లభిస్తుందో అలాంటి నిజమైన శ్రేయస్సు ను పొందాలి అని ధర్మ శాస్త్రాన్ని సహాయం చేసుకొన్నాడు.

స్పినోజా రాసిన ముఖ్య గ్రంధం "నీతి శాస్త్రం "తన ఆలోచనా విధానాన్ని ఇందులో పొందు పరాచాడు. ఇది కాక "దేకార్ట్ దర్శన తత్త్వం, సూక్ష్మ గ్రంధం మన రాజకీయం అనే గ్రంధాలు రాశాడు. నీతి శాస్త్రాన్ని జీవితమంతా ధార పోసి రాశాడు. దీనిని సమీక్షించి సరి చేసుకోవటానికి బతికినా నలభై అయిదేళ్ళలో పది హీను ఏళ్ళు శ్రమించాడు. ఇందులో అయిదు భాగాలున్నాయి. ఈశ్వరుని గురించి,, మనస్సు స్వభావం పుట్టుక గురించి, మానసిక ఉద్వేగాల ప్రాదుర్బావం గురించి, బంధాన్ని గురించి, బుద్ధి శక్తి లేక మానవ స్వేచ్ఛ గురించి, అయిదు భాగాలలో చర్చించాడు స్పినోజా ను యూదు సమాజంబహిష్కరించింది స్పినోజా భావనలో ఒకదాని ఆధారం గా సోమర్సెట్ మాం "ఆఫ్ హ్యూమన్ బాన్డేజ్ "నవల రాశాడు ఒయిన్స్టీన్ స్పినోజా ను గ్రేటెస్ట్ ఫిలాసఫర్ అన్నాడు

స్పినోజా ప్రతి పాదించిన నీతి శాస్త్రం రేఖా గణిత పద్ధతిలో నడిచింది. ప్రతి భాగం లో ఉపోద్ఘాతం నిర్వచనం స్వంత ప్రమాణాలైన వాక్యాలు ప్రమేయాలు ఉంటాయి. వాక్య పరంపర లో యుక్తి ని గూర్చి చెప్పాడు ప్రతి యుక్తి నిరూపణ సాధ్యమై నదే. పరంపరగా వచ్చిన సెమెటిక్ప్కృధాన్నివ్యతిరేకించాడు. సేమిటి క్ పద్ధతిలో దేవుని విశ్వాతీత స్వభావాన్ని, విశ్వ ప్రయోజనాన్ని, ప్రయోజాత్మక లక్షణాలను చెబుతారు దేవుడు విశ్వానికి బయట ఉన్నాడని విశ్వ సృష్టి కర్త అని, ఒక ప్రయోజనం కోసమే సృష్టి చేశారాని సెమెటిక్ లభావన

స్పి నోజా దృష్టిలో దేవుడు అంటే వస్తువుల్లోకి ప్రవేశించి వాటి పై బయటి నుంచి ప్రభావం కలిగించే వాడు కాదు. ఆయన అంతర్యామి. అంతరంగం లో ఉండే, పని చేస్తాడు. అన్ని వస్తువులలో ప్రవేశించి, వాటికి సార్ధకత కల్గిస్తాడు. వస్తు సత్యం దైవ సత్యానికి అధీనం లో ఉంటుంది. దేవుని సత్యాన్ని మించిన సత్యము లేదు స్పినోజా భావం లో దేవుడు విశ్వానికి వెలుపల ఉన్నదన్న భావానికి, సర్వాంతర్యామి అన్న భావానికి వ్యతి రేకం గా కనీ పిస్తుంది మానవ భావారోపణను- ఖండించాడు. అరిస్టాటిల్ చెప్పిన అంతిమ కారణాల సిద్ధాంతం లో ఇది కనీ పిస్తుంది. విశ్వానికి ఒక ప్రయోజనం ఉంది అన్న దాన్ని స్పినోజా ఖండించాడు.

అంత మాత్రం చేత స్పినోజా విశ్వం ఒక యాదృచ్ఛిక సంఘటన అని కూడా చెప్ప లేదు. ఒక రకమైన నియతి వా(ది దడిటెర్మినిస్ట్ )స్పినోజా.ఆవశ్యకతా నియమం పై నమ్మకం ఉన్న వాడు. ప్రతి వస్తువు ఉనికి అవసరమే అని భావించాడు. ఏది జరిగినా అవసరాన్ని బట్టే జరుగుతున్దంటాడు. చివరి కారణాలని చెప్పే వన్నీ మానవ బుద్ధి లోంచి వచ్చినవే. అన్ని వస్తువులు, ప్రకృతి ఒక నిత్య ఆవశ్యకతా నియమాన్ని అనుసరించే పరి పూర్ణం గా ఉద్భవించాయని చెప్పాడు.

స్పినోజా చెప్పిన అతి భౌతిక ఏక సత్తా వాదం ను "మూల సిద్ధాంత వాదం "అంటారు. అతని దృష్టిలో మూల ద్రవ్యం ఒక్కటే. ఆయనే ఈశ్వరుడు. మనసు, భౌతిక ధర్మాలు ఆ మూల ద్రవ్యం యొక్క విశేషణాలు. వీటినే ఆలోచనా, విస్తృతి అన్నాడు. ఈ రెండిటి వల్లనే ప్రాపంచం లో వివిధ మనస్సులు భౌతిక వస్తువులు ఏర్పడ్డాయి. ఈ రెండు లక్షణాలు అఖండ మూల ద్రవ్య స్వరూపాలు.

ద్రవ్యం స్వతంత్ర ఉనికి గలదిగా, స్వయం బోధక మైనదిగా ఉంటుంది. మూల ద్రవ్యం తనకు తానే కారణం. అన్నిటిని తనలో ఇముడ్చు కొంటుంది అందువల్ల మూల ద్రవ్యం నిరవధికం, అనంతం, ఏకం అన్నాడు స్పినోజా. దేవుడికి ప్రకుతి తో తాదాత్మ్యం ఉంది ప్రకృతికి దేవుడికి వ్యత్యాసం కల్పించటం అర్ధ రహితం. దివ్య శక్తి, ప్రకుతి శక్తి ఒక్కటే. ప్రకుతి నియమాలన్నీ దైవ నియమాలే. ప్రకృతికి వ్యతి రేకం గా దైవ ప్రార్ధన చేయటం తప్పు.

ప్రకుతి భావం అంటే ప్రకుతి సత్తా సర్వస్వం. ప్రతి విశేషం లో ఏది అసమగ్రం గా ఉందో ప్రతి పరిమిత విశేషం దేని అసమగ్ర నియత ప్రకారమో అలాంటి సత్తా సర్వస్వమే.. స్పినోజా నైతిక నియతి లో మానవ బంధ భావం స్వేచ్చా భావం అని ఉన్నాయి స్వేచ్ఛ అంటే అర్ధం లేనిది అన్నాడు. మనం చేసే పనులన్నిటిని మన మనస్సు ప్రేరేపిస్తుంది వాటిని నియంత్రిస్సేదే మనస్సు. స్వతంత్ర కార్యానికి, ప్రేరేపిత కార్యా నికి

ఉన్న భేదం ఏమిటి అని ప్రశ్నించి సమాధానం చెప్పాడు. సంకల్ప కార్యాలలో మన ప్రేరణ మనకు తెలుస్తుంది. ప్రేరిత కార్యాలలో ప్రేరణ ఉనికి కాని, వ్యవహారం కాని మనకు తెలియదు అన్నాడు

బాహ్య ప్రేరణల ప్రాబల్యాన్నే స్పినోజా బంధం అన్నాడు. అంతః ప్రేరణ ప్రాబల్యమే స్వతంత్రత. వీటి నే అయన బౌద్ధిక ప్రేరణలన్నాడు. దేవుని పై బౌద్ధిక ప్రేమ అత్యంత ఉన్నత మైంది అని స్పినోజా అభిప్రాయం. విశ్వం యొక్క ఐక్యత ను స్పష్టం గా గ్రహించటం వల్ల జరిగినప్పుడు పుట్టిన దైవ భావనే బౌద్ధిక ప్రేమ అన్నాడు. ఇదే ఆనందం అంటాడు., విశ్వ ఐక్య భా వన, సంపూర్ణత కలిస్తే ఒక అంతరానుభవం అవిచ్చిన్నం గా ఏర్పడుతుంది. ఈ అనుభవాన్ని గ్రహించిన వాడు సత్యాన్ని అనుభవిస్తాడు. ఈశ్వర భావం బాహ్య హేతు వల్ల తెలుసుకొన్నా అనుభవానికి అందదు.

## క్వేకర్ మతం



పదిహేడ వ శతాబ్దం లో క్రైస్తవ మతం లో ఏర్పడిన మతోద్యమమే క్వేకర్ మతం క్వేకర్ అంటే స్నేహితుడు అని అర్ధం. ఈ మత స్తాపకుడు జార్జి ఫాక్స్. పది హేడవ శతాబ్దానికే ఈ మతం అమెరికా లో బాగా వ్యాపించింది. ఇప్పటికి చాలా దేశాలలో వీరి సభ్యులున్నారు. 19 వ శతాబ్దం లో ఈ అమతం అమెరికా లో రెండు శాఖలు గా చీలింది. ఒక తెగ వారిని "హైక్స్విట్లు "అని రెండవ తెగ వారిని "విల్బ రైట్లు "అని అంటారు క్వేకర్లను" రిలిజియస్ సొసైటీ ఆఫ్ ఫ్రెండ్స్ "అంటారు ముందుగా 1640 లో ఇంగ్లాండ్ లో క్వేకర్ మతం పుట్టింది అమెరికాకు తర్వాతా చేరింది. విలియం పెన్ అమెరికా లోని పెన్సిల్వేనియా లో దీన్ని మొత్తందట వ్యాపింప జేశాడు. ఆఫ్రికాలోనూ సుస్తిరమైన్ది

Quaker Star

## విలియం పెన్



ఆంతరంగిక ఆధ్యాత్మిక భావానికి క్వేకర్లు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. అహింసా పద్ధతిలోనే ప్రభుత్వాన్ని, మతా దిపతులను లను ఎదిరించారు పీడనాన్ని ఎదుర్కొని నిలిచారు. అవతలి వారు యెంత హింసకు గురి చేసినా సహిమ్చారే కాని హింసా మార్గాన్ని చేబట్టలేదు క్వేకర్లు. మతా చార్యుల పోషణ కోసం ఏర్పడిన "ti thes " అంటే వ్యక్తి సంపాదనలో పదవ వంతు మతా చార్యుల పోషణ కు ఇవ్వాలి అనే శాసనాన్ని క్వేకర్లు బాగా ఎదిరించారు ఇది దారుణం అన్నారు. ప్వేకర్లు కూడా తమ మతా చార్యులను జీతాలిచ్చి పోషించ కుండా ఆదర్శం గా నిలిచారు. అలాగే న్యాయ స్తానాలలో ప్రమాణం చేయ టాన్ని నిరాకరించారు.

Historical painting of a Quaker meetingOld drawing of Quakers sitting in a circle of chairs

## జార్జి ఫాక్స్

యుద్ధాలను వ్యతిరేకించారు. హింసను ఖండించారు. మానవ హక్కుల కోసం వర్ణ విచక్షతకు ఎదురు నిలిచారు. ఆపదలో ఉన్న వారికి తక్షణ సాయం చేశారు. వయోజన విద్యా వ్యాప్తి కి ఎన్నో పాఠ శాలలు నిర్మించి నడిపించారు. ప్రాధమిక మత విశ్వాసాలలో సాధారణ క్రైస్తవులకు క్వేకర్ల కు తేడా ఏమీ లేదు. బైబిల్ పఠనం కోసం అమెరికా లో ఒక విద్యాలయాన్ని నెల కోల్పారు. వీరి సంస్కృతీ, జీవన విధానం ఇప్పటికి

గౌరవింప బడుతున్నాయి ఆదర్శ జీవితాలనుగడి పారు. జైళ్ళ సంస్కరణకు, శిక్షా స్మృతి సంస్కరణ కు, ఉన్మాద శరణాలయ సంస్కరణ లో వీరి పాత్ర మరువ లేనిది అన్ని మతాల వారిని సోదర ప్రేమ తో చూసి అసలైన క్రైస్తవులని పించు కొన్నారు.



. క్వేకర్ అనే బిరుదు ఒక ప్యూరిటన్ న్యాయాధికారి వీరికి ఇచ్చాడు. ఆయన అ మాటను వీరిపై అసహ్య భావం తో అన్నప్పటికీ, వీరి శీలం ప్రవర్తన వల్ల ఆ పదం లో ఆ భావమే లేకుండా పోయింది. "అంతర్ జ్యోతి "అనే ఆధ్యాత్మిక భావామే క్వేకర్ మతం. ఈ అంతర్ జ్యోతి ననుసరించే క్రీస్తు భూలోకం లో తమ కోసం వచ్చాడని వీరి విశ్వాసం. యేసు క్రీస్తును హృదయం లో నెల కోల్పుకొని జీ వించ టమే క్వేకర్లకు పరమార్ధం. అందుకని క్వేకర్లకు బయటి ఆడంబరాలు నచ్చవు.

## స్టాయిక్ మతం



గ్రీకు దర్శన శాస్త్రం లోచివరి యుగానికి చెందినమతమే స్టాయిక్ మతం. క్రీ పూ300 లో "జీనో "స్టాయిక్. మతాన్ని ఎదేన్స్ నగరం లో స్థాపించాడు ఇందులో నైతికం, దార్శనికం అనే రెండు భాగాలున్నాయి.. .ఎదేన్స్ లో జీనో ఒక సంత దగ్గర బొమ్మలు వేసే "స్టోవా"అనే వసారాలో దీన్ని మొదట బోధించటం వల్ల స్స్టాయిక్ మతం అనే పేరొచ్చింది. దీన్ని అనుసరించే వారే స్టాయిక్కులు.



సత్య ద్వారం తెరవటం జీనో

సినిక్ దార్శనికుడైన స్టాయిక్ దగ్గర జీనో విద్య నేర్చుకొన్నాడు. ఆ మతం లోని నైతిక సిద్ధాంతాలను తీసుకొని స్టాయిక్ మతం గా వృద్ధి చేశాడు జీనో. ఇతని వారసుడు క్లియాన్తిస్. ఇతను ఇందులోని హేరా క్లైటాస్ మత భావాలను వ్యాప్తి చేశాడు. హేరా క్లైటాస్ చెప్పిన విశ్వాగ్ని (యూని వరసల్ ఫైర్ ),లాగాన్ చెప్పిన కాలం అనే సిద్ధాన్తాలున్తాయి. తరువాత క్రిసప్పాస్ దీన్ని ఇంకా వ్యాపింప జేశాడు. క్రీ.పూ.రెండో శతాబ్దిలో దీన్ని రోమన్ సామ్రాజ్యం లో సినే టియన్ ప్రవేశ పెట్టాడు. ఇతను చెప్పిన దాన్ని "మధ్య స్టోవాఅన్నారు. రోమన్ కుటుంబాలలో ఇది రెండు వందల ఏళ్ళు బాగా వ్యాపించింది. క్రీ.పూ.ఒకటవ శతాబ్దం లో "సేనేకా ",ఎపిక్టాస్, మార్కస్, ఒరీలియన్ చక్ర వర్తి బాగాఉధృతం గా గా ప్రచారం చేశారు. క్రీ;శ. మూడవ శతాబ్దం వచ్చేసరికి స్టాయిక్ భావాలన్నీ క్రైస్తవ మతం లో చేరిపోయాయి. రోమన్ ధర్మ శాస్త్రం పై సేనేకా, స్టాయిక్ మత ప్రభావం బాగా ఉండేది.




స్టాయిక్ మతం లో మూడు భాగాలున్నాయి తర్కం, భౌతికం, నీతి శాస్త్రాలు. తర్క శాస్త్రం లో మనసు బయటి వాటి నుంచి ఇంద్రియాల ద్వారా సంవేదనలు గ్రాహించి హేతు బుద్ధి తో ఒక క్రమంగా మార్చి సామాన్య భావాన్ని సృష్టించు కొంటుంది. మనసుకు దృఢ మైన నమ్మకం కలిగితే కాని సంవేదనలు సత్యం అని అంగీకరించదు. సామాన్య భావాలు –ఏ సంబంధం గుణాల యొక్క సామాన్యలయ్యయో వాటికి ఈ విశ్వం లోని హేతు క్రమం కు అనుగున్ణం గా ఉన్నప్పుడే అవి సత్యాలవుతాయి. గుణాలు, సంబంధాలు మనం సంకల్పించేవి కావు అంటుంది స్టాయిజం,. నిజం గా ప్రకృతి లో ఉంటె,సామాన్య భావాలు మన మనసులో మాత్రమె ఉంటాయి అంటారు స్టాయిక్కులు

సత్యాన్ని చేరాలంటే అనుమానం కూడా ఒక ప్రమాణమే. కనుక తర్కం అనేది వీరిసాధనం, అరిస్టాటిల్ చెప్పిన న్యాయ ప్రయోగ సిద్ధాంతాలకు కొన్ని మార్పులు చేసి, కొత్తవి చేర్చి దీన్ని రూపొందించారు



భౌతిక శాస్త్రం లో అరిస్టాటిల్ చెప్పిన అతి భౌతిక రూపమే స్టాయిక్కులభౌతిక శాస్త్రం. దీనిలో ఖగోళం, మతం మనస్తత్వ శాస్త్రాలున్నాయి. ఈ విశ్వానికి మూల కారణం అంతటా వ్యాపించి ఉండే అగ్ని అంటారు స్టాయిక్కులు. అదే ఈశ్వరుడు అన్నారు. సత్తా అనేది రెండు తత్త్వాలలో ఉంటుంది మొదటిది. సచేతన మైనది. ఇది స్వయం చాలక మైనది. ఇదే కార్య కారకం కూడా. ఇతర వస్తువులకు రూప కల్పనా చేస్తుంది. రెండవది జడం ఇది మార్పు చెందుతుంది, కదలిక ఉంటుంది ఇతరాలు దీన్ని రూప కల్పనా చేస్తాయి ఆలోచన లో మాత్రమె ఈ రెండు తత్వాలను వేరు చేయగలం. నిజం గా చెప్పాలంటే ఈరెండు కలిసే ఉంటాయి అన్నది స్టాయిక్కుల జడ తత్త్వం.

స్టాయిక్కులు నియతి వాదాన్ని సమర్ధించారు. ప్రపంచం లో అన్ని పూ ర్వమే ఈ విశ్వం ఏర్పాటు చేసిందని, విధిని అంగీకరించటం లోనే మనిషికి స్వేచ్ఛ ఉందని అంటారు.

స్టాయిక్కులనీతి శాస్త్రం లో సృష్టి నియమాన్ని (లాగోస్ )క్రమాన్ని, హేతువు ను తెలుసు కొని దాన్ని అనుసరించటమే మానవ కర్తవ్యమ్ అన్నారు స్టాయిక్కులు. అత్యుత్తమ తత్వమైన హేతు బుద్ధిని అనుసరించి జీవించాలి. సుఖం ధర్మాని కంటే భిన్నమైనది.. అదొక రాగం మాత్రమె. రాగాలను లోబర్చుకొన్న వాడే రుషి. ఆరోగ్యం, జీవితం, మర్యాదా, డబ్బు హోదా, అధికారం స్నేహం విజయం స్వతస్సిద్ధమైనవి. ఇవి శ్రేయస్కరాలు కావు. మృత్యువు వ్యాధి అవమానం దరిద్రం నీచ జన్మ ఇవి స్వయం గా దోషాలు కావు. వీటి ఆచరణ మనకు ఫలితం ఇస్తుంది. ఇవి మన ఆచరణకు లక్ష్యాలు కాదు. ఆనందం సౌఖ్యం సాధించటం మన శక్తి లోనిది కాదు. మన సంకల్పాన్నను సరిం చి దృష్టిని మార్చుకోవాలి. వాటి విలువ మన శీలం గల ప్రభావం మీదనే ఆధార పడి ఉంటాయి. ధర్మమే అన్నిటికన్నా స్వతస్సిద్ధం గా ఉత్తమోత్తమ మైనది. అదే అసలైన అందాన్ని చేకూర్చేది. ధర్మా ధర్మ విచక్షణత తో చేసే పని మాత్రామే ధర్మా చరణ అవుతుంది. వైరాగ్యం స్టాయిక్కులనైతిక లక్ష్యం. కొన్ని సందర్భాలలో స్టాయిక్కులు ఆత్మ హత్యను సమర్ధించారు.

## షోపెన్ హార్

జర్మని కి చెందిన షోఫెన్ హార్ డాన్జింగ్ నగరం లో 1788 లో ఫిబ్రవరి 22న జన్మించాడు. ధనిక కుటుంబానికి చెందిన ఈయన తల్లి సాహిత్య కళా రంగాలలో మంచి ఖ్యాతి పొందింది. తండ్రి చేసే వ్యాపారం లో కొంత కాలం పని చేశాడు నచ్చలేదు. 1809 లో గోటేన్ నగరం చేరాడు.. అక్కడి విశ్వ విద్యాలయం లో వైద్య శాస్త్రం లో చేరాడు.

"పర్యాప్తతత్త్వం యొక్క నాలుగు మూలాలు "అనే బృహత్ గ్రంధాన్ని రాసి జేనా విశ్వ విద్యాలయం నుంచి 1813 లో డాక్టరేట్ బిరుదు పొందాడు డ్రెస్ డెన్ లో ప్రధాన గ్రంధమైన" భావ, సంకల్ప రూపాలలో ప్రపంచం "1878 లో రచించాడు. బెర్లిన్ విశ్వ విద్యాలయం లో లెక్చరర్ అయ్యాడు. అప్పటికే ప్రఖ్యాతులైన హెగెల్ మొదలైన వారి "భావ వాదం "పై తీవ్ర విమర్శలు చేశాడు హార్. తన మనసులోని భావ ధారను ఉపన్యాసాలుగా వెలువరించాడు. అయితే మంచి ఉపన్యాసకుడి గా గుర్తింపు పొందలేక పోయాడు.. వినే వాళ్ళే కరువై పోయారు. కోపం వచ్చి ఈ ఉపన్యాస పరం పరకు స్వస్తి చెప్పాడు. 1831 లో బెర్లిన్ లో కలరా తీవ్రం గా విజృమ్భించిన కాలం లో అందరు నగరాన్ని వదిలి పెట్టి వెళ్లి పోతే, షో పెన్ హార్ మాత్రం ఒక్కడే ఏకాకి గా బెర్లిన్ లో ఉండి పోయాడు. 1860 సెప్టెంబర్ 21న డెబ్బై రెండేళ్లకు మరణించాడు రిచార్డ్

వాగ్నర్, ఎడ్విన్ స్కోరింజేర్, ఆల్బర్ట్ ఐన్స్టీన్, టాల్ స్టాయ్, ఫ్రాయిడ్, ముస్తఫా మొహమ్మద్ మొదలైన వారి పై హార ప్రభావం అధికం. వేదాల,ఉపనిషత్తుల సారాన్ని బాగా గ్రహించాడు హార్.వేద, ఉపనిషత్తుల పై ఆయన శ్రేష్ట అభిప్రాయాన్ని కింద చూడండి

If the reader has also received the benefit of the Vedas, the access to which by means of the Upanishads is in my eyes the greatest privilege which this still young century (1818) may claim before all previous centuries, if then the reader, I say, has received his initiation in primeval Indian wisdom, and received it with an open heart, he will be prepared in the very best way for hearing what I have to tell him. It will not sound to him strange, as to many others, much less disagreeable; for I might, if it did not sound conceited, contend that every one of the detached statements which constitute the Upanishads, may be deduced as a necessary result from the fundamental thoughts which I have to enunciate, though those deductions themselves are by no means to be found there.[90]

He summarised the influence of the Upanishads thus: "It has been the solace of my life, it will be the solace of my death!"

హార్ దర్శికుడే కాక కళా మర్మజ్ఞుడు కూడా. ఈయన దర్శన సిద్ధాంతాల మీద ప్లేటో కాంట్ లప్రభావం ఎక్కువ. ప్లేటో చెప్పిన "రియాలిటి అండ్ అపియరెన్స్ "సిద్ధాంతాన్ని కాంట్ ఒప్పుకొని వృద్ధి చేస్తే హాపర్ కూడా సమర్ధించాడు. హార్ దృష్టిలో దర్శన శాస్త్రానికి, విజ్ఞాన శాస్త్రానికి, శాస్త్రానికి, కళ కు బుద్ధికి, సంకల్పానికి మధ్య భేదం ఉంది. బుద్ధి కంటే సంకల్పం గొప్పది మూలమైనది,ప్రధానమైంది.,. అన్నాడు షో షెన్.బుద్ధి హేతు ద్వారాకనిపించే ప్రపంచాన్ని నిర్మించుకొంటున్నది కాని దాని వెనుక ఉన్న సత్యం యొక్క జ్ఞానాన్ని కలిగించదు. ఆంతరంగిక జ్ఞానం ద్వారానే సత్య జ్ఞానం లభిస్తుంది. అలాంటి లోపలి జ్ఞానం తోనే బుద్ధికి, కాలానికి, ప్రయోజనం లేని సంకల్పం గోచరిస్తుంది.

విషయ జ్ఞానం మీదే ప్రపంచం ఆధార పడి ఉందని, జ్ఞాన భావమే ప్రపంచ భావం అన్న భావ వాదాన్ని హార్ అంగీక రించాడు.. అయితే విషయి లోని భావాలన్నిటికీ సంకల్పమే ఆధారం అన్నాడు. ఈ సంకల్పమే వ్యక్తిలో, విశ్వం లో, జడం లో, చైతన్యం లో వివిధ దశలలలో తనను తాను ఆవిష్కరించు కొంతుటుంది అన్నాడు. ఈ సంకల్పం సంగీతం లాంటి కళల లో కూడా ఆవిష్కార మవుతుంది అన్నాడు. సంకల్పం వివేక రహిత మైనది. బుద్ధి దీనికి బానిస అన్నాడు హాపర్.

శాస్త్రం వస్తువు యొక్క ఉపాధి ని మాత్రమె తెలియ జేస్తుంది. కాని దాని యదార్ధ స్వరూపాన్ని చెప్ప లేదు అలాంటి వస్తు యదార్ధ స్వరూపం శాస్త్రానికి అందదు కళలు మాత్రమె వ్యక్తం చేస్తాయి. విజ్ఞానం అంటే తార్కిక ప్రక్రియ.. సాధన వల్ల దీన్ని గ్రహించ వచ్చు. దార్శనిక సత్యాన్ని తన లాంటి మేధావులు మాత్రమె గ్రహించ గలరు అన్నాడు. అలాంటి సత్య గ్రహణానికి మూలం వ్యక్తీ లో ఉండే దార్శనిక శక్తి అని హార్ అభిప్రాయ పడ్డాడు.

సంకల్పం అనే భావనలో అన్ని కోరికలు, ప్రయత్నాలు, ప్రేరణలు, పరిణామ ప్రవృత్తులు ఉన్నాయి. వీటి వైరుధ్యం వల్లనే అసంతృప్తి, బాధ కలుగుతాయి. మానవ జీవితం బాధా మయం అంటాడు షో షెన్..అందుకని హార్ ను "నిరాశా వాది "అన్నారు సుఖం అనేది వ్యతి రేక భావమే. మన బాధలకు, కోరికలకు అది తాత్కాలిక ఉపశమనమే. సంకల్పం హేతు రహిత మైంది. దాని వల్ల వచ్చే సంఘర్షణ కూడా నిత్య మైనది ఇలాంటి సంకల్పానికి పర్య వసానం నిరాశే అంటాడు. మనం చూసేదంతా నిరుపయోగం అనే భావన వస్తే అదేవిముక్తి మార్గం చూపిస్తుంది. కోరికలను అణచుకొంటే కాని శాంతి రాదు.. కాలాను భూతి లో సంకల్పం నిషేధించ బడుతుంది. దీని వల్ల కోరికలూ ఉండవు. కాని లభించే ఉపశాంతి మాత్రం తాత్కాలికం గానే ఉంటుంది అన్నాడు షో ఫెన్ హార్.

సంకల్ప విమోచనం నీతి ద్వారానే సాధ్యం. ఒకే ఒక్క పరమార్ధమైన సంకల్పం యొక్క రూపాలైన వ్యక్తులు పరస్పరం భిన్నాలు కారు. దీని కంటే గొప్పది సంకల్పాన్ని నిషేధించట మే. సంకల్పాన్ని నిషేధిస్తే బాధ ఉండదు. ఏ మతం ప్రతి పాదించినా ఇదే నంటాడు.

దేశం, కాలం, కారణాలు భ్రాంతి మాత్రమె. అందుకని మానవ ప్రయత్నం వృధా. పురోగతి ఉండదు అన్నాడు హార్. అహంకారమే రాజ వ్యవస్థకు కారణం. పేదరికం, బానిసత్వం నిరుద్యోగం, యుద్ధాలు కొద్ది మంది భో గాన్ని అనుభ వించటం వల్లనే వస్తున్నాయన్న రాజ కీయ మర్మజ్ఞుడు హాపర్.. కాని ఈ భోగమే లేక పోతే సంస్కృతీ, మానవ వికాసం ఉండవు అనీ చెప్పాడు. ఎక్కువ మంది ప్రజలు బుద్ధి హీనులు.. వీరిని బుద్ధి మంతులైన వారు నాయకులై ముందుకు నడిపించాలి. స్త్రీలు బుద్ధిలోను, నైతికం గాను మగ వారి కంటే తక్కువ వారు అన్నాడు షో ఫెన్ హార్

వైట్ హెడ్



ఆల్ఫ్రెడ్ నార్త్ వైట్ హెడ్ బ్రిటన్ కు చెందిన దార్శనికుడు 1861 లో ఫిబ్రవరి పదిహేను జన్మించాడు ట్రినిటి కాలేజ్ లోయాభై ఏళ్ళకు ఫెలోషిప్ సాధించాడు లండన్ యూని వర్సిటి లో గణిత, యాంత్రిక శాస్త్రాలను బోధించాడు ఇంపీరియల్ కాలేజి ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ లో గణిత శాస్త్ర ఆచార్యుడు అయ్యాడు. 1924 లో ఉద్యోగం విరమించే దాకా హార్వర్డ్ యూని వర్సిటి లో దర్శన శాస్త్ర ఆచార్యుడు గా ఉన్నాడు. గణితానికి, దర్శన శాస్త్రానికి వైట్ హెడ్ చేసిన సేవ నిరుప మానం క్షేత్ర గణితం భౌతిక శాస్త్రం, అతి భౌతిక శాస్త్రాలలో ఉన్న అడ్డంకులను తొలగించాడు. ఈయన ప్రభావం అనేక మంది ఆ చార్యులపై పడింది మహా ప్రతిభా సంపన్నుడ ని పించుకొన్నాడు.

ఒక శాస్త్రం లో విశేషజ్ఞత ఉన్న వాడు మరొక దాంట్లో నిష్ణాతుడు కావటం అసాధ్యం కాని వైట్ హెడ్ గణిత శాస్త్రాధ్యాపకుడై ఉండి కూడా దార్శనికుడు గా మారి అంత రింద్రియ జ్ఞానానికి తర్కానికి, భౌతిక శాస్త్రానికి సమాన మైన ప్రాధాన్యం ఇచ్చి ఒక కొత్త దర్శన సిద్ధాంతాన్ని ప్రతి పాడించిన మహా మేధావి. అతని దర్శనం లో దృక్పద ఐక్యతా, సమీక్షా వైశిద్యం అందరి ప్రశంసలు పొందాయి..

వైట్ హెడ్ ప్రత్యేకత ఏమిటి అంటే పదార్థాలను గ్రాహించి ప్రపంచాన్ని అవయవ సమూహం గా నిరూపించటం. ప్రకృతి దృశ్యాలన్నీ ఒక సర్వ సామాన్య ప్ర క్రియ చేత శాసింప బడుతాయని సిద్ధాంతీకరించాడు. ఇది సృజనాత్మక ప్రక్రియ. ఈయన దర్శనం లో మూడు భాగాలున్నాయి మొదటిది వాస్తవిక సంభవాలు (ఆక్ట్యువాల్ అకేషన్స్ )రెండు నిత్య వస్తుజ్ఞానం (ఎటర్నల్ ఆబ్జెక్ట్స్ )మూడవది దేవుడు., ప్రపంచం



అతని దృక్పధం లో ప్రపంచం ప్రత్యేక వాస్తవ సత్యాల సమాహారం. ఇవి ఒక దానితో ఒకటి సంబంధం కలిగి ఉంటాయి. ప్రాతి వాస్తవికత మిగిలిన శక్తి కేంద్రాలతో సృజనాత్మకం గా ప్రక్రియ లో పాల్గొంటాయి వాస్తవ ప్రక్రియలను విక సింప జేసే ఈ ప్రక్రియనే "కాన్సంస్ "అన్నాడు ఈ ప్రత్యేక సంభవాలు అమూర్త వస్తువులు కావు. ఇందులో ప్రతిదీ నిజమైంది, ప్రాత్యేక మైంది కూడా. వాస్తవిక సంభవాల ప్రత్యేకత దాని అంతర ఏకత చేత నియమింప బడుతుంది.

వైట్ హెడ్ భావాలలో నిత్య వస్తు భావం చాలా ప్రాధాన్యం పొందింది. వాస్తవిక సంభవాలు ఇంద్రియాలనే కాక బుద్ధిని కూడా తాకుతాయి ఇలాంటి అమూర్తాలనే నిత్య వస్తువు అన్నాడు అమూర్త వస్తువులు ఇంద్రియాలకు అతీతం గా ఉంటాయి నిత్య వస్తువులు అంతర్యామిత్వాన్ని కోరతాయి. నిత్య వస్తు ప్రపంచం కనీ పించే ప్రపంచం కంటే అతీతం గా ఉంటుంది. నిత్య వస్తువులు విశ్వం యొక్క మౌలిక అంశాలు అన్నాడు వైట్ హెడ్.

అతని "అవయవి "దర్శనం లో "నిరాపేక్ష అతీతత్వాం, "నిరపేక్ష అంతర్యామిత్వం "మొదలైన భావాలు లేవు. ఆయన వాస్తవిక సంభావాలకు సాపేక్షతా సూత్రం ఎలా అన్వాయిస్తుందో ఈశ్వరునికి సంబంధించిన దానికీ అలానే వర్తిస్తుంది ఈశ్వరుడు ప్రపంచానికి వాస్తవిక సంభావాలకు అతీతుడు కాదు అన్నాడు దేవుడిని వదిలేసి నిత్య వస్తువులు ఇతర వాస్తవిక సంభావ వికాసానికిమార్గ దర్శనం చేస్తాయి. ఈశ్వరుడు నిత్య వస్తువుల సృష్టి కర్తకాదన్నాడు వైట్ హెడ్. అయితే వాటి వ్యవస్థ యేర్పడ టానికి దేవుడే కారకుడు తన మౌలిక స్వభావ ప్రభావం చేత ఈశ్వరుడు నిత్య వస్తువులను దర్శిస్తాడు ఆయన గ్రహించి నట్లు ఏ వస్తువు గ్రహించ లేదు ఒక వాస్తవిక సంభవం ఇంకొక దాని చేత విషయీకరింప బడుతుంది. ఇతర వాస్తవ సంబంధాల లాగా ఈశ్వరుడు మూర్తార్థలను కల్పించడు దృష్టిలో కాని, ప్రతీకార గుణం లో కాని తీక్ష్ణత లో కాని

ఈశ్వరుడి అనుభవం సర్వ సమగ్రం అన్నాడు వైట్ హెడ్1947 డిసెంబర్ ముప్పై న మరణించాడు ప్రాసెస్ ఆఫ్ ఫిలాసఫీ, ప్రాసెస్ ఆఫ్ దియాలజిల సిద్ధాంత కర్త గా గొప్ప గుర్తింపు పొందాడు

## విజ్ఞాన భిక్షువు

సాంఖ్య శాస్త్ర భాష్యం రాసిన వారిలో విజ్ఞాన భిక్షువు సాటి లేని వాడని పించుకొన్నాడు పదహారవ శతాబ్దికి కి చెందిన ఈయన వారణాసి లో జన్మించాడు జీవించాడు. 1560-1600 కాలం వాడని భావిస్తారు. భిక్షు అనేది ఆయన బిరుదు అయితే ఇతను భిక్షువు కాదు సన్యాసి కాదు బౌద్ధమతావాలంబి కాదు సాంఖ్య సూత్రాలకు "సాం ఖ్య ప్రవచనం "ను యోగ సూత్రాలకు అంటే వ్యాస మహర్షి రాసిన దానికి "యోగ వావర్తికం ",బ్రహ్మ సూత్రాలకు "విజ్ఞానామ్రుతం "అనే మూడు మహా భాష్యాలను రాసిన ఘనుడు విజ్ఞాన భిక్షువు.

ఈశ్వర గీతా భాష్యం, సాంఖ్యసారం, యోగ సార సంగ్రహం సాంఖ్య సారం, మొదలైన ఇతర గ్రంధాలు కూడా రాశాడు దురదృష్ట వశాత్తు ఆయన రచనలను సంపుతీకరించటం కాని ఆంగ్లం లోకి అనువదించటం కాని జరగ లేదు ఈయనను పరోక్ష బౌద్ధుడు అనీ అంటారు

వేదాంతాన్ని సాంఖ్యం తో సమన్వయ పరచాడు. సాంఖ్యం లో చెప్పిన పరిణామ వాదం వేదాంతుల పాలిటి చింతామణి. అద్వైతాన్ని వ్యావహారికం గా, మిగిలిన ద్వైత విశిష్టాద్వైత భేదా, భేద దర్శనాలను పార మార్థికం గా పరిణామ వాదం స్వీకరించింది. భిక్షువు పరిణామ వాదాన్ని ఒప్పుకోవటమే కాక సాంఖ్యం లో ఉన్న ప్రకృతి పురుష ద్వైతాన్ని పురుష బహుత్వాన్ని వేదాంత సూత్రాలలో చేర్చాడు.

బ్రహ్మ మీమాంస లో జీవాత్మ యొక్క బహుత్వం కనీ పిస్తుంది కొన్ని శ్లోకాలలో. సాంఖ్యం లోని పురుష ఆత్మత్వం బ్రహ్మ మీమాంస లో ఇబ్బంది కలిగిస్తుంది. "ఆత్మేతి తూప యంతి "అనే సూత్రం లో పరమాత్మ కే పరమార్ధం లో ఆత్మత్వాన్ని చెప్పింది. అయినా సాంఖ్యం-వేదాంతం తో భేదించలేదు. కారణం వ్యాహరాకికాత్మ అయిన జీవుడికి ఇతర వివేక జ్ఞానాలు మోక్షానికి సాధనాలుగా చెప్పటమే ఇది రెండు దర్శనాలకు సమ్మత మైన విషయమే. కనుక శ్రుతి, స్మృతి లలో ప్రసిద్ధం గా చెప్ప బడిన నానాత్వ ఏకత్వాదులకు సాంఖ్యం లో వ్యావహారిక పరమార్ధ భేద దృష్టిలో సాంఖ్యానికి వేదాంతానికి మధ్య భేదం తొలగి పోయింది అందుకే సాంఖ్య సిద్ధాంతాలవివరణ మే వేదాంతం లో కనీ పిస్తోంది

## లీబ్నిట్జ్

లీ బ్నిత్జ్ పూర్తి పేరు గాట్ ఫ్రీడ్ విల్ హెల్మ్ లీబ్నిట్జ్. లైస్సిగ్ నగరం లో 1648 లో జన్మించాడు. అక్కడి యూని వర్సిటి లో నీతి శాస్త్రాన్ని బోధించాడు తండ్రి చిన్నతనం లోనే మరణించాడు కష్టపడి స్వయం కృషి తో తర్క గణిత శాస్త్రాలలో అపార పాండిత్యాన్ని సాధించాడు. పదార్ధ విజ్ఞానం పై మోజు ఎక్కువ. విద్యార్ధి దశ లోనే అమోఘ పాండిత్యాన్ని పొందటం వల్ల ఆచార్య పదవి లభించింది. తన కున్న విజ్ఞానం ఒక్క విద్యకే పరి మితం కాకూడదని భావించాడు. రాజు దగ్గర ఉద్యోగం లో చేరి ఈజిప్ట్ పై జైత్ర యాత్ర చేయటానికి పద్నాలుగవ లూయీ ని ప్రేరేపించాడు. కాని అతడు స్తబ్దుగా ఉండి పోవటం వాళ్ళ నెపోలియన్ దీన్ని గమనించి లాభం పొందాడు.



దేశమంతా పర్య టించిన లీబ్నిట్జ్ ఆర్నాల్డ్, హైగేన్స్ మొదలైన ప్రముఖులను సందర్శించాడు. స్పినోజా ఇతని స్నేహాన్ని కాదను కొన్నాడు దీనితో కొంత కుంగి పోయాడు. మైన్స్ రాజు చని పోయిన తర్వాతా బ్రన్స్ విక్ రాజు గ్రంధాలయ పర్య వేక్షక ఉద్యోగాన్ని ఇచ్చాడు. ఇక్కడ బ్రన్స్ విక్ వంశ చరిత్ర రాశాడు. చివరి రోజుల్లో రాజు దయ లేక పోవటం వల్ల కాలం గడవటం కష్టమైంది. హారోవార్ రాజు జార్జి రాజ్య నిర్వాహక సభను జర్మనీ నుంచి ఇంగ్లాండ్ కు మార్చేశాడు. రాజు లీబ్నిట్జ్ ను తనతో తీసుకు వెళ్ళ లేదు. అల్ప బుద్ధి అని, నాస్తికుడని అపకీర్తి పొందాడు. లీబ్నిజ్ 1716 లో మరణించాడు మరణించిన తర్వాత అతని అంత్య క్రియలు కూడా ఒక నీచుడికి చేసి నట్లు చేశారు. మరణానంతరం ప్రజలు బుద్ధి తెచ్చుకొని అర్ధం చేసుకొన్నారు.

వివిధ దర్శనాలను ఏకం చేయటానికి కృషి చేశాడు. ప్రోటే స్టంట్లు కేధలిక్కుల మధ్య సామరస్యం సాధించటానికి ప్రయత్నించాడు. చైనా సంస్కృతిని మెచ్చు కొన్నాడు. ఉనేస్కో లో ఆదర్శ దార్శనికుడు గా లీబ్నిజ్ ఉండ తగిన వాడు అని ఫిలిప్ వైనర్

భావిన్చాడంటే ఇతని గొప్ప తనం ఎలాంటిదో తెలుస్తోంది. వాదాలతో అనవసర కాల క్షేపం చెయ్యకుండా విజ్ఞాన సమర్పణకుసర్వ సామాన్య భాష ను ఒక దాన్ని సృష్టించ టానికి లీబ్నిట్జ్ కలల కన్నాడు.

గణితం లోన్యూటన్ కనుక్కొన్న "కాల్క్యులస్ "గణితాన్ని ఆవిష్కరించటం లో లీబ్నిట్జ్ కూ గణ నీయ పాత్ర ఉంది. ఎవరు ముందు అని వాదం పెరిగింది. లీబ్నిట్జ్ కనీ పెట్టిన సాం కేతిక పరి భాష న్యూటన్ పరి భాష కంటే గొప్పది.

లీబ్నిట్జ్ దార్శనిక పద్ధతి లో ద్రవ్య భావం అనేది ఉంది. అధికారం. పద్ధతి. గూఢ పద్ధతి లో తార్కిక సత్యాన్ని భూతార్ధ సత్యం ఉన్నాయి డేకార్డ్ లాగా ఆధునిక విజ్ఞానాన్ని జోడించాడు. ఒక భౌతిక ద్రవ్యం ఆధారం గా ఏకత్వసూత్రం కనుక్కోవటానికి లీబ్నిట్జ్ ప్రయత్నించాడు. "అరిస్టాటిల్ కౌగిలి నుంచి నేను విడి పోయి డేమక్రటిస్ చెప్పిన పరమాణువాదాన్ని, శూన్య వాదాన్నిపరమాణువులను అంగీకరించాను. ఇది నా ఊహకు దగ్గర గా ఉంది. గణిత శాస్త్రముకు కు భిన్నంగా ఉన్నాయి. అతి భౌతిక శాస్త్రీయ బిందువుకే సత్యత్వ, వాస్తవికత్వాలు ఉన్నాయి. ఈ జీవ అణువు (మొనాడ్)ఒక శక్తి ఏకాన్కమే. ఇది ఆత్మ వంటిది "అంటాడు లీబ్నిట్జ్. డేకార్డ్. గతి శాస్త్రాన్ని ఇతను ఒప్పుకోలేదు "క్వాం టిటి ఆఫ్ మోషన్ " నిత్యం అంటాడు డేకార్డ్ దీనికి వ్యతి రేకం గా నియత దశలో జరిగే గతి యొక్క క్వాం టిటి నిత్యం అన్నాడు లీబ్నిట్జ్. దీనికే శక్తి నిత్యత్వ సూత్రం అని పేరు. ద్రవ్య కణాన్ని ఒకే స్తానం లో ఉంచటాని కైనా బలం కావాలి. స్తితి శక్తి ఉన్న వస్తువు కైనా చైతన్యం గా ఉంటుంది అన్నాడు. ప్రతి జీవ అణువుకు అంత రంగిక స్వభావం ఉంది. జీవ అణువుల నానాత్వం అంగీ కారమే

జీవ అణువులు కేవల జీవ అణువులు, ఆత్మా స్పిరిట్స్ అని మూడు రకాలు జీవాణువులు పరస్పర ప్రతిక్రియా రహితలుగా ఉంటాయి శ్రేణుల యొక్క అనా వస్యకత (కంటిన్ జెంట్)పర్యాప్త కారణం అయిన ఈశ్వరుడే. ఇదే లీబ్నిట్జ్ ప ర్యాప్త హేతు సూత్రం. లీబ్నిట్జ్ పద్ధతిలో అవి భక్త తాదాత్మ్య సూత్రం(identity of indiscernibles), సంపూర్ణతా(plentitude ) సూత్రంఉన్నాయి. ఉండవలసి నంత అస్తిత్వం ఉంది అని సంపూర్ణతా సిద్ధాంతం చెబుతుంది కనీ పించే ప్రపంచం సుస్తాపిత దృశ్యం (bene funda te ))సర్వ జీవాణువుల సహ్ అస్తిత్వమే (కో ఎక్సి స్తేన్స్ )ఆకాశం అన్నాడు. ఇది సర్వ సామాన్య ఆవ కాశం. దీనికి భిన్నం గా వ్యక్తీ అవకాశం ప్రతి బిమ్బించే జీవాణువు యొక్క పరి పూర్ణత అని ప్రతి పాదించాడు. ఈ రెండు భౌతిక శాస్త్రానికి బాగా ఉప యోగ పడ్డాయి.

సద్రుస్యం లేని ధర్ముల క్రమ వ్యవస్థ నే కాలం అన్నాడు లీబ్నిట్జ్. ఇవి ఒక దాని తర్వాత ఒకటి ఉంటాయి ఇతని కాల నిర్వచనం అర్ధం అవటం కష్టం. జీవాణువు పరిణామ ధర్మాన్ని అంగీకరించిన కాలం యొక్క యదార్ధాన్ని లీబ్నిట్జ్ నిరాకరించాడు జీవాణువుల "గవాక్ష రాహిత్యం "ఒక పెద్ద అడ్డంకి.ఇది జ్ఞాన మీమాంసలో చాలా చిక్కులు తెచ్చింది తనకు ముందున్న పూర్వ సిద్ధాంతాలను సమన్వయ పరచటానికే కృషి చేశాయే ఈశ్వరీయ జ్ఞానం అంటాడు. ఇదేవ్యక్తీ సహాయ జ్ఞానం. కేవలం జీవాణువులను నిరూపించే జ్ఞానం నిక్రుస్టమైనది. ఈ రెంటికి మధ్య ప్రకృష్ట ప్రభావం ఉన్న జీవాణువు లను ప్రదర్శించే మహనీయ మానవులున్నారు అన్నాడు.

లీబ్నిట్జ్ సిద్ధాంతాలన్నీ సంసర్గాలు అసత్యాలు, ప్రతి పాదనా ఉద్దేశ విదేయం రూపం లో ఉంటాయి. "జీవాణునవులు అనేకం "అనే వాక్యం మాత్రం సంప్రస్నా త్మకమూ కాదు ఉద్దేస్య విదేయమూ కాదు. ఈ ప్రపంచ విసహాయం లో లీబ్నిట్జ్ వైవిధ్యం. సాంప్రదాయ దార్శనిక వర్గానికి ఆధునిక తార్కిక భాషా శాస్త్ర వాదానికి మధ్య గొప్ప సమన్వయము సాధించిన వాడు లీబ్నిట్జ్. సత్యం కేవలం నామాలు మూలాధారం కలది కాదు అనే లీబ్నిట్జ్ ఉక్తిని తార్కిక భాషా వాదం లో గొప్ప స్తానం పొందింది.

## వల్లభా చార్యులు

పరబ్రహ్మ సర్వ ధర్మా శ్రయ మని వల్లభా చార్యుల మతం. పరబ్రహ్మ తనను తాను ఈ జగత్తు గా చేసుకొంటాడు. ఎవడి నుండి సర్వ భూతాలూ పుట్టు తున్నాయో అలాంటి బ్రహ్మానికే కర్తృత్వం ఉంది. ఇది ఆయన కు స్వభావమే కాని శంకరుడు చెప్పినట్లు మాయ తో కూడినది కాదు. బ్రహ్మ కర్త అయితే జీవులలో తార తమ్యాలేందుకు ఏర్పడ్డాయి అన్న దానికి వల్లభా చార్యులు ఆయనలో పక్షపాతం. లయ విషయం లో నిర్దయా ఉన్నాయని చెప్పాడు ఇది పరబ్రహ్మ దోషం కాదు అనటానికి మూడు సమాధానాలు చెప్పాడు. జీవుల కర్మల ఫలాన్ని బ్రహ్మం సఫలం చేశాడు కనుక వైషమ్యదోషం ఆయనకు అంటదు. తన సర్వ సమ ఈ విషమ సృష్టి అవసరం కనుక సామర్ధ్యాన్ని ప్రదర్శించాటానికే సర్వ సృష్టి ని బయటికి తెచ్చాడు కనుక విషమ దోషం అంటదు, లీలకు అవకాశం లేదు కనుక విషమ ద్రుష్టి లోపం అంటుకోదు అంటాడు వల్లభుడు ఈయన1474. లోచంపా రణ్యం లో జన్మించి 1531లో మరణించాడు విష్ణు స్వామి మతం లో "ఆచార్య "పదవి పొందాడు. ఆ సంప్రదాయానికి చివరి వాడైన బిల్వ మంగళ ఆచార్యుడుఈయన గురువు



విజయ నగర సామ్రాజ్య చక్ర వర్తి శ్రీ కృష్ణ దేవా రాయల ఆస్థానం లో వల్లభా చార్యులు వాదం లో శంకారా ద్వైతాన్ని ఓడించాడు పుష్టి వాడ భక్తీ కి ప్రధమ ఆచార్యుడు వల్లభుడు విష్ణు స్వామి మతం లో రుద్రసంప్రదాయానికి చెందినా వాడు వల్లభుడు బ్రహ్మ సూత్రాలకు అనుభాశ్యం రాశాడు పదహారు స్తోత్రాలను రాశాడు మహా జ్ఞాని మహా బహాక్త శేఖరుడు మహా వేదాంతి అని పించుకొన్నాడు తన పుష్టి వాడ మత ప్రచారానికి అనేక పాఠ శాలలను ఏర్పాటు చేశాడు. రామానుజ మాధవ నిమ్బార్కారుల వేదాంతాన్ని తన వేదాంతం లో చొప్పించాడు వల్లభా చార్యులు

నేను అనేకం గా అవుతాను అనే శ్రుతి వాక్యం పరబ్రహ్మ తన ఇచ్చ ప్రకారం పూర్ణ మైన ఆనందాన్ని మరుగు పరచి జీవ స్వరూపాన్ని గ్రహిస్తాడు. ఈవిషయం లో అవిద్య లేక మాయ సంబంధం లేదు. అగ్ని నుండి విస్ఫులింగాలు వచ్చి నట్లు జీవులు పరమాత్మ నుండే ఉద్భ విస్తాయి. కనుక జీవ నానాత్వాన్ని అంగీకరించాడు వల్లభా చార్యులు. ఉత్పత్తి, వినాశం లేక పోవటం వల్ల జీవుడు నిత్యుడే. ఇతడు జ్ఞాత. మాత్రమె. జ్ఞానం అతని ధర్మం. జ్ఞాన రూప మైన ధర్మానికి, జ్ఞాత్రు రూప మాయిన ధర్మికి కాంతికి సూర్యుడికి ఉన్న సంబంధం లాంటిదే. జీవుడికి పైకి వెళ్ళటం మోక్ష కారక మైన గతి. జీవుడు అణుస్వరూపుడు. తన సహజ జ్ఞానం చే చైతన్య రూపం గా వ్యాపిస్తాడు.



స్మ్రుతి ప్రమాణం చేత జీవుడు పరబ్రహ్మ అంశమే.బ్రహ్మ అంశి.బ్రహ్మకు పామ్ముత్వం, నిరంకుశత్వం ఉందని స్మ్రుతి ఒప్పుకొంది. కనీ పించే సృష్టి అంతా సృష్టికి పూర్వమే ఉంది కనీ పించేదంతా సత్యమే అని శ్రుతి వాక్యం కనుక జగత్తు సత్యమే. మట్టి, కుండలో భాగమై నట్లు జగత్తు కూడా బ్రాహ్మ లో భాగమే. వల్లభ మతం లో జగత్తు, సంసారం ఒకటి కాదు. ఇది ఇంకే మతం లోను కనీ పించని విషయం. అజ్ఞానం టో పుట్టిన సంసారం జ్ఞానం వల్ల నశిస్తుంది జగత్తు సద్రూపం. దానికి నాశనం లేదు. ఈ మతం లో మోక్షానికి జ్ఞానం కంటే భక్తికే ఎక్కువ ప్రాధాన్యం ఉంది. జ్ఞాన సహజ భక్తీ మహా సాధనం. భక్తిలో మర్యాదా, పుష్టి అని రెండు రకాలు. మొదటిది పరమేశ్వరుని చరణార విన్దాలపై భక్తీ, రెండోది భగ వంతుని ముఖార విందము పై భక్తీ. మర్యాదా భక్తీ వేద సిద్ధం. పుష్టి భక్తీ వేద నిరపేక్షం. స్వతంత్రం. మర్యాద భక్తికి కి సాయుజ్యమే ఫలం. పుష్టి భక్తికి ఫలం అభేద బావన. మర్యాదా భక్తిలో ఫలా పేక్ష ఉంటె, పుష్టి భక్తిలో ఫలా పేక్ష లేదు. మర్యాదా భక్తికి అంబరీషుడు పుష్టి భక్తీ కి వ్రేపల్లె గోపికా స్త్రీలు ఉదాహరణ. ఇందులో శ్రీ కృష్ణ లీలా రసానుభావాన్ని వ్రజ భామలు పుష్కలం గా అనుభ వించారు.

## జాన్ లాక్

జాన్ లాక్ ఇంగ్లాండు దేశం లో బ్రిస్టల్ నగరం దగ్గర రింగ్ టన్ లో 1632ఆగస్ట్29 న జన్మించాడు. వెస్ట్ మినిస్టర్ స్కూల్ లో చదివి ఇరవై వ ఏట ఆక్స్ ఫర్డ్ యూని వర్సిటి లో చేరాడు కాని పూర్తీ చేయలేదు వైద్య, మోడరన్ సైన్స్ల మీద ద్రుష్టి సారించాడు. ఆష్లీ రాజు గృహ వైద్యుయ్యాడు. రాజు తో పరిచయం రాజకీయాలు దారి తీసింది. ఒక వర్తక సంస్తకు కార్య దర్శి గా పని చేశాడు. మూడేళ్ళు ఫ్రాన్స్ దేశం లో ఆరోగ్యం బాగు పర్చుకోవటానికి ఉండి పోయాడు. 1679 లో ఇంగ్లాండ్ కు మళ్ళీ వచ్చాడు. శాఫ్ట్స్ బరీ రాజు సహచరుడు గా ఉండటం వాళ్ళ తీవ్ర వాదిగా అనుమానింప బడ్డాడు. రాజు1682లో హాలండ్ కు పారి పోతే లాక్ కూడా అక్కడికే చేరాడు. 1689 లో విలియం రాజు మేరీ రాణి సింహాసనం అధిష్టించే దాకా అక్కడే ఉండి పోయాడు. సర్ ఫ్రాన్సిస్ సుశాం తో ఓ.ట్స్ వద్ద నివాసం ఉన్నాడు. 1704 లోఅక్టోబర్28 న 72ఏళ్ళ వయసులో అక్కడే చని పోయాడు. "ఫాదర్ ఆఫ్ క్లాసికాల్ లిబరలిజం "అని లాక్ ను గౌరవం గా పిలుచు కొంటారు. బ్రిటిష్ మేధా పరంపరలో లాక్ ఒకడు. రాజకీయ వేదాంతాన్ని, ఎపిస్ట మాలజి ని వ్యాప్తి చేసిన చింతనా పరుడు. "continuation of consciousness తో వ్యక్తిత్వాన్ని రుజువు చేసి మొదట వ్యాప్తి చేసినవాడు లాక్ అతని ప్రభావం కాంట్, రూసో హ్యూమ్ ల పై అధికం. వోల్టైర్, రూసో భావాలకు స్కాటిష్ ఎన్

లైటెన్మెంట్ థింకర్స్ కు అమెరికన్ రివల్యూష నరీలకు లాక్ భావాలే ప్రేరకాలైనాయి అమెరికా లో డిక్లరేషన్ ఆఫ్ ఇండి పెండెన్స్ పై లాక్ ప్రభావం ఉంది



జ్ఞానం ఉత్పత్తి, నిశ్చయత్వం పరి మితి అనే విషయాల మీద చింతన చేశాడు జాన్ లాక్. An essay concerning human understanding "అనే ఉద్గ్రంధం రాశాడు మొదట్లో ఏమీ లేకుండా ఉండే మనస్సు తను గ్రహించిన భావాలను దాని పై రాసుకొంటుంది. భావం అంటే ఆలోచించేటప్పుడు అతని బోధకు ఏది విషయం అవుతుందో అది అన్నాడు. భావాలు అంతర్భావాలు, అంతర్భూత తత్వాలను సత్యాలను నిరాకరించాడు. మనస్సు మూడు రకాలుగా భావాలను గ్రహిస్తుంది. ఇంద్రియాల ద్వారా, గ్రహిస్తుంది. రెండు సంశయించటం, తో ఆలోచించటం అనే "అను చింతన "ద్వారా గ్రాహిస్తుంది.మూడు –ఒక వస్తువు ఇంకో దాని పై మార్పు తెచ్చినప్పుడు అంటే "ప్రత్యక్ష అనుచిన్తన" ద్వారా గ్రహిస్తుంది అంటాడు లాక్.

ఘనత్వం, విస్తృతి, ఆకారం, చలనం అనేవి ద్రవ్యం లోని ప్రతి కణానికి చెందిన గుణాలు అన్నాడు. వీటిని" ప్రైమరీ క్వాలిటీస్"అని పిలిచాడు ద్రవ్యం లో ఇంద్రియ గోచరాలు కాని సూక్ష్మ ద్రవ్య భాగాల నిర్మాణం ఉంది వాటికి చలనమూ ఉంది. వీటి వల్లే రంగు రుచి ధ్వని మొదలైన శక్తులు ద్రవ్యానికి వచ్చాయి అని చెప్పాడు. వీటిని "సెకండరి క్వాలిటీస్" అన్నాడు. భౌతిక ద్రవ్యం మానసిక ద్రవ్యాల స్వరూపం మనం తెలుసుకోలేమన్నాడు లాక్. ద్రవ్యం అవిజ్ఞాతం అన్నాడు అది మనలో భావాలను కలగా జేసే శక్తి ఉన్న గుణాలకు అధిష్టానం అని మాత్రమె చెప్ప గలిగాడు.

ఈశ్వర అస్తిత్వాన్ని ఆవిష్కరించటానికి అవసరమైన సత్తా అనే వాదాన్ని లాక్ నిరాకరించాడు మానవ అస్తిత్వమే దేవుని అస్తిత్వం అన్నాడు జాన్ లాక్. మన భావాల్లోని పరస్పర సంవాదమే వస్తు తత్త్వం యొక్క జ్ఞానాన్ని మనకు అంద జేస్తుంది అన్నాడు. అంటే గుణాలు ప్రకృతిలో స్వంత అ స్తిత్వాన్ని కలిగి ఉంటాయి. గుణాలు ఏ ద్రవ్యం లో ఉన్నాయో అలాంటి ద్రవ్య విషయమై ఇంద్రియాలు మనకు అంద జేసే వాస్తవిక అనుభవాల వలన మనకు వస్తువుల యదార్ధ జ్ఞానం లభిస్తుందని లాక్ అభి ప్రాయం

లాక్ చెప్పిన జ్ఞాన సిద్ధాంతం వల్ల కీర్తి బాగా పెరిగింది. నైతిక సూత్రాలను రాజ నీతికి, మతానికి తన సిద్ధాంతాలను అన్వయించటం కోసమే లాక్ జ్ఞానం యొక్క పరిమితి, ప్రామాణ్యాలను పరిశీలించాడు. నైతిక సూత్రాలకు తార్కిక ఆధారాన్ని కల్పించే ప్రయత్నం చేశాడు. అయితే ఇందులో పెద్దగా ముందుకు వెళ్ళ లేక పోయాడు. ప్రతి మనిషి ఇతరులతో సమ్యక్ బుద్ధి, అంతరాత్మను కనుగొన గలిగిన ప్రకృతి నియమాల ననుసరించి మెలగితే అందరు మనుషులు సమానం గా భావించి తన, ఇతరుల ప్రాణాలకు స్వాతంత్ర్యాలకు ఆస్తులను కాపాడటానికి నేర శిక్షను తనకున్న శక్తి యుక్తులను సద్వినియోగం చేసుకొంటే దేశం సుభిక్షం గా ఉంటుంది అన్నాడు లాక్ పండితుడు. రాజుకున్న నిరంకుశ అధికారాన్ని లాక్ ఖండించాడు. సామాన్యుల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని రాజు చట్టాలు చేసి అమలు చేయాలని కోరాడు. ప్రజాభిప్రాయానికి వ్యతిరేకం గా ఉన్న చట్టాలను,, ప్రభువును తిరస్కరించే అధికారం ప్రజలదే అని నిర్ద్వందం గా చాటి చెప్పాడు జాన్ లాక్ మహాశయుడుదీనినే ఉదార వాదం అన్నాడు

మత విషయం లో కూడా ఈ ఉదార వాదాన్ని వ్యాప్తి చేశాడు లాక్. దేవుడు వంచకుడు కాదన్నాడు. ఈశ్వర ఆవిష్కారం అంతా సత్యమే అన్నాడు దేవుని అస్తిత్వ ప్రచారం కోసం ఏర్పడ్డ మతసంస్థల ప్రయోజనాలు ప్రభుత్వ ప్రయోజనాలకు భిన్నమైనవి. ప్రభుత్వం అంటే ప్రాణం స్వతంత్రం ఆస్తి హక్కు వంటి పౌర హక్కులను కాపాడే సమాజమే అని నిర్వచించాడు. రాజ కీయ ధర్మాలకు ప్రత్యేక మత విశ్వాసం అవసరం కాక పోయినా, స్వధర్మాన్ని నిర్వహించటానికి దేవుని పై నమ్మకం చాలా అవసరం అని తెల్చి చెప్పాడు జాన్ లాక్,

## డేకార్టేస్

"ఆధునిక దార్శనిక పిత "అని పించుకొన్న రీనె డేకార్టేస్ 1596 మార్చ్ 31న ఫ్రాన్స్ దేశం లో జన్మించాడు ప్లేటో తర్వాత మళ్ళీ కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపా పదించి ప్రసిద్ధి కెక్కిన వాడు డేకార్ట్. శ్రీ మంతుల ఇంటిలో పుట్టి ఉత్తమ విద్యా వ్యాసంగాన్ని సాధించాడు దర్శన శాస్త్రం మీదనే మొదటి నుంచి మోజు ఏర్పడింది. లాఫ్లేచ్ జేజూయిట్ కళా శాలలో విద్య నేర్చి గణితం లో ప్రావీణ్యాన్ని పొందాడు.. నిరంతర చింతనా పరుడు. సైన్యం లో చేరి పని చేశాడు. దీనితో ప్రపంచాను భవం కలిగింది. చాలా దేశాలు తిరిగాడు. అనేక కలలు వచ్చేవి. మనసు వ్యాకులం గా

ఉండేది. అప్పుడు స్వాధీన మనస్కత తో తన కలలన్నీ తన దర్శన శాస్త్రానుభవమే నని, కలల్లో పొందిన ఉపదేశాలన్నీ అమోఘాలని నిశ్చయించుకొన్నాడు.



సహజం గా డేకార్డ్ పిరికి వాడు. పుణ్య స్వభావం ఉన్న వాడు. గెలీలియో భూ చలన సిద్ధాంతాన్ని సమర్ధించాడు. తాను రాసిన గ్రంధాలను ప్రచురించాడు. స్వీడెన్ రాణి క్రిస్టీన్ ఆహ్వానం పై హాలండ్ వెళ్ళాడు. తెల్ల వారు ఝామున అయిదు గంటలకు తనకు రోజు దర్శన శాస్త్రాన్ని బోధించమని కోరింది అలానే చేశాడు. చలి బాధకు తట్టుకోలేక పోయాడు. ఊపిరి తిత్తులు చెడి పోయాయి. 1650 లోఫిబ్రవరి న యాభై నాలుగేళ్ళకే డేకార్డ్ అకాల మరణం పొందాడు వాడు రోమన్ కేథలిక్ మతం వాడు ఆయన రాసిన ఫస్ట్ ఫి లాసఫీ పుస్తకం ఎన్నో యూని వర్సిటీలలో బోధనా గ్రంధం గా ఉంది

డేకార్డ్ దర్శన శాస్త్రం లో జ్ఞానానికి ఎక్కువ ప్రాముఖ్యత ఉంది. సమ్యక్ నిర్ణయ సామర్ధ్యం, భ్రమ, వివేకం మనుష్యులకు సహజం, సమానం అన్నాడు డేకార్డ్.. వైయక్తిక బౌద్ధిక వాదం డేకార్డ్ తోనే ప్రారంబ మైంది అంతటి వరకు చర్చి ఆది పత్యం లోనే సాగి పోయింది. "నేను తలుస్తున్నాను కనుక నేనున్నాను "అనేవాక్యం తో డేకార్డ్ తన దర్శన శాస్త్రాన్ని ప్రారంభించాడు. దీనికి ముందే ఆతను కొన్ని విధి విధానాలను, నియమాలను రూపొందించు కొన్నట్లు డేకార్డ్ మరణా నంతరం వెలువడిన "రెగ్యులే "అనే పుస్తకం లో ఉంది. మనస్సును యదార్ధాలను అప వాదం లేని నిర్ణయాలను చేసే టట్లు మనసును ప్రవర్తింప చేయాలన్నాడు. మానసిక శక్తులకు అనుగుణం గా చిత్త శుద్ధి తో స్పందించాలి. మన మనో నిశ్చయాన్ని ఇతరుల భావాలకు తలొగ్గి వదిలి పెట్ట రాదు సరళ, సంకీర్ణ జీవులన్నిటి విషయమై పరీక్షించి దేని నుండి జ్ఞానం పొంద వచ్చో దానిని గ్రాహించాలి.



కొన్ని భావాలు ఆన్తరికాలు కాక పొతే జ్ఞానం అనేది రాదు అని అభిప్రాయ పడ్డాడు. దీనికి కావాల్సిన హేతువులను గణిత శాస్త్రం నుంచి గ్రహించాడు. గణితం పై డేకార్డ్ కు అమిత గౌరవం అందుకే "గణితం యొక్క మూలం దృఢ ప్రతిష్టితం. ఆ మూలం పై గణిత శాస్త్రాని కన్న ఎక్కువ గొప్ప సౌధాన్ని కట్టటం అసాధ్యం అని తెలుసు కొని నేను ఆశ్చర్య పోయాను "అని రాశాడు.

తనకు ముందున్న దార్శనికుల భావాలేవీ నచ్చలేదు డేకార్డ్ కు. నిశ్చిత జ్ఞానం ఎక్కడ లభిస్తుందో అని తీవ్ర అన్వేషణలో పడి గణితాన్ని ఆధారం గా చేసుకొన్నాడు. సందేహాలకు చోటు లేని నిస్సయత్వం గణితం వల్లనే సాధ్యం కనుకు దీన్ని తన దర్శనానికి అనుసంధానం చేసుకొన్నాడు. దీనికోసం ఒక ప్రస్థా ఘట్టం అవసరం అని పించింది. సెయింట్ అగస్టీన్ చెప్పిన "సందేహ పద్ధతి "ని గ్రహించాడు. "నేను ఆలోచిస్తున్నాను కనుక నేను ఉన్నాను "అనే స్వయం విదితం చేసే వ్యక్తి నిష్టమైన ఆలోచనల ఆధారం గ మిగిలిన సత్యాలను దీని నుంచి రా బట్ట టానికి ప్రయత్నం చేశాడు. సందేహించే వాడి ఉనికి సందేహం లేనిది కనుక సందేహ పదం కాదు అన్నాడు. తాను ముందు చెప్పిన వాక్యాన్ని ప్రస్థానం గా తీసుకొన్నాడు డేకార్డ్




"దేన్నీ నేను స్పష్టం గా సమగ్రం గా నేను గ్రాహిస్తానో అది సత్యం అని స్వీకరిస్తాను "అని చెప్పాడు. స్వంత చైతన్యం లాగా ఏది ఏది స్పష్టం గా పరి పూర్ణం గా. కనీ పిస్తుందో అదంతా సత్యమే నంటాడు. నిశ్చల మనస్సు నుండి ఉద్భ వించే భావాలు సప్రమాణ జ్ఞానం అన్నాడు ఇంద్రియ సంవేదనాల కంటే భౌతిక ద్రవ్యం భిన్నమైనది. ఈ గుణాలు అస్పస్టాలు. ఇవి వస్తు నిస్టం కావు. అంటే కొత్త అతి భౌతిక వాదం ఇందులో చేరిందని తెలుస్తోంది. శరీరానికి మనసుకు మధ్య ఉన్న వైరుధ్యం మరీ బల పడింది డేకార్డ్ వాదం లో. మానవుడు కూడా యంత్రమే అయినా అతనిలో దేవుడు, ఆలోచించే మనసును ఉంచాడు మనిషికి ఉన్న సంవేదనలు గ్రాహక శక్తి, చలనం మొదలైన స్వరూపం చేత శరీరం లో విజాతికి చెందినా మనసు ఉంది ఎక్కడో శరీరం తో సంసర్గం కలగ జేసు కొంటోంది అని భావించాడు. ఈ సంసర్గం అనేది మాన వ మస్తిష్కం లో ఉన్న "పైనీయాల్ గ్రంధి (అమృత గ్రంధి)లో జరుగుతోంది అని చెప్పాడు డేకార్డ్. ఇక్కడే మనసు-నాడుల నుంచి వేదనలను గ్రహించి, నాడీ కణాల గుండా "ఆనిమల్ స్పిరిట్స్"ద్వారా చలానాలను కలిగిస్తోంది అన్నాడు. కాని డేకార్డ్ చెప్పిన ఈ విషయాన్నీ భావ వాదులు, భాషా శాస్త్ర వేత్తలూ అంగీకరించలేదు. అయితే ఇది భావ వాదానికి నాంది అని నిస్సందేహం గా చెప్ప వచ్చు ఇదే డేకార్డ్ సాధించిన ఘన విజయం

ద్రవ్యం కంటే మనస్సు నిశ్చిత బుద్ధికి శ్రేష్టం అని తెలిసింది. దీని పై ఇంకా స్పష్టమైన సిద్ధాంతాలను ఆ తర్వాత ఎప్పుడో కాని కాంట్, హెగెల్ లు చెప్ప గలిగారు. దేవుడు, బయటి ప్రపంచం లను నిరూపించటానికి డేకార్డ్ ప్రయత్నించాడు. మనసు నుండి బాహ్య ప్రపంచాన్ని ఉత్పాదిన్చాటా నికి సిద్ధాంతాలు చేశాడు. మనసు నుండి భౌతిక ద్రవ్యాన్ని వేరు చేసి వాటి మధ్య సంబంధాన్ని ఏర్పరచాడు. దీనినే ఈశ్వరుడు అన్నాడు. "ఏది నాకు భిన్నం అయిన దంతటిని సృష్టించిందో, అలాంటి అనంతం నిత్యం స్వతంత్రం సర్వజ్ఞత్వం అయిన ద్రవ్యమే దేవుడు లేక ఈశ్వరుడు అన్నాడు డేకార్డ్. దేవుడుతప్పక వివేకవంతుడు. ఈశ్వర అస్తిత్వాన్ని ఆయన స్వరూపం నుండి వేరు చేయలేము అంటూ" ఒక త్రిభుజం లో మూడు కోణాలు కలిస్తే రెండు సమకోణాలకు సమానం" అనే గుణం త్రిభుజం స్వరూ పాన్నుంచి ఎలా వేరు చేయ లేమో ఇదీ అంతే అని ముడి పెట్టాడు. కాంట్ అస్తిత్వం విశేష కోటిలో చేరదు అని తేల్చాడు.

ఈశ్వరుని పరి పూర్ణతలో శీల పరి పూర్ణత ఉంది కనుక ఆయన వంచకుడు కాదన్నాడు డేకార్డ్. సహజ ప్రకాశం కలది అంతా సత్యమే నన్నాడు. మన ఇంద్రియాలు మనల్ని ఎప్పుడూ వంచిస్తాయి అనే భావం నుంచి డేకార్డ్ బాహ్య ప్రపంచ స్వభావాన్ని స్పష్టపరచ టానికి యత్నించాడు. డేకార్డ్ మతం లో విస్తృత మైనదీ, పరిణామ శీలం కలది తప్ప ఈ విశ్వం లో ఇంకేదీ లేదు. "ఆర్కి మిడీ స్ లాగా డేకర్డ్ "భౌతిక ద్రవ్యాన్ని,చలనాన్ని నాకు ఇస్తే ఈ విశ్వాన్ని అంతటిని నేను మళ్ళీ నిర్మిస్తాను "అని ప్రతిజ్ఞా చేశాడు

విస్తృతి ని విస్తృత మైన దాని కంటే వేరుగా చూడలేము అన్నాడు. దేశం లేక వస్తువు లోపల ఉండే ప్రదేశం, దాన్ని ఆక్రమించి ఉన్న ద్రవ్యం పరస్పర భిన్నాలు కావు. మనంచూసే చూపు ను బట్టి తేడా గా కనీ పిస్తాయంటాడు. వస్తువులో విస్తుతి దాని విశేషణం. అని తన భౌతిక శాస్త్రానికి జామెట్రీ ని జోడించి చెప్పాడు మరి నానాత్వానికి కారణం ఏమిటి ?చలనం ఉష్ణం కాంతి అంటాడు మనస్సు –శరీరం ల గురించి చెబుతూ భౌతిక సూత్రాలకు లొంగని దాన్ని మనసుకు ఆపాదించాడు ఈశ్వరుడే చలానికి ప్రధాన కారణం మొదటి చలనం ఆయన కల్పించిందే. అప్పటి నుండి విశ్వ చలనం నిరాటంకం గా జరిగి పోతోంది అన్నాడు.

డేకార్డ్ ద్వైత వాదిఅయినా వ్యక్తి లో కనీ పించే మనస్సు శరీరాల ఐక్యతను, ప్రత్యక్ష, అంతర్ జ్ఞానాన్ని కాదన లేదు. బాహ్య ప్రపంచం విషయం లో డేకార్డ్ చెప్పింది అతి భౌతిక శాస్త్ర మూల సారమే. అతని దృష్టిలో దర్శనం వృక్షం లాంటిది. దాని మూలం అతి భౌతిక శాస్త్రం. కొమ్మలు భౌతిక శాస్త్రం. మిగిలిన విజ్ఞాన శాస్త్రాలన్నీ దాని శాఖలే. ఈశ్వరుడే ప్రాధమిక ద్రవ్యం. మనసు, భౌతిక ద్రవ్యం సెకండరి. విశేషణాలు భౌతిక ద్రవ్యం యొక్క సారాలు (ఎస్సెన్స్ )మనస్సు స్వరూపం ఆలోచనా భౌతిక ద్రవ్యాల విస్తృతి. ప్రాకారాలు అంటే ఫంక్షన్స్ ద్రవ్యం యొక్క విశేష రూపాలు (మాడి ఫిషన్స్ ), డేకార్డ్ దర్శన శాస్త్రం వల్ల నూతన వైజ్ఞానిక ఆవిష్కారానికి, దర్శనం తో సమన్వయానికి దారి తీశాయి అతన్ని విమర్శించిన వారి వల్ల డేకార్డ్ ప్రతిభ పెరి గిందే కాని తగ్గలేదు.

## లియో టాల్ స్టాయ్

రష్యాలో బాగా సంపన్నమైన కుటుంబం లో లియో టాల్ స్టాయ్ 1828 లోసెప్టెంబర్ తొమ్మిది న జన్మించాడు. పూర్తీ పేరు లెవ నికోలోవిచ్ కౌంట్ టాల్ స్టాయ్. యస్నాయ పోల్యాన జన్మ స్థలం యవ్వనం లో ఖుషీ పురుషుడిగా అన్నీ భోగాలు అనుభ వించాడు ఆ తర్వాతా ఇలాంటి జీవితం పై విరక్తి కలిగింది. ప్రేమ, కరుణ ప్రధానం గా ఉన్న తత్వ శాస్త్రాన్ని రూపొందించాడు


"Tolstoy portrait to Klay.ru" by Original uploader was FeodorBezuhov at ru.wikipedia

యుద్ధం మీద ప్రతి ఒక్కరికి ద్వేషం కలిగే టట్లు "యుద్ధము –శాంతి "అనే గొప్ప నవల1865-69 మధ్య రాశాడు రష్యా పై నెపోలియన్ దండ యాత్రకు వ్యతిరేకం గా అయిదు కుటుంబాల కదా ను ఇందులో రాశాడు స్వతంత్ర బుద్ధి అన్దరికిఉన్డాలని చెప్పాడు నెపోలియన్ లాంటి గర్విస్తులు తమను తాము తెలుసుకోలేక విర్ర వీగారాని రాశాడు అది ఆయన "మాగ్నం ఓపస్ "అని ఇంచుకోంది.రష్యా సాహిత్య చరిత్రలో అదొక మెయిలు రాయిగా ఆధునిక రష్యా ఇతిహాసం (ఎపిక్) గా సుస్తిర స్థానం పొందింది ఆయనకు విశేష మైన కీర్తి ప్రతిష్టలు తెచ్చింది ప్రపంచ దేశాలలో టాల్ స్టాయ్ పేరు మారు మోగింది. ప్రపంచ ప్రసిద్ధ నవలా రచయిత అయ్యాడు

, ఆయన రాసిన అన్నా కేరీనా నవల ఫ్లాబర్ట్ రాసిన "మేడం బోవరి "కి, ఫాన్టెన్ రాసిన "ఇఫీ బ్రీస్ట్ "నవలకు సరి సమానం. ఇందులో వివాహిత అయిన ఒక స్త్రీ విషాద ఆద చిత్రించాడు ఈ నవల చాలా సార్లు హాలీ వుడ్ సినిమా గా తీశారు. అన్నా కేరీన లో తానూ చెప్పాల్సింది అంటా చెప్పేశానని ఇంకా రాయటానికి ఏమీ మిగలలేదని టాల్ స్టాయ్ చెప్పుకొన్నాడు ఈ నవలలో అసాంఘిక అవి నీతి ని బోధించాడని ఆయనపై ఆరోపణ వచ్చింది ఆయన రాసిన "కన్ఫెషన్ అండ్ వాత ఐ బిలీవ్ "రచనను ప్రభుత్వం నిషేద్ధించింది జీవితం లో సత్యానికి యెంత అవసరం ఉందొ రచనలో లేక కళలలో కూడా సత్యానికి అంతే ప్రాధాన్యత ఉండాన్నాడు టాల్స్టాయ్ గాంధీ గారికి టాల్ స్టాయ్ గురువు.. షేక్స్ పియర్, డాంటే, బీతొవెన్ లు అంటే ఎవగించుకొన్నాడు లియో. కదా నవలాలలో క్లైమాక్స్ అంటే ఇష్టం లేని వాడాయన. ప్రతిదీ సంపూర్ణం గా రాయటమే ధ్యేయం ఆయన క్రిస్టియన్ భావం లో "సెర్మాన్ ఆన్ ది.మౌంట్ "కు ప్రాధాన్యత ఎక్కువ. తనకు నచ్చిన వాటిని విడిగా రాసుకొన్నాడు దీనికి "టాల్ స్టాయ్ బైబిల్" అని పేరుఇది బాగా ప్రాచుర్యం పొందింది. పీటర్ ది గ్రేట్ ఈయనకు "కౌంట్ "బిరుదునిచ్చాడుబాక్సర్ విప్ల వాణ్ని సమర్ధించాడు కరువు బాధితులకు సహాయం చేశాడు

1908 లో " a letter to a HIindu "అని భారత స్వాతంత్ర్యాన్ని బ్రిటిష్ పాలకుల నుండి తెచ్చుకోవటానికి అహింసా మార్గమే శరణ్యం అని రాశాడు దక్షిణాఫ్రికా లో గాంధీ పని చేస్తున్నప్పుడు ఆయనకు ఇది దొరికి చదివి స్ఫూర్తి పొందాడు వారిద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్త రాలు జరిగాయి గాన్ధీ గారి అనుమానాలన్నీ టాల్ స్టాయ్ తీర్చి కార్యోన్ముఖుడిని చేశాడు. గురు దక్షిణ గా దక్షిణాఫ్రికాలో రెండవ ఆశ్రమం గా "టాల్ స్టాయ్ ఫారం "ను గాంధీ ఏర్పాటు చేశాడు. టాల్ స్టాయ్ "ఎస్పరాన్టో ఉద్యమం "ను పూర్తిగా సమర్ధించాడు.

కజాన్ యూని వర్సిటి లో న్యాయ, భాషా శాస్త్రాలు చదివాడు. ఆ నాటి విద్యా స్థాయి నచ్చక డిగ్రీ పొందలేదు. ఎక్కువ కాలం మాస్కో, పీటర్స్ బర్గ్ లో గడిపాడు. సుఖ వ్యాధులు అంటించుకొని, జూదం అది అంతా పోగొట్టుకొన్నాడు. 1850 నుంచి రచనా వ్యాసంగం మొదలు పెట్టాడు. సైన్యం లో చేరి పని చేశాడు "చైల్డ్ హుడ్, బాయ్ హుడ్, యూత్ అనే త్రయాలజి గా తన జీవిత చరిత్ర రాసుకొన్నాడు మొదట్లో రాసిన "రైడ్ "అనే కధలో మిలిటరీ చేచన్ పర్వతాలలో ఉన్న ట్రైబల్స్ పై చేసిన దాడిని ప్రతిఘటిస్తాడు. క్రీమియన్ వార్ లో సైనిక భాగానికి సారధ్యం వహించి "సెబస్టో పోల్ "స్వాధీనం చేసుకొన్నాడు. రోజు డైరీ రాస్తూ తనలోని భావాలను పొందు పరచే వాడు. గోతే స్తేన్దాల్ థాకరే రచనలను కరతలా మలకం చేసుకొన్నాడు. డికెన్స్ రూసో రచనలను ఆకళింపు చేసుకొన్నాడు.

సిద్ధర్ధుడికి జ్ఞానోదయం అయి నట్లు టాల్ స్టాయ్ కి కూడా జ్ఞాన నేత్రం విచ్చు కొంది.జీవిత లక్ష్యం పై జిజ్ఞాస పెరిగింది మరణమా ?అంతమా /అనే ప్రశ్న వేధించింది. మరణ భయాన్ని పోగొట్టుకోవటానికి మార్గాలేమిటి అనే దాని పై చింతన చేశాడు. దీని పై నిరంతరం ఆలోచిస్తూ దేశ, విదేశాలు తిరిగి మనస్సుకు సమాధానం చెప్పుకొన్నాడు. ఏఏ అనంత పయనం లో ఆటను నాలుగు సూత్రాలను రూపొందించాడు. 1-కోపాన్ని చంపుకోవాలి. 2-కాముకత్వం రూపు మాపు కోవాలి. 3-ఏ విషయాన్ని గురించి ఎవరికి మాట ఇవ్వ కూడదు. 4-అపకారికి కూడా ఉపకారం చేయాలి. ఈ నాలుగు సూత్రాలను సమన్వయము చేస్తూ "చతుర్దర్శన సమన్వయ దీపిక "అనే ఉద్గ్రంధం రాశాడు

1917 లో రష్యాలో లెనిన్ నాయకత్వం లో కమ్యూనిస్ట్ ప్రభుత్వం ఏర్పడింది. ప్రతి కాలేజి విద్యార్ధి తత్వశాస్త్రాన్ని ఒక ఏడాది తప్పకుండా చదవాలనే నియమం వచ్చింది. హైస్కూల్ లెవెల్ లో తర్కం, సామాజిక శాస్త్ర బోధన అమల్లోకి వచ్చింది.

ఈ విశ్వం అనంతం అని, దీనికి ఆది కాని అంతం కాని లేవని టాల్ స్టాయ్ చెప్పాడు. విశ్వం సర్వ సమగ్రం అన్నాడు. కనుక దీన్ని మించినదేదీ ఎక్కడా లేదు అని స్పష్టం చేశాడు. కనుక "అజ్ఞేయం "అనేది విశ్వం లో లేనే లేదుఅజ్ఞాతం మాత్రం ఉంది అన్నాడు. "విశ్వ రహస్యాన్ని ఆవిష్కా రించే సూత్రాలు గతి తార్కిక భౌతిక వాదసూత్రాలు మాత్రమె " అని ఖచ్చితం గా చెప్పాడు. ఇవే అందరికి మార్గ దర్శకాలు అని తేల్చి చెప్పాడు. ఇదంతా ఆ నాటి రష్యా లో ఉన్న తాత్విక ధోరణికి మూల లక్శనాలాఐన విషయాలే. 1910 లో నవంబర్ఇరవై న 82 ఏళ్ళ వయసులో టాల్ స్టాయ్ ఇహ లోక యాత్ర చాలించాడు

## సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు



1888 లోసెప్టెంబర్ అయిదున రాదాకృష్ణన్ తిరుత్తని లో జన్మించాడు తండ్రి వీరాస్వామి తల్లి సీతమ్మ. సర్వే పల్లి రాదా కృష్ణన్ మద్రాస్ క్రైస్తవ కాలేజి లో విద్య పూర్తీ చేసి, అక్కడే ప్రెసి డేన్సి కాలేజ్ లో దర్శన శాస్త్ర ఉపన్యాసకుడు గా, ప్రదానోపన్యాసకుడుగా పని చేశారు. భార్య శివకామి. కల కత్తా విశ్వ విద్యాలయం లో తత్వ శాస్త్రావుపన్యాసకుడు గా పని చేశారు. మాంచెస్టర్ కాలేజ్ ఆ ఫ ఆక్స్ ఫర్డ్ లో ఆస్తాన్ ఉపన్యాసకుడైనాడు. 1926 లో చికాగో లో హాస్కెల్ తులనాత్మక మత దర్శనోపాధ్యుడైనాడు. 1931-36 లో ఆంధ్ర విశ్వ విద్యాలయ ఉపాధ్యకుడుగా1936-52 లో ప్రాచ్య మత, నీటి శాస్త్రాలలో స్పాల్డింగ్ ఆచార్యుడుగా ఉన్నాడు. 1939-48, కాలం లో బెనారస్ విశ్వ విద్యాలయ ఉపాధ్యక్ష పదవి నిర్వహించాడు. అంతర్జాతీయం గా ఎన్నో విశిష్ట పదవులను రించాడు పండితుడు. 1951 లో భారత తొలి రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ తో బాటు తొలి ఉప రాష్ట్ర పాటి పదివిలో అలరాడాడు ఆతర్వాత రెండవ రాష్ట్రపతి గా పరిపాలనను ఆదర్శ వంతం గా పని చేసి ప్లేటో చెప్పినట్లు దేశానికి రుషి పాలనా కావాలన్నదాన్ని రుజువు చేసి సర్వా సమర్దుడని పించుకొన్నాడు. అంతకు ముందు రష్యాలో రాయ బారిగా ఉండి స్టాలిన్ మనసునే మార్చిన ఘనుడు రాధాకృష్ణ దేశికుడు. అనేక వేదాంత గ్రంధాలను తత్వ శాస్త్రా గ్రంధాలను రచించి ప్రపంచ ప్రసిద్ధి చెందాడు ఆచార్యుడు తన పుట్టిన రోజు సెప్టెంబర్ అయిదు ను వేడుక గా జరపటం కంటే "ఉపాధ్యాయ దినోత్సవం "గా నిర్వహించాలని సూచించాడు. అప్పటినుంచి అదే జరుగుతోంది. ప్రస్తాన త్రయం అనబడే బ్రాహ్మ సూత్రాలు ఉపనిషత్తులు భగవద్ గీత కు రాధాకృష్ణన్ చేసిన వ్యాఖ్యానం చరిత్రలో నిలిచి పోతుంది. "క్రిష్ణార్పణ చారిటి ట్రస్ట్ ను ఏర్పరచి సేవ లందించాడు. "ఫిలాసఫర్ ప్రెసిడెంట్ "గా సుప్రసిద్ధుడు. ప్లేటో "తత్వ వేత్త రాజ్యాదికారి కావాలి "అన్నదాన్ని రుజువు చేశాడు. అన్తాకు ముందు జనక చక్ర వర్తి తో ఈయనను పోలుస్తారు.

రాదా కృష్ణన్ భావనలో సమన్వయము చాలా ముఖ్యమైనది. ఈ విశ్వం యొక్క విచిత్ర రూపాన్ని, దానిలో కనీ పించే ఏకత్వాన్ని జాగ్రత్త గా గమనించాలని కోరాడు. మానవ స్వభావం సద్భావమనుభావం తో కూడిన విజ్ఞానం లో కూడా ఏకత్వాన్ని దర్శించ వచ్చు అంటాడు పండితుడు. ఆయన దర్శనం లో మూడు అంశాలు ప్రధానమైనవి.

మొదటిది –"కేవలం "గూర్చి సిద్ధాంతాలున్నాయి. పాశ్చాత్య వేదాంతాన్ని హెగెల్, బ్రాడ్లీ వంటి వారి ని ఆదర్శం గా తీసుకొన్నాడు ఈయన భావానాలు మిగిలిన వారి దాని కంటే విలక్షణ మైనది. "కేవలం అని చెప్పిన రాదా కృష్ణ భావం శాంకారాద్వైతంలోనిదే

రెండవది –ఈయన రచనలన్నీ ఆధునిక ప్రపంచ సమస్యల పరిష్కారానికే ఉప యోగించాడు. ఇదే భారతీయ వేదాంతానికి కొత్త రూపు నిచ్చాడు. ఇతర దేశాలలో ఉదార భావం వ్యాపించిన చోట్లలో రాదా కృష్ణ భావ వ్యాప్తి చొచ్చుకు పోయింది.

మూడవది –ఆధునిక దర్శన శాస్త్ర చరిత్రలో మన పండితుని స్థానం అద్వితీయం గా నిలిచి పోయింది. మానవ నాగరకతకు సంస్కృతికి కొత్త సమన్వయం తీసుకొచ్చాడు. ప్రపంచ వైవిధ్యానికి ఏకత్వం సాధించిన ప్రజ్ఞాని. ప్రపంచ దేశాల మధ్య సంస్కృతుల మధ్య ఉన్న భిన్నాలను వదిలి ఏకత్వాన్ని సమకూర్చి న ఘనుడు ఈ మధ్యే మార్గం అంటే "తార్కిక వివేచనా జ్ఞానం యొక్క ఫాలితమే ".

" library of living philosophers "అనే గ్రంధ శ్రేణి లో ఒకటి అయిన ఫ్రాగ్ మెంట్స్ఆఫ్ కన్ఫెషన్ "లో గురువు యెంత గొప్ప వాడైనా తానూ దాన్ని అంగీకరించాను అన్నాడు స్వానుభవం నుండి వచ్చిన జ్ఞానమే మూల మైనది అని ఖచ్చితం గా చెప్పాడు. గతంఅనాగారక తకు ఆరంభం అని భావించి రెండిటిని పునర్జీవింప జేయాలి ఇది ప్రాచీనులు చెప్పిన శుకుడు చెప్పిన బోధ కాదు. అప్రాచీన విజ్ఞానం లోని ఆత్మ వివేక సారాన్నిగ్రహించి మహా జ్ఞానాన్ని అంతా కొత్త పద్ధతిలో వివరించి సమస్యా పరిష్కారానికి విని యోగ యోగ్యత నిరూపించాడు.

జ్ఞాన, మీమాంసా శాస్త్రాలలో అంతర జ్ఞానం యొక్క మూలం అయిన "కేవల "సిద్ధాంతాన్ని ముఖ్యం గా బోధించాడు. జ్ఞానం అనేది స్వతః ప్రమాణం. అది నిత్యుడు అయిన జ్ఞాతను తెలియ జేస్తుంది. ప్రపంచం మిధ్య కాని భ్రాంతి కాని కాదు. విజ్ఞానానికి ఉపయోగ పడే సంవేదనలన్నీ, వాటి మధ్య సంసర్గాలుగా మారాలి. ద్రవ్యం జీవం, చైతాన్యం అనేవి కాల్పనిక నిర్మాణాలు. మానవ అనుభవానికి వరుస దశలు. ఇది కేవల జ్ఞాన వాడి చెప్పే మతం మాత్రం కాదు.

"ప్రపంచానికి వ్యావహారిక సత్తా ఉంది. వ్యావహారిక సత్తాకు భిన్నమైనవి. మానవ అనుభవం పరమ సత్యం కాదు. భ్రాంతి విలసితం కూడా కాదు., ప్రపంచం సత్యం కాక పోయినా మనస్సు సృష్టించింది కాదు. సత్తా సర్వాస్వం ఆత్మయే. మన ఆలోచనా పరంపరా లో అనుభవం అయిన ఒక ఆవశ్యకత నిర పేక్ష సత్యం ప్రకుతి చైతన్య తో కూడినది. అను రూప మైన వశ్యం సద్భావం యొక్క అనుభూతి లేనిదే నిరుపాధిక సత్యం గా భావిన్చాక్ లేం. దీన్నే "జీవితాన్ని గురించి హావ వాడ దృక్పధం "అనే దానిలో వివరించాడు రాధాకృష్ణన్. "అయిడలిస్ట్ వ్యూ ఆఫ్ లైఫ్ లో వీటి విషయమై చర్చించాడు. మనతో సమాన మైన అనుభవం కల ఇతర మనస్సులు కలవు అన్నది అందరికి తెలిసిందే. ఈ సామాన్య ప్రతీకయే పరామాత్మ యొక్క అస్తిత్వికి ప్రమాణం అన్నాడు.

తన వాదాలను ఉపనిషత్తుల నాదారాం గా సమర్ధించాడు. అంతర్ జ్ఞానం అనగా ప్రత్యక్ష అనుభూతియే. ఇది అఖండాభనువమే. అంతర జ్ఞానానికి రుజువు దాన్ని మన మనసు నుండి బహిష్కరించ లేక పోవటమే అన్నాడు.

నీతిశాస్త్ర విషయం లో కూడా రాదా కృష్ణన్ కు కొన్ని నిశ్చిత అభిప్రాయాలున్నాయి. కర్మ స్వేచ్చకు ప్రతి ద్వందికాదు. తన్ను తానూ ఉద్ధరించుకోవాలి అన్న కోరిక మానవుడికి సహజం. సన్యాసం కూడా సాధుత్వాన్ని సాధనం కాదు. స్మృతుల ననుసరించి ప్రవర్తించటం మంచిదే నన్నాడు. అవి శాంతికి ఉపయోగిస్తే మంచిదే అంటాడు. సంపూర్ణ జ్ఞానం, నిరుపాధిక ప్రేమ, పరి పూర్ణ స్వేచ్చ మధ్య సామరస్యాన్ని సాధించటమే మనవ జీవిత లక్ష్యం. ఇందులో ఏది లోపించినా సంపూర్ణం కాదు. 'H indu view of life "లో వర్ణ వ్యవస్థ ను సమర్ధించాడు. మానవుడి గుణాలే అతని ఉత్కృస్టతకు కారణం. మానవ హక్కులు తగ్గించుకొని కర్తవ్యానికి ప్రాముఖ్యమివ్వాలని కోరాడు. ఇతరుల దృక్పధాన్ని కూడా అర్ధం చేసుకోవాలి. శీలం పీడనం లేక పోవటమే ప్రజాస్వామ్యానికి రక్ష అన్నాడు. ప్రజాస్వామ్యం సఫలం కావాలంటే ఆర్ధిక తార తమ్యాలుండా రాదు. ధర్మం తో ఉందని అభ్యుదయం ఇసుక ఇల్లు లాంటిదే.

అంతర్జాతీయ రాజకీయ రంగం లో రాదా కృష్ణన్ బోధలు అత్యన్తావస్యకాలు అన్నారెందరో. ప్రతి నాగరికత అక్కడి మతం యొక్క అభి వ్యక్తియే. అంధ విశ్వాసాలు వదిలెయ్యాలి. ఆత్మ సంపత్తి లో మానవు లంతా సమానమే. మానవులు ఉన్నత గుణాలు పొంది ప్రవర్తనలో ఈశ్వర భావాన్ని నింపుకొని ప్రవర్తిస్తేనే శాంతి ఏర్పడుతుంది అని చెప్పాడు. ఏ సంప్రదాయాన్ని రాదా కృష్ణన్ అంగీకరించ లేదు. మనుష్యుల హృదయాలలో వెలుగు నింపి, శ్రద్ధను ప్రోత్సహించి కృతకృత్యులు కావాలనిపండి తుని ఉపదేశ సారం 1975ఏప్రిల్ 17 న 86 ఏళ్ళ నిండు వయసులో పరమ పాడించాడు మహా పండితుడు.

## కార్ల్ యాస్పర్స్ (Jaspers Carl )

కార్ల్ యాస్పర్స్ జర్మన్ దార్శనికుడు ఓల్డెన్ బర్గ్ లోఒక బ్యాంకి అధికారి కుమారుడు. 1883 లో ఫిబ్రవరి23 న జన్మించాడు మనసిక రోగ చికిత్సా నిపుణుడు. దీనిపై "Allegemeine sycho patology "అనే గ్రంధాన్ని రాశాడు దృష్టి ని దర్శన శాస్త్రం మీద కేంద్రీకరించాడు. హిడెన్ బర్గ్ యూని వర్సిటి లో ఆచార్య పదవి లో చేరాడు. అప్పుడున్న జాతీయ సమైక్య వాదాన్ని ఒప్పుకోలేదు కార్ల్. దీని ఫలితం గా జర్మనీ ని వదిలి పెట్టాల్సిన స్తితి వచ్చింది. 1943 లో స్విట్జర్లాండ్ లో బాసిల్ విశ్వ విద్యాలయ ఆచార్య పదవి లో ప్రవేశించాడు. చాలా గ్రంధాలు రాశాడు అందులో

ముఖ్యమైనవి దర్శన శాస్త్రం, దార్శనిక సమాలోచనా రీతి, దార్శనిక శాస్త్ర ప్రవేశం, నేటి తర్కం –ప్రతి తర్కం మొదలైనవి. 1969ఫిబ్రవరి 26న ఎనభై ఆరు ఏళ్ళ వయసులో మరణించాడు

"While I was still at school Spinoza was the first. Kant then became the philosopher for me and has remained so...Nietzsche gained importance for me only late as the magnificent revelation of nihilism and the task of overcoming it."



కియొర్క్ గార్డ్ అనే ఆయన స్తాపించిన అస్తిత్వ వాద సంప్రదాయానికే యాస్పర్స్ చెందుతాడు. అతని దృష్టిలో దర్శన శాస్త్రం అంటే విశ్వాన్ని గూర్చిన అమూర్త సిద్ధాంతం కాదు. అస్తిత్వ గుణం ఉన్న దార్శనికుడు తాను ఉన్న ప్రత్యక్ష జీవిత సన్నీ వేశాలలో చూపే ప్రవృత్తి. యే దర్శన శాస్త్రం అన్నాడు. యాస్పర్స్ ఆలోచన పరిణతి పొందిన కొద్దీ అస్తిత్వ వాదం లో ఉన్న విరోదా భాసాలపై ఆసక్తి తగ్గింది. అంత కంటే సువ్యవస్తిత దార్శనిక సమా లోచన వైపు ద్రుష్టి పెట్టాడు. ఈ అంశాలను దర్శన శాస్త్రం ఉపేక్షించ కూడదు అని చెప్పాడు. దాని లక్ష్యం హేతు బద్ధ బౌద్ధిక విచారమే. తర్కం యొక్క ప్రాదాన్యతను గు ర్తించాడు. కనుక దర్శన శాష్ట్రం "బుద్ధి దర్శనం" అని కొత్త అర్ధం చెప్పాడు.

ఇతని ఆలోచనలలో విషయత్వం (ఆబ్జెక్టి విటి),అస్తిత్వం (ఎక్సిస్టెన్స్ ),అతీత్వం (ట్రాన్సేన్ డేన్స్ ) ఉన్నాయి. వాస్తవికత అంటే సజీవ నిర్జీవ వస్తువులే కాక, ఆలోచనలు మనః ప్రవృత్తులు. ఇవన్నీ ప్రకుతి శాస్త్రం చర్చించేవి. ప్రకుతి విజ్ఞానం వల్ల విశ్వం యొక్క సమగ్ర స్వరూపం తెలియదు ప్రకుతి జ్ఞానం దానికది సాటి లేనిదే. దానిపై విపరీతం గా ఆధార పడ రాదు. ప్రకుతి విజ్ఞానం టో దర్శన శాస్త్రానికేమీ వైరుధ్యం లేదన్నాడు. దర్శనం ప్రకుతి యొక్క పరిమితి ని చూపించి దాని పై వ్యామోహం కలగ కుండా కాపాడుతుంది. వ్యక్తీ అస్తిత్వం లో ఉన్న వైవిధ్యం సందిగ్ధతల పై ద్రుష్టి పెట్టాలి. తన నిర్ణయాలలో మానవుడు తన అస్తిత్వాన్ని బయట పెడతాడు. అతడు కేవలం "విషయి "మాత్రం కాదు. ప్రపంచం టో సంబంధం ఉన్న వాడు. అతని అస్తిత్వానికి ఎప్పుడూ ప్రామాదం పొంచి ఉంటుంది. ఈ సందర్భం లో అతనికి వ్యక్తిత్వం, స్వేచ్ఛ ఉండక పోవచ్చు.

దైవ ద్రుష్టి లేక పొతే అమానుషం గా మానవుడు ప్రవర్తించే అవకాశం ఉంది. స్వతంత్ర మానవ సంఘం లో తానొక స్వతంత్ర వ్యక్తీ గా మసులుకోవాలి. అస్తిత్వాన్ని వివరించటం అసాధ్యం అన్నాడు యాస్పర్స్. కనుక విషయ వాస్తవికత కంటే భిన్నమైన వాటిని కల్పించుకోవాల్సిన అవసరం ఉందన్నాడు. అతీత్వం అనేది లేక పొతే అస్తిత్వం అర్ధం కాదన్నాడు. "లిమిట్ సిచుయేషన్స్అనే భావాన్ని దీనికోసం వ్యాప్తి లోకి తెచ్చాడు చావు మొదలైనవి అనుభావాలైనప్పుడు మనల్ని మన అస్తిత్వ విషయం లో శ్రద్ధ పెంచి అస్తిత్వం యొక్క నిగూడార్ధాన్ని ఈ అవధి సన్నివేశం(లిమిట్సిచు యేషన్స్ ) కాపాడుతాయని చెప్పాడు.

అస్తిత్వానికి ఈ దృశ్య ప్రపంచం టో సంబంధం ఉన్నట్లే దాని అతీత్వం టో కూడా సంబంధం ఉంది అన్నాడు. దీనిని వివరించటానికి "కూటలిపి భాష ) "ను తయారు చేసి అందులో చెప్పాడు. అతీత్వ సందేశాలను గ్రాహించటా నికి మనిషి ఎప్పుడూ సిద్ధం గా ఉండాలి. కూట లిపి లో మునిగి తేలిన వాడి జన్మ సార్ధకం. అలాంటి కూట లిపి భాష లలో చరిత్ర ఒకటి "అన్నాడు ఈ భాష పురాణాలలో కళలలో కన్పిస్తుంది అని చెప్పాడు. కూట లిపి కానిదేదీ లేదు అని తేల్చాడు. అతీత్వం వాస్తవికత యొక్క ఉత్కృష్ట దశను, నికృష్ట దశనూ రెండిటిని చెబుతుంది.

1934 లో యాస్పర్స్ రాసిన 'చరిత్ర పుట్టుక- లక్ష్యం "గ్రంధం ఈ ద్రుష్టితో రాసిందే. క్రీ. పూ. 500 కా లాన్ని"యాక్సిస్ టైం "అంటారు. ఆ కాలానికి చాలా ప్రాధాన్యత కల్పించాడు గ్రంధం లో. ఈ కాలం లోనే ప్రపంచం లో చాలా దేశాలలో మతాచార్యులు జన్మించారని అన్నాడు. వారి

సందేశాలను అవగాహన చేసి కొని, మానవుడు తన స్తిత్వాన్ని గురించి దాని పరిమితుల గురించి జ్ఞానాన్ని సంపాదించాడు అని స్పష్టం గా చెప్పాడు కార్ల్.

ఒక రకం గా అస్తిత్వ వాదులలో యాస్పర్స్ అతి వాదుల కంటే సమత్వ ద్రుష్టి ఉన్న వాడుగా గుర్తింపు పొందాడు. పాశ్చాత్య దేశాలలో కనిపించే పురుషార్ధాలానే యాస్పర్స్ తన దర్శన శాస్త్రం లో నిక్షిప్తం చేశాడని తెలుస్తుంది. జీన్ పాల్ సాత్రె వంటి నిరీశ్వర వాదుల కంటే యాస్పర్స్ క్రైస్తవానికి దగ్గర గా ఉన్నాడు అ నే భావన కలుగుతుంది

నాజీలు అధికారం లోకి వచ్చిన తర్వాతా జ్యూయిష్ వాడు అని ఉద్యోగం ఊడ గొట్టారు జర్మనీ యూరప్ దేశాలలో పేరు పొందిన ఫిలాసఫర్ అని పించుకొన్నాడు

## జాన్ స్టువార్ట్ మిల్

జాన్ స్టువార్ట్ మిల్ 1806 లో మే ఇరవై న ఇంగ్లాండ్ లో జన్మించిన బ్రిటిష్ దార్శనికుడు. అర్ధ శాస్త్ర నిపుణుడు. తండ్రి కిష్టమైన ఉపయోగ వాదాన్ని వ్యాప్తి చేయటమే ధ్యేయం గా కార్య క్రమం లోకి దిగాడు దీనికి "బెంథం "సిద్ధాంతాలను కూడా అర్ధం చేసుకొన్నాడు. అనుభవ వాదాన్ని శిఖరా రోహణం చేయించిన ఘనత మిల్ కే దక్కు తుంది. రాజనీతి, నీతి శాస్త్రాలలో లిబరలిజం అంటే ఉదార వాదాన్ని పూర్తిగా సమర్ధించాడు.



మిల్ చెప్పిన విధానాలను "మెదడ్స్ ఆఫ్ మిల్ "అంటారు. తన ఆదర్శాన్ని శాస్త్రం మీద కేంద్రీకరించాడు మిల్. ప్రకృతి శాస్త్రం లో ఉన్న నిశ్చిత పద్ధతుల్ని సాంఘిక శాస్త్రం లో ప్రవేశ పెట్టటం కోసం చాలా కృషి చేసి సఫలీ కృతుడైనాడు. "ఇండక్టివ్ "అంటే వ్యాప్తి సంబంధమైన అన్వేషణ అంతా కారణాలను వెతకటం తోనే సరి పోతుందని భావించాడు. కనుక శాస్త్రీయం గా సంఘటనల మధ్య సంబంధాలను కనుగొనే పద్ధతుల్ని నిర్ణ యించట నన్నాడు. ఇందులో అయిదు పద్ధతులున్నాయని చెప్పాడు. 1-cause complex (కారణ సంకీర్ణం )2-factors(అంశాలు )3-antecedents (పూర్వ రాశులు )4-consequences (ఉత్తర రాసులు )

తన భావ వ్యాప్తికి రెండు నియమాలు రూపొందిన్చుకొన్నాడు. 1-సంఘటన దేనిలో కనీ పిస్తుందో అలాంటి విభిన్న ద్రుష్టాంతాలను ఒక దానితో ఒకటి పోల్చి చెప్పటం 2-అలాంటి దృష్టాంతాలను అన్ని విధాల సమానం కాని వాటితో పోల్చి చెప్పటం. ఈ రెండు "ఒక సంఘటన కనీ పించి నప్పుడు ఆ సంఘటనకు కారణం మాత్రం కాదు "అనేది మిల్ యొక్క ప్రాధమిక సూత్రం దీని మీదే అంతా ఆధారపడి రాశాడు.

మిల్ పద్ధతులలో 1-అంగీకార పద్ధతి (method of agreement ). ఇందు సంఘటన యొక్క రెండు లేక ఎక్కువ దృష్టాంతాలు ఒకే పద్ధతి ని సామాన్యం గా కలిగి ఉంటె అన్ని దృష్టాంతాలు సామాన్య పద్ధతిలో ఆ సంఘటనకు కారణం అవుతుంది. -2-భేద పద్ధతి –సంఘటన ఏ దృష్టాంతం లో కనీ పించిందో, దానికి ఆ సంఘటన కనబడని దానికి ఈ ఒక్కటి తప్ప మిగిలిన వన్నీ సమానం గా ఉంటె అప్పుడది ఆ సంఘటన యొక్క కార్యం, లేక కారణం అవుతుంది

3-అంగీకార భేద సంయుక్త పద్ధతి (joint method of agreement and difference ).ఒక సంఘటన కనీ పించే రెండు లేక ఎక్కువ ద్రుష్టాంతా లలో ఒక పరిస్తితి మాత్రమె సమానం గా ఉంటె ఆ సంఘటన కనీ పించని రెండు లేక ఎక్కువ ద్రుష్టాం తాలలో ఆ పరిస్తితి లేక పోవటం తప్ప మరేదీ సామాన్యం గా లేక పొతే ఏ పరిస్తితుల్లో ఈ రెండు ద్రుష్టాంతాల "వర్గాలు" భేదిస్తాయో అది ఆ సంఘటన యొక్క కార్యం కాని,కారణం కాని కారణం లో ముఖ్య భాగం కాని అవుతుంది.

4-సాహచర్య పరిణామ పద్ధతి ( method of concomitant variation ))మార్పు చెందినప్పుడ ల్లా ఒక సంఘటన ఏదో విధం గా మారుతుంటే ఆ సంఘటన రెండవ సంఘుట నకు కారణం కాని కార్యం అవుతుంది.

5-అవశేషాల పద్ధతి (method of residue )-ఏ సంఘటన అయినా యేవో కొన్ని పూర్వ రాస్తుల కార్యం అని ఇదివరకు చెప్పిన దాన్ని వ్యవకలన చేస్తుంది అప్పుడు ఆ సంఘటనలో అవశేషం మిగిలిన పూర్వ రాశుల కార్యం అవుతుంది. ఈ పద్ధతులు కొత్త విషయాలను కనీ పెట్ట టానికి పనికి వచ్చేవి కావు. ఇవి పద్ధతులు కావు నియమాలు మాత్రమె అని తేల్చారు

66 ఏళ్ళ వయసులో 1873 మే ఎనిమిది లో స్టువార్ట్ మిల్ మరణించాడు బ్రిటిష్ పార్ల మెంట్ సభ్యుడైనాడు. లిబరల్ పొలిటికల్ ఫిలాసఫీ వ్యాప్తి చేసిన వారిలో ప్రముఖుడు. మూడేళ్లకే గ్రీక్ భాష నేర్చి ఎనిమిదో ఏట ఈసప్ నీతి కధలు చదివేశాడు ఆ వయసులోనే లాటిన్ నేర్చి యూక్లిడ్ జామెట్రీ, అల్జీబ్రాలలో సాధికారత సాధించాడు ఆంగ్ల కవిత్వం చదవటమే కాక రాశాడు కూడా హోమర్ రాసిన ఇలియడ్ కు కొనసాగింపు కావ్యం రాసి మంచి పేరు పొందాడు. ఆగస్టీ కాంటే తో కలం స్నేహం చేశాడు అమెరికన్ అకాడెమి ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్ లో గౌరవ సభ్యుడ దయ్యాడు రిప్రేసేన్తతివ్ ప్రభుత్వానికి ప్రోపోర్శనల్ రిప్రేసేన్తెషణ్ కు అనుకూలుడు బెర్ట్రాండ్ రసెల్ కు ఫిలాసఫీలో "గాడ్ ఫాదర్ "మహిళా హక్కుల కోసం బానిసత్వ విమోచన కోసం కృషి చేశాడు. "ఫెమినిస్ట్ ఫిలాసఫీ " రాశాడు "దాదాపు నలభై పుస్తకాలాను వైవిధ్య భరితం గా రాసిన ఘనా పారి జాన్ స్టువార్ట్ మిల్

## మిత్ర మతం

మిత్ర మతం క్రీస్తు పూర్వం లోనే ఉండి క్రీ.శ.లో కొన్ని శతాబ్దాలు బాగా వాప్తి చెంది క్షీణించి పోయింది. ఆర్య, పర్షియన్ పురాణ కధల్లో ఉన్న శాంతి, సత్యం ఆధారంగా ఈ మతం ఏర్పడింది. ఈ మతానికి దేవత "మిత్రుడు 'గా ఉండేవాడు తరువాత సూర్యుడు దేవతగా మారాడు మిత్రుడు అన్నా సూర్యుడు అన్నా ఒకటే. ఈ మతం లో దేవతలంతా ఆర్యులు, పర్శియన్లే. వీరిని రోమన్లు కూడా పూజించే సంప్రదాయం వచ్చింది. భారత్ చ్చిన ఆర్యులు ఇరానీ సంబంధాన్ని వదలక ముందే ఈమతం వ్యాప్తి లో ఉందని చరిత్రకారుల ఉవాచ.



## మిత్రుడు వృషభ వధ

మిత్ర దేవత మనుష్యులకు చాలా ఇష్టమైన వాడు. ఆర్యుల కాలం లో మిత్రుడు వరుణుడి తో కలిసి ఉన్నట్లు తెలుస్తోంది. ఈ దేవతలిద్దరు ఒకే స్వర్ణ రధ సారదులై ఒకే రకమైన చింతన చేసి నట్లు ఉంది. ఈ ఇద్దరు విశ్వ క్రమాన్ని, ధర్మాన్ని సంరక్షిస్తూ, మానవ హృదయాలకు, కార్యాలకు సాక్షులుగా ఉంటారు. మిత్రా వరుణులనేత్రం గా.సూర్యుడు ఉన్నాడని ఈ మతం అంటుంది. ఆకాశం లో వీరు నియమిత మార్గం లో ప్రయాణం చేసే వీళ్ళ రధమే "కాంతి "గా భావిస్తారు. వీరిద్దరూ పాపుల ను శిక్షిస్తారని, అవసరమైతే క్షమిస్తారని విశ్వ సిస్తారు.



మిత్రా వరుణు లిద్దరూ ప్రతి రోజు మానవులను మేల్కొల్పి, నిత్య కృత్యాలకోసం ప్రోత్సహిస్తారు. అనంతా శం అనబడే" అదితి "కుమారులైన వీరు ఆదిత్యులయ్యారు అని నమ్ముతారు. వేదం లో ఉన్న మిత్రుడు, ఇరానియన్ పురాణాల్లో ఉన్న మిత్రుడు వేరు వేరు కాదు. జోరాస్ట్రియన్ మతం లో "ఆర్మజ్ద్ "అంటే ఆహూర, మజ్ద ఈయనే. ఈయనే విశ్వానికి అధిదేవత. ప్రపంచానికి మధ్య వర్తిగా వ్యవహరిస్తాడు. దుష్టశక్తి అయిన "ఆహ్రిమన్ "వ్యతిరేకం గా మిత్రుడు అజ్మార్డ్ టో కలిసి రోజు పోరాడుతూనే ఉంటాడు.

చరిత్రకారుడు ప్లూటార్క్ చెప్పిన దాన్నిబట్టి క్రీ.పూ. 68లో పాంపే చక్ర వర్తి సైలీశియా నుంచి సముద్ర చోరులైన ఖైదీ లచేత ఈ మిత్ర మతం రోమ్ దేశం లో ప్రవేశించింది. రోమన్ సైనికుల ద్వారా, వర్తకుల ద్వారా, ప్రచారకుల ద్వారా రోమ్ లో చాలా వేగం గా విస్తరించింది. రోమన్ చక్ర

వర్తులు కూడా మిత్ర పూజ చేశారు. బ్రిటన్ లో రోమన్ కేధలిక్కులు ప్రవేశించిన చోట్ల మిత్రమతం నాశనం చెందింది. ఈ మిత్ర మతం క్రీ.శ, 275 నుండి క్షీణత ప్రారంభమైంది. నాల్గవ శతాబ్దం లో మిత్ర మతాన్ని నిషేధించే శారు. దానితో పూర్తిగా అణగారి పోయింది. దీనిస్థానం లో క్రైస్తవం వేరూనింది.

ఆ నాడున్న అన్ని రహస్య మతాల లాగానే "ఒక దివ్య వివేకం" తమకు ఉందని, మిత్రాయిజం చెబుతోంది. ఈశ్వరుని తో ఐక్యం అవటం ద్వారా మోక్షం లేక అమృతత్వం సాధించాలని మిత్రుల అభి భాషణం. మిత్ర మతం లో నైతిక ప్రమాణాలు చాలా ముఖ్యమైనవి. ఈ మతం లో ఉన్న అనేక అంశాలు దీని తర్వాతా వచ్చిన "మాని "అనే మతం లో ప్రవేశించాయి



మిత్ర మతం లోని సూత్రాలు చాలా రహస్యాలు కొద్ది మంది ఆన్తరంగికులకే అవి తెలుసు కనుక పునర్నిర్మాణం అసాధ్యమైంది.. మొదటి ఆంగ్లానువాద పుస్తకం ఫ్రాంజ్ కామన్స్ రాసిన" texts and illustrationt illustrations monunuments of mystic mitra"అనేది1884 -1900 మధ్య ప్రచురింప బడింది. ప్రతి మిత్ర దేవాలయం లో ముఖ్య దేవుడు మిత్ర "తారోక్తని "అనే పవిత్ర వృషభాన్ని చంపుతున్న మూర్తి ఉంటుంది. ఈ వృషభం ఖగోళ రహస్యం గా భావిస్తారు. దీనితో బాటు ఒక సర్పం ఒక శునకం ఒక మాల కాకి కూడా విగ్రహ రూపం లో దర్శన మిస్తాయి. ఇవన్నీ నక్షత్ర గణాలకు చెందినవని అనుకొంటారు. ఒక్కొక్క దేవాలయం లో నలభై మందికే ప్రవేశం. మిత్ర శ్రేణిలో నాలుగు సోపానాలున్నాయి అందులో మూడు అందరు చేరుకో వచ్చు ఆధ్యాత్మిక ఉన్నతికివి సోపానాలు. చివరిది.కష్ట సాధ్యం. ఇందులో ఉన్న ఏడు రాంకుల క్రమం –మాల కాకి, కన్య, సైనికుడు, సింహం, పెర్సేస్, సూర్య వార్తాహరుడు, తండ్రి.



ఇటలీ లో శిధిల మిత్రాలయం

## భారతీ తీర్ధులు

ఆది శంకరా చార్యుల వారి తర్వాతా అద్వైత మత వ్యాప్తికి అధిక కృషి చేసిన వాడు భారతీ తీర్ధులు. మాధవ, విద్యారన్యుల సమకాలికుడు. వీరిద్దరి కంటే వయసులో పెద్ద వాడు. విద్యారన్యులు అనే బిరుదనామం మాధవాచార్యులకు భారతీ తీర్ధులకుఇద్దరికీ వర్తిస్తుంది. 1386 శాసనాన్ని బట్టి భారతీ తీర్ధులకు విద్యా తీర్ధులు గురువు అని తెలుస్తోంది. భారతీ తీర్ధులు మాధవ, విద్యారణ్యు లిద్దరికీ గురువే. మాధవ, భారతీ తీర్ధులిద్దరు అద్వైత పండితులే. విజయ నగర రాజుల తో సన్నిహిత సంబంధం ఉన్న వారుకూడా.

## విద్యాతీర్ధ స్వామి వారి శిష్యులు భారతీ తీర్ధులు, విద్యారన్యులు



భారతీ తీర్థుల కాలం పద్నాలుగో శతాబ్దం. శృంగేరి పీఠాన్ని అది రోహించటం లో మాధవ, విద్యారన్యులిద్దరికంటే భారతీ తీర్థులు ముందు వాడు.శాంకరాద్వైతాన్ని వ్యాఖ్యానించటం లో అద్వితీయ ప్రతిభా సంపన్నుడు భారతీ తీర్థ. విజయ నగర రాజుల చేత సన్మానింప బడిన వాడు. తీర్థ రాసిన "పంచదశి "అద్వైత సంప్రదాయం లో శాశ్వత స్థానాన్ని పొందింది. ఈయన రాసిన "వివరణ ప్రమేయ సంగ్రహం "కూడా ఉత్తమమైనదిగా పేర్కొంటారు. "దృక్ దృశ్య వివేకం "అనే వీరి రచన పరమోత్కృష్ట మైంది.

భారతీ తీర్థ 1333-1380 కాలం వాడు ఆంధ్ర దేశం లో ఏకశిలా నగరం అయిన ఓరుగల్ అనే వరంగల్ లో జన్మించాడు పూర్వాశ్రమం లో విద్యారన్యుల తమ్ముడు. గురువైన విద్యా తీర్థుల తర్వాతా పదకొండవ శృంగేరి పీఠాదిపతి అయి నలభై ఏడేళ్ళు పీఠాదిపత్యం లో ఉన్నాడు ఆయన కాలం చారిత్రాత్మక మైనదిగా పేర్కొంటారు. శ్రీ ఆది శంకరా చార్యులు మంచి గాంధపు శారదా విగ్రహాన్ని శృంగేరి లో ఏర్పరిస్తే భారతీ తీర్థ స్వర్ణ విగ్రహం చేయించి ప్రతిష్టించారు ఆలయాన్ని మఠాన్ని అభి వృద్ధి చేశాడు సామాన్యుల కోసం మఠాన్ని విస్తృత పరచాడు. విజయ నగర రాజుల కాలం లో విద్యా శంకరాలయం నిర్మాణం జరిపించాడు హరిహర రాయమహారాజు తన తమ్ముడు మారెప్పను అల్లుడుబాలప్పను శృంగేరి పంపించి ఆశ్రమపోషణకు అయిదు గ్రామాలు దానం గా ఇప్పించాడు. అంటే కాదు భారతీ తీర్థకు సేవకులుగా నలభై మంది బ్రాహ్మణ పరి చారకుల్ని నియమించాడు

భారతీ తీర్థులు 120 మంది వేద పండితులకు రాజు తన కిచ్చిన దానిలో భూములనిచ్చి వారి పోషణకు సాయ పడ్డాడు. దీంతోనే శృంగేరి గ్రామ నిర్మాణం ప్రారంభ మైంది వేదాలలో, శాస్త్రాలలో అపార పాండిత్యాన్ని చూపిన వారికి బిరుదులిచ్చి సత్కరించటం భారతీ తీర్థ కాలం లోనే ప్రారంభ మైంది

अज्ञानां जाह्नवी तीर्थं विद्यातीर्थं विवेकिनाम् ।

सर्वेषां सुखदं तीर्थं भारतीतीर्थमाश्रये ॥

*That Ganga which is the sin-removing refuge to the ignorant, That esoteric knowledge that is the refuge sought by the wise, That refuge which is good for all who seek Bliss, Unto that Bharati Tirtha, I bow!*

ఇది భారతీ తీర్థ స్వామిగూర్చిన ప్రస్తుతి. "పవిత్ర గంగా జలం అజ్ఞానులపాప ప్రక్షాళన నం చేస్తుంది ఆశ్రయిస్తే మహాజ్ఞానాన్నిజ్ఞానులు ప్రసాదిస్తారు. బ్రహ్మానందాన్ని, ఆశ్రయించిన వారికందరికీ మంచిని ప్రసాదించే శ్రీ భారతీ తీర్థులకు ప్రణామం " అని భావం

ఉపనిషత్తులలో చెప్పినట్లు బ్రహ్మం, దాని స్వభావాన్ని బాహ్య, అభ్యంతారాలకు అంటే ఆబ్జెక్టివ్ అండ్ సబ్జెక్టివ మెథడ్ లరెండిటిని సమన్వయ పరచి బోధించాడు భారతీ తీర్థ. తన పంచ దశి లో "పంచ మహా భూతం "అనే అధ్యాయం లో బాహ్య ప్రపంచాన్నుంచి బ్రహ్మాన్ని ఎలా వేరు చేయ వచ్చో సవివరం గా తెలిపాడు. "పంచకోశ వివేకం "అనే మూడవ అధ్యాయం లో పంచకోశాల నుండి ఆత్మను వేరు చేసి చూపించాడు ఇది ధాన్యం నుండి పై పొట్టు ను తీసే విధానం లాంటిది.

జీవుడు, ఈశ్వరుడు ఇద్దరు ప్రపంచ సృష్టికర్తలు అని భారతీర్థ అన్నాడు ఇందులో ఈశ్వరుడు ముఖ్య కర్త. జీవుడు ఆయనకు లోబడి పని చేసే వాడు. ప్రపంచ స్తితికి మాత్రం ఆధారం ఈశ్వరుడే. ప్రపంచానుభ వాలకు మాత్రం జీవుడు ఆశ్రయుడు గా ఉంటాడు. జీవుడి సృష్టి బాహ్య ప్రపంచం కాదు. అంతర భావనా ప్రపంచమే నంటాడు తీర్థ. "వివరణ ప్రమేయ సంగ్రహం "లో ప్రతి బింబ వాదాన్ని తీసుకొచ్చి వివరణ కోరే వారికి సంతృప్తి కలిగించాడు. కాని పంచ దశిలో ప్రతి బింబ వాదం లో ఒకటైన "ఆభాస వాదం "ను అంగీకరించి, వివరణ కారుని దృష్టిలో బింబం కంటే వేరే కాదని సత్యమైన అభాసం అని తేల్చాడు. అంటేభ్రాంతి అని చెప్పాడు. మాయకు, అవిద్య కు భేదాన్ని చెప్పకుండా వివరణ కారుని సిద్ధాంతాన్ని అనుసరించి పంచ దశిలో ఈ రెండిటిని వేరు పరచి చూపించాడు.

వేదాంత విచారం చేత లభించే జ్ఞానం ఒక్కటే ముక్తికి సాధనం అని స్పష్టం చేశాడు. శ్రీ కృష్ణ. భగవానుడు చెప్పిన సాంఖ్యం, యోగం రెండిటిలో ఏదైనా ఒకటి ముక్తికి సాధనం అవుతుందని పంచదశి లో వివరించాడు.

## మ(మా )ని మతం (Manicheism )

మని లేక మానికేయన్ అనే పర్షియన్ మత ప్రవక్త క్రేపూ.216 -276 బోధించిన మత వ్యవస్తనే మని లేక మానికా మతం అంటారు. దీన్ని "జ్ఞాన మతం "అనీ పిలుస్తారు. ఈ మత సిద్ధాంతాలలో జ్ఞాన, క్రైస్తవ బౌద్ధ, జోరాస్ట్రియన్ మత భావనలన్నీ ఉన్నాయి. క్రీ.పూ.మూడో శతాబ్దం లో పుట్టిన ఈ మతం అనేక పశ్చిమ, తూర్పు దేశాలలో విపరీతం గా వ్యాప్తి చెందింది. చివరికి క్రైస్తవం దీన్ని మింగేసింది.



మని అనేది గ్రీకు పేరు దీనికి లాటిన్ లో సమాన పదం మానికేయన్. మానికేయన్ సంపన్న ఉన్నత కుటుంబం లో జన్మించాడు తండ్రి దగ్గరే విద్య నేర్చాడు. ఆనాటికి ప్రచారం లో ఉన్న మిత్ర మతాన్ని క్రైస్తవాన్ని, పెర్షియా దేశ మతమయిన మజ్దాను కూలంక షం గా అధ్యయనం చేసి ఆకళింపు చేసుకొన్నాడు అయన ఇరవై ఏళ్ళ వయస్సు లో ఈ కొత్తమతాన్ని స్తాపించాడు. క్రీ.శ 241కాలపు పర్షియా రాజు షాపూర్ పట్టాభిషేకానికి ఈ మతాన్ని ప్రత్యేకం గా బోధించాడు భారత దేశం కూడా వచ్చాడని ప్రచారం లో ఉంది.. కాని బహ్రేన్ రాజు ఇతన్ని మాజ్దా మత పూజార్లకు అప్పగించాడు. బ్రతికి ఉండగానే మానికేయన్ చర్మాన్ని ఒలిచి అతి క్రూరం గా చంపేశారు వాళ్ళు



మానికేయన్ తనకు దివ్య సాక్షాత్కారం కలిగిందని, ప్రపంచ మత ప్రవక్తలలో తానే చివరి వాడినని చెప్పుకొన్నాడు. బుద్ధుడు జోరాస్టర్, యేసు క్రీస్తు కూడా ప్రవక్త లే అన్నాడు తను ఈ లోకానికి "శాంతి దూత "గా వచ్చానని తెలియ జేశాడు.

మని మత సిద్ధాంతాలు –ఇది పూర్తిగా ద్వైత మతం. ఆయన దృష్టిలో భౌతిక నైతిక విషయాలలో భేదం లేదు.. కాంతికి, చీకటికి మధ్య గొప్ప సంఘర్షణ ఉంది. అలాగే సంఘర్షణ పుణ్య, పాపాల మధ్యా ఉంది. జ్ఞానం అన్నా విమోచనం అన్నా చీకటి లోంచి వెలుగుకు ప్రస్తానం. తమస్సులోనుంది వచ్చిన వాటినన్నిటిని వదిలెయ్యాలి. కాంతి లోకం నుండి వచ్చిన అన్ని విషయాలను ప్రోత్సహించి, వాటినే అనుసరించాలి. కాంతి లోకం దేవుడి అధీనం లో ఉంది. తమోలోకానికి అధిపతి "సైతాను ".ఈ రెండు లోకాల మధ్యా మొదటి నుంచి సంఘర్షణ ఉంది. ఒక సారి సైతాన్ కాంతి లోకం పైకి దండెత్తినప్పుడు కాంతి దేవత మొదటి మానవుడిని సృష్టించి సైతాను తో పోరాటానికి పంపింది సైతానే శక్తి వంతుడై మనిషిని నిర్బంధించాడు. కొత్త దేవతల సహాయం తో కాంతి దేవతయే సైతానుతో పోరాడి మొదటి మానవుడిని విడి పించిందని వీరి సిద్ధాంతం.

పదమూడవ శతాబ్దం లో దొరికిన మని గ్రంథ భాగం



మొదటి మానవుడంటే "ఆదాము ".ఇతన్ని సైతాను లాగానే సృష్టించాడు. కాని బలమైన కాంతి రేఖ ఉన్న వాడు ఆడం కు తోడుగా సైతాన్" అవ్వ" అంటే ఈవ్ ను ఇచ్చాడట. వీరి కామం వల్లనే మానవ జాతి ఆవిర్భవించింది. రాక్షసులు కామం తో, భ్రాంతితో, ప్రలోభాలతో మానవుల్ని హింసించారు. అప్పుడు కాంతి దేవత ప్రవక్త లను భూమి మీదకు పంపి, మానవులకు వారి స్వభావాన్ని గురించి, ప్రకృతి గురించి సరైన జ్ఞానాన్నిచ్చి విముక్తికోసం సహాయ పడతారు.

ఈ మతం లో పురోహితులు మాత్రం చాలా కఠిన మైన నియమాలను పాటించాలి. సాధారణ మానవులు అహింస, విగ్రహారాధన, అబద్ధం, వ్యభిచారాలను దురాశలను వదిలితే చాలు. మని మతం "ప్రోబాస్ "చక్ర వర్తి కాలం లో క్రీ.శ.280 లో రోమన్ సామ్రాజ్యం లో ప్రవేశించింది. దాదాపు మూడు వందల ఏళ్ళు సువ్యవస్తితం గా నిలిచి ఉంది అక్కడ. తర్వాత వచ్చిన రోమన్ చక్ర వర్తులు మని మతానికి వ్యతి రేకం గా శాసనాలు చేశారు. మధ్య యుగం వచ్చేసరికి కొత్త దారులు చూసుకొని క్షీణించి పోయింది

మని సిద్ధాంత గ్రంధాలు చాలా ఉన్నా చివరికి కొన్ని భాగాలు మాత్రమె అదీ అనువాద రూపం లో లభించాయి చైనా దేశం లోను ఈ మతం బానే వ్యాపించింది మని సిరియానిక్ లిపి ని కానీ పెట్టాడని భావిస్తారు మన వినాయకుడు ఈ మతం లో ప్రవేశించాడు మనికేయన్ కుషాన్ సామ్రాజ్యం లో పర్యతిన్చాడని చెబుతారు పాప్ మితియాదిస్ కాలం లో ఈ మతం రోమ్ లో బాగా ఉండేది. రోమన్ చక్ర వర్తి తియోదాస్ మానికేయులను చంపేయమని క్రీ.ష.382 లో క్రైస్తవ మతాన్ని రాజ మతం గా ప్రకటించే ముందు ఆజ్ఞా జారీ చేశాడు

## భాస్కరా చార్యులు

భాస్కరా చార్యులకే భాస్కర రాయుడు, భాసురానందుడు అనే పేర్లున్నాయి తండ్రి గంభీర రాయ దీక్షితులు. తల్లి కోనాంబా దేవి. వీరిది మహా రాష్ట్ర దేశం. కాశీ వెళ్లి విద్య నేర్చిన భాస్కరుడు తంజావూర్ చేరి కావేరీ తీరం లో "తిరువేలంగాడు "లో ఉన్నాడు. అక్కడ గంగాధర వాజ పేయి అనే పండితుడి వద్ద శాస్త్రాలు నేర్చాడు. శ్రీ విద్యోపాసకులలో భాస్కరుడు ప్రసిద్ధుడు.



భాస్కరా చార్యులు బ్రహ్మ సూత్రాలకు భాష్యం రాశాడు సేతు బంధం అనే గ్రంధం లో వామకేశ్వర తంత్రం లోని నిత్య షోడశికార్నవానికి వ్యాఖ్యానం చేశాడు పరశురామ కల్ప సూత్రం పై "రత్నాలోకం "అనే వ్యాఖ్యాన గ్రంధం రచించాడు. దుర్గా సప్త శతి పై "గుప్త వతి "అనే వ్యాఖ్యానం రాశాడు భాస్కరుడు క్రీ.శ,.తొమ్మిదో శతాబ్ది వాడని వాచస్పతిమిశ్రుడికి పూర్వం, శంకరాచార్యుల తరువాతి వాడు అని భావిస్తారు. సూత్ర భాష్యాన్ని తొమ్మిదో శతాబ్దం మొదటి భాగం లో రచించాడని తెలుస్తోంది వాచస్పతి మిశ్రుడు భాస్కరాచార్యులను తన గ్రంధాలలో ఉదాహరించాడు. శంకరులను తీవ్రం గా విమర్శించాడు ఆచార్యుడు.

శ్రుతుల మీదా, బ్రహ్మ సూత్రాల మీద ఇతరులు చేసిన వ్యాఖ్యానాల నన్నిటిని భాస్కరుడు ఖండించి తన ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించాడు. మహా యానం లోని శూన్య వాదమే మాయా వాదం అంటాడు భాస్కరుడు. భేదాన్ని అభేదాన్ని గుర్తించే భేదా భేద వాదాన్ని యితడు చెప్పాడు. బ్రహ్మమే ఈ విశ్వం లో పరిణమించాడని భావించాడు. ముక్తికి జ్ఞానం, కర్మా రెండు సాధనలాలె అని గట్టిగా చెప్పాడు.. . జీవన్ముక్తిని అంగీకరించలేదు. విదేహ ముక్తినే అంగీక రించాడు.

పరిపూర్ణం, అఖండం అయిన పరబ్రహ్మం భాస్కర మతం లో అపరిమితం, పరిమితం, అఖండం ఖండం కూడా అవుతుందని చెప్పాడు. ఏక ఉపాధి ఉన్న బ్రాహ్మం అనేక ఉపాధులను గ్రహించి పరిచ్చిన్నం అవుతాడని అన్నాడు. ఈ సిద్ధాంతం శంకర, రామానుజ మతాలకు

మధ్యస్తం గా ఉంది. శంకరుడు చెప్పిన మాయా వాదాన్ని విమర్శించటానికే భాస్కరుడు తన దర్శనాన్ని ఉపయోగించాడు మాయా వాదం మహా యానం లో నుంచి వచ్చింది అంటాడు అందుకని విచ్చిన్న మూలం అన్నాడు. ఈ భేదా భేద వాదమే భాస్కర మతానికి భూమిక. బ్రహ్మం నిరుపాధికం, సోపాధికం,. ప్రపంచం చేతనా చేతన విభాగానికి అర్ధమైంది అంటాడు. బ్రహ్మకు జీవలోకం లో సంబంధం లో ఈ భేదం అనేది ఔపాదికమే. అభేదం అనేది స్వాభావిక మైంది అన్నాడు



యాదవ మతం లో బ్రహ్మకు భేదం అభేదం స్వాభావికాలే. కానీ భాస్కర మతం లో చిత్తూ, అచిత్తురెండు బ్రహ్మం యొక్క వాస్తవిక పరిణామాలే. శంకరుడు చెప్పినట్లు మాయ యొక్క లీల కాదు. భేదం లో అభేద లక్షణం కూడా కలిసి ఉందన్నాడు ఆచార్య భాస్కరుడు. దీనికి ఉదాహరణతరంగాలు సముద్రం కంటే భిన్నాలే కాక అభిన్నాలు కూడా అన్నాడు. సముద్ర శక్తి నుంచే తరంగాలు పుట్టాయి. కనుక ఒకే సముద్రం దాని శక్తి వ్యక్తీకరాలు అయిన తరంగాలకంటే భిన్నం గా కన్పించినా, శక్తికి శక్తి జనకానికి అభిన్నం. అందువల్ల ఇది భేదం కాదు అభేదం కూడా కాదని సమర్ధించాడు. మాయా వాదం లో జీవాత్మ అవిద్య తో కూడిన పరమాత్మ యొక్క ఆభాసమే. రామానుజుడు జీవాత్మను బ్రహ్మం శరీరం గ, భావించాడు. ఈ రెండు మతాలను కాదని జీవుడికి బ్రహ్మానికి భాస్కరుడు అంశ, అమ్మిత్వాలను కల్పించాడు. అనంత శక్తి స్వరూపుడైన బ్రహ్మం ఉపాధిని తీసుకొని, జీవాత్మగా మారుతాడ న్నాడు. ఉపాధి స్వీకారం వల్ల బ్రహ్మం కర్మ బద్ధుడు అవుతాడు. ఈ కర్మ అంటే అంతం లేని కార్యాచరణమే. ఇదిలేక పోయినా దీనికి అంతం ఉంది జీవుడు సాదన క్రమం లో సంసారాన్ని అవగాహన చేసుకొన్నప్పుడు ఉపాధి నశిస్తుందని చెప్పాడు భాస్కరా చార్యుడు బ్రహ్మం అంటే ఏమిటో, ఉపాధి అంటే ఏమిటో తెలుసుకోలేని జీవుడు సంసార లంపటం లో పడతాడు అని తన వేదాంతం లో భాస్కరాచార్యులు చెప్పాడు



భాస్కరా చార్యను. 1554-1594 కాలం వాడైన అప్పయ్య దీక్షితులు ప్రశంపించాడు 1677-1750 వాడైన నాగోజి భట్టఅనే వ్యాకరణ పండితుని ను భాస్కరుడు తన "గుప్తావతి "గ్రంధం లో ప్రస్తుతించాడు వీటన్నిటి వల్ల భాస్కరుడి కాలం 1670 అని తేల్చారు భాస్కరుడు సోమయజ్ఞాన్ని జ్యోతిస్తోమాన్నిచేశాడు. కాశీనుండి వచ్చి కొంతకాలం కృష్ణా నదీ తీరం లో ఉండి కావేరీ తీరానికి చేరాడు తంజావూర్ మహా రాజు కావేరి దక్షిణ తీరం లో "భాస్కర రాజ నగరం "అనే అగ్రహారాన్ని ఆచార్యులకు రాసిచ్చాడు

చంద్ర సేన రాజు కు ఒక నపుంసక కుమారుడు జన్మించాడని అతన్ని ఎలా అయినా పురుషుడి గా మార్చమని రాజు ఆచార్య పాదాలను ఆశ్రయించాడు ఆయన కృష్ణా నదీ తీరం లో రోజు ఆ కుర్రాడితో కలిసి సూర్య దేవుడికి "త్రిచరర్ఘ్య ప్రదానం"చేశాడు ఆయన నివాసం నదికి దూరం గా ఉంది అందుకని రోజు ఎంతో దూరం నడిచి వచ్చి అర్ఘ్యప్రదానం చేసే వాడు. కాళ్ళు పుండ్లు పడ్డాయి శిష్యులు భరించలేక ఏడుస్తున్నారు. అప్పుడు ఆచార్యుడు సూర్య దేవుడిని తన శిష్యుల సంతృప్తి కోసం నదీ ప్రవాహాన్ని తన ఇంటి దగ్గరకు త్రిప్పమని ప్రార్ధించాడు భాస్కరుడు ఈ భాస్కరుని ప్రార్ధన మన్నించి కృష్ణా ప్రవాహ దిశను ఇంటికి దగ్గరగా వచ్చేట్లు చేశాడు దానితో ఆ నీటి ప్రవాహం లో తడిసిన రాజు కొడుకు నపుంసకత్వం నశించి పురుష రూపం వచ్చిందట. ఇవీ భాస్కర మహిమలు

## బెర్నార్డ్ బోజం కెట్ (Bosanquet Bernrd )

1848 లో జులై పద్నాలుగున జన్మించిన బెర్నార్డ్ బోజం కెట్ హెగెల్ సంప్రదాయానికి చెందిన "కేవల భౌతిక వాది ఇంగ్లాండ్ లో "(ఆబ్సల్యూట్ ఐడియ లిస్టు).హారో లో ఆక్స్ ఫర్డ్ కాలేజి లో విద్య నేర్చాడు సెయింట్ ఆండ్రూస్ యూని వర్సిటి లో నైతిక, దర్శనా చార్యుడు గా పని చేశాడు. ఆక్స్ ఫర్డ్ లో ఫెలో అయ్యాడు. మొదటి పుస్తకం "అతీనియాన్ కాంస్టి ట్యూషన్ హిస్టరీ హిస్టరికి "అనువాద గ్రంధం లండన్ ఎథికల్ సొసైటీ,

చారిటి ఆర్గా నైజేషన్ సొసైటీ, లండన్ స్కూల్ ఆఫ్ ఎథిక్స్ అండ్ సోషల్ ఫిలాసఫీ లకు అపార సేవలందించాడు. "దిఫిలసాఫికల్ దీరీ ఆఫ్ స్టేట్ అండ్ సైకాలజీ ఆఫ్ మోరల్ సెల్ఫ్ "గ్రంధాన్ని రచించాడు "అరిస్తాతిలియాన్ సొసైటీ కి ఉపాధ్యక్షుడు గా అధ్యక్షుడు గా పని చేశాడు. ఎడిన్ బర్గ్ యూని వర్సిటి లో "జిఫార్డ్ లెక్చర్లు "ఇచ్చి వాటిని పుస్తకం గా ముద్రించాడు



1849 ఈయన దృష్టిలో సత్యం ఏకమే. ఈ ఏకమైనది సర్వ వ్యాపకమే కాక, సంపూర్ణంగా హేతు బద్ధ అనుభవమే. ఇదే సామాన్యాన్ని, విశేషాన్ని సంఘటితం చేస్తుంది. దీనికి మాత్రమె అస్తిత్వం ఉంది, మిగిలిన మనస్సులు, వ్యక్తులు, వస్తువులు ఆంశిక వ్యక్తిత్వం కలవి. ఆంశిక విశేషత్వం, ఆంశిక సత్యాన్ని కలిగి ఉండేవి అంటాడు బెర్నార్డ్

లోపల ఉన్న చైతన్యం ఎక్కడి నుంచో వచ్చినదీ, అసంపూర్ణం, అస్వతంత్రం, ఆమ్శికమైన వ్యక్తిత్వం కలిగింది అని అభిప్రాయ పడ్డాడు ఈ చై తన్యం యొక్క ప్రవృత్తులు ఇంద్రియానుభవాలు, ఆలోచన, నైతికాచరణ, సౌందర్య సంధానం మొదలైన వన్నీ ఒక ఉదార, ఉదాత్త లక్ష్యాన్నివెతుక్కొంటూ అందుకొని, దాన్ని పొందే ప్రయత్నం లో మనకు కనీ పిస్తున్నాయని చెప్పాడు. ఆత్మా తన కన్న ఉదాత్తమైన మరొక వస్తువు కు తనను తాను త్యాగం చేసుకోవటమే ఆత్మ పరి పూర్ణతను సాధిస్తుందని నమ్మాడు. బోజం కేట్ దృష్టిలో ఈ విశ్వం అంతా ఒక నాటకమే ఇది ఆబ్సల్యూట్ అనే "కేవలం "చేత రచించ బడింది. ఈ జగత్తు అనే రంగాస్థలం మీద ప్రదర్శింప బడుతు ఉన్నది ఈ కేవలం అనేది కళాకారుడు, హేతువు తోకూడిన బోధ (ఇంటలిజెన్స్)మాత్రమే. ఈ బోధ యొక్క తాత్పర్యం కేవలం నాటక అభినయమే కాకుండా ఆత్మ ప్రకటనం కూడా అవుతుంది అంతేకాదు తెలుసుకో దగిన సత్యం యొక్క ఏకత్వాన్ని గోచరింప జేస్తున్దంటాడు బెర్నార్డ్., 75 ఏళ్ళు జీవించి1923 లో ఫిబ్రవరి ఎనిమిదిన బెర్నార్డ్ బోజంకెట్ ఇహ లోక యాత్ర చాలించాడు. "బ్రిటిష్ ఫిలాసఫీకి ఆ తరానికి కేంద్ర బిందు'వు' గా బెర్నార్డ్ ను భావిస్తారు

ఆయన రాసిన గ్రంధాలు అపూర్వ మైనవి. వాటి వివరాలు చూద్దాం

***Knowledge and Reality, A Criticism of Mr. F. H. Bradley's 'Principles of Logic'.* London: Kegan Paul, Trench, 1885.**
***Logic, or the Morphology of Knowledge*. Oxford: Clarendon Press, 1888. 2d ed., 1911.**
***Essays and Addresses*. London, Swan Sonnenschein, 1889.**
***A History of Aesthetic*, London: Swan Sonnenschein, 1892. 2d ed., 1904.**
***The Civilization of Christendom and Other Studies.* London: Swan Sonnenschein, 1893.**
***The Essentials of Logic: Being Ten Lectures on Judgement and Inference.* London and New York: Macmillan, 1895.**
***Aspects of the Social Problem*, London, 1895.**
***A Companion to Plato's Republic for English Readers: Being a Commentary adapted to Davies and Vaughan's Translation*. New York/London, 1895.**
***The Philosophical Theory of the State*, London, 1899; 4th ed., 1923.**
***Psychology of the Moral Self*, London and New York: Macmillan, 1897.**
***The Principle of Individuality and Value. The Gifford Lectures for 1911 delivered in Edinburgh University*. London: Macmillan, 1912.**
***The Value and Destiny of the Individual. The Gifford Lectures for 1912 delivered in Edinburgh University.* London: Macmillan, 1913.**
***The Distinction Between Mind and its Objects. The Adamson Lecture for 1913 with an Appendix.* Manchester: University Press, 1913**
***Three Lectures on Aesthetic*, London: Macmillan, 1915.**
***Social and International Ideals: Being Studies in Patriotism*, London: Macmillan, 1917.**
***Some Suggestions in Ethics*, London: Macmillan, 1918; 2nd ed. 1919.**

*Implication and Linear Inference*, London: Macmillan, 1920.
*What Religion Is*, London: Macmillan, 1920.
*The Meeting of Extremes in Contemporary Philosophy*. London: Macmillan, 1921.
*Three Chapters on the Nature of Mind*, London: Macmillan, 1923.
*Science and Philosophy and Other Essays by the Late Bernard Bosanquet*, (ed. J.H. Muirhead and R.C. Bosanquet), London, Allen and Unwin, 1927.

## బెర్గ్ సన్

హెన్రి  బెర్గ్ సన్ ఫ్రెంచ్ దార్శనికుడు. ఫ్రెంచ్ వారిపై అమిత ప్రభావం కలిగిన వాడు. 1859 లో అక్టోబర్ పద్దెనిమిది న జన్మించాడు. ఈయన భావాలు విలియం జేమ్స్ ద్వారా అమెరికా చేరి బహుళ వ్యాప్తి చెందాయి, చివరి రోజులో చరిత్ర అధ్యాయం తో గడిపాడు. ఆ యన చెప్పిన వాటిపై ఈతరం దార్శనికులు అధికం గా ఆకర్షితులవుతున్డటం బెర్గ్ సన్ ప్ర త్యేకత.,



బెర్గ్ సన్ ద్రుష్టి లో అంతరజ్ఞానమే నిజమైన దర్శనానికి మూలం. సత్యం అనేది ఏక మైన సృష్టి కార్యం గా అన్నిటా గోచరిస్తుంది. దీనినే “ఎలాన్ వైటల్”అంటే సర్జనాత్మక శక్తి అన్నాడు. ఇదే ప్రాణశక్తి,  ఈ శక్తి ద్రవ్యం కలిగించే నిరోధాన్ని, అవకాశం యొక్క కదలని తనాన్ని ప్రతిఘటిస్తూ అనేక అనుభవ రూపాలు దాలుస్తు, భౌతిక ద్రవ్యం నుండి జీవానికి, అక్కడి నుండి మానవుడి కి అక్కడనుండి ఇంకా పైకి వ్యాపిస్తుంది. ఇది ఆత్మ వైవిధ్య ప్రక్రియ. దీనిలో ఏకత్వం ఎప్పుడూ ఉంటూనే ఉంది. ఈ ఏకత్వం నుంచే భేదాలు ఏర్పడతాయి. పైన చెప్పిన పురోగతి ఈ భేదాలను ధరించటమే కాకుండా, వాటికి అభిన్నం గా కూడా ఉంటుంది. ఈ విషయాలన్నీ బెర్గ్ సన్ నాలుగు మహా గ్రంధాలలో నిక్షిప్తం చేశాడు. అవే లేడాన్నీల్ ఇమ్మేడిఎట్స్ డిలా కాన్షస్ (చైతన్యనికి ప్రత్యక్షం గా ఉన్న అంశాలు ),మేటి యర్ యెట్ మేమ్వారి (భౌతిక ద్రవ్యం స్మృతి ),రివల్యూషన్ క్రియార్తిర్స్ (సర్గాత్మక పరిణామం ),లేడోయ్ సోర్స్ర్సేస్ డి లా మొరాలిటి యెట్ రేలిజియాన్ (నీతి, మతాల ప్రాదుర్భావం ) ఇవి కాక పత్రికల్లో రాసిన వాటినీ పుస్తాకాలుగా ముద్రించాడు అందులో లేనర్జి స్పిరి త్యువల్(ప్రాణ శక్తి )డ్యూరియెట్ సైమల్తేనిటి (అవధి అనెవి ఉన్నాయి

దానీజ్ అనే గ్రంధం లో శుద్ధమైన కాల ప్రవాహాన్ని కాలం గాను, భావాన్ని మనో ద్రవ్యం గాను, తి భౌతిక సత్యం గాను చెప్పాడు.. కాలప్రవాహం మానసిక మైనది అన్నాడు నిర్విరామం గా వేరు వేరు విధాలుగా ప్రవహిస్తుంది. ఎప్పుడూ మార్పులు చెందుతూ ఉంటుంది. మన ప్రక్రియలు దాన్ని భేదించి ముక్కలుగా మనకు కనపడేట్లు చేస్తుంది. ఇది కాలానికి ఆచలత్వానికి సాపేక్షం. విస్తృతి అనే దానికి చలనం ఉండదు. దిక్ బిందువులు ఒకే విధం గా ఉంటాయి. అందులో ప్రతిదీ మిగిలిన వాటికి వెలుపలగాను ఒక దాన్ని అనుసరించి ఒకటి ఉంటాయి. నిజమైన కాలానికి విస్తృతి లేదు. సంకుచితమైంది. తర్వాతి లక్షణాలు ముందున్న వాటితో కలిసి పోయి ప్రతి క్షణం కొత్తది గా కనీ పిస్తుంది. భూత, వర్తమాన భవిష్యత్ కాలాల క్రమం అంతా ఒక అవిభక్తమైన ప్రవ్రుత్తి —యాక్టివిటి)

మనం కాలాన్ని శాస్త్రీయ, పారిశ్రామిక కాలం గా మార్చేశాం అంటారు బెర్గ్ సన్).అపరిచ్ఛేద్య వస్తువులకు పరిచ్ఛేద్యాన్ని ఆరోపించటం వల్లనే భాష, తర్కం భౌతిక శాస్త్రం వగైరా గా మారాయి. సజీవ కాలం స్వతంత్రం, ఉత్పాదకం, అనిర్దేశ్యం అన్నాడు మన పండితుడు. దీనికి ఎన్నో ఉదాహరణల్ని “ద్రవ్యం స్మృతి “లో చెప్పాడు శరీరం ఆత్మ చేత కల్పించ బడిన ఒక సాధనం అన్నాడు ఆత్మ అంటే కాలం యొక్క పూర్తీ ప్రవాహమే. మన మస్తిష్కం ప్రోద్బలన కర్త గా ఉంటుంది. ప్రవృత్తిని చేబట్టని వాటిని దాచేస్తుంది దీనినే శుద్ధ స్మృతి అన్నాడు. ఇదే మన ఆత్మల మూలం అంటాడు యాక్షన్ కనపడని భూతాంశాలలో ఒక దాన్ని స్వయం గా ఎన్ను కొంటుంది. నానాత్వాన్ని గ్రహించే ప్రాణ శక్తి తానూ విడి పోకుండా అయస్కాంతం లాగా భిన్న ధ్రువాలను ఏర్పరుస్తుంది. చలనం కళ భౌతిక ద్రవ్యం క్రమం గా క్షీణించి చలన శూన్యత గా మారిపోతుంది. ఈ విషయాన్ని “సర్గాత్మక పరిణామం “లో చెప్పాడు.

వృక్షాలు మనష్యులు ఒక దాని నొకటి తిని బతుకుతాయి. "గతం తం యొక్క రెండు ఉద్భవ స్థానాలు "లో మనిషి ప్రతీతుల్ని మనుష్య సంవర్గానికి అన్వయించాడు ఈ దివ్య ప్రాణ శక్తి మానవుడిలో భౌతిక ద్రవ్యత్వ బంధనాలను చేదించుకొని స్వేచ్చ పొందింది. ఇలాచేయటం వల్ల పరిణామం ఏర్పడి మానవ బుద్ధి, మనుష్యుడు మిగిలి ఉన్నారంటాడు. ప్రాణ శక్తి కి ఆటంకం కలిగితే సంఘం లో సంక్షోభం వస్తుందన్నాడు. కొందరు మహాను భావులు ఈ దివ్య శక్తిని సాధించుకొని మానవుల్ని రాక్షిస్తారు. త్యాగం, శీలం లను బోధించి నైతిక మార్గాన్ని అవలంబించేట్లు దారి చూపిస్తారు ప్రస్తుత మన నాగరకత ఇలాంటి సంక్షోభ స్థితిలోనే ఉందని గట్టిగా చెప్పాడు అచల సంవృత స్థితి, చల విస్తృత స్థితి లలో ఒక దాన్ని ఎన్నుకోవాల్సిన సమయం వచ్చిందని హెచ్చరిస్తాడు బెర్గ్ సన్.1941 lలోజనవరి నాలుగున ఎనభై రెండేళ్ళ వయసులో బెర్గ్ సన్ దార్శనికుడు మహా ప్రస్థానం చెందాడు

బెర్గ్ సన్ 1927 లో నోబుల్ పురస్కారాన్ని అందుకొన్నాడు ఫ్రాన్స్ దేశపు అత్యున్నత అవార్డు"గ్రాండ్ క్రోకస్ డి లా లీజియన్ డీ ఆనర్ " అందుకొన్న ఘనుడు. ఆయన రాసిన కాంటి నెంటల్ ఫిలాసఫీ, ఫ్రెంచ్ స్పిరిట్యులిజం గ్రంధాలు బహుళ ప్రచారం పొందాయి.

## కబీర్

భక్తకవి కబీర్ శ్రేష్ట సత్పురుషుడు.. తలిదండ్రులెవరో తెలియదు. కాని పుట్టింది1398 లో జ్యేష్ట శుద్ధ పూర్ణిమ సోమవారం నాడు అని అంటారు., మహమ్మదీయ దంపతులు కబీర్ ను పెంచారని అంటారు ఆయన చేనేత వృత్తి కి చెందినా వాడు., కాశి లో కబీర్ జన్మించాడు. కబీర్ అంటే ఆరబిక్ లో కబీర్అంటే గొప్ప వాడు అని అర్ధం ఇస్లాం మతం లో 37 వ దేవుడి పేరు కబీర్. వివాహం చేసుకొని కొడుకును కన్నాడు రామానంద స్వామి తన గురువు అని కబీర్ అన్నాడు. గురువు "రామ"మంత్రాన్ని కబీర్ కు బోధించాడు. కబీర్ సంప్రదాయం ఆందరికీ అందుబాటులో ఉంటుంది. ఆయన భక్తులు పది లక్షలకు పైగా ప్రపంచం అంతా వ్యాపించి ఉన్నారు.. కబీర్ బీజక్ కబీర్ గ్రంధావళి,అనురాగ సాగర్ పుస్తకాలు కబీర్ రాశాడు అవధి బోజ్పురి, వ్రాజ్ మాండలికాలలో తత్వాలు రాశాడు సంత్ మత్, రాదాస్వామి గబీర్ దాస్ లపై కబీర్ ప్రభావం ఉంది. ఆయన కవితల్ని బాణీలు లేక బోధలు అంటారు రెండు పంక్తులుండే వీటిని" కబీర్ దోహాలు"అంటారు. దులో కబీర్ గంభీర వేదాంత భావాలు సూటిగా మనసుకు హత్తుకోనేట్లు చెప్పటం అయన ప్రతిభకు నిదర్శనం. ఇవి ముఖతా చెప్పినవే పరంపర గా తర తరాలుగా వ్యాప్తి చెందాయి సూఫీ మతం లో మొదటి ప్రార్ధాన కబీర్ కవిత్వం తో నే ప్రారంభమవుతుంది గృహస్తుగా సంత్ గా కబీర్ సమర్ధ జీవితాన్ని గడిపాడు. కబీర్ భగత్ ను సిక్కుల అయిదవ మతగురువు అర్జున్ సిక్కు మత గ్రంధం గ్రంధ సాహెబ్ లోచేర్పించాడు.. కబీర్ 1518 లో నూట ఇరవై ఏళ్ళు జీవించి మఘార్ లో మరణించాడు



కబీర్ పరమాత్మను అన్ని నామాలతో భజించిన మహా భక్త శిఖా మణి.అందులో న్రామ నామం అంటే మహా ప్రీతీ ఆయనకు అందువల్ల ముస్లిం మత పెద్దల ఆగ్రహానికి ఈర్ష్యకు గురి కావాల్సి వచ్చింది. సికందర్ లోడి భక్త కబీర్ ను చాలా బాధలు పెట్టాడని చరిత్ర చెబుతోంది. కబీర్ కు అల్లా, విష్ణు, కృష్ణ, గోవింద, ఖుదా, రామ నామాలన్నీ నిర్గుణ పరబ్రహ్మను సూచిన్చేమంత్రాలే నని నమ్మాడు. కబీర్ కొలిచే రాముడు పేదా తీతుడైన, త్రిలోకాలకు విలక్షణుడైన కేవల పరమాత్మ తత్వమే.

భక్తిని పారమార్ధిక సాధనం గా కబీర్ ఎంచుకొన్నాడు. మన లని భగవంతుడి తో కలిపే హృదయం దొరకటం ఒక మహా రహస్యం అన్నాడు కబీర్. దీనినే ఆయన" భావ ", భేద "పేర్లతో పిలిచాడు. అందుకే తన మార్గాన్ని "భావ భగతి "అంటే భావ భక్తి అన్నాడు. దీన్ని వర్ణించటం అసాధ్యం అన్నాడు. అదొక అనుభవైక వేద్య విధానం అని చెప్పాడు సద్గురు కటాక్షం వల్లనే ఇది సాధ్యం అన్నాడు. అప్పుడే జ్ఞాన నేత్రం వికశించి

మనలో దాగి ఉన్న రహస్యం మనకు తెలుస్తుంది అంటాడు. భగవంతుని పై జిజ్ఞాస, ఆయన ముఖ వీక్షణ అభిలాష తీవ్రం గా మనలో రగుల్కొని ఈశ్వరుడొక్కడే ఏకైక ప్రియ తముడై, ఆయన విరహం తాళ లేనంత అయినప్పుడే భాగవత్సాక్షాత్కారం లభిస్తుందని కబీర్ చెప్పాడు.



కబీర్ చెప్పిన భావా భక్తీ కి మస్శుద్ధి, మనస్సు యొక్క సంయమనం, అవసరాలు. అన్ని భౌతిక విషయాలు వదిలేసి చివరికి దేనిలో ప్రవేశించాలో ఆ మనస్సు ను మనం వెతుక్కోవాలి. అదే "ఆకల్ నిరంజన్" అంటే నిరంజన బుద్ధి. అని కబీరు వర్ణించాడు. ఈ నిరంజన బుద్ధి ఎక్కడో లేదు మన మనసులోనే ఉందన్నాడు. మనసు నిర్వికారం గా ఉన్నప్పుడు అది స్వచ్ఛమైన అద్దం లాగా శుద్ధమైనప్పుడు అది నిరంజన బుద్ధి లో ప్రవేశిస్తుంది. అప్పుడే మన మనస్సులో రహస్యమైన శాశ్వత పర వస్తువు ప్రతి బిమ్బిస్తుంది. అదే "అపా ",బ్రహ్మం ",రాముడు "అందుకే ఈ ప్రాప్తి సాధ్యమవుతుంది దీనినే ఆ ప్రాప్తి సాధనాన్ని "ఆత్మ సాధన ",బ్రహ్మ విచారం "రామ నామ సిద్ధి యోగం "అన్నాడు.

భావం అనేది షట్చక్రాల బంగారు భవనం లో ఉంది. దాని తాళం విప్పి లోపలి ప్రవేశించి నప్పుడే షట్చక్ర చేదనం జరిగి అది తెలుస్తుంది. పరం జ్యోతి సహస్రారం లో దర్శనం అయినప్పుడు "హద్దు "హద్దు లేనిది "అవుతుంది అంటాడు కబీర్. "ఘట " ముందే "అఘటం కనిపిస్తుంది. ఇదే అనంత బ్రహ్మ యొక్క అసంఖ్యాక సూర్య సమానం అయి, శీతల తేజస్సు, దాని వర్ణన కుదరదు. ఆ స్తితి ప్రాప్తించి నప్పుడు కల్పనలనేవి ఉండవు. మనస్సు పోయి, అమనస్కత ఏర్పడుతుంది. ఈ కర్మ వల్ల కర్మ నాశనం అయి మమత్వం అభిమానాలు బ్రహ్మాగ్ని చేత భస్మం అవుతాయి. ఈ అవస్తనే కబీర్ "సహజ సమాధి "అన్నాడు. గురువు వల్లే ఇది లభిస్తుందని చెప్పాడు దీనికోసం ఆసనం ముద్రా, అక్కర్లేదు. వాసనా త్యాగం మనో నిరోధం వల్ల "సురటి "ని అరికట్టాలి. అప్పుడే సహజ సమాధి వీలు అవుతుంది. అనాది నుండి వచ్చిన వాసనాదుల వల్ల కలిగే ప్రపంచ దృశ్యాల స్పురణమే "సురటి " లేదా సంసారం.

హిందూ, మహమ్మదీయ మతాలలో ఒకే పరమ సత్యం ఉందని నమ్మి దాన్ని వ్యక్తం చేయటానికి ప్రయత్నించాడు. కబీర్ ది ఒక రకం గా "అద్వైత సాక్షాత్కార వాదం "కబీర్ పై హఠ యోగుల ప్రభావం ఉంది.కుల భేదాలను లెక్క చేయలేదు కబీర్. అందరికి సన్నిహితుడైన ఒకే ఈశ్వరుడి గూర్చి ప్రజలకు దేశ భాషలో బోధించైనా ప్రజా భక్త కవి కబీర్.,.

## రవీంద్ర నాథటాగూర్



విశ్వకవి గా, గీతాంజలి కర్త గా అనేక కదా, నవలా, నాటక రచయితగా శాంతి నికేతన్ సంస్తాపకుడుగా, రవీంద్ర సంగీత కర్త గా, గాయకుడుగా,చిత్రకారుని గా రవీంద్ర నాధ 'టాగూర్ ప్రముఖ స్తానం పొందాడు. ఆయన దార్శనికుడు కూడా తండ్రి దేవేంద్ర నాద టాగూర్ కుమారుడు. కలకత్తాలో 1861 లో మే ఏడున జన్మించాడు నిత్యం ఉపనిషత్ మంత్రం ఘోష ఉన్న కుటుంబం వారిది. చిన్న నాడే వంగ దేశ వైష్ణవ భక్తీ గీతాలకు ఆకర్షితుడయ్యాడు. వివాహం అయిన తర్వాత ఇంట్లోనే పదేళ్ళ పాటు ఉన్నాడు. తోట పని వారితో, బ్రహ్మ జ్ఞాన చింతనతో, విశ్వ సౌభ్రాత్వపు భావనలతో ఉండి పోయాడు. ఇవే ఆయన దార్శనిక సూత్రాలకు మూలాలయ్యాయి. గీతాంజలి కవిత్వానికి1931 లో నోబెల్ పురస్కారాన్ని సాహిత్యం లో పొందిన మొదటిభారత దేశపు కవి టాగూర్. మొదటి నాన్ యూరోపియన్ కవికూడా. బెంగాలీ చిత్ర కళను బంధాల నుండి విముక్తి చేసి స్వేచ్చా చిత్ర కల గా ఘనత టాగూర్ దే.మన జాతీయ గీతం జన గణ మన బంగ్లా దేశ గీతం "సోనార్ బంగ్లా "లను రాసి న వాడు రవి కవియే. ఎన్నో సాహిత్య వ్యాసాలనూ సాదికారికం

గా రాశాడు అయన రాసిన" కాబూలీ వాలా "కద, చండాలిక నాటకం, నౌకా భంగం నవల ప్రసిద్ధి చెందాయి శరత్ టాగూర్ ను తన గురువు అన్నాడు

1900-1- కాలం లో శాంతి నికేత విద్యా సంస్థను స్థాపించి కళలను, సాహిత్య చిత్రలేఖన నృత్యాలను బోధించాడు ఆ తర్వాత అది విశ్వ భారతి గా రూపు దాల్చింది. ఇప్పుడువిశ్వ విద్యాలయమై కేంద్ర ప్రభుత్వ అధీనం లో నడుస్తోంది. సాధన,, క్రియేటివ్ యూనిటి, మానవత్వం వ్యక్తిత్వం లను రవీంద్రుడు ఆధారం గా చేసుకొని దర్శన భావాలను వ్యాప్తి చేశాడు. కవిత్వానికి దార్శనిక సూత్రాలకు సంబంధం కల్పించాడు.

రవీంద్ర మతం వైష్ణవ వేదాంతానికి దగ్గరలో ఉంటుంది. పరమార్ధం పురుష రూపం లో ఉంది అదే మానవ కృత దైవం. అదియే పురుషోత్తముడు "నిరవధికం అవదీకృతం అయితే పరమార్ధం పురుషార్ధం అవుతుందని టాగూర్ చెప్పాడు. సృష్టి కార్యోన్ముఖం అయితే పురుషార్ధం పురుషం అవుతుందని అన్నాడు. అమూర్తాన్ని కేవలం అంటే ఆబ్సల్యూట్ ను కాదన లేదు. పురుష విధానం లో ఆలోచించి నప్పుడే కేవలం మానవ బోధకు అందుతుంది అన్నాడు టాగూర్.

అద్వైతాన్ని అంగీకరించి, దేవుడొక్కడే అన్నాడు. సావధిక సత్తా నిరవదిక సత్తా పేక్షం అవుతుంది. కేవలం తో ఏక మవటమే సావదికాత్మ యొక్క పరమ లక్ష్యం అంటాడు. టాగూర్ చెప్పిన ఐక్యతకు శంకరుడు చెప్పిన అద్వైత ఐక్యతకు భేదం ఉంది. జీవాత్మ తనకు తాను నిరవ శేషంగా పరమాత్మకు అర్పించుకోవటమే టాగూర్ చెప్పిన ఐక్యత. అహం లేక పోతే ప్రేమ ఎలా ?ఇదొక్కటే ఉంటె ప్రేమ యెట్లా సాధ్యం ?అని సాధన లో వివరించాడు ఆత్మ అన్నిటి కంటే ఎక్కువ ప్రేమాస్పదమైంది. ఆత్మ స్వరూపాన్నే సర్వ ప్రేమాస్పదం గా ఉపాశించేది. ఈ ప్రేమ బాహ్యమైంది, మరణ శీల మైంది అన్న బృహదారన్యకానికి ఆనందానికి, ప్రేమకు వ్యాఖ్యానాన్ని కల్పించి జ్ఞానం కంటే ప్రేమయే బ్రహ్మ ప్రాప్తికి సాధకం అవుతుందని రవీంద్రుడు వివరించాడు. "సాపరాను రిక్త రీశ్వ రే "అనే శాండిల్య మహర్షి సూత్రర్ధాన్ని అనుసరించి ఈశ్వరుని పై ఉన్న పరమ ప్రేమయే భక్తీ అని చెప్పాడు. అలాంటి భక్తీ అహేతుక, వ్యవహితమూ అయినప్పుడు ప్రేమ అవుతుంది అని గట్టిగా చెప్పాడు. ప్రేమ, భక్తీ అనర్ధాన్తరాలు. జ్ఞానం విషయి విషయ తేడాను పాటిస్తుంది. ఈ తేడా లేక పోతే జ్ఞానం రావటం అసంభవం అన్నాడు విశ్వ కవి. ప్రేమ లక్ష్యం ఐక్యత. ఇందులో విషయి విషయ వ్యత్యాసం అంత రించి పోతుంది. కాని ప్రేమ జ్ఞానం తో పొందేది కాదు అన్నాడు

. వాల్మీకి నాటక భాగం"నీస్" ఇందిరా దేవి తో టాగూర్

ఈశ్వరుని తెలుసుకోవాలంటే ఆనందమే, ప్రేమయే మార్గాలు. ఆనందం జ్ఞానం యొక్క స్ఫూర్తి అంటాడు. బుద్ధి మనల్ని జ్ఞేయ విషయాలనుండి వేరు చేస్తున్దన్నాడు. ప్రేమ విషయాన్ని ఏకీకరణం వల్లనే తెలుసుకో గలం, అలాంటి జ్ఞానం అపరోక్షం. అనుమానానికి చోటు ఇవ్వదు. అని ప్రేమ రహస్యాన్ని సంపూర్ణం గా ఆవిష్కరించాడు విశ్వకవి రవికవి జ్ఞాని టాగూర్.

"మరుగున పడిన మతాలు –మతా చార్యులు "సమాప్తం..

ఈ ధారా వాహిక కు కావలసిన ముఖ్య విషయాలన్నిటిని "వీకీ పీడియా "నుండి" విజ్ఞాన సర్వస్వం" నుండి గ్రహించానని సవినయం గా మనవి చేస్తున్నాను. మొదటి ఎపిసోడ్ లో చెప్పినట్లు నేను అందించింది ఆవగింజంత మాత్రమె, దీన్ని ఆధారం గా ఆ మహనీయులను గుర్తు చేయటానికి మాత్రమె. కావలసిన వారు ఇంకా లోతుగా తెలుసుకొంటారనే నా భావన

## జ్యోతిర్మఠపీఠాధిపతి-స్వామి బ్రహ్మానంద సరస్వతి

20-12-18 6 8 న జన్మించిన రాజారావు సన్యాసి అయి 15 0ఏళ్ళు ఖాళీగా ఉన్న ఉత్తర భారత దేశంలోని బదరీ క్షేత్రానికి దగ్గరలో ఉన్న జ్యోతిర్మఠఉత్తర ఆమ్నాయ పీఠాధి అవటం వింతయిన కధ.
అయోధ్య దగ్గర గణ గ్రామంలో "మిశ్ర "అనే బ్రాహ్మణ కుటుంబం లో రాజా రావు పేరుతో జన్మించి, ఆధ్యాత్మిక భావ లహరిలో మునిగి తేలుతూమహా యోగి రాజు అని పించుకొని, మన ఆది శంకరాచార్యులవలె 9 వ ఏట తగిన గురువును అన్వేషిస్తూ ఇల్లు వదిలి పెట్టి వెళ్ళాడు. కాని ఒక పోలీసు గుర్తుపట్టి ఇంటికి తీసుకు వచ్చి అప్పగించాడు, తనకు గృహస్తాశ్రమం లో ఇష్టం లేదని సన్యసించాలని ఉందని చెప్పాడు. పెళ్లి చేసుకోమంటే వద్దన్నాడు. ఇంటి పురోహితుని అడిగారు ఆయన కుర్రాడి యోగ జ్ఞానానికి అబ్బుర పడి అతని ఇష్టం ప్రకారమే చేయమని సలహా ఇచ్చాడు తలిదండ్రులకూ కొడుకు రాజారాం ఆధ్యాత్మిక బలం అర్ధమై సరేనన్నారు. రెండు రోజులతర్వాత ఎవరికీ చెప్పకుండా ఇల్లు వదిలి తపస్సుకోసం హిమాలయాలకు వెళ్ళాడు., సరైన గురువుకోసం అణ్వేషిస్తూ ఎందరినో చూసి వారెవ్వరూ తన ఆధ్యాత్మిక దాహం తీర్చే సమర్దులుకారని నిర్ణయించుకున్నాడు. హరిద్వార్ రుశీ కేష్ లకు వెళ్ళాడు. 14 వ ఏట ఉత్తర కాశిలో స్వామి కృష్ణానంద సరస్వతిని దర్శించి

ఆయనే తాగిన గురువని శిష్యుడయ్యాడు. ఆయన "బ్రహ్మ చైతన్య బ్రహ్మ చారి "అనే పేరుపెట్టాడు రాజా రామ్ కు. గురువు చెప్పినట్లు సాధన చేస్తూ ప్రక్కనే ఉన్న గుహలో తపస్సు చేసి వారానికి ఒక్క సారిమాత్రమే గురు దర్శనం చేసేవాడు. 25 వ ఏట గుహ నుండి బయటికి వచ్చి గురువుగారి ఆశ్రమం లో ఉండి పోయాడు. 34 వ ఏట కుంభ మేళ సమయం లో గురువు శిష్యునికి సన్యాస దీక్షనిచ్చి స్వామి బ్రహ్మానంద సరస్వతి అనే దీక్షా నామం ఇచ్చాడు. ఇక్కడి నుంచి మధ్య భారతం చేరి ఒక గుహలో ఏకాంతం గా తపోధ్యానాలతో 40 ఏళ్ళు ఉన్నాడు.

7 0 వ ఏట, అనేక విద్యావంతులు బ్రహ్మానంద ను అప్పటికి 150 సంవత్సరాలుగా తగిన పీఠాధిపతి దొరకకక ఖాళీగా ఉన్న జ్యోతిర్మఠ పీఠాదిపత్యం వహించటానికి ఆయనే సర్వ సమర్ధుడు అని అందరూ



అనేకసార్లు కోరగా సరే నని "మీరు అరణ్యం లో స్వేచ్ఛగా తిరిగే సింహాన్ని బంధిస్తున్నారు. మీ రందరి ఇష్టం ప్రకారంమీ మాటలను గౌరవించి పీఠాదిపత్యాన్ని స్వీకరించి ఆది శంకరా చార్యుల అడుగు జాడలలో నడుస్తాను "అన్నాడు దీనికి ముఖ్య ప్రేరకుడు కరపత్ర స్వామి. నియమించే "ధర్మ మహా మండలి ' ఎంతో సంతోషంగా ఆహ్వానించింది /19 41 ఏప్రిల్ 1 న పీఠాదిపత్య విధానం అంతా వారణాశి పండితులు, పూరీ శంకరాచార్య శ్రీ శ్రీ భారతీ కృష్ణ తీర్ధ, శృంగేరి శంకరాచార్యులు శ్రీ చంద్ర శేఖర భారతి స్వాముల సమక్షం లో మహా వైభవంగా నిర్వహించారు. గర్వాల్, వారణాసి, దర్భంగా మహా రాజులు ఎందరెందరో మత ప్రముఖులు హాజరయ్యారు. వేదం లో చెప్పబడిన సర్వ లక్షణ సంశోభితుడు స్వామి బ్రహ్మానంద సరస్వతి అని అందరూ శ్లాఘించారు.



బ్రహ్మానంద సరస్వతి మొదటి సారిగా జ్యోతిర్మఠాన్ని పునర్నిర్మించాడు. ఆప్రాంతమంతా స్థానికుల ఆక్రమణలో ఉంటె స్థానిక డిప్యూటీ కమీషనర్ స్థానిక పెద్దల సహకారం తో ఖాళీ చేయించి 30 గదులతో రెండస్తుల భవన నిర్మాణం చేసి "జ్యోతిర్మఠ పీఠ భవనం "అని పేరు పెట్టాడు. దీనికి వంద గజాల దూరం లో దర్భంగా మహా రాజు మొదలు పెట్టిన "పూర్ణ గిరి దేవి "దేవాలయాన్ని బ్రహ్మానంద పూర్తీ చేయించాడు. సంప్రదాయ అద్వైత మత ప్రచారానికి ఉత్తర భారతం లో జ్యోతిర్మఠం అతి ముఖ్యమైన గొప్ప కేంద్రం. జ్యోతిర్మఠ శంకరాచార్యునిగా ఉత్తర భారత దేశమంతా పర్యటించి ప్రబోధాత్మక ప్రసంగాలతో శంకరాద్వైత భావ వ్యాప్తి చేశాడు మహర్షి మహేష్ యోగి కరపత్రి స్వామి, స్వామి స్వరూపానంద సరస్వతి, స్వామి శాంతానంద సరస్వతి మొదలైన వారు బ్రహ్మానంద సరస్వతి ముఖ్య శిష్యులు. భారత ప్రధమ రాష్ట్ర పతి డా బాబూ రాజేంద్ర ప్రసాద్, ఫిలసాఫికల్ ప్రెసిడెంట్ సర్వేపల్లి రాధాకృష్ణన్ బ్రహ్మానంద సరస్వతిని దర్శించి ఆశీర్వాదాలు పొందారు. రాదా కృష్ణన్ "మూరీ భవించిన వేదాంతం సత్య స్వరూపం స్వామి బ్రహ్మానంద సరస్వతి "అన్నారు. 19 53లో 8 5 వ ఏట బ్రహ్మైక్యం చెందటానికి 5 నెలల ముందు స్వామి బ్రహ్మానంద వీలునామా రాసి తన తదనంతర పీఠాదిపతి స్వామి శాంతానంద సరస్వతి అని పేర్కొన్నాడు.

స్వామి బ్రహ్మానంద గొప్ప శ్రీ చక్ర ఉపాసకుడు ఆయన వద్ద అరుదైన రూబీ శ్రీ చక్రం ఉండేది. ఆయన పీఠాదిపత్యకాలం లో ఎందరెందరో రాజులు ధనికులు ఆశ్రమానికి వచ్చి విలువైనకానుకలు సమర్పించేవారు. మంత్ర దీక్ష స్వీకరించేవారు. ఈ ధన సంపద పీఠ ఆధ్యాత్మిక కార్య క్రమాలకు సద్వినియోగమయ్యేది. "మహర్షి మహేష్ యోగి 20 08లో "మహేష్ యోగి ట్రస్ట్ "ఏర్పరచి బ్రహ్మానంద సరస్వతి పేరుతో దేశంలోని 30 వేల వేద పండితుల కు ఆసరా కలిపించి గురు ఋణం తీర్చుకున్నాడు. కారణ జన్ముడు స్వామి బ్రహ్మానంద సరస్వతి శంకరాచార్య.

## శ్రీ జగ్గీ వాసుదేవ్

శ్రీ సద్గురు వాసు దేవ్ ను అందరు" జగ్గీ వాసుదేవ్" అని, ఆప్యాయం గా పిలుచు కొంటారు. అసలు పేరు జగదీశ్. అదే జగ్గీ అయింది. జగత్తుకు నాయ కత్వం వహించే లక్షణాలు ఆయన లో ఉన్నందుకే ఆ పేరు పెట్టారట, ఆయన 3-9-1957 సుశీలా, డాక్టర్ వాసు దేవ్అనే తెలుగు

దంపతులకు కర్నాటక లోని మైసూర్ లో జన్మించారు. చిన్నప్పుడే గురువు" మల్లాది హళ్లి రాఘు వేంద్ర స్వామి" వద్ద యోగాభ్యాసం నేర్చారు. అప్పటి నుండి అది ఆయనకు నిత్య కృత్యమైంది. మైసూర్ వర్సిటి లోఇంగ్లీష లిటరేచర్ లోడిగ్రీ సాధించారు. మోటారు సైకిల్ పై దేశమంతటా పర్య టించారు. కారునడప గలరు. ఆయనకు రాని విద్య లేదు. ఆయన మైసూర్లోని చాముండీ హిల్ పై ఒక రాతి మీద కూర్చుని తీవ్ర ధ్యానం లో నిమగ్నమయారు. 23-9-1982 వారికి అకస్మాత్తుగా దివ్య దర్శనం అయి, జ్ఞానోదయం అయింది. మంచి యోగా కేంద్రాన్ని స్థాపించ మని గురువు ఆదేశించారాయన్ను. తగిన స్థలం కోసం తీవ్రం గా గాలించారు. చివరకు తమిళ్ నాడు లోని కోయంబత్తూర్ కు నలభై కిలో మీటర్ల దూరం లో ప్రశాంత వాతా వరణం లో 'వెళ్ళిం గిరిమౌంటేన్" వద్ద మంచి ప్రదేశం లభించింది. అక్కడ ఒక ఆశ్రమాన్ని నిర్మించి, యోగా ను నేర్పుతున్నారు ".ఈశా ఫౌండేషన్ " ను స్థాపించి ఎన్నో సేవా కార్య క్రమాలను నిర్వ హిస్తున్నారు. "ఈశా "అంటే ఆయన "నిర్గుణ పర బ్రహ్మ "అని అర్ధం చెప్పారు. ఇక్కడే" యోగిక్ టెంపుల్" ను నిర్మించి ధ్యానానికి కేంద్ర బిందువు గా "ధ్యాన లింగాన్ని" ప్రతిష్టించారు. అక్కడ అన దారు యే భేదం లేకుండా ధ్యానం చేసుకో వచ్చు. సర్వ జన సన్నిహితుడు ఆయన. ఆ కేంద్రం లో అన్నీ నేర్పుతారు. అయన కు అన్ని ఆటలు వచ్చు. హాకీ కూడా ఆడతారు. తమిళ్ నాడు, కర్నాటక రాష్ట్రా లలో తరచు భారీ "సత్సంగాలు "నిర్వ హిస్తారు. ఆయనకు ఆరు ఖండాలలో, అనేక దేశాలలో శిష్య పరంపర ఉంది. , పర్యటనలు చేస్తూ వారిని ఉత్తేజితులను చేస్తూంటారు.



" ప్రముఖ భారతీయుడు" గా అనేక పత్రికలనిర్వ హించిన అభిప్రాయాలలో స్థానం సంపాదించారు. ఆయన అంత గా భారీ కార్య క్రమాలను నిర్వ హించిన వారు అరుదు. క్రిందటి ఏడాది మద్రాస్ లో "ఆనంద్ అలై"(A wave of Bliss) అనే పేరున " భారీ సత్సంగ్ ను నిర్వ హిస్తే, లక్షా యాభై వేల మంది పాల్గొని,"న భూతో "అని పించారు. ఆయన చాలా సాధారణం గా ఉంటారు. ముఖం లో ది వ్య తేజస్సు వెలుగుతూ ఉంటుంది. చక్కని గడ్డం,.. జుట్టుకు, గడ్డానికి రంగులు వేసుకోరు. ప్రాచీన మహర్షి ఆయన లో దర్శనమిస్తారు. ఈశా ఫౌండేషన్ గిన్నీస్ బుక్ రికార్డు సాధించింది. తమిళ్ నాడు లో ఆయన ఆధ్వర్యం లో ఒకే రోజు 80,000మొక్కలు 27జిల్లాలలో నాటి, రికార్డు సృష్టించారు. ఆ సంస్థ గ్రామీణ ఆర్ధిక విధానాన్ని, ఆధునిక అభి వృద్ధి మార్గాలు చేబట్టింది. ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేసి నిర్వ హిస్తోంది. సంచార విద్యాలయాల ద్వారా 4,200గ్రామాలకు సేవ లందిస్తున్నారు. వీటి వల్ల 70 లక్షల మంది వైద్య సదు పాయాన్ని పొందుతున్నారు. అమెరికా లోని టెన్నిసీ రాష్ట్రం లో కంబర్లాండ్ లో mc Minvilleలో 1200ఎకరాల స్థలం లో "isha institute of inner sciences "2006 లో నిర్మించి, సేవ లందిస్తున్నారు. ప్రపంచ శాంతి, సుహృద్భావం, సమాజ పరి రక్షణ, అందరికి విద్యా, ఆరోగ్యం, సాంకేతిక వినియోగం, స్త్రీ విద్యా, శిశు సంరక్షణ కోసం అవి రళ కృషి చేస్తున్నారు. ఏది బోధించినా తేలిక మాటలతో హృదయం లో నిలిచి పోయే టట్లు చేసే శక్తి సద్గురువు లది. వారి వాసుదేవ వాణి ని విందాం,

### సద్గురు వాసు దేవ వాణి

మాన వాళి కేవలం జీవించటం అనేదాన్ని అధిగ మించింది. ప్రతి మనిషి లో మేధస్సు ఉంది. దాన్ని తెలుసుకొని సాధన లోకి తెచ్చు కోవాలి. దాన్ని తిండికో, విలాస జీవితానికో, ధన సంపాదనకో ఖర్చు పెడితే ప్రయోజనం లేదు. మనిషి మానసిక పరిస్తితిని వృద్ధి చెందిచాలి. సమానత్వం అనేది" ఒకే రకం గా ఉండటం "అను కొంటె పొర బాటే. అలా అయితే రెండో వారి అవసరం లేదు కదా. సమానత్వం అంటే సమాన అవకాశాలు. నువ్వు ఇష్ట పడే వ్యక్తీ నీతో సమానం కాదు. అతనెప్పుడూ నీ కంటే పైనే ఉంటాడు. మనం ఇవాళ విలువలను కోల్పోతున్నాం. అన్నీ డబ్బు, హోదా లతో ముడి పెడుతున్నాం. స్త్రీ కూడా సమానత్వాన్ని కోరుతోంది. అంటే పురుషుని తో సమానం గా సంపాదించాలని మాత్రమె భావించ రాదు. ఆమె కు గృహ బాధ్యతలుంటాయి. కుటుంబాన్ని ఉన్నత స్తితికి తీసుకు రావాలనే తపన ఆమె లో ఉంటుంది. సాంకేతికత పుణ్యమా అని మార్పు అనేది చాలా వేగ వంతం గా జరిగి పోతోంది.

ఈ నాటి చిన్న పిల్లలు ఆరు బయట స్తలాల్లో ఆడు కోవటం తక్కువ గా ఉంది. వాళ్ళు ఇప్పుడు" "గెలాక్సీల మధ్య" ఆడుకొంటున్నారు. అంటే కంప్యూటర్ లో ఆడుకొంటున్నారు. కృత్రిమ మ ఆటలు ఆడుతున్నారని అర్ధం. ఇరుగు పొరుగు వారితో ఆటలాడే తీరిక వారికి లేకుండా పోయింది. సాంకేతికత మనకు అన్నీ తెచ్చి అరచేతుల్లో పెడు తోంది. మరి సమస్య ఏమిటి ?ఉన్న ప్రతి దానితో మనమే సమస్యలను అనంతం గా సృష్టించు కొంటున్నాం. మనం వాడే సెల్, కంప్యూటర్ వగైరా లన్నీ మాన వ మెకానిజం కంటే గొప్పవేమీ కావని

గ్రహించాలి. మీరు చెప్పిన మాట మీ పిల్లలు వినటం లేదు అంటే, చెప్పే నైతిక విలువ ను మీరు కోల్పోయారు అని అర్ధం. అధికారం తో వారిని శాసించ లేము. నువ్వు వారి నుండి గౌరవం, మర్యాదా కోరు కొంటె అది "వేళా కోళం" అవుతుంది. వారికి అందు బాటులో ఉన్న వన్నీ తెలిసేట్లు చేయండి. సలహా ఇస్తున్నట్లు గా మీ రు చెప్పేది వాళ్లకు అని పించాలి. అప్పుడు వాళ్ళు వినటమే కాదు, ఏది ఎలా చేయాలని మిమ్మల్ని తరచు వచ్చి అడుగుతూ ఉంటారు. అప్పుడే మీరు చేప్పే దాని మీద వారికి గురి ఏర్పడుతుంది.

భగవద్గీత పై వ్యాఖ్యానం

భగవద్గీత అన్నది రాజకీయ బోధ కాదు. అది ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని బోధించేది అది రాజకీయమే అయితే కృష్ణుడు అందరికీ చెప్పే వాడు కదా.తన ఆత్యంత అంత రంగికుడైన అర్జునుడికి ఒక్కడికే ఎందుకు చెప్పాల్సి వచ్చింది ?భగవాన్ శ్రీ కృష్ణుడు అర్జునునికి గీత ను బోధించిన తర్వాతా36 ఏళ్ళు అర్జునుడు జీవించే ఉన్నాడు. కాని దాన్ని ఎవరికీ చెప్ప లేదే ?.అసలా విషయాన్ని ఎవరి వద్దా అతను ప్రస్తావనకు తీసుకు రాలేదే. అది నారా నారాయనులిద్దరి మధ్య ఉన్న రహస్య విషయం. బయటి నుంచి ఎవరూ వినను కూడా లేదు. అదంతా అతని స్వయం నిర్ణయం, అనుభవానికి సంబంధించిన విషయం. భగవద్గీత హిందువులకుమాత్రమే అనుకోవటం పోర బాటు. అది అందరిదీ. జ్యా అయిన న్యూటన్ గురుత్వాకర్షణసిద్ధాంతాన్ని కనీ పెట్టాడు కనుక అది యూదులకు మాత్రమె వర్తిస్తుందంటే వెర్రి తనం కాదా. సనాతన ధర్మం అంటే విశ్వ నిబంధన, చట్టం ధర్మం,న్యాయం. (యూని వరసల్ లా,).కృష్ణుడు బోధించి నప్పుడు ఆయన హిందువు అని అనుకో లేదు. ఆయనేమీ హిందూ మతాన్ని సృష్టించ లేదు. కృష్ణుడు గుర్తు చేసింది "స్వధర్మం "నే. స్వధర్మం అంటే హిందూ ధర్మం అని కాదు. స్వీయ మైన, వైయక్తిక మైన ధర్మం అని అర్ధం.. గీత ఒక చక్కని డిబేట్. సందేహాలకు సమాధానాలు. ఈ గ్రంధం ఇలా చెప్పింది, ఆ గ్రంధం అలా చెప్పింది అని శంకలు పనికి రావు. అవన్నీ చిన్న టాంకుల లో ఉన్న నీరు లాంటివి.. అసలు అనంత నీటి ప్రవాహమే వస్తే, వీటి ఉనికే ఉండదు కదా.

నేను చెబుతున్న వన్నీ, నేను అనుభవ పూర్వకం గా తెలుసుకోన్నవే. మీ స్వధర్మమే అన్నిటి కన్నా ఉన్నత మైనదీ, ఉత్తమ మైనది అని మర్చి పోరాదు. అంతశ్శో ధన చేసుకోండి. మిమ్మల్ని అప్పుడు మీరే నడి పించుకో గల సామర్ధ్యాన్ని పొంద గలుగుతారు. ముందుగా దానికి అర్హత సంపాదించాలి. అది ఎలా ఉంటుందంటే చిన్న పిల్లాడు ఐన్ స్టీన్ గారిE=mc 2సూత్రాన్ని బట్టీ పట్టి తనకు సాపేక్ష సిద్ధాంతం అర్ధం అయింది అని చెప్పటం లా ఉంటుంది. గీత లోని మాటలకు అర్ధ తాత్పర్యాలు తెలిసి నంత మాత్రం చేత గీత నీకు అవ గాహన అయి నట్లు కాదని తెలుసుకోవాలి. నీకు నీ స్వధర్మం -అంటే స్వీయ ధర్మం (లా ఆఫ్ ది సెల్ఫ్ )తెలియాలి అప్పుడే అది అర్ధము అయినట్లు.

టెక్నాలజీ నిన్నేమీ "నన్ను ఉపయోగించుకో "అని కోరటం లేదే. అది అందు బాటు లో ఉంది నువ్వుదాన్ని నీ సౌకర్యం కోసం వాడుకొంటున్నావు. ఇక్కడ సమస్య ఏమిటి అంటే -నీ శరీరం తో ఎలా పని చేయించుకోవాలి, నీ మెదడు మనసు లతో ఏవిధమైన పనులు చేయించు కోవాలో నీకు తెలియదు. అలాగే నీ భావోద్రేకాలను, నీ శరీర ధర్మాన్ని ఎలా నియంత్రించు కోవాలో తెలీని మూర్ఖత్వం లో ఉంటున్నావు. అందుకని నీ చుట్టూ ఉన్న ప్రతి దాని పైనా ఫిర్యాదులు చేస్తూండటం నీకు అలవాటై పోయింది. ఆధ్యాత్మికత్వం అంటే మింగుడు పాడనీ పదార్ధం అనుకొని పొర బడుతున్నావు. అవసరం వచ్చి నప్పుడు సాంకేతిక సహాయం తీసుకో. మిగిలిన కాలాని ధ్యానం లో గడుపు. అప్పుడు అంతా స్వచ్చం గా కనీ పిస్తుంది. టెక్నాలజీ ని వాడ వద్దని ఎవరూ చెప్పరు. అవసరానికే విని యోగించు. జీవితాన్ని అధ్యయనం, పరిశీలనా చేయాలి లేక పోతే బురద లో కూరుకు పోతాం. ఆన్ లైన్లో అన్నీ చేసుకో. ఇబ్బందేమీ లేదు.

ప్రపంచం లో అందరికీ అన్నీ చాలటం లేదని ఫిర్యాదు ఉంది. విషయాలను సమర్ధ వంతం గా పరిష్కరించే ఆలోచన చేయక పోవటమే లోపం. నువ్వు నిర్మించిన ఇంజనీరింగ్ వస్తువులను గురించి గొప్ప గా పొగుడు కొంటావు. కాని నీ లోని ఇంజనీరింగ్ శక్తిని గూర్చిన ధ్యాసే లేకుండా పోయింది. మేము ఇప్పుడు "ఈశా క్రి యా " అనే సులభ పద్ధతిని ఉచితం గా అందరికి అందిస్తున్నాం. ఇండియా లో దీని ని 12మిలియన్ల d.v.d.లనుచేసి పంచి పెట్టాం. అమెరికా లో కూడా వీటిని అందించే ఆలోచన లో ఉన్నాము. ఇది నెట్ లో లభించే టట్లు చేశాం. దాని ప్రకారం రోజుకు కేవలం 12 నిమిషాలు ధ్యానం చేస్తే చాలు. అదే మిమ్మల్ని సరైన మార్గం లో ఉంచు తుంది. ఇంకా ఎక్కువ సమయం కేటా ఇంచే అవకాశం ఉంటె అలానే చేయ వచ్చు. "మేము బిజీ, మాకు సమయం లేదు "అను కొనే వారికే ఈ "ఈశ క్రియ ".ఇది క్రియ అని ఎందుకు అన్నాము అంటే దీనిలో ఉండటం, శ్వాసించటం, వికసించటం (be, breatheand blossom )అనేవి ఉన్నాయి కనుక. దీన్ని అందరు హాయిగా తేలిగ్గా చేయగలరు చేస్తున్నారు ప్రయోజనం పొందుతున్నారు కూడా. ఇది సరైన మార్గం లో పడ టానికి అతి తేలికైన మార్గం గా రుజువైంది. హాయిగా,తీరిగ్గా కుర్చీ లో కూర్చుని చేయచ్చు. ధ్యానం మీద ధ్యాస పెట్టండి. అంతా చక చకా అదే జరిగి పోతుంది.స్విచ్ వేస్తె, బల్బు వెలిగి

కాన్తినిచ్చి నట్లు. అదే మీకు మార్గ దర్శకత్వం చేస్తుంది. ఇందులో తెలీనిది అంటూ ఏమీ ఉండదు. నష్ట పోవటం జరగదు. ఏమి చేయాలన్న సందేహాలే మీ దేహానికి రావు. ప్రతి క్షణం లోను మిమ్మల్ని ముందుకు దారి చూపి నడిపిస్తుంది.



The Githa song

" The hollow bamboo can turn the passing wind into a sweet song
one filled with its own sap will be mute and dumb
when all of creation laughs and sings
if the hum of life's sweet song has to be heard empty
Empty your self of your self
The sweetness, the melody, and the fragrance of the Divine Song shall be you
when you let yourself be absorbed in to the divine will "-

- Sadguru Vasu Deva

## కాశ్మీర్ సర్వజ్ఞ శారదా శక్తిపీఠ౦

ఆజాద్ కాశ్మీర్ లో నీలం నది ఒడ్డున శారదా గ్రామంలో శారదా దేవి శక్తిపీఠ ఆలయం ఉంది.. కాశ్మీర్ వేద వేదాంత శాస్త్ర విద్యలకు ప్రముఖ స్థానం అందుకే కాశ్మీర్ కు" శారదా దేశ౦ అని పేరు అక్కడ కొలువైయున్న సరస్వతీ మాత యే శారదాంబ. ఆమెను "కాశ్మీర పూర్వ వాసిని "అంటారు. కాశ్మీర ప్రజలు నిత్యం ఈ శక్తి పీఠాన్ని సందర్శించి "నమస్తే శారదా దేవీ కాశ్మీర పురవాసినీ -త్వం హం ప్రార్ధయే నిత్యం విద్యాదానం చ దేహిమే "అని భక్తితో స్తోత్రం చేస్తారు



14 వ శతాబ్దానికి ఈ ఆలయం చాలా సార్లు శిధిలమైంది. 19 వ శతాబ్దం లో కాశ్మీర్ రాజు మహారాజా గులాబీ సింగ్ ఈ ఆలయాన్ని చివరిసారిగా మరమ్మత్తులు చేశాడు. 1 948 లో ఇండియా పాకిస్తాన్ యుద్ధం ఈ ప్రాంతం లో జరిగి ఈ ప్రాంతం ఫస్తూ న్ "తె గల ఆక్రమణకు గురై వాళ్ళ అధీనం లో ఉండి పోయింది. తర్వాత ఇది పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్ వశం లో ఉన్నది. దీనికి తోడు 2005 లో జరిగిన అతిపెద్ద భూకంపం లో ఈ ప్రాంతం దేవాలయం చాలా శిధిలమైపోయింది అప్పటి నుంచి ఇది మరమ్మత్తులకు నోచుకోలేదు. పాకిస్తానీ హిందువులు అరుదుగా ఈ దేవాలయాన్ని సందర్శిస్తారు. దీనికంటే వాళ్ళు సింధు బలూచిస్తాన్ పంజాబ్ ప్రాంతాలను సందర్శించటానికి ఇష్టపడతారు. అందుకే "కటాస్ రాజ్ "దేవాలయానికిచ్చిన ప్రాధాన్యాన్ని పాక్ ప్రభుత్వం దీని పై చూపటం లేదు

సతీదేవి శరీర భాగాలు 51 ఎక్కడ పడ్డాయో అక్కడ శక్తి పీఠాలు కాలభైరవ దేవాలయాలు వెలసిన సంగతి మనకు తెలుసు ఇక్కడ అమ్మవారి కుడి చేయిపడి శారదా శక్తి పీఠ మైంది. 18 మహా శక్తిపీఠాలలో ఇదిఒకటి. ఇక్కడ విద్యా దేవతగా శక్తిని ఆరాధిస్తారు అందుకే శారదా పీఠం అయింది.

ఈ దేవాలయం బారాముల్లాకు 60 మైళ్ళు, ముజఫర్ బాద్ కు 40 మైళ్ళ దూరం లో నీలం లోయలో శారదా అనే కుగ్రామం లో ఉంది. ఇది "లైన్ ఆఫ్ కంట్రోల్ "కు వాయవ్య భాగం లో 16 మైళ్ళ దూరం లో ఉంది. ఒకప్పుడు ఈ ప్రాంతం సంస్కృత విద్య కు కాశ్మీరీ పండితులకు గొప్ప ఆవాసభూమి. హిందూ బౌద్ధాలు చక్కగా విలసిల్లిన భూమి. 1277-78 కాలపు జైనుల చారిత్రక గ్రంథం "ప్రభావక చరిత్ర "ప్రకారం ఇక్కడ భద్రపరచబడిన వ్యాకరణ గ్రంధాలను చదివి శ్వే తాంబర జైనుడైన హేమచంద్రా చార్య తన "సిద్ధాంత హేమ "వ్యాకరణ గ్రంధం రాశాడు. భగవద్రామా నుజా చార్యులు శ్రీరంగం నుంచి ఇక్కడికి వచ్చి ఇక్కడున్న బ్రహ్మ సూత్రాలపై బోధాయనుడు రాసిన వృత్తిని పరిశీలించి తాము" బ్రహ్మ సూత్ర భాష్యం"అనే "శ్రీ భాష్యం "రాశారు. శారదా దేవాలయం ప్రక్కన సంస్కృత విశ్వ విద్యాలయం ఉండేది క్రీశ 632 లో చైనా యాత్రికుడు హుయాన్ సాంగ్ దీన్ని సందర్శించి రెండేళ్లు అధ్యయనం లో గడిపి దీనికున్న చారిత్రిక సాంస్కృతిక వైభవాన్ని ప్రస్తుతించారు

కాశ్మీర్ శారదా పీఠాన్ని సర్వజ్ఞ పీఠం అంటారు. ఎన్నో అర్హతలున్నవారు మాత్రమే దీనిని అధిరోహిచగలరు భగవాన్ శంకర భగవత్పాదులు ఇక్కడికి వచ్చి అన్ని మతాల వాదాల వారినీ వాదం లో జయించి సర్వజ్ఞ పీఠం అధిరోహించారు, ఇది అతిప్రాచీన ఆలయము, పీఠమూ. సముద్ర మట్టానికి 11000 అడుగుల ఎత్తున ఉన్నది. భారత ప్రభుత్వాధీన కాశ్మీర్ కు ఇది వేసవి విడిది. శారదాలయం 142 అడుగులపొడవు 95 అడుగుల వెడల్పు లో వెలుపలి గోడలు 6 అడుగుల వెడల్పు 11 అడుగుల పొడవు గా ఉంటాయి, 8 అడుగుల ఎత్తులో ఆర్చీ లుంటాయి. శృంగేరిలో శ్రీ శంకరాచార్య స్వామి ప్రతిష్టించిన గంధపు చెక్కతో చేయబడిన శారదా దేవి విగ్రాహాన్ని ఇక్కడి నుండే తీసుకు వెళ్లారని అంటారు 1148 కి చెందిన కల్హణ మహాకవి శారదా దేవాలయం గురించి వర్ణించాడు 8 వ శతాబ్దం లో కాశ్మీర్ రాజు లలితాదిత్యునికాలం లో బెంగాల్ ప్రభువు గౌడరాజులనుయాయులు శారదాదేవిని దర్శించారని, శంకరాచార్యులవారి " ప్రపంచసారం "లో శారదా దేవి స్తుతి ఉందని ఇక్కడే రాసి ఉంటారని అంటారు. 1030 లో లో ఈ దేవాలయాన్ని సందర్శించిన "అల్ బరూని "అనే చరిత్రకారుడు శారదా దేవి విగ్రహం గంధపు చెక్క-చంద న చెక్క తో చేయబడి ఉందని,చెప్పి ఈ ఆలయాన్ని ముల్తాన్ సూర్య దేవాలయం, దాసేశ్వర్ లోని విష్ణు చక్రస్వామి దేవాలయం, గుజరాత్ లోని సోమనాధ దేవాలయం తోను పోల్చి చెప్పాడు. 16 వ శతాబ్దం లో అక్బర్ చక్రవర్తి ఆస్థాన నవరత్నాలలో ఒకరైన అబుల్ ఫజల్ కవి ఈ దేవాలయాన్ని వర్ణిస్తూ ఇది మధుమతి నది అంటే నేటి నీలం నది ఒడ్డున ఉందని, ఆలయం బంగారంతో ధగధగా మెరుస్తూ ఉంటుందని ప్రతి శుక్లపక్షం అష్టమినాడు ఇక్కడ అద్భుతాలు జరుగుతాయని రాశాడు



ఇంత గొప్పగా చరిత్రలో వెలిగిపోయిన శారదాలయం 14 వ శతాబ్దం లోమొదటిసారిగా ముస్లిం ల దాడికి గురైనది. ఆతర్వాత ఈ ఆలయం ఈ ప్రాంతం, కృష్ణ గంగ తో సంబంధం పూర్తిగా భారత దేశపు అధీనం నుంచి తప్పి పోయింది. 19 వశతాబ్దపు డోగ్రారాజు శారదాలయాన్ని పునరుద్ధరించారు. తర్వాతమళ్ళీ మామూలే.

.ఈ ఆలయాన్ని, అమ్మవారిని ప్రముఖ కర్ణాటక వాగ్గేయ కారుడు ముత్తుస్వామి దీక్షితులు కళావతీ కమలాసనా, యువతీ "కీర్తనలో ఘనంగా కీర్తించారు "శాండిల్య మహర్షి ఈ దేవాలయం ప్రక్కన శారదా వనం లో తపస్సు చేశాడు. ఆలయం ప్రక్కనే అమర కుండ్ సరస్సు ఉండే. శాండిల్య మహర్షి తపస్సుకు శారదా దేవి ప్రత్యక్షమైంది. కాశ్మీర్ ప్రజల స్థానిక లిపిని అమ్మవారిపేరుతోనే "శారదా లిపి" "అని భక్తిగా చెప్పుకొంటారు. ఉగ్రవాదుల దాడులలో అట్టుడికి పోయిన కాశ్మీర్ నుండి కాశ్మీర్ పండితులు వలస పోయారు. 2007 లో కొందరు పండితులు ఆజాద్ కాశ్మీర్ లోని శారదా దేవాలయాన్ని చూడటానికి వెడితే అనుమతించలేదు. అదీ మనచదువులతల్లి శారదా మాతకు పట్టిన దుర్భర పరిస్థితి. మాటల గారడీ చేసే మోడీ కూడా దీనిపై శ్రద్ధ పట్టకపోవడం, ఇదేకాదు తన గుజరాత్ రాష్ట్రం లోని సముద్ర గర్భం లో ఉన్న ద్వారక పట్టణం పై కూడా ద్రుష్టి సారించకపోవడం బాధ గా ఉంది, ఒకప్పుడు వైభవం గా ఉన్న శారదా దేవాలయ సర్వజ్ఞ శక్తి పీఠం నేడు శిధిలాలుగా చూస్తుంటే కడుపు తరుక్కు పోతుంది.,

పండుగలు

## సంస్కృతి అంటే ?

సంస్కృతి అనేది మానవ జీవితాలకు మాత్రమే సంబంధించింది. అది ఉండబట్టే మనల్ని మానవులు అంటున్నారు. లేకుంటే జంతువులతో సమానమే. సంస్కృటతి అంటే సభ్యతా, సంస్కారం అని అనుకొంటాం.. ఇతరుల పట్ల మర్యాదా, మన్ననా, గౌరవం చూపటమే ఈ రెండు పదాలకు అర్ధం. అవి లేక పోయినా, చూపక పోయినా, సంస్కృతీ విహీనులు గా భావింప బడటం లోక రివాజు. సంస్కృతీ పై మంచి అవగాహన కలిగి ఉండాలి. సామాజికం గా ఐక్యతా ఉండాలి. ఈ రెండు ఉంటె దేశ ఐక్యత సాధ్యం. సమాజం లో ఉన్న వ్యక్తుల మధ్య సంబంధాల వల్ల కలిగేది సంస్కృతి. దీనికోసం నిరంతరం చర్చలు జరుగు తూనే ఉంటాయి. ఈ చర్చల మొత్తం సారాంశమే సంస్కృతి. నాగరకత నుంచి వచ్చేది విద్య. ప్రతి జాతికీ, దేశానికి సంబంధించిన సంస్కృతి ఉంటుంది.

సంస్కృతీ ని అనేకులు అనేక రకాలుగా నిర్వ చించ టానికి ప్రయత్నించారు. అంత తేలికగా నిర్వ చింప బడని పదం. "ఎవరైతే, తన ప్రవర్తన లో నాగరకత చూపిస్తారో, వారు సంస్కృతి ఉన్న వ్యక్తులు ;;అంటారు. ఇంకొంచెం ఆలోచిస్తే, "ఒక నియమిత సమాజం లో ప్రజల జీవన విధానాన్ని సంస్కృతి "అన వచ్చు. రాతి కాలం నుండి నేటి వరకు మనిషి సుఖం గా, ఆనందం గా ఉండటానికి, సంతృప్తి గల జీవనాన్ని ఇచ్చేదీ సంస్కృతి.. చట్టానికి లోబడి, మానవ ప్రశాంత జీవ నానికి, సామాజిక ప్రవర్తనకు, పొందిన జ్ఞానం తో, పెరిగే విలువలు, ప్రమాణాలతో జీవనం సాగించటమే సంస్కృతి. సంస్కృతీ టో పాటు, నాగరకత పదమూ అవినా భావ సంబంధం కలిగి ఉంది. ఒక్కో సారి ఒక దాని కొకటి కలిపి వాడుతూ ఉంటాం. నాగరకత అనేది –సంస్కృతీ కి ఉన్న బాహ్య రూపం. అంటే –మనం ఉపయోగించే వస్తువులు, యంత్రాలు వగైరా.

ఆంతరిక మైనది సంస్కృతీ. నాగరకత శరీరం అయితే, సంస్కృతీ ఆత్మ. నాగరకత అనేది సంస్కృతీ లో ని భౌతిక పార్శ్వం.. లేదా భౌతిక సంస్కృతి. సామాజిక జీవన వ్యవస్థలు, కట్టు బాట్లు, ఆచారాలు, విలువలు, కళలు, సాహిత్యం,, సంగీతం, సమాజం లోని వ్యక్తుల పరస్పర చర్యలు, సంబంధాలలో పొందే అభి వృద్ధి వీటన్నిటిని కలిపి "అభౌతిక సంస్కృతీ "అంటారు. ఈ పార్శ్వాన్నే విస్తృతార్ధం లో సంస్కృతీ అంటాం. అంటే సంస్కృతికి, భౌతిక, అభౌతిక పార్శ్వాలున్నట్లు గా తెలుస్తోంది.. మనుష్యులు దేన్నీ కలిగి ఉన్నారో అది నాగరకత అని, మనుష్యులు అంటే ఏమిటో చెప్పేది సంస్కృతీ అని "మకైవార్ "అనే విశ్లేషకుడు సూక్ష్మం గా చెప్పాడు. భౌతిక సంస్కృతీ తేలి కగా మారి పోతుంది. అభౌతి కం అంత తేలిగ్గా మారదు.

## సంస్కృతీ లక్షణాలేమిటి

ఏయే లక్షణాలు ఉంటె సంస్కృతీ అనాలి ?సమాజం లో ని వ్యక్తుల ప్రవర్తనా ఫలితం గా ఏర్పడిందే సంస్కృతీ. అంటే సంస్కృతీ సమాజ ఫలితం గా ఏర్పడు తుంది. సంస్కృతి మానవ నిర్మిత మైనదే. అందుకే మనిషి, అతను చేసే పనులే సంస్కృతీ అన్నారు. కొత్త తరం వారికి అవసర మైనవన్నీ అందించేది సంస్కృతి., సంస్కృతీ పరిణామ శీలం కలిగి ఉంటుంది. సమాజ అవసరాలను బట్టి మారుతుంది. సంస్కృతి అభ్యాసనం వల్ల అంటే నేర్చు కోవటం వల్ల ఏర్పడుతుంది. భాషా, కళలు మొదలైనవి నేర్చు కొంటె నే వస్తాయి. తనకు అవసర మైన హోదా,గౌరవం, తిండి, బట్టలు, పొంది సంతృప్తినిస్తుంది. అందుకే సంతృప్తి దాయక మైనదిగా సంస్కృతీ ని భావిస్తారు.. భిన్న సంస్కృతుల మధ్య ఆదాన ప్రదానాలుంటాయి. అనుకరణ అనేది ఆదరణ లకు నిలయమై పంచు కొ బడేది గా ఉంటుంది. నిరంతరం మారుతూ ఉండటం దాని లక్షణం.. ఆలోచన, భావం అనేవి దాని లక్షణాలే కనుక సంస్కృతీ మారుతూ, గతిశీలం గా ఉంటుంది. సంస్కతి విస్తృతం గా పెరిగి పోతే, విడి పోవటమూ జరుగు తుంది. ఒకే విధ మైన సంస్కృతీ ఉన్న వేర్వేరు వ్యక్తుల మధ్య పరస్పర సంబంధాన్ని సంస్కృతీ ఏర్పరుస్తుంది. అందుకని, సంస్కృతి భిన్న మైనా, సమగ్రం గా ఉంటుంది. సంస్కృతీ సమాజం లోని పరి వార్తన, సామాజిక ప్రమాణాలను,నియంత్రిస్తుంది. కనుక వ్యక్తులు విలువలను ఆచరణ లో పెట్టాలి

సంస్కృతికి పునాది కుటుంబం. ఆర్ధిక స్తితి, ప్రభుత్వం, విద్య, మతం అనే సంస్థలే. ప్రతి వ్యక్తీ పైనా అది కారం, అనుమతుల ప్రభావం, ఎక్కువగా ఉంటుంది. ఎవరి సంస్కృతీ వాళ్లకు గొప్పే. ఇతర సంస్కృతుల్ని కూడా ఆద రించే ఉదార భావం అలవాడాలి. "సంస్కృతీ బహుళత్వం "అనే భావన ఈ రోజు విశ్వ వ్యాపితం గా ఉంది. తరాల మధ్య వ్యత్యాసం ఏర్పడు తుంది. కొన్ని అంశాలలో అభివృద్ధి బానే ఉంటె, కొన్నిటి విషయాలలో నెమ్మది గా ఉంటుంది. దీన్నే "సంస్కృతిక విలంబన "(కల్చరల్ లాగ్ )అన్నారు విశ్లేషకులు. భిన్న సంస్కృతులున్న సమాజాలు కాని, వ్యక్తులు కాని తారస పడ్డప్పుడు కలిగే ఫలితం, ప్రభావం "సాంస్కృతిక విఘాతం "అంటారు. ఒత్తిడి వల్ల ఒకరి భావాలపై వేరొకరి భావం పడి ఘర్షణ కలుగు తుంది.

హెర్బర్ట్ స్పెన్సర్ "సంస్కృతిభౌతికము కాదు, అభౌతిక ము కాదు. ఈ రెంటికీ భిన్న మైన అర్ధాన్నిస్తుంది "అన్నాడు. కనుక సంస్కృతీ "సూపర్ ఆర్గానిక్ "లక్షణం కలదని భావిస్తున్నారు. సంస్కృతీ ఆదర్శ ప్రాయ మైనదే. "విసరణ (డిఫ్యూజన్ ) ద్వారా అది చొచ్చు కొని పోతుంది. అందుకే ఈ బాధ భరించ లేక "అనుభవాల ప్రోగు "అని సంస్కృతిని నిర్వ చించారు. ప్రస్తుతం ఉన్న విజ్ఞానాన్ని, భవిష్యత్తు కు ఉపయోగ పడ టా న్ని "కల్పన "అన్నారు. కల్పన పెరిగితే, విజ్ఞానం పెరుగు తుంది. ఆధునీ కరణ,, సమాజ అవసరాల్లో ఒకటి. ఉన్న విషయాలను కనుక్కోవటం ఆవిష్కరణ. ఖండాలు కనుక్కోవటం మొదలైనవి ఆవిష్కరణలు (డిస్కవరి) అన్నారు. సర్దు బాటు కూడా ఒక భాగమే. రెండు సంస్కృతుల మధ్య ఫలదీకరణం జరిగి సంస్కృతీ శక్తిని, జీవనాన్ని నిలబెట్టు కొంటుంది. ఒక సమూహం నుంచి వేరొక దానికి సాంస్కృతిక అంశాలు వ్యాప్తి చెందటమే సంస్కృతీకరణ. ఒక్కో సారి భిన్న సంస్కృతులు చాలా కాలం కలిసి ఉండటం వల్ల భేదాలు అంతరించి విలీనీ కరణం జరుగుతుంది అని దీని పై ఆలోచించిన జ్ఞానులు పరిశోధనా పూర్వకం గా తెలియ జేశారు.

"ఒక సమాజపు సాంస్కృతిక సాంప్రదాయాలను, అది సంపాదించే ప్రక్రియను సంస్కృతీ స్వీకరణం గా వీరు నిర్వ చించారు. సంస్కృతిని సక్రమింప జేయటాన్ని, స్వీకరణ లేక" en culturation "అంటారని దీని మీద సాధికారం గల mary godman "అనే ఆయన చెప్పాడు. ఈ విధానమే భారతీయ సంస్కృతి భిన్న దేశాలకు వ్యాపించటా నికి కారణం అయింది అని ఆయన సూటిగా నిష్కర్ష గా చెప్పాడు.

## మకర సంక్రాంతి



సూర్యుడు ప్రతి నెల ఒక్కో రాసిలో ప్రవేశిస్తుంటాడు దాన్ని సంక్రమణం అంటారు. సూర్యుడు కర్కాటక రాశి లో కి ప్రవేశించినపుడు కటక లేక కర్కాటక సంక్రమణం అంటారు దీంతో దక్షిణాయణం ప్రారంభమైనట్లు. ఇది సాధారణం గా జులైపదిహేడు న వస్తుంది. ఇది పిత్ృ దేవతల కాలం. ఆరు నెలలు ఉంటుందని మనకుతెలుసు., అలాగే రవి మకర రాసిలో ప్రవేశించినపుడు వచ్చేది మకర సంక్రమణం. రేపు అంటే ఈ నెల పద్నాలుగవ తేది సోమవారం మధ్యాహ్నం గం.12-10 కు సూర్యుడు మకర రాశి లో ప్రవేశించటం తో మకర సంక్రమణం ప్రారంభమవుతుంది. ఈ ఆరు నెలలు దేవయానం గా భావిస్తారు. ఉపనయనాలు ఉత్తరాయణం లోనే చేస్తారు. సంక్రాంతి పురుషుడు ఒక్కో సారి ఒక్కో రకం గ వస్తాడు. ఈ సంవత్సరం సంక్రాంతి పురుషుడు ఎలా ఉన్నాడో, యేవాహనం ఎక్కి వచ్చాడో, వేషదారణం ఏమిటో ఆ వివరాలు తెలుసుకొందాం.



రేపు వచ్చే సంక్రాంతి పురుషుని పేరు ‘‘ద్వాం క్ష ‘‘అందువల్ల వైశ్యులకు హాని అని తెలుస్తోంది. గజ వాహనం ఎక్కి రావటం వలన పెద్ద పెద్ద పదవుల్లో ఉన్న వారికి భోగ భాగ్యాలతో పాటు అకారణం గా కలహాలేర్పడతాయని సూచన. చందన ఉదకం తో స్నానం చేయటం వల్ల పాడి పంటలు సమృద్ధి గా ఉంటాయి. యవాక్షత ధారణం వలన అలచంద పంటకు నష్టాలుండ వచ్చు. నీలి రంగు వస్త్రం కట్టుకొన్నందున ప్రజలలో భయాందోళనలు ఎక్కువవ గా ఉండచ్చు. గోరోచనాన్ని లేపనం గా పూసుకొన్నందున విలాస వస్తువుల ధరలు ఆకాశమంత ఎత్తున ఉంటాయి. జపా పుష్పాన్ని ధరించటం వల్ల యుద్ధ భయం జాస్తి. గోమేధికాన్ని ఆభారణం గా ధరించటం వలన నవ రత్నాలకు గిరాకీ పెరుగుతుంది. తగరపు పాత్ర లో భోజనం చేయటం వల్ల లోహాలన్నిటికి గిరాకీ ఉంటుంది. పాలను తాగటం వల్ల శూద్రులకు అరిష్టం గా భావిస్తారు.





రేగు పండ్ల ను తినటం వల్ల పండ్ల తోటలు జాస్తిగా పెరుగుతాయని అంటారు. కోదండాన్ని ఆయుధం గా వాడటం వలన పాలకులకు మనశ్శాంతి తక్కువ అని చెబుతారు. బంగారు గొడుగు వేసుకోవటం వలన ప్రజలకు ఆయురారోగ్యాలు ఉంటాయి. విస్మయం చేష్ట గా ఉన్నందున వర్షాలు అధికం గా కురుస్తాయని సూచన. సంక్రాంతి పురుషుడు కూర్చుని ఉన్నట్లు ఉండటం వలన అనారోగ్యాలు ఎక్కువే నని ఊహిస్తున్నారు. బల్లెం తో సంచరించటం వల్ల జంతు నష్టం, దొంగలకు హాని. ఆగ్నేయ దిశలో ప్రయాణించటం –ఆగ్నేయ ప్రాంతాల వారికి అరిష్టం గా భావిస్తారు. శుక్ల పక్షం లో ప్రవేశించటం వలన అన్ని వస్తువుల ధరలూ పెరిగి పోతాయట. తదియ తిది వల్ల చిన్న వ్యాపారులకు లాభాలెక్కువ. సోమవారం నాడు రావటం –పంటలకు నష్టం, చిన్న పరిశ్రమలకు వృద్ధి. మేష లగ్నం లో ప్రవేశం వలన స్త్రీలకూ ప్రాముఖ్యత పెరుగుతుంది. ధనిష్ఠా నక్షత్రం లో ప్రవేశం కనుక నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతాయని ఊహిస్తున్నారు. మధ్యాహ్న కాలం లో ప్రవేశించటం అధికారులతో మనస్పర్ధలు ఎర్పడేట్లు సూచన కని పిస్తోందని పంచాంగ కర్తలు చెబుతున్నారు.

సంక్రమణ సమయం లో జపం, తపం చేయ గల వారు చేసుకో వచ్చు. సంక్రమణ ప్రవేశ సమయం లో దానాలు చేయాలి పిత్ృదేవతలు సంతృప్తి పడతారు. బూడిద గుమ్మడి ని బ్రాహ్మణునికి వడ్ల తో దానం చేయాలి. పిత్ృదేవతలకు తిలోదకాలు వదలాలి. ఇవన్నీ చేస్తే ఆయురారోగ్యాలు, ఐశ్వర్యాలు, పుత్రపౌత్రాభి వృద్ధి కలుగుతుంది..

## మార్గశిరం లో హరి-హర కైంకర్యం

మధురకవి శ్రీమతిముదిగొండ సీతారామమ్మగారు మదినిండా భక్తి నింపుకున్న విదుషీమణి. వినయం ఆమె ఆభరణం. ఆమె తలిస్తే, పిలిస్తే పద్యం వరదలై ప్రవహిస్తుంది. అతి సహజ సుందర పదాలతో క్లిష్ట విషయాన్ని సైతం సుందర పద్యంగా చెక్కగల నైపుణ్యమున్నవారు. ఇప్పటికే చాలా పద్య కావ్యాలు రాసి ప్రచురించిన అనుభవమున్నవారు. ఈ మార్గ శిరమాసం లో ఆమె దృష్టి గోదాదేవి "తిరుప్పావై "పాశురాలపై, మాణిక్యవచకర్" తిరు వెంబావై"పడి, ఆ మాసంలోనే రెండిటినీ తన స్వంత బాణీలో సీసపద్యాలలోకి అనువదించి అటు "ఆండాళ్ళు" లాగా, ఇటు" శివబాల" లాగా తన భక్తిప్రపత్తులను చాటి, తానూ ఆ వ్రతాలలో అక్షర అర్చనతో భాగస్వామి అయి ధన్యమయ్యారు. అంటే హరిహరాద్వైతం సాధించారన్నమాట. తెలుగు సాహితీ లోకానికి వాటిలోని ఉదాత్తభావనలను సరళ సుందరంగా అందించి మన్ననలు అందుకొన్నారు.

### తిరుప్పావై



తిరుప్పావై గురించి తెలుగునాట ఈ నాడు తెలియని వారు లేరు. ప్రతి వైష్ణవాలయం లో ధనుర్మాసం లో తిరుప్పావై గానం, వాటిపై ప్రవచనం సర్వ సాధారణమే. అందులో శరణాగతి అందరినీ తన్మయులను చేస్తుంది. పేరుకు "మేలి నోము "కాని, అంతరార్థం చాలా వేదాంత విషయ సమగ్రం. ముక్తికి మార్గం. సామీప్య సారూప్య సాయుజ్యానికి దగ్గరి దారి. శ్రీ కృష్ణావతారం లో శ్రీకృష్ణ పరమాత్మ అతిమానుష చేష్టలు, సౌందర్యానికి వశులైన గోపకన్యలు ధూర్త గోపాలునిపై మనసు పారేసుకొని సర్వ సమర్పణ బుద్ధితో ఉంటే, గోప వృద్ధులు, తమ ఇంటి కన్యకలను వేణుమాధవునికి కనిపించకుండా నేల భోషాణం లో దాచారు. దీనివలన ప్రకృతి కన్నెర్ర జేయగా, వర్షాభావం ఏర్పడింది. దీనికి పరిష్కారంగా వృద్ధులు రాజీపడి గోపకన్యలు వర్షం కోసం శ్రీ కృష్ణుని గురించి వ్రతం చేయమని, వారికి, కృష్ణుడిచెప్పి ఉభయుల అంగీకారం తో ఆయనకు వీరిని అప్పగించి వెళ్ళారు..ఇక ఆలస్యంచేయరాదని ఆ రాత్రిని కొనియాడి, అర్ధ రాత్రి నోముకై స్నానం చేయటానికి తనను లేపమని ఆనతిచ్చి, తాను"నప్పిన్న పిరాట్టి "అయిన నీళా దేవి గృహ ప్రవేశం చేశాడుకొంటె కిట్టయ్య., ఆయన చెప్పినట్లే శ్రీ కృష్ణ గుణ చేష్టితులైన గోపకన్యలు స్మరణానందం తో నిద్రరాక, లేచీ లేవక, లేవనివారిని మేల్కొలపటానికి నందగోపుని ఇంటికి వెళ్ళి, శ్రీ కృష్ణుని మేల్కొల్పి, తమ ప్రార్ధనలు విన్నవించి నోము అనే పేర భగవత్ సంశ్లేషానందం పొందినట్లు గోదాదేవి పారవశ్యం తో రాసిన పాశురాలు ఇవి. అన్నిటికీ భావ గంభీరంగా పద్యాలలోకి మధుమదురంగా మలచి తమ "మధురకవి "బిరుదు సార్ధకం చేసుకొన్నారు "సరసభారతి ఆస్థాన కవయిత్రి" శ్రీమతి ముదిగొండ సీతారామమ్మగారు.



### తిరు వెంబావై

9వశతాబ్ది శైవకవి మాణిక్య వచకర్ పాండ్య రాజు రెండవ వరగుణ వర్మ మంత్రి. అనునిత్యం శివభక్తి తన్మయత్వం లో తేలియాడే వాడు. గొప్ప కావ్యాలు రాశాడు. కాని ఆయనపేరు 63నాయనార్ల పేర్లలో చేరకపోవటం ఆశ్చర్యం. తమిళనాడులోని మదురై జిల్లా వైగై నది(విశ్వనాథ వారి "ఏక వీర"నవల కథ జరిగిన చోటు) తీరం వాదవూర్ లో జన్మించి,శివాలయం పూజారిగా జీవిస్తూ, రాజు విశ్వాసం పొందాడు. అతనిలోని సైనిక పటుత్వం గమనించి రాజు, తన సైన్యం కోసం మేలు జాతి గుర్రాలను కొనమని చాలాడబ్బు ఇచ్చాడు.సరే నని బయలేరి వస్తూంటే దారిలో శివుడే ఒక శివముని రూపం లో కనిపించి,ఆత్మజ్ఞానం కలిగించగా రాజు ఇచ్చిన ధనం తో "తిరు పెరునత్తురై "లో గొప్ప శివాలయం నిర్మించి, మన భక్త రామ దాసు అనిపించాడు. రాజునూ శివ భక్త శిఖామణిగా మార్చి ముక్తి పొందేట్లు చేసిన పరమ శివభక్తుడు మాణిక్య వచకర్. ఈయన దేహం చాలించినప్పుడు ఆయన ఆత్మ దివ్యజ్యోతిగా మారి, పరమజ్యోతిలో కలిసి, ఆయన శవం కనిపించకుండా పోయిందని భగవాన్ రమణ మహర్షి

చెప్పారు. చిదంబరం లో శ్రీ లంక బౌద్దులతో వాదం చేసి ఓడించిన ప్రతిభ ఆయనది. ఆయన ఆరాధనోత్సవం తమిళనాడు అంతటా జున్ –జులై లో వచ్చే "ఆణి"నాడు ఘనంగా నిర్వహిస్తారు.

ఆయన రాసిన 20 పాశురాల "తిరువెంబావై "తానేఒక మహిళగా భావించి "పావై నోంబు"ను అనుసరిస్తూ పరమ శివుని కీర్తిస్తాడు. ఆయన విగ్రహం ఆంధ్ర ప్రదేశ్ ఆర్కేలాజికల్ మ్యూజియం లో త్రిభంగ భంగిమలో ఒక చేతిలోఓం నమః శివాయ అని రాయబడిన తాళపత్రం తో ఉన్నది. కంచి పరమాచార్య శ్రీ శ్రీ చంద్ర శేఖర సరస్వతీ స్వామి మాణిక్య వచకర్ గురించి, తిరువెంబావై ఘనత గురించి తరచుగా చెప్పేవారు. ఇందులోని 9వ పాశురం కావ్యానికి ఆత్మ,ఫలశృతిగా ఉందని సీతారామమ్మగారు చెప్పిన మాటలు యదార్ధం –ఒక సారి ఆపద్య వైభోగం చూద్దాం –

"చిన్మయ రూపుడాచిత్త చిదంబర –నటరాజ గిరివాస నందివాహ –కామేశ్వరీ పతి, కామ సంహారుడా –కనికరించుము స్వామి కరుణ చూపు ----

"భస్మధారుల కిల భవబంధ వితతి –త్రెంపి బాస టగుడదువయ్య దీనబంధు –మార్గ శిర మాస తానముల్ మార్గ మిచ్చు –శివుని దరి చేర్చు వ్రతమిది శివము గూర్చు "

ఈపద్యం శ్రీనాధుని భీమఖండం లోని "చంద్ర బింబానన -,చంద్ర రేఖా మౌళి, నీలకుంతల ఫాల, నీల గళుడు "పద్యాన్ని స్ఫురణకు తెచ్చింది.

ఈ పాశురాలలో " శివుని దరి చేర్చు వ్రతమిది శివము గూర్చు "మకుటం "మకుటాయమానం"గా ఉన్నది. పద్యాలు జలపాత సొరుతో మానసిక విందు కూర్చింది. పూర్వం మన మగువలు చదివే "ఆధ్యాత్మ రామాయణ కీర్తన "ల తన్మయత్వం కలిగిస్తుంది.అలా పాడుకోవటానికి అనువుగా కూడా ఉన్నది., అవును. తనువూ మనసు భగవంకితమైనప్పుడు వచ్చే శబ్దం, అర్ధం అత్యంత ఉన్నతంగా నే ఉంటాయి.

ఇలా శివ- కేశవుల అభేదాన్ని భక్తిభావ బంధురంగా రెండు రకాల పాశుర పద్యాలలో నిబద్దం చేసి తమ కలం కత్తికి రెండు వైపులా సునిశిత " ధార" ఉందని నిరూపించారు శ్రీమతి సీతారామమ్మగారు. అభినందనలు.



## ముక్కోటి ఏకాదశి

ముక్కోటి ఏకాదశి నే వైకుంఠ ఏకాదశి అంటారు. ఏకాదశి అంటే ఒక తిదిమాత్రమేకాడు, ఒక దేవత పేరు, 10 ఇంద్రియాలను అదుపులో పెట్టేది, ఉపవాసాలకు ముఖ్యమైన రోజు, విష్ణువుకు పరమ ప్రీతి కరమైన రోజు. ఏడాదికి శుక్ల కృష్ణ పక్షాలలో వచ్చే ఏకాదశులు 24. అధికమాసమైతే 26 వస్తాయి. ఆషాఢ శుద్ధ ఏకాదశి శయన ఏకాదశి.భాద్రపద శుద్ధ ఏకాదశి పరివర్తన ఏకాదశి, కార్తీక శుద్ధ ఏకాదశి బోధన లేక ఉత్థాన ఏకాదశి. మాఘ శుద్ధ ఏకాదశి భీష్మ ఏకాదశి. సూర్యుడు ధనుర్మాసం లో ఉన్నకాలం లో మార్గశిర లేక పుష్యమాసం లో వచ్చేదే ముక్కోటి ఏకాదశి. 3 కోట్ల దేవతలతో కలిసి శ్రీ మన్నారాయణుడు ఈ రోజునే దర్శన మిస్తాడు. అందుకే ఆ పేరు. ఈ రోజు ఉపవాసం ఉంటె 3 కోట్ల ఏకాదశులలో చేసే ఉపవాస ఫలితం, పుణ్యం వైకుంఠ ఏకాదశి నాడు చేస్తే లభిస్తుంది.

మనదేవతల సంఖ్య 33 కోట్లు. కాని "అసహస్రాత్ "అనే వేద ప్రమాణాన్ని బట్టి అసంఖ్యాకం అని అర్ధం అంటే అంతా దేవతామయమే. విష్ణు మయమే. ఒక్కడే పరమాత్మ ఇన్ని రూపాలలో ఉన్నాడని భావం. ఇక్కడ 3 కధలు తెలుసు కొందాం. ఒక మన్వంతరం లో "వికుంఠ"అనే తల్లికి విష్ణువు కుమారుడిగా పుట్టాడు. అందుకే" వైకుంఠుడు"అంటారు. రెండోకద –కృత యుగం లో చంద్రావతి నగరాన్ని" మురుడు"అనే రాక్షసుడు పాలిస్తూ దేవతలను క్షోభ పెట్టాడు. అప్పుడు వైకుంఠంనుంచి విష్ణువు దిగి వచ్చి వాడిని చంపటానికి ప్రత్యేక అస్త్రం కావాలని బదరికాశ్రమం లోహైమావతి అనే ఒక గుహలో ప్రవేశించాడు. ముర ఇక్కడే విష్ణువు దాక్కున్నాడని తెలిసి గుహలోకి ప్రవేశించాడు. అప్పుడు

విష్ణువు నుంచి ఒక శక్తి ఉద్భవించి కంటి చూపుతో మురాసురుని కాల్చేసింది. సంతోషించిన విష్ణువు ఆమె కు "ఏకాదశి "అని పేరు పెట్టి వరం కోరుకోమంటే, ఏకాదశినాడు ఉపవాసం ఉన్నవారి పాపాలను సంహరించాలని కోరింది తథాస్తు అంటూ వైకుంఠ ఏకాదశి నాడు ఉపవాసం ఉన్నవారికి మోక్షం కలుగుతుందని మురారి వరమిచ్చాడు. (వ్రత చూడామణి ).ఈ ఏకాదశినాడు మురాసురుడు బియ్యం లో దాక్కుంటాడని అందుకే బియ్యం తో చేసిన పదార్ధాలు తినరాదని, తులసి నీరు తాగుతూ ఉపవాసం ఉండాలని అంటారు. ముర అంటే తామసిక రాజసిక గుణాలకు, అరిషడ్వర్గాలకు ప్రతీక. ఉపవాసం చేస్తే సత్వ గుణం పెరిగి ముక్తికి మార్గం అవుతుంది. 3 వ కథ-కుంభుని కొడుకైన మద మన్యుడు అనే రాక్షసుడు శివునికై తపస్సు చేసి "అయోనిజ "వల్లనే తాను చనిపోయే వరం పొందాడు. లోక కంటకం గా వాడు ప్రవర్తిస్తుంటే విష్ణువు వాడిని సంహరించటానికి "సింహ వతి "అనే గుహలో ప్రవేశించాడు. ఆ గుహ అంచుల స్వామి శరీరం రాపిడి చెంది ఏకాదశి అనే స్త్రీ గా మారి ఆమె శక్తితో మదమన్యుడిని సంహరించాడు.

మధ్యలో ఈ అంచు లేమిటి?అవే జాగ్రత్ స్వప్న సుషుప్తి లు. కుట నుంచి కోటి శబ్దం పుట్టింది కుట అంటే కౌటిల్యం లేక వంకర. అంచులకు కోటి అనే పేరుంది. బాలకృష్ణుడు కొన గోట గోవర్ధన పర్వతాన్ని ఎత్తి నిలబెట్టాడు అని మనం విన్నాం. కనుక పై మూడు అవస్థల అంచుల్ని తాకి మనల్ని పునీతుల్ని చేసేది అని ముక్కోటి ఏకాదశి పరమార్ధం.

ఒక సారి శ్రీరంగం వెడదాం

"శ్రీ రంగ ద్వారస్థ భగవదాలోకన మహోత్సవం –ముక్కోటి ఏకాదశి "అని పంచాగ కర్తలు రాస్తారు. శ్రీరంగం లో రంగ నాద స్వామి దక్షిణాభి ముఖం గా శయనించి ఉంటాడు. ముక్కోటి నాడు ఉత్తర ద్వారం దగ్గర దర్శనం కలుగ జేస్తారు. స్వామిని వజ్రాలు అలంకరించిన వస్త్రాలతో అలంకరించి వెయ్యి స్తంభాల ప్రాంగణం లో ఉత్తర ద్వారం దగ్గర దర్శన మిప్పిస్తారు. ఇక్కడ 21 రోజుల ఉత్సవం చేస్తారు. ఉదయం పూట చేసే పూజను "పాగల్ పట్టు "అని రాత్రి చేసే పూజను "ఇర పట్టు "అంటారు.

అసలు శ్రీరంగం లో రంగ నాధుడు ఎలా వెలిశాడు?

ప్రళయం తర్వాత బ్రహ్మకు విష్ణు మూర్తి ఆది శేషునిపై పవళించి దేవేరులతో సకల దేవతలతో దర్శన మిచ్చి "జ్యోతిశ్శాస్త్రం"బోధించాడు. తరువాత బ్రహ్మ కోరిక మేరకు "విమానం "లో వెలిశాడు. ఆ మూర్తి స్వరూపమే శ్రీ రంగ నాధుడు. ఆ మూర్తి ఇక్ష్వాకు రాజులకు లభించింది. ఇక్ష్వాకు వంశ రాజుల ఇలవేలుపు రంగనాధుడు. ఆ వంశం లో శ్రీరాముని వరకు రంగనాధుని పూజించారు. శ్రీరాముడు అవతార సమాప్తి చేసేటప్పుడు ఆ మూర్తి ని విభీషణుడికి ఇచ్చాడు. దాన్ని లంకకు తీసుకు వెడుతూ దారిలో సంధ్యావందన కాలం అయిందని, ఒక బాలుడి రూపం లో ఉన్న వినాయకుడికి అప్పగించి దాన్ని కిందపెట్టావద్దని బతిమాలి చెప్పాడు. కాని బరువు మోయలేక వాడు కింద పెట్టేశాడు. విభీషణుడు వచ్చి నెత్తీ నోరు కొట్టుకొన్నాడు. అక్కడే ఆలయం కట్టి ప్రతిష్టించి పూజించి ప్రతి ముక్కోటికీ వచ్చి దర్శనం చేసుకొనేవాడు.

ఉత్తర ద్వార దర్శనం దేనికి?

ధనుర్మాసం ప్రారంభం లో మూసి ఉన్న స్వర్గ ద్వారాలు తెరుచుకొంటాయి. దేవతలకు 6 నెలలు పగలు 6 నెలలు రాత్రి అని మనకు తెలుసు. దక్షిణాయణం నుంచి ఉత్తరాయణ పుణ్య కాలానికి అంటే చీకటి లో నుంచి వెలుగులోకి అంటే పగలులోకి దేవతలు ప్రవేశిస్తారన్నమాట. స్వర్గ ద్వారాలు తెరవగానే ముందుగా ఈ కాంతి ఉత్తర ద్వారం నుంచి ప్రవేశిస్తుంది. అందుకే ఉత్తర ద్వార దర్శనం. దేవతలు ఈ రోజు దివి నుండి భువికి దిగి వస్తారు. వైకుంఠ ద్వారమే సూర్యుని ఉత్తరాయణ ప్రవేశానికి సూచిక. ఈ రోజు విష్ణు దర్శనం మోక్ష ప్రాప్తి.




ఇందులో శాస్త్రీయ భావన

ఉత్తర ద్వార దర్శనం అంటే ఆకాశం లో శ్రవణా నక్షత్ర మండలం లో 3 కోట్ల నక్షత్రాలు అంటే దేవతలు వెంట రాగా విశ్వ వ్యాపితుడైన శ్రీమన్నారాయణుడిని దర్శించటం అన్న మాట.

మనిషి ముఖానికి ఎదురుగా ఉండేది తూర్పు (ఉదయం ). వీపు వైపు పడమర. కాళ్ళ వైపు దక్షిణం. శిరసు వైపు ఉత్తరం. కనుక హృదయ కుహరం లో స్వామిని దర్శించాలని అర్ధం. -"నిహిత గుహా యాం విభ్రాజితే "

ఉపవాసం ఎందుకు ?



శాస్త్రీయం గా దీనికి సమాధానం తెలుసుకొందాం –చంద్రుడు భూమి చుట్టూ తిరిగేటప్పుడు రోజుకు 12 డిగ్రీల చొప్పున తిరుగుతాడు. పాడ్యమి నుంచి పౌర్ణమికి 180డిగ్రీలు. పౌర్ణమి నుంచి అమావాస్య కు 180డిగ్రీలు. మొత్తం 360డిగ్రీలు. దీనితో ఒక ఆవర్తనం పూర్తి అవుతుంది. ఏకాదశి తిదినాటికి 120 నుంచి 132 డిగ్రీలు ఉంటుంది.దీన్ని "త్రికోణ "సమయం అంటారు. పౌర్ణమి, అమావాస్యలలో చంద్రుని ప్రభావం సముద్రం మీద అంటే నీటి మీద ఎక్కువ అని తెలిసిన విషయమే. అప్పుడే సముద్రానికి ఆటూపోటూ వస్తాయి. మనశరీరం లో 80 శాతం నీరే. కనుక ఏకాదశినాడు చంద్ర ప్రభావం మన పొట్ట మీద బాగా ఉంటుంది. పొట్టలో ఆహారం ఉంటే చంద్ర కిరణాలు పడి జీర్ణ శక్తిని దెబ్బ తీస్తాయి. అందుకే ఉపవాసం చేయాలి.

ఉపవాసం తో పాటు ఇంకా ఏమేం చేయాలి ?

ముక్కోటి ఏకాదశినాడు తెల్లవారు ఝాముననే "ఉసిరిక "ముద్దతో శరీరం అంతా పూసుకొని సూర్యోదయానికి ముందే తలారా స్నానం చేయాలి. ఉపవాసముండాలి. తులసి దళాలు వేసిన నీటిని మాత్రమే త్రాగాలి. మౌనంగా ఉండటం మేలు. విష్ణు సహస్ర పారాయణ ఉత్తమం. సాధ్యమైనంత వరకూ ఎవరినీ తాకకుండా ఉండటం మంచిది. రాత్రి హరినామ స్మరణ తో జాగరణ చేయాలి.

పుత్రద ఏకాదశి



ముక్కోటి ఏకాదశిని "పుత్రద ఏకాదశి "అనీ పిలుస్తారు. ఒకప్పుడు సుకేతుడు అనే మహా రాజు భాద్రావతి నగరాన్ని పాలిస్తున్నాడు. భార్య చంపక. పుత్ర సంతానం కోసం దంపతులు ఎన్నో తీర్ధ యాత్రలు చేశారు. అప్పుడు కొందరు ఋషులు వారిని ఏకాదశీ వ్రతాన్ని చేస్తే పుత్ర సంతానం కలుగుతుందని చెప్పారు. వ్రత విధానం వారి వలన తెలుసుకొని ఏకాదశీ వ్రతం చేసి, భగవానుని అనుగ్రహం వలన పుత్రసంతానం పొందారు. అందుకే పుత్రద ఏకాదశి అనే పేరొచ్చింది.

తిరుమల, భద్రాచలం లలో ఉత్తర ద్వారా దర్శనాలకు ప్రత్యేకత ఉంది. మిగిలిన అన్ని వైష్ణవాలయాలలో స్వాములకు ఉత్తర ద్వార దర్శనం ఏర్పాటు చేసి తరింప జేసి, మోక్ష ప్రాప్తి కలిగిస్తారు.

## శ్రావణమాస విశిష్టత

### శ్రావణ శుక్రవార వరలక్ష్మీ పూజ



శూన్యమాస మైన తర్వాత వచ్చే శ్రావణమాసం కోసం పెళ్లీడు పిల్లలు, పెళ్ళైన కొత్త దంపతులు ఆత్రంగా ఎదురు చూస్తుంటారు. శ్రవణా నక్షత్రం పౌర్ణమి నాడు వచ్చేదికనుక శ్రావణం. మండే ఎండాకాలమైన గ్రీష్మ ఋతువు, వెళ్లి చల్లబరచే వర్ష ఋతువు ప్రవేశించి ఉపశమనం కలిగిస్తుంది. పంటలు వేసేకాలం. భూమి ఆకుపచ్చ చీర కట్టుకొని ముచ్చటగా దర్శనమిచ్చి మనశ్శాంతి కల్గిస్తుంది. వర్షాలు విపరీతంగా కురిసి నదులన్నీ నిండు గర్భిణీ స్త్రీలు లాగా నిండుగా ప్రవహిస్తాయి. శ్రావణ మంగళవారాలలో స్త్రీలు మంగళ గౌరీ నోము నోస్తారు., ప్రతి శుక్రవారం పవిత్రమైందే. రెండవ శుక్రవారం అంటే పౌర్ణమి ముందు వచ్చే శుక్రవారం వరలక్ష్మీ వ్రతం. ముత్తైదువలు అత్యంత భక్తి శ్రద్ధలతో దీర్ఘ సౌమాంగల్యం కోసం అమ్మవారిని పూజిస్తారు.. కొబ్బరి కాయకు పసుపు కుంకుమపెట్టి కలశంపై ఉంచి పైన రవికముక్కను అందంగా అలంకరించి అమ్మవారికి కళ్ళూ ముక్కు చెవులు నోరు ఏర్పరచి, ఆభరణాలు తొడిగి, పుష్పహారాలతో శోభిల్లజేసి తమ ఇంట లక్ష్మీదేవి వెలసినట్లు పరవశిస్తారు. అమ్మవారిని ఈ రకంగా చూసి మురిసిపోయి ధన్యులవుతారు. వరలక్ష్మీ వ్రతాన్ని శాస్త్రోక్తంగా చేస్తారు కథ చెప్పుకొని తొమ్మిది పోగుల తోరపూజ చేసి, మంత్రపూతంగా చేతికి కట్టుకుంటారు. అనేక భక్ష్య లేహ్య చోష్యాలను ప్రసాదంగా చేసి నైవేద్యం పెడతారు. ముఖ్యంగా తొమ్మిది రకాల ప్రసాదాలు చేయటం పరిపాటి. వాటిలో పూర్ణబ్బూరెలు, పులిహోర గారెలు తప్పని సరి ముత్తైదువులకు పూర్ణబ్బూరెలు వాయనంగా ఇవ్వటం ఆనవాయితీ. అమ్మవారి కి మంగళహారతులు పాడుతారు. సెనగలు నానపెట్టి వాయనంగా తాంబూలం పళ్ళు తో ఇవ్వటం రివాజు. అయిదేళ్ళు నోములు నోచి ఉద్యాపన చేస్తారు. వరలక్ష్మీ వ్రతానికి కొత్త అల్లుళ్ళను ఆహ్వానించి వారికి నూతనవస్త్రాలు పెట్టి కోరిన కోరికలు తీరుస్తారు మామగార్లు. అందుకే కొత్త అల్లుళ్ళు మాంచి జోష్ గా వస్తారు అత్తారింటికి. కొందరు సాయం వేళ అయిదుగురు ముత్తైదువులను ఆహ్వానించి తాంబూలాలు ఇస్తారు. కొందరు ఇళ్లకే వెళ్లి ఇస్తారు ఎవరి అనుకూలం వారిది. శ్రావణ మాస పేరంటాలంటే మహిళలకు మహా క్రేజు. ఈ శ్రావణమాస మూత్తైదువులను చూస్తే సాక్షాత్తు లక్ష్మీ స్వరూపులుగా కనిపిస్తారు. కొత్తనగలు కొనుక్కొంటారు. కొత్తకోడలికి అత్తవారు కూడా అలానే చేస్తారు. రెండవ శుక్రవారం ఏ కారణం చేతనైనా వ్రతం చేయలేక పోయినవారు తర్వాత వచ్చే శుక్రవారం చేస్తారు. శ్రావణమాసం లో లక్ష్మీ దేవిని పూజిస్తే వ్రత కథలో చెప్పినట్లు అమ్మవారు నట్టింట్లో గల్లుగల్లు గజ్జెల సవ్వడితో ప్రవేశించి సకల సౌభాగ్యాలు దీర్ఘ సౌభాగ్యం, సత్సంతానం, దీర్ఘాయుస్సు ప్రసాదిస్తుందని అనాదిగా అందరి విశ్వాసం.

### మంగళ గౌరీ నోము



పెళ్లిళ్లకు శ్రావణ మాసం శ్రేష్టమైనది. కొత్తగా పెళ్ళైన అమ్మాయి శ్రావణ మంగళ వార నోము పట్టి అన్ని మంగళ వారాలు గౌరీ దేవికి పూజలు చేసి నానబోసిన సెనగలు పళ్ళు తాంబూలం లో పెట్టి ముత్తైదువులకు వాయనమిస్తారు. పసుపు తోరణాలు తయారు చేసుకొని వాటిని కలశం పై ఉంచి పూజ చేసి మంత్ర విదిగా కట్టుకొంటారు. కుడుములు చేసి నైవేద్యం పెడతారు. ముత్తైదువులకు తాంబూలాలు ఇచ్చి తలలో పెట్టుకోవటానికి పూలమాల తో సత్కరించి ఆశీస్సులు అందుకుంటారు. కత్తికి గంధం రాసి, ఆవునేతితో జ్యోతులు వెలిగించి, పాటపాడుతూ, ఆ కత్తి జ్యోతులపై ఉంచి మసిబారేట్లు చేసి, కాటుక తయారు చేసి తాము కళ్ళకు పెట్టుకొని ముత్తైదువులకూ ఇవ్వటం తరతరాలుగా వస్తున్న సంప్రదాయం. ఏ దేశం లో ఉన్నా ఆంధ్ర మహిళలు ఈ నోము వరలక్ష్మీ వ్రతం తప్పక పాటిస్తూనే ఉన్నారు. వారికి హాట్స్ ఆఫ్. ఇక్కడ మరో ముఖ్య విషయం కూడా గమనించాలి. గౌరీ దేవికి యెంత ప్రాధాన్యముందో లక్ష్మీ దేవికీ అంతే ప్రాధాన్యం ఉండటం శివ కేశవ, లక్ష్మీ గౌరీ అభేదానికి నిదర్శనం కూడా.

## నాగుల చవితి



శ్రావణ మాసం పండగలతోనే ప్రారంభమౌతుందని పై విషయాలను బట్టి మనకు అర్ధమౌతోంది. ఇవి స్త్రీలకు మాత్రమే ప్రత్యేకమైనవి. అందరికీ చెందిన పండగల నెల శ్రావణం. శ్రావణ శుద్ధ చవితి నాగ చతుర్ధి లేక నాగుల చవితి. ఈనెల 14మంగళవారం., పుట్టలోపాలు పోసి నాగేంద్రుని కొలవటం మన సంప్రదాయం. పుట్టమన్ను చెవులకు పెట్టుకొంటే సర్ప దోషా లుండవని నమ్మకం. పుట్టలో ఆవుపాలు పోసి చలిమిడి, వడపప్పు, పళ్ళు నైవేద్యం పెడతారు. ఓపికున్నవారు నాగదేవత ఉన్న మోపిదేవి, సింగరాయకొండ మొదలైన దేవాలయాలకు వెళ్లి దర్శించి పూజిస్తారు, స్త్రీలు తప్పకుండా ఉపవాస ముంటారు. నాగేశ్వరస్వామికి అభిషేకం జరిపిస్తారు. నాగ దోష నివారణ దీనివలన తొలగిపోతుంది, పిల్లలకు చెవికి సంబంధిన వ్యాదులుంటే తప్పక నాగుల చవితికి పూజలు చేస్తూంటారు. మోపిదేవి మొక్కులు తీర్చుకుంటారు.

## నాగ పంచమి



శ్రావణ శుద్ధ పంచమి నాగపంచమి 15 వ తేదిబుధవారం.. .పాతాళం లో నాగ లోకం ఉంది. నాగ జాతికి చెందిన కద్రువ ను కశ్యపప్రజాపతి వివాహ మాడటం వలన ఆమెకు కలిగిన కుమారులను నాగులు అన్నారు. ఆయనభార్య వినతకు దేవతలతోపాటు గరుత్మంతుడు జన్మించి విష్ణుమూర్తి వాహనమయ్యాడు. పాములను పూజించటం మనకు తరతరాలుగా వస్తున్న సంప్రదాయం. నాగజాతి పరిపాలకులల రాష్ట్రం నాగాలాండ్. నాగ ప్రార్ధన –

"నాగ ప్రీతా భవంతి –శాంతిమాప్నోతి –సశాంతి లోక మా సాధ్య మేదతే-సస్థిత శమః "

నాగ పంచమినే "భ్రాతృ పంచమి "అంటారు.స్త్రీలుసోదరులతోకలిసి పుట్టలో పాల్లుపోసి నాగ పూజ చేస్తారు. దీనివలన పాము కాటు భయం ఉండదని నమ్మిక. దీనికీ ఒక కథ ఉంది. ఒకప్పుడు ఒక రైతు కు ఇద్దరుకొడుకులు, ఒక కూతురు ఉన్నారు. ఒక కొడుకు పొలం దున్నుతుండగా నాగలి కిందనలిగి మూడు పాములు చచ్చాయి. వాటి తల్లి పగబట్టి ఆ రాత్రే ఆ రైతును, భార్యను, ఇద్దరుకొడుకులను కరచి చంపి పగ తీర్చుకున్నది. వాళ్ల మరణాన్ని జీర్ణించుకోలేని కూతురు తల్లి పామున్న పుట్టదగ్గరకు వెళ్లి పాలు నైవేద్యం పెట్టి ప్రార్థించి చనిపోయిన తనవారిని బ్రతికించమని కోరింది ఆమె అమాయకత్వానికి, భక్తికి మెచ్చిన ఆనాగు వాళ్లను బ్రతికించింది. అందుకే ఇది భ్రాతృ పంచమి అయింది, మనదేశం లో అన్ని ప్రాంతాలలోని వారు నాగపంచమి తప్పని సరిగా పాటిస్తారు. నాగపంచమి సినిమా కూడా వచ్చినట్లు జ్ఞాపకం. నేపాల్ లోనూ చేస్తారు. అక్కడ చెంగూ నారాయన దేవాలయం లో గరుడ విగ్రహం ఉంది. గరుత్మంత పూజ చేస్తారు

స్వాతంత్ర్య దినోత్సవం



ఆగస్ట్ 15బుధ వారం భారత స్వాతంత్ర్య దినోత్సవం. యావద్భారత జాతి జాతిపండుగ. జెండాపండగ. ఎందరెందరో త్యాగధనుల ఆత్మబలిదానంతో లభించిన స్వాతంత్ర్యం మనది.

జంధ్యాల పౌర్ణమి, రాఖీ, రక్షాబంధన్



శ్రావణ పౌర్ణమి 26 వ తేది ఆదివారం. పాత జంధ్యాలు తీసి కొత్త జంధ్యాలువేసుకొనే జంధ్యాల పూర్ణిమ. కొత్తగా ఉపనయనం చేసుకున్నవారు జంధ్యానికికున్న "మౌంజి "అంటే జింక తోలుముక్కను (అసలు అప్పటిదాకా ఉంచుకుంట )తీసేసే రోజు. దీనికే ఉపాకర్మఅంటారు

. రాఖీ పండగ కూడా. దీనినే రక్షాబంధనం అంటారు. స్త్రీలు తమ సోదరులకు రక్ష కట్టి వారికి అన్నిరకాల విజయాలు కలగాలని కోరుకుంటారు. సోదరులు వారి కోరికలు తీరుస్తారు.

స్వయం సేవకుల రక్షా బంధన్




రాష్ట్రీయస్వయం సేవక్ సంఘ్ ఈ రోజు రక్షాబంధన దినోత్సవాన్ని పరమ పవిత్రంగా నిర్వహిస్తుంది. ధ్వజానికి పూజ చేసిన రక్షలనుకట్టి స్వయంసేవకులు ఒకరికొకరు రక్ష కట్టుకొని దేశం కోసం సర్వాన్ని త్యాగం చేస్తామని శపథం చేస్తారు. ఆర్. ఎస్. ఎస్. నిధికోసం తమకు తోచిన ధనాన్ని కవర్లలో పెట్టి గుప్తంగా ధ్వజం దగ్గర ఉంచుతారు. ఇవన్నీ రాష్ట్రానికి అక్కడినుంచి నాగపూర్ లోని కేంద్ర సంస్థకు చేరుతాయి. ఇందులో నిర్బంధ వసూలు ఉండదు స్వచ్ఛందంగా యెంత ఇవ్వాలనిపిస్తే తమ శక్తిని బట్టి సమర్పిస్తారు. ఎవరెంత సమర్పించారో మిగిలినవారికి తెలీదు

అలెక్జాండర్ ప్రాణం కాపాడిన రాఖీ



అలెక్జాం డర్ పురుషో త్తముడితో యుద్ధం చేస్తున్నప్పుడు గ్రీసు దేశం నుండి అతనితో పాటు వచ్చిన అతడి ప్రియురాలు రుక్సానా భారత వీరుడైన పురుషోత్తమ పరాక్రమం ముందు గ్రీకు వీరుడు నిలువ లేడని గ్రహించి, మారువేషం లో వచ్చి పురుషోత్తముడికి రక్షబంధనం కట్టి సోదరిగా తనభర్త ఓడిపోయినా చంపవద్దని కోరింది. అలేగ్జాండర్ పురుషోత్తముడి చేతికి చిక్కి అతనిపై కత్తి ఎత్తగా

చేతికున్న రాఖీ కనబడి చంపకుండా వదిలేశాడు. ఆతర్వాత జరిగిన కథ మనకు తెలిసిందే.

### ఇంద్రుని విజయానికి రక్ష కట్టిన శచీదేవి

భవిష్య పురాణం ఇంద్రుడు బలి చక్రవర్తిపై యుద్ధానికి వెడుతున్నప్పుడు భార్య శచీ దేవి విష్ణు మూర్తిని ప్రార్ధించి ఆయన సలహాతో లక్ష్మీ దేవి ఇచ్చిన దారపు రక్షకట్టి విజయం కలగాలని కోరిందని, దాని వలన బలిని ఓడించాడని చెబుతోంది. అప్పటి నుంచే రక్షాబంధనం లోకం లో ఆనవాయితీగా వస్తోందన్న మాట.

### వినాయకుని కుమారులులకు రక్ష కట్టిన కూతురు సంతోషిమాత

వినాయకుడికి శుభుడు లాభుడు అనే ఇద్దరు కొడుకులు. తమతో ఆడుకోవటానికి, రక్షాబంధనం కట్టటానికి ఒక చెల్లెలు ఉంటే బాగుండును అనుకొని తండ్రికి చెప్పారు. అది జరగనిఅపని అన్నాడాయన. నారదమహర్షి వచ్చి కుమార్తె ఉంటేనే ఇంటికి మంగళ ప్రదం కనుక వారి కోర్కె తీర్చమన్నాడు. సరేనని "సంతోషి మాత"ను సృష్టించి తనభార్యలు రిద్ధి, సిద్ధిలకు ఇచ్చాడు, గణేశ పుత్రులు తమ చిట్టి చెల్లెలు సంతోషి చేత రక్షాబంధనం కట్టించుకొని కోరిక తీర్చుకున్నారు.

### బలికి రక్షకట్టి "హరి"కి పాతాళ చెర విడిపించిన " సిరి"

భాగవతం లో విష్ణుమూర్తి వామనావతార మెత్తి మూడడుగులదానం పుచ్చుకొని, త్రివిక్ర ముడై ముల్లోకాలను ఆక్రమించాడని, దీనికి ప్రతిఫలంగా బాలి ఆయనను పాతాళం లో తనదగ్గరే ఉండి పొమ్మని వరం కోరితేసరే నని అక్కడే ఉన్నాడని. భర్త శ్రీ మహా విష్ణువు లేని వైకుంఠం లో ఉండలేక ఎలాగైనా భర్తను తెచ్చుకోవాలని లక్ష్మీదేవి పాతాళం చేరి, బలికి సోదరిగా రక్షాబంధన్ కట్టి వరం గా తనభర్తకు స్వేచ్చ కలిగించమని కోరగా అంగీ కరించి విష్ణువుకుపాతాళం చెర విడిపించాడని ఉంది.

### ద్రౌపది కుంతీ యమధర్మరాజులకు రక్షాబంధనం

భారతం లో ద్రౌపది శ్రీ కృష్ణునికి, కుంతీదేవి మనవడు అభి మన్యుడికి రక్ష కట్టినట్లుంది. యముడు తన సోదరి "యమున"ను చూసి 12 ఏళ్ళు అయింది. ఆమె చాలాబాధపడి గంగను సంప్రదించింది. ఆమె యముడికి విషయం తెలియజేసింది యముడు యమునవద్దకు వచ్చి సంతోషం కలిగించి వరం కోరుకోమనగా వీలైనప్పుడు వచ్చి సోదరి క్షేమ సమాచారాలు కనుక్కోమని కోరింది. ఆమె నిష్కల్మష భ్రాతృ భక్తి కి సంతసించి ఆమె శాశ్వ తమైన యమునానదిగా మారిపోయే వరం కూడా ప్రసాదించాడు. ఈ పండుగను కొన్నిప్రాంతాలలో "భాయ్ దుజ్ "పేరిట రక్షాబంధన దినోత్సవంగా నిర్వహిస్తారు. ఇక్కడ మరొక్క ముఖ్య విషయం ఉంది. ఆడపిల్ల పుట్టింటికి తప్పని సరిగా 12 ఏళ్ళలోపు మళ్ళీ వెళ్ళాలి. అలాగే సోదరుడుకూడా సోదరి ఇంటికి పన్నెండు ఏళ్ళు దాటకుండా మళ్ళీ వెళ్ళాలనే సంప్రదాయం కూడా ఉంది. ఏ కాగితానికైనా గడువుకూడా 12 ఏళ్ళు. తర్వాత లిమిటేషన్ దాటింది కనుక చెల్లదు అంటారు.

### రవీంద్రుడు భారీ ఎత్తున నిర్వహించిన రక్షా బంధన్

1905 లో బ్రిటిష్ ప్రభుత్వం బెంగాల్ విభజన చేసింది. అప్పుడు రవీంద్రనాథ టాగూర్ బెంగాల్ లోని హిందూ ముస్లిం ల నందరినీ సమావేశ పరచి "రక్షాబంధన దినోత్సవం "పెద్ద ఎత్తున జరిపి, అందరూకలిసి కలిసికట్టుగా అన్నదమ్ము లలాగా మెలగుతూ బ్రిటిష్ పాలనను ఎదిరించాలని పిలుపు నిచ్చాడు. ప్రజల మనోభావాలకు దెబ్బతగిలిందని గుర్తించిన బ్రిటిష్ ప్రభుత్వం బెంగాల్ విభజన ను 1911 లో ఆరేళ్ళ తర్వాత వెనక్కు తీసుకున్నది. కానీ దీన్ని ముస్లిం లు వ్యతిరేకించగా పాపం ఇంత శ్రమపడిన టాగూర్ ప్రయత్నం విఫలమైంది. మళ్ళీ బెంగాల్ విభజన చేసి తూర్పు బెంగాల్ అంటే బంగ్లాదేశ్ ఏర్పరచి ముస్లిం డామి నేషన్ కు బలం కూర్చింది. మిగిలినదానికి పశ్చిమబెంగాల్ అన్నది. అయినా టాగూర్ రక్షాబంధన మహోత్సవాలను భారీ జనసమూహాలతో క్రమం తప్పకుండా నిర్వహిస్తూ ఐక్యత కోసం శ్రమించాడు. ఇప్పటికీ అక్కడ రక్షాబంధన్ మహోత్సవంగా జరుగుతూనే ఉంది. రవీంద్రుడు "రాఖీ పై ఒక దివ్య కవిత కూడా రాశాడు –చూడండి

The love in my body and heart
For the earth's shadow and light
Has stayed over years.

With its cares and its hope it has thrown

A language of its own
Into blue skies.

It lives in my joys and glooms
In the spring night's buds and blooms
Like a Rakhi-band
On the Future's hand..

## సిక్కులు జరిపిన రాఖీ పండగ

18 వ శతాబ్దం లో శిఖ్ ఖాల్సా సైన్యం రాఖీ అంటే రక్షాబంధన్ ను ప్రవేశపెట్టి ఆఫ్ఘన్ చొరబాటు దారుల నుండి రైతుల రక్షణకు వారికి రక్షకట్టి కాపాడారు. వారికి పలువిధాల వొలంకోతలు వగైరాలకు సాయం చేశారు '

సిక్కు సామ్రాజ్య స్థాపక పాలకుడు రాజా రంజిత్ సింగ్ రాఖీ బంధనోత్సవాన్ని జరిపేవాడు. ఆయన భార్య మహారాణి "జిందా "నేపాల్ రాజుకు రక్షా బంధనాన్ని పంపింది. ఆమెను అతడు సోదరిగా భావించి సిక్కు సామ్రాజ్య పతనం తర్వాత ఆమెకు నేపాల్ లో ఆశ్రయం కలిగించాడు. సిక్కులు రాఖీని "రఖార్డి"అంటారు అంటే రిస్ట్ బాండ్ అంటే మోచేతికి కట్టేది అని అర్థం. దీన్ని కానుకల దినోత్సవంగా ఘనంగా నిర్వహిస్తారు.

మనదేశం లో మహిళలు ముఖ్యమంత్రులకు ప్రధాని రాష్ట్రపతి మొదలైన వారికి రాఖీలు విజయం చేకూర్చాలని కోరు తారు. ఫోటోలు దిగుతారు ఫేస్ బుక్కుల్లో అంటిస్తారు.

## శ్రీ కృష్ణాష్టమి



ఇలా శ్రావణ శుక్ల పక్షమంతా నోములు వ్రతాలు పండగలతో గడిచిపోతుంది. శ్రావణ కృష్ణ అష్టమి శ్రీ కృష్ణాష్టమి శ్రీ కృష్ణుడు జన్మించిన కృష్ణాష్టమి. జన్మాష్టమి. రోహిణీ నక్షత్రం లో కృష్ణుడు దేవకీ దేవికి సకల విధ ఆయుధాలు ఆభరణాలలతో కారాగారం లో అంటే ఈనాటి మధుర లో పుట్టాడు. ఆసమయం లో కృష్ణ జననం పారాయణ చేస్తారు. సెప్టెంబర్ 3సోమవారం జన్మాష్టమి. వైష్ణవాలయాలన్నీ మహా సంబరంగా జరుపుతాయి. వీధులలో ఉట్టి వేలాడ దీసి కొట్టటం ఒక పెద్ద వేడుక.. ఆలయాలలో బాలింతరాల్లకు పెట్టె కట్టె కరం చేసే నైవేద్యం పెడతారు. గోపికా కృష్ణ వేషాలు దరించి జనాలకు ఆనందం కలిగిస్తారు. అన్నమయ్య "సఖులాలా సఖులాలా చూడరో శ్రావణ బహులాస్టమి "అనే కీర్తన రాసి చరితార్థం చేశాడు. బాలకృష్ణ లీలలకు మురుస్తాం యవ్వన కృష్ణ లీలలకు పరవశమౌతాం.పెద్ద కృష్ణుని రాజకీయ చాతుర్యానికి అబ్బో అంటాం. ఏ దశలోనైనా కృష్ణుడు మనోహరుడు. అందుకే ఆయనను "లార్డ్ ఆఫ్ ఆటం మూన్స్ "అంటే "శరత్ చంద్ర ప్రభువు "అన్నారు, మీరాబాయ్వంటి మహాభక్తులెందరో శ్రీ క్రష్ణభక్తులు జన్మ చరితార్థం చేసుకున్నారు. కృష్ణలీలలు మధురాతిమధురం. వాటికి పరమ మాధుర్యం కలిగించాడు భాగవత పోతన్న. మధురలో కృష్ణాష్టమి వేడుకలు పులకరింప జేస్తాయి.

## సర్వేపల్లి జయంతి ఉపాధ్యాయ దినోత్సవం



సెప్టెంబర్ 5 సర్వే పల్లి రాధాకృష్ణ పండితుని అన్మదినం. ఉపాధ్యాయ దినోత్సవంగా దేశమంతా నిర్వహిస్తారు. ఉత్తముపాధ్యాయులను ప్రభుత్వాలు గుర్తించి సన్మానిస్తాయి. సరసభారతి ఈ రోజునే ఉదయం 10 గం.లకు శ్రీ కోటగురువరేణ్యులు స్వర్గీయ శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రిగారి గురుపూజోత్సవం స్థానిక అమరవాణీ హైస్కూల్ లో సంయుక్తంగా నిర్వహిస్తోంది. ప్రముఖ అతిధులు, గురు పుత్రులు కోట సోదరులు పాల్గొనే ఈ కార్యక్రమంలో"కవి రాజ మౌళి, కవి సార్వ భౌమ, మధురకవి, అష్టావధాని, కనకాభి షేకి, 70 గ్రంధాల రచయిత, విశ్రాంత తెలుగు పండితులు, గుంటూరు జిల్లావాసి, 93 ఏళ్ళ శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మగారికి సన్మానం చేస్తూ, స్థానిక ఉపాధ్యాయును సన్మానిస్తూ, శ్రీ మైనేని గోపాల కృష్ణ శ్రీమతి సత్యవతి (అమెరికా )దంపతులు, కోటసోదరులు ఏర్పాటు చేసిన మాస్టారి స్మారక నగదు బహుమతులను అర్హులైన విద్యార్ధులకు అందజేసి సార్ధకం చేస్తోంది.

## పోలాల అమావాస్య







శ్రావణ బహుళ అమావాస్య "పోలాల అమావాస్య"సెప్టెంబర్ 9 ఆదివారం. పోలాంబా వ్రతం చేస్తారు వృషభానికి ఆహారం పెట్టే రోజు. హిరణ్య కశిపుని సోదరి సింహిక. విప్రసిద్ధి భార్య కొడుకు అంధకాసురుడు. బ్రహ్మను తపస్సుతో మెప్పించి వరాలు పొందాడు. వీడు గుడ్డివాడేకాదు, కామాంధుడుకూడా. వరగర్వం తో వీడికామ దృష్టి జగన్మాత పార్వతీదేవిపై పడింది. శివుడు భూలోకం వెళ్ళినప్పుడు, కైలాసం వెళ్లి అమ్మవారితో అనుచితంగా మాట్లాడగా నందీశ్వరునికి కోపంవచ్చి వాడిపై యుద్ధం చేస్తుండగా శివుడు కూడావచ్చి, వాడిని అడ్డగించి సంహరించాడు. అందుకే శివుడిని "అంధకాసురకాంతకే మమ కిం కరష్యతి వైళమః "అని శివుడిని స్తుతిస్తాం. నందీశ్వరుని పోరాటపటిమకు మెచ్చి వరం కోరుకోమనగా తాను తన తండ్రి శిలాదునికి పొలం దున్నుతుంటే వృషభ రూపం లో లభించానని, కనుక ఆ రోజున వృషభ లేక గోపూజ చేసేవారికి ఆహారం పెట్టేవారికి సకల శుభాలు కలిగేట్లు చేయి అని అడగగా తథాస్తు అన్నాడు శివుడు. కనుక వృషభ పూజ పోలాల అమావాస్య నాడు తప్పని సరిగా చేస్తారు. అవి దొరక్కపోతే ఆవులకైనా పూజ చేయవచ్చు.

మరో కధ కూడా ఉంది. ఈ రోజున పోలేరమ్మతల్లి అనుగ్రహం కూడా పొందాలి,దీనికొక కథ ఉంది. పూర్వం ఒక బ్రాహ్మణుడికి ఏడుగురు కొడుకులు. శ్రావణ బహుళ అమావాస్య నాడు పోలేరమ్మ తల్లి పూజ చేసేవారు, ఏడవ బిడ్డ పుట్టి మరణిస్తుంటే పూజ చేయలేకపోయారు..చివరి సారిగామళ్ళీ ఏడవ బిడ్డ పుట్టగానే చనిపోయాడు. ఏమైతే అయిందనే మొండి ధైర్యం తో వాడిని గదిలోపెట్టేసి బయటికి వచ్చి మిగిలిన కొడుకులతో పోలేరమ్మ పూజ చేసింది అతనిభార్య. ఆ రాత్రి పిల్లాడి శవాన్ని తీసుకువెళ్ళి పోలేరమ్మ గుడి మెట్ల పై పడేసి రోదిస్తూ కూర్చుంది. పోలేరమ్మ ఆరాత్రి గ్రామ సంచారం చేస్తూ, ఏడుస్తున్న ఆమెను వోదార్చికారణం అడిగి తెలుసుకొని వాడినిబతికించటమేకాక, అక్షతలిచ్చి ఇదివరకు చనిపోయిన బిడ్డలను

పూడ్చిన చోట చల్లమని చెప్పింది. ఆమె అలా చేయగా, చనిపోయిన పిల్లలందరూ బతికి వచ్చారు. అందుకే కృతజ్ఞతగా పొలాల మావాస్యనాడు పోలేరమ్మ తల్లి అనుగ్రహాన్ని, శివానుగ్రహాన్ని పొందటానికి పోలేరమ్మ పూజ చేస్తారు.

గోదావరి జిల్లాలలో ఇదే రోజు "కంద పిలకలు "అమర్చి పూజ చేసే అలవాటు ఉంది. కంద లో ఏభాగంలోనుంచైనా మొలకలు వస్తాయి. అది సంతానహేతువుగా భావించి పూజిస్తారని నా ఊహ. గోదావరి జిల్లాలో వివాహాది శుభకార్యాలలో అందుకే కందా బచ్చలి కూర వండటం కూడా శుభం కోసమే. ఇప్పుడు ఆవంటకం అన్ని జిల్లాలకూ పాకింది.

## వైశాఖ పౌర్ణమి



ఆ.కా.,మా.,వై. పౌర్ణమి లలో పవిత్ర సముద్ర స్నానాలను చేస్తాం. ఆ వరుస లో చివరి పున్నమి వైశాఖ. దీన్నే మహా వైశాఖి గా భావిస్తారు. దీని తరువాత వచ్చేది జ్యేష్ట పౌర్ణమి ని ఏరువాక పౌర్నమని, ఆ తర్వాతా వచ్చే ఆషాఢపున్నమిని గురు పూర్ణమి లేక వ్యాస పూర్ణిమ లేక జయంతి అని, ఆ తరువాత వచ్చే శ్రావణ పౌర్ణమి ని జంధ్యాల పూర్ణమి లేక రాఖీ పౌర్ణమి గా జరుపుకొంటాం. వైశాఖ పౌర్ణమి ని బుద్ధ పూర్ణిమ గా భావిస్తారు. అన్నమయ్య జయంతి కూడా ఈ రోజే కావటం యాదృచ్చికం. ఇది ఎల్లుండి అంటే మే ఆరవ తేది ఆదివారం.

శాక్యముని గా, ఆసియా జ్యోతి గా, అహింసా మూర్తి గా, కరుణా సింధు గా, ప్రేమ నిలయునిగా, విశ్వ జ్యోతి గా పూజింపబడే, ఆరాధింప బడే గౌతమ బుద్ధుడు జన్మించిన రోజు, జ్ఞానోదయాన్ని పొందిన రోజు, మహానిర్యాణం చెందిన రోజు వైశాఖ పౌర్ణమి అవటం చాలా గొప్పగా ఉంది. అందుకనే బౌద్ధ మతావలంబులకు వైశాఖ పౌర్ణమి పరమ పవిత్ర మైనది. ఈ రోజు విశిష్టతను తెలుసు కొందాం. శుద్ధోదన మహారాజు కుమారు డైన సిద్ధార్థుడు ప్రాపంచిక సుఖాన్ని రోసి, మనసు ను దిటవు పరచుకొని, భార్యా, పిల్లవాడిని రాజ్యాన్ని వదలి ఆత్మా జ్ఞాన సముపార్జనకు బయల్దేరాడు. దాదాపు ఎనిమిదేళ్ళు శరీరాన్ని అతి కష్టాల పాలు చేసి కొని శారీరకం గా బాగా బలహీనుడై పోయాడు. నాలుగు ఏళ్ళు "సమాన "స్తితి లో అంటే నడకే తప్ప, ఆహారం ఏమీ తీసుకో క పోవటం కటిక ఉపవాసం తో గడి పాడు. అప్పుడు బీహారు రాష్ట్రం లో గయకు దగ్గర ప్రవహించే "నిరంజన నది "దగ్గరకు తనతో బాటు వస్తున్నా అయిదుగురు యాత్రికు ల తో పాటు చేరు కొన్నాడు. చాలా బలహీన పడి,శల్యా వసిస్తుడై, ప్రాణాలు గాలిలో కలిసి పోయే స్థితి లో ఉన్నాడు.అ నది లో ఎప్పుడూ మోకాలు లోతు నీరు సుళ్ళు తిరుగుతూ ప్రవహిస్తుంది. ఇప్పుడు ఆ నది సరస్వతి మొదలైన కొన్ని నదుల లానే అంత రించి పోయింది. కని పించదు. ఆ నది ని దాటే ప్రయత్నం చేశాడు సిద్ధార్ధుడు. బలహీనుడై పోవటం వల్ల అడుగు కూడా ముందుకు వెయ్య లేక పోయాడు. అప్పుడు అనుకో కుండా ఒక ఎండు చెట్టు కొమ్మ కొట్టుకు వస్తు, కని పించింది. దాన్ని పట్టు కొని కొన్ని గంటలు నీటి లో, ఆ ప్రవాహా ఉద్ధృతి లో ఉండిపోయాడు. కాళ్ళు తడ బడుతున్నాయి. మానసిక పరిశోధన చేయాలను కొన్న తనకు ఈ పరీక్ష ఏమిటి ?అను కొన్నాడు. తన ప్రయత్నం లో ఏదో లోపం ఉందని పించింది. ఇది తెలియగానే అనుకోకుండా కొంత కొత్త శక్తి శరీరం లో చేరి నట్లని పించింది. ఆ శక్తి తో నిరంజన నదిని దాటాడు. అలసటగా ఉన్నందున అక్కడ ఉన్న బోధి వృక్షం కింద కూర్చుండిపోయాడు. తనకు జ్ఞానోదయం కలిగే వరకు అక్కడి నుంచి కదలను అని ఒక వేళ కలుగక పోతే మరణమే శరణ్యం అని ప్రతిజ్ఞా చేశాడు.



శరీరం లోని సర్వ శక్తుల్ని కేంద్రీకరిస్తేనే సాధానా ఫలం లభిస్తుందని తెలుసు కొన్నాడు. +అది పొందటానికి ఒక్క క్షణం చాలు. లేక పోతే యుగాలైనా సరి పోవు. దీన్నే సామన అనే సాధన గా భావిస్తారు. అంతే –అది వైశాఖ పౌర్ణమి రోజు, పూర్ణ చంద్రుడు ఆకాశం లో వెన్నెల కురి పిస్తున్నాడు. ఆ క్షణం లో గౌతమునికి అకస్మాత్తు గా జ్ఞానోదయం అయింది. వింత కాంతి శరీరం అంతా ఆవహించింది. ముఖం వెలుగులు చిమ్మింది. కొన్ని గంటలు ఆ నిశ్చేతన స్థితి లో గడి పాడు. తరువాత లేచి నిల బడ్డాడు. తనతో ఉన్న తోటి ప్రయాణీకులతో "భోజనం చేద్దాం "అన్నాడు మొదటి సారిగా నోరు విప్పి. వాళ్ళు ఆశ్చర్య పోయారు. గౌతమునికి ఏదో అయిందని భావించారు. ఆహారం కోసం తహతహ లాడుతున్నా డేమో నని భ్రమ పడ్డారు. వారి భావాన్ని

గ్రహించిన తథాగత బుద్ధుడు "మీరు పొర బడ్డారు. నేనన్నది ఉపవాసానికి సంబంధించింది కాదు. ఎరుక ఫలితం, జ్ఞానోదయ విశేషం. దాన్ని స్వీకరిద్దాం అని నా ఉద్దేశ్యం '.ఈ వైశాఖ పౌర్ణమి రోజున వెన్నెల కురుస్తుండగా నాలో "జ్ఞాన పూర్ణ చంద్రోదయం "అయింది. నాలో వచ్చిన మార్పు ను గమనించండి. "అని వివరించాడు. వారికేమీ అర్ధం కాక, ఆయన ప్రాణానికి ఆయన్ను వదిలేసి, తమ దారి తాము చూసుకోవటానికి వెళ్లి పోయారు. కొన్నేళ్ళ తర్వాత బుద్ధుడు వారిని వెతుక్కొంటూ సారనాద్ చేరి వారిని కలుసు కొని తన ధర్మాలను వివరించి జ్ఞానోదయం కల్గించి శిష్యులుగా స్వీకరించాడు. 2600 సంవత్సరాలు అయినా ఇంకా ఆ మహాను భావుడైన బుద్ధుని భగవానుని గా ప్రపంచం అంతా కొలుస్తూనే ఉంది. ప్రపంచ శాంతికి ఆయన బోధన లే శరణ్యం గా భావిస్తోంది.

## బుద్ధుడు అంటే ఎవరు ?



జాగృతి, ఎరుక. లేక జ్ఞానోదయం ను పొందిన వాడిని బుద్ధుడు అంటారు. అజ్ఞానం అనే నిద్ర వదిలించుకొని జ్ఞానం అనే ప్రకాశాన్ని పొంది, సకల వస్తు జాలం యొక్క నిజ స్వరూపం తెలిసిన వాడే బుద్ధుడు. దోషరహితుడైన వాడు, మానసిక నిషేదాలకు అతీతుడు బుద్ధుడు. గౌతమ బుద్ధుని కంటే ముందు చాలా మంది బుద్ధులున్నారు. భవిష్యత్ లోను ఉంటారు. బుద్ధునికి తెలియనిది ఏదీ ఉండదు. భూత, భవిష్యత్, వర్త మానాలను ఒకే సారి చూడ గల ప్రజ్ఞ అతనికి ఉంటుంది. పరిమితి లేని భూత దయ, కారుణ్యం, ప్రేమా ఉన్నవాడు బుద్ధుడు. పక్ష పాతం లేకుండా అందర్నీ హృదయానికి ఆప్యాయం గా హత్తు కొనే వాడు బుద్ధుడు.

బుద్ధుడు జీవులను ఉద్ధరించే కార్యక్రమాలను నిర్వహిస్తాడు. బుద్ధుని ప్రభావం వల్ల క్రూర జంతువులూ కూడా తమ క్రూర స్వభావాన్ని వదిలి సాధువులు గా మారి పోతాయి. బుద్ధుడు ఆధ్యాత్మిక గురువు గా ఉండి విశ్వ జనుల మానసిక పరి పక్వత ను పెంపొందిస్తాడు. ఆచార్య నాగార్జునుడు చెప్పి నట్లు బుద్ధుని సాయం పొందని జీవి లేనే లేదు.. బుద్ధుని దయా, సానుభూతి, అనుకంప, ప్రేమ, కరుణ లు మాటల, చేతల పరిధి ని దాటి ఉంటాయి. బుద్ధుని జ్ఞానం, పరిపూర్ణత, శక్తి వర్ణనా తీతం. మనం ఒక వస్తువు ను ఎంత స్పష్టం గా కళ్ళతో తో చూడ గలమో, బుద్ధుడు అయిన వాడు ఈ విశ్వాన్ని అంతటిని, అంత స్పష్టం గా చూడ గలడు.ఇతరులకు ఏది మంచిదో ఆయనకు పూర్తిగా తెలుసు. దానినే అప్పటి కప్పుడు ఆయన చేస్తాడు. దాని కోసం ముందస్తు ప్రణాళిక ఆయనకు ఉండదు. సూర్యుడికి వేడి నివ్వటం, ప్రకాశాన్నివ్వడం అన్న ధర్మం ఎంత సహజమో, బుద్ధునికి ప్రేమ, కారుణ్యం,దయా, సహాయం అంత సహజాతాలు. పరోప కారమే బుద్ధుని శ్వాస.

## గౌతమ బుద్ధుని బోధనలు

మనసుకు శిక్షణ నివ్వటానికి బాహ్య నియమాల కంటే అంత రంగిక నియమాలకే విలువనివ్వాలి, వాటి పైనే ఆధార పడాలి అన్నాడు బుద్ధ భగ వానుడు. పని చేయటానికి పరిస్థితులు అనుకూలించాలి అని తాత్సారం చేయరాదంటాడు. మనం మనకు వ్యతి రేకం గా ఉన్న పరిస్తితులను కూడా అనుకూలం గా మార్చుకొనే సమర్ధత ఉన్న వాళ్ళం అని గ్రహించాలి. పరిస్థితులను మార్చాలనే ప్రయత్నం లో మునిగి పోతే, ధర్మా చరన అసాధ్యమవుతుంది అన్నాడు శాక్యముని. ఆ ప్రయత్నం లో ధ్యానం పై మనసు నిలవదని హెచ్చ రించాడు. సమయమూ వృధా అయి కోరికలకు అంతు లేకుండా పోతుంది. ఈ క్షణమే మనకు అనుకూలం, పవిత్ర మైనది అన్న భావన తో పని చేయాలి. వచ్చిన, చేతి లో ఉన్న అవకాశాన్ని దుర్విని యోగం చేసు కోరాదు.భౌతిక సంపాదనే ధ్యేయం కాదు. ధనం చేరితే సమస్యలూ పెరుగు తాయి. జీవిత పరమార్ధం నిర్వాణమే. ధర్మా చరణ వల్లనే ఇది సాధ్యం. మనసు అదుపు లో ఉంటె, అన్నీ మన వశం అవుతాయి అని స్పష్టం గా చెప్పాడు భగవానుడు.



ధర్మం అంటే పరి పూర్ణత. బుద్ధ బోధనలు అనుసరిస్తే స్వీయ రక్షణ ఏర్పడుతుంది. ధర్మా చరణ అంటే ఉత్కృష్ట మాన వ జీవనమే. భౌతికాభి వృద్ధి కాదు. అంత రంగ పరి పూర్ణత సాధించటమే. మానశిక శాంతి, ఆనందం పొందటమే. పూర్వకాలం లో బుద్ధులందరూ అతి నిరాడంబర సామాన్య జీవితాన్నే గడి పారు. వ్యతిరేక పరిస్థితుల్లో జీవించారు. అయితే బుద్ధ బోధనలను ధర్మాన్ని పాటించి సుఖ, శాంతులను పొందారు. గౌతమ బుద్ధుని బోధలను అనుసరించితే బాహ్య, ఆంతరంగిక శాంతి సౌఖ్యం లభిస్తాయి. ఆదర్శ జీవన విధానం వల్ల ఇవి సాధ్యమవుతాయి.

ఒక సారి బుద్ధుడు "కల్మా నగరం "లో విహరిస్తుంటే, ప్రజలు ఆయన్ను కలిసి "చాలా మంది గురువులు చాలా విషయాలు చెబుతున్నారు. అవి పరస్పర విరుద్ధం గా ఉన్నాయి. ఒకదానికొకటి పొంతన గా లేవు. మేము దేన్నీ పాటించాలో పాలు పోవటం లేదు. దయ చేసి మార్గ దర్శకం చేయండి "అని వేడు కొన్నారు. దానికి బుద్ధ భగ వానుడు ప్రశాంత చిత్తం తో పది సూత్రాలు చెప్పాడు. ఒకటి –చాలా సార్లు చెప్పారని, రెండు –గ్రంథాల్లో ఉన్నాయని, మూడు –గురువు చెప్పాడని, నాలుగు –చుట్టూ ఉన్న వారు చేస్తున్నారని, అయిదు –అందులో అలౌకిక శక్తులున్నాయని, ఆరు –మీ నమ్మకానికి సరిగ్గా ఉందని, ఏడు –ఆలోచనకు సరైనదిగా కని పించిందని, ఎనిమిది –సంఘం లో గౌరవ నీయ వ్యక్తులు బోధించారని, తొమ్మిది –గురువు అదే సత్యం అని గట్టిగా పడే పడే చెప్పాడని, పది –దాన్ని సమర్ధించ టానికి లేక ఎదురు తిరగటానికి అని –నమ్మ వద్దు. మీ అనుభవానికి, ఆలోచనకు, వివేకానికి, నీకు, సమాజం లో అందరికి ఉప యోగా పడుతుందని అనుకొంటే నే నమ్మి ఏదైనా ఆచరించు "అని అతి స్పష్టం గా తధాగతుడు మార్గ నిర్దేశం చేశాడు.

"నా బోధలు వేదాంతం కాదు. అవి నా సూటి అనుభవ ఫలితాలు. అవి సాధనకు మార్గం కానీ ఆరాధనకు మార్గం కాదు. నేను చెప్పిందంతా నది దాటే కర్ర పుల్ల అంటే తెడ్డు లాంటిదే. ఒడ్డుకు చేరిన తరువాత ఆ తేడ్డును భుజాన వేసు కొని మోసుకొని తిరిగితే, వెర్రి వెంగళప్ప అంటారు. శిష్యుడు బంధువు అయిన ఆనంద తో "ఆనందా !నా మీద గౌరవం తో, ప్రేమ, అనురాగాలతో ధర్మాన్ని పాటించ వద్దు. అలా చేస్తే నిన్ను నేను శిష్యునిగా భావించను. ఆ ధర్మాన్ని నువ్వు నీ అనుభవం తో జోడించి అనుసరిస్తే సత్యాన్నితెలుసు కొ గలుగు తావు. , అప్పుడే నువ్వు నాకు నిజమైన శిష్యుడివి అని పించు కొంటావు "అని అతి విష్పస్తం గా ధర్మా చరణ విధానాన్ని విశ్లేషించి చెప్పాడు భగవాన్ బుద్ధుడు.

అశాంతి, హింస, దౌర్జన్యం, అజ్ఞానం, అవివేకం, మానసిక దౌర్బల్యం పెచ్చు మీరి అశాంతి తో అలమటిస్తున్న నేటి సకల మానవాళి కి బుద్ధుని బోధలు రక్షా కవచాలు. బుద్ధ పౌర్ణమి అని పిలువ బడే ఈ వైశాఖ పౌర్ణమి నాడు ఆ అహింసా మూర్తి ని ఒక సారి జ్ఞాపకం చేసుకొనే ప్రయత్నం చేశాను. ఓం శాన్తిహి.

## రక్షా బంధనం

భారత దేశం లో అనాదిగా వస్తున్న సంప్రదాయం శ్రావణ పౌర్ణమి నాడు వచ్చే రక్షా బంధనోత్సవం. ఆ రోజు దేశానికి అంకిత మై పని చేస్తానని శపథం చేసే వారు. శివాజీ మహా రాజు కాలం లో దీన్ని బాగా జరిపే వారని తెలుస్తోంది. అదే సంప్రదాయాన్ని రాష్ట్రీయ స్వయం సేవక సంఘం అనే ఆర్.ఎస్.ఎస్.తన శాఖలలో దేశమంతా ఈ పండుగను నిర్వ హిస్తుంది. ఆ రోజున స్వయం సేవకు లందరూ ఉదయమో, సాయంకాలమో సంఘ శాఖలకు వెళ్లి భారత మాత స్తుతి సి చేసి కాషాయ జెండా ను ఎగుర వేసి, దానికి అందరు ప్రణామం చేస్తారు. ఈ జెండా తర తరాల నుండి అవిచ్చిన్నంగా వస్తున్న సంస్కృతీ పతాకమే. దాన్నే "భగవా ధ్వజం "అని గౌరవంగా భక్తితో పిలుస్తారు. ఆ పతాకం దేశానికి చిహ్నం గా భావిస్తారు. దానికి గౌరవం ఇవ్వటం అంటే దేశానికి, భగవంతునికి ఇచ్చి నట్లే. ఆ ద్వాజాన్ని స్వయం సేవకు లందరూ పరమ పవిత్రం గా భావించి పూజిస్తారు. పూలు కుంకుమ తో ఒక్కొక్కరు వెళ్లి పూజ చేస్తారు. దానికి కాషాయ రంగు లో ఉన్న పూలతో అలంకరింప బడిన రక్షా బంధాన్ని కడతారు. మళ్ళీ ప్రణామం చేసి వచ్చి తమ స్తానాల్లో కూర్చుంటారు. ఆ తర్వాతా ఒకళ్ళ చేతికి ఒకరు రక్షా బంధాన్ని కట్టు కొంటారు. దేశాన్ని రక్షించటానికి సర్వదా సిద్ధం గా ఉంటామని, ఆత్మ బలిదానానికి సిద్ధమౌతామని దేశ స్వాతంత్రాన్ని సంరక్షిన్చుకోవటానికి, భగవాధ్వజాన్ని కాపాడు కోవటానికి, భారతీయ సంస్కృతి ధర్మాల పరి రక్షణకు సంసిద్ధులం గా ఉంటామని సామూహికం గా ప్రతిజ్ఞ చేస్తారు. ఆ తర్వాత అందరికి తలా ఒక ఖాళీ కవరు అంద జేస్తారు. అందులో చిన్న కాగితం ఉంటుంది. ఆ కాగితం మీద తమ పేరు రాసి తాము సమర్పించే డబ్బు ను అందులో ఉంచి కవరు మూసి మళ్ళీ ఒక్కొక్కరు భగావాద్వజానికి నమస్కరించి, దాని పాదం వద్ద

సమర్పించి వస్తారు. ఇలా స్వయం సేవకుల వద్ద ఒక్క రక్షా బంధనం రోజునే డబ్బు వసూలు చేస్తారు. అదీ ఐచ్చికం గా ఇవ్వటమే. ఈ డబ్బంతా కేంద్ర కార్యా లయానికి చేరుతుంది. అక్కడ లెక్కిస్తారు. మా చిన్నప్పుడు ఉయ్యూరు శివాలయం లో ఆర్.ఎస్.ఎస్. శాఖలలో పాల్గొనటం వల్ల నాకు ఇవన్నీ తెలిశాయి. ఎందుకో ఇవాళ ఇవన్నీ జ్ఞాపకం వచ్చి మీ ముందు ఉంచుతున్నాను. అంకిత భావం తో చేయటం అంటే అదే నని పిస్తుంది. చాలా ఆదర్శ ప్రాయ మన విధానం.

### రాఖీ



ఉత్తరాది నుండి వచ్చిన సంప్రదాయం రాఖీ. సోదరి తన అన్నకో, తమ్ముడికో రాఖీ కడు తుంది. అన్న ఆమెకు ఏదో కానుక ఇస్తాడు. సోదరి అన్నదమ్ములకు తీపి పదార్ధం పెడుతుంది. రాఖీలు అనేక డిజైన్లతో రంగు రంగులతో ఉంటాయి. సోదరిని కంటికి రెప్ప లాగా కాపాడతానని అన్న శపథం చేస్తాడు. ఆమె కోరిక ఏదైనా ఉంటె తీరుస్తాడు. ఇది సోదర, సోదరీల మధ్య ఉన్న గాఢ అనురాగానికి, ప్రేమ, వాత్సల్యాలకు ప్రతీక. కుటుంబ బంధానికి ఒక చిహ్నం. పంజాబ్ రాజస్తాన్, ఉత్తర ప్రదేశ్, మహారాష్ట్రమొదలైన ప్రదేశాలలో రాఖీని అత్యంత ఉత్సాహం గా జరుపుతారు. ఆంధ్ర ప్రదేశ్ లో తెలంగాణా లో జోష్ గా చేస్తారు. ఇప్పుడు రాష్ట్రం అంతటా జరుపు కొంటున్నారు. రాష్ట్రపతి, ప్రధాని, ముఖ్యమంత్రులకు రాఖీ లు కట్టే విధానం వచ్చింది. ఏమైనా సోదర భావం తోఅందరు మెలగాలనే గొప్ప సంప్రదాయం. సంఘం లో ఒకరికొకరు అండగా ఉండాలన్న భావన దీని వెనుక ఉన్న పరమార్ధం.

### రాఖీ వల్ల ప్రాణ రక్షణ పొందిన అలెక్సాండర్

అది క్రీ పూ. 326.నేడు డు పంజాబు రాష్ట్రం అని పిలువబడుతున్న ఈ ప్రాంత రాజ్యాన్ని ఆరోజులలో 'పురుషోత్తముడు "అనే గొప్ప రాజు పరి పాలిస్తున్నాడు. ఇది జీలం చీనాబు నదుల మధ్య ఉంది. గ్రీకు వీరుడు అలెగ్జాండరు ప్రపంచ విజేత కావాలనే ఉద్దేశం తో గ్రీకు లోని మాసిడోనియా నుండి బయల్దేరి, యూరపు అంతటా జయించి ఆసియా ను స్వాధీన పరచుకొని భారత దేశం వరకు వచ్చాడు. సై న్యాన్ని జీలం నది ఒడ్డున విడిది చేయించి పురుషోత్తముని తో, యు ద్ధానికి సన్నద్ధు డవు తున్నాడు. అతన్ని ప్రేమించిన "రుక్సానా "అనే స్త్రీ అలెగ్జాండర్ కు తెలీకుండా అతని ని కంటి ముందు వచ్చి చేరింది. మారు వేషం లో ఉందామె. ఆ రోజు రాఖీ పండుగ. ప్రజలందరూ రాజైన పురుషోత్తముడికి రక్షా కడుతున్నారు. ఆయన వారికి కానుక లిచ్చి పంపిస్తున్నాడు రుక్సానా కూడా వచ్చి రక్ష కట్టింది. ఆయనకు ఆమె కొత్త స్త్రీ అని పించింది. రక్షా కట్టిన తర్వాత"అమ్మా ! నువ్వెవరివి గ్రీకు స్త్రీ లా ఉన్నావు. నీఎకు వచ్చిన ఇబ్బంది ఏమిటి. రక్ష కట్టిన స్త్రీ నాకు సోదరి తో సమానం. ఈ అన్న దగ్గర దాయకుండా మనసు లోని కోరిక తెలియ జేయి. తీరుస్తానని వాగ్దానం చేస్తున్నాను "అన్నాడు. దానికి ఆమె సంకోచపడ కుండా "అన్నా !నేను ప్రపంచ విజేత అలెగ్జాండర్ ను ప్రేమించి వచ్చిన స్త్రీని. నా ప్రియుని ప్రాణ భిక్ష నాకు కావాలి. అదే ఈ చెల్లెలి కోరిక "అన్నది. "నీ కోరిక తప్పక తీరుస్తానమ్మా !"అని వాగ్దానం చేశాడు. సంతోషం తో నిండిన కృతజ్ఞత తో సంతృప్తి తో నమస్కారం చేసి అలెగ్జాండర్ ప్రియురాలు రుక్సానా వెళ్లి పోయింది.

అసలు విషయం ఏమి టంటే-అలెగ్జాండర్ సైన్యం దాదాపు పదేళ్లు గా యుద్ధాలు చేయటం వల్ల అలసట, ఇంటి మీద దిగులు తో ఉంది. ఉత్సాహం గా యుద్ధం చేయటం లేదు. అందులో "పోరస్ "అని పిలువ బడే పురుషోత్తముని గజ సైన్యం చూస్తేనే వారికి వొణుకు పుడుతోంది. భీతి తో బతుకు ఈడుస్తున్నారు. ఇంతవరకు ఎక్కడా అపజయం లేకుండా విజయాలు సాధిస్తున్న అలెగ్జాండరు పురుషోత్తముడి సైన్యాన్ని, ప్రజల తోడ్పాటుని ప్రజల అనన్య దేశ భక్తిని చూసి చలించి పోతున్నాడు. ప్రజలందరూ విజయం పురుషో త్తముడిదే అను కొని మహా పరాక్రమ విక్రమాలతో సిద్ధమైనారు., తన ప్రియుడు ఇక తనకు దక్కడని పురుషోత్తముని యెదిరించి నిలిచి పోరాడి విజయం సాధించే లక్షణాలు అలెగ్జాండరుకు లేవని గ్రహించింది రుక్సానా. తను ప్రాణాధికం గా ప్రేమించిన ప్రియుడు అలెగ్జాండర్ ను కాపాడు కోవాలని బతికి ఉంటె బలుసాకు తిన వచ్చు నని భావించి పురుశోత్తముడికి రాఖీ కట్టింది.

యుద్ధం మహా భీకరం గా సాగుతోంది. మహా గజం ఎక్కి పురుషోత్తమ మహా రాజు యుద్ధం చేస్తున్నాడు. అలెగ్జాండర్ యవనాశ్వం ఎక్కి యుద్ధానికి దిగి ఎదురు పడ్డాడు. ఇద్దరు భీకరం గా పోరాడు తున్నారు. అలెగ్జాండర్ పురు షోత్తముని సమీ పానికి వచ్చాడు. వీర కరవాలం చేత ధరించిన పురుషోత్తముడు ఒక్క సారి ఖడ్గాన్ని అలెగ్జాండర్ మెడ మీద కు తెచ్చాడు. అప్పుడే అతని చేతికి

కట్టిన రాఖీ కాంతులతో ప్రకాశించింది. అంతే రుక్సానా కిచ్చిన వాగ్దానాన్ని గుర్తుకు తెచ్చుకొని చంప కుండా వదిలేశాడు., ఇదే అదును గా యవన సైన్యం పురుషోత్తముని బందీ గా పట్టు కొది. మర్నాడు అలెగ్జాండర్ సముఖానికి తీసుకొని వెళ్లటం ఆయన, ఈయన సాహస ధైర్యాలకు మెచ్చి "మిమ్మల్ని ఎలా గౌరవించాలి "?అని అడగటం ఈ యన "ఒక మహా రాజు ఇంకొక మహా రాజు ను గౌరవించి నట్లు "అని తోణక కుండా సమాధానం చెప్పటంఅందరికి తెలిసిన విషయాలే. ఇలా "రాఖీ "అలెగ్జాండర్ ప్రాణాలను కాపాడినా, మహా వీరుడైన పురుశోత్తముడిని బందీ కూడా చేసింది. అలెగ్జాండర్ చేసిన చివరి యుద్ధం కూడా ఇదే నని మనకు తెలుసు. నిజం గా యుద్ధం లో గెలిచింది పురుషోత్తముడే అంటే భారత దేశమే. చరిత్రను వక్ర గతి లో రాసి అసలు చరిత్రకు మసి పట్టించారు పాశ్చాత్య చరిత్ర కారులు అని భారతీయ చరిత్ర కారులంటున్నారు.

ఈ కధను మేము1954 లో తొమ్మిదో తరగతి చదువు తుండగా మాకు "పురుషోత్తముడు "అనే ఉప వాచకం అంటే నాన్ డిటైల్డ్ పుస్తకం లో మేము చదు వుకున్నది. అప్పటి నుంచి పురుషోత్తముడు అంటే ఆరాధనా భావం ఉంది. అంటే 58సంవత్స రాల క్రితం చదువు కొన్న కధ. ఇవాళ ఎందుకో జ్ఞాపకం వచ్చి ఈ" రక్షా బంధన మహోత్సవం "నాడు మీ దృష్టికి తెచ్చాను అంతే.



## కార్తీక మాస శోభ

కృత్తికా నక్షత్రం పౌర్ణమి నాడు వున్నా క్ నేలను కార్తీక మాసం అంటారు. కృత్తిక అగ్ని నక్షత్రం. శివుడు అగ్ని ని మూడో కన్ను గా కలిగి ఉన్నాడని మనకు తెలుసు. అందుకని శివాలయం లో శివ లింగానికి ఎదురు గా నందీశ్వ రున్ని ఎర్పాత్రు చేస్తారు. నంది నాసిక పుతలనుంచి వచ్చే చల్లదనం శివుని వేడిని తగ్గిస్తుందని అభి ప్రాయం. అందుకే లింగానికి, నదికి మధ్య గా ఎవ్వరు నిలబదరు, మధ్య లోంచి వెళ్లారు.



రేపటి తో కార్తీక మాసం పూర్తి అవుతుంది రేపు అమావాష్య. అమా వాష్య తెల్ల వారు ఝాముున "పోలి"ని స్వర్గానికి పంపు తారు. దీనికి ఒక కధ వుంది. ఒక చాకలి ముసలి ఆవిడకు అయిదుగురు కోడళ్ళు ఉన్నారట. ఆమె ఆశ్వ యుజ బహుళ అమావాష్య నుంచి కార్తీక బహుళ అమా వాష్య వరకు తెల్ల వారు ఝామునే లేచి, ఏటి లో చన్నీటి స్నానం చేసి దీపం పెట్టు కొనేది. ఇలా ఒక నెల గడి చిన తర్వాత కార్తీక అమావాష్య నాడు చిన్న కోడలు "పోలి"ని ఇంటికి కాపలా పెట్టి మిగిలిన కోడళ్ళను తీసుకొని నది ఒడ్డుకు వెళ్ళింది. చిన్న కోడలు పెరుగు చిలికి వెన్న తీసి, కవ్వానికి అంటిన వెన్న తీసి, పత్తి చెట్టు కింద రాలిన పత్తి తో వత్తి చేసి, ప్రమిదలో పెట్టి, శుభ్రం గా నూతి వద్ద స్నానం చేసి దీపం వెలిగించింది. అత్త గారు వచ్చి తిట్టు తుందనే భయం తో ఆ దీపం కనపడ కుండా దానిపై చాకలి బాన బోర్లించింది. దేవతలు ఆమె భక్తికి సంతోషించి, దివ్య విమానాన్ని తెచ్చి, ఆమెను బొందె తో కైలాసానికి తీసుకు వెళ్ళారు. వూళ్ళో వున్న వారంతా ",చాకలి పోలి స్వర్గానికి వెడుతోంది "అను కుంటు వింత గా చూశారు. విమానం బాగా క్రింధు గా పోతూ వుండటం తో ఆమె కాళ్ళు పట్టు కొని వూరి జనం కూడా ఆమెతో స్వర్గానికి వెళ్తున్నారు. విష్ణు దూతలు "ఈ పోలి అధిక భక్తీ తో జ్యోతిని వెలి గించింది. కనుక స్వర్గానికి తీసుకొని వెళ్తున్నాం. మీకు ఆ అదృష్టం లేదు "అని వాళ్ళను కిందకు తోసే శారు. పోలి శరీరం తో స్వర్గానికి వెళ్ళిన పుణ్యాత్ము రాలు. అందుకే ఆమె ను తలచు కుంటు కార్తీక అమా వాశ్య తెల్ల వారుఝ్హామున నది ఒడ్డున దీపాలు వెలిగించి ఆమె ను గుర్తు చేసు కొంటు, ఆమె కధను చెప్పు కొంటు, నీటి లో దీపాలు వదిలి పెడ తారు స్త్రీలు అంతా. స్త్రీలు అందరు ఈ కథ చెప్పు కోని అక్షంతలు నెత్తినా వేసుకొని ఇంటికి తిరిగి వస్తారు. అరటి దొప్ప లలో ఆవు నీతి దీపాలు వెలిగించి నీటి లో వదులు తారు. అదీ పోలి స్వర్గానికి పోవటం అంటే. ఇందు లో రెండు ముఖ్య విషయాలున్నాయి. ఒకటి భక్తికి కులం అడ్డు రాదు. అందుకే అందరు అన్ని కులాల స్త్రీలు "పోలి తల్లి "ని గుర్తుంచు కోని దీపాలు పెట్టి సాగ నమ్పటం. రెండోది కార్తీక దీపానికి అంత ప్రాముఖ్యత వుంది అని తెలియ జేయటం. నిశ్చల భక్తీ తో చేసింది ఏదైనా పర మేశ్వరుడు మెచ్చుతాడు.

-- ఇప్పుడు కార్తీక మాస ప్రాముఖ్యాన్ని తెలుసు కుందాం. కార్తీకం శివునికి అత్యంత ప్రీతి పాత్రమైన నెల. ఆశ్వయుజ కార్తీక మాసాలు శరదృతువు. వర్షాలు వెనక్కి తగ్గి నదుల నీరు తేట బడు తుంది. సర్దుతూ వు పౌర్ణమి వెలుగు అద్భుతం గా వుంటుంది. మనసు

పర వశం చెందు తుంది. ప్రకృతి అంతా ప్రశాంతం గా వుంటుంది. అందుకని మన మనసులను కూడా ప్రశాంతం గా ఉంచు కో వాలని సూచన కూడా. ఆశ్వయుజం లో శక్తి ఆరాధన చేస్తాస్ము. అదే దసరా. నవ రాత్రులు భక్తీ శ్రద్ధ లో తో నిర్వ హిస్తాం. చెడు పై మంచి పొందిన విజయమే విజయ దశమి. దుష్ట సంహారం జరిగి శిష్టులను కాపాడిన లలితా త్రిపుర సుందరీ దేవిని ఘనం గా ఆలయాలలోను, ఇళ్ళల్లోను అర్చించి తరిస్తాము. కొత్త అల్లుళ్ళను పండుగకు ఆహ్వానించి గౌర విస్తాం.తారు వాత దీపావళి అదీ దుర్మార్గాన్ని అంతం చేసే పండగే. సరదా గా దీపాలు పెట్టి, టపాకాయలు కాల్చి దుష్ట సంహారం జరిగిందని ఆనంద పాడు తాం. దీని తర్వాత కార్తీక మాసం ప్రారంభమవుతుంది.




కార్తీం లో దీపానికి స్నానానికి ప్రత్యేకత వుంది. తెల్ల వారు జామునే లేచి చన్నీళ్ళు స్నానం తలారా చేసి తులసి చెట్టు దగ్గరో, ఉసిరి చెట్టు కిందో దీపా రాదన చేస్తారు. ఇంటిలో దేవ తార్చన వున్న వారు అభిషేకం చేసు కొంటారు. శివాలయానికి వెళ్లి శివుని దర్శించి తరిస్తారు. సాయంత్రం వేళ "ఆకాశ దీపాలు "వెలిగించి ధ్వజ స్తంభా లకు కర్రతో కట్టి పైకి చేరు స్తారు. ఆ దీపాలకు ముందే పూజ చేసి పైకి ఎత్తు తారు. ఆడ వాళ్ళంతా ఆ దీపోత్స వాణికి హాజరై భక్తీ శ్రద్ధలతో నమస్కరిస్తారు. ఇది నెల రోజు జరిగే కార్య క్రమం. ఇది వరకు శివాలయం లోనే చేసే వారు. ఇప్పుడు అన్ని ఆలాయా ల లోను ఆకాశ దీపాలు పెడుతున్నారు. ఇదొక వేడుక గా నిర్వ హిస్తున్నారు.



కార్తీక మాసం ప్రారంభ మైన రెండా వ రోజు అంటే శుక్ల విదియ "భగినీ హస్త భోజనం "అంటే అన్నా చెల్లెళ్ళ పండుగ. అక్క ఇంటికి తమ్ముడు వచ్చి భోజనం చేయాలి. అక్కకు బహుమతి ఇవ్వాలి. లేక పోతే అన్న చేల్లెలింటికి వెళ్లి భోజనం చేసి బహుమతి ఇవ్వాలి. అన్న, కాని తమ్ముడు కాని అక్క, లేకచెల్లెలు ఇంటికి వెళ్ళాలి. అక్క, చెల్లెలు అన్న, లేక తమ్ముడు ఇంటికి కాదు అని తెలుసుకోండి.

కార్తీక శుక్ల చవితి "నాగుల చవితి "అందరు పుట్టలో పాలు పోస్తారు. చలిమిడి, వడ పప్పు నై వేద్యం పెడ తారు. పుట్ట మన్ను ను భక్తీ తో తీసు కోని చెవులకు కొద్దిగా రాసు కొంటారు. మోపి దేవి లోని వల్లీ, దేవ సేనా సమేత శుబ్రహ్మనఎశ్వర స్వామిని దర్శించి, పూజించి తరిస్తారు.

శుక్ల దశమి నాడు "యాజ్న్య వల్క్య జయంతి "శుక్ల ఏకాదశి మహా పర్వ దినం. ఉప వాసాలు వుంటారు. రాత్రి దాకా వుంది శివుడిని దర్శించి అ.చంద్ర దర్శనం అయింతర్వాత భోజనం చేస్తారు. కొందరు ఆ రోజల్లా ఉప వాసం చేసి మర్నాడు ద్వాదశి నాడు బంధు మిత్రులను పిలుచు కోని అన్నీ రకాల పదార్ధాలు వండుకొని సంతోషం గా భోజనం చేస్తారు.

శుక్ల ద్వాదశి ని "చిలుకు ద్వాదశి లేక క్షీరాబ్ది ద్వాదశి "అంటారు., సాయంకాలం ఉసిరి చెట్టు కింద, తులసి చెట్టు వద్ద పూజ లు చేస్తారు. కార్తీక దామోదర స్వామిని అర్చించి బ్రాహ్మణులకు వాయినాలు ఇస్తారు. దీనికి ఒక కధ వుంది ఒక బ్రాహ్మణుడికి శివుని వరం తో ఒక కుమార్తె కల్గింది.పేరు నారాయణమ్మ. ఆమెను ఎవరు పెళ్లి చేసు కో లేదు. తండ్రి ఆమెను ఒక రాతి కి పెళ్లి చేశాడు. అది ముక్క లై పోయింది. ఒక పుణ్యాత్మురాలు చిలక ముగ్గు నోము నోచగా నారాయణమ్మ ఆమెను దాని ఫలితాన్ని తనకు ఇమ్మని వేడు కొంది. ఆమె ఇచ్చింది. అప్పుడు ఆమెకు పుణ్య స్త్రర్వం వచ్చింది. అప్పటి నుంచి పునిస్త్రర్లు అందరు ఆ నోము నోస్తున్నారు.,

కార్తీక పౌర్ణమి చాలా విశేష మైనది. పుణ్య నదీ, సముద్ర స్నానాలు చేస్తారు. ఉప వాసం వుంటారు రాత్ర కి సత్య నారాయణ వర తం చేసు కొంటారు. శివాలయాలన్నీ ఈ రోజు కిట కిట లాది పోతాయి భక్త జన సందోహం తో. "హర హర మహా దేవ శంభో "అని దిక్కులు పిక్క టిల్లెట్లు గా భక్తీ తో నోరారా అంటే ఒళ్ళు పులకిస్తుంది. జ్వాలా తోరణం ఏర్పాటు చేస్తారు. అంటే దేవాలయం అంతా దీపాలతో అలంకరిస్తారు. శివ లింగం బొమ్మ వేసి దాని పై ప్రమిద దీపాలుంచి చక్క గా అలంకరిస్తారు. దీప శోభతో ఎంతో ఆనందం మనసుకు కలుగు తుంది. ఆవు నేతి

దీపాలు కనుక వాటా వరనాన్ని కాలుష్యం నుంచి కాపాడు తాయి. కొద్దిగా చలి ప్రారంభ మాయే రోజులు. కనుక వెచ్చ దనం హాయిగా వుంటుంది..

బహుళ చతుర్దశి "మాస శివ రాత్రి "దీనినీ అభిషేకాలతో జరుపు తారు. ఇలాఎన్నో రోజులు ఈ మాసం లో శివునికి ప్రీతి కార మైన రోజు లున్నాయి. ఆది వారాల్లో సాముహికం గా వన భోజ నాలు ఏర్పాటు చేసు కోని ఆనందిస్తారు. అనుదిన శివారాధన ముక్తికి హేతువు..

శివుడిని లింగ రూపం లోనే అర్చించాలి కృష్ణార్జునులు పూర్వ జన్మ లో శివలింగాని అర్చించారు. అశ్వత్థామ పూర్వ జన్మ లో శివుడి బొమ్మను పూజించాడు. అందుకే భారత యుద్ధం లో అశ్వత్థామ, కృష్ణార్జును లపై వేసిన నారాయనాస్త్రం వాళ్ళను ఏమీ చేయ లేక పోయింది. ఈ విషయం స్వయం గా వ్యాసుల వారే అశ్వథామ కు అతను అడిగితే చెప్పారు.



శివ లింగానికి అభిషేకం చేస్తారు. మహాన్యాసం తో పద కొండు సార్లు నమక చమకాలతో. ఇక్కడ ఒక విషయం తెలుసు కో వాలి. రుద్రుడు కాని వాడేవాడు రుద్రున్ని అర్చించ టానికి వీలు లేదు. మరి మనం ఆవ లేము కదా. అందుకని శివుని అన్ని శరీర భాగాలు మన శరీరం లోకి ఆవాహన చేసు కొంటాము. న్యాసం అంటే వుంచటం. అలా న్యాసం చేసు కొంటె మనం రుద్ర రూపాన్ని పొందుతాం.అప్పుడు మనం రుద్రుని అర్చించ టానికి అర్హులం అవుతాం. ఇదీ ఇందు లోని పరమార్ధం శివ లింగం లో "ప్రజ్ఞానం లో బ్రహ్మ, పాదం లో విష్ణువు, హస్తం లో హరుడు, బాహువుల్లో ఇంద్రుడు, జతరం లో అగ్ని, హృదయం లో శివుడు, కంఠం లో వన వాసుడు, నాలుక లో సరస్వతి, నాసికలో వాయు, కళ్ళల్లో చంద్రుడు సూర్యుడు, చెవుల్లో అశ్వినీ దేవతలు లలాటం లో రుద్రుడు, మూర్ధా భాగం లో ఆదిత్యుడు, శిరసు లో మహాదేవుడు, శిఖా లో వాసు దేవుడు, పృష్టం లో పినాకిని, ముందు శూలి ప్రక్కల శివుడు, శంకరుడు, అన్నిటా వాయువు దానికి బయట అగ్నీ జ్వాలా సర్వ అంగాలలో సర్వ దేవతలు యధా స్థానం లో వుంది నన్ను, రక్షించాలి "అని శివుని ఆవాహన చేసు కుంటాం.

" దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవ స్సనాతననః "దేహం అనే దేవాలయం జీవుడే సనాతనుడైన పర మేశ్వరుడు. శివునికి వ్యోమ కేశుడు అని పేరు. అంటే ఆకాశమే జుట్టు గా కల వాడు. జాతీ అంటే అని రహశ్యాలు తెలిసిన వాడు. శివుడు జటా జూటి.

ఈ కార్తీకం లోపంచారామాలోఅలో వున్న శివున్ని దర్శించి తరిస్తారు. వీలున్న వారు ద్వాదశ జ్యోతిర్లింగా దర్శం చేస్తారు. రుద్రాక్ష మాల ధరిస్తారు. శివ పంచాక్షరీ జపం చేస్తారు. శివ స్తోత్రాలను భక్తి తో పతిస్తారు. శ్రీ శంకర భగవత్పాదులు రాసిన "శివా నంద లహరి "గానం చేస్తూ, అర్ధ వివరణం తెలుసు కొంటు జనం సాఫల్యం చేసు కొంటారు. ఈ మాసం అంతా ఇలా గే మీరందరూ గడి పీ ఉంటా రాణి భావిస్తున్నాను. కార్తీకం తర్వాత వచ్చేది "మార్గ శిర మాసం"అది విష్ణువు కు మహా ప్రీతి కర మైంది. ఇందులోనే ధనుర్మాసం వస్తుంది.

"నమశివాభ్యాం పర మ్మోషదాభ్యాం -పంచాక్షరీ పంజర రంజి తాభ్యాం

ప్రపంచ సృష్టి స్థితి సంప్రుతాభ్యాం --నమో నమః శంకర పార్వ తీభ్యాం.

కార్తీక పుణ్యం అందరికి లభించాలని కోరుకుంటూ

## మహా శివ రాత్రి –శత రుద్రీయం

మాఘ మాసం శివునికి ప్రీతికరమైనది. అందులో మహా శివ రాత్రి మహా పవిత్రమైనది, రుద్రుడికి అత్యంత ప్రీతికరమైనది. అలాంటి శివుడికి మహాన్యాసం తో కూడిన నమక చమకాతో అభిషేకం చేయాలి, అభిషేక ప్రియుడు శివుడు. నమకం లో పదకొండు చమకం లో పదకొండు అనువాకాలు ఉన్నాయి. ఈ ఇరవై రెండు అనువాకాలను కలిపి "రుద్రాధ్యాయం "అంటారు. దీనికే మరో పేరు "శత రుద్రీయం ".అంటే అపరిమిత శివ రూపాలు అని అర్ధం.



మహా భారత యుద్ధ ప్రారంభం అప్పుడు అర్జునుడు భయ కంపితుడై శస్త్ర అస్త్రాలను లను కింద పడేసి భీరువు లా ఏడుస్తూ ఉంటె శ్రీ క్రిష్ణ భగవానుడు ధైర్యం చెప్పి "గీత "ను ఉపదేశించిన సంగతి మనకు తెలుసు. దీనిని "" సాం గ్రామికం "అంటారు. అశ్వత్థామ శ్రీ కృష్ణ, అర్జునులపై బ్రహ్మ శిరోనామకాస్త్రాన్ని భీష్మ పర్వం లో ప్రయోగించినప్పుడు అది వారినిద్దరినీ ఏమీ చేయలేక పోయింది. అప్పుడు ద్రోణ సుతుడు వ్యాస భగవానుడిని ప్రార్ధిస్తే ఆయన ప్రత్యక్షమైనాడు. అశ్వత్థామ తన అస్త్రం ఎందుకు విఫలమైందని అడిగాడు. దానికి వ్యాసభగవానుడు పూర్వ జన్మ లో కృష్ణుడు, అర్జునుడు శివలింగాన్ని పూజించారని, అశ్వత్థామ శివుని ప్రతిమను అర్చిన్చాడని, లింగాభిషేకం సకల శ్రేయోదాయకం అని, దాని ఫలితం గొప్పదని అంతటి ఫలితం ప్రతిమా పూజ వలన లభించ దని తెలియ జేశాడు. అందుకే శివలింగానికే పూజా, అభిషేకము చేయాలి. ద్రోణుడు మరణించిన తర్వాత మహా శివుని విభూతిని గొప్పగా ఆవిష్కరించి అశ్వత్థామకు వివ రించాడు. అలాగే అర్జునునికి మరో సారి శివుని మహత్వాన్ని వివరించాడు. వ్యాసుడు చెప్పిన ఈ విషయాలన్నీ "శత రుద్రీయం "అంటారు. కనుక భగవద్ గీత లాగే శత రుద్రీయం కూడా "సాం గ్రామికం "అని పించు కొంది.



శత రుద్రీయం అమృతత్వ సాధనం అని "జాబాల శ్రుతి" చెప్పింది. "నమశ్శివాయ శివ తరాయచ "లో పంచాక్షరి మంత్రం ఉంది. శివ అంటే అవాజ్మానస గోచమయిన సత్య, జ్ఞాన, ఆనంద లక్షణం ఉన్న పర బ్రాహ్మయే. కనుక శివ అంటే అమృత భావన. అంటే శ్రీ విద్యా పరం కూడా. నమకం లో మొదటి అనువాకం లో అన్ని వ్యసనాలకు మూలం అయిన క్రోధానికి నమస్కారం చెప్ప బడింది. తరువాత బాధ కలిగించే బాణానికి, దాన్ని పూరించే ధనుస్సుకు, దాన్ని సంధించే చేతులకు నమస్కారాలు చెప్పారు. అంటే ఈ జగత్తు ను లయం చేసే రుద్రుడైన శివుని" ఘోర రూపం" వర్ణించ బడింది. శివుడు "అఘోర రూపం" లో కూడా ఉంటాడు. రెండవ అనువాకం లో సుఖాన్ని కలిగించే "శాంత స్వభావం "వర్ణించ బడింది. ఎనిమిదవ అనువాకం లో "శివ పంచాక్షరి "మంత్రం ఉంది. ఇది బంధ విచ్చేదనం చేసే సాధనం అయి, జ్ఞానాన్ని ఇచ్చి, ముక్తిని కలిగిస్తుంది. ఈ ఎనిమిదవ అనువాకం రుద్రాధ్యాయ మాలలో మణి పూస గా నిలిచింది.

నమకం లో మొదటి అనువాకం "నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః"-నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాం నమః "అనే మంత్రం తో ప్రారంభ మవుతుంది.




క్రోధం నశిస్తే శాంతి లభిస్తుంది. శాంతి ఉంటె అన్నీ ఉన్నట్లే. అందుకే జగత్ ను పరి పాలించే, మహా విష్ణువు "శాంతా కారం భుజగ శయనం, పద్మ నాభం సురేశం-విశ్వాకారం గగన సదృశం మేఘ వర్ణం శుభాంగం "అనీ, లయ కారకుడైన మహా దేవుడిని "శాంతం పద్మాసనస్తం శశి ధర మకుటం పంచ వక్త్రం త్రినేత్రం "అనీ "శాంతం" అనే ముందు మాట తోనే స్తుతిస్తాం. చమకం "అగ్నా విష్ణూ సజోష సేమా వర్ధంతు వాంగిరః – ద్యుమ్నై ర్వాజేభి రాగతం "అనే మంత్రం తో ప్రారంభ మవుతుంది. నమకం లో శివునికి నమస్కారాలు ఉంటె చమకం లో శివుడిని అర్ధించే విషయాలు కో కొల్లలు గా ఉన్నాయి. ఇందులో "చమే "అనే మాట అనేక సార్లు వస్తుంది. అంటే "కూడా నాకు కావాలి "అని అర్ధం. "కల్పతాం" అనే

మాట లో" కలుగు గాక " అనే అర్ధం ఉంది. రుద్రీయం లో రెండు వాక్యాలున్న మంత్రాలను" రుక్కులు "అని,ఒకే వాక్యం ఉన్న మంత్రాలను "యజుస్సు "లని అంటారు.

## రుద్రుడు అంటే ?



రుద్రుడు అంటే రోదసి లేక అంతరిక్షం (ఈధర్ )కు అధిపతి. పదకొండు రూపాలలో వ్యక్తమయ్యే అంతరిక్ష దేవత. అంత రిక్ష రుద్రులు పద కొండు మంది.వీరికి" ఏకాదశ రుద్రుల"ని పేరు. వీరిని "gods of vibration "అంటారు. దివికి సంబంధించిన దేవతలు పన్నెండు మంది వీరిని "ద్వాదశాదిత్యులు" అంటారు. వీరికి "gods of radiation "అని పేరు. పృధివి లేక భూమి కి సంబంధించిన దేవతలు ఎనిమిది మంది. వీరిని" అష్ట వసువు"లంటారు. "gods of materialization "అని వీరిని పిలుస్తారు. ఈ సంఖ్యలను బట్టి 'త్రిష్టుప్ "అనే పద కొందు అక్షరాల ఛందస్సు, "జగతి "అనే పన్నెండు అక్షరాల ఛందస్సు, "గాయత్రి "అనే ఎనిమిది అక్షరాల ఛందస్సు, పదహారు అక్షరాల "అనుష్టుప్ "ఛందస్సు లు ఏర్పడ్డాయి.

"శివ తమా "అనే మంత్రం లో శివ తమ అంటే శివత్వమే. అంటే మోక్షమే నన్న మాట. రుద్రుడు ధరించే ధనుస్సు మొదటి సగం మన శిరస్సు లో బ్రహ్మ రంధ్రం నుండి ముందు వైపుకు భ్రూ మధ్యం వరకు ఉంటుంది. ఇక్కడే "మన్యువు "అనే శక్తి ఉంటుంది. శివధనుస్సు రెండవ సగం బ్రాహ్మ రంధ్రం నుంచి మెడ వరకు ఉంటుంది. మన కను బొమల నుండి మెడ వరకు అడ్డంగా పుర్రె పై వ్యాపించి ఉన్న రేఖ యే" శివ ధనుస్సు" గా భావిస్తారు. అందుకే శివుడు కపాలాన్ని చేత ధరిస్తాడు. అది సంకేతం అన్న మాట. అలాగే ఆకాశం లో ఉదయం నుంచి అస్తమయం దాకా సూర్యుని దారి ఒక చాపం "ఆర్క్" లాగా ఉంటుంది. ఇది కూడా శివ ధనుస్సుయే.దీని వలన పగలు, రాత్రి ఏర్పడతాయి. శివుడు కాల స్వరూపుడు అందుకే "మహా కాలుడు" అన్నారు. మనస్సు, ఇంద్రియ ప్రవృత్తులు, కపాలం నుండి రుద్ర గ్రంధి వరకు అంటే "మెడుల్లా " మీదుగా పని చేస్తాయి. అయిదు జ్ఞానేంద్రియాలు అయిదు కర్మేంద్రియాలు, మనసు ను ఆశ్రయించిన రుద్రుని పదకొండు రూపాలే శివుని పదకొండు బాణాలు.

### పద్మ ప్రాభృతకం భాణం



శూద్రక మహా కవి సంస్కృతం లో "మృత్చాకటికం "(మట్టి బండి )అనే నాటకం రాశాడు. అది చాలా ప్రసిద్ధమైనది. అదే తెలుగులో "వసంత సేన "అనే సినిమా గా వచ్చింది. ఆ నాటకం లో వసంతసేన అనే వేశ్య పాత్రను అత్యద్భుతం గా తీర్చి దిద్దాడు. మన గురజాడ వారి "కన్యాశుల్కం "నాటకం లోని మధురవాణి నిని వసంతసేన తో పోలుస్తారు. ఆ శోద్రక మహా కవే "పద్మ ప్రాభ్రుతకం అంటే "తామర పువ్వు కానుక "అనే భాణం కూడా రాశాడు. అన్ని భాణాల లో అది చాలా విశిష్ట మైంది. ఈ కవి క్రీస్తు పూర్వం రెండువందల ఏళ్ళ నాటి కవి. ఇంతకీ భాణం అంటే ఏమిటో తెలుసు కుందాం. సంస్కృత నాటకాలలో కధానాయకుడు పురాణపురుషుడు కాని, ఉదాత్తపురుషుడు కాని అయి ఉంటాడు. అయితే రూపకం అనే పిలువబడే ప్రకరణం, ప్రహసనం, వీధీ, భాణం లలో కధానాయకుడు మధ్యతరగతి వాడు.విషయం కూడా మధ్యతరగతికి చెందినది అయి వుంటుంది. సాంఘిక ఇతివృత్తం అన్న మాట భాణం లో ఒకే ఒక పాత్ర రంగస్థలం మీద కన్పిస్తుంది.. ఇతడే విటుడు. కదాఆయకుడు కాదు. కాని, నాయకునికి, నాయికకు మిత్రుడు, సచివుడు లాంటి వాడు. ధూర్తుడు అని ముద్ర పడ్డ వాడు. శతుడు (shathudu ).కళా శాస్త్ర ప్రావీణ్యం వున్న వేశ్యాలోలుడు. అందచందాలున్న కొత్త నాయికలను ప్రేమించి,ప్రేమిమ్పజేసుకొనే వాడు. వీడిసే ధీరలలితుడు అంటారు. ఇతని ప్రేయసిలందరూ సామాన్యలె. ఒకరకం గా చెప్పాలంటే ఈ విటుడు ఇవాల్టి మిమిక్రీ ఆర్టిస్ట్ లాగా అనిపిస్తాడు. అన్నిపాత్రల సంభాషణల్ని, తన గొంతులో పలికించే నేర్పున్న వాడు. దీన్నే "స్వర వ్యంజనం "అంటారు. కనుక విటుడి అనుభవానికి హద్దులు వుండవు. రెచ్చిపోవటానికి హద్దులు లేని అవకాశాలు. అభినయానికి పుష్కలం గా సామగ్రి వుంటుంది. పరిమితి లేని నటన తో పండించ గలడు. శృంగారం పుష్కలం. ఆ రోజుల్లో భాణం ప్రక్రియ అందర్నీ ఆకర్షించింది,ఆహ్లాద పరిచేది. దీనిలో రసం కంటే రసాభాసం ఎక్కువ. రసాస్వాదన లో దగ్గరదారి "భాణం "అని విమర్శకుల అభిప్రాయం. భాణం లో సమకాలీన సాంఘిక జీవనం ప్రతిఫలించడం విశేషం.

ఆకాలానికి ఆధునికం గా మొదట రూపకం గా "ధూర్త విట సంవాదం "అనే భానాన్ని ఈశ్వర దత్తు అనే కవి సంస్కృతం లో రాశాడు. రెండవ భాణం వరరుచి కవి రాసిన 'ఉభయాభి సారిక '

మూడవది శూద్రక కవి రాసిన "పద్మ ప్రాభ్రుతకమ్ ".నాల్గవ భాణంఈశ్వరదట్టు కుమారుడు సొమిల్లకుడు రాసిన 'పాద తాదితం ';.ఈ నాలుగింటినీ కలిపి "చతుర్భాని "అంటారు వీటిని తెలుగు లోకి "ఆంధ్ర చతుర్భాని 'గా తేట తెల్లం గా, కవిహృదయ విశ్లేశకం గా అనువదించిన వారు ప్రముఖ వాగ్గేయ కారులు, ఆకాశవాణి పూర్వ సంచాలకులు, కళాప్రపూర్ణ. శ్రీ బాలాంత్రపు రజనీ కాంత రావు గారు. ఇవి ఆకాశవాణి ద్వారా ప్రసారం కూడా అయాయి. రసికజనులను అలరించాయి. వీటిలో శూద్రక మహాకవి రాసిన భాణం పద్మ ప్రాభ్రుతకం (తామరపువ్వు కానుక )లో మెరిసిన అలంకార సంపదనన్నెంతో ఆకర్షించింది. ఆ సంపదను నేను మాత్రమే అనుభవించే సంకుచిత బుద్ధి నాకు లేదు. కనుక ఆ సంపదను మీకూ పంచి, నేనూ ఆనందాన్ని పొందుతున్నాను. అక్కడకడ పండిన మధుర హాస్యాన్ని అందిస్తున్నాను.

సంవత్సరం అనే విలాస పురుషుడికి చలికాలపు ముసలితనం లో సర్వమూ వుడిగిపోయాయత. అయితేనేమి హిమరసాయనం సేవించటం వల్ల మళ్ళీ వసంత కిశోరత్వం (చిన్న తనం )వచ్చిందట. రుతుపరం గా సంవత్సారాన్ని అద్భుతం గా ఆవిష్కరించాడు ఆలన్కారికం గా శూద్రక మహా కవి. అప్పుడున్న వసంత శోభ ఎలా వుందో తెలియజేస్తున్నాడు చూడండి. చివర్లు అలల్లాడుతుంటే చెట్లు నృత్యం చేస్తున్నట్లుందట. దానితో తీగలు, పూలు పూసి యవ్వనాన్ని పొందాయత. తిలకం అనే చెట్టు శిరస్సు పై వున్న కోయిల కొత్తముడి గా ఉందట. కుందపుష్పం మీద కూర్చున్న తుమ్మెద అందమైన స్త్రీ చూపు లాగా ఉందట. ఆకుపచ్చని తామర మొగ్గ అప్పుడే తల ఊపే కన్నె పిల్ల లాగా ఉందట. ఆమని (వసంతం )అనే కోడె (యువకుడు )గాలి వీస్తుంటే వలపు చెలగాటం లో అలసి చెమర్చిన జవరాలి (యవ్వనం లో వున్న )స్థనాల స్పర్శ సుఖం లాగా ఉందట.

ఇంకో చోట "దేవదత్త తో సాంగత్యం అనే మధుపానికి (తుమ్మెద )పక్కనంజుడు కూరలాంటిది దానిచెల్లెలి పొత్తు "అంటాడు. ఆ పరిసరాలు, ఆ తాగుడు, చీకుల నంజుడు భాషలో. వేరొక చోట "మదనజ్వరం తేలికగా కనబడుతున్నా, మహాచేడ్డబలమైనది అంటాడు. ఉజ్జయినీ నగరవైభావం చాలా కొత్తభాషలో చెప్పాడు. "వసుంధర (భూమి )అనే వధువుకి జంబూద్వీపం వదన కపోలం (చెక్కిలి )అయితే దానిమీద చిత్రలేఖనం గా అనిపించే అవంతి సుందరి ఈ ఉజ్జయిని అపర లక్ష్మీదేవి లా విరాజిల్లుతోంది. చాలా గొప్ప ఆవిష్కరణ ఇది. అలాగే అర్ధవంతమైన మాటల సంభాషానాన్ని 'సరస్వతీ లతకు పూసిన వాక్ పుష్పాలు "అనటం శూద్రక మహాకవికే చెల్లింది.

## తామర పువ్వు కానుక

వసంతుడిని పుష్పాలతో అర్చించటం ఉచితమేనా ?ఉచితమే అంటూ బహు గొప్పగా సమర్ధించాడు శూద్రక కవి. సూర్యునికి దీపారాధనతో, సముద్రానికి అందులోని నీటితో పూజ చేయటం లోక సహజమే. వాక్కు కు ప్రభువైన బ్రహ్మాదేవుడిని వాక్కులతో అర్చించటం లోక రీతి. అలాగే వసంతుడినీ ఆయన ఇచ్చే పూలతో పూజించటం సహజమేనంటాడు కవి. తనను చూసి తప్పించుకు పోతున్న విపులామాత్యుడిని పలకరిస్తూ "కలువ స్నేహితులను మేలుకొలపని,పగటి చంద్రుడిలాగా దాటుకు పోతున్నావెం?"అని ఆలంకారికం గా ప్రశ్నిస్తాడు. వాన, బురద తో, వరదలతో నది కలుషితమైనపుడు, దాన్ని శుభ్రపరచాటానికి శరదృతువు వస్తుంది. తీవ్రమైన చలి రాత్రిలో విసనకర్ర తో విసురు కోవటం వ్యర్ధం. వ్యాకరణ పాండిత్యం తో హడలగొట్టే "దత్తకలాషి "అనే విటుడికి స్వాగతం చెబుతూ "స్వాగతం అక్షరాల బందెల దొడ్డికి 'అని చురుక్కున మాటల ఈటెలతో పొడుస్తాడు. ఉక్కనేలపై తాబేలుగా తిస్తవేయటం, వారుణీ జఘున పాత్రం గంగా తీర్ధం లాగా పవిత్రం అనటం, గొల్లపేట లో పెరుగు అమ్మటం, కపటప్రచార కంచుకం తీసివేయటం చక్కని పలుకుబళ్ళు. దీనికి సంస్కృతం లో శూద్రకునికి, తెలుగు చేసిన రజనికి వందనాలు.

పువ్వులు అమ్మే వీధిలో అనేక పూలసముదాయం అంగ ప్రత్యగ్గాలుగా రూపుదాల్చిన వసంత వధువు లాగా ఉందట పూలు అమ్మే వీధి అంతా. ఆ వర్ణనా మనోహరం గా వుంది., పదండి నాతో పూలరంగడులు లా ఆ వీధిలోకి. బాగా విచ్చుకొన్న తామర పూవు వసంతం అనే వధువు సిరిమోము (శ్రీముఖం )లాగా, విరజాజిమొగ్గలు పలువరుసగా, కలువపూలె కన్నులుగా, ఎర్రమద్ది పూవు క్రింది పెదవిగా, తుమ్మెద రోద తేట తేనె పలుకులా, పూలగుత్తులు రొమ్ములుగా, సిగచుట్టు దండలే నగలుగా, పేర్చిన పుష్పాలే వస్త్రాలుగా, పూలమాలలేమొలనూలుగా, పుష్పాలతో అమరిన స్త్రీ రూపు ధరించి పుష్పవీది వసంతుని రాణి లాగా శోభలీనుతోందట.. సాహిత్యచరిత్రలో పుష్పవీధిని ఇంత ఊహాత్మకం గా వ్యూహాత్మకంగా చిత్రించిన కవి లేడేమో /

పండుముసలివాడిని చూసి "ముసలితనం బాగా పండుతోంది కదా ?'అని అంటే వాడు "ముదిసిన పాములాగా ముసలితనపు కుబుసం వదలగోట్టుకున్నున్నాను "అని గడుసు సమాధానం చెప్తాడు. ముసలాయన నోయగాన్ని ఎట్టిపోదిచినట్లు మెచ్చుకుంటూ "కట్టె అంటని గండభాగం తో ముఖం, పాథ ఇంటికి సున్నం కొడితే శోభించినట్లు గా వుంది "అని నర్మ గర్బం గా అంటాడు పాత్రధారి సూత్రధారి, అయిన విటుడు.ముందే చెప్పినట్లు అన్ని పాత్రలు అతనే పోషిస్తాడు. వాళ్ళలో పరకాయ ప్రవేశం చేసి మాట్లాడుతున్నట్లుంటాడు. అవతలి వాడు అనవలసిన మాటల్ని, వాళ్ళు అన్నట్లు గా భావించి తనే అనటం భాణం లో ప్రత్యేకత. ఇదే కవి కున్న నేర్పు. ఇంకో బకరా గాడు తనను తప్పించుకొని పోతుంటే, వాదిమొహం మీదే "వెన్నెల్ని తప్పించుకొని, గొడుగులో తలదాచుకొన్నట్లు, స్నేహితుడిని అయిన నన్ను తప్పించుకుని, స్థంభం చాటుకు చేరావెందుకురా ?"అని గద్దిస్తాడు. అలాగే "అందని కోరికలు పొందే లోగా, అందిన సుఖాలను త్యాగం చేయటం పురుషలక్షణం కాదు అని అంటూ నిప్పు వెదకటానికి దీపం కావాలా?"అని సందేశం ఇస్తాడు కోరిన స్త్రీ ని వాడు చేరు కోవటానికి వీలుగా.

వేశ్యావాటికను కూడా సందర్భోచితం గా వర్ణిస్తాడు శూద్రక మహాకవి. మన్మధుని ఇల్లు, జూదరి పాఠశాల, మాయలకు నిలయం, వంచనకు పంచ, అది. అక్కడ డబ్బులేని వాడికి స్వాగతం హుళక్కి. వెతలు కూడా రామ్యమవేదే వేశ్యాగృహం ట.విటుడి అనుభవాలన్నీ కవి ఏకరువు పెట్టాడు. ఆయనకూ అనుభవైక వేద్యాలా ?ఒక బౌద్ధ సన్యాసి, దొంగచాటుగా వేశ్యా సాంగత్యం పొంది, ముఖానికి ముసుగేసుకొని, బయటకు వస్తు మన విటశిఖా మణికి అడ్డం గా దొరికి పోయాడు. అతన్ని ఆటపట్టిస్తూ, పనిలో పనిగా బౌద్ధం మీద క్లాస్ తీసుకుంటూ విరుచుకు పడ్డాడు. "అర్ధం లేని బోడి దొంగ సన్యాసుల చేత మైలపడి పోతున్న బుద్ధ ధర్మానికి ఎటువంటి దుర్గతి పట్టింది /కాకుల ఎంగిలికి తీర్ధజలం మైలపడటం లేదా ?"అనుకొంటూ, వాడిని "విహార బేతాళా ?"'అని సంబోధించాడు. "వేశ్యా వాటిక అనే దిగుడుబావి దగ్గర అప్పుడే వాలిన కొంగలా, దొంగ అడుగులు వేస్తూ పోతావెం ?సురత (రతి) పిండపాతం అనుష్టీయతేనా ?చీకటి తప్పూ చేసి, చేయి కడుకోవటం కాదు కదా ?"అని ఝాడించి పారేశాడు. అప్పటికే బౌద్ధం వెర్రితలలు వేసి, ధర్మభ్రష్టమై క్షీణదశకు చేరుకొన్నట్లుంది. సంఘం నైతికం గా, సాంఘికం గా దిగజారిన స్థితి. మళ్ళీ సనాతన ధర్మం వైపుకు ప్రజలు అడుగులు వేస్తున్న జాడ కనబడుతోంది. కాంక్షతో కాని అనుకోకుండా కాని వేశ్యల కొమ్పలకు చేరే భిక్షువులు, జైన బౌద్ధ సూత్రాలను ఓంకార శబ్దం లాగా విఫలురు అవుతారు కాని దాని నుంచి ఏ వెలుగునూ పొందలేరు 'అని కవి వాక్కులు. కాలమ్ దానినే రుజువు చేసింది కదా /కవిచెప్పినవన్నీ తాను ప్రత్యక్షం గా చూసినవే, అనుభవాలే. "సకల జనులమీద ప్రసన్న చిత్తం వుండాలి కదా ?"అని ఆ భిక్షువు,తనచేష్ట nu సమర్ధిన్చుకొంటే, మనవాడు "అర్ధం లేని తల గోరుగుడుకి, స్థిరం లేని మనస్సు వల్ల సిగ్గు కాక మరేమిటి ?"అని గడ్డి పెడతాడు., మందలిస్తాడు. "మదన భ్రమ చేత శుద్ధ ఆచమనం లాగా, నీ వల్ల బుద్ధవచనం భ్రష్టం అయింది "అని మనవాడు బాధ, సానుభూతి వ్యక్తం చేస్తాడు. ధర్మ భ్రష్టులుఏ కాలమ్ లోనైనా వుంటారు అని తెలియజెప్పే సన్ని వేశం. ఇలా శూద్రక కవి

ఎన్నో సామాజికాంశాలను  స్పృశించి వెలుగు లోకి తెచ్చాడు. భాణం అని పేరే కాని చెడు మీదకు, అధర్మం మీదకు, అపకారం మీదకు, అశ్లీలత పైకి, అధర్మం మీదకు, చాపల్యం మీదకు సంధించిన బాణం అది అనిపిస్తుంది లోతుగా పరిశీలిస్తే. వ్యంగ్యవైభవం మూర్తీభావించింది ఇందులో.,

పేర్లు పెట్టటం లోను మహాకవి శూద్రకుడు మంచి చమత్కారం చేశాడు. ఒక విటుడి పేరు "హ్రీ రమ్యుడు " అంటే సిగ్గుతో శోభించేవాడు అని అర్ధం. కాని ఇక్కడ వీడు పట్టపగలే శృంగారక్రీడ చేసే వాడు.   అందుకే వాడికి "పట్టపగటి ప్రణయ కళా పట్టభద్రుడు "అని సరదా బిరుదు తగిలించాడు. ఎగతాళి చేయటం ఒక కళ అట. అది ఎలాంటిది అంటే "ఆకారం పైన వేసిన ముసుగు కూడా అదే ఆకారాన్ని ధరించి నట్లుందట ""నడుస్తున్న కామ రథం కాడి విరుగకొట్ట రాదు "అనే విట సామెత కూడా చక్కగా సరిపోయేట్లు చెప్పాడు. దీవెన కోద్కా అదే స్థాయిలో వుండాలి కదా "అవిరళ కామోత్సవోస్తూ "
అని గార్గి గారి అబ్బాయిని ఆశీర్వదిస్తాడు. సందర్భానికి తగినట్లుగా. ఇదే విధం గా మగధసుందరి అనే గణిక (వేశ్య ) బ్రహ్మచారి గా ఉంటూ వసంతుడిని ఉపాశిస్తోందని తెలిసి "దంతపు గాట్లతో నీ పెదవులు నలిగినట్లున్నాయి.నీ అంతకు నీవే నియమాలు పెట్టుకోవటం ఎలా వుందంటే "వ్రతము భంగము కాని చాన్ద్రాయనమున ముద్దులు ఉద్యాపనంమగు నుద్ది తోచే "అంటాడు. వ్రతభంగం లేని చాంద్రాయణం లో ముద్దులే వ్రతం చివర చేసే ఉద్యాపనం అని భలే చాకచక్యం గా, వ్రాతభాష లో సమర్ధించాడు కవి. "తోట అంటే మదన కర్మాంత భూమి "అని చక్కని పేరు పెట్టాడు.

సిగ్గు అనేది యుక్త వయసు వచ్చిన ఆడడానికి, పైపెచ్చు ప్రౌఢ కాని ముద్దు గుమ్మకు అరణపు సొమ్ము లాంటిది. అంటే సహజమైనది కాదు. --ఎరువు తెచ్చుకున్నది అంటాడు చమత్కారం గా. ఒకడే అనేకమంది స్త్రీలను కట్టుకోవటం కొత్తకాదని చెబుతూ దక్షప్రజాపతి కూతుళ్ళు ఇరవైఏడు మంది చంద్రుని భార్యలు అయారు కదా అంటాడు. అలాగే మామిడి చెట్టుకు ఒకే వేరు నుంచి రెండు తీగలు సాగి అల్లుకోవటం సహజమే కదా అని సమర్ధించాడు. దేవసేన అనే వేశ్య ఆప్యాయం గా తామర పువ్వును కానుకగా కర్ణిపుత్రుడికి ఇవ్వమని ఈ విటుడికి అంటే మన భాణం లోని బాణం లాంటి వాడైన వాడికి అందిస్తుంది. ఇదే కారని పుత్రుడైన ఆచార్య మూలదేవుడికి సంజీవి ఆగా పనిచేస్తుందన్న ఆశను వెలిబుచ్చటం తో భాణం ముగుస్తుంది.


చండకౌశికమ్

రజనీకాంత రావు గారి తెనుగు సేత రజనీ గంధం లా సువాసనలీనింది. పద్యం, గద్యం హృద్యం గా సాగాయి. అసలవి తెలుగు లోనే ఉన్నాయా అన్నంత సహజం గా, ఆశ్చర్య జనకం గా వున్నాయి. చతుర్భాని నేడు జనరంజకంగా లేకపోయినా ఆ నాడు జనఃరుదయాలను గెలిచినవే. శూద్రకుని భాణం తెలుగు పత్రికా సరస్వతి "భారతి "లో ప్రచురితమైంది. భాణం రాసిన వాళ్ళలో వరరుచి ముందు వాడు. రజని గారు వరరుచి రాసిన భాణం "ఉభాయాభిసారిక "ను ఆంధ్ర ప్రాధ్యాపకులు, హైదరాబాద్ లోని శారదానగర్ పారదర్శి విద్వద్వరెన్యులు, చాతుర్భానిని తెలిగిమ్పప్రోత్సాహించిన వారు అయిన శ్రీ ఇప్పగుంట స్వయిబాబా గారికి అంకితమిచ్చారు. ఋణం తీర్చుకున్నారు.

శ్రీ సాయిబాబా గారు నా అడ్రస్ యెట్లా సంపాదించారో నాకు తెలియదు కాని పుస్తకాన్ని పోస్ట్ లో పంపారు (ఆంధ్ర చతుర్భాని). నేను అందిన వెంటనే వారికి ఫోన్ చేసి కృతజ్ఞతలను చెప్పి నా అడ్రస్ ఎలా తెలిసింది అని అడిగాను. వారు నేను రాసిన పుస్తకం ఎవరో ఇస్తే చదివానని అందులోని అడ్రెస్స్ చూసి మంచి సాహితీ సేవ చేసే వారి గా గుర్తించి పంపాను అని చెప్పారు. నేను సరసభారతి ప్రచురించిన అయిదు పుస్తకాలను వారికి పంపాను. వారు అందినట్లు జాబు రాసి తమ సహ్రుదయతను చాటారు. ఇది అంతా యాదృచ్చికం గా జరిగిన విషయం. ఎవరు ఎప్పుడు ఎలా చేరువవుతారో మనకే తెలీదు. పుస్తకం చదువు తుంటే శూద్రకుని భాణం అడుగడుగునా నన్ను ఆశ్చర్య పరిచింది,మనసుకు పట్టేసింది. అందులోని అలంకారం,నిర్వహణ, లోకోక్తులు ఆకర్షించాయి. దీనిపై చిన్న వ్యాసం రాయాలనిపించింది. అది క్రమం గా పెరిగి ఇంత అయింది. ఈ వ్యాసం శ్రీ సాయిబాబా గారికి రజనీ కాంత రావు గారి భాష లో 'హరిచందనపు పూత."గా అందిస్తూ, వారికే అంకితం చేస్తున్నాను.

చక్కని ముద్రణ, ఆకర్షణీయమైన ముఖచిత్రం ఈ పుస్తకానికి వన్నె చిన్నెలు. మొదటి ముద్రణ 2005 లోనే జరిగినా, శ్రీ సాయిబాబా గారి వల్ల ఇప్పుడే చూడగలిగాను. ఇప్ప పూవు ఒక రకమైన రుచిగా, మత్తునిచ్చే ద్రవ్య నిదిగా, భద్రాచల శ్రీరాముని ప్రసాదం గా

మనందరికీ తెలుసు. మరి ఇది "ఇప్పగుంట "కదా. శృంగార ఖని గా భాసించింది. దాన్ని ఆదరించ్ ప్రోత్సాహించింది. శూద్రక కవి "తామరపువ్వుకానుక "లో పుష్పవీది లోని వసంత వధువును నానా కుసుమ సముదాయం గా వర్ణించిన తీరు, దాన్ని రజని గారి అనువాదం పుష్పసుగందాన్ని రాశీభూతం చేస్తే, దాన్ని అత్యంత సుందరం గా చిత్రించారు "బ్నిం ".ముఖ చిత్రం, ఉజ్జయిని లో ఒజ్జల వద్ద విద్యసేర్చే చాత్రవరుల లోపలి చిత్రం, అట్టచివర సంగీత సాహిత్య బయకారుడు, ఉభయకారుడు, వాగ్గేయకారుడు అయిన మాన్యశ్రీ బాలాంత్రపు రజనీ కాంత రావు గారి చిత్రం ఆకట్టు కుంటాయి. శూద్రుని భాణం "పద్మ ప్రాభ్రుతకం "ను స్నిగ్ధ హృదయుడు, కళా హృదయుడు అయిన నొగసు కాడు స్వర్గీయ ఆచంట జానకి రాం గారికి అంకితమిచ్చారు. ఈశ్వరదత్తభానం ' ధూర్త విట సంవాదం "ను ఆకాశవాణి పూర్వ సంచాలకులు కీర్తిశేషులు పెనుబోలు బాల గురుమూర్తి (బాలు )గారికి అంకితం చేసి సహృదయత చాటుకున్నారు సొమిల్లకునిభాణం "పాద తాడితం "ను ప్రముఖ పరిష్కర్త, 85 ఏళ్ళ క్రితమే "పాటలీపుత్ర చతుర్భాని " పేర ముద్రించి వెలుగులోకి తెచ్చిన కీర్తి శేషులు మానవల్లి రామ క్రిష్నయ్య కవి పంతులు గారికి అంకితమిచ్చి తన కృతజ్ఞతను తెలియ జేసుకున్నారు.

ఇవన్నీ పాటలీపుత్రం లో జరిగే శృంగార కధలే ఇవి. పాటలీపుత్రానికే కుసుమపురం అనే పేరుంది. అదే నేడు పాట్నా అయింది. ఆందరూ లబ్ధ ప్రతిష్టులైన కవీశ్వరులే నవరత్న కవుల సరసన వున్న వారే. శ్రీ ఇప్పగుంట సాయిబాబా గారు విస్తృతమైన "భూమిక "కూర్చి, తమ సంస్కృత, ఆంధ్ర భాషా శేముషిని ఎరుక పరచారు. నాలుగు భాణాల్లో" పుష్ప భాణం "గా ఎదను తాకిన శూద్రక భాణం నిజం గా రసజ్ఞులకు "పద్మ ప్రాభ్రుతకమే "అంటే "తామర పువ్వు కానుకే ".

సూక్తి సుధ

విజయవాడ ఆకాశ వాణి కేంద్రం వారు సూక్తి సుధ లో "ధార్మిక చంతన, క్రోధం "అనే రెండు విషయాలపై మాట్లాడమి కోరగా రాసి మాట్లాడాను. దానిని ఆగస్ట్ 1,8,15,22,29 తేదీలలో ఉదయం 6గంటల సూక్తి సుధలో అయిదు భాగాలుగా ప్రసారం చేశారు. దానినే మీకు అంద జేస్తున్నాను.




"ధ్రుజ్ ధరణే"అనే ధాతువు నుండి "ధర్మం "అనే పదం వచ్చింది. "ధరతి విశ్వమితి ధర్మః –ధారణాత్ ధర్మః "అని వ్యుత్పత్తి. సమస్త విశ్వాన్నీ ధరించేది ధర్మం. విశ్వ స్థితికి ఆధారమైనది ధర్మం. "ధర్మ విశ్వస్య జగతః ప్రతిష్టాలోకే – ధర్మిష్టం ప్రజా ఉప స్పర్పంతి-ధర్మేణ పాప మనువదతి-ధర్మే సర్వం ప్రతిష్టి తం –తస్మాధర్మం పరమం వదంతి "అంటుంది శ్రుతి.అంటే "సమస్తలోక స్థితికి పరమ ఆధారం ధర్మమే. ధర్మ నిష్ట కలవారిని ప్రజలు ఆశ్ర ఇస్తారు. ధర్మం పాపాన్ని తొలగిస్తుంది. ధర్మం లోనే అన్నీ ఉన్నాయి. కనుక ధర్మం సర్వ శ్రేష్ట మైనది "అని భావం. రామాయణం లో కైక కూడా శ్రీ రామునితో "ధర్మ మూల మిదం రామ విదితం చ సదామపి "అని హితవు చెప్పింది. "జగత్తు ధర్మ పైనే ఆధార పడి నడుస్తోందిరామా, ఈ విషయం పండితులకు తెలుసు "అని ఆమె మనో భావం. వనవాసానికి వెడుతున్న కొడుకు రాముడితో తల్లి కౌసల్య "నువ్వు ఆచరిస్తున్న ధర్మమే నిన్ను రక్షిస్తుంది "అని ధైర్యం చెప్పి పంపించింది.

ఇంతకీ ధర్మం మనకు చేసే మేలు ఏమిటి ?"యతోభ్యుదయ నిస్స్రేయససిద్ధిః స ధర్మః "అభ్యుదయం నిస్స్రేయస్సు లను ధర్మం కలిగిస్తుంది. మనుస్మృతి "దశ లక్షణోధర్మః సేవితవ్యః ప్రయత్నతః –ధృతి, క్షమా, దమోస్తేయం, శౌచ మింద్రియ నిగ్రహః –ధీః,విద్యా, సత్యమక్రోధః దశకం ధర్మ లక్షణం "అని ధర్మానికి ఉన్న పది లక్షణాలను చెప్పింది. ధర్మాలు రెండు రకాలు. ఆశ్రమ ధర్మాలు, సామాన్య ధర్మాలు. గృహస్థాశ్రమ, వానప్రస్థాశ్రమ, సన్యాసాశ్రమాలలోని వారు ఆశ్చరించాల్సినవి ఆశ్రమ ధర్మాలు. సామాన్య జనులందరూ ఆచారిమ్చాల్సినవి సామాన్య ధర్మాలు. ఇవే సత్యం, క్షమా, భూత దయ, కృతజ్ఞత మొదలైనవి. వాల్మీకి మహర్షి రామాయణం లో సామాన్య ధర్మాలకే ప్రాధాన్య మిచ్చాడు. ఇవన్నీ మానవతా ధర్మాలుగా లోకం లో పిలువ బడుతున్నాయి. ఇవే సమాజ పురోగతికి అవసరమైనవి.

ఐతే మానవత్వం అంటే ?"మన్యతే అనేనా ఇతి "అని చెప్పారు. "దేని వలన సమస్తవ్యక్త ప్రపంచం, దానికి కారణమైన అవ్యక్త ప్రపంచం తెలియ బడుతుందో అదే మానవత్వం ".మానవత్వం లేని బ్రతుకు నిరర్ధకం. సాటి మానవునిలో దైవాన్ని చూసే చూపు కావాలి, రావాలి. అప్పుడే

మనిషి జన్మ సార్ధకం. సమాజం అలాంటి మానవులతోనే అభ్యుదయం చెందుతుంది. "యతో ధర్మ స్తతో జయతి "సుఖ సంతోషాలతో అందరూ వర్ధిల్లటానికి ఈ ధర్మాలు అందరూ ఆనుష్టించాలి. ఈ రకమైన ధార్మిక పరమైన ఆలోచనా, నిరంతర మననం ను "ధార్మిక చింతన "అంటారు.

ధర్మం పురుషార్ధ హేతువు. కటుంబ, బంధు, సోదర, దాంపత్య, సాంఘిక, న్యాయ, రాజకీయాది ధర్మాలను అందరం ఆచరించాలి. అసత్యానికి మించిన అధర్మం లేదు. "ధర్మ మూల జగత్సర్వం –ధర్మశ్చశ్రుతిమూలకః –భారతం పంచామో వేదః –శ్రుతి సర్వస్వ విస్తరం ". "సమస్త వేదాలకు మూలం ధర్మం. మహా భారతం పంచమ వేదం. వేదం సర్వస్వాన్ని మహా భారతం వివరించి చెబుతుంది. "అని దీని భావం. భారతం చదివి అర్ధం చేసుకొని, జీవితానికి అన్వయించుకొని ఆచరిస్తే ప్రపంచం సుఖ శాంతి మయమవుతుంది. అందుకే వివేకానందుడు "ప్రాక్టికల్ వేదాంతం "అవసరమని చెప్పాడు. ధర్మాలలో భూత దయ ఉత్తమమైనది. ఇదే భగవాన్ బుద్ధుని బోధనా సారాంశం. మానవుల విషయాలలోనే కాక పశు పక్షాదుల విషయం లో కూడా భూత దయ ఉండాలి అని వాల్మీకి మహర్షి బోధించాడు..

ఒక క్రమ పద్ధతిలో, అందరితో సహజీవనం తో, అందరికి సమాన సంతృప్తిని కలిగిస్తూ జీవించటమే ధర్మం. "అనేక ప్రాణి జేతే రహతి –త్యా సర్వాంచి రహ వి సుస్తితి –సామాన్ సంధానాంచి గతి వ్యాస –ధర్మ మహానవే ".విశ్వాన్ని అంతటిని మన ఇల్లుగా భావించటం, అందులో మన ఉన్నతి తో బాటు, ఇతరుల సుఖ సంతోషాలు చూసే గొప్ప సంస్కృతినే ధర్మం అన వచ్చు. ఇందులో న్యాయం నీటి, సమానత్వం ఉంటాయి. ఒకరికొకరు నిజాయితీగా సాయం చేసుకోవటమే లౌకికార్ధం లో ధర్మం.

ప్రపంచాన్ని ధరించేది రాక్షించేది ధర్మం. అనేక ధర్మాలు లోకం లో ఉన్నా వేదం ధర్మం శ్రేయస్కరం. "ద్వివిధోహి వేదోక్తో ధర్మః ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణ శ్చ జగతః స్థితి కారణం 'అని శ్రీ శంకర భగవత్పాదులు "గీతా భాష్యం "లో చెప్పారు. వేదం ధర్మాలు ప్రవృత్తిధర్మం, నివృత్తి ధర్మం అని రెండు రకాలు. ప్రవృత్తి ధర్మం అంటే ముందుకు వెళ్ళటం- ప్రోగ్రెస్. నివృత్తి ధర్మం అంటే వెనక్కి తిరిగి చూసుకొని సవరించుకోవటం-రిగ్రేస్. ఈ రెండు ధర్మాలు ప్రపంచం లో ప్రాణులన్నిటికి సహజమే. ఇందులో ఏది ముఖ్యమైనది అంటే రెండూ ముఖ్యమైనవే. ఉదాహరణకు-మానవుని పెరుగుదల శిశుత్వం తో ప్రారంభమై అనేక దశలలో,అనేక రకాలుగా విస్తరిస్తుంది. ఇది ప్రవృత్తి ధర్మం. వృద్ధాప్యం లోఎదుగుదల ఆగిపోతుంది. మనిషి నెమ్మదిగా కుంచించుకు పోతాడు. ఇదే నివృత్తి ధర్మం. అంటే మొదట ప్రవృత్తి ధర్మం, తర్వాత నివృత్తి ధర్మం అనే దశలు ఉంటాయి. ఇవి ఒకదాన్ని వదలి రెండవది ఉండదు. ప్రవృత్తిలో ప్రేమ ప్రధానం. అదే అభ్యుదయ మార్గం. నివృత్తి లో శ్రేయస్సు ప్రధానం గా ఉండి, ముక్తికి సోపానమవుతుంది. అలాగే మనసుకు కూడా ఈ రెండు ధర్మాలు వర్తిస్తాయి. జీవితం లో ముందుకు సాగటం ప్రవృత్తి. ఏవైనా అడ్డంకులు ఎదురైతే, కొంచెం వెనక్కి తగ్గి, మనల్ని మనం రక్షించుకోవటం నివృత్తి. మెలకువ స్థితిలో ప్రవృత్తి లో ఉన్న మనసు, ఇంద్రియాలు, నిద్రించే చేముందు నివృత్తి లోకి చేరతాయి. ముందుగా కర్మేంద్రియాలు, తర్వాత జ్ఞానేంద్రియాలు, మనసు విషయాల నుంచి వెనక్కి మరలి, ఆత్మలో కరగి పోతాయి. నివృత్తి తో బాటు ధర్మాన్ని కూడా అలవరచు కొంటేనే నిజమైన ఫలితం కలుగుతుంది.

కేవలం నిద్రించటమే నివృత్తి ధర్మం కాదు. దానికి తోడుగా జ్ఞానం ఉండాలి అప్పుడే మోక్షం లభిస్తుంది. నివృత్తి స్థితికి చేరాలంటే మొదట ఇంద్రియ స్వేచ్చను అరి కట్టుకోవాలి. తర్వాత అనేక విషయాలపై ఉన్న దుఖాన్ని గుర్తిస్తూ వివేకం తో వాటిని విశ్లేషిస్తూ, అనవసరమైన వాటిని విసర్జించాలి. అప్పుడు మాత్రమె మనసు నివృత్తి చెంది ఆత్మను తెలుసుకో గలుగుతుంది. అంటే ఆత్మ జ్ఞానం లభిస్తుందన్నమాట. అయితే ఇదంతా సద్గురువుల సాన్నిధ్యం లో, మార్గ దర్శకం లో మాత్రమె సాధ్యమవుతుంది. అప్పుడే ప్రవృత్తి, నివృత్తి ధర్మాలకు ధర్మ సూక్ష్మాలు గ్రహించే జ్ఞానం వస్తుందని సాధనలో పరి పక్వమైనవారు తెలియ జేశారు. ఈ జ్ఞాన సాధన వలననే పునరావృత్తి రహిత మోక్ష పదం సిద్ధిస్తుంది.

"శరీరమాద్యం ఖాలు ధర్మ సాధనం "అన్నారు ఏది సాధించాలన్నా శరీరం కావాలి. అది ఆరోగ్యం గా ఉండాలి. "A sound mind in a sound body "శరీరం ఆరోగ్యం గా ఉంటె మనసూ ఆరోగ్యంగా ఉంటుంది. "బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి "బ్రహ్మ జ్ఞానం తెలిసిన వాడు బ్రహ్మమే అవుతాడు. అలాగే "ధర్మ విద్ ధర్మైవ భవతి "ధర్మం తెలిసిన వాడు ధర్మ మూర్తి అయిన పరమాత్మయే అవుతాడు. ఇహ లోక వ్యవహారాలతో ముడి పడి ఉన్నదే ప్రవృత్తి ధర్మం. పరలోక వ్యవహారాలకు సంబంధించింది నివృత్తి ధర్మం. "అరయగ ధర్మ తంత్రముల యందు –నిరర్ధకము లేదోకండు-సెవ్వరి మది యందు వ్రాలె దగ –వారు, దానిన పూని యాచరింతురు"అని తిక్కన గారు శాంతి పర్వం లో చెప్పారు. అంటే మానవుడికి ధర్మ స్వీకార స్వేచ్చ ఉన్నదన్నమాట. అనుమానం లేదు. ప్రవృత్తి నివృత్తి ధర్మాలు ఒక దానికొకటి విరుద్ధం కావు. పరస్పర పోషకాలే. దీనికి మహత్తర ఉదాహరణ మన జాతి పిత మహాత్మా గాంధీయే –"ఒడలు దేశ సేవకు –ఎడద రాముని సేవకు –అప్పగించి ముక్తి గాంచె గాంధి "అన్నారు తెనుగులెంక శ్రీ తుమ్మల సీతారామ మూర్తిగారు.

మానవ జీవితం లో దాగి ఉన్న దైవత్వాన్ని వెలికి తీస్సి, సమాజ సేవకు అన్కం కావాలని మహా భారతం బోధించింది. జీవితం ద్వంద్వాత్మకం. మంచిని గ్రహించి ముందుకు సాగి జీవితాన్ని సార్ధకం చేసుకోవాలి.

ధార్మిక జీవిత వైశిష్ట్యం ఏమిటి అంటే "కష్ట సహిష్ణుత, స్వార్జిత విత్తానుభవ ప్రశస్తి, సోదరత్వ సౌజన్యం, ఆధ్యాత్మిక చింతన, ద్వేష రాహిత్యం, భగవద్భక్తి, బాంధవ్యం, సత్య నిష్ఠ,రుజు ప్రవర్తన, స్నేహ శీలం, విద్యా వినయ సంపద, ఐకమత్యం, పరోపకారం, సానుభూతి, సహవేదన. వీటిని అవరచుకొని ఆచరిస్తే సమాజం లో హింస, క్రూర ప్రవృత్తి నశించి, సుఖ శాంతులు వర్ధిల్లి, పురోగమనం చేకూరుతుంది. ఈ భావనలు కలగాలంటే నిరంతర ధార్మిక చింతన ఉండాలి. సద్గ్రంధ పఠనం ఆవశ్యకం. సత్సాంగత్యం, సద్గురు బోధ, ఉండాలి. మహా భారతం లో లేనిది ఏదీ లేదు. అది మనిషి కద.మనిషి మనసు కధ.మనిషిలోని ఉన్నత శిఖరాలను, అతి భయంకరమైన లోయలను, కుదుపులను చెప్పే కధ..విప్పే కధ. మానవ జీవితానికి అద్దం భారతం. వ్యక్తీ ప్రగతికి, సమాజ ప్రగతికి,, సుఖ దుఖాలకు అవసరమైన ధర్మాలు, ధర్మ సూక్ష్మాలు వివరించింది. మానవ జీవితానికి వాటిని సమన్వయం చేసి, రసమయం చేసింది, లోచూపు వెలిగించే దీపంగా భాసిస్తుంది భారతం.

రక్త మాంసాలతో, రకరకాల మనస్తత్వాలతో, మనతో పాటే ఉండే, శకునులు, శల్యులు, సైంధవులు, కీచకులు బకాసురులు, దుర్యోధన ధృత రాష్ట్రాదులు అన్ని యుగాల్లో, అన్నికాలాల్లో, అన్ని జాతుల్లో ఉన్నారు,ఉంటారు. వారిని పెరగనీయ కుండా మనమే జాగ్రత్త పడాలి. లేక పొతే మానవ జీవితం కల్లోలమయమై పోతుంది. ధర్మాన్ని ఆచరించటమేకాదు, ధార్మిక బోధనా అవసరమే. శాస్త్ర సాంకేతిక విద్యావలయం లో పరిభ్రమిస్తున్న నేటి ప్రపంచం మేధస్సుకు ఇస్తున్న విలువను, ప్రాధాన్యాన్ని హృదయానికి ఇవ్వటం లేదు. హృదయం లేని మనిషి దానవుడు అయ్యే ప్రమాదం ఉంది. ఉంటోంది కూడా. ఇది అందరికి అనుభవమే. అందుకే మానవ విలువలను బోధించే సాంఘిక శాస్త్రం విద్యలో అంతర్భాగం కావాలి. హ్యుమానిటీస్ లేక పొతే మనిషి "ఇన్ హ్యూమన్ "అవుతాడు. పరస్పర గౌరవం, మర్యాద అవగాహన అందించే విద్య నేర్పాలి. ప్రపంచం కుగ్రామం అయిన కొద్దీ, మనిషి స్వార్ధం తో మరీ కుంచించు కు పోతున్నాడు. మానవత్వాన్ని మంట గలుపుతున్నాడు. బుద్ధి, మేధస్సు వికసిస్తోందికాని హృదయ వికాసం రావటం లేదు.

ధార్మిక ప్రవృత్తి నుంచి మనిషి వైదొలగితే వచ్చే ప్రమాదం ఇదే. "మనం బ్రతికే అచ్చమైన, స్వచ్చమైన బ్రతుకే ధర్మ స్వరూపం "అన్నది కాశ్మీర దేశపు సంస్కర్త, యోగిని "లల్లాదేవి ".అందుకే ముస్లిములు కూడా ఏంతో గౌరవించి ఆమెను "లల్లారిఫా "అని ఆత్మీయంగా గౌరవం గా పిలుచుకొన్నారు. ధర్మమే అందరిని కలిపి ఉంచుతుంది అని దీనిని బట్టి మనకు అర్ధమవుతుంది. "ఇదంశరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిదీయతే "అని చెప్పిన భగవద్గీత వాక్యానికి "ఈ శరీరం ధర్మం అనే పంట పండించే క్షేత్రం "అని పరమోత్కృష్టమైన అర్ధం చెప్పారు శ్రీ కంచి పరమాచార్య.

"సర్వేషాం యః సుహృత్ నిత్యం –సర్వేషాంచ హితే రతః –కర్మణా, మనసా, వాచా, స ధర్మం వేదం జాజలే "అని జాజలికి వర్తకుడు తులాభారుడు భారతం లో ధర్మ విషయం గురించి బోధించాడు. ""జాజలీ !నిత్యం అందరికి స్నేహితుడిగా, మనో వాక్కాయ కర్మలా, పర హితంగా, ఉండే వాడే నిజంగా ధర్మం తెలిసిన వాడు "అని భావం. "తనను అధిగమించి, తనను నిర్మించుకోక పొతే –యెంత పేదవాడు ఈ మనిషి ?"అన్నాడు ప్రముఖ ఆంగ్లకవి వర్డ్స్ వర్త్.

రామాయణం లో రాముడు రావణాసురుడికి ధర్మ బోధ చేస్తూ "ధర్మ ఏవ హతో హంతి-ధర్మో రక్షతి రక్షితః –తస్మాద్ధర్మో న హంతవ్యః –మానో ధర్మో హతో వదీత్ "అన్నాడు "అధర్మాన్ని అణచి వేసే ధర్మాన్ని నువ్వు అణచి వేశావు రావణా !అందుకే ధర్మం నిన్ను హతం చేస్తుంది. ధర్మాన్ని మనం రక్షిస్తే ధర్మం మనల్ని రక్షిస్తుంది. ధర్మాన్ని అణచ కూడదు.ధర్మం హతమైతే మనల్ని ధర్మం హతం చేస్తుంది ".

"సత్యం పరమం ధర్మం "అన్నారు. సత్యం లో ధర్మం ఉంది సత్యమే నాశనం లేనిది. సత్యం తర్వాత పదమే మోక్షం. విశ్వాన్ని సుఖ శాంతులతో, ఉన్నతిలో ఉంచటమే అందరి ధ్యేయం కావాలి. "అందర్నీ ప్రేమించే మనసు, అందర్నీ సేవించే వయసు, అందరి క్షేమం కోరే బుద్ధి నాకు ప్రసాదించు "అన్నది మన ప్రార్ధన కావాలి. "కుర్వంతు విశ్వం ఆర్యం "అనేది భారతీయ సంప్రదాయం. విశ్వాన్ని సర్వోత్కృష్ట, ఉన్నత మయమానవులనుగా తీర్చి దిద్దటమే భారతీయ ధార్మిక ఆదర్శం.

"తనకోపమె తన శత్రువు, -తనశాంతమే తనకు రక్ష, దయ చుట్టంబౌ "అన్నాడు సుమతీ శతక కర్త. అసలు మనుషులకు క్రోధం ఎందుకు వస్తుంది ?దానివల్ల జరిగే పరిణామం ఏమిటి ?అనే దాన్ని గురించి తెలుసు కొందాం. "క్రోధాద్భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః స్మృతి భ్రంశాత్ బుద్ధి నాశో –బుద్ధినాశాత్ ప్రణశ్యతి "అని గీతా చార్యుడు శ్రీ కృష్ణ పరమాత్మ చెప్పాడు. "అను క్షణం విషయ సుఖాల గురించి ఆలోచిస్తే దానిమీదే ఆసక్తి పెరుగుతుంది. ఆసక్తి క్రమంగా కామం లేక కోరిక గా మారు తుంది. కోరిక తీరక పొతే కోపం లేక క్రోధం కలుగుతుంది. క్రోధం అవివేకానికి దారి చూపుతుంది. దీని వలన మరపు కలిగి, బుద్ధి నశిస్తుంది. బుద్ధి నాశనమైతే, అయోగ్యుడై మనిషి నశిస్తాడు. అంటే "ఆకాశంబున నుండి శంభుని శిరంబందుండి "లాగ క్రమంగా పతనమై జీవి నశించి పోతాడు. మరి దీనికి విరుగుడు లేదా?ఉన్నది "రాగ ద్వేషాలు లేకుండా ఇంద్రియాలనుస్వాదీనం లో ఉంచుకొని, విషయ సుఖాలను అనుభ విస్తూ కూడా మానవుడు నిర్మలుడే అవుతాడని ఆ భగవద్గీతే చెప్పింది.

అందుకే భగవద్గీత ను "మనస్తత్వ శాస్త్రం "అన్నారు. మానవ మనో లీలలను పరమాద్భుతం గా వర్ణించింది. బందానికీ, మోక్షానికీ కారణం మనసే. ఉద్ధరించినా అధోగతి పాలు చేసినా మనస్సే"అదే బంధం శత్రువుకూడా. కనుక కోరిక పెరిగితే, కామం పెరిగి మోక్షానికి అవరోధమవుతుంది. "వీత రాగ భయ క్రోదో, మన్మయా మా ముపాశ్రితాః-బహవో జనన తపసా పూతా మద్భావ మాగతాః"అని పరమాత్మ తరుణోపాయమూ చెప్పాడు. అన్నిటికి కారణమైన కామాన్ని పిశాచం తో పోల్చింది "యోగ వాసిస్టం ""తవనావహితం చిత్తం కామః కవల యిష్యతి –సావదానస్య బుద్దస్య పిశాచః కిం కరిష్యతి ?అన్నది అంటే "అజాగ్రత్తగా ఉంటె చిత్తాన్ని కామం మింగేస్తుంది. జాగ్రత్తగా ఉంటె కామ పిశాచి చిత్తాన్ని ఏమీ చేయలేదు "అని భావం. కనుక సర్వ వేళల, సర్వా వస్థలలో మెలకువగా అంటే జాగ్రత్తగా ఉండాలి.

పరశురాముని క్రోధం 14 సార్లుక్షత్రియ రాజ వంశాలపై దండెట్టించి,రాజ వంశ నిర్మూలనం చేసింది. మహా భారతం లో పరీక్షిత్తు మహారాజు తపస్సమాధిలో ఉన్న "శమీక మహర్షి "తనకు ఆతిధ్యం ఇవ్వలేదని ఆగ్రహించి, చచ్చిన పామును తెచ్చి ముని మెడలో వేస్తె ఆ తర్వాత వచ్చి చూసిన కొడుకు "శృంగి "7 రోజుల్లో పరీక్షిత్తు మరణిస్తాడని శపించాడు. జరిగింది తెలుసుకొన్న మహర్షి కొడుకుతో "క్రోధం తపస్సుకు భంగం. అణిమాద్యష్టసిద్ధి సాధనకు ఆవ రోధం. ధర్మ మార్గానికి అడ్డంకి. తపస్వికి క్రోధం పనికి రాదు. చేసే పని ఒకటికి రెండు సార్లు ఆలోచించుకొని చేస్తే క్రోధం తగ్గుతుంది "అని హితవు చెప్పాడు. విశ్వామిత్రుడికి వసిష్ట మహర్షిపై ఉన్న కోపం బ్రహ్మర్షి పదవికి అడ్డంకి అయింది. కార్త వీర్యార్జునుని కోపం పతన హేతువైనది. దుర్యోధనుని క్రోధం కౌరవ వంశ నిర్మూలనం చేసింది. "కామం ఆవహిస్తే క్రోధం నాట్యం చేస్తుంది "అనే సామెత లోకం లో ఉంది. కామ, క్రోధాలు పరమ మిత్రులు. లోకోపకారానికి అవతార పురుషులు "ధర్మాగ్రహం "చూపిస్తారు. శ్రీరాముడిది రావణాది రాక్షస సంహారం లో ధర్మాగ్రహమే. భారత స్వాతంత్ర్య సముపార్జనకు మహాత్మా గాంధి బ్రిటిష్ వారిని ఎదిరించింది "సత్యాగ్రహం "తోనే.

కామ క్రోదాలకు తోడు డంబం, గర్వం, అభిమానం అంటే దురహంకారం, కాఠిన్యం,అవివేకం అసుర లక్షణాలుగా ఉపనిషత్తులు పేర్కొన్నాయి. అందుకే "కామ క్రోధ స్తదా లోభాస్తస్మా దే త్రయం వ్యజేత్ "అన్నారు నరక ద్వారాలైన కామ క్రోధ లోభాలను మూడింటిని విసర్జించాలి. అహంకారం బలం దర్పం, కామం క్రోధపరిగ్రహం –విముచ్య నిర్మమస్శాంతో బ్రహ్మ భూయాయ కల్పతే "అని చెప్పి వీటిని విసర్జించి మన శ్శాంతి తో జీవించమని మహాత్ముల సందేశం.

శ్రీరాముడు తాను రాజ సూయ యాగం చేస్తానని తమ్ములతో చెప్పాడు. వివేకి అయిన తమ్ముడు లక్ష్మణుడు "రాజ సూయ యాగం వలన రాజులతో అనవసర కలహాలేర్పడి ప్రశాంతతకు భంగం కలుగుతుంది. రాజ వంశ వినాశనం జరుగుతుంది. వసుంధరా వధ చేయ వద్దు "అని చక్కని సలహా ఇచ్చాడు. ధర్మ సూక్ష్మం గ్రహించిన రాముడు "శుభం పలికావు చిన్నవాడివైనా. వివేకి లోక పీడా చర్యలు చేయరాదు "అని విరమించుకొన్నాడు. చనిపోయే ముందు మనిషి కామ క్రోధాదుల వేగం అరి కట్ట గలిగితే, యోగి, సుఖి అవుతాడు. కామ క్రోధాలు తొలగి పోవటం "వాసనా క్షయం "అంటారు. దీని వలన చిత్తం స్వాధీనమై, ఆత్మ జ్ఞానం కలిగి మోక్షం లభిస్తుంది.

"కామం లేక కోరిక క్రోదానికి హేతువు. కామం వల్ల ద్యూతం, వేట, స్త్రీవ్యసనం, మద్యపానం నిరర్ధక ధన వ్యయం అనే అయిదు వ్యసనాలు కలుగుతాయి. వీటి వలలో పడి, కోరికలు పెరిగి, అవి తీరక పొతే క్రోధం విజ్రుంభిస్తుంది. క్రోధం వల్ల వాక్పారుష్యత్వం, దండ పారుష్యం అనే రెండు వ్యసనాలొస్తాయి. "అని భీష్మ పితామహుడు అంపశయ్యపై ఉండి ధర్మ రాజుకు ఉపదేశించాడు. "ధర్మార్ధ కామాలు అనే వర్గ త్రయం, ప్రభుత్వ మంత్రోత్సాహాలైన శక్తి త్రయం, రాజు అధీనం లో ఉంటె, సత్వ ర స్తమ గుణాల వివేచనతో రాజు ధర్మ పాలన చేస్తాడు. రాజు ప్రజలను జాగ్రత్తగా కాపాడుతూ, ప్రజలు చేసే సత్కార్యాలను మెచ్చుకుంటూ, కౌటిల్యం ఆత్మ స్తుతి, దురహంకారం, క్రోధం విడనాడాలి" అని భీష్మ ఉవాచ. ఇవి పరిపాలనలో ఉండే అందరికీ వర్తించే నిత్య సత్యాలు. పాలకులు ఈ మార్గం లో నడిస్తే ప్రజాశాంతి సాధన జరుగుతుంది.

కామ క్రోధ లోభ మద మాత్సర్యాలను "అరిషడ్వర్గం "అంటారు. ఇవి ఎలాకలుగుతాయో ఏ విధం గా తొలగి పోతాయో కూడా చెప్పారు. "సంకల్పం వల్ల కామం జనిస్తుంది. దేహాత్మ విభేద జ్ఞానం వలన నశిస్తుంది. పరుల దోషాల వల్లక్రోధం ఏర్పడుతుంది. ఓర్పుతో ఇది నశిస్తుంది. అస్థిర జ్ఞానం లోపిస్తే లోభం కలుగుతుంది. ఎరుక వలన తొలగి పోతుంది. అజ్ఞానం వలన మోహావేశం కలిగి ధర్మాచరణ తో దూరమౌతుంది. కులం విద్య, ధనం మదాన్ని పెంచుతాయి. అవి అశాశ్వతం అని గ్రహిస్తే మదం నశిస్తుంది. సాత్విక గుణ సంపత్తి లేకపోతె మాత్సర్యం ఏర్పడి సత్పురుష సాంగత్యం వలన నిర్మూలనమౌతుంది. ఈ ఆరు మనసులో చేరితే ధైర్యం కోల్పోతారు. అయితే ధీమంతుడిని ఇవి ఏమీ చేయలేవు. బాగా ఆలోచించి నిర్ణయం తీసుకొంటె వీటి వలన ప్రమాదం రాదు.

మన ఆలోచనా విధానం సక్రమ మార్గం లో ఉండాలి. మనసు నిర్మలం గా ఉంచుకోవాలి. ఈ ఆధునిక కాలం లో ఇది సాధ్యమేనా ?అంటే సాధ్యమే. వృత్తి ఉద్యోగాలలో అనుక్షణం టెన్షన్ లో ఉంటాం. సమాజం లో అసమానతలు, చుట్టూ దరిద్రం, పరపీడన, పురుషాహంకారం, ప్రేమ పేరిట మృగాలవుతున్నమగాళ్ళు,, అన్నిట్లో వివక్షత మనల్ని అశాంతులను చేస్తున్నాయి. అందుకని ఉద్రేకపడి ఉపద్రవాలు తెచ్చుకోకూడదు. కనుకనే శారీరిక మానసిక ఆరోగ్యం కోసం యోగ సాధన చేయాలి "యోగః కర్మ సుకౌశలం "అన్నాడు యోగాచార్యుడు

కృష్ణుడు. యోగిగా ఈ సమాజం లో జీవించు అని గీత చెప్పింది. చెప్పటం సులువే కాని ఆచరణ సాధ్యమా అనిసందేహం వస్తుంది., అందుకే "మనసులో సమత్వం ఉన్నవారంతా యోగులే "అన్నారు కంచి పరమాచార్య. "మన వేదనా స్వరూపానికి శాంతి ప్రకరణమే వేదం "అని గ్రహించమన్నారు. ప్రపంచం లో ప్రజలకోసం చేసే సేవ పరమేశ్వరా రాధనం అవుతుంది. అందుకే "సమాజ పరమేశ్వరుడు "అన్నారు. దీని వలన ఆత్మ సంతుష్టి కలిగి సేవలో పడిన క్లేశ, దుఖాలు ఆనందాన్ని, సుఖాన్ని ఇస్తాయి.

సమాజం లో జరిగే వాటిని చూసి భయపడి పని చేయకుండా ఉండరాదు. భగవంతుని తో సహా అందరం కర్మ చేయాల్సిందే. కర్మ లేక పొతే లోక కార్యం జరగదు. కర్మ వలన చిత్త శుద్ధికలిగి, దాని వలన నిష్కామ కర్మ తెలిసి, దీనిద్వారా ధ్యానం, యోగం కలిగి చివరికి ఆత్మాను సంధానం లభిస్తుందని గీతలో పరమాత్మ చెప్పాడు. మనం శ్రద్ధ తో చేసేపని భక్తీ అయి ముక్తిగా విలసిల్లు తుంది. "ఉద్రేకాలు అణచుకొని, సదాలోచనలు పెంచుకొని, ఉద్వేగాలకు లోనుకాకుండా, బ్రతికితేనే శాంతి. మనసులో నిర్మలత్వం, ద్రుష్టి లో విశాలత్వం, ఆలోచనలలో అనంతత్వం ఉంటేనే శాంతి లభిస్తుంది "అని జ్ఞాన, వయో వృద్ధులైన రచయిత శ్రీ పోతుకూచి సాంబశివ రావు గారు అన్నారు.

"మనసు కలయిక గా విద్య ఉండాలి. అంతరిక సమతుల్యత, సామరస్యం ఉన్న వ్యక్తులను విద్య సమాజానికి అందించాలి. జీవితాన్ని, మానవుడిని, ప్రవర్తనను నిర్మించే విద్య నేర్పితే, అరిషడ్వర్గాలను అధిగమించే స్థితి కలుగుతుంది "అని స్వామి వివేకానంద ప్రవచనం. విజ్ఞాన, ఆధ్యాత్మిక శక్తులను ఏకం చేస్తూ, వ్యక్తిత్వ వికాసాన్ని విద్య పెంపొందిస్తే, సమాజం లో రుగ్మతలు ఉండవు.

అందర్నీ కలిపి ఉంచేది ప్రేమ తత్త్వమే. ప్రపంచాన్ని కామక్రోధాలు పాలించ కూడదు. ప్రేమ మాత్రమె ప్రపంచ పాలన సాగించాలి. అప్పుడే సుఖం శాంతి, పురోగమనం లభిస్తాయి. ప్రేమ వికశించి, సంకుచితత్వాన్ని త్రెంచి పారెయ్యాలి. "ప్రేమ వికశించి మస్తిష్కం పునర్వ్య స్థీక రించ బడాలి. సమస్త జీవుల్లో ఊర్జవం, శక్తి, మాధుర్యం, తేజస్సులు చొచ్చుకు పోవాలి. ప్రేమలో శాంతి సుఖ సంతోషాలు సేవ ఉన్నాయి. ప్రేమ విశ్వం కన్నా విశాలమైనది యుగాలు కల్పాలకన్నా శాశ్వతమైనది. అనంతమైనది. ప్రేమ అంటే మీరే. నేనే, మనమే "అన్నారు అరవిందాశ్రమ మాత.

### సత్య కధా సుధ

సాహితీ బంధువులకు --సాదర విన్నపం -సత్య దర్శనం చేయటానికి అనేక ఉపాయాలున్నాయి. అందులో చిన్న కధ లుగా చెబితే త్వరగా మనసుకు పడుతుంది. అలాంటి వాటిని రాసిన మాహాను భావులు శ్రీ టి.వి.కే.సోమయాజులు గారు. వారు రచించిన "సత్య దర్శనం "నుండి నా భాషలో సత్య సౌందర్యం ను దర్శించటానికి "సత్య కధా సుధ "శీర్షిక తో ధారావాహికను అతి త్వరలో మొదలు పెడుతున్నాను. మీ దుర్గా ప్రసాద్


సత్య కథా సుధ 1

ఒక రాజు గారికి దైవ భక్తీ ఎక్కువ. దేశం లో ఉన్న తన ప్రజల్లో దైవం మీద విశ్వాసం ఎలా ఉందో తెలుసు కోవాలనే వింత కోరిక కలిగింది. మూడు ప్రశ్న లను ఇచ్చి దండోరా వేయించాడు. మొదటి ప్రశ్న దేవుడున్నాడా ?.రెండోది ఉంటె ఎటు వైపు చూస్తుంటాడు ?మూడో ప్రశ్న ఏమి చేస్తుంటాడు?ఈ మూడు ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగిన వాళ్ళే రాజు దగ్గరకు రావాలి. చెప్ప లేక పోతే శిరచ్చేదమే. అదీ చాటింపు. దేశం లోని పండితులు జ్ఞానులు, భక్తులు, సన్యాసులు అందరు విన్నారు. కానీ శిక్షను ను చూసి ఎవరు సాహసించి వెళ్ళ లేక పోయారు.

చివరికి ఒక సన్యాసి మాత్రం అన్నిటికీ తెగించి రాజు దగ్గరకు వచ్చాడు. తాను ప్రశ్నలకు సమాధానం చెబుతానని, శిక్ష విషయం కూడా తెలుసు నని విన్న వించాడు రాజుతో. సరే నన్నాడు రాజు. దైవ విషయం పై చర్చ కనుక ఒక దీపారాధన తెప్పించమని, నైవేద్యానికి ఒక గ్లాసు పాలు కావాలని కోరాడు. అలానే ఏర్పాటు చేశారు. సమాధానం చెప్పమని రాజు తొందర పెడుతున్నాడు. అప్పుడు సన్యాసి రాజుతో "నువ్వు అడిగే వాడివి నేను చెప్పే వాడిని కనుక నేను ఉన్నతాసనం మీద కూర్చో వాలి, నువ్వు శిష్యుడైనందు వల్ల కింద కూర్చోవాలి అన్నాడు. ఇది ఉపదేశ నియమం "అని చెప్పాడు సన్యాసి. రాజు అంగీకరించి అలానే చేశాడు. సింహాసనం మీద కూర్చొని రాజును ప్రశ్నించ మని అడిగాడు సన్యాసి. రాజు మొదటి ప్రశ్న "దేవుడున్నాడా "?అని అడిగాడు. సన్యాసి పాల గ్లాసు ను చూపించి "ఈ పాలలో వెన్న ఉందా?"అని ఎదురు ప్రశ్న వేశాడు. ఉందని రాజు సమాధానం చెప్పాడు. చూపించమన్నాడు సన్యాసి. పాలను తోడేసి చిలికితే కాని వెన్న రాదు అని రాజు సమాధానం చెప్పాడు. అప్పుడు సన్యాసి "భగవంతుని గురించి నిరంతర చింతన ఉన్న వాళ్ళ కే ఆయన కని పిస్తాడు "అని సమాధానం సంతృప్తిగా చెప్పాడు.

రాజు “దేవుడు ఎటు చూస్తాడు ?”అని రెండో ప్రశ్న వేశాడు. సన్యాసి సమాధానం చెప్ప కుండా “ఈ దీపం ఎటు చూస్తోంది ?”అని ప్రశ్నించాడు. అన్ని వైపులకూ చూస్తోందని రాజు సమాధానం. వెంటనే సన్యాసి “దీపం లాగానే దేవుడూ అన్ని దిక్కులకు చూస్తాడు “అని సమాధానం చెప్పాడు. తృప్తి చెందిన రాజు మూడో ప్రశ్న “దేవుడు ఏం చేస్తుంటాడు?అని అడిగాడు. సన్యాసి “రాజా !నువ్వు ప్రభువువు.నువ్వు ఇప్పుడు కింద కూర్చున్నావు. నేను సాధారణ సన్యాసిని. సింహాసనం మీద కూర్చున్నాను. అలాగే భాగ వంతుడు కింది వాణ్ణి పైకి పై వాణ్ని కిందా కు మారుస్తుంటాడు “అని సమాధాన మిచ్చాడు. రాజు పరమానందాన్ని పొందాడు, అప్పటి నుంచి ఆ రాజు భగవంతుని పై అనన్య భక్తిని కలిగి ధన్యుడు అయాడు,

జగద్గురువులు ఆది శంకరాచార్యుల వారు “సుఖావ బోదార్ధం ఆఖ్యాయికాఖ్యానం “అన్నారు. అంటేగహన మైన వేదాంత విషయాలను బోధించ టానికి, తేలికగా అర్ధం ఆవ టానికి కధలు అవసరం అని చెప్పారు.

దైవీ శక్తి అనంతం. అర్ధం చేసుకోవటం మనకు మించిన పని. ఈ విషయాన్నే ఒక సంస్కృత మహా కవి అందమైన శ్లోకం లో చెప్పాడు.

**“అసిత గిరి సమం స్యాత్ కజ్జలం సింధు పాత్రే –సుర తరు వర శాఖా లేఖినీ పత్రముర్వీ –**
**లిఖితి యది గృహీత్వా, శారదా సర్వ కాలం –తదపి తవ గుణా నా మీశ పారం నయాతి “**

భావం —కాటుక పర్వతాన్ని తెచ్చి, సముద్రం లో వేసి సిరా తొట్టి గా మార్చి, కల్ప వృక్ష శాఖను కలంగా తీసుకొని, భూమి నంతా రాయ టానికి వాడు కొని ఆ సరస్వతీ దేవి సర్వ కాలాల్లో ను రాస్తున్నా, భగ వంతుని గుణాలు తరగటం లేదట. అంటే ఆమె తరం కాలేదు అని అర్ధం. ఇదీ దైవీ గుణ విభూతి. ఎంత చెప్పినా తరగని గని

“అదృష్ట వంతు లైన పుత్రుల్ని కని హాయిగా జీవించండి. బిడ్డలు విద్యా వంతులు, శూరులు అయినంత మాత్రాన ఆనందం రాదు. నా కొడుకులు విద్యా వంతులు, పరాక్రమ వంతులే.. వారి వల్ల నేను కాని వారు కాని ఏ సుఖమూ పొంద లేదు. అదృష్ట వంతులకు మాత్రమే సౌఖ్యాలు లభిస్తాయి “ అని కుంతీ దేవి తన కొడుకులు కురు క్షేత్ర యుద్ధానికి బయల్దేరి నప్పుడు ఆశీర్వ దించి పంపింది. అందుకే లోకం లో ఒక సామెత వచ్చింది “పాండవుల ఆదాయం కౌరవుల తద్ది నాలకు చాల లేదు “అని. అంటే పాపం అంత కష్టపడి అరణ్య, అజ్ఞాత వాసాలు చేసి, యుద్ధం చేసి, చేసిన ప్రతిజ్ఞ లను నేర వెరచు కొని రాజ్యాన్ని పొందినా వాళ్ళకు దక్కింది చాలా తక్కువే.

ఒకే పనిని చాలా మంది చేస్తారు. కాని ఫలితాలు వేరు వేరు గా ఉండటం గమనిస్తాం. దానికి కారణం ఏదీ మనకు కని పించదు. దీన్ని అర్ధం చేసు కోవా టానికి ఒక కధ చెబుతాను ఒక ఊరిలో ఇద్దరన్న దమ్ములున్నారు. పేదరికం ఇద్దర్నీ బాధిస్తోంది. దాని నుంచి బయట పద టానికి మార్గాలను అన్వేషిస్తూనే ఉన్నారు. పెద్ద వాడి భార్య తమకు ఆ ఊళ్ళో ఏమీ లభించటం లేదని, ఇతర గ్రామానికి వెళ్లి సంపాదన కు ప్రయత్నించ మని సలహా ఇచ్చింది. అలాగే అతడు బయల్దేరి వెళ్లాడు. బాగా నడిచి ఒక మర్రి చెట్టు కింద అలసట తో నిద్ర పోయాడు. చీకటి పడబోతుండగా దగ్గర్లో ఉన్న చెరువు లో స్నానం చేసి తాను తెచ్చు కొన్న అన్నం తిందాము అను కొన్నాడు. స్నానం చేసి వచ్చి చుస్తే తను తెచ్చు కొన్న అన్నం మూట లో అన్నం లేదు. కాని అందులో ఒక పళ్ళెం ఉంది. కోపం వచ్చింది. ఆకలి దహిస్తోంది. ఆ పళ్ళాన్ని నేల కేసి కొట్టాడు. అది బోర్ల పడింది. అందులే షడ్రసో పెత మైన భోజన పదార్దాలున్నాయి. కమ్మగా భోజనం చేసి ఇంటికి చేరాడు. భార్యతో విషయం చెప్పాడు. మర్నాడు ఊరి వారందరినీ తన ఇంటికి భోజనానికి పిలిచాడు. అందరికి ఆశ్చర్యమేసింది. అందరు వచ్చారు. ఇంట్లో గాడి పొయ్యి లేదు వంట వండిన తీరు లేదు. అంతా పంక్తుల్లో కూర్చున్నారు. గోవింద నామ స్మరణ చేస్తూ, అందరి తో చేయిస్తూ అన్దరి ముందు పళ్ళెం బోర్లిస్తున్నాడు వరుసగా. అపుడు ప్రతి వాడి ముందు అన్ని భోజన పదార్దాలతో ఉన్న విస్తరి కని పించింది. సుష్టుగా అంతా భోజనం చేసి కృతజ్ఞత తెలిపి వెళ్లారు “.అన్నయ్య జీవితం వడ్డించిన విస్తరి “అయినదని తమ్ముడు తెలుసు కొన్నాడు. తానూ అలా కావాలని ఆలోచించాడు

తమ్ముడి భార్య తోడి కోడలి దగ్గర విషయం అంతా సేకరించి భర్తకు చెప్పి పొరుగూరికి వెళ్లి సాధించ మని బోధించింది. అతను అలానే వెళ్లాడు. అన్నకు జరిగి నట్లుగా నే అతని అన్నం మూటలో పళ్ళెం కని పించింది. అందులో భోజన పదార్ధాలు సర్వం ఉన్నాయి అన్నయ్య వాటిని ఇక్కడే తిని తప్పు చేశాడని భావించి తిన కుండా, ఆకలి తో ఇంటికి చేరాడు. మర్నాడు వూరి వారందర్నీ భోజనానికి పిలిచి పళ్ళానికిపూజ చేసి ఒక్కొక్కరి పళ్ళెం ముందు పళ్ళాన్ని బోర్లించి తిరగేస్తున్నాడు. అందరి తో గోవింద స్మరణ చేయిస్తున్నాడు. కాని పళ్ళెం నుంచి భోజన పదార్ధాలున్న విస్తళ్ళు రాలేదు. హతాశు డై పోయాడు., అయితే ఇద్దరు మంగలి వాళ్ళు మాత్రం పళ్ళెం నుంచి వచ్చారు. ప్రతి వాడిని పట్టు కొని వద్దన్నా విన కుండా ఆడా మగా తేడా లేకుండా బుర్రలు గొరిగి వదులుతున్నారు. పారి పోయేవీలు లేని పరిస్తితి లో వాళ్ళున్నారు. కనుక ఒకే పనిని ఒకే విధానం లో ఇద్దరు చేసినా ఫలితాలు ఒకే రకం గా ఉండవని అర్ధం అవుతోంది. మనం చేసిన మంచీ, చెడు మన ఉన్నతికి, అధోగతికి కారణాలవుతాయి అని మర్చి పోకూడదు. అదృష్ట వంతుల్ని చెరిచే వారు, దురదృష్ట వంతుల్ని బాగు చేసే వారు లేరు

ఇంకో కథ తెలుసు కొందాం. ఒక పేదయువకుడు దేవుడు గుడి లో పూజారి పెట్టిన ప్రసాదాలు తింటూ గుడి అరుగు మీద రాత్రుళ్ళు నిద్ర పోతూ కాల క్షేపం చేస్తున్నాడు. ఒక రోజు రాత్రి అలానే నిద్ర పోతుంటే ధన లక్ష్మి కలలో కన్పించి "నీ దగ్గిరి కి వస్తాను "అన్నది. అతడికి విరక్తి ఎక్కువ. ఏమీ సమాధానం చెప్ప లేదు. మళ్ళీ కని పించి వస్తాను అంది. దానికి అతడు "తల్లీ ! వస్తానంటున్నావు. మంచిదే. ఎప్పుడు వెళ్లి పోతావో కూడా చెప్పు "అన్నాడు అప్పుడు లక్ష్మీ దేవి "నీ భార్య ఒక రోజు తెల్ల వారు ఝామున తల విర బోసుకొని, పని వాళ్ళు లేరు, చేసే వాళ్ళు లేరు బాధ్యత లేదు అని తిట్టు కుంటూ మేడమెట్లు దిగే రోజున నేను వెళ్లి పోతాను "అని చెప్పింది. మెలకువ వచ్చి, నవ్వు కుంటూ లేచాడు యువకుడు. కాల కృత్యాలు కూడా తీర్చు కొ కుండా నడిచి వెళ్లి పోతున్నాడు. తిన్నగా రాజు గారి **అంతఃపురం చేరి, కావలి వారెవరు లేక పోయే సరికి రాణీ గారి తల్పం మీద అప్పుడే నిద్ర లేచి కూర్చున్న మహా రాణి**ని చూశాడు. అమాంతం ఆమె ను కౌగలించు కొని గట్టిగా పట్టు కొన్నాడు. ఆమె పెనుగు లాడుతూ అరుస్తోంది. రాజు గారు పరిగెత్తు కొచ్చి వాడిని నరక టానికి కత్తి పైకెత్తాడు. ఇంతలో రాణి పడుకున్న మంచం మీంచి కాల సర్పం కింద పడింది. దాన్ని రాజు చంపి, తన రాణిని రక్షించి నందుకు యువకుడి పై జాలి కలిగి కనక ఆసనం పై వాడిని కూర్చో బెట్టి కనకాభి షేకం చేశాడు రానీ తో సహా. అతని పై కృతజ్ఞతా భావం కలిగింది. మంచి అమ్మాయిని వెదికించి పెళ్లి జరి పించాడు. అన్ని భోగాలు వారికి రాజు సమ కూర్చాడు. కాని యువకుడు తనకున్న రెండు అంగ వస్త్రాలను, చెంబు ను భోషాణం లో భద్రం గా దాచు కొన్నాడు. కంత కాలం గడిచింది

ఒక రోజు అతని భార్య తల విరబోసు కొని మేడ మెట్లు దిగుతూ తనకు కావలసిన వస్తువుల జాబితా అందించింది. తనకు ఈ ఐశ్వర్యం నుంచి విముక్తి లభించే రోజు దగ్గర పడింది అని యువ కుడు తెలుసు కొన్నాడు. నగలను ధనాన్ని మూటల్లో కట్టించి, పల్లకి ఎక్కించి పుట్టిన ఇంటికి వెళ్లి హాయిగా ఉండ మన్నాడు. ఎందుకో అడగ వద్దు అని శాశించాడు. రాజు గారి భటుడు వేట రమ్మని రాజాహ్వానం గా తెలియ జేశాడు. రాజు, ఈ యువకుడు చాలా సేపు వేటాడి అడవిలో ఒక చెట్టు కింద అలసట చెంది నిద్రించారు. చెట్టు మీద ఉన్న కొంగ రాజు గారిమెడ మీద రెట్ట వేసింది. దాన్ని తొలగించే విధి తనది అని భావించి, రాజు మొలలో ఉన్న చుర కత్తి తీసి తుడవ బోయాడు. ఇంత లో రాజుకు మెలకువ వచ్చి, మెడ మీద కత్తి ఉండటం గమనించి తన్ను చంప బోతున్నాడని భావించాడు. యువకుడు ఏదో చెప్ప బోయాడు. విని పించు కొ లేదు. విచారణ జరిగింది. రాజే ప్రత్యక్ష సాక్షి కనుక తీర్పు వెంటనే చెప్పారు శిరచ్చేదం అని తీర్పు. రాణి గారు జాలి పడి అతన్ని విడి చి పెట్ట మనికోరారు. అప్పుడు అతను తన భోషాణం లో ఉన్న మూడు వస్తువులను తనకు తెచ్చి ఇప్పించమని కోరి తన కథ అంతా వివ రించాడు. అందరు యువకుని సత్ప్రవర్తన ను గ్రహించారు. కనుక అవ్యక్త పర మాత్మ ఆదేశం మేరకే, మంచి, చెడు జరుగు తుంది. మానవుడి భాగ్య రేఖ దీని వెనక ఉంటుంది. అదే దైవీ శక్తి. అందుకే భాస్కర శతకం లో –

"పూనిన భాగ్య రేఖ చెడి పోయిన పిమ్మట ఎట్టి మానవుమ్డైనను –వాని నెవ్వరు ప్రియంబున బిల్వరు పలక రెచ్చట న్ "అన్న సూక్తి మర్చి పోరాదు.

భగ వంతుడు ఏమి చేస్తాడో మానవునికి తెలియని ఒక లీల ను గురించి తెలియ జేస్తాను. ఒక రాజు గారి ఆశ్రయం లో ఇద్దరు పురోహితులున్నారు. అందులో ఒకడు "దైవా దీనం జగత్ సర్వం "అని నమ్మిన వాడు. రెండో వాడు రాజు గారి పరిపాలన బాగా ఉందని అందుకే ప్రజలంతా సుఖం గా ఉన్నారని నమ్మే వాడు. మొదటి వాడు ఎప్పుడూ అంతా దైవాధీనం అంటూ ఉండటం వల్ల"దైవాధీనం" అనే అందరి చేతా పిలువ బడే వాడు. రెండో వాడు అంతా రాజు గారి దయ అని భావిస్తూ"రాజాదీనం "అని పిలువా బడ్డాడు. రాజు గారి మెప్పు పొంది ఇతను అప్పుడప్పుడు రాజ బహుమానం అందు కునే వాడు.

ఒక రోజు రాజు గారికి రాజాదీనం గారిని సువర్ణ, వజ్ర వైదూర్యాలతో సత్క రించాలని కోరిక కలిగింది. అదీ ఎవరికీ తెలీకుండా రహస్యం గా చేయాలని భావించాడు. ఒక గుమ్మడి కాయ ను తెప్పించి దానికి కన్నం పెట్టించి అందులో వజ్ర వైదూర్య రత్న మాణిక్య సువర్నాలను నిక్షేపం చేసి రాజాదీనం గారికి స దక్షిణం గా దానం చేశాడు. ఆయన దాన్ని ఇంటికి మోసుకు పోతుంటే దాన్ని అమ్మేసి డబ్బులు తీసుకుంటే మంచిది అనిఆలోచన వచ్చింది. ఒక శెట్టి గారికి అమ్మి ఆయన ఇచ్చిన పావలా డబ్బులు తీసు కొని ఇంటికి వెళ్లాడు. శెట్టి కి ఒక ఆలోచన వచ్చింది. గుమ్మడి కాయ దొరికింది పితృదేవతల పేరు తో దాన్ని దానం చేస్తే పుణ్యం అని అను కొన్నాడు. అప్పుడే అను కొ కుండా దైవాధీనం గారు అటు వెళ్తూ కని పించాడు. ఇంటికి ఆహ్వానించి ఆయనకు దక్షిణ తో సహా కూష్మాండ దానం చేశాడు శెట్టి. దైవాధీనం గారి భార్య భర్త తెచ్చిన గుమ్మడి కాయను పగుల గొట్టించింది భర్త చేత. ఆడ వాళ్ళు గుమ్మడి కాయ పగుల గొట్ట రాదనీ ఆచారం. అందులో వజ్రవైదూర్య మరకత మాణిక్య సువర్నాలు కని పించాయి. ఇదంతా దైవ లీల గా ఆయన భావించి పరమేశ్వరునికి కృతజ్ఞత తెలిపాడు

మర్నాడు రాజాదీనం రాజ దర్శనానికి వెళ్లాడు. గుమ్మడి కాయ కూర తిన్నారాని రాజు అడిగాడు. ఆహా, ఓహో అద్భుతం అని బొంకాడు ఆయన. రాజు గారికి అర్థమైంది. గుమ్మడి కాయ ఆయన ఇంటికిచేర లేదని. భటులను పిలి పించి కొరడా తో ఝాలిపించి నిజం కక్కించాడు. శెట్టి ని పిలిచి అడిగితె డబ్బు ఇచ్చి దాన్ని దాన్ని కొన్నానని దైవాధీనం గారికి దానం చేశానని చెప్పాడు. తాను ఒకటి తలిస్తే దైవం ఇంకో లాగా చేశాదేమిటి అని వితర్కించు కొన్నాడు రాజు. మరో సారి రాజాదీనానికి ఏదో ఇవ్వాలని సంకల్పించాడు

ఒక సంచి లో ధనాన్ని మూట కట్టించి రాజా దీనం గారు వచ్చే దారిలో పెట్టి, భటుడి ని కని పించ కుండా ఏం జరుగుతుందో చూస్తూ ఉండమన్నాడు.రాజదీనం నడచి వస్తు, దాన్ని గమనించ కుండా వెళ్లి పోయాడు. భటుడు రాజుగారికి విషయం తెలిపాడు. ఆయన మళ్ళీ ఆశ్చరయం లో మునిగాడు. రాజాదీనాన్ని పిలిపించి ఆ మూటను ఎందుకు చూడ లేదని అడిగాడు దానికి అతడు రోజు వెళ్ళే దారే కదా కళ్ళు మూసు కొని వెళ్ళ లేనా అని అక్కడికి రాగానే అని పించిందని అందుకని కళ్ళు మూసుకొని వెళ్ళా.అని బదులు చెప్పాడు. అదృష్ట వంతున్ని ఎవరు చేద గొట్ట లేరు. దురదృష్ట వంతున్ని బాగూ చేయ లేరు. తాను ఒకటి తలిస్తే దైవం ఇంకోటి తలుస్తుంది. దైవాన్ని నమ్మిన వాడికి అదృష్టం తలుపు తడుతుంది. అని ఇందులో ఉన్న సారాంశం.

పరమాత్మ ను పూర్తిగా మనస్పూర్తిగా నమ్మాలి అప్పుడే ఆయన కటాక్షం మన మీద పడుతుంది. మన ప్రయత్నం అంతా అయిన తర్వాత, నువ్వే తప్ప ఇతరం లేదు అని శరణాగతి పొంది నప్పుడే పరమాత్మ అనుగ్రహిస్తాడని గజేంద్ర మోక్షం లో ద్రౌపదీ వస్త్రాప హరణం లో గోపికా వస్త్రాపహరణం లో తెలిసిన విషయమే. అలాంటిదే ఇంకొకద. ఒక చాకలి వానికి ఒక భక్తుడి తో విరోధం వచ్చింది. బాగా తప్ప తాగి ఆవేశం తో వాడు కావడి బద్ద తీసుకొని భక్తుణ్ణి బాదేస్తున్నాడు. దెబ్బ దేబ్బకూ భక్తుడు"హరీ హరీ "అంటూ బాధ అను భావిస్తూ భగవంతడిని తలచు కొంటుఅరుస్తున్నాడు. అప్పుడు వైకుంఠ వాసుడు రమా పర్యం కం లో విహరిస్తున్నాడు. ఆమె కు చెప్ప కుండా ఎక్కడికో వెళ్లి కాసేపటి తర్వాత తిరిగి వచ్చాడు శ్రీ హరి. లక్ష్మీ దేవి అడిగింది ఎందుకు అంత త్వరగా చెప్ప కుండా వెళ్లి, అప్పుడే వచ్చారేమిటి అని. అప్పుడు రమా రమణుడు "ఒక భక్తుడిని ఒక చాకలి తాగిన కోపం తో కావడి బద్ద తో బాదు తుంటే అతడు నన్నే స్మరించాడుదెబ్బలను ఒర్చుకొంటు. అతన్ని రక్షించాలని ఆలస్యం చేయ కుండా వెళ్లాను ఈ లోగా ఆ భక్తుడు చాకలి చేతి లో కావడి బద్ద లాక్కొని చాకలిని వీర బాదుడు బాదు తున్నాడు. ఇక నా పని అక్కడ లేదు అని గ్రహించి వెంటనే తిరిగి వచ్చేశా అని చెప్పాడు దీన పరాధీనుడు

ఒక సారి వ్యాసుల వారు జనమేజయ మహా రాజు వద్దకు వచ్చి అతనికి ఒక పని చెబుతానని దాన్ని ఆచరించ గలడో లేడో అని అడిగాడు. తప్పకుండా చేస్తానన్నాడు రాజు. అప్పుడు ద్వైపాయనుడు "నాయనా !కొద్ది రోజుల్లో ఒక గుర్రాల మంద అమ్మకానికి వస్తుంది. అందులో నల్లని పెద్ద గుర్రం ఉంటుంది. దాన్ని మాత్రం కోన వద్దు. కొన్నా దాన్ని ఎక్క వద్దు. ఎక్కినా ఉత్తర దిక్కుకు వెళ్ళద్దు. వెళ్ళినా నీకు కనిపించిన అమ్మాయితో మాట్లాడకు., మాట్లాడినా ఆమె ను పెళ్లి చేసుకోకు, ఆడినా ఆమె చెప్పి నట్లు వినకు "అని చెప్పాడు. ఇదెంత పని అనుకొన్నాడు రాజు

కొన్నేళ్ళుగడిచాయి. గుర్రాల మంద వచ్చింది. కొనద్దను కొంటూనే నల్ల గుర్రాన్ని కొన్నాడు వద్దను కుంటూనే ఎక్కిస్వారి చేస్తూ వద్దను కొంటూనే ఉత్తర దిక్కు కు వెళ్లాడు అక్కడ ఏడుస్తున్న అందమైన అమ్మాయిని చూశాడు. మహర్షి చెప్పింది జ్ఞాపకం ఉంది. అయినా ఏమవుతుంది లే అనే ధీమా వచ్చింది ఆమెతో మాట్లాడటం గాంధర్వ వివాహం చేయటం రాజధానికి తీసుకు రావటం జరిగి పోయాయి. ఆమె కోరిక మీద సాధువులకు సంతర్పణ ఏర్పాటు చేశాడు. ఆమె వారికి నెయ్యి వడ్డిస్తూ, జారుతున్న పైటను సద్దు కొంటోది. రాజు పర్య వేక్షణ చేస్తున్నాడు. ఆమె పైట వంక సాధువు లు చూస్తుండటం సహించ లేక పోయాడు ఓర లోని కత్తి లాగి దెబ్బకు పది మందిని గా ఆ సాధువు లందర్నీ చంపేశాడు పురోహితులు అడ్డ గిన్చినా ఆగ లేదు. అంతా అయిపోయిన తర్వాతా "అయ్యో సాదు హత్య చేశానే "అని కూల బడి పోయాడు. ఎదురు గా వ్యాస మహర్షి ప్రత్యక్షమయ్యాడు. సిగ్గు తో తల వంచు కున్నాడు రాజు. వ్యాసుడిచ్చిన ఆరు అవకాశాలను తాను దాటి నందుకు, మహా అపరాధం చేసి నందుకు కుమిలి పోయాడు రాజు. ఈ విషయాన్నే భగవద్గీత లో కృష్ణ పరమాత్మ "ప్రకృతిస్త్వాం నియోక్షసి "అని చెప్పాడు అర్జునుని తో. "నువ్వు అహంకారం తో యుద్ధం చేయను అను కుంటావేమో. మానటం నీ అధీనం లో లేదు. ప్రకృతి బలాత్కారం గా నీ చేత చేయిస్తుంది "అని వివరించాడు. ఈ సత్యాన్ని చాటి చెప్పే కధ మనం ఇప్పుడు చెప్పుకొన్న సత్య కధా సుధా. an unknown power always leads అంటారు అందుకే. ఇంతకీ ఈ కధ ఎందుకు చెప్పాల్సి వచ్చింది అంటే-- వ్యాసుడిని జన మే జయుడు "మహర్షీ !యమ ధర్మ రాజు అంశతో జన్మించి, సకల సద్గుణాలు కలిగి జితేంద్రియుడు అని పిలి పించుకొన్న యుధిష్ఠిరుడు జ్యూదం లో పాల్గొనటం, అన్నీ పణం గా పెట్టటం, ఓడి పోవటం వింటుంటే ఆయన్ను "అవి వేకి "అనక తప్పటం లేదు. పెద్ద తాత గారు ధర్మ రాజు పెద్ద తప్పే చేశారు "అన్నాడు దానికి పై అర్ధం ఉన్న గీతా శ్లోకం చెప్పి ఎంతటి వారి నైనా విధి ఆడిస్తుందని మనం అందరం దాని చేతి లో కీలు బొమ్మలం అని తెలియ జెప్పే కధే ఇది.

దైవీ శక్తి ని గురించి ఒక ఆస్తికుడు, నాస్తికుడు తీవ్రం గా వాదించు కొన్నారు. "నేను అన్నం తినను "అన్నాడు నాస్తికుడు "నీతో దేవుడు తి ని పిస్తాడుగా "అన్నాడు ఆస్తికుడు. దేవున్నితప్పించు కోవటానికి ఒక అడవి చేరి మర్రి చెట్టుమాటున దాక్కున్నాడు. అప్పుడు ఒక బాట సారి వచ్చి అన్నం మూటను చెట్టు కు వేలాద దీసి తువ్వాల వేసుకొని హాయిగా నిద్ర పోయాడు. ఇంతలో పెద్ద పులి గాండ్రింపు విని మూటను వదిలి పారి పోయాడు. కొంత సేపటికి ఒక దొంగల ముథ దొంగిలించిన ధనం తో అక్కడికి వచ్చి పడుకో బోతూ చెట్టు కు ఉన్న మూటను చూసి ఎవరో తమకు విషాన్నం పెట్టి ధనాన్ని కాజేయాలను కొన్నారని భావించి వెదికారు. పాపం చెట్టు మాటున నాస్తికుడిని చూసి లాక్కొచ్చారు. ఆ మూట అతనిదే నను కొన్నారు. వాడు లబో దిబో తనకేమీ తెలీదు అంటున్నాడు. మూట లో అన్నం తినమన్నారు. అన్నం

తినను అని శపథం చేశాడుగా. తిననని మొరాయించాడు. కొట్టి, భయ పెట్టి తి ని పించారు. వాడు చావ లేదే అని ఆశ్చర్య పోయి, వాడే చస్తాడు లేఅనుకొని వెళ్లి పోయారు దొంగలు.కనుక తినటం తినక పోవటం నీ ఇష్టం లో లేదు అని ఆ తర్వాతా ఆస్తికుడు చెప్పాదన్నది మనం గ్రహించే విషయం.

విధి ఆడే వింత నాటకాన్ని గురించి ఇంకో కధ –ఒక రాజు తన కుమార్తెకు సంగీత సాహిత్యాలు నేర్పించమని ఒక గురువు ను ఏర్పాటు చేశాడు. బానే నేర్పాడు ఆమె కు యుక్త వయసు వచ్చింది గురుదక్షిణ గా పెద్ద సంపదను ఇచ్చి రాకుమారి నమస్కరించింది., దాన్ని గ్రహించ కుండా రాజకుమార్తె తనను పెళ్లి చేసుకోవటమే గురుదక్షిణ అన్నాడు. రాకుమారి అతనితో గురువు తండ్రి లాంటి వాడని అలా కోరటం తప్పని చెప్పింది గురువు కు కోపం వచ్చి అంతు చూస్తానని వెళ్లి పోయాడు.

ఒక రోజు రాజు గురువు ను పిలిచి కూతురు జాతకాన్ని పరిశీలించి తగిన వరున్ని చూడ టానికి సహాయం కోరాడు. దుష్టుడు అయిన గురువు ఆమె వల్ల రాజు రాజ్యాన్ని కోల్పోతాడని చెప్పాడు. ఉపాయం ఏమిటి అని అడిగితె చంపెయట మే అన్నాడు ఆ పని చేయ లేనన్నాడు రాజు. అయితే ఆమెను ఒక పెట్టె లో పెట్టి నీళ్ళ లో వదిలేయమని అప్పుడు పీడా విరగడ అవుతుందని చెప్పాడు. అలానే చేశాడు రాజు. ఆ పెట్టె నీటి లో కొట్టు కు పోతోంది. అప్పుడే వేటకు వచ్చిన రాజ కుమారుడు ఒకడు ఆ పెట్టెను నీటి లోంచి బయటకు తెప్పించి చూశాడు అందులో రాకుమార్తె ఉంది. ఆమెను విషయం అంతా వివరించ మని కోరితే చెప్పింది. రా కుమారుడు రాజ గురువు దుష్ట పన్నాగం తెలుసు కొని తన దగ్గర పట్టు బడిన ఒక ఎలుగు బంటి ని పెట్టెలో పెట్టించి మళ్ళీ నీళ్ళ లోకి వదిలేశాడు.

గురువు శిష్యులతో ఒక దేవాలయం లో ఉండి పెట్టె కోసం ఎదురు చూస్తున్నాడు. పెళ్ళికి ఏర్పాట్లన్నీ చేసు కొన్నాడు. పెట్టె కని పించాగానే శిష్యులతో తెప్పించాడు. గుడి లో పెట్టించాడు. ఎవరు వచ్చి గోల చేసినా తలుపు లు తీయ వద్దని ఒక వేళ తానే కేక లేసినా కూడా గుడి తలుపులు తీయ వద్దని గట్టి గా హెచ్చ రించి లోపలి చేరాడు. నెమ్మదిగా పెట్టె తలుపు తీశాడు. మెత్తగా తగిలితే సుకుమార రాకుమార్తె అను కొన్నాడు. పూర్తిగా తీయ గానే భల్లూకం కోరలతో వాడి మేడ పట్టుకొని చీల్చి తినేయటం మొదలెట్టింది. గట్టిగా అరుస్తున్నాడు, ఏడుస్తున్నాడు గురువు. గురువు అజ్ఞా ప్రకారం శిష్యులు తేలిగ్గా తీసుకొని తలు పులు తీయ లేదు. గురువు ను హాయిగా భక్షించి జారు కుంది. దురాశ ఎంత ప్రమాదాన్ని తెస్తుందో తెలిపే కధ ఇది.

"అన్యదా చిన్తితం కార్యం దైవ మన్యాత్ర చింత ఎత్—రాజ కన్యా పహారే ణ విప్రో భల్లూక భక్షితః "అన్న శ్లోకానికి ఈ కధ వివరణ.

భక్తుడు" రక్షించు మహా ప్రభో" అని ఆర్తిగా ప్రార్ధిస్తూ ఉంటె వీడు ఏమైనా పుణ్య కర్మ చేశాడా అని భగవంతుడు ఆలోచిస్తాడట. దీనికి సంబంధించిన కధ తెలుసు కొందాం.

ఒక సారి పాండవులందరూ ద్రౌపది తో సహా సముద్ర స్నానానికి వెళ్లారట. దాదాపు అంతా గంటకు పైగా స్నానాలు చేసి పైకి వచ్చి కూర్చున్నారు. కాని తమతో పాటు సముద్ర స్నానానికి వచ్చిన ఒక సాధువు ఎంత సేపైనా నీటి నుంచి బయటికి రాకుండా, నీళ్ళలో వణుకుతూ కని పించాడు. ద్రౌపది ఆయన విషయం కనుక్కో మని ధర్మ రాజుకు చెప్పింది. ఆయన సేవకుల ద్వారా విచారించాడు. సాధువు కౌపీనం సముద్ర కెరటా లకు కొట్టు కు పోయిందట. నగ్నం గా బయటకు రావటానికి ఇబ్బంది పడుతూ ఆ చలిలో అలానే వణుకు తున్నాడని చెప్పారు. వెంటనే ద్రౌపదీ దేవి క్షణం ఆలో చించ కుండా తన చీర చెరగు చింపి, ఆ సాధువు కు ఇమ్మని పంపించిందట. పాపం ఆయన అది కట్టు కొని తీరం పైకి వచ్చాడట. అందుకనే నిండు సభలో ద్రౌపది కి వస్త్రాపహరణాన్ని దుశ్శాసనుడు చేసె నప్పుడు శ్రీ కృష్ణ పరమాత్మ ఈ పుణ్యాన్ని దృష్టి లో ఉంచు కొని రంగు రంగుల విలువైన చీరలు అసంఖ్యాకం గా అందించి ఆమె గౌరవాన్ని, శీలాన్ని కాపాడాడట. అవే" అక్షయ వలువలు" గా ప్రసిద్ధి చెందాయి పాపం దుర్యోధనుడికి ద్రౌపదీ మానాన్ని మంట గలుపు దామని చేసిన ప్రయత్నం బెడిసి కొట్టింది '

చేసుకొన్న వారికి చేసుకోన్నంత. ప్రపంచం లో అంతకు ముందు ఎవ్వరు చూడని రంగు రంగుల ఖరీదైన చీరల వర్షం ద్రౌపది మీద కృష్ణుడు కురి పించే సరికి దుర్యోధనుడికి కడుపు ఉబ్బరం చేసింది. తట్టు కొ లేక పోయాడు. దేశమంతా వెతికించి అతి విలువైన చీరలను తమ సోదరుల భార్య లందరికి అంటే నూరు చీరెలు తెప్పించి ఇచ్చి, వారిని కట్టు కొ మన్నా ట. వారందరూ ఎంతోసంతోషం గా వాటిని ధరించి, వాటి సౌందర్యాన్ని నగర వాసుల కు కూడా చూపించాలనే ఉత్సాహం తో అంత పురం పైకి చేరి ప్రజలకు కని పించే టట్లు పచార్లు చేస్తున్నారట. ఇంతలో శ్రీ కృష్ణ పరమాత్మ మురళి ని అద్భుతం గా వాయిమ్చాడ ట...ఆ వేణు గానానికి ముచ్చట పడి ఆ చీరలన్నీ చిలకలుగా మా రి పోయి, మధుర వైపు యెగిరి పోయాయట. పాపం కక్కా లేక మింగా గా లేక, శీలం కాపాడు కొనే వీలు లేక, ప్రజల దృష్టి నుంచి తప్పించు కోలేక, నానా ఇబ్బందీ పడ్డారట ఆ నూరుగురు రాణులు, ఒక్క ద్రౌపదీమాన సంరక్షణ చేసిన వాడే ఒకే సారి నూరుగురికి వస్త్రాపహరణం చేసి బుద్ధి తెప్పించాడ న్న మాట. కన్నయ్య లీలలు అందుకే అద్భుతాలు. గుణ ప్రధానాలు.

భగవంతుని కంటే ఆయన నామం గొప్పది అని తెలియ జేసే కథలు చాలా విన్నాం. శ్రీ రాముని గురించిన కథ ఒకటి చెప్పుతున్నాను. సముద్ర లంఘనం చేసి నప్పుడు హనుమ రామ నామాని జపిస్తూ సునాయాసం గా లంకకు చేరాడని మనకు తెలుసు. శ్రీ రాముని సైన్యం రావణ సంహారం కోసం సముద్ర తీరం చేరింది. సముద్రం పై వారధి నిర్మించే ఏర్పాటు నీలుడు అనే ఇంజనీర్ చూస్తున్నాడు. రావణ వధ తర్వాత ఒక రోజు రాముడు ఒంటరి గా సముద్రం ఒడ్డున కూర్చున్నాడు. ఆ నాడు వానరులు కట్టిన సేతువు దృశ్య మానం గా కని పించింది. అంటే మనసు ఫ్లాష్ బాక్ లో కి వెళ్ళింది. ఎలా కట్టామా అని ఆశ్చర్య పోతున్నాడు. సముద్రం లో వేసిన శిలలన్నీ తేలి పోవటం ఇప్పటికీ ఆశ్చర్యం గా నే ఉంది ఆయనకు.. . తాను స్వయం గా ఒక పెద్ద రాయి తెచ్చి సముద్రం లో విసిరేశాడు. అది డబుక్కున మునిగి పోయింది. సంభ్రమం లో మునిగి పోయాడు. ఇదేమిటి ఇలా జరిగిందేమిటి అని విచారిస్తున్నాడు. కొంప తీసి ఎవరు చూడలేదు కదా అని అటు, ఇటు చూశాడు. హనుమ కన్పించాడు ".చూశావా "అని అడిగాడు. "చూశానన్నా"డు మారుతి. ఎవరికీ చెప్పవు కదా అని అడిగాడు ".ముల్లోకాలకు చాటించి మరీ చెబుతాను" అన్నాడు పావని ".యేమని చెబుతావు" మళ్ళీ రామ ప్రశ్న. పరువు పోతుందేమో నని భయం. అప్పుడు హను మంతుడు 'శ్రీ రాముని చేతి పట్టు విడిచిన వారు మునిగి పోవటం ఖాయం అని ఎలుగెత్తి చాటు తాను" అన్నాడు నవ్వుతు. రాముడు ముసి ముసి నవ్వులు నవ్వుతు" అమ్మయ్య" అను కొన్నాడు. కనుక భగ వంతుని కంటే భగవన్నా మం గొప్పది. వారధి కట్టేటప్పుడు రాళ్ళ మీద రామ నామం రాసిన విషయం మనం విన్నదే కదా.

ఒక సారి నారదుడు విష్ణు మూర్తి ని" అందరి కంటే గొప్ప వాడేవారు "?అని ప్రశ్నించాడు. దానికి పరమాత్మ "నారదా !అన్నిటి కంటే గొప్పది భూమి. దాని కంటే సముద్రం గొప్పది. అంతటి సముద్రాన్ని ఒక్క గుక్క లో తాగేసిన అగస్త్య మహర్షి గొప్ప వాడు. ఆ అగస్త్యుడిని నక్షత్ర రూపం లో భరిస్తున్న ఆకాశం గొప్పది. అలాంటి ఆకాశాన్ని ఒకే ఒక్క పాదం లో నేను అక్రమించాను. విశ్వ వ్యాప్తి ని అయిన నన్ను హృదయం లో దాచుకొన్న భక్త శిఖా మణి అందరి కంటే గొప్పవాడు "అని సందేహాన్ని నివృత్తి చేసి భక్తుడే భగ వంతుని కంటే గొప్ప అని రుజువు తో సహా పరమాత్మే తెలియ జేశాడు.

ఇప్పుడు ఒక భక్తుడు చెప్పిన శ్లోకం, దాని లోని సత్యం తెలుసు కొందాం

"దాసోహమితి యా బుద్ధిహ్ పూర్వ మాసీత్ జనార్దనే ---దకారో అపహృహృస్తేన గోపీ వస్త్రాప హారినా"

దీని అర్ధం –పూర్వం నేను భక్తీ తో " దాసోహం "అంటూ ఉండే వాడిని. అలా అనుకొంటుంటే గోపికా వస్త్రాపహరుడైన ఆయన దాసోహం అనే నా భావనలో "ధా" అనే అక్షరాన్ని అపహరించాడు. "సోహం "అనే భావం తో నన్ను ముంచేశాడు. అంటే నాకు పరమాత్మ కు భేదం లేదని తెలియ జేశాడు. దీన్నే వ్యాజ స్తుతి అంటారు. పైకి నింద ఉన్నా లోపల అందమైన ఆనందార్ధం ఉంటుంది.

భక్తీ అంటే ఏమిటో "శివా నంద లహరి "లో శంకర భగవత్పాదులు గొప్పగా వివ రించారు –ఆ వైభవం చూద్దాం –" "అన్కోలం నిజ బిందు సంతతి, మయస్కాన్తోపలం సూచికః –సాధ్వీ నిజ విభుం లతాక్షి తిరుహం సిన్దుస్సరిద్వల్లభం –ప్రాప్నోతీ హయదా తధా పశు పతే పాదార విందం ద్వయం –చేతో వృత్తి రుపెత్య తిష్టతి సదా సా భక్తీ రిత్యుచ్యతే"ఊరుగ చెట్టు విత్తనాలు పండి నేల రాలి తమకు తామే చెట్టు వైపుకు ఆకర్షింప బడి మానుకు అంటూ కుంటాయి.. ఇనుప సూది అయస్కాంతానికి తానె ఆకర్షింప బడు తుంది పవిత్రత అనేది మనస్సు భక్తీ భావం అనే మనో వాక్కాయ కర్మ లచే అనుసరిస్తుంది.తీగ చెట్టుకు చుట్టు కోవటం, నది సముద్రాన్ని చేరటం సహజం. అలానే మనసు శివుని పాద పద్మము లను పట్టు కొని ఉండటం భక్తీ అంటారు.

భాగవతం లో భక్తీ అంటే ఏమిటో ప్రహ్లాదుని గురించి చెబుతూ పోతన గారు రాసిన అద్భుత పద్యం జగద్విదితం

"పానీయమ్ములు త్రావుచున్, కుడుచుచున్,, భావించుచున్, హాస లీ

లా నిద్రాదులు చేయుచున్, తిరుగు చుం, లక్షించు చుం, సంతత

శ్రీ నారాయణ పాద పద్మయుగళ,, చిన్తా మృతా స్వాద సం

దానున్డై, మరచేన్ సురారి సుతుడే తద్విశ్వమున్ భూవరా"

ఒక గృహస్తు ఇంటికి భోజన సమయానికి ఒక అతిధి వచ్చాడు. తనతో పాటు ఆయనకు వడ్డించమని భార్యకు చెప్పాడు. అలానే చేసింది. తినటానికి ముందు అతిధిని "బ్రహ్మార్పణం బ్రహ్మ హవి బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హృతం "అని గీతా శ్లోకాన్ని తనతో పాటు అనమన్నాడు. నేను అననన్నాడు అతిధి. అనమని మళ్ళీ గద్దించాడు. అన్నని మొండి కేశాడాయన. కోపం వచ్చి తిట్టి కొట్టి తరిమేశాడు., భయ పడి అతిధి పారి పోయాడు. ఆ కోపం తోనే భోజనం ముగించాడు గృహస్తు. భార్య కూడా భోజనం చేసి భర్త అలా చేయటం బాగా లేదని నెమ్మదిగా చెప్పింది. అతన్ని కొట్టటం తప్పు అని చెప్పింది. భార్య మాటలు విన్న తర్వాతతాను తప్పు చేశానేమో నని బాధ పడ్డాడు. రాత్రి కి ఏమీ తిన కుండానే నిద్ర పోయాడు. ఆ రాత్రి దేవుడు కలలో కన్పించి "అంత ఆవేశం పడ్డావెం నాయనా !"అని లాలన గా పలకరించాడు. "ఆ మూర్ఖుణ్ణి అరవై ఏళ్ళు గా నేను భరిస్తున్నాను, ఒక్క అర్ధ గంట నువ్వు భరించ లేక పోయావా ?"అని గృహస్తు ను మంద లించాడు. అన్దుకె భగవానుడు గీత లో

"క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతి విభ్రమః –స్మృతి భ్రంశాత్ బుద్ధి నాశః –బుద్ధి నాశాత్ ప్రణశ్యతి "అని చెప్పాడు. అందరం గమనించ వలసిన విషయమే ఇది.

మరణ సమయం లో భగవన్నామ స్మరణ చేయ మని చెబుతారు. కాని బుద్ధి గడ్డి మేస్తే ఆ పని చేయలేడు జీవుడు. దీనికి శ్రీ విద్యా ప్రకాశానంద స్వామీ జీ ఒక కధ చెప్పారు. కన్నడ దేశం లో ఒక గృహస్తు సంసారాన్ని జాగ్రత్త గా పోషిస్తూ, సంపదలతో ఆనందం సుఖం అను భావిస్తున్నాడట. మరణం సమీ పించింది. పిల్లలు భార్య చుట్టూ చేరి "రామా. కృష్ణా "అనమని గోల చేస్తున్నారు. బ్రతికి ఉన్నప్పుడు ఎలాగూ దేవుణ్ణి గురించి ఆలోచించ లేక పోయాడు. ఇప్పుడన్నా స్మరిస్తే ఉత్తమ గతులు కలుగు తాయని వారందరి విశ్వాసం కాని ఆ వృద్ధుడు "క.క.క.కా"అంటున్నాడు. ఎవరికి అర్ధం కావటం ఏమంటున్నాడో. వైద్యున్ని పిలి పించి ఇంజెక్షన్ ఇప్పించారు. కొంత శక్తి వచ్చింది ఆయనకు. ఇప్పుడు మళ్ళీ అడిగారు "నాన్నా ! గంట నుంచి కకకకా "అంటున్నారు. అర్ధం ఏమిటి అని. దాని అకి వృద్ధుడు "క రు కస బరికి యన్న కాడి యుత్తదే "అని కన్ను మూశాడు. దాని అర్ధం "చీపురు కట్టను దూడ మేస్తోంది. జాగ్రత్త చేయండి. మన వాళ్ళు ఒక కద చెప్పే వారు. చావు సమయం లో ఒకడిని నారాయణ అనమంటే అనలేదు. కనీసం నార ను చూపిస్తే నన్నా అంటాడేమో నని ఎదురుగా పెట్టి కనీసం "నారా, నారా "అంటాడని ఎదురు చూశారట. వాడు దాన్ని "పీచు, పీచు "అంటూ చచ్చాడట. అంటే నారా అనే ఇంగితం కూడా వాడికి లేకపోయిందని అర్ధం.

భాగ వంతుడు ఎక్కడ ఉంటాడని అందరికి సందేహం. దానికి ఆయనే సమాధానం చెప్పాడు "సుజను లందు తరచు చొచ్చి యుందు "అని భాగవతం లో చెప్పాడు. మరి సజ్జనులు అంటే, సత్ ప్రవర్తన అంటే ?

**"తను హృద్భాషల సత్యమున్ శ్రవణమున్, దాసత్యమున్, వందనా**
**ర్చనముల్, సేవయు, ఆత్మలో నేరుకయున్, సంకీర్తనల్, చింతనం**
**బను ఈ తొమ్మిది భక్తీ మార్గ మ ల సర్వాత్మున్ –హరిన్నమ్మి, స**
**జ్జనుడై యుండుట భద్ర మంచు దలతున్సత్యంబు దైత్యోత్తమా "**

నవ విధభక్తి మార్గాలతో పాటు సజ్జనత్వం తప్పదు. ప్రవర్త నాలో ఆధ్యాత్మిక లక్షణాలు అలవాటు చేసు కొన్న వారి ఐని దగ్గరకు పరమాత్మ చేర్చు కొంటాడు.

హృదయాన్ని వికసింప జేసుకొన్న పుష్ప పూజ నే పరా భక్తీ పూజ అన్నారు

"అహింసా ప్రధమం పుష్పం, పుష్ప మింద్రియ నిగ్రహహ –సర్వ భూత దయా పుష్పం, క్షమా పుష్పం విశేతః

శాంతి పుష్పం, తపః పుష్పం, ధ్యాన పుష్పం తదైవచ –సత్యం అష్ట విధ పుష్పం విష్ణోహ ప్రీతి కరం భవేత్

ఈ లక్షణాలు లేక పోతే ఎంత భక్తీ ఉన్నా నిష్ప్రయోజనమే. ముప్ఫై అయిదు సజ్జన లక్షణాలను పరమాత్మ వివరించిన సంగతి మనకు తెలిసిందే.

జ్ఞాని, కర్మ యోగి ఇద్దరు కూడా ఎంత సిద్ధా లైనా సత్కారాల్ని, భక్తిని విడి చి పెట్ట రాదు అని తెలిపే ఒక కధ తెలుసు కొందాం –

ఒక సద్గురువు గారి ఆశ్రమం శ్రావణ, మనన, నిది ధ్యానాలతో కర్మ,, భక్తీ జ్ఞాన మార్గాలమార్గాలను శిష్యులకు నిత్యం బోధిస్తూ అనుష్టింప జేస్తూ ఉన్నారు. అది కార్తీక మాసం. పగలు నదీ స్నాన్నం జపతపాలు అభిషేకాలు పగలంతా ఉపవాసం రాత్రికే భోజనం గా గురుశిష్యులందరూ పాటిస్తున్నారు. అంతకు ముందు రాత్రి ఒక స్వామీజీ కొత్తగా ఆశ్రమం లోకి వచ్చి గురువు అనుమతి టో నిద్రించాడు. మర్నాడు తెల్ల వారు ఝామున శిష్యులు స్నానానికి వెళ్తుంటే కొత్త అతిధి స్వామిని కూడా లేపి తెసుకు వెళ్ళండి అని గురువు చెప్పారు. ఎన్ని సార్లు లేపినా చలిగా ఉందని లేస్తాను, లేస్తాను అంటూ తాత్సారం చేస్తున్నాదాయన. ఇక తప్పదురా బాబూ ఈ చలిలో స్నానం అను కొని శిష్యులతో "నాయన లారా ౧ గంగా, యమునా, సరస్వతి నదులు నాలోనే ఉన్నాయి. నేను వాటిలో ఉన్నాను. "అని చెప్పి ముసుగు తనని పడుకొన్నాడు. విషయం

గురువు గారికి చేరింది. అందరు "నక్తం "కనుక వారెవరు భోజనం చేయలేదు. కాని గుర్వాజ్న పై అతిధి కి మంచి భోజనం ఏర్పాటు చేశారు. సుష్టుగా భోజనం చేసి త్రేనుస్తూ ఒక గదిలో పగలు హాయిగా నిద్ర పోయాడు అతిధి. గదికి బయట గొళ్ళెం పెట్టించారు గురూజీ. లోపల ఆయనకు కొంత సేపటికి మెలకువ వచ్చి "దాహం దాహం "అని అరుస్తున్నాడు. ఎవరు తలుపు తీయ వద్దని ఆజ్ఞ.మంచిన నీళ్ళు కావాలని తలుపులు బద్దలు కొట్టే ప్రయత్నం చేస్తున్నాడు. ఇంతలో గురుజీ వచ్చి "గంగా కావేరి గోదావరి మొదలైన నదులు అన్నీ నీ దగ్గరే ఉంటె, నీకు నీళ్ళు కరువయ్యాయా నాయనా !"అన్నాడు. అందరికి అర్ధం అయింది. తలుపు తీయించి మంచి నీళ్ళు ఇప్పించాడు గురువు గారు. సిగ్గుతో తల వంచు బుద్ది తెచ్చు కొని వెళ్లి పోయాడు ఆగంత అతిధి. అప్పుడు గురువు గారు శిష్యులతో "నాయన లారా !కర్మా, భక్తీ మార్గాలలో జ్ఞాన శిఖ రాన్ని ఎక్కినా, లోకాన్ని అనుసరించాలి. జ్ఞానినే అందరు అనుసరిస్తారు. జ్ఞాని అజ్ఞానిగా ప్రవర్తిస్తే అందరికి నష్టం "జ్ఞాని కి కర్మా భక్తీ అవసరం లేక పోయినా లోక రీతి ని అనుసరించాలి. మార్గ దర్శకం చేయాలి. " అని హిత బోధ చేశాడు

ఆశ కు అంతు లేదు అని చెప్పటానికి ఒక చిన్న కధ. ఒకడు రాజు ను ఆశ్రయించి, అనుగ్రహం పొంది భూమిని అంతటిని దానం గా పొందాడు. రాజ లాంచనాలతో ఏనుగు మీద ఎక్కి ఊరేగుతూ ఇంటికి వచ్చాడు. అందరు ఎంతో సంతోషించారు. అమాంతం గా గది లోకి వెళ్లి ఎక్కి ఎక్కి ఏడవటం మొదలు పెట్టాడు. ఎందుకు ఏ డుస్తున్నాడో ఎవరికి తెలీటం లేదు. కాసేపు ఏడవ నిచ్చి భార్య వెళ్లి పలకరించి" సమస్త భూమి రాజు గారు మీకు దారా దత్తం చేశారు కదా ఇంకా ఏడవటానికి కారణం ఏమిటి" అని అడిగింది. వాడు ;";అయ్యో ఆకాశాన్ని దానం చేయమని అడగ లేక పోయాను కదా "అని బావురు మన్నాడట

సంతృప్తి ఉన్న వాడు మూడు లోకాల్లోను పూజ్యుడు. దరిద్రుడు ఎవడు అని ప్రశ్నిస్తే ఆశకు అంటూ లేని వాడు అని సమాధానం. ధన వంతుడేవడు అన్న ప్రశ్న కు –పరి పూర్ణ తృప్తి కలవాడు అని సమాధానం చెప్పారు పెద్దలు. మేరు పర్వతాన్ని సృష్టించిన బ్రహ్మ దేవుడిని ఒక జ్ఞాని ఇలా ప్రశ్నించాడట –ఈ మేరువు ను ఎవరి కోసం సృష్టించావు /--ఆశ లేని వాళ్ళకు అది అక్కర లేదు. దురాశా పరులకు అది సంతృప్తి ని ఇవ్వదు. బంగారు పర్వతాన్ని సృష్టించానని మురిసి పోతున్నా వేమో –ఎవరికీ ఉపయోగం లేని నిర్వాకం చేశావ్ –అని దేప్పాడటజ్ఞాని.

భార్యా, పిల్లలు అనే వాళ్ళు ప్రతి జన్మకు మారి పోతారు. పరమాత్మ నుండి విడి పోయిన ఈ జీవుడు ఎన్ని జన్మ లేత్తదో, ఎన్ని సముద్రాలు దాటాడో తెలీదంటాడు జ్ఞాని. దీన్ని గురించిన చిన్న కధ భారతం నుండి –కురుక్షేత్ర సంగ్రామం లో పద్మ వ్యూహాన్ని చేదించి, బయటకు రాలేక అవక్ర పరాక్రమం తో పోరాడి వీర మరణం పొందాడు అభిమన్య కుమారుడు. తండ్రి పుత్రా శోకం తో బాధ పడుతున్నాడు. స్వయం గా శ్రీ కృష్ణ పరమాత్మ వచ్చి ఓదార్చినా దుఖాన్ని తగ్గించు కొ లేక పోయాడు. అప్పుడు కృష్ణుడు అర్జునుడిని స్వర్గ లోకానికి తీసుకొని వెళ్ళాడట. అక్కడ హాయిగా ఆడు కొంటున్న అభి మన్యున్ని చూశాడు కిరీటి. అర్జునుడు ఆనందం పట్టా లేక దగ్గరికి వెళ్లి, ఆప్యాయం గా కావలించుకొన్నాడు. అభికి అంతా కొత్తగా వుంది. వింతగా చూస్తున్నాడు "నేను నీ తండ్రి అర్జునుడిని "అన్నాడు చివరికి ధనుంజయుడు. "ఎన్నో తండ్రివి ?"అని ప్రశ్నించాడు కుమారుడు అతి నిర్లిప్తం గా. కనుక సంసార బంధాలు జన్మ జన్మ కూ మారుతాయని తెలియ జెప్పటమే ఇందు లోని ఆంతర్యం.

పుట్టిన బిడ్డ ఏడుపు కు, తల్లి పాడే జోల పాటకు ఒక పండితుడు అర్ధం చెప్పాడు –చంటి వాడు "క్వా, క్వా, క్వా"అని ఎడుస్తాడని మనకు తెలిసిన విషయమే. సంస్కృతం లో "క్వా"అంటే ఎక్కడ?అని అర్ధం. అంటే ఈ లోకం లో ఆనందం ఎక్కడా?అని ప్రశ్నిస్తున్నాడ ట వాడు. తల్లి వాణ్ణి సముదాయిస్తూ "హుళక్కి, హుళక్కి హాయి "అని పాడుతుంది కదా. ఆమె అర్ధం ఏమిటంటే "నాయనా ! ఈ లోకం లో హాయి అంటే ఆనందం హుళక్కి అంటే ఏమి లేదు –నిండు సున్నా "అని ప్రపంచ సత్యాన్ని తెలియ జేస్తుందని వేదాంత పరమైన అర్ధాన్ని చెప్పిందన్న మాట.

లండన్ నగరం లో ఒక చోట ఉపన్యాసాన్ని ఇవ్వటానికి సిద్ధ పడ్డాడు చికాగో హీరో వివేకానంద స్వామి. వేదిక మెట్లు ఎక్కుతుండగా, కొంత మంది జనం ఆయన అవతారాన్ని చూసి "mad, mad, mad "అని అరుస్తున్నారట. ఆయనేమీ లెక్క చేయకుండా తన ఉపన్యాసాన్ని ఇలా ప్రారంభించి నోళ్ళు మూయించాడు "some mad after money, some mad after women, Iam mad after god "దానితో వాళ్ళ జ్ఞాన నేత్రాలను తెరిపించాడు దైవీ శక్తిని బోధిస్తూ.

వాయువు ప్రేరణ వల్లనే మేఘాలు కమ్ము కుంటాయి. అదే వాయువు వల్ల మేఘాలు తొలగి పోతాయి. ఒకే వాయువు మేఘాలు దగ్గరకు చేరటా నికీ, విడి పోవటానికీ కారణం అవుతున్నాయి. అలానే మానవుడు మనసు లో రాగాన్ని పెంచు కొని రాగి అవుతున్నాడు. రాగాన్ని వదిలించుకొని విరాగి అయి ముక్తి పొందుతున్నాడు. దీన్ని వివరించే చక్కని శ్లోకం –

"వాయునా నీయతే మేఘః పునః తేనైవ మోక్షతే –మనసా కల్ప్యతే బంధః మోక్షః తేనైవ కల్ప్యతే "

బౌద్ధ గురువు, రస సిద్ధుడు ఆచార్య నాగార్జునుడు యోగ శక్తి తో, ఔషధ శక్తి తో దాదాపు నాలుగు వందల సంవత్స రాలు జీవించి, చివరికి "అనవసరంగా శ్రమ పడ్డాను "అని గ్రహించి ఈ లోకం నుండి విముక్తుడ య్యాడట.

ఒక జ్ఞాని what can make me afraid? death is a joke to me"అన్నాడు ఆనందం గా.

ఒక రాజు గారి కి ఒకడే వడో వెయ్యి మైళ్ళ అవతల,మహా పర్వత శిఖరం మీద అమృత గంగ ఉందని తాగిన వారికి మరణం లేదని తెలియ జేశాడు. ఇంకేముంది –రాజు సైన్యంతో శ్రమ పడి అంత దూరం వెళ్లి. పర్వతా రోహణం చేసి శిఖరం చేరే సరికి దారిలో చాలా మంది నడవ లేక, ఎక్క లేక చని పోయి రాజుగారితో పాటు ఒక్క పది మందే మిగిలారట. చివరికి అమృత గంగను చేరాడు. ఒక చెంబు తో ముందుగా రాజు గారికి భటుడు ఆ జీవన గంగ ను అందించాడు. అక్కడే ఎత్తైన చోట కూర్చొని, భగవన్నామ స్మరణ చేసి తాగటానికి చెంబు పైకెత్తాడు. ఇంత లో "ఆగండి ఆగండి "అని పిచ్చి కేకలు విని పించాయట, ఆ వైపు చూశాడు రాజు. అరిచే వాళ్ళందరూ గోచి పాత రాయుళ్ళు, వికృతా కారాలతో పిచ్చి చూపులతో కళ్ళు పీక్కు పోయి పళ్ళు లేక నడవ లేక తూలీ పోతూ కన్పించారట. వాళ్ళందరూ రాజు దగ్గరకు చేరి "తాగ కండి బాబూ !ఆ అమృత గంగ తాగి చావటానికి వీలు లేక, బతక టానికి శక్తి లేక చావు బతుకుల మధ్య గిల గిల లాడుతున్నాం. చావు రాదు. బతికే శక్తి లేదు.మేం చేతు లారా తెచ్చు కొన్నాం. మీరు దాని బారిన పడి మా లాగా కావద్దు "'అని గోల చేశారట.రాజు గారికి జ్ఞానోదయం అయింది. చెంబు విసిరి ఆ నీళ్ళలో పడేశాడు. తనతో పాటు మిగిలి ఉన్న వారితో కిందికి దిగి రాజ్యం చేరు కొన్నాడట. అందుకే ఒక మహానుభావుడు "death is a most important event of life, man has sufficient time to know how to die "అన్నాడు.

"కాశ్యాంచ మరనాన్ముక్తిహ్ "అని అందరికి తెలిసిన విషయమే. కాశీ లో చని పోవటం కూడా మన చేతి లో లేదు అని శూద్రక మహా రాజు కధ తెలియ జేస్తోంది. కాశీ లో మరణించాలి అనే ధృఢ సంకల్పం టో శూద్రక మహా రాజు రాజ్యాన్ని కొడుకులకు అప్పగించి, కాశీ చేరి అక్కడ ఒక భవనం కట్టించు కొని అందులో ఉంటున్నాడు. ఒక వేళ బుద్ధి మారి ఇంకో చోటుకు పోవాల్సి వస్తుందేమో అని పించి రెండు మోకాలి చిప్పలు తీసేయించుకొని నడిచే పని లేకుండా చేసు కొన్నాడు. ఇక ఏ భయం లేదు. కాశీ లో మరణం ఖాయం అను కొన్నాడు.

శూద్రక మహారాజు అశ్వ శిక్షణ లో నల మహారాజు అంతటి వాడు. కాశీ రాజు అశ్వ శాలకు "అజానేయం "అనే ఒక కొత్త గుర్రం వచ్చింది. అది ఎవరికీ లోన్గటం లేదు. చాలా ఇబ్బంది పెడుతోంది. దాన్ని లొంగ దీసి స్వారీ చేసిన వారికి అర్ధ రాజ్యం ఇస్తానని ప్రకటించాడు. ఉండ బట్ట లేక పోయాడు ఆ ప్రకటన విని శూద్రక రాజు. తాను ఆ గుర్రాన్ని అదుపులో పెట్టగలను అని భటుడి తో కాశీ రాజుకు కబురు పంపాడు. మోకాళ్ళు లేవు లేవు ఎలా సాధ్యం అని వాళ్ళు అన్నారు. తనను ఆ గుర్రం మీద ఎత్తి కూర్చో పెట్టండి అన్నాడు. అలానే చేశారు కాశీ రాజ భటులు. అంత వరకు గుర్రాన్ని అదుపు లోకి తేవాలని ప్రయత్నించిన వారందర్నీ ఆ గుర్రం ఎక్క గానే కింద పడేశింది. వాళ్లు భంగ పడి వెళ్లి పోయే వారు. ఈ యన కూర్చున్నాడు కదా అని అందరు సంతోషించి, గుర్రాన్ని అదుపులోకి టే గలడు అని నమ్మారు కాశీ రాజు తో సహా. గుర్రం రివ్వున దూసుకు పోయింది ఆఘ మేఘాల మీద. శూద్రకుడు ఎప్పుడు తిరిగి వస్తాడా అని జనం ఎదురు చూస్తున్నారు.

ఆ పెంకి గుర్రం కాశీ ప్రభావం లేనంత దూరం సుమారు మూడు వందల మైళ్ళు ప్రయాణించి, ఒక మర్రి చెట్టును ఢీకోన్నది. అంతే దెబ్బకు శూద్రక రాజు అక్కడి కక్కడే చని పోయాడు. పాపం కాశీ లో చావాలను కొని, మోకాలి చిప్పలు కూడా తీసే యించుకొన్న వాడికి కాశీ లో చావు రాలేదు. దిక్కు లేని చావు వచ్చింది. దీనినే భాస్కర శతకం లో చక్కని పద్యం లో చెప్పాడు హుళక్కి భాస్కరుడు –

**"గిట్టుట కేడ కట్టడ లిఖించిన, అచ్చట గాని, యొండు చో**
**పుట్టదు చావు !జానువుల పున్కల నూడిచి, కాశి చావ, గా**
**ల్గట్టిన శూద్రకుస్, భ్రమల గప్పుచు, తద్విధి గుర్రమౌచు, ఆ**
**పట్టున గొంచు, మర్రి కడ, ప్రాణము దీసే కదయ్య భాస్కరా "'**

అందుకే కర్తవ్య నిర్వహణ లో ఏమరు పాటు తగదు –మృత్యువు ఎప్పుడు వచ్చి మీద పడుతుందో తెలీదు. ఎప్పుడు చేయాల్సిన పని వాయిదా వెయ్య కుండా అప్పుడే చేయాలని చెప్పే శ్లోకం –

"శ్వః కార్య మద్య కుర్వీత –పూర్వాహ్నే చాప రాహ్నికం –యమస్య కరుణా నాస్తి కృతం వప్యవదాకృతం "

దీని భావం –రేపు చేయాల్సిన పని ఇప్పుడే చెయ్యి. మధ్యాహ్నం పూర్తీ చేయాల్సింది ఉదయమే చెయ్యి. యముడు దయా రహితుడు. అయ్యో పాపం వీడు తన కర్తవ్యాన్ని పూర్తీ చేశాడా అని చూడడు. పని చేసే ట ప్పుడు ముందే పూర్తీ చేసుకోవాలి.

ఏ జన్మ లో మానవుడు న్నా, దాని పై మొహాన్ని వదులు కోలేడు –దీన్ని వివ రించే ఒక కధ –ఒక గురువు గారికి చావు సమయం దగ్గర పడింది. శిష్యుడు చుట్టూ విచారిస్తు న్నాడు, ఆయన్ను "మీరు సరాసరి మొక్షానికే పోతారా "?"అని అడిగారు. దానికి ఆయన మోక్షానికి ఇంకో జన్మ అడ్డంగా ఉందని, ముందు పంది జన్మ తర్వాత మోక్షం వస్తుందని చెప్పాడు గురువు. గురువు గారు పంది జన్మ ఎత్తటం శిష్యుడు జీర్ణించు కోలేక పోయి తన కర్తవ్యమ్ ఏమిటో చెప్ప మన్నాడు.. దానికాయన "ఊరికి ఉత్తరాన, ఒక ఎరుకల వాని ఇంట్లో ఒక పంది పిల్లగా జన్మించ బోతున్నానని ఆ పిల్లకు మొహం మీద తెల్ల మచ్చ ఉంటుందని, వెంటనే తన్ను చంపేస్తే సరాసరి తనకు మోక్షం వస్తుందని చెప్పాడు. శిష్యుడు అలానే చేస్తానని మాట ఇచ్చిన తరువాత గురువు హాయిగా ప్రాణం వదిలాడు

గురువు చెప్పినట్లే ఎరుకల వాడింటికి శిష్యుడు వెళ్లాడు. అక్కడ ఒక పంది ఈన టానికి నొప్పులు పడుతోంది. కాచుక్కూచున్నాడు శిష్యుడు దుడ్డు కర్రతో. పంది ఈని ఇరవై పిల్లల్ని కన్నది. అందులో ముఖం మీద తెల్ల మచ్చ పిల్ల కని పించింది. శిష్యుడు ఎరుకల వాడిని బతిమి లాడి ఆ పిల్లను తీసుకొని, చాటుగా దుడ్డు కర్రతో దాని కపాల మోక్షం చేసి గురువు గారికి మోక్షం కల్పించాలని కర్ర ఎత్తాడు. ఇంతలో గురువు గారి గొంతు ఆ తెల్ల మచ్చ పంది పిల్ల నుంచి విని పించింది "నాయనా !నన్ను చంపవద్దు. నాకు చాలా ఆనందం గా ఉంది. పాలు తాగే సమయ మైంది. మా అమ్మ దగ్గర పాలు తాగుతాను. "అని చెప్పాడు గురువు గారు. దీనిని బట్టి తేలేదేమి టంటే ఎంత నికృష్ట జన్మ ఎత్తినా మరణానికి జీవి భయ పడుతుంది అని.

మేక "మే,మే"అని అరుస్తుందని మనకు తెలుసు. మానవ మేక యేమని అరుస్తుందో సరదాగా అయినా, సత్యమే చెప్పాడు ఒక కవి.

"అపత్యం చ మే –కళత్రం మే –ధనం మే –బంధవాస్చ మే ---జల్పస్త మితి మర్త్యాజం హన్తి కాల వృకో బలాత్ "

దీని అర్ధం ఇది –మానవుడు అనే మేక సంతానం నాది –భార్య నాది, ధనం నాది –బంధు వర్గం నాది అని "మేమే, మేమే "అంటూ అరుస్తుందట. ఈ అరుపు విని కాలం అనే తోడేలు మీద పడి బలాత్కారం గా మేక మానవున్ని చంపేస్తుంది. సంస్కృతం లో మే –మమ –అంటే నాది అని అర్ధం.

చని పోతే నాది అనేది ఏదీ ఉండదని తెలియ జెప్పే ఒక కధ –

ఒక రాజు వంది మాగధుల స్తోత్రాలతో హాయిగా నిద్ర లేచాడు. తన వైభవాన్ని తానే మురిసి పోతు మనసు లో ఒక శ్లోకం కూర్చు కొంటున్నాడు. ఒక పండితుడు రాజు గారికి తెలీకుండా ఆయన మంచం కింద నక్కి వింటున్నాడు. రాజు గారు శ్లోకాన్ని బిగ్గరగా చదివాడు

"చేతో హరాయువతః సుహ్రుదోను కూలః –సద్బాన్ధవాహ్ప్రనయ గర్బ గిరిస్చ భ్రుత్యాః

గర్జంతి దంతి నివహాః తరలాస్తూ రంగాః –మన్యే మమై తదపి సర్వ మదృష్ట జాతం "

వెంటనే మంచం కింద ఉన్న కవి పండితుడు "సంమీలనే నయనయొహ్ సహ కించి దస్థి"అని అయిదు పాదాలు ఉండే ఆ శ్లోకాన్ని అయిదవ పాదం చెప్పి పూర్తీ చేసి మంచం కింద నుంచి బయటికి వచ్చాడట. పేదరికం బాధ తట్టు కోలేక దొంగతనం చేయటానికి మనసొప్పక తను ఇలా మంచం కింద దాక్కో వాల్సి వచ్చిందని నిజం చెప్పాడు పండితుడు. రాజు పండితుడిని క్షమించి ధనం భూమి ఇచ్చి సత్కరించి పంపాడట. ఇంతకీ ఆ శ్లోక స్వారస్యం తెలుసు కోవాలి కదా --రాజు తన శ్లోకం లో "నా మనస్సుకు ఆనందం కల్గించే సుందరాన్గులున్నారు, అనుకూలమైన స్నేహితులున్నారు, కష్ట సుఖాల్లో పాలు పంచుకొనే బంధువు లున్నారు, మాటలతో, రాజ భక్తీ తో సేవ లందించే నౌకర్లు చాకర్లున్నారు ఘీన్కరించే మత్త గజాలున్నాయి. వాయు వేగాలైన గుర్రాలున్నాయి. ఈ భాగ్యం అంతా నా అదృష్టం నుంచి వచ్చిందే "అని పొంగి పోయాడు. మంచం కింది కవి పూరించిన దాని అర్ధం –"కన్ను మూస్తే ఈ ప్రపంచం లో నాది అనుకో దగిన దేదీ నీకు ఉండదు ".

సజ్జన, దుర్జన మైత్రి ఎలా ఉంటుందో తెలిపే శ్లోకాన్ని అందిస్తాను

"దిక్ దిక్ –సజ్జన మైత్రీ –దుర్జన సంసగా ఏవనో భవతు –సజ్జన వియోగ కాలే భవంతి తీవ్రాణి దుఖాని "—అర్ధం –

"ఛీ ఛీ –సజ్జన మైత్రి మాకు వద్దు –దుర్జన స్నేహమే మాకు లభించాలి. ఎందు కంటే సజ్జనులతో యెడ బాటు కల్గితే తట్టు కొ లేనంత దుఖం కలుగుతుంది. దుర్జనుల తో యెడ బాటు మహాదానందం గా ఉంటుంది "అని తమాషా గా అర్ధ వంతం గా చెప్పాడు కవి. దీని అంతరార్ధం –

దుర్జన సాంగత్యం వెంటనే వాదులు కోమని. “శుక మహర్షి “సాంగత్యం పరీక్షిత్తు మహారా జుకు మోక్ష మార్గాన్ని చూపించింది. అదే “శకుని “సాంగత్యం దుర్యోధనుడిని సర్వ నాశనం చేసిందని మనకు తెలిసిన విషయమే.

“సాధూనాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాప నాశనం –సంభాషణం సర్వ తీర్థాని, వందనం మోక్ష దాయకం “అని పెద్దలు చెప్పారు అందుకే ఆడి శంకరులు “లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబం “అని దైవాన్ని చేయూత నిమ్మని మనసారా ప్రార్ధించారు.

సాంగత్య ఫలితాలు ఎలా ఉంటాయో ప్రత్యక్ష ఉదాహరణ లతో ఎలా చెప్పారో తెలియ జేస్తాను –గాలితో సాంగత్యం చేసిన ధూళి దేవాలయ గోపురం ఎక్కింది. నీళ్ళ తో కలిసిన ధూళి పాతాళానికి పోయింది. నన తో సాంగత్యం చేసిన నార తల కెక్కింది. ఇనుము నిప్పుతో కలిసి మెత్త బడింది. మట్టి తో నీళ్ళ తో కలిసి త్రుప్పు పట్టి నశించింది. మహాత్ముల చేతు లతో ప్రతిష్టింప బడిన రాయి దేవత్వం పొందింది. అంధుడికి కళ్ళున్న వాడితో సంబంధం పురోగమ నానికి సహక రించింది. జ్ఞాని కి జ్ఞాని సంబంధం ప్రజ్ఞాని ని చేసింది.

మహాత్ములు తీర్థాలకే మహా పవిత్ర శక్తిని అందించ గలరు –వివేకానంద స్వామి తపస్సు చేసిన కన్యా కుమారి లోని సముద్ర శిల “వివేకానంద రాక్ “అని పేరు పొందింది. బుద్ధుడు తపస్సు చేసిన గయ “బుద్ధ గయ “అయింది ఆదీ కవి నన్నయ భట్టారకుడు తపస్సు చేసిన “తారకాసుర పట్టణం “-తణుకు అయింది. నిప్పు రవ్వ ఎంతటి మహారణ్యాన్ని అయిన దగ్ధం చేస్తుంది. సజ్జన సాంగత్యం ఎంత అజ్ఞాంద కారాన్నైనా అంత రింప జేస్తుంది.

ప్రార్ధన అంటే ప్ర+అర్ధన వివరం గా చెప్పాలంటే భగవంతున్ని వేరుగా ఉంచి, తాను వేరుగా ఉంది అర్ధించటమే ప్రార్ధన. మరి ధ్యానం అంటే –”నేను భగవంతున్ని స్మరిస్తున్నాను అనే భావం నశించి తాదాత్మ్యాన్ని పొందటం.

మానవ మనస్సు మర్కటం లా చపలం అని భగవత్పాదులు సౌందర్య లహరి లో ఒక శ్లోకం లో చమత్కారం గా జ్ఞాన బోధకం గా చెప్పారు–

”కపాలిన్ భిక్షో –మే హృదయ కపి మత్యంత చపలం –దుఢం భక్త్యా బధ్వా శివ భవ దదీనం కురు విభో “

కపాలం చెత్తతో పట్టు కొని బిచ్చ మెత్తు కొనే ఆది భిక్షూ !మహా చపల మైన నా మనస్సు అనే కోతి నాకు ధ్యానానికి భంగం కలిగిస్తోంది. మహాత్మా !ఈ కోతి ని బంధించి నీతో తీసుకొని పో.. నాకు మనస్సు లేకుండా చేస్తే అమనస్క యోగం కలిగి మోక్షం కరతలా మలకం అవుతుంది”. ఇక్కడి చమత్కారం ఏమిటో తెలిసే ఉంటుంది. భిక్ష గాడి చేతి లో గొలుసు తో కట్టేసి ఉన్న కోతి ఉంటె, ఆ కోతిని ఆడిస్తూ వినోదం కల్గిస్తూ ఉంటె అందరు సంతోషం తో భిక్ష ఎక్కువ గా వేస్తారు బాగా లా భిస్తుందని వెటకారం.

ఒకప్పుడు దత్తాత్రేయ మహర్షి అరణ్యం లో నడుస్తున్నాడు. ఒక చోట మార్గం రెండుగా చీలింది. ఏ దారి లో వెళ్ళాలో తెలియ లేదు. దగ్గర్లో ఒక చెరువు దగ్గర చేపలు పట్టే వాడు గాలం తో చేపలు పడు తున్నాడు. వాడి దగ్గరకు వెళ్లి ఎటు వెళ్ళాలో చెప్పమని అడిగాడు. వాడికి ఈ లోకం టో సంబంధం లేదు చేప గాలానికి తగిలితే బుట్ట లో వేసుకోవాలనే ధ్యాస. తప్ప.మహర్షి ఎంత మొత్తు కొని అరచినా వాడేమీ ఉలక లేదు, పలక లేదు. చేప చిక్కి బుట్టలో వేసుకొన్న తర్వాత దత్తుని చూసి “ఏమి కావాలి ?”అని అడిగాడు. ఆ చేపల వాడికి మహర్షి నమస్కరించి “చేపలు పట్టటం లో నీకున్న శ్రద్ధ నాకు ధ్యాన సాధన లో ఉంటె,ఏ నాడో మోక్షాన్ని పొందే వాడిని “అని ఆశ్చర్య పోతూ దారి తెలుసుకొని వెళ్లి పోయాడు దత్తాత్రేయ మహర్షి

వ్యాస మహర్షి ఒక సారి అరణ్య మార్గాన వెడుతుంటే ఒక చిన్న పురుగు, ఆ దారి ని దాట టానికి కంగారు పడు తూన్డటం చూశాడు దానికి మాట్లాడే శక్తిని ఇచ్చి కంగారు కు కారణం అడిగాడు ‘ఆ పురుగు “మహర్షీ !ఒక మహారాజు ఈ దారి లో రధం మీద వస్తున్నట్లు భగ వచ్చక్తి తో తెలుసు కొన్నాను. రధం వచ్చే లోపు అవతలి వైపుకు చేరాలి లేక పోతే చావు తప్పదు, రధంకింద పడి నలిగి పోతాను “అంది. దానికి వ్యాసుడు “చిన్న పురుగువి నువ్వు ఉంటె ఎంత, చస్తే ఎంత ?”అన్నాడు తేలిక భావం తో. దానికా కీటకం “మునీంద్రా !అలా అన వద్దు. మానవులకున్నట్లే మాకూ సుఖ దుఖాలుంటాయి. సుఖం మీద ఆశ, దుఖం మీద భయం మాకూ సహజమే. “అని జవాబు చెప్పే సరికి వ్యాసునికి లోక జ్ఞానం లేకుండా తాను ప్రశ్నించి నందుకు సిగ్గు పడి క్షమాపణ చెప్పి వెళ్లి పోయాడట.

చితి, చింత –లకు భేదం ఏమిటి అని శిష్యుడొకడు గురువు ను ప్రశ్నిస్తే –చితి ప్రాణం లేని శరీరాన్ని కాలుస్తుంది. చింత ప్రాణం ఉన్న దేహాన్ని కాలుస్తూనే ఉంటుంది అని గురువు సమాధానం చెప్పాడు.

బౌద్ధ గురువు ఆచార్య నాగార్జునుడు మట్టి పాత్ర తో భిక్షాటన చేసుకొనే వాడు. అది చూడ లేక ఒక ధనికుడు ఆయనకు బంగారు పాత్రనిచ్చాడు. దానితో నే భిక్షాట నానికి వెళ్లాడు. ఒక రోజు రాత్రి నాగార్జునుడుండే గుహ లోకి దొంగ ప్రవేశించాడు. దొంగను చూసి ఏమి కావాలని అడిగాడు. బంగారు పాత్ర కావాలన్నాడు వాడు. ఓస్ ఇంతేనా తీసుకో అని తానే దాన్ని ఇచ్చేశాడు దొంగకు., మళ్ళీ పాత పాత్రే. అను కోకుండా కొన్ని రోజుల తర్వాత దొంగ గుహ లోకి వచ్చాడు.ఇంకేమి కావాలని అడిగాడు ఆచార్యుడు. "నాకేమీ వద్దు. ఈ పాత్ర తీసుకొని వెళ్ళిన దగ్గర్నుంచి నాకు నిద్రాహారాలు లేవు. ఎవరు ఎత్తుకు పోతారోనని భయం. అదే దిగులు. మీ బంగారు పాత్రను మీరు తీసుకొని నాకు మనశ్శాంతి ని ప్రసాదించండి "అని కాళ్ళ మీద పడి పాత్రను అక్కడే వదిలేసి వెళ్లి పోయాడట

ఇవన్నీ సత్య దర్శనం చేసే కథలే,విషయాలే., ఈ వ్యాస పరంపరను ప్రారంభించ టానికి ముందే నేను చెప్పి నట్లు ఈ విషయాలన్నీ శ్రీ టి.వి.కే.సోమయాజులు గారు రచించిన "సత్య దర్శనం "లోనివి. వారికి ప్రేరణ కల్పించిన వారు "స్వామి శ్రీ నిశ్రేయ సానంద జీ మహారాజ్ " -- స్వామీజీ తణుకు లో శ్రీ రామ కృష్ణ సేవా సమితి స్థాపించి ఎందరికో ప్రేరణ నిచ్చిన గురు వరెన్యులు. సోమయాజులుగారు వీరి అనుగ్రహం తో రాసిన పుస్తకం ఇది. నన్ను ఆకర్షించింది ఆ సుధను మీకూ అందించాలని చేసిన ప్రయత్నమే ఇది.



## మరికొన్ని పురాణ ...

సూత శౌనకులు

ప్రతి పురాణం "సూతముని శౌనకాది మహర్షుల కిట్లనియె "అనే వాక్యం తో ప్రారంభమౌతుంది. ఇందులో మనకు సూతుడు అనే ముని పురాణాలు శౌనకుడు అనే మహర్షితో సహా మిగిలిన వారికి పురాణ ప్రవచనం చేశాడు అని మాత్రమె మనకు తెలుస్తుంది. అసలు వాళ్ళు ఎవరో మనం ఆలోచించం. ఒక వేల ఆలోచ్చించి ప్రయత్నించినా మనకు లభించే విషయం చాలా స్వల్పమే. ఇదొక నిరుత్సాహం. నాకూ న్తవరకు ఆ ఆలోచన రాలేదు ఇవాళ బల్బ్ వెలిగి తెలుసుకొనే ప్రయత్నం చేశాను. నాకుదొరికిన సమాచారం మీకూ అందిస్తున్నాను. ఇంతకంటే అదనపు సమాచారం ఎవరి దగ్గర ఉన్నా పంపించి దీన్ని నిరభ్యంతరంగా పరిపూర్ణం చేయవచ్చు.

సూత ముని

పృధు చక్రవర్తి పితామహ సంబంధమైన యజ్ఞాలు చేస్తుండగా శ్రీమహా విష్ణువు వచ్చి పౌరాణికుడై సూతుడు అనే పేరుతొ పిలువబడ్డాడు. ఆతర్వాత అతని సంతతి వారందరికీ ఈపేరేవచ్చింది అని బ్రహ్మాండ పురాణంలో ఉన్నది.

పృధు చక్రవర్తి నూరు అశ్వమేధ యాగాలను చేద్దామను కొని బ్రహ్మావర్త దేశం లో సరస్వతీ నదీ తీరాన 99పూర్తి చేసి, నూరవది మొదలు పెట్టగా, ఈర్ష్యతో ఇంద్రుడు యాగాశ్వం అపహరించి తీసుకు వెళ్ళగా, అతడి కొడుకు ఇంద్రుని జయించి గుర్రాన్ని తెచ్చాడు. ఇంద్రుడు మళ్ళీ ఎత్తుకు పోయాడు పృధువుకు కోపం వచ్చి విల్లు బాణాలతో యుద్ధానికి బయల్దేరాడు. యాగం మధ్యలో వెళ్లరాదని మునులు చెప్పగా విరమించాడు. బ్రహ్మ వచ్చి "మీరు ఏ దేవుని కోసం యాగం చేస్తున్నారో ఆయన అంశ ఉన్నవాడు ఇంద్రుడు కనుక వధార్హుడు కాడు.పృధువుకు 101యాగాల ఫలితం నేను అందిస్తున్నాను. ఇతడు నారాయణ అంశ సంభూతుడు. ధర్మాన్ని కాపాడటానికి పుట్టాడు "అని చెప్పగా సంతృప్తి చెంది, ఇంద్రునితో స్నేహం పాటించాడు. పరమేశ్వరుడు ఇంద్రునితో ప్రత్యక్షమై "సత్పురుషులు దేహాభిమానంతో ఉండకూడదు. మత్సర వికారం



పొంద రాదు "అని ధర్మం బోధించి ఆశీర్వ దించారు. అలాగే పృథు చక్రవర్తి ధర్మ బద్ధంగా పాలించి రాజ్యం కొడుకులకు అప్పగించి తపస్సుకు వెళ్ళాడు

భాగవతం లో రోమ హర్షుడి కుమారుడు ఉగ్రశ్రవసుడు అనీ ఈయనే శౌనకాదులకు పురాణాలు చెప్పాడనీ ఉన్నది.

భారతం ప్రకారం కృష్ణ ద్వైపాయన వ్యాసుడు అష్టాదశ పురాణాలు రాసి, తాను వక్తగా ఉండకుండా నైమిశారణ్యం లో శౌనకుడు మొదలైన మహర్షులు దీర్ఘ సత్ర యాగం చేస్తుంటే, వ్యాస శిష్యుడు రోమ హర్షణుడు కుమారుడైన సూత మహర్షిద్వారా సత్కాలక్షేపంగా పురాణాలు చెప్పించాడు.

మార్కండేయ పురాణం లో ఇలా పురాణ ప్రవచనం చేస్తుండగా శ్రీకృష్ణుని అన్న బలరాముడు వచ్చాడు. ఆయనను చూసి సూతుడు గౌరవంగా లేచి నిలబడ లేదు. బలరాముడికి కోపం నషాళానికి అంటి క్షణం ఆలోచించకుండా సూతుడిని సంహరించాడు. శౌనకాది మహర్షులు ప్రార్దిస్తే మళ్ళీ సూతుడిని బ్రతికించి పురాణ ప్రవచనం యధేచ్చగా జరిగేట్లు చేశాడు.

శౌనక మహర్షి

శౌనక మహర్షి శనకమహర్షి కుమారుడు. శనకుడు గృత్స్నమదుడు అనే ముని కుమారుడు. శౌనకుని కుమారుడు "బహ్వ్రచ ప్రవరుడు ". శౌనకుడు నైమి శారణ్యం లో పన్నెండు సంవత్సరాలు సత్రయాగంనిర్వహించాడు. యాగ సమయం లోసూతముని చేత పుణ్య కథా శ్రవణం చేయించాడు పురాణ శ్రణమూ చేసిన ధన్యజీవి. అని భాగవత పురాణం లో ఉన్నది.

భారతం లో శౌనకుడు కపి గోత్ర రుషి. ఇతడూ, కక్ష సేన వంశం వాడైన "అభి ప్రతారి "అనే ముని కలిసి భోజనానికి కూర్చోగా ఒక బ్రహ్మ చారి భిక్షకు వచ్చాడు. వచ్చినవాడికి "సంసర్గ విద్య " అంటే సాంఘిక శాస్త్రం లో నిష్ఠ ఉందో లేదో తెలుసుకొందామని వీరిద్దరూ భిక్ష ఇవ్వలేదు. అతడు శౌనకునితో ఆ విద్య పై వాదం చేశాడు. సంతృప్తి చెంది భిక్ష ఇచ్చారు.

మహా భారతం లోనే మరో విషయం కూడా ఉన్నది. పాండవులు అరణ్య వాసం చేస్తూ గంగాతీరం చేరి అక్కడ ఒక వట వృక్షం క్రింద ఒక పూట గడిపి వెడుతుంటే, అక్కడి బ్రాహ్మణులు తమ అగ్ని హోత్రాలు తెచ్చుకొని పాండవులతో పాటు వనవాసం చేస్తామని వచ్చారు. అప్పుడు ధర్మరాజు "మహాశయులారా !నేనురోజూ బ్రాహ్మణులకు మృష్టాన్న భోజనం తో సంతృప్తి పరచేవాడిని. ఇప్పుడు నాదగ్గర ఏమీ లేదు.ఏమీ

ఇవ్వలేను పోషించలేను మాతో రావద్దు "అని బాధ పడ్డాడు. అక్కడికి వచ్చిన శౌనకమహర్షికి ధర్మరాజు కు సుహృత్ వాతావరణం లో సంవాదం జరుగుతుంది.




ఋగ్వేద రక్షణ కోసం శౌనక మహర్షి 1-అనువాకానుక్రమణి 2-అర్షాను క్రమణి 3-చందోను క్రమణి 4- దేవతాను క్రమణి 5-పాదానుక్రమణి 6-సూక్తాను క్రమణి7-ఋగ్విదానం 8-బృహద్దేవతా 9-ప్రాతి శాఖ్యం 10-శౌనక స్మృతి రాశాడు. ఇందులో మొదటి 7"అనుక్రమణిక వాఙ్మయం"లోకి చేరతాయి.

జిజ్ఞాసువైన శౌనకమహర్షి అంగీరస మహర్షిని దర్శించి "ఏది తెలుసుకొంటే అన్నీ తెలిసినట్లు ఔతుంది ?"అని అడిగాడు. పర, అపరా విద్యలున్నాయి. పరా విద్య పరబ్రహ్మ తత్వాన్ని చెప్పేది. అపరా విద్య లౌకిక ధర్మాలను వివరించేది. మొదటిదే గొప్పది. అది తెలిస్తే సంసార బంధ విముక్తి కలుగుతుంది "అని ముండక ఉపనిషత్తు బోధించాడు. శౌనక మహర్షి " చరణ వ్యూహం "అనే ధర్మశాస్త్ర కర్త కూడా.

పద్మ పురాణ లో ఒక రోజు ఒక మహర్షి శౌనకాశ్రమానికి వచ్చి విష్ణు కథా శ్రవణం చేస్తుంటే సూతమహర్షివచ్చాడు. అక్కడి వారందరికీ సూతమహర్షి "పద్మ పురాణం "అంతా వినిపించి వారిని బ్రహ్మానందపరచి, తానూ బ్రహ్మానంద భరితుడు అయ్యాడని పద్మపురాణం లో ఉన్నది. ఇంతటి ఘన చరిత్ర ఉన్నవారు మన సూత శౌనక మహర్షులు.

శ్రీ గాయత్రీ మాహాత్మ్యం




డా.శ్రీ చిదంబర శాస్త్రి గారి "సర్వ "విద్యా పారంగత్వ ప్రతీక "శ్రీ గాయత్రీ మాహాత్మ్యం "

కృష్ణా జిల్లా జగ్గయ్య పేట లో ఆంధ్రోపన్యాసకులుగా చేసి రిటైరైన డా.శ్రీ సర్వా సీతారామ చిదంబర శాస్త్రి, జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో 65దాకా విశ్లేషణాత్మక పత్రాలు రాసి సమర్పించిన విద్వన్మణి."రమణాయన కావ్య రమణీయం "పై పరిశోధన చేసి పిహెచ్ డిఅందుకొన్నారు. శ్రీ ఆంజనేయ శతకం, శ్రీ గాయత్రి మాతృ ద్విశతి, దేశభాష లందు తెలుగు లెస్స సంకలనం తో సాహితీలోకం లో సుప్రసిద్ధులు. ఇప్పుడు తాజాగా2018 డిసెంబర్ లో "శ్రీ గాయత్రీ మాహాత్మ్యం "వచన రచన చేసి ఆ మాతపై తమకున్న భక్తిప్రపత్తులను చాటుకొని,. చాలాకాలంగా సాహితీ మిత్రులైన శాస్త్రి గారు నాకు సుమారు 20 రోజులక్రితం దానిని పంపారు. చదవటానికి ఇప్పటికి కుదిరి చదివి ఆనందించాను. వీరి జ్ఞాన సంపత్తికి డా. రామడుకు వేంకటేశ్వర శర్మగారు "జ్ఞానాభి షేకం "చేస్తే, మహాకవి శేఖరులు శ్రీ భారత శ్రీమన్నారాయణ "చిదంబర ప్రశస్తి "చేసి చిదంబర విజ్ఞాన రహస్యం బయట పెట్టారు. శ్రీరంగం నల్లాన్ చక్రవర్తుల తిరుమలాచార్యులు అభినందన కంఠహారం-గ్రైవేయకం సమర్పించారు. స్మార్త క్రమాంత విశిష్ట స్వాధ్యాయి శ్రీ జగర్ల పూడి వీరభద్ర శర్మ "జ్ఞాన యజ్ఞం "గా శాస్త్రి గారి కృషిని అభివర్ణించారు. శాస్త్రి గారు" ఒక్క మాట "లో సూర్యుడున్న చోట చీకటి ఉండనట్లే సనాతన ధర్మమున్న చోట దుఖం ఉండదని, బ్రహ్మ సమానమైన దేవుడు, బ్రహ్మ సమానమైన గురువు, బ్రహ్మ సమానమైన తపం లేదని భావిష్యపురాణం చెప్పిందనీ కనుక గాయత్రీ మంత్రం బ్రహ్మ సమానమైనదని చెప్పారు. ఇప్పుడు గ్రంథంలోని కొన్ని ముఖ్య విషయాలు మీ ముందుంచుతున్నాను.

"సూర్యుడు, నక్షత్రాలు లేని ఆహోరాత్రాలమధ్య సందికాలాన్ని సంధ్య అంటారు ఇదికాలవాచకమే అయినా, ఉపాస్య దేవత గా ఆరాధించాలి. అని చెప్పి గాయత్రి ఆవిర్భావ కథ తెలిపి, "యా వసేత్ ప్రాణి జిహ్వాసు సదా వాగుపవర్తనాత్-సరస్వతీతి నామ్నేయం సమాఖ్యాతా మహర్షి భిః"అంటే జీవరాసులలో వాక్కు ఉన్నవారి నాలుక కొనపై నర్తించేది సరస్వతి అని ఋషులు చెప్పారని తెలియజేశారు. తర్వాత గాయత్రి విశిష్టతను చెబుతూ ముక్తినిచ్చే 6 గయలలో గాయత్రి కూడా ఒకటన్నారు. పరమేశ్వరుని ముఖం నుండి వెలువడిన మొదటి ఛందస్సు గాయత్రి. గానం చేస్తే రక్షించేదీ,గయ అనబడే ప్రాణాల్ని కాపాడేదీ,ఆరాధిస్తే మనస్సుకు ప్రశాంతినిచ్చేదీ గాయత్రి అన్నారు. ఋగ్వేద, అధర్వ వేద, శతపథ బ్రాహ్మణ, సూత సంహిత, బృహదారణ్య ఛాందోగ్య నారాయణ, నృసింహ పూర్వతాపి, మైత్రాయణి, ఉపనిషత్ లలో నిర్వచింప బడిన గాయత్రిని బహు శ్రమ కోర్చి వెలికి తీసి ముందుంచారు. బృహద్యోగి యాజ్ఞవల్క్యం, విశ్వామిత్ర స్మృతి, మను స్మృతి,సంవర్త, యాజ్ఞవల్క్య, హారీత, పరాశర,శంఖ, స్మృతులలో ఉన్నగాయత్రినీ, పద్మ, కూర్మ అగ్ని, మత్స్య,భవిష్య, నారద పురాణాలలో చెప్పబడిన గాయత్రిని, సంధ్యా భాష్యం,మహాభారతం భగవద్గీత, భాగవత గాయత్రినీ వివారించారు. శ్రీ వాసా సూర్యనారాయణ, శ్రీ శేషావతారం గార్లు చేసిన గాయత్రీ స్తుతి, శ్రీనాథుని కాశీఖండ గాయత్రి ని వివరించి, బ్రాహ్మశ్రీ మల్లంపల్లి శరభయ్యగారు శ్రీనాథుని సీసానికి చెప్పిన వివరణ ఇచ్చారు – "గాయత్రీ దేవికి మూడు వేదాలు మూడుపాదాలు,భూమి ఆకాశం నాలుగు దిక్కులు కలిసి ఆరు కుక్షులు, సమస్త భవనం శరీరం, స్వర్గమే పొట్ట, ధర్మశాస్త్రం హృదయకోశం. ఛందస్సమితి స్తనద్వయం. ఈశ్వర నిరీశ్వర సాంఖ్యాలు రెండూ రెండు చెవులు. అగ్ని ముఖం. శిక్షా, వ్యాకరణ, నిరుక్త,జ్యోతిష, కల్పాలు అయిదూ అయిదు తలలు, అధర్వణ వేదం చేస్ట,శిఖ శివుడు. బ్రహ్మ శిరస్సు. విష్ణువు ఆత్మ,. భావ లక్షణం తటస్థ లక్షణం. పూర్వ మీమాంస స్థూల శరీరం, వేదాంత శాస్త్రం సూక్ష్మ శరీరం.

ఇలామనకు తెలిసినా, తెలీని అనేక విషయాలు తరచి రాసిన పుస్తకం. తర్వాత గాయత్రీ మంత్రాని శబ్దగత అర్ధం మంత్రాధి దేవతలు, మంత్రాక్షర వర్ణాలు, ఛందస్సులు బీజాక్షరాలు, తత్వాలు, ఋషులు, కళలు,, దేవీశక్తులు, మంత్రాక్షర అవతారాలు, సత్ ప్రవృత్తులు, సిద్ధులు, విద్యలు, మాతృకలు, కూడా సవివరంగా తెలిపారు. గాయత్రీ మంత్రం లో 24అక్షరాలకు 24 స్త్రీ, పురుష దైవీ శక్తులున్నాయని వాటినీ వివరించారు. గాయత్రీ మంత్ర జపాన్ని పది సార్లు, 28సార్లు, 108సార్లు, వెయ్యిన్నూట ఎనిమిది సార్లు శక్తి ననుసరించి చేయాలి.

పిమ్మట గాయత్రి మంత్ర హోమ విధానం, గాయత్రీ మంత్ర మహిమ తెలిపే వృత్తాంత గాధలు చెప్పి గాయత్రీ మాహాత్మ్యాన్ని గురించి వేదవ్యాసుని దగ్గరనుంచి, మహర్షులు, జగద్గురు శంకరాచార్య, రమణమహర్షి, స్వామి శివానంద, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, అరవిందయోగి, గాంధీజీ, రవీంద్ర, తిలక్, మాలవ్యా దయానంద సరస్వతి,సర్ మోనియర్ విలియం దాకా ప్రస్తుతించిన విషయాలు చెప్పి చివరికి ఫలశ్రుతి చెబుతూ గాయత్రీ మంత్ర జపం చేసిన చోట అగ్ని జల,వాయు పిశాచ సర్ప భయం ఉండదని భరోసా తో ముగించారు.

ఒక రకంగా డా సర్వా సీతారామ చిదంబర శాస్త్రి గారి "శ్రీ గాయత్రీ మాహాత్మ్యం "ఆల్ ఇన్ వన్ లేక "గాయత్రీ విజ్ఞాన సర్వస్వం "అని ఢంకాపథంగా చెప్పవచ్చు. దీన్ని వారి గురు పాదులు స్వర్గీయ బ్రహ్మశ్రీ భాగవతుల సంజీవ శాస్త్రి గారికి అంకితమివ్వటం శాస్త్రిగారి గురుభక్తికి తార్కాణ.ఇంత విలువైన గ్రంధాన్నికీ.శే.శ్రీమతిపేముల రాజ్యలక్ష్మి, శ్రీ రాఘవరావు దంపతుల స్మృత్యర్థం వారికుమారులు, కోడళ్ళు కీ.శే. పేముల సాంబశివరావు శ్రీమతి పద్మావతి దంపతులు, శ్రీ పేముల నగేష్, శ్రీమతి స్వాతి దంపతులు ఆర్ధికసాయమందించి ప్రచురించినందుకు అభినందనలు, కీర్తి శేషులను అక్షరాలతో నిజంగా కీర్తి శేషుల్ని చేశారు. శ్రీ గాయత్రి మాత ఆ కుటుంబాలకు సర్వదా రక్షగా ఉండాలని ప్రార్ధిస్తున్నాను

"చిదంబర రహస్యం"గా ఉన్న గాయత్రీ మాహాత్మ్యాన్ని శ్రీ చిదంబర శాస్త్రి గారు కరతలామలకం చేసినందుకు అభినదిస్తూ మరిన్ని ఆర్ష విద్యా గ్రంథాలు వారి నుండి వెలువడాలని ఆశిస్తున్నాను.

"త్వమేవ సంధ్యా గాయత్రీ సావిత్రీచ సరస్వతీ –బ్రాహ్మీచ వైష్ణవీ రౌద్రీ రక్తాశ్వేతా సితే తరా"

"కమలా విష్ణు లోకే చ, గాయత్రీ బ్రహ్మలోక దా-రుద్ర లోక స్థితా గౌరీ హరార్ధాంగ నివాసినీ "

గాయత్రీం చింతయేద్యస్తు హృత్పద్మేసముపస్థితం –ధర్మా ధర్మ వినిర్ముక్తః తయాతి పరమాం గతిం "

"కర కమలంబుల యందున –వర వేద కమండలములు భాసిలు చుండన్ –శిరమున ఖండేందునితో –వరలెడి గాయత్రి !నీకు వందన శతముల్"

సుందరమైన ముఖ చిత్రాలతో, పాల నురగవంటి తెల్లకాగితాలపై 207పేజీల అత్యంత విలువైన సమాచారం తో ఉన్న ఈ గ్రంథాన్ని పొందటానికి మూల్యం –కేవలం శ్రీ గాయత్రీ ధ్యానమే. అంటే ఉచితంగా పొందవచ్చు. కావలసినవారు శాస్త్రి గారి ఈ క్రింది చిరునామాకు సంప్రదించండి –

డా.సర్వా సీతారామ చిదంబర శాస్త్రి –అక్షర భారతి కాన్సెప్ట్ స్కూల్ –పాత కోర్టు భవనం –వినాయకుడి గుడి దగ్గర –జగ్గయ్య పేట 521175 –కృష్ణా జిల్లా

సెల్ -9885383741

# సమాప్తం

## వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ -

# ....సంపూర్ణం...

మీ సలహాలు సూచనలు తెలియచేయండి

గబ్బిట దుర్గాప్రసాద్

Cell : 9989066375

gabbita.prasad@gmail.com
http://sarasabharati.wordpress.com
http://sarasabharativuyyuru.wordpress.com
http://suvarchalaanjaneyaswami.wordpress.com

Telugu Wikipedia
: https://te.wikipedia.org/wiki/%E0%B0%97%E0%B0%AC%E0%B1%8D%E0%B0%AC%E0%B0%BF%E0%B0%9F_%E0%B0%A6%E0%B1%81%E0%B0%B0%E0%B1%8D%E0%B0%97%E0%B0%BE%E0%B0%AA%E0%B1%8D%E0%B0%B0%E0%B0%B8%E0%B0%BE%E0%B0%A6%E0%B1%8D
Gabbita Durga Prasad
Rtd. head Master Sivalayam Street

Vuyyuru 521165 Krishan District
Andhra Pradesh
India

## రచనలు

నేను రాసిన ,సరసభారతి ప్రాచురించిన పుస్తకాలు డిజిటల్ రూపం లో .క్లిక్ చేస్తే చాలు పుస్తకం ప్రత్యక్షం

| | పుస్తకం పేరు | వివరాలు | ప్రమరణ | అంకితం | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు | 27 తెలుగు వేదశాస్త్ర ప్రవిణులు రచనలు | సెప్టెంబర్ 2010 | స్వర్గీయ శ్రీ కోమలి సూర్యనారాయణ శాస్త్రి | 55 |
| 2 | జనవేమన | వేమన యోగి గా మారిన విధం | ఏప్రిల్ 2012 | చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ | 16 |
| 3 | దర్శనీయ దైవ క్షేత్రాలు | 100 ప్రసిద్ధ దేవాలయాల చరిత్ర, దివ్యధామ దర్శనం | జనవరి 2015 | శ్రీ కోగంటి సుబ్బారావు శ్రీమతి సావిత్రి | 64 |
| 4 | శ్రీ హనుమత్ కథా నిధి | హనుమాన్ దివ్య చరిత్ర, పూజ శ్లోకాలు | ఉగాది 2012 | స్వర్గీయ పవని రాధాకృష్ణ | 59 |
| 5 | శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం | ఆంజనేయస్వామి మహాత్యం, కథలు, విశేషాలు | జూన్ 2013 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 20 |
| 6 | సిద్ధ యోగిపుంగవులు | 35 సిద్ధుల జీవిత చరిత్రలు | ఏప్రిల్ 2013 | స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మ కుమ్మమూరు | 20 |
| 7 | మహిళా మాణిక్యాలు | 50 ప్రపంచ ప్రసిద్ధ మహిళల చరిత్రలు | మార్చి 2014 | శ్రీమతి మైనేని సత్యవతి USA | 84 |
| 8 | పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు | 125 ఇంగ్లాండ్,అమెరికా దేశాల కవుల చరిత్ర | ఆగస్ట్ 2014 | శ్రీ రాచకొండ నరసింహ శర్మ వైజాగ్ | 280 |
| 9 | గీర్వాణ కవులకవితా గీర్వాణం -1 | 146 సంస్కృత కవుల జీవిత విషయాలు | మార్చి 2015 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 408 |
| 10 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -2 | 482 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2014 | గబ్బిట భవానమ్మ మృత్యుంజయశాస్త్రి | 532 |
| 11 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -3 | 462 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2017 | డా\|\| భండారు రాధాకృష్ణ మూర్తి , సులోచన | 520 |
| 12 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -1 | 201 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మే 2015 | శ్రీమతి వేలూరి దుర్గ, శ్రీ వివేకానంద | 264 |
| 13 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -2 | 221 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మార్చి 2019 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 312 |
| 14 | కెమోటాలజీ పిత డా.కొలాచల సీతారామయ్య | ఆయిల్ సైన్స్ శాస్త్ర సాంకేతిక శాస్త్రజ్ఞుడు | జనవరి 2016 | శ్రీ యలమంచలి సీతారామయ్య,శేషుమాంబ | 44 |
| 15 | దైవ చిత్తం | Mind of god కు తెలుగు స్వేచ్ఛ అనువాదం | ఏప్రిల్ 2016 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 30 |
| 16 | బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | శత జయంతి ఉత్సవ సమీక్ష | మార్చ్ 2017 | శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | 7 |
| 17 | ఆధునిక ప్రపంచ నిర్మాతలు – జీవితాలలో చీకటి వెలుగులు | చరిత్రను మలుపు త్రిప్పిన వివిధ రంగాల 91 ప్రపంచ ప్రముఖుల జీవితం సమగ్ర గ్రంథం | డిసెంబర్ 2017 | శ్రీ స్వర్గీయ పరచూరి రామకృష్ణయ్య | 704 |
| 18 | షార్లెట్ సాహితీ మైత్రీ బంధం | అమెరికా నార్త్ కరోలిన షార్లెట్ యాత్రా సాహిత్యం | 2018 | అమెరికా షార్లెట్ | 344 |
| 19 | అణుశాస్త్రవేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య | 117 మూలకం టెన్నిస్సిన్ 'Ts'ఆంధ్ర అణుశాస్త్రవేత్త | అక్టోబర్ 2018 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| 20 | శాస్త్రపరిశోధన పిత డా.పుచ్చా వెంకటేశ్వర్లు | ఆంధ్ర కాంతి శాస్త్ర పరిశోధన సాంకేతికవేత్త | మార్చి 2019 | శ్రీ ఆకునూరి రామయ్య | 32 |
| 21 | ఊసుల్లో ఉయ్యూరు | 75ఏళ్ళ అనుబంధం ,జ్ఞాపకాలు నాస్టాల్జియా | మార్చి 2020 | శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి , సీతమ్మ | 304 |
| 22 | సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా | 6 రాష్ట్రాల క్షేత్ర సందర్శన యాత్రా సాహిత్యం | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 328 |
| 23 | ఆధునిక ఆంధ్ర శాస్త్ర మాణిక్యాలు | 62 ఆంధ్ర శాస్త్రవేత్తల జీవిత విశేషాలు, | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 68 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 24 | వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాద సూరి | శ్రీ పిజ.లాల్యే ఇంగ్లీష్ ‘‘మల్లినాథ’అనువాదం | మార్చి 2021 | శ్రీ మల్లినాద | 20 |
| 25 | ఆధునిక విదేశీ సంస్కృత విద్వాంసులు | 42 విదేశ సంస్కృత విద్వాంసుల రచనలు | మార్చి 2021 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామి ఉయ్యూరు | 30 |
| 26 | Dr. Ankunuri Venkata Ramayya | డా ఆకునూరి వెంకటరామయ్య ఇంగ్లీష్ అనువాదం | అక్టోబర్ 2020 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| | | | | | 5735 |

సంపాదకత్వం

| | పుస్తకం పేరు | వివరాలు | అంకితం | ప్రచురణ | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | జ్యోతిస్సంశ్లేషణం | విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి రచన | స్వర్గీయ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | మార్చ్ 2010 | 15 |
| 2 | ఉయ్యూరు ఊసులు | గబ్బిట కృష్ణ మోహన్ ఉయ్యూరు జ్ఞాపకాలు | ఉయ్యూరు | డిసెంబర 2010 | 42 |
| 3 | మహా కవితా సంతం | కవుల కవితలు సెప్టెంబర్ 2010 | స్వర్గీయ టి ఎల్ కాంతారావు | సెప్టెంబర్ 2010 | 32 |
| 4 | మా అక్కయ్య | ఉగాది కవితా సంపుటి | | ఆగష్టు 2011 | 40 |
| 5 | "ఆదిత్య ‘‘హృదయం | పద్య వచన కవితా సంకలనం | | మే 2012 | 24 |
| 6 | త్యాగి పే’’రెడీలు’ | శ్రీ టీవీ సత్యనారాయణ రచనలు | బాపు రమణ | మార్చి 2015 | 96 |
| 7 | శ్రీరామవాణి | శ్రీ తూములూరి దక్షిణామూర్తి గారి రచన | | | 24 |
| 8 | మా అన్నయ్య | కవితాసంకలనం | తాడికొండ భోగ మల్లికార్జునరావు దంపతులు | జూలై 2016 | 45 |
| 9 | శ్రీ సువర్చలా వాయు నందన శతకం | రామలక్ష్మణచార్యులు | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 64 |
| 10 | శ్రీ సువర్చలా మారుతి శతకం | ముదిగొండ సీతరావమ్మ | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 40 |
| 11 | శ్రీ సువర్చలేశ్వర శతకం | మంకు శీను | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 35 |
| 12 | వసుధైక కుటుంబం | ఉగాది కవితల సంకలనం | | మార్చి 2018 | 40 |
| 13 | సాహితీ స్రవంతి | (సాహితీ మండలి తరపున ) | | మార్చి 2012 | 25 |
| | | | | | 522 |

అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు

| | పుస్తకం పేరు | వివరాలు | విదుదల | పేజీలు |
|---|---|---|---|---|
| 1 | సమస్త భక్త శిఖామణులు | దైవం కోసం, దేశం కోసం, రాజ్యం కోసం, సాహిత్యం కోసం పాటుపడి చరిత్రలో మిగిలిపోయిన భక్త శిఖామణులు | 15-08-2021 | 350 |
| 2 | వేద, ఇతిహాస, తాత్వికరచనల విశ్లేషణ | వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ | 10-09-2021 | 460 |
| 3 | దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు | శివ, దేవి, వినాయక, విచిత్ర ఆలయాల చరిత్ర, శ్రీ ఆదిశంకర విశిష్ట వేదాంత రచన | 15-10-2021 | 625 |
| | | | | 1435 |

